

# ఆధునికాంధ్ర కవిత్వము

## సంప్రదాయములు: ప్రయోగములు


డా॥ సి. నారాయణరెడ్డి

ఎం.ఏ, పిహెచ్.డి.





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001

TRADITION AND EXPERIMENT IN MODERN TELUGU POETRY
BY - Prof. C. NARAYANA REDDY, M.A.,Ph.D.

ప్రచురణ నెం. : 2121
ప్రథమ ముద్రణ : జనవరి, 1967
ద్వితీయ ముద్రణ : సెప్టెంబరు, 1977

ప్రతులు : 1000

వి.పి.హెచ్.
ప్రథమ ముద్రణ : జులై, 1989
ద్వితీయ ముద్రణ : సెప్టెంబరు, 1993
తృతీయ ముద్రణ : మార్చి, 1999



వెల: రూ. 180-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ISBN : 81-7098-147-6

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్ : 3229831

# నిత్య నూతనత్వం

సుమారు 27 సంవత్సరాల క్రితం డాక్టరు సి. నారాయణరెడ్డి గారు, పిహెచ్.డి. పట్టాకై సమర్పించిన సిద్ధాంత గ్రంథమిది.

అధ్యయన ప్రధానమైన ఈ గ్రంథం అతిత్వరలో ఎం.ఎ. విద్యార్థులకు పఠనీయ గ్రంథమైంది. అధ్యయన, అధ్యాపనల రెంటిలోను గ్రంథ రచయితకు గల సవ్యసాచిత్వాని కిది చిహ్నం. ఇప్పటికే రెండు ముద్రణలు పొందింది. ఇది మూడో ముద్రణ.

సర్వ విజ్ఞాన విభాగాలకు పరస్పరాధారిత్వం ఉంది. ముఖ్యంగా తత్వ శాస్త్రానికి, సాహిత్యానికి గల అనుబంధం మరీ గాఢమైంది. ఈ సత్యం తెలిసిన వారు డాక్టరు నారాయణరెడ్డి గారు.

ఈ గ్రంథమంతా, తాత్విక, సాహిత్య రంగాలకు వేలాది సంవత్సరాలుగా సాగుతున్న చర్య, ప్రతిచర్యల ప్రస్తావనాపరంగా సాగింది. అడుగడుగునా, పాశ్చాత్య, ప్రాచ్య ధోరణుల తులనాత్మక పరిశీలన, అంతస్సూత్రంగా సాగటం ప్రత్యేకించి హర్షణీయం.

వస్తువు, రూపం, ఛందస్సు, భాష, అలంకారిక ప్రక్రియలు, ఇలా బహుముఖమైన సాహిత్య ఉపాంగాలన్నిటిని విశ్లేషించి, వివరించి, వ్యాఖ్యానిస్తూ సాగిన ఈ గ్రంథం సాహితీప్రియులకే కాక, సామాన్య పాఠకులకు సైతం ఆదరణీయం. సాహితీ అభిరుచిని సర్వులకు అందిచటంలో ఇలాంటి గ్రంథాలే ఎంతో ప్రయోజన కరం. పరిశోధకులకు చాలాకాలంగా ఇది ప్రధాన ఆధారగ్రంథంగా తోడ్పడుతోందన్నది తెలిసిందే.

సంప్రదాయములు - ప్రయోగములు అను ఈ గ్రంథ శీర్షిక ఎంతో అర్థవంతం.

పైకి విరుద్ధంగా కనిపించే ఈ రెండు ధోరణులు, అన్నికాలాల్లోనూ ఒక దాని వెంట ఒకటి సంస్కృతీ ప్రవాహంలో అంతర్భాగాలుగా ఉన్నాయి. తత్కాలానికి వ్యతిరేకత, మరికొంత కాలానికి అనుబంధం ఏర్పడుతూ వచ్చాయి.

గ్రంథాంతంలో ఈ రచయిత రాసిన మాటలు గమనార్హం. "అందరొక వేదిక మీద ఆసీనులై విభిన్న రీతులలో రచనలు చేసి మెప్పించుట" డాక్టరు నారాయణరెడ్డి గారి భవిష్యద్దర్శనానికి ఇది తార్కాణం.

సంప్రదాయానికి ప్రతీకగా ఉన్న ఒక మహాకవికి రెండు దశాబ్దాలక్రితం అత్యున్నతమైన జ్ఞానపీఠ్ అవార్డు లభించగా, ప్రయోగశీలి ఐన ఈ మహాకవికి, ఈ ఏడు 'జ్ఞానపీఠ్' అవార్డు లభించడం, కేవలం యాదృచ్ఛికం కాదనిపిస్తుంది.

ఇలాంటి ఉత్తమ రచనను పునర్ముద్రించే అవకాశము మాకు కలిగించిన రచయితకు కృతజ్ఞులం.

**ఏటుకూరు బలరామమూర్తి**
ఎడిటర్
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

హైద్రాబాద్
30.9.'89

# అంకితము

కన్నతల్లి: బ్రతికినంత
కాలము బంగరుమమతల
పొంగించిన పాలవెల్లి
సింగిరెడ్డి బుచ్చమ్మకు —

కన్నతండ్రి: నల్లని రే
గళ్ళ దున్ని నా బ్రతుకున
రవ్వలు పండించిన క
ర్షకమణి మల్లారెడ్డికి —

ఆధునికాంధ్రకవిత్వామ
హాంభోరాశిని మధించి
సాధించిన నవామృత
స్వాదుఫలము సమర్పింతు.

# రెండు మాటలు

దాదాపు 37 యేళ్ల క్రితం నేను రాసిన పరిశోధన గ్రంథమిది: (1962). దీని తొలిముద్రణ 1967లో జరిగింది. మరో పదేళ్లకు మలిముద్రణ (1977). మార్కెట్‌లో ప్రతులు అయిపోయిన ప్పుడు విశాలాంధ్ర ప్రచురణాలయం వారు తాము అచ్చువేస్తామని నన్ను అడగడం నేను అంగీకరించడం జరిగింది. వారు రెండు ముద్రణలు తీసుకొని వచ్చారు. మూడు, నాలుగు ముద్రణలు వారు తీసుకొచ్చారన్నమాట! (1989, 1993) ఇది ఐదో ఎడిషన్. ఒక విశ్వవిద్యాలయ పరిశోధన గ్రంథం ఇంతగా పాఠకుల ఆదరణ పొంది ఐదు ముద్రణలు వెలువడడం తెలుగులో ఇదే ప్రథమం అనుకుంటాను.

ఆధునికాంధ్ర కవిత్వానికి సంబంధించి అప్పటికి వెలువడిన పరిశోధన గ్రంథాల్లో ఇది సమగ్రమని విద్వాంసుల అభిప్రాయం. తదనంతరం వెలువడిన గ్రంథాలకిది పునాదిగా నిలిచిందనడానికి కాలమే సాక్షి. దీనిని ప్రచురిస్తున్న విశాలాంధ్ర ప్రచురణా లయం వారికీ, ముఖ్యంగా చొరవ తీసుకుంటున్న ప్రచురణాలయం మేనేజర్ రాజేశ్వరరావు గారికీ నా అభివందనలు.

– సి. నారాయణరెడ్డి

# సూచిక

# సంప్రదాయము : ప్రయోగము

**ప్రవేశిక :**

సంప్రదాయ మొక జీవనది వంటిది. ఉత్తుంగ హిమాద్రి శిఖరములనుండి దూకి దూకి తదనంతర మార్యావర్తమున కాలుమోపి, ఒక మహాత్ముని భావనవలె గంభీరముగా సమగమనముతో సాగిన మందానికివలె, సంప్రదాయము ఆరంభ దశలలో ఆరభటికి, ఉద్వేగమునకు లోనై క్రమముగా కలతదేరి నెమ్మదిగా ప్రవహించును. జీవనది ఎల్లప్పుడు ఒకే రీతిగా ప్రవహింపదు, ఒకే రూపులో ప్రవహింపదు. మధ్య మధ్య అనేకములైన ఉపనదులను, సెలయేరులను, ప్రవాహినులను తనలో లీనము చేసికొనును. అవసరమైనప్పుడు ప్రక్కదారలించును. నదీ ప్రవాహమునకువలెనే జీవత్సంప్రదాయమునకు సైతము మిట్టలు అడ్డునిలుచును తిరిగి పొమ్మని గిరులు బెదరించును. అడవు లాటంకము కలిగించును. అయినను జీవత్సంప్రదాయము స్థిత ప్రజ్ఞతతో శృంఖలలనుగూడ అలంకారములుగా చేసికొని, అవరోధములను అవలంబనములుగా మచ్చికచేసికొని, అంతగా అనువు కానప్పుడు ఒదిగి ఒదిగి ప్రక్కలనుండి చోటుచేసికొని, ఎట్లో దాటి మరల పూర్వగతిలో ముందుకు ప్రవహించును. ప్రవాహము, ప్రవాహమునకు ఆటంకములు, ఈ ఉభయములు అనివార్యములు. అట్లే సంప్రదాయములు, వానిపై జరుగు ప్రయోగములును అనివార్యములు. మానవునిలో వికాస మున్నన్నినాళ్ళు సంప్రదాయము సజీవముగా నుండును. అది క్రొత్త క్రొత్త మార్పులతో వసంత ద్రుమమువలె చిగురించుచుండును. సంప్రదాయము ప్రాణవంతముగా నుండుటకు ప్రయోగమే చక్కని సాధనము. మతములో, సంస్కృతిలో, సాహిత్యములో, మానవుని నిత్యనైమిత్తిక క్రియాకలాపములలో సంప్రదాయములపై ప్రయోగము లవశ్యము జరుగుచుండును. సాహిత్యమున – ప్రధానముగా ఆధునికాంధ్ర కవిత్వమున – సంప్రదాయమునకున్న స్థానమును, దానిపై జరిగిన విస్మయావహములైన సరిక్రొత్త ప్రయోగములను పరిశీలించి చూపుటయే ఈ పరిశోధన గ్రంథము పరమలక్ష్యము.

**శీర్షిక :**

"ఆధుని కాంధ్ర కవిత్వములో సంప్రదాయములు; ప్రయోగములు" అను ఈ శీర్షిక ఇంగ్లీషులో "Tradition And Experiment In Modern Telugu Poetry" అను దానికి సమానార్థకము. Tradition అను శబ్దమునకు సంప్రదాయమను పదము చక్కగా కుదిరినను,

Experiment అను పదమునకు 'ప్రయోగము' అనునది అంత సరియైనది కాదేమో ? కాని తెలుగులో Experiment అను పదము 'ప్రయోగ'మనియే రూఢముగా వ్యవహారములో నున్నందున దానినే స్వీకరింపవలసి వచ్చినది. Experiment కు బదులుగా Revolt (తిరుగుబాటు) వాడుటకు వీలున్నది. కాని యీ రెంటికి ఇంచుక భేదమున్నది. Experiment లో నున్న సాధుత్వము Revolt లో లేదు. సాహిత్య రంగములో జరుగునవి ప్రయోగములే కాని, మూల చ్ఛేదము చేసెడు తిరుగుబాటులు కావు. ఒకవేళ అట్టివి జరిగినను అవి రాశికి వచ్చునవి కావు. ఈ గ్రంథమున ప్రయోగమను శబ్దము మార్పునకు, నవ్యతకు పర్యాయముగా స్వీకరింపబడినది.

## సంప్రదాయము : దాని స్వరూపము

### సంప్రదాయ నిర్వచనము :

'సంప్రదాయ' శబ్దము సంస్కృత భాషలో వేదకాలమునుండి ఈనాటివరకు బహుళ ప్రచారమున నున్నదే. ఇది తెలుగులో తత్సమముగా స్వీకరింపబడినది.

అమరకోశమున 'అథామ్నాయస్సంప్రదాయః' అని యున్నది. 'సమ్యక్ ప్రదానం సంప్రదాయః', 'సమ్యక్ సరహస్యం ప్రదీయత ఇతి సంప్రదాయః' అని ఈ శబ్దమునకు వ్యుత్పత్తులు చెప్పబడినవి. వీని ప్రకారము గురుపరంపరాగతమైన సదుపదేశమునకు సంప్రదాయ మని అర్థము వచ్చును. 'సం + ప్ర + దా + ఘఞ్ = సంప్రపూర్వస్యదాధాతోః ఘఞ్'; 'గురు పరంపరాగత సదుపదేశః', 'శిష్టపరంపరావతీర్ణోపదేశః' అని అమరకోశ వ్యాఖ్యానమున కలదు. గురుపరంపరగానే కాక, శిష్టపరంపరగా అవతరించిన ఉపదేశమునుగూడ సంప్రదాయ మనవచ్చు నని దీనినిబట్టి తెలియుచున్నది.

ఆప్టే సంస్కృత నిఘంటువునందు దీనికి 'Tradition' అనియు, 'Traditional' doctrine or knowledge' అనియు, 'An established custom, usage' అనియు అర్థము లీయబడినవి. సంప్రదాయ మనగా పరంపరాగతమైన పరిజ్ఞానము, లేక ఒకానొక సుప్రతిష్ఠితమైన ఆచారము అను అర్థము దీనివలన తేలును. మాక్స్ రాడిన్ (Max Radin) అను రచయిత 'Tradition is the handing on of the past to the present' అని వ్రాసినాడు.[1] వర్తమానమునకు సంక్రమించు గతమే సంప్రదాయమని ఇతని అభిప్రాయము.[2]

1. **Encyclopaedia of Social Sciences : P. 189.**
2. **J. T. Shipley** కూడ ఈ అభిప్రాయమునే వెల్లడించెను. **'Tradition : In its broadest sense denotes all the conventions, literary devices and habits of expression handed on to a writer from the past.'**

**— Dictionary of World Literary Terms.**

వ్యాలిస్ (Wallis) అను రచయిత సంప్రదాయమును గూర్చి ఇట్లన్నాడు :

'Tradition has to do with the past and commonly conceived as the influence of the past on the present.'[1] ఈ నిర్వచనము ప్రకారము తరతరములుగా ఏర్పడుచున్న చారిత్రక ప్రభావములవలన సంప్రదాయ మేర్పడునని స్పష్టమైనది.

ఇంగ్లీషులో custom, convention అను మరి రెండు పదము లున్నవి. Convention అనునది ఇంచుమించుగా Tradition కు సమానార్థకము. Custom మాత్రము కాదు. Custom అనగా ఆచారము మాత్రమే. సంప్రదాయములోని విస్తృతి ఆచారమునందు లేదు. ఆచారము ప్రధానముగా ఆచరణకు సంబంధించినది. సంప్రదాయము ఆలోచనకు సంబంధించినది.[2] కాని వ్యవహారము నం దీ రెంటికంతగా భేదము పాటించబడుటలేదు. సంప్రదాయమును 'వారసత్వ' మను అర్థములోగూడ స్వీకరింపవచ్చును.

'The role of tradition in social life, like that of heredity in physiological life, is to hand down a portion of the past, to wit the stream of impelling tendencies which carry over from one generation to another.'[3]

శారీరకతత్త్వముపై వంశ పారంపర్య ప్రభావమెట్లో, సాంఘిక జీవితమున సంప్రదాయము నిర్వహించు పాత్రకూడ అట్టిదే. గతములోని కొంత భాగమును ఒక తరమునుండి మరియొక తరమున కందజేయుటయే సంప్రదాయముయొక్క కర్తవ్యమని పై నిర్వచనమువలన తెలుచున్నది.

'సంప్రదాయ' శబ్దమునకు దాని వ్యుత్పత్త్యర్థమునుబట్టి చూచినచో 'సంక్రమించుట' (Transmission) అను అర్థము వచ్చును. ఈ దృష్టితో చూచినచో ప్రతి యుగమున ఆ యుగము తనకై తానుగా సృష్టించుకొన్న నూతనాంశములు, ఇతరులనుండి ఎరువు తెచ్చుకొన్న అంశములు తప్ప, సాంఘిక జీవితమునందలి తక్కిన అంశము లన్నియు సంప్రదాయ సంబంధులే.[4]

గతతరము వర్తమానతరమునకు సంప్రదాయ మూలధనము నందించిపోవును. ఒకానొక సాంఘిక వ్యవస్థకు సంబంధించిన ప్రజలందరు ఆమోదించినప్పుడే ఒకానొక సంప్రదాయము వేరూదినిల్చును. సంప్రదాయము స్వయముగా ఒక వ్యవస్థ కాదు; ఒకానొక వ్యవస్థ

1. Introduction to Sociology : P. 186.
2. 'Custom pertains to the realm of action and tradition to that of thought.'
— Introduction to Sociology : P. 186.
3. Introduction to Sociology : P. 186.
4. చూ : Encyclopaedia of Social Sciences : P. 186.

పట్ల గల విశ్వాసము మాత్రమే.[1] అయినను కేవలము విశ్వాసములనేకాక కర్మలనుగూడ సంప్రదాయావరణములో చేర్చవచ్చును.[2]

ఈ 'సంప్రదాయ' శబ్దము వర్తమాన కాలమున అనేక రీతులుగా వ్యవహరింపబడు చున్నది. మనము వైదిక సంప్రదాయములని, లౌకిక సంప్రదాయములని, నిత్య వ్యవహారమున వినుచుందుము. ఇంతేకాక ప్రాచీన మర్యాదల నంటిపెట్టుకొన్న కుటుంబమును 'సంప్రదాయ మున్న కుటుంబ'మని యందుము. 'అమాయికుడు' అను అర్థములో కొందరు 'సాంప్రదాయికు' దని వాడుదురు. అనగా ఏ విధమైన తిరుగుబాటుచేయక పూర్వమున్నదాని నున్నట్లుగా అనుసరించువాడని అర్థము. ఒక రచయితను స్తుతించుటకు 'అతఁడు చక్కని సంప్రదాయ మార్గమునకు చెందినవాడు (Traditional)' అని యందుము. మరి విమర్శింప దలచినప్పుడు కూడ 'అతడు వట్టి సంప్రదాయవాది' యని 'సంప్రదాయ' శబ్దమునే ఉపయోగింతుము. ఆంగ్ల సాహిత్యమున కొన్ని యుగలక్షణములను 'సంప్రదాయము'తో ముడివేసి పిల్చుట కలదు. French tradition, Victorian tradition, Classical tradition ఇట్టివే. రోముదేశపు న్యాయశాస్త్రము (Roman Law) ప్రకారము Tradition అనగా కనీస మొకటి రెండు తరములనుండి వాడుకలోనున్న ఆచారము. ఇది న్యాసము (deposit) తో పోల్చబడినది. 'డిపాజిటు' అనునది నైతిక జీవనమున అత్యంత పావిత్ర్యముగల వస్తువు. కనుక సంప్రదాయ మనునది జనవ్యవహారములోని ఆచారములవలె ప్రత్యక్షముగా కన్పించు విషయము మాత్రమే కాదు. అది అనల్పమైన ఒక నిశ్చయమును వ్యక్తము చేయును.

సంప్రదాయము విశాలమైన అర్థము కలిగియున్నదని ఇంతవరకే మనవి చేసితిని. సదాచారములు, ఉత్తమ విశ్వాసములు అన్నియు దీనిలోనే చేరును. ఒకానొక వ్యక్తిని చూచినప్పుడు మన మతనిని సంభావించెడి పద్ధతి సైతము మీ సంప్రదాయములోనే చేరునని టి. యస్. ఇలియట్ (T. S. Eliot) అభిప్రాయపడెను. మానవుని జీవితములోని సమస్తాంగములయందు సంప్రదాయము పూసలలోని దారమువలె నుండును. జాతి జీవితసౌధమున కది పునాది వంటిది. కాని మనలో పలువురు దాని విలువను గమనింపరు. నిజమే మరి. గాలి, వెల్తురు, వెన్నెల–ఇవి కొంతకాలము లేకుండ పోయినచో వాని విలువ మనకు తెలియును. సంప్రదాయ మట్టిదే. సత్ సంప్రదాయ మెల్లప్పుడు జీవనదివలె ప్రవహించుచుండును. సాంఘిక జీవన క్షేత్రమునగాని, మానవుని వ్యక్తిగతమైన బ్రతుకు బాటలోగాని, సాహిత్యాది రంగములయందుగాని, సంప్ర

1. 'What is really a tradition therefore is not the institution but the belief in its value'. — Encyclopaedia of Social Sciences.

2. 'పారంపర్యముగా, అనుశ్రుతముగా, తరతరాలుగా, అనుస్యూతముగా వచ్చే కొన్ని నమ్మకాల యొక్కగాని, అభిప్రాయముల యొక్కగాని, కర్మల యొక్కగాని, సమూహానికి సంప్రదాయమని చెప్పవచ్చును.'

— నవ్యాంధ్ర సాహిత్య వీథులు : కురుగంటి సీతారామయ్య : 2 భా. : పుట 281.

దాయమే ప్రబల శక్తిగా పనిచేయును. ఒకానొక సంప్రదాయము గతములో ఘనమైనది కావచ్చును. కాని వర్తమాన కాలమున దానికిగల విశిష్టతను గమనించుట ముఖ్యము. అందుకు రచయితకు చారిత్రకదృష్టి అవసరము. దేశకాల పరిస్థితుల దృష్ట్యా సామాజిక పరిణామమునకు సైదోడుగానుండు సంప్రదాయము మాత్రమే స్వీకరింపదగినది. అందుకే గతమును గతము దృష్టితో కాక వర్తమాన దృష్టితో సమీక్షింపవలెనని ఇలియట్ అభిప్రాయపడెను.[1] వర్తమాన పరిస్థితుల కనుగుణముగా కలిగిన చారిత్రకదృష్టి యెల్లప్పటికి నవనవోన్మేషమైన ప్రతిభకు ఉపస్కారకమైనది. సంప్రదాయము నాలంబనముగా స్వీకరింపక ఏ వ్యవస్థయు వృద్ధిపొందదు. ఏ కవియు, ఏ కళాభిజ్ఞుడును నూత్న నిర్మాణము చేయలేడు. ప్రతి యుగమునందును, ఆ యా కవుల వ్యక్తిత్వములను వారికి ముందుండిన కవులను బట్టియే నిర్ణయింపవలసి యుండును. ఏ కవికిని విడిగా అపూర్వ వ్యక్తిత్వముండదని ఇలియట్ స్పష్టపరిచెను.[2] అయినను సంప్రదాయము పేర గతములోని వన్నియు దిగుమతి చేసికొనుట భావ్యముకాదు. అట్లే గతమును గ్రుడ్డిగా పూజించుటయును వాంఛనీయముకాదు. సంప్రదాయమును గ్రుడ్డిగా అనుకరించుటకన్న నవ్యత నుపాసించుటయే శ్రేష్ఠమని ఇలియట్ నొక్కి చెప్పెను.[3] సంప్రదాయములకు దేశ కాలములు నిరోధకములుగావు. వాల్మీకి రామాయణములోని కొన్ని కవి సమయములనే ఈనాటికిని మనము స్వీకరించుచున్నాము. అంత మాత్రమున ప్రాచీన కావ్యములలోని సంప్రదాయము లన్నిటిని తు. చ. తప్పకుండ స్వీకరించుట హాస్యాస్పదమే యగును. కాలగతి కెదురొడ్డి నిల్వలేక ఒడ్డిగిలబడిన నిర్జీవ సంప్రదాయములను నిలబెట్ట ప్రయత్నించుట వాంఛనీయముకాదు. దీనిని ఇలియట్ చక్కని ఉదాహరణముతో వ్యక్తీకరించినాడు.

'We become conscious of these items, or conscious of their importance, usually only after they have begun to fall into desuetude, as we are aware of the leaves of a tree when the autumn wind begins to blow them off–when they have separately ceased to be vital'.[4]

శిశిరవాతఘాతముచేత జీవశక్తి నశించి రాలిపడిన ఆకులనుగూర్చి విచారించి ప్రయోజనములేదని ఇలియట్ అభిప్రాయము. నిజమే. ఆ ఆకులకు జిగురువెట్టి మరల నతికించుటకై

1. 'Not only of the pastness of the past, but of its presence'.—
'Tradition And the Individual Talent' : (వ్యాసము)
'Points of View' అను పుస్తకములో ప్రచురింపబడినది : P. 25.
2. 'No poet, no artist of any art, has his complete meaning alone. His significance, his appreciation is the appreciation of his relation to the dead poets and artists'. — 'Tradition And the Individual Talent : P. 25.
3. 'Novelty is better than repetition'. —'Tradition And The Individual Talent'
4. Tradition (వ్యాసము) : Pub : 'Points of View' : P. 21.

ప్రయత్నము చేసినచో అది అజ్ఞానమే యగును. చేవయున్న చెట్టయినచో మరల క్రొత్త చిగుళ్ళు తొడుగుకొనును. కానిచో గొడ్డలిపాలగును. ఆధునిక యుగములో సైతము నిర్జీవ సంప్రదాయ ములను పునః ప్రతిష్ఠించవలెనను శుద్ధ సంప్రదాయవాదులు లేకపోలేదు. వారి కృషి యే విధ ముగా నిష్ఫలమగునో ఇలియట్ ఇచ్చిన దృష్టాంతమువలన స్పష్టమైన దనుకొందును.

ఇక నిర్జీవ సంప్రదాయముల మాట అటుండనిచ్చి సత్సంప్రదాయముల విషయము పరిశీలింతము. గత మను తల్లి వర్తమాన మను శిశువునకిచ్చు స్తన్యమే సత్ సంప్రదాయము. ఒకానొక వ్యక్తి ఆ స్తన్యము నెంతగా జీర్ణించుకొనునో అతని కంతటి ధీశక్తి యలవడును. ముఖ్యముగా కవులపట్ల, కళాస్రష్టలపట్ల ఈ సత్యము 'అక్షరాల' వర్తించును. వేద ఋక్కుల లోని ప్రకృతి రామణీయకమును చూరగొననిదే వాల్మీకి శ్రీమద్రామాయణము రచింపలేదు. వాల్మీకి వర్ణనాపటిమను, కల్పనా శిల్పమును గుండెకు పట్టించుకొననిదే కాళిదాసు కావ్యసృష్టి చేయలేదు. అతడు మబ్బుతో మధుర సందేశమును పంపించుటకు ప్రాతిపదిక వాల్మీకి రామా యణములోని హనుమత్సందేశములోనే యున్నదికదా! అట్లే నన్నయాదులు, వాల్మీకి కాళిదాసా దుల కావ్యములను రుచిచూడనిదే తెలుగు కావ్యములు వ్రాయలేదు. అన్ని భాషల సాహిత్యము లకు ఈ విషయయే వర్తించును.[1] ఇంగ్లీషు కవులగు మిల్టన్, పోపు, షెల్లీ, కీట్సు, టెన్నిసన్, స్విoబర్న్ మున్నగు కవులపై గ్రీకు సంప్రదాయముల ప్రభావము కంఠదఘ్నముగా నున్నది. ఇంగ్లీషువారి సాహిత్యములో, సాంఘిక జీవనములో గ్రీకు సంప్రదాయములతోపాటు రోమన్ సంప్రదాయములుగూడ ప్రబలముగా పనిచేసినవి.[2] మిల్టన్ కావ్యములపై వర్జిల్ (Virgil) ప్రభా వము మిక్కుటముగా నున్నది. ఆ వర్జిల్‌పై హోమర్ (Homer) ప్రభావమున్నది. తనకు ముందు మార్లో (Marlowe) లేనిదే షేక్స్పియరు అంత చక్కని నాటకములు వ్రాసియుండెడి వాడు కాడు. అట్లే మార్లోకూడ చాసర్ (Chaucer) లేనిదే వ్రాయగలిగెడివాడు కాడు. చాసరుకు ముందటి కవులు ఆంగ్లభాషను మచ్చిక చేసికొని దానికి రూపురేకలు దిద్దియుండకపోయినచో చాసరు మహాకావ్య రచన చేయుట దుష్కరమయ్యెడిది. ఒక వాణి వెనుక ఎందరి అనుభవమో నిబిడమై యుండునన్న వర్జీనియా వుల్ఫ్ (Virginia Woolf) అభిప్రాయము ఈ సందర్భమున గమనింపదగినది.[3] కావున ప్రతి సాహిత్యమున సత్ సంప్రదాయము మూలనిధివలె ఉపయోగ పడుచు క్రమాభివృద్ధికి దోహదకారి యగుచున్నది.

1. విశ్వకవి రవీంద్రునిపై గల వాల్మీకి కాళిదాసాదుల ప్రభావము జగద్విదితము.
2. 'For in the full sense the classical tradition is the whole stream which comes down from the ancient civilizations and gives form and unity to our own; a stream which comes from Greece, through the Roman empire, through Christianity wilh affluents from the Christian Hebrew and Barbaric North'.

—'The Classical Tradition In Poetry' : Gilbert Murray : P. 6.
3. 'The experience of the mass is behind the Single voice.'

### సంప్రదాయావశ్యకము :

జాత్యభివృద్ధికి సంప్రదాయానుసరణ మెంత ఆవశ్యకమైనదో వేరే చెప్పనవసరములేదు. సంప్రదాయములేని జాతి వెన్నెముకలేని శరీరము వంటిది. ఏ జాతి తన సంప్రదాయములను సంస్కార నికషముపై ఒఱసికొనుచుండునో ఆ జాతి పది కాలములపాటు బ్రతికి బట్టగట్టును. అందుకే సత్సంప్రదాయము మానవుని ఆంతర ప్రకృతిని ప్రక్షాళనముచేసి తామసిక వికారము లను తుడిచివేసి అతనిని దివ్యపదవికి చేరవేయునని రాధాకృష్ణ పండితు డభిప్రాయపడినాఁడు.[1] మానవుని దేవతగా మలచుటకన్న ఘనకార్యము మరియొకటి కలదా ? వేదములు, పురాణములు, ఇతిహాసములు, మతభాష్యములు, కావ్యములు – ఒకటేమిటి – సమస్త వాఙ్మయ ప్రక్రియల సంప్రదాయాత్మ ఒకటే. మానిసిని మనీషిగా, మనస్విగా – క్రమముగా దేవతగా – మలచుట కొరకే ఈ ప్రక్రియలన్నియు రూపొందినవి. వీని దారులు వేరైనను గమ్యమొకటే. 'మృత్పిండమేకం బహుభాండరూపమ్' అన్నట్లుగా ఇవన్నియు ఒకే సంప్రదాయము ఆత్మ గాగలవే. వివిధవర్ణ విభాసితములైన పుష్పముల నొకచో కూర్చుటకు ఒకే సూత్ర ముపకరించు నట్లు ; ఒకే యొక చిరంతన సంప్రదాయము భారతదేశములోని ప్రధాన మతము లన్నిటిలో అంతర్వాహినిగా నున్నది.[2]

సంస్కృతి పుష్టమైన ఏ జాతియు సంప్రదాయములకు దూరముగా నుండలేదు. అంతవర కెందుకు ? ఆటవిక జాతులు సైతము కొన్ని సంప్రదాయములకు తలవంచి బ్రతుకును గడుపు చున్నవి. నేటికిని పల్లెటూళ్ళలో 'ఈ పని యెందుకు చేసితి' వనగా 'మా తాత ముత్తాతలు చేసిరి మేమును చేయుచున్నా' మనియు, 'ఇది చిరకాలమునుండి సంప్రదాయముగా వచ్చుచున్న' దనియు అందురు. వెనుకబడిన జాతులలో సంప్రదాయానుసరణము మిక్కుటముగా కను పించును. నాగరకత ముదిరిన జాతులలో కొంతవరకు సంప్రదాయోల్లంఘన తత్త్వము మొనలు చూపుట సహజము.

సంప్రదాయానుసరణము ఒక జాతి నెంతటి అభివృద్ధిదశకు తీసికొనిపోవునో తెల్పుటకు భారతదేశమునే కాక గ్రీసు రోము దేశములను గూడ నిదర్శనములుగా గ్రహింపవచ్చును.

1. 'A living tradition influences our inner faculties, humanizes our nature and lifts us to a higher level.' —'The Hindu View of Life' : P. 18.
2. 'త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మతః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథ జుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసామర్ణవ ఇవ.' —మహిమ్నః స్తోత్రము.

(మతములు స్వరుచి భేదమువలన ఇది మంచిదని, అది మంచిదని అనుకొనును. కాని వివిధ గతులలో విభిన్న దశలలోసాగు నదు లన్నియు కడకు సాగరమున కలసినట్లు నరు లందరికి భగవంతుడే ఏకైక లక్ష్యమని దీని తాత్పర్యము).

అవిచ్ఛిన్నముగా సంప్రదాయ పోషణము జరిగిన కాలముననే గ్రీసు రోముదేశములు సాంస్కృతికముగా సంపన్నమైనవి. సంప్రదాయమే పాశ్చాత్య ప్రపంచమున మధ్యయుగములో 'చర్చి'కి ఆధిపత్యమిచ్చినది. ఫ్రాన్సుదేశములోని ప్రజలు సంప్రదాయముయొక్క చుంచు దువ్విననాడే ఆ దేశము నాగరకముగా పెంపు వహించినది. బ్రిటిషు ప్రజల జాతీయ జీవనముపై గూడ సంప్రదాయ ప్రభావము ప్రబలముగా నున్నది. ఇంగ్లండులోని ప్రజల జాతీయ జీవనము దిన దినము కొమ్మలు రెమ్మలు వేయుటకు కారణము ఆ దేశములోని ప్రజాసంస్థలో లేక ప్రభుత్వమో కాదు. దాని బహుముఖాభివృద్ధికి సంప్రదాయానుసరణమే మూలహేతువని సాంఘిక శాస్త్రవేత్తలు (Sociologists) అభిప్రాయపడిరి. ఫ్రాన్సుదేశమున సంప్రదాయోల్లంఘన తత్త్వమధికమగుటచేత అచ్చటి సాంఘిక రాజకీయ జీవనము కొంత దెబ్బతిన్నదని ప్రముఖ సాంఘిక శాస్త్రవేత్త వ్యాలిన్ అభిప్రాయపడినాడు.[1] సంప్రదాయ బద్ధమైన జీవితము గడవుచున్నందుననే ఇంగ్లండు దేశము పాశ్చాత్యదేశము లన్నిటిలో తలమానికమై ప్రశాంత జీవితమును సాగించుచున్నదని ఇతని యభిప్రాయము. అంత మాత్రమున క్రొత్తదనమునకు చోటీయక తదితరముల క్రిందటి సంప్రదాయములనే పట్టుకొని వ్రేలాడవలెనని అర్థము చేసికొనరాదు. వర్తమాన కాలమున కనుగుణమైన సజీవ సంప్రదాయముల ననుసరించు జాతియే సర్వవిధముల సంపన్నమగునని ఈ చర్చ సారాంశము.

### సంప్రదాయావతరణము :

అపార ప్రతిభావంతుడైన ఒక వ్యక్తి తన పూర్వులు నడచిన బాటలో నడవక ఏదో ఒక క్రొత్తదనమును చూపును. అప్పుడప్పు డిట్టి వ్యక్తులు ఘంటాధ్వములను కాదని కంటక మార్గములందు కాలూని స్వశక్తిచే వానిని పూలబాటలుగా మలచుకొందురు. వారేర్పరిచిన బాటలోనే వారికన్న అల్ప ప్రతిభయు, పరిమిత బుద్ధియు గలవారు నడచుచుందురు. నడచువారి సంఖ్య ఎంతగా అధికమైన, అంతగా ఆ బాట నలిగిపోవును. గమ్యమును సులభముగా అందుకొన వచ్చునను విశ్వాసము పథికుల కేర్పడును. క్రమముగా ఆ బాటలో నడచుట ఒక సంప్రదాయముగా మారిపోవును.

'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరోజనః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే'.[2]

కావున ప్రతి నూత్నమార్గము (సిద్ధాంతము) కొన్నినాళ్ళకు సంప్రదాయమై పోవును. క్రమముగా నడచువారి సంఖ్య అధికము కాగా ఆ బాట అరిగిపోయి అగమ్యమైపోవును. మరల ఒక 'శ్రేష్ఠుడు' బయలుదేరి ప్రక్కనుండి క్రొత్తబాట ప్రారంభించును. ఈ బాట కూడ నేలపై వేసినదే కావున క్రమముగా అదియు సంప్రదాయమైపోవును. నేలపై గాక గాలిలో వేసిన

1. చూ. 'Introduction to Sociology' :
2. భగవద్గీత : కర్మయోగము : 21 శ్లోకము.

బాట సంప్రదాయము కాజాలదు. శంకరుడు, రామానుజుడు, వివేకానందుడు మున్నగు ప్రవక్తలు; వాల్మీకి, కాళిదాసు, జయదేవుడు మున్నగు ప్రాచ్యకవులు; చాసరు, వర్డ్సువర్తు, బైరను వంటి పాశ్చాత్య కవులు; వారివారి రంగములందు కొన్ని సంప్రదాయములను ప్రతిష్ఠించిపోయిన మహానుభావులే. వారు నాటిన కొన్ని సంప్రదాయములు నేటికిని చెక్కుచెదరకుండ నిలిచియున్నవి. బహిరాకృతిలో కొంత మార్పు వచ్చినను వాని ఆత్మలో అవంత వ్యత్యాసము రాలేదు. అచుంబితమైన ఆలోచనాపాటవమున్న వారే సంప్రదాయములను నిర్మించిపోదురు. అల్ప ప్రతిభులు వట్టి తిరుగుబాటుతో తృప్తినొందుదురు. సంప్రదాయమాత్మగా గల నూత్న ప్రయోగములు సదా వాంఛనీయిములే. సృష్ట్యాదినుండి నేటికిని ఎడనెడ క్రొత్త ప్రయోగములు జరుగుచునేయున్నవి. ఈ ప్రయోగములవలన సంప్రదాయ మహాప్రవాహ మింకను విస్తృతమై అనేకుల మనశ్శాద్వలములలో మరకతములను పండించుచున్నది. అవాంఛనీయమొక్కటే. అదే నేలవిడిచి చేసిన సాము; అనగా సంప్రదాయమును బొత్తిగా కాదని చేసెడు ప్రయోగము.

### భారతీయ మత సంస్కృతుల సంప్రదాయములు :

భారతీయ సంస్కృతి యనగా స్థూలముగా వైదిక సంస్కృతియనియే చెప్పవచ్చును. ప్రధానముగా ప్రాచీన భారతదేశములోని సంస్కృతి యనగా వేదములలో, వేదాంతములైన ఉపనిషత్తులలో, ఉపనిషత్సారమైన భగవద్గీతలో ప్రవచింపబడిన విజ్ఞానసారమే. భారతీయ సంస్కృతిని, మతమును విడదీయుటకు వీలులేదు. ఒక్కొక్కకాలమున తలయెత్తిన ఒక్కొక్క మతములోని సత్త్వము భారతీయ సంస్కృతి శరీరమునకు పుష్టిని చేకూర్చినది. భారతీయ సంస్కృతి సంప్రదాయములపై అనేక మతముల ప్రభావమున్నది. భారతదేశములోని మతములు పేరున కెన్ని వేరుగా కన్పించినను వాని అంతస్సూత్ర మొకటే. అవన్నియు ఆధ్యాత్మికతనే ప్రతిపాదించినవి. స్థూలముగా కనిపించు జగత్తునకు అభిన్నము, అతీతమునైన పరబ్రహ్మ పదార్థమును ఇంచుక తారతమ్యముతో విశ్వసించినవి. ద్రవ్యకాంక్ష, సంసారవాంఛ జీవితధ్యేయములు కావని, ఆముష్మిక చింతన, సత్యాన్వేషణ అవశ్యాచరణీయములని ఘంటాఘోషముగా ఉద్ఘాటించినవి. ఒక్క చార్వాకమతము మాత్రము ఈ మూల సూత్రములకు విభిన్నముగా వెర్రితలలు వేసినది. 'చైతన్య విశిష్ట దేహ ఏవాత్మా' అన్నది ఈ మతము మూల సిద్ధాంతము. ఈ మతము దృష్టిలో స్వర్గ నరకములులేవు. అపవర్గములేదు. యావజ్జీవితము సుఖించుటయే దీని పరమావధి. భారతీయ సంస్కృతి సంప్రదాయముల కిది మూలచ్ఛేది కావున పుబ్బలో పుట్టి మఖలో మాడిపోయినది. భారతీయ సంస్కృతిపై ఇట్టి మతముల ప్రభావ మావంతయు కానరాదు.

భారతీయ సంస్కృతి పాదపమునకు మూలకందమైన హిందూమతము స్థూలదృష్టితో చూచువారికి అనేక విశ్వాసముల ప్రదర్శనశాలగ, అనేక సిద్ధాంతముల కలగూరగంపగా కనిపించును. వేదయుగములం దొకరీతిగ, బ్రాహ్మణముల కాలమున మరియొక మాదిరిగ,

బౌద్ధయుగమున ఇంకొకతీరుగ హిందూమత తత్త్వము భాసించినది శైవులు, వైష్ణవులు, శాక్తేయులు, ద్వైతులు ఈ మతము నిచ్చవచ్చినట్లు మలచుకొన్నారు. తమ అభిరుచుల కను గుణముగా ఈ మతమునకు భాష్యములు రచించినారు. భారతదేశమున ఎన్ని మతములున్నవో అన్నిటికిమించి జాతులు, వర్ణములు, భాషలు నున్నవి. మతములో, భాషలో, వర్ణాదులలో ఎంత వైవిధ్యమున్నను భారతజాతి అంతరంగమున ఇంచుమించుగ ఒకే సంస్కారము పరిమ ళించినది. భారతజాతి రక్తప్రసారముతో హైందవమత సార సారణి శ్రుతిగలిపి ప్రవహించినది. భిన్నత్వములో ఏకత్వము భారతజాతి అనాదినుండి అవలంబించిన సంప్రదాయము. నాలుగు వేల సంవత్సరములనాటి వేదసంస్కృతియే నేటికిని వాసనారూపమున మిగిలిపోయినది. నగ రములు పాశ్చాత్య సంస్కృతి సంపర్కముచే ప్రాచీనతా గంధము పోగొట్టుకొన్నను పల్లెలలో మాత్రము నేటికిని ప్రాచీన సంస్కృతి సౌరభములు ప్రసరించుచునే యున్నవి. ఎన్ని దండ యాత్రలు వచ్చిపడినను, ఎన్ని అంతః కల్లోలములు పెల్లుబికినను, హైందవ సంస్కృతి వజ్ర సంకల్పముతో వాని నెదుర్కొన్నది. బాహిరముగా ఎన్ని మార్పులు జరిగినను అంతస్సత్త్వ దృష్ట్యా చూచినచో హైందవ సంస్కృతి వేదకాలము నాటిదే. ఇతర సంస్కృతులలో కని పించని నిబిడ జీవశక్తి హైందవ సంస్కృతిలో గోచరించును. చెట్టులో చేవయున్నదో లేదో కనుగొనుటకు ఆ చెట్టునే చీల్చి చూడవలసి యుండును. అందు కెంత శక్తి కావలెనో, హైందవ సంస్కృతిని విశ్లేషణముచేసి చూపుటకు అంతకన్న అధికశక్తి కావలెనని రాధాకృష్ణ పండితు డభిప్రాయపడినాడు.[1]

సత్యాన్వేషణమే హైందవ సంస్కృతి ప్రధాన ధ్యేయము. వివిధ మతము లీ ధ్యేయ సముపార్జనకే ఉదయించినవి. హైందవ మతమును నిర్వచించుట యనగా దాని సత్యాన్వేషణ తత్త్వమును విప్పి చూపుటయే. నిరంతర సత్యాన్వేషణమే హైందవ మతమని, ఇదే సత్యము యొక్క మతమని, సత్యమే దైవమని, దేవుడు లేదని అనుట మన మెరుగుదుముకాని సత్యము లేదని యనుట మాత్రము మన మెచ్చట వినలేదని గాంధీగా రభిప్రాయపడిరి.[2]

భారతీయ సంస్కృతి పౌరాతన్యము విస్మయావహమైనది. మానవజాతి చరిత్రలో తొలి ఉషస్సు తొంగిచూచినప్పటినుండియే భారతదేశము ప్రపంచమునందలి అన్ని మూల లందు తన ఆశయకాంతులను ప్రసరింపజేసినది. తన సాంస్కృతిక సామ్రాజ్యమును సమస్త విశ్వమున విస్తరింపజేసినది. ఇంతటి మహత్తరకృషిని ఈ దేశము ఎట్టి 'డాబుదర్పములు' లేకుండ నిశ్శబ్దముగా నిర్వహించినది. మనము చూడకయే వినకయే ఏ విధముగా మంచు

1. The Hindu View of Life : P. 13.
2. 'Hinduism is a relentless pursuit after truth. Hinduism is the religion of truth. Truth is God. Denial of God we have known, denial of truth we have not known.'
—Quoted by Sri Jawaharlal Nehru in his book 'Discovery of India' : P. 68.

కురిసి అందమైన గులాబీపువ్వులను వికసింపజేయునో; అట్లే భారతదేశముగూడ ప్రపంచ మతదృక్పథములకు తాను చేయవలసిన దోహదము చేసినదని వివేకానందులు వెలిపుచ్చిన అభిప్రాయము అత్యంత సముచితమైనది.[1]

### భారత సంస్కృతి : భగవద్గీత :

భారతదేశములోని ప్రాచీన సంస్కృతి చాలవరకు వ్యాసభారతమున నిర్దిష్టమైన సంస్కృతియనియే చెప్పవచ్చును. భారతము కేవల మితిహాసమో, కావ్యమో కాదు. నన్నయ మాటలలో చెప్పవలెనన్న అది ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రము, అధ్యాత్మవిదులకు వేదాంతము, నీతి విచక్షణులకు నీతి శాస్త్రము. ఇందరి కిన్నివిధములుగా భాసించిన మహాభారత పద్మము నందు కర్ణికాసదృశమైన ఘట్టము భగవద్గీత. వినోబా భావేగారు గీతాప్రాధాన్యము నీ విధముగా ఉగ్గడించినారు.

'గీత మహాభారతముయొక్క మధ్య భాగములో ఎత్తైన దీపమువలె నిలిచియున్నది. దాని వెలుగు మహాభారతమున కెల్ల సోకుచున్నది'.[2]

మానవుని సాంఘిక, రాజకీయ, నైతిక సంఘర్షణలకు నిలువుటద్దము భగవద్గీత. ముఖ్యముగా ఆత్మలో జరుగు సంగ్రామమునకిది దిక్సూచి. స్వధర్మమునకు ప్రతిబంధకమైన మోహమును పారద్రోలుటయే గీత పరమోద్దేశము. భారతేతిహాసమునాటి సమాజముపై దీని ప్రభావము అతి ప్రబలముగా నున్నది.. ఈ నాటికి సైతము భారతీయ సంస్కృతి సంప్రదాయజ్ఞులకు గీతాసూక్తులు రసమయ ఋక్కులు. ఆత్మతత్త్వము, కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, పరమాత్మ స్వరూపము మున్నగు విషయములపై ఇది అమూల్యములైన అభిప్రాయములను వెల్లడించినది. గీతాసూక్తులతో కేవలము అర్జునుని మోహతిమిరమే పటాపంచలు కాలేదు. భారతదేశములోని ప్రతి సంశయాత్ముని మోహగ్రంధులను ఛేదించుట కిది చక్కని లవిత్రముగా పనిచేసినది. భారతీయ సంస్కృతి సంప్రదాయములను గ్రహించుట కిది వెలలేని రాజమార్గము. ఉపనిషత్తులలోని సారమును తెచ్చి అచ్చులో పోయగా రూపొందినది గీత.

## భారతీయ సంస్కృతి ఆధార శిలలు :
## సాహిత్యముపై వాని ప్రభావము :

### చతుర్విధ పురుషార్థములు :

ధర్మార్థకామమోక్షములు చతుర్విధ పురుషార్థములని భారతీయ తత్త్వజ్ఞులు నిర్ణయించిరి. మోక్షమువినా త్రివర్గ ప్రతిపత్తిని వాత్స్యాయనుడు క్రింది విధముగా నిర్వచించెను.

1. **'Like the gentle dew that falls unseen and unheard and yet brings into blossom the fairest of roses, it has been the contribution of India to the thought of the World.' —Quoted by Sisirkumar Mitra in his book 'Vision of India'.**
2. గీతా ప్రవచనములు : (ప్ర. ఆళ్వా) : అను : వెంపటి సూర్యనారాయణ.

'శతాయుర్వై పురుషో విభజ్య కాల మన్యోన్యానుబద్ధం పరస్పరస్యానను ఘాతకం త్రివర్గం సేవేత.'[1] పురుషుడు తన జీవితకాలమును ప్రత్యేకముగా విభజించుకొని ఒకదానితో ఒకటి విరుద్ధముకాని విధముగా పేర్చుకొని ధర్మార్థకామము లనెడు మూడు పురుషార్థములను సేవింపవలయునని వాత్స్యాయనుడు అభిప్రాయపడెను. బాల్యమునందు విద్యాగ్రహణా ద్యర్థములను, యౌవనమందు కామమును, వార్ధక్యమునందు ధర్మమోక్షములను సేవింపవలయునని ఈతడు తెలిపెను. మానవుని జీవితమును క్రమబద్ధముగా నడిపించుటకు ఈ పురుషార్థములు వెలుగుదారులుగా పనిచేసినవి. ప్రాచీనభారతీయులు ఈ చతురర్థములను సాధించుటకు ప్రయత్నించిరి. ఇక వీనినిగూర్చి సంగ్రహముగా చర్చింతును.

### ధర్మ నిర్వచనము :

'ధర్మస్తత్త్వదర్శనమ్' అని దండి మహాకవి అభిప్రాయము. అనగా సత్తునుండి అసత్తును వేరుచేయునది ధర్మము. ధర్మమును వాత్స్యాయనుడు క్రింది విధముగా నిర్వచించెను.

'అలౌకికత్వా దదృష్టార్థత్వా దప్రవృత్తానాం యజ్ఞాదీనాం శాస్త్రాత్ప్రవర్తనం లౌకికత్వా ద్దృష్టార్థత్వాచ్చ ప్రవృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్యః శాస్త్రాదేవ నివారణం ధర్మః'[2]

(అలౌకికములును, అదృష్టార్థములును అగుటవలన యజ్ఞాదులను ప్రవర్తింపజేయు నట్టిదియు, లౌకికములును, దృష్టార్థములును అగుటవలన ప్రవృత్తములైన మాంసభక్షణాదుల నుండి నివర్తింప జేయునట్టిదియును ఏది కలదో అది ధర్మమనబడుచున్నదని సూత్రార్థము.)[3]

### అర్థ నిర్వచనము :

'విద్యా భూమి హిరణ్య పశు ధాన్య భాండోపస్కర మిత్రాదీనా మర్జన, మర్జనస్య పరిరక్షణ మర్థః'.[4]

(విద్యలు, భూమి, హిరణ్యము, పశువులు, ధాన్యములు, గృహోపకరణములు, మిత్రులు మొదలగు వస్తువులలో అన్నిటిని ఆర్జనము చేయుట, ఆర్జించినదానిని వృద్ధిపొందించుట – అను ఈ రెండును అర్థమని సూత్రార్థము.)

దండి దశకుమారచరితలో అర్థనిర్వచన మించుమించుగా ఇట్లే చేసెను.

'అర్థ స్త్రావ దర్జన వర్ధన రక్షణాత్మకః కృషి పాశుపాల్య వాణిజ్య సంధి విగ్రహాది పరివారః తీర్థ ప్రతిపాదన ఫలశ్చ.'

1. వాత్స్యాయన కామసూత్రములు : (1-2-1) వివరణకర్త : పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.
2. వాత్స్యాయన కామసూత్రములు : (1-2-7)
3. సూత్ర వివరణము : ఆదినారాయణశాస్త్రి.
4. వాత్స్యాయన కామసూత్రములు : (1-2-9).

**కామ నిర్వచనము :**

'శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణానా మాత్మసంయుక్తేన మనసాఽధిష్ఠితానాం స్వేషు స్వేషు విషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః.'[1]

శ్రోత్రాది పంచేంద్రియములు ఆత్మ సంయుక్త మనస్సుతో గూడినవై తమతమ విషయములం దనుకూలముగా ప్రవర్తిల్లుటయే కామమనబడునని పై సూత్రములలోని అభిప్రాయము.

'కామస్తు విషయాతిసక్త చేతసోః స్త్రీ పుంసయోః నిరతిశయ సుఖ స్పర్శవిశేషః'[2]

కామమనగా విషయాతిసక్తులైన స్త్రీపురుషుల నిరతిశయసుఖ స్పర్శవిశేషమని దండి అభిప్రాయపడెను. లోకమున ఏది ఉజ్జ్వలముగా, రమణీయముగా నుండునో అది కామోద్దీపనము కలిగించునని ఇతడు విపులీకరించెను.

**మోక్ష నిర్వచనము :**

'దుఃఖాత్యంతర నివృత్తి ర్మోక్షః,' 'తదత్యంత విమోక్షోఽపవర్గః' అని మోక్షము నిర్వచింపబడినది.[3] ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు దుఃఖముల అత్యంత నివారణమే మోక్షమని వీని తాత్పర్యము. తదత్యంత విమోక్షము అపవర్గము. మానవుడు తెలిసికొనవలసిన ఆత్మాది పదార్థములలో ముఖ్యమైన ప్రమేయమిది.

**ధర్మ ప్రాధాన్యము :**

ఈ చతుర్విధ పురుషార్థములలో తురీయమైన మోక్షమే జీవిత లక్ష్యముగా నుండవలెనని భారతీయ తత్త్వజ్ఞులు విశ్వసించిరి. మొదటి మూడింటిలో ధర్మమునకే అగ్రతాంబూలము నిచ్చిరి. ధర్మమనునది మతముకంటె విస్తృతమైనది. మానవుని స్వవిధులను, ఇతరులపట్ల నిర్వర్తింపవలసిన బాధ్యతలను నిర్దేశించునది ధర్మము. జగత్తును నైతికసూత్రమున బిగించు 'ఋతము'లో ధర్మ మంతర్వాహిని వంటిది. ధర్మర్థకామములు మూడింటిలో తారతమ్య పరీక్ష చేసినచో ధర్మమే ఆచరణీయమని కామసూత్రములను రచించిన వాత్స్యాయనుడు సైతము వ్రాసెను. అతని సూత్రమిది.

'తేషాం సమవాయే పూర్వః పూర్వో గరీయాన్.'[4]

అనగా ధర్మార్థకామములకు ఘర్షణము జరిగినప్పుడు కామము అర్థముచేత సాధింపదగినది కాన కామముకంటె అర్థమే శ్రేష్ఠమనియు, ఆ రెంటికి సంఘర్షణము జరిగినచో

1. వాత్స్యాయన కామసూత్రములు : (1-2-11)
2. దశకుమార చరిత్రము : దండి.
3. న్యాయ సూత్రములు : (1-3-14)
4. వాత్స్యాయన కామసూత్రములు : (1-2-14)

అర్థము ధర్మముచేత సాధింపదగినది కనుక ధర్మమే శ్రేష్ఠమనియు ఈ సూత్రములోని భావము.

అర్థకామములుగూడ సజ్జనులకు బాధకములు కావని ప్రాచీనులు విశ్వసించిరి. కాళిదాసు 'అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మ ఏవ మనీషిణః'[1] అన్నాడు. అర్థకామములుగూడ మనీషియైన దిలీపమహారాజునకు ధర్మముగానే పరిణమించినవని అతని యభిప్రాయము.

## సాహిత్యముపై ప్రభావము :

ఇక సాహిత్యముపై ఈ పురుషార్థముల ప్రభావ మెంతవరకు గలదో విశదీకరింతును.

సర్వశాస్త్రములు, కావ్యములుగూడ ధర్మ ప్రతిపాదనమునకే రచింపబడినవని ఆలంకారిక శిరోమణి అభినవగుప్తు డభిప్రాయపడెను.

> 'శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
> తస్మాత్ స సర్వ శాస్త్రజ్ఞః యస్య శాంతం మన స్సదా.'[2]

శమమనగా శాంతి. శాంతి ధర్మచింతనము వలననే కలుగును.

ప్రాచీన భారతీయ సాహిత్యమంతయు ఈ చతుర్విధ పురుషార్థముల పునాదులపైనే నిర్మింపబడినది. చివరకు గీతగోవిందమువంటి శృంగార కావ్యములోగూడ మోక్షసిద్ధియే పరమ లక్ష్యముగా నిరూపింపబడినది. ఈ కావ్యములోని రాధాకృష్ణుల మధురభక్తి జీవాత్మ పరమాత్మల సంయోగమునకు సంకేతముగా చిత్రింపబడినది. అందుచేత గీతగోవిందము చరమ ధ్యేయము తురీయపురుషార్థమైన మోక్షమేయని చెప్పక తప్పదు.

వాల్మీకి రామాయణమున ఈ ధర్మప్రతిపాదనమే కలదు. రాముని పితృవాక్య పరిపాలనము, అరణ్యవాసము, లక్ష్మణుని త్యాగశీలము, భ్రాతృభక్తి మున్నగునవి ధర్మ వృక్షమున కొనసాగిన కొమ్మలే.

మహాభారతము కేవలము అన్నదమ్ముల పోట్లాటకు సంబధించిన గ్రంథముకాదు. అది తత్త్వగ్రంథముకూడ. సాధారణముగా మహాభారతమున ధర్మము ప్రతిపాదింప బడినదని యందురు. కాని ఆనందవర్ధనుడు దానిలో మోక్షమే ప్రధానముగా ప్రపంచింప బడినదని స్పష్టపరిచెను.

'మహాభారతేఽపి శాస్త్రకావ్య రూపచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ విరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజనన తాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రసశ్చ ముఖ్యతయా వివక్షావిషయత్వేన

1. రఘువంశము : ప్రథమ సర్గము. 2. 'అభినవ భారతి'నుండి.

సూచితః'[1]. కావున భారతమున ప్రధానముగా మోక్షము, గౌణముగా ధర్మము ఉపదేశింపబడిన వని చెప్పవచ్చును.

కాళిదాసు తన కావ్యములన్నిటిలో ధర్మప్రాధాన్యమును ప్రతిపాదించెను. రఘువంశ కావ్యమున దిలీపుడు సింహమునకు తన్ను తాను బలి యిచ్చుటకు సంసిద్ధుడగుట గోరక్షణార్థమే. గోరక్షణమనగా ధర్మరక్షణమే. అర్థకామములు ధర్మమును వ్యుత్క్రమించినచో ఎట్లు కల్యాణ భంజకములగునో రఘువంశకావ్యమున అగ్నివర్ణుని వృత్తాంతముద్వారా కాళిదాసు బోధించెను. అగ్నివర్ణుడు ప్రధానముగా కామోపజీవి. రాజ్యభారమును అనగా ధర్మరక్షణమును తృణప్రాయ ముగా త్రోసివేసి స్త్రీలోలుడైనాడు. తత్పర్యవసానముగ ఉభయభ్రష్టుడైనాడు. అభిజ్ఞాన శాకుంతలమున శకుంతల గాంధర్వవివాహము కామలక్షణము. కామైక పరత్వమున కన్నుగానక ఆమె ధర్మమును విస్మరించినది. అందుకే క్లేశముల పాలైనది.

ఉత్తరరామచరిత్రమునందు ధర్మస్థాపనముకొరకు, లోకారాధనముకొరకు సమస్తమును పరిత్యజింతునని రాముడు ప్రతిజ్ఞ చేయును.

'స్నేహం దయాంచ సౌఖ్యంచ యదివా జానకీ మపి,
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తిమే వ్యథా.'[2]

లోకారాధనముకొరకు స్నేహము, దయ, సౌఖ్యము, మొదలైనవేకాక తన ప్రాణములో ప్రాణమైన జానకినిగూడ పరిత్యజించినను తనకు దుఃఖములేదని రాముడనెను. ప్రజల నారా ధించుట యనగా వారి ఆదర్శములను పోషించుటయే. పాతివ్రత్యము ప్రజల ఆదర్శములలో నొకటి. అగ్నివంటి సీతాదేవి పాతివ్రత్యమునకు నిమిత్తముగా లోకాపవాద కళంకముప్పతిల్లెను. అది కల్లయని రాముని అంతరాత్మకు తెలియును. కాని ప్రజాభిప్రాయమును కాదనలేక ఆ సాధ్విని పరిత్యజింపవలసి వచ్చినది.

అశ్వఘోషుని బుద్ధచరిత్రము, సౌందరనందమువంటి కావ్యములలో శాంత రసమే కనిపించుచున్నది. శాంతరసము అపవర్గమునకు-అనగా మోక్షమునకు-దారి చూపునదే కదా.

ఈ విధముగా వాల్మీకిరామాయణమునుండి గీతగోవిందమువరకు గల భారతీయ (సంస్కృత) సాహిత్యమంతయు, చతుర్విధ పురుషార్థములలో ధర్మమోక్షములే వరణీయములని ఉద్ఘాటించినది. అయినను అర్థకామములను ఆనుషంగికముగా ప్రతిపాదింపకుండ ఉండలేదు. వీనిని బొత్తిగా తీసివేసినచో జీవితము దారుసదృశమై పోవునని వీనికిగూడ భారతీయులు తగిన స్థానమును కల్పించిరి.

1. ధ్వన్యాలోకము : చతుర్థోద్యోతము.
2. ఉత్తరరామచరిత్రము : ప్రథమాంకము.

## వర్ణాశ్రమములు :

### వర్ణవ్యవస్థ :

ఆర్యావర్తమున ఆర్యులు స్థిరపడిపోయిన తరువాత అంతకుముందే అక్కడ నివసించుచున్న ఆదిమవాసులనుండి తమ్ము వేరుగా నుంచుకొనుటకు, జాతి సాంకర్యమునుండి కాపాడుకొనుటకు వర్ణవ్యవస్థ నేర్పాటుచేసికొనిరి. వర్ణవ్యవస్థ ఏర్పడకముందు ఆర్యుడైన ప్రతివ్యక్తియు పురోహితుడుగా, యోధుడుగా, వర్తకుడుగా, కర్షకుడుగా నుండెడివాడు. క్రమముగా జనసంఖ్య పెరిగినది. ఒకే వ్యక్తి అన్ని వృత్తులు నిర్వర్తించుకొనుట కష్టమైపోయినది. కర్మకాండకు, ధర్మకాండకు, కృషికి, సేవకు తమలోనే వర్ణము లేర్పాటుచేసికొనుట మంచిదని వారు భావించిరి. విద్యాజ్ఞానములం దభిరుచిగలవారు పురోహితులని (విప్రులని), పరిపాలనము చేపట్టినవారు క్షత్రియులని, మిగిలిన వారందరు ప్రజలని లేక వైశ్యులని వ్యవహరింపబడిరి. క్రమముగా వాణిజ్యము చేయువారు మాత్రమే వైశ్యులనియు, పై మూడు వర్ణములవారి కన్నుసన్నలలో మెలగువారు శూద్రులనియు వ్యవహరింపబడిరి. తొలుత కేవలము కార్యసౌలభ్యము కొరకు చేసిన ఈ వృత్తివిభాగము క్రమముగా వంశపారంపరికమైనది.

వర్ణవ్యవస్థ మొట్టమొదటిసారిగ పురుషసూక్తమున ఉల్లేఖింపబడినది.

> 'బ్రాహ్మణో౽స్యముఖమాసీ ద్బాహూ రాజన్యః కృతః
> ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత.'[1]

అయినను ఋగ్వేదకాలమున ఈ వ్యవస్థ సుప్రతిష్ఠితము కాలేదు. కేవలము వృత్తుల పైనే ఇది ఆధారపడియుండెను. బ్రాహ్మణముల కాలమున ఈ వ్యవస్థ బలపడినది. చాతుర్వర్ణ్యములో బ్రాహ్మణుల కగ్రతాంబూలము దొరకినది. ఉపనిషత్కాలమున క్షత్రియులు, జ్ఞానవంతులును బ్రహ్మజ్ఞులును అయిపోయిరి. భగవద్గీతలో 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః' అని యున్నది. గుణములనుబట్టియే కాక కర్మలనుబట్టియు వర్ణవిభాగము జరిగెనని దీనివలన తెలియుచున్నది.

ఆధునిక కాలమున ఈ వర్ణవ్యవస్థ పరిహాసాస్పదముగా కనిపించినను ప్రాచీన కాలమున దీనికున్న ప్రాధాన్యమును త్రోసివేయుటకు వీలులేదు. వర్ణసాంకర్య మానాడు పాపముగా భావింపబడుచుండెడిది. కులధర్మములను కూల ద్రోసినవారు నరకమున కేగుదురని భగవద్గీతయందు కలదు.[2] అభిజ్ఞాన శాకుంతలమున కాళిదాసు వంశపరంపరాగతమైన వృత్తి నవలంబించుటయే మానవుని కర్తవ్యమని జాలరిచే అనిపించెను.

1. ఋగ్వేదము : దశమ మండలము : 90 సూక్తము.
2. 'ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
   నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ'. —భగవద్గీత : 1 అధ్యా : 44.

'సహజం కిల యద్వినిందితం నహి తత్కర్మ విసర్జనీయకం
పశుమారణకర్మదారుణోఽ ప్యనుకంపామృదురేవ భూసురః'[1]

బ్రాహ్మణుడు యజ్ఞాదులలో పశువిశసనముచేయుట పాపమెందుకు కాదనగా అది కుల క్రమాగతమైన వృత్తియగుటవలననే యని కాళిదాసు వర్ణవ్యవస్థను సమర్థించెను. 'స్వధర్మే నిధనం శ్రేయః' అనియేకాక 'పరధర్మో భయావహః' అనికూడ గీత హెచ్చరించెను

## సాహిత్యముపై ప్రభావము :

వాల్మీకిరామాయణమున వర్ణ వ్యవస్థ సమర్థింపబడినది. భారతమున ఇట్లే కలదు. వర్ణ వ్యవస్థను పోషించుటయే ప్రభువుల కర్తవ్యమని ఈ రెంటిలో అడుగడుగున చెప్పబడినది. కాళిదాసు కావ్యములలో ఈ వ్యవస్థ ప్రభావము మిక్కుటముగా కన్పించును. రాజు వర్ణవ్యవస్థను విధిగా పాటింపవలెనని కాళిదాసు తెలిపెను.

'రేఖామాత్రమపి క్షుణ్ణాదామనోర్వర్త్మనః పరం
నవ్యతీయుః ప్రజాస్తస్య నియంతుర్నేమివృత్తయః'[2]

రాజు నియంత. అనగా సారథివంటివాడు. మనుప్రోక్తమైన వర్ణాశ్రమధర్మమే రాచ బాట. ప్రజలు గుఱ్ఱములవంటివారు. వర్ణధర్మమును సక్రమముగా పాలించుటయే ఐహికాముష్మిక సుఖముల కేకైక సాధనమని కాళిదాసు అభిప్రాయము. తరువాత బాణుడు, భవభూతి మున్నగు కవులు దీనిని సమర్థించిరి. ప్రాచీన సంస్కృత కావ్యములన్నిటిలో ఎక్కడో ఒక చోట ఈ వర్ణవ్యవస్థ ప్రతిబింబము కనిపించును.

హైందవ సంస్కృతికి వర్ణవ్యవస్థ మూలకందముగా నుండెడిది. తొలి దినములలో ఇది అంతగా సంకుచితముగా లేదు. స్మృతుల కాలమున ఈ వ్యవస్థ వికాసము కోల్పోయి బిగిసి పోయినది. బ్రాహ్మణత్వము జన్మముపైగాక శీలముపై ఆధారపడియున్నదని ఛాందోగ్యోపనిషత్తులోని 'సత్యకామ జాబాలుని కథ' నిరూపించుచున్నది. అవరవర్ణుడైన జాబాలుడు ఉపనిషద్ద్రష్టలలో ఒకడు. క్షత్రియుడైన సనత్కుమారుడు బ్రాహ్మణుడైన నారదునికి పరమార్థముపదేశించెను. శుకుడు క్షత్రియుడైన జనకుని గురువుగా స్వీకరించెను. దాల్భ్యుడు శూద్రుడు. ఇతడు బృహదారణ్యకోపనిషత్ ద్రష్టలలో ఒకడు. ఋగ్వేదమునకు వ్యాఖ్యారూపకమైన బ్రాహ్మణము వ్రాసిన మహీదాసుడు శూద్రుడే. భారతములోని ధర్మవ్యాధోపాఖ్యానమున కసాయివాడు బ్రాహ్మణునికి ధర్మ సూక్ష్మములను వెల్లడించినట్లున్నది. కావున ఈ వ్యవస్థ

1. అభిజ్ఞాన శాకుంతలము : షష్ఠాంకము.
2. రఘువంశము : ప్ర. స. 17 శ్లోకము.

ప్రారంభదశలో చక్కని వికాసమును పొందినను క్రమముగా ఘనీభవించిపోయి సత్ఫలితముం నీయలేకపోయినది. ఏది యెట్లున్నను ప్రాచీనభారతసాహిత్యముపై దీని ప్రభావమును విస్మరించుటకు వీలు లేదు.

ఆశ్రమ ధర్మములు :

ఆశ్రమ ధర్మములు వైదికయుగములోనే స్థాపింపబడినవి. నాటి మానవుని జీవితము నాలుగు ఆశ్రమములుగా విభజింపబడినది.

1. బ్రహ్మచర్యము : వేదవిద్యాభ్యాసముచేయుట 2. గృహస్థాశ్రమము : యజ్ఞములు చేయుట. 3. వానప్రస్థము : భోగములను దిగద్రావి వనవాసము చేయుట. 4. సన్న్యాసము : సర్వసంగ పరిత్యాగము చేయుట.

రామాయణ భారతాది గ్రంథములలోని వ్యక్తులందరు ఈ యాశ్రమవ్యవస్థను పాటించిన వారే. చివరకు శృంగారకావ్యమైన మనుచరిత్రలోగూడ గృహస్థాశ్రమ ధర్మము చక్కగా సమర్థింపబడినది. వరూధిని తృతీయపురుషార్థమునకు సంకేతము. ప్రవరుడు తురీయ పురుషార్థమునకు, గృహస్థాశ్రమమునకు ప్రతిబింబము. కడకు గృహమేధియే జయించునని మనుచరిత్ర వలన తెలియుచున్నది.

చతుర్విధపురుషార్థములు, వర్ణాశ్రమధర్మములు ప్రాచీన భారతసంస్కృతికి ప్రధానాంగములు. ఆత్మతత్త్వము, పరమాత్మతత్త్వము, కర్మసిద్ధాంతము, పునర్జన్మసిద్ధాంతము ఉపాంగములు. ఇక వీనిని గూర్చి సంక్షేపముగా ముచ్చటింతును.

(i)- 'ఆత్మ' తత్త్వము

భారతీయసంస్కృతి ప్రత్యేకత 'ఆత్మ' సిద్ధాంతములో నిబిడీకృతమైయున్నదని చెప్పవచ్చును. బుద్ధికన్న, మనస్సుకన్న, ఆత్మ గొప్పదని గీత అభిప్రాయము. భారతదేశమున చిరకాలమునుండి ఆత్మకే అగ్రపీఠమున్నది. పాశ్చాత్యులలో పలువురు బుద్ధికే గద్దెనిచ్చినారు. మనలో నేటికిని ఆత్మవాదులే అధికముగా నున్నారు. గీతలో ఆత్మ ఔన్నత్య మిట్లు చెప్పబడినది.

'ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరంమనః
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః'

(కర్మయోగము : 42 శ్లో)

దేహముకన్న ఇంద్రియములు, ఇంద్రియములకన్న మనస్సు, మనస్సుకంటె బుద్ధి, బుద్ధి కంటె ఆత్మ-ఒకదానికంటె ఒకటి శ్రేష్ఠమని దీని యభిప్రాయము. ఇట్టి ఆత్మను తెలిసికొని బుద్ధితో మనస్సును నిగ్రహించుకొని, దుఃఖకారియగు కామరూప శత్రువును నిర్జించవలెనని గీత

ఉపదేశించినది. ఆత్మకు వినాశములేదని భారతీయుల విశ్వాసము. అది సత్తు. దేహాదులు అసత్తులు. అవి నశ్యములు. ఆత్మకు ప్రత్యక్షాది ప్రమాణములు లేవు. ఇది చంపునదికాదు, చంపబడునది కాదు. దీనికి జననమరణములు లేవు. మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను గట్టుకొన్నట్లు ఆత్మ వివిధశరీరములను విడిచి క్రొత్త శరీరములను పొందుచుండునని గీత బోధించినది[1]. ఆత్మతత్త్వము నింత నిశితముగా లోతుగా దర్శించినజాతి భారతజాతి యొకటేయని చెప్పవచ్చును.

### (ii) పరమాత్మ తత్త్వము

వేదములలో దేవతల సంఖ్య 3333 వరకుండెడిది. క్రమముగా వర్గీకరణము జరిగి ఏకేశ్వరసిద్ధాంతము బయలుదేరినది. అనంతరము అనశ్వరమైనదియు, 'సత్తు' అగు పరబ్రహ్మపదార్థ మొక్కటే యను యభిప్రాయము బలపడినది.

'ఏకంసద్విప్రా బహుధావదంతి, అగ్నిర్యమం మాతరిశ్వానమాహుః' అనునది ఈ అభిప్రాయమునే బలపరుచుచున్నది.

### (iii) కర్మ సిద్ధాంతము

లోకములో మానవుల సుఖదుఃఖములకు వారు పూర్వజన్మమందు చేసిన కర్మలే కారణములు. కలిమిలేములు రెండును కర్మపరిపాకమునుబట్టి యేర్పడును. సృష్టికర్తకు ఏ ఒక్కనియందు ప్రత్యేకముగా కోపముగాని, కూర్మిగాని ఉండవు. కర్మకు మూడు విభాగములు కలవు. ఆగామి, సంచితము, ప్రారబ్ధము. 'మొదలు పెట్టినందున ఎట్టి దానిని అనుభవింపక తప్పదు. కాని ఆగామిసంచితాలను మానవుడు తన సత్ప్రవర్తనవలన, భగవత్కటాక్షము వలన గెలువ వచ్చును.'[2] ఉపనిషత్తులు సైతము సత్కర్మానుష్ఠానమువలన మోక్షప్రాప్తి కలుగునని చెప్పెను.

### (iv) పునర్జన్మ సిద్ధాంతము

జీవిమరణముతో ఆత్మ మరణింపదు. అది మరల క్రొత్తదేహములను ఆశ్రయించును. ఉపనిషత్తులయందును, తత్సారమైన భగవద్గీతలోను ఇదే చెప్పబడినది.

ఇవికాక పురాణగాథలు, అవతారములు మొదలైనవి సైతము భారతీయ సంస్కృతికి ఉపాంగములై యున్నవి. భారత సాహిత్యముపై ఈ అంగముల ప్రభావము ప్రగాఢముగా

1. 'వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథాశరీరాణి విహాయజీర్ణా న్యన్యాని సంయాతి నవానిదేహీ.'
—భగవద్గీత : సాంఖ్యయోగము : 22 శ్లోకము.

2. నవ్యాంధ్ర సాహిత్యవీధులు : పుట : 251.

నున్నది. భారత రామాయణములందును, కాళిదాసాదుల మహాకావ్యములందును వీని ప్రస్తావన ఎడనెడ కనిపించును.

## భారతీయ మత సంప్రదాయములు : సాహిత్యముపై వాని ప్రభావము :

భారతదేశమున అనాదినుండి అనేకమతములు బయలుదేరినవి. ప్రాచీన భారతమున సంఘముపై సారస్వతముపై మతప్రభావము అమితముగా నుండెడిది. ఒక్కొక్క మతము ఉన్నతదశలోనున్న కాలమున ఒక్కొక్క రకమైన ప్రభావమును ప్రసరించినది. వ్యాసభారతము ప్రధానముగా వాసుదేవ తత్త్వమును ప్రసాదించుటకు రూపొందినది. కాళిదాసు కావ్యములపై అధికముగా శైవమత ప్రభావమున్నది. రఘువంశమున సైతము కాళిదాసు శివస్తుతియే చేసెను. విప్రలంభశృంగార మాత్మగాగల మేఘసందేశమునగూడ అలకాపుర వర్ణన సందర్భమున 'బాహ్యోద్యానస్థిత హరశిరశ్చంద్రికాధౌత హర్మ్యా' అని శివుని ప్రస్తావన తెచ్చెను. అభిజ్ఞానశాకుంతలమున మొదట శివునే స్తుతించెను. భారవి కిరాతార్జునీయమున శైవాధిక్యమునే ప్రతిపాదించెను. సర్వవిధముల అతనికి స్పర్థియై కావ్యము వ్రాసిన మాఘుడు శిశుపాల వధలో వైష్ణవపారమ్యము నుగ్గడించెను. బౌద్ధమతమును ప్రతిపాదించుటకే అశ్వఘోషుడు కవిత్వ సాధనమును ఉపయోగించుకొనెను. సౌందరనందము, బుద్ధచరిత ఈ దృష్టితోనే వ్రాయబడినవి.

తెలుగు సాహిత్యమున ఇట్టి కావ్యములు పెక్కు కలవు. శివకేశవాద్వైతమును నిరూపించుటకు, తన్మతమును ప్రతిపాదించుటకు తిక్కన భారతమును సద్వినియోగముచేసెను. నన్నెచోడుడు, పాలకురికి సోమనాధుడు శైవాధిక్యమును ప్రచార మొనర్చుటకే కావ్యరచన కావించిరి. శ్రీనాధునిపై శైవమత ప్రభావమున్నది. కృష్ణరాయల యుగమున వైష్ణవమత సంబంధి కావ్యములకు ఆదరము లభించినది.

ఈ విధముగా మన ప్రాచీన సాహిత్యములో మతసంప్రదాయములు ప్రతిఫలింపక తప్పలేదు.

## భారతీయ సాంఘిక సంప్రదాయములు : సాహిత్యముపై వాని ప్రభావము :

భారతీయ సాంఘికసంప్రదాయములలో షోడశసంస్కారములు ప్రధానములు. ఈ సంస్కారములను పాటించుట ప్రతి గృహస్థుని విధిగా భావింపబడెడిది. జననము మొదలుకొని మరణము వరకు ఇవి పరివ్యాప్తములై యుండెడివి. మన కావ్యములందు జననము వివాహము మున్నగునవి విధిగా వర్ణింపబడినవి. మరణానంతర కర్మకాండ రామాయణ భారతాదులలో ఉల్లేఖింపబడినది. రఘువంశమున సీమంతోన్నయనము వర్ణింప బడినది.

అతిథికి అర్ఘ్యపాద్యములిచ్చుట భారతీయుల సాంఘికసంప్రదాయము. అతిథి దేవ తుల్యుడుగా భావింపబడినాడు.[1] మనుస్మృతిలో 'సర్వదేవ మయోఽతిథిః' అని కలదు. మన కావ్యము లన్నిటిలో అర్ఘ్యపాద్యముల ప్రస్తావన అనివార్యము.

ఇంటికి వచ్చిన అతిథికి అర్ఘ్యపాద్యములతోపాటు తాంబూలమిచ్చుట భారతీయుల సాంఘిక సంప్రదాయము. ప్రత్యేకముగా రాజుల యిండ్లలో, ధనికుల యిండ్లలో 'తాంబూల కరండ వాహిను' లుండెడివారు. ఎవరితోనైనను స్నేహము నెరపవలెనన్న తాంబూలమును లాంఛనప్రాయకముగా నిచ్చెడివారు. బాణుని కాదంబరిలో, హర్ష చరితలో ఇట్టివి కలవు. కవులకు ప్రభువులు జాంబూనదాంబరాగ్రహారాదు లిచ్చుటకు ముందుగా కర్పూర తాంబూలము నిచ్చుచుండిరి. తాంబూల సమర్పణమును తెలుగుకవి తెనాలి రామకృష్ణుడు చక్కగా వర్ణించి నాడు.[2] పెద్దన కవిత్వరచనకు 'నిరూపహతిస్థలము'తోపాటు 'రమణి ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడెము' కావలెనన్నాడు. సభలో గౌరవము పొందుటకు తాంబూలము లాంఛ నముగా నుండెడిది. అందులో రెండు తాంబూలములను పొందుట అధిక గౌరవమునకు చిహ్నము. నైషధములో హర్షుడు 'తాంబూలద్వయ మాసనంచ లభతే యఃకాన్యకుబ్జేశ్వరాత్' అని చెప్పుకొనెను.

భారతీయ సాంఘిక సంప్రదాయములలోసాష్టాంగప్రణామ మెన్నదగినది.

'ఉరసా మనసా చైవ శిరసా వచసా తథా
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోఽష్టాంగ ఉచ్యతే'

అని సంప్రదాయము (ప్రణామ సంప్రదాయము) కలదు. మన కావ్యము లన్నిటిలో ఈ దండవత్ప్రణామమే కనిపించును. సామంతరాజులు దండవత్ప్రణామము చేయకున్నను చక్ర వర్తుల పాదములపై శిరమువంచి నమస్కరించెడివారు. నిటారుగానిల్చుండి చేయునది నమస్కార ముగా మనవారు భావింపలేదు. కనీసము శిరమైనను వంచనిదే నమస్కారముకాదు. అసలు నమస్సులోని 'నమ్' ధాతువున కర్థము వంగుటయనియేకదా.

1. 'అతిథి దేవోభవ' ఇత్యాదులు.
2. 'పలుకుం దొయ్యలి మోవితావి కెనయౌ బాగాలు నయ్యంతి చ
క్కులఁబోలుం దెలనాకు, లయ్యువిద పల్కుల్వంటి కప్రంపు ప
ల్కులతో గూడిన విడియం బొసగె నాకున్ పద్మనాభార్పనా
కలనా పావనహస్త కంకణ ఝణత్కారంబు తోరంబుగాన్'.
—పాండురంగ మాహాత్మ్యము : అవతారిక.

## పాశ్చాత్యుల మత సంస్కృతుల సంప్రదాయములు : సాహిత్యముపై వాని ప్రభావము :

భారతీయ సంస్కృతియనగా వేదప్రతిపాదితమైన సంస్కృతియన్నట్లే, పాశ్చాత్యుల ప్రాచీనసంస్కృతియనగా గ్రీకుసంస్కృతియనియే చెప్పవచ్చును. ఇప్పటికి దాదాపు నాలుగు వేల యేండ్ల క్రితమే గ్రీసులో నాగరకత అభివృద్ధినందినది. అనేక దేవతాత్వము గ్రీకుదేశపు ప్రాచీన నాగరకతలో ప్రధానమైన అంగము. వీరపూజయే క్రమముగా అనేకేశ్వరత్వమునకు దారితీసినది.[1] 'నావిష్ణుః పృథివీపతిః' అన్నట్టుగా ఉన్నది అభిప్రాయము. గ్రీకుల దేవతలలో పెక్కురు హిందూదేవతలవలెనే కనిపింతురు. వారి Jupiter మన యింద్రునివంటివాడు. మనకు నందనమున్నట్టే వారి దేవలోకమున ఒక దివ్యవనము కలదు. మన కమృతమున్నట్టే వారికి తత్సమ్మితమైన అమృతము (Nectar) కలదు. గ్రీకుల పురాణముల ప్రకారము చంద్రుడు స్త్రీమూర్తి. ఆమెను Artemis లేక Diana అందురు. ఆమె చేతిలో జింక యుండును. చంద్రుని 'హరిణాంకు'డన్న భారతీయ సాహిత్యములలోని వర్ణనకు దీనికి చక్కని పోలికయున్నది. మనకు మన్మథునివలె గ్రీకులకు క్యూపిడ్ (Cupid) ఉన్నాడు. మన్మథునికి వలెనే క్యూపిడ్‌కు ధనురస్త్రములుండును. మన సాహిత్యములోవలెనే గ్రీకు సాహిత్యమున దక్షిణమారుతము వర్ణింపబడినది. దీనిని ఆస్టర్ (Auster) లేక నోటస్ (Notus) అందురు. మార్దవమునకు దీనిని వారు సంకేతముగా గ్రహించిరి. మన సూర్యుని కొక రథమున్నది. దాని సారథి అనూరుడు. అట్లే గ్రీకులకుకూడ సూర్యుని కొక రథమున్నది. దాని సారథి పేరు హీలియాస్ (Helios). గ్రీకులు మనవలెనే అదృష్టమును (విధిని) బలముగా విశ్వసించిరి. విధికి కాలచక్రముపై సమస్తాధిపత్యమున్నదని వారు గుర్తించిరి. విధికి ఒకరు తనవారు, ఒకరు పెరవారు అని ఉండదని, యథేచ్ఛావర్తనమే దాని లక్షణమని వారభిప్రాయపడిరి.[2] గ్రీకు నాటకములలో 'విధి' ప్రధానపాత్ర వహించినది. హోమరు వ్రాసిన ఇలియడ్, ఒడిస్సీ అను రెండు కావ్యములపై ప్రాచీనగాథల ప్రభావమున్నది. జాన్సన్, దయానా (Diana) పై చక్కని గీతము వ్రాసెను. షెల్లి గ్రీకు పురాణములలోని అనేక దేవతలగురించి గేయములురచించెను. Hymn of Pan మున్నగున విట్టివే. కీట్సు వ్రాసిన ఎండిమియాన్ (Endymion) అను సుదీర్ఘగీతముపై గ్రీకు పురాణముల ప్రభావమున్నది. ఎండిమియాన్ ఒకానొక అతిలోక సుందర యువకుని పేరు. కీట్సు వ్రాసిన Ode to Psyche (ఓడ్ టు సైకీ) అను ఖండ

1. 'Their Gods were simply their kings and heroes, whom they afterwards deified' —'Lectures on the History of Literature' by Thomas Carlyle : P. 10.

2. 'They recognized a 'Destiny', a great dumb, black power ruling during time, which knew nobody for its matter, and in its decrees was as inflexible as adamant, and everyone knew that it was there.'

—Lectures on The History of Literature : P. 12.

కృతిలో రతీమన్మథుల (Psyche & Cupid) అనుబంధము చిత్రింపబడినది. మన భారతాది పురాణ కావ్యములయందు మానవులతోపాటు దేవతలుచరించినట్లే, గ్రీకు పురాణములలోగూడ పిలియస్ (Peleus) థీటిస్ (Thetis) ల వివాహమునకు దేవతలు కానుకలు తెచ్చినట్లు చిత్రింపబడినది. భారత యుద్ధమున శ్రీకృష్ణభగవానుడు పాండవపక్షపాతమువహించినట్లే, గ్రీకులకు ట్రోజన్లకు జరిగిన సంగ్రామమున నెప్ట్యూన్ (Neptune : వరుణ దేవత) గ్రీకులపక్షమున నున్నట్లు వర్ణింపబడినది. ఈ విధముగా ఆంగ్లసాహిత్యముపై గ్రీకు పురాణముల ప్రభావము కనిపించుచున్నది.

పాశ్చాత్యలోకమున మొదట బహుదేవతాత్వము సంప్రదాయముగా నుండెడిది, క్రమముగా అది ప్రకృత్యారాధనము (Paganism) నకు దారితీసినది. మరల దీనికి విరుగుడుగా క్రైస్తవ మతము (Christianity) బయలుదేరినది. క్రైస్తవమతములో Roman Catholics అని, Protestants అని రెండుతెగ లేర్పడినవి. మిల్టన్‌కవిపై ప్యూరిటనిజము (Puritanism) ప్రభావము అమితముగా పనిచేసినది. అతని Paradise Lost మున్నగు కావ్యములు ఈ ఆదర్శమును ప్రచారము చేయుటకే వ్రాయబడినవి.[1] Satan (సేటన్) దైవమునకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేసినందుకు ఏ విధముగా అధఃపతనము చెందెనో నిరూపించుటకు, బైబిలు గొప్పతనమును ప్రకటించుటకు, Paradise Lost, Paradise Regained అను రెండు కావ్యములు వ్రాయబడినవని ఆంగ్లసాహిత్యజ్ఞులెల్ల రంగీకరించిన విషయమే.

17 వ శతాబ్దములో హెర్బర్టు (Herbert), వాన్ (Vaughan), క్రాషా (Crawshaw) ప్రభృతి కవులు ఆధ్యాత్మిక కవిత్వము విరివిగా రచించిరి. ఈశ్వరుడు ప్రణయ మహిమవలన మానవుని సన్నిధికి పయనించి, అతని నుద్ధరించినట్లు వీరు చిత్రించిరి. ఈశ్వరుని ప్రేమమూర్తిగా భావించి కీర్తించిన షెల్లీ కవితలో వీరి ఛాయలు కనిపించును. బ్రౌనింగ్, రొజెటీ మున్నగు కాల్పనికకవుల భక్తిగీతములపై వీరి ప్రభావమున్నది. వీరి ప్రభావమునకు వశుడై ఆధునికకాలమున ఫ్రాన్సిస్ థామ్సన్ అను కవి 'The Hound of Heaven' అను కావ్యమును రచించినాడు. ఇందులో మానవుడు అజ్ఞానమువలన దైవమునకు దూరముగా పోవుటకు ప్రయత్నించును. దైవము జాగిలమువలె మానవుని వెన్నంటి తరిమి అతనిని జయించి తన ప్రేమతత్త్వమువంక కాకర్షించును. రాబర్ట్ బ్రిడ్జస్ (Robert Bridges) వ్రాసిన 'Testament of Beauty' లో ఈశ్వర ప్రణయమునకు రూపాంతరమే సౌందర్యమని ప్రకటింపబడినది. ఈ విధముగా ఆంగ్ల కవిత్వములో ఆస్తికభావధార అప్రతిహతముగా ప్రవహించుచునే యున్నది

1. ఈ కావ్యము గ్రీకుగాథయగు **Titanomachia** ను పోలిన రచన. దీనిలోని **Satan** పాత్ర గ్రీకు సాహిత్యములోని **Typhon, Prometheus** పాత్రల మూర్తులకు ప్రతిరూపమేయని విమర్శకు లభిప్రాయపడిరి.

## పాశ్చాత్యుల సాంఘిక సంప్రదాయములు : సాహిత్యముపై వాని ప్రభావము :

సాహిత్యముపై, కళలపై అయా కాలములందలి సాంఘికసాంప్రదాయము లెంత ప్రబలముగా పనిచేయునో ఏ దేశపు సాహిత్యచరిత్రను పరిశీలించినను విశదమగును. ఇస్లాము మతము ప్రకారము యువతులను చూచుటకాని, వర్ణించుటకాని దోషముగా పరిగణింపబడెడిది. అందువలన అరేబియా మున్నగు ముస్లిముదేశములలో చిత్రకళ వికసింపలేదని కొందరు విమర్శకులు అభిప్రాయపడిరి. అమెరికా వలసరాజ్యములలో నగ్నుల (Nudes) ను చిత్రించుట దోషముగా భావింపబడెడిది. అందుచేత ఫ్రాన్సు మున్నగు దేశములలో జరిగిన కళావికాస మక్కడ జరుగలేదు. ఆంగ్ల సాహిత్యమున ఎలిజబెత్ మహారాజ్ఞి పాలించిన కాలము స్వర్ణయుగము వంటిది. ఆ కాలమున సామ్రాజ్యస్థాపనము. సాగరయానము విశేషముగా జరిగినందున షేక్స్పియరు ప్రభృతులు సాహసము ప్రధాన వస్తువుగాగల రచనలు చేసిరి; స్పెన్సరు మున్నగువారు కాల్పనిక రచనలు చేసిరి. తరువాతి శతాబ్దములో సమాజమున భోగపరాయణత్వము, అసభ్యశృంగారము వెచ్చుపెరిగిపోగా, నైతిక పునరుద్ధరణకొరకు ప్యూరిటన్ ఉద్యమము బయలుదేరి 'నిరాడంబర జీవనము, ఉన్నత భావనము' అను నినాదము లేవదీసినది. పద్యరచనలో మిల్టన్, వచనరచనలో జాన్ బన్యన్ (John Bunyan) ఈ ఉద్యమమునకు ప్రతినిధులు.

ఫ్రాన్సు దేశమున వచ్చిన విప్లవము తర్వాత ఆంగ్లరచయితలలో గొప్ప భావవిప్లవము వచ్చినది. స్వేచ్ఛాప్రియత్వము, సామాన్య మానవుల సుఖ దుఃఖముల చిత్రణము ఈ కాలపు రచనలలో ప్రధానముగా ప్రతిబింబించినవి. శాస్త్రపరిశోధనల ఫలితముగా హేతువాదము ముదిరిపోవుటతో, మానవులలో ఏర్పడిన దుర్భర మానసిక వ్యధను ఆర్నాల్డు (Arnold), ఇలియట్ (Eliot) మున్నగువారు సునిశితముగా వర్ణించినారు. ఈ విధముగా తరతరములనుండి సంక్రమించిన సాంఘిక సంప్రదాయములతోపాటు, సమకాలీన సామాజిక భావవీచులు పాశ్చాత్య సాహిత్యమున ప్రస్ఫుటముగా కనిపించును.

## సంప్రదాయములలో మార్పు :

నవ్యతాప్రీతి మానవుని సహజ ప్రవృత్తి. నవ్యత రమణీయతా స్వరూపము.[1] లోకోత్తరాహ్లాదమును కలిగించుట రమణీయతా లక్షణము. సాధారణముగా మానవుడు నిన్న విన్న పాటను నేడు వినుటకు వెనుదీయును. నిన్న చూచిన దృశ్యమును నేడు చూచుటకు విముఖుడగును. అయినప్పుడు వందల ఏండ్లనాటి త్యాగరాజ కీర్తనల నెట్లు వినుచున్నాము ? యుగ యుగముల క్రిందటి ప్రకృతిదృశ్యము లెట్లవలోకించుచున్నాము ? ఈ ప్రశ్నలు కలుగుట సహజము. త్యాగ

1. 'క్షణే క్షణే యన్నవతాముపైతి
తదేవ రూపం రమణీయతాయాః' —మాఘుడు : శిశుపాల వధ : సర్గ 4.

రాజ కీర్తనలను వినుటకు, ప్రకృతి దృశ్యములను జూచుటకు కారణము వానిలోని 'క్షణ క్షణ నవ్యత్వ'మే. సూర్య చంద్ర నక్షత్రాదులు ఎంత ప్రాతవైనను క్రొత్త అనుభూతిని కలిగించుచునే యుండును. వాల్మీకి వర్ణించిన ప్రకృతియే ఈనాటి కవులకు వర్ణ్య వస్తువైనది. కాళిదాసును కదలించిన ఆషాఢ పయోదమే ఈనాటి కవులచేత ప్రణయగీతిక లల్లించుచున్నది. కావున ప్రాత వస్తువులు క్రొత్త అనుభూతుల నందించలేవని యనుటకు వీలులేదు. ప్రాతలోనే క్రొత్తదనమున్న దను విషయమును త్రోసివేయలేము.[1] ఈ నవ్యతాగుణమే లోపించినచో లోక మిన్నినాళ్ళు సంసారము చేసెడిదికాదు. బౌద్ధధర్మము ప్రకారము జగత్తు ప్రతిక్షణ పరివర్తనాత్మకము. నిముసమునకు ముందుండిన జగత్స్వరూప మిప్పుడులేదు. ఈ ప్రతిక్షణ నవ్యతయే లోకమును రసమయ మొనర్చుచున్నది. ఈ నవ్యత సమాజమునందు, కళా సాహిత్యాది రంగములందు చూడనగును.

పరాంపరాగతమైన సంప్రదాయములు ప్రజల అభిరుచిభేదమువలన మారక తప్పదు. ఈ యభిరుచినిర్దేశము తత్కాలీన సాంఘికపరిస్థితులనుబట్టి జరుగుచుండును. మానవ జీవితము నందలి సమస్త రంగములలో సంప్రదాయములు, వానిపై జరుగు ప్రయోగములు చక్రనేమి క్రమముగా వచ్చుచుండును. భారతదేశములో మతసంబంధి సంప్రదాయములయందు జరిగిన మార్పులను రాధాకృష్ణపండితు డీవిధముగా విశదీకరించినాడు.

'ఎప్పుడెప్పుడు తత్త్వపరిశీలనము సంకుచితసిద్ధాంతశాఖల రూపము నొంద యత్నించునో, అప్పుడు సంస్కారోద్యమములు బయలుదేరి ఆయాభావములను విమర్శనాగ్ని పాత్రములనుబోసి, అసద్భావములను నిర్మూలించి, సత్యభావములను సమర్థించి పోషించుచుండెడివి. అనుశ్రుతముగా వచ్చిన సంప్రదాయములు, విశ్వాసములు మార్పు చెందిన కాలమున సరిపడకపోవుటయేకాక, అసత్యముగా తోచినప్పుడు ఏ మహాదేశికునిదో అంతర్దృష్టి, ఒక బుద్ధునిదో ఒక మహావీరునిదో ఒక వ్యాసునిదో శంకరునిదో తత్త్వజిజ్ఞాస ప్రపంచమున నుద్భవించి ఉజ్జూతలూగించెడిది'.[2]

రాధాకృష్ణుడు వెలిపుచ్చిన ఈ యభిప్రాయములు సాంఘికజీవనములోని సర్వశాఖలకు వర్తించును. సంప్రదాయముపై జరుగవలసిన ప్రయోగముయొక్క అవశ్యక మీ మాటలతో బలపడుచున్నది. సంప్రదాయములలో మార్పు తత్కాలీన పరిస్థితులనుబట్టి జరుగుచుండునని ఇంతవరకే మనవి చేసితిని. ఒక సంప్రదాయ మెంతకాలము గద్దెనెక్కి యుండునో చెప్పుటకు వీలులేదు. సంప్రదాయములపట్ల జనులు మూడురకములుగా వ్యవహరింపవచ్చునని J. L. Lowes అభిప్రాయపడినాడు. ఒకటి : వాని నామోదించి స్థిరపరుచు కొనుట. రెండవది : వానిని పూర్తిగా పోగొట్టుకొనకుండ కాపాడుకొని తమ కనుకూలముగా మార్పు చేసి

1. **'The oldest things in the world are the things that also have been new as many times as human beings have been born'. —Convention And Revolt in Poetry by John Livingston Lowes : Pub : 1930 : P. 86.**

2. **Indian Philosophy : S. Radhakrishnan : అను : బులుసు వెంకటేశ్వర్లు.**

కొనుట. మూడవది : వానిని బ్రద్దలుగొట్టి తమదారిని తాము పోవుట.[1] ఈ మూడింటిలో మొదటి ధోరణి నవలంబించినచో కీర్తిగాని అపకీర్తిగాని రాదు. ఈ పద్ధతిలో జీవించుటయందు గాని, రచనలు చేయుటయందుగాని వైలక్షణ్యములేదు. ఈ తెగకు చెందినవారిని సంప్రదాయ దాసు లనవచ్చును. మిగిలిన రెండు ధోరణులకు చెందినవారు విలక్షణమైనవారు. ప్రాతయెల్లను గొప్పదను విశ్వాసము వీరికిలేదు. ఈ యిరుతెగలవారు సంప్రదాయములో మార్పు నభిల షింతురు. కాని వీరిలో మూడవ ధోరణికి చెందినవారు అతివాదులు. నేలవిడిచి సాముచేయు మనస్తత్త్వము వీరిది. వీరి ప్రయోగములను, సమకాలమువారు హర్షింపరు. సంప్రదాయ పరులకు అవి పచ్చి చేదుబిళ్ళల వంటివి. కావున రెండవ ధోరణికి చెందినవారే అచ్చమైన ప్రయోగవాదులు (Experimentalists) అని నా అభిప్రాయము. శరీరములో ఏదేని ఒక అంగము దుష్టముగా నున్నచో దానిని మూలశరీరతత్త్వమునకు హానికలుగకుండ తీసివేయుట వాంఛనీయము కదా ! ఈ తెగకు చెందినవారు సంప్రదాయములోని చెడును తీసివేసి దానిలో క్రొత్తనెత్తురును తళుకొత్తజేయుదురు. కావుననే వీరి ప్రయోగములు పదికాలములపాటు నిల్చును వేదకాలమున మానవుని మనసులో నిత్యము జరిగిన పరిణామమే ఉపనిషత్తుల రూపమున ఉద్గ మించినది. ఉపనిషన్మతసంప్రదాయములో జరిగిన సమ్యక్ పరిణామమే బౌద్ధజైనమతములకు దారితీసినది. బౌద్ధజైనములు వేదప్రామాణ్యమును నిరసించినను అవికూడ ఒక విధముగా వైదిక మతమనెడు పాదునుండి ప్రక్కలకు దన్నుకొని వచ్చిన శాఖలే. భావప్రపంచమున కలిగిన పరిణామముల ఫలితముగా జరిగిన ప్రయోగములే యివి. ఉపనిషత్తులనుసైతము, క్రతు వులకు తదితరకర్మకాండలకు వ్యతిరేకముగా జరిగిన పరిణామములుగానే స్వీకరింపవచ్చునని విజ్ఞులభిప్రాయపడిరి.[2]

1. 'There are three determining attitudes towards conventions: We may accept them, passively confirm, or we may keep and mould them; or we gloriously smash them and go on.'

—Convention And Revolt In Poetry: P. 91.

2. 'In the realm of ideas there are continuous growth and often conflicts. The early Upanishads had been followed by the development of thought and activity in many directions. They were themselves a reaction against priest-craft and ritualism'. —Discovery of India : Jawaharlal Nehru : P. 108.

## ప్రయోగము : దాని స్వరూపము :

సంప్రదాయముపై జరుగు మార్పే ప్రయోగము. ఈ ప్రయోగము మూలమునకు మెరుగులు దిద్దునది కావచ్చును; లేక మూలచ్ఛేది కావచ్చును. మూలమునకు మెరుగులుదిద్దు ప్రయోగమే ఆదరణీయమని ఇంతవరకే మనవిచేసితిని. సత్ప్రయోగములన్నియు మూలలక్ష్యము నందుకొనుటకే ప్రయత్నించును. చాసరుమహాకవి తన కుమారునికి వ్రాసిన లేఖలో 'Diverse pathes leaden diverse folks the right way to Rome' అని ఈ విషయమే వ్యక్త పరిచెను.[1] రోమును చేరుకొనుటకు విభిన్న వ్యక్తులకు విభిన్న మార్గము లుపకరించునని పై వాక్యములోని భావము. కాళిదాసమహాకవియును రఘువంశములో సరిగా ఇట్టి అభిప్రాయమునే వెల్లడించెను.

'బహుధాప్యాగమైర్భిన్నాః పంథానస్సిద్ధిహేతవః
త్వయ్యేవ నిపతంత్యోఘాః జాహ్నవీయా ఇవార్ణవే.'

—(ద్వాదశ సర్గము)

గంగాసంబంధమైన భిన్న ప్రవాహములు సముద్రములోనే కలయునట్లు వివిధ సిద్ధాంతములకు భగవంతుడే గమ్యుడని పై శ్లోకములోని అభిప్రాయము. ఈ అభిప్రాయములు ప్రయోగముల లక్ష్యసిద్ధిని నిర్దేశించుచున్నవి.

ఒకానొక సంప్రదాయముపై తిరుగుబాటు ఏవిధముగా జరుగునో Lowes ఇట్లు తెలిపెను. మృతప్రాయమైన సంప్రదాయములు వీధిలోపడి కీచుమనుచున్నప్పుడు వాని నెదుర్కొనుటకు మూడు మార్గములున్నవి. ఒకటి : కవులు తామే సంప్రదాయములను సృష్టించుకొనవచ్చును లేక మిన్నకుండవచ్చును. రెండవది : మృతిస్థితిలోనున్న వట్టి గుల్లలపై తమ సృజనాత్మక శక్తితో మరియొక రూపు కట్టవచ్చును. మూడవది : ప్రాతనాణెము లిక చెల్లనేరవని ఉద్ఘాటించి తిరుగబడి క్రొత్తనాణెములు ముద్రింపవచ్చును.[2] ఈ మూడు మార్గములలో చిరకాలము

1. 'Convention And Revolt In Poetry' లో ఉద్ధృతము.
2. 'When dead conventions squeak and gibber in the streets, there are just three ways of reckoning with them. Poets may set the conventions going with the detatchment of a phonograph and even absent themselves to all intents and purposes entirely. Or they may exercise creative energy, as we have seen, upon dead forms and empty shells, and bring about a metamorphosis. Or, finally, they may rise up in revolt, repudiate the old coinage altogether, and more or less definitely set themselves to minting new'.

—'Convention And Revolt In Poetry' : P. 142.

నుండి ఎదురుబొదురు లేక జీవచచ్చిన సంప్రదాయమున క్రొత్త ఊపిరులూదుటయే ఉత్తమమైనది. ప్రాతనాణెమును త్రోసివేసి (కరగబోసి) క్రొత్త నాణెమును సృష్టించునట్టి ప్రయోగము జనులను చకితుల నొనర్చునేకాని సంప్రీతుల జేయలేదు. ఈ ధోరణిలో సాగిన బహుప్రయోగములు ప్రజాదరణకు దూరమైపోయినవి. ఒకానొక నూత్నసాహిత్యోద్యమము రాత్రివేళ దొంగవలె ఎవరి కంటబడకుండ ప్రారంభమగునని, ప్రాతమర్యాదల నుల్లంఘించుచు పూర్వాచార పరాయణుల ప్రతిఘటనమున కెదురొడ్డి నిల్చి క్రమముగా ప్రజాభిమానమును చూరగొనునని మార్టిన్ గిల్కిన్ (Martin Gilkes) అభిప్రాయపడినాడు.[1] నిజమే. క్రొత్తలో ప్రతి నవ్యప్రయోగము వింతగా కనిపించును. కాలనికషమే అది ఇత్తడియో పుత్తడియో తేల్చివైచును. ఎంతటి సంప్రదాయాత్మక ప్రయోగమైనను కొంతకాలమువరకు మచ్చికచేయని జవనాశ్వమువలె నుండును. క్రమముగా దాని జూలుదువ్వి, మోర నిమిరి మచ్చికచేసినచో అది సాధువై పోవును. ఏ ప్రయోగమైనను ఘటోత్కచుని యౌవనమువలె సద్యోజనితముకాదు. దాని కెక్కడో ఒక చోట ఆధారముండి తీరును. కొన్ని ప్రయోగములు కాలవ్యత్యాసముతో విస్మృతిగర్భమున కలిసిపోయిన మృతసంప్రదాయములనుండియే పునర్జన్మము పొంది వచ్చును. మరికొన్ని దేశాంతరమునుండి రూపు మార్చుకొని దిగుమతియగును. గాఢమైన ప్రతిభ కలవాడు చేసిన ప్రయోగము మాత్రము అనతికాలముననే సంప్రదాయముగా రూఢమగును. అంతేకాదు. ప్రాత విషయములే ప్రతిభావంతుని చేతిలోబడి నవ్యతను పుంజుకొనుటకూడ లేకపోలేదు.[2] మానవ జీవితమున కార్య ప్రతికార్యములు ఏ విధముగా ప్రాణిహృదయమువలె ఒకపరి ముకుళించుకొని, ఇంకొకపరి వికసించునో, అట్లే తిరుగుబాటెల్లప్పుడు సంభవించుచునేయుండునన్న Lowes అభిప్రాయమెంతో సమంజసమైనది.[3]

## భారతీయ మత సంస్కృతులలో ప్రయోగములు :

వేదకాలమునుండి గంగానదివలె ప్రవహించుచున్న హిందూమతమును సంస్కరించుటకు మధ్యమధ్య కొందరు మహానుభావులు ప్రయత్నించుచునేయున్నారు. జీవన్మృతమునకు సంస్క-

1. 'A new movement begins like a thief in the night, almost imperceptibly as we used to be told in the nursery-bad habits begin. It grows, in the face of opposition....Then as people become accustomed to the new rhythms of speech and novel methods of expression; it challenges the reigning tradition in its own ground'. —'A Key To Modern English Poetry'.

2. 'For the old will perennially become new at the hands of genius. That is the paradox of art, and likewise the reconciliation of conservatism and revolt'. —'Convention And Revolt In Poetry'. P. 94.

3. 'There will always be revolt in poetry, so long as action and reaction play their systole and diastole in life'. —'Convention And Revolt In Poetry'. P. 179.

రణము తప్పదు. ప్రయోగముల కెడమీయలేని మతము మృతప్రాయము. గొర్రె తోకవలె ఉండి పోవు ఏ మతముకూడ జనాభిమతమును చూరగొనజాలదు. అందుచేత మతసంస్కృతులలో ప్రయోగములు అనాదినుండి చేయబడుచునేయున్నవి.

వేదమంత్రములలోని నిరాడంబరమైన దేవతాభక్తికి బదులుగా బ్రాహ్మణముల కాలమున కర్మకాండ ముదిరినది. యాగములు యాంత్రికముగ మారిపోయినవి. వీనిపై ఉపనిషత్తులు మెత్తని తిరుగుబాటు చేసినవి. వేదమంత్రములలో సూచనప్రాయముగానున్న అద్వైత భావములను ఉపనిషత్తులు పెంపొందించినవి. బాహ్యాకర్మాచారములను నిరసించినవి. ఇహసుఖములను పూర్తిగా త్రోసిరాజని, తత్త్వానుభూతిని ఆత్మ సాక్షాత్కారమును పరమ లక్ష్యములుగా గ్రహించినవి. కావున ఉపనిషత్తులు భారతీయ సంస్కృతిరంగములో క్రొత్తదారి త్రొక్కెనన వచ్చును.

ఉపనిషత్తులలో అంకురించిన సర్వసమానత్వ బీజములు క్రమముగా బౌద్ధమతమున రెమ్మలు తొడిగినవి. పురాణయుగములోనే సర్వసమానత్వముకొరకు సంఘర్షణలు జరిగినవి. వశిష్ఠమహర్షిని ఘనీభూతసంప్రదాయములకు ప్రతినిధిగా తీసికొనవచ్చును. విశ్వామిత్రుడు వానిని సడలింపజేయుటకు బద్ధకంకణుడైన రాజర్షియని చెప్పవచ్చును. ఆర్యులకు మాత్రమే వేద విజ్ఞానము పరిమితమై యుండవలెనని వశిష్ఠుడు వాదించెను. విశ్వామిత్రుడు అది సమస్త జనులకు సమభోగ్యమవి పట్టుపట్టెను; తరువాతి కాలమున రామానుజాచార్యుడు శూద్రులను, పంచములను చేరదీసి వారిని 'ఆళ్వారులు'గా సంభావించెను. తెలుగునాట 'పలనాటి చాపకూడు' ప్రసిద్ధమే కదా! వీరశైవమతముకూడ కులభేదములను కూల్చుటకు నడుముగట్టినది. తరువాతి కాలమున రాజారామమోహనరాయలు హిందూ మతమును సంస్కరించుటకు శంఖమెత్తిన మహాపురుషుడు. అనాదిగా ప్రవహించుచున్న హిందూమతస్రోతస్వినికి ఈత దెదురీదుటకు ప్రయత్నింపలేదు. దాని గమనములో కించిత్తుగా మార్పుచేయుటకు మాత్రము ప్రయత్నించెను. చిరకాలమునుండి ఆచరణలో నున్న 'సహగమ'నాద్యంధ విశ్వాసములకు వ్యతిరేకముగా ఉద్యమము లేవనెత్తెను. దయానంద సరస్వతి సంస్కరణ పతాకమెత్తిన మరియొక మనీషి. ఇతడు మారుచున్న కాలమున కనుగుణముగా వేదార్థములను సంస్కరించుకొనవలెనని ఎలుగెత్తి చాటెను. అపౌరుషేయములని భావింపబడు వేదములకు సరిక్రొత్త వ్యాఖ్యానముచేయుట మతరంగములో జరిగిన అభినవప్రయోగము. తన కాలము నాటి గ్రుడ్డి నమ్మకములను పారద్రోలి పురాభారతవైభవమును పునరుద్ధరించుటకు ఇతడు 'ఆర్యసమాజము' ద్వారా ప్రయత్నించెను[1].

భారతసంస్కృతికి ప్రధానాంగమైన వర్ణవ్యవస్థలోగూడ అనేక నవ్యప్రయోగములు జరిగినవి. హైందవ మతము ఏనాడును అంతర్వర్ణ వివాహములను ప్రోత్సహింపలేదు. పైగా

1. **'His principal achievement was the unsealing of the Vedic Lore-the perennial well-spring of Indian Spirituality and culture-which none of his predecessors had ever dreamt of doing'. — 'Vision of India' : Sisirkumar Mitra.**

వర్ణసాంకర్యము మహాపాపమని గీతలో చెప్పబడినది. కాని మనువు తన మనుస్మృతిలో అనులోమ విలోమ వివాహములను పేర్కొనెను. ఉచ్చవర్ణస్థులు అవరవర్ణ స్త్రీని వివాహమాడుట అనులోమము. అవరవర్ణపురుషుడు ఉచ్చవర్ణస్త్రీని వివాహమాడుట విలోమము. ప్రాచీన భారతకాలమున ఇవి ప్రబలముగా నున్నట్టు ఆధారములు కలవు. వ్యాసుడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు అనులోమవివాహములవలన జన్మించినవారే. సూతుడు క్షత్రియునివలన విప్ర కన్యకకు పుట్టెను. ఇతడు విలోమవివాహఫలితమునకు దృష్టాంతము.

భారతీయమతసంస్కృతులలో ప్రయోగములు జరిగినట్టే, పాశ్చాత్యదేశములలోగూడ జరిగినవి. గ్రీసులో Poletheism (బహుదేవతాత్వము), రోములో Paganism (ప్రకృత్యారాధనము) ఒక కాలమున ప్రబలముగానుండెడివి. వీని ప్రభావము ఇంగ్లండుపై ఉండెడిది. క్రమముగా మధ్యయుగములందు – అనగా క్రీస్తు జననముతో – మరల మత విశ్వాసము మోసులెత్తినది. రానురాను 'చర్చి'కి ప్రాధాన్యము హెచ్చినది. పోపుహైల్డ్ బ్రాండ్ (Pope Hilde Brand) 1070 ప్రాంతమున ప్రపంచములో అన్నిటికంటె ఉన్నతమైనది చర్చియని ఉద్ఘాటించెను. రాజ్యాధికారమెవరిదను విషయమున ఆనాటి చక్రవర్తియైన నాల్గవహెన్రీకి (Henry IV) పోపునకు సంఘర్షణము జరిగెను. చివరికి 'చర్చి' ప్రతినిధియైన హైల్డ్‌బ్రాండ్ గెలుపొందెను. మహారాజుకన్న మతము గొప్పదని ఈతడు చేసిన ప్రబోధము కొంతకాలము వెలిగిపోయినది.

## భారతీయ సాహిత్యములలో ప్రయోగములు :

భారతీయ సాహిత్యములలో సంస్కృత సాహిత్యమే అతిప్రాచీనమైనది; అన్నిటికన్న సంపన్నమైనది. భారతదేశములోని సమస్త భాషాసాహిత్యములపైన దీని ప్రభావమున్నది. ఒక్క తమిళముపై మాత్రము కొంచెము తక్కువగా నున్నదని చెప్పవచ్చును. భారతీయ భాషలన్నియు సంస్కృతభాషా సాహిత్య మర్యాదలనే పాటించినవి. అందుచేత ప్రధానముగా సంస్కృత సాహిత్యములోని ప్రయోగములే యిచ్చట చర్చింపబడును తెలుగు సాహిత్యములోని ప్రయోగముల గురించి ముందు ముందు విపులముగా చర్చింపవలసియున్నది.

### ఛందస్సు :

వైదిక ఋక్కులు మాత్రాచ్ఛందస్సులో వెలువడినవి. వానిలో గురులఘు నియమము లేదు. ఋగ్వేదములో గాయత్రి, అనుష్టుప్పు మొదలైన ఛందస్సులు ప్రయోగింపబడినవి. మకుటముల ఆవృత్తి (శతకములలోవలె) ఋగ్వేదములోనే కనిపించును.

వైదిక ఋక్కులపై ఛందోవిషయికముగా చేసిన సరిక్రొత్త ప్రయోగము వాల్మీకి రామాయణము. ఈ కావ్యమునకు ముందు అనుష్టుప్ ఛందస్సు కథా కథనమునకు, కావ్యరచనకు ఉపయోగపడలేదు. వాల్మీకి తన కావ్యమును 'తాళబద్ధాక్షరసమం, తంత్రీలయ సమన్వితం,

కావ్య మేతన్మయాకృతమ్'[1] అని చెప్పుకొన్నాడు. లౌకిక వాఙ్మయమున ఛందస్సులో నిర్మితమైన ప్రప్రథమ కావ్యము వాల్మీకి రామాయణమే. 'ఆమ్నాయా న్నూతనోఽయం ఛందసామవతారః' అని భవభూతి ఉత్తర రామచరిత్రమున వాల్మీకి రామాయణముయొక్క నూతనత్వమును ప్రస్తుతించెను. అనుష్టుప్ ఛందస్సునకు మంచి పుష్టిని ప్రసాదించినవాడు వాల్మీకి. తదనంతర కవులు ఈ ఛందస్సులో అసంఖ్యాక కావ్యములను రచించిరి

వాల్మీకి తర్వాత ఛందస్సులో గొప్ప నవ్యత చూపినవాడు కాళిదాసు. కాళిదాసు అనుష్టుప్పును త్రోసిపుచ్చలేదు. దానిని కథాకథనమునకు మాత్రమే పరిమితము చేసెను. కరుణ రసమునకు వియోగినియను క్రొత్త ఛందస్సు నుపయోగించెను. మందాక్రాంతవృత్తములో రచన చేయుట కాళిదాసు చేసిన మరియొక నూత్న ప్రయోగమని అనవచ్చును. విప్రలంభ శృంగార పోషణమునకు మందాక్రాంతమును సమర్థముగా నడపిన కవి యీతడు. మందాక్రాంత వృత్తములో విరతు (యతు) లెక్కువ. ఇది మందముగా భారముగా నడచును. విప్రలంభ శృంగారమునకు సైతము విరతులు బహుళముగా నుండుటవలన ఈ వృత్తమునకు ఔచిత్య మేర్పడినది. మందాక్రాంతములో ఈతడు మేఘసందేశము వ్రాసెను. ఇతని ప్రయోగమే తరువాతి కవులకు సంప్రదాయమైనది. సందేశ కావ్యములెవరు వ్రాసినను మందాక్రాంతములోనే వ్రాసిరి. ధోయీ కవి పవనసందేశము, వేదాంతదేశికుని హంససందేశము ఇందుకు నిదర్శనములు.

కాళిదాసు తరువాత భవభూతి అతని మార్గము ననుసరింపలేదు. విప్రలంభమునకు మందాక్రాంతమును, కరుణరసమునకు వైతాళీయమును అతడు స్వీకరింపలేదు. పై రెండు రసములకు శిఖరిణీవృత్తమును ప్రయోగించి తన స్వేచ్ఛాప్రియత్వమును కనబరిచెను

జయదేవుడు గేయచ్ఛందస్సులో కావ్యమువ్రాసి గొప్ప ప్రయోగము చేసినాడు.

**వస్తువు :**

ఇతివృత్తముతో గూడుకొనిన మొదటి కావ్యము వాల్మీకి రామాయణము. అందులోని వస్తువు ఐతిహాసికము. వాల్మీకి తరువాత కాళిదాసే వస్తువరణములో చక్కని ప్రయోగములు చేసెను. ఇతని మేఘసందేశములోని వస్తువు కేవలము కల్పితము. ఇందులో నాయికా నాయకుల పేర్లు సైతము సూచింపబడలేదు. ఉత్పాద్యమైన వస్తువుతో కావ్యము నిర్మించుట కాళిదాసు చేసిన అపూర్వ ప్రయోగము. ప్రేమికుల సందేశములకు, ప్రణయవేదనలకు కావ్యరూపమిచ్చిన తొలికవి కాళిదాసే. అతనికి ముందు మహాభారతములో హంస సందేశమున్నది. రామాయణమున హనుమత్సందేశమున్నది.[2] ఐనను ఆ సందేశములన్నియు గౌణములు; కావ్యాంతర్గ

---

1. వాల్మీకి రామాయణము : బాలకాండము.

2. ఋగ్వేదములో ఒక సందేశమున్నది. 'సరమా' అను పేరుగల దేవశుని (ఆడుకుక్క) ఇంద్రుని దూతికయై 'పణి' యను ఒక జాతి మానవుని దగ్గరకు వచ్చును. ఇంద్రునితో అతడు యుద్ధము చేయుట తగదనియు, ఇంద్రుని గోవులను తిరిగి అతనికి ఇచ్చివేయుట సమంజసమనియు సంధికార్యము నడపును.

తములు. మేఘసందేశమే మొట్టమొదటి స్వతంత్ర సందేశ కావ్యము. కాళిదాను ఋతుసంహారముకూడ వస్తురీత్యా గొప్ప ప్రయోగము. ఋతువులపై స్వతంత్రముగా వెలసిన మొదటి కావ్యమిది. స్వల్పమైన వస్తువుతో అనల్పమైన వర్ణనలతో సాగిన కావ్యమిది.

ప్రాతదెల్ల గొప్పకాదనియు, క్రొత్తయెల్ల రోతకాదనియు కాళిదాసు స్పష్టముగా వ్యక్తీకరించెను. అతడు బుద్ధిపూర్వకముగానే క్రొత్త ప్రయోగములు చేసెను. కాళిదాసు వ్రాసిన ఈ క్రింది శ్లోకమువలన అతని ప్రయోగప్రీతి స్పష్టమగును.

'పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః'[1]

పురాణమనగానే ఎప్పుడో ఒకప్పుడు క్రొత్తదేయని అభిప్రాయము కలదు. 'పురానవం భవతీతి పురాణమ్' అని యాస్కుని నిర్వచనము. ఎప్పుడో క్రొత్తదైనంత మాత్రమున ఈనాడు సాధువైనదెట్లగును. ఇదే కాళిదాసు చెప్పినది. నవీనమైనంత మాత్రమున గర్హ్యము కాదని అతని అభిప్రాయము. కాళిదాసునకు ముందు కొన్ని కావ్యములలో 'తు, హి, చ, స్మ, హ, వై'లు విపరీతముగా నుండెడివి. వీనిని పరిహరించి, వాగర్థములను పార్వతీపరమేశ్వరుల వలె మేళవించి, కావ్యములు ధ్వని ప్రధానముగా సమర్థముగా వ్రాసిన ఆదర్శ కవి కాళిదాసే.

సద్వస్తువును మాత్రమే తీసికొని కావ్యములు వ్రాయవలెనని ప్రాచీనాలంకారికు లభిప్రాయపడిరి. 6 వ శతాబ్ది ఆలంకారికుడు భామహుడీ విషయమున ఇట్లభిప్రాయపడెను.

'సర్గబంధో మహాకావ్యం మహతాంచ మహచ్చయత్
అగ్రామ్య శబ్దమర్థంచ సాలంకారం సదాశ్రయమ్.'[2]

కథాశరీరము సద్వస్తువు నాశ్రయించి యుండవలెనని భామహుని మతము. అతని తరువాతి ఆలంకారికులెల్లరు కావ్యము సద్వస్త్వాశ్రయముగ నుండవలెనని బలపరిచిరి. కథా శరీరమునందు అధర్మాత్మకములైన అంశములు తారసిల్లినచో వానిని పరిహరింపవలెనని సూచించిరి.

'ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యాప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః'[3]

ఇతివృత్తగతములైన అననుకూలసంఘటనలను తీసివేయవలెనని, మధ్యమధ్య అవసరమైనచో క్రొత్త సన్నివేశములను కల్పించి కథను రసవంతముగా చేయవలెనని ఆనందవర్ధనుడ

1. మాలవికాగ్నిమిత్రము : ప్రస్తావన.
2. కావ్యాలంకారము : ప్రథమ పరిచ్ఛేదము.
3. ధ్వన్యాలోకము : తృతీయోద్యోతము.

అభిప్రాయము. ఈ సంప్రదాయముప్రకారము సద్వస్తువు మాత్రమే వర్ణ్యమని రూఢియైనది. కాని దీనికి విరుద్ధముగా కొందరు కవులు రచనలు చేసిరి. అసద్వస్తుభరితములైన కావ్యములను, నాటకములను రచించిరి. ప్రహసనము, ప్రకరణము, భాణము, లఘుకథలు మొదలగు ప్రక్రియలలో అనేకములు అసద్వస్తువర్ణన కుపయోగింపబడినవే. భగవదజ్జుకము, పాదతాడితకము మొదలైన ప్రహసనములలో వేశ్యలకు, జూదరులకు సంబంధించిన జీవితము చిత్రింపబడినది.

### రసము :

సంస్కృతములో ఆదికావ్యమైన రామాయణము కరుణరసప్రధానమైనది. కాళిదాసు శృంగారమునకే అగ్రతాంబూలము నిచ్చెను. అశ్వఘోషుడు కేవలము శాంతరసప్రధానమైన రచనలు చేసెను. భవభూతి కాలమునకు శృంగారరసము రసరాజముగా ప్రతిష్ఠ సంపాదించుకొన్నది. భవభూతి దీనిపై క్రొత్త ప్రయోగము చేసెను. కరుణరస మొకటే రసమని ఉద్ఘోషించెను.

'ఏకోరసః కరుణ ఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా
నంభోయథా సలిలమేవహి తత్సమస్తమ్.'[1]

సమస్త రసములు కరుణరసమునకు అంగప్రాయములనియు, అవి ఆ మహారసమునకు వికృతులు మాత్రమే యనియు భవభూతి అభిప్రాయము ఇంగ్లీషులో షెల్లీకవి సైతము ఈ అభిప్రాయమునే వెల్లడించెను.[2]

### కావ్య స్వరూపము :

లాక్షణికులు మొదట మహాకావ్యమును, ఖండకావ్యమును మాత్రమే ప్రస్తావించిరి. ఈ రెండు ప్రక్రియలకు భిన్నమైన ప్రయోగమును సంస్కృత సాహిత్యములో అమరుకుడు సమర్థతతో నొనరించెను. అది ముక్తకము. ముక్తకమనగా ఒకే ఒక్క శ్లోకముతో కూడుకొన్న రచన. ఇతర ముక్తకములలోని భావముతో దీనికి సంబంధముండదు. ప్రతి శ్లోక మొక ప్రత్యేక కావ్యమనవలెను. కావ్యము పరిమాణమునుబట్టి పెద్దదిగా ఉండవలెనని తనకు ముందు స్థిరపడిన అభిప్రాయమును అమరుకుడు పరాస్తము చేసెను. ఒక్క చక్కని శ్లోకమైనను కావ్య గౌరవము పొందగలదని నిరూపించెను. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అన్న విశ్వనాథుని సూక్తి ముక్తకమునే బలపరుచుచున్నది. అమరుకునిచేత ప్రారంభింపబడిన ఈ ముక్తకము

1. ఉత్తర రామచరిత్ర : తృతీయాంకమున తమస యను నదీదేవతచేత అనిపించినాడు.
2. 'Our sweetest songs are those that tell of saddest thoughts.' — Shelley.
(అత్యంత వేదనాభరిత భావములను గ్రథనము చేయునవే మధుర గీతికలు.)

క్రమముగా సంప్రదాయమైపోయినది. భర్తృహరి, బిల్హణుడు మున్నగు కవులు అనేక ముక్తకములను రచించిరి.

మొట్టమొదటిసారిగా గద్యములో మహాకావ్యము రచించినవాడు బాణుడు. అతనికి ముందు గద్యములో రచనలున్నను వాని కంతగా గౌరవస్థానము లేకుండెడిది. 'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆభాణకము బాణుని తరువాత బయలుదేరినదే. ఇతని ప్రయోగ సాఫల్యమునకు ఇదియొక మచ్చుతునక. ఇతని ప్రయోగమును దండి మున్నగు మహాకవులు పల్వురనుసరించిరి.

**అర్థాలంకారములు :**

సంస్కృత సాహిత్యమున అలంకారములు అసంఖ్యాకములుగా నున్నవి. వానిలోనుండి కొన్నిటిని మాత్రమే యేరి కొందరు బహుళముగా ప్రయోగించిరి.

కాళిదాసు ఉపమాలంకారమును విరివిగా వాడుటవలన తరువాత దాని ప్రాధాన్యము పెరిగిపోయినది. క్రమముగా ఉపమ సర్వాలంకారములందు రాజ్ఞీపదవి నధిష్ఠించినది. తరువాతి కవులలో పలువురు ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము మున్నగువానిని గ్రహించిరి. సుబంధుడను కవి శ్లేషాలంకారమును ప్రధానముగా స్వీకరించి 'వాసవదత్త' అను కావ్యము రచించెను.

'ప్రత్యక్షర శ్లేషమయ ప్రబంధ
విన్యాసవైదగ్ధ్య నిధిః కవీనామ్'

అని ఇతడు తన్నుతాను పొగడుకొనెను. కాని ఇతని ప్రయోగము కేవలము ప్రయోగముగా నిలిచిపోయినది. శ్లేషలు విధిగా ప్రయోగింపవలసిన అవసరమున్నందున కావ్యము రసభంగమునకు, అనౌచిత్యమునకు పాల్పడినది. తరువాతి కవులు ఇతని ప్రయోగమును ప్రమాణీకరింపలేదు. ఈ విధముగానే పరిసంఖ్య, విరోధాభాసము మొదలైన అలంకారములను ప్రధానముగా స్వీకరించి కొందరు కావ్యరచన చేసిరి. విరోధాభాసమును పరిసంఖ్యమును బహుళముగా కావ్యములలో ప్రయోగించిన ప్రథమకవి బాణుడని చెప్పవచ్చును.

**శబ్దాలంకారములు :**

సంస్కృత కావ్యములలో తొలిసారిగా భారవి ఏకాక్షరీ, ద్వ్యక్షరీ, త్ర్యక్షరీత్యాది చిత్రకవిత్వమును, బంధకవిత్వమును కిరాతార్జునీయమున ప్రవేశపెట్టెను. ఈ ప్రయోగము కేవలము 'స్వాంతస్సుఖాయ' అనియే చెప్పవచ్చును. ఇది కావ్యశోభ నినుమడింపజేయలేదు. అందుకే ఆలంకారికుల దృష్టిలో ఈ ప్రయోగము అధమశ్రేణికి చెందినదిగా పరిగణింపబడినది. చిత్ర కవిత్వము సద్యఃపరనిర్వృతికి వ్యవధాయకము. అందుచేత ఇది క్షుద్రకవితామార్గములలో చేర్చబడినది. కావ్యముయొక్క పరమోద్దేశము 'సద్యఃపరనిర్వృతి' కదా. ఈ మూలోద్దేశమునకే విరుద్ధముగా తలయెత్తిన ప్రయోగము మూడునాళ్ళకన్న మిన్నగా ఎట్లు నిలుచును ?

### కవిసమయములు :

సంస్కృత సాహిత్యమున కవిసమయములు నిర్ణీతములై యున్నవి. కొందరు కవులు అప్పుడప్పుడు వానిని కాదని కొన్ని నవ్య ప్రయోగములు చేసినారు.

కనులను కలువలతోనో, కమలములతోనో పోల్చుట కవి సమయము. దండి మహాకవి రాగరూషితయగు అవంతిసుందరి నేత్రమును 'ప్రౌఢ కందళీకుట్మలమివ'[1] అని ఉపమించెను. కందళి యనగా అరటిపువ్వు. అరటి పువ్వుతో కన్నును పోల్చుట ఒక క్రొత్త ప్రయోగమే. ఈ కావ్యములోనే దండి అధరమును కదంబ పుష్పముతో పోల్చినాడు. ఇదియు అపూర్వ ప్రయోగమే. మచ్చునకు మాత్రమే ఈ రెంటిని చూపితిని. అనేక కవి సమయములలో ఇట్టి ప్రయోగములు జరిగినవి.

## ఆంగ్ల సాహిత్యములో ప్రయోగములు :[2]

సంస్కృత కవిత్వమునకు వాల్మీకివలె, తెలుగు కవిత్వమునకు నన్నయవలె, ఇంగ్లీషు కవిత్వమునకు చాసర్ ఇంచుమించుగా ఆదికవి. ఇతనికిముందు కవులు లేరనికాదు. కేడ్మన్ (Caedmon), ఆల్ఫ్రెడ్ రాజు (King Alfred) మున్నగు కవులు చాసర్‌కుముందే ఆంగ్లో సాక్షన్ (Anglo-Saxon) భాషలో రచనలు కావించిరి. కాని నన్నయకు పూర్వపు శాసనముల లోని భాషవలె వీరి భాషకూడ కొంత దురవగాహముగా నుండును. చాసర్‌పై ఇటలీదేశపు మానవతావాదము (Italian Humanism) ప్రభావము ప్రబలముగా నున్నది. ఇతడు ఛందస్సు విషయములో గొప్ప ప్రయోగముచేసెను. ఇతనికి ముందున్న ఆంగ్లో సాక్షన్ కవిత్వములో పదాద్యక్షర సామ్యము (Alliteration) ఉండెడిది. ఇంగ్లీషు కవిత్వమున ప్రాయశః నిర్బంధమై పోయిన అంత్య నియమము (End rhyme) ఆనాడు లేదు. ఆది నియమము (Beginning rhyme) మాత్రముండెడిది. పద్యపాదములుగూడ అక్షరసంఖ్యా నియమబద్ధములుగా ఉండక పోయెడివి. చాసరు మహాకవి తొలిసారిగా పద్యపాదములలో అక్షరసంఖ్యా నియమము ప్రవేశ పెట్టెను. పదాద్యక్షర సామ్యమును వదలివేసి ఫ్రెంచి ఛందోనియమమగు అంత్యప్రాసమును తొలిసారిగా ప్రవేశపెట్టెను. ఇతని ప్రభావమువలననే ఇంగ్లీషు కవిత్వమునుండి క్రమశః (Alliteration) నిష్క్రమించినది. చాసర్ ప్రవేశపెట్టిన అంత్య నియమము మరియు అత డధికముగాచేసిన వసంత ప్రభాత (May Morning) వర్ణనలు, ఉద్యానవర్ణనలు అతని అనుచరులకు సంప్రదాయములై పోయినవి.

చాసర్ ఏర్పరిచిన బాటను పెక్కు రనుసరించిరి. కాని పదునారవ శతాబ్దిలో ఇతని బాటను కాదని ఇటలీదేశమున సర్ థామస్ వయట్ (Sir Thomas Wyatt), సర్రే (Surrey)

1. దశకుమార చరితము : ప్రథమోచ్ఛ్వాసము.
2. ఈ విషయముగూర్చి వ్రాయుటకు Hudson వ్రాసిన An Outline of History of English Literature ఉపకరించినది.

అను ఇరువురు కవులు క్రొత్త ప్రయోగములు చేసినారు. వీరు ఇటలీ భాషా సాహిత్యముల పారము నందుకొన్నవారు. పెట్రార్క్ (Petrarch) ప్రభృతులు బలపరిచిన ప్రణయ కవిత్వమును వీరు ఇంగ్లీషు కవిత్వములోనికి దిగుమతిచేసిరి. సర్రే ప్రప్రథమముగా అంత్యనియమము లేకుండ Blank verse ను చేపట్టెను. వీరిరువురు తొలిసారిగా ఇంగ్లీషులో సానెట్ (Sonnet) ను ప్రవేశపెట్టిరి. సానెట్ పదునాలుగు పంక్తుల గీతము. వీరు వేసిన బాటలు క్రమముగా సంప్రదాయములైనవి.

షేక్స్పియరు యుగమునందు ప్రధానముగా కాల్పనిక సౌరభముగల రచనలు వెలువడినవి. ఈ యుగములోనే బెన్ జాన్సన్ (Ben Jonson) అను కవి సంప్రదాయ ధిక్కరణము చేసి కాల్పనికేతివృత్తములను త్రోసిపుచ్చి తత్కాలీన సమాజ స్థితిగతులను చిత్రించుటకు నాటకములు వ్రాసెను. ఉపదేశాత్మక వాస్తవికతకు (Didactic Realism) దారి తీసిన గొప్ప ప్రయోక్త బెన్ జాన్సన్.

మిల్టన్ కాలమువరకు Blank verse నాటకములందు మాత్రము వాడబడుచుండెడిది. తొలిసారిగా మహాకావ్యములందు శక్తిమంతముగా దీనిని ప్రయోగించిన మహాకవి మిల్టన్. ఇంగ్లండులోని మతరంగమున తననాటికే వేళ్లు నాటుకొన్న Puritanism ను ప్రచారము చేయుటకు కంకణము కట్టుకొన్న కవి మిల్టన్. కాల్పనికోద్యమము (Romanticism) పై ఇతడు తిరుగుబాటు చేసెనని చెప్పవచ్చును. అయినను మిల్టనులోని మానవతా వాదమును అతనిలోని మతాభినివేశము త్రోసిరాజనలేదు మిల్టను ప్యారడైజ్ లాస్ట్‌లో అంత్యప్రాసములేని బ్లాంక్ వెర్స్‌ను ప్రవేశపెట్టినాడు. మహాకావ్య (Epic) రచనకు ఒరవడి దిద్దినాడు.

ఇంగ్లీషు సాహిత్యమున పోపుయుగమును Neo-classical Age అని యందురు. ఈ కాలమున వెనుకచూపు ముదిరినది. నగర సంబంధమైన కవిత్వము ప్రబలినది. భావమునకు బదులుగా రీతిపై, శైలిపై మమకారము హెచ్చినది. సహజత్వమునకు బదులుగా నగిషీలు, జిలుగులు పెరిగిపోయినవి. అలంకారముల ఆరభటి అతిశయించినది. భావనాశక్తికి బదులుగా చమత్కారమునకు ప్రాధాన్యము కలిగినది.[1] ఈ యుగములోని సమస్త సంప్రదాయములకు విరుద్ధముగా కాల్పనికోద్యమము (Romantic Revival) గొప్ప తిరుగుబాటు చేసినది. కాల్పనికోద్యమమును గురించి, తదనంతర కవితాధోరణులనుగురించి రానున్న ప్రకరణములలో చర్చింపబడును కావున ఇంతటితో ఈ విషయ పరిశీలనము ముగించుచున్నాను.

---

1. Bird (పక్షి) అనుటకు బదులుగా 'The feathered inhabitant of the air' వంటి 'ఖాంత తిరుగుడు' ధోరణులు బయలుదేరినవి; తెలుగున సీతయనుటకు బదులుగా 'కదలి మొలనూలి చేడియకన్న పడతి' యన్నట్లు.

## సంప్రదాయ ప్రయోగముల సమన్వయము :

సంప్రదాయము, ప్రయోగము స్థూలదృష్టికి వేరువేరుగా కనిపించినను, ఈ రెంటికి సన్నిహిత సంబంధమున్నది. ప్రతి సంప్రదాయము ఒకనాటి ప్రయోగమే. ప్రతి ప్రయోగము ఒకనాటికి సంప్రదాయముకాక తప్పదు. ఒక్కొక్క ప్రతిభావంతుడైన కవి చేతిలో 'పరుసవేది' యుండును. అతడు మట్టిగడ్డను ముట్టినను మాణిక్యమైపోవును. మౌలికప్రజ్ఞ కలవాడు చేసిన ఏ ప్రయోగమైనను త్వరలోనే సంప్రదాయ ముద్రవేసికొనును.

ఒక సంప్రదాయము కొంతకాలము రంగమున సుప్రతిష్ఠితమైన తర్వాత దానియందు రక్తప్రసారము మందగించును. అప్పుడు దానిలో సంచలనము కలిగించుట ఆవశ్యక మగును. అందుకు సంప్రదాయదాసు లామోదించరు. అప్పుడు దానిని బొత్తిగా కాదని ప్రయోగము బయలుదేరును. సంప్రదాయములోని మూలతత్త్వమును – అనగా ఆ సంప్రదాయము పూర్వాశ్రమములో ప్రయోగముగా ఉన్ననాటి తత్త్వమును–జీర్ణించుకొన్న సరిక్రొత్త ప్రయోగము అనతి కాలములోనే సంప్రదాయపీఠ మాక్రమించును.

ఎంతటి ప్రయోగమునకైనను సంప్రదాయవాసన ఉండక తప్పదు. వాల్మీకిని ఆదికవి యన్నంత మాత్రమున అతని కావ్యము గారడివాడు మొలిపించిన మామిడి మొక్కవలె అప్పుడే పుట్టినదికాదు. వైదికఋక్కులు అతని హృదయతంత్రులలో ఎన్నినాళ్ళ నుండియో శ్రుతి సారించుకొన్నవి. తెలుగులో నన్నయను ఆదికవి యందుము. అయినను అతనికి ముందున్న గ్రంథస్థముకాని రచన లతని మతికి పదునుపెట్టిన విషయము విస్మరించలేము. సంస్కృతములో సందేశ కావ్యములకు మూలపురుషుడు కాళిదాసందుము. అతనికి ముందుగానే సందేశ కావ్యములు రేఖామాత్రములుగా రామాయణ భారతాదులలో ఉన్నవి. పోపును 'నూతన-ఐతిహాసిక యుగము' (Neo-Classical Age) నకు వైతాళికుడన్నచో అతడు దానిని అమాంతముగా సృష్టించినాడని అర్థముకాదు. ఆ కావ్యరీతి అతని చేతిలో పరిపూర్ణత నందుకొన్నదని మాత్రమే తాత్పర్యము. తెలుగులో ప్రథమ ప్రబంధము అల్లసాని పెద్దన వ్రాసెనని యందుము. వాస్తవమునకు నన్నెచోడుడే తత్కవితారీతికి బాటలు వేసెను. తనకు ముందున్న వారువేసిన కాలిబాటను ఘంటా పథముగా చేసినచో అది సంప్రదాయముపై చేసిన చక్కని ప్రయోగముగా గణనలోనికి వచ్చును.

సమకాలికులు చేసెడి ప్రతిప్రయోగము గొప్పదనియు, సాంప్రదాయికముగా నున్న దంతయు రోత యనియు ఒక్కొక్క కాలమున కొన్ని అభిప్రాయములు బయలుదేరును. 17, 18 శతాబ్దులలో ఇంగ్లండు, ఫ్రాంసు దేశములందు ఇట్టి విశృంఖల చిత్తవృత్తియే విజృంభించెను. అప్పటికి ఇంగ్లీషు, ఫ్రెంచి సాహిత్యములపై గ్రీకు, ల్యాటిను సాహిత్యముల ప్రభావము కుత్తుకబంటిగా నుండెను. ఆధునికసమాజము అనేకవిధములుగా అభివృద్ధినందినది

కావున ఎన్నడో గ్రీకులు స్థాపించిన సంప్రదాయముల నెందుకు స్వీకరింపవలెనను తిరుగుబాటును వీరు లేవనెత్తిరి. గ్రీకులు ప్రకృత్యారాధకులు (Pagans). ఆధునికులైన ఇంగ్లీషువారు క్రైస్తవులు (Christians). కావున వారికన్న తామే ఉదాత్తభావులమను అభిప్రాయమును ఆంగ్లేయులు సాగదీసిరి. వారి వాదసారాంశమిది :— మానవ విజ్ఞానము నిరంతరము పురోగమించుచున్నది. మనము పెరిక్లియన్ కాలపు గ్రీకుల తరువాత, ఆగస్టన్‌కాలపు రోమన్ల తరువాత జీవించుచున్నాము. కావున వారికంటె మనమే సమధిక వివేకవిజ్ఞానములు కలవారము. అందుచేత ప్రాచీనులైన గ్రీకులు, రోమన్లు రచించినదానికంటె, నిర్మించినదానికంటె, మనము రచించినదే, మనము నిర్మించినదే శ్రేష్ఠతరమైనది.[1] విజ్ఞానశాస్త్రమువలన ఆధునికులు పొందిన అభివృద్ధి ఈ అతివాదులకు గర్వకారణమైనది. శాస్త్రవిజ్ఞానముతోపాటు సాహిత్యము, కళలు, సంస్కృతి పెరిగిపోయినవని వీరి వింత నమ్మకము. గ్రీకులకన్న సాహిత్యరంగములో వీరు సాధించిన దేదియని ప్రశ్నించుకొని, గ్రీకుల ది ఒరెస్టీ (The Oresteia) వంటి ఉత్తమోత్తమమైన విషాదాంతత్రిపుటి (Tragic Triology) ఒక్కటైనను వీరు వ్రాయలేనప్పటికి, దానిని పునశ్చరణముచేయుటయే వీరి ఘనత కావచ్చునని గిల్బర్ట్ ముర్రే (Gilbert-Murray) అధిక్షేపించినాడు.[2]

కావున శాస్త్రీయముగా, సాంకేతికముగా అభివృద్ధిచెందినంత మాత్రమున సాహిత్యరంగములో ముందంజవేసినామనుట సత్యదూరము. మహాకావ్యము లొకతరములో మాత్రమే దేదీప్యమానముగా వెలిగి మరుతరమున మలగిపోవునవి కావు. కవిత్వము బుద్ధికి మాత్రమే సంబంధించినది కాదు. ప్రధానముగా అది హృదయసంబంధి. మానవుని మనోబుద్ధులలో మార్పు త్వరగా రావచ్చును. కాని హృదయము ప్రతితరమున మార్పు చెందదు. రెండువేలయేండ్లక్రిందగల హృదయ సంబంధి సమస్యలే నేటికి నున్నవి.

ఆధునికులు కొందరు ప్రాచీనులను త్రోసివేయకయే తమ రచనలు వారికన్న ఏ మాత్రము తీసిపోవని వాదింతురు. వారి వాదధోరణి యిట్లుండును :— నేటికాలపు సింహములు క్రౌర్యములో ఆగస్టస్‌కాలమునాటి సింహముల కేమాత్రము తీసిపోవు. నేటి గులాబులు పరిమళములో ఆనాటి గులాబులకు దీటువచ్చునవే. నేటి మానవులు ఆ కాలమువారియంత యెత్తు

1. 'Human knowledge is constantly advancing. We live in a later age than the periclean greeks and Augustan Romans, therefore we are wiser. Therefore, anything we write, or make is better than the things written and made by the ancient Greeks and Romans'.

—The Classical Tradition : Gilbert Highet : P. 264.

2. 'The Classical Tradition లో ఉద్ధృతము : P. 265.

గను, పొట్టిగను ఉన్నారు. కనుక ప్రాచీనకాలములోనివారి రచన లెంత ప్రశస్తమైనవో నేటి కాలమువారి రచనలుగూడ అంతే శ్రేష్ఠమైనవి.[1]

ఈ వాదములో నైతము అర్ధసత్యమే యున్నది. మానవుని జీవితమున చిరకాలమునుండి కొన్ని శాశ్వతసమస్య లున్నవి. రాగద్వేషములు, అధికారవాంఛ, సన్మానకాంక్ష, మృత్యుభీతి, ఇంద్రియప్రీతి, ప్రకృతిరక్తి, దైవభక్తి మున్నగు ప్రవృత్తులు సార్వకాలికములైనవి. విరహవేదన కాళిదాసుకాలమందున్నది; నేడున్నది. మగనిపై మగువ పొందు పొలయల్క పారిజాతాపహరణ రచనాకాలమందున్నది; ఈనాడున్నది. కర్మభ్రష్టులు పాండురంగ మాహాత్మ్యము రచించిన కాలమునందున్నారు; నేడున్నారు. ఈ సత్యములు సార్వకాలికములైనను వీనిని అన్ని కాలములకు చెందిన రచయితలు సమానముగా చిత్రింపలేదు. ప్రతి యుగమున వీతద్విషయ చిత్రీకరణములో కొంత మార్పు కనిపించుచున్నది. కళ యనునది సామాజిక ధర్మము. సమాజ పరిస్థితులనుబట్టి కళా స్రష్ట తన సృష్టిస్వరూపమునకు రూపురేకలు తీర్చిదిద్దుకొనును.

ప్రతి విశృంఖల ప్రయోగము జయప్రదమగుననుట కల్ల. సంప్రదాయగంధము కలిగిన ప్రయోగము మాత్రమే నిలువగలుగును. ఈ అభిప్రాయమే ఇంతవరకు ప్రకటింపబడినది. అంతమాత్రమున విశృంఖల ప్రయోగములు సుతరాము పనికిరావని నేనను. వానినే ప్రమాణములుగా భావించి ప్రాకులాడుట తగదు. ఒక్కొక్క కాలమునందలి సామాజిక పరిస్థితినిబట్టి ప్రళయకాలాంభోధి తరంగములవంటి ప్రయోగములు రాకతప్పవు. ఒక తాలోత్తాల తరంగము మహాకల్లోలముతో బయలుదేరి హోరెత్తుచు సాగి కడకు ఒడ్డునకు దాకి చిద్రుపలు చిద్రుపలై పోవును. కొంతసేపటికి సముద్రము ప్రశాంతగంభీరముగా మారును. ప్రయోగముయొక్క తీవ్ర ప్రతిఘాతముతో, గడ్డకట్టుకొనిపోయిన సంప్రదాయము ఒక్కమారుగా గలగల కదలిపోవును. దానిలో క్రొత్తజీవము ఉబికి వచ్చును. ఆ ప్రయోగము తాను స్వతః ప్రయోజనకారి కాకున్నను అంతకుముందున్న సంప్రదాయములో నూత్న చైతన్య మూదును. దీనికి ఫ్రాన్సులో జరిగిన ఒక సాహిత్యోద్యమమును, తత్పర్యవసానమును ఉదాహరణముగా పేర్కొందును.

1635 లో ఫ్రాన్సులో ఫ్రెంచి అకాడమీ (French Academy) అను సంస్థ స్థాపింపబడినది. ఇది సంప్రదాయదాసులకు గొడ్డలిపెట్టుగా రూపొందినది. జీన్‌డెస్మార్టెస్ (Jean Desmartes) అను రచయిత సంప్రదాయమును సంపూర్ణముగా నిరసించుచు కొన్ని గ్రంథములు వ్రాసెను. ప్రాచీన కావ్యము లన్నియు ఎందుకు పనికిరావనియు, తనరచనలు, తన సమకాలిక రచనలే గొప్పవనియు నిరూపించుటకు ప్రయాసపడెను. ఇత డెంతగా దుమారము లేపినను

1. 'The lions of today are no less fierce than those of the days of Augustus Caesar; roses smell no less sweetly; men are no taller no shorter. Therefore the works of men are as good today as they are in classical times'.

—'The Classical Tradition' : P. 268.

ఇతని సమకాలికుడును సంప్రదాయమును జీర్ణించుకొని క్రొత్తరచనలు సృష్టించినవాడునగు మిల్టన్ మహాకవితో తులదూగలేకపోయినాడు. అనగా ఇతడు చేయదలచుకొన్న ప్రయోగము ఫలవంతము కాలేదన్నమాట. ఒకటి మాత్రము జరిగినది. సంప్రదాయమును గ్రుడ్డిగా అనుకరించువారికి ఈ తిరుగుబాటు కశాఘాతమువలె పనిచేసినది.[1]

క్షీణదశలోనున్న సంప్రదాయమును పునరుద్ధరించుటకు తోడ్పడు ఎట్టి విశృంఖల ప్రయోగమైనను ఆదరణీయమే. కేవలము ప్రయోగముకొరకు ప్రయోగము చేయుట అంతగా ఫలవంతమైన ప్రక్రియకాదు. ఏ క్షేత్రములోనైనను మొదట సంప్రదాయమను ఎరువు వేసి తదనంతరము ప్రయోగములనెడు విత్తనములు చల్లినచో మరకతములను, మణులను గ్రేణిసేయు పంటలు పండింపవచ్చును. సంప్రదాయ ప్రయోగముల సమ్యక్మేళనమే మానవుని మహోన్నత దశకు గొనిపోవును.[2]

1. 'But the real benefit of the battle for the both sides was that it discouraged slavish respect for tradition, and made it more difficult for future writers to produce 'chinese copies' of classical masterpieces in which exact imitation a virtue and original invention a sin'.

—'The Classical Tradition': P. 288.

2. 'The new comes and takes its place beside the old, and we welcome it. But it is not wise to give up too soon the old for dead. The ways of genius with supposedly, cast-off lifeless forms have to be reckoned with. For, the touch of genius is like the miracle of spring'.

—'Convention And Revolt In Poetry': P. 70.

# కవితా స్వరూపము:

## 'కవి' శబ్దనిర్వచనము :

కవిత్వముయొక్క స్వరూప స్వభావములను చర్చించుటకు ముందు 'కవి' యనగా నెవరో పరిశీలింపవలసియున్నది. వైదిక మంత్రములలో 'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః' అని కవి శబ్దము 'పరమాత్మ' యను అర్థమున కనిపించుచున్నది. క్రమముగా అది 'ఋషి' పరముగా వాడబడినది. 'నానృషిః కురుతే కావ్యమ్', 'కవయః క్రాంతదర్శినః' అను లోకోక్తులు కవి యనగా ఋషియనియే బలపరుచుచున్నవి. రోమన్లు సైతము కవిని ఋషిగానే భావించిరి. వారి భాషలో కవిని వాటిస్ (Vates) అందురు. అనగా Fore-seer, Prophet (ద్రష్ట) అని అర్థము.

కేవలము 'ఋషి' కవి యెట్లు కాగలడను సందేహము కలుగుట సహజము. పూర్వ కాలమున వైదికఋషులే కవులు. ఉపనిషత్తులు, ఋక్కులు వారి కావ్యములు. వాల్మీకి వ్యాసాదులు లౌకికములైన కావ్యములు రచించినవారైనను వారు ఋషులగుటవలన ఋషులే కవులను అభిప్రాయము బలపడినది. ఋషులు దివ్యదృష్టి కలవారు. వారు విచిత్ర భావ ధర్మాంశముల నెరిగి లోకోత్తర వర్ణనలు చేసిరి. లోకోత్తర వర్ణనానిపుణత్వము నవనవోన్మేష శాలినియైన ప్రతిభచేత సముపలభ్యము. ప్రతిభ అందరికి సాధ్యముకాదు. దేవతానుగ్రహ సంపాద్యము. దేవతానుగ్రహము సంపాదించుటకు తపస్సు, యోగము అవశ్యకమైనవి. ఇవి ఋషి కర్మలు. అందువలననే 'నానృషిః కురుతే కావ్యమ్' మొదలైన లోకోక్తు లేర్పడినవి. తెలుగు లాక్షణికుడగు అప్పకవి ఈ అభిప్రాయమునే ఇట్లుద్ఘాటించెను.

> 'ఇమ్మహిని మునులచే వెల
> సమ్మను కావ్యములు 'నానృషిః-కురుతే కా
> వ్య' మ్మను వచనార్థంబే
> సమ్మతి కలివేళ సుకవిజనులే మౌనుల్.'[1]

1. అప్పకవీయము : 48వ పద్యము.

గ్రీకులుకూడ కవితాశక్తి దైవదత్తమనియే భావించిరి. ప్లేటో తన ఇయాన్ (Ion) అను గ్రంథమున కవిముఖతః పలుకునది భగవంతుడే యని అభిప్రాయపడెను. సోక్రటీస్ ఇయాన్‌తో ప్రసంగించిన సందర్భమున గల వాక్యముల గమనింపుడు.

'All good poets, epic as well as lyric, compose their beautiful poems not by art, because they are inspired and possessed'.[1]

కవులకు ఆవేశము నొసగునది ఒకానొక దివ్యశక్తియని గ్రీకుల అభిప్రాయము. మ్యూజ్ (Muse) అను దేవత గ్రీకులదృష్టిలో మన 'సరస్వతి' వంటిది. Muses తొమ్మండుగురు కలరని వారి విశ్వాసము. ఈ Muse దేవతయే కవిని స్పందింపజేయునని ప్లేటో అభిప్రాయపడెను. కవిత్వము దేవతానుగ్రహ సంపాద్యమని ప్లేటో స్పష్టపరిచెను.[2]

ప్లేటో పేర్కొన్న ఇయాన్ అనువాడు ఒకానొక గాయకుడు. ఇతడు మహాకవుల కావ్యములను గానముచేసెడివాడు. భగవంతుడు, కవి, గాయకుడు-వీరి అనుబంధమును ప్లేటో అయస్కాంతాకర్షణపద్ధతితో పోల్చెను. అయస్కాంతము ఇనుపముక్క నాకర్షించును. ఆ యినుపముక్కప్రక్క ఇంకొక యినుపముక్కను చేర్చినచో అదియు ఆకృష్టమగును. అట్లే భగవంతుడు కవులను, కవులు గాయకులను ఆకర్షింతురు.

ఈ దేవతానుగ్రహమునే కొందరు పూర్వజన్మసుకృత మందురు. మరికొందరు 'వాసనా విశేష' మందురు. ఆధునికులు 'స్వతసిద్ధమై'న శక్తి యందురు. సామాన్యులకు లేని ఒకానొక విచిత్రశక్తి యున్నవాడు కవియని ఎల్లరొప్పుకొందురు. 'Poets are unacknowledged Legislators of mankind' అని షెల్లీ అభిప్రాయపడెను.

కవి ఋషితుల్యుడన్నప్పు డొక సందేహము కలుగును. ఋషులు కేవలము ద్రష్టలు గదా! దర్శనశక్తి యున్నంత మాత్రమున కవితాసృష్టి ఎట్లు జరుగును? నిజమే. కేవలము దర్శనశక్తి చాలదు. లోకములోని విచిత్రములయిన వస్తువుల ధర్మాంశముల నెరుగుటయేకాక వానిని ప్రకటించు నేర్పుగూడ ఉండవలయును. అనగా కవికి వర్ణనశక్తి అతిప్రధానమైనది. దర్శనశక్తి మాత్రమే కల వశిష్ఠాది ఋషివర్యులందరు కవులు కాలేదు. వ్యాస వాల్మీక్యాదులు కొందరే కవులు. వాల్మీకి క్రౌంచమిధున వియోగమును చూచుటకుముందు కేవలము ఋషి, అనగా ద్రష్ట. 'మా నిషాద ప్రతిష్ఠాం త్వం' అను శ్లోకము హఠాదుద్గతమైన పిమ్మట ఆయన కవియయ్యెను. భట్టతౌతు డీ యభిప్రాయమును దృష్టిలో నుంచుకొనియే ఇట్లనెను.

1. Plato's Ion.
2. 'Poets are only the interpreters of the Gods, by whom they are severally possessed'.

'దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః'.

'కవి' శబ్దమునకు వ్యుత్పత్తి 'కవతే చాతుర్యేణ కవిః' అనియేకదా!

ఉన్నదానిని వర్ణించుటయేకాక నూత్నసృష్టి చేయుటకు సమర్థుడు కవి. అందుకే గ్రీకులు కవిని పొయటిస్ (Poietes) అనిరి. పొయటిస్ అనగా సృష్టికర్తయని అర్థము.

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే.'

అపారమైన కావ్యజగత్తునందు కవియే బ్రహ్మయని ఆనందవర్ధనుని యభిప్రాయము. అతడు తన యిచ్ఛానుసారముగా లోకమును మార్చును. అతడు శృంగారియగుచో లోకమును శృంగారమయముగా చేయును. వీతరాగుడైనచో లోకమును నీరసముగా ప్రకటించును.

రస్కిన్ అను ఆంగ్లవిమర్శకుడు 'Modern Painters' అను గ్రంథములో వ్యక్తులను అయిదు విధములుగా విభజించెను.

1. Persons who see - వీరిని Seers అనవచ్చు
2. Persons who talk - వీరిని Prophets అనవచ్చు
3. Persons who make - వీరిని Poets అనవచ్చు
4. Persons who think - వీరిని Philosophers అనవచ్చు
5. Persons who do - వీరిని Believers అనవచ్చు

ఈ అయిదుగురిలో మూడవశ్రేణికి చెందినవారినే 'కవులు' అనవచ్చునని రస్కిన్ అభిప్రాయపడెను.. కాని నిశితముగా పరిశీలించినచో ఈ అయిదుశ్రేణులకు చెందినవా రొకచోట చేరినప్పుడే ఒక కవి రూపొందగలడనిపించును. కవికి దర్శనము, ప్రకటనము, సృజనము, ఆలోచనము, విశ్వాసము ఇన్ని శక్తులు సమ్మిళితమై యుండవలయును. వీనిలో దర్శనశక్తి, సృజనశక్తి ప్రబలముగా నుండవలయును.

కవికి వర్తమానమునేకాక గతమును, భవిష్యత్తును దర్శించు నేర్పుండవలయును. త్రికాలవేదిత్వము ఋషులకు సహజము. కవిలో ఋషిత్వమున్నది; కావున అతడు భూత వర్తమాన భవిష్యత్తులను దర్శించగల ప్రజ్ఞాచక్షువు కావలయును. ఈ మూడింటిలో గతమును

తెలిసికొనుట ఘనవిషయము కాదు. వర్తమాన దర్శనము కూడ దుస్సాధ్యము కాదు. భవిష్య ద్దర్శనమే గొప్పది. దానిని కవి సాధింపవలయును[1].

### కవి దృష్టి :

కవి దృష్టికి, సామాన్యుని దృష్టికి ఎంతయో అంతరమున్నది. సామాన్యుడు పలుసార్లు సెలయేటిగలగలలను వినుచునేయుండును. ఇంద్రధనుస్సౌందర్యమును చూచుచునేయుండును. అరవిచ్చిన మల్లెపడుచు కనులలోని బిడియపుబరువు ననుభవించుచునేయుండును. కాని ఆ వినికిడి, ఆ చూపు, ఆ అనుభవము విలక్షణమైనవి కావు. అతిసాధారణమైనవి. ఆ వస్తువులలోనున్న సృష్టివైచిత్ర్యము సామాన్యుని కనుభూతము కాదు. కవి వీనినే విని, చూచి, అనుభవించి ఆనందపరవశుడగును. అతని హృదయము బిగించిన వీణాతంత్రివలె ఝుమ్మని లయబద్ధమైన గీతములను వెలార్చును. పక్షులవేట నెందరు పరికించలేదు. ఒక్క వాల్మీకి మాత్రమే ఒకానొక క్రౌంచద్వంద్వ వియోగమును చూచి శోకించెను. ఆ శోకమునుండియే శ్లోకము పుట్టెను. ఎందరు కిన్నెరసానివాగును చూడలేదు. విశ్వనాథసత్యనారాయణగారికి ఆ చిన్నవాగు కన్నెగా విరహోత్కంఠయైన నాయికగా భాసించి, అతనిచేత కమ్మనికావ్యమును గానము చేయించినది. ఊరిబయట ఒత్తుగా పూచిన గడ్డిపూల నెంద రెన్నిమార్లు చూడలేదు. వర్డ్సువర్తు కవిని అవి కదలించి కమనీయ కావ్యఖండమును పలికించినవి.[2]

సామాన్యునికి ప్రకృతి యథాస్థితిలోనే కనిపించును. కవి కది అపూర్వసౌందర్య తుందిలముగా భాసించును.[3] కవి భావనాచక్షువు మంటికి మింటికి నడుమనున్న సమస్తవస్తువుల పరిశీలించును. గాలిలో తేలిపోవు ఊహలకు కవిలేఖిని నామరూపములు సమకూర్చును. జీవితమను జిలుగుతెరను తొలగించి సత్యమును శోధించగల శక్తి కవుల కున్నది. సామాన్యునికి లతలు లతలే; తరువులు తరువులే. కాని కవి దృష్టిలో అవి నాయికానాయకులు. కుమారసంభవములో కాళిదాస మహాకవికి లతలు, తరువులు ఈ విధముగా కనిపించినవి

1. 'Poets, according to the circumstances of the age and nation in which they appeared, were called, in the earlier epochs of the world, legislators or prophets, a poet essentially comprises and unites both these characters. For he not only beholds intensely the present as it is, and discovers those laws according to which present things ought to be ordered, but he beholds the future in the present.' —'A Defence of Poetry' : Shelly : P. 27.
2. Daffodils : Wordsworth.
3. 'And in many places where there is a shy and subtle beauty that most of us would never see, a poet's eye discovers it and his voice makes plain to us'.
—'The Rudiments of Criticism' : E. A. Grening Lamborn ; P. 11.

'పర్యాప్త పుష్పస్తబక స్తనాభ్యః
స్ఫురత్ ప్రవాళోష్ఠ మనోహరాభ్యః
లతావధూభ్యః తరవోఽప్యవాపుః
వినమ్రశాఖా భుజబంధనాని.'

కాళిదాసు దృష్టికి లతలు వధువులుగా, పుష్ప స్తబకములు వాని వక్షోజములుగా, చిగుళ్ళు పెదవులుగా భాసించినవి. సామాన్యునిదృష్టికి కవిదృష్టి కింత అంతరమున్నది.

### కవి సృష్టి :

ఇంతవరకు వివరించినది కవిదృష్టిలోని వైచిత్రినే. ఇక అతని సృష్టినిగురించి చెప్ప వలసియున్నది. బ్రహ్మసృష్టిలో ఉన్నట్లు కవిసృష్టిలో నియతధర్మము లేదు. కవిసృష్టిలో ముఖము కేవలము ముఖము కాదు. పద్మము; చంద్రబింబము. కనులు కేవలము కనులు కావు. కలువలు; మీనములు. 'ధూమ జ్యోతి స్సలిల మరుత్తుల' సన్నిపాతమైన మబ్బును మెట్లుగా మలచు శక్తి అతని కున్నది. అంతవరకెందుకు, గాలితాకిడితో గగ్గోలుపడి పరుగిడు మబ్బుతునకతో ప్రణయవార్తలను పంపించు మహేంద్రజాల మతని కబ్బినది. అమృతము, అప్సరసలు, స్వర్గము, ఆకాశగంగ, మిన్నేటిలో విప్పారిన పసిడితామరలు, పసిడితామరలలో పరిమళవంతమైన మధువు, పాలవెల్లి, ముప్పదిమూండ్లు దాటని నిత్యయౌవనులైన దేవతలు, మేరుపర్వతము ఇత్యాదులన్నియు కవిసృష్టికి చెందినవి. సుఖదుఃఖములకు సంకేతములుగా అతడు స్వర్గనరకములను సృష్టించెను. దేవతలలోసైతము నొకరిని 'కాంచనాంబరుని'గా జేసెను. ఇంకొకరిని 'చర్మాంబరుని'గా జేసెను. ఒక్కొక్కమాటు కవిసృష్టి బ్రహ్మసృష్టిని గూడ మించును. బ్రహ్మసృష్టిలో సుఖదుఃఖములు రెండుండగా కవి తన సృష్టిలో కేవలము సుఖమునకే చోటిచ్చెను.[1]

### కవి అనుభూతులు :

ప్రకృతిదర్శనమువలన కవిహృదయములో కొన్ని అనుభూతు లుద్భిన్నములగును. వానిని ప్రకటించుటయే అతని ధర్మము. ఈ విధముగా భావించినచో ఎల్లరు కవులేయను ఆభాస కలుగును. ఏలయనగా అందరును అంతయో, యింతయో అనుభూతి కలవారే. దానిని ఎదుటి వాని మనసున కెక్కునట్లుగా వివరించు శక్తి గూడ కొందరి కుండును. అంతమాత్రముననే ఈదృశులందరు కవులుకారు. ఇట్టివారి అనుభూతులకన్న కవి అనుభూతులు నిశితమైనవి,

1. 'నియతికృత నియమరహితాం, హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి; మాదధతీ భారతీ కవేర్జయతి'.
—కావ్యప్రకాశము : ప్రథమోల్లాసము : మమ్మటుడు.

లోతైనవి, విశాలమైనవి.[1] వానిని సముచిత పదజాలమున వ్యక్తముచేసి సహృదయుని మనస్సులోనికి పూసలలో దారము నిమిడించినట్లెక్కించుశక్తి కవికిమాత్రమే యుండును. కవికి, తదితరునికి గల తారతమ్యమును లాంబర్న్ (Lamborn) ఇట్లు వివరించెను.

'To speak in metaphor, the senses of their (poets) soul are more numerous and more acute, and their voices have a greater compass than is in common men.'[2]

వాల్మీకి రామాయణమున రాముని విరహావస్థను సూచించుటకు వాల్మీకి యెగసిన యెత్తులు విస్మయావహమైనవి.

'ఏష పుష్పవహో వాయు స్సుఖస్పర్శో హిమావహః
తాం విచింతయతః కాంతాం పావకప్రతిమోపమః.'[3]

విరహము లోకమున పలువు రనుభవించు వ్యథయే. విరహులకు మలయమారుతాదులు సంతోషమునకు బదులుగా సంత్రాసము కలిగించును. ఇది అనుభూతివిశేషము. ఈ యనుభూతి యెల్లరిలోనున్నను దానిని వ్యక్తముచేయుటకు వారందరును సమర్థులు కారు. 'సురభిళము, శీతలము, స్పర్శసుఖము అయిన మలయమారుతము అగ్నిహోత్రమువలె నున్నది' అనుటలో ఆ యనుభూతి ఎంత నిశితమైనదో తెలియుచున్నది. దానిని వ్యక్తముచేయుటలో గూడ అంతటి వైశిత్యము కనిపించుచున్నది. సామాన్యుని కీయనుభూతి కలిగినను ఇంత నిశితముగా, లోతుగా దానిని వ్యక్తీకరించలేడు. ఇట్టి శక్తి కవికే యుండును.

ఇట్టి యనుభూతుల నెంత యెక్కువగా వ్యక్తీకరించినచో ఒకానొక దంతటి ఉత్తమ కవి కాగలుగును. వస్తువైవిధ్యమును దర్శించుటవలన అనుభూతివైవిధ్య మేర్పడును. వర్ణనలలో అనుభూతిశబలత్వ మున్నచో సహృదయలోక మిమ్మడి ముమ్మడి ఆనందమును పొందగలుగును.[4]

1. 'There are degrees of expressive power; degrees of vividness, of coherence, of complexity, an electric current circulates in all of us, but the poets are men of terrific voltage'.

—'The Idiom Of Poetry' : Frederic A. Pottle : P. 65.

2. The Rudiments of Criticism : P. 10.
3. వాల్మీకి రామాయణము : కిష్కింధాకాండము : ప్ర. సం. 52 శ్లో.
4. 'The greatest poet is he who has felt the most of all the things that more the hearts of men and felt them most deeply, and can touch the most hearts to sympathy'.

—'The Rudiments of Criticism' : P. 11.

### కవి లోకమున కతీతుడా ?

కవిని ఋషితో పోల్చినంత మాత్రమున, అతనిని అపరబ్రహ్మ యన్నంత మాత్రమున, లోకమున కతీతుడని అర్థము కాదు. భావనాప్రపంచమున అతడు బ్రహ్మయగునుగాని నిత్య నైః త్రిక జీవితమున కాదు. మానవుడుగా మహోన్నతస్థాయి నందుకొన్న వ్యక్తియే మహాకవి కాగలడు. ఉత్తమ సంస్కారముగల హృదయమే ఉదాత్తభావన చేయగలదు. నైతికముగా నిష్కళంకజీవనము గడపినవాడే వ్యంగ్యముగానైననుసరే లోకమునకు సందేశ మందించుటకు సమర్థుడగును. ఒకవైపు తనదేశము స్వాతంత్ర్య సమరాగ్నిలో దూకి ఆత్మార్పణముచేయు చుండగా ఇంటితలుపులు మూసుకొని యిరుకుగదిలో దాగియున్న భీరువు స్వాతంత్ర్యగీతము లాలపించుటకు సమర్థుడు కాడు. అట్టి ప్రతిభ యున్నను అత డందు కర్హుడు కాడు. విద్వత్త, నైతికసత్త్వము రెండు కలసియున్న ప్రతిభాశాలియే ఉత్తమకవి.[1] ఈ అభిప్రాయమునే పాట్ల్ (Pottle) ఇట్లు విశదీకరించెను

'Not all good and wise men are poets; not all poets are good and wise men; but a good and wise man who is a poet is a particularly valuable kind of poet.[2]'

### కవిత్వావతరణము :

కవిత్వమును నిర్వచించి దాని స్వరూపస్వభావములను నిరూపించుటకుముందు అది యెప్పుడు ఎటుల అవతరించినదో, మానవజీవితమున దాని ప్రాశస్త్యమేమియో వివరింతును. లలితకళలలో అగ్రపీఠము కవిత్వమునకే యున్నది. గానము విన్నంతసేపు, నాట్యము కనినంతసేపు మాత్రమే సామాజికునియందు రసనిష్పత్తి కలుగును. పైరెంటిలో లేని స్థిరత్వము కవిత్వమున కున్నది. దీనిలో రసచర్వణమునకు వీ లెక్కువగానున్నది. చిత్రశిల్పములలో శబ్దము లేదు. సుస్పష్టమైన అర్థవ్యక్తి లేదు. కవిత్వములో ఈ రెం డుండుటవలన ఇది వాని కన్న విలక్షణమైనది. కవిత్వ మక్షరకళ. 'బ్రహ్మ' మక్షరమే. కవిత్వమువలన సామాజి కునికి కలుగు రసానందము బ్రహ్మానంద సబ్రహ్మచారి. అందుకే ఋషులు, వేదాంతులు సైతము నిగూఢ భావబోధనకు కవిత్వమును సాధనముగా స్వీకరించిరి.

1. 'But if a man highly gifted with the child like faculty of expressiveness can retain it while he acquires intellectual and moral profundity, his intuitions will naturally be more rich, complex, and valuable than those coming from a man of inferior intellectual and moral grasp.'

—The Idiom of Poetry : P. 67.

2. The Idiom of Poetry : P. 67.

నిజమైన కవిత్వమునకు 'నిన్ననేడులు' లేవు. అట్లే 'రేపు' గూడ లేదు. సూర్యుని చూపులవలె, తెమ్మెర పిచోపులవలె ఇది అనంతము. ఇంతకు, కవిత్వ మెప్పుడో ఒకప్పుడు పుట్టియుండవలెనుగదా ! కవిత్వావతరణమును గూర్చి ప్రఖ్యాతాంగ్లకవి టి. యస్. ఇలియట్ అభిప్రాయ మిది.

'Poetry begins, I dare say, with a savage beating a drum in a jungle, and it retains that essential of percussion and rhythm; hyperbolically one might say that the poet is older than other human beings.'[1]

ఇలియట్ చమత్కారముగా చెప్పినను సత్యదూరముగా చెప్పలేదు. కవిత్వము సృష్టిలో ఎంత పురాతనమైనదో వ్యక్తపరచినాడు. తళుక్కున ఒక మెరుపు దూసికొనిపోయినప్పుడు, ఒక పుష్కలావర్తకము మదగజమువలె ఘీంకరించినప్పుడు. ఒక మలయపవనవీచిక అలస గమనముతో వచ్చి తనువునిండ చందనము రాసిపోయినప్పుడు, ఆది మానవుని ఆత్మ పాల కెరటమై పరవళ్లుద్రొక్కినది. అప్పుడే కవిత్వమునకు నాంది జరిగినది. అట్టి స్వాదు సమయములలోనే తూర్పున వేదఋక్కులు తొంగిచూచినవి. పడమటింట సామ్స్ (Psalms) పలికినవి.

అత్యంత ప్రాచీనకాలముననే మంత్రద్రష్టల ముఖతః గభీరభావాత్మకమైన కవిత్వ ముద్గమించినది. ఒక మంత్రమును పరికింతము;

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి '[2]

(రెండు పక్షులు స్నేహముతో ఒకే చెట్టుపైన నున్నవి. ఒక పక్షి ఆ చెట్టుమీది తీయని పండును తినుచున్నది. రెండవది తినక దిక్కులు చూచుచున్నది.)

ఈ రెండు పక్షులు వట్టి పిట్టలు కావు. జీవేశ్వరులకు సంకేతములు. ఇటీవల చలామణిలో నున్న మిస్టిసిజము (Mysticism) అను కవితా సిద్ధాంత మీ మంత్రములో వ్యజ్యమానమగుచున్నది. పాశ్చాత్యదేశములలో అతి ప్రాచీనమైన గ్రీకు భాషలో అత్యంత పురాతన కాలముననే ఇట్టి కవిత్వము వెలసినది. Psalms of David లో ఉదాత్త కవిత్వసంపద కలదు. Psalms అనగా గేయములు. ఇవి ఛందోబద్ధములని వేరుగా చెప్పనక్కరలేదు. ఛందోబద్ధతయే వీనికి కావ్యత్వమును తెచ్చిపెట్టలేదు. వీనిలో చక్కని కల్పనాశక్తి, భావనా పటిమ ప్రదర్శింపబడినవి. సొగసైన అలంకారములు కై సేయబడినవి. దేవిడ్ ఒక Psalm లో 'Of the beastes

1. The Use of Poetry And The Use of Criticism (వ్యాసము). : T. S. Eliot.
2. ఋగ్వేదము : ప్రథమమండలము : 168 వ సూక్తము.

joyfulness and hills leaping' అని అభివర్ణించెను. కొండలు గంతులువేయుట వాస్తవము కాదు. కల్పనా ప్రపంచమునకు సంబంధించినది.

ఉద్వేగమునుండియేకాక కరుణలోనుండి సైతము కవిత్వ మవతరించినదనవచ్చును. వాల్మీకిని మనీషిగా మనస్విగా ఎత్తిచూపినది క్రౌంచమిధున వియోగమే. ఆ మహర్షి మనస్సులో జాలువారిన జాలినుండియే మహాకావ్యము రూపుదిద్దుకొన్నది.[5] 'శోకః శ్లోకత్వమాగతః'.

సాహిత్య ప్రక్రియ లీనాడు శాఖోపశాఖలుగా విస్తరిల్లినవి. నాటకము, నవల, కథానిక, వ్యాసము ఇత్యాదులు వానిలో పేర్కొనదగినవి. ఈ యన్నిటిలో కవిత్వ మత్యంత సనాతన మైనది. అందుకే మానవ సమాజముయొక్క శైశవదశలో ప్రతి రచయిత కవియే యని షెల్లీ యనెను.[1]

## కవిత్వము నిత్యనూతనము :

కవిత్వ మెంత పురాతనమైనదో అంత అధునాతనమైనది. సాంకేతికముగా, వైజ్ఞానికముగా పురోభివృద్ధి నందుచున్న యుగములో ఊహలతో జీవించు కవిత్వము బ్రతుకగల్గునాయను సందేహమును కొందరు ప్రకటించిరి. కవిత్వము ప్రధానముగా మానవుని అనుభూతులపై ఆధార పడియున్న కళ. అందుచేత మానవు డున్నంతకాలము కవిత్వమునకు క్షతిలేదు. భౌతిక ప్రపంచమున ఎన్ని విచిత్రములైన మార్పులు వచ్చినను మానవునిలోని మౌలిక మనఃప్రవృత్తులలో చెప్పుకోదగిన పరివర్తనము లేదు. రాగద్వేషములు, పాపపుణ్యములు, అధికారవాంఛ, కీర్తికాంక్ష, ప్రకృతిప్రీతి, దైవభీతి నాడెటులో నేడటులే మానవుని మనస్సును పెనవేసికొని యున్నవి. ఇవి ఉన్నన్నినాళ్లు కవిత్వముండును. మానవునిలో 'వాసనలు' నశించిననాడు కవిత్వమేకాదు - ఏ కళయును నిలువలేదు. కవిత్వమును పురాతనము (Primitive) అనుకొనుటలోనే దోషమున్నది. ఋక్కులనుండి 'స్పుత్నిక్కుల' కాలమువరకు ఇది సురసరిత్తువలె ప్రవహించుచున్నది. వాల్మీకి రామాయణమునకు, కాళిదాసు శాకుంతలమునకు, హోమరు 'ఒడిస్సీ'కి, షేక్స్పియరు 'హామ్లెట్'కు ఈనాటికిని విలువ తగ్గిపోలేదు. ఇవి ప్రపంచ భాషలలో పరివర్తితములగుచు అనుదినము పఠితల సంఖ్యను పెంచుచున్నవి. అందుకే కవిత్వ మెంత పాతదో అంత క్రొత్తదని యంటిని. ఇది సూర్యునివంటిది. సూర్యు డెంత సనాతనుడో అంత వినూతనుడు. ప్రతి ప్రభాతమునందు భానుమూర్తి పదిపదునారేండ్ల పడుచువానివలె కనిపించి లోకమును ఆనందపరుచుటలేదా? లోచూపున్నవారికి కవిత్వము సూర్యబింబమువలె అభినవముగా కనిపించును. క్రొత్తదనమన్నది చూపులో ఉండవలెగాని వస్తువులోకాదు. 'వందలాది' కవులు వాడినను శబ్దములు పాతవడలేదు. సూర్యుని వెల్తురు నెంతమంది ఉపయోగించికొన్నను మాసిపోయెనామరి?

1. 'In the infancy of society every author is necessarily a poet, because language itself is poetry, and to be a poet is to apprehend the time and the beautiful'.
—'A Defence of Poetry': P. 26.

ప్రతిదినము మనము చూచు శబ్దార్థములే కావ్యమునందు ప్రయోగింపబడినప్పుడు వసంత కాలమునందలి తరువులవలె శోభాయమానముగా అభినవముగా కనిపించునని ఆనందవర్ధనుడనెను.[1] కవిత్వము ప్రపంచములోని గుప్త సౌందర్యముపైగల మేలిముసుగును తొలగించునని షెల్లీ యనెను.[2] మనము నిత్యము చూచి ఉపేక్షవహించిన వస్తువులలోని గొప్పతనము నొక్కొక్క ప్పుడు కవిత్వము వ్యక్తపరుచును.[3]

## కవిత్వనిర్వచనము :

కవిత్వమును నిష్కర్షగా నిర్వచించుట సుసాధ్యముకాదు. అంతమాత్రమున అసాధ్యము కూడ కాదు. సేంట్ ఆగస్టిన్ (St. Augustine) ఒక సందర్భమున ఇట్లనెను. 'If not asked, I know; If you ask me, I know not.' కవిత్వ నిర్వచనముపట్ల ఇది చక్కగా వర్తించును. సహృదయు లెల్లరకు కవిత్వ మాస్వాద రమణీయముగానే యుండును. కాని తజ్ఞు లెల్లరు దానిని గీటుగీసి నిర్వచించలేరు. కవితాత్మ అమృతము వంటిది. అమృత మిట్లుండ వచ్చునని ఊహించి అభివర్ణించినట్లే కవిత్వమును నిర్వచించుటయు జరిగినది.

కవిత్వమునుగురించి గంపెడు మతభేదములు, పుట్టెడు నిర్వచనములు ఎందుకు పుట్టిన వను శంకకు తావున్నది. కవిత్వమును పఠించి శ్రవణించి ఆనందించిన సహృదయుల అను భవము లన్నియు సమానములే. ఆ ఆనందానుభూతిని ప్రకటింపవలసినప్పుడు, నిర్వచింప వలసివచ్చినప్పుడు, వైవిధ్యము వచ్చిపడినది. ఆనందానుభూతి శబ్దమువలన కలిగినదని కొంద రనిరి. కొంద రలంకారములవలన అనిరి. మరి కొందరు రీతివలన, ఇంకకొందరు రసమువలన అనిరి. కావున కవిత్వమునుగూర్చి ప్రాచ్యులు, పాశ్చాత్యులు చేసిన నిర్వచనములను పరిశీ లించుట సమంజసము. తొలుత సంస్కృతలాక్షణికుల నిర్వచనములను పొందుపరుతును.

## సంస్కృతలాక్షణికుల సిద్ధాంతములు :[4]

కవిత్వమునుగూర్చి సిద్ధాంతములు చేసినవారిలో సంస్కృతలాక్షణికులు కనిష్ఠికాధిష్ఠితులు. సంస్కృతభాషలో వెలసిన అలంకారశాస్త్రములు అసంఖ్యాకములు. తొలుత, భరతుడు మొదలు

1. 'దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్ సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః'.
—ధ్వన్యాలోకము : చతుర్థోద్ద్యోతము.

2. 'Poetry lifts the veil from the hidden beauty of the world, and makes familiar objects be as if they were not familiar.' —'A Defence of Poetry': P. 81.

3. 'One chief element of Poetry is its revealing power. It opens our eyes to sensuous beauties and spiritual meanings in the worlds of human experience and of nature to which otherwise we should remain blind.'
—'An Introduction To The Study of Literature': Hudson.

4. ఈ విషయమును గూర్చి వ్రాయుటలో సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహము అధికముగా ఉపకరించినది.

కొని విశ్వనాథునివరకుగల ముఖ్యలాక్షణికులు కవిత్వస్వరూపము నెటుల నిర్వచించిరో వివరించుటకు ప్రయత్నింతును. తరువాత పాశ్చాత్యుల సిద్ధాంతముల నుటంకింతును.

### భరతుడు :

దాదాపు రెండువేల సంవత్సరముల క్రితమే భరతుడు నాట్యశాస్త్రమును రచించెను. ఈ గ్రంథము ప్రధానముగా రూపకములగురించి, రూపకభేదములగురించి ఉద్దేశింపబడినది. భరతుడు దృశ్యకావ్యమునకు శ్రవ్యకావ్యమునకు భేదము పాటింపలేదు. రెంటిని కావ్యము క్రిందనే పరిగణించెను. నాట్యమునకు కావ్యమునకు ఇతరభేదము పాటించినట్లు ఈ క్రింది ఉదాహరణమువలన స్పష్టమగును.

'ఉపమా రూపకంచైవ దీపకం యమకం తథా
అలంకారాస్తు విజ్ఞేయాః చత్వారో నాటకాశ్రయాః.
యత్కించి త్కావ్యబంధేషు సాదృశ్యే నోపమీయతే
ఉపమానామవిజ్ఞేయా గుణాకృతి సమాశ్రయా'.[1]

భరతుడు నాట్యము, కావ్యబంధము అను పదములు సమానార్థమున ఉపయోగించినాడన్నది పై యుదాహరణమువలన స్పష్టము. అతని దృష్టిలో కావ్యమనగా ఇది.

'మృదులలితపదార్థం గూఢశబ్దార్థహీనం
బుధజనసుఖయోగ్యం బుద్ధిమన్నృత్యయోగ్యం
బహురసకృతమార్గం సంధిసంధానయుక్తం
సభవతి శుభకార్యం నాటకప్రేక్షకానామ్.[2]

కావ్యము మృదుపదార్థములతో కూడుకొని ప్రసాదగుణమయముగా నుండవలెనని భరతుని అభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. ఇతని యభిమతమున కావ్యశరీర మితివృత్తమే. 'ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్' అని యితడనెను. కావ్యశరీర మితివృత్తమైనను దాని సౌందర్యహేతువు రసమని స్పష్టపరిచెను. ఇతడు రసప్రాధాన్యవాది.

### భామహుడు :

భామహుడు 'శబ్దార్థౌ సహితౌ కావ్యమ్' అని నిర్వచించెను. అనగా శబ్దార్థములతో కూడుకొనియున్నదే కావ్యమని అర్థము. 'సహిత' శబ్దమునకు రెండర్థములు చెప్పవచ్చును. ఒకటి : సహితమనగా సమస్తము (కలసియున్నది), రెండవది : 'హితేనసహపరస్పరం

1. నాట్యశాస్త్రము : 16 వ అధ్యాయము
2. నాట్యశాస్త్రము : 17 వ అధ్యాయము : 128.

వర్తేతే' యని. అనగా శబ్దార్థములు పరస్పరోపకారకములై వర్తిల్లుట. శబ్దార్థమయమైన కావ్యశరీరమున కలంకారములు సౌందర్యహేతువులని ఇత డభిప్రాయపడెను.

'సైషా సర్వత్ర వక్రోక్తి రనయార్థో విభావ్యతే'[1]. కవి ఏది చెప్పినను వక్రోక్తి మార్గమున చెప్పునని ఇతడు సిద్ధాంతీకరించెను. అనగా హృదయరంజనార్థ మొకానొక అసాధారణ ప్రతిభతో చెప్పునని తాత్పర్యము. ఆలంకారికులెల్ల రామోదించిన స్వభావోక్తి నితడు త్రోసివేసెను వక్రముగా పలికినప్పుడే ఆనందము కలుగునని వ్యక్తపరచెను. సత్యనిష్ఠములైన ఇతిహాసాదులలో స్వభావోక్తి యుండవచ్చునని, తద్వ్యతిరిక్తములైన ఆనంద ప్రధానములైన కావ్యములలో మాత్రము వక్రోక్తి యుండవలెనని ఇతని సిద్ధాంతము. తరువాతి లాక్షణికుడైన ఆనందవర్ధను డీయభిప్రాయము నొకచో ఇట్లు బలపరిచెను.

'నహి ఇతివృత్త వర్ణనామాత్రాదేవ
కవే రాత్మపదలాభః ఇతిహాసాదేవ తత్సిద్ధేః'[2].

అనగా ఇతివృత్తవర్ణనముచేతనే ఒకడు కవి కాలేడు. ఎందుచేతననగా ఆ పని ఇతిహాసాదులే చేయుచున్నవి. కావ్యమన్నప్పుడు దానిలో ఇతిహాసాదులలోలేని వైలక్షణ్య మవసరము అదియే భామహుడు ప్రతిపాదించిన వక్రోక్తి. భామహుడు ప్రధానముగా అలంకార ప్రాధాన్యవాది. రసమునుగూడ ఇతడు రసవదలంకారమనుపేర అలంకారముగనే పరిగణించెను.

**దండి :**

దండి కావ్యము నీరీతిగా నిర్వచించెను.

'తైః శరీరంచ కావ్యానా మలంకారాశ్చ దర్శితాః
శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ.'[3]

దండి దృష్టిలో కావ్యమనగా ఇష్టార్థము (రమణీయార్థము) చేత కూడుకొనియున్న పదావళియే. ఇతడు కావ్యశరీరమునకు గుణములే ప్రధానములని నిర్వచించెను. లోకమునందు స్త్రీ పురుషులకు సౌందర్యమును గూర్చునవి గుణములైనట్లు కావ్యశరీర శోభాహేతువులుగూడ గుణములేయని ఇత డభిప్రాయపడెను. ఇతడు గుణప్రాధాన్యవాది. భామహుడు శబ్దార్థోభయమును కావ్యశరీరమని చెప్పగా ఇతడు కేవలము శబ్దమునే (రమణీయార్థభూషితమైనది) కావ్యశరీర మనెను. వీరిరువురును కావ్యాత్మనుగురించి విచారించలేదు.

1. భామహాలంకారము : ద్వితీయ పరిచ్ఛేదము.
2. ధ్వన్యాలోకము :
3 కావ్యాదర్శము : ప్రథమ పరిచ్ఛేదము : 10.

**వామనుడు :**

వామనుడు 'కావ్యమ్గ్రాహ్యమలంకారాత్' అని సూత్రీకరించెను. దీనికి వృత్తి ఇది; 'కావ్యమ్ ఖలు గ్రాహ్యమ్ ఉపాదేయం భవతి అలంకారాత్. కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయోః వర్తతే'.[1] అనగా గుణాలంకారయుక్తమైన శబ్దార్థము కావ్యమని యితని అభిప్రాయము. అలంకారమననేమియో ఇత డిట్లు విశదీకరించెను. 'సౌందర్యమలంకారః' దీనికి వృత్తి :- 'అలంకృతిః అలంకారః, కరణవ్యుత్పత్త్యా పునః అలంకారశబ్దః అయం ఉపమా దిషు వర్తతే.' వామనుడు భామహుని అలంకారసిద్ధాంతమును, దండి గుణసిద్ధాంతమును తనలో సమన్వయించుకొనెను. పైగా తొలుదొల్త కావ్యాత్మవిచారము చేసినదీతడే. 'రీతిరాత్మా కావ్యస్య' యని ఇతని సిద్ధాంతము. శరీరమున కాత్మ యెట్లు ప్రధానమో కావ్యమునకు రీతి యట్టిదనెను. 'విశిష్టపదరచనా రీతిః' అని రీతిని ఇతడు నిర్వచించెను. శ్లేషప్రసాదాదులైన పదిగుణముల నీతడు ప్రవేశపెట్టెను. గుణసమూహమే రీతియనెను. 'కావ్యశోభాయాః కర్తారో గుణాః' అనెను. 'తదతిశయహేతవః అలంకారాః' అనెను. అనగా గుణములచేత కల్పింపబడిన శోభను అతిశయింపజేయునవి అలంకారములని స్పష్టపరిచెను. గుణములగొప్పతనము నీతడు క్రిందివిధముగా పొందుపరిచెను.

'యువతే రివ రూప మంగకావ్యం
స్వదతే శుద్ధగుణం తదప్యతీవ
విహితప్రణయం నిరంతరాభిః
సదలంకార వికల్పకల్పనాభిః
యదిభవతి వచశ్చ్యుతం గుణేభ్యో
వపురివ యౌవన మంగనాయాః
అపిజనదయితాని దుర్భగత్వం
నియతమలంకరణాని సంశ్రయంతే.'[2]

అనగా-యువతిరూపమువలె గుణోపేత కావ్యమే రుచిరముగా నుండును. ఆ రూప మొకవేళ అలంకారమయమై ప్రణయభరితమగుచో ఇతోధికముగా భావించును. కావ్యము గుణ హీనమైనచో యౌవనహీనమైన అంగన శరీరమువలె దుర్భగమగునని తాత్పర్యము. ఇతడు గుణముల ప్రాధాన్యము నుగ్గడించినను రీతి కావ్యమున కాత్మయని సిద్ధాంతీకరించెను కావున రీతి ప్రాధాన్యవాది.

---

1. కావ్యాలంకారసూత్రవృత్తి : 1 వ అధికరణము.
2. కావ్యాలంకారసూత్రవృత్తి : 3 వ అధికరణము.

### ఆనందవర్ధనుడు :

ఆనందవర్ధనుని మతానుసారము రసానుభూతియే కావ్య పరమలక్ష్యము. కావ్యమునకు ఆత్మ ధ్వనియని ఇతడు సిద్ధాంతీకరించెను. ధ్వన్యాలోకములోని మొదటి కారికలోనే ఈ సిద్ధాంతము స్థాపింపబడినది.

'కావ్యస్యాత్మా ధ్వని రితిబుధైః
యస్సమామ్నాత పూర్వః.'

ఇంకను 'తస్యహి ధ్వనేః స్వరూపమ్ సకలసత్కవి కావ్యోపనిషద్భూతమ్ అతిరమణీయమ్' అనెను. అనగా మహాకవుల కావ్యములలో ధ్వని ఆత్మాయమానమని ఇతని అభిప్రాయము. వ్యంగ్యార్థముయొక్క ప్రాధాన్యము నిత డీరీతిగా ఉగ్గడించెను.

'ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనాం
యత్తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్యమివాంగనాసు.'

అంగనల శరీరమందు అవయవభిన్నమైన ఒకానొక లావణ్యము భావించినట్లు మహాకవుల వాణియందు వాచ్యార్థమునకు భిన్నమైన వ్యంగ్యార్థము ఉండనేయుండునని పై శ్లోకములలోని భావము.

ఈ ధ్వని-వస్త్వలంకారరసరూపమని ఆనందవర్ధనుడు. పేర్కొనెను. ఈ మూటిలో రసధ్వనియే శ్రేష్ఠమనెను.

'కావ్యస్యాత్మా సఏవార్థః తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వ వియోగోత్థ శ్శోక శ్లోకత్వ మాగతః.'[1]

రసధ్వనియే కావ్యమున కాత్మ. ఆదికవియొక్క క్రౌంచద్వంద్వ వియోగజనితమైన శోకమే శ్లోకత్వ మందినది.

మహాకవి యెవరను ప్రశ్నకు ఆనందవర్ధనుని సమాధానమిది. 'వ్యంగ్యవ్యంజకాభ్యామేవహి సుప్రయుక్తాభ్యాం మహాకవీనాం మహాకవిత్వాభః నతు వాచ్యవాచకచారుత్వమాత్రేణ.'[2]

'ప్రసిద్ధిశ్చ ఇయమస్తి ఏవ విదగ్ధవిద్వత్పరిషత్సు యదభిమతతరం వస్తువ్యంగ్యత్వేన ప్రకాశ్యతే సారభూతోహ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరామేవ శోభా మావహతి.'[3]

1. ధ్వన్యాలోకము : ప్రథమోద్యోతము.
2, 3. ధ్వన్యాలోకము : చతుర్థోద్యోతము

అనగా వాచ్య వాచక చారుత్వ మాత్రముచేత మహాకవు లనిపించుకొనరు. వ్యంగ్య వ్యంజకములచేత మాత్రమే యనిపించుకొందురు. కావ్యమునకు సారభూతమైన వస్తువు (రసము) స్వశబ్దముచేత చెప్పబడక వ్యంగ్యముగా చెప్పబడినప్పుడే కావ్య మత్యంతముగా శోభించును. శోకము వర్ణించుపట్టున ఆ శోకశబ్దమునే ఎన్నిసార్లు ప్రయోగించినను రసవ్యక్తి కలుగదు. దానికి తగిన సాత్త్వికాది భావములను సముచిత శబ్దములలో తొడిగినపుడే సొగసు. అప్పుడే

ఆనందవర్ధనుడు, భామహ, దండి, వామనుల కావ్యసిద్ధాంతములను సమన్వయము చేసెను. ఇతడు తనకు పూర్వీకుల అలంకార, గుణ, రీతిసిద్ధాంతములను సహేతుకముగా తన ధ్వని సిద్ధాంతమున కంగభూతములుగా స్వీకరించెను. మరియు భరతుని రససిద్ధాంతమునే 'రసధ్వని' రూపమున ప్రతిష్ఠించెను. రసముతోపాటు వస్త్వలంకారములకుగూడ కావ్యమున సముచిత ప్రాధాన్య మిచ్చుట ఇతని సమన్వయధోరణికి నిదర్శనము.

ఆనందవర్ధనుని కావ్యశరీరము శబ్దార్థోభయమే. 'సహృదయ హృదయాహ్లాది శబ్దార్థమ యత్వమేవ కావ్యత్వమ్'.[1] మరియు కావ్యము 'లలితోచితసన్నివేశచారు' వనెను. కొందరు ధ్వన్యాచార్యుని మతమున కావ్యము శబ్దవిశేషమే యను అభిప్రాయముతో క్రింది పంక్తులను ధ్వన్యాలోకమునుండి యెత్తిచూపిరి.

'తత్రవా చారుత్వాతిశయ విశిష్టార్థప్రకాశనలక్షణే ప్రయోజనే కర్తవ్యే యది శబ్ద స్యాముఖ్యతా తదా తస్యప్రయోగే దుష్టత్రైవస్యాత్; నచైవమ్.' దీనినిబట్టి చారుత్వాతిశయ విశిష్టమైన అర్థమును ప్రకాశింపజేయు శబ్దవిశేషమే కావ్యమని స్పష్టమగుచున్నది. ఏది యెట్లు న్నను భరతుడు ప్రధానముగా రససిద్ధాంతమును దృశ్యకావ్యపరముగా నిరూపించగా ఆనంద వర్ధనుడు దానిని దృశ్యశ్రవ్యోభయసాధారణమని సిద్ధాంతీకరించి అలంకారికలోకమున క్రొత్త తెన్ను త్రొక్కను. రసము వాచ్యరూపముగా కాక వ్యంగ్యరూపముగా నుండవలయుననియు, అదియే (రసధ్వనియే) కావ్యత్మయనియు సిద్ధాంతీకరించి తరువాతి కాలమున అనేకాలంకారికు లకు మార్గదర్శకుడయ్యెను.

**మహిమభట్టు :**

ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునకు ఖండనముగా ఇతడు వ్యక్తివివేక మను గ్రంథము వ్రాసెను. ఇతడు ఆనందవర్ధనుడు ప్రత్యేకించి పేర్కొన్న వ్యంజనావృత్తి అక్కరలేదనెను. ధ్వనులన్నియు అనుమానములోనే అంతర్భవించు ననెను. ఇతనిది కావ్యానుమితిసిద్ధాంతము. లక్షణావృత్తి నిత దనుమానములోనే గణించెను. రసప్రాధాన్యము నంగీకరించినను వ్యంగ్య మవసరములేదని, అది యనుమానములోనే అంతర్భవించునని యనెను. ఇతని దృష్టిలో కావ్యశరీరము శబ్దార్థోభయమే.

1. ధ్వన్యాలోకము : ప్రథమోద్యోతము.

**కుంతకుడు :**

ఇతడు 'వక్రోక్తిః కావ్యజీవితమ్' అను సిద్ధాంతమును స్థాపించెను. భామహుని వక్రోక్తినే యితడు విశేషముగా పెంపుచేసెను. ఇతడు కావ్యము నీ విధముగా నిర్వచించెను.

'శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని
బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి'.[1]

అనగా శబ్దార్థమయమే కావ్యము. వక్రత్వముతో కూడుకొన్న సహృదయ హృదయాహ్లాదకరమై రచనయే కావ్యము. వక్రోక్తి వినా కావ్యము శోభించదని ఇత డభిప్రాయపడెను. వట్టి శబ్దచమత్కృతి నీతడు నిరసించెను. వక్రోక్తి యనగా అర్థవైచిత్ర్యము. వక్రోక్తి కిత డిచ్చిన నిర్వచనము 'విచిత్రగుణాలంకారసంపదాం పరస్పరస్పర్థాధిరోహః'. అనగా విచిత్ర గుణములు, అలంకారములు అహమహమికతో కావ్యమునందు వ్యక్తము కావలెనని ఇతని అభిప్రాయము. అట్లు వ్యక్తీకరించునదే వక్రోక్తి యనెను. ఈ వక్రోక్తి ఎన్నిరీతులుగా సాధ్యమో ఇట్లు వివరించెను.

1. వర్ణ విన్యాసవక్రత : శబ్దాలంకారములు; అనుప్రాసాదులు.

2. పదపూర్వార్థవక్రత : పదపూర్వమనగా ప్రాతిపదిక. ఉ॥ 'రామ' మొదలైనవి. 'రామోస్మినర్వంసహే' అనుశ్లోకపాదము నీసందర్భమున కుంతకుడు వివరించెను. ఇందులో 'రామ' శబ్దము నెందు కుపయోగించెనన్నది ప్రశ్న. 'రామ' అనునది పద పూర్వార్థము. సమస్త శబ్దరాశి (ప్రత్యయములుతప్ప) పదపూర్వార్థమే. కవి యొక్క ప్రత్యేకశబ్దమే ఏల ఉపయోగించెనని పఠితకు జిజ్ఞాసకలుగుట సహజము. ఇదియే పదపూర్వార్థవక్రత. ప్రత్యయములకన్న ప్రాతిపదికయే ప్రధాన మను భావము దీనివలన ద్యోతకమగును.

3. పదపరార్థవక్రత : అనగా ప్రత్యయసంబంధి వక్రత. ఒకానొక విభక్తిప్రత్యయము గాని, బహువచనప్రత్యయము గాని, ఒకానొక సందర్భమున ఎందుకు ప్రయోగింపబడినదను విచారము దీనికి సంబంధించినది.

4. వాక్యవక్రత : అనగా అర్థములో వక్రత్వము. పర్యాయోక్త్యాదులైన అర్థాలంకారము లీ శ్రేణిలోనివి.

5. ప్రకరణవక్రత : కవి అక్కడక్కడ ఇతివృత్తములో మార్పులు చేయును. ఇదే ప్రకరణవక్రత. శాకుంతలమున దుర్వాసుని ప్రవేశము వంటివి.

1. వక్రోక్తిజీవితము : ప్రథమోన్మేషము.

6. ప్రబంధవక్రత : ఒక రసములోనున్న కథాభాగమును మరొక రసము ప్రధానముగా అగునట్లు మార్చుట. వేణీసంహారనాటకములో శాంతరసప్రధానమగు భారతకథ వీర రసప్రధానముగా మార్చబడినది. ఆనందవర్ధనుడన్న 'ప్రబంధధ్వని' ప్రబంధవక్రతయే. అనగా ఒకానొక కావ్యములో ప్రతిబింబించు కవి హృదయము; అతని తత్త్వము.

కుంతకుని మతము ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమున కించుమించుగా బాహిరరూపము.

**క్షేమేంద్రుడు :**

ఇతడు 'ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్' అని ఔచిత్యమే కావ్యాత్మగా సిద్ధాంతీకరించెను. ఈ యౌచిత్యము పద, వాక్య, ప్రబంధ, గుణ, అలంకార, ఉపసర్గ, నిపాత, కాల, దేశాదులం దుండునని విపులీకరించెను. ఇతడు ధ్వనికారుని 'అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్' అన్న సిద్ధాంతమునే పునఃప్రతిష్ఠించెను. ఇతని సిద్ధాంతము ధ్వని మతమునకు వ్యతిరేకము కాదు.

**మమ్మటుడు :**

ఇతడు అభావరూపములో కవిత్వమును నిర్వచించెను. ఆ నిర్వచన మిది :

'తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి'.[1]

దోషరహితములును, గుణయుక్తములును, క్వాచిత్కముగా నిరలంకృతములైనను శబ్దార్థములు కావ్యమని దీని అభిప్రాయము. ఇతని దృష్టిలో అలంకారములు కావ్యమునకు ముఖ్యములు కావు. ఇతడు గుణములకు ప్రాధాన్య మిచ్చినను ఉత్తమకావ్యము వ్యంగ్యప్రధాన మైనదే యనెను. 'ఇద ముత్తమ మతిశాయిని వాచ్యాత్ ధ్వని ర్బుధైః కథితః.'[2]

**విశ్వనాథుడు :**

ఇతడు 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అని నిర్వచించెను. మమ్మటుడు కావ్యములో దోషము లుండరాదని సిద్ధాంతీకరించగా ఇతడు దోషము లున్నంతమాత్రమున ఒకానొక కావ్య మునకు కావ్యత్వము పోదని వాదించెను.

'కీటానువిద్ధరత్నాదిసాధారణ్యేన కావ్యతా
దుష్టేష్వపి మతా యత్ర రసాద్యనుగమస్ఫుటః'.[3]

కావ్యమునకు పురుగు తొలిచిన రత్నముతో సాదృశ్యమున్నది. ఎక్కడ రసానుభూతికి వీలున్నదో అక్కడ (ఆ కావ్యమున) దోషములున్నను దానికావ్యత్వమునకు హాని కలుగదు.

1, 2. కావ్యప్రకాశము : ప్రథమోల్లాసము.
3. సాహిత్యదర్పణము : ప్రథమపరిచ్ఛేదము.

శబ్దగతమైన దోషము దోషము కాదనియు, రససంబంధి దోషము మాత్రమే దోషమనియు ఇతడు ఆనందవర్ధనుని అభిమతమును పునరుద్ఘాటించెను.

'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను ఈతని సిద్ధాంతము పయోరాశిని పాత్రలో బంధించి నట్లున్నది. వాక్యమనగా ఇతనిదృష్టిలో కేవలము రెండు మూడు శబ్దముల సముచ్చయ మని అనుకొనగూడదు. కనీస మొక్కశ్లోకమైనను వాక్యముగా పరిగణింపబడునని యితని అభిప్రాయము. ఇతడు తన నిర్వచనమున కుదాహరణముగా నిచ్చిన 'శూన్యం వాసగృహం విలోక్య' అను శ్లోకమువలన ఇది స్పష్టము. కావున వాక్యమనగా ఇతని యభిప్రాయము మహావాక్యమనియే. ఆనందవర్ధనుడు మొదలైనవారు కావ్యపరముగా మహావాక్యమను శబ్దమును వాడిరి.

### జగన్నాథుడు :

ఇతని కావ్యనిర్వచనము 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్'[1] అని. దీనికి వివరణ మిది.

'రమణీయ, అర్థ, ప్రతిపాదక, శబ్ద అనే లక్షణ శరీరములోని ఈ నాలుగుపదములూ సార్థకములు. కమనీయకామినీ కటాక్షాదికముకూడా రమణీయార్థమును ప్రతిపాదింపవచ్చును. అయినా అది శబ్దముకాదు కావున కావ్యముకాదు. వ్యంగ్యమును చెప్పు శబ్దము కూడా కావ్యమే. దాని సంగ్రహమునకే వాచకపదమును విడిచి ప్రతిపాదకశబ్దము గ్రహింపబడినది. వ్యాకరణము రమణీయశబ్ద ప్రతిపాదకమే కాని రమణీయార్థ ప్రతిపాదకము కాదు. కావున అది కావ్యము కాదు. 'ఘటమును తెమ్ము' అనే శబ్దము సామాన్యముగా అర్థమును ప్రతిపాదించుచున్నది. అయినా అది రమణీయార్థ ప్రతిపాదకము కాదు. మొత్తముమీద లక్షణములోని ఏకైకాంశము కలవానిని కావ్యముగా వ్యవహరింపరాదని సారాంశము.'[2]

### ఉపసంహారము :

సంస్కృతాలంకారికులలో ముఖ్యులైనవారి సిద్ధాంతములనే పైని పొందుపరిచితిని. స్థూలముగా వీరిలో రెండు తెగలవారు – అలంకారవాదులు, రసవాదులు కనిపించుచున్నారు. వీరిలో అలంకారవాదులకన్న రసవాదుల సిద్ధాంతములే కావ్యాత్మావిష్కరణమునకు సమర్థముగానున్నవి. అలంకారవాదులు కావ్యశరీరమును మాత్రమే ఆవిష్కరించిరి. వామనుడు రీతికావ్యాత్మ యన్నను అది భ్రాంతిజనితమైన వాదమే. రీతి పదాశ్రయము. పదములు ఆత్మ కాలేవు. శరీరమాత్ర పరిమితములు. కావున కావ్యాత్మ 'రసధ్వని' యన్న ఆనందవర్ధనుడు ఈ లాక్షణికులందరిలో కావ్యాత్మను సమగ్రముగా అర్థముచేసికొన్నాడని చెప్పవలెను. రసధ్వని ఆత్మగాలేని అలంకార

1. రసగంగాధరము : ప్రథమాననము.
2. నవరసగంగాధరము : జమ్మలమడక మాధవరాయశర్మ : పుట 7.

ములు కేవల మలంకారములే. అనగా బాహ్యశోభాహేతువులే. రసధ్వని ఆత్మగాగలిగిన కావ్యములోని అలంకారములు నిస్సందేహముగా దీప్తికారణములగును. ఔచిత్యవిచారచర్చలో క్షేమేంద్రు డీ అభిప్రాయమునే వెల్లడించెను.

'అర్థౌచిత్యవతా సూక్తి రలంకారేణ శోభతే
పీనస్తనస్థితేనేవ హారేణ హరిణేక్షణా.'

అనగా కావ్యార్థమునకు సముచితమైన అలంకారమే శోభాహేతువగును. సుందరాంగి పీనవక్షమునకే ముత్యాలదండ మురువుగొల్పునుగదా.

అంగనామణియొక్క ఆయా అంగములకు సముచితమైన అలంకారము లున్నప్పుడే అవి ఆమె శరీరమునకు సౌందర్యపోషకములగును. పూచిన తంగేడువలె సొమ్ములు పెట్టుకొన్న ఎమ్మెలాడి ఎబ్బెట్టుగా కనిపించకతప్పదు. కావున కావ్యములోసైత మలంకారములు పరిమితముగా ఉండవలయును. అలంకారభార మెప్పుడును వర్జ్యమే. మహాకవి వాల్మీకి సైతము ఒకటిరెండు చోట్ల అలంకారప్రీతితో కావ్యాత్మను విస్మరించినాడని కొందరు విమర్శకు లభిప్రాయపడిరి.

'అవగాఢ స్సుదుష్పారం శోకసాగర మబ్రవీత్
రామశోక మహాభోగ స్సీతావిరహ పారగః
శ్వసితోర్మి మహావర్తో బాష్పఫేనజలావిలః
బాహువిక్షేప మీనౌఘో విక్రందితమహాస్వనః
యస్మిన్ బత నిమగ్నోఽహం కౌసల్యే ! రాఘవం వినా
దుస్తరో జీవతా దేవి ! మయాఽయం శోకసాగరః.'[1]

ఇవి దశరథుని ముఖతః వెడలిన మాటలు. రాము దరణ్యములకు వెడలిపోయిన పిమ్మట శోకతాడితుడై అవసానదశలో దశరథు డన్నమాట లివి. ఇందులో సర్వావయవ రూపక మను అలంకారమున్నది. ఇక్కడ అలంకార మంతగా ఔచితీమంతము కాదేమో. పైగా కవినోటినుండి ఈ మాటలు వచ్చినచో చిక్కులేదు. కాని మరణసన్నద్ధుడైన దశరథునిచేత ఇంత దీర్ఘమైన అలంకారములతో చెప్పించుటలోని ఔచిత్యము విచార్యము. చివరిదాక సర్వావయవరూపకము రాబట్టుట యనగా మెదడుచేత కసరత్తు చేయించుటయే కదా! చెప్పదలచుకొన్న భావము పఠితమనస్సులో జుమ్మనవలెను గాని అతనిమేధను మెదుపగూడదు. ఝటితిత్యవభానము కావ్యమున కత్యవసరము. ఇది ధ్వనిమార్గముననే సాధ్యము.[2]

1. రామాయణము : అయోధ్యాకాండము : 59 వ సర్గము.

2. 'Poetry, being intended for the delight of the imagination, must be effective only through suggestion and hint, and when one makes it a bit of grammar or logic, it ceases to be poetry'. —'Some concepts of Alankarasastra : Prof. Raghavan.

అందుకే కావ్యనిర్వచనము లన్నిటిలో 'కావ్యస్యాత్మాధ్వనిః' మరియు 'సహృదయ హృదయాహ్లాది శబ్దార్థమయత్వమేవ కావ్యత్వమ్' అను నిర్వచనములే అలంకారశాస్త్రజగత్తులో స్వర్ణశిఖరములవలె నిలచినవి. వీని నీడలలోనే జగన్నాథ విశ్వనాథాది లాక్షణికులు తమతమ నిర్వచనములను నిరూపించిరి. రససిద్ధాంతము భరతునినుండియే ఉద్గమించినప్పటికిని దానికి సర్వాంగీణత్వమును సువ్యవస్థితమైన రూపమును ఇచ్చినవా డానందవర్ధనుడే.[1]

వ్యంగ్యమనగా కేవలము వక్రోక్తి, అన్యోక్తి, ప్రహేళికాదులే కావు. వీనిలో వాచ్యార్థము రమణీయముగా నుండదు. వ్యంగ్యప్రధాన కావ్యములో వాచ్యార్థము, తత్ప్రకాశితమైన వ్యంగ్యార్థము రెండును రమణీయముగా నుండవలెను. ఆనందవర్ధను డీ విషయము నిట్లు సూత్రీకరించెను.

'స్వసామర్థ్యవశేనైవ వాక్యార్థం ప్రతిపాదయన్
యథా వ్యాపారనిష్పత్తౌ పదార్థో నవిభావ్యతే
తద్వత్ సచేతసాం సోర్థో వాచ్యార్థవిముఖాత్మనాం
బుద్ధౌ తత్త్వార్థదర్శిన్యాం ఝటిత్యే వావభాసతే.'[2]

అనగా వాక్యములో ప్రతిపదమున కొక అర్థముండును. అన్ని పదముల అర్థములు కలసి ఒక వాక్యార్థమును గోచరింపజేయును. వాక్యార్థజ్ఞానము కలిగిన పిమ్మట ప్రతి శబ్దము యొక్క ప్రత్యేకార్థము గోచరము కాదు. సహృదయు డీవాక్యార్థముతో అనగా వాచ్యముతోనే సంతృప్తి చెందడు. అతనిబుద్ధికి ఈ వాచ్యార్థమే మరియొక అర్థమును స్ఫురింపజేయును. ఎందుచేత ? అతని బుద్ధి తత్త్వార్థదర్శిని యగుటచేత. ఆ మరియొక అర్థమే వ్యంగ్యార్థము. అది ఝటితిగా స్ఫురించవలయును. ఆనందవర్ధనుని కారిక సారాంశ మిది.

వ్యంగ్యార్థస్ఫురణమువలన కలిగిన ఆనందానుభూతియే కావ్యముయొక్క పరమలక్ష్యము. ఈ యానందము మిగిలిన సంతోషములకన్న విలక్షణమైనది. రసానందము మనస్సులోనేకాక శరీరమంతటను వ్యాపించునని భరతు డభిప్రాయపడెను.

'యోర్థో హృదయసంవాదీ తస్యభావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కంకాష్ఠ మివాగ్నినా.'[3]

హృదయాహ్లాదియైన ఈ రసానందము అగ్ని ఎండుకట్టెలో గబగబ వ్యాపించినట్లు శరీరమంతట నిండుకొనునని భరతుని యభిప్రాయము. భరతుని ఈ యుపమానమువలన.

1. భరతునికి పూర్వికుడు నందికేశ్వరుడే రససిద్ధాంతమునకు పునాదివేసెనని కొందరి మతము.
2. ధ్వన్యాలోకము : ప్రథమోద్ద్యోతము.
3. నాట్యశాస్త్రము.

వ్యంగ్యార్థమునకు ఝటితిత్యవభాసమునకు గల ఆంతరంగిక బంధము స్పష్టమైనది. భరతుడే సర్వలక్షణసారమును తొలుదొల్తగా అందించిన మహానుభావుడు.

'నహి రసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే' యని ఒక్క వాక్యములో ఇతడు సమస్తమును క్రోడీకరించెను. రసములేకుండ ఏ యర్థముండదని పై వాక్యములోని అభిప్రాయము. ఉండదనగా ఉండగూడదనియే. భరతుడు ప్రేలెత్తిచూపిన రససిద్ధాంతమునే పెంచి ఆనందవర్ధనుడు 'రసధ్వని' యనుపేర ఘంటాపథమును నిర్మించెనవి వెనుక చెప్పియుంటిని. ఆనందవర్ధనుని రసధ్వని సిద్ధాంతమే సర్వశ్రేష్ఠమైనది. 'రసధ్వని'తో కూడుకొన్నదే ఉత్తమ కవిత్వము. ఇది మన సంస్కృతలాక్షణికు లందించిన పిండితార్థము.

## పాశ్చాత్య విమర్శకుల సిద్ధాంతములు :

సంస్కృత లాక్షణికులు కవిత్వ స్వరూపస్వభావాదులనుగూర్చి తమ అభిప్రాయములు ప్రకటించుటకు ప్రత్యేక లక్షణగ్రంథములను రచించిరి. వారిలో ప్రాయికముగా ఒక్కొక్క లాక్షణికుడు ఒక్కొక్క సిద్ధాంతమును ప్రతిపాదించుటకు ప్రత్యేక గ్రంథమును రచించెను. కావ్యజీవితము వక్రోక్తియని నిరూపించుటకే కుంతకుడు 'వక్రోక్తిజీవిత' మను గ్రంథమును రచించెను. కావ్యమునకాత్మ ధ్వనియని సిద్ధాంతీకరించుటకు ఆనందవర్ధనుడు 'ధ్వన్యాలోక'మను మహాగ్రంథము నిర్మించెను. కవిత్వమునకు ఔచిత్యమే ఆత్మయని నొక్కిచెప్పుటకు క్షేమేంద్రుడు 'ఔచిత్యవిచారచర్చ' అను గ్రంథమును సంతరించెను. ఈదృశముగా ప్రముఖాలంకారికు లందరు కవిత్వమునకు సంబంధించిన తమ తమ మతములను ప్రకటించుటకు ప్రత్యేక గ్రంథములు వ్రాసిరి. పాశ్చాత్య విమర్శకులలో ప్రాయికముగా ఇట్లు జరుగలేదు. వీరిలో పలువురు తాము వ్రాసిన గ్రంథములలో పృథక్సిద్ధాంతములనుకాక బహువిషయములను చర్చించినారు. అరిస్టాటల్ వ్రాసిన 'Poetics' తీసికొందము. ఇతడు కవిత్వమును ప్రకృత్యనుకరణమని సిద్ధాంతీకరించినాడు. అయినను ఈ విషయమును ప్రతిపాదించుటకే 'Poetics' వ్రాయలేదు. కవిత్వమునకు, కళలకు సంబంధించిన సర్వతోముఖవిషయములను దీనిలో సంతరించినాడు. ఇతడే కాదు రస్కిన్, కార్లైల్, కాలరిడ్జి, ఆర్నాల్డు మున్నగు ప్రముఖవిమర్శకులందరిట్టివారే. రస్కిన్ వ్రాసిన వ్యాససంపుటిని పరిశీలించినచో ఒకేదానిలో కవిత్వము గురించియే కాక చిత్రకళ, శిల్పము, గృహనిర్మాణము, నైతికవిషయచర్చ-అంతేకాదు అతని యాత్రావిశేషములుగూడ ఒకదానివెంట ఒకటి కనిపించును. అట్లే కాలరిడ్జి వ్రాసిన 'బయోగ్రాఫియా లిటరేరియా' (Biographia Literaria) అను విమర్శగ్రంథమును తీసికొందము. ఈ ఒకే గ్రంథములో Opinions In Religion And, Politics తో పాటు 'Advice to Young Authors' అను వ్యాసము, Lyrical Ballads అను కావ్యసంపుటికి వర్డ్సువర్తు వ్రాసిన ఉపోద్ఘాతముపై విమర్శ - వెంటనే షేక్స్పియరు కవితాశక్తిపై పరామర్శ అగుపించును. ఇంతకు నా తాత్పర్యమేమనగా సంస్కృతాలంకారికులు బహుశముగా ఒకానొక సిద్ధాంతమును ప్రతిపాదించు

టకు లక్షణగ్రంథములు రచించిరి. పాశ్చాత్యవిమర్శకుల రచన అట్లుకాక ప్రాయికముగా కలగూరగంపలు. ఉండియుండి ఎప్పుడో ఒకప్పుడు కవిత్వమునుగురించి; తత్స్వరూపమును గురించి ఒక చెణుకు విసురుదురు. వానినేరి నిర్వచనములుగా సమీకరింపవలసియున్నది. వీరిలో సిడ్నీ, షెల్లీ, ఆర్నాల్డు మొదలైన కొందరు విమర్శకులు ఒక ప్రత్యేక సిద్ధాంతప్రకటన మునకు ప్రత్యేకగ్రంథములు రచించినమాట కాదనుటకు వీలులేదు. థామస్ లవ్ పీకాక్ అను విమర్శకుడు కవిత్వము ఆటవికయుగమునకు సంబంధించిన కళ యని నిరసించగా అతని వాదమును పరాస్తముచేయు ఉద్దేశముతో షెల్లీ 'A Defence of Poetry' అను ప్రత్యేక గ్రంథము రచించెను. ఇట్లు వ్రాసినవారు కొందరుమాత్రమే.

పాశ్చాత్య విమర్శకులలో కేవలము విమర్శకులేకాక కవులుగా ఖ్యాతినొందినవారుగూడ కలరు. వర్డ్సువర్తు, షెల్లీ, ఆర్నాల్డు, కాలరిడ్జి, పోపు మున్నగువారు విమర్శకులేకాక ఉత్తమ కవులు. సంస్కృతలాక్షణికులలో కవులైనవా రరుదు.[1] కవులు విమర్శకులుగా మారినప్పుడు వారి విమర్శలలో Subjective Element (ఆత్మాభిరుచి) ప్రవేశింపక తప్పదు. అచ్చమైన విమర్శకుడు ఆత్మాభిరుచుల కధీనుడుగా ఉండరాదు. అతని విమర్శలో ప్రధానముగా వస్తు తత్త్వావిష్కరణమే ఉండవలెను. ఇది లోపించినప్పుడు విమర్శ పాక్షికముగా పరిణమించును. వర్డ్సువర్తు, షెల్లీ మున్నగువారు చేసిన సాహిత్యపరమైన సిద్ధాంతములు వారివారి కవితాస్వభావముల కనుగుణముగా రూపొందినవి. పాశ్చాత్యవిమర్శకులు కవిత్వముగురించి చేసిన నిర్వచనములను పరిశీలించినప్పు డీవిషయము విస్మరించుటకు వీలులేదు.

ఇంకొక తారతమ్య మీ యిరుతెగలకు చెందిన విమర్శకులలో కనిపించును. సంస్కృత లాక్షణికులు 'కవిత్వము'ను నిర్వచించలేదు. 'కావ్యము'ను నిర్వచించిరి. ఈ రెంటికి ఇంచుక భేదమున్నది. కావ్యగుణము కవిత్వము. అనగా ప్రతి ఉత్తమకావ్యములో కవిత్వ ముండి తీరును. కాని కవిత్వమంతయు కావ్యము కానేరదు. వస్తువు, కథ, పాత్రలు, సన్నివేశములు వీని నాధారముగా చేసికొని సర్వాంగీణవికాసమునొందిన సంపుష్టమైన కవిత్వము కావ్యము. రసభరితమై సహృదయుల తలలూపించు ఒకానొక లయబద్ధమైన, ఛందోఘటితమైన వాక్యము, పదసముచ్చయము కావ్యము కాలేదు. నిస్సందేహముగా అది కవిత్వము. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అన్న నిర్వచనమున కర్థము కేవల మొకవాక్యము కావ్యమని కాదు. మహావాక్యమే కావ్యము. ఈ చర్చయటుంచి ప్రకృతవిషయమునకు వత్తును. సంస్కృతలాక్షణికులు ప్రధానముగా కావ్యనిర్వచనము చేసిరి. పాశ్చాత్యవిమర్శకులు కవిత్వనిర్వచనము చేసిరి. వారి నిర్వచనములు కథా, వస్తు, పాత్ర, సన్నివేశ గర్భితములైన కావ్యములకు సంబంధించినవి కావు. కవిత్వమునకు సంబంధించినవే.

ఇంకొక విషయము, సంస్కృతలాక్షణికులు కావ్యస్వరూప నిరూపణము చేయునప్పుడు ప్రధానముగా శరీరము, ఆత్మ (కావ్యముయొక్క బహిఃస్వరూపము, ఆంతరంగిక స్వభావము)

1. జగన్నాథ పండితరాయలు వంటివారు ఇందుకు అపవాదము.

ఈ రెంటిపై విడివిడిగా తమదృష్టిని కేంద్రీకరించిరి. వారి నిర్వచనములు ఈ రెండంశముల చుట్టు విధిగా చాంద్రాయణముచేసినవి. పాశ్చాత్యు లిట్లుచేయలేదు. వారు కావ్యశరీరమును ప్రత్యేకముగా ప్రస్తావించలేదు. కావ్యాత్మనుగురించి విడిగా పేర్కొనలేదు. కాలరిడ్జివంటివా రెక్కడో ఒకచోట కావ్యశరీరమును, ఆత్మను ప్రస్తావించినను అది లెక్కలోనికి రాదు.[1] ప్రధానముగా వారు అనుభూతి, ఆవేశము, ఊహ, భావన, కల్పన, సౌందర్యము, సందేశము, లయ, ఛందస్సు - వీనిని పురస్కరించుకొనియే కవిత్వమునకు కొలతబద్దలను నిర్మించిరి. అనగా ఇక ముందు నేను ఉదాహరించనున్న నిర్వచనములన్నియు పైన పేర్కొన్న అంశములను తమలో ఇముడ్చుకొని బయలుదేరినవే.

### నిర్వచన వైచిత్రి :

కొందరు విమర్శకులు నిర్వచనములో చమత్కారము కనబరిచిరి. పరబ్రహ్మపదార్థమును నిర్వచించుటకు వేదాంతులు కొందరు 'నేతి, నేతి' పద్ధతిని అవలంబించిరి. ఓవెన్ బార్‌ఫీల్డు (Owen Barfield) అను ఆంగ్ల విమర్శకుడు కవిత్వనిర్వచనముపట్ల ఇట్టి విధానమునే అవలంబించెను. ఒక్కొక్కవ్యక్తి స్వీయానుభూతులనుబట్టి కవిత్వమునకు విలువలు కట్టుట జరుగుచుండునని, ఆయావ్యక్తుల ఆంతరంగిక ప్రవృత్తులనుబట్టి, అభిరుచులనుబట్టి కవిత్వనిర్వచనములు జరుగుచుండునని ఈత డభిప్రాయపడెను. జాన్ రాబిన్‌సన్ అను విమర్శకుడు ప్రపంచమహాకావ్యమైన 'ప్యారడైజ్ లాస్టు'లో కవిత్వమే లేదనెను. కొందరు కీట్సుకవి 'ఎండిమియాన్' అను కావ్యము కవిత్వమే కాదనిరి. నిజమున కీరెండుకావ్యములు ఆంగ్ల కవితా జగత్తులో దీపస్తంభములవంటివి. అందుచే ఏది కవిత్వమో కాదో ఎవరికివారే నిర్ణయించుకొనవలెనుగాని కొందరు కూర్చుండి కొలమానములు తయారుచేసినచో నిష్ప్రయోజనమని ఇతడు తేల్చివేసెను. ఈ విధముగా నిస్పృహను ప్రకటించుచునే బార్‌ఫీల్డు 'నేతి' పద్ధతిలో చేసిన కవిత్వ నిర్వచనమును పరిశీలింతము.

'If the question, what is poetry? has never been answered, everyone will agree at least thus for : that it is not merely so many waves in the air or ink-marks on a piece of paper - that it exists primarily in the world of consciousness...whatever poetry may be, then it is something more than the signs or sounds by which it is conveyed'.[2]

కవిత్వమనగా గాలిలో లేచిన అలలుకాదు. తెల్లకాగితము మీది నల్లసిరామరకలు కాదు. కవిత్వము రేఖలకు ధ్వనులకు అతీతమైన ఏదో ఒక అవ్యక్తశక్తి. ఇది యీ విమర్శకుని

1. 'Good sense is the body of poetic genius....and imagination the soul'.
—Biographia Literaria.

2. Poetic Diction: Owen Barfield: P. 41.

నిర్వచనసరణి. కవిత్వమనగా పైన చెప్పినవి కాదు. ఇది యెల్లరెరిగినదే. ఏదికాదో చెప్పుట కాదు విమర్శకుని కర్తవ్యము; ఏదియగునో చెప్పుటయే. కావున ఇట్టి నిర్వచనములను గణన లోనికి తీసికొనవలసిన అవసర మంతగా కనిపించదు.

కొందరు అతిపేశలమైన చమత్కారధోరణిలో కవిత్వమును నిర్వచించినారు. వీరు 'ఇతి' ధోరణిలో కచ్చితముగా గీటుగీసి కవిత్వమును నిర్వచించినను ఆ నిర్వచనములలో ద్రఢిమ లేదు. లీలగా గాలిలో ఎగిరిపోవు పుప్పొడివంటి నిర్వచనములవి. మచ్చున కొకటి.

'Poetry is algebra, not arithmetic'.[1] ఈ నిర్వచనములో అర్థములేదని కాదు. కవిత్వమనగా ఉన్నదున్నట్టుగా చెప్పుట (అంకగణితము) కాదు; సంకేతముల రూపములో చెప్పుట (బీజగణితము). ప్రతీకలద్వారా చెప్పుట కవిత్వమున కుపస్కారకమైన రీతియని దీని అభిప్రాయము. ఈ యభిప్రాయము ప్రకటించు రీతిలో బిగువు, స్పష్టత లేవు. ఇట్టివానిని కవిత్వ నిర్వచనములుగా ప్రమాణీకరించుట చిక్కు.

ఇక ఉబుసుపోకగానో, అలవోకగానో చేయబడిన నిర్వచనములు కాక సహేతుకముగా చేయబడినవి మాత్రమే పొందుపరుతును. ఒక్కొక్క అభిప్రాయమును పురస్కరించుకొని చేయ బడిన నిర్వచనములను ఒక్కొక్క వర్గములోనికి చేర్తును. ఆ యా విమర్శకుల పృథక్త్వమును పరిశీలించుటకే ఈ వర్గీకరణ ముద్దేశింపబడినది.

1. కవిత్వమును తొలిసారిగా నిర్వచించిన పాశ్చాత్యలాక్షణికుడు అరిస్టాటల్. ఇతడు కవిత్వమును (కళలన్నిటిని) ప్రకృతి కనుకరణమనెను. అరిస్టాటల్ ప్రత్యేకించి ఒక సూత్రములో ఈ విషయము చెప్పకున్నను, ఆ భావము నాధారముగా జేసికొని కవిత్వమును, కళలను, వాని స్వరూప స్వభావములను నిర్ణయించెను. ఇతనిది అనుకరణ సిద్ధాంతము (Imitation Theory).[2]

2. అనుభూతిని (Feeling), ఆవేశమును (Emotion) పురస్కరించుకొని చేసిన నిర్వచనములు.

(i) Poetry is 'the spontaneous overflow of powerful feelings'
—Wordsworth.

(తీవ్రానుభూతుల స్వచ్ఛంద విజృంభణమే కవిత్వము.)

(ii) 'But the thought and words in which emotion spontaneously embodies itself.'—Mill.

(ఆవేశము స్వచ్ఛందముగా రూపొందిన శబ్దార్థములు కవిత్వము.)

1. 'Over the Teacups' : (రచయిత అనామకుడు).
2. దీనినిగూర్చి ముందు ముందు చర్చింతును.

(iii) 'A vent for over-charged feeling.'—Keble.
(ఉప్పొంగు అనుభూతుల అభివ్యక్తి కవిత్వము.)

(iv) 'The suggestion by the imagination of noble grounds for the noble emotions'—Ruskin.
(ఊహద్వారా ఉదాత్తావేశములకు ఉత్తమాలంబనము కల్పించునది కవిత్వము.)

3. ఊహాశక్తిని (Imaginatian) పురస్కరించుకొని చేసిన నిర్వచనములు.

(i) 'In a general sense may by defined as the expression of the imagination'—Shelly.
(ఊహాశక్తి ప్రకటనమే కవిత్వము.)

(ii) 'The language of the imagination'—Hazlitt.
(ఊహాశక్తి పలికెడు శబ్దసందోహమే కవిత్వము.)

4. లయను (Rhythm) దృష్టిలో పెట్టుకొని చేసిన నిర్వచనములు.

(i) '(Poetry) We will call musical thought'—Carlyle.
(సంగీతాత్మకమైన ఆలోచనమే కవిత్వము.)

(ii) 'The rhythmic creation of Beauty'—E. A. Poe.
(లయబద్ధమైన సౌందర్యసృష్టి కవిత్వము.)

5. శబ్దము (Word) దృష్ట్యా చేసిన నిర్వచనము.

(i) 'By Poetry we mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by the means of words the painter does by means of colours'.—Macaulay.
(భావనాశక్తిని భ్రాంతులతో నింపు విధముగా శబ్దములను ప్రయోగించుట, చిత్రకారుడు వర్ణములద్వారా సాధించుదానిని శబ్దములతో సాధించుట కవిత్వము )

6. వ్యక్తీకరణమును (Expression) దృష్టిలో నిడికొని చేసిన నిర్వచనములు.

(i) 'The most delightful and perfect form of utterance that human words can reach',—Arnold.

(శబ్దసంపద అందుకొనగల సంపూర్ణమైన ఆనంద ప్రదమైన స్వరూపము కవిత్వము.)

(ii) 'The impassioned expression, which is in the countenance of all science'—Wordsworth.

(సమస్త శాస్త్రములయొక్క సత్యముల ఆవేశభరితమైన అభివ్యక్తి కవిత్వము.)

7. ప్రయోజనము (Purpose of the poem) దృష్ట్యా చేసినది.

(i) 'Poetry is anti-thesis of science having for its immediate object pleasure not truth'—Coleridge.

కవిత్వము శాస్త్రీయ విజ్ఞానమునకు విరుద్ధమైనది. దాని ప్రయోజనము సత్యము కాదు ఆనందము.)

8. ఎవరికి అంతుచిక్కకుండ అనేకాంశములను-భావన, కల్పన, ఊహ, సౌందర్యము, ఆవేశము మున్నగునవి - కూడలిగాచేసి సమన్వయ ధోరణిలో చేసిన నిర్వచనములు.

(i) 'Poetry is a metrical composition. It is the art of uniting pleasure with truth by calling imagination to the help of reason and its essence is 'invention'.'—Johnson.

(ఛందోబద్ధమైన రచన కవిత్వము. హేతువాదమునకు భావనాశక్తిని జతచేసి సత్యమును ఆనందమును సమ్మేళనము చేయగల కళ కవిత్వము.)

(ii) 'The utterance of a passion for truth, beauty and power, embodying and illustrating its conceptions by imagination and fancy, and modulating its language on the principle of variety in unity'—Leigh Hunt.

(సత్యము, సౌందర్యము, సత్త్వము అను మూడు లక్షణములపట్ల గాఢమైన అభినివేశము ప్రకటించు అభివ్యక్తి కవిత్వము. తన ఉద్దేశములకు భావన, కల్పన అను శక్తుల సాహాయ్యముతో తార్కాణములను సృష్టించుచు, ఏకత్వమును చాటించు వైవిధ్యముతో అలరారునట్లు భాషను సవరించుకొనునది కవిత్వము.)

(iii) 'Finally, good sense is the body of poetic genius, fancy is its drapery, emotion its life and imagination the soul that is

every where, and in each, and forms all into one graceful and intelligent whole'—Coleridge.

(కవితాశక్తికి వివేకమే శరీరము, కల్పనయే వేషము, ఆవేశమే ప్రాణము, ఊహయే ఆత్మ. ఈ యాత్మ అన్నిటిలో పరివ్యాప్తమై విభిన్నాంశములకు సురుచిరమైన స్ఫుటమైన ఏకత్వమును ప్రసాదించును.)

ఇంతవరకు, విశిష్ట వ్యక్తిత్వమున్న విమర్శకుల నిర్వచనములనే పొందుపరిచితిని. వీనిలో ఒక్కొక్కదానినిగూర్చి చర్చించుట పిష్టపేషణమగును. ఈ నిర్వచనముల వెనుక ఇమిడియున్న ప్రధానసూత్రములను మాత్రమే విడదీసి చూపుదును.

### ప్రకృత్యనుకరణమే కవిత్వమా ? :

అరిస్టాటలుకుముందే ప్లేటో 'రిపబ్లిక్' అను గ్రంథములో కవిత్వమునుగూర్చి దిఙ్మాత్రముగా తన అభిప్రాయములను వెల్లడించెను. ఈ గ్రంథములో అతడు మానవుడుత్తమ పౌరుడగుటకు మార్గములు సూచించుటయే ప్రధానధ్యేయముగా పెట్టుకొనెను. ప్రాస్తావికముగా కవిత్వమునుగురించి, కళలనుగురించి పరామర్శించెను. కవిత్వము భ్రాంతినుండి ఉద్భూతమగునది కావున సత్యదూరమనియు, అది హృదయములోని అధమ భాగమునకు చెందిన ప్రవృత్తుల బాహిర రూపమనియు, ఉద్రేకము (Passion) ను రెచ్చగొట్టునది కావున అంతగా ఆదరణీయము కాదనియు అభిప్రాయపడెను. తత్త్వవేత్త, నీతిబోద్ధయైన ప్లేటోకు సూటిగా నీతిబోధచేయని కవిత్వకళ రుచింపకపోవుటలో ఆశ్చర్యమేమియులేదు. సంస్కృత వాఙ్మయమునసైతము 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్'వంటి నానుడులు చిరకాలమునుండి వినవచ్చుచున్నవి. ప్లేటో తరువాత వచ్చిన అరిస్టాటలు ప్లేటో అభిప్రాయముతో ఏకీభవించలేదు. కవిత్వము అభూత సృష్టి యన్న ప్లేటో ధోరణికి భిన్నముగా ఇతడు తన సిద్ధాంతమును ప్రవేశపెట్టెను. కవిత్వము (లలితకళలన్నియు) ప్రకృతికి అనుకరణమే యని స్పష్టపరిచెను. మానవునిలో పసితనము నుండియే అనుకరణగుణ ముండును. ఇది ప్రకృతిసిద్ధముగా ప్రతిమానవుని యందుండు వాసనావిశేషము. ఈ గుణమే మానవుని జంతువులనుండి వేరుచేయుచున్నది. మానవునికి అనుకరణమే తొలిపాఠము నందించును. అనుకరణమువలన ఆనందము కలుగును. అనుకరణ గుణమువలెనే సంగీతము, లయజ్ఞానము, ప్రతిమానవునికి ఆజానజములు. ఎవరిలో ఈ గుణములు బలవత్తరముగా నుండునో వారు క్రమముగా శబ్దరూపమున వానిని ప్రకటింతురు. ఆ ప్రకటనమే కవిత్వమునకు దారితీయును. ఇవి అరిస్టాటలు పొయిటిక్సు (Poetics) లో వెల్లడించిన అభిప్రాయములు.

అరిస్టాటలు 'అనుకరణ' సిద్ధాంతమును సీడ్నీ విమర్శించెను. కవిత్వము ప్రకృతికి అనుకరణము కాదని, అది అపూర్వసృష్టియని ఇతడు వాదించెను. కవి ఉన్నదున్నట్లుగా చిత్రించడు. సాధారణుని చర్మచక్షువునకు కనిపించని గుప్తసౌందర్యమును కవి సువ్యక్త

మొనర్చును. ఐనప్పుడు కవిత్వము అనుకరణ మెట్లగును? అందుచేత దీనిని కేవల మను కరణమనుట చెల్లదు. అది ఆదర్శాత్మకమైన అనుకరణము (Ideal Imitation). ఇవి సిడ్నీ చెప్పిన అభిప్రాయములు. సిడ్నీ దృష్టిలో కవితాజగత్తు, వాస్తవజగిత్తుకన్న విలువైనది.[1] పఠిత తన నిత్యజీవితములో కవితాజగత్తు నాదర్శముగా స్వీకరించును. దీనివలన అనుకరణము కవిధర్మముగాక, పఠితధర్మమని ఇతడు తేల్చెను. అరిస్టాటలు ప్రతిపాదించిన 'అనుకర ణము'ను సిడ్నీ కవినుండి సహృదయునివైపు మరల్చెను. కవిని అనుకర్తగా గాక సృష్టి కర్తగా ఉద్ఘాటించెను.

అరిస్టాటలు కవిత్వమును ప్రకృతి కంధానుకరణమని యనలేదు. సిడ్నీ ఆదర్శవాది కావున అతనికి అరిస్టాటలు ప్రతిపాదించిన 'వాస్తవికతావాదము' (Realism) రుచింపలేదు. అరిస్టాటలుగూడ ప్రకృతిని గ్రుడ్డిగా అనుకరించుట కవిత్వధర్మమనలేదు. అనుకరణము మూడు విధములుగా జరుగునని అతడు విశదపరిచెను.

'The poet, being an imitator like the painter or any other artist of that kind, must necessarily, when he imitates, have in view one of these three objects : he must represent things such as they were or are : or such as they are said to be and believed to be; or such as they should be.'

—**Poetics** : ('బుచర్' అనువాదము)

అనగా కవి ప్రకృతిని ఉన్నదున్నట్లుగా అనుకరింపవచ్చును. లేక అది యిట్లుండ వచ్చునను విశ్వాసముతో చిత్రింపవచ్చును. లేదా అది యిట్లుండవలయునని చిత్రింపవచ్చును. అరిస్టాటలు వ్రాసిన యీ వాక్యములనుబట్టి అతడు కేవలము అంధానుకరణమును కవిత్వమన లేదని స్పష్టమగుచున్నది. వస్తుస్థితి 'ఇట్లుండవలయు'నని చిత్రించుటయే కవిధర్మమని యతని ఉద్దేశము. దీనినిబట్టి అరిస్టాటలు కొంతగా ఆదర్శవాదమువైపు మొగ్గెననవచ్చును. ప్రకృతి లోని కొన్ని యంగములు దోషభూయిష్ఠములుగా నుండవచ్చును. మానవు డొక్కొక్కమాటు పశువువలె ప్రవర్తింపవచ్చును. నిత్యజీవితములో జుగుప్సావహములైన ఘట్టము లప్పుడప్పుడు పైకితేలవచ్చును. ఇట్టి అంశములను యథాతథముగా చిత్రించుట కవిధర్మము కాదు. వీనిలోని చెడును పరిహరించి, ఇవి మంచిదారిలో నడచుటకు వీలైన సూచనలు కవి చేయవచ్చునని అరిస్టాటలు వ్రాసిన పై వాక్యములవలన విదితమగుచున్నది. కావున సిడ్నీవిమర్శ నిరాధార మని తేలుచున్నది. పైగా అరిస్టాటలు వాస్తవస్థితిని చప్పచప్పగా, పరిమళము రసము రూపము లేని శబ్దములలో వ్యక్తీకరించుమని చెప్పలేదు. వాస్తవికత పేరుతో నిర్జీవపదబంధరచన నతడు ఉద్దేశించలేదు. కవి ప్రతిభనబట్టి వస్తుచిత్రణము సమర్థమైన పదజాలములో సముచిత రీతిలో జరుగునని స్పష్టముగా చెప్పెను.

1. 'కవిత్వము; వాస్తవికత' అను విషయమును గురించి ముందు చర్చింతును.

'Again, all this he (poet) is to express in words, either common, or foreign or metaphorical or varied by some of those many modifications and peculiarities of language which are privilege of poets'.[1]

ఈ వాక్యమునుబట్టి కవి వస్తుభావముల కనుగుణమైన రచనారీతిలో రచన చేయవచ్చునని స్పష్టమగుచున్నది.

అనుకరణములో రెండు దోషము లుండునని అరిస్టాట లభిప్రాయపడెను. ప్రకృతి ధర్మమును సమర్థమైన పదజాలములో వ్యక్తీకరించు (అనుకరించు) శక్తి లేకున్నచో అట్టివాని కవిత్వము కవిత్వము కాదనెను. ఈ దోషమును ఆంతరంగికదోషమని (Essential fault) అనెను. ఇక కల్పనాశిల్పమునకు పుష్టికూర్చుటకొరకై కవి ప్రకృత్యనుకరణములో యాదృచ్ఛికముగా కొంచెము దారివిడిచిపోయెనా అది యంత పెద్దదోషము కాదనెను. దానిని ప్రామాదిక దోషము (Accidental fault) అనెను. ఒకానొక గుఱ్ఱము తన కుడికాళ్ళను రెంటిని ఒకే మారు లేవనెత్తి నడచినట్టుగా వర్ణించినచో అది ప్రామాదికదోషమని ఉదాహరించెను. దీని నాతడు పెద్దదోషముగా పరిగణించలేదు. పైగా వస్తుస్థితి నున్నదున్నట్లుగా చిత్రించని కవుల నాతడు సమర్థించెను ఈ సందర్భమున అతని వాక్యములు గమనింపదగినవి.

'Further, if it be objected to the poet that he has not represented things conformably to truth, he may answer that he has represented them as they should be. This was the answer of sophocles, that 'he draw mankind such as they should be; Euripides, such as they are'. 'And this is the proper answer'.

వస్తుస్థితి తెలియనప్పుడు దానికి సంబంధించిన విశ్వాసమును పురస్కరించుకొనికాని, లేక అది యిట్లుండవచ్చునని ఊహించికాని వ్రాయవచ్చునని ఇతడు పదేపదే స్పష్టపరిచెను. దేవతల వర్ణన మిట్టిదేయని ఉదాహరించెను. కావున అరిస్టాటలు దృష్టిలో కవిత్వమనగా ప్రకృతికి అంధానుకరణము కాదని తేలినది. సిడ్నీ ప్రతిపాదించిన 'Ideal Imitation' ఏమంత క్రొత్త సిద్ధాంతము కాదు. అది అరిస్టాట లేనాడో చెప్పినదే.

### కవిత్వము : వాస్తవికత :

కవిత్వమున 'వాస్తవికత' కెంతవరకు స్థానమున్నది? కవితాజగత్తునకు వాస్తవజగత్తున కున్న తారతమ్య మేమి? మానవజీవితచిత్రణమే కవిత్వధర్మమా? ఈ మొదలైన ప్రశ్నలకు ఆంగ్లవాఙ్మయప్రపంచములో అరిస్టాటలునుండియే వాదోపవాదములు బయలుదేరినవి. సంస్కృత లాక్షణికులలో పలువురు కవితాజగత్తు వాస్తవజగత్తుకన్న కొంత భిన్నమైనదనియే అభిప్రాయ

1. Poetics : Aristotle.

పడిరి.[1] ఆంగ్లవిమర్శకులలో ఈ రెండువైపుల వాదించువారు 'పోటాపోటీ'గా నున్నారు. అరిస్టాటలు, అర్నాల్డు మొదలైనవారు ప్రధానముగా వాస్తవికతవైపు మొగ్గినవారు. సిడ్నీ, బ్రాడ్లీ (Bradeley) మొదలైనవారు వాస్తవజగత్తుకన్న కవితాజగత్తు భిన్నమైనదేకాక ఉన్నతమైన దనియు ఘంటాఘోషముగా ప్రకటించినారు. ఈ యిరుతెగలవారి వాదములను క్రమముగా పరిశీలింతము.

క్రోచే (Croce) ఇటలీదేశపు విద్వాంసుడు. తాను వ్రాసిన ఈస్తటిక్సు (Aesthetics) అను గ్రంథములో కవితాజగత్తు మాత్రమే సత్యమని, వాస్తవజగత్తు మిథ్యయని అభిప్రాయ పడెను. పైగా కావ్యజగత్తునుండియే సామాజికజగత్తు రూపుదిద్దుకొన్నదని ఇతనివాదము. కాని యిది అతివాదము. మానవుడు, అతడు నివసించుచున్న లోకము, అతనిచుట్టున్న ప్రకృతి లేనిదే కవిత్వములేదు, కళలులేవు. మానవుని అనుభూతులకు ప్రకృతికి అవినాభావ సంబంధ మున్నది. ప్రకృతిని కాదని కవిత్వము వర్ధిల్లలేదు. పైగా సామాజికజగత్తునుండియే కవితా జగత్తు పుట్టినది. కావ్యజగత్తు తన అపూర్వరామణీయకముతో మానవుని అనుభూతులను మార్చవచ్చును. అంతమాత్రమున వాస్తవజగత్తు కవితాజగత్తునుండి ఉత్పన్నమైనదను వాదము నేలవిడిచినసాము.

ఇక ఈ రెంటిలో కవితాజగత్తు ఉన్నతమైనదను వాదము పరిశీలింతము.

ఫిలిప్‌సిడ్నీ అరిస్టాటలుయొక్క అనుకరణసిద్ధాంతమును విమర్శించెను. సాధారణ ప్రకృతి కతీతమైనదే కవిత్వ మనెను. అది యొక విలక్షణసృష్టి యనెను. కల్పనయే కవి కర్తవ్య మనెను.[2] వాస్తవజగత్తుకన్న కవితాజగత్తు సుందరమని, అది ఆదర్శములు రూపు గట్టిన చోటని ఇతడు నొక్కి చెప్పెను. వాస్తవజగత్తు సత్తుదైనచో కవితాజగత్తు స్వర్ణమయ మైనదని అభిప్రాయపడెను. కవి మాత్రమే ప్రకృతి కతీతమైన సృష్టి చేయగలడని వాదించెను. ఇతని వాద మిట్లు సాగినది. కవితాజగత్తులోని పాత్రలు, వస్తువు వాస్తవలోకముకన్న శాశ్వతములు. అందలి నాయకులు వాస్తవలోకముకన్న సుందరులు, సుగుణఖనులు. ఇచ్చట అందరు ధీరోదాత్తులే, ధీరలలితులే. ఇచ్చట మంచికే అంతిమవిజయము. చెడున కెల్లప్పుడు చెరసాలయే ఫలము. దీనిలో క్వాచిత్కముగా ప్రతిఫలించు దుష్టత్వము సహృదయునికి జలద రింపు కలిగించునంత వికారముగా, జుగుప్సావహముగా చిత్రింపబడవలయును. ఇందలి పూలు నిత్యజీవితములో మనమనుభవించు పూలకన్న పరిమళభరితములు. కావున కవితాలోకము వాస్తవలోకముకన్న ఎన్నోరెట్లు మిన్నయైనది.

1. మమ్మటుని 'నియతికృత' అను శ్లోకములో ఈ విషయమే చెప్పబడినది.

2. **'Invention is the distinguishing character of the poet, he creates new things by drawing on his 'own wit.'**

సిడ్నీ త్రోవలోనే బ్రాడ్లీ సంచారముచేసెను. అతడు కావ్యజీవితము తనంతతాను స్వతంత్రమైన దనునంతవరకు సాగిపోయెను[1].

కవితాజగత్తుకన్న వాస్తవకగత్తు భిన్నమైనదను వాదము అత్యుక్తిదోషజుష్టము. ఉన్నత మైనదనుట కొంతవరకు సత్యము. వాస్తవజగత్తున అసంఖ్యాక గ్రహములలో ఒకటియైన చంద్ర బింబము కవితాలోకమున సుందరాంగియొక్క ముఖబింబము నాక్రమించును. వాస్తవ జగత్తులో పద్మములలో మచ్చుకైనను తేనె కనిపించదు. అవే కావ్యజగత్తున ప్రవేశించుటతో కనక కింజల్కభరితములగును; మధుసౌరభమిళితములగును.

మానవుని కాంక్షలు అసంఖ్యాకములు, అసంపూర్ణములు. అతడు నిత్యజీవితమున అనుభవించలేని పదార్థములను, తీరని కాంక్షలను కవితాలోకమున ఊహించుకొని తృప్తిపడును. స్వప్నలోకములో ఇట్టివి సంభవముకదా ః ఐనప్పుడు కవితాలోకముయొక్క ఆవశ్యకమేమి యను ప్రశ్న ఉదయించును. స్వప్నజగత్తు, కవితాజగత్తు ఒకటి కావు. రెంటికి ఎంతయో అంతరమున్నది. మానవుడు జాగ్రదవస్థలో నున్నప్పుడు హేతుబుద్ధిచేత అణచివేయబడిన వాసనలు, కాంక్షలు, స్వప్నములో సఫలీకృతములగును. స్వప్నములో వ్యక్తా వ్యక్తము (Sub-conscious) పెద్దతనము వహించును. ఆ స్థితిలో మానవుని అసంపూర్ణ కాంక్షలు సాకారముగా ప్రత్యక్షమగుటకు వీలున్నది. అంతేకాదు. నిత్యజీవితములో చూడలేని-చూచుటకు మన మువ్విళ్ళూరెడి-అలౌకికవిషయములు స్వప్నముద్వారా సాధ్యములు. కావ్యజగత్తు కొంతవరకు ఇట్టిదేయన్నప్పుడు ఈ రెంటికి సాదృశ్యమున్నదను భ్రాంతి కలుగుట సహజము. కాని నిజమున కిది భ్రాంతిమాత్రమే. ఎందుకనగా స్వప్నలోకములో ఆనందము చర్వణయోగ్యము కాదు; క్షణికము. తటిత్తువలె త్రుటికాలమాత్రభోగ్యము. కావ్యానందము నిరంతరచర్వణార్హము. పైగా కావ్యజగత్తు 'హ్లాదైకమయము'. దీనిలో దుఃఖప్రస్తావన లేదు. కరుణరసాత్మకమైన కావ్యముగూడ సహృదయునికి కలిగించునది ఆనందమే. స్వప్నజగత్తు అట్టిదికాదు. దీనిలో ఆనందమే కలుగునను నియమము లేదు. అప్పుడప్పుడు జుగుప్సాభయములు కలిగించు దుఃఖకరమైన ఘట్టములుగూడ స్వప్నములో వచ్చుట సాజము. ఇంకొక విషయము. స్వప్నములో ఆనందము కలుగవలసిన ఘట్టములో విషాదము, విషాదము కలుగవలసిన సందర్భమున ఆనందము కలుగుట సంభవించును. ఈ క్రమము కావ్యజగత్తున కన్వయింపదు. ఎట్టి

1. 'Its nature is to be, not a part nor yet a copy of the real world, as we commonly understand that phrase, but to be a world by itself, independent, complete autonomous to possess it fully, you must enter that world, conform to its laws, and ignore, for the time being the beliefs, aims, and particular conditions which belong to you, in the other world of reality.'

—Oxford Lectures on Poetry: P. 5.

ఘట్టమైనను చివరకు ఆనందదాయి యగుటయే కావ్యజగత్తులోని నియత ధర్మము. కావున కావ్యజగత్తునకు, స్వప్నజగత్తునకు సంబంధసాదృశ్యములు లేవు.[1]

ఇక వాస్తవజగత్తుకన్న కావ్యజగత్తు ఎంతవరకు, ఏ రీతిగా ఉన్నతమైనదో చర్చింప వలసియున్నది.

కవిత్వము వాస్తవలోకమునకు కేవలము ప్రతిబింబము కాదు. అట్లగుచో అప్సరసలు, అమరులు, అకాశగంగ, పాలసముద్రము, మేరుపర్వతమువంటి ఆనందదాయకములైన విషయములకు, నరకము, వైతరణి వంటి భయావహములైన విషయములకు కవితా జగత్తున తావు లేకుండెడిది. మానవుడు సుఖదుఃఖములకు రూపారోపణముచేసి స్వర్గనరకములు సృష్టించు కొన్నాడు. తన మనస్సులోని లావణ్యమును, సౌందర్యమును ఒకచోట ప్రోగుచేసి రంభాద్యప్స రసలను కల్పించుకొని ఊహామాత్రమాధుర్య మనుభవించుచున్నాడు. నిత్యజీవితములోని పూలు క్షణమాత్రమో, దినమాత్రమో వికాసముతోనుండి పిమ్మట వాడివత్తలైపోవుట మానవుడు సహింపలేక పరిమళముచెడని వాడని, పరువముదప్పని పరాగముగల పారిజాతాది పుష్పముల నూహించుకొని తలనూపుచున్నాడు.[2] కావున వాస్తవజగత్తున ఆతనికి లభ్యముకాని వస్తువులను, సాధ్యముకాని పదార్థములను కవితాజగత్తులో సృష్టించుకొని అవ్యక్తానందము పొందుచున్నాడు. ఇది ప్రపంచసాహిత్యము లన్నిటిలో నున్న విషయమే. ఉదాహరణకు కామదేవతను తీసి కొందము. ఇటు సంస్కృతసాహిత్యములో, అటు గ్రీకుసాహిత్యములో మదనుని ప్రస్తావన యున్నది. ఇతనిని 'పూలవింటివాడు'గా ఉభయసాహిత్యములు కల్పన చేసినవి.

'ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం
దృశాం కోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః
తథాప్యేకోఽనంగ స్త్రిభువనమపి వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.'

అంతటి నెఱజోదునకు-జగము లొక్కుమ్మడి సాధింపనెత్తిన మదనమహీపతికి—పూలే బాణములు. తుమ్మెదలబారే వింటినారి; శుకపికములే బలగము. తాను అనంగుడై కూడ సొంగుల హృదయములందు చిచ్చురగిలించును. ఈ కల్పన కవితాజగత్తునకు సంబంధించినదే. అనుభూతి (మదనానుభూతి) మాత్రము వాస్తవికము. దీనికి రూపకల్పము చేసినవాడు కవి. కావున వాస్తవికముగానున్న లౌకికానుభూతులకు కవి కమనీయరూపము కల్పించునని తేలినది.

1. ఫ్రాయిడ్ సిద్ధాంతములను చర్చించుట కిది సందర్భము కాదు. ఆధునిక కవిత్వ ప్రక్రియలను చర్చించునప్పుడు దీని చర్చవచ్చును.

2. పారిజాతాపహరణ కావ్యమున పారిజాత పుష్ప వర్ణన : ద్వితీయాశ్వాసము.

**కవి అనుభూతి :**

పైన చెప్పినది సామాజికుని అనుభూతి. కవి నైజానుభూతినిబట్టికూడ ఈ విషయమును చర్చింపవలసియున్నది. వస్తుస్థితి కవిభావనను పురస్కరించుకొని చిత్రితమగు చుండును గాని కేవలము ఆ వస్తువు యాథార్థ్యమునుబట్టి కాదు. ఒక్కొక్కమారు కవి యథార్థమున కతీతముగా భావనచేయును. కొన్ని సందర్భములలో వస్తువు యథార్థ స్వరూపము గుప్తమై ఒక క్రొత్తరూపు దానిలో మిలమిలలాడును. అదే వస్తువు కవి మానసిక స్థితిగతులనుబట్టి భిన్నసందర్భములలో భిన్నమైన అనుభూతుల నిచ్చును. లాంబర్న్ (Lamborn) అను విమర్శకుడు ఈ విషయము నిట్లు తెలపరిచెను.

'Art is the expression of the artist's mood, not the representation of objective fact. To a poet in a lover's mood, the sea smiles with him in his joy, the winds whisper the name of his beloved, the stars look down on him like friendly eyes, to the same poet, in another mood, the same sea looks grim and cruel, the winds mock his sighs, and the cold stars watch him with a passionless inscrutable gaze'.[1]

ఈ అభిప్రాయమునే ఆనందవర్ధను డిట్లు వెల్లడించెను.

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
సఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్.'[2]

ఆనందవర్ధనుని శ్లోకములకు లాంబర్న్ మాట లుదాహరణములవలె నున్నవి. తేలిన దేమనగా కవి స్వీయానుభూతులనుబట్టికూడ వస్తుస్థితిగతులలో మార్పు రాకతప్పదు. వాస్తవికత యనునది ఎల్లప్పుడు చెల్లునది కాదు. కొన్ని సందర్భములందు వాస్తవిక చిత్రణము కావ్యమునకు వన్నెగూర్చినచో, మరికొన్ని తావులందు ఆదర్శచిత్రణము (Idealism) నిగ్గులు తీర్చును.[3]

1. 'The Rudiments of criticism : P. 18.
2. ధ్వన్యాలోకము : తృతీయోద్ద్యోతము :
3. వాస్తవికత పేరుతో ప్రతిభాలోపమును, శిల్పరాహిత్యమును కప్పిపుచ్చుట పనికిరాదని హవార్డ్ ఫాస్ట్ (Howard Fast) తన 'Literature and Reality' అను గ్రంథములో ఇట్లు విశదీకరించెను. 'Realism is the reflection in literature, of life, itself. It is a ladder to the stars, a road to such art as man never knew and never dreamed of..........'. వాస్తవికత కల్పనకు సోపానపంక్తివంటిదని ఇతని అభిప్రాయము.

కవులు అలౌకికముగా ఊహించిన విషయములుసైతము కేవలము అభూతములు కావు. వానికి పునాది లౌకికానుభూతులలోనే యున్నది, స్వర్గము, ఆకాశగంగ, హంసలు మున్నగునవి సామాజికజగత్తులో బీజప్రాయముగా నున్నవే. లౌకికజగత్తులోని ఆనందధామమే కావ్యజగత్తులోని స్వర్గము. ఇక్కడి గంగయే ఇంతకు ఇమ్మడిముమ్మడి అందమును, ఉదాత్తతను సంతరించుకొని ఆకాశగంగగా రూపుదిద్దుకొన్నది. ఉదయసూర్యుని కాంతిలో మిలమిలమెరిసిపోవు ఇసుకయే ఆకాశగంగాతీరముననున్న స్వర్ణసైకతము. పున్నమినాడు పండువెన్నెలలో తళతళమెరియు సామాన్యసముద్రమే కవితాజగత్తున క్షీరసాగరము. ఇక్కడి అందమైన బాతులు, కొంగలు, అక్కడి రాజహంసలు. ఇక్కడ కవి పొందిన లౌకికానుభూతులే ఇంచుకంత భేదముతో అలౌకికవస్తువులుగా రూపొందినవి. డా. జి. వి. కృష్ణారావుగారన్న క్రిందిమాటలు ఈ సందర్భమున గమనింపదగినవి.

'కవుల వర్ణనం ప్రకారం శివుడు అలౌకికమూర్తి; కవులు ఎలా సృష్టించగలిగారా అనే సందేహం ఒకప్పుడు నన్ను పీడిస్తూవుండేది. కాని సైకోయెనలిస్టులు బండారం బయటపెట్టారు. ప్రస్తుతం శివుడు అలౌకికుడు కాడనీ, వ్యాసుడు వాసనలను ప్రకృతిమార్గాలనుపోనీక సంయమించటంవల్ల ఈ సృష్టి బయలుదేరిందనీ, శివుని ఆకృతి అలౌకికం కాదనీ, కేవలం పుంస్త్వ స్వరూపమేననీ గ్రహిస్తే చాలు'.[1]

కృష్ణారావుగారి తీర్పు సైకో-ఎనాలిసెస్ అను ఫ్రాయిడ్ సిద్ధాంతమునకు సంబంధించిన దైనను, కవిసృష్టి యేరళముగా లౌకికానుభూతులతో లంకెవేయబడియున్నదో నిరూపించుచున్నందున ఉదాహరింపబడినది.

**కవిత్వము :**

**మానవ ప్రకృతి చిత్రణము**

ఫిలిప్‌సిడ్నీకి వందయేండ్ల తర్వాత జాన్ డ్రైడెన్ అను ఆంగ్ల విమర్శకుడు 'Essay on Dramatic Poesie'ని ప్రకటించెను. ఇది ప్రధానముగా గేయనాటికల స్వరూప స్వభావములను చర్చించుట కుద్దిష్టమైన రచనయైనను కవిత్వమునుగూర్చి కొన్ని అభిప్రాయములను వెల్లడించినది. డ్రైడెన్ ఈ వ్యాసములో Play (Poetry) నిర్వచన మిట్లుచేసెను.

**'A just and lively image of human nature, representing its passions and humours, and the changes of fortune to which it is subject, for the delight and instruction of mankind'.[2]**

1. కావ్యజగత్తు : పుట 17.
2. Quoted by David Daiches in his book 'Critical Approaches to Literature' : P. 74.

ఈ విమర్శకుడు కవితాజగత్తును ఆదర్శజగత్తుగా, అలౌకికప్రపంచముగా చిత్రించిన సిడ్నీ అభిప్రాయమునకు భిన్నమైన సిద్ధాంతమును ప్రతిపాదించెను. మానవప్రకృతిని యథాతథముగా చిత్రించుటయే కవిత్వధర్మమనెను. అతనివాద మిట్లుసాగినది.

మానవప్రకృతి చమత్కారమయము, అద్భుతావహము, ఆవేశబద్ధము. ఇది కొన్ని వింతప్రవృత్తులతో లంకెవేసికొనియుండును. కావున ఆవేశబద్ధములును చమత్కృతి సిద్ధములును అయిన విచిత్ర ప్రవృత్తులకును ప్రాతినిధ్యము వహించెడి మానవప్రకృతి ప్రతిబింబమే కవిత్వము. ఈ ప్రకృతి విధివిలాసమునుబట్టి పరివర్తనమందుచుండును. విధివశమున పరిణామమందు ఈ మానవప్రకృతిచిత్రణతో సహృదయులు ఆనంద సందేశము లందుకొందురు. ఇది డ్రైడెన్ వాదసారాంశము. దీని కుదాహరణముగా హామ్లెట్ నాటకము తీసికొండనెను. హామ్లెట్ తండ్రి, తన పినతండ్రిచేత హత్యచేయబడనిచో, అతని తల్లి భర్తృ హంతయైన తన మరదిని పెండ్లియాడకుండనిచో, హామ్లెట్ ఆంతరప్రకృతిలో దాగియున్న నైజము విస్ఫుటము కాకుండెడిది. విధివశమున ఏర్పడిన సంఘటనలే హామ్లెట్ పాత్రలోని నైశిత్యమును వెలికిదన్ని, దానిని కవితాఖండముగా రూపొందించినవని డ్రైడెన్ అభిప్రాయపడెను. ఇతని అభిమతము నిట్లు సంగ్రహింపవచ్చును. కొన్ని సంఘటనలనుబట్టి మానవప్రకృతిలో వైవిధ్యము, వైలక్షణ్యము వ్యక్తమగును. దానిని ప్రకటించుటయే కవిత్వధర్మము. డేవిడ్ డైకిస్ (David Daiches) వ్యాఖ్యానించినట్లుగా డ్రైడెన్ వాదము తర్కబద్ధము. ఇతని సిద్ధాంతములో ఆధునికుల Psychological Realism (మనస్తత్త్వముపై పరిస్థితుల ప్రభావము) అను వాదము తొంగి చూచుచున్నది.

డ్రైడెన్ ప్రతిపాదించిన అభిప్రాయమునే ఇంచుమించుగా డా॥ జాన్సన్ (Dr. Johnson) బలపరిచెను. షేక్స్పియరు రచనల సంపుటికి తాను వ్రాసిన ఉపోద్ఘాతములో కవిత్వమును గూర్చి జాన్సన్ తన అభిప్రాయములను ప్రకటించెను. సిడ్నీ ప్రతిపాదించిన ఆదర్శవాదము (Idealism) ను ఖండించెను. సాధారణ మానవప్రకృతిని యధాతథముగా చిత్రించుటయే కవిత్వమనెను. అతని వాద సారాంశ మిది :— సాధారణ ప్రకృతుల సహజచిత్రణమే అన్ని కాలములలో అందరిని అలరించు గుణము. కల్పనాశక్తివలన రూపొందించిన విచిత్ర చిత్రణము తాత్కాలికముగా మాత్రమే ఆనందదాయకమగును. ఆకస్మికముగా కలుగు ఆశ్చర్యకర సంఘటనలవలన సమకూరెడి ఆనందము త్వరలోనే అంతరించిపోవును. సుస్థిరసత్యములపై ఆధారపడుటవలననే హృదయమునకు శాశ్వతానందము లభించును.

ఈ విమర్శకు లిర్వురును పాక్షికమైన మార్గమునే అవలంబించినా రనవచ్చును. ఎందుచేతననగా ఈ యిరువురు ఊహాశక్తిని, కల్పనాశక్తిని ఆదరించలేదు సరికదా కొంతవరకు త్రోసిపుచ్చిరి. నాటకరచనను దృష్టిలో పెట్టుకొనుటవలన వీరి అభిప్రాయములిట్లు వెలువడినవేమో ?

ఈ రెంటిలో డ్రైడెన్ నిర్వచనము కొంత సహేతుకముగానున్నది. అతడు 'Lively' అను శబ్దమును ప్రయోగించుటవలన సమగ్రత యేర్పడినది. మానవ ప్రకృతి ప్రతిబింబమును మనస్తత్వశాస్త్రవేత్తకూడ చిత్రింపగలడు. అతని చిత్రణము రసపత్తరముగా ఉండదు. ఆ చిత్రణమునే కవి రసాత్మకము (Lively) గా పర్యవసింపజేయును. ఏది యెట్లున్నను వీరిర్వురు ప్రధానముగా మానవప్రకృతియొక్క యథార్థచిత్రణమువైపే మొగ్గుచూపిరి. ఈ విధానము నాటకములపట్ల చెల్లును గాని కవిత్వముపట్ల పూర్తిగా వర్తించదు. ముఖ్యముగా ఆత్మాశ్రయ కవిత్వములో ఊహ, కల్పన లేనిదే సొగసు లేదు. వాస్తవస్థితికి ఊహయను సుందరచేలమును తొడిగినప్పుడే అది శోభించును. అంతమాత్రమున మానవజీవితమునుండి కవిత్వమును పూర్తిగా విడదీయుటకు వీలులేదు. కొన్ని సందర్భములలో నేనింతవరకు మనవిచేసినట్లు మానవజీవితము నకు అతీతమైన విషయములు కావ్యజగత్తున కనిపింపవచ్చును. అంతమాత్రముననే అది జీవి తమునకు భిన్నమైనలోకము కాదు.[1]

## కవిత్వము : చరిత్ర :

చరిత్రలక్ష్యము సత్యప్రతిపాదనము. ఒక విధముగా చూచినచో కవిత్వధ్యేయముగూడ సత్యప్రతిపాదనమే. అరిస్టాటలు, వర్డ్సువర్తు మున్నగువారు సత్యప్రతిపాదనము కవిత్వ ధర్మ ములలో నొకటిగా భావించిరి. తాత్కాలికమైన, ప్రాదేశికమైన సత్యములు ప్రకటించు చరిత్ర కంటె సార్వజనీనమైన సత్యములను ప్రతిపాదించు కవిత్వతత్త్వము గంభీరమైనదవి అరిస్టాటలు అభిప్రాయపడెను. ఒక స్వభావముగల వ్యక్తి ఎట్లు ప్రవర్తించునో, ఎట్లు సంభాషించునో సందర్భశుద్ధితో నిరూపణచేయుట కవిత్వలక్ష్యమని, ఇది విశ్వజనీనమైనదని ఇతడు స్పష్ట పరిచెను.[2] ఇతని అభిప్రాయమునే వర్డ్సువర్తు బలపరిచెను. కవిత్వమునకు వ్యక్తిగతమైన, ప్రాదేశికమైన సత్యము లక్ష్యముకాదని, సార్వజనీనమైన సచేతనమైన సత్యమే దాని లక్ష్యమని వర్డ్సువర్తు ప్రకటించెను.

1. 'The seperation of poetic experience from its place in life and its ulterior worths, involves a definite lop-sidedness, narrowness and incompleteness in those who preach it sincerely'.

—Principles of Literary criticism : I. A. Richards.

(కావ్యానుభూతిని జీవితమునుండి, దాని పరమార్థమునుండి వినదీయుటవలన, అట్టి సిద్ధాంతములను మనఃస్ఫూర్తిగా ప్రతిపాదించువారిలో పాక్షికదృష్టి, సంకుచితత్వము, అసమగ్రత్వము ఏర్పడును.)

2. 'Poetry is a more philosophical and a more serious thing than history; for poetry chiefly conversant about general (universal) truth, history about particular. In what manner, for example any person of a certain character would speak or act, probably or necessarily-this is universal; and this is the object of poetry.' —Poetics.

ఈ యిరువురి అభిప్రాయములవలన తేలునదేమనగా కవిత్వము - చరిత్ర - ఈ రెంటి ధ్యేయము సత్యప్రతిపాదనమేయైనను రెంటికి కొంత భేదమున్నది. కవి ప్రతిపాదించు సత్యము సార్వజనీనము, సార్వకాలికము. చరిత్రకారుడు ప్రకటించు సత్యము దేశకాలబద్ధము. దానిని విశ్వసించుటకు మనకు శాసనాద్యాధారములు కావలసియుండును. ఈ యాధారములు కవిత్వమున కవసరములేదు. ఉన్నదున్నట్లు, జరిగినది జరిగినట్లు చెప్పుటయే చరిత్రధర్మము. దానికి కార్యకారణభావ మక్కరలేదు. చరిత్ర ప్రధానముగా ప్రత్యేకవ్యక్తులపై ఆధారపడి యుండును. కావ్యమున వ్యక్తులకుగాక వ్యక్తుల వ్యాపారములకే ప్రాధాన్యమున్నది. ఆలగ్జాండరు చరిత్ర వ్రాయునప్పు డతనికి బదులుగా మరొక పేరు పెట్టినచో రసాభాసమగును. చరిత్రలో పేరున కంత ప్రాధాన్యమున్నది. కవిత్వములో అట్లు కాదు. కాళిదాసు వ్రాసిన కల్పిత కావ్యమైన మేఘసందేశమున యక్షదంపతులు నాయికానాయకులు. యక్షదంపతు లనుటకు బదులుగా గంధర్వదంపతు లన్నను కొరతరాదు. ఈ యక్షదంపతులకు కవి నామకరణము చేయకున్నను ఏలోపము కలుగలేదు. అట్లే పింగళిసూరన వ్రాసిన సుగాత్రీశాలీనుల కథలో సుగాత్రికి బదులుగా 'సుశీల' యన్నను చిక్కులేదు. కావున కావ్యములందు వ్యక్తులపేర్లు ప్రధానములు కావు. చారిత్రకకావ్యములు మరియు పురాణములపట్ల మాత్రము ఈ విషయము వర్తించదు. ఎందుచేతననగా పురాణములుసైతము చరిత్రలకు మారుపేరులే. కవిత్వములో ఆవేశమును, భావనను ఆధారముగాచేసికొని సత్యము ప్రపంచింపబడును, కేవలము నగ్నసత్యము చెప్పుట చరిత్రధర్మము మాత్రమే.

### కవిత్వము : తత్త్వశాస్త్రము :

కవిత్వము విశ్వజనీనసత్యముల నత్యంతసుందరముగా ప్రకటించు కళారూపము. తత్త్వశాస్త్రము (Philosophy) కేవలము స్థూలసత్యము (abstract precept) ను మాత్రమే తర్కబద్ధముగా బోధించును. తత్త్వశాస్త్రము బోధించునది సత్యమే కాని దానిలో స్పష్టతలేదు. అది రసవంతము కాదు. కటుకౌషధము వంటిది. కవిత్వము ఔషధప్రాయమైన సత్యమును తేనె ననుపానముగాజేసి యందించును. వేదాంతి చేసెడి బోధలు సుగ్రాహ్యముగా ఉండవు. వానిని పండితులు మాత్రమే గ్రహించగలరు. కవి అల్పబుద్ధులకుగూడ అందునట్లు బోధించగలడు. కావున కవులే జనరంజకులైన తత్త్వవేత్తలని సిడ్నీ అభిప్రాయపడినాడు[1]. తన అభిప్రాయమునకు ఉపస్కారకముగా ఈ విమర్శకుడు ఈసఫ్ కథల నుదాహరించినాడు. జంతువులే పాత్రలుగా నుండు కథలివి. ఈ కథలలో గర్భితముగానున్న నీతిబోధనలద్వారా పశువులకంటె హీనమైనవారికిగూడ ప్రబోధము కలిగించుట వీని విశిష్టలక్షణమని సిడ్నీ స్పష్టపరిచినాడు.

1. 'I say the philosopher teaches, but he teaches obscurely, so as the learned only can understand him, that is to say, he teaches them that are already taught; but the poet is the food for the tenderest stomachs, the poet is indeed the right popular philosopher.'

కవిత్వము సుందరముగా వ్యక్తీకరింపబడిన వేదాంతమని సిడ్నీ అంగీకరించుట హర్షింపదగినది. రామాయణ, భాగవత, భారతాది మహాకావ్యములు కేవలము కావ్యములే కాదు. 'అధ్యాత్మ విద్యలకు వేదాంతముల' వంటివి. మిల్టన్ వ్రాసిన Paradise Lost మున్నగు కావ్యములు తాత్త్వికవిషయ గర్భితములే. తత్త్వగంధము వ్యంగ్యముగానున్న కవిత్వము శాశ్వతమైనది. కవిత్వము శుష్కమైన కేవలతత్త్వముకన్న, ఇతిహాసముకన్న సరసమైనది, సార్వజనీనమైనదని చెప్పుచు సిడ్నీ ఈసపు పిట్టకథల నుదాహరించుట చిత్రముగా నున్నది. ఎందుకనగా ఈ పిట్టకథలు ఉదాత్తసాహిత్యసంపద కుదాహరణములు కాలేవు. మహాకవిత్వములో నుండవలసిన భావగాంభీర్యము, రసప్రతీతిలక్షణము వీనిలో నుండునని చెప్పుటకు వీలులేదు. చిత్తదీప్తిని కలిగించు గుణముమాత్రము వీనిలో ఉండవచ్చును. చిత్తద్రుతి కలిగించు శక్తి వీనిలో స్వల్పము. కవిత్వలక్ష్యము చిత్తదీప్తివరకే పరిమితము కాదు. చిత్తద్రుతిని కలిగించునప్పుడే దానికి పారమ్యము సంభవించును. అద్భుతరసము చిత్తదీప్తికి కారకము. కరుణము, శృంగారము చిత్తద్రుతి కుపస్కారకములు. ఈ రెంటిలో చిత్తద్రుతియే ప్రధానము. గుండెను కరగించునదే దండి కవిత్వము కదా ! కావున సిడ్నీ ఇచ్చిన ఉదాహరణ మంతగా సముచితమైనది కాదు.

ఇంతకు తేలినదేమనగా కవిత్వము ప్రతిపాదించు సత్యము తత్త్వశాస్త్రాదులకన్న రసవత్తరమైనదని, సులభసాధ్యమైనదని.

**కవిత్వము : శాస్త్రము :**

శాస్త్ర మొకానొక అజ్ఞాతసత్యమును వెలికిదీయును. ఆ సత్యమును కనిపెట్టినప్పుడు కలిగెడు ఆనందము ప్రధానముగా శాస్త్రజ్ఞునికి సంబంధించినదే. కవి కనిపెట్టిన సత్యమట్లు గాక సామూహికమైనది. శాస్త్రజ్ఞుడు మనకు దూరముగానున్న సత్యము నన్వేషించి దానిని ఏకాంతమున తన అంతరంగములో నిక్షేపించుకొని ఆరాధించుననియు, కవి సత్యమును ప్రత్యక్షమిత్రముగా గుర్తించి గొంతెత్తి దానినిగూర్చి పాడునప్పుడు సమస్త మానవజాతి అతనితో శ్రుతిగలుపుననియు, వర్డ్సువర్తు వ్యాఖ్యానించినాడు.[1]

అప్పుడప్పుడు కొందరు కవులు విజ్ఞానశాస్త్రమునకు సంబంధించిన విషయములను కవితాబద్ధ మొనర్తురు. అంతమాత్రమున అవి శాస్త్రజ్ఞులముద్ర నందుకోలేవు. కవి లేఖినినుండి వెలువడిన శాస్త్రసమ్మతమైన సత్యము సైతము రూపురేఖలు మార్చుకొనును. షెల్లీ మేఘమును వర్ణించిన తీరు చూడుడు.

1. 'The man of science seeks truth as a remote and unknown benefactor; he cherishes and loves it in his solitude: the poet, singing a song in which all human beings join with him rejoices in the presence of truth as our visible friend and hourly companion'. —Preface to Lyrical Ballads,

'I am the daughter of earth and water
And the nursling of the sky'.

ఇందులో మేఘము తాను జలస్థలములకు కూతురునని ఆకాశము పెంచిన శిశువునని యనును. దీనిలోని 'daughter,' 'nursling' అను శబ్దములు శాస్త్రజ్ఞులకు నవ్వుతెప్పించును.

శాస్త్రము భౌతికజీవనరంగములో అద్భుతావహములైన విజయములను సాధించినది. భూమ్యాకాశములకు వంతెన నిర్మించినది జలస్థలములను ఏకసూత్రములో బిగించినది. చంద్రమండలమును చుంబించినది. అంతేకాని మానవుని మనోవేదనలకు మందు కనుగొనలేకపోయినది. కామక్రోధమోహాది దుష్టప్రవృత్తులకు 'విరుగుడు' చూపలేకపోయినది. కవిత్వమే కొంతవరకు వీనికి పరిహారము చూపెట్టినది. కవులు మానవాత్మలకు నూత్నగవాక్షములు తెరచినారని లాంబర్న్ అన్న దీర్ఘదృష్టితోనే.[1]

శాస్త్రధ్యేయము విజ్ఞానసముపార్జనము. కవిత్వముగూడ ఆనందముతోపాటు విజ్ఞానమును ప్రసాదించు కళ. గానకళ, చిత్రకళ, శిల్పకళ ప్రధానముగా ఆనందదాయకములు మాత్రమే. కవిత్వ మట్లుగాక సర్వశాస్త్రములకు సారభూతమైన విజ్ఞానమును ఒక్క శ్లోకరూపముననో, పద్యరూపముననో అందించును, అందుకే కవిత్వములేనిదే శాస్త్రము సమగ్రముకాదని ఆర్నాల్డు అభిప్రాయపడెను.[2] వర్డ్సువర్తుగూడ కవిత్వము సమస్తవిజ్ఞానమున కూపిరివంటిదని ప్రకటించెను.[3]

### కవిత్వము గణితము కాదు :

కవిత్వమున సంఖ్య కంతగా ప్రాధాన్యముండదు. ఒకానొక సంఖ్య సూచితమైనచో దానివెనుక దాగియున్న భావము, అనుభూతి ప్రధానములు. సంస్కృతసాహిత్యమున కమలమునకు శతపత్ర మన్న పేరున్నది. కవిత్వదృష్టిలో కమలమునకు నూరురేకు లున్నవా లేవా యనునది అప్రసక్తము. అసంఖ్యాకముగా దళములున్నవని దానివెనుక దాగియున్న భావము. ఇందు కమల మెంత విశాలమైనదో, అందమైనదో వ్యక్తీకరింపబడినది అంతవరకే 'శత' సంఖ్యకు ప్రయోజనమున్నది. అట్లే సూర్యుని 'సహస్రకిరణు' డందురు. ఈ సంఖ్యగూడ సూర్యుని కిరణసంఖ్యాధిక్యమును, కాంత్యతిశయమును ద్యోతకము చేయునేకాని వాస్తవస్థితినికాదు. కావున కవితాజగత్తులో గణితము (సంఖ్యలు) కేవలము ఊహావైచిత్రికి ఉక్తివైచిత్రికి ఉపయోగపడును. ఈ రకముగా ఆచరణీయములు కాని అంశములను ఫ్రెడరిక్ ఎ. పాట్లు Imprac-

1. చూ: The Rudiments of Criticism ; P. 11.
2. 'Without poetry, our science will appear incomplete; and most of what now passes with us for religion and philosophy will be replaced by poetry'.
—Essays In Criticism.
3. 'The breath and finer spirit of all knowledge'.

tical Identifications అనెను. ఇవి కవిత్వమున కెంతేని అవసరమని ఇత డొక సిద్ధాంతమును లేవనె త్తెను. ఉపమ (Similie), రూపకము (Metaphor) మున్నగు అలంకారములీ Impractical Identifications గా ఇతడు పేర్కొనెను. ఇతని వాద మిట్లు తీగలు సాగినది. అలంకారము లనుభూతిరమ్యములు. అవి హేతుబద్ధములు (గణితములోవలె) కాకపోవచ్చును.[1] ఒకానొక ఘటనవలన కవిహృదయములో ఉద్బుద్ధమైన స్థాయిభావమే, అతని అనుభూతి పరంపరయే, ఉక్తివై చిత్రిని ఆలంబనముగా చేసికొని కవిత్వముగా బహిర్గతమగును. అనుభూతికి ప్రాధాన్యముతగ్గి ఆలోచన పై కుబికినప్పుడు వచ్చు కవిత్వము ఆహ్లాదజనకము కాదు. ఈ సిద్ధాంతమును బలపరుచుటకు ఇతడు వర్డ్సువర్తు వ్రాసిన రెండుగీతముల తారతమ్య పరిశీలనముచేసి చూపెను.

వర్డ్సువర్తు వ్రాసిన 'Thorn' అను గీతములో క్రింది పంక్తులు కలవు.

'You see a little muddy pond
Of water, never dry;
I have measured it from side to side
It is three feet long, and two feet wide'.

ఈ గీతములో ఆ బురదగుంట మూడడుగుల పొడుగు, రెండడుగుల వెడల్పున్నదని చెప్పుటలో సారస్య మేమియు కనిపించదు. ఈ కొలత ఇచ్చుటనుబట్టి చూడగా కవిదృష్టి వస్తువుపై నున్నంతగా తద్దర్శనమువలన కలిగిన అనుభూతిపై లేదని తేలినది. దీనిలో అనుభూతిస్థానమున గణితము ప్రవేశించినది. 'I have measured' అని నొక్కి చెప్పుటవలన సాధించిన ప్రయోజనమేమియులేదు. ఈ చరణములో కవిత్వగంధమునకు బదులుగా గద్య వాసన చోటుచేసికొన్నది. వర్డ్సువర్తు వ్రాసిన డాఫోడిల్సు (Daffodils) అను గీతములో ఇట్టి సందర్భమే కలదు. ఆ పంక్తులివి.

'Ten thousand saw I at a glance
Tossing their heads in sprightly dance'.

ఈ పంక్తులలో కవిత్వగంధ మున్నది. ఎందుచేత ? కవి యిచ్చిన సంఖ్య చమత్కార పారమ్యము కలది; వాస్తవమైనదికాదు. అతడు మొదటి గీతమున కొలిచిచెప్పినట్టిది కాదు. ఇందులో ఉన్నది గణితము కాదు; ఊహ. కవి పదివేల ప్రసూనములను లెక్కపెట్టినాడనుటకు వీలులేదు. ఒకవేళ ఓపికతో నేను లెక్కపెట్టితినని కవియే స్వయముగా అనె ననుకొందము. అప్పుడు దీని సొగసుకూడ ఎగిరిపోవు స్థితి వచ్చును. ఈ పంక్తులలో వ్యక్తీకృతమైనది Impractical Identification. అందుకే ఇది చమత్కారమునో, ఆనందమునో కలిగించు

1. గణితములో $1+2=3$. దీనికి తిరుగులేదు. ఇది హేతుబద్ధము.

నదిగా ఉన్నది.[1] పాట్ల్ సిద్ధాంతము, తద్వివరణము, చాలవరకు సమంజసముగానే యున్నవి. కవిత్వమనగా గణితము కాదని ఇతడు హేతుగర్భితముగా వాదించెను.

### కవిత్వము : ఆవేశము :

ఆంగ్ల విమర్శకులలో వర్డ్స్‌వర్త్, మిల్, రస్కిన్ మున్నగువారు కవిత్వమనగా ఆవేశోద్గమనమే యను అభిప్రాయమును వెలిపుచ్చినారు. వీరిలో వర్డ్స్‌వర్త్ - మొదట - ప్రబలమైన అనుభూతుల మహాప్రవాహమే కవిత్వమన్నను వెంటనే సంబాళించుకొని 'It takes its origin from emotion recollected in tranqu lity' అని తన వాదమునకు స్థిరత్వమును సమకూర్చుకొనెను. కేవలము ఆవేశము కవిత్వ మెన్నడుకాదు. కట్టమంచి రామలింగారెడ్డిగారు 'ఉద్రేకమేకదా కవితాశక్తికి ప్రాణాధారమైన కారణము'[2] అని యనిరి. ఇది అర్ధసత్యము మాత్రమే. పాట్ల్‌కూడ కవిత్వము కేవలము ఆవేశమునుండియే ఉద్భవించునన్నాడు.[3] కవిత్వమనగా అక్షరబద్ధమైన అనుభూతియనియు, కవిత్వావతరణ సమయమున తార్కికమైన ఆలోచనకు, నైతికచింతనకు తావులేదనియు ఈ విమర్శకుని అభిప్రాయము. ఇది పాక్షికమైన అభిప్రాయమే. కవిత్వమంతయు ఆవేశహఠాదుద్గమనమువలన రచింపబడినది కాదు. 'మా నిషాద' అను శ్లోకమొక్కటి వాల్మీకి ముఖమునుండి ఆవేశప్రోద్బలమువలన ఉద్గతము కావచ్చును. రామాయణమంతయు నట్లే రాలేదు. అది నెమ్మదిగా కూర్చుండి ఆలోచనా పూర్వకముగా రచించినది. వర్డ్స్‌వర్త్ అన్నట్లుగా అది 'emotion recollected in tranquillity'. ప్రపంచములోని మహాకావ్యములైన 'ఒడిస్సీ' మొదలైనవన్నియు ఈ పద్ధతిలోనే రచింపబడినవి. కావున కవిత్వ రచనకు హృదయమేకాక మేధకూడ అత్యవసరము. ఆవేశమును నిగ్రహించికొని దానిని రసస్నాతమొనర్చి సుందరమైన పదజాలములో ప్రకటించినప్పుడే ఉత్తమకవిత్వ మవతరించును, అభినవగుప్తుడు ఆవేశము రససహితముగా ఉండవలెననియే అభిప్రాయపడెను.

'ప్రతిభా అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా; తస్యా విశేషో రసావేశవైశద్య సౌందర్య కావ్యనిర్మాణక్షమత్వమ్'[4].

1. 'In the ordinary or popular sense of the term, poetry is language in which expression of the qualities of experience is felt to predominate greatly over statement concerning its uses.' —The Idiom of Poetry : P. 72.
2. కవిత్వ తత్త్వ విచారము : పుట 11.
3. 'Poetry is not a higher kind of reason, it is the first grade of verbalized experience prior to logic, prior to morality'.
—The Idiom of Poetry : P. 65.
4. లోచనవ్యాఖ్య.

రామలింగారెడ్డిగా రన్నట్టుగా ఉద్రేకమే కవిత్వమునకు ప్రాణమువంటిదగుచో, సభాసదుల హృదయములందు కల్లోలము కలుగునట్లు ఉపన్యసించు వక్త మాటలుకూడ కవిత్వము కావలసివచ్చును, కావున కేవలము ఉద్రేకము, ఆవేశము కవిత్వము కాజాలవు. ఆవేశమును నిగ్రహించి సముచిత సుందర పదజాలములో లయాత్మకముగా చెప్పినప్పుడే ఉత్తమకవిత్వ ముద్భవించును[1].

కవికి ఆవేశ మెంతయున్నదను ప్రసక్తికి తావు లేదు. ఆ యావేశము నెంత అందముగా వ్యక్తపరిచినాడనునదే విచార్యము. ప్రతిభావంతుడును, వ్యుత్పన్నుడునైన కవి మనస్సులో జనించిన ఆవేశమెట్లు సుందరకవిత్వరూపము నందుకొనునో, తదితరునిలో పుట్టిన ఆవేశమెట్లు వ్యర్థమగునో దువ్వూరిరామిరెడ్డిగారు చక్కని ఉదాహరణములో నిరూపించినారు.

''ముత్తెపుచిప్పలో వానచినుకు పడినప్పు డది మంచిముత్యముగ మారును గాని, కాకిచిప్పలో బడినప్పుడు మార్పునొందదు. ఎందువలన? ముత్తెపుచిప్పయందుకల సృజనశక్తి కాకిచిప్పయం దుండకపోవుటవలన; నీటిబొట్టు ముత్తెపుచిప్ప కడుపులో బడినప్పుడు అందొక వికారము పుట్టును. అందువలన చిప్ప లోపలిభాగమున కంటుకొనియున్న పింగాణిరంగు వాన చినుకుపై జుట్టుకొని దానినొక అమూల్యమైన ముత్యముగా మార్చివేయును''.[2] ఈ యుదాహరణమునందలి వానచినుకు ఆవేశము వంటిది, ముత్తెపుచిప్ప ప్రతిభావంతుని హృదయము. కాకిచిప్ప ప్రతిభాశూన్యుని హృదయము. నీటిబొట్టు ముత్తెపుచిప్పలో బడగానే దానిలోనున్న పింగాణిరంగు చినుకున కంటుకొని దానిని ముత్యముగా మార్చివేయును, అట్లే ఆవేశము కవి హృదయమున ఉద్భవించగానే అది రసప్రతీతినొంది అందమైన కవిత్వముగా రూపు దిద్దుకొనునని తాత్పర్యము.

షెల్లీ మున్నగువారు ఊహాప్రకటనమే కవిత్వ మన్నారు. ఇది అవ్యాప్తితో కూడుకొన్న నిర్వచనము. కేవల మూహాప్రకటనము పలువురు చేతురు. అట్లు చేసినవారందరు కవులు కాలేరు. ఆ ఊహకు తగిన తోడుగవసరముకదా! కార్లైల్ గానసహితమైన ఆలోచనము కవిత్వమన్నాడు. ఈ నిర్వచనముదృష్ట్యా గానగుణములేని వచనగీతముల రూపమున వ్రాసిన రచనలు కవిత్వము కాకపోవచ్చును. కాన ఇది సమగ్రమైన నిర్వచనము కాదు. ఇక మెకాలే శబ్దమునకే ప్రాధాన్య మిచ్చినాడు. ఇది రీతివాదుల ధోరణి. ఉత్తమకవిత్వమునకు శబ్దము కాదు ప్రధానము; అర్థము; రసము. ఆర్నాల్డు కవిత్వమునకు వ్యక్తీకరణము ప్రధాన మన్నాడు.

1. లాంబర్న్ ఇట్లే అభిప్రాయపడెను.
'To exist as poetry, emotion must be translated into music and visual images, clear and beautiful; they may be terrible or saddening, but still beautiful; for it has been said that the greatest mystesy of poetry is its power to invest the saddest things with beauty' —The Rudiments of Criticism: P. 14.

2. కవికోకిల గ్రంథావళి: 4 వ భాగము: పుట 23.

అందముగా చెప్పినదంతయు ఉత్తమకవిత్వము కానేరదు.[1] కాలరిడ్జి నిర్వచనములలో ఒకటి ప్రయోజనదృష్టితో చేసినది. మరియొకటి నిర్వచనమువలెకాక వివరణమువలె నున్నది. ఇందులో కవిత్వముయొక్క ప్రత్యంగపరిశీలనము చేయబడినది. జాన్సన్, లేహంట్ చేసిన నిర్వచనములలో స్పష్టత కొరవడినది. చిక్కు లెక్కువైనవి. ఈ నిర్వచనము లన్నిటిలో సంక్షేపగుణమును, సమగ్రతను దృష్టిలో ఉంచుకొని చూచినచో ఎడ్గర్ ఎలన్ పో (Edgar Allen Poe) అను అమెరికాదేశపు రచయిత చేసిన నిర్వచనమే సమగ్ర మనిపించుచున్నది. అతని నిర్వచనమిది. 'Poetry is the rhythmic creation of beauty'. అనగా సౌందర్యముయొక్క లయబద్ధమైన సృష్టియే కవిత్వము. ఈ నిర్వచనములో కవిత్వమున కుండవలసిన లయసౌందర్యములు రెండున్నవి. సౌందర్య మన్నప్పుడు రమణీయార్థమని అర్థము. పఠితలో ఆనందమును కలిగించునదే రమణీయార్థము. నిరంతర దర్శన మననములచేత ఏది అపూర్వముగా, నిత్యనూతనముగా కనిపించునో అదే రమణీయత్వ లక్షణము. రమణీయార్థమును లయబద్ధముగా సృష్టించుట కవిత్వ మనుట సమంజసముగా నున్నది. Creation అను శబ్దముగూడ ఔచితీవిలసితము. కవిత్వ మనుకరణము కాదు. నూత్నసృష్టి యని దీని అభిప్రాయము. కవిత్వమునకు, గద్యమునకు స్థూలమైన భేదము రచనారీతిలో నున్నది. కవిత్వము లయాత్మకముగ నుండుట ప్రాథమికగుణమని చెప్పవలయును. ఇతడు ఛందోబద్ధమైనదే కవిత్వ మనలేదు. లయబద్ధమైనదని మాత్రమే యనుటవలన ఛందస్సులేని Free verse, Blank verse (ముక్తచ్ఛందోరీతులు) మొదలైన కవితారీతు లన్నియు ఈ నిర్వచనములో ఇమిడిపోయినవి. Free verse గూడ 'లయ', 'తూగు' అత్యంత ప్రధానమైన గుణములు. కావున ఈ నిర్వచనము సంక్షిప్తముగా సమగ్రముగా నున్నదనవచ్చును. నిర్వచనమునకు సంక్షేపమే ప్రధానమైన లక్షణము కదా!

### కవిత్వము : ఛందస్సు :

మనవేదముల షడంగములలో ఛంద స్సొకటి. వేదములలోని ఋక్కులు ఛందోబద్ధములు. లౌకికకావ్యములలో మొదటిదైన వాల్మీకిరామాయణము అనుష్టుప్ఛందస్సులో నడచినది. క్రౌంచమిథున వియోగమువలన అశ్రుస్విన్నహృదయుడైన వాల్మీకినోటినుండి అప్రయత్నముగా బహిర్గతమైన వాక్కులు 'పాదబద్ధము'లు, 'అక్షరసమము'లు, 'తంత్రీలయసమన్వితము'లు. నాటినుండి నేటివరకు సంస్కృత కవిత్వము – దాని ప్రభావము కుత్తుక బంటిగ ఉన్న తెలుగుకవిత్వము – ప్రాయికముగా ఛందోఘటితములే. ఆంగ్లసాహిత్యములో గూడ ఆదినుండి ఛందస్సునకు తగిన స్థానమున్నది.

ఛందస్సు కవిత్వమున కెంతవర కవసరమను విషయమున సంస్కృత లాక్షణికులంతగా పట్టించుకొనలేదు. వారు కావ్యములను మూడు విధములుగా విభజించిరి. (1) పద్యకావ్యము.

1. ఈ విషయము కవిత్వ ప్రయోజనమును చర్చించునప్పుడు వివరింపబడును.

(2) గద్యకావ్యము. (3) చంపూ కావ్యము (గద్యపద్యోభయము). వారిదృష్టి రసభావాదులపై నున్నంతగా ఛందస్సుపై లేదనుట కీవిభాగమే సాక్ష్యము. గద్యములో వ్రాయబడిన కాదంబరి, దశకుమారచరిత్రము మొదలైన గ్రంథములను వారు కావ్యములుగానే భావించిరి. పైగా సంస్కృతములో గద్యమువ్రాసి మెప్పించుటయే ఘనవిషయమను అభిప్రాయముండినట్లు 'గద్యం కవీనాం నికషం వదంతి'వంటి నానుడులవలన తెలియుచున్నది.

కేవలము ఛందోబద్ధమైన శబ్దసముచ్చయమును కవిత్వమని ఏలాక్షణికు డొప్పుకొనడు. సంస్కృతాంధ్రములలో కొన్ని వైద్యశాస్త్రములు, వ్యాకరణ గ్రంథములు, గణితగ్రంథములు, నిఘంటువులు, అలంకార గ్రంథములు పద్యములలోనే వ్రాయబడినవి. అంతమాత్రమున వానిని కవిత్వములో జేర్చుట హాస్యాస్పదము. కేవలము గద్యములో వ్రాయబడిన కాదంబర్యాదులను కవిత్వము కాదనుటకు వీలులేదు కాని లయవాసనలేని గద్యమును కవిత్వముగా పరిగణించుట కష్టము. కవిత్వమన్నప్పుడు గణనియమము లేకున్నను కనీసము లయయైన ఉండుట వాంఛనీయము.

కావ్యములో ఛందస్సునకుగల ఆవశ్యకతనుగురించి ఆంగ్లవిమర్శకుల అభిప్రాయముల నిక్కడ చర్చించుట ఆవసరమని భావింతును.[1]

ఫిలిప్‌సిడ్నీ 'The greatest part of the poets have apparelled their poetical inventions in that numbrous kinde of writing which is called verse'[2] అన్నాడు. ఛందస్సు కవితాత్మ కొక తొడుగువంటిది మాత్రమే యని, అది కవిత్వమునకు హేతువుగాక అలంకారము మాత్రమే యని ఇత డభిప్రాయపడెను. ఛందస్సు లేకున్నను ఉత్తమకవిత్వము సాధ్యమని కాలరిడ్జి అభిప్రాయపడెను. 'Poetry of the highest kind may exist without metere' అని ఇతడన్నాడు. దీనికి నిదర్శనముగా ప్లేటో, టేలర్ (Taylor) మున్నగువారి వచనరచనల నెత్తిచూపినాడు. కార్లయిల్ (Carlyl) ఛందస్సు కవిత్వమున కవసరమను అభిప్రాయము నిట్లు ప్రకటించెను. 'For my own part, I find codsiderable meaning in old vulgar distinction of poetry being metrical, having music in'. ఇతడు కవిత్వమునకు ఛందస్సుతోపాటు ఒకరకమైన సంగీతముండవలె వలెనని అభిప్రాయపడెను. ఇతని గద్యరచనలలో అనేక భాగములను కావ్యఖండములుగా ఎత్తి చూపవచ్చును. లే హంట్ (Leigh Hunt) కవిత్వమునకు ఛందస్సు అనివార్యమని అభిప్రాయపడినాడు. కొందరు కవిత్వమునకు ఛంద స్సంతగా అవసరములేదన్న వాదము నితడు 'prosaical mistake' అని ఎగతాళిచేసెను. అతని వాద మిట్లున్నది.

1. ఈ భాగము వ్రాయుటలో Hudson వ్రాసిన 'An Introduction to the study of Literature' అను గ్రంథము చక్కగా ఉపకరించినది.
2. An Apologie for Poetrie.

'Fitness or unfitness for song, or meterical excitement, make all the difference between poetical spirit demands it - that the circle of its enthusiasm, beauty and power, is incomplete without it'.[1]

అచ్చమైన కవిత్వమునకు ఛందస్సు అత్యంత నిసర్గ మనియు, అది లేనిదే కవిత్వము అసమగ్రమనియు లే హంట్ అభిప్రాయము.

కవిత్వమును ఆర్నాల్డు 'criticism of life' అని నిర్వచించెను. ఇంత స్థూలముగా నిర్వచించిన ఇతడుగూడ కవిత్వమునకు లయ అవసరమనెను. గద్యపద్యములు రెంటిలో ఈ లయ ఉండవలెనని, ఈ రెంటికి కొంత అంతరముండునని అభిప్రాయపడెను. ఛందస్సు కవిత్వమునకు సమగ్రతకూర్చు అంగములలో ఒకటని చివరకు తీర్పుచెప్పెను.

వీరిలో ఛందస్సు కవిత్వమున కనివార్యమని కొందరు, అంతగా అవసరములేదని మరి కొందరు అభిప్రాయపడినారు. ఛందస్సులేనిదే కవిత్వములేదని చెప్పుట సాహసము. అట్లే ఛందోబద్ధమైన ప్రతిరచన కావ్యఖండ మనుటకు వీలులేదు. గ్రేవ్ నవలలో Aylmer's fiield మున్నగు నవి పద్యరచనలు. Silas Mariner మొదలైనవి గద్యరచనలు. ఈ రెంటికి తారతమ్యము చూపుట కష్టము. వర్డ్సువర్తు ఎక్స్‌కర్షన్ (Excursion) అను సుదీర్ఘ గీతములోని కొన్ని భాగములు కేవలము గద్యగంధులే. వచనమునే ముక్కలుగాజేసి సమపాదములుగా అతికించినట్లనిపించును. కాన ఇది కవిత్వము కాదందుమా ? హోమరు గ్రీకుభాషలో ఛందోబద్ధముగా వ్రాసిన ఒడిస్సీ (Odyssey)కి బుచర్ (Butcher) ఇంగ్లీషులో చేసిన అనువాదము కేవలము గద్యాత్మకమే. అంత మాత్రమున దీనినుండి కావ్యగుణములు లేచిపోయినవా ? ఈ కావ్యమునే పోపు ఛందస్సులో వ్రాసెను. కాని బుచర్ రచనలోని రామణీయకము దీనిలో సన్నగిల్లినది. అనగా కావ్యత్వమునకే హాని కలిగినది. కొన్ని రచనలు పద్యగద్యములకు మధ్యవర్తులుగా నిలుచును. వాల్ట్‌విట్మన్ వ్రాసిన Leaves of Grass, షేక్స్పియరు నాటకములలోని కొన్ని ఘట్టములు, టర్జినీవ్ (Turgenev) వ్రాసిన వచనగీతములు, బ్లేకు వ్రాసిన Rhapsodies ఇట్టివే. భారతకవులలో రవీంద్రుని 'గీతాంజలి' మున్నగు గీతములు, తెలుగులో వెంకటేశ్వరవచనములు, తాళ్ళపాకవారివచనములు ముక్తచ్ఛందస్సులో వ్రాసినవే. వీనిలో కవిత్వగుణము పరాకాష్ఠనందుకొన్నదను విషయము త్రోసిపుచ్చుటకు వీలులేదు. ఈ విధముగా పరిశీలించినచో ఛందస్సు కవిత్వమున కనివార్యమను వాదము పరాస్తమగును. సర్వసాధారణముగా అది కవిత్వమునకు శోభాదాయకమైన అంగము మాత్రమే. ప్రపంచమునందలి అన్ని భాషలలోని ఉత్తమకావ్యములలో అధికసంఖ్య ఛందోఘటితము లైన కావ్యములదే. కాని అల్పసంఖ్యలోనున్నను ముక్తచ్ఛందస్సులోని కావ్యములనుండి మొగము త్రిప్పుటకు వీలులేదు.

1. **Imagination And fancy.**

నిరంతర రచనాభ్యాససిద్ధుడైన కవి ముఖతః జరిగిన భావప్రకటనము తనంతతాను ఛందస్సులో వెడలుట ప్రకృతివిరుద్ధము కాదు. దీనినే దువ్వూరి రామిరెడ్డిగా రిట్లన్నారు. 'కవి హృదయము భావశబలితమై ఉద్రిక్తమైనప్పుడు, భావములు తమంతతాము ఉచితమైన భాష వెదకికొని లయాన్వితముగ ప్రవహించును'.[1] మానవుడు మానవుడుగా రూపొందినప్పటినుండి శాశ్వత గభీరభావములన్నియు లయబద్ధమైన భాషలో ప్రకటితమగుటకు త్వరపడినవనియు, భావము తీవ్రతరమైనకొలది భాషలో లయకు నిర్దిష్టమైన రూపమేర్పడినదనియు ఆంగ్లవిమర్శకుడు మిల్ అభిప్రాయపడినాడు.[2]

సంగీతమువలె ఛందస్సు కవిభావనలకు బలము చేకూర్చును. అర్థమునకు ప్రాధాన్యము లేని కొన్ని శబ్దముల కలయికవలన ఉత్పన్నమగు రాగములే సహృదయులను తన్మయుల నొనర్చుచుండగా భావయుక్తమైన, రసభరితమైన పదసమ్మేళనముగల పద్యములు ఛందోబద్ధము లైనప్పుడు కలుగు ఆనందపారవశ్యమును వేరు వివరింపవలయునా? పైగా వివిధచ్ఛందో రీతులు పఠితలో వివిధ భావములను రేకెత్తించుట కుపయోగపడును. ఒక్కొక్క లయలో, తూగులో రచింపబడిన గీతము ఒక్కొక్క ప్రయోజనమును సాధించును. ఒక ప్రత్యేకమైన తూగులో విసురులో బిగింపులో వ్రాయబడిన పద్యమును చిరుమార్పులతో వచనమువలె వ్రాసినచో దాని మౌలికసౌందర్యము నేలపాలగును. ఈ అభిప్రాయమును జేమ్సు మాంట్గోమరీ (James Montgomery) అను ఆంగ్లవిమర్శకుడు నొక్కిచెప్పినాడు. అతని అభిప్రాయ సారాంశ మిది :- మిల్టన్, షేక్స్పియరువంటి కవుల గేయభాగములను వచనమువలె పేర్చినచో వాని సౌందర్యము లుప్తమైపోవును. గరికపై ముత్యములవలె భాసించు మంచుబిందువులను చేతిలోనికి తీసికొన్నచో అవి నీరుగారిపోక తప్పదు. వస్తువదే కాని దాని రూపలావణ్యములు లోపించినవి.[3] ఈయుదాహరణమువలన కవిత్వమునకు లయ యెంత ఆవశ్యకమైనదో స్పష్టమైనది. 'లయ'నే ఆంగ్లవిమర్శకులు rhythm అన్నారు. ఛందస్సు భావప్రకటనమునకు శృంఖలయని కొందరన్న వాదములో కొంత సత్యమున్నది. కొందరి కిది అయశ్శృంఖల అగుచో, మరికొందరికి సువర్ణ

1. కవికోకిల గ్రంథావళి : 4 వ భాగము : పుట 11.
2. 'Ever since man has been man, all deep and sustained feeling has tended to express itself in rhythmical language, and the deeper the feeling the more characteristic and decided the rhythm'.

—Thoughts on Poetry And its Varieties.

3. 'How much the power of poetry depends on the nice inflections of rhythm alone, may be proved, by taking the finest passages of Milton and Shakespeare and merely putting them into prose, with the least possible variation of the words themselves. The attempt would be like gathering up drops which appear jewels and pearls on the grass but run into water in the hands; the essence and elements remain; but the grace, the sparkle, and the form are gone'.

శృంఖల. ఎట్లయినను శృంఖలాత్వము ఛందస్సునకు తప్పనిసరి లక్షణము, కాని 'లయ' అట్టిది కాదు. ఇది కవిత్వమునకు స్పందన గుణమును ప్రసాదించును. కావ్యమునకు, పద్యమునకు వైలక్షణ్యమును ప్రసాదించు గుణము లయయే. విశ్వకవి రవీంద్రుడీ అభిప్రాయమునే ఇట్లు బలపరిచెను.

'Just as the banks give each river a distinct personality, so does rhythm makes each poem an individual creation'.[1]

## కవిత్వ హేతువులు :

సంస్కృతలాక్షణికులును ఆంగ్లవిమర్శకులును కవిత్వహేతువులనుగూర్చి చర్చించిరి. మొదట సంస్కృతలాక్షణికులు తెలిపిన కవిత్వహేతువు లేవియో పరిశీలింతము.

ప్రతిభయే కవితాబీజమని తొలిసారిగా ప్రతిపాదించినవాడు భామహుడు. దండి ప్రతిభతో పాటు పాండిత్యమును ప్రయత్నమును కావ్యహేతువులుగా పేర్కొన్నాడు. పూర్వవాసనా గుణాను బంధియైన ప్రతిభ లేకున్నను పాండిత్యముచేతను, అభ్యాసవశమునను వాగ్దేవి అనుగ్రహము సంపాదించినవ్యక్తి కవియగునని ఇతని తాత్పర్యము. రుద్రటుడు శక్తివ్యుత్పత్త్యభ్యాసము లనెడు మూడుగుణములను కావ్యహేతువులుగా పేర్కొని, ప్రతిభను సహజప్రతిభ, వ్యుత్పాదిత ప్రతిభ యని ద్విధా విభజించెను. వ్యుత్పాదితప్రతిభ మంత్రశాస్త్రాదుల నభ్యసించుటవలన విశదీక రించెను. ఆనందవర్ధనుడు ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభయే గరీయసి యనెను. ప్రతిభావంతుని దోషములుసైతము గుణములుగానే పరిణమించుననెను. మమ్మటుడు దండ్యాదులవలెనే ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములను కావ్యహేతువులుగా పేర్కొనెను.[2] ఐనను ఇతని నిర్వచనములోని 'ఇతి హేతుః' అనునది గమనింపదగినది. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు దేనికది కావ్యహేతువు కాక, మూడింటి సమాహారమే కావ్యహేతువని ఈతని తాత్పర్యము. నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ (ప్రతిభ), లోకశాస్త్ర కావ్యాదిపరిశీలనమువలన కలిగిన పాండిత్యసంస్కారము, అభ్యాసము, ఈ మూడింటిలో ఏది లోపించినను కవిత్వము అసంపూర్ణముగా నుండును. వీనిలో ప్రతిభ అగ్రేసర మైనది.[3] అవ్యుత్పత్తికృత దోషములను కప్పివేయుట కిదే సమర్థమైనది.

ఇక ఆంగ్లవిమర్శకుల అభిప్రాయములను పొందుపరుతును. R. P. Cowl అను విమర్శకుడు Theory of Poetry In England అను గ్రంథములో కావ్యహేతువులు (Requirements of the poet) గా వీనిని పేర్కొనెను. (1) Observation and

1. Glimpses of Bengal. —Lectures on Poetry : III part.
2. 'శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్'
'కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే.' —కావ్యప్రకాశము.
3. 'ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా గరీయసీ.' —ధ్వన్యాలోకము.

Description : వస్తుపరిశీలనము, వర్ణనము దీని క్రిందకు వచ్చును. (2) Sensibility : కవియొక్క ఆలోచనాతీవ్రత దీని లక్షణము. (3) Reflection : మనోవికారములు, చేష్టలు వస్తువుతో సమున్మీలనము పొందు స్థితి యిది. (4) Imagination and fancy ; ఊహ, కల్పన. (5) Invention : సృజనాత్మకగుణము. (6) Judgment : ఔచిత్య విచారము.

వీనిలో Imagination, Fancy, Invention, Description అనునవి సంస్కృత లాక్షణికులన్న ప్రతిభకు సంబంధించినవే. Observation, Sensibility, Reflection అనునవి వ్యుత్పత్తిలోని భాగములే. విషయవిభజనలో తప్ప సిద్ధాంతరీత్యా వీనిలో క్రొత్తదనము లేదు. ఫ్రెడరిక్ ఎ. పాట్ల్ కవిత్వహేతువులలో Expressiveness (వ్యక్తీకరణశక్తి) ప్రధాన మన్నాడు. ఈ శక్తి ప్రతిభవలన, అభ్యాసమువలన సాధ్యము. ప్రతిభ దైవదత్తమన్న మన ప్రాచీనమార్గ మునే ఈత డనుసరించెను.[1] ఎంతగా విజ్ఞానము పెరిగి మెదడు హేతుబద్ధమగునో అంతగా ఈ ప్రతిభ నశించునని ఈతడనెను. వ్యుత్పత్తి లన ప్రతిభ నశించునన్న ఈ వాదము సమంజస మైనది కాదేమో? వాల్మీకి కాళిదాసాదులు, హోమరు, భాసరు, షేక్స్పియరు మున్నగువారు కూలంకష పాండిత్యము కలవారు కారా? అంత మాత్రమున వారిప్రతిభ క్షీణించినదా! వారిది వ్యుత్పత్తికి మించిన ప్రతిభ. అంతేకాదు ప్రతిభను ప్రదర్శించు పాండిత్యము వారి కలవడినది. కావుననే వారు మహాకవులైరి. ప్రతిభను గుండెతో, పాండిత్యమును కండతో పోల్చవచ్చును. గుండెకు తగిన కండ ఉన్నప్పుడే వ్యక్తికి సమగ్రరూపమేర్పడును గదా!

## కవిత్వ ప్రయోజనము :

అభినవగుప్తుడు వాఙ్మయము ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, కాంతాసమ్మితము అని మూడు విధములుగా విభజించెను. వేదములు ప్రభుసమ్మితములు. పురాణములు మిత్ర సమ్మిత ములు. కావ్యములు కాంతాసమ్మితములు. అనగా స్వాధీనపతికయైన సాధ్వీమణి రూపలావణ్య గుణాలంకారములచేత భర్తను వశపరుచుకొని వ్యంగ్యముగా కర్తవ్యోపదేశ మొనర్చినట్లు, కావ్యము హృదయమునకు ఆనందసందేశము లందించునని దీని తాత్పర్యము. అభినవగుప్తునిదృష్టిలో ఆనందోపదేశములు రెండును కావ్యప్రయోజనములని తేలినది. లాక్షణిక శిరోమణియగు భరతుడే ఈ యభిప్రాయమును తొలుత వెల్లడించెను. కావ్యము (నాట్యము) యొక్క బహుళ ప్రయోజనములలో అతడు ధర్మము, కామము, ఉత్సాహము, హితోపదేశము, విశ్రామ

1. 'The unusual degree of expressive power which causes a man to be recognized as a poet is his by grace of God (poeta nascitur) and it is not increased by the strenuous discipline through which he acquires wisdom and virtue.'

—The Idiom of Poetry : P. 67.

జనకత్వము మున్నగువానిని చేర్చెను.[1] భరతుని 'విశ్రామ జనకత్వ'మే క్రమముగా 'ఆనంద' రూపమున ప్రయుక్తమైనది. భామహుడు చతుర్వర్గప్రాప్తి, కళావైచక్షణ్యము, ఆనందము, కీర్తి అనువానిని కావ్యప్రయోజనములుగా పేర్కొన్నాడు. దండి వాఙ్మయ దర్పణమున ఆదిరాజుల యశోబింబము ప్రతిబింబించునని పలికి సాహిత్యమునకు సామాజిక జీవన చిత్రణము ప్రయోజనమను అంశమును ధ్వనింపజేసెను. ఆనందవర్ధనునికి ముందున్న లాక్షణికులు పల్వురు కావ్యప్రయోజనములలో ప్రీతితోపాటు కీర్తిని, హితోపదేశమును చేర్చుచు వచ్చిరి. ఆనందవర్ధనుడు వీనిలో కేవలము మనఃప్రీతినే గ్రహించెను. 'సహృదయజన మనః ప్రకాశ'మే కావ్యప్రయోజనమని స్పష్టపరిచెను. అభినవగుప్తు డీబాటలోనే సాగిపోయి, కావ్యమున కెన్ని ప్రయోజనము లున్నను 'ప్రీతిరేవ ప్రధానమ్' అని ఆనందవర్ధనుని బలపరిచెను. మమ్మటుడు ప్రాచీనాలంకారికులు ప్రతిపాదించిన ప్రయోజనములనే ఒకచోట కుదించి చెప్పెను. వారిలో సద్యఃపరనిర్వృతి, ఉపదేశము ఎన్నదగినవి.

పాశ్చాత్యులలోగూడ పల్వురు ఆనందోపదేశములనే కావ్యప్రయోజనములుగా స్వీకరించిరి. వర్డ్సువర్తు ఆనందమే ప్రధానమనెను. ఇత డుపదేశమును ప్రస్తావించలేదు. డ్రైడెన్, బ్లేక్ ఆనందమే ప్రధానమని, నీతిబోధ అనుషంగికమని యనిరి. మిల్టన్ నీతిబోధయే ప్రధానమని భావించెను. ఎడ్గర్ ఎలన్ పో కవిత్వధర్మము ఆనంద సంధానమేకాని సత్యప్రతిపాదనము కాదని తెలిపెను. ఫిలిప్‌సిడ్నీ కవిత్వప్రయోజనములలో ఆనందసందేశములు రెండును ముఖ్యమైనవే యనెను. కవిత్వమునకు ప్రయోజనమేమని విచారించుటయనగా కవిత్వస్థాయిని క్షీణింపజేయుటయేయని బ్రాడ్లీ అభిప్రాయపడెను. ఆస్కార్‌వైల్డ్ 'కళలన్నియు నీతిబాహ్యము' లన్నంత దారుణముగా సాగిపోయెను.[2] ఈ ఒక్క అభిప్రాయమును తీసివేసినచో మిగిలిన విమర్శకులలో కొందరు ఆనందసందేశములు రెండును ముఖ్యములే యనిరి. మరికొందరు కేవలము ఆనందమేయని, కేవల ముపదేశమేయని అనిరి. ఇంక కొందరు ఉపదేశ మవసరము లేదనియు అనిరి.

సంస్కృతలాక్షణికులలో ఆనందోపదేశములు సమానమని కొందరు, ఒకటి అనుషంగికము, ఇంకొకటి ప్రధానమని మరికొందరు అనిరి. కాని ఉపదేశ మక్కరయేలేదని అన్నవారు లేరు. పాశ్చాత్యులలో అట్లుగాక మిల్టన్‌వలె నీతిబోధయే ప్రధానమనువారు, ఆస్కార్‌వైల్డ్‌వలె నీతిరాహిత్యమునే ప్రతిపాదించువా రుండుట గమనింపదగినది. ఈ రెండురకములైన అభిప్రాయములు పాక్షికదృష్టితో గూడుకొన్నవే.

1. నాట్యశాస్త్రము : ప్రథమాధ్యాయము.
2. 'All the arts are immoral. To morals, belong the lower and less intellectual spheres'. —Inventions.

ధర్మశాస్త్రములందు ప్రవచించినట్లు కావ్యములందు వాచ్యముగా నీతి చెప్పబడగూడ దన్నచో ఎవరి కేమి అభ్యంతర ముండదు. కళలు నీతిబాహ్యములనియు, నీతి కేవలము 'మిడిమిడి'జ్ఞాన మున్నవారికి మాత్రమే యనియు, ప్రతిభాశాలురకు నీతి యనవసరమనియు వైల్డ్ వెల్లడించిన అభిప్రాయము సాహసోపేతమైనదని చెప్పవలె. అందముగా చిత్రించిన ప్రతి కావ్యము ఉపాదేయము కాదు. తెలుగులో ముద్దుపళని 'రాధికాసాంత్వనము' చదువుచున్నప్పుడు పఠితలో అవశ్యముగా ఒకవిధమైన స్పందనము కలుగవచ్చును. పంచేంద్రియము లూయల లూగవచ్చును. అంతమాత్రమున దానిని ఉత్తమకావ్యశ్రేణిలో చేర్చుటకు వీలులేదు. రాధికా సాంత్వనము ఇంద్రియలౌల్యమును కలిగించు కావ్యమేకాని మనోబుద్ధ్యహంకారముల కతీతముగా ఆత్మానందము కలిగించునది కాదు. ఆత్మానందమును సమకూర్చుటకు, హృదయము నున్నత పథములకు తీసికొనిపోవుటకు భంగ్యంతరముగా, వ్యంగ్యముగా ఉపదేశమధువు నందించు కావ్యమే సర్వవిధముల సమర్థమైనది. దుప్పూరి రామిరెడ్డిగారు చక్కని ఉదాహరణముతో ఈ విషయము నిట్లు విశదీకరించినారు.

'ఒకవేళ నీతిబాహ్యమైన వస్తువు రమణీయమై యుండినయెడల షేక్స్పియరు మహాకవి సృజించిన క్లియోపాత్రా (Cleopatra) కన్యవలె మానవలోకమున కుపద్రవము కలుగజేయును. శకుంతలవలె అనుభోగ్యము కాదు'.[1]

కావున వైల్డ్ ప్రతిపాదించిన సిద్ధాంతము కేవలము అరాజకమునకు దారిదీయునదిగా నున్నది. ఇక నీతిరాహిత్యము నంతగా నొక్కి చెప్పకున్నను బ్రాడ్లీ నీతిప్రస్తావన అనవసరమని అభిప్రాయపడెను. ఇదికూడ పాక్షికమే. కావ్యములలో ఉపదేశములను బొత్తిగా విస్మరించు టకు వీలులేదు. New Testament, Pilgrim's Progress వంటి గ్రంథములు, వాల్టేర్, బైరన్, స్విఫ్ట్ మున్నగువారి రచనలు, రామాయణ భారతాదులు, రఘువంశాది కావ్యములు ఒకానొక పరమార్థమును దృష్టిలో నుంచుకొనియే రచింపబడినవి. ఈ కావ్యములను పఠించు సహృదయులుగూడ ఆ పరమార్థమును దృష్టిలోనిడుకొనియే ఆనందింతురు. అంతమాత్రమున ఈ కావ్యాత్మలకు హైన్యము కలుగుటలేదు. వీనిలోని కవిత్వపు విలువలు ఏ మాత్రము దిగి పోవుటలేదు. Ancient Mariner మున్నగు ఇంగ్లీషుకావ్యములు ప్రత్యేకమైన సందేశమును వహించినవి కావు. ఇట్టికావ్యములను చదువునప్పుడు పఠితకు సందేశమువైపు దృష్టిపోవు ప్రసక్తియే లేదు.

డ్రైడెన్ మొదలైనవారు ఆనందసందేశములలో ఆనందమే ప్రథమమని, సందేశ మాను షంగికమైనదని అభిప్రాయపడిరి. ఈ సిద్ధాంతమే సర్వవిధముల తలమానికము వంటిది. సంస్కృతలాక్షణికులలో అభినవగుప్తాదులు 'తథాపి ప్రీతిరేవ ప్రధానమ్' అని ఇట్టి అభిప్రాయ

1. కవికోకిల గ్రంథావళి : 4 వ భాగము : పుట 60.

మునే వ్యక్తపరిచిరి. సహృదయునకు ఆనందానుభూతి కలిగించి క్రమముగా అతనిని కర్త వ్యోన్ముఖుని జేయుటయే కవిత్వ పరమప్రయోజనము. మానవుని మనస్సునందలి క్షుద్రవాసనల నశింపజేసి దానిని శరత్కాలకాసారమువలె చేయు మంత్రశక్తి ఆనందమునకే సుసాధ్యము మన ప్రాచీనులు చెప్పిన 'ఆనంద' మాహాత్మ్యము నుగ్గడించుచు ఈచర్చ ముగింతును.

'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే
ఆనందాద్ధ్యేవ జాతాని జీవంతి
ఆనందం ప్రయాం త్యభిసంవిశంతి.'[1]

---

1. తైత్తిరీయోపనిషత్తు : భృగువల్లి.

# ప్రథమ ఖండము

## (నన్నయనుండి 19 వ శతాబ్ది ప్రారంభము వరకు)

### ప్రవేశిక :

ఇంతవరకున్న రెండు ప్రకరణములలో సంప్రదాయ ప్రయోగముల నిర్వచన వివరణములను పొందుపరిచితిని. కవిత్వముగూర్చి ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయములను చర్చించితిని. ఇక ఆధునికాంధ్ర కవిత్వములో సంప్రదాయమునకుగల స్థానమును, నూత్న ప్రయోగముల స్వరూపమును చర్చింపవలసియున్నది. కాని ఆ ప్రకరణము ప్రారంభించుటకు ముందు ప్రాచీనాంధ్ర సాహిత్యములో ఎప్పటికప్పుడు జరిగిన సరిక్రొత్త ప్రయోగములను వివరించుట ఆవశ్యకమని తోచుచున్నది. ఇరువదవ శతాబ్దిలోనే ఒక్కమాటుగా క్రొత్తదనపు వెల్లువ వెలికి చిమ్ముకొని రాలేదు. ఆంధ్రసాహిత్య ప్రారంభమునుండియే ఇట్టి ప్రయోగములు కోకొల్లలుగా జరిగినవి. సృష్టిలోనే నవ్యతాప్రీతి యున్నదికదా ! మాథ్యూ ఆర్నాల్డు చెప్పినట్లుగా 'Old order changeth yielding place to new'. అందుకే నన్నయ మొదలుకొని 19 వ శతాబ్ది ప్రారంభమువరకు వచ్చిన మార్పుల నొక భాగముగా. 19 వ శతాబ్దినుండి 20 వ శతాబ్ది ఆరంభమువరకు కలిగిన మార్పుల నింకొక భాగముగా - ఈ రెంటిని కలిపి ఒక ప్రకరణముగా పొందుపరుచుచున్నాను.

### యుగ విభజనము :

ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు పలువురు పలువిధములుగా యుగవిభజన మొనర్చినారు. రాజవంశములనుబట్టి కావ్య ప్రక్రియలనుబట్టి మార్గదర్శకులైన మహాకవులనుబట్టి ఈ విభజనము జరిగినది. వీనిలో కావ్యప్రక్రియలనుబట్టి, మహాకవులనుబట్టి చేసిన విభజనమే సమంజసముగానున్నది. కావ్యప్రక్రియలనుబట్టి చేసినచో ప్రాఙ్నన్నయయుగము, అనువాదయుగము, కావ్యయుగము, ప్రబంధయుగము. దక్షిణాంధ్రయుగము అని ప్రాచీనసాహిత్యమును పేర్కొనవచ్చును. వీనిలో ఇంకను తగ్గించుటకు అవకాశమున్నది. కవితాపరిశీలన దృష్టితో చూచినచో ప్రాఙ్నన్నయయుగ మొక యుగముకాదు. భాషాదృష్ట్యా దానికి ప్రాధాన్యమున్నదే కాని కవితాదృష్టితో కాదు. ఇక కావ్యయుగమను ప్రత్యేకవిభజన మక్కరలేదనియే అనిపించును. శ్రీనాథుని కావ్యములుగాని, అతని కాలమునను, అతనితర్వాత ప్రబంధయుగమునకు

పూర్వము వెలువడిన కావ్యములుగాని 'ముప్పాతిక మువ్వీసము' అనువాదములే కాని స్వతంత్ర కావ్యములు కావు. మార్కండేయపురాణాదు లెట్లనువాదములో, నైషధాదికావ్యములు నట్లే. అయినను పాలకురికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రమువంటి అపవాదములు లేకపోలేదు. కొంతవరకు నన్నెచోడుని కుమారసంభవము ఇట్టిదే. ఇక కథాకావ్యములైన జక్కన విక్రమార్కచరిత్ర, కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశిక మున్నగునవి సంపూర్ణముగా స్వతంత్ర ప్రబంధములు కావు. వానికి మాతృకలు ఒక గ్రంథములో కాకున్నను అనేక గ్రంథములలో విడివిడిగా నున్నవి. కావున నన్నయనాటినుండి ప్రబంధయుగ ప్రారంభమువరకు కావ్యములు వెలువడినను, పురాణములు వెలువడినను, ఇవి ప్రాయికముగా అనువాదగ్రంథములే కాబట్టి దీనిని అనువాదయుగ మన్నచో చెల్లును.

ఇక ప్రబంధయుగముననే తొలిసారిగ స్వతంత్రకావ్యరచనము సాగినది. ఈ యుగమున గూడ హరిభట్టు మత్స్యపురాణమువంటి పురాణానువాదములు వెలువడినను ప్రధానముగా స్వతంత్ర కావ్యములైన ప్రబంధములే వెలువడినవి. కావున దీనిని ప్రబంధయుగమనుట యుక్తము.

దక్షిణాంధ్రయుగమున ఏ యొక్క ప్రక్రియయును శిఖరస్థాయి నందుకొనలేదు. యక్ష గానములు, ద్విపదకావ్యములు, గద్యకావ్యములు, శృంగార ప్రబంధములు, కీర్తనలు, వచనములు, గేయములు, ద్వ్యర్థికావ్యములు మున్నగు వివిధ ప్రక్రియలు వెలసినవి. కాబట్టి దీనిని ప్రక్రియనుబట్టి విభజించుట కష్టము. దక్షిణాంధ్రయుగమనుటలోనే సౌకర్యమున్నది. కాబట్టి ఈ యుగమును అ పేరుతోనే వ్యవహరింపవచ్చును.

ఇక ఈ మూడుయుగములలో జరిగిన వినూత్న ప్రస్థానములను, విశిష్టప్రయోగములను వివరింతును.

## నన్నయకు ముందటి ఆంధ్రసాహిత్యము :

వేదవేదాంగములు జ్ఞాన ప్రతిపాదకములైనను అవి జనసామాన్యమున కందుబాటులో నుండెడివి కావు. ప్రజలలో అనుదినము ప్రవృద్ధమగు జ్ఞానతృష్ణ నుపశమింపజేయుటకు పండితులు పురాణములను రచింపవలసివచ్చినది. క్రమముగా పురాణములలోని రసవంతమైన గాథలు కావ్యరూపము ధాల్చి జ్ఞానమును సర్వజనులకు కరస్థపేటికగా చేసినవి. సంస్కృత భాషలో రచింపబడిన పురాణములు, కావ్యములు జనసామాన్యమునకు సులభబోధకములుగా నుండెడివి కావు. ఈ రహస్యమును గమనించియే జినుడు, గౌతమబుద్ధుడు ప్రజావ్యవహార క్షుణ్ణమైన భాషలోనే ధర్మోపదేశము చేయుట కారంభించిరి. ప్రజాహృదయమును సులభముగా నాకర్షించుటకే ప్రాకృతభాషాభేదమైన పాలీభాషలో ధర్మపథము, బుద్ధజాతక గాథలు మున్నగు గ్రంథములను వెలువరించిరి. ఈ మార్పువలన దేశభాషలకు గౌరవ మేర్పడినది. అవి నవచైతన్య విలసితములు కాజొచ్చినవి. పదవ శతాబ్దికిముందే దక్షిణ దేశములో తమిళ, కర్ణాటక సాహిత్య

ములు ననలెత్తి పుష్పింపసాగినవి. తమిళములో తొల్కాప్పియమ్ తిరుక్కురళ్ వంటివి క్రీస్తుకు పూర్వమే వెలువడినవందురు. క్రీస్తు తర్వాత సిలప్పదికారమ్, మణిమేకలై మొదలైనవి వెలసినవి. పెరిందేవనార్‌చేత భారతము రచింపబడినది. కన్నడ భాషలో కవిరాజ మార్గము వంటి లక్షణ గ్రంథములు, విక్రమార్జున విజయమువంటి ప్రౌఢకావ్యములు వెలువడినవి. ఇది ఆనాటి దక్షిణ దేశములోని సాహిత్యస్థితి. ఇక తెలుగు సాహిత్యమునుగురించి వివరింతును.

## నన్నయకు పూర్వము తెలుగు :

నన్నయకు పూర్వము తెలుగుభాష యెప్పటినుండి ఉన్నదను విషయమును పరిశీలించుటకు శాసనములు మాత్రమే ప్రబల సాక్ష్యములు. క్రీ. శ. ప్రథమ శతాబ్దికిచెందిన అమరావతీ స్తూపములో 'నాగబు' అను శబ్దమున్నదని, దీనిలో 'బు' అనునది అమహద్వాచక ప్రథమైకవచన ప్రత్యయమైన 'ము' వర్ణమునకు రూపాంతరమని పరిశోధకుల అభిప్రాయము. శాతవాహనుల తరువాతి రాజులైన ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, ఆనంద గోత్రికులు, విష్ణుకుండినులు, పల్లవులు మున్నగువారి యేల్బడిలో వేయించిన శాసనములు ప్రాకృతమునందో, సంస్కృతమునందో కలవు. ఈశాసనములలో పేర్కొనబడిన ఊర్ల పేర్లు, ప్రతి గ్రహీతలపేర్లు కొన్ని తెలుగు పదములను పోలియున్నవి. ఊరు, చెరువు, పల్లి మొదలగు పదములతో ముగియు గ్రామనామములు పెక్కులు కనిపించుచున్నవి. ఈ పదములనుబట్టి ఆనాటి తెలుగుభాషా స్వరూపమును తెలిసికొనుట కష్టము. ఆనాటికి తెలుగుభాష జనుల వ్యవహారములో నుండెడిదను విషయముమాత్ర మీ పదములవలన వ్యక్తమగుచున్నది.

మొనమొన్నటివరకు జయసింహవల్లభుడు వేయించిన విప్పర్లశాసనమే (క్రీ. శ. 641) తెలుగుభాషలోని మొట్టమొదటి శాసనమను అభిప్రాయ ముండెడిది. కాని ఇటీవలి పరిశోధనల ఫలితముగా ఆరవ శతాబ్ది చరమపాదమునకు సంబంధించిన ధనంజయుని కలమళ్ళ శాసనము తొలితెలుగు శాసనమని తెలియవచ్చినది.[1] క్రీ. శ. 848 కు చెందిన పండరంగని అద్దంకి శాసనములో ఒక తరువోజ కలదు. ఆ కాలమునకు సంబంధించిన కందుకూరు ధర్మవర శాసనములలో సీసపద్యము లున్నవి. క్రీ. శ. 934 కు చెందిన యుద్ధమల్లుని బెజవాడశాసనములో అయిదు మధ్యాక్కర లున్నవి. శాసనములందు లభించిన ఈ పద్యములు జాతులో, ఉపజాతులో అయియున్నవి. వృత్తములు కావు. క్రీ. శ. 1000 ప్రాంతమునాటిదని పరిశోధకులు నిర్ణయించిన విరియాలకామసాని గూడూరు శాసనములో మూడు చంపకమాలలును, రెండు ఉత్పలమాలలును కలవు. ఇవి సంస్కృత వృత్తముల ఛాయలను సంతరించికొన్న తెలుగు వృత్తములు.

## నన్నయ చేసిన నవ్య ప్రయోగములు :

నన్నయకు పూర్వము చెదురుమదురుగా దేశిచ్ఛందస్సులో వ్రాయబడిన పద్యములు, సకృత్తుగా చంపకోత్పలమాలలవంటి వృత్తములుమాత్ర ముండెడివి. ప్రామాణికమైన గ్రంథ

1. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము : డా॥ దివాకర్ల వెంకటావధాని : పుట 13.

రచన సాగలేదు. చాళుక్య ప్రభువులు దేశీయ భాషాభిమానము కలవారు కావున ఆనాడు వ్యవహారముననున్న తెలుగుభాషలో శాసనములు వేయించుటకు ప్రయత్నించిరి.[1] అంతేకాని దేశభాషయైన తెలుగులో కావ్యములు రచించుటకు ఆనాటి కవులెవ్వరును సాహసించలేరైరి. చాళుక్య ప్రభువైన రాజరాజనరేంద్రునకు తెనుగులో ఉత్తమగ్రంథ మొక్కటైనను రాలేదను విచారము కలిగినది. ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడైన నన్నయభట్టు ఆతని దృక్శృంగాటకమున మెరసిపోయెను. రాజరాజు ప్రోత్సాహముతో నన్నయ వ్యాసరచిత మహాభారతము నాంధ్రీకరించుటకు కంకణధారియయ్యెను. తెలుగులో ఒక కావ్యము వ్రాయుటకు గంటమూనుటయే ఆనాడు సాహసోపేతక్రియ. అసంస్కృతముగానున్న తెలుగులో పంచమవేదము నందించుట సామాన్యమైన పనికాదు. పద్యములేకాక ఆ కాలమున తెలుగుభాషలో తగిన పదజాలమేలేదు. ఉన్న కొన్ని శబ్దములుగూడ ఒక్క రూపములో లేవు. 'ఆనతి' అనుటకు 'ఆణతి' అని, 'కొడుకులు' అనుటకు 'కొడ్డుకళ్' అని, దేవుడు అను ఒక్క శబ్దము 'దేవడు', 'దేవండు', 'దేవణ్డు' అని, 'తూర్పు' అను పదము 'తూఱ్పు', 'తూఱ్గు', 'తూఱ్వ' అని, 'రెడ్లు' అనుటకు 'రట్టగుళ్ళు' అని, 'ఎనిమిది' అనుటకు 'ఎణంబొది' అని ఆనాటి శాసనములలో వ్రాయబడుచుండెడివి.[2] ఇంకను హ్రస్వముండవలసినచోట దీర్ఘములు. సాధురేఫముండవలసినచోట శకటరేఫము, బిందువుండవలసినచోట వర్గపంచమాక్షరము ప్రయోగింపబడుచుండెడివి. ఈ శాసనశబ్దము లన్నిటిని పరిశీలించినచో ఆనాడు తెలుగుభాష ఎంతగా ద్రవరూపములో నుండెడిదో తెలియుచున్నది. ఈ విధముగా విభిన్నరూపములలోనున్న పదజాలమును సంస్కరించుకొని, వృత్తసంఖ్యను పెంచి, వాక్యరచనా విధానమును నిర్ణయించి ఒక మహాకావ్య రచనకు కావలసిన భాషాసామగ్రిని నిర్మించుకొనవలసిన గడ్డుసమస్యను ధైర్యముగా నెదుర్కొని సమర్థముగా నిర్వహించిన వాగనుశాసనుడు నన్నయభట్టు. కన్నడములో అంతవరకే పరిణతమైన కవితా స్వరూపము నన్నయకు తెలుగు పద్యరచనలో ఉపకరించినది. ఆనాటి కన్నడ సాహిత్యస్వరూపమును దిఙ్మాత్రముగా మనవిచేసి వానిద్వారా నన్నయ సాధించిన క్రొత్త రీతులను విపులీకరింతును.

కన్నడభాషలో క్రీ: శ. 700 నాటిదని తలపబడుచున్న శ్రావణ బెళగొళశాసనములందు, సంస్కృత వృత్తములలో రచింపబడిన కన్నడపద్యము లున్నవి. ప్రాచీన కన్నడ శాసనములలో దేశిరచనలు క్వాచిత్కముగా కన్పించుచున్నవి. ముఖ్యముగా ఎనిమిదవ శతాబ్దినుండి కన్నడ శాసనములలో సంస్కృత వృత్తము లధికమైపోయినవి. నన్నయకు ముందున్న రత్నత్రయము (పంప, రన్న, పొన్నకవులు) దేశిరచనల నంతగా ఆదరించక, సంస్కృత వృత్త

---

1. 'మును మార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్ర విషయంబున జన చాళుక్యరాజు మొదలగు పల్వుర్'

—కుమార సంభవము : అవతారిక నన్నెచోడుడు.

2. ఆచార్య గంటి జోగిసోమయాజిగారి 'ఆంధ్రభాషా చరిత్రము' మరియు ఆచార్య ఖండవల్లి లక్ష్మిరంజనంగారి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము' నుండి గ్రహించిన పదములివి.

బహుళముగానే కావ్యరచన చేసెను. ఇక తెలుగులో నన్నయకు ముందు కన్పించని కంద పద్యములు కన్నడభాషలో నుండుట గమనించదగిన విషయము. కన్నడభాషలో తొలిలక్షణ గ్రంథమైన (నన్నయకు ముందటిది) కవిరాజమార్గములో కందపద్యములు పెక్కులున్నవి. వీనితోపాటు సంస్కృత వృత్తములు, గీతికలును కలవు. ఆ గ్రంథములో ''బెదెండె' అను ఒకరకమైన కావ్యప్రక్రియ ఉదాహరింపబడినది. ఒక కందపద్యము తర్వాత ఒక వృత్తమును రచించి అందందు జాతులను పొదిగినచో అది 'బెదెండె' కావ్యమగునట.[1] ఈ గ్రంథములోనే పేర్కొనబడిన 'బెత్తాణె'యను కావ్యప్రక్రియగూడ ఇంచుమించుగా నిట్టిదే. వీనినిబట్టి ఒక విషయము తేలుచున్నది. సంస్కృత కావ్యములలోవలె ఏకవృత్తముతో నుండు ఆశ్వాసములుకాక కన్నడములో కవిరాజమార్గమునాటికే సంస్కృత వృత్తములు, దేశీయపద్యములు, గీతికలు చేర్చిన రచన లున్నవి. కన్నడ కవితామార్గములో వృత్తవైవిధ్య మంతవరకే ఒక సంప్రదాయముగా ప్రతిష్ఠితమైనది. నన్నయకు ముందు తెలుగులో ఇట్టి రచనలేదు. అద్దంకి శాసనములో పద్యములు, గద్యము కలసి ఉండుటవలన కొంతవరకు చంపూ కావ్యగంధ మున్నట్లు ఊహింపవచ్చును. కాని యిది సంస్కృత వృత్తములతోపాటు దేశీయచ్ఛందస్సులను కలిపివ్రాసిన పద్ధతి కాదు. గద్యపద్యములు మాత్రమే కలిసిన రీతి. నన్నయ తెలుగు సాహిత్యములో చేసిన నవ్యప్రయోగమిందే యున్నది. కేవలము తరువోజ, సీసము, మధ్యాక్కర మొదలగు దేశి పద్యములతో మహాభారతరచన కొనసాగించుట దుస్సాధ్యము. వాని కంతటి సమర్థత ఉన్నదో లేదోయని ఆయన వెనుదీయుటయు సహజమే. ఇక శార్దూలాది సంస్కృత వృత్తములు అంతవరకు తెలుగులో ప్రవేశించలేదు. కేవల సంస్కృత వృత్తములను గ్రహించినచో దేశీయతకు భంగము కలుగును. ఈ రెంటిని సమన్వయము చేయవలెనని నన్నయ సంకల్పించెను. కన్నడ కావ్యములలోని 'బెదెండె' మున్నగు కావ్యప్రక్రియ లాయనకు బాగుగా ఉపకరించినవి. కన్నడములో ప్రయుక్తములైన శార్దూలాది సంస్కృత వృత్తములకు తెలుగుతనమును కల్పించి భారతమున ప్రవేశపెట్టెను. కన్నడములోలేని యతినియమము నీతడు క్రొత్తగా ప్రయోగించెను. యతి తెలుగునకు క్రొత్తకాదు. తరువోజ, సీసము, మధ్యాక్కర మున్నగు దేశి పద్యములలో ఇది విధిగా ప్రయోగింపబడినదే. అనగా ఇది దేశీయ సంప్రదాయ మన్నమాట. పైగా 'అక్షరసామ్య' యతి తెలుగుభాషలోని ప్రత్యేకలక్షణము. సంస్కృతములో 'విరతి' తప్ప అక్షరసాదృశ్యము లేదు. ఇదే తెలుగుదేశీయత. దేశీయమైన ఈ యతిలక్షణమును, కన్నడములోని ప్రాసమును గ్రహించి రెంటిని మేళవించి నన్నయ సంస్కృత వృత్తముల (స్రగ్ధరమున్నగు వాని) లోని యతినియమమును మార్చివేసి క్రొత్తచోట యతిని ప్రవేశపెట్టెను. ఇవి నన్నయ ఛందోవిషయికముగా చేసిన నూతన ప్రయోగములు. భాషావిషయికముగాగూడ

1. 'కందము మమళిన వృత్తము మొందొందెదె గొందుజాతి జాణెసెయె బెదం
గొందివఖిళమరె పేళల్బందర రూపిం 'బెదెండె' గబ్బ మదక్కుం'. —కోరాడ
రామకృష్ణయ్యగారి భాషాసారస్వతములు : దేశి. పుట 12.

నన్నయ విస్మయ జనకములైన ప్రయోగములు చేసినాడు. ఇంతవరకు పేర్కొన్న పరస్పర విభిన్న పదరూపములను సంస్కరించి వానిలో సాధువులని తోచినవిమాత్రమే గ్రహించినాడు. తూఱ్పు, తూఱ్వు, తూర్పు అను శబ్దములలో 'తూర్పు'ను మాత్రమే స్వీకరించినాడు. దీనికి ప్రమాణము లోకము. 'ప్రవాహినీదేశ్యా'యని సూత్రీకరించిన మహానుభావు డీతడేకదా ! పైగా శబ్దసిద్ధి లోకవ్యవహారమువలన తెలియునని ఘంటాఘోషముగా చాటిన వాగ్విదు డీతడే. తనకు ప్రామాణికములని తోచిన రూపములను మాత్రమే ప్రయోగించి వానికి గ్రాంధికత కలిగించినాడు. ద్రవరూపములోనుండి క్షణక్షణ పరివర్తనాత్మకమైన భాషకు ఒక స్థిరరూపమును కల్పించినాడు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగా రన్నట్లు వ్యాకరణాదివ్యవస్థలేక అల్లిబిల్లిగా అల్లుకొనిపోయిన ఆంధ్రభాషావల్లరిని బూడిదనుండి లేవనెత్తి సంస్కరించినాడు నన్నయ్య.[1]

నన్నయకు పూర్వము మణిప్రవాళశైలి యుండెడిదేమో అని అనుమానించుటకు వీలగుచున్నది. పాలకురికి సోమనాథుడు వృషాధిప శతకములో మణిప్రవాళమున కుదాహరణముగ పేర్కొన్న క్రిందిపద్య మీ అనుమానమునకు కారణమగుచున్నది.

"అనయము చేతులందు భవదంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను మాటల నిన్వరివస్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకనసేయుదు భక్తలోకహృ
ద్వనజవిహారలోల బసవా ! బసవా ! బసవా ! వృషాధిపా."

పాలకురికి సోమనాథుడు పేర్కొన్న యీ మణి ప్రవాళశైలి యనగా - మణులను ప్రవాళములను గూర్చి యల్లిన దండవలె సంస్కృత ప్రత్యయములుగల శబ్దములు తెలుగు పదములు కలిపి చేసిన రచనారీతి. ఈ రీతి నన్నయకు పూర్వమున్నదనుటకు చమలూరి శాసనము ప్రమాణము.[2] కన్నడములో ఇట్టిరీతి యుండెడిదనుటకు కవిరాజమార్గకర్త చెప్పిన ఈ పద్యమువలన స్పష్టమగును.

'సమసంస్కృతంగళొళ్ త
త్సమద్దిరె కన్నడ మనఱిదు పేళ్గెంబుది దా
గమ కోవిద నిగదిత మా
ర్గమిదం బెరసల్క మాగదీ సక్కదదొళ్' (కవిరాజమార్గం—1-51)

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము : పుట 28.

2. 1968 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన నన్నెచోడుని కుమార సంభవమునకు వ్రాసిన ఉపోద్ఘాతమున డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారు 8వ శతాబ్దికి చెందిన విజయాదిత్య చోళుని చమలూరి శాసనములోని మణిప్రవాళశైలినిపోలిన పంక్తులనుదాహరించినారు. 'దేవశర్మాణ పుత్రస్య అగ్నిశర్మారికిచ్చిన దత్తి'.

కన్నడములో కొందరు కవులు సంస్కృత విభక్తి ప్రత్యయములతో కూడుకొనిన శబ్దములను, దేశభాషాశబ్దములను కలిపి రచనచేయగా అది విద్వత్సమ్మతమైన మార్గము కాదని, శిష్టమార్గము కాదని నిరసించినా డితడు. తెలుగుభాష కన్నడమునకు సైదోడుగా పెరిగిన భాషకాబట్టి ఈ భాషలో సైతమిట్టి పద్యరచన ఉండియుండవచ్చును. ఇందుకు పాలకురికి సోమనాథుని పద్యము ప్రబలమైన సాక్ష్యము. తరువాతి లాక్షణికుడైన కేతన ఆంధ్ర భాషా భూషణములో వృక్షేణ, దక్షాయవంటి సంస్కృత విభక్తి ప్రత్యయములును, అస్తి, సంతి, గాయంతివంటి క్రియలును, గంతుం, హంతుంవంటి తుమున్నంతములును, అపి, చ, తుహి మున్నగు అవ్యయములును ఆంధ్ర కవితలో ప్రవేశించుటకు వీలులేనివని స్పష్టీకరించినాడు. దీనిని బట్టి కేతనకుముందు ఇట్టి పదములు తెలుగు కవిత్వములో చేరెడివేమోయని అనుమానించుటకు వీలగుచున్నది. పాలకురికి పేర్కొన్న పద్యమున 'సరోజయుగం' మొదలైనవి సంస్కృత విభక్తి ప్రత్యయములు, 'నమామి' మున్నగునవి సంస్కృత క్రియారూపములే కదా. కావున మణి ప్రవాళశైలిని దృష్టిలోనుంచికొనియే కేతన ఈ హెచ్చరిక చేసినట్లు తెలుచున్నది. మొన్నమొన్నటివరకు మళయాళభాషలో మణిప్రవాళశైలిలో కావ్యములే వెలువడినవను విషయము భాషావిదులకు విదితమే. నన్నయకు పూర్వముండిన వాఙ్మయస్వరూపము ద్విధావిభక్తమయి యుండెననుటకు వీలున్నది. సామాన్యప్రజలు గేయములతో వినోదించియుందురు. పండితులు సంస్కృతమును వీడలేక, దేశిరచనలను కాదనలేక మణిప్రవాళశైలిని సృష్టించుకొని యుందురు. నన్నయ ఈ మణిప్రవాళశైలిని త్రోసిపుచ్చి, సంస్కృతశబ్దములకు తెలుగుదనము కల్పించెను. సంస్కృతవిభక్తి ప్రత్యయములను యథాతథముగా స్వీకరించుటమాని సంస్కృతపదములకు తెలుగువిభక్తి ప్రత్యయములను, సంస్కృతధాతువులపై 'ఇంచు'గాగమాదులనుజేర్చి, తత్సమపద భాండాగారమును వృద్ధిచేసెను. తెలుగున కీనాడు ఎట్టి భావమునైనను, ఎట్టి రసమునైనను మెప్పించు శక్తిమంతమైన భాష యున్నదనగా, అది నన్నయపెట్టిన భిక్షయే. ఆనాడు నన్నయ కేవలము దేశిపదములతో తృప్తిపడి యుండినచో మన భాష ఇంతగా సుసంపన్నమయ్యెడిదికాదు.

ఈ విధముగా నన్నయభట్టారకుడు భాషావిషయములో, వృత్తనిర్మాణ విషయములో, కావ్య రచనావిషయములో క్రొత్తదారులు నెలకొల్పినాడు. ఇతని రచన అనువాదమేయైనను అంధానుకరణముకాక అక్కడక్కడ స్వాతంత్ర్యము నవలంబించిన స్వచ్ఛందానువాదము. తరువాతికవులకు ఈ పద్ధతియే మార్గదర్శకమైనది. తానుచేసినది అనువాదమేయైనను అది మూలాతిశాయియైన పటిమను పుణికిపుచ్చుకొనవలెనని నన్నయసంకల్పము. క్రింది పద్యమిందుకు ఉపస్కారకముగా నున్నది.

'జననుత ! కృష్ణద్వైపా
యనమునివృషభాభిహిత మహాభారత బ

ద్ధనిరూపితార్థ మేర్పడ
తెనుగున రచియింపు మధికధీయు క్తి మెయిన్.

—ఆంధ్రమహాభారతావతారిక.

ఈ పద్యమున 'తెనుగున రచియింపు' మనుమాట గమనింపదగినది. రాజరాజు నన్న యను వ్యాసప్రోక్త సంస్కృత భారతమును తెనిగించుమనలేదు. వ్యాసుని మహాభారతములో నిరూపింపబడిన అర్థమును (పరమార్థమును) తెలుగుభాషలో అధికధీయుక్తితో 'రచియింపు' మన్నాడు. కేవలానువాదమునకు అధికధీ క్తి అక్కరలేదు; నిర్మాణమున కవసరము. వ్యాస ప్రోక్త భారతములోని పరమార్థమును తెనుగుభాషలో పునర్నిర్మాణము చేయవలెననియే ఈ పద్యములోని తాత్పర్యార్థము. కన్నడమున పంప డిట్లు చేయలేదు. అతడు వ్యాసభారతమును యథామాతృకముగా అనువదించలేదు. జైనమత ప్రతిపాదనమున కనుగుణముగా కథలో, రచనలో కావలసిన మార్పులు చేసికొనెను. నన్నయ కథను మార్చలేదు. భారతములోని ప్రధానకథ, ఉపాఖ్యానములు వైదికమతము నుద్బోధించునవి. నన్నయ వైదికమతాభిమాని. అప్పటికే చైతన్యరహితములై పట్టువీడుచున్న బౌద్ధజైన మతముల స్థానములో వైదికమతమును స్థాపించవలెనని అతడు కాంక్షించియుండును. రాజరాజు కోరికయు ఇదే. కావుననే నన్నయ భట్టారకుడు మూలకథలో మార్పులుచేయక వర్ణనలందుమాత్రము స్వాతంత్ర్యమును కనబరిచి నాడు. వ్యాసకథిత పరమార్థమును తెలుగుజనులకు శ్రవణామృతముగా అందించుటకు ప్రయత్నించినాడు. ఒకానొక మూలగ్రంథమును అనువాదార్థమై స్వీకరించి, అందందు రచనా స్వాతంత్ర్యము కనబరుచుట తెలుగుభాషలో నన్నయతోనే ప్రారంభమైనది. ప్రబంధయుగ మునకు ముందున్న కవులలో ఒకరిద్దరు (నన్నెచోడ సోమనాథులు) తప్ప మిగిలినవారందరును ఈతని బాటలో నడచిన వారే. కాబట్టి నన్నయచేసిన ప్రయోగములలో స్వేచ్ఛానువాద ప్రక్రియ యొకటి.

తెలుగులో కావ్యరచనకు శ్రీకారముచుట్టుటయే నన్నయచేసిన గొప్ప ప్రయోగము. దేశ భాషలలో పంచమవేదము నందించుటయే మహాసాహసముగా ఆనాటి సంస్కృతాభిమానులైన పండితులు భావించియుందురు. నన్నయ కెంతో తరువాతివాడైన విన్నకోట పెద్దన సంస్కృత భాషాభిమానులకు ఆంధ్రభాషపట్లగల నిరసనభావమును తెలిపియున్నాడు.[1] విన్నకోట పెద్దన నాటికే ఇట్టి యభిప్రాయము విద్వన్మండలిలో నుండెననగా నన్నయకుముం దిది యెంత మెండుగా

1. "విలసద్పావరసాద్యలంకృతులచే విప్పారి గీర్వాణ భా
షల కబ్బంబుల కెట్టి చక్కదనముల్ సంధిల్లు నాచందమై
వలియుం బ్రాసయు నంతకగ్గలముగా వర్తిల్లు సత్కావ్యముల్
తెలుగంచుం జెవిఁబెట్టలేమి కకటా! తేగల్గెనే మందిలన్."
—కావ్యాలంకార చూడామణి.

నుండెడిదో ఊహింపవచ్చును. నన్నయ భావతావతారిదిలోని ఈ క్రింది పద్యమువలన అతడు చేసినది సాహసమని, సరిక్రొత్త ప్రయోగమని స్పష్టమగుచున్నది.

'పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు వానస ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడుఁ దనకిష్టుడుఁ సహా
ధ్యాయియునైనవా డభిమతంబుగఁ దోడయి నిర్వహింపగఁ'.

ఈ పద్యములో నన్నయకు నారాయణభట్టను పండితుడు చేసిన సహాయము భారత యుద్ధములో అర్జునునికి నారాయణుడు చేసిన సహాయముతో పోల్చబడినది. నారాయణభట్టు సంస్కృత కర్ణాట పైశాచికాంధ్ర భాషలయందు కవిరాజశేఖరుడు.[1] ముఖ్యముగా ఇతడు కన్నడభాషలో అంతవరకే వెలువడిన కవితారీతులను గ్రహించి, వానిని తెలుగులో ప్రవేశపెట్టు విషయమున నన్నయకు తోడ్పడియుండును. నారాయణభట్టు సహకారముతో నన్నయభట్టు ఆనాటి ఉద్దండ సంస్కృత పండితుల నెదిరించి దేశభాషలో ప్రప్రథమముగా మహాగ్రంథ నిర్మాణము చేయుటకు సాహసించినాడు. ఆయన భారత భారతీ సముద్రమును దరియంగ నీద లేకపోయినను, ఈదినంతమేరకు 'గజయాత' కాంద్రకు మార్గదర్శకుడైనాడు.

## నన్నెచోడుని నవ్యత :

సంస్కృతములో కాళిదాసువలె తెలుగులో తొలిసారిగా మహాకావ్యరచనకు పూనుకొన్న వాడు కవిరాజ శిఖామణి నన్నెచోడుడు. ఈ మహాకవి కాలముగురించి జరిగిన వాదప్రతివాదములు తెలుగులో ఇంకే కవినిగూర్చి జరుగలేదేమో ? కొంద రీతనిని నన్నయకు ముందువాడని, మరి కొందరు సమకాలికుడని, ఇంక కొందరు తరువాతివాడని, మరికొందరు తిక్కన తరువాతివాడని వాదించిరి. నన్నయకు తరువాతివాడను వాదమే బహువిమర్శకామోదము పొందినది. కుమార సంభవ రచన క్రీ. శ. 1170 వ ప్రాంతమునకు ముందుగానే జరిగియుండునని మత సంప్రదాయ ములనుబట్టి నిరూపింపవచ్చునని సిద్ధుదవోలు వేంకటరావుగా రభిప్రాయపడినారు (కుమార సంభవ పీఠిక : పుట 17). ఈ కవిరాజ శిఖామణి 12 వ శతాబ్ది మధ్యభాగములో నున్నవాడను దృష్టితోనే ఈతని నవ్యరీతులను పరిశీలింతము.

నన్నెచోడునికి పూర్వము తెలుగుభాషలో నన్నయ మహాభారతమే ఏకైక మహాగ్రంథము. నన్నయ భారతము సంస్కృత భారతమున కనువాద గ్రంథము. పైగా అది కేవలము కావ్యమే కాదు; ధర్మశాస్త్రము, అధ్యాత్మవిదులకు వేదాంతము, ఐతిహాసికుల కితిహాసము, వీనితోపాటు కవివృషభులకు మహాకావ్యము. అనగా భారతము విశ్వజనీనమైన గ్రంథము. దీనిని నన్నయ

1. 'య స్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్రభాషాసు కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన—' —నందంపూడి శాసనము.

ప్రతిభా బలముతో స్వతంత్ర కావ్యమో యన్నట్లు రూపొందించినాడు. ప్రధానముగా నన్నయ దృష్టి 'ప్రసన్న కథాకలితార్థయుక్తి'పై నున్నది. మూలభారతములోని 'అభిప్రాయము'ను దాని లోని 'నిరూపితార్థము'ను తెనుగువారికి తెల్లముచేయుట నన్నయ కర్తవ్యము. భారతమును సంహితగా భావించి ఆతడు రచనకు పూనుకొన్నాడు. కాబట్టి నన్నయదృష్టి ప్రధానముగా పౌరాణికము, అనుషంగికముగా కావ్యసంబంధి.

నన్నెచోడునిదృష్టి దీనికి భిన్నము. ఈతడు తెలుగులో మహాకావ్యరచన చేయు సంకల్పముతోనే కుమార సంభవమును ప్రారంభించెను. కృత్యాదిలో వస్తుకవితను ప్రస్తుతించెను. మార్గదేశి కవితలను ప్రస్తావించెను. సత్కావ్య మెట్టిదో నిర్వచించెను. కవిత్వమున కుండవలసిన లక్షణములను వివరించెను. వీనినిబట్టి చూడగా ఈతనిది ప్రధానముగా కావ్యరచనా దృష్టి యనియే తెలుచున్నది. కేవలము శివపారమ్యము నుపలక్షించియే యీ కావ్యము వ్రాయలేదు. వీర శైవమత ప్రతిపాదనముగూడ ఈతని దృష్టికాదు. మధ్యమధ్య ఈతడుచేసిన వేదముల ప్రస్తావన ఇందు కుపస్కారకమైన అంశము. శివపారమ్యము నుద్ఘాటించుట ఈతని ప్రణాళిక లోని ఒక అంశము కావచ్చును. మతదృష్టి, రసదృక్పథము, వర్ణనామార్గము, కథాప్రాధాన్యము, జాను తెనుగురచన ఇన్ని దృక్పథములను మేళవించుకొని కావ్యరచన చేసినాడు నన్నెచోడుడు.

నన్నెచోడుడు కుమారసంభవము అవతారికలో కాళిదాసు 'కవీంద్రులదాసులగానేలె'నని స్తుతించెనేకాని అతని కుమారసంభవ కావ్యమును పేర్కొనలేదు. పైగా అప్రసిద్ధమైన ఉద్భటుని కుమారసంభవమును మాత్రమే పేర్కొనినాడు. ఈ కావ్యము గూఢవస్తుమయ కావ్యమనియు, అలంకారమయమైనదనియు స్పష్టపరిచినాడు. ఉద్భటుని కావ్యములోని ప్రత్యేక గుణమైన గూఢవస్తుమయత్వమునకు ముగ్ధుడై నన్నెచోడుడు ప్రత్యేకముగా అతనినే పేర్కొనెనేమో? కాళిదాసుని కుమారసంభవమును పేర్కొనకున్నను అతని కథాప్రణాళికను, వర్ణనలను కొంతవర కనుకరించినాడు. కావ్యములో ప్రధానభాగ మీతని స్వతంత్రసృష్టియే కావున కుమార సంభవము స్వతంత్ర కావ్యముగానే వ్యవహరింపబడుచున్నది. ఉద్భటుని కావ్యము లభించకపోవుటవలన దాని తారతమ్య ప్రసక్తియేలేదు. చోడుడు తన కావ్యములో కవితా సంబంధమైన కొన్ని సిద్ధాంతములను ప్రతిపాదించినాడు. ఇవి అప్పటికి నవ్యతాభరితములు కాబట్టి వీనిగూర్చి సంగ్రహముగా చర్చింతును.

1. **జాను తెనుగు :** ఈ మాటను తొలిసారిగా కావ్యలోకమున ప్రవేశపెట్టినవాడు నన్నెచోడుడు.[1] దీని నొక సిద్ధాంతముగాజేసి పాలకురికి సోమనాథుడు తరువాతి కాలములో దీనికి సమధిక ప్రాశస్త్యమును కూర్చినాడు. నన్నెచోడుడు దీనిని ఏ యర్థములో వాడినాడో తెలుపుటకు పలువురు పండితులు ప్రయత్నించినారు. కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు పండితా

1. 'సరళముగాగ భావములు; జానుతెనుంగున నింపుపెంపుతో విరిగొవ వర్ణనల్'

—కుమారసంభవము : అవతారిక.

రాధ్య చరిత్ర పీఠికలో 'జాను' అనునది 'చదును' శబ్దమునకు రూపాంతరమని, 'చదును' చతుర శబ్దమునకు వికృతియని అన్నారు. జాను తెనుగనగా సర్వజన సుబోధకమైన తెనుగని వీ రభిప్రాయపడిరి. కాని వీ రిచ్చిన వ్యుత్పత్తికిని, వివరణమునకును సమన్వయము కుదురుట లేదు. నిడుదవోలు వెంకటరావుగారు జానుతెనుగనగా అచ్చతెనుగుకాదని స్పష్టపరిచిరి. నిజమే. సోమనాథుడు వృషాధిప శతకములో జానుతెనుగున కుదాహరణముగా పేర్కొన్న 'బలుపొడ తోలుసీరయును' అను పద్యములో నున్నవి శుద్ధాంధ్రపదములే. వానిలో తత్సమశబ్దముల ప్రసక్తియేలేదు. మరి నన్నెచోడుని కవిత్వములో తత్సమములు కోకొల్లలు. సోమనాథుని కృతు లలో సైతము లెక్కకుమించి యున్నవి. కాబట్టి జానుతెనుగనగా యయాతి చరిత్రాదులలోని అచ్చతెనుగు కానేరదను నిడుదవోలువారి అభిప్రాయము సహేతుకమైనదే.

జానుశబ్దమునకు అందము, సౌందర్యము అను అర్థములు కలవు.[1] ఇది శుద్ధదేశ్యపదము. జానుతెనుగనగా అందమైన తెనుగని, ఇంపైన తెనుగని అర్థము. ఏది ఒకానొక దుర్బోధక విషయమునుగూడ సామాన్య జనులకుసైతము సుబోధకముగా, సుప్రసన్నముగా అందించునో అది జానుతెనుగు. దేశిశబ్దములను, జనవ్యవహారములో నలిగిపోయిన సంస్కృత శబ్దములను, సముచిత ప్రమాణములో మేళవించినప్పుడే తెనుగునకు 'జానుతనము' సిద్ధించును. నిఘంటువు లను మాత్రమే ఆశ్రయించి బ్రతికెడు పదములను ప్రయోగించినచో ప్రజల కవి బోధపడవు 'ప్రవాహినీ దేశ్యా' యనికదా పండితోక్తి. కావున జనమండలికి సన్నిహితములైన సుందర సంస్కృతాంధ్ర శబ్దముల నేర్చికూర్చిన రచనారీతి 'జానుతెను'గని నిర్ధరింపవచ్చును. నన్నెచోడుడు తాను చేసిన ప్రతిజ్ఞ పాటింపలేకపోయినను, అతని అభిప్రాయ మిదియేయై యున్నట్లు 'సరళముగాగ భావములు, జానుతెనుంగున నింపుపెంపుతో బిరిగొన వర్ణనల్' అన్న పద్యభాగమువలన తేలుచున్నది. భావములు సరళముగాగ, వర్ణనలు జానుతెనుగులో ఇంపు పెంపుతో పెనగొనగా అని దీని తాత్పర్యము. భావములు వస్తుతః సరళముగా నుండవలెనని దీని అభిప్రాయముకాదు. భావప్రకటనము సరళముగా నుండవలెననియే. భావములు సరళముగా ప్రకటింపబడుటయనగా జనవ్యవహారమునకు సహోదరముగానుండు భాష కావలెననియే అభి ప్రాయము. అదే జానుతెనుగు. ఇంతకు తేలినదేమనగా జానుతెనుగనగా 'ఇంపుపెంపు' గల తెనుగు. నన్నెచోడు డిదే తెలిపెను. బహుశః నన్నయ భారతములోని సంస్కృత పదబాహుళ్య మును, సమాసాధిక్యమును చూచి నన్నెచోడు డిట్టి ప్రతిజ్ఞ చేసెనేమో? నన్నెచోడుని అభి ప్రాయమున కేది హేతువైనను, అతడే తన ప్రతిజ్ఞ నిల్పికొనలేకపోయెను. కెలసము, వెంచలు, కండవడము, కొలవేళ్లు మున్నగు కన్నడ పదములను, పోండిగ, మూండు, పీండు, పుడమిపుడు, ఎయిదనేరమివంటి వింతపదములను ప్రయోగించి తన రచనను అనవసరముగా కొంత క్లిష్ట పరిచెను. ఐనను నన్నయ ప్రయోగించని కొన్ని దేశిపదములను ప్రయోగించి కొంతవరకు తన 'జానుతెనుగు' ప్రతిజ్ఞను నిల్పికొన్నాడని చెప్పుటలోగూడ విప్రతిపత్తి యుండదు. ఏది

---

1. శబ్దరత్నాకరము.

యెట్లున్నను తెలుగులో తొలిసారిగా భాషావిషయికమైన ఒక సిద్ధాంతమును 'జానుతెనుగు' అను పేరుతో లేవదీసి తరువాతి కవులలో కొందరికి మార్గదర్శకుడైనవా డీకవి. ఇతని ఈ సిద్ధాంతమును చెప్పకయే తిక్కన పాటించినాడు. చెప్పి సోమనాథుడు సాధించినాడు.

2. **వస్తు కవిత :** ఈ వస్తుకవిత్వమను పదముసైతము నన్నెచోడుని కావ్యములో తొలిసారిగా కన్పించుచున్నది. కృత్యవతారికలో ఇత డీశబ్దమును పలుసార్లు ప్రస్తావించినాడు. వాల్మీకిని 'వస్తుకావ్యాబ్జరవి' అనియు, 'భారవియు వస్తుకవితను భారవి యనబరగి' రనియు, ఉద్భటుని కుమారసంభవము 'గూఢవస్తుమయకావ్య'మనియు, తనది 'జంగమమల్లయ వరము నందుగనిన వస్తుకవిత'యనియు పలుసార్లు పేర్కొన్నాడు. వస్తువనగా స్థూలముగా ఇతివృత్తమని అర్థము. కుమారసంభవము ఇతివృత్తముతోపాటు వర్ణనా ప్రాధాన్యముగల కావ్యము కాబట్టి ఈ నిర్వచనము చెల్లదు. వస్తుకవిత్వమనగా 'వర్ణనాత్మకమైన ఫణితి' కావచ్చునని శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగా రభిప్రాయపడిరి. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు 'వర్ణనీయ వస్తువునుగూర్చి చమత్కార వర్ణనలతో గూడిన కవిత' యనిరి. ఈ యభిప్రాయములు కొంత వరకు సమంజసముగానే యున్నవి. డా॥ పల్లాదుర్గయ్యగారు వస్తుకవిత్వమనగా (నన్నెచోడుడు కృత్యాదిని ప్రతిపాదించిన దాని దృష్ట్యా) భావములు, వర్ణనలు, అర్థములు, గుణములు, రసము, సూక్తులు, జానుతెనుగు, దేశిమార్గము, అలంకారములు మున్నగు దశవిధ కావ్యవస్తువులతో నొప్పు కవిత యనిరి.[1] నన్నెచోడుని కావ్యముమేర కీనిర్వచనము సరియైనదే కాని వస్తుకవులుగా అతనిచే పేర్కొనబడిన భారవి, వాల్మీకి మున్నగు కవుల కావ్యములపట్లకూడ ఈ నిర్వచనము చెల్లునోలేదో చూడవలసి యున్నది. కొందరు వస్తుకవితయనగా నిసర్గకవితయని వ్యాఖ్యానించిరి. వస్తుశబ్దమునకు సహజమను అర్థము రూఢమైనదికాదు కావున ఈ అభిప్రాయము సమంజసమైనదికాదు. వీరు వస్తుకవితకిచ్చిన మరియొక అర్థము 'ప్రకృతి కవిత' యని. వస్తుశబ్దమునకు నిఘంటువులలో ప్రకృతియను అర్థము కలదు కాబట్టి వస్తుకవిత యనగా ప్రకృతినిగూర్చి వర్ణించు కవితయని వీరనిరి. శ్రీ లక్ష్మీరంజనంగారు మరియు శ్రీ కోరాడవారు చేసిన నిర్వచనముల కిది సన్నిహితముగా నున్నది. ప్రకృతి కవిత్వమనగా ప్రకృతికి సంబంధించిన వర్ణనలు బహుళముగాగల కవిత్వమని గ్రహింపవచ్చును. నన్నెచోడుని కవిత్వమునగల వన, ఋతు, సముద్ర, చంద్రోదయ, సూర్యోదయ, జలకేళ్యాదివర్ణనలను ప్రకృతి వర్ణనలుగానే పరిగణింపవచ్చును.

ఇంతకు వస్తుకవితయనగా తరువాతికాలమున ప్రబంధములుగా చెప్పబడిన కావ్యములలో ఉండవలసిన లక్షణములను ప్రాయికముగా సంతరించికొన్న కవిత్వమని తేలినది. ప్రబంధ కవితాలక్షణములలో సగమునకుపైగా ఈ వస్తుకవిత్వమున ఇమిడియున్నవి. నన్నెచోడుడు కావ్యములో అష్టాదశవర్ణన లుండవలెనని తెలిపినాడు.

1. ఆంధ్రప్రబంధ వాఙ్మయ వికాసము (వ్రాతప్రతి) : డా॥ పల్లా దుర్గయ్య.

'వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర గతి రత క్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హ నగ విరహ దూత్య వర్ణనాష్టాదశముల్.'[1]

ఈ వర్ణనలలో ప్రకృతివర్ణనలు సైతం మిమిడియున్నవి. ఈ అష్టాదశవర్ణనలు తరువాతి ప్రబంధములకు నిర్బంధగుణములై పోయినవి. నన్నెచోడుడు తన కావ్యమును 'ప్రబంధ'మని కూడ పేర్కొన్నాడు. తాను పేర్కొన్న అష్టాదశ వర్ణనములన్నిటిని తనకావ్యములో ప్రవేశ పెట్టినాడు. అనగా తన కావ్యమును ప్రబంధమునకు ప్రతీకగా సంతరించినాడు. కాబట్టి వస్తు కవిత్వమునకు ప్రబంధమునకు సాన్నిహిత్యమేర్పడినది. ఒక విధముగా ఊహించినచో వస్తు కావ్యమనగా ప్రబంధమనియే చెప్పవచ్చును. నన్నెచోడుడు వస్తుకవిత్వ శబ్దమును ప్రబంధ కవిత్వమునకు పర్యాయముగా ప్రయోగించేనేమోయని ఊహించుటకు వీలున్నది. ఇతిహాసము కథాప్రధానము. తానువ్రాయుచున్నది ఇతిహాసముకాదు; కావ్యము. కావ్యము రసప్రధానము. రసము వర్ణనాదులవలన సాధ్యము. కావున వర్ణనాత్మకమైన కావ్యము వస్తుకావ్యమని, అందు లోని కవిత వస్తుకవితయని నన్నెచోడు డభిప్రాయపడియుండును. ఏదియెట్లున్నను తొలిసారిగా ప్రబంధమునకు తెలుగుమాగాణిలో బీజవాపము చేసినవాడు నన్నెచోడుడు. పురాణాంధ్రీకరణ యుగములో దీనిని గొప్పప్రయోగముగా పరిగణింపవచ్చును.

3. **షష్ఠ్యంతములు :** తెలుగుకావ్యములలో తొలిసారిగా షష్ఠ్యంతములను ప్రవేశపెట్టిన వాడు నన్నెచోడుడు. నన్నయ భారతములో ఈ పద్ధతిలేదు. కావ్యమును అంకితమిచ్చుటయను సంప్రదాయమును నెలకొల్పిన దీతడే. భారతము రాజరాజునకు అంకితముకాలేదు. రాజరాజు శ్రోతమాత్రమే. నన్నెచోడుడు తన గురువైన మల్లికార్జునయోగికి కుమారసంభవకావ్యము నంకితము చేసినాడు. 'జంగమ మల్లయ వరమునందుగనిన వస్తుకవిత దగిలి వారియంద నెగడింతు' ననియు, 'సత్కథాధిపతి జంగమ మల్లికార్జునుం'డనియు స్పష్టపరిచినాడు. ఎప్పు డంకితముప్రసక్తి వచ్చినదో అప్పుడు షష్ఠ్యంతరచన ఆవశ్యకమైనది. ఆంధ్రదేశములో నన్నెచోడునికిముందే ఈ షష్ఠ్యంతరచన వ్యాప్తమై యుండగా నన్నెచోడుడు దీనిని గ్రహించి కావ్యమున ప్రయోగించియుండునని అమరేశం రాజేశ్వరశర్మగారు తమ 'నన్నెచోడుని కవిత్వ' మనుగ్రంథములో ఇట్టి పద్యమొకటి ఉదాహరించినారు.[2] కాలమునుబట్టి చూడగా ఈ శాసనము

1. కుమార సంభవము : ప్రథమ. ఆశ్వా. 44 పద్యము.
2. 1170 సం॥లో కాకతీయ రుద్రదేవరాజువద్ద ఉద్యోగిగానున్న గంగాధరకవి వేయించిన కరీం నగరంలోని శాసనమునందలి పద్యము :
"వరమంత్ర కూటపురమున వరదునకు జగజ్జనాను వందితచరణాం
బురుహున కాచంద్రార్క స్థిరముగ గుడివృత్తి విల్పితిం, ద్విజయనుకుల్."

నన్నెచోడుని తరువాతిదే. ఈ షష్ఠ్యంత రచనను తదనంతర కాలమున కేతన, తిక్కన, మంచన, సూరనాదు లనుకరించినారు.

4. **చిత్ర కవిత్వము :** తెలుగుసాహిత్యమున ప్రప్రథమముగ చిత్రకవిత్వమును, గర్భ కవిత్వమును రచించినవాడు నన్నెచోడుడే. ఇతని చిత్రకవిత్వమునకు చతుర్విధకందము నుదాహరణముగా నీయవచ్చును.

> 'సుజ్ఞానయోగతత్త్వవి
> ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో
> నజ్ఞానపదము బొందక
> ప్రాజ్ఞులు శివుగొల్తు రచలభావనదవులఁ.'[1]

(12 అశ్వా, 247 ప.)

గర్భకవిత్వమునకు 'కందగర్భ చంపకమాల' నుదాహరణముగా తీసికొనవచ్చును (కుమార సంభవము : 12 ఆశ్వా. 219 పద్యము). బంధకవిత్వమునకు నాగమురజబంధములు నిదర్శనములు. ఈ చిత్ర కవిత్వాదులన్నియు కేవలము పాండితీ ప్రకర్షా ప్రదర్శనార్థముకాక ఔచితీగర్భితముగా ప్రయోగించుట నన్నెచోడుని ప్రత్యేకత. తరువాతికవులలో – ముఖ్యముగా ప్రబంధకవులలో – పల్వురు ఈ చిత్ర కవిత్వాదుల ననుకరించినారు. నందితిమ్మనవంటి సరస కవీంద్రుడు సైతము బంధకవిత్వమునకు పాల్పడవలసివచ్చెను. గణపవరపు వేంకటకవియను ప్రబంధకవి 'ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాస'మను తన ప్రబంధములో ఒక సీసపద్య మున 56 బంధముల నిమిడ్చెను.[2] ఇట్టి కవిత్వము శాసనములకును ఎక్కినది. దీనినిబట్టి నన్నెచోడుడు తొలిసారిగావేసిన ఈ బాట యెంత అనుకరణీయమై పోయినదో గమనింప వచ్చును. తెలుగున కీమార్గము క్రొత్తగాని కన్నడమున తొమ్మిదవ శతాబ్దివరకే ఉన్నట్లుగా కవిరాజమార్గములోని ఉదాహరణములనుబట్టి తెలియుచున్నది.

5. **కొన్ని చిన్న చిన్న క్రొత్తదారులు:** నన్నెచోడుడు ఇంక కొన్ని చిన్న చిన్న క్రొత్తప్రయోగములు కోకొల్లలు చేసెను. ముద్రాలంకారమును తొలిసారిగా తెలుగులో వాడిన దీతడే.[3] 'సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః' అని దీని నిర్వచనము. నన్నెచోడుడు వృత్తము పేరు వృత్తములో ఇమిడ్చి ఈ యలంకారమును ప్రయోగించినాడు. ఇది సంస్కృత ములో అనాదిగానున్నను తెలుగున ఇతడే మొదటిసారిగా ప్రవేశపెట్టెను. ఈ సంప్రదాయ మును ఎఱ్ఱాప్రెగ్గడ మున్నగుకవులు కొంద రనుకరించిరి.

1. చూ॥ అనుబంధము
2. నిడుదవోలు వెంకటరావుగారి కుమారసంభవ పీఠిక : (వావిళ్ళ ప్రచురణ) పుట 84.
3. 'మత్తకోకిల లారమింగదుమాసరంబగు నామనిన్'.

'శ్రీ' తో కావ్యమును ప్రారంభించి 'మంగళమహాశ్రీ'తో ముగించుట నన్నెచోడుడు చూపిన మరియొక క్రొత్తదెన్ను. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే' అను అభియుక్తోక్తి యున్నను 'మంగళమహాశ్రీ' యనెడు వృత్తముతోనే కావ్యమును ముగించు సంప్రదాయము లేదు. నన్నెచోడుడే దీని కాద్యుడు. ఈ పద్ధతిని తరువాతి కవులైన పాలకురికి సోమనాథుడు, జక్కన్న, వెన్నెలకంటి సూరన, నంది తిమ్మన ప్రభృతులు పాటించినారు.

అవతారికలోని ఇష్టదేవతాస్తుతిలో మన్మథస్తుతి చేసినవారిలో తెలుగున ప్రథము డీతడే. తరువాత కేతనమున్నగువా రీపద్ధతి ననుకరించిరి.

## తిక్కన క్రొత్తదెన్నులు :

తిక్కనసోమయాజి పేరు వినగానే ఆంధ్రమహాభారతములోని విరాటోద్యోగపర్వములు సాక్షాత్కరించును. విరాటపర్వమును ఊర్జితకథోపేతముగా, రసాభ్యుదయోల్లాసిగా, ఉద్యోగ పర్వమును మానవ మనస్తత్త్వ దీపకముగా, రాజకీయతంత్ర నిరూపకముగా తీర్చిదిద్దినాడు తిక్కన. మహాభారతాంధ్రీకరణమునకుముం దీమహాకవి నిర్వచనోత్తర రామాయణమును రచించినాడు. ఇదియొక ప్రత్యేకగ్రంథమున కనువాదముకాదు. స్వతంత్రకావ్యము కాదు. వాల్మీకి రామాయణములోని ఒక ఖండమున కించుక స్వాతంత్ర్యముతో చేసిన అనుసరణము. కాబట్టి ఖండానువాదమగుట కొంతలో కొంత క్రొత్తదనము కలిగియున్నది. నాచనసోముని ఉత్తరహరివంశము మున్నగునవి ఈ తెగకుచెందిన ఖండానువాదములే.

నిర్వచనోత్తర రామాయణావతారికలోని సుకవిస్తుతి, కుకవినింద, కావ్యనిర్వచనము మున్నగు విషయములలో తిక్కన నన్నెచోడునినే అనుకరించినాడు. విశేషించి చెప్పదగిన క్రొత్తప్రయోగము లీకావ్యమున చేయలేదు.

## హరిహరనాథ తత్త్వము :

తిక్కనసోమయాజి హరిహరనాథతత్త్వ ప్రతిపాదనముతో సాహిత్యలోకముననేకాక ఆధ్యాత్మిక జగత్తులోగూడ నవ్యమార్గమును చూపిన మహాకవియైనాడు. హరిహరనాథునికి తన మహాభారతము నంకితముచేసి ఆ పరతత్త్వమునకు సాహిత్యపీఠమున శాశ్వతస్థితిని కలిగించిన మహానుభావు డాయన. అంతవరకు ప్రసిద్ధముకాని ఈ హరిహర దైవతమునకు కావ్య మంకితము చేయుటకుగల తత్కాలీన పరిస్థితులను పరిశీలించుట అవసరము.

12 వ శతాబ్దమున ఒకవైపు బసవనిచే స్థాపింపబడిన వీర శైవమతము, ఇంకొకవైపు శ్రీ రామానుజుల వైష్ణవమతము దక్షిణదేశమున విజృంభించి కల్లోలములకు, రక్తపాతములకు దారిదీయుచుండెను. 13 వ శతాబ్దిలో మధ్వాచార్యుల ద్వైతమతఝుంఝు బయలుదేరి అంతవరకే ప్రజ్వలించుచున్న మతవైషమ్యమహాగ్ని నింకను దరికొల్పినది. తత్ఫలితముగా అద్వైత

మతము క్షీణింపసాగినది. అప్పటికి రెండువందలయేండ్ల క్రితమే కొంతవరకు తెనిగింపబడిన భారతమును తుదముట్టనిర్వహించుటకు ఏ కవియు ముందుకు రాకపోవుటకు ఈ మతవైషమ్యములే ప్రబలహేతువులు. అట్టి పరిస్థితిలో దేశీయులను సరియైన మార్గమున నడిపించుటకు వేద ప్రతిపాదితమైన అద్వైత తత్త్వమును కవితారూపమున అందింపవలసిన అవసర మేర్పడినది. చిన్న చిన్న కవులతో జరుగుపని కాదిది. తిక్కనవంటి అమలోదాత్త మనీషి, 'ఉభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పమునంబారగుడు'నైన మహాకవి ఈ మహాకార్యమునకు కంకణ ధారణము చేయవలసి వచ్చినది. కావుననే తిక్కనసోమయాజి హరిహరు లొక్కరేయని, భగవత్తత్త్వ మొక్కటేయని ఎలుగెత్తిచాటినాడు. హరిహరుడను ప్రత్యేక దైవమును విగ్రహరూపమునకాక పరతత్త్వముగా ఉపాసించి ప్రచారము చేసినాడు. ఈతడు ప్రతిపాదించిన హరహరనాథుడు 'త్రిభువనశుక దృఢపంజర విభవమహితుడు', 'సమస్త విష్టపనిర్మోక భుజంగపతి', 'భావనారాధ్యుడు', 'ఓంకారవాచ్యుడు'. అంతేకాని ప్రతిమారూపమున నెలకొన్నవాడు కాడు. తిక్కనకు పూర్వము ఆంధ్రదేశమున హరిహరాలయముగాని, హరిహరోపాసనగాని ప్రసిద్ధముగా ఉన్నట్టు కనుపట్టదు.[1] ఇతని హరిహరారాధనము తరువాతికవు లనేకులకు మార్గదర్శకమైనది. నాచనసోముడు ఉత్తర హరివంశమును హరిహరమూర్తి కంకితమొనర్చెను. జక్కన హరిహరారాధకుడు. పంచతంత్రము తెనిగించిన దూబగుంట నారాయణకవి హరిహర భక్తుడు. ఈ విధముగా హరిహరారాధనము తరువాతి కొందరికవుల కొక సంప్రదాయమైపోయినది.

## కవితారీతులలో నవ్యత :

నన్నెచోడుడు ప్రతిపాదించిన 'జానుతెనుగు' సిద్ధాంతమును లక్ష్యరూపమున పాటించినవాడు తిక్కన. నన్నెచోడు డెంతగా దేశికవులను ప్రస్తుతించినను, మార్గకవులను విమర్శించినను, అతడు తత్సమ పదబహుళమైన శైలినే యనుసరించినాడు. తిక్కన అట్లుకాక పలుకుబడిలో, ఊహలో, సంభాషణలలో అచ్చమైన దేశిత్వమును చూపినాడు. నన్నెచోడుని కావ్యములోని పద్యములలో ఎక్కువగా వాడబడినది కందము. అతడు దేశీయపద్యములైన తేటగీతులను, ఆటవెలదులను అంతగా వాడలేదు. తిక్కన వృత్తముల నెంతోసమర్థముగా ప్రయోగించుశక్తి కలవాడైనను బహుళముగా ఆటవెలదులను. తేటగీతులను ప్రయోగించినాడు. ఇతని దేశ్యభిమానమున కిదియొక ఉదాహరణము.

కావ్యములో 'నాటకీయత'ను ప్రవేశపెట్టి తిక్కన ఒక క్రొత్తబాటను త్రొక్కినాడన్నది ఆంధ్రసాహిత్య విమర్శకులెల్ల రంగీకరించిన సత్యమే. ఈ నాటకీయత యన్నది కేవలము కథను సంభాషణరూపమున నడుపుటలోనేలేదు; నాటకములో నుండెడు సంధిబంధములను దృష్టిలోనుంచుకొని సన్నివేశములను కల్పించి, అందలిపాత్రల మనోవికాసాదులను చిత్రించుటలో

1. కన్నడదేశములోగూడ అప్పటికి హరిహరాలయము లేదందురు.

ఉండును. తిక్కన ఈ రీతిని సమర్థముగా నిర్వహించి తెలుగుకావ్యములలో తొలిసారిగా 'నాటకీయత'ను స్ఫుటమైన ఆకృతిలో ప్రవేశపెట్టినాడు.

తెలుగు కావ్యములలో 'స్వప్నవృత్తాంతము' మొదటిసారిగా తిక్కన భారతములోనే చోటు చేసికొన్నది. స్వప్నమున హరిహరనాథుడు సాక్షాత్కరించి భారతము నాంధ్రీకరించవలసినదిగా ఆజ్ఞాపించినట్లు అవతారికలో కలదు. రానురాను ఆంధ్రకవులలో పలువురు దీనినొక సంప్రదాయముగా భావించి అవసరమున్నను లేకపోయినను ఇష్టదైవతమో, పితృపాదుడో స్వప్నమునవచ్చి కావ్యరచన కాదేశించినట్లుగా వ్రాసినారు.

తిక్కన సోమయాజికిష్టుడైన కేతన, దండి సంస్కృతములో రచించిన దశకుమార చరిత్ర మను గద్యకావ్యమును పద్యకావ్యముగా అనువదించినకవి. ఇది అనువాద కావ్యమేయైనను తెలుగులో మొట్టమొదటి కథాకావ్యము. కథాకావ్యరచనకు శ్రీకారముచుట్టిన కవిగా కేతన పేర్కొనదగినవాడు.

### పాలకురికి సోమనాథుని 'ప్రయోగ' పరంపరలు :

నన్నయ్య యేర్పరిచిన మార్గకవితా ఘంటాపథమును కాదని దేశికవితా కంటకపథమున కాలూని దానిని పూలబాటగా మార్చుకొన్న అపూర్వ ప్రతిభాసముపేతుడు పాలకురికి సోమనాథుడు నన్నెచోడకవిలో మొలకెత్తిన దేశ్యభిమానము పాలకురికిలో రెమ్మలువేసి, కొమ్మలు సాచి, పూచి, కాచి ఫలించినది. పూర్వాంధ్రసాహిత్యమున దేశికవితకు పునాది వేసినవాడితడే; గోపురమును పెట్టినవాడును ఇతడే. వీరశైవమతమును కావ్యరూపమున సుస్థిరము చేయుటలోనేమి, కవితా రంగమున క్రొంగ్రొత్తదారులు త్రొక్కుటయందేమి ఇతని కితడేసాటి. మతాభిమానము, దేశ్యభినివేశము సంగమించిన ప్రజ్ఞాశాలి యీతడు. సంస్కృత భాషాపరిష్వంగము నుండి తెలుగు పలుకును విడిపించుటకు ప్రయత్నించినవా డీతడు. ఇక ఈ కవీంద్రుడుచూపిన క్రొత్త తెన్నులను వివరించుటకు ప్రయత్నింతును.

#### (i) ఛందస్సు :

పాలకురికి సోమనాథునికి ముందు దేశీయచ్ఛందస్సుల కంతగా ఆదరములేదు. తరువోజలు, మధ్యాక్కరలు మొదలైనకొన్ని దేశిపద్యములు మాత్రమే నన్నయాదుల మన్ననలందినవి. అయినను అవి వృత్తముల కంఠాణధాటికాగలేక ప్రక్కప్రక్కల కొదిగియేయున్నవి. సోమనాథునికిముందు ద్విపదచ్ఛందస్సు ముందుకురాలేదు.

'ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుతెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
కూర్చెద ద్విపదలు కోర్కిదైవార' (బసవపురాణము)

అని ద్విపదచ్ఛందస్సులో కావ్యరచనచేతునని శంఖము పూరించిన దేశికవి సోమనాథుడు. అనగా తొలిసారిగా అచ్చమైన తెలుగుఛందస్సులో సర్వతస్సమగ్రమైన కావ్యరచనకు కడంగిన సాహసికుడితడు. రెండుకాళ్ళఛందస్సగు ద్విపదలో దండికావ్యములు వెలయించిన కీర్తి సోమనాథునికే దక్కినదని పండితులెల్లరు సమ్మతించిన విషయమే. కాని ఇటీవలి పరిశోధనలవలన రంగనాథ రామాయణము కాలమునుబట్టి సోమనాథునికన్న ముందటిదను అభిప్రాయము బయల్పడినది. సోమనాథుని జీవితకాలము 1295 నుండి 1323 వరకు ఓరుగల్లును పాలించిన రెండవ ప్రతాపరుద్రుని కాలమనియు, రంగనాథ రామాయణకర్తయగు గోన బుద్ధారెడ్డి 13 వ శతాబ్ద్యంతముననే జీవించియుండెననియు పండితు లభిప్రాయపడుచున్నారు.[1] ఈ కాలనిర్ణయమునుగూర్చి భిన్నాభిప్రాయములున్నవి. ఒకవేళ ఈ నిర్ణయమును పాటించినను ద్విపద కవిత్వమునకు సోమనాథు డాద్యుడనుటలో విప్రతిపత్తియుండదు. ఎందుకనగా సోమనాథుని బసవపురాణములోని కృత్యాదిపద్యములనుబట్టి ఇతనికిముందు ద్విపదచ్ఛందస్సు కావ్యోపయోగియైనట్లు కనబడదు.

'ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుతెనుగు విశేషము ప్రసన్నత' కనియు -
'కూర్చెద ద్విపదలు కోర్కిదైవార' ననియు -
'తెలుగుమాటలనంగ వలదు వేదముల
కొలదియకాచూడు' డనియు

సోమనాథుడుచేసిన ప్రతిజ్ఞలనుబట్టి ఇతనికిముందు ద్విపదచ్ఛందస్సు కావ్యప్రయుక్తమైనట్లు తోచదు. రంగనాథరామాయణ మీతనికిముందు రచింపబడియున్నను దాని నీతడు చూడలేదనియే చెప్పవచ్చును. చూచుటకాని లేక వినుటకాని తటస్థించినచో ద్విపద ప్రాధాన్యమును ఇంతగా డిండిమముమ్రోగించి చాటవలసిన అవసరములేదు. రంగనాథ రామాయణములో ద్విపద రచనావశ్యకమునుగూర్చి యెట్టి ప్రతిజ్ఞలు లేవు. అంతవరకే క్షుణ్ణమైన మార్గమున నడచినట్లున్నదిగాని అది ప్రత్యేకదృష్టితో రచింపబడినట్లులేదు. కాబట్టి సోమనాథుడే ద్విపదను కావ్యోపయోగిగా చేసిన ప్రథమ కవీంద్రుడని చెప్పవచ్చును. పైగా ద్విపదలో ప్రాసయతిని ప్రవేశపెట్టి సరిక్రొత్త మార్గమును చేపట్టినాడీతడు. మొదట అనుభవసారమును వృత్తములలో రచించి అంతటితో తృప్తినొందక తెలుగు ఛందస్సగు ద్విపదలో బసవని చరిత్రను రచించి నవ్యత నుపాసించిన కవీంద్రు డీతడు.

1. చూ॥ శ్రీలక్ష్మీరంజనంగారి ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము.

(ii) వస్తువు :

సోమనాథునికి పూర్వమున్న కావ్యములన్నియు సంస్కృత గ్రంథముల కనువాదములే. ఒక్క నన్నెచోడుడు మాత్రము కాళిదాస కుమారసంభవమును దృష్టిలోనుంచుకొని ఇంచు మించుగా స్వతంత్రకావ్యమును వెలయించినాడు. అయినను కుమారసంభవములోని వస్తువు ప్రాచీనమైనది; ప్రఖ్యాతమైనది. సోమనాథుడు వస్తువరణములో సైతము నవ్యత కన బరిచెను.

'అతత సకల పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృక గాగ' (బసవపురాణము)

బసవపురాణమును రచించినకవి యీతడు. పేరునకిది పురాణమేకాని తెలుగులో సమ కాలీన సమాజమును తొలిసారిగా చిత్రించిన 'సాంఘిక కావ్యము'. తననాటికి జనులలో వాడుకలో నున్న శివభక్తుల జీవితగాథలను సేకరించి బసవని కథాసూత్రమునకు సమన్వయించి సరి క్రొత్త దండనల్లినా డీతడు. పురాణగాథలనుగాక సాంఘికగాథలను కావ్యవస్తువుగా స్వీక రించుట సోమనాథుడుచేసిన అభినవ ప్రయోగములలో ఎన్నదగినది. బెజ్జవ్వ, దుగ్గవ్వ, కిన్నర బ్రహ్మయ్య, కుమ్మరి గుండయ్య మున్నగు సామాన్యుల జీవితగాథల నీతడు కావ్యవస్తువులుగా స్వీకరించుట ఆనాడు సాహసమే.

(iii) భాష :

ఛందోవస్తువులతోపాటు భాషలోగూడ సోమనాథుడు నవ్యతను సాధించినాడు. ఏనాడో నన్నెచోడుడు ప్రతిపాదించిన 'జానుతెనుగు' సిద్ధాంతము నీతడు విస్తరింపజేసినాడు. సంస్కృత పదభూయిష్ఠముగానున్న గద్యపద్యకృతులకన్న జానుతెనుగులోనున్న దేశికావ్యములే మిన్నయని ఉద్ఘోషించినాడు. తెలుగుమాటలను వేదములకొలదిగా చూడుడన్నాడు. బసవపురాణము, పండితారాధ్య చరిత్రము అను రెండు ద్విపదకావ్యములలో సాధ్యమైనన్ని తెలుగు పలుకుబడు లను ప్రయోగించి తన ప్రతిజ్ఞను కొంతవరకు నిల్పికొన్నాడు.

మరికొన్ని ప్రయోగములు :

సోమనాథుడే తెలుగులో తొలిశతకమును వ్రాసినవాడని చెప్పవచ్చును. ఇతనికి పూర్వ మున్న పండితారాధ్యుని శివతత్త్వసారమను గ్రంథములో శతకలక్షణములు కనిపించుచున్నవి. సోమనాథుడు సైతము దీనిని శతకమనియే పేర్కొన్నాడు. కాని ఈ గ్రంథములో ఏకమకుటత లేదు. శివా, అజా, మహేశామున్నగు విభిన్నసంబోధనములున్నవి. పద్యముల సంఖ్యకూడ కొన్ని వందలలోనున్నది. ఇది స్వభావమునుబట్టి శతకమేయైనను సమగ్ర నిర్వచనమున కందదు. శతక నిర్వచనమున కందిన మొట్టమొదటి గ్రంథము సోమనాథుని వృషాధిపశతకము.

ఇది 'బసవా బసవా వృషాధిపా' అను ఏకమకుటముతో గూడుకొనియున్నది. కావున 'మకుట, పద్యసంఖ్యా నియమములతో గూడిన ప్రథమశతకమిదియే'[1].

సోమనాథుడు 'చెన్నమల్లుసీసము' లనెడు మరియొక శతకము రచించెను సీసపద్యములలో తొలిసారిగా శతకము రచించినవాడితడే. దీనిలో ప్రతిసీసపద్యముయొక్క చివర (ఎత్తుగీతిలో) 'చెన్నమల్లు' అను మకుటము పునరావృత్తమగుచుండును. సీసములోని ప్రతిపాదము దేనికదే విరిగిపోవును. దీని తరువాత సీసపద్యములలో ఆంధ్రనాయక శతకము, రాజగోపాల శతకము, నరసింహ శతకము మున్నగునవి వెలసినవి.

తెలుగులో తొలిసారిగా రగడలను. గద్యలను ప్రవేశపెట్టినవాడీ కవియే. రగడ అచ్చముగా దేశీయచ్ఛందస్సు; మాత్రాచ్ఛందస్సు. ఇతని బసవరగడయే తరువాతి కావ్యములలోని రగడలకు మూలము. బహుశః కన్నడములో అంతవరకే ప్రచలితముగానున్న 'రగళె'లను, గద్యలను దృష్టిలో నుంచుకొని సోమనాథుడు తెలుగులో వానిని ప్రవేశపెట్టినాడేమో ? ప్రబంధ కవులు పుష్పాపచయ ఘట్టములోనో, వసంతవర్ణన ఘట్టములోనో విధిగా ఈ 'రగడల'ను ప్రవేశపెట్టినారు. సోమనాథుని బసవోదాహరణము ఉదాహరణ వాఙ్మయశాఖలో విరిసిన ప్రథమ పుష్పము. దీనిని సోమనాథుడు తెలుగులోనేకాక సంస్కృతములోను రచించి, ఈ రెండు భాషలలో మొట్టమొదటి ఉదాహరణమును రచించిన కీర్తిని దక్కించుకొనెను.

రోకటిపాటగానున్న ద్విపదను నవరస పోషణచణముగా, లయసమన్వితముగా, భావ వైవిధ్యవాహికగా, వివిధరీతి విలసితముగా మలచి దానికి తెలుగు కావ్యజగత్తులో స్వర్ణాసనమును సమకూర్చిపోయిన కవీంద్రుడు సోమనాథుడు. నాటికి నేటికి ద్విపద కాతడు పెట్టినభిక్షయే ఆరాధ్యము; ఆస్వాద్యము. ఇతని తరువాత నవనాథ చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, పల్నాటి వీరచరిత్రమున్నగు చక్కని ద్విపదకృతులు వెలసినవి.

## శ్రీనాథునికి పూర్వమున్న కొందరు కవుల క్రొత్త రీతులు :

శ్రీనాథునివరకు తెలుగులో పురాణానువాదములే ప్రబలముగా సాగినవి. క్వచిత్తుగా కావ్యములు వెలువడినవి. ఇతనికి పూర్వము కొందరుకవులు కొన్నికొన్ని మెఱుపులవంటి చిన్న చిన్న ప్రయోగములు చేయకపోలేదు.

తిక్కన సోమయాజి శిష్యుడైన మారన ప్రప్రథమముగా పురాణానువాదమునకు పూనుకొన్నవాడు. అష్టాదశ పురాణములలో నొకటియైన మార్కండేయపురాణము నీతడు తెనిగించి తరువాతి కాలములోని వరాహపురాణ, మత్స్యపురాణాద్యనువాదములకు మార్గదర్శకుడైనాడు.

1. చూ: డా॥ దివాకర్ల వెంకటావధానిగారి ఆంధ్రవాఙ్మయ చరిత్రము : పుట 28. యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకము దీనికి ముందటిదను వాదము నైతమున్నది.

సంస్కృతములోనున్న నాటకములను తెలుగులోనికి అనువదించుట మంచనతో ప్రారంభమైనది. ఇతని కేయూరబాహుచరిత్రము రాజశేఖరుని విద్ధసాలభంజిక నాధారముగా చేసికొని రచింపబడిన కావ్యము. క్రీడాభిరామమున్నగునవి ఈ పద్ధతిలో వెలువడిన కావ్యములే. పిన వీరన శృంగార శాకుంతలము, నందిమల్లయ ఘంటసింగయల ప్రబోధచంద్రోదయ నాటకము తదనంతర యుగమున వెలువడిన సంస్కృత నాటకానువాదములు.

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణము మొట్టమొదటి క్షేత్రమాహాత్మ్యమని చెప్పవచ్చును. ఇది కేవలానువాదమువాదు. బ్రహ్మాండ పురాణములోని నృసింహావతారకథను ఆధారముగా చేసికొని క్షేత్రదైవత మాహాత్మ్యముల నభివర్ణించినాడీ కవి. ఇది పురాణమని అనబడినను మొట్టమొదటి 'క్షేత్ర మాహాత్మ్య' కావ్యమని చెప్పవచ్చును. శ్రీనాథుని కాశీఖండ, భీమఖండ, శివరాత్రి మాహాత్మ్యములు, రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, ధూర్జటి కాళహస్తీశ్వర మాహాత్మ్యము తరువాతి కాలములో వెలువడిన చక్కని 'మాహాత్మ్య' కావ్యములు.

### శ్రీనాథుని నవీన రీతులు :

శ్రీనాథునికి ముందున్న కవులలో నాచనసోముడు 'నవీన గుణసనాథు'డని తన్నుతాను చెప్పికొనెను. ఈతని ఉత్తర హరివంశమున చెప్పుకొనదగిన నవీనగుణములంతగా కానరావు. నాచన సోమునికి ముందున్న కావ్యములలో భావప్రాధాన్యమున్నదేకాని అంగాంగవర్ణనము, శబ్ద ప్రీతి అంతగా అగుపించవు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సోముని నవీనగుణ సనాథత్వమునుగురించి చర్చించుచు భావమునకు బదులుగా వస్తురచనా ఫక్కికలందు శ్రద్ధవహించి కావ్య రచన చేయుట నాచనసోముని క్రొత్తదనమని తీర్మానించిరి. నిజమే. ప్రబంధకవుల వర్ణనాప్రీతి, రీతి ప్రాధాన్య మీతనితో మొనలు సూపినవని చెప్పవచ్చును.

ఇక శ్రీనాథుడనగానే శృంగారరసము తళుక్కుమని స్ఫురించును. తెలుగులో విడివిడిగా బహుకావ్యములు రచించినవాడు శ్రీనాథుడే. ఇతని కావ్యములలో శృంగారనైషధము, హరవిలాసము, క్రీడాభిరామము మున్నగునవి ప్రధానముగా శృంగారరచనలే. భీమఖండము, కాశీఖండము భక్తి ప్రధానకావ్యములైనను రక్తిస్పర్శ లేకుండపోలేదు. ఇతని చాటువులు శృంగార రసమునకు బంగారు పేటికలు. ఇతనికిముందే కుమారసంభవములో దశకుమార చరిత్రలో కేయూర బాహు చరిత్రలో శృంగారరసమునకు సముచిత స్థానము లభించినను ఇతని కావ్యములలో ఇది శిఖర స్థానమధిష్ఠించినది. ప్రబంధములతో పరాకాష్ఠనందుకొన్నది. ఇంతేకాక శ్రీనాథునితోనే కథా ప్రాధాన్యము తగ్గిపోయి రసప్రధానమైన రచనలు వెలువడినవని చెప్పవచ్చును. శృంగార నైషధము, హరవిలాసము ఇట్టి రచనలే.

తెలుగు నుడికారమునకు, సీసపద్యముల చిత్రచిత్రగతులకు, ఒకేవిషయమును పెక్కు భంగుల సాగదీసిచెప్పెడు ధోరణులకు శ్రీనాథుడే శ్రీకారమును చుట్టినాడనవచ్చును. తరువాతి కవులలో పెద్దనాదులు ఇతడు వేసిన ఈ బాటలలో నడచి కృతార్థులైనవారే. అంతేకాదు; ఆధు

నిక యుగములో సైతము ప్రసిద్ధాంధ్ర కవులలోపల్కురికి మూడు గుణములచేత ప్రభావితులై రచనలు సాగించినారు.[1]

తెలుగులో వీరగాథాకావ్యమును (Ballad) వ్రాసిన మొదటికవి శ్రీనాథుడే. ఇతని పల్నాటి వీరచరిత్ర నాటికి నేటికి అనుపమానమైన వీరకావ్యము. ఛందస్సులో సోమనాథుని దారి త్రొక్కినను వస్తువులో నవ్యతసాధించిన కావ్యమిది.

సమకాలీన సమాజజీవితమును సమగ్రముగా చిత్రించుటలో సైతము శ్రీనాథుడు నవ్యత కనబరిచినాడు. పాల్కురికి సోమనాథుడు కొంతవరకీమార్గములో నడచినవాడే. కాని శ్రీనాథుడు క్రీడాభిరామములో నాట ఓరుగంటి సాంఘికజీవనమును అద్దములోవలె ప్రతిబింబింప జేసినాడు.[2] క్రీడాభిరామము ప్రేమాభిరామమను సంస్కృతవీధి కనుసరణ గ్రంథమని పరిశోధకుల అభిప్రాయము. ఇది దశరూపకములలో నొకటైన వీధికి సన్నిహితముగానున్న రచన. కేవలము నాటకమువలెకాక దృశ్యశ్రవ్య కావ్యలక్షణములు మేళవించిన కావ్యప్రక్రియ. ఈ ప్రక్రియ తెలుగులో క్రీడాభిరామముతోనే ప్రారంభమై దానివరకే పరిమితమై యున్నది, దీనిలో కాకతీయుల నాటి వృత్తులు, వర్ణములు, కులములు, క్రీడావినోదములు, పూటకూళ్ళ భోజనములు, ఆనాటి ప్రజల ఆచార వ్యవహారములు మనోజ్ఞముగా చిత్రింపబడినవి తరువాత వెలువడిన హంసవింశతి మున్నగు కథాకావ్యములలోని సామాజిక జీవితచిత్రణ కిది ఒరవడియైనది. దీనిలో అధిక్షేప కావ్యలక్షణములు సైతము గర్భితములుగా నున్నవి. మంచనశర్మ పాత్రద్వారా ఆనాటి వేశ్యాలోలత్వమును శ్రీనాథు డెత్తిచూపినాడనవచ్చును. భీమఖండములోగూడ శ్రీనాథుడు మధ్యాంధ్ర దేశమును వాస్తవికతా బంధురముగా వర్ణించినాడు.

ఒకవైపు గంగాయమునలవంటి మహాకావ్యములను ప్రవహింపజేయుచు మరియొకవైపు ఈ మహాకవి పిల్లకాల్వలవంటి చాటుపద్యములకు బాటలుతీసి ఆంధ్రసాహితిని రాచనగరులనుండి రచ్చపట్టులదాక ప్రసరింపజేసినాడు. తెలుగుభాషపట్ల ఆస్థానములనుండి అంగళ్ళవరకు ఆమోద ముద్ర వేయించినాడు. డిండిమభట్టు మున్నగు సంస్కృత విద్వాంసులను ఢీకొని వాదపటిమతో ఓడించి తెలుగుభాషకు ఎనలేని గౌరవ ప్రతిష్ఠలను కలిగించినాడు. ఆధునిక యుగప్రారంభములో తిరుపతి వెంకటకవులవలె ఆనాడు శ్రీనాథుడు తెలుగు కవిత్వమును చాటువులద్వారా జనసామాన్యమునకు సన్నిహితము చేసినాడు. కవిత్వమును మహోద్యమముగా నడిపినవారిలోను శ్రీనాథుడే ప్రథమగణ్యుడు.

శ్రీనాథుని సమకాలికుడైన బమ్మెరపోతన మహాభాగవతాంధ్రీకరణముద్వారా అంత్యప్రాస రచనకు క్రొత్తదారులు తీసినాడు. తరువాతి కవులెల్లర కీరీతి శిరోధార్యమైనది. నన్నయ ప్రారంభించిన శబ్దసంగీతమును తారస్థితికి తీసికొని పోయినవాడు పోతన.

1. జామువా మున్నగువారు.
2. క్రీడాభిరామము శ్రీనాథకృతమేయన్న విశ్వాసమున్నదృష్ట్యా ఈ విషయము వివృతమైనది.

దండకమును కావ్యప్రక్రియకు పరాకాష్ఠ కలిగించిన గౌరవము పోతన్నకే దక్కినది. ఈతని భోగినీదండకము శృంగారాత్మకముగా వెలువడిన తొలిదండకము. దండకము పోతన్నకు ముందు లేదనికాదు. భారతారణ్య పర్వములో, శ్రీనాథుని శృంగార నైషధములో సంస్కృత దండకములున్నవి. శ్రీనాథుని కాశీఖండములో తెలుగు దండకమున్నది. కాని దండకమును కావ్యములో అంతర్భాగముగా కాక విడిగా రచించుట, శృంగార ప్రధానముగా రచించుట పోతన ప్రత్యేకత. కావ్యమును నరాంకితము చేయనని కంఠోక్తిగా చెప్పుట, మాతృదేవతను స్తుతించుట, మధురభక్తికి పూలపందిళ్ళు వేయుట పోతన ప్రత్యేకగుణములు.

ప్రబంధ యుగమునకుముందు రచింపబడిన కావ్యములలో కాసెసర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్రము పేర్కొనదగినది. తెలుగులో ప్రప్రథమ చారిత్రక కావ్యమగుట దీని ప్రత్యేకత. ఏకామ్రనాథుని ప్రతాప చరిత్రము ఈ మార్గములోనే వెలువడిన ఇంకొక చారిత్రక కావ్యము.

## ప్రబంధయుగములోని 'ప్రయోగ' రీతులు :

ఆంధ్రసాహిత్యము పురాణయుగమున మతధర్మ స్తంభములపై ఆధారపడినది. భారత భాగవతారామాయణము లాంధ్రసాహిత్య తత్త్వమునకు ముకురప్రాయములుగా వెలసినవి. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన సంస్కృత పురాణముల ననువదించుటలో ప్రధానముగా కథావృష్టిని విశ్వశ్రేయోదృష్టిని కలిగియుండిరే కాని విచిత్ర కథాకల్పనలకు, అపూర్వవర్ణనలకు పాల్పడలేదు. క్రమముగా కావ్యదృష్టి, రసదృష్టి ప్రబలినవి. రసరాజమగు శృంగారమున కగ్రతాంబూలము లభించినది. శ్రీనాథుడు, పినవీరభద్రుడు మున్నగు ప్రబంధయుగ పూర్వ కవుల చేతులలో శృంగారరసము స్ఫుటరేఖలను తీర్చుకొన్నది. వేదపురాణములందు, ఇతిహాసములందు ప్రతిపాదితమైన సాత్త్వికశృంగారము క్రమముగా తెరమరుగున పడినది. రాజస తామస శృంగారములకు అగ్రేసరత్వము వచ్చినది పురాణపాత్రల స్థానమున అప్సరసలు, వారాంగనలు, గంధర్వులు వచ్చి నిలచిరి. ప్రబంధ సూర్యోదయముతో శృంగారము జాజ్జ్వల్యమానముగా ప్రకాశించినది. ఇక ఆంధ్రసాహిత్యమున శృంగారరసమున కగ్రతాంబూలము కలుగుటకుగల హేతువులను విచారింపవలసి యున్నది.

16వ శతాబ్దిలో ఆంధ్రదేశమున మహమ్మదీయులు విజృంభించిరి. నన్నయ తిక్కనలతో పెంపొందిన వైదికమతము, పాలకురికితో వేరూదిన వీరశైవమతము, క్రమముగా శిథిలములై పోయినవి. పాలకులైన మహమ్మదీయుల రాజ్యవైభవము హైందవసమాజములో భోగాభిలాషను రేకెత్తించినది. వీరి ప్రభావమువలన వెనుకటి సాత్త్విక శృంగారము సడలిపోయి రాజసతామస శృంగారములు పొడసూపినవి. విజయనగర ప్రభువులపై ఆనాటి మహమ్మదీయ ప్రభువుల ప్రభావము సోకుటవలన వారు శృంగార రసప్రధానమైన కావ్యములనే అభిమానింపసాగిరి. క్షుద్రశృంగారము సైతము ప్రభువుల శిరఃకంపన పాత్రమగుచుండెడిది. నందితిమ్మన పారిజాతాపహరణములో రుక్మిణీకృష్ణులయెదుట నారదునిచేత పలికించిన పద్యములనుబట్టి చూచినచో ఆనాటి ప్రభువు లెంతటి ఆంగికశృంగారమునైనను ఆమోదించెడువారని ఊహించుటకు వీలగు

చున్నది.[1] ఇట్టి పరిస్థితులలో ధర్మమోక్షములను ప్రతిపాదించెడు కావ్యములను చెవిబెట్టెడు వాడెవ్వడు ? కావుననే శృంగారరస ప్రధానములైన ప్రబంధములు పుంఖానుపుంఖములుగా వెలువడి తెలుగు సాహిత్యమునకు సరిక్రొత్త జిగిని బిగిని సమకూర్చినవి.

'ప్రబంధ' మనునది తెలుగు సాహిత్యములో ఒక వినూత్న ప్రక్రియయని ఎల్లరంగీకరించినవిషయమే. ప్రబంధములు శృంగారరసప్రధానములుగా అవతరించుటకుగల కాలపరిస్థితులను ముందే మనవిచేసియున్నాను. ఇక కావ్యప్రక్రియగా దీని నవ్యత్వమును నిరూపించవలసియున్నది. ప్రబంధయుగమునకు పూర్వము వెలువడిన కావ్యములలో తిక్కన నిర్వచనోత్తర రామాయణము, భాస్కరాదుల చంపూరామాయణము, రంగనాథ (ద్విపద) రామాయణము, మడికి సింగన వాసిష్ఠ రామాయణము మూలవిధేయములుగానున్న ఆంధ్రానువాదకావ్యములు. శ్రీనాథుడు మొదలుకొని నందిమల్లయ్యవరకుగల మిగిలినకవులు చాలవరకు స్వతంత్రానువాదములేచేసినారు. ప్రబంధ పూర్వయుగములో పాలకురికిసోమనాథు డొక్కడే నూటికి నూరుపాళ్ళు స్వతంత్ర రచయిత. 15వ శతాబ్దివరకే తెలుగులో సంస్కృత వాఙ్మయములోని బహువిధ కావ్యప్రక్రియలు దిగుమతియైనవి. భారత రామాయణ భాగవతాది మహాగ్రంథములును, మార్కండేయ పురాణాది పురాణములును, దశకుమార చరిత్రాది గద్యకావ్యములును, ప్రబోధ చంద్రోదయాది నాటకములును భిన్నరీతులలో అనువదింపబడినవి. ఛందోలంకార వ్యాకరణాది శాస్త్ర గ్రంథములు తెలుగులో రచింపబడినవి. ఇంకను శ్లేషాద్యలంకారములతోగూడిన కాదంబరి తెనిగింపబడినట్లు తెలియుచున్నను అది నేటికిని ఉపలభ్యముకాలేదు.[2] పింగళిసూరన రాఘవ పాండవీయద్వ్యర్థి కావ్యములోని 'భీమన తొల్లిజెప్పెనను పెద్దలమాటయెకాని' అను పద్యమునుబట్టి ఏనాడో వేములవాడ భీమకవి రాఘవ పాండవీయమను ద్వ్యర్థికావ్యమును నిర్మించినట్లు తెలియుచున్నది. ఈ రీతిగా సంస్కృత సాహిత్యములోని సమస్త కావ్యప్రక్రియలు తెలుగులో, శాఖోపశాఖలుగా విస్తరించినవి. కృష్ణదేవరాయల కాలములోని కవులకు సంస్కృత సాహిత్యమునుండి తెలుగులోనికి దిగుమతిచేయుటకు ఏ కావ్యప్రక్రియయును మిగులలేదు. అందుకే స్వతంత్ర కావ్య నిర్మాణము వారి కావశ్యకముగా తోచినది. ఈ సంకల్పమే ప్రబంధ రచనకు నాందియైనది.

ఆంధ్రసాహిత్యములో అతఃపూర్వము గతానుగతికముగా సాగుచున్న అనువాద పద్ధతిని త్రోసిరాజనుట ప్రబంధయుగ ప్రత్యేకత. ఈ ప్రక్రియ కథావస్తువుపైనే కేంద్రీకృతమైన దృష్టిని

1. 'అలినీలాలక ! నీవునీపతి రహస్యక్రీడవర్తించువే
శ లతాంతాయుధు సంగరమ్మునకు నుల్లాసమ్ముకల్పించు ను
జ్జ్వల దీపాంకురమై; రతిశ్రమ తనూసంజాతధారాళ ఘ
ర్మలవంబుల్ దొలగింపగా సురటియై రంజిల్లు నిచ్చాగతిన్.'

—పారిజాతాపహరణము : ప్రథమాశ్వాసము

2. ఆంధ్ర ప్రబంధవాఙ్మయ వికాసము (వ్రాతప్రతి) : డా॥ పల్లాదుర్గయ్య.

కమనీయ వర్ణనలవైపు త్రిప్పినది. హృదయముతోపాటు బుద్ధికి ప్రాధాన్యము నిచ్చినది ప్రసిద్ధ వస్తువుతోపాటు కల్పితేతివృత్తములకు గౌరవము ప్రసాదించినది.

ప్రబంధశబ్దము నన్నెచోడునినాటినుండి వ్యవహారములోనున్నదే. వ్యుత్పత్తినిబట్టి చూచి నచో ప్రకృష్టమైనబంధము ప్రబంధమనవచ్చును. నన్నెచోడాదులు దీనిని మహాకావ్య పరముగా వాడిరి. ప్రబంధశబ్దమును నన్నెచోడునితోపాటు తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథాదులు కావ్యపరముగా ప్రయోగించిరి.[1] నన్నెచోడుని కుమారసంభవములో, ఎఱ్ఱన నృసింహపురాణములో, నాచన ఉత్తరహరివంశములో, శ్రీనాథుని శృంగార నైషధములో, పినవీరన శృంగారశాకుంతలములో ప్రబంధవాసన గుబాళించుచున్నది. అయిననివి సమగ్ర ప్రబంధములు కావు. ప్రబంధ సూర్యోదయమునకు వేగుచుక్కలు; ప్రభాతరేఖలు మాత్రమే. రచనావిధానములో, కథావస్తువులో, పాత్రచిత్రణములో, రసపోషణములో, అలంకారవర్ణనాదికములో ప్రబంధము క్రొత్త రీతులను సంతరించికొన్న కావ్యప్రక్రియ. స్థూలముగా ప్రబంధ లక్షణములు నాలుగు.

1. కథ నాయకుని తృతీయ పురుషార్థమునకు (కామమునకు) చెంది ప్రాయికముగా తద్వివాహ సంబంధియగుట.
2. శృంగారము అంగిరసముగా నుండుట'
3. వర్ణనా బాహుళ్యము కలిగియుండుట.
4. రీతిప్రాధాన్యము కలిగియుండుట.

మనుచరిత్ర ఈ లక్షణములన్నిటిని గర్భీకరించుకొన్న ప్రథమప్రబంధము. దీనికి సమకాలికముగా వెలువడిన పారిజాతాపహరణముసైత మిట్టికావ్యమే. తరువాతి వెలువడిన అనేక ప్రబంధములకు మనుచరిత్రయే గీటురాయియైనది.

రామరాజభూషణునివంటి అప్రతిమాన ప్రతిభాసమేతుడుకూడ మనుచరిత్ర ప్రభావమునకు లోబడక తప్పలేదు. ప్రబంధరచయితగా పెద్దనచేసిన ప్రయోగము ప్రథమగణ్యమైనది. రామరాజభూషణుడు ఉన్నంతలో కొంతనవ్యత చూపించకపోలేదు. కథాసంవిధానములో, వర్ణనలలో కొంతవరకు మనుచరిత్రననుకరించినను కావ్యమందంతట ధ్వన్యలంకారములను నిక్షిప్తముచేసి క్రొత్తబాట త్రొక్కినాడు.

పెద్దన రామరాజభూషణుల తర్వాత చెప్పికొనదగిన ప్రయోగము చేసినవాడు పింగళి సూరన. కాలమునుబట్టి ఈతడు రామరాజభూషణునికి ముందున్నవాడు. కావున ఈతని రాఘవ పాండవీయము ఉపలబ్ధమైన గ్రంథములలో ప్రథమ ద్వ్యర్థికావ్యమని చెప్పవచ్చును. దీనిని జూచియే రామరాజభూషణుడు హరిశ్చంద్రనలోపాఖ్యానము రచించియుండును. ఏమైనను ద్వ్యర్థి ప్రబంధములకు సూరన రాఘవపాండవీయమే మార్గదర్శకమైనది.

1. ఆంధ్ర మహాభారతావతారికలో 'జననుత! కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ' అను పద్యములోని 'బద్ధ' 'బంధ'మేమో? ఈ 'బంధ'ము ప్రబంధార్థమున నన్నయ వాడెనేమో?

కేవల కల్పితకథ తీసికొని కావ్యరచనకు పూనుకొనుట సూరనచేసిన ప్రయోగములలో అపూర్వమైనది. కళాపూర్ణోదయము కల్పితకథతో కథావైచిత్ర్యముతో కూడుకొన్న మహా కావ్యము. 'కేవలకల్పనా కథలు కృత్రిమరత్నము'లని ఉపాలంభింపబడుచున్న ఆకాలమున కల్పిత వస్తువును గ్రహించి కావ్యనిర్మాణముచేయుట గొప్పప్రయోగము. కళాపూర్ణోదయ కావ్యపీఠికలోనే కవి 'అపూర్వ కథాసంవిధాన వైచిత్రీమహనీయం'బను మాటలలో తన కావ్యములో నున్నది కల్పిత కథయను విషయమును విశదీకరించినాడు.[1]

ప్రబంధయుగములో మిగిలిన కవులెల్లరు క్షుణ్ణమైన ఘంటాపథములో నడచినవారేకాని సూరనవలె క్రొత్తదారులు తీయుటకు సాహసించలేదు. పొన్నికంటి తెలగనార్యుడు 'యయాతి చరిత్రము'ద్వారా అచ్చతెనుగు కావ్యరచనకు దారితీసినాడు.

తెలుగులో సంకీర్తనలను పేర వ్యవహృతమగుచున్న భక్తిగీతములను వ్రాసినవారిలో ప్రప్రథముడు తాళ్ళపాక అన్నమాచార్యులు. త్యాగయ్య, క్షేత్రయ్యమున్నగు భక్తకవులు తరువాత తరువాత ఈ మార్గమున సంచరించినవారే. అన్నమాచార్యులకుగల 'పదకవితా పితామహుడ'ను బిరుద మత్యంత సార్థకమైనది.

దక్షిణాంధ్రయుగములో సాహిత్యరంగమున చెప్పుకోదగిన నూత్నప్రక్రియలు వెల్వడ లేదు. వచనగ్రంథములు విస్తారముగా వెలువడినవి. శతకములు, యక్షగానములు, గేయరచనలు ప్రబలముగా వెలసినవి. మనుచరిత్రతో ప్రారంభమైన ప్రబంధ కావ్యప్రక్రియ ఈ కాలము నాటికి వెఱ్ఱితలలు వేసినది. శృంగారము అంగపరిమితమై, అంతస్సారమును కోల్పోయి క్షుద్రమైనది. విజయవిలాసమువంటి ఒకటిరెండు ప్రబంధములుతప్ప చెప్పుకొనదగిన ప్రబంధము లీయుగమున లేవు. ఈ కాలములోని ఒకేఒక్క సుగుణము గేయకవితా పట్టాభిషేకము. రఘునాథరాయలు, విజయరాఘవ నాయకుడు స్వయముగా గేయరచనలను చేసిరి. అనేక గేయ కృతుల నాదరించిరి. విజయరాఘవుడు కర్ణాటకభాషలోని సాంగత్యమను ఛందస్సులో శృంగార సాంగత్యము, సంపంగిమన్నారు సాంగత్యమను రెండు గ్రంథములు రచించి ఛందస్సులో క్రొత్త రీతిని ప్రవేశపెట్టినాడు. అంతే. ఈ కాలమున వెలువడిన మిగిలిన కావ్యములన్నియు గతానుగతికములే.

### వేమన ప్రయోగములు :

ఈ కాలములో ఒకే ఒక్క క్రొత్తగొంతుక ప్రజాకవి వేమనది. తననాటికి జడీభవించిన వైదికధర్మమార్గమును, సాంఘిక దురాచారములను అధిక్షేపించుటకు పద్యమును వజ్రాయుధమువలె

1. ఈ కావ్యములోని కథాకల్పనా చాతుర్యము అపూర్వమైనది. కాలక్రమపద్ధతిలో కథచెప్పక 'ఆధునిక నవల'లో నున్నట్లు కార్యకారణపద్ధతి నవలంబించి కథామధ్య వృత్తాంతముతో కావ్యము నారంభించుట సూరనచూపిన నవ్యత. మనస్తత్త్వ సంఘర్షణ చిత్రణలోనైత మీ కావ్యమున సూరన క్రొత్తపోకడలు పోయెను.

ప్రయోగించినవాడితడు. ఛందస్సులో ఇతడు క్రొత్తదారి త్రొక్కకున్నను వస్తువులో గొప్ప వైవిధ్యము కనబరిచినాడు. అధిక్షేపకావ్యరీతి కీతనిపద్యములు శ్రీకారము చుట్టినవి.[1] తన చుట్టుజరుగు విషయములను సూటిగా ఎత్తిచూపుట, సంఘసంస్కారార్థమై కవిత్వము నుపయోగించుట, ప్రజలభాషలో పద్యములురచించుట వేమనచేసిన సరిక్రొత్త ప్రయోగములు. భాషలో, భావములో, శైలిలో అచ్చమైన తెలుగుదనము కలిగిన పద్యములు వేమనవి. వేమన ఆధునిక యుగములోని కవులలో పలువురిపై ప్రభావమువేసిన ప్రజాకవి. తెలుగు కవితను జానపదుల రసనాగ్రములపై నర్తింపజేసిన మహానుభావుడితడు.

ఇంతవరకు నన్నయ మొదలుకొని వేమనవరకుగల కవుల నవ్యప్రయోగములను వివరించితిని. ఇక 19 వ శతాబ్దినుండి 20 వ శతాబ్ది ప్రారంభమువరకు వెలువడిన క్రొత్తరీతుల నుటంకించుటకు ప్రయత్నింతును. ఇరువదవ శతాబ్దిలో ప్రారంభమైన నవ్యకవిత్వోద్యమమునకు పూర్వరంగమును నిర్దేశించుటకొరకే ఇంత విపులముగా వ్రాయవలసివచ్చినది. ముఖ్యముగా నన్నయ, నన్నెచోడుడు, సోమనాథుడు మున్నగు నలుగురైదుగురు చేసిన ప్రయోగములను వివరముగా చర్చించితిని. సాహిత్యరంగములో వీరుచేసిన ప్రయోగములు అపూర్వములైనవి. కావుననే వీనినిగురించి వైపుల్యమవసరమైనది. ప్రబంధయుగములో వేర్వేరు కవులగురించి చెప్పక యుగలక్షణములను - అనగా ప్రబంధప్రక్రియలోని నవ్యతనే ప్రస్తావించితిని. దక్షిణాంధ్ర యుగములో కావ్యములు సంఖ్యలో పరశ్శతముగానున్నను గుణములో గణనీయనవ్యత సంతరించుకొన్నవి కొన్నియేకావున సంగ్రహముగా ముగించితిని.

ప్రాచీనాంధ్ర కవులగూర్చి విచారించునప్పుడు వారి సంప్రదాయానుసరణముకన్న నవ్యతాసాధకతనే దృష్టిలోనుంచుకొంటిని. ఆనాడు సంప్రదాయానుసరణము ఎల్లరుచేసిన పనియే. ఆధునిక కవిత్వమును చర్చించునప్పుడు వారి సంప్రదాయానుసరణముపైగూడ సమదృష్టిని ప్రసరింతును. ఆధునిక కాలములో క్రొత్తప్రయోగముల పేరుతో 'చలామణి'లోనున్న రచనలన్నియు సంప్రదాయ దూరములుకావని, అవి సంప్రదాయమును జీర్ణించుకొన్నవేయని ముందు ముందు నిరూపించుటకు ప్రయత్నింతును.

[1] '—ఇరుసక్కలందును మఱుగులేని మంచి పదనుగల చురకత్తివంటి కవితాశక్తి, దానికి మెఱుగిచ్చునట్టి సంకేతదూషితముకాని ప్రపంచ వ్యవహారములందలి సూక్ష్మదృష్టి, గాయపుమందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచు నవ్వించు హాస్యకుశలత,—ఇవన్నియు వేమన్నను సృష్టి చేయునపుడు బ్రహ్మదేవు డుపయోగించిన మూలద్రవ్యములు'.

—వేమన : రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ : ప్రచు. 1946 : పుట 1.

# ద్వితీయ ఖండము

## పందొమ్మిదవ శతాబ్దిలో ఆంధ్రసాహిత్య స్థితిగతులు :

### ప్రవేశిక :

ప్రాచీనాంధ్ర సాహిత్యమంతయు రాజాదరణము వలన మూడుపూవు లారుకాయలుగా వర్ధిల్లినది. తూర్పు చాళుక్యప్రభువగు రాజరాజనరేంద్రుని కంటిచల్వతో పల్లెపట్టులందు మరుగు వడిన ఆంధ్రకవితా సరస్వతికి ఆస్థాన ప్రవేశయోగ్యత కలిగినది. క్రమముగా కాకతీయులు, రెడ్డిరాజులు, వెలమప్రభువులు తెలుగుభారతికి ముత్యాలశాలలు సంతరించిరి. విజయనగర ప్రభువుల యేల్బడిలో ఆంధ్రవాణి అంబరములను చుంబించు రవ్వలమేడలు నిర్మించుకొన్నది. 'ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబు' అనువానిచేత ఆవృతమైన మహావలయమున 'మహాంధ్ర' కవితా ప్రాగల్భ్యము వెల్లివిరిసినది. విజయనగరసామ్రాజ్య మస్తమించినతర్వాత దక్షిణమున చోళపాండ్యరాజ్యములే తెలుగు భారతికి శరణమిచ్చినవి. అప్పటికే సామంతరాజులలో ధర్మదీక్ష సడలిపోజొచ్చినది. సుఖలాలస, భోగచింతన ముదిరిపోసాగినవి. చోళపాండ్య రాజ్యములు ఛిన్నభిన్నమగుటతో ఒకనాడు సామ్రాజ్యస్థాపకులై 'తూరుపుకనుమదుర్గములనేలిన' ఆంధ్రులకు సామంతరాజ్యములు సైతము లేని నికృష్టదశ వచ్చినది. పురావైభవమును కోల్పోయి నామమాత్రావశిష్టములైన జమీలుమాత్రము శేషించినవి. ఆంధ్రజాతిలో వెనుకటి వీరతాముద్రలు చెరిగిపోయినవి. నృత్యసంగీత ప్రియత్వమను ముసుగులో భోగప్రియత్వము కుదురుకొన సాగినది. జాతికేర్పడిన ఈ దుస్థితియే సారస్వత రంగమున ప్రతిబింబించుట తప్పనిసరికదా ! సామ్రాజ్య నిర్మాణమునకు, తదున్నతికి హేతుభూతముగానుండి, వీరతాస్ఫూర్తిని కలిగించు కావ్యకాహళల నొత్తెడుకవు లీనాడు కరువైరి. అల్లసానిపెద్దన యెంతటి శృంగార ప్రబంధమును నిర్మించినను ధర్మప్రబోధమును విస్మరించలేదు. ఇప్పుడట్లుకాక ఐహికవాంఛలకు దోహదము చేసెడి కామశృంగార ప్రేరకములైన ప్రబంధములే చిలువలు పలువలుగా వ్యాపింపసాగినవి. సామంతరాజుల కాలమునాటికే ప్రజలలో కవులలో ఐహికసుఖ తత్పరత పెరిగిపోయినది. జమీల కాలమున ఇది యింకను ముదిరిపోయినది. జాతిజీవితము నిర్వీర్యమైనది. సారస్వతరంగము నిస్తేజమైనది. ప్రాచీన సాహిత్యసంప్రదాయములను అతిక్రమించుకొని క్రొత్తపుంతలో రచనలుచేయు

మహాకవి ఆనాడుద్భవించలేదు. అనుకరణశీలము పెరిగినది. చిత్రకవిత్వముపై మమకారము హెచ్చినది. పిల్లవసుచరిత్రలు పెల్లుగా విజృంభించినవి. ప్రబంధకవిత్వము క్రమముగా బంధ కవిత్వముగా మిగిలిపోయినది. ఆంధ్రసాహిత్యరంగమున ఏ యుగమునలేని రాధికాసాంత్వనము వంటి క్షుద్రశృంగార కావ్యములు, చంద్రరేఖా విలాపమువంటి బూతుకావ్యములు తలలెత్తినవి. శ్లేషకావ్యములు ఇసుళ్ళపుట్టలవలె బయలుదేరినవి. వానిలోకొన్ని చతురర్థులుగూడ నున్నవి. ప్రబంధములకు వసుచరిత్ర, ద్వ్యర్థికావ్యములకు రాఘవపాండవీయము మాతృకలై పోయినవి. అదే యెత్తుగడ, అవే సన్నివేశములు, అవే పాత్రలు, అదే కథాశరీరము, అదే నిర్వహణము. ఇంచుమించుగా 19 వ శతాబ్ది మధ్యభాగమువర కిట్టిస్థితియే పట్టినది. వీరేశలింగంపంతులుగారి అవతరణముతో ఆంధ్రసాహితి గ్రహణముక్తమై తొంటికాంతితో కలకలలాడి పోయినది. వీరేశ లింగంగారికి ముందు భారతదేశములోని సాంఘికస్థితిగతులు, విద్యావైజ్ఞానిక వ్యవహారము లెట్లుండెడివో పరిశీలించుట అవసరము. భారతదేశములోని స్థితిగతుల ప్రభావము ఆంధ్రదేశ ముపై ప్రసరించక తప్పదు. కాబట్టి మొదట భారతదేశములోని సాంఘికవ్యవస్థా స్వరూపమును సంగ్రహముగా నివేదింతును.

### భారతదేశములోని సాంఘిక స్థితి :

18 వ శతాబ్దిలో భారతదేశములో విద్యావికాసము మృగ్యమని చెప్పవచ్చును. అక్కడక్కడ శేషించిన ప్రాచీన విద్యాపీఠములు లక్షలాది విద్యావిహీనులకు ప్రయోజనకరములు కాలేదు. దేశములో వెనుకటి 'గ్రామపంచాయితీ'లకు బదులుగా కలెక్టర్లపాలన యేర్పడినది. ఈ 'కంపినీ' పరిపాలనకాలమున దేశీయులు అజ్ఞానాంధకారములోబడి కొట్టుమిట్టాడుచుండెడివారు. అసలే దేశము పారతంత్ర్య శృంఖలలో చిక్కుకొని నలిగిపోవుచున్నది. అందులో విద్యావ్యాప్తి వీసమైనలేదు. రానురాను భారతజాతిని భౌతికముగా, మానసికముగా మాంద్యము, నిస్పృహ పెనవేసికొన్నవి. మద్రాసుగవర్నరు సర్‌థామస్‌మన్రూ దేశీయులలో విద్యావ్యాప్తికై సంకల్పించిన ఉదారబుద్ధి. కాని 1827 లో అతడస్తంగతుడగుటవలన అతని సత్‌సంకల్పము నెర వేరినదికాదు. దేశీయులు తెల్లదొరలన్నచో మొగమెత్తి చూచుటకే జడిసెడివారు. వారిలోని సుప్తచైతన్యమును మేల్కొల్పి ఒకత్రాటిపై నడిపించు రాజకీయనాయకు లానాడు కలికమునకైన లేరు. ఈ స్థితిలో దేశములో నూత్నదృక్పథము వేరూరుటకు సరిక్రొత్త వాతావరణమును సృష్టింపవలసివచ్చినది. మాగాణమదే కాని యెరువులు, పరికరములు క్రొత్తవి, పుష్టిమంతము లైనవి కావలసివచ్చినది. ఇట్టి గడ్డుపరిస్థితిలో వంగదేశమున రాజారామమోహనరాయలు భారతీయుల దుర్దశను తొలగించుటకు వజ్రసంకల్పముతో నడుముగట్టెను.

### రాజారామమోహనరాయలు :

వందలసంవత్సరములనుండి దాస్యతమస్సులోపడి కన్నుగానక తడబడుచున్న భారత దేశమునకు రాజారామమోహనరాయల అవతరణము ప్రథమ ప్రభాతమువంటిది. 'బ్రిటిష ప్రభుత్వయుగమున భారతదేశోద్ధరణ ప్రయత్నము రాజారామమోహనరాయలతో ప్రారంభమైన

దని చెప్పవచ్చును.'[1] భారతదేశములో ఇంగ్లీషువిద్య ప్రబలుట కతడే మూలపురుషుడు. 1823 లో భారతదేశములో విద్యావ్యాప్తికిగల అవకాశములను పరిశీలించుటకు నాటి ఆంగ్లప్రభుత్వమొక 'కమిటీ'ని నియమించినది. ఆ కమిటీ సూచనలననుసరించి ప్రభుత్వము సంస్కృత కళాశాలలు స్థాపించుటకు నిర్ణయించినది. రామమోహనరాయ లీకళాశాలలస్థాపనకు వ్యతిరేకముగా ఎలుగెత్తెను. సంస్కృతముస్థానే ఇంగ్లీషుభాష 'మాధ్యమము' (Medium) గా ఆధునిక రీతులలో శాస్త్రవిజ్ఞానము, గణితము మున్నగు విషయములను బోధించవలయునని పట్టుపట్టెను. అప్పటి గవర్నరు జనరల్ Lord Amherst కు తన అభిప్రాయముల నుద్ఘాటించుచు ఒక లేఖ వ్రాసెను. ఆ లేఖలోని ఒక భాగమిది.

'—But as the improvement of the native population is the object of the Government, it will consequently promote a more liberal, and enlightened system of instruction, embracing mathematics, natural philosophy, chemistry, Anatomy, with other useful sciences. which may be accomplished with the sums proposed by employing a few gentlemen of talent and learning educated in Europe and providing a college furnished with necessary books, instruments and other apparatus.'[2]

రాజారామ్మోహనరాయలు మున్నగు విద్యాధికులు సాగించిన ఉద్యమమునకు ఫలితముగా 1835 లో మెకాలేవేసిన ఆంగ్లవిద్యాపథకము ఫలించినది. ఇంగ్లీషు భాష మాధ్యమముగా ఆధునిక విద్యావిధానము ప్రవేశపెట్టబడినది. దీనితో భారతీయులు పాశ్చాత్యుల సర్వతోముఖ విద్యారీతులను, విజ్ఞానశాఖల నవగాహన చేసికొనెడి అవకాశము కలిగినది.

రామమోహనరాయలు విద్యావిషయముననే కాక బహుముఖముగా భారతదేశమును సంస్కరించుటకు ప్రయత్నించిన మహామనీషి. బ్రహ్మ సమాజస్థాపనము, సహగమన నిర్మూలనము, సంఘదురాచార నిరసనము, ఆధునిక విజ్ఞాన వ్యాపనము, అసంఖ్యాక గ్రంథరచనము రామమోహనరాయల ఉదాత్త కార్యప్రణాళికలో గణనీయమైనవి. క్రైస్తవమత ప్రచారకు లీతని శేముషీ విశేషమున కాశ్చర్యపడి ఎట్లైన నీతనిని తమమతములో కలుపుకొనుటకు ప్రయత్నించగా, రాయలు క్రైస్తవ మతధర్మములను నిశితముగా నిర్భయముగా విమర్శించెను. సంఘ సంస్కరణము నిమిత్తమై 'సంవాద కౌముది' అను పత్రిక నిర్వహించెను. ఆంగ్ల, సంస్కృత, వంగ, పారసీకాది భాషలలో సంస్కరణోద్యమమును ప్రచారము చేయుటకై అసంఖ్యాకముగా వ్యాసములు ప్రకటించెను.

### ఆంగ్లవిద్యావ్యాప్తి : తత్ప్రభావము :

రామమోహనరాయల ఉద్యమము ఫలితముగా దేశీయులలో అపూర్వచైతన్యము రేకులు విప్పినది. ఆంగ్లవిద్యాసముపార్జన ఫలితముగా భారతీయులలో ఛాందసదృష్టి తొలగి సరిక్రొత్త

1. బ్రిటిష్ రాజ్యతంత్ర యుగము : దిగవల్లి వెంకటశివరావు : పుట 291.
2. 'Raja Ram Mohan Roy' : Published by G. A. Natesam co. Madras.

దృక్పథము జనించినది. ఇంగ్లీషు చదువుకొన్న ప్రాచ్యభాషా పండితులు (Orientalists) వినూత్న దృక్పథముతో సాహిత్యాధ్యయనము చేయసాగిరి. విస్మృతి గర్భములో విలీనమై యున్న జాతిరత్నములను (Classics) పునరుద్ధరించి ప్రచురించదొడగిరి. ప్రాచీన సంస్కృత గ్రంథములను సహేతుకదృష్టితో పరిశీలింపసాగిరి.[1] మిషనరీలు తమ మతగ్రంథముల ప్రచు రణకొరకు ముద్రణాలయములను నెలకొల్పదొడగిరి. వీరి కృషికూడ భారతదేశములో విద్యా వ్యాప్తికి అక్షరాస్యతా విస్తృతికి దోహదకారియైనది.

క్రమక్రమముగా దేశములో కళాశాలలు, పాఠశాలలు పెరిపోయినవి. పాశ్చాత్యుల చరిత్రను, సాహిత్య సంపదను పరిశీలించుటవలన విద్యాధికులైన భారతీయులలో వినూత్న వికాసము కలిగినది. బానిసతనమువలన వన్నెవాసి కోల్పోయిన తమదేశమును, సాంస్కృతికముగా పురోగమించిన ఇతరదేశములతో సరిబంతిని నిల్పవలెననుకాంక్ష చిగురించినది. మూగవడిన తమ జాతిజనులను పలికించుటకు వారు ఇంగ్లీషులోనేకాక తమతమ మాతృభాషలలో రచనలు చేయవలసి వచ్చినది. ఆత్మోద్ధరణముకొరకు వారు దేశభాషలలో ఉత్తమరచనలు చేయసాగిరి.[2]

1857 నాటికే బొంబాయి, కలకత్తా, మద్రాసులలో విశ్వవిద్యాలయములు స్థాపింపబడి నవి. భారతీయ జిజ్ఞాసువుల కివి కల్పతరువులై నిల్చినవి. విద్యాధికులసంఖ్య క్రమముగా పెరిగి పోయినది. పత్రికలు యువరచయితల నాకర్షింపసాగినవి. మైకేలు మధుసూదన దత్తు వంటి భారతీయరచయితలు మాతృభాషలతోపాటు ఇంగ్లీషులోకూడ ఉత్తమ రచనలు చేయ సాగిరి. మధుసూదనదత్తు అనన్యప్రతిభాశాలి. 1849 లోనే ఇతడు 'The Capitive Ladie' అను గేయకావ్యమును ఇంగ్లీషులో ప్రచురించెను. ఇది సంయుక్తా పృథ్వీరాజుల ప్రణయగాథ. ఇతడు మద్రాసునుండి కొంతకాల మింగ్లీషులో వార్తాపత్రిక సైతము ప్రకటించెను.

### జాతీయ చైతన్యము :[3]

ఆంగ్ల విద్యావ్యాప్తి ఫలితముగా దేశీయులలో స్వదేశోద్ధరణ సంకల్పము వేరూరసాగినది. 1851 లో కలకత్తాలో 'British Indian Association' అను ప్రజాసంస్థ స్థాపించబడినది. దేశీయుల హక్కుల రక్షణకొరకై ఆంగ్లప్రభుత్వము నెదుర్కొనుట కీ సంస్థ ప్రభవించినది. దీని స్థాపకులలో హరిశ్చంద్రముఖర్జీ, రాజేంద్రలాల్‌మిత్ర, ప్రసన్నకుమారటాగూరు ప్రముఖులు. 1854 లో స్థాపించిన 'Hindu patriot' అను పత్రికకు కొంతకాలము 'విలేఖరి'గా, తరువాత

---

1. Max Muller, Rider, Keith వంటి ఆంగ్లవిద్యాధికుల చలువవలననే భారతీయ విద్వాంసులు తమ వేదవాఙ్మయముపై, పాణినీయాదులపై దృష్టి మరల్చిరి.

2. 'The shock of the western impact had turned the sod, while English literature had fertilized the field and in due course, Modern Indian Literature was born'.
— 'Contemporary Indian Literature'లో K. R. Srinivasa Iyangar వ్యాసము.

3. ఈ విషయమునుగూర్చి వ్రాయుటలో దిగవల్లి వెంకటశివరావుగారి వ్యాసము లుపకరించినవి.

సంపాదకుడుగా హరిశ్చంద్రముఖర్జీ సమర్థతతో నిర్వహించెను. సంఘసంస్కరణమునం దీతడు ఈశ్వరచంద్రవిద్యాసాగర్ గారికి కుడిభుజముగా నిలిచెను. సిపాయి విప్లవము నణచుటకు ఆంగ్లేయులుచేసిన దుశ్చర్యల నీతడు నిర్భీకముగా ఖండించెను. దొరల యాజమాన్యమునగల నీలిమందు తోటలలో పనిచేయు రైతుల పక్షమున నిలిచి అనేక కష్టనష్టముల కోర్చెను.

1851 ప్రాంతములోనే జగన్నాథ్ శంకర్‌సేట్ మున్నగు పురప్రముఖులుకలిసి బొంబాయిలో ఒక ప్రజాసంస్థను స్థాపించిరి. ఈ సంఘమునజేరి దేశోద్ధరణముకై కృషిచేసినవారిలో దాదాభాయినౌరోజీ, మంగళ్‌దాసునాథూభాయి మున్నగువారు గణనీయులు. ఇంతకుముందే దక్షిణభారతదేశములో ఆంగ్లవిద్యావ్యాప్తి కలిగినదని చెప్పవచ్చును. ఆంగ్లోద్యోగులకు ఉద్యోగదృష్ట్యా దేశభాషాపఠన మవసరమైనందున మద్రాసులో క్రీ. శ. 1812 లోనే ఒక కళాశాల స్థాపింపబడినది. ఈ కళాశాలలో తెలుగు నేర్చుకొన్నవారే క్యాంబెల్, విలియంబ్రౌన్, సి. పి. బ్రౌన్ మున్నగువారు. వీరు తెలుగు వ్యాకరణములను ఇంగ్లీషుభాషలో రచించి సారస్వతమున కెంతో సేవచేసిరి.

1833 ప్రాంతములో ఏనుగుల వీరాస్వామయ్యంగారు, వెంబాంకం రాఘవాచార్యులుగారు, శ్రీనివాసపిళ్ళగారుకలిసి Hindu Literary Society అను ప్రజాసంస్థను స్థాపించి సభలుజరిపి ప్రముఖులచేత ఉపన్యాసము లిప్పింపసాగిరి. దక్షిణదేశమున దేశీయుల విజ్ఞాన వికాసమునకు కృషిచేసినవారిలో వీరే ప్రథమగణ్యులు. ఈ సంస్థ ఆధ్వర్యమున నాడు మద్రాసు సుప్రీంకోర్టులో అడ్వకేటు జనరల్‌గానుండిన జార్జినార్టన్‌గారిచే 1833-34 నడుమ ఆంగ్ల విద్యావశ్యకము గురించి, దేశచరిత్రాదికములగుర్చించి, ప్రజల హక్కులనుగురించి మహోపన్యాసము లిప్పించిరి. ఈతని ఉపన్యాసములు మద్రాసు పౌరులలో అపూర్వ రాజకీయ చైతన్యమును రేకెత్తించినవి. 1838 లో ఈ సంస్థ యాజమాన్యమున ఇంగ్లీషు కళాశాల స్థాపనావశ్యకము నుగ్గడించుచు 70 వేల మంది సంతకములతో ఒక 'మెమొరాండము' జార్జినార్టనుగారిద్వారా నాటి గవర్నరు జనరలు కందజేయబడినది. తత్ఫలితముగానే 1841 లో మద్రాసు యూనివర్సిటీ స్థాపింపబడినది. ఉత్తరోత్తరముగా దక్షిణదేశములో జరిగిన విద్యాభివృద్ధికి, ముఖ్యముగా ఆంగ్లభాషా విస్తృతికి వీరాస్వామయ్య ప్రభృతులు, రామమోహనరాయలపాత్రను నిర్వహించినారని చెప్పవచ్చును.

1844 లో క్రైస్తవ మిషనరీల అక్రమచర్యల నరికట్టుటకు 'చెన్నపట్టణ స్వదేశ సంఘము' అనుపేర మద్రాసు నగరములో ఒక ప్రజాసంస్థ స్థాపింపబడినది. దీనికి ప్రముఖాంధ్రవర్తకులు గాజుల లక్ష్మీనరసుసెట్టిగారు వెన్నెముకగా నిలిచిరి. తమ పత్రికయైన 'క్రెసెంటు' లో క్రైస్తవ మతాచార్యుల కుతంత్రములను కటువుగా విమర్శింపసాగిరి. ఈయన 1845 ఏప్రిలు 9 వ తేదీన ఒక అసమ్మతిసభ జరిపి, దానిలో చేయబడిన తీర్మానపు పాఠమును 'మహజరు'ను ఇంగ్లండులోని డైరెక్టర్లకు సొంతఖర్చులపై పంపించెను. క్రైస్తవమతాంతరులకు ఆస్తిహక్కు లుండవలెనని ఇంగ్లీషు ప్రభుత్వము చేయదలచిన చట్టమును సెట్టిగారి ఆందోళన ఫలితముగా ఉపసంహరించుకొనవలసివచ్చినది. ఆ కాలమున పాఠశాలలలో విద్యార్థులు క్రైస్తవమత పరిజ్ఞానములేనిదే పురోగ

మించుటకు వీలులేకుండెడిది. పైగా పాఠశాలలందు ప్రభుత్వమువారు బైబిలును నిర్బంధ పాఠ్య ప్రణాళికలో చేర్చిరి. ఇది క్రైస్తవమత పరివర్తనకు మొదటిమెట్టని గమనించి లక్ష్మీనర్సుగారు 1846 లో మద్రాసు నగరమున ఒక మహాసభచేసిరి. 12 వేలమంది సంతకములతో ఈ సభలో ఒక 'మహజరు' సిద్ధముచేయబడినది. కంపెనీ డైరెక్టర్లు ఈ మహజరును తృణీకరించినను, బైబిలును పాఠ్యగ్రంథముగా తీసివేయక తప్పలేదు.

1875 నాటికే భారతదేశములోగల అన్ని ప్రాంతములలో జాతీయ చైతన్యము రెమ్మలు వేసినది. చెన్నసగరములోని విశ్వవిద్యాలయములోను, హైకోర్టులోను ఉన్నతోద్యోగులు కొందరు దేశీయుల స్థితిగతులను చర్చింపసాగిరి. వీరిలో సర్. టి. మాధవరావు, ఆర్. రఘునాధరావుగార్లు గణనీయులు. ఇంకను న్యాపతి సుబ్బారావుగారు, తల్లాప్రగడ సుబ్బారావుగారు, పనప్పాకం అనంతాచార్యులుగారు మున్నగు ఆంధ్రప్రముఖులు దేశాభ్యుదయముకొరకు కంకణధారులైరి. మాధవరావుగారు దేశీయుల అభిప్రాయములను ప్రకటించుటకు 'Native public Opinion' అను పత్రికను ప్రకటించిరి. ఇది అంకురస్థితిలోనే అణగారిపోయినది. 1878 లో పి. సుబ్రహ్మణ్య అయ్యరు ప్రభృతుల సహాయముతో 'హిందూ' పత్రిక వారపత్రికగా స్థాపితమైనది. వీరి కృషివలననే మద్రాసునగిరములో మద్రాసు మహాజనసభయనెడు ప్రజాసంస్థ నెలకొల్పబడినది. ఈ కాలముననే కొందరు పాశ్చాత్యులు సంస్కృత భాషాసాహిత్యముల నభ్యసించి భారతీయ మతసంస్కృతుల ప్రాశస్త్యము నుగ్గడించుచు ఆంగ్లభాషలో వ్యాసములను ప్రకటింపసాగిరి. 1875 లో సర్వమత సమన్వయార్థమై అమెరికాలో స్థాపింపబడిన దివ్యజ్ఞాన సమాజము సభ్యులు భారతదేశమును పర్యటించి ఈ దేశము ప్రాచీనౌన్నత్యముపై ఉపన్యసించిరి. ఈ సంస్థలో క్రమముగా భారతీయ విద్యాధికు లనేకులు చేరిరి. వీరిలో తల్లాప్రగడ సుబ్బారావుగారు ప్రథమగణ్యులు. వీరి ప్రోత్సాహముతో అడయారులో 1882 లో దివ్యజ్ఞాన సమాజము స్థాపింపబడినది. 'ఆ సమాజసభ్యులలో కొందరు వీరి శిష్యులయిరి అందులో భారతదేశోద్ధరణకు పాటుపడిన ఎ. పి. సిన్నెటు, ఎ. ఓ. హ్యూము అను దొరలుకూడ ఉండిరని సమాజగ్రంథములందు వివరింపబడియున్నది.'[1] 1885 లో ఈ హ్యూముగారే భారతీయ ప్రముఖులను చేరదీసి బొంబాయిలో **Indian National Congress** కు బీజావాపము చేసిరి.

19 వ శతాబ్ది చివరభాగములోనే భారతీయ విద్యాధికులలో విశేషముగా వైజ్ఞానిక సంచలనము కలుగసాగినది. ఇంగ్లండులో చార్లెసుబ్రాడ్లే మున్నగువారు నాస్తికత్వమును ప్రతిపాదించుచు వ్రాసిన గ్రంథములను హేతువాద ప్రీతికలిగిన భారతీయ విద్యాధికులు చదువసాగిరి. ఈ కాలముననే **Herbert Spencer** ప్రతిపాదించిన **Agnosticism** (అజ్ఞేయవాదము) పాశ్చాత్య దేశములలో గొప్పసంచలనము కలిగించినది. ఇతని గ్రంథములను, చార్లెసువాయిసీ **Theism** మున్నగు గ్రంథములను భారతదేశములో బ్రహ్మసామాజికులు శ్రద్ధగా పఠింపసాగిరి. పాశ్చాత్య

1. దిగవల్లి వెంకటశివరావుగారు సంగ్రహాంధ్ర విజ్ఞానకోశములో వ్రాసిన ఆంధ్రదేశ చరిత్రము IV సంపు. : పుట 490.

దేశములలో లేచిన ఈ మతసంబంధమైన ఉద్యమములుగూడ భారతదేశములోని విద్యాధికులలో విజ్ఞాన వికాసము కలిగించెనని చెప్పవచ్చును.

ఇదియిట్లుండగా 19 వ శతాబ్ది చివరిమూడు దశాబ్దములలో ఆధ్యాత్మికరంగమున అభినవో త్తేజము కలిగినది. అప్పటికే కొందరు భారతీయులు పాశ్చాత్యవిద్యా నాగరకతాంధులై పోసాగిరి. రామకృష్ణ పరమహంస తన బోధామృతముతో భారతీయ సంప్రదాయముల మహత్తును చూపసాగెను. వీరిశిష్యుడు వివేకానందుడు భారతదేశము పూర్వవైభవమును, భారత సంస్కృత్యాధిక్యమును సమస్త ప్రపంచమునకు పరిచయము చేయుటకై పర్యటనచేయసాగెను. 1893 లో షికాగోనగరమున జరిగిన విశ్వమత మహాసభలో వివేకానందుడు భారతదేశమునకు ప్రతినిధిగా పాల్గొనెను. ఆ సభలో వేదప్రాశస్త్యమును సనాతన ధర్మోన్నత్యము నుగ్గడించుచు స్వామి గంభీరముగా ఉపన్యసించెను. తమతమ మతములే మోక్షకవాటములనుకొనెడు దురహంకారులకు వివేకానందుని ఉపన్యాసము గొడ్డలిపెట్టయినది. 1894 లో డిట్రాయిట్ నగరమున చేసిన ఉపన్యాసములో వివేకానందుడు క్రైస్తవమత దురభిమానము గలవారిని తీవ్రముగా ఖండించెను. స్వామి ఉపన్యాసములోని ఒకవాక్యమిది, ''భారతీయులందరునులేచి హిందూమహాసముద్రపు టడుగుననున్న బురదనంతయుదీసి పాశ్చాత్యదేశములపై బడవైచినను అయ్యది మీరు మాపట్ల సల్పుచున్న ఘోరకృత్యములలో సహస్రాంశమునకైనను సరిరాదు. ఎందులకు ? మీ మతమునువీడి మామత మవలంబింపజేయుటకు మేమొకమత ప్రచారకుని మీ దేశమున కెన్నడైనను పంపియెరుగుదుమా''.[1]

హిందూమత మొకమతముకాదని, భారతీయులకు వ్యక్తిత్వములేదని వింతభ్రాంతిలోనున్న పాశ్చాత్యులకు వివేకానందుని ఉపన్యాసములు నేత్రాంజనములుగా పరిణమించినవి. ఈ ఉపన్యాస పాఠములను చదువుకొన్న భారతీయులలో ఎక్కడలేని అభిమానము కట్టలుత్రెంచుకొని వచ్చినది. స్వామి ఉపన్యాసములేకాక, ఆయన పాశ్చాత్యదేశములలో నున్నప్పుడు భారతీయ శిష్యులకు వ్రాసిన లేఖలుగూడ భారతజాతిలో ఆధ్యాత్మికముగా, సాంఘికముగా నూత్నజాగృతి కలిగించినవి. స్వామి రాజకీయములలో ప్రత్యక్షముగా పాల్గొనలేదు. కాని తత్కాలీన భారతీయుల దౌర్భాగ్యమున కాయన యెంతగా కుమిలిపోవుచుండెడివాడో ఆయన లేఖలవలన తెలియుచున్నది. ఒకలేఖలో ఆతడు 'అధఃపతితమైయున్న భారత సోదరకోటి సముద్ధరణము పొందుటకై మనమందర మహర్నిశము ప్రార్థింతముగాక' (చిరంతనానందస్వామి అనువాదము) అనెను. అశ్వినీ కుమారుదత్తనెడు ప్రముఖ దేశభక్తునితో స్వామి ఒకమాటు 'వంగయువకుల అస్థులనుండి భారతదేశ దాస్యమును విచ్ఛిన్నముచేయు వజ్రాయుధము నిర్మింపబడవలయు'నని అనెను. మాలమాదిగలే భారతజాతికి ప్రాణమనెను. వారికి పాతకాలలను నెలకొల్పుడని, వారికుపనయనము నొనర్పుడని ఉద్బోధించెను. ఈ విధముగా వివేకానందుని ఉపన్యాసములు, లేఖలు నాటి జాతీయచైతన్య స్ఫూర్తికి దోహదము చేసినవని చెప్పవచ్చును.

1. వివేకానందుడు : చిరంతనానందస్వామి : పుట 201.

### తెలుగునాట పత్రికా రచన :

దేశీయులలో విద్యావ్యాప్తిలోనేమి, జాతీయతా ప్రచారములోనేమి, విజ్ఞానదీప్తి కలిగించుటలోనేమి పత్రికలు ప్రధానపాత్ర వహించినవి. తెలుగునాట వెలసిన అసంఖ్యాక పత్రికలు ఇరుదవ శతాబ్దిలో అలలెత్తిన నవ్యసాహిత్యోద్యమమునకు పూర్వరంగము నెట్లు సిద్ధపరిచెనో గమనింతము.

దాదాపొక శతాబ్దము క్రిందనే తెలుగులో పత్రికారచన ప్రారంభమైనది. 1852 లో బ్రౌనుదొర బ్రౌణ్య నిఘంటువునకు వ్రాసిన పీఠికలో తత్కాలీన పత్రికలగురించి యిట్లువ్రాసెను.

"Among the Telugus, it (Printing) commenced about the year 1806, but made little Progress untll 1880...There are at least eight such presses at work, besides those which are under management of English men. Native news papers both Telugu and Tamil exist, but are ill-supported unless they deal in vituperation regarding points of religion or caste".

ప్రాథమిక దశలో భారతీయపత్రికలలో ఎక్కువగా క్రైస్తవమత ప్రచారమునకు సంబంధించినవే ఉండెడివి. తెలుగునాట వెలసిన ప్రప్రథమ పత్రికకూడ ఇట్టిదే. దీనిపేరు సత్యదూత. ఇది మాసపత్రిక. ఇది బళ్ళారిలోని క్రైస్తవ సమాజముపక్షమున నడుపబడుచుండెడిది. దీనిలోని భాష వ్యావహారికమే అయియుండుట గమనింపదగిన యంశము. 1840 లో వృత్తాంతిని, 184?-50 లో వర్తమాన తరంగణి, 1861-68 లో దినవార్తామణి. 1862-67 లో హితవాది, 18?3-67 లో శ్రీ యక్షిణి మొదలైన పత్రికలు వెలువడినవి. ఈ పత్రికలన్నియు క్రైస్తవమత ప్రచారార్థ ముదయించినవే. 1864-70 లో మద్రాసు వేదసమాజము పక్షమున తత్త్వబోధిని యను పత్రిక వెలువడినది. దీనిలో మతసంబంధమైన చర్చలకు ప్రాధాన్య ముండెడిది. వీరేశలింగం పంతులువంటివారి కీపత్రిక ప్రయోజనకారియైనదని పంతులుగారి మాటలవలననే తెలియుచున్నది. సుజనరంజని (1864-67), ఆంధ్రభాషా సంజీవని (1871-99) మున్నగు పత్రికలు అముద్రిత రచనల ప్రచురణకై, సాహిత్యవిమర్శలకై ఉద్దేశింపబడినవి. ఆంధ్రభాషా సంజీవని కొక్కొండ వెంకటరత్నం పంతులుగారికి, వివేకవర్ధని వీరేశలింగం పంతులుగారికి స్వాభిప్రాయ ప్రకటనకు చక్కని వేదికలుగా రూపొందినవి. 1885 లో ప్రచురింపబడిన పూండ్ల రామకృష్ణయ్యగారి అముద్రిత గ్రంథచింతామణి సాహిత్య విమర్శలకు, అముద్రిత గ్రంథప్రచురణకు సాధనమై అమూల్యమైన సేవచేసినది. వార్తలు మున్నగువాని కేమాత్రము అవకాశమీయక ఇంగ్లీషుభాషలో ప్రకటింపబడు Athenaeum అను పత్రికవలె కేవలము భాషా సారస్వత విషయములకొరకే దీక్షగావనిచేసిన పత్రికారాజమిది. వేదం వెంకటరాయశాస్త్రి మున్నగు పండితవర్యుల విమర్శలకిది వేదికగానుండెడిది. పి. ఆనందాచార్యులగారి వైజయంతి, రాజా మంత్రిప్రగడభుజంగ రావుగారి మంజువాణి; శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి కళావతి, చిలకమర్తివారి మనోరమ ఆనాటి సాహిత్యవికాసమునకు బహుధా కృషిచేసినవి.

## క్రైస్తవ మిషనరీల ప్రభావము :

### తత్పర్యవసానము :

హిందువులనందరిని క్రైస్తవులుగా జేయుటకే తాను భారతదేశములో ఇంగ్లీషు భాషను ప్రవేశపెట్టితినని మెకాలే ప్రభువు తన సోదరికి ఒక లేఖలో వ్రాసెను. ఇంగ్లీషు ప్రభుత్వము అండదండలతో క్రైస్తవ మిషనరీలు భారతదేశమంతట విజృంభింపజొచ్చెను. వంగదేశములో మధుసూదనదత్తువంటి మహాకవి క్రైస్తవమతమును స్వీకరించెనన్న ఈ మతప్రభావ మెంత ఘనిష్ఠముగా నుండెడిదో ఊహింపవచ్చును. ఆంధ్రదేశములో 19వ శతాబ్ది ఉత్తరార్ధమున క్రైస్తవ మతవ్యాపనము విస్తృతము కాజొచ్చినది. హైందవమతము కేవలము మూఢాచారభూయిష్ఠమైనదని, రాయిరప్పలను దేవతలుగా పూజించు అనాగరక మతమని వారు దుష్ప్రచారము చేయసాగిరి. వీరి ప్రచార ప్రభావమునకు లోబడి, వీ రొసగిన సహాయ సానుభూతులకు ఆకృష్టులై ఆంధ్రదేశమున కొన్ని లక్షలమంది మాలమాదిగలు క్రైస్తవమతమును పుచ్చుకొనిరి. గుంటూరు జిల్లాలో కొందరు రెడ్లు, కమ్మవారుసైత మీ మతమును స్వీకరించిరి. నోబులు కళాశాల (బందరు) లో చదువుకొన్న బ్రాహ్మణ యువకులలో కొందరు క్రైస్తవమతాంతగులైరి. వారిలో ధన్వాడ అనంతం, మల్లాది వెంకటరత్నం పేర్కొనదగినవారు. ఆసుపత్రులద్వారా, విద్యాకేంద్రములద్వారా ఆంధ్రదేశమున క్రైస్తవమతము దళితజాతుల నోరూరించినది. ఈ విధముగా క్రైస్తవమతము విజృంభించినకొలది హైందవులలో అంతశ్శోధన ప్రారంభమైనది. హైందవులలో స్వస్థాన వేషభాషాభిమానము వెల్లువిరిసుకొని విజృంభించుటకు క్రైస్తవ మతప్రాబల్యము ప్రధానహేతువని చెప్పవచ్చును.

హిందూమతములోని మూఢాచారములను, అంధవిశ్వాసములను దులిపివేసి, దాని పురాప్రశస్తిని, అంతస్సత్త్వమును దేశములో ప్రసరింపజేయుటకు ఆంధ్రదేశమున గొప్ప సంస్కరణోద్యమము బయలుదేరినది. రాజారామమోహనరాయలు అంతవరకే వంగదేశమున బ్రహ్మసమాజమును స్థాపించి దురాచార దూషితమైన హైందవసంఘమును సంస్కరించుచుండెను. ఈ సమాజముచేత ప్రభావితులై కందుకూరి వీరేశలింగంపంతులుగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఆంధ్రదేశమున వెల్లువవలె సంస్కరణోద్యమమును ప్రవహింపజేసిరి. వీరొకవైపు పూర్వాచారపరాయణులైన హిందువులను, మరియొకవైపు క్రైస్తవమత ప్రచారకుల నెదుర్కొనవలసివచ్చెను. బ్రహ్మసమాజమేకాక దయానందసరస్వతి స్థాపించిన ఆర్యసమాజము, మేడంబ్లావిట్స్కీ, కల్నల్ అల్కాటుగార్లు స్థాపించిన దివ్యజ్ఞాన సమాజము, స్వామి వివేకానందుల సనాతన మతపునరుద్ధరణ మహోద్యమము, భారతదేశముతోపాటు ఆంధ్రదేశములోగూడ అభినవోత్తేజమును రేకెత్తింపజేసినవి. విద్యార్థులలో, విద్యాధికులలో ఈ ఉద్యమములు సమష్టిగా అపూర్వ సంచలనమును కలుగజేసినవి. క్రైస్తవమతప్రచారము అభావాత్మకముగా (Negative) పై ఉద్యమముల ప్రాబల్యమునకు హేతువైనది. ఐనను క్రైస్తవ మతప్రాచుర్యమువలన ఒకటి రెండు మేళ్లు కలిగినవను విషయము విస్మరించుటకు వీలులేదు. వానిలో తెలుగుభాషకు కలిగిన ప్రచా

రము ప్రధానమైనది. క్రైస్తవ మతప్రచారకులు తమ మతమును త్వరితగతిని ప్రజలలో ప్రచారము చేయుటకు ప్రాంతీయ భాషలలో బైబిలు ననువదింపజేయుట అత్యావశ్యకమైపోయినది. ప్రార్థనాలయములందు. ప్రచారసభలయందు పాడుటకు కీర్తనలు, పాటలు కావలసివచ్చినది. ఇంగ్లీషుభాషలో చెప్పినచో దేశీయుల కర్థముకాదు. అందువలన వారు దేశీయులవద్ద వారిభాషను, సారస్వతమును అధ్యయనము చేయవలసివచ్చినది. అందుకు వారు నిఘంటు నిర్మాణము ప్రప్రథమ కర్తవ్యముగా భావించి కాంబెలు దొరగారిని ఆ పనికి నియోగించిరి. వారికి సహాయకులుగా ఇద్దరు తెలుగు పండితులను నియమించిరి. వీరు సిద్ధముచేసిన నిఘంటువు అక్షర క్రమమున వ్రాసిన మొదటి నిఘంటువని జయంతి రామయ్యపంతులుగా రభిప్రాయపడినారు. వీరు మత దృష్టితో దీనిని సంకలనము చేయించినను తెనుగుభాషకు దీనివలన మహోపకారము జరిగినది. ఉద్యోగరీత్యా చెన్నపట్టణమునకువచ్చిన బ్రౌను దొరగారు ఆంధ్ర సాహిత్యమునకు చేసినసేవను ఇక్కడ సంగ్రహముగా నివేదించుట అప్రస్తుతము కాదనుకొందును.

కాంబెలుగారి నిఘంటువుకన్న సమగ్రమైన నిఘంటువులను రెంటిని బ్రౌనుదొరగారు 1852 లో ప్రచురించినారు (ఒకటి తెలుగునుండి ఇంగ్లీషునకు, రెండవది ఇంగ్లీషునుండి తెలుగునకు). 1833 నాటికే ఈయన తెలుగు సాహిత్యమునుగూర్చి ఒక వ్యాసమును రచించెను. 1840 లో ఒక తెనుగు వ్యాకరణమును రచించెను. శ్రీ కురుగంటి సీతారామయ్యగారన్నట్టుగా బ్రౌను దొర ఆంధ్రభాషకు అమరసింహునివంటివాడు. వేమన శతకమును ఇంగ్లీషులోనికి అనువాదము చేయించి తెలుగు కవితా సౌరభమును తొలిసారిగా తెల్లదొరల కందించిన మహనీయుడాతడు. తాళపత్ర గ్రంథరూపమున సుషుప్త్యవస్థనున్న తెలుగు కావ్యముల నుద్ధరించి మొట్టమొదట ముద్రణ భాగ్యమును కలిగించిన భాషాపోషకుడితడే. ప్రబంధ రత్నములైన మనుచరిత్ర వసుచరిత్రలను శ్రీమదాంధ్ర భాగవతమును తొలిసారిగా ముద్రింపించి వెలుగులోనికి తెచ్చినది ఈతడే. అంతేకాదు. ఈనాడు అచ్చులిపిలోనున్న 'వత్తులు' కొన్నిటిని ఆయనయే కనిపెట్టినాడు. శంకర నారాయణగారి రెండు నిఘంటువులకు బ్రౌను నిఘంటువులే మాతృకలు.[1]

### వీరేశలింగంగారు :

### సంఘసంస్కరణోద్యమము :

ఫ్రాన్సుదేశములో వాల్టేరువలె ఆంధ్రదేశమున సంఘసంస్కరణముకొరకు తన కలమును ఖడ్గసదృశముగా ఝళిపించిన మహాపురుషులు వీరేశలింగంపంతులుగారు. సాంఘిక దురాచార నిర్మూలనములోనేమి, బహుముఖ సాహితీప్రక్రియాసృష్టిలోనేమి, ఆంధ్రజాతీయతా ప్రచారములోనేమి, వీరేశలింగంగారే పితామహతుల్యులు. వారే రథులు, సారథులు. 1874 లో వారు వివేకవర్ధనియను పత్రికను స్థాపించిరి. ఇది మాసపత్రిక. ఈ పత్రికా ప్రకటన ప్రయోజనములు రెండని పంతులుగారే తమ స్వీయచరిత్రలో వ్రాసికొనిరి. ఒకటి భాషాభివృద్ధి; రెండవది దేశాభి

1. నవ్యాంధ్ర సాహిత్యవీధులు : (ప్రథమ భాగము) : పుట 8.

వృద్ధి. తెలుగుభాషలో మృదువైన, సరళమైన శైలిలో సలక్షణ వచన రచనచేయుట భాషాభివృద్ధి మార్గమని, దురాచారములను నిర్మూలించి, మతకులాచార విద్యానీతి విషయములందు నానాముఖముః కృషిచేయుట దేశాభివృద్ధి మార్గమని పంతులుగారు వివరించిరి. లంచగొండితనమును బట్ట బయలు చేయుటయందు, స్త్రీవిద్యా విషయమునందు, వితంతువివాహ విషయమునందు వీరేశలింగంగారి కృషి అనన్యమైనది. 1881 లో రాజమహేంద్రవరమున ఒక నాటక సమాజమును స్థాపించి 'చమత్కార రత్నావళి' యను రెండు నాటకముల నాడించిరి. ఇవి ప్రహసన రూపములో నున్నవి. వీని ప్రదర్శనతో నగరమందు గొప్ప సంచలనము కలిగినది. 1881 డిసెంబరు 1 వ తేదీని రాజమహేంద్రవరములో మొదటి వితంతు వివాహము జరిపించి పంతులుగారు సంఘ సంస్కరణోద్యమమునకు పతాకస్థాయి కల్పించిరి.

సంఘసంస్కరణోద్యమముతోపాటు సాహిత్యకేదారమున ఎన్నో క్రొత్త అంట్లను నాటిన భవిష్యద్ద్రష్ట వీరేశలింగంగారు. గద్యవాఙ్మయమును క్రొత్తదారులలో నడిపించుటయందు వారే ఆద్యులు. కావ్యనాటకములేకాక తెలుగులో ప్రకృతిశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, శారీరశాస్త్రము, పదార్థ వివేచనాశాస్త్రము, భౌతిక భూగోళశాస్త్రములకు సంబంధించిన గ్రంథములు, అలంకార సంగ్రహము, ఆంధ్రతర్కసంగ్రహముమున్నగు బహువిధవాఙ్మయ సృష్టిచేసిన మనీషి ఆయన. ఆంధ్రసాహిత్య చరిత్రమును క్రమబద్ధముగా ప్రమాణవంతముగా వ్రాసినదాతడే. వీరి ఆంధ్ర కవుల చరిత్ర ప్రచురణముతో నన్నయ, రామకృష్ణకవి ప్రభృతులకు సంబంధించిన కట్టుకథలు మాయమైపోయినవి. ఒక్క కవితారంగముతప్ప సారస్వత క్షేత్రములోని అన్నిదారులలో సరి క్రొత్త ప్రయోగములుచేసిన మహారచయిత పంతులుగారు. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారన్నట్లు ఈయన అయిదవ వాచకము మొదలుకొని ఆంధ్రకవుల చరిత్రముపరకు రచించిన బహుముఖ ప్రజ్ఞాశాలి. పంతులుగా రెన్నిరకములైన ప్రయోగములుచేసిరో వారే స్వయముగా స్వీయచరిత్రలో వ్రాసికొన్న మాటలనుబట్టి తెలియును.

''తెనుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని మొదటి చరిత్రమును నేనే రచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని''.

ఒక్కమాటలో చెప్పవలెనన్నచో ఆంధ్రదేశమునకు సాంఘికముగా, సాహిత్యకముగా వినూతన జాగృతిని కలిగించిన ప్రప్రథమ వైతాళికుడు వీరేశలింగంపంతులుగారు. వీరికి సారస్వత రంగములో సైదోడుగానుండి కొమర్రాజువారు విజ్ఞానచంద్రికామండలి స్థాపించి గొప్ప సేవచేసినారు.

ఇంతవరకు భారతదేశము ముఖ్యముగా ఆంధ్రదేశము సాంఘిక సాంస్కృతిక స్థితిగతులను నివేదించినాను. ఇక 19 వ శతాబ్దిలో వెలువడిన కవిత్వమును, దాని క్రొత్త పాతలను సంగ్రహముగా నివేదించి ఈ ప్రకరణమును ముగింతును.[1]

1. ఈ విషయముగూర్చి వ్రాయుటకు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్ర రచయితలు' చక్కగా ఉపకరించినది.

## కొందరు కవులు :
## వారి కవితా రీతులు :

19 వ శతాబ్ది రచయితలలో ప్రథమగణ్యుడు చిన్నయసూరి. కాని అతడు గద్యవాఙ్మయములో క్రొత్తమొక్కలు నాటినాడేకాని కవితా కేదారమున కాలూనలేదు. ఈ కాలపు కవులలో మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి (1808-73) పేర్కొనదగినవాడు. ఇతడు సంప్రదాయ మార్గములో సంచరించినవాడేకాని ఈషణ్మాత్రమైన నూత్నప్రయోగము చేసినవాడుకాడు. పారిజాతాపహరణ విజయవిలాస కథలను జోడించి ఈతడు 'కృష్ణార్జున చరిత్ర'మను ద్వ్యర్థి కావ్యమును రచించెను. కోరాడ రామచంద్రశాస్త్రిగారుసైతము 'కుమారోదయము' అను కావ్యమును రచించి క్షుణ్ణమైపోయిన సంప్రదాయాధ్వములో ప్రయాణించినారు.

మతుకుమల్లి నృసింహకవి (1816-73) ఈ కాలపు కవులలో క్రొత్తతెన్నులు ద్రొక్కుటకు ఉత్సహించినాడు. మొదట ఈతడు వసుచరిత్రకు సహపంక్తిలోనిలుచు 'అజచరిత్ర' మను ప్రౌఢప్రబంధమును రచించెను. ఇంతటితో తృప్తిపడక 'చెన్నపురీ విలాసము' అను కావ్యమును 1860 ప్రాంతములో రచించెను. ఈ కవి కార్యవశమున చెన్నపట్టణము వెళ్ళినప్పుడు చూచిన ఆ పురవిశేషములన్నియు ఈ కావ్యమున పూసగ్రుచ్చినట్లు వర్ణింపబడినవి. నాటి మదరాసులోని విశేషములన్నియు నిందు కనులకు గట్టినటుల వర్ణింపబడినవి.[1] దీనిలో వీధులు, మేడలు, సముద్రము, రైలు, ఫోటోగ్రాఫు, అచ్చుకూటములు, ఆసుపత్రులు, మ్యూజియము, లైటుహౌసు మున్నగువానిపై ముచ్చటైన వర్ణనలు కలవు. చాటుపద్యములు, క్రీడాభిరామము మొదలైన ఒకటి రెండు కావ్యములుతప్ప సమకాలిక సమాజ స్థితిగతులను చిత్రించు కావ్యములు తెలుగులో క్వాచిత్కముగా కనిపించును. అందులో ఆంగ్ల నాగరకత మూర్తీభవించిన మద్రాసు నగరము నీకవి నిసర్గరమణీయముగా వర్ణించుట విశేషము. ఆ కాలమున నిట్టి కావ్యములు వ్రాయుట క్రొత్తయే యనిపించును. పైగా కోకొల్లలుగా ఆంగ్ల పదములను ప్రయోగించి కొంత సాహసమును ప్రదర్శించినాడీతడు.

ఈతని తర్వాత మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు గణనీయులు. వీరికి 'అభినవాంధ్ర కవితా పితామహు'డను బిరుదము కలదు. చిన్ననాటనే 'కవితాలతాంకుర'మను కావ్యము గంటలో రచించిన ఆశుకవి వీరు. ఒక్క 'ఆత్మచర్య' రచనలోతప్ప వీరి కవిత్వములో అభినవత్వము కనిపించదు. 'ఆత్మచర్య' పద్యబద్ధమైన స్వీయచరిత్ర. పద్యములలో స్వీయచరిత్రనల్లుట కొత్త ప్రయోగమనియే చెప్పవచ్చును. కవులు కావ్యాదిలోగాని, కావ్యాంతరములోగాని ఆత్మ విషయములు చెప్పికొనిరిగాని ప్రత్యేకముగా అందుకొరకు కావ్యములు రచించలేదు. ఈయన అట్లు చేయుట క్రొత్తవిషయము. వెంకటశాస్త్రిగారి 'జాతకచర్య' రచన కీకావ్యమే దారిచూపినదనిపించును.

---

1. ఆంధ్ర రచయితలు : పుట 24.

మాడభూషి వెంకటాచార్యులుగారు ప్రాతధోరణిలోనే 'భరతాభ్యుదయ'మను ప్రౌఢ ప్రబంధము రచించినను ఆశుకవిత్వమును, అవధానములను బహుళ ప్రచురితములుగాజేసి ఒక క్రొత్తదారి త్రొక్కినారు. శతావధానముల నధికప్రచారము చేసినవారిలో వీరే అగ్రేసరులు. దేవులపల్లి సోదరకవులకు, తిరుపతి వెంకటకవులకు అవధాన విషయములో వీరే వేగుచుక్కలని చెప్పవచ్చును.

కొక్కొండ వెంకటరత్నంపంతులుగారు భాషావిషయికముగా, రచనా విషయికముగా అత్యంత సాంప్రదాయికులు. బిల్వేశ్వరీయము, కుమార నృసింహమువంటి జటిల కావ్యములు రచించిన వీరు సీసము మొదలైన పద్యములకు 'ఉజ్జీ'గా వెండి, బంగారము మొదలైన పేర్లతో క్రొత్త వృత్తములను సృష్టించుట చరిత్రలో సరిక్రొత్త ప్రయోగము. ఐనను వీరి ప్రయోగము ప్రయోగముగానే నిలిచిపోయినది. సీసముముందు 'వెండి' 'బంగారము'లు వీగిపోయినవి.[1]

హరికథకుడుగా సుప్రసిద్ధుడైన ఆదిభట్లనారాయణదాసు 'ఉమరుఖయ్యాము'ను తొలిసారిగా తెలుగులో అనువదించినకీర్తి గడించుకొన్నాడు. ఈయన సంస్కృతాంగ్ల పారసీకాంధ్రభాషలలో ఒకొక్క చరణముచొప్పున చెప్పిన సీసము చమత్కారవంతమైన వినూత్న ప్రయోగము.

గీతపద్యములలో నాటకముసాంతము రచించినవారు వావిలాల వాసుదేవశాస్త్రిగారు. వీరి 'నందకరాజ్య'మను నాటక మిట్టిదే. ఇది మొత్తము గీతపద్యములలో నడచినది. పద్యములలో నాటకము వ్రాయుట ఆంగ్లనాటక ప్రభావమును సూచించుచున్నది.

వేదంవెంకటరాయశాస్త్రిగారుగూడ వీరేశలింగంగారివలె కవిత్వములో క్రొత్త ప్రయోగము లేవియు చేయలేదు. కాని నాటకరచనలో వీరు కనబరిచిన స్వేచ్ఛ ప్రత్యేకముగా పేర్కొన దగినది. ప్రతాపరుద్రీయ నాటకములో వీరు గ్రాంథిక వ్యావహారికభాషలను పాత్రోచితముగావాడి క్రొత్తదారిని తొక్కిరి ఇది అపూర్వమైన ప్రయోగము. వ్యావహారికభాషకు తొలిసారిగా 'గ్రాంథికత' కల్పించిన విప్లవకారులు వీరే. వీరి తర్వాత గురజాడవారు వ్యావహారికభాషలో మొత్తము నాటకము 'కన్యాశుల్కము' పేర రచించిరి. ఇది నాటక రచనకు సంబంధించిన ప్రయోగమైనను దీని ప్రభావము తరువాతికాలపు సాహిత్యరంగమున నంతట ప్రసరించినది. కావున దీనిని ప్రత్యేకముగా పేర్కొనవలసివచ్చినది.

దేవులపల్లి సోదరకవులలో ఒకరైన సుబ్బరాయకవి రచించిన 'మహేంద్రవిజయ'మను కావ్యము సంప్రదాయసిద్ధముగా నడచినను కొన్ని క్రొత్తపోకడలను సంతరించుకొన్నది. శాంతి భద్రాద్రిరామశాస్త్రి, 'చిత్రసీమ' అను కావ్యమువ్రాసి అభినవ ప్రయోగమునకు అంకురార్పణచేసిన కవి. ఇది కళాపూర్ణోదయ లక్షణములను పుణికిపుచ్చుకొన్న కల్పితవస్తు భరితమైన కావ్యము. ఈ కావ్యము 'కలదొక రాచకూతురు' అని ప్రారంభింపబడినది. 'శ్రీ' తో ప్రారంభము కాక పోవుట, కృత్యాద్యవస్థలేకపోవుట ఆ కాలమున గొప్పనవ్యత. షష్ఠ్యంతములకుబదులుగా ద్వితీ

1. చూ॥ అనుబంధము - 2.

యాంతములుకూర్చుట మరియొక చమత్కారము. ఈ కావ్యనాయకుని పేరు చిత్రసీమ. ఈ పేరులోనే ఎంతో క్రొత్తదనమున్నది.

మేడేపల్లి వెంకటరమణాచార్యులు దేవవ్రత చరిత్రమను కావ్యమును ప్రాచీనఫక్కిలో రచించినను, కావ్యమున ఒకచోట నాటకపద్ధతిని ప్రవేశపెట్టి నవ్యతను ప్రదర్శించినాడు. ఆ పద్ధతి యిట్లున్నది.

భీష్ముడు : మేల యీ సంరంభము
హేలాసంతర్జితావనీశ్వర ! నీకుఁ
జామదగ్న్యుడు : బాలామణి గైకొనుమీ
భీష్ముడు : వాలాయము సేయనౌనె భార్గవ ! చెపుమా !

నాటకములోని సంవాదపద్ధతిలో ఇది వ్రాయబడినది. అనవుడు, నావుడు, ఇట్లనియె మున్నగు పూరణపదములకు బదులుగా ఈ పద్ధతి నవలంబించుట నవ్యప్రయోగమనవలెను.

దాసు శ్రీరాములుకవి దేవీభాగవతాంధ్రీకరణము సంప్రదాయమార్గములో చేసినను 'తెలుగు నాడు' అను కావ్యముద్వారా సమకాలీన సమాజమును చిత్రించి నవ్యతను సాధించినాడు. ఈ కవి వైదిక బ్రాహ్మణుల వ్యావహారిక భాషలో వ్రాసిన పద్యము చమత్కారముగానున్నది.

"అస్సేచూస్సివషే వొషే చెవుడషే అప్లాగషే యేమిషే
విస్సావఝ్ఝలవారి ఋర్రినష ఆవిస్సాయి కిస్సారుషే
విస్సండెంతటివాడె యేళ్ళుపదిషే——————"

ఈ ధోరణిలో నడచిన దీపద్యము. 'చంద్రశేఖర శతకము'లో ఈ వ్యావహారికభాష ప్రయోగింపబడినను దానియుద్దేశము అవహేళనమాత్రమే. శ్రీరాములుకవి ప్రయోగము వాస్తవికచిత్రణ ప్రయోజనముగాగలది.

ఆచంటవెంకటసాంఖ్యాయన శర్మగారు 1892 లో ఆంధ్రవత్యావళి అనుపేర తమ కావ్య ఖండికలను సంపుటిగా ప్రచురించిరి. సంఘసంస్కరణము అన్న ఖండికలో వారీరీతిగా హెచ్చరించిరి.

'మగువలకెగాని చన్నాలు మగలకెందు
పొడమవను మాటలన్నియు బూటకములు
పురుషులికమీద స్తన్యంబు పొడమునట్లు
రొమ్ము నవరించుకొనుట భాగ్యమ్ముకాదె'.

పురుషులలో వీరతాస్ఫూర్తి కలుగవలెనని అధిక్షేపాత్మకముగా చెప్పిన రచనయిది. సంఘసంస్కరణముకొరకు కవిత్వమువ్రాసిన 19వ శతాబ్దిరచయితలలో ఈతడు గణనీయుడు.

ప్రాతమార్గములందు నడచినను కొన్నిక్రొత్తరీతులను ప్రవేశపెట్టిన కవులనే పైన పేర్కొన్నాను. ఐనను వీరిప్రయోగములలో పెక్కు కేవలము చమత్కార ప్రమేయము మాత్రమే కలిగియున్నవి. రచనారీతిలో, వస్తువరణములో, భావప్రకటనములో, ఛందస్సులో క్రొత్తదనము కలిగినవి కావు. అందువలన వీనిని నిజమైన ప్రయోగములని చెప్పుటకు వీలులేదు. ప్రయోగచ్ఛాయలు మాత్రమే కించిత్కముగా కలిగియున్నవి. పైగా ఇవి తరువాతి కవులకు మార్గదర్శకములైనవి కావు. అందువలననే వీరిలో ఎవ్వరును ఆధునికకవులుగా పరిగణింపబడలేదు. 20 వ శతాబ్ది ప్రారంభములో - 1900 సంవత్సరమున - కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము' అను కావ్యము ప్రచురింపబడినది. ఇది నవ్యకవిత్వ మహాప్రభాతమునకు భానూదయము కాదుగాని తొలి ఉషోరేఖ. ఈ కావ్యమునుగురించి తరువాతి ప్రకరణములో ముచ్చటింతును. కవిత్వములో పరివర్తనము రావలెనను తీవ్రవేదన వీరేశలింగంగారి 'సరస్వతీ నారద విలాపము' అను కావ్యఖండికలోనే ప్రస్ఫుటించినది. ఐనను అది వేదనగామాత్రమే నిలిచిపోయినది. రాయప్రోలు గురజాడల రచనలరూపములో ఆ వేదన అక్షరత్వమున ందినది. సరస్వతీ నారద విలాపములో గర్భితమైయున్న నవ్యతాప్రీతినిగురించి తరువాతి ప్రకరణమున నివేదింతును.

ఒక్కమాటలో చెప్పవలెనన్నచో 19వ శతాబ్దిలో వెలువడిన కవిత్వము చాలవరకు నలిగినబాటలోనే నడచినది. ఆ వెలువడిన కావ్యములలో ముప్పాతిక మువ్వీసము వసుచరిత్రాదులను ముందుంచుకొని వెలువడినవే.

## అంధకారనిరాసము :

వెనుకటి ప్రకరణములో, తత్కాలీన సాహిత్యదుస్థితినిగూర్చి వీరేశలింగంగారి మనస్సులో పొడమిన వేదనను వివరింతునంటిని. వారు 'సరస్వతీనారద విలాపము' అను ఖండకృతి 1887 లో రచించినారు. ప్రబంధకవిత్వమువేసిన వెర్రితలలతో విసిగిపోయిన వీరేశలింగంగారి బాధాదిగ్ధహృదయము దీనిలో వ్యక్తమగును. సాంఘికసంస్కరణ విషయములం దత్యంతము పదునుగల వీరేశలింగంగారి లేఖిని కవిత్వవిషయములందు మాత్రము మెత్తపడిపోయినది. సాంఘికరంగములో ఆయన వీరావేశముతో విజృంభించిన అతివాది. కవితారంగమున మాత్రము కడుపులోని చల్ల కదలకుండ నడచిన మితవాది. సాంఘికవిషయములలో ఆయన చూపిన విప్లవావేశములను కవిత్వరంగములో చూపినచో, 19 వ శతాబ్ది ఉత్తరార్ధముననే కవితాసతి బంధవిముక్తికలిగి, స్వేచ్ఛావాయువులను పీల్చెడిది. వీరేశలింగంగా రాంగ్లసాహిత్యముతో గట్టిపరి చయ మున్నవారే. ఐనను వారిదృష్టి ఆంగ్లములోని గద్యరచయితల మీదనే ప్రధానముగా ప్రసరించినది. వారు కవులలో Goldsmith ను దాటిపోలేదు. Wordsworth మున్నగు కాల్ప నికోద్యమకవులు సాహిత్యకేదారములో నాటిన క్రొత్తయంట్లపై వీరేశలింగంగారి దృష్టి పడినట్లులేదు. అందువలననే ఆయన 1892 లో Goldsmith కావ్యమును 'పథికవిలాసము' అనుపేర తెనిగించెను.

బాల్యదశలో ఆనాటి కవులందరివలెనే వీరేశలింగంగారు మార్కండేయ శతకమును, గోపాలశతకమును రచించిరి. తరువాత కొన్నియేండ్లకు శృంగారరసోల్బణముగల 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము'అను ప్రబంధము రచించిరి. తదనంతరము గర్భకవిత్వము వెల యించిరి. కవిత్వవిషయములలో మొదట ఇంతగా సంప్రదాయ ప్రవాహమున కొట్టుకొనిపోయి నను 1887 నాటికి, నానాటికి దిగజారిపోయెడు తెలుగుకవిత్వస్థితి పంతులుగారికి కడుపులో ఛేయివేసి కలచినట్లనిపించినది. ఆ గర్భవేదనయే సరస్వతీనారద విలాపముగా వెలిచిమ్ముకొని వచ్చినది

## సరస్వతీనారద విలాపము :

నారదుడు తనతల్లియైన సరస్వతి దీనస్థితిని చూచి ఆనవాలుపట్టలేక కారణమడుగగా సరస్వతీదేవి తన దురవస్థను చెప్పుకొనుట ఈ పద్యములోని వస్తువు. ఇది ఉత్తర ప్రత్యుత్తర రూపకమైన సంవాదకావ్యము. రచనాస్వరూపమునుబట్టి ఖండకావ్యమనవచ్చును. అర్థసారస్య

మును పూర్ణముగా జెఱచి అవయవములను విరిచి, భాషావధూటిని విరూపిణిగా, శవప్రాయనుగా జేసినవారిని పంతులుగారు ఈ కృతిలో విమర్శించిరి. తొల్లిటికవులు 'రమణీయోక్తులచేత అర్థ గుణ సారస్యము' కల్పించుచు, సహజసౌందర్యము పెంపొందించుచు, కించిదలంకారములతో, 'చేష్టాచమత్కారభాగ్యము' హెచ్చించుచు తన్నుకాపాడిరని, ఇప్పటికవులు 'రసమునెట్టి', 'అలంకరణకైతవముతో మేనుకట్టి' ప్రాణముతీయుచున్నారని సరస్వతి నారదునితో మొర పెట్టుకొనును. ఆమె ఇంక ఈ విధముగా విలపించును.

"తెలియదుసుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావములేమిఁ
వెలసొమ్ములుగా కివి నం
కెలలయి కడునాదుమేనికిన్ వెతనింపుఁ"

"దయమాలి తుదముట్ట తలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించునొకడు
పాదంబులోపల పాదంబులిమిడించి
వీరుడై నన్ను నొప్పించునొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లదరించి
పోటుబంటయి నన్ను పొడుచునొకడు
బెండుపల్కులుగూర్చి నిండైన నగలంచు
దిట్టయై చెవులు వేధించునొకడు

ఖడ్గచక్రాదిరూపముల్ గానిపించి
వర్ణముల్ మార్చి నను చిక్కుపరచునొకడు
కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములుతీయ
ఒడలిపసలేక శుష్కించియున్నదాన".

ఈ పద్యములలో, శ్లేషచమత్కారముతో ఆంధ్రభారతికి పట్టిన గ్రహణస్థితిని పంతులు గారెత్తిచూపిరి. గర్భ, బంధ, చిత్రకవిత్వములను, వ్యర్థపదాడంబరమును, రసహీనపద సంపుటులను అలంక్రియలుకాక శృంఖలలని ఎలుగెత్తిచాటిరి. ఛందోబద్ధమైనంత మాత్రముననే పద్యము కవిత్వము కాదనియు, రసాత్మకమైనది మాత్రమే కవిత్వమనియు నొక్కిచెప్పిరి.

"సుందరబహురసపుష్టి నమందానందంబు బుధులమది కిడదేనిఁ
ఛందోబద్ధంబగు పదబృందాటోపంబు తా కవిత్వంబగునే".

ఈ విధముగా వీరేశలింగంగారు కేవలబాహ్యాడంబరజృంభితమై, అంతశ్శోభారహితమై యున్న ఆంధ్రకవిత్వములో కలుగవలసిన మార్పు నేనాడో గుర్తించిరి. ఈ సరస్వతీనారద విలాపముపై స్పెన్సరు వ్రాసిన 'Tears of the Muses' అను గేయము ప్రభావమున్నట్లు తోచు చున్నది. ఈ గేయములో స్పెన్సరు ఆంగ్లసాహిత్య మేవిధముగా క్షీణదశకు పోవుచున్నదో Muses (విద్యాదేవతల) ముఖతః వెల్లడించినాడు. ఇరువదవశతాబ్దిలోని నవ్యకవిత్వభానూదయ మున కీమనఃపరివర్తనము నేపథ్యమునుండి అంధకారనిరాసముచేయ నారంభించినది. వీరేశ లింగంగారి అభిప్రాయములకు, నవ్యతాప్రీతికి, ఒక ఆకృతి కలిగించిన కవి రామలింగారెడ్డిగారు.

### వేగుచుక్క :

సాహిత్యరంగములోని చిమ్మచీకట్లను వీరేశలింగంగారి 'సరస్వతీనారద విలాపము' చిమ్మివేయుచుండగా, వేగుచుక్కవలె సన్నసన్నని కాంతిపృషత్తులను చిల్కరించిన కవీంద్రుడు కట్టమంచి రామలింగారెడ్డిగారు. 1889 నాటికే రెడ్డిగా రున్నత విద్యాభ్యాసము చేయుచుండిరి. అందుచేత వారికి ఆంగ్లకవిత్వములోని నిగ్గులను గ్రహించెడు సదవకాశము కలిగినది. ఈ యాంగ్లసాహిత్య పరిచయమే రామలింగారెడ్డిగారిచేత సరిక్రొత్త కావ్యమును రచింపజేసినది. ఒకటి రెండు విషయములలో ఈతని 'ముసలమ్మ మరణము' అను కావ్యము క్రొత్త పుంతలు త్రొక్కినను, దీనిని ప్రప్రథమ నవ్యకావ్యమనుటకు వీలులేదు. ఈ విషయమును ముందుముందు వివరముగా చర్చింతును.

### కట్టమంచివారి 'ముసలమ్మ మరణము' :

19 వ శతాబ్ది కవిత్వములో మెరుపులవంటి నూతనప్రయోగములు క్వాచిత్కముగా కని పించెనుగాని చూపరకు దిగ్భ్రమకలిగించెడు అభినవకవితామూర్తు లవతరించలేదు. వచనరంగ ములో నవల, నాటకము మొదలైన నవీనప్రక్రియలు వెలసినను, కవితారంగము గతానుగతిక మైన ప్రబంధ నిబంధనధోరణిలోనే జడీభవించి నిలిచినది. ఈ శతాబ్ది చివరిపాదములో మాత్రము కొన్ని క్రొత్తదనపుతావులు గుబాళించెడు నవ్యకావ్యము వెలసినది. అదియే కట్ట మంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము'.

### కావ్యావతరణము :

1889 లో చెన్నపట్టణమున క్రైస్తవ కళాశాల ఆంధ్రభాషాభిరంజనీ సమాజపోషకుడు శ్రీ సమర్థి రంగయ్యశ్రేష్ఠి, కావ్యరచనలను ప్రోత్సహించుటకై ఏర్పరిచిన పోటీపరీక్షలో నెగ్గిన కావ్యమే 'ముసలమ్మ మరణము'. దీని పరీక్షకులలో వేదం వేంకటరాయశాస్త్రిగారొకరు. ఇది 1889 లో రచింపబడినను 20 వ శతాబ్ది తొలిపాదము (1900) లోనే ప్రచురితమైనది.

కాలరీత్యా ఈ కావ్యము భావకవిత్వ ప్రాదుర్భావమునకు దాదాపు రెండు దశాబ్దులు ముందుగా పుట్టినది. అయినను దీనిని ఎంతవరకు నవ్యకావ్యమనవచ్చునో పరిశీలింపవలసియున్నది.

## విమర్శకుల అభిప్రాయములు :

ఈ కావ్యములోని సంప్రదాయానుసరణత్వమును, నవ్యత్వమును నిరూపించుటకు ముందు దీనినిగురించి ఆధునికాంధ్ర విమర్శకుల యభిప్రాయములను పొందుపరుచుట అప్రస్తుతము కాదనుకొందును.

ఈ కావ్యమునుగూర్చి పింగళిలక్ష్మీకాంతముగారిట్లు వ్రాసిరి.

'ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుబోకలో నక్షత్రమువలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో ఆవిర్భవించిన నూత్న ఆంధ్రకావ్యము 'ముసలమ్మమరణము'[1].

శ్రీవాత్సవగారిట్లు వ్రాసిరి.

'ఈ కావ్యము.................. అంతవరకువచ్చిన కవితాసంప్రదాయములను, వర్ణన విధానములను, కవిసమయములను పూర్తిగామార్చి ఒక విప్లవమునకు అంకుర్పారణ చేసినది.[2]

డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు 'తెలుగుపై ఆంగ్లసాహిత్యప్రభావము' అనెడు తమ పరిశోధన గ్రంథములో ఈ కావ్యము "భావకవితోద్యమ మింకను బాగుగా ప్రచారమునకు రాక పూర్వమే, ఆంగ్లసాహిత్య ప్రభావమున భావకవిత్వమునకు మార్గదర్శకముగ'' వెలసినదనిరి. శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ 'నవ్యాంధ్రసాహిత్యవీధుల'లో ఈ కావ్యము 1900 సంవత్సరమునాటికే వెలువడినను అది యప్పటిలో ఎవ్వరి నాకర్షించలేదనియు, రాయప్రోలువారి 'తృణకంకణ' ప్రచురణము తరువాతయే ఈ కావ్యమువైపు పాఠకులదృష్టి మరలినదనియు, అయినప్పటికి ఇది కొంత నవ్యమార్గముననుసరించుచు ఉదాత్తముగా, రసవంతముగా నున్నదనుట కభ్యంతరము లేదని తెలిపిరి.

ఈ కావ్యము విషయములో, స్వయముగా కవియేకాక విమర్శకుడైన రామలింగారెడ్డిగారి అభిప్రాయ మేమో గమనింతము. మొదటికూర్పునకు కూర్చిన 'ముఖపత్రము'లో రామలింగారెడ్డి గారిట్లు వ్రాసిరి.

''ఒకానొక త్రిలింగదేశీయునిచే వ్రాయబడి బ్రౌన్‌దొరగారిచే ప్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము' అను గ్రంథమునుండి యిందలి కథంగైకొంటిని. అయినను కొన్నియెడల రసాధిక్యమునకై నూతనకల్పనలు చేసినాడ''.

## కావ్యవస్తువు :

ఈ వాక్యములవలన రెడ్డిగారు కావ్యవస్తువు నెక్కడనుండి యేరుకొన్నది విశదమైనది. దానికి రసోచితమైన మార్పులు చేసినట్లు స్పష్టమైనది. ఈ విషయమును సూచించు శిలాశాసన మొకటి అనంతపురమునకు సమీపమునగల 'బుక్కరాయ సముద్రము' అను గ్రామమున కలదట. ఆ యూరి చెరువుకట్టకు నేటికిని 'ముసలమ్మ కట్ట'యని వాడుక కలదట. బుక్కరాయ సము

1. గౌతమవ్యాసములు. పుట : 185. 2. ఉషఃకిరణాలు. పుట : 208.

ద్రము పొంగి కట్ట తెగిపోయినది. ఊరిరైతులు గ్రామదేవతయైన పోలేరమ్మను ప్రార్థించగా, ఆ యూరిలోని 'ముసలమ్మ' యనువనిత బలియైనచో ఆపన్నివారణము జరుగునని ఆకాశవాణి పల్కినది. 'ముసలమ్మ' సాధ్వీలలామ. కరుణాంతరంగ. ప్రాణపదుడైన భర్తను, అత్తమామలను, బంధుమిత్రులను వీడి 'మెట్టినూరు'ను రక్షించుటకు నీటబడి మునిగి పరమపదించినది. సంగ్రహముగా ఈ కావ్యములోని కథ యిది. 'సమష్టి'కై 'వ్యష్టి' ఆత్మబలి యొసగిన కరుణ రసాత్మకమైన కథ యిది.

ఇక దీనిలోని నవ్యతను గమనింతము.

**నవ్యత :**

మన ప్రాచీనకావ్యములు ప్రాయికముగా పౌరాణికములో, చారిత్రకములో అయియున్నవి. శృంగారమల్హణచరిత్ర, నిరంకుశోపాఖ్యానము మున్నగు ఒకటిరెండు సాంఘిక ప్రబంధము లున్నను వాని నిర్వహణము కృత్రిమ పర్యవసాయిగా నున్నది. పాండురంగ మాహాత్మ్యములోని నిగమశర్మకథ, సుశీలకథ, కాశీఖండములోని గుణనిధికథ, అచ్చమైన సాంఘికకథలేయైనను అవి భక్తి ప్రయోజనముకలవి కావున అలౌకికతాగంధము నలముకొన్నవి. కొంతలో కొంతగా నేలపై కాలూని నడచినకథ కళాపూర్ణోదయములోని సుగాత్రీశాలీనుల వృత్తాంతము. అయినను దీనికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. ఆ మహాకావ్యమున గ్రథితమైన కథాముక్తావళిలో ఇదియొక ముత్యము. ఈ దృష్టితో చూచినచో 'ముసలమ్మ మరణము'లోని కథ అప్పటికి క్రొత్తయేయని చెప్పవచ్చును. అచ్చమైన సాంఘికవృత్తముతో ఒక స్వతంత్ర కావ్యమును రచించుట క్రొత్తప్రయోగమే.

ఈ కావ్యములోని మరియొకనవ్యత కథ మరణాంతముగా సమాప్తమగుట. అప్పటి పాఠకుల నిది విస్మితుల నొనర్చిన నవ్యత యనవచ్చును. 'మంగాళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే'యను అభియుక్తోక్తి రక్తదఘ్నముగా నాటుకొనియున్న కాలములో మరణాంతముగా కావ్యమును ముగించుట చక్కని ప్రయోగమనక తప్పదు. ఈ కావ్యము 1900 లో అచ్చగునప్పుడు కొందరు దీనిని సుఖాంతముగా మార్చవలెనని కవిగారికి సూచించిరట. కాని వా రాంగ్లభాషా మర్మజ్ఞులును, నవ్యతోపాసకులు నగుటవలన, మార్పున కంగీకరించక యథాతథముగా ప్రకటించిరి. అయినను లోకకళ్యాణార్థమై జరిగిన ఆత్మబలిని అమంగళముగా పరిగణించుటకు వీలులేదు. ఒకవ్యక్తి ఆత్మార్పణమువలన వందలప్రాణములు నిలిచినవి. అనగా అసంఖ్యాక జనావళికి మంగళము జరిగినది. కావున ఈ కావ్యములోని కథనుబట్టి చూచినచో ఇది మరణాంతమైనను, మంగళాంతమనియే చెప్పవచ్చును. అనగా స్థూలముగా మరణాంతమువలె కనిపించెడు ఈ కథ నిగూఢముగా సంప్రదాయమువైపు మొలుసూపుచునే యున్నది.

ఎట్లయినను ఈ రెండులక్షణము లాకాలమున నవ్యతానిర్భరములే. ఈ రెంటిని పురస్కరించుకొని ఈ కావ్యమును 'నవ్యకవిత్వమునకు' మార్గదర్శకమైన గ్రంథమనియు, తరువాతి

తరములో 'ఒక విప్లవమునకు అంకురార్పణ చేసిన'దనియనుట ఎంతవరకు సముచితమో విచారింపవలసి యున్నది.

## 'మునలమ్మ మరణము' నవ్యకావ్యమగునా ?

పైన తెలిపిన రెండు లక్షణములుతప్ప మిగిలిన విషయములలో ఈ కావ్యము సంప్రదాయమునే పూర్తిగా అనుసరించినది. కొంతవరకు గ్రుడ్డిగా అనుసరించినదని చెప్పవచ్చును. కావ్యము మరణాంతముగా ముగిసినదన్న అంశము అతిస్వల్పమైనది. ఆ కాలమున నాటకములలో ధర్మవరం రామకృష్ణమాచార్యులుగా రీపద్ధతిని ప్రవేశపెట్టినవారే. పైగా రామలింగారెడ్డిగారొక క్రొత్త ప్రయోగము చేయవలెనను బలీయమైన ఉద్దేశముతో ఈ కథను రచించలేదు. ఒకానొక కాపు యువతి గ్రామక్షేమముకొరకు చేసిన ప్రాణార్పణమును తలచుకొని, హృదయము ద్రవించి దీనిని కావ్యవస్తువుగా స్వీకరించిరి. వారు స్వయముగా వ్రాసికొన్నట్లుగా, ఈ కథ మరణాంతముగా జనవ్యవహారములో, శాసనరూపములో నున్నదే. అందువలన దీనిలోని మరణాంత నిర్వహణము రెడ్డిగారు బుద్ధిపూర్వకముగా చేసినదికాదు. కాబట్టి ఇది క్రొత్తప్రయోగము క్రిందికిరాదు.

ఇక ఇతివృత్తమును పరిశీలింతము. ప్రాచీనాంధ్ర కావ్యములలో అంతర్ఘట్టముల రూపమున, అస్వతంత్రముగా మాత్రమే సాంఘికకథలుండగా, వీరు స్వతంత్రముగా సాంఘిక కథను స్వీకరించి కావ్యము రచించుట నిస్సందేహముగా క్రొత్తప్రయోగమే. అయినను కేవలము స్వీకృతవస్తువునుబట్టియే కావ్యమునకు నవ్యత్వము సిద్ధించదు. ఆ వస్తువునకు ప్రాణప్రతిష్ఠ చేసెడు రసభావాదులవలనను, దానికి కాలు సేతులు, కన్ను, ముక్కు, చెవులు మున్నగువానిని చేర్చెడు వర్ణనాదులవలనను, దాని నవ్యత నిరూపితమగును. ఈ దృష్టితో చూచినచో దీనిలో చెప్పుకోదగిన నవ్యతలేదని చెప్పవచ్చును. కావ్యప్రారంభమునుండి అంతమువరకు సంప్రదాయమే బహుముఖముల భాసించుచుండును.

పదప్రయోగములో, వర్ణనలలో, పద్యశిల్పములో (ఛందస్సులో), పలుకుబడి పోహణింపులో, రెడ్డిగారు సంప్రదాయక్షుణ్ణమైన ప్రబంధమార్గము నెట్లవలంబించినది నిరూపింతును.

## సంప్రదాయానుసరణము :

ఈ కావ్యములోని పద్యములన్నియు సంప్రదాయ సిద్ధములైన ఉత్పల చంపకాది వృత్తములు, సీసము, తేటగీతి, ఆటవెలది, కందమున్నగు జాత్యుపజాతులే. పద్యగతిలో, శిల్పములో సైతము క్రొత్తదనమేమియు లేదు. పైగా అక్కడక్కడ తిక్కన్ననడకలు. కృత్యాదిలో పోతన్నను తలపించు అంత్యనియమముల దొంతరలు;[1] పద్యరచనా విషయములో వీరిని సంప్ర

1. ''అచలసంభూత, సదయహృదంబుజాత, నిర్గుణోపేత, పరిపూర్ణ, నిత్యపూత,
వాఙ్మనోతీత, సుగుణసంపత్ సమేత, పార్వతీమాత, మదభీష్టవరముతీత''
—మునలమ్మ మరణము : పుట 6.

దాయానుసరణమును స్పష్టమొనర్చును. పైగా 'పార్వతీమాత'ను స్తవించు సీసపద్యములో ఎత్తుగీతితప్ప మిగిలిన నాలుగుచరణములు అచ్చతెనుగులో నడచినవి. దీనిలో 'అంచతేజీ నెక్కియలరుసామి,' 'చిలుకలయెకిమీని సెజ్జ పండెడువాని', 'గిత్తతత్తడిరౌతు' మున్నగు అచ్చ తెనుగుపదములు కేవలము ప్రబంధకవుల పెరళ్ళనుండి త్రవ్వుకొని తెచ్చినవే. భావకవు లెవ రును ఇట్టిపదములను ప్రయోగింపలేదు. ఈ కావ్యములోని పద్యములు, పదములు ప్రాచీన కావ్యవాసనలను సమగ్రముగా జీర్ణించుకొన్న వే.

రచనారీతినిబట్టి చూచినను ఈ కావ్యములో నవ్యత కానరాదు. కావ్యమునకు ముందు చేర్చబడిన 'ఉపక్రమణిక' 'కటుమంచి పురధాము'డైన కామాక్షీసహితుని స్తుతితో ప్రారంభ మగును. ఈ పద్యము 'శ్రీ'తో ప్రారంభమగును. ఇది ప్రాచీనాంధ్రకవులెల్లరు విధిగా పాటిం చిన పద్ధతి. తరువాతిపద్యము దేవతాస్తుతి. ఇది త్రిమూర్త్యాత్మకమైనది. తెలుగులో త్రిమూర్తి స్మరణ 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ'యను నన్నయభట్టారకుని శ్లోకముతోనే ప్రారంభమైనది. త్రిమూర్తులను విడిగాకాక 'సరస్వతిన్ కలిమిలేమను పార్వతిఁగూడివెల్గు దివ్యాలఘు శాంత తేజము'గా రెడ్డిగారు సంభావించుట కొంతవరకు 'శ్రీయనగౌరినాఁబరగు' అన్న తిక్కన్న పద్య చ్ఛాయలో మొలకెత్తిన రీతి. దేవతాస్తుతి తర్వాత రెడ్డిగారు సుకవిస్తుతి, పితృసంకీర్తనము చేసిరి. నడుమ కావ్యరచనా హేతువును పద్యరూపములో ప్రస్తావించిరి. మూడంకిత పద్యములు వ్రాసిరి. ఇవియన్నియు కేవలము సాంప్రదాయికముగా సాగిన ధోరణులే.

కావ్య ప్రారంభము సైతము మరల 'శ్రీ'తోనే ప్రారంభమగుట, అంతము మరణాంత మైనను భరతవాక్యముతో ముగియుట ఇతని సంప్రదాయానుసరణమునకు సుస్పష్ట సూచికలు.[1]

కావ్యములోని రెండవపద్యము గ్రామవర్ణనము. ప్రబంధకవులు పురములను వర్ణించగా ఈ కవి పల్లెను వర్ణించెను. ఆ యూరిసరస్సును (చెరువును) వర్ణించిన ధోరణినిబట్టి చూచినచో ఈ కవి ఎంతగా ప్రబంధముద్రకలవాడో విదితమగును.

> 'చలదుత్తుంగమహోగ్రభంగ పటలీసంఘట్టనారావ; ము
> జ్జ్వలకూలాగ్రనటత్తరంగరవ; మంచన్మధ్యభాగ్భూమిభృ
> త్కుల సంపాతి మహోర్మికా నికరనిర్ఘోషంబునుం గూడగా
> నలరున్ ఘోరసరస్సు దిగ్విదళన వ్యాపారపారీణమై'.

---

1. 'శివమై చిన్మయమై, యఖండమయి, యర్చిష్మంతమై, నిత్యమై
భవపాథోనిధినావయై, మునిజన ప్రాణంబునై, యద్భుతా
ర్ణవమై, నామవికారరూపరహిత ప్రాశస్త్యమై, వెల్గువి
ద్యువిరించీశ్వరనాథతత్త్వము మముల్ శోభిల్లగా జేయుతన్.' —మునలమ్మ మరణము.

తిక్కన్న తీరుతెన్నులను పుక్కిట బెట్టుకొన్న యీ పద్యములో వర్ణింపబడినది ఊరి చెరువుకాదు. ప్రబంధములలో పరంపరగా వర్ణింపబడిన మహాసముద్రమునకు మారురూపు మాత్రమే.

ఈ కావ్యము కథా ప్రధానమైనది కాబట్టి వర్ణనలు స్వల్పముగానున్నవి. కావ్యమంతయు సంభాషణలతో, ముసలమ్మ చిత్తవృత్తి చిత్రణముతో సాగిపోవును. ఉన్న కొన్ని వర్ణనలు ప్రబంధగంధులే. ముసలమ్మ పసువున జలకమాడినప్పుడు "తలమీదిచెట్లు కురిసిన లలితసుమ పరాగమున వెలయు లతిక"వలె ఉన్నదట. ఆత్మార్పణమునకై నీటిలో చొచ్చెడు ముసలమ్మ

"కన్నెఱ్ఱవారిన ఖరకరోదయకాల
మల్లనమ్రింగు జాబిల్లియనగ
జ్వలదగ్ని శిఖలపై నెలనవ్వుతోబోవు
ధాత్రీమహాదేవి తనయయనగ
కెందామరలబారు సుందరమగులీల
నల్లనల్లనజొచ్చు నంచయనగ"

ఉన్నదట. ఈ వర్ణనలన్నియు ప్రాచీనకవులు చేసినవే. ముఖ్యముగా చివరి వర్ణన గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములో చంద్రమతి అగ్నిప్రవేశము చేసినప్పటి వర్ణనకు ప్రతిబింబముగా నున్నది. కావ్యము మధ్యలో ఒకచోట 'ఇలియడ్'లోని ఒక వర్ణనకు అనుసరణమున్నది. అంత మాత్రమననే దీనికి నవ్యత చేకూరదు. ఈ కావ్యమున 'ముసలమ్మ' నాయిక. సాధారణముగా ప్రాచీన కావ్యములలో నాయికలు శృంగార రసస్నాతలు. ఈ నాయిక అట్లుకాక త్యాగశీల. ఆమె శృంగారముకాక త్యాగశీలమే ఈ కావ్యమున చిత్రింపబడినది. ఇది నవ్యత యెందుకు కాదను ప్రశ్న జనింపవచ్చును. ఆ దృష్టితో చూచినను దీనిలో నవ్యత కనిపించదు. ప్రాచీన కావ్యములలోగూడ శృంగారేతరమైన భావశీలములు కలిగిన నాయికలు లేకపోలేదు. పాండురంగ మాహాత్మ్యములోని 'సుశీల' ఉదాత్తచరిత. పతిశీల. ఈ కథలో శృంగార ప్రసక్తియేలేదు. నిగమశర్మ అక్క సోదరవాత్సల్యము రూపుగట్టిన మూర్తి. కావున శృంగారేతరమైన భావమును కలిగియున్న స్త్రీపాత్రలు ప్రాచీన సాహిత్యమునకు క్రొత్తకాదు.

'దీనియందు అష్టాదశ వర్ణనలును, శృంగార ప్రబంధనాయికా విరహతాపముచే వచ్చు ఆపసోపములును కానరావు.'[1] అన్న అభిప్రాయముగూడ సమంజసమైనదికాదు. కావ్యవస్తువునుబట్టి వర్ణనలుండును. ఇది కథాప్రధానకావ్యము కావున అష్టాదశవర్ణనల అక్కరయేలేదు. శృంగార రసముతో సంబంధములేని కావ్యము కాబట్టి విరహతాప ప్రసక్తియే కానరాదు. 'సుశీల' కథలో శృంగారమున్నదా? శృంగారమున్న 'సుగాత్రీశాలీనులకథ'లో విరహతాపమును వెళ్ళబోసెడు

1. 'ఉషఃకిరణాలు': పుట 203.

వర్ణనలున్నవా ? ఈ కావ్యములో వీని ప్రసక్తియే లేనప్పుడు ఇవి లేకుండ వ్రాసిన కావ్యము కాబట్టి ఇది నవీనమార్గమునకు చెందినదనుట సహేతుకముకాదు. ముసలమ్మనుగురించి జనులను కొన్నట్లు చెప్పిన పద్యములోని

'లేగమైనాకుచు లీనమై మెడమలం
చిన గోవుఁబిండెడు వనరుహాక్షి'

అచ్చమైన రెడ్డివనితయని స్థూలముగా అనిపించును. ఈ పద్య మిట్లే సాగినచో కొంత నవ్యత సాధింపబడెడిది. కాని రెండవ చరణములో

'బొండుమల్లెలతోట పువ్వులుగోయుచు
వనలక్ష్మియననొప్పు వనజగంధి'

అన్నది చదువగానే ఆ యభిప్రాయ మెగిరిపోవును. రచనలో నిసర్గరామణీయకము లోపించినది. పల్లెపడుచు వెంటనే ప్రబంధసుందరిగా గోచరించినది. ఇది రెడ్డిగారిని విమర్శించుట కాదు. ఆయన రచనలోని లోపముల నెత్తిచూపుటయును కాదు. ఈ కావ్యము 'కవితా సంప్రదాయములను, వర్ణన విధానములను, కవిసమయములను పూర్తిగామార్చి ఒక విప్లవమునకు అంకురార్పణ చేసినది' అన్న అభిప్రాయము సహేతుకముకాదని తెలుపుటకే నేను ప్రయత్నించితిని. నవీనతారేఖలు ఒకటి రెండున్నంతమాత్రముననే దీనిని నవ్యకావ్యమని పేర్కొనుటకు వీలు లేదు. ప్రాయికముగా ఇది ప్రబంధ మార్గములలో నడచిన లఘుకావ్యము. వర్ణనా ప్రధానము కాక కథాప్రధానమైన కావ్యము. అనగా ప్రాచీనమార్గములో నడచిన కథాకావ్యము. ఛందస్సును బట్టి, రచనా సంవిధానమునుబట్టి, భావములనుబట్టి, కథాగతినిబట్టి ఇది ప్రాచీన కావ్యములకోవకు చెందినదే. వస్తువు విషయములో, కథను మగణాంతముచేయుట విషయములో మాత్రము, కించిన్నవ్యతను సంతరించుకొన్నమాట వాస్తవము. ఈ గుణములతోపాటు దీనిలోని నాయికానాయకులను ప్రభువంశములనుండికాక సామాన్యుల కుటుంబమునుండి గ్రహించుటవలన ఈ కావ్యమును 'సంధి' కావ్య మనవచ్చును. పింగళి లక్ష్మీకాంతంగారన్నట్లు రానున్న నవ్యకవితా ప్రభాతమునకిది వేగుచుక్కవంటిది. వీరి తర్వాత గురజాడ రాయప్రోలులు అరుణోదయ తపనోదయములకు కారణభూతులై ఆంధ్ర సాహిత్యలోకమును సముద్దీపింపజేసిన యుగకర్తలైనారు.

## తిరుపతి వేంకటకవులు :

19వ శతాబ్ది చివరిభాగమునుండి యిరువదవశతాబ్ది మధ్యభాగమువరకు తమ విశృంఖల కవితా విహారముచేత, అష్టావధాన శతావధానాశుకవిత్వాది ప్రక్రియలచేత, ఆంధ్ర సాహిత్య లోకమునకు పులకలు వెలార్చిన కవిధీరులు తిరుపతి వేంకటకవులు. వీరు కవితా రచనలో చెప్పుకోదగిన నవ్యతను సాధించకున్నను, నవ్యకవితోద్యమ ప్రాదుర్భావమునకు పూర్వమే కొన్ని క్రొత్తపుంతలు త్రొక్కిన కింకవీంద్రఘటాపంచాననులు. వీరేశలింగంగారు దీర్ఘసమాస

భూయిష్ఠమును, కృత్రిమపదజుష్టమునైన వచనప్రక్రియను సరళసుందరముగా మార్చినట్లే, అనవసర భాషాభేషజముతో, అర్థములేని పదడిండిమార్భటులతో ఉక్కిరిబిక్కిరగుచున్న కవితా సరస్వతికి వీరు సహజరామణీయకమును ప్రసాదించిరి. గహనములవంటి ఘనప్రబంధములతో తెలుగు ప్రజల కూపిరాడని దినములలో ఉద్యానవనములవంటి ఉత్తమ కావ్యములు సృష్టించిరి. చిరకాలముగా ఘనీభవించి వ్యవహారదూరమైన వ్యాకరణ సూత్రముల కొన్నిటి నుల్లంఘించిరి. 'గ్రాంధికతా' ముద్రకు వెలియై, అస్పృశ్యములుగా పరిగణింపబడుచున్న వ్యావహారికపు పలుకు బడులను, కావ్యములందు యథేచ్ఛముగా ప్రయోగించిరి. రాజాస్థానములకే పరిమితమనుకొన్న కవిత్వ సంపదను రచ్చకెక్కించిరి.

## 19వ శతాబ్దాంతమందలి పరిస్థితులు :

వీరు సాధించిన మహోద్యమమును వివరించుటకు ముందుగా నాటి సామాజిక పరిస్థితు లను పేర్కొనుట అవసరమనుకొందును.

ఇప్పటికి డెబ్బదియేండ్లక్రితము దాసు శ్రీరామకవి 'తెలుగునాడు' అను కావ్యములో చెప్పిన ''ముదికరణాలు రాముగుడిమోసల రచ్చలుదీర్చి'' అను పద్యమువలన నవయువకులకు గల ఆంగ్లభాషా పరిచయ వ్యామోహములు స్పష్టమగును.[1] అగ్రవర్ణీయులతోపాటు తదితరులు గూడ ఇంగ్లీషు చదువులకొరకు పట్టణములకు ఎగబడుచున్న రోజులవి. షేక్స్పియరు, మిల్టను, షెల్లీ మున్నగు ఆంగ్లకవుల కావ్యములు పఠించుటయన్నను, గిబ్బను, మెకాలేమున్నగువారివలె ఇంగ్లీషులో వచనరచన చేయుటయన్నను 'బులపాటము' బలిసిపోయిన కాలమది. స్వస్థానవేష భాషలపై ఆసక్తి సన్నగిల్లి ఇంగ్లీషుభాషపై వెర్రివ్యామోహము ప్రబలినది. ఇక ఆనాటి దేశీయ పండితులకు విద్యయనగా దేవభాషయే. తెలుగు వారిదృష్టికానెడు భాషకాదు. 19వ శతాబ్ది చివర ఆంధ్రసాహిత్యమే ఇట్టి దురవస్థలోనుండగా ఇక నవ్యసాహిత్యమునుగూర్చి ఆలోచించున దెవ్వరు ? అప్పటికి జాతీయోద్యమముగూడ ఒకయాకృతి ధరించలేదు. రాజాస్థానములలోను, పల్లెలలోను పూర్వవాసనలే రాజ్యమేలుచుండెను. ఆ రోజులలో కొన్ని ముద్రణ యంత్రములు, కొన్ని పత్రికలున్నను వానిలో నేవియు నూతన దృక్పథము కలిగియున్నవికావు. ఆనాడు ప్రముఖముగా వెలువడెడి సాహిత్య పత్రికయగు 'అముద్రిత గ్రంథచింతామణి' వంటి పత్రికలలో ప్రచురితమగు సాహిత్యవిమర్శలు పాండితీ ప్రదర్శకములుగా, ప్రాతవాసనలు కలిగియుండె డివి. వీరేశలింగం పంతులుగారివంటి సంస్కరణోద్యమ నిర్మాతసైతము పండితరంజనముకై, 'నిరోష్ఠ్య నిర్వచననైషధము' రచించెననగా ఇతరులమాట చెప్పనేల ? అందుకే ఆ కాలమున 'పాత

1. 'ముదికరణాలు రాముగుడిమోసల రచ్చలుదీర్చి ఖారఖాల్
చదువుచు లోకవార్తల ప్రశంసలనందుదు; తెలుంగుబాసమం
చిది, మనపిల్లకాయలు వచించెదు ఇంగిలిపీసు పున్‌పుసన్
పెదవులదాటః దెంతటి యెఫేయు, బియే, యెమియే వచించినన్.'

యమకాలకే కొత్తవంపులూ, పాతశ్లేషలకే కొత్తవిరుపులూ పెట్టగలవారందరూ కవులనిపించు కుంటున్నారు',[1] కాటూరి వెంకటేశ్వర రావుగారన్నట్లుగా ఇటు ఇంగ్లీషు ఉరవడికి, అటు పండిత భిషక్కుల భాషాభేషజమునకు మధ్యపడిపోయి తెలుగుసాహితి నలిగిపోవుచున్న కాలములో తిరుపతి వెంకటకవులు కాకినాడ నగరమున ఆంధ్రకవితాశంఖమును పూరించిరి. అవధానము ఆశుకవిత్వము మున్నగు అపూర్వసాహిత్య ప్రక్రియలతో నాగరకులను సంభ్రమానందములలో ముంచెత్తిరి. వట్టి పెరటిచెట్టుగా భావింపబడుచున్న తెలుగునకు సురద్రుమస్ఫూర్తి కలిగించిరి. 'దోసమటంచెరిగియును, దుందుడుకొప్పగ పెంచినార మీ మీసము రెండు బాసలకు మేమె కవీంద్రులమంచు' అని ప్రతిజ్ఞ యొనరించి, ఊరూరపర్యటించి, నానారాజాస్థానములను దర్శించి, మొండికెత్తిన డిండిమభట్టులను తమ శేముషీ శౌండిమములతో నిర్జించి, తెలుగు కవితను ముత్యాలపల్లకిలో ఊరేగింపజేసిరి. అప్పటివర కాంధ్రసాహిత్యారామములో మూగవడియున్న కోకిలల గొంతుముడులు విడిపోయినవి. రిచ్చవడియున్న భ్రమరముల రెక్కలు రెపరెపలాడినవి.

### అవధానములవలని ప్రయోజనము :

తిరుపతి వెంకటకవుల అవధానములవలన వారికి కలిగిన యశఃప్రాప్తియటుంచి ఆంధ్ర సారస్వత రంగములోనే సరిక్రొత్త చైతన్యము తరగలెత్తినది.

"శతావధానం కారణంగా తిరుపతి వెంకటకవులు కవితాజైత్రయాత్ర చేయకనే పోయి నచో ఆంధ్రసాహిత్యానికి నేటి ఉజ్జీవం కలగకపోయేదేమో అనిపిస్తుంది. రాజసభలో పండిత వశంవదమై పాతపాటలే పాడుకుంటూ పల్లెలలో ముదికరణాల పురాణపఠనాల్లో తప్ప మరో చోట మొగంచూపలేక కాలం వెళ్ళదోస్తున్న ఆంధ్రశారద మళ్ళీ పల్లకీలెక్కి ఊరూరా ఊరేగ టానికి ఆస్కారం ఈ శతావధానంవల్లనే లభించిందని చెప్పవచ్చు".[2]

శ్రీనాథుని తర్వాత కవిత్వమున కింత బహుళవ్యాప్తి కలిగించిన కవు లెవ్వరులేరు. కృష్ణశాస్త్రిగారన్నట్లుగా తిరుపతి వెంకటకవులు కవిత్వము నొక ఉద్యమముగా నడిపించిరి[3]. పైగా సామాన్యుల వ్యవహారములో నలిగిపోయెడు పదములను కావ్యములలో ప్రవేశపెట్టి వానికి సరిక్రొత్త 'గ్రాంధికత'ను ప్రసాదించిన ఘనత తొలుదొల్త వీరికే దక్కినది. కవిత్వము సామాన్య మానవుల పలుకుబడి కెంత సన్నిహితముగా నుండుటకు వీలున్నదో, అంత సన్నిహిత మొనర్చినవారు వీరు.

ఇక వీరి కావ్యములలో రేఖామాత్రముగా కనిపించు నవ్యతను చర్చింతును. వీరి బుద్ధ చరిత్రము అర్నాల్డు వ్రాసిన 'లైట్ ఆఫ్ ఏసియా' యను కృతికి అనువాద గ్రంథము. 'దేవీ

1. 'తిరుపతి వెంకటకవులు' (వ్యాసము) : కాటూరి వెంకటేశ్వరరావు
— ఆంధ్రపత్రిక ; ఉగాది సంచిక ; పుట 18.
2. 'తిరుపతి వెంకటకవులు' (వ్యాసము) : కాటూరి వెంకటేశ్వరరావు
3. 'పాతికసంవత్సరాల తెలుగు కవిత్వము' : భారతి రజతోత్సవ సంచిక : పుట 384.

భాగవతము' అదేపేరుతోనున్న సంస్కృత కావ్యమున కనువాదము. వీనిలో నవ్యతా ప్రసక్తియే లేదు. వీరి 'గీరతము' భారతమునకు దీటుగా వ్రాసిన కావ్యము. ఇది అధిక్షేపాత్మకమైన కావ్యము కాబట్టి ప్రక్రియనుబట్టి కొంత క్రొత్తదనమును సంతరించుకొన్నది. వెంకటకవిగారి శిష్యుడొకడు 'తాను వారి శిష్యుడు కాదనగా, వానిని రభసపట్టించుటకు' పుట్టిన కావ్యమిది. భారతములోని పర్వవిభజనమువలెనే ఇందులో మేకు బిగింపు పర్వము, చప్పట్ల పర్వము మున్నగు చమత్కార గర్భితమైన పేర్లున్నవి. భాషాసౌలభ్యముదృష్ట్యా చక్కని గ్రంథమిది.

**రెండు కావ్యములు :**

వీరి కావ్యములలో కొంత నవ్యతాగుణము కలిగియున్నవి శ్రవణానందము, పాణిగృహీత. వీరేశలింగంగారు ప్రారంభించిన వేశ్యావృత్తి వ్యతిరేకోద్యమ ప్రభావముతో వ్రాసిన కావ్యము లివి. వేశ్యలపొందు సర్వానర్థములకు బీజమని ఈ యుభయకావ్యము లిచ్చెడు సందేశము. కట్టమంచివారి 'ముసలమ్మ మరణము'లో నున్నట్లు ఈ రెంటిలోని ఇతివృత్తము సాంఘికమే. రెంటిలోను వేశ్య నాయిక; బ్రాహ్మణయువకుడు నాయకుడు. పాణిగృహీతలోని నాయకుడు వెలవెలందికిలోనై క్రమశోభ్రష్టుడగును. శ్రవణానందములోని నాయకుడు వేశ్య దుశ్శీలము నెరింగి కొంత కాలమునకు పశ్చాత్తప్తుడై దానిని పరిత్యజించును. పాణిగృహీతలో ఒకటి రెండు సందర్భములం దీకవులు సూటిగా, సునిశితముగా బాల్యవివాహములను (చతుర్థాశ్వాసము- 126 పద్యము) కన్యాశుల్కములను (చతుర్థాశ్వాసము-131 పద్యము) విమర్శించిరి. సంఘ సంస్కార ప్రియత్వముదృష్ట్యా తప్ప ఈ కావ్యములో క్రొత్తదనము కానరాదు. రెండు కావ్యములు 'శ్రీ'తో ప్రారంభమై దేవతా స్తుతి, సుకవిస్తుతి, కుకవినిందాదులు కలిగియున్నవి. ఆంగిక వర్ణనలు, అష్టాదశవర్ణనలు అందందు చోటుచేసికొన్నవి. చివరకు చాతుర్వర్ణ్యవర్ణన సైతమొనరించి ఈ కవులు ప్రబంధానుసారిత్వమును ప్రకటించుకొనిరి. ఈ విషయములో 'ముసలమ్మ మరణమే' యెంతో మెరుగని చెప్పవచ్చును.

లక్షణముకంటె లక్ష్యమునకే అగ్రతాంబూల మిచ్చుటలో, లక్షణములోని దొసగులను వ్రేలెత్తిచూపుటలో, తిరుపతి వెంకటకవులు సాహసమును ప్రదర్శించిరని చెప్పవచ్చును. గుర జాడ అప్పారావుగారివరకు కీవని నెవ్వరు చేయలేదు. శ్రవణానందములో, వీరు నిఘంటువుల నాశ్రయించుకొన్న మారుమూలపదములు గుప్పించుట తగదని యెత్తిపొడిచిరి. తాము స్వీకరించినది కల్పితము - అందులో సాంఘికవస్తువు - కాబట్టి దానిని సమర్థించుటకు పాణిగృహీత కృత్యాదిలో ప్రయత్నించిరి. 'అ'కు రేఫకు మైత్రిచేసినట్టి పోతన్నను నిందించిన అప్పకవిని నిరసించిరి. వ్యాకరణవిషయములలో సడలింపు సమంజసమనిరి. క్రింది రెండుపద్యములు వ్యాకరణవిషయమున వారు కోరిన మార్పును స్పష్టీకరించును.

'తొలిబాసయందుబలె నీ తెలుగుంబాస వెలయించు దీపము లేమిఙ
విలువగల కవుల లక్ష్యమ్ములె తామీభారమెల్ల మోయగవలయుఙ'

పాణిగృహీత. 17 వ పద్యము.

'కాలముబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశభా
షాలలితాంగి మారుటది సత్కవిసమ్మతమౌట; నవ్యదే
శ్యాలను ఆంధ్రభాషగలవౌటను ఔచితిబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి; మవి పండితు లేగతినొప్పకుందురో.'

పాణిగృహీత : 19 వ పద్యము.

'తెలుగునకున్న వ్యాకరణ దీపము' చిన్నదని చిన్నయసూరిగారి బాలవ్యాకరణము వెలువడిన యనంతరము సైతము వీరు చెప్పుట వీరివిశాలదృష్టికి, పరిణామశీలితకు నిదర్శనము. కాలమునుబట్టి భాష మారునని ఉద్ఘాటించి వీరు గిడుగువారి సిద్ధాంతములకు చేయూత నిచ్చినారని చెప్పవచ్చును. అయినను ఆ సిద్ధాంతమున కక్షరాకృతి గురజాడవారి కవిత్వములోనే సమగ్ర సుందరముగా లభించినది. దీనిని కాదనలేము. ఏది యెట్లున్నను దక్షిణాంధ్రయుగమున క్షీణ దశలో నున్న పద్యకవిత్వము, తిరుపతి వెంకటకవుల చేతిచలువవలన పునర్వికాసము పొందినది. పింగళిలక్ష్మీకాంతముగారన్నట్లుగా, 'ఈ మహాకవుల వాక్కు ప్రాచీనసరణికి భరతవాక్యము; నవీనసరణికి నాందీవాక్యము.'[1]

## 1900 - 1910 వరకు :

నవ్యసాహిత్య మహోదయమునకు అరుణోదయతపనోదయములను వెలార్చిన గురజాడ రాయప్రోలుల సాహిత్యకృషిని స్మరించుటకుముందు, రామలింగారెడ్డిగారి తర్వాత ప్రాచీ దిగంగనకు మరికొన్ని స్వర్ణరేఖలను సంతరించిన కొందరు కవులనుగూర్చి ముచ్చటింపవలసి యున్నది.

1900 లో ముసలమ్మ మరణము ప్రచురింపబడినను అది యంతగా ప్రచారము పొందలేదను మాట వాస్తవమే. అయినను 1900 అక్టోబరు 'మంజువాణి' సంచికలో ఆ కావ్యము సమీక్షింపబడుట గమనింపదగినది. ఆ కావ్య మప్పటికి ఉవ్వెత్తుగా ఎగసి పలువురి నాకర్షించకున్నను కొందరి దృష్టిలో పడినదని యీ సమీక్షవలన ఊహింపనగును.

1900 నుండి 1909 వరకు ముసలమ్మ మరణమువంటి నవ్యతాగంధముగల గ్రంథమేదియు ప్రచురింపబడలేదు. 1909 లో రాయప్రోలువారి 'లలిత', 1910 లో గురజాడవారి 'ముత్యాల సరాలు' ప్రచురితములై నవ్యకవితా శకస్థాపనమొనర్చినవి. ఈ నడిమి పదేండ్లలో నవ్యకవిత్వము పుస్తకరూపమున రానప్పటికి, పత్రికరూపమున వెలువడినది. ఈ మధ్యకాలమున సాహిత్యసేవకై రంగస్థలమున నిల్చిన పత్రికలలో కల్పలత, మంజువాణి, మనోరమ, కళావతి, సరస్వతి, తెలుగు జనానాపత్రిక గణనీయమైనవి. 1909 లో వెలువడిన 'ఆంధ్ర భారతి' ఆ కాలమున నేటి 'భారతి'వలె సేవచేసినది. ఈ పత్రికలో ప్రచురింపబడిన ఖండకావ్యములలో క్రొత్తదనపు గుబాళింపులు గలవానిని కొన్నిటి నిక్కడ పరిశీలింతును.

1. గౌతమవ్యాసములు : పుట 59.

1900 జులైలో ప్రచురింపబడిన తెలుగు జనానాపత్రికలో 'విక్టోరియా మహారాజ్ఞి విజయ గీతము' అను శీర్షికతో ఒక గేయమున్నది. కర్త కె. వెంకటరత్నం పంతులు. బహుశః కొక్కొండ వెంకటరత్నం పంతులుగారై యుందురు. ఇది త్ర్యస్రగతిలో నడుచు గేయము. దీనిని కర్త ఉత్సాహవృత్తమని పేర్కొన్నాడు. యతినియమమున్నది. రెండు చరణములకు మాత్రమే ప్రాసనియమమున్నది. వస్తువు విక్టోరియారాజ్ఞి విజయకీర్తనము. అందుకు తగినట్లుగా గేయవాసనగల వృత్తము నెన్నుకొనుట ఒక రకముగా నవ్యతయే. ఈ వృత్తము ఆద్యంతము లను పొందుపరుతును.

'అల్లయాఫ్రికాకు దక్షిణాశ ట్రాన్సువాలనన్
మొల్లమైన దేశముండు ముఖ్యమైన కీలనన్.
వెలయుమమ్మ యింగ్లాండు క్వీనువిక్టోరియా
ఎలమి సర్వసమతనేలు ఎంప్రెసాఫిండియా.'

క్రీగీటుగల భాగములందు ఒక్కొక్క మాత్ర లోపించుటవలన గణభంగము జరిగినది. ఉత్సాహవృత్త లక్షణమునుబట్టి చూచినచో ఇది దోషమే. త్ర్యస్రగతిలో నడుచు గేయమును దృష్టిలోనుంచుకొని 'యింగ్లాండు' అను పదమున 'యింగ్' అనుచోట ఆపి పల్కినచో, 'ఎంప్రెసా' అను పదమున 'సా' అను అక్షరమును ఒక మాత్రకాలము దీర్ఘముదీసి పల్కినచో గణభంగము కలిగినట్లు కనిపించదు. ఇది పేరునకు వృత్తమైనను గేయమేయని ఈ పరిశీలనము వలన స్పష్టమైనది.

1902 లోనే ఎ. రామచంద్రరావునాయుడను యువకవి టెన్నిసను రచించిన 'డోరా' అను కథా కావ్యమును అచ్చతెనుగులో అనువదించి మద్రాసు క్రైస్తవ కళాశాలవారి బహుమతి పొంది నాడు. ఇది ప్రచురితమై, ఆ కాలమున F. A. తరగతికి పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది.[1]

ఈ కాలమున మంజువాణి, కల్పలతయను పత్రికలు సాహిత్యసేవ చేసినవానిలో ఎన్న దగినవి. ఈ రెండు పత్రికలలో చమత్కారపద్యములు, సమస్యాపూరణ పద్యములు ప్రచురింప బడెడివి. వెంకట పార్వతీశ్వరకవులు మొదట ఈ సమస్యాపూరణములు చేసినవారే. ఇవి ప్రాచీనధోరణిలోనే నడచినను, ఖండకావ్యరచనకు ప్రోత్సాహము కలుగజేసినవి. ఆనాటి యువ కవులలో అణగారియున్న ప్రతిభా బీజములకు కాంతిజలసేచన మొనర్చినవి. కల్పలత (30-12-1903) లోని ప్రశ్నలకు వెంకట పార్వతీశ్వరకవులు పద్యరూపమున ప్రత్యుత్తర మిచ్చిరి. 1904 లో వీరు ప్రచురించిన చాతకము, చంద్రవర్ణనము, సూర్యకాంత పుష్పము అను ఖండకావ్యములు నవ్యతారేఖలను సంతరించుకొన్నవే. 'సూర్యకాంత పుష్పము'పై వీరు వ్రాసిన ఈ పద్యములో వస్తునవ్యతతోపాటు వ్యక్తీకరణ నవ్యతకూడ తొంగిచూచుచున్నది.

---

1. ఈ విషయము నాతో శ్రీ గిడుగు సీతాపతిగారన్నారు. ఈ పుస్తకమిప్పు డందుబాటులో లేదు. 'డోరా' కు రాయప్రోలువారి అనువాదమగు 'అనుమతి'నిగూర్చి ముందు చర్చింతును.

తన యభ్యుదయమును తలయెత్తునొనరించి
యెనలేని కాంతి రేకెత్తజేసి
తన కరస్పర్శనుఁ దనువల్లి నలరించి
హృదయ సమ్మోదంబుఁ బొదలజేసి
తనమూర్తి తేజంబుననురాగ మొదగూర్చి
యనువర్తినిగ నన్ను నలరజేసి
తన సత్పథ విహారమున నన్ను భ్రమయించి
యాశలతోడ నల్లాడజేసి

అపరదిక్సతి కనురాగియగుచు నిప్పు
డన్నియును వీడి యినుడిదే యరిగెననుచు
సూర్యకాంతమ ! తలవాంచి స్రుక్కఁబోకు
వారుణీ సక్తునకు నెందు వలపుగలదె.'[1]

**బొండుమల్లె :**

కల్పలత (1904 ఆగస్టు సంచిక) లో 'బొండుమల్లె' యను శీర్షికతో దాదాపు 3, 4 పుటల గీతమాలిక ప్రచురింపబడినది. కర్తపేరు లేదు.[2] ప్రక్రియనుబట్టి యిది ఖండకావ్యశ్రేణిలో చేరినను గుణమునుబట్టి చూచినచో ఆధునిక కథాకావ్య పంక్తిలో నిల్చు నవ్యరచన. తరువాతి కాలమున లలిత, తృణకంకణము, కష్టకమల మున్నగు కావ్యములలో రాయప్రోలువారు చేపట్టిన కథనకవిత్వమున కిది మార్గదర్శకమో యన్నట్లున్నది. మొదట ఈ కావ్యఖండములోని కథను పొందుపరుతును.

కనకలతయను రాచకన్య కలదు. ఒకనాడామె పూదోటలోనికి పోయి కొంతసేపు పెద్ద పెద్ద మొగ్గల నేరికోసి, వానిని కాలఁద్రొక్కివేయును. కొన్నిటిని చిదిమివేయును. ఇంతలో సాయంకాలమైనది. చంద్రోదయము జరిగినది. ఆవిడ యింటికేగి పాన్పున పవళించినది. ఆమె బొండుమల్లెలను కాలరాయుటకుగల కారణమేమి ? అది యీ విధముగా చెప్పబడినది.

మధుకరవర్మ కనకలత మేనబావ. విద్యార్జనకై దేశదేశములు తిరిగి ఒకనా డిల్లుచేరు కొనెను. కనకలత వర్మవచ్చినప్పటినుండి 'బావ బావ యటంచును ప్రాకులాడి'నది. అతడు 'మఱదలు మఱద'లనుచు ఆమె నెడబాయక నిల్చెను. ఆవిడ తలిదండ్రులు వారిపెండ్లి కియ్య

1. కావ్యకుసుమావళి : ప్రథమ భాగము : తొలిముద్రణము 1924 : పుట 27.
2. బహుశః దీని కర్త ఈ పత్రికా సంపాదకులగు ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మగారేమో. ఈ కాలముననే వీరు 'చందమామ'మున్నగు ఖండకావ్యములు రచించిరి.

కొనిరి. ఒకనాడు పూదోటలో ఆ యిర్వురు విహరించుచుండగా కనకలత మధుకరునితో 'బావా నీవు నన్ను విడిచి మునుపటివలె చదువుకొరకు వెళ్ళిపోయెదవా' యని ప్రశ్నించెను. అప్పుడాత డిట్లనెను.

'మఱదలా ! చదువెన్నడు మానజాలఁ
బోదు నిటనుండి యిచ్చటి బొండుమల్లె
మొక్క తొలిమొగ్గ విరిసినపూట వెడలి'.

అప్పటినుండి కనకలతకు బొండుమల్లెలపై కినుకగలిగి వానిని వెనువెంట చిదిమివేయసాగినది. మొగ్గలు విరియకుండున ట్లుపాయము దెలుపుమని ఊరివెలువల విడిదిచేసియున్న ఒక సాదు కడకేగి యడిగినది. ఆ సాదు "బావ పోలికగలవాని నొకనిజూచి అతనితోగూడి ప్రొద్దుగ్రుంక గానేపోయి, బొండుమల్లె మొగ్గలపై ఉప్పుమంచు చల్లగా నూదవలయు"నని, "ఊదునప్పుడు ఇద్దరు నొకేమారూదవలయు''నని ఉపాయము చెప్పెను. తర్వాత కనకలత మాధవవర్మయను తన బంధువునుగూడి సాదుచెప్పినట్లు చేయసాగినది. ఇది తెలిసి మధుకరుడామెపై అలిగెను. అందుకు కనకలత కోపగించెను. తాను మాధవుడు కలసి విహరించుటతో మధుకరునికి కన్ను గుట్టెనని, తానన్నచో అతనికి కంటగింపని, కావున తాను మాధవుడు వెళ్ళి మొగ్గలను వేడిగా ఊదుటయే కర్తవ్యమని, మధుకరుడే దాని ఫలము ననుభవించునని, మాధవుని దోడ్కొనివెళ్ళి అన్నంతపని చేసినది. తోటలోని బొండుమల్లెలన్ని ఒక్కమొగి విరిసినవి. మధుకరుడు మాయమైనాడు. ''మగువలమనంబు కుసుమకోమలముగానఁ గనకలత కించుకంతలో మనసు విఱిగి''నది. ఇంతటితో కథ, కావ్యము ముగిసినవి.

ఇది రాచకన్యవృత్తాంతమైనను ప్రబంధనాయికల ధోరణిలోలేదు. పైగా దీనిలోని మధుకరుడు దేశదేశములకు చదువునిమిత్తము వెళ్ళినాడన్న విషయము ఆ కాలములోని ఆంగ్ల విద్యావ్యవస్థను, సాంఘికస్థితిని వ్యక్తముచేయును. నాటి జమీందారుల వంశపరిస్థితులకు సరి పోవుకథ యిది. కనకలత రూపవర్ణన లేకపోవుట, అనవసర వర్ణనలు లేకపోవుట, చిన్నకథను తీసికొని 150 పంక్తులుగల గీతమాలిక వ్రాయుట ఈ ఖండకావ్యములోని నవ్యత. ఆ కాలమున పత్రికలలో ప్రచురింపబడెడి ఖండకావ్యములలోకొన్ని ఆంగ్లకవుల కావ్యఖండముల కనువాద ములు. మిగిలినవి ప్రాచీనతాగంధబంధురములైన పద్యములు. ఈ పద్యములలోని రచనాశిల్ప ములో, పదప్రయోగరీతిలో నవ్యతలేకున్నను, వస్తువులో గొప్పనవ్యత యున్నది. పైగా రానున్న తరమున ప్రధానభూమిక నాక్రమించనున్న ప్రణయము దీనిలో కేంద్రస్థానముననుండుట ప్రశం సావహము. ఒక చెలికానిని మనసార ప్రేమించిన మగువ వృత్తాంత మిది. ఆ విధముగా పవిత్రప్రణయము నారాధించిన కన్య ఆశలు దెబ్బతిన్నప్పుడు ఆమె మనస్సులోజరిగిన కల్లోల మును, తత్పర్యవసానమును సరళరమ్యముగా చిత్రించిన రచనయిది. రాయప్రోలువారి లలిత. తృణకంకణాదికావ్యములలో ఈ ప్రణయభంగ వృత్తమే యింకను రసవత్తరముగా చిత్రింప

బడినది. ఇంచుమించుగా రాయప్రోలువారి కావ్యములన్నియు నాయికాప్రాధాన్యముగలవి. ప్రణయమే ఇతివృత్తముగాగలవి. ఈ రెంటికి 'బొండుమల్లె'యను ఈ ఖండకావ్యము దారితీసినది. అయితే రచనలో, ఊహలో, భావనలో, పదప్రయోగములో నవ్యత లేకపోవుటవలన ఇట్టి ఖండకావ్యములు రాశికిరాలేదు.

1905 నుండి 1909 లోపుగా పత్రికలలో చెప్పుకోదగిన ఖండకావ్యములు రాలేదు. 1909, 1910 లలో చక్కనిరచనలు వెలువడినవి. 1909 నుండి ఆంధ్రసాహిత్య రంగస్థలమున 'ఆంధ్రభారతి' జేగీయమానముగా నిలచినది. ఈ పత్రిక చెన్నాప్రగడభానుమూర్తి, రాయప్రోలుసుబ్బారావు, గురజాడ అప్పారావు మున్నగు ప్రముఖకవుల కవితలను ప్రచురించినది.

'ఆంధ్రభారతి' (1891 శా. శ. చైత్రము. 1909 క్రీ. శ.) సంచికలో 'నూతనసంవత్సరాది' అను శీర్షికతో చెన్నాప్రగడభానుమూర్తిగారి పద్యములున్నవి. ఈ పద్యములన్నియు ప్రాతఫక్కిలోనే వ్రాయబడినను. ఒక్క పద్యములో మాత్రము గతముకన్న వర్తమానము గొప్పదను అభిప్రాయము క్రొత్తదనము కలిగియున్నది. ఆ పద్యమిది.

"కాలరహస్యవేదుల కఖండశుభంబులుగూరు దీన శం
కాలవమైన లేదు; గతకాలము మేలనుమాట కల్లయౌ
కాలపుకీడుమే ల్పురుషకారవశంబుననుండు నెందునున్
— — — — — "

**మొదటి ముత్యాలసరము :**

ఈ పత్రిక (శా. శ. 1831 మాఘ సంచిక)లో 'మేలుకొలుపు'అను శీర్షికతో ఒకగేయము ప్రచురింపబడినది. కర్తపేరు లేదు. ఇది ప్రధానముగా ప్రబోధాత్మకమైన గేయము. అప్పటికి గురజాడవారి ముత్యాలసరములు వెలువడలేదు. కాని ఈ సంచికలోనే వారి నీలగిరిపాటలలో ఒకటైన 'పూటిచోద్యమేఋచెపుదు' అన్నది ప్రచురింపబడినది. ఈ 'మేలుకొలుపు'గేయము మిశ్రగతిలో నున్నది. అనగా గురజాడవారు 1910 లో ప్రచురించిన 'ముత్యాలసరము' ఛందస్సులో నున్నది. అయినను ఈ గేయము గురజాడవారి ముత్యాలసరమువలె 4 పాదములుగా అచ్చుకాలేదు. వారి రెండుపాదము లీగేయములో ఒకే పాదముగా సాగిపోయినవి. రెండుపాదములకు ప్రాస నియమమున్నది.

"మేలుకొనుమీ భరతపుత్రుడ, మేలుకొనుమీ సుజనపుత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ, మేలుకొనవయ్యా ! వత్సా ! మేలుకో
వేడుకను జాతీయతయను వేగుచుక్క పొడిచె నదుగో
కూడి వందేమాతరమ్మని కుక్కుటము లరచెన్ ॥వత్సా॥

అల్లనను విజ్ఞానమనియెడునట్టి యరుణోదయమునాయెను
చెల్లె నంతఃకలహములనెడు చీకటులవెల్లన్ ॥వత్సా॥

తరలి మూర్ఖాచారములనెడు తారకంబులు న స్తమించెను
సొరిది తూరుపుదిశను జ్ఞానసూర్యుడుదయించెన్ ॥వత్సా॥

— — — —

అందరును నీకంటెముందర నడుగువేయుచు మెలగుచుండగ
పందవలెనిటు నిద్రవోవగఁ బాడియగునయ్యా ॥వత్సా॥

ఈ గేయములో 'వత్సామేలుకో' అను భాగము తీసివేసినచో, ఇది అచ్చముగా ముత్యాల సరముగా రూపొందును. నాలుగు పాదములకు బదులుగా రెండుపాదములుగా అచ్చువేసినంత మాత్రమున ఇది ముత్యాలసరము కాదనుటకు వీలులేదు. మేలుకొలుపుపాటల ప్రభావమును పుక్కిటబెట్టుకొని బయలుదేరిన గేయమిది. దీనిలోని ప్రాసనియమ మా ప్రభావమునే చాటు చున్నది. గురజాడవారు దీనికన్నముందుకు సాగిపోయి ప్రాసనియమమును ఛేదించి, వ్యావహారిక భాషాపదములను ప్రయోగించి అపూర్వమైన నవ్యత సాధించిరి. ఐనను వారి ముత్యాల సరముకన్న ఒక సంవత్సరము ముందుగా ఇది వెలువడుట గమనింపదగినది. పైగా దీనిలోని వస్తువుసైతము గురజాడవారి ప్రబోధమునకు సన్నిహితమైనది. రచనారీతికూడ వారి శైలికి సహోదరముగా నున్నది. 'జాతీయతయను వేగుచుక్క పొడుచుట', 'విజ్ఞానమనియెడి యరుణోదయమగుట', 'చెల్లె నంతఃకలహములనెడు చీకటులవెల్లన్' అనుట, 'పందవలెనిటు నిద్రవోవగ పాడియగునయ్యా' యని హెచ్చరించుట; గురజాడవారి ముత్యాలసరములలోని 'తూర్పు బలబల తెల్లవారెను', 'మందగించకముందు అడుగెయ్' వంటి పంక్తులను తలపింపజేయును. గురజాడవారు సమూలముగా పెల్లగించుటకు ప్రయత్నించిన మూఢాచారములవిషయ మీ గేయములో 'తరలి మూర్ఖాచారములనెడు తారకంబులు న స్తమించెను' అన్నపాదములో స్పృశింపబడినది. ఈ విధముగా గురజాడవారి ముత్యాలసరమునకు, ప్రబోధధోరణికి, మూఢాచారనిరసనమునకు పురోగామియైన గేయమిది. సర్వాంగీణత లేకపోయినను మొట్టమొదటి ముత్యాల సరమిదియేయని చెప్పవచ్చును. భారత జాతీయోద్యమమును, ముఖ్యముగా 'వందేమాతరం' ఉద్యమమును కవిత్వరూపమున ప్రకటించిన మొదటి గేయముసైతమిదియే యనవచ్చును.

'ఆంధ్ర భారతి' (శా. శ. 1832) జ్యేష్ఠమాస సంచికలో గురజాడవారి మొట్టమొదటి నవ్యగేయము 'తోకచుక్క' ప్రచురింపబడినది.[1] శ్రావణమాస సంచికలో వారి 'కాసులు', భాద్రపదసంచికలో 'డామన్‌పిథియన్' ప్రచురింపబడినవి. ఈ భాద్రపదమాస సంచికలోనే 'మాలవాంద్రపాట' అన్న గేయమున్నది. కర్తపేరు లేదు. దానిలోని కొన్ని పంక్తులివి.

1. దీనికే 'ముత్యాలసరములు' అన్న శీర్షిక పెట్టి 'ముత్యాలసరాలు' అన్న పుస్తకములో ప్రచురించిరి.

అందారు పుట్టీరి హిందమ్మతల్లీకి
అందారు ఒక్కాలై ఉందారి సక్కాంగ.
కష్టమ్ములొచ్చీన నిష్ఠూరమొచ్చీన
ఇష్టమ్ముగానుండి కట్టూగనుందాము ॥అందారు॥

— — —

వర్ణాలయెక్కూవ పుట్టంగలేదయ్య
మమ్మేల క్రిందీకి క్రుమ్మేరుమానోరు ॥అందారు॥

— — —

తమ్మూలమనిమీరు మమ్మూలజూడండి
ఆమ్మోరుదీవించి అయిశ్వర్యమిచ్చును. ॥అందారు॥

ఇది వ్యావహారికములో – అందులో క్రింది తరగతులు వాడుకొను గ్రామ్యభాషలో– వ్రాయబడిన గేయము. వ్యాకరణ నియమములను భాషావిషయికముగా సంపూర్ణముగా నుల్లంఘించి, గ్రామ్యభాషకు పట్టముగట్టిన ప్రప్రథమ గేయమిది. తరువాతి కాలమున నండూరివా రీరకమైన భాష నుపయోగించిరి. గురజాడవా రిట్టి ధోరణిలో వ్రాయలేదు. వారు ప్రయోగించిన వ్యావహారికము శిష్టులదే. ఇది 'మాలవారి'-గోడు కాబట్టి వారి భాషలోనే రచింపబడుట ఔచిత్యము. గురజాడవారు 'లవణరాజుకల' లో చూపిన వర్ణభేదనిరాస మీ గేయమున సువ్యక్తమైనది. అల నాడే అస్పృశ్యతను ప్రతిఘటించిన గేయమిది. ఇంతటి నవ్యత్వమున్నను ఈ గేయము గణనకెక్కలేదనగా దీనిలో కవితాగుణము లోపించుటయే.

1910 తర్వాత ఆంధ్రసాహిత్య రంగమున అపూర్వసంచలనము కలిగినది. 1909 లో రాయప్రోలువారి 'లలిత' ప్రచురితమైనది. 1910 లో వారి 'అనుమతి' వెలువడినది. 1910 లో గురజాడవారి 'ముత్యాల సరములు' సంపుటిగా వెలువడి పాఠకులను సమ్ముగ్ధమొనర్చినవి. ఈ సంవత్సరమే ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక అవతరించినది. 'ఆంధ్రభారతి' వెనుకటివలెనే నడక సాగించినది. ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలు వెంకటపార్వతీశ్వరులు, మంగిపూడి వెంకట శర్మ, రాయప్రోలు సుబ్బారావు మున్నగు యువకపీంద్రుల తరుణకవితలకు అరుణకాంతులను ప్రసాదించినవి. 1915 లో ప్రారంభమైన 'గ్రంథాలయ సర్వస్వము', రాయప్రోలువారి రమణీయ కవితాలాస్యములకు రంగస్థలమైనది. ఈ పత్రికయే అబ్బూరి, బసవరాజు మున్నగు యువకవుల ఖండకావ్యములను ప్రచురించినది. భారతి, శారద, సాహితి, ప్రతిభమున్నగు సాహిత్యపత్రికలు వెలువడువరకు పైని పేర్కొన్న మూడుపత్రికలే నవ్యకవిత్వమునకు దోహద మిచ్చినవి. 1910 నుండి 1920 లోపుగా రాయప్రోలువారి ప్రముఖకావ్యములు, ప్రసిద్ధగీతములు వెలువడి రసికుల రసనాగ్రములపై నిలిచినవి. ఈ పదేండ్లలోపుగానే గురజాడవారికి అను

యాయులు బయలుదేరినారు'. 1909 లో నాటబడిన నవ్యకవిత్వబీజ మీ పదేండ్లలో అంకుర పల్లవాది దశల నధిగమించి కుట్మలించి కుసుమించినది. ఆ సుమపరిమళములను భావకవు లేవిధముగా దశదిశల ప్రసరింపజేసిరో ముందుముందు పరిశీలింతును. అంతకుముందు నవ్యకవిత్వ మనగా నేమియో, దాని స్థాపకులెవరో చర్చింతును.

## నవ్యకవితోద్వదయ హేతువులు:

### (i) సంఘసంస్కరణోద్యమము:

రాజమహేంద్రవరములో కందుకూరి వీరేశలింగంపంతులుగారు, కాకినాడలో రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు బ్రహ్మసమాజమునకు పట్టుగొమ్మలై నిల్చిరి. ఈ యిరువురు సంఘ సంస్కరణావేశము కలవారు. ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానమును సమశ్రుతిలో మేళవించుకొన్నవారు. వీరిలో వీరేశలింగంగారు ఆంధ్రాంగ్ల సంస్కృత సాహిత్యనిష్ణాతులు. తెలుగుసాహితికి అపూర్వా భరణములు కైసేసిన స్రష్ట. సాహిత్యమును వజ్రాయుధముగాజేసికొని సంఘములో పాతుకొని పోయిన దురాచారపర్వతములను తుత్తునియ లొనర్చిన సంస్కరణశీలి. హైందవ సంఘములోని బాల్యవివాహములు, వృద్ధవివాహములు, విగ్రహారాధనము అతని వజ్రఘాతముల కెరయైనవి. ఎందరో బాలవితంతువులకు పసుపుకుంకుమలు ప్రాప్తించినవి. వారి తలలపైని నీలాలు నిలిచి పోయినవి. వీరేశలింగంగారి ఏకేశ్వరారాధన తత్త్వప్రచారముతో చిల్లరదేవతలను పట్టుకొని వ్రేలాడు మనస్తత్త్వము కొందరు దేశీయులలో కొంతవరకు సన్నగిల్లినది. పాశ్చాత్య నాగరకత పట్ల కొందరికున్న ఛాందసదృష్టి తొలగిపోయినది. ఆనాటి యువకవుల మనఃపరివర్తనమున కీసంస్కరణోద్యమ మెంతో ఉపకరించినది. వారి హృదయములందు క్రొత్త గవాక్షములు తెరచినట్లైనది. వారికి క్రొత్తఊపిరి పోసినట్లైనది.

### (ii) ఆంగ్ల విద్యావ్యాప్తి:

యువకులలో మందమందముగా రగులుచున్న భావవిప్లవము నాంగ్లవిద్యామరుత్తు ఒక్క మాటుగా జాజ్వల్యమాన మొనర్చినది. మెకాలే సిద్ధపరిచిన యింగ్లీషువిద్యాప్రణాళిక ప్రకార ముగా అప్పటికే దేశమంతట ఇంగ్లీషుపాఠశాలలు స్థాపింపబడినవి. క్రైస్తవమిషనరీలు విద్యా సంస్థలను స్థాపించి స్వమత ప్రచారము చేయసాగినవి. వీ రేదృష్టితో పాఠశాలలు స్థాపించినను, తద్ద్వారా దేశీయులకు ఆంగ్లసారస్వతములోని మేలినిగ్గులను, పాశ్చాత్య నాగరకతలోని ఉత్తమ లక్షణముల నాకళించుకొనెడి అవకాశము కలిగినది. ఇది యిట్లుండగా గోఖలేగారు ప్రతిపాదించిన నిర్బంధ ప్రారంభ విద్యాశాసనము దేశములో నవజాగృతి కలిగించినది. ఆ శాసనము ఆవశ్యక మును ప్రచారముచేయుటకై ఆయన దేశము నలుమూలల పర్యటించుటతో ప్రజలలో సామాన్య విద్యపట్ల అభిమానము ద్విగుణీకృతమైనది. ఈ రకముగా ఒకవైపు ప్రజలలో విద్యావిజ్ఞానముల పట్ల శ్రద్ధాసక్తులు పెరుగుచుండగా, ఇంకొకవైపు ఆంగ్లసాహిత్యములోని అద్భుత విషయములు ఉన్నతవిద్య నభ్యసించువారికి మిరుమిట్లు గొల్పుచుండెను. ఉన్నత పాఠశాలల, కళాశాలల

స్థాయిలో పాఠ్యభాగములుగా నిర్ణయింపబడిన టెన్నిసను, వర్డ్సువర్తు, షెల్లీ, కీట్సు, షేక్స్పియరు మున్నగు ఇంగ్లీషుకవుల రసవత్తర కావ్యఖండములను సవిమర్శముగా పఠించుటతో దేశీయులలో అపూర్వమైన చిత్తోన్మేషము, దీవికాసము కలుగజొచ్చినవి. తాము సైతము అట్టికావ్యములేల వ్రాయగూడదను కాంక్ష కొందరిలో పొడమసాగినది. పెటపెటలాడు సుదీర్ఘసర్గబంధములకు స్వస్తిచెప్పి, పటికిముక్కలవంటి చిటిపొటికవితలు చెప్పిన బాగుండునను ఉత్సాహము క్రేళ్ళురికినది. తత్పర్యవసానముగా విద్యార్థిదశలోనే కొందరాంధ్రయువకులు నవ్యరీతులలో ఖండకావ్య రచన చేయసాగిరి.[1] అప్పటికే వంగాదిభాషలలో క్రొత్తరచనారీతులకు పాదులేర్పడినవి. వంగాది భాషలనుండి తెలుగులోనికి పరివర్తితమైన గ్రంథములుగూడ దేశీయులలో భావవిప్లవమునకు సహాయకారులైనవి.

(iii) పత్రికా వ్యాప్తి :

దేశీయులలో విద్యావిజ్ఞానములు పెరిగినకొలది, వారి మెదడుకు మేతవేసెడు సరిక్రొత్త సామగ్రి కావలసివచ్చినది. ఇందుకు పత్రికలే ప్రధాన వాహికలైనవి. తెలుగున మొదటి రోజులలో అముద్రిత గ్రంథచింతామణివంటి పత్రికలుమాత్రమే ఉండెడివి. ఇవి కేవలము భాషా సారస్వత వివాదములకు, గ్రంథవిమర్శలకు, అముద్రిత గ్రంథ ప్రచురణమునకు ఉపకరించెడివి. క్రమశః కల్పలతవంటి సాహిత్య పత్రికలు బయలుదేరి ఖండకావ్యరచనకు దోహదమిచ్చినవి. మొదట కళావతి మున్నగు కొన్ని పత్రికలు వరుసగా ప్రబంధములు ప్రచురించినను, రానురాను పత్రికలలో ప్రబంధ ప్రచురణమున కాదరణ లభించలేదు. పుటల పరిమితినిబట్టి, పాఠకుల అభిరుచులనుబట్టి, రెండుమూడు పుటలలో ముగిసిపోవు ఖండకావ్యములకే ప్రాధాన్యము కలిగినది. పత్రికలు ఖండకావ్యములకిచ్చిన ప్రోత్సాహము కవులమనస్సులను మార్చివేసినది. మహాకావ్యములు తప్ప వ్రాయనివారు ఖండకావ్యప్రక్రియను సాధింపజొచ్చిరి. కావ్యమునకు కథ విధిగా ఉండితీరవలెనన్న అభిప్రాయము అడుగంటసాగినది, ఒక సన్నివేశమో, ఒక భావావేశమో కావ్యరచనకు చాలునన్న భావము బలపడినది. క్రమక్రమముగా ఖండకావ్యములకు సమాజమున సముచితస్థానము లభించినది. క్రొత్తకవితా వస్తువులపై దృష్టిమరలినది. గతానుగతికమైన రీతిలోగాక నవంనవముగా చెప్పవలెనను ఆసక్తి పెరిగినది.

(iv) వ్యావహారిక భాషోద్యమము :

ప్రాచీనకాలమున సైతము కరడుగట్టిన భాషాసంప్రదాయములను తిరస్కరించు ధోరణి ఉండనేయున్నది. తిక్కన 'పలుకుల పొందులేక రసభంగముసేయుచు ప్రాతవడ్డమాటల తమ నేర్పుచూపు' కుకవులను దుర్విటులని నిందించెను. అయ్యలరాజు రామభద్రుడు సకలకథాసార సంగ్రహమున ఇట్లనెను.

---

1. రాయప్రోలు, అబ్బూరి మున్నగువారు విద్యార్థిదశలోనే (20 ఏండ్ల ప్రాయములోపుగానే) కావ్య రచనచేయుట గమనింపదగినది.

'నన్నయ తిక్కనాది కవినాథులు చెప్పినయట్ల చెప్పలే
కున్న తదుత్తరాంధ్రకవు లూరకయుండిరె ? తోచినట్లు ని
త్యోన్నతబుద్ధి కబ్బములు యోజరచింపక యందు జ్ఞానసం
పన్నుల కావ్యముల్ హరిసమర్పణమై చెలువొందు నెందునున్.'

తిరుపతి వెంకటకవులు గూడ "కాలముబట్టి, దేశమునుగాంచి, ప్రభుత్వమునెంచి, దేశభాషాలలితాంగి' మారుననిరి. భాషా విషయికముగా ఎప్పటికప్పుడు ఒడ్డుమునుగునట్లు పొంగెత్తు పరిణామములను, తిరుగుబాటులను క్షూలంకషముగా పరిశీలించిన గిడుగు రామమూర్తి పంతులు గారు వ్యవహారచ్యుతములైన మాటలు, నిఘంటువుల నాశ్రయించుకొని జీవించు పదములు, రచనోపయోగులు కావని, రచయితలకు శిష్టవ్యావహారికభాషయే శరణ్యమని ఒక మహోద్యమము లేవనెత్తిరి. ప్రాచీనకావ్యములు వల్లెవేయించినంతనే, ప్రాతపడిన వ్యాకరణములను పుక్కిట బట్టించినంతనే, ప్రజలలో విద్యావ్యాప్తి కలిగినట్లు కాదని వీరు స్పష్టపరిచిరి. భాషకు శాశ్వతముగా ఒక వ్యాకరణము నిర్మించుటయనగా దానికి సమాధి కట్టుటయేయని, క్రొత్తనీటిని జేర్చుకొని తరగెత్తు జీవనదివలె భాష ఎప్పటికప్పుడు సరిక్రొత్త వాడుకమాటలను తనలో కలుపుకొని ముందుకు సాగవలెనని ఎలుగెత్తి ఘోషించిరి. తమవాదమును స్థాపించుటకు పంతులుగారు, శ్రీ కొక్కొండ వెంకటరత్నం, శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి మున్నగు దిగ్దంతుల రచనలలోని అప్రయోగముల నెత్తిచూపి, అచ్చమైన గ్రాంథికభాష వ్రాయుట ఎవ్వరికి తరముకాదని నిరూపించిరి. చిన్నయసూరి వ్యాకరణములోని నియమముల కాయన నీతిచంద్రికలోనే విరుద్ధ ప్రయోగములున్నవని రుజువుచేసిరి. కాలగర్భమున కలసిపోయిన దేశిరచనలను పునరుద్ధరించవలసిన ఆవశ్యకము నుద్ఘాటించిరి. బాలల గేయములు వ్రాసినవారినుండి, బుర్రకథలు వ్రాసిన వారినుండి శిష్టులు నేర్చుకోవలసినదెంతయో కలదని అభిప్రాయపడిరి. సమాజములో వలెనే కళారంగమునగూడ మార్పులు అనివార్యములని నొక్కిచెప్పిరి.[1] వారు వర్తమానమునకు సాహిత్యమునకుగల అచ్ఛిన్నసంబంధము నిట్టుగ్గడించిరి.

"ఏ తరంలోని సాహిత్యమైనా, తనకాలపు ఆలోచనా స్వభావాదులను ప్రతిబింబిస్తుంది. ఒక యుగం, వెనుకటి యుగపు సాహిత్య ప్రమాణాలను గుడ్డిగా అనుసరించదు. అది వర్తమాన కాలంనుంచి ఆవేశాన్ని పొందుతుంది. విషయస్వీకరణంలో, భావవ్యక్తీకరణలో రెండింటా, తన లక్ష్యం జీవిత విమర్శేకాని, నిర్జీవపదార్థవిమర్శ కానేకాదని అది ఉద్ఘాటిస్తుంది."

—వ్యాసావళి : పుట 81.

1. "ఆంధ్ర కవిత్వాన్ని మొట్టమొదట సృష్టించినవారికి పరిమితమైన సంకుచితపరిధిలోనే నవ్యులు గిరిగీసుకొని శాశ్వతంగా బంధింపబడి వుండవలసిందేనా ? సమాజంలాగానే కళకూడా స్వాతంత్ర్యం, శోధన అన్నవాటివల్ల మాత్రమే అభివృద్ధమౌతుంది.' —వ్యాసావళి : పుట 88

మొదట గిడుగువారు, గురజాడ అప్పారావుగారు మరియొకరిద్దరుమాత్రమే ఈ యుద్యమమును ప్రారంభించిరి. క్రమముగా విశాఖపట్టణము కళాశాల ప్రిన్సిపాలు శ్రీనివాసయ్యంగారు, విశాఖపట్టణములో విద్యాశాఖాధికారిగానున్న ఏట్సుదొరగారు వీరి ఉద్యమమునకు మూల స్తంభములై నిల్చిరి. శ్రీనివాసయ్యంగా రింగ్లీషులో 'Life or death, a plea for vernaculars' అను గ్రంథమునే రచించి ప్రచురించిరన్న ఈ ఉద్యమ మెంత తీవ్రరూపము దాల్చినదో స్పష్టమగును. జయంతి రామయ్యపంతులుగారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు మున్నగు ఉద్దండపండితులు, తరువాతికాలమున ఆంధ్రసాహిత్య పరిషత్తు ఈ యుద్యమము నెంతగా ప్రతిఘటించినను, గరుడుని పక్షయుగ్మమువలె గిడుగు గురజాడల సంకల్పము మొక్కవోకుండ ముందుకు సాగినది. విశ్వవిద్యాలయములందు దీనికి పీఠము లభించకున్నను ఇది విద్యాధికుల మన్ననల నందుకొన్నది.[1] నాటి యువసారస్వతేయుల హృదయములను సదనములుగా జేసికొని వర్ధిల్లినది. వాదప్రతివాదములతో ఒకవంక ఈ మహోద్యమము పొంగులు వారుచుండగా, ఇంకొకవంక గురజాడవారు లక్షణభాగములోనే తృప్తిపడక లక్ష్యసిద్ధికొరకు 'కన్యాశుల్క'మను నాటకమును (1897 లో) సృష్టించి, వ్యావహారికభాషకు రసోత్పాదనశక్తి లేదను పండితుల అభిప్రాయమును పరాస్తమొనర్చిరి.

సహజముగా స్వేచ్ఛాప్రియత్వము, నవ్యతా ప్రీతియున్న యువకుల కీయుద్యమ మేనుగంత బలము నిచ్చినది. కవిత్రయమువారి పదప్రయోగములే కలకాలము పరమ ప్రమాణములను విశ్వాస మీయుద్యమధాటికి చెల్లాచెదరగుటతో, నిత్యజీవితములోని వాడుకమాటలకు 'గ్రాంధికతా' పట్టము గట్టుటతో, యువకులలో నూత్నసత్త్వము రెక్కలు తొడుగుకొని రెపరెపలువోయినది. చిన్నయసూరి అప్పకవుల సింహస్వప్నములు చెదరిపోయి గిడుగుగురజాడల ఉద్యమ కాంతులు వారియంతస్సులను రాగరంజిత మొనర్చినవి. వారి వాక్కుల కంతవరకున్న ఉక్కుపంజరము లూడిపడినట్లైనది. ఈ విధముగా వ్యావహారికభాషోద్యమము యువకవుల బుజము దట్టి, వారిచేత స్వచ్ఛందరీతిలో సరిక్రొత్తరచనలు చేయించుటకు సాయపడినది.

### (v) స్వదేశీయోద్యమము :

గిడుగువారి భాషాసంస్కరణముతో, వీరేశలింగంపంతులుగారి సంఘసంస్కరణముతో పదునువారుచున్న దేశీయుల హృదయములు స్వదేశీయోద్యమముతో మరింత నిశితమైపోయినవి. ఆ కాలమున కర్జన్ ప్రభువు వంగరాష్ట్రమును రెండుగా చీల్చివేయుటతో వంగప్రజలు ఉగ్రాక్షులై విజృంభించి గొప్ప ఆందోళనము లేవదీసిరి. ఈ యుద్యమము స్వరాజ్యవాంఛకు దోహ

1. విశ్వవిద్యాలయ స్థాయిలోగూడ వ్యావహారిక భాష కామోదముద్ర లభించకపోలేదు. "అందరూ ఆలోచించి వేదము వెంకటాచలయ్యగారు వ్రాసిన "విధిలేక వైద్యుడు" అనే వ్యావహారికములో వ్రాసిన నాటకమును పాఠ్యగ్రంథముగా నిర్ణయించిరి".

నవ్యాంధ్ర సాహిత్యవీధులు : (ద్వి. భా.) పుట 189

దము చేసినది. స్వదేశవస్తువులపై ఎక్కడలేని మక్కువను కలుగజేసినది. విదేశవస్తు బహిష్కారమునకు దారితీసినది. స్వభాషాభిమానమునకు పాదులువేసినది. ఈ విధముగా వంగ దేశమున పొటమరించిన ఈ యుద్యమము క్రమశః భారతదేశమంతట శాఖలుసాచి విస్తరించినది. 'వందేమాతరం' అను నినాదము దిక్కులను కుద్దాలింపసాగినది. ఆ ప్రభావముతో ఆంధ్రదేశము ప్రబుద్ధమై క్రుద్ధమై నిలిచినది. ఆంధ్రయువకుల లోలోపల ఉడుకుచున్న దేశాభిమానము 'లావా'వలె ఉద్గమించినది. ఆంధ్రవిద్యావంతులకు పరప్రభుత్వముక్రింద ఉద్యోగము చేయుట యన్న రోతపుట్టినది. వారి స్వేచ్ఛాప్రియత్వము. తిరుగుబాటు మనస్తత్త్వము, సంకెళ్ళు త్రెంచుకొని బయటపడినవి. సంఘములోని కట్టుబాట్లు, పరప్రభుత్వ పాలనమువలని అగచాట్లు, వారి గుండెలను కుతకుతలాడించినవి. వెల్లువవలె భావగీతములు పరవళ్ళు త్రొక్కినవి. ప్రబోధ గీతములు ప్రసారితమైనవి. అన్యాపదేశముగా అనేక ఖండకావ్యములు వెలువడసాగినవి. ఆనాడు దేశీయుల అంతరంగములందు చెలరేగుచుండిన పరివర్తన ప్రభంజనమును పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగా రిట్లు వ్యాఖ్యానించినారు.

"ఎప్పుడో పాతికశతాబ్దాల క్రింద ఏర్పడ్డ లక్షణశాస్త్రాలూ, వ్యాకరణశాస్త్రాలూ విధించిన కట్టుబాట్లున్నూ, ధర్మశాస్త్రాలూ సంఘశాస్త్రాలూ నియమించిన నిబంధనలున్నూ, కులాలూ మతాలూ వ్యక్తులూ ఇత్యాదులలోగల భేదభావాలున్నూ మన అభ్యున్నతికి అడ్డుపడునట్లుంటే వాటిని తోసివేస్తున్నాము".[1]

నవ్యకవు లేవిధముగా తమ కడ్డమునిల్చిన నిర్బంధములను త్రెంచుకొని పురోగమించిరో శాస్త్రిగారి మాటలు స్పష్టముచేసినవి. ఈ పురోగతివెనుక పనిచేసిన పరిస్థితులు పైని విశదీకరింపబడినవి. నవ్యకవిత్వ మొక్కమాటుగా ఘటోత్కచుని యౌవనమువలె వచ్చిపడలేదని, సాంఘికరాజకీయభాషాస్థితిగతుల ప్రోద్బలముతో మాగిమాగి వెలువడిన 'మహాప్రయోగ'మని నేను పైన పేర్కొన్న హేతువులవలన తేలినదని భావించుచున్నాను. దాదాపు తొమ్మిదిసంవత్సరములపాటుగా ఆంధ్ర కవితాసతి పొందిన (ప్రసవ) వేదనకు ఫలితము రాయప్రోలు గురజాడల ఖండకావ్య గేయోదయము. నవ్యకవిత్వ లక్షణములను వివరించుటకుముందు, ఆంధ్రపత్రిక 1914 లోనే యేవిధముగా ఈ కవిత్వ ప్రాశస్త్యము నుగ్గడించెవో ఉటంకించుట అనుచితము కాదనుకొందును.

"భాషాభిమానము ప్రబలుచున్నది. భాషాభివృద్ధి కనుకూలమైన యత్నములు చేయబడుచున్నవి. నూతనభావములు వికసించుచున్నవి. నూతన భావపూరితములైన గీతములు కథలును రచింపబడుచున్నవి. నూతనశైలి సంక్షిప్తము. నూతనభావములు గంభీరములు. నూతన సంప్రదాయము లపరిచితములు. నూతనాదర్శములు సదాశాభరితములు. శైలియు భావములును

1. నవ్యసాహిత్యపరిషత్తు నాల్గవ సమావేశములో చేసిన అధ్యక్షోపన్యాసము : 'ప్రతిభ' : ధాతువ సంత సంచిక.

సంప్రదాయమును విపరీతాభిప్రాయమును కలిగించుట సహజము. కాలక్రమమున నివి పరిపాటియై భాషకు నూతనాలంకారములు సమకూర్పగలవు.''[1]

ఆధునిక కవిత్వములోని నవ్యతను గుర్తించుట, దానికి నివాళులెత్తుట, భవిష్యత్తులో దాని సర్వాంగీణస్ఫూర్తి నాశించుట ఈ సంపాదకీయములో గమనింపదగిన అంశములు.

## నవ్యకవిత్వ లక్షణములు :

నవ్యకవిత్వమునకు ఆధునిక కవిత్వము, అభినవకవిత్వము, భావకవిత్వము, లిరికల్ పోయిట్రీమున్నగు పదములు పర్యాయములుగా నున్నవి. వీనిలో ఆధునికకవిత్వమన్నది కాల వాచి. ఆధునికకాలమున (ఇరువదవ శతాబ్దిలో) వచ్చిన కవిత్వమంతయు ఆధునిక కవిత్వమే. తిరుపతి వెంకటేశ్వరుల బుద్ధచరిత్రము, జనమంచివారి బ్రహ్మాండపురాణము. శ్రీపాదవారి యాజ్ఞవల్క్యచరిత్ర మున్నగు కావ్యములు పై నిర్వచనమునుబట్టి ఆధునిక కవిత్వములోనికే వచ్చి చేరును. కావున ఆధునికత్వమన్నది కాలవాచిగా గ్రహించినచో ఈ చిక్కు వచ్చును. రవీంద్రనాథ టాగూరుగారు కవిత్వములో ఆధునికత్వమనగా స్వభావమునుబట్టిన ఆధునికత్వమే కాని కాలమునుబట్టినది కానేకాదని స్పష్టపరిచిరి.[2]

భావకవిత్వము, లిరికల్‌పోయిట్రీ అను పదములు ఒకే అర్థములో వాడబడుచున్నవి. సాహితీసమితి స్థాపనతో కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయశాస్త్రి, నాయనిసుబ్బారావు మున్నగు కవుల ఆత్మాశ్రయ కవిత్వముతో ఈ భావకవిత్వశబ్దము దేశములో వేరూదినిల్చినది. భావ కవిత్వమనునది సముద్రమంత విశాలగంభీరమైన పదము. దీనినిగూర్చి, దీనిలో ఇమిడిపోయిన అనేక ప్రక్రియలనుగూర్చి ప్రత్యేకముగా చర్చింపవలసియున్నది. ప్రస్తుత మీశతాబ్ది ప్రారంభ ములో వెలువడిన నవ్యకవిత్వము స్థూలరేఖలను చిత్రించుటయే నాపని. ఇక అభినవ కవిత్వ మనునది నవ్యకవిత్వమునకు పర్యాయపదమే. ఈ శబ్దములన్నిటిలో నవ్యకవిత్వమే సముచిత ముగా నున్నది. నవీనగుణములుగల్గిన సమస్తాధునిక కవిత్వమునకు ఈమాట సరిపడును. చిన్న కథతో, ఒకటిరెండు పాత్రలతో, కొన్ని సన్నివేశములతో, ఆధునికకవులు రచించిన లఘు కావ్యములకు భావకవిత్వము, లిరికల్‌పోయిట్రీ అన్నమాటలు సరిపోవును.[3] ''ఆధునిక కవిత్వ మంటే ఇప్పటివాళ్ళదంతా అవుతుంది. భావకవిత్వమంటే కథానకాదిరూపమై నవ్యకవిత్వానికి అన్వయించక అవ్యాప్తిదోషము పాలవుతుంది.''[4] కాబట్టి నవ్యకవిత్వమను పదముమాత్రమే ఔచితీమంతమైనదని నోరినరసింహశాస్త్రిగారు వ్రాసియున్నారు.

1. ఆంధ్రపత్రిక : సంవత్సరాది సంచిక సంపాదకీయము : పుట 10.
2. ''కవిత్వంలో ఆధునికత్వం : '' (రవీంద్రనాథటాగూరు). Modern Review లో ప్రచురించిన వ్యాసమునకు తెలుగు : భారతి : అక్టోబరు 1946.
3. తృణకంకణము, కష్టకమల, వనకుమారి మున్నగు కావ్యములు.
4. నవ్యకవిత్వము : దానిఉద్దేశ్యము (వ్యాసము) : నోరినరసింహశాస్త్రి : ప్రతిభ 1988 జనవరి.

సాధారణముగా ఆధునిక విమర్శకులు నవ్యకవిత్వమునకు భావకవిత్వమునకు అభేద మూహించుకొని నిర్వచనములు చేసియున్నారు. భావకవిత్వమును విడిగానిర్వచించినప్పుడు వానిలో కొన్నిటిని పొందుపరుతును. నవ్యకవిత్వమును ప్రత్యేకార్థములోకాక నవ్యసాహిత్వమను అతివిశాలమైన అర్థములో విశ్వనాథ సత్యనారాయణగారిచ్చిన నిర్వచనము (వివరణము) గమనింప దగినది.

'సృష్టిక్రమంలో, సృష్ట్యాదినుండి కాలనిర్ణయంలో, భిన్నరాజచరిత్ర నిర్ణయంలో, సంఘ ధర్మనీతులలో, ఆర్థికరాజకీయాల్లో సారస్వత పథాలల్లో ఒక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాలమీద మనజాతి నడిచింది. ఇవ్వాళ అంగిలేయులు మన్ని ఆక్రమించటంచేత ఆ మహా సంస్కారంమీద అభిమానం పోయింది. పాశ్చాత్యదేశీయుల సంస్కారంమీద అభిమానం ప్రబలింది. ఏ తదభిమాన పురస్కృతములైన భాషాతత్వం, చరిత్రనిర్మాణం, సృష్ట్యాదికాల నిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, వీటిని యేయే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్య సాహిత్యం.''[1]

ఈ వాక్యములవలన తేలిన సారమేమనగా విశిష్టమైన భారతీయ సంస్కృతి సంప్ర దాయములను త్రోసిరాజని ఆంధ్రసాహిత్యము పాశ్చాత్య విజ్ఞానసంస్కారములకు లోనైనదని, ఆ ప్రభావముతో వచ్చిన సాహిత్య మంతయు నవ్యసాహిత్యమని. ఇందులో పాశ్చాత్యనాగర కతా సంపర్కమువలన మన 'మహా సంస్కారంమీద అభిమానం పోయింది' అనుమాట పరిశీ లింపదగినది. ఈ మాట మిగిలిన సాహిత్యప్రక్రియలకేమోకాని నవ్యకవిత్వముపట్ల మాత్రము వర్తించదు. అంతటి విప్లవకారుడైన గురజాడవా రేవిధముగా సంప్రదాయమును జీర్ణించుకొని రచనచేసిరో ముందుముందు నిరూపింతును. ఇక రాయప్రోలు, నాయని, విశ్వనాథ, కృష్ణశాస్త్రి మున్నగు నవ్యకవి ప్రముఖులపైన సంప్రదాయముద్ర స్ఫుటమైనరేఖలతో కనుపించుచున్నది. నవ్యకవులు క్రొత్తప్రయోగములు చేసినమాట వాస్తవమే కాని, వీనిలో ఏ యొకరిద్దరోతప్ప సంప్రదాయచ్ఛేదము చేసినవారు లేరు. కాబట్టి నవ్యకవిత్వ మాంగ్లేయ ప్రభావముతో వెలువడి నంతమాత్రమున భారతీయ సంస్కారమునకు విదూరమైనదని అనుటకు వీలులేదు. ఆధునిక భాషాశాస్త్రము తెలుగును సంస్కృత జన్యమనికాక ద్రావిడభాషా కుటుంబములోనిదని నిర్ధరించి నందువలన, ఆధునిక చరిత్రపరిశోధన పురాణములను త్రోసిరాజని శాసనములమీది ప్రత్యయ ముతో సాగిపోవుటవలన, విశ్వనాథవారు నవ్యసాహిత్యము నట్లు వివరించిరేకాని – ఈ నిర్వచ నము నవ్యకవిత్వమునకు మాత్రము చెల్లదు.

పండాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారుగూడ ఈ ధోరణిలోనే నవ్యసాహిత్యమును నిర్వ చించినారు.[1] ఆంగ్ల విద్యాఫలితముగా, ఇంగ్లీషువారి ఆచారవ్యవహారముల ప్రభావఫలితముగా

1. నవ్యసాహిత్య పరిషత్తు సప్తమ వార్షికసమావేశాధ్యక్షోపన్యాసము : భారతి 1940 ఏప్రిలు.
2. నవ్యసాహిత్య పరిషత్తు చతుర్థసమావేశాధ్యక్షోపన్యాసము : ప్రతిభ : భావసంతసంచిక.

ఆంధ్రజాతికి సంక్రమించిన మంచి సెబ్బరలను ప్రతిబింబింపజేయునది నవ్యసాహిత్యమని వీరు అభిప్రాయపడిరి. ఆంగ్లేయ సంపర్కముతో. 'పరజాతి కీర్తనము', 'ఆత్మవిశ్వాస శూన్యత', 'స్వజాతి దూషణము' మున్నగునవి నవ్యులకు సంక్రమించినవని వీరనుట విచారింపవలసిన విషయము. నవ్యకవులలో ఆత్మవిశ్వాసములేని కవులు లేరు. గురజాడ అప్పారావుగా రెక్కడో ఒకచోట

'కన్నుగానని వస్తుతత్వము
కాంచనేర్పరు లింగిరీజులు'

అన్నంతమాత్రమున అది పరజాతికీర్తనము, స్వజాతినింద కానేరదు. ప్రకరణమునుబట్టి యన్నమాట అది అంధవిశ్వాసములు మంచివికావను అభిప్రాయమును బలపరుచుట కన్నమాట అది. గురజాడ వారి ఆత్మప్రత్యయమునకు వారి 'దేశభక్తి'కన్న ప్రబలప్రమాణము లేదు. రాయప్రోలుమున్నగు వారి జాతీయాభిమానము, సంప్రదాయానురక్తి ప్రసిద్ధములేకదా! ఆధునికులు చేసిన స్వజాతి కీర్తనము ఆంధ్రసాహిత్య చరిత్రలోనే అపూర్వము. భారత దేశాభిమానమునకేమి, ఆంధ్రదేశాభిమానమునకేమి నవ్యులది పెట్టినదిపేరు[1]. ఆంధ్రదేశపుమట్టిని కనకముగా, జలమును అమృతముగా భావించిన భావుకులు వీరు. కాబట్టి విశ్వనాథవారుగాని పంచాగ్నుల వారుగాని చేసిన నిర్వచనములు నవ్యసాహిత్యమునకు–ముఖ్యముగా నవ్యకవిత్వమునకు – సమగ్రముగా వర్తించలేవని నాభావము. నవ్యకవుల సంప్రదాయపోషణముగూర్చి ముందు ముందుగా చర్చింపవలసియున్నది. కావున దీనిని ఇంతటితో ఆపి నవ్యకవిత్వ లక్షణములను స్థూలముగా పరిశీలింతును.

### (i) *ఖండకావ్య ప్రక్రియ :*

ఖండకావ్యము నవ్యకవిత్వములో ప్రథమగణ్యమైన ప్రక్రియ. ఇరువదవ శతాబ్ది ప్రారంభమున తెలుగు సాహిత్యమున మొలకెత్తిన ప్రక్రియయిది. పాశ్చాత్య విజ్ఞాన ఫలితముగా సమాజములో కల్గినమార్పు: కవులనాదరించి గండపెండేరములుతొడుగు 'కవితా ప్రావీణ్య ఫణీశు'లగు ప్రభువులులేని లోటు ఈ ప్రక్రియకు దారితీసినది. ఆంగ్ల నాగరకతా సంపర్కమువలన దేశీయుల జీవన విధానములో వెనుక ఎన్నడులేని వేడిపుట్టినది. ప్రజలు త్వరజీవనమున కలవాటుపడిరి. వారికి మహాకావ్యములను పఠించు ఓపిక, తీరిక కొరవడినవి. స్వల్పకాలములో, అనల్పానందమునుగూర్చు కవిత్వము కావలసివచ్చినది. పత్రికలకు ప్రబంధములను ప్రచురించు అవకాశము లేకపోయినది. కవిత్వము కవులకు 'జాంబూనదాంబరాగ్రహారముల'ను సమకూర్చు కాలము కాకుండపోయినది. తీరిక కాలములో ఆత్మానందముకొరకు మిత్రుల మెప్పుకొరకు కవిత్వము వ్రాసికొనుటయేకాని తిక్కన్నవలె 'మహాకవిత్వదీక్షావిధి' పొందవలసిన అవసరము లేకపోయినది. ఈ పరిస్థితు లిట్లుండగా ఆంగ్ల సార్వతములోని రసగుళికలైన ఖండకావ్యములతో

1. ఈ విషయము 'దేశభక్తి కవిత్వము'న్న శీర్షిక క్రింద వివరముగా చర్చింపబడును.

తెలుగువారికి పరిచయమేర్పడినది. తెలుగువారు వానిని చదివి ముగ్ధులై వాని ప్రభావముతో ఖండ కావ్యరచనకు పూనుకొనిరి. కాబట్టి ఖండకావ్యసృష్టికి ప్రధాన హేతువు ఇంగ్లీషు కవిత్వమే.[1] అయినను ఈ ఖండకావ్యమన్నది మన సాహిత్యమునకు క్రొత్తగాదు. కావున ఖండకావ్యమును గూర్చి ప్రాచీన సంస్కృత లాక్షణికు లిచ్చిన లక్షణములను మొదట పరిశీలింతము.

భామహుడు కావ్యమును మూడువిధములుగా విభజించినాడు. 1. సర్గబంధము, 2. అభినేయార్థము, 3. అనిబద్ధము. సర్గబంధమనగా వివిధరస భావములతో, సుదీర్ఘ కథతో కూడు కొన్న మహాకావ్యము. అభినేయార్థమనగా దృశ్యకావ్యము. అనిబద్ధమనగా అనుస్యూతముగా ఒకకథ లేకుండ భావ తీవ్రతను ప్రకటించుటయే లక్షణముగాగల ముక్తకరచన. నిబద్ధకావ్య మనగా ప్రబంధమని, అనిబద్ధ కావ్యమనగా ముక్తకమని తేలినది. ప్రాచీనులు అనిబద్ధ కావ్యము లకు విలువనీయలేదు. వామనుడు 'నాఽనిబద్ధంచకాస్త్యేకతేజః పరమాణువత్'[2] అని సూత్రీక రించెను. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున ముక్తక ప్రస్థానములో ముక్తకములను ప్రబంధముల పంక్తిలో కూర్చుండబెట్టెను. విద్యానాథుడు ప్రతాపరుద్రీయములో 'అసర్గబంధమపి యదుపకావ్య ముదీర్యతే' అని ముక్తక (ఖండ) కావ్యమునకు కొంత అస్తిత్వమున్నట్లు సూచించెను. తొలి సారిగా ఖండకావ్య ప్రక్రియను పేర్కొన్న లాక్షణికుడు విశ్వనాథుడు. ఆయన 'వాక్యం రసా త్మకం కావ్యం' అన్న రసప్రలుబ్ధుడు కాబట్టి ఖండకావ్యము విశిష్టతను గుర్తించెను. ఈతడు 'ఖండకావ్యం భవేత్కావ్యస్యైక దేశానుసారిచ' అని సూత్రీకరించి దీని కుదాహరణముగా 'యథా మేఘదూతాదిః' అని వివరించెను.

"మహాకావ్యములలో ఏకదేశములైన రసవత్ సంఘటనలనుగాని, నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయాదులలో నేదైన ఒకటిగాని తీసికొని రసభావబంధురములైన రమణీయరచనలు చేయవచ్చు. అట్టివానికే ఖండకావ్యములనిపేరు".[3] ఈ దృష్టితో పరిశీలించినచో విప్రలంభ శృంగారమునుమాత్రమే తీసికొని రచింపబడిన మేఘసందేశము ఖండకావ్యమగును. గీత గోవిందము ఖండకావ్యమేయగును. ఋగ్వేదములోని ఉషస్సూక్తములు, ఋతుసంహారము ఈ కోవకు చెందినవే యగును. గాథాసప్తశతిలో ఏ శ్లోకమున కాశ్లోకమే స్వయంపూర్ణము కాబట్టి ఇది ముక్తక శ్రేణిలోచేరును. అమరుక శతకము, తెలుగుశతకములన్నియు ఈ ముక్తక కావ్యములే యగును.

ప్రాచీన లాక్షణికులలో విశ్వనాథుడు ఖండకావ్య వైశిష్ట్యమును గుర్తించుట ప్రశంసార్హము. కవిగుండెను చీల్చుకొని వెలికుబికివచ్చు భావధారలకు ఖండకావ్యమునకుమించిన వాహికలేదు. పోతన్న మహాభాగవతములోని గోపికాగీతలను వేరుపరిచినచో ఆ భాగము చక్కని ఖండకావ్య మగును. ఆ ఘట్టములో గోపికాముఖముగ పోతన్న భావతీవ్రతయే వ్యక్తమైనదని పలువురు

1. 'కథలకేం, ఖండకావ్యాలకేం, పాశ్చాత్యులవరవడి' —విశ్వనాథసత్యనారాయణ : 'జయంతి' లో
2. కావ్యాలంకార సూత్రవృత్తి.
3. 'మేఘసందేశము మహాకావ్యమట' (వ్యాసము): ఇంద్రగంటి: భారతి 1939 నవంబరు.

విమర్శకుల యూహ. భావతీవ్రతను ప్రకటించుటకు, పాఠకునిలో 'శుష్కకాష్ఠములో అగ్నివలె' రసానందమును ఝటితిప్రసరణము చేయుటకు, ఖండకావ్యము కడుసమర్థమైనది.[1] ఈ ఖండ కావ్యము కేవల మాత్మాశ్రయకవిత్వమే కానక్కరలేదు. పరిమిత పాత్రలతో కవి తన భావమును ప్రకటింపవచ్చును. మేఘసందేశములో కాళిదాసు ప్రత్యక్షముగా కనిపించడు. యక్షుని పాత్ర ద్వారా విప్రలంభవేదనను వ్యక్తమొనర్చెను. రాయప్రోలువారి తృణకంకణము, గురజాడవారి పూర్ణమ్మ మున్నగునవి చక్కని ఖండకావ్యములు. వీనిని ఆత్మాశ్రయ కవిత్వమేయనుటకు వీలులేదు. వీనిలో ఆత్మాశ్రయ కవిత్వగంధముండపచ్చును. 1904 లొ కల్పలతలో ప్రచురింప బడిన 'బొండుమల్లె'ను గూర్చి ఈ వరకే పేర్కొంటిని. అది ఖండకావ్యము. కాని ఆత్మాశ్రయ కవిత్వముకాదు. అందుకే 'ఆత్మాశ్రయ కవిత్వరీతి'ని నవ్యకవిత్వమున కింకొక లక్షణముగా ప్రత్యేకించి పేర్కొన్నాను, ఇంతకు - ఖండకావ్యమనగా చిన్నకథ, కొన్ని పాత్రలు, పరిమిత పద్యములుండి ఆశ్వాస విభక్తముకాని రచన కావచ్చును. లేక ఒక పద్యమో, కొన్ని పద్యములో ఉన్న రచన కావచ్చును.[2] గురజాడవారి 'దేశభక్తి' గేయము, రాయప్రోలువారి తృణకంకణము ఖండకావ్యశ్రేణిలోనే చేరును.[3] విశ్వనాథవారి నిర్వచన మీ విషయమునే బలపరుచుచున్నది.

''మహాకావ్యములనుండి రసవద్ఘట్టములుకాని, ఒక ఏక విషయమునుగురించి వ్రాసిన కొన్ని పద్యములుకాని, విడిగా తీసినచో అవి ఖండకావ్యములగును''.[4]

### (ii) ఆత్మాశ్రయరీతి :

కవి తాను దర్శించిన సత్యమును, శివమును, సౌందర్యమును ప్రకటించుటకు రెండు మార్గము లున్నవి. ఒకటి వస్త్వాశ్రయ కవితారీతి. రెండవది ఆత్మాశ్రయ కవితారీతి. వీనినే క్రమముగా Objective Poetry అనియు, Subjective Poetry అనియు పాశ్చాత్యవిమర్శ కులు వింగడించిరి. ఈ విభాగము మన కవిత్వములో ఆంగ్ల సంప్రదాయ ప్రకారము వచ్చినదే. మన ప్రాచీనకవిత్వములో వస్త్వాశ్రయ కవితామార్గమే నూటికి తొంబదితొమ్మిది పాళ్ళు కని పించును. వస్త్వాశ్రయ కవితామార్గమున, నాయికానాయకులద్వారా కవి తన అభిప్రాయములను ప్రకటించును. ఈ నాయికానాయకులు దివ్యులు, దివ్యాదివ్యులు, అదివ్యులని ముత్తెఱగులు. మన ప్రాచీనులలో శతకకవులు తప్ప ఎల్లరు ఇట్టిమార్గము నవలంబించినవారే. కొందరు తమ భక్తి

1. ''ఉదాత్తమైన మహాకావ్యంకంటె ఈ ఖండకావ్యం తక్షణ హృదయస్పృక్కు. కవి హృదయజ్వలన ములో వెలువడిన రసభావ సంగీతమున కిది తారస్థాయి''.
—'మేఘసందేశము మహాకావ్యమట' : ఇంద్రగంటి.
2. నవ్యులు ముక్తకమునుగూడ ఖండకావ్యముగానే భావించిరి.
3. ఆధునిక కావ్యములలో జాషువాగారి కావ్యములు ఖండకావ్యములే. పింగళికాటూరుల 'సౌందర నందము' ఆశ్వాస నియతివలన కావ్యమైనది.
4. రత్నాపణ సమీక్ష : ఆంధ్రవారపత్రిక : 5 జనవరి. 1933.

భావమునకు రాముడని, కృష్ణుడని పేర్లుపెట్టికొని, మరికొందరు 'హరిహర' దైవతమును సృష్టించికొని, ఆయాదైవతముల మూర్తిసౌందర్యము నూహించి. గుణములను కీర్తించి యానందించిరి. ఆత్మాశ్రయ కవితారీతిలో ఈ మూర్తికల్పనము లేదు. ఈ నాయికా నాయకులుండరు. కవియే దీనిలో ఆలంబనవిభావము. భక్తిగాని, రక్తిగాని, సుఖముగాని, దుఃఖముగాని, ప్రణయముగాని, ప్రళయముగాని కవియే స్వయముగా అనుభవించి, ఆలోచించి, సూటిగా కవితాబద్ధ మొనర్చును.[1] పరస్వాశ్రయ కవిత్వములో అట్లుగాక కవి తన వ్యక్తిత్వమును విస్మరించి, తన అభిరుచులను అణచుకొని, తన ఉద్వేగము నుపసంహరించుకొని, ఆయా మూసలలో కరగించి పోసిన బంగారమువలె ఆయాపాత్రల భావచేష్టాదికములలో లీనమైపోవును. తన యుద్వేగమును నిబద్ధవక్తృముఖమున ప్రకటించును. లోకవృత్తములోని వైవిధ్యమును ఔచిత్యపరిధిలో ప్రదర్శించుట అతని ముఖ్యబాధ్యత యగును. భారతములో ధర్మజుడు, శకుని, కృష్ణుడు, ద్రౌపది, కీచకుడు మున్నగు వివిధపాత్రలను కథ 'పూర్వాపరములకు పొందికగలుగునట్లు' చిత్రింపవలసినదే కాని వ్యాసుడుగాని, తిక్కనగాని స్వాభిరుచులు ప్రకటించుటకు వలనుపడదు. ఆంధ్రభాగవతమున గోపికాగీతలలో, భ్రమరగీతలలో పోతన్నయే కనిపించునని, కాళిదాసు మేఘసందేశములో చిత్రించిన విరహవేదన ఆయన స్వీయమేయని కొందరు వ్యాఖ్యానించి, ఇవి ఒక రకముగా ఆత్మాశ్రయ కవిత్వములేయని అభిప్రాయపడినారు. ఈ యభిప్రాయ మంతగా ఉచితమైనది కాదు. పోతన్న కేవలము మధురభక్తినే వర్ణించలేదు. దాస్య, వాత్సల్య, సఖ్యాదులను గూడ రసవత్తరముగా చిత్రించినాడు. కాబట్టి అక్రూరాదులలో యశోదాదులలోగూడ ఆయన తన అభిరుచులనే ప్రకటించెననవలసి వచ్చును. కాళిదాసు మేఘసందేశములో కామార్తుడైన యక్షుని విరహమును వర్ణించెనే కాని తన సొంతగోడు కాదు. అట్లు చూచినచో ప్రాచీనకావ్యములందలి విప్రలంభశృంగార సంబంధి చంద్రాది దూషణలన్నియు ఆయాకవులకు అంటగట్టవలసివచ్చును. అర్థాంతరన్యాసములుగా పెద్దన ప్రయోగించిన 'బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్', 'చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్' మున్నగునవి అతని స్వాభిప్రాయము లనవలసివచ్చును.[2] శృంగార నైషధములో శ్రీనాథుడు నలదమయంతుల వివాహానంతర భోజనమును వర్ణించుచు క్రిందిపద్యము చెప్పెను.

"మిసిమిగల పుల్లపెరుగుతో మిశితమైన
ఆవపచ్చళ్ళు చవిచూచి రాదరమున

1. "In which the poet goes down into himself and finds his inspiration and his subjects in his own experiences, thoughts and feelings'"

—An Introduction to the study of Literature by W. H. Hudson. P. 96.

2. 'తరుణీనవ్యకాంత' అను పద్యములో పెద్దన్న వరూధినియెడల పక్షపాతము వహించెనని, ఈ పద్యములో అతడు బయటపడక తప్పలేదని వ్యాఖ్యానించు ధోరణి తెలుగువిమర్శనరంగమున క్రొత్తగాదు.

చుఱ్ఱుమని మూర్ధములుదాకి యొఱ్ఱదనము
పొగలు వెడలింప నాసికాపుటములందు''.

ఈ పద్యమునకు మూలమున'మిసిమిగల పుల్లపెరు'గని లేదు, 'దధి'యని మాత్రమే ఉన్నది. చివరిరెండు చరణములును శ్రీనాథోపజ్ఞకములే. అంతమాత్రమున శ్రీనాథుని అభిరుచులలో 'మిసిమిగలపుల్లపెరుగు'ను, 'చుఱ్ఱుమని మూర్ధములుదాకు' కారపుఘాటుగల ఆవపచ్చళ్ళను చేర్చుట తగనిపని. ఈ పద్యములో ఆత్మాశ్రయరీతిని అనుమానించుటకూడ సమంజసముకాదు. కాబట్టి ప్రాచీనకావ్యములలో శతకములుదప్ప ఆత్మాశ్రయ కవిత్వము కలవి లేవు. ఆ శతకములుగూడ ప్రాయికముగా భక్తిపరములు. మిగిలినకొన్ని శృంగారము, నీతి, అధిక్షేపము గలవి. వీనిలో కవి మనఃప్రవృత్తికి సంబంధించిన అంచులన్నియు కనిపించవు. అతని అనుభవవైవిధ్యము ప్రదర్శితముకాదు. వివిధ సన్నివేశములలో, హఠాద్ఘటనములలో అతని గుండెలో కలిగిన ఒరపిడులు, రాపిడులు, కల్లోలములు, పోటుపాటులు శతక కవిత్వమున కనిపించవు. ఎంతసేపు మనస్సులోని అభిప్రాయమును నగ్నముగా, గబగబచెప్పి వేయవలెనను ఉత్కంఠయేకాని దానికి ఊహలదుస్తులు తొడిగి, దానిని భావరంజిత మొనర్చి ప్రకటింపవలెనను ప్రయత్నముండదు. శతకకవిత్వమునకును ఆధునికుల ఆత్మాశ్రయరీతికిని ఈ భేదమున్నది. ఆత్మాశ్రయ కవిత్వములో కవి సొంతగొడవయేకాని అనంతమైన లోకవృత్తముండదను ఒక విమర్శ యున్నది ఇది సమంజసముకాదు. కవి ఎల్లప్పుడు తననొక శృంగారనాయికగానో, భక్తుడుగానో భావించుకొనడు. పాదుషాగా, పకీరుగా, పాపిగా, భక్తుడుగా, రక్తుడుగా, పరమాత్ముడుగా, రాయిగా, రత్నముగా, విరిగా, గిరిగా - ఎన్నోరకములుగా భావించుకొనును. అతని అనుభూతు లవస్థాభేదమునుబట్టి ఉద్గతమగుచుండును. సీతాకోకచిలుక మొదలుకొని శివుని సిగపువ్వుదాక అతని యనుభూతితంత్రులను మ్రోగించి, అతనిచేత కావ్యగానము చేయించును. కావున ఆత్మాశ్రయరీతిలో లోకవృత్త ప్రదర్శనమునకు, వస్తువైవిధ్యప్రకటనమునకు వీలు లేదని శంకించనవసరములేదు. ఈ రకమైన కవిత్వములో కథాపూరణ ప్రయత్నముండదు. అనవసరమైన వర్ణనలు దిగుమతిచేయు అవసరముండదు. చెప్పినదంతయు మేలిమిముద్దగా నుండును. అందుకే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిట్లనిరి. 'ఉత్తమమైన ఆత్మపరమైన కావ్యంలో ఉన్నంత కవిత్వ లావణ్యము మరొక కావ్యంలో ఉండదు. ఊపినచోట అది ఊపినంత మరొకటి ఊపదు".[1]

ఆత్మాశ్రయకవిత్వరీతిలో ఒక భ్రమప్రమాదమునకు వీలున్నది. కవి వ్రాసిన సమస్త కవిత్వమున కాయనతో సంవాదమున్నదో లేదోయని పరిశీలించుట. రాయప్రోలువారు ప్రతిపాదించిన అమలిన శృంగార సిద్ధాంతమును ఆయన నిత్యజీవితములో వెదకిచూడవలసిన అవసరములేదు. అదియొక సిద్ధాంతము. దానిని వారు కావ్యరూపమున ఎట్లు నిర్వహించిరన్నదే

1. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము' : భారతి : రజతోత్సవసంచిక జనవరి 1949 :

ప్రసక్తము. తద్ద్వారా మనకుకలిగిన ఆనందమే ప్రధానము. కృష్ణశాస్త్రిగారు 'పల్లకి' యన్న పద్య సంపుటిలో తమ్మొక శృంగార నాయికగా భావించుకొనిరి. "నొసలిపై చెలలాడు ముంగురులతో, తుఱగలించు చిరునవ్వుతో............సవిలాసమగు వేషముతో,"[1] పాటలుపాడు కృష్ణశాస్త్రిగారిని శోకప్రధానమైన కావ్యమగు 'కృష్ణపక్షము' నాయకుడుగా ఎట్లు భావింతుమను ప్రశ్న పూర్వమే వచ్చినది. ఈ యభిప్రాయమున కాధారములేదు. కృష్ణపక్షములో అధికభాగము దుఃఖభావశబలితమైనమాట నిజమే. అందులో 'కంటక కిరీటధారినై కాళరాత్రి మధ్యవేళల జీమూత మందిరము'లలో కొల్వుదీర్తునని కవిగారు ప్రకటించిరి. అంతమాత్రమున ఆ విషయములన్నియు వారి వ్యక్తిత్వమున కాపాదించుట హాస్యాస్పదము. ఆ పద్యములలో ప్రకటితమైన భావావస్థతోమాత్రమే కవికి సంబంధమున్నది. ఆ ప్రత్యేక భావములను తనవిగా భావనచేసికొని, అనుభవించి, మధనపడి, మననముచేసికొని సుందర శబ్దజాలములో కవి వ్యక్తమొనర్చినాడు. ఆత్మాశ్రయరీతిలో రచనచేయుకవి, అందరికి కేవల మింద్రియగోచరమగు సత్యమును, సౌందర్యమును తన గుండెలో రంగరించుకొని, తనదిగా చేసికొని, వాడిగా, వేడిగా, జవజీవములతో ప్రకటించును. కావున ఆత్మాశ్రయ కవిత్వమునకు, కవి వ్యక్తిత్వమునకు పోలికలుండవచ్చుగాని, అభేద మూహించరాదు. కవిత్వములోని అనుభూతులతో, భావములతో, కల్పనలతో మాత్రము కవికి ఆత్మాశ్రయ కవిత్వమున కభేదాధ్యవసాయము చూడవచ్చును.

సంస్కృత కవిత్వములో – ఋక్కులలో – ఈ ఆత్మాశ్రయ కవిత్వచ్ఛాయ లున్నవి. అలనాటి వైదిక ఋషులు ఉషస్సునుజూచి, పృథ్వినిజూచి, సూర్యచంద్రులనుజూచి విభ్రాంతులై ప్రకటించిన భావములు ఋక్కులలో స్పష్టముగా కనబడును. వరుణదేవునిగూర్చి వేదకవి యిట్లు విన్నవించెను.

> ''యచ్చిద్ధితే విశోయథా ప్రదేవవరుణ వ్రతం మినీమసి ద్యవిద్యవి......
> యత్కించేదం వరుణ దైవ్యేజనేఽభిద్రోహం మనుష్యా శ్చరామసి...
> ......మాన స్తస్మాదేనసో దేవ రీరిషః''.[2]
>
> ఈ ఋక్కుల తాత్పర్యమిది :
>
> ''ఓ వరుణదేవా ! అనుదినము మేము సామాన్య మానవులవలె
> నీ వ్రతములో ఏ లోపము చేయుచున్నామో.........
> దేవతలయెడ మేము ఏ ద్రోహ మాచరించుచున్నామో......
> ......ఆ పాపమును మనసున నిడికొని మమ్ము హింసించకుము''.

1. 'నవ్యకవిత్వసమీక్ష : కృష్ణాపత్రిక : 1935 మే 18.
2. ఋగ్వేదము.

అట్లే పాశ్చాత్య లోకములోని Psalms (భక్తిగీతముల) లో ఈ ఛాయలున్నవి. హీబ్రూల Lyrical కవిత్వములో ఈ ధోరణులున్నవి. అయినను ఈ గీతములలో కనిపించు 'నేను' 'మేము' అను పదములవెనుక ఉన్నది వ్యక్తి చైతన్యము కాదు; సంఘచైతన్యము.

"Thus the 'I' and 'me' of the psalms, as modern Scholars tell us, refer, not to David or any other individual singer, but to the community of Israel, with its common tribulations, hopes, contrition, trust."[1]

ఈ విధముగానే మన వైదిక ఋక్కులలో ప్రకటితమైన అభిప్రాయములలో వ్యక్తి చైతన్యముకాక సాంఘిక చైతన్యమే ప్రతిబింబించినది. అనగా ఆ యభిప్రాయములను ఏ యొక్క ఋషికో అంటగట్టుటకు వీలులేదు. పృథ్వీసూక్త మున్నదనగా అది ఋషులందరి హృదయముల నుండి వెలువడిన భావసంపుటి. అట్లుకాక ఆధునిక కాలమున వెలువడిన ఆత్మాశ్రయ కవిత్వములో వ్యక్తిచైతన్యము ప్రధానమని తేలినది.

పాశ్చాత్యులు Subjective poetry ని Lyrical poetry కి పర్యాయముగా స్వీకరించిరి. Song lyric, Reflective lyric, ode, Elegy. Sonnet, Lyrical Ballad, Dramatic Monologue; Dramatic lyric మున్నగు బహుప్రక్రియలను ఆత్మాశ్రయ కవిత్వములో చేర్చిరి. ఈ భేదములన్నియు 'భావకవిత్వ'మను శీర్షిక క్రింద చర్చింపబడును. కావున ప్రస్తుతము వానిని స్పృశించుటలేదు. సంస్కృతాంధ్ర కావ్యములలో – ముక్తక (శతక)ములలో – ఆత్మాశ్రయ రీతులున్నను, అవి ప్రథమ శ్రేణిలో చేర్చబడలేదు. ఆనాడు కవిత్వమనగా కావ్యమే. అనగా కథలేనిది, అంగాంగి సమృద్ధిలేనిది కావ్యమేకాదు. శతకకవు లందువలననే ప్రథమ శ్రేణికవులలో పరిగణింపబడలేదు. నవ్యకవిత్వములో ఆత్మాశ్రయరీతి కగ్రతాంబూలము లభించినది. గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి మున్నగువారు, కొంతవరకు విశ్వనాథ ఆత్మాశ్రయ కవులే.

(iii) వస్తునవ్యత :

మన ప్రాచీనకావ్యములలో ముప్పాతిక మువ్వీసము కథలు ప్రసిద్ధవృత్తములో, మిశ్ర వృత్తములో అయియున్నవి. 'కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము'లని నాటికవు లీసడించిరి. ఏ పింగళి సూరన్నవంటివాడో సాహసించి 'కళాపూర్ణోదయము'వంటి కల్పిత ప్రబంధము వ్రాసినను, దానిలోని కథ నేలపొలిమేరలను స్పృశించినదికాదు. సుగాత్రీశాలీనులవంటి సాంఘిక కథ ఆ కావ్యములోనున్నను దానిలోని పాత్రలు అగ్రవర్ణపరిధినిదాటి క్రిందికి దిగలేదు. నిగమశర్మోపాఖ్యాన మిట్టిదే. రామలింగారెడ్డిగారి వరకు సాంఘికమైన ఇతివృత్తముతో, సామాన్యజనుల జీవితమును చిత్రించిన కావ్యములు వెలువడలేదు. రామాయణములో శబరి, గుహుడు మున్నగు ఆటవికుల ప్రసక్తియున్నను దాని ప్రయోజనము పరిమితము; భక్తిపర్యవసన్నము. రఘువంశ

1. An Introduction To the study of literature: W. H. Hudson: P.

ములో 'హైయంగవీనమాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్' అనుపాదములో గొల్లవాండ్ర ప్రసక్తి ఉన్నంతమాత్రమున సరిపోదు. అట్లే మాఘుడు తనకావ్యములో గ్రామీణస్త్రీలను, గోపవనితలను ప్రకరణవశమున వర్ణించినంతమాత్రమున చాలదు. మన ప్రాచీన కావ్యములలోని పాత్రలు ప్రాయికముగా దివ్యములు, దివ్యాదివ్యములే. ఏ కొన్ని అదివ్య (మానవ) పాత్రలున్నను అవి అగ్రవర్ణములకు చెందినవే. బసవపురాణాదులలో మడివాలు మాచయ్యవంటి శూద్రపాత్రలున్నను అవి భక్తిప్రయోజనముగలవి. నవ్యకవిత్వములో క్రింది వర్ణములకు చెందిన పాత్రలు నాయికానాయకులగుట గొప్పమార్పు. యెంకిపాటలు, వనకుమారి, లవణరాజు కల మున్నగువానిలో సామాన్యజనుల జీవితములే చిత్రింపబడినవి.[1] జానపదగేయములలో సామాన్యజనులు నాయికానాయకులుగానున్నను వానికి కావ్యగౌరవమబ్బలేదు కావున వాని ప్రసక్తియేలేదు.[2]

ఇక ప్రాచీనకావ్యములలోని నాయకులు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితులను స్పష్టమైన విభజన కలవారు. ఈ నాలుగు తెగలకు వర్ణములతో సంబంధము కూర్చబడినది. శూద్రులు తప్ప మిగిలినవారికి ఈ నాయకులగుట కర్హత యేర్పడినది. నవ్యకవిత్వములో ఈ పృథక్త్వము తొలగిపోయినది. కావ్యనాయకులకు నాయికలకు గుణముమాత్రమే ప్రధానమని, వర్ణప్రసక్తికాదని నవ్యకవిత్వము తేల్చివేసినది. జాషువాగారి 'గబ్బిలము'లోని బక్క చిక్కిన అస్పృశ్యుడు మేఘసందేశములోని యక్షునిస్థాన మాక్రమించినాడు. గబ్బిలమేమో ఉత్తమవంశ సంజాతమైన పుష్కలావర్తక మేఘము స్థానమాక్రమించినది. కావున నవ్యకవిత్వములో కలిగిన యీ మార్పు (వస్తువిషయికముగా) విప్లవాత్మకమైనదిగా భావించవలసియున్నది. కాపువారు, పడవనడుపువారు, గొల్లవారు, అస్పృశ్యులు కావ్యపాత్రలగుట - వారి బ్రతుకుతెరువులకు కావ్య గౌరవము కల్గుట - ఇంతకుమించిన వస్తునవ్యత మరేమున్నది.

ఆంధ్రసాహిత్యమున - ప్రధానముగా ప్రబంధకాలములో - 'స్త్రీ' సమస్తవర్ణనలకు కేంద్ర స్థానమైనది. అప్పకవిచెప్పిన 22 వర్ణనలలో 'కన్యాంగ సౌందర్య కథనము' ఒకటి. అందువలన కవులందరు స్త్రీలను నఖశిఖాపర్యంతము వర్ణించుటలో పోటీపడిరి. కన్యాంగములలో వక్షోజవర్ణన చేయని కవి లేడనవచ్చును. అతివ నడుమును వర్ణించుటలో 'అతనికంటె ఘనుడు ఆచంట మల్లన' అనుధోరణిలో నడచిరి. ఒకరు 'హరిమధ్య'యనగా, ఇంకొకరు 'తనుమధ్య'యనిరి. ఇంకొకరు 'పిడికిటనొదిగెడునడు'మనిరి. మరియొకరు 'అణుమధ్య'యనిరి. ఇంకొకరు 'అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదర'మనిరి. మరియొకరు 'నడుమే పసలేదుగాని నారీమణికిన్' అనగా ఇంకొకరు 'శూన్యమధ్య'యని 'ఖచ్చితము'గా తేల్చివైచిరి. ఈ విధముగా అంగవర్ణనకు సంబంధించిన ఘట్టములలో మన ప్రాచీనకవులు తమ ధీశక్తిని హెచ్చుగా వెచ్చపెట్టిరి.

---

1. 'లవణరాజుకల'లో నాయిక మాలెత.
2. 'యెంకి పాటల'లో కనిపించు మధురగంభీరభావన, తాత్త్విక దృక్పథము, వానిని జానపద గేయములనుండి వేరుచేసిన గొప్పగుణములు.

నవ్యకవితలో అంగవర్ణన ఇంచుమించుగా పరిత్యక్తమైనది. భావప్రకటన సాధనములు కాబట్టి ముఖనేత్రాదులను కొందరు వర్ణించిరి. వక్షోజ జఘనాదుల వర్ణనపూర్తిగా విసర్జించిరి. అంగ వర్ణనకన్న అంతరంగవర్ణనకే నవ్యులు ప్రాధాన్యమునిచ్చిరి. అనుభూతి గాఢత్వమును ప్రకటించుటకే తమ ఆలోచనాశక్తి నెక్కువగా ఉపయోగించిరి.

(iv) భావ నవ్యత :

కవిత్వమునకు కావలసిన వస్తుభావరచనలు మూడింటిలో భావ మగ్రేసరమైనది. తెలుగులో పురాణకావ్యములు వస్తుప్రధానములు. ఇతివృత్తకథనమే వాని ముఖ్యోద్దేశము. ప్రబంధములు కథను 'చిలకొయ్య'కు తగిలించి వర్ణనలవెంట మరులుగొన్నవి. కథాప్రాధాన్యము లేనప్పుడు కనీసము భావనాబలము నుపయోగించిన బాగుండును. అట్లుకాక మేధాగతకల్పనల (Intellectual Images) తో, ఊహల ఉద్దీనముతో, రీతిప్రాధాన్యముతో ప్రబంధములు నిసర్గభావము లకు చోటులేకుండ చేసికొన్నవి.[1] పురవర్ణనయన్నది ప్రబంధములలో ప్రధానమైనది. ఆ వర్ణన సౌధవర్ణనతో ప్రారంభమగును. సౌధములు అంబరచుంబులనుట కవిసమయమైనది. ఇంతటితో తీరలేదు. సౌధములు నక్షత్రసూర్య చంద్రలోకములను గ్రుమ్మి వేయునంత యెత్తుపెరిగినవి. కృత్రిమమైన ఊహాశక్తి యీ వర్ణనలలో ఏ విధముగా పెచ్చుపెరిగినచో ఆముక్తమాల్యదలోని సౌధవర్ణన నెత్తిచూపుదును.

'సోరణగండ్లరాఁ గొదమచుక్కలు పట్ట సతుల్కవాటము
ల్చేరుప మౌక్తికంబులని చిల్లులువుత్తురు దమ్మటంచుఁ బొ
ల్పారు వితానహారములయం దొగి హారతవ్రేలి ప్రొద్దువోఁ
గా రతిడస్సి గాడ్పులకుఁగాఁ దెఱవన్దను విచ్చి మేడలన్.''

(మధురాపురమున మేడలు నక్షత్రముల నతిక్రమించి యుండుటవలన పిల్లనక్షత్రము లామేడలు తమకడ్డముకాగా గవాక్షములనుండి మేడలలోనికి చొరబడినవి. వానిని పట్టుకొనుట కామేడలలోని సతులు తలుపులుమూసిరి. తమ్ము ముత్యములనుకొని ఎక్కడ చిల్లులువొడుతురోయని భయపడి చుక్కలు మేలికట్లలో వ్రేలాడు దండలలో దండలుగా వ్రేలాడినవి. ఈ విధముగా వారి కన్నుగప్పి, ఆ సతీమణులు రతిక్రీడలచే అలసి చల్లగాలికి తలుపులు తెరచినప్పుడు, ఆ చుక్కలు హారములనుండి విడివడి బయటికి పరుగెత్తికొని పోవును.)

ఈ వర్ణన ప్రధానప్రయోజనము సౌధములు నక్షత్రమండలము నతిక్రమించునంత ఎత్తైనవని తెల్పుటయే. తన్నిమిత్తమే ఇంతటి అత్యుక్తి కల్పింపబడినది. చుక్కలు నేలమీదినుండి మనకు ముత్యములవలె కన్పింపవచ్చును. నక్షత్రమండలమునకేగి సమీపమునుండి చూసిన

1. ఈ వాక్య మన్నిప్రబంధములకు వర్తించదు, పారిజాతాపహరణములో సత్యభామ అలుక, మను చరిత్రలో వరూధినీ ప్రవరులఘట్టము అద్భుత భావనాబలమునకు నిదర్శనములు.

అంతే కనిపించునా ? ఈ జిజ్ఞాస కీ వర్ణనలో సమాధానముండదు. ఎందుకు ? ఇది భావనాబలమును త్రోసిరాజని, కేవలము ఊహాశక్తినాశ్రయించినది కాబట్టి - హృదయమును విస్మరించి మెదడుకు పనికల్పించినది కాబట్టి. ప్రబంధములలోని పలువర్ణన లీవిధముగానే కృత్రిమత్వమును సంతరించుకొన్నవి

హృదయమును ద్రవీభవింపజేయు కరుణరసఘట్టములలోగూడ ప్రబంధకవులు భావనాశక్తిని మన్నించలేదు. ముఖ్యముగా ప్రబంధనాయికల విలాపరీతు లాధునికులకు నవ్వు తెప్పించును. మనుచరిత్రలో వరూధిని 'కలస్వనంబు'తో ఏడ్చెనన్న కొంత అర్థమున్నది. ఆ పాత్ర మన స్తత్త్వమును, తత్చిత్రణమునుబట్టి పారిజాతాపహరణములో సత్యభామ 'బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠవధూ కలకాకలీధ్వనిన్' విలపించినది. మరి వసుచరిత్రలో గిరిక 'కాంభోజీరాగ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్' ఏడ్చినది. ఈ మూడు విలాపరీతులను తెనాలిరామకృష్ణు డిట్లు చమత్కరించెనట. 'అల్లసానివా డల్లనల్లన ఏడ్చెను; ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా నేడ్చెను; భట్టుమూర్తి బావురుమని యేడ్చెను.' కొంటెగా అన్న మాటలైనను వీనిలో సత్యము లేకపోలేదు. ఈ విలాపవర్ణనములు చదివినప్పుడు మన కన్నులలో చెమ్మకలుగదు సరికదా, పెదవులపై నవ్వువచ్చును. పాత్రతో సానుభూతి కలిగించ వలసిన ఘట్టములలో మన ప్రబంధకవు లీరకమైన వర్ణనలుచేసి తమధీశక్తిని ప్రదర్శించుకొనిరి. ఈ మాటలు ప్రబంధములమీద నిరసనభావముతో వ్రాయుచున్నవి కావు. వారు నిసర్గమధురముగా హృదయతంత్రీస్పందకముగా భావింపవలసినచోట ఎంత కృత్రిమమైన కసరత్తులు చేసిరో విశదీకరించుటకు మాత్రమే. ఇందుకు ప్రబంధములలోనే అపవాదములున్నవని మొదటనే మనవిచేసికొన్నాను.

నవ్యకవిత్వమున వస్తుభావరచనలలో భావమునకే అగ్రతాంబూలము కలిగినది.[1] నవ్యకవు లూహలతో ఇంద్రజాలముచేయక భావనాబలము నెక్కువ ప్రదర్శించిరి. అష్టాదశ వర్ణనల నిర్బంధమునకు తిలోదకము లర్పించిరి. ప్రాచీనకావ్యములనుండి యెరువుతెచ్చుకొన్న కవిసమయములను కాసంత సేపు ప్రక్కకుపెట్టిరి అవసరమనితోచినప్పుడు ఔచిత్యభంగము లేనప్పుడు సరిక్రొత్త కవిసమయములను ప్రయోగించుకొనిరి[2] విన్నదానికన్న కన్నదానినే వర్ణ్యమొనర్చుకొనిరి. ఊహించిన విషయముకంటె భావించిన అనుభవించిన విషయమునే కవితామయ మొనర్చిరి. కొదమతెమ్మెరను వర్ణించినను 'కొండవీటి పొగమబ్బుల'ను వర్ణించినను తమ భావనాచక్షువులతో దర్శించియే చేసిరి. విన్న వియద్గంగలకు బదులుగా, కన్నులారగన్న 'కిన్నెరసాను'లను కమనీయ భావనాబలముతో వర్ణించి కవితాసతికి క్రమభూషలు కై సేసిరి.[3]

1. ఈ విషయము 'భావకవిత్వము'అను శీర్షిక క్రింద విపులముగా చర్చింపబడును.
2. 'దానిమ్మపూవంటి తరుణికెమ్మోవి' (రాయప్రోలు.) : ఇది అపూర్వ ప్రయోగము.
3. ఈ విషయము భావకవిత్వమునుగూర్చి వ్రాసినప్పుడు వివరముగా చర్చింపబడును.

### (v) శైలీనవ్యత :

ప్రబంధ కవిత్వావసానదశలో గర్భబంధ కవిత్వములు మితిమీరిపోయినవి. దీర్ఘసమాసములకు, మారుమూలపదముల కగ్రేసరత్వ మేర్పడినది. తత్సమ పదములకు తాంబూలము చేకూరినది. శ్లేషకావ్యములు (ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యములు) బయలుదేరినవి. అచ్చమైన తెలుగుపలు కడుగువట్టినది. యక్షగానయుగములో తెలుగు పలుకుబడికి 'గిరాకి' పెరిగినను, ఆ కాలమున అసలైనకవితాత్మ వెలవెల వోయినది. 'ప్రతి పద్యములోన చమత్కృతి' చూపిన చేమకూర వెంకన్న తెలుగుపలుకునకు జీవముపోసినను, అతని యమకశ్లేషల బిగింపులతో దాని కూపిరాడకుండ పోయినది. ఈ విధముగా పదాడంబరము రాజ్యము చేయుచున్న తెలుగు కవిత్వములో నవ్యకవిత్వము భావమునకు పట్టాభిషేకము జరిపినది. అనగా అనవసరమైన పదముల పటాటోపమును తగ్గించినది. పద్యములలో పద్యములుగూర్చు పద్ధతి నిది నిరసించినది.[1] జటిలసమాసములను, సాంస్కృతిక పదబంధములను తగ్గించినది. కోశములను మాత్రమే ఆశ్రయించుకొని గుర్రువెట్టుచున్న పదముల నట్లే యుండనిచ్చినది. (ఇట్టి శబ్దములను కొంద రాధునికకవులు కేవల సంప్రదాయధోరణికి చెందిన కావ్యములలోనే ప్రయోగించిరి. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్ష ప్రభృతులిందు కుదాహరణ యోగ్యములు.) చెప్పెడిదేదో నలుగురి కర్థముకావలెనన్న అభిప్రాయమును వ్యాపింపజేసినది. ఒక్క విశ్వనాథవారి కొన్ని కావ్యములలోని శైలితప్ప మిగిలిన ప్రముఖకవులగు రాయప్రోలు, గురజాడ, కృష్ణశాస్త్రి, నాయని, బసవరాజు మున్నగు కవుల రచనలన్నియు వైదర్భీరీతిలో, సంస్కృతాంధ్ర సరళపదముల సముచిత సమ్మేళనముతో అధికజనుల కర్థమగు ధోరణిలో రచింపబడినవి.[2] వీనిలో మారుమూలపదములు మచ్చునకైన లభించవు. శైలీసారళ్యము నవ్యకవిత్వ లక్షణములలో గణనీయమైనది.[3]

### (vi) పదప్రయోగము :

నవ్యకవులు క్రొత్తపదములను ప్రయోగించిరనగా వానిని సృష్టించినారని అర్థముకాదు. పతంజలి మహాభాష్యములో ప్రవచించినట్లుగా, కుమ్మరివాడు కుండలు చేయునట్లు, వైయాకరణులుగాని కవులుగాని క్రొత్తశబ్దములను పుట్టించరు. శబ్దార్థముల సంబంధ మనాది. అది 'వృద్ధపరంపరామూలము'న వ్యవహృతమగుచుండును. ఐనచో నవ్యకవులు చూపిన పద ప్రయోగ నవ్యత యేమి ?

**ఒకటి :** వ్యవహార భ్రష్టములైన పలుపదములను విసర్జించుట. ఉ. కంపు. ఈ శబ్దమునకు పరిమళమను అర్థమున్నది. తిక్కన, నన్నెచోడుడు 'పువ్వులకంపు'అని ప్రయోగించినారు.

1. ఈ నిరసన వీరేశలింగంగారి 'సరస్వతీ నారదవిలాపము'తోనే బయలుదేరినది.
2. విశ్వనాథవారి 'కిన్నెరసాని పాటలు' వారి కావ్యములన్నిటిలో సరళమధుర రచన. వారికృతులలో సమాస జాటిల్యములేని రచనయిది.
3. ఈ చర్చ కేవలము వస్తుప్రధానములైన పురాణములకు వర్తించదు.)

ఇట్టి శబ్దములు పూర్వార్థమునుండి విడివడి వేరే దురర్థము నిచ్చుచున్నవి. ఇట్టివానిని నవ్యకవులు బొత్తిగా వదలివేసిరి.[1]

**రెండవది :** ప్రాచీనులు పాదపూరణమునకై వాడిన శబ్దములను తిరస్కరించుట. మానుగ, కొనకొని, ఒనరన్, అలరగ, ధర, ధారుణిమున్నగు వ్యర్థపదములను (ప్రకరణమునుబట్టి) వీరు ప్రయోగించుట మానిరి. అక్కిరాజు ఉమాకాంతపండితులు తమ 'నేటికాలపు తెలుగుకవిత్వము' అను గ్రంథములో ఇట్టి పాదపూరణ పదములను వింగడించి, దండగ్గణం, గుంపుగణం, ప్రకాశ గణం మున్నగు పేర్లుంచినారు. నవ్యకవిత్వములో గుంపుగణమునకు చెందిన అళి, ఆవళి, చయము మున్నగు వ్యర్థపదములున్నవని వీరు విమర్శించిరి. ఇందులో కొంత సత్యమున్నది. అయినను మిగిలిన వ్యర్థపదములను మాత్రము నవ్యకవులు పరిత్యజించుట ప్రశంసావహము.

**మూడవది :** సమకాలిక సమాజములో చలామణిలోనున్న పదములకు వీరు పట్టముగట్టి గొప్పనవ్యతను చూపెట్టిరి. ప్రాచీనశతకములలో 'అంతా, చేసే'మున్నగు వ్యావహారిక ప్రయోగములు క్వచిత్తుగా కనిపించును. ఇరువదవశతాబ్ది ప్రారంభమువరకు అప్పకవీయధాటిని తట్టుకొన్న కవులులేరు. గిడుగుపిడుగు హుంకృతితో, గురజాడ చూపెట్టిన సరిక్రొత్తజాడతో వ్యవహారమునయున్న పదములకు కావ్యప్రవేశయోగ్యత కలిగినది. గురజాడవారి ముత్యాలసరములలో ఎన్నో శిష్టవ్యావహారిక భాషాపదములు చోటుచేసికొన్నవి. నండూరివారి యెంకిపాటలలో తూర్పు గోదావరి మండలములోని కాపువారి వాడుకభాష రాజ్ఞీత్వము వహించినది. మాటకు, కైతకు సాన్నిహిత్య మేర్పడుటకన్న సాహసప్రయోగ మేమున్నది ? సాధురేఫకు శకటరేఫకు యతి మైత్రి చేసినంత మాత్రమున పుట్టిమునిగిపోయినట్లు మోషించిన తెలుగుభాషలో, 'పాటకజనుల' 'యాస' మాటలకు పట్టముగట్టుటకన్న నవ్యత యేమున్నది ?[2]

(vii) *దేశికవిత :*

భారతీయ సంగీతసాహిత్యములలో మార్గదేశి విభాగము చిరకాలమునుండి సాంప్రదాయికముగా వచ్చుచున్నది. త్యాగరాజకీర్తనలు, క్షేత్రయ్యపదములు, యక్షగానములలోని దరువులు శుద్ధమైన దేశిరచనలు. తెలుగుసాహిత్య ప్రారంభమే మార్గకవితారచనతో అగుటవలన; అనన్య ప్రతిభామాన్యుడైన నన్నయ దానిని సమర్థముగా నిర్వహించుటవలన, అంతకుముందున్న దేశి కవితకు తీరనిదెబ్బ తగిలినది. పాలకురికి సోమన్న పండితారాధ్య చరిత్రములో పేర్కొన్న తుమ్మెద, వెన్నెల, నివాళి, ప్రభాత, శంకర, గొబ్బిపదములు దేశిరచనలు. కవిత్రయమువారి కావ్యరచనదాకతో ఇవి కకావికలై పోయినవి. పాలకురికి మహావేశముతో దేశిరీతి నుద్ధరించుటకు ద్విపదలో రెండు దండికావ్యములు రచించినను, మతప్రాబల్యము వానిని మరుగునబడ

1. మధ్యయుగకవులుగూడ ఈ 'కంపు' శబ్దమును ప్రయోగించినట్టులేదు.
2. పూర్వము 'చంద్రశేఖర శతకము'వంటివానిలో గ్రామ్యభాషా ప్రయోగములున్నను, అవి చమత్కారమాత్ర ప్రయోజనముగల రచనలు. గభీరభావద్యోతనమునకు ప్రాచీనులు వ్యావహారిక భాష ప్రయోగించలేదు.

వేసినది. తరువాతికాలమున అతని బసవపురాణమును వృత్తములలో వ్రాయవలసిన గతిపట్టినది. అతనిమీది అభిమానముతో ఆ సత్కార్యమును నిర్వర్తించిన పిడుపర్తి సోమనాథుడు తప్ప సోమ నాథుని పేరెత్తినవారు లేరు. ఈ విధముగా తంజావూరు యుగముదాక దేశికవిత్వము తెరమరు గుననుండి పోయినది అన్నమయ్య కృతులలో తప్ప. మాత్రాచ్ఛందస్సులోనున్న నవవిధరగడ లీదేశికవిత్వములోనే చేరును. ప్రబంధకవులలో కొందరు పుష్పాపచయ ఘట్టమున, వసంతవర్ణన ఘట్టమున ఈ రగడల నుపయోగించిరి. శ్రీనాథుడు కాశీఖండమున 'మణికర్ణిక'వర్ణనలో ఒక రగడ నుపయోగించెను. సోమనాథుని 'బసవరగడ' సరేసరి. కాని ఇవి రాశికివచ్చినవి కావు. మాత్రాచ్ఛందస్సును ఏదో ఒక వర్ణన కొరకు, మధ్యలో మార్పుకొరకు ఉపయోగించిరేకాని దీనిలో కావ్యరచనకు వీలున్నదని ఆనాటికవులు గుర్తించలేదు. ద్విపదలో సాహసించి కావ్య రచనచేసిన సోమనాథునికి 'దిక్కు మొక్కు' లేకుండపోయినది. అతనిజాడలో రంగనాథ రామాయణాదులు వెలసినను వానికి వృత్తకావ్యముల పంక్తిలో గూర్చుండెడి యోగ్యత కల్గలేదు. పైగా రానురాను 'పద కవితల'నుగూర్చి నిరసన కలుగసాగినది.[1] 'ద్విపదకావ్యంబు ముదిలంజ దిడ్డిగంత'యను ధోరణిలో ఈసడింపులు బయలుదేరినవి. మధుర తంజావూరు యుగమున దేశికవితకు ఆదరము కలిగినను, వాని కవితాగుణమును సంగీతము మ్రింగివేసినది.[2]

ఈ పరిస్థితిలో నవ్యకవిత్వము ప్రారంభమగుటతో దేశకవితకు 'దేవిడీ' లభించినది. గురజాడవారు మాత్రాచ్ఛందస్సులో మహనీయ భావములను వెల్లడించవచ్చునని, దేశికవితలో అన్నిరసము లొప్పింపవచ్చునని దీక్షగా అనేకగేయములు రచించిరి. క్రమముగా రాయప్రోలు, బసవరాజు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నండూరి, తరువాతి కాలమున శ్రీ శ్రీ మున్నగు కవులు దేశికవితలో రసపత్తర కావ్యములు, గేయములు, గీతములు రచించి నవ్యతకు నాందిపల్కిరి.

### (viii) *ప్రక్రియాబాహుళ్యము :*

ప్రక్రియా బాహుళ్యము నవ్యకవితకు ప్రత్యేకలక్షణము. పూర్వము కవులు గణిత శాస్త్రమును,[3] వైద్యశాస్త్రమును[4] పద్యములలోనే రచించిరి. అప్పకవ్యాదు లలంకార లక్షణ శాస్త్రములను పద్యములలోనే వ్రాసిరి. నవ్యులు దీనిని విడనాడిరి. కవితాగుణమున్న విష యములనే పద్యగేయములలో చెప్పిరి. పైగా రామాయణ భారతాది గ్రంథములు కథాఖ్యాన నాటకశాస్త్ర లక్షణము లనేక మల్లుకొన్న రచనలు. ప్రబంధకవులుగూడ తమ బహుముఖశాస్త్ర పాండిత్యమును ప్రదర్శించుటకు విశ్వప్రయత్నము చేసిరి.[5] నవ్యకవు లీవిషయములను వదలి కేవల కవితాగుణమున్నవానినే చేపట్టినను, వీరు సాధించిన వైవిధ్యము విభ్రాంతి జనకము. ఒక్క

1 'ముదివిటులు విధవలంజలు పదకవితలు మారుబాసబాపనవారల్' —చాటువు.

2. కీర్తనలు, పదములు, దరువులు, పాటలు ఇట్టివే. 3. పావులూరి మల్లన్న గణితశాస్త్రము.

4. బసవరాజీయము మున్నగునవి.

5. ఆముక్తమాల్యదలో అనేక శాస్త్రాంశములున్నట్లు విద్వద్విదితమే కదా.

భావకవిత్వమునే తీసికొందము. ఇది విస్తృతార్థము కలదని ఈ వరకే మనవిచేసితిని. ప్రకృతి కవిత్వము, పల్లీజనకవిత్వము (Pastoral Poetry), దేశభక్తి కవిత్వము, సంఘసంస్కరణ కవిత్వము (Reformative poetry), భక్తికవిత్వము (Mystic poetry), కథాకవిత్వము, స్మృతిగీతములు (Elegies), బాలగేయములు మున్నగు అనంత ప్రక్రియలు భావకవిత్వములో వెలసినవి. ఇంతటి ప్రక్రియాబాహుళ్యము ప్రాచీనకవిత్వమున కనిపించదు. అందుకే ఈ విషయమునుగూడ నవ్యకవిత్వ విశిష్ట లక్షణములలో చేర్చితిని.

## నవ్యకవిత్వ యుగకర్త:

ఎవరు తమ రచనలద్వారా వర్తమాన కాలమునకేకాక భవిష్యత్తరములవారికి అభినవోత్తేజము కల్గింతురో, ఎవరు గతానుగతికమై ఘనీభవించిన భావప్రపంచములో ఉద్దామమైన ఉద్దీపనము కలిగింతురో, ఎవరు తమ తరువాతి అనేక కవులకు అనుకరణీయు లౌదురో వారిని సాహిత్యరంగమున యుగకర్త లనవచ్చును. ఈ దృష్టితో పర్యాలోకనము చేసినచో నవ్యసాహిత్యమునకు కందుకూరివారే ప్రప్రథమ యుగకర్తలు. కేవలము కవితారంగములో చూచినచో ఎవరు యుగకర్తలన్నది ప్రస్తుత చర్చనీయాంశము. కట్టమంచివారి 'ముసలమ్మ మరణము'తో తొలి ఉషోరేఖలు ప్రసరించినను, తరువాతి తరము వారి కవిత్వముచేత ఉత్తేజితము కాలేదు కాబట్టి వారిని కవిత్వరంగమునందు యుగకర్తగా పరిగణించుటకు వీలులేదు. విమర్శన రంగమందు మాత్రము వారి కవిత్వ తత్త్వ విచారము నూత్నయుగమునకు నాందిపాడినది. తిరుపతి వెంకటకవులు ప్రాచీనధోరణికి ప్రచారస్థాయి కలిగించిరేకాని, భావవిప్లవమునకు బాసటగా నిల్వలేదు; కవితారంగములో అపూర్వప్రయోగములు చేయలేదు. ఇక మిగిలినవారిర్వురు, ఒకరు గురజాడ అప్పారావుగారు, రెండవవారు రాయప్రోలు సుబ్బారావుగారు. ఈ యిరువురి విషయమున నవ్యసాహిత్య విమర్శకులలో కొందరొకవైపు, ఇంకకొందరింకొకవైపు, మరికొందరిరువురివైపు మొగ్గుచూపినారు. నవ్యకవిత్వ యుగకర్తృత్వ విషయమున కొందరు ప్రముఖుల అభిప్రాయములను పొందుపరచి నా మతమును తర్వాత నివేదింతును.

## 1. యుగకర్త గురజాడ:

గురజాడ యుగకర్తృత్వమును సమర్థించినవారు వీరు.

**1. అంధ్ర శేషగిరిరావుగారు :** 'నవ్యాంధ్రకవిత్వ శుభోదయమునకు గురజాడ అప్పారావు వేగుచుక్క. ప్రబంధవీధుల బందీకృతయైన కవితాసతిని గ్రొత్తతెన్నులకు గొనివచ్చి ఆమెకు స్వేచ్ఛానిశ్వాసము కల్గించిన ప్రజ్ఞానిధి'.[1]

**2. విశ్వనాథ సత్యనారాయణగారు :** 'అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగా రందుకొన్నారు'.[2]

---

1. 'తెనుగుకైతల క్రొత్తతెన్నులు' (వ్యాసము): ఆంధ్రపత్రిక : ఉగాదిసంచిక : 1927 ఏప్రిలు.
2. నవ్యసాహిత్య పరిషత్తు సప్తమ వార్షికాధ్యక్షోపన్యాసము : భారతి : 1940 ఏప్రిలు.

**3. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు :** 'ఈ శతాబ్దపుటారంభముననే గురజాడ అప్పారాయ కవి యవలోకము కనుచున్న కలలు రూపొందజేయుచు ఆధునికకవిత్వపు ధ్వజమును ప్రతిష్ఠించెను. ముత్యాలసరములను గేయసంపుటితో నవ్యకవితకు నాందిపఠించెను'.[1]

**4. నోరి నరసింహశాస్త్రిగారు :** 'అప్పారావుగారి నీలగిరి పాటలు, ముత్యాలసరాలు క్రొత్తపాతల మేలుకలయిక కూర్చిన నవ్యసాహిత్యపు తొలికృతులు'.[2]

**5. శ్రీశ్రీ గారు :** 'మహాకవి గురజాడ అప్పారావు మొట్టమొదటిసారి ముత్యాలసరాలు గుచ్చిన ఏడు (1910 లో). అప్పుడే తెలుగుకవిత్వంలో విప్లవశకం ఆరంభమైనది.'[3]

(ఈ వ్యాసములో శ్రీశ్రీగారు కందుకూరి, తిరుపతి వెంకటకవులు, రాయప్రోలుగార్లను ప్రస్తావించి, వారెవ్వరు యుగకర్తలు కారని; 'సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా' గురజాడవారినే నవ్యకవిత్వమునకు యుగకర్తగా తామూభావించుచున్నట్లు ఉద్ఘాటించినారు.)

## 2. యుగకర్త రాయప్రోలు :

రాయప్రోలు యుగకర్తృత్వమును సమర్థించినవారు వీరు.

**1. తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు :** 'ఆధునిక కవిత్వమునకు 'తృణకంకణము' ఆది గ్రంధమని అస్మదాదుల ఆశయము'.[4]

**2. రమాకాంతాచార్యులుగారు :** ('లలిత' నుద్దేశించి వ్రాసిన మాటలు)

'This poem...I believe is the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the Sacred passions of love under the direct inspiration of the Votaries of English in use, and as such, *Marks a new epoch* in the developmemt of modern Telugu literature..'[5]

**3. కురుగంటి సీతారామయ్యగారు :** 'వీరిద్దరిలో (రాయప్రోలు – గురజాడ) సార స్వతక్షేత్రమును దోహదముచేసి ఫలింపజేసిన వారెవరు ? ఈ విషయము చర్చించవలసినపుడు రాయప్రోలువారేయని చెప్పవలె. కాలమునుబట్టి నిర్ణయించవలసినప్పుడుకూడ అప్పారావుగారి కంటె సుబ్బారావుగారే మార్గదర్శి అని గమనింపగల్గుతాము.'[6]

1. 'ఆధునికాంధ్ర కవిత్వము' (వ్యాసము) : విజ్ఞానసర్వస్వము : 'తెలుగు సంస్కృతి' సంపుటి : పుట 622.
2. నవ్యకవిత్వము ; దాని ఉద్దేశ్యము (వ్యాసము); ప్రతిభ : 1988 జనవరి.
3. 'గురజాడ అధిక్యానికిగల కారణాలు' : (వ్యాసము) ; 'గురజాడ' అను పుస్తకమునుండి.
4. 'తృణకంకణ' రజతోత్సవ సంచికా నీరాజనం.
5. 'లలిత'కు ఆచార్యులుగారు ఇంగ్లీషులో వ్రాసిన పీఠికనుండి.
6. 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు : ద్వి. భాగము : పుట 222.

పై యిరువురితోపాటు వెంకటపార్వతీశ్వర కవులుగూడ నవ్యకవిత్వ యుగకర్తలని టేకుమళ్ళ రాజగోపాలరావుగా రభిప్రాయపడిరి.

"The present age in the Telugu literary world may fitly be called the age of Venkata parvateswara kavulu, for to them the Telugu novel owes its present day perfection, and Telugu poetry is by them made to run into new phases and ways of thought that it had never reached before"[1] పై వాక్యములలో కేవలము నవలారచనవలననేకాక కవిత్వరచనవలనగూడ వెంకట పార్వతీశ్వరులు యుగకర్తలను అభిప్రాయము స్పష్టము.

ఆంధ్ర శేషగిరిరావుగారు తమ 'తెనుగుకైతల క్రొత్తతెన్నులు'అను వ్యాసములో నవ్య కవిత్వమునకు గురజాడను వేగుచుక్కగా పేర్కొన్నను, కొన్ని పంక్తులు గడచిన పిమ్మట ఇట్లు వ్రాసిరి.

"నవ్యాంధ్ర కవితాసతికి గురజాడ అప్పారావు క్రొత్తతెన్నులు రుచిచూపెను. రాయప్రోలు సుబ్బారావు పదశిల్పము నివేదించెను. వెంకటపార్వతీశ్వరులు తేటగీతముల మంజరుల కాన్కనిచ్చిరి......వీరలు నవ్యాంధ్ర కవిత్వమునకు సూత్రధారులు" (పుట : 81)

వెంకట పార్వతీశ్వర కవులుగూడ యుగకర్తలన్నది ఈ వాక్యములవలన స్పష్టమైనది.

వెంకటపార్వతీశ్వరకవులు 20 వ శతాబ్ది ప్రథమదశాబ్దములోనే సాహిత్యసృష్టి చేసినను వారు అప్పటికి కవిత్వరంగములో నూతనత్వమును సాధించలేదు. ఇతర భాషలనుండి అసంఖ్యాకముగా నవలలను గ్రహించి తెలుగులో అనువదించిరి. 1909 నుండి ఖండకావ్యములు ప్రచురించిరి. ఖండకావ్య ప్రచురణము 1904 లోనే ఇతరులు చేసినట్లు ఇంతవరకే సోదాహరణముగా నిరూపించితిని. వీరును ఆ బాటలోనే పయనించిరి.

1913 లో వీరు ప్రచురించిన 'కావ్యగీతము'[2] అన్న కావ్యఖండికలో గణనీయమైన నవ్యత తొంగిచూచినది. తరువాతి కాలములోనే వీరి నవ్యకృతులగు ఏకాంతసేవ, భావసంకీర్తనము, కావ్యకుసుమావళి సంపుటములు వెలువడినవి, 1913 లోపుగానే గురజాడ రాయప్రోలులు కవిత్వములో విప్లవశకము స్థాపించిరి. కావున వెంకటపార్వతీశ్వరకవులు నవ్యకవులలో ప్రథమశ్రేణికి చెందినవారైనను వీరిని యుగకర్తలుగా పేర్కొనుటకు తగిన ఆధారములు లేవు.[3]

ఇక రాయప్రోలు గురజాడలలో ఎవరు యుగకర్తలన్న విషయమున సమన్వయధోరణి కనబరచిన కొందరు ప్రముఖుల అభిప్రాయములను పరిశీలింతును.

1. కావ్యకుసుమావళి : ప్రథమభాగము పీఠికలో ; పుట 1
2. 'ఆంధ్రభారతి' : ఫిబ్రవరి 1913
3. వీరి ప్రభావము తరువాతి కవులపై స్వల్పమనియే చెప్పవలె.

### సమన్వయధోరణి :

1. పి. వి. రాజమన్నారుగారు నవ్యాంధ్ర కవిత్వమునకు మూలపురుషులుగా ఈ యిరువురిని సంభావించిరి. 'అప్పారావుగారు ముత్యాలసరాలతో, నీలగిరిపాటలతో, క్రొత్తదారి త్రొక్కినవారైనను రాయప్రోలువారి కావ్యాలతోనే భావకవిత్వం ప్రారంభమైనదని చెప్పక తప్పదు'[1] అనిరి. ఈ వాక్యములో ఇరువురి యుగకర్తృత్వము నంగీకరించినట్లే స్పష్టమైనది.

2. గిడుగు సీతాపతిగారు తాటస్థ్యవిధాన మవలంబించుచు, వయోరీత్యా సాహిత్యసేవ దృష్ట్యా అప్పారావుగారే పూర్వులని, కవిత్వప్రచురణ దృష్ట్యా తరువాతి కవులపైపడిన దాని ప్రభావము దృష్ట్యా రాయప్రోలే ఆద్యులని అభిప్రాయపడిరి.[2]

3. అభినవ కవిత్వములో రెండుశాఖలకు (మార్గ–దేశి) క్రమముగా రాయప్రోలుగురజాడలు మార్గదర్శకులని డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు సమన్వయధోరణి కనబరిచిరి.[3]

### ఇరువురు యుగకర్తలే :

రచనల నవ్యతనుబట్టి, వాని ప్రచురణకాలమునుబట్టి, తరువాతి కాలమున వాని ప్రభావమునుబట్టి యుగకర్తృత్వము నిర్ణయించవలసి యుండును. ఈ దృష్టితో పరిశీలించినచో ఇరువురి రచనలు నవ్యతానిర్భరములే. వస్తుభావరచనలలో ఇరువురు క్రొత్తబాటలు తీసినవారే. ఇక ప్రచురణ విషయము. ఇది రెండువిధములుగా నుండును. ఒకటి : పత్రికాముఖమున; రెండవది : పుస్తకరూపమున.

1903 లో మంజువాణియను పత్రికలో గురజాడవా రొకసమస్య పద్యరూపమున పూరించినట్లు శ్రీమతి బాణగిరిరాజమ్మగారు పేర్కొని; ఆ పద్యము నుదాహరించినారు.[4] ఇది సమస్యా పూరణమే కావున గణనీయ విషయముకాదు. తరువాత 1909 (శాలి. శ. 1831 మాఘము) ఆంధ్రభారతి సంచికలో గురజాడవారి నీలగిరిపాటలలో నొకటియగు 'పూటిచోద్య మేమిచెపుదు' అన్నది ప్రచురింపబడినది. ఈ సంచికలోనే గ్రంథస్వీకారమను శీర్షికక్రింద

---

1. 'నూరేండ్ల తెలుగుసాహిత్యము' (వ్యాసము) : వాణి : 22-9-1957.
2. History of Telugu literature : part II (Manuscript)
   'నవ్యాంధ్ర సాహిత్యవీథుల'లో తత్కర్తలు పేర్కొన్న గిడుగువారి అభిప్రాయమున కిది భిన్నముగా నున్నది. ఆ గ్రంథములోని వాక్యమిది.
   "ఆధునికాంధ్ర కవిత్వపక్కికి సాంఘిక నాటకరచనకు మార్గము చూపినవారు వాస్తవముగ కీ.శే. గురజాడవెంకట అప్పారావుగారే అని చెప్పవలెను అని గిడుగు వెంకటసీతాపతిగారి వాక్యము."
   —నవ్యాంధ్ర సాహిత్యవీథులు : ద్వితీయభాగము. పుట : 221
3. 'తెలుగుపై ఇంగ్లీషు సాహిత్య ప్రభావము' :
4. పరిశోధన · గురజాడ ప్రత్యేక సంచిక : పుట 75

'నీలగిరిపాటల' పుస్తకసమీక్షయున్నది. ఆసమీక్షలో ఇట్లుకలదు. ''ఈ కీర్తనలయందలి వర్ణనలు స్వాభావికముగను, కవిత్వము బహురసవంతముగా నున్నది.''

ఆంధ్రభారతి 1909 (శాలి. శ. 1831 చైత్రము) సంచికలో రాయప్రోలువారు వ్రాసిన 'కళాకవిత్వములు'అను వ్యాసము, గురజాడవారి 'మీపేరేమిటి ?' అను కథానిక ప్రచురింపబడినది. ఇరువురి రచన లొకేసంచికలో ప్రథమపర్యాయము వచ్చుట విశేషము.

అంధ్రభారతిలో 1910 లోనే గురజాడవారి ముత్యాలసరములు, కాసులు, డామన్ పితియస్ మున్నగునవి ప్రచురింపబడినవి. 1912 లో ఈ పత్రికలోనే రాయప్రోలువారు కోడ రామమూర్తిగారిపై వ్రాసిన 'స్వాగతపంచరత్న' పద్యములు, 'కనకము' ప్రచురింపబడినవి. గురజాడవారి 'కన్యక', రాయప్రోలువారి 'కనకము' ఒకేసంచికలో ప్రచురితమగుట యింకొక విశేషము. ఈ విధముగా పత్రికలలో ప్రచురితమైన రచనలనుబట్టి చూచినచో ఇరువు రొకరి కొకరు తీసిపోరని తెలినది. 1909 లోనే ఆంధ్రకేసరిలో తాము వ్యభిచార వ్యతిరేక పద్యములు ప్రచురించినట్లు రాయప్రోలు వారు నాతో అన్నారు. అయినను ఇవి రాశికివచ్చినవికావు కావున వీనిని పరిశీలించ నవసరము లేదు. 1910 లో ప్రచురితమైన ముత్యాలసరములను తాము చూచినట్లు, వానిచేత ప్రభావితులై తరువాత 'చిల్క'అన్నగేయము రచించినట్లు సుబ్బారావుగారు నాతో అన్నారు. అయినను అంతకుముందే వారి 'లలిత' గ్రంథరూపములో వెలువడిన విషయము గమనింపదగినది. 'ముత్యాల సరములు' (కొన్నిగేయములు) 1910 లో గాని గ్రంథరూపమున రాలేదు. కావున గ్రంథప్రచురణ దృష్ట్యా చూచినచో రాయప్రోలువారే ఆద్యులు. కాని 'లలిత' మౌలికకావ్యము కాదు. గోల్డుస్మిత్ 'Hermit'నకు ప్రతిభామూలకమైన అనుసరణ. ఈ గ్రంథము మొదట ప్రచురించినప్పుడు దేశములో తగిన సంచలనము కలుగలేదు కాని 500 ప్రతులురెండు మాసములలోనే అమ్మకమైనవట. తత్ప్రచురణకర్తలు దానివలన వచ్చిన 70 రూపాయలను సుబ్బారావు గారి కిచ్చినారట.[1] అయినను 'లలిత' గ్రంథసమీక్షల కెక్కినట్లు మాత్రము ప్రమాణములులేవు. అనగా ప్రథమముద్రణ ప్రతులు రెండుమాసములలో చెల్లిపోయినను, ఆనాటి సారస్వతేయుల దృష్టిని అది అంతగా ఆకర్షించలేదనవచ్చును. రాయప్రోలువారి 'తృణకంకణము' (1913 లో ప్రచురణ) సాహిత్యలోకమును సంచలింపజేసిన ప్రథమ నవ్యకావ్యము. ఇక గురజాడవారి' 'ముత్యాల సరములు' పత్రికలో ప్రచురించినప్పుడే ఒకరిద్దరి విమర్శలకు గురియైనవి.[2] అంతమాత్రముననే అవి దేశములోని యువకులలో మహోత్తేజము కలిగించలేదు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారన్నట్లుగా గురజాడఅప్పారావుగారు 1915 లో చనిపోయినను, 1915 తరువాతనే జీవించసాగిరి.[3] 1914-16 ల మధ్యకాలములో నండూరి, కృష్ణశాస్త్రి, బసవరాజు, వేదుల, చింతా దీక్షితులు మొదలైనఆనాటియువకవులు, రాయప్రోలు గురజాడల పద్యములను వెర్రిఆవేశముతో

1. అభినవసాహితి ; పాదులు ; పాలన ; (వ్యాసము) రాయప్రోలు : ఆంధ్రప్రభదినపత్రిక
2. 'ముత్యాలసరాల లక్షణము' (వ్యాసము); వ్యాసచంద్రిక : గురజాడ
3, 4. 'పాతికసంవత్సరాల తెలుగు కవిత్వము' ; భారతి 1949 జనవరి

చదివెడివారట.[4] 1909-10 ప్రాంతములో రాయప్రోలు గురజాడలు నూత్నకవితా ప్రస్థానము ప్రారంభించినను, వారి ప్రతిభ 1913-16 ల మధ్యనే సాహితీజగత్తునకు జాజ్వల్యమానముగా కనిపించినదని స్పష్టము. తరువాతి కాలమున రాయప్రోలువారి రచనలతో ప్రభావితులైనవారిలో కృష్ణశాస్త్రి, వేదుల, అబ్బూరి గణనీయులు. గురజాడవారి ప్రభావముద్ర గలవారిలో బసవరాజు అప్పారావు నండూరి సుబ్బారావు. చింతాదీక్షితులు (భావకవులలో) చెప్పుకొనదగినవారు.

కావున రచనలోని నవ్యత, గ్రంథప్రచురణ, తరువాతి కవులపై వాని ప్రభావము అను మూడంశములనుబట్టి పరిశీలించగా నవ్యకవిత్వ మహోదయమునకు గురజాడ రాయప్రోలులు ఏకకాలమున అరుణోదయతపనోదయముల వంటివారని తేలుచున్నది. డా. వీరభద్రరావుగారు సూచించినట్లుగా ఈ యిరువురి మార్గదేశి కవిత్వములకు భావకవిత్వయుగమున అనుయాయులు ఏర్పడినారు. అభ్యుదయ కవిత్వయుగములో మాత్రము శ్రీశ్రీ అవతరణతో గురజాడ ఆధిక్య మొకింత పెరిగినది. ఇంగ్లీషుభాషలో కాల్పనికోద్యమము (Romanticism) నకు ఎవరాచార్యు లను ప్రశ్న వచ్చినప్పుడు తటుక్కున మెరసెడు వారిద్దరు. ఒకరు వర్డ్సువర్తు, రెండవవారు కాలరిడ్జి. వీరి Lyrical Ballads అను గేయసంపుటి ఇంగ్లీషు సారస్వతములో కాల్పనికోద్య మమునకు క్రొత్తదారులు తీసినది.[1] అట్లే రాయప్రోలు గురజాడల కావ్యములు నవ్యకవిత్వ యుగమునకు నాందీపలికినవి. అందుకే ఇరువురిని యుగకర్తలుగా భావించి కైమోడ్పులు ఘటించుట యుక్తము.

రాయప్రోలు గురజాడలపై ఇంగ్లీషు Romanticisim ప్రభావము కొంత ఉన్నది. తరువాతి భావకవులపై ఈ ప్రభావము కంఠదఘ్నముగా ప్రసరించినది. గురజాడవారికి వర్డ్సు వర్తు అభిమానకవి. అతడు సామాన్యప్రజల జీవితములను కావ్యవస్తువులుగా జేసికొనుటతో ముగ్ధులై గురజాడవారు ఆ పద్ధతి నవలంబించి రచనలుచేసినారు. ఇక రాయప్రోలువారి ప్రణయ కవిత్వమునకు, కథనకవిత్వమునకు, ప్రకృతి కవిత్వమునకు ఇంగ్లీషు రొమాంటికు కవులే పథ దర్శకులు. ఈ యిర్వురు యుగకర్తలపై రొమాంటిసిజము ప్రభావముండుటవలన మొదట ఇంగ్లీషు సాహిత్యములో జరిగిన తత్ప్రాదుర్భావ వికాసములను వివరించుట సముచితమని భావించుచున్నాను.

## ఆంగ్లకవిత్వములో 'కాల్పనికోద్యమము' :
### (Romanticism In English Poetry)

డ్రైడన్ (1660-1700) యుగమునుండియే ఇంగ్లీషుకవిత్వము ఉడ్డీనముమాని భూయా నము సాగించినది. 'బుద్ధి' గద్దెనెక్కినది. భావన అడుగుపట్టినది. వచనము చేసెడుపని కవి త్వము చేయసాగినది. స్పెన్సరు సృష్టించిన కల్పనాలోకము, మిల్టను రూపుదిద్దిన స్వర్గనర కములు మరుగువడినవి. క్రమముగా పోపుయుగము (1700 - 1745) నాటికి ఈ ధోరణి

1. వీరికిముందే బ్లేకు మున్నగుకవులలో కాల్పనిక కవిత్వచ్ఛాయలున్నను వీరే యుగకర్తలైనారు.

మరింత బలపడినది. ఈ యుగమును Classical Age అనియు Augustan Age (ఐతిహాసిక యుగము) అనియు అందురు. అయినను అలెగ్జాండరు పోపు నాయకత్వమున ప్రచలితమైనది 'నూతన - ఐతిహాసికయుగ'మని చెప్పదగును. Classical Age అనగా రోముదేశములో ఉత్తమ కవిత్వము ఉద్భవించిన యుగము. పోపు మున్నగువారు ఆ కవితారీతికి కృతకానుకరణమును మాత్రమే చేసిరి. ఐనను ఈ యుగము Classical Age అను పేరనే వ్యవహృతమైనందున ఆ పదమునే స్వీకరించితిని. ఈ యుగమును Classical Age అనుటకు రెండు కారణములున్నవి. ఒకటి : ఈ కాలపురచయితలు 'ల్యాటిను' భాషారచయితలను ప్రమాణముగా తలచుట. రెండవది : ల్యాటిను రచయితలవలెనే యీ కాలపువారు వ్యక్తిగతమైన ప్రతిభావ్యుత్పత్తులకు మౌలికమైన ఊహలకు ప్రాధాన్యమీయక గతకాలపు విలువలే గ్రుడ్డిగా స్వీకరించుట. 1706 లో వాల్ష్ (walsh) అను రచయిత పోపునకు వ్రాసిన ఒక లేఖలో ఇట్లు అభిప్రాయపడెను.

'The best of the modern poets in all Languages are those that have nearest copied the ancients'.[1] ఐతిహాసిక యుగమునకు నాయకుడైన అలెగ్జాండరుపోపు సైతము తన 'Essay on criticism'లో ఈ అభిప్రాయమునే వెల్లడించెను.

ఇక ఈ యుగమును Augustan Age అనుటకు కారణమిది : — ల్యాటిన్ సాహిత్యములో ఆగస్టన్ యుగము స్వర్ణయుగముగా పరిగణింపబడినది. ఇంగ్లీషు సాహిత్యములో ఈ యుగము అట్టిదని నాటివా రభిప్రాయపడిరి. అందువలననే దీనికి Augustan Age అనుపేరు వచ్చినది. వ్యవహారమునుబట్టి ఈ పేరున్నను స్వరూపస్వభావముల దృష్ట్యా దీనిని Classical Age (ఐతిహాసిక యుగము) అనుటయే సముచితము.

**ఐతిహాసిక యుగలక్షణములు :**

1. ఈ యుగమునకు చెందిన కవిత్వము కేవలము ధిషణాజనితమైనది. ఈ కవిత్వమున బుద్ధికి హేతుదృష్టికి ఉన్న ప్రాధాన్యము, ఆవేశమునకు భావమునకు లేదు. ఆవేశ ప్రధానమైన రచన నీ మార్గానుయాయులు గర్హించెడివారు.

2. ఈ కవిత్వము సాధారణముగా అధిక్షేపాత్మకము; ఉపదేశగర్భితము. సమకాలిక రాజకీయములపై, వివిధవ్యక్తులపై విసుర్లు, విమర్శలు, తర్జనభర్జన లీకవిత్వమున కనిపించును.

3. ఈ కవిత్వము కాల్పనికావేశమును, మతాభినివేశమును నిరసించినది. ఆదర్శవాదము నుదాసీనముగా చూచినది.

4. ఇది ప్రధానముగా నగరకవిత్వము (Town poetry). ఈ కవుల దృష్టిలో జానపద జీవితము వర్ణ్యముకాదు. వీరు క్వాచిత్కముగా ప్రకృతివర్ణనలు చేసినను, అవి ఐతిహాసిక కావ్యములనుండి యెరువు తెచ్చుకొన్నవేకాని 'స్వానుభవ భాష్యములు' కావు.

1. An Outline History of English Literature : Hudson : P. 135.

5. ప్రకృతియనునది ఈ కవులదృష్టిలో విపరీతమైన అర్థము కలిగియుండెడిది. వీరు గూడ 'Follow nature' అను నినాదమిచ్చిరి. కాని వీరిదృష్టిలో ప్రకృతిచిత్రణమనగా నిత్య జీవితము నున్నదియున్నట్లనుకరించుటయే. అద్భుతావహములైన విషయములను, ఆవేశ గుంఫితములైన సన్నివేశములను నిరసించు రీతియే నిజమైన ప్రకృత్యనుసరణమని వీరుభావించిరి. నాగరకసమాజమును 'మక్కికిమక్కి'గా ప్రతిబింబించుట తప్ప, విరులను, తరులను, ధరాధరములను, ధారాధరములను, ఋతుపరివర్తనమును వర్ణించుట 'ప్రకృతి' కవిత్వలక్షణము కాదని వీరి అభిప్రాయము, జోసఫ్‌వార్టన్ (Josepeh warton) అనుకవి వ్రాసిన Enthusiast అనురచన ఆత్మాశ్రయరీతిలో, ఆవేశాత్మకముగా రచింపబడినందుకు అది ప్రకృతికవిత్వములో చేరదనియు, లేడీమేరీ (Lady Mary) అను కవయిత్రి వ్రాసిన టౌన్ ఎక్లోగ్స్ (Town Eclogues) అనురచన నాగరకసమాజమును యథాతథముగా చిత్రించుటవలన, ఇది ఉత్తమశ్రేణికి చెందిన ప్రకృతి కవిత్వమనియు వీరభిప్రాయపడిరి.

6. ఈ కవిత్వమున సహజరామణీయకత కరువైనది. రీతికి స్థానము బలపడినది. కృత్రిమమైన జిలుగులు, సమయాసమయములులేని అలంకార బలాత్కారములు పెచ్చుపెరిగినవి. నిసర్గ సుందరముగా చెప్పవలసినచోట 'వొంకతిరుగుడు' వ్యవహారము తయారైనది. 'God rest his soul' అనవలసివచ్చినప్పుడు 'Eternal blessings on his shade attend' అనుట జరిగినది. అనగా శబ్దవ్యామోహము (Phraseology) ముదిరినది.

7. ఈ కవిత్వమున Closed couplet (ద్విపదవంటిరచన) మాత్రమే గద్దెనెక్కినది. బలవత్తర భావప్రకటన కిది సమర్థముకాకున్నను ఈ కవులు దీనినే వాడజొచ్చిరి. క్రమముగా ఇది విసుగుపుట్టించునట్లు పరిణమించినది.

ఇవి ఐతిహాసిక కవిత్వము ప్రధానలక్షణములు. పోపు మున్నగు ఐతిహాసికకవుల ప్రోద్బలముతో ఈ కాలపు కవిత్వము శోభావిహీనమై పోయినది. ప్రతిభకు బదులుగా పాండిత్యము, పేశలచమత్కారము, కవిత్వమునకు గీటురాళ్లైనవి. ఈ పరిస్థితిలో తలయెత్తి విజృంభించినదే కాల్పనికోద్యమము.

### కాల్పనికోద్యమము : తత్ప్రభావము :

కాల్పనికోద్యమ మింగ్లండులో వ్యాపించకపూర్వము ఫ్రాన్సులో, జర్మనీలో విజృంభించినది. ఈ ఉద్యమస్థాపకుడు వ్యాపకుడు రూసోయని చెప్పవచ్చును. ఇతడు పాశ్చాత్యులచేత 'కాల్పనికోద్యమపిత'గా పరిగణింపబడినాడు. ఇతడు ప్రతిపాదించిన Revolutionary Naturalism (స్వాభావికతా పునరుద్ధరణవాదము), మానవతావాదము (Humanism) పాశ్చాత్య లోకమును దిగ్భ్రాంత మొనర్చినవి. ఇతని Social contract అను గ్రంథము మానవులెల్లరు సమానులేయను సిద్ధాంతము నుద్బోధించినది. ఇతని న్యూహెలాయిస్ (New Heloise) ప్రణయ తత్త్వము నుద్దీపింపజేసినది. సి. హెచ్. హెర్ఫర్డ్ (Herford) అను

విమర్శకుడు రూసో సిద్ధాంతమును 'The worth and dignity of man as man, and the power of natural scenery to respond to his needs' అని క్లుప్తీకరించెను.[1]

ఇంగ్లీషులోని కాల్పనికోద్యమముపై రూసోమానవతావాదము బలమైన ముద్రవేసినది. బ్లేకు, వర్డ్సువర్తు, కాలరిడ్జి మున్నగువారు బాల్యము నాదర్శప్రాయముగా చిత్రించుటలో రూసో ప్రభావమే పనిచేసినది. భావోద్రేకముతో స్వాతంత్ర్యేచ్ఛతో ఉత్తేజితులైన షెల్లీకృతులలోని నాయికానాయకుల చిత్రణలో, రూసోప్రభావము చెరుగని ముద్ర వేసినది. కాల్పనిక కవులు ప్రకృతిపురుషుల అవినాభావసంబంధము నతిరమ్యముగా వర్ణించుటకు రూసోసిద్ధాంతములే అంత స్స్రోతములుగా పనిచేసినవని చెప్పవచ్చును. రూసో కాల్పనికోద్యమమునకు మూలపురుషుడైనను, ఈ ఉద్యమమునకు జర్మనీలోనే సమధిక ప్రచారము కలిగినది. జర్మను తాత్త్వికులైన కాంట్ (Kant), ఫిక్టే (Fichte) మున్నగువా రీయుద్యమముయొక్క తత్త్వ నిరూపణమునకై ప్రయత్నించిరి. వీరికి సైదోడుగా షెల్లింగు అను తత్త్వవేత్త, నొవాలిస్ (Novalis) అనుకవి జర్మనీలో ఈ యుద్యమవ్యాప్తికి చేయూతనిచ్చిరి. జర్మనీఫ్రాన్సు దేశములలో ప్రవహించి ఈ యుద్యమము మహోద్వేగముతో ఇంగ్లండులో ప్రవేశించి బహుముఖముల విస్తరించినది. స్కాట్, బ్లేక్, బర్న్సు, వర్డ్సువర్తు, కాలరిడ్జి, షెల్లీ, కీట్సు, బైరన్ మున్నగు ఇంగ్లీషుకవులీప్రవాహములో ఈదులాడిన కవిశేఖరులు. అంతకుముందు వేళ్ళుదన్నుకొనియున్న ఐతిహాసిక కవిత్వమునకు వ్యతిరేకముగా వీరు ధ్వజమెత్తి నిలిచిరి. అయినను ఫ్రెంచిభాషలోని కాల్పనికరచనలకు విక్టర్ హ్యూగోవలె, ఇంగ్లీషులో కాల్పనికరచనలకు ఆధారశిలవంటి రచయిత మొదటిరోజులలో కనిపించలేదు. తమకు క్రొత్త ఊపిరుల నందించెడి కవియెవరాయని ఆనాటి యువకవులు గతములోనికి తొంగిచూచిరి. అప్పుడు వారికి స్పెన్సరు జేగీయమానముగా కన్పడెను. అతని ప్రణయ కవిత్వ మమృతభాండమువలె భాసించెను. ముఖ్యముగా అతని ఫేరీక్వీన్ (Faery Queene) అను కావ్యము కాల్పనిక కవికుమారులలో క్రమస్పందనము కలిగించినది. 1754 లో థామస్ వార్టన్ ప్రచురించిన **Observations of Faery Queene** అన్నరచన మధ్యయుగముల మహావైభవమునకు, కాల్పనికదృక్పథమునకు ఆరతులెత్తినది. ఇతడే వ్రాసిన 'Essay on pope' అను రచన కాల్పనిక కవితానుయాయులకెంతో ఉపస్కారకమైనది. ఈ వ్యాసములో 'పోపు గొప్ప చమత్కారి కావచ్చుగాని గొప్ప కవిమాత్రము కా'దని వార్టన్ ఎలుగెత్తి చాటెను. ఈ విమర్శ కాల్పనికకవుల కేనుగంత బలము నిచ్చినది. ఈ ఉద్యమమునకు వ్యతిరేకముగా మొదటి దినములలో పోపు, స్విఫ్టు మున్నగు ఉద్దండరచయితలెందరో ప్రయత్నించిరి. అయినను ఈ కవితాసారణి క్రమక్రమ వర్ధమానమై మహావాహినిగా రూపొంది ఆంగ్లసాహిత్యకేదారమును సస్యసంపన్న మొనర్చినది.

1. 'The Age of Wordsworth.— P. 16.

నిర్వచనములు :

ఇంగ్లీషు సాహిత్యచరిత్రలో అత్యంత ప్రధానపరిణామమైన ఈ కాల్పనిక కవిత్వమును గురించి ఎన్నెన్నో నిర్వచనములున్నవి. ప్రధానగుణములను గర్భీకరించుకొన్న నిర్వచనములనే ప్రస్తుతము పొందుపరుచుటకు ప్రయత్నింతును.

1. హైనే (Heine) అను విమర్శకుడు ఐతిహాసికకళకు కాల్పనికకళకుగల భేదమును వివరించుచు ఇట్లు వ్రాసెను.

"Classic art portrays the finite, Romantic art the infinite."[1]

2. పేటర్ (Pater) అను విమర్శకు డిట్లు నిర్వచించెను.

"...........The essential elements, then, of the Romantic Spirit are curiosity and the Love of beauty..........."[2]

3. Dr. F. H. Hedge ఇట్లనెను

"It is the sense of something hidden of imperfect revelation."[3]

4. ఫ్రెంచిరచయిత Victor Hugo దీనిని 'Liberalism in Literature' అని వ్యాఖ్యానించెను.

5. Watts-Dunton దీనిని 'the renaissance of wonder and mystery' అనెను.

6. Herford అను విమర్శకుడు దీనిని "a Spirit of expansion" అని చమత్కరించెను.

7. Prof. Boyesen ఇట్లు నిర్వచించెను.

"............Romantic poetry invariably deals with longing........ not a definite desire, but a dim, mysterious aspiration."

ఈ విధముగా కాల్పనిక కవిత్వమునకు భిన్నభిన్న నిర్వచనములున్నవి. ఈ నిర్వచనములు పరస్పర విరుద్ధములైనవి మాత్రము కావు. కాల్పనిక కవిత్వముయొక్క బహుముఖ పరిణామమునకివేవియు సమగ్రమైన నిర్వచనములు కావు. ఈ నిర్వచనములలోని లక్షణము లన్నిటిని ఒకచోట గుదిగూర్చిన C. H. Herford చేసిన వివరణము చాలవరకు సమగ్రమైన దని చెప్పవచ్చును. అయినను దీనిని నిర్వచన మనలేము.

1. Quoted in "The Beginnings of the English Romantic Movement : W. L. Phelps : Page 2

2. Macmillans Magazine : VOL. XXXV.

3. Atlantic Monthly : VOL LVII.

"Glory of lake and mountain, grace of childhood, dignity of untaught peasant, wonder of faery, mystery of the Gothic aisle, radiance of Attie morbles, — all these springs of the poet's inspiration and the artist's joy began to flow..........."[1]

ఇక ఈ నిర్వచనములను దృష్టిలోపెట్టుకొని ఇంగ్లీషులోని కాల్పనిక కవిత్వ లక్షణములను వివరింతును.

**కాల్పనిక కవిత్వము :**

**విశిష్ట లక్షణములు :**

ఇంగ్లీషు కవిత్వచరిత్రలో కాల్పనిక కవిత్వము విశిష్టమైన స్థానము కలిగియున్నది. చాసరువలె సుకుమారముగా కావ్యరచనచేసిన కవి యింకొకడు లేడు. ఈ సాహిత్యములో స్పెన్సరువలె శబ్దసంగీతమును సృష్టించినవారు క్వచిత్తుగా ఉన్నారు. కాని చాసరు తన కవిత్వమును కథాకథనమునకు సాధనముగానే స్వీకరించెను. స్పెన్సరు దానిని దృశ్యచిత్రణకో, అన్యాపదేశముకొరకో ఉపయోగించెను. మరి ఎలిజబెత్‌కాలపు కవులకు కవిత్వము వివిధ మానసిక చర్యలకు, ఘట్టన ప్రతిఘట్టనములకు వాహికయైనది. కాల్పనిక కవులు అట్లుగాక కవిత్వమునకు ప్రాణభూతమైన కల్పన (Imagination) కగ్రతాంబూల మిచ్చిరి. సౌందర్యముతో అద్భుతత్వమును సమ్మేళనమొనర్చిరి. నేపథ్యములో నిలిచిపోయిన 'ప్రకృతి'ని రంగస్థలము పైకి తెచ్చిరి. సామాన్యవస్తువులకు మాన్యత నిచ్చిరి. అనాదృత విషయములకు ఆసనము వేసిరి. ప్రముఖ కాల్పనిక కవియగు బ్లేకు పలికిన క్రిందివాక్యములలో కాల్పనిక కవిత్వ తత్త్వము హృద్యముగా గుబాళించుచున్నది.

"To see a world in a grain of sand
A heaven in a wild flower
To hold infinity in the palm of the hand
And eternity in an honr.."

ఈ కవిత్వమునకు ప్రధానగుణములు, 1. ప్రకృతిప్రీతి 2. గతవైభవ పునరుద్ధరణము 3. ప్రణయతత్త్వము 4. ఆత్మాశ్రయత్వము[2] 5. అద్భుతత్వము 6. సాహస ప్రియత్వము. ముందుముందు తెలుగు భావకవులపై ఈ లక్షణముల ప్రభావమును పరిశీలింపవలసి యున్నది కనుక ఈ యంశములనుగూర్చి కొంత చర్చించుట యవసరము.

1. The Age of Wordsworth. : Page 14.
2. ఈ యంశము ఇంతకుముందే విపులముగా చర్చింపబడినది.

(i) ప్రకృతి ప్రీతి :

కాల్పనిక కవితోద్యమమునకు ముందు కవిత్వము నగరసీమల దాటి జనపదములవైపు ప్రసరించలేదు. ఆ కాలమున పర్వతప్రాంతములు, అరణ్యములు భయంకర విషయములుగా పరిగణింపబడుచుండెడివి. గ్రే మున్నగు కవుల ఆవిర్భావముతో ఇది తొలగిపోయినది. కొండ కోనలపై ప్రీతి మెండుకొన్నది. గ్రే వ్రాసిన ఒక వ్యాసములోని క్రింది భాగమును పరికించిన ఈ విషయము విదితమగును.

"In the evening walked alone down to the lake by the side of crow-park after sunset and solemn colouring night draw on, the last gleam of sunshine fading away on the hill-tops, the deep, serene of the waters, and the long shadows of the mountains thrown across them."[1]

కాల్పనికోద్యమమునకు ముందటి ఇంగ్లీషుకవులు క్వాచిత్కముగా చిత్రించిన ప్రకృతి వర్ణనలు కేవలము పుస్తకములనుండి యెరవు తెచ్చుకొన్నవే. షేక్స్పియరులోగూడ ప్రకృతి వర్ణన అలంకార ప్రాయముగా నున్నవే కాని స్వానుభవావిష్కరణ సాధనములుగా లేవు. మొట్ట మొదటిసారిగా ప్రకృతిని తెరవెనుకనుండి రంగముమీదికి రప్పించినవారు స్కాట్లాండుకవులు. 1680-1758 కు చెందిన అలన్‌రాంసే (Allan Ramsay) అను కవి రచనలలో తొలిసారిగా ప్రకృత్యుపాసన కనిపించుచున్నది. తననాటి జానపదగేయములతో ప్రభావితుడైన ఈ కవి 'Gentle shepherd' అను కావ్యములో పల్లెపడుచులను, పసులకాపరులను రమణీయముగా అభివర్ణించినాడు. ఈ స్కాట్లాండుకవి ప్రభావము లండనుదాక సోకినది. జేమ్సుథాంసన్ (1700-48) ప్రధానముగా ఆగస్టన్ కవుల తరగతికి చెందినవాడైనను ఇతని రచనలలో చిత్రిత మైన ప్రకృతి స్వానుభవ పురస్కృతమైనది. ఈతని 'Seasons' అను కావ్యము చారిత్రకముగా అత్యంత ప్రాధాన్యముగలది. ఇందులో ప్రకృతి అంగిగా స్వీకరింపబడినది. ఈ కాలముననే Ballad (గేయగాథా) సాహిత్యము పునరుద్ధరింపబడినది. బ్లేక్ ప్రకృత్యుపాసకులైన కవులలో గణనీయుడు. సామాన్యవిషయములను కావ్యవస్తువులుగా చేసికొనుటలో ఈ కవి వర్డ్సువర్తు కవికి మార్గదర్శకుడయ్యెను.

ప్రకృతిని సంప్రదాయసిద్ధమైన దృష్టితోకాక భావనారమ్యముగా పరిశీలించుటలో వర్డ్సు వర్తు అందెవేసినచేయి. ఈతని దృష్టికి మనము నిత్యము చూచెడు కొండలు, కోనలు, విరులు, తరులు, వంకలు, డొంకలు అపూర్వ సౌందర్యమూర్తులుగా సాక్షాత్కరించినవి. ఈయనకు ప్రకృతి కేవలము బాహ్యశోభాకలితమైనదే కాదు; దివ్యత్వనిధానము. విశ్వాత్మకు, మానవాత్మకు ప్రకృతియే స్వర్ణసేతువని ఇతడు విశ్వసించెను. ప్రకృతిని ఈయన 'Apocalypse' (భగ

1. Quoted by W. H. Phelps in his book 'The Beginnings of the English Romantic Movement' ; page 170.

వత్ సాక్షాత్కారము)గా స్వీకరించెను. అంతేకాదు. మానవులలో సైతము ప్రకృతి స్వరూపమును దర్శించిన చిన్మయుడీతడు. అందుకే వాల్టర్‌రాలీ (Walter Raleigh) అను విమర్శకుడు 'He saw men and women as trees walking' అని చమత్కరించెను. వర్డ్సువర్తు వ్రాసిన 'Ode on the Intimations of Immortality' అన్న గేయములోని క్రింది చరణములను పరిశీలించిన ఆయన ప్రకృత్యుపాసనాతత్త్వము విశదమగును.

"To me the meanest flower that blows,
Can give thoughts that do often lie too deep for tears''.

వికసించి నేలరాలిపోయెడు పువ్వులో జీవనమరణతత్త్వము భాసించునని వర్డ్సువర్తు అభిప్రాయము. ప్రకృతిని ఇంతగా ప్రేమించిన వర్డ్సువర్తు దానిని యథాతథముగా కావ్యమందు దించవలెనని చెప్పలేదు. ప్రకృతి సందర్శనమువలన మానవునిలో కలిగెడు మనఃప్రవృత్తులను, వాని పరిణామములను ప్రతిఫలింపజేయవలెనని ఈయన అభిప్రాయపడెను.

"And add to the gleam
The light that never was on land or stream
The consecration and the poet's dream."

ఈ ప్రకృతి చిత్రణకొరకు వర్డ్సువర్తు ప్రాచీన కావ్యములను గాలించలేదు. సూటిగా జనపదములకే వెడలిపోయెను. మైకేల్ అను ఇతని కావ్యము పరిశీలనా ప్రతిభకు, వాస్తవ చిత్రణకు చక్కని నిదర్శనము. నాగరక జీవన చిత్రణములో పోపు ఎంతటివాడో సహజరమ్యమైన జానపదజీవన చిత్రణములో వర్డ్సువర్తు అంతటివాడు. ప్రకృతికి భాష్యప్రణేతలైన కవులలో వర్డ్సువర్తు అగ్రేసరుడు. అతనికిగల ప్రకృతి పరిజ్ఞాన మపారము. అతడు కన్నులతోనే కావ్యములు వ్రాసినాడని, 'బండపడిన గుండెలని మెత్తదనంతో నింపి ప్రజలకు కొత్తకళ్ళనీ, చెవులనీ ఇచ్చాడనీ'[1] ఈయనగురించి విమర్శకులు వెల్లడించిన అభిప్రాయములు సత్యసమ్మతములు.

(ii) *గతవైభవ పునరుద్ధరణము* (Revival of the past):

పోపు యుగములో Gothicism (జర్మన్ శిల్పరీతి).Chivalry (సాహసము) విస్మృతి గర్భమున విలీనమైయుండెను. కాల్పనిక యుగములో మరల దీనికి వెలుగుపుంత లభించినది. స్పెన్సర్, షేక్స్పియర్, మిల్టన్ మున్నగు మహాకవుల కూపిరులూదిన పురాణగాథాలహరి ఆగస్టన్ యుగములోని శాస్త్రబద్ధమైన హేతువాద ప్రచండతాపమునకు శుష్కమైపోగా కాల్పనిక కవులు దానిని మరల ఉజ్జీవింపజేసిరి. వాల్టర్‌స్కాట్ ఇట్టి వస్తువులతోనే కావ్యరచన చేసెను. ఇతనిని కాల్పనికకవియనుట కితడు స్వీకరించిన వస్తువులే ప్రధానహేతువులు, వర్డ్సువర్తు తన Excursion అను సుదీర్ఘ గీతములో గ్రీకుపురాణగాథ నితివృత్తముగా స్వీకరించి, ప్రకృతికి అన్వయించి నవ్యతను సాధించెను. షెల్లీవ్రాసిన 'ప్రొమీథియస్ అన్‌బౌండ్' (Prometheus

1. 'ఆశ్చర్యం' (వ్యాసం): అమరేంద్ర: ఆంధ్రప్రభ 16 అక్టోబరు 1960.

unbound) గ్రీకు పురాణగాధకు సంబంధించినదే. కీట్సు వ్రాసిన ఎండిమియాన్ (Endymion), హైపీరియాన్ (Hyperion) మున్నగు కావ్యము లిట్టివే. ఈ గతవైభవ పునరుద్ధరణతత్త్వము తోనే క్రైస్తవమతము మరల మందహాసము చేసినది. కాల్పనికకవులు గతమును, మతమును తృణీకరించక గతములోగల 'ఛాందసము'ను పరిహరించి, క్రైస్తవమతములోని సల్లక్షణములను స్వీకరించి తమదైన ఒక సిద్ధాంతమును నిర్మించుకొనిరి. అయినను 'రినైజాన్సు' (సాంస్కృతిక పునరుద్ధరణోద్యమ) కవులవలె వీరు క్రైస్తవమతమునే ధ్యేయముగా పెట్టుకొని రచనలు చేయలేదు.[1]

### (iii) ప్రణయ తత్త్వము (Philosophy of Love):

కాల్పనిక కవులలో షెల్లీ, కీట్సు, బర్న్సు మున్నగు కవులు ప్రణయతత్త్వము రసవత్తరముగా ప్రతిపాదించిన కవులు. వీరు దర్శించిన కాల్పనిక ఆదర్శవాదము (Romantic Idealism) నకు ప్లేటోతత్త్వము (Platonism) మూలము. స్త్రీపురుషుల ఆత్మలు మొదట అఖండముగా ఏకముగా ఉండెడివని, ఆయఖండాత్మయే రెండుగా విడిపోయి స్త్రీపురుషులుగా రూపొందినదని, మరల వీరిద్దరు ప్రణయసూత్రములో ముడివడిపోయినప్పుడు ఆ ఖండాత్మల కేకీకరణము జరుగునని ప్లేటోతత్త్వము. ఈ తత్త్వమునే కాల్పనిక కవులు ప్రతిపాదించిరి. షెల్లీ ప్రేయసిని 'Spirit's sister' అని సంబోధించుటలో ఈ తత్త్వమే ఆవిష్కృతమైనది. ఈ ఐక్యతత్త్వమును షెల్లీ 'Love's philosophy' అను గేయములో చక్కగా ప్రతిపాదించినాడు.

"The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix forever
With a sweet emotion;
Nothing in the world is single;
All things by a Law divine
In one spirit meet and mingle.
Why not I with thine?"

ఇది కాల్పనికకవుల ప్రణయతత్త్వమునకు మణిదర్పణమువంటి కవితాఖండము.

కాల్పనికకవులు స్త్రీని కామైకదృష్టితో చూడలేదు. ఆమె నారాధ్యదేవతగా స్వీకరించిరి.[2] మానవులను పునీతులనుగాజేసి వారికి దివ్యత్వము సమకూర్చగల శక్తి ప్రణయమునకున్నదని వారు విశ్వసించిరి.

1. 'For the renaissance poets, poetry was subordinate ally of religion; for the romantics, it takes the place of religion.'
—A History of English poetry : W. J. Courthope. P. 81.

2. "Innocent is the heart's devotion
with which I worship thine;" —Shelley

'The worm beneath the sod
In love and worship equals the Spirit of God'

అని షెల్లీ అభిప్రాయపడెను. మట్టిపొరల క్రింద లుకలుకలాడు పురుగు సైతము ప్రణయ శక్తిచేత భగవత్త్వముతో తులదూగునని దీని యభిప్రాయము. అయినను కేవలము 'స్త్రీ పుం సయోగ'మందే వీరు ప్రణయమును దర్శించలేదు. ప్రధానముగా వియోగ శృంగారమును, విషాద మాధుర్యమునే వీరు చిత్రించిరి.

"Our sweetest songs are those that tell of saddest thought"[1]

అన్న మాటలలో ఈ విషాదమాధుర్యమునే షెల్లీ ప్రతిపాదించెను.

(v) అద్భుతత్వము :[2]

'Romance' అను శబ్దమున కర్థము 'అద్భుతము'. బిగిసికొనిపోయిన జీవితములోని నిష్ఠురసత్యములనుండి విముక్తిపొందవలెనని, ఎక్కడకో యేగంధర్వసీమాంచలములకో రెక్కలు గట్టుకొని ఎగసిపోవలెనని కాల్పనికకవులు కాంక్షించిరి. అందుకే వర్డ్సువర్తు సహజత్వముతో గూడిన రచనలుచేసిన కాలములోనే కాలరిడ్జి అద్భుతత్వమును ప్రతిపాదించు రచనలను సృష్టించెను. Lyrical Ballads లోని కాలరిడ్జి రచనలు అద్భుతరసాశ్రయములే. ఇతని Ancient Mariner అన్న కావ్యము ఈ రసమునకు చక్కని నిదర్శనము. అందువలననే వాట్స్‌డంటన్ కాల్పనికకవిత్వమును విస్మయ పునరుద్ధరణము (Renaissance of wonder) అన్నాడు.

(vi) సాహసప్రియత్వము (స్వేచ్ఛాకాంక్ష) :

ఐతిహాసికయుగములో అనాదృతములైన వీరగాథలు కాల్పనికోద్యమ ప్రభావముతో పునరుద్ధరింపబడినవి. ఎడిసన్ తన Spectator లో వీని పునరుద్ధరణకొరకు కొంత ప్రయత్నించినను అవి యంతగా జనాదరణ పొందలేదు. జేమ్సువాట్సన్ ప్రచురించిన వీరగాథా సంపుటములు ప్రజాదృష్టిని విశేషముగా నాకర్షించినవి. పర్సీ (Percy) ప్రచురించిన రెలిక్స్ (Reliques) అను గ్రంథము ఈ సాహిత్యము నాకాశమున కెత్తినది. ఈ వీరగాథలను చదివిన కాల్పనిక కవులలో అణగారియున్న సాహసప్రియత్వము సటలు విదలించినది. బైరన్ కవిత ఈ రీతికి బలమైన నిదర్శనము. Child Harolde's Pilgrimage, Isles of Greece మున్నగునవి బైరన్ సాహసప్రియత్వమునకు సంకేతములగు కావ్యములు. ఇతని 'Prisoner of chillon' లో స్వాతంత్ర్యేచ్ఛ ములుసూపినది. షెల్లీ రచించిన Revolt of Islam, Skylark, Prometheus Unbound, Ode to the west wind మున్నగు రచనలలో స్వాతంత్ర్య ప్రీతి (Love of Liberty) స్ఫుటముగా భాసించినది.

ఇవి శేఖరప్రాయములైన కొన్ని లక్షణములు. ఆత్మాశ్రయరీతి యీ కవిత్వమందంతట పూసలలోని దారమువలె కలదు. ఈ కవులు వస్తువును తీసికొని కావ్యము వ్రాసినను స్వానుభవ

1. 'To a Skylark'
2. నాల్గవది 'ఆత్మాశ్రయత్వము'. అది ఇంతవరకే చర్చింపబడినది.

ములనే వ్యంగ్యముగా నిక్షేపించిరి. Revolt of Islam మున్నగు కావ్యములలో షెల్లీ తత్కాలీన సమాజమునే చిత్రించెను. స్వేచ్ఛపట్ల తన యభిప్రాయములను నిశితముగా వెల్లడించెను. కాల్పనిక కవిత్వములో ఆత్మాశ్రయరీతికి - అనగా ఆత్మానుభవ ప్రకటన పద్ధతికిగల ప్రాశస్త్యము నొక విమర్శకు డిట్లు చమత్కరించెను.

"Keats' 'ode to a nightingale' tells us more about Keats than the nightingale''.

నిజమే. ఈ గీతములో కీట్సు తన భగ్నప్రేమనుగురించి, సోదరుని అకాలమృత్యువును గురించి కలిగిన భావములను 'వెళ్ళబోసు' కొనెను.

ఈ కవులు ఛందస్సులోగూడ గణనీయమైన మార్పును తెచ్చిరి. ఐతిహాసిక యుగములో Closed couplet కు గల అగ్రేసరత్వమును వీరు తృణీకరించిరి. మరల Blank verse నుద్ధ చించిరి. ఛందోవైవిధ్యము నాదరించిరి. శైలీ ప్రాధాన్యమును త్రోసిరాజనిరి. భాషాసారళ్యము నకు నుడికారపు సొంపున కగ్రతాంబూలమిచ్చిరి. జుగుప్సావహములైన వస్తువులలోగూడ రమణీయతను దర్శించిరి. మానవత్వ దృక్పథమును ప్రవేశపెట్టిరి. కవిత్వమును సౌందర్యావ తారముగా దర్శించిరి.[1] సౌందర్యమే సత్యమని, సత్యమే సౌందర్యమని భావించిరి ఈ విధముగా కాల్పనికకవిత్వ మత్యంత వైవిధ్యవిలసితమైనది. అయినను వీరు భిన్నతలో ఏకతనే సాధించిరి. నవ్యతాప్రీతియే ఆ యేకత. కాల్పనిక కవులెల్లరు ఈ నవ్యత నుపాసించినవారే. వారు నవ్యతాగ వేషకులు కావుననే ఒకరి దారి నింకొకరు గ్రుడ్డిగా అనుసరించలేదు. ఒక్కొక్క రొక్కొక్క తత్త్వనిర్దేశములో మిన్న లనిపించుకొనిరి. అద్భుత విషయవర్ణనములో స్కాటు, నిసర్గ రామణీయకమును చిత్రించుటలో వర్డ్సువర్తు, స్వాతంత్ర్యేచ్ఛలో బైరన్, మానవతావాదము (ఆదర్శవాదము) లో షెల్లీ, సౌందర్యార్చనలో కీట్సు, పల్లీయుల బ్రతుకులను కనులకు గట్టించు టలో బర్న్సు, తమతమ సొంతగొంతులను వినిపించినారు. ఇందరి గొంతులనుండి వెడలిన రసరాగములు రాయప్రోలు, కృష్ణశాస్త్రి, నాయని, వేదుల, రామిరెడ్డి మున్నగు భావకవుల నే విధముగా స్పందింపజేసినవో విపులముగా ముందుముందు చర్చింతును.

1. 'A thing of beauty is a joy for ever : —Endymion : Keats.

# గురజాడ అప్పారావు:

గురజాడ అప్పారావుగారి జననము ఆంధ్రసాహిత్య లోకమున కరుణోదయము.[1] పిల్ల వసుచరిత్రల పెంజీకట్లు ముసురుకొన్న రోజులలో దేశికవితారశ్మిని ప్రసరించిన కవిభాస్కరు డాతడు. సాహిత్యము ఏ కొందరి సొత్తోయనుకొన్న కాలములో అది ప్రజలసొమ్మని ఉదారముగా పంచిపెట్టిన సామ్యశీలి ఆయన. కందుకూరి సాంఘిక విప్లవమును, గిడుగు భాషా విప్లవమును తనలో సమన్వయించుకొని, సరిక్రొత్త సాహిత్యవిప్లవము లేవనెత్తిన నవయుగ వైతాళికుడాయన. ఆయన చేతిచలువతో, అస్పృశ్యముగా పడియున్న వాడుకభాష అందల మెక్కినది. మెత్తని తెలుగుపలుకు కత్తివాదరవలె మెరసినది. వీధిమానిసికి వేదిక లభించినది. ఆంధ్రభారతి అంతకుముందటి అలంకారభారములను దుల్చివేసి ముచ్చటగా ముత్యాలసరాల నలంకరించుకొన్నది. నాటకము. గేయము. వ్యాసము, కథానిక, ఆయన వాఙ్మహిమతో ఎన్నడులేని జవమును, జీవమును పుంజుకొన్నవి.[2]

ఇది గురజాడ వ్యక్తిత్వము స్ఫురణకురాగానే సాహిత్యశీలి హృదయమున ఉవ్వెత్తుగా నెగయు భావపరంపర. బ్రతికినంతకాలము తన లక్ష్యసాధనకై, గ్రంథశోధనకై, నిర్విరామముగా పనిచేసిన 'కర్మిష్ఠి' ఆయన. ఇక ఆయన శేముషిని, కృషిని క్రమముగా పరిశీలింతును.

## వ్యక్తిత్వ వికాసము :

1882 లోనే – అనగా తన యిరువదియొకటవయేటనే – గురజాడవా రింగ్లీషులో కవిత్వ రచన చేయసాగిరి. ఆయేడు వారు వ్రాసిన 'సారంగధర'అను శీర్షికతోగల ఇంగ్లీషు పద్యము లను మొదట గుండుకుర్తి వేంకటరమణయ్యగారు తమ **'Indian Leisure Hour'** అను పత్రికలో ప్రచురించిరి. తరువాత వారే వానిని 'రీస్ అండ్ రయత్' పత్రికా సంపాదకులును, ప్రముఖ వంగవిద్యావేత్తలునగు శంభుచంద్రముఖర్జీగారికి ప్రచురణార్థము పంపిరి. ఆ పద్యములను చదివి మెచ్చుకొని ముఖర్జీగారు వేంకటరమణయ్యగారికి వ్రాసిన లేఖలో అప్పారావుగారిని సంబోధించి ఈ వాక్యములు వ్రాసిరి.

"........జలపాతాలను, ప్రవహించే సెలయేళ్ళను వీక్షించండి. మానవరూపంలో అరుదుగా అందంగా గోచరించే దైవాంశములను చూడడం మరువకండి. మీ హృదయాన్ని,

---

1. జననము : 30 నవంబరు 1861
2. ఈ వాక్యములు నేను స్రవంతి (నవంబరు 1960) పత్రిక సంపాదకీయములో వ్రాసినవి. కించి ద్భేదముతో వానినే ఉద్ధరించినాను.

ఇతరుల హృదయాలను పరిశీలించండి. వాటిబలాన్ని దౌర్బల్యాన్ని పరీక్షించండి. ఇతరులు సాధించిన గొప్పతనాన్ని తెలుసుకోండి, కాని ఇతరులమీద ఎన్నడూ ఆధారపడవద్దు. మీ ఆత్మ శక్తిమీద మీరు విశ్వాసం వుంచి, అన్నివిధాల దానివికాసానికి కృషిచేయండి.''[1]

ఈ వాక్యములు అప్పారావుగారి జీవితచరిత్రలో అత్యంత ప్రాధాన్యముకలవి. నూనూగు మీసాల నూత్నయౌవనములోనున్న - తనకు తెలియని శక్తులు హృదయకుహరములో సుడులు తిరుగుచు వెలికిబిమ్ముకొనివచ్చు తెన్నుగానని వయోదశలోనున్న - గురజాడవారి ఆలోచనా ఫలకముపై ఈ వాక్యములు క్రొత్తరేఖలు ముద్రించియుండును. ముఖర్జీగారు ప్రబోధించిన స్వశక్తి ప్రాధాన్యమును, స్వపరహృదయ పరిశీలనపాటవమును, ఆయన తరువాతి కాలములో వ్యావహారిక భాషోద్యమ ప్రచారముద్వారా కన్యాశుల్క నాటకముద్వారా, ముత్యాలసరములద్వారా నిరూపించుకొన్నాడు.

1884 జనవరి 27 వ తేదీన ముఖర్జీగారు స్వయముగా అప్పారావుగారికి లేఖ వ్రాసిరి. 'మీలో ప్రతిభవుంది. సాధనచేత ప్రకాశమానం చేసుకోవచ్చును' అని ఈ లేఖద్వారా అప్పారావుగారిని ప్రోత్సహించిరి. ఇంగ్లీషులో యతిప్రాసలు (Rhymes) లేని పద్యములు వ్రాసినచో అది కవిత్వముకాదను దురభిప్రాయము చాలమందికున్నదని విమర్శించిరి. ఈ లేఖ చివరలో వారిట్లువ్రాసిరి.

''మీరు వ్రాద్దామనుకొన్న రాజకీయ పద్యకావ్యాన్ని ప్రారంభించారా ? జానపదగేయాలు, వివిధ ఛందస్సులలో పద్యాలు వ్రాయడాని కుపక్రమించండి.[2]

ముఖర్జీగారు పేర్కొన్న రాజకీయ పద్యకావ్యము ఏ భాషలోనో తెలియదు. అట్లే జానపద గేయచ్ఛందస్సులోని పద్యాలవిషయము స్పష్టముగాలేదు. 1884 లో అప్పారావుగా రిట్టిరచనలు చేసినట్లు ఆధారములులేవు. కాని జానపదగేయరీతులలో నవ్యగేయము ు వ్రాయవలెనన్న దృష్టి ఆనాటికే ఆయన కేర్పడినట్లు స్పష్టమగుచున్నది.[3] 1910 లో ఆయన రచించిన ముత్యాలసరములకుముందు నీలగిరిపాటలు మరియు ఒకటి రెండు చమత్కారగేయములు తప్ప గేయరచన చేసినట్లు కనిపించదు. ప్రాచీన కవితారీతికిచెందిన 'సుభద్ర' కావ్యము, మరికొన్ని పద్యములను గురజాడవారు రచించిన ట్లాధారములున్నవి. సుభద్రకావ్యము మరియు ఇతర కావ్యములు రచింపబడిన కాలము ఇప్పటికిని తెలియుటలేదు. బహుశః వానిని వారు ముత్యాలసరములకు ముందే అభ్యాసదశలో రచించియుండిరేమో ? ముత్యాలసరముల కొకటిరెండు సంవత్సరములకు ముందు రచింపబడిన నీలగిరిపాటలు, తరువాత ప్రచురింపబడిన (ముత్యాలసరములలోని)

1. గురజాడరచనలు : మాటామంతీ - అవీఇవీ ; పుట 13
2. మాటామంతీ - అవీఇవీ : పుట 16
3. ముత్యాలసరాలు జానపదగేయాల ధోరణివే అనుకొనవచ్చును. ఇవి 1910 లో ప్రచురింపబడినవి.

గేయముల ప్రచురణకాలము తెలియుచున్నది. వీనినిబట్టి ఆలోచించగా 'సుభద్ర'మున్నగు పద్యములు వీనికన్న చాలముందుగానే వ్రాయబడి యుండవచ్చును.[1]

## ప్రథమ రచనలు: సంప్రదాయానుకరణము :

1. గురజాడ కేవలము సాంప్రదాయికమైన రీతిలో, ప్రాచీన వృత్తములలో రచించిన ఖండకావ్యములు 'మాటలమబ్బులు,' 'పుష్పలావికలు,' 'మెరుపులు,' 'సుభద్ర' (కావ్యము) 'ఋతశతకము'అనునవి.[2] వీనిలో 'మాటలమబ్బులు' అనుదానిలో విజయనగరములోని అధికారుల నధిక్షేపించిన పద్యములున్నవి. దబ్బరలు, కొండెములు, మాయమాటలు, మొండితనము, అధికారుల అబ్బురపువిద్యలని గురజాడవా రీపద్యములలో ఎత్తిపొడిచిరి. ఈ శీర్షికక్రిందనే వ్రాసిన క్రిందిపద్యము అన్యాపదేశముద్రగల 'చమత్కృతిమత్కృతి.'

> "విధివశమున నీ చెంతకు
> మధుపముఁరా హేళనంపు మాటాడకుమా
> మధువొలుకు జలజకులముల
> కధికపునెయ్యుడగు కుటజమా ! తెలియుమెదన్.[3]

2. 'పుష్పలావికలు' అన్న శీర్షికతో వీరు తొమ్మిదిపద్యములు వ్రాసిరి. ఇవన్నియు ప్రబంధములలోని పుష్పలావికల వర్ణనలకు తీసిన చక్కని 'నకళ్లు'. ముఖ్యముగా పుష్పలావికల శృంగారమును ప్రదర్శించు పద్యములివి. ఆముక్తమాల్యదలోని పుష్పలావికావర్ణన ఘట్టము ప్రభావ మీ పద్యములలో అడుగడుగున తొంగిచూచుచున్నది. ఆ ప్రబంధములోగల "వెలది యీ నీదండ వెలయెంత ? నాదండకును వెలబెట్ట నెవ్వనితరంబు"[4] అను పుష్పలావికా విటుల సంభాషణయే కించిద్భేదముతో

> "నీదండ చిక్కువడెనే
> నాదండను చిక్కుటన్న నగరే ప్రాజ్ఞుల్
> నీదండ నుంచికొనుమా
> వాదుడుగుమటందు రచటి వనితలు విటులున్"

అను పద్యముగా అవతరించినది. ఆముక్తమాల్యదలోని 'జాతులేవంబుజేక్షణ ? పద్మినులు సైతమును నున్నయెడ జాతులునికియరుదె'[5] అన్న 'జాతి' శ్లేషయే

---

1. బహుశః కన్యాశుల్క ప్రచురణకు (1898) ముందే వ్రాసిరేమో ?
2. ఇవి 'ముత్యాలసరాలు' తృతీయ ముద్రణ సంపుటిలో (1958 జులై) నున్నవి.
3. 'ముత్యాలసరాలు' తృతీయ ముద్రణ సంపుటిలో ప్రచురితము. పుట 86.
4. ఆముక్తమాల్యద : ద్వితీయాశ్వాసము : 19 వ పద్యము.
5. ఆముక్తమాల్యద : ద్వితీయాశ్వాసము : 19 వ పద్యము.

"చూతము మీమీజాతుల నాతిరొాయని విటులుపల్కనగి లావికలున్
ప్రీతిగలదేని జాతులు చూతురె మాజాతులెల్ల జోద్యములనరే"

అను పద్యములో రూపుదిద్దుకొన్నది.

ఆముక్తమాల్యదలో పుష్పలావికలు సరసుల (విటుల) నర్మము తమ కింపొసగుచుండగా, తమ దృక్కరళకాంతులను కలువలుగా, నవ్వులను మొల్లలుగా భ్రమించి, పూలుగూర్చకయే రిత్తనూలొసగి, తమ పొరపాటు తెలిసికొని సిగ్గుపడుదురు.[1] ఈ పద్యములోని భ్రాంతిమదలంకారమును గురజాడవా రీవిధముగా మలచుకొనిరి.

గోరులడాలు దండలకుగూర్పగ గెంజిగి నెర్రమొల్లలిం
పారగజూడగా గలిగె నన్నువ తెమ్మని తీసి యింటికిన్
జేరగ తెల్లవారగని చింతిలి తారును దెల్లవారి ర
య్యారనుగల్గు లావికల యోజలు చిత్రములంచు జవ్వనుల్".

3. 'మెరుపులు' అను శీర్షికతో వ్రాసిన పద్యములన్నియు సంస్కృత చాటుశ్లోకముల కనువాదములే. ఈ యనువాదరీతిలో ఆయనకు తెలుగునుడిపైగల అభిరుచి గమనింపదగినది. మచ్చున కొకటి :

"కాశిజచ్చెనేని కలుగదు జన్మంబు
కలిగెనేని నుదుట కలుగుకన్ను
సిరసునందు చిన్నిసిరితోడబుట్టువు
కంఠసీమ వెలయు గరళచిహ్న".[2]

ఈ పద్యములో 'లలాటేవిలోచనమ్' అనుటకు 'నుదుటగలుగుకన్ను', 'చంద్రకళాచ మౌళౌ' అనుటకు 'సిరసునందు చిన్నిసిరితోడబుట్టువు' అను ప్రయోగములు చక్కని తెలుగు నుడులు.

4. 'ఋుతశతకము' :— ఇది కందపద్యములలో వ్రాయబడినది. ఇప్పటికి దొరకిన పద్యములు 25 మాత్రమే. వీనిలో 'త' ప్రాసము అన్ని పద్యములలో పాటింపబడుట ప్రత్యేకత. ఈ పద్యములలో పదములగజిబిజి యెక్కువ. ఏవో కొన్ని పద్యములలోతప్ప ప్రసాదగుణము లేదు. మొదటి పద్యమే

---

1 ఆముక్తమాల్యద : ద్వితీయాశ్వాసము : 20 వ పద్యము.

2. దీనికి సంస్కృత మూలము :

'కాశ్యామవశ్యం త్యజతాం శరీరం శరీరిణాం నాస్తి పునశ్శరీరం
యద్యస్తి కంఠేగరళం లలాటే విలోచనం చంద్రకళాచ మౌళౌ'.

"స్మితమతి సూచీ భేదిత
ఋతమౌక్తిక పదక శతక మిభపతి భాషా
సతి సతి కుతుకతగూర్చగ
సతతము———"

అన్నధోరణిలో స్పష్టతకు దూరముగానున్నది. 'ఇభపతి' యనగా గజానను డనుకొన వలెనేమో?[1] ఋతశతకమును వినాయకునికి, సరస్వతికి కుతుకముగూర్చునట్లుగా రచింతునను ప్రతిజ్ఞ ఈ పద్యములో నున్నట్లు తోచును.

ఈ శతకములో కవితాగంధమున్న పద్యములలోనుండి ఒకటి ఉదాహరించుచున్నాను.

"మతివీణ మీటునంతనె
ఋతతంత్రీశ్రుతినిజేరి యింపుగ స్వరముల్
ప్రతి సంవాదమ్మిడునని
సతతము".[2]

౯. సుభద్రకావ్యము:— ఇది అసంపూర్ణము. మూడాశ్వాసములే లభించినవి. అర్జునుడు మౌనివేషమున రైవతకాద్రికివచ్చుట, బలరాముడాతనికి పరిచర్యలజేయుటకై సుభద్రను నియోగించుట, యతి అందము చూచి సుభద్ర మనస్సులో మరులురేగగా ఆమె దోలాందోళిత యగుట, సత్యభామ ఆమెనోదార్చుట ఈ కావ్యమున చిత్రింపబడినవి. ఇది సంపూర్ణముగా ప్రబంధలక్షణములు పొదుగుకొన్న కావ్యము. దీనిలోని 'చూడ్కులు మరునికటారులై పొడుచుట', 'తాటిసిడపుజోదు', 'జఘనఘన', 'వారిజకింజల్కశ్రీ' మున్నగు ప్రయోగములు ప్రబంధములకుదుట బుట్టినవే. నాయికావర్ణనముగూడ ప్రబంధరీతిలోనే యున్నది.

"కస్తూరిగన్నెరుకావి చీరమెఱుంగు
మేనిఛాయకు వింతమిసిమిగొలుప
చెలరేగుముంగురుల్ చేర్చికట్టినజోతి
యిరులపై రిక్కలకరణివెలుఁగ
పైటపైఁదూగాడు పచ్చలహారముల్
చలదింద్రచాపంబు చాడ్పుఁజూప

1. 'ఇభపతి' యనగా గజపతి. అనగా ఆనందగజపతి మహారాజేమో?

2. ఈ శతకము చివరపద్యములో 'ధృతి గురుజాడల నరిగెడుగతి పెద్దలు జూప జనితి గజపతి త్రోవన్ కృతికదె గౌరవమగుటన్' అని యున్నది. ఇందులో గజపతియనగా ఆనందగజపతియేయని తెలినది. 'గురుజాడ' అన్నదానిలో అప్పారావుగారి యింటిపేరు ధ్వనించుచున్నది.

నిద్దంపుఁజెక్కుల దిద్దినపత్రముల్
మకరాంకుబిరుదాల మాడ్కి-వఱల

మెఱపు కెమ్మబ్బులోపల మెఱయునట్లు
వలిపమున మేల్మిమేలనూలు తళుకులీన
భద్ర నడతెంచె బంగరుపళ్ళెరములఁ
బండ్లుఁబూవులుగొనుచు సపర్యకొఱకు".

గురజాడవారీ రీతిగానే పద్యరచన చేసియుండినచో ఆ మార్గములో వారు తప్పక ప్రౌఢ కవియయ్యేడివారు. సంప్రదాయము ననుసరించిన కవులపంక్తిలో ఎక్కడో ఒకచోట ఆయన కొక చిటిచాప లభించియుండెడిది. కాని అట్లుజరుగలేదు. ఆయన పంక్తిమధ్యలో కూర్చుండ వలసినవాడుకాడు. అగ్రేసరత్వ మాయన జాతకమున వ్రాసియున్నది. వైతాళికత్వము, యుగ కర్తృత్వము ఆయన సాధింపవలసిన మహాకార్యములు. అందువలన అందరు నడచుచున్నది ఘంటాపథమైనను ఆయనకు రుచింపలేదు. శ్రీశ్రీ అన్నట్లుగా "వేసినదారంట వెళ్ళిపోవడం సులభం. అంతేకాదు పదిలం".[1] కాని నవనవోన్మేషప్రజ్ఞగల గురజాడవారికి గతానుగతికములైన ఆ బాటలు వెగటుగొల్పినవి. క్రొత్తబాట వేయవలయునను కుతూహల ముదయించినది. తన ముందున్నవి గహనారణ్యములైననుసరే, ఛేదించుకొని పోవలెనను 'వజ్రసంకల్పము బిగుసు కొనిపోయినది'. తాను మొదటవేసెడిది ఘంటాపథముకాదు; కేవలము సన్నని కాలిబాట. అదియు కంటకపరికీర్ణము. అది కంటకశిలావృతమైన కాలిబాటయైనను కాలిబాటయైనను తరువాతి తరములవారికి పూలబాటగా మారునని ఆయనకు తెలియును. ఆయనదృష్టి భవిష్యత్తులోనికి చొచ్చుకొని ఎగిసిపోవునంతటి నిశితమైనది; ప్రగతిమూలకమైనది. అందువలననే ఆయన క్రొత్త ప్రయోగములకు కంకణము కట్టుకొన్నాడు. వృత్తిరచనకు స్వస్తిచెప్పినాడు. ప్రబంధ రీతులకు తిలోదకములిచ్చినాడు. వాడుకభాషతో చేతులుకలిపినాడు. అంతేకాదు. అతడే ఒక చోట వ్రాసికొన్నట్టుగా దిక్కులేని గ్రామ్యస్త్రీతరపున ఫీజులేకుండ వకాల్తాపుచ్చుకొని, దిగ్విజయము సాధించినాడు. ఆ ప్రయోగచికీర్షలో వెలువడిన అభినవప్రక్రియలే కన్యాశుల్కము, ముత్యాలసరములు, కొన్ని చిన్నకథలు. వీనినిగూర్చి చర్చించుటకుముందు గురజాడవారిలో నవ్యత్వము కొరకు జరిగిన సంరంభము, దాని హేతువులు, ప్రభావములు పరిశీలించుట సముచిత మని భావింతును.

### క్రమపరిణామము :

1889 నుండి 1915 వరకు గురజాడవారు వ్రాసికొన్న డైరీలనుబట్టి[2] వారి మనోరంగ మున జరిగిన క్రమపరిణామము, సాహిత్యముపట్ల వారికిగల ఆశయములు, వారు కలిసికొన్న

1. గురజాడ : (వ్యాససంపుటి): శ్రీశ్రీ : పుట 35.
2. గురజాడ రచనలు : మహాకవిడైరీలు : విశాలాంధ్ర ప్రచురణాలయ ప్రచురణ.

వ్యక్తులు, చదివిన గ్రంథములు, సమకాలీన సమాజముపట్ల వారి అభిప్రాయములు అద్దములోవలె ప్రతిబింబించుచున్నవి. వీని నాధారముగాజేసికొని వారి వ్యక్తిత్వవికాసము నర్థముచేసికొనవచ్చును.

1895 లో గురజాడవారు పఠించిన క్రింది ఆంగ్లగ్రంథములనుబట్టి వారి అభిరుచినిర్దేశము జరుపవచ్చును.

**నాటక కళాసంబంధులు :** 1. Why did Shakespeare write Tragedies 2. The English Drama. 3. A Dramatic Tale. 4. The Theatre In China. 5. The Miseries of Dramatic Author మున్నగునవి.

**కవిత్వ సంబంధులు :** 1. Criticism on Wordsworth. 2. Novel Element In Literature 3. English Rural Poetry 4. Dravidian Folk Songs 5. English Lyrical Poetry 6. Poetic Image and Primitive Conception 7. Art and Morality 8. Ballad 9. Chaucer's Love poetry. 10. Early years of Shelly మున్నగునవి.[1]

ఈ గ్రంథములలో నాటకవిమర్శకు సంబంధించినవి, కవిత్వవిమర్శకు సంబంధించినవి - వానిలో షేక్స్పియరు వర్డ్సువర్తు ప్రభృతి కాల్పనికకవులకు సంబంధించినవి - హెచ్చుగానున్నవి. అంతకుముందు సాంప్రదాయిక ఫణితిలో సాహిత్యసృష్టి చేయుచుండెడి అప్పారావుగారి కీగ్రంథములు దివ్యలోకముల తలుపులు తెరచెడు మంత్రాక్షరములుగా స్ఫురించియుండును. ఈ రకమైన గ్రంథముల పఠనముతోనే వారికి నవ్యతమీద ప్రీతికలిగినది. షేక్స్పియరు, వర్డువర్తు, షెల్లీ మున్నగుకవులు నాటక కవితారంగములందు సాక్షాత్కరింపజేసిన 'ప్రయోగ' మూర్తులను మనశ్చక్షువుచేత దర్శించి వానిని అనుకృన్మననము చేసికొనగా అప్పారావుగారిలో అపూర్వచైతన్యము పరవళ్ళుద్రొక్కినది. అప్పటికే సాంఘికరంగము కందుకూరి ప్రవహింపజేసిన సంస్కరణోద్యమ భాగీరథీపయఃపూరముచేత, విగతకశ్మల మగుచున్నది. భాషారంగము 'గిడుగుపిడుగు' గర్జలతో ప్రతిధ్వను లీనుచున్నది. ఈ రెండుద్యమములు గురజాడవారికి క్రొత్తవెల్తురును క్రొత్తగాలి నందజేసినవి. వీనికి తోడుగా ఆంగ్లసాహిత్యములోని విమర్శ గ్రంథములు, కావ్యములు, వినూత్నపరిమళమును ప్రసాదించినవి. ఆ క్రొత్తవెల్తురు, ఆ క్రొత్తగాలి, ఆ క్రొత్తపరిమళము - గురజాడవారిలో చొరబారి వారిలో నిద్రాణమైయున్న ప్రతిభాబీజములను జాగృతమొనర్చినవి. వాని సమష్టి ప్రభావఫలితమే 1893 లో కన్యాశుల్క నాటక రచన; తరువాత 17 ఏండ్లకు ముత్యాలసరముల సృష్టి.

ఇక కన్యాశుల్క నాటకరచనమువరకు, గురజాడ మనస్సులో జరిగిన పరిణతియెట్టిదను విషయ మాలోచింపదగినది. 1895 లోనే దేశభాషాసారస్వతములు నవ్యమార్గమున

1. గురజాడ రచనలు ; మహాకవి డైరీలు ; విశాలాంధ్ర ప్రచురణాలయ ప్రచురణ. పుట 119.

పయనించక పోవుటకుగల కారణమేమను ప్రశ్న వారికి కలిగినది. 1895 లో ఏప్రిలు 5 వ తేదీని ఇంగ్లీషు ప్రొఫెసరు బెయిటుగారితో ప్రసంగించు సందర్భమున అప్పారావుగా రీ ప్రశ్న వేసిరి.

"గ్రీకు రోమను గ్రంథపఠనమువల్ల రినేజాన్సు దినములలో యూరపులోని అన్నిదేశాల లోనూ, స్వదేశీయ సారస్వత విజృంభణము వొక్కమారు ప్రతిభావంతమైనదిగదా, అట్లే ఆంగ్లుల ప్రసిద్ధ సాహిత్యప్రచారంవలన, విద్యాప్రభావంవలన అట్టి విజృంభణము మన దేశ భాషలలో చెప్పుకోదగ్గ ఫలితమేమి కానరాకపోవడం వింతగా తోచడంలేదా ?".[1]

దీనికి ప్రొఫెసరుగారు సరియైనసమాధాన మీయలేదు. స్వదేశీయ సారస్వతము విజృం భించక పోవుటకు కారణ మాంగ్లసారస్వత బోధనాలోపమని అప్పారావుగారే సమాధాన మొసగిరి. స్వతంత్రాలోచనాశక్తిని పురికొల్పు బోధనా క్రమము లేకపోవుటతో, విమర్శనాత్మకమైన పఠన పాఠనములు లేకపోవుటతో, విద్యార్థులలో విమర్శనశక్తి పెరుగలేదని, వారిలో ఈ వివేచనాశక్తి వర్ధిల్లనిదే నవ్యత్వమువైపు దృష్టిమరలదని అప్పారావుగారు వారికి వివరించిరి. అందుకు వారు చేసిన సూచన యిది.

"మనం గొప్పగొప్ప కావ్యాలను విద్యార్థులచేత చదివించడం మంచిది. ఏదో ఒక యుగపు వాఙ్మయ చరిత్రను పాఠ్యభాగంగా వేస్తే చాలు".[2]

వీరిసూచనను ప్రొఫెసరుగా రంగీకరించిరి. దేశభాషాసారస్వతములలో మార్పునభిల షించు అప్పారావుగారి దృక్పథము పై ఉదాహరణమువలన స్పష్టమైనది. ఈ మార్పునెవరో చేయవలయునని చేసెదరని ఆశించక తానే అందుకు నడుము బిగించినాడాయన.

### 'కన్యాశుల్క' రచన :

నాటకరంగములో 'కన్యాశుల్కము' గొప్ప ప్రయోగము. వ్యావహారికభాషకు పట్టము గట్టిన ప్రథమదృశ్యకావ్యమిది. అంతకుముందు ప్రహసనములలో కందుకూరివారు వాడుక భాషను ప్రవేశపెట్టినను అది తేలిక హాస్యమును సృష్టించుటకుమాత్రమే ఉద్దేశింపబడినది. సమాజములోని అన్నితరగతులకుచెందిన వ్యక్తుల అభిప్రాయములను, వారి కష్టసుఖములను, సజీవమైన వ్యావహారికభాషలో, రసపుష్టికి వీసమెత్తు కొరతకలుగకుండ వ్యక్తమొనర్చిన ప్రప్ర థమ నాటకము కన్యాశుల్కమే. కావ్యగుణములను కావ్యప్రయోజనములను నిర్ధరించునవి ప్రాచీన వైయాకరణుల ఛాందసములు కావని, నాగరకతా సంపన్నముగా కావ్యభాషను పెంపొం దించుకొనుటకు వ్యవహారభ్రష్టమైన పదములను, తెలుగుజాతీయతకు విరుద్ధమైన సంస్కృత శబ్దరూపములను త్రోసివేసి భాషను సజీవమైన వాడుకమాటలతో పుష్టిమంత మొనర్చుకోవలసి

1. మహాకవి డైరీలు : పుట 48.
2. మహాకవి డైరీలు : పుట : 45.

యున్నదని, ఆ విధముగా కావ్యభాషకు వ్యావహారికభాషకు సాన్నిహిత్యము సంపాదించవలసి యున్నదని అప్పారావుగారు కన్యాశుల్కము ప్రథమముద్రణ పీఠికలో ఉద్ఘాటించిరి.[1]

అయినను ఈ సిద్ధాంతములు గిడుగు గురజాడలతోనే ఆంధ్రవాఙ్మయ లోకమున ఆకస్మాత్తుగా ఊడిపడినవికావు. ఆంధ్రశబ్దచింతామణిలోని 'పేచోషాదికశబ్దాన్ ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః, ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్' అను సూత్రము వ్యవహార భ్రష్టములైన పదములను కావ్యములలో వాడరాదని ప్రకటించినది. తిక్కన 'జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెన్నడు జొన్ప'నని తెలుగు జాతీయతకు విరుద్ధమైన సంస్కృతపద ప్రయోగమును నిరసించినాడు. ఈ యుత్తమ సిద్ధాంతములు చిరకాలమునుండి యున్నను, క్రమశః అవి విస్మృతములై నిరాదృతములై భాషయందు నవోన్మేషము కొరవడగా, దాని యావశ్యకమును గుర్తించి గిడుగు గురజాడలు చైతన్య ప్రబోధ మొనర్చిరి.

1909 మే నెలలో వీరు రచించిన కన్యాశుల్క ద్వితీయముద్రణ పీఠికలో వ్యావహారిక భాషాప్రాశస్త్యము, సంఘసంస్కరణము, నాటకరచన, సమకాలిక విద్వాంసుల ఛాందసధోరణులు మున్నగు అనేకవిషయములను కూలంకషముగా చర్చించి తమ క్రొత్తసిద్ధాంతమును బలపరిచిరి.[2] అతిక్లిష్టమైన సమస్యలుగల సమకాలీన జీవితమును చిత్రించుటకు నాటకరచయిత లెవ్వరును ప్రయత్నించక పోవుటకు విచారము వెలిపుచ్చిరి.[3]

ఈ నాటకముద్వారా అప్పారావుగారు వ్యావహారికభాష కావ్యోపయోగియని నిరూపించిరి. వాస్తవికతకు నివాళులెత్తిరి. సాంఘిక జీవనచిత్రణముద్వారా క్రొత్తదనము చూపించిరి. ఈ విషయములన్నియు వారి ముత్యాలసరాలకు వర్తించును. కాబట్టి వీనిని కొంత విపులీకరించితిని.

### కవిత్వములో నూత్నప్రయోగములు :

గురజాడవారు కవిత్వరంగమున చేసిన సాహసప్రయోగములు ప్రాచీనకవులలో పాలకురికి సోమనాథుని ప్రయోగములను తలపింపజేయును. ఇరువురు దేశిసాహిత్య ప్రవర్తకులే. ఇరువురును తమకాలమున వ్యవహారములోనున్న పదములకు, పలుకుబడులకు గ్రాంధికత కల్పిం

---

1. 'It has been remarked that the use of what is wrongly termed the vulgar tongue mars the dignity of a literary production but that is a piece of criticism which one need not heed at the present day when the progress of the science of language has established better standards for judging the quality and usefulness of tongues than the whims of the grammarians of old linguistic strata.'

కన్యాశుల్కము : ప్రథమ ముద్రణ పీఠిక.

2. వర్డ్స్‌వర్త్ 'Lyrical Ballads' ద్వితీయ ముద్రణకు వ్రాసిన పీఠిక యిట్టిదే. ఈ యిరువురికిగల పోలికలను ముందు చర్చింతును.

3. 'Modern life which presents complex social conditions is neglected by play-writers' (ద్వితీయ ముద్రణ పీఠిక).

చినవారే. పాలకురికి జానుతెనుగును ప్రతిపాదించగా, గురజాడ తెలుగు పలుకుబడికి ప్రాణము పోసెను. ఇరువురును వర్ణభేదములేని సంఘవ్యవస్థను వాంఛించిరి. ఛందస్సులో ఇరువురు క్రొత్తమార్గములు త్రొక్కిరి. "ఇరువురికీకల భేదమంతా ఒక్క విషయంలో – ఒకరిది శివభక్తి; మఱొకరిది మానవాభ్యుదయాసక్తి"[1]. ఈ ప్రయోగములన్నిటికి కేంద్రబిందువు దేశిసాహిత్య పునరుద్ధరణకాంక్ష. ఈ కాంక్ష గురజాడవారిలో ఏనాటినుండియో బీజస్థితిలోనున్నది. అది 1910 లో ముత్యాలసరముల రూపమున (1909 లో నీలగిరిపాటల రూపములో గూడ) విస్ఫురించి, వెలికుబికివచ్చినది. ఇక దేశికవిత్వ విషయములో గురజాడవారి అభిప్రాయము లేమియో గమనింతము. 1911 లోని డైరీలలో వ్రాసికొన్న విషయములనుబట్టి ఆయన దేశిసాహిత్యాభినివేశము తెల్లమగును. తెలుగు పద్యములను వారు Popular అని Classical అని రెండు తరగతులుగా విభజించిరి. ఇవి దేశిమార్గరీతులకు వారు ఇంగ్లీషులో వాడిన పదములు. క్లాసికల్ కృతులు పద్య (వృత్త) మయములని, ఇవి శబ్దాడంబరముతో కూడుకొన్నవని, పాప్యులర్ కృతులు పాశ్చాత్యసాహిత్యములోని గేయములవలె లలితరీతిలో ద్విపదలలో రచింపబడినవని వారు అభిప్రాయపడిరి. ద్విపదలలో వ్రాయబడిన ప్రజాసాహిత్యము పండితులదృష్టిలో నిలువక పోయినప్పటికి, అది సహజముగ లలితముగ నుండునని అనిరి. పండిత సంప్రదాయమైన సంస్కృత పదజటిలత్వముగల కవితాపద్ధతులలో ఈ ప్రజాగీతములను పోల్చిచూచుట తగదని హెచ్చరించిరి. వారింక నిట్లనిరి.

"ఈ జానపద గేయాలలో శబ్దసౌష్ఠవం లేకపోయినా, కవిత శిల్పం లేకపోలేదు. సర్వజన సంపర్ధితమైన జానపద గేయములు విదేశీయులకు ఆకర్షణీయములు.........ఇందుగల భావవ్యక్తీకరణపద్ధతి వారి కెంతో ప్రయోజనకారి."[2]

ఈ అభిప్రాయములను పరిశీలించగా గురజాడవారికి దేశికవిత్వము పట్లగల గాఢాభిమానము స్పష్టమైనది. వారు మన ప్రాచీనసాహిత్యమున చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్న మార్గదేశి విభాగములో దేశికవిత్వమునకే మకుటము పెట్టిరి. జానపదగేయములలోని కవితాశిల్పమునకు దివ్వెలెత్తిరి. వాని భావప్రాధాన్యము నుద్ఘాటించిరి. పైగా సంస్కృతపద జటిలత్వముగల మార్గరీతి ప్రజలకు సన్నిహితమైనదికాదని ఉగ్గడించిరి. తెలుగులోని ద్విపదలను పాశ్చాత్యసాహిత్యములోని గేయములతో పోల్చిరి. అనగా అప్పారావుగారిపై సాంప్రదాయికమైన దేశి రచనలతోపాటు, పాశ్చాత్యుల 'లిరిక్కుల' (గేయముల) ప్రభావము సైతము మున్నట్లు తేలినది.[3] ఇక కవిత్వాంగములైన వస్తుభావరచనల విషయములో వీరుచేసిన నవ్యప్రయోగములేవో పరిశీలింతము.

---

1. పరిశోధన : గురజాడ ప్రత్యేక సంచిక : సంపాదకీయము.
2. మహాకవి డైరీలు : పుట 227.
   ఈ అభిప్రాయమునే గిడుగు రామమూర్తిగారు వ్యక్తీకరించిరి. అది వెనుక ఉదాహరింపబడినది.
3. వీరిపై ఇంగ్లీషు కవితారీతుల ప్రభావ మెంతవరకున్నదో ముందు చర్చింతును.

**వస్తువు :** 1908 లోనే అప్పారావుగారు విజయరామగజపతి మహారాజుగారికి వ్రాసిన లేఖలో తాము కన్యాశుల్కమున సమకాలీన సాంఘిక జీవితమును వస్తువుగా తీసికొన్న విషయమునుగూర్చి తమ అభిప్రాయములను వెలిపుచ్చిరి. ఇవి నాటకేతివృత్తము దృష్ట్యా వ్రాసిన మాటలైనను, కావ్యవస్తువుపట్ల సైత మన్వయించును కాబట్టి వాని నుదాహరించుచున్నాను.

"పుష్కలమైన అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించక, ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనిక కథలనుంచి రచయితలు యితివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంగాక నాకు ఆశ్చర్యంవేసింది. ఈ కారణాలవల్ల నేను వాస్తవిక జీవితంనుంచి సమకాలిక యితివృత్తాన్ని స్వీకరించి దానిని తెలుగున వాడుక భాషలో నాటకంగా రూపొందించాను."[1]

కావ్యవస్తువు విషయములో గురజాడవారిపై వర్డ్సువర్తు సిద్ధాంతములు ప్రబల ప్రభావమును ప్రసరించినవి. వర్డ్సువర్తు Lyrical Ballads ద్వితీయ ముద్రణ పీఠికలో వెల్లడించిన అభిప్రాయము లీ సందర్భమున గమనింపదగినవి.

"The Principal object, then, Proposed in these poems was to choose incidents and situations from common life and to relate or describe them, throughout, as far as possible in a selection of language really used by men and at the same time, to throw over them a certain colouring of imaginaton, whereby ordinary things should be presented to the mind in an unusual aspect............" ఈ సిద్ధాంతములో గమనింపదగిన అంశములివి : కావ్యవస్తువును సామాన్యుల జీవిత సంఘటనలనుండి పరిసరములనుండి గ్రహించుట, కావ్యభాష సాధ్యమైనంతవరకు ప్రజావ్యవహారమునకు సన్నిహితముగానుండుట, ప్రజలభాష నున్నది యున్నట్లుగాక భావనారంజితమొనర్చుట ఈ మూడంశములు క్రమముగా వస్తు భాషా (రచన) భావములపట్ల వర్డ్సువర్తు అభిప్రాయములను తెలియజేయును. వీనిలో ప్రస్తుతము వస్తువు మాత్రమే ప్రసక్తము కాబట్టి దానినిగూర్చి వివరింతును.

వర్డ్సువర్తు తన సిద్ధాంతమున కనుగుణముగా వ్రాసిన 'మైకేల్' మున్నగు కావ్యములలో సామాన్యమానవుల జీవితమును కావ్యవృత్తముగా తీసికొనెను. ఈ విషయము గురజాడవారి నాకర్షించినది. వీరు వర్డ్సువర్తునుగురించి వ్రాసిన వ్యాసమునందు వర్డ్సువర్తుకు మన ప్రాచీనకవులకుగల తారతమ్యమును స్పష్టపరిచిరి. మనదేశపుకవులు కావ్యములలో వర్ణించు పాత్రలు దేవతలు రాజవంశీయులేయని, లోకములో కానరాని గుణసంపత్తి రూపసంపత్తి ఆ నాయికానాయకులలో రాశీభూతమైనట్లు మనవారు వర్ణింతురని, అట్టి సంపత్తి క్రింది కులములకు చెందినవారిలో ఉండవని మనదేశపుకవు లభిప్రాయపడినారని, గురజాడవారు తమ విచారమును ప్రకటించిరి. ఇట్టి అభిప్రాయమే వర్డ్సువర్తుకు పూర్వమున్న ఇంగ్లీషుకవులలో కొంతవరకుండెడిదని, వర్డ్సువర్తు

1. గురజాడ లేఖలు : పుట 15.

గొల్లవానికథను తీసికొని కావ్యముఁ వ్రాసి గొప్పవిప్లవము తెచ్చెనని అభిప్రాయపడిరి. కులముకన్న గుణముమిన్నయని, రసవత్తర కావ్యరచనకు రాజుల, రెడ్ల, బ్రాహ్మణుల చర్యల వర్ణన యెటుల తగియున్నదో, తక్కువజాతివారి చర్యలుగూడ అట్లేయని నొక్కిచెప్పిరి.[1] ఇందు కనుగుణముగా వారు 'లవణరాజుకల'లో 'మాలెతను' కావ్యనాయికగా స్వీకరించి తమ అభిప్రాయమునకు అక్షరత్వము కల్పించిరి. 'కన్యక'లో సెట్టికూతురును, 'పూర్ణమ్మ'లో 'పూజారికూతురు'ను నాయికలుగా స్వీకరించి యీ సిద్ధాంతమునకు దోహదము చేసిరి. నిరంతరము విజయనగరము రాజుగారి సహవాసములో నున్నను, సహజముగ భోగజీవితమున కలవాటుపడి యున్నను, అప్పారావుగారు 'పెద్దయవస్థలోనుండు దుర్జనునికన్న తక్కువస్థితిలోనుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడుకాడా'అని వ్రాసిరి.[2] లోకములో ఒకానొకనికి గొప్ప ప్రతిపత్తి యున్నదనగా, అది వాని పదవి మున్నగు హంగులనుబట్టి కలిగియుండవచ్చునని, వానినిబట్టి మానవుని సత్త్వ నిర్ణయము చేయరాదని, పదవీలబ్ధ ప్రతిపత్తి కేవలము నాణెముమీది ముద్రవంటిదని, మానవుడే సహజముగా బంగారమువంటివాడని వివరించిరి.[3] ఈ విధముగా వర్డ్సువర్తు ప్రభావముతో అప్పారావుగారు సామాన్యమానవుల జీవితములను, సహజత్వమునకు క్షతికలుగని స్థితిలో, సముచిత భావనాసమ్మేళనముతో రచించుటకు పూనుకొనిరి. వారి కావ్యవస్తువు ప్రధానముగా సమకాలీన జీవితమునుండి పెల్లుబికినదే. (లవణరాజు కలలో వస్తువు ప్రాతదైనను దానిని మలచుకొనుటలో సమకాలీనతాముద్ర కలదు.)

**భావము :** ఊహలతో కసరత్తులు చేయించుట, కృత్రిమమైన పదచిత్రములు సృష్టించుట గురజాడకు 'చుక్కెదురు'. కవిత్వములో వాస్తవికతను ప్రవేశపెట్టిన కవి ఆయన వాస్తవికత యనగా నీరసమైన భావప్రదర్శన మనుకొనగూడదు. ఆయనది వట్టి 'ఫోటోగ్రఫీ' కాదు. శ్రీశ్రీ అన్నట్లుగా 'ఎక్సురేఫోటోగ్రఫీ'. అదియు ప్రధానముగా హృదయసంబంధి. బిగించిన వీణియతీగ పైరగాలికి ఝుమ్మనునట్లుగా, గురజాడ సుకుమార భావములతోనే హృదయస్పందనము కలిగించ ప్రయత్నించెను. ధిషణాకషణము సేయు ఊహింపులను ఆయన విసర్జించెను. అతడు చేసిన ప్రభాతవర్ణనమిది.

"వెలుగునీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదలబారెను;
యెక్కడనొ వొక చెట్టుచాటున
నొక్క కోకిల పలుకసాగెను.

1. వ్యాసచంద్రిక : పుట 18. 2. వ్యాసచంద్రిక.
3. ఇందుకు బర్న్సు వ్రాసిన క్రిందిగేయ చరణముల నుదాహరించిరి.
**'Rank is but the guenea stamp**
**The man is the gold for all this.'** (వ్యాసచంద్రిక)

మేలుకొలుపులు కోడి కూసెను
విరులు కన్నులువిచ్చి చూసెను;
ఉండి, ఉడిగియు, ఆకులాడగ
కొసరెనోయన గాలివీచెను.''[1]

ఈ చరణములలో గురజాడ చుక్కలు అస్తమించుట, చీకటివెడలిపోవుట, కోడికూయుట, విరులువిచ్చుట, మందసమీరము వీచుట అను ప్రభాత కాలధర్మములను సహజరమ్యఫణితిలో చిత్రించినాడు. వీనినే ప్రబంధకవులు కృత్రిమ కల్పనలతో అగమ్యముగా చిత్రించిరి. కోడి కూతను 'సూరసూత నవోద్యత్ కరకుంచికా విఘటిత ధ్వాంతారర క్రక్రియాస్వనము'గా వారూహించిరి.[2] గురజాడ 'కోడికూసినది'అని మాత్రమే అనక కోడి మేలుకొలుపులను పలికినదని వ్రాసి వైతాళికత్వమును సుకుమారముగా ధ్వనింపజేసెను. ఊహాశబలము కాని లలిత భావనా మార్గమిది. 'విరులు కన్నులువిచ్చి చూసెను' అనుటతో జడప్రకృతిలో ప్రభాతవేళ కలిగిన చైతన్యోన్మేషమును, పద్మాదిపుష్ప వికసన ధర్మమును వ్యంగ్యముగా తెలిపెను. మందసమీరము వీచినదనుటకు 'ఉండి ఉడిగియు ఆకులాడగ, కొసరెనోయన గాలివీచిన'దనెను. మందసమీరపు సౌకుమార్యము 'ఆకులాడగ' అనుటలో ద్యోతితమైనది. ఆకులు మాత్రమే కదలినవి. ఆకులు ఏ మాత్రము గాలితాకిడికైనను కదలును. వేకువజామున వీచువాయువు సున్నితమైనది. 'ఆకులాడగా'అను ప్రయోగము దాని మందత్వమును మధురముగా ఎత్తిచూపు చున్నది. ఇట్లే 'లవణరాజుకల'లో నాయిక పాటపాడిన ఘట్టమున చేసినవర్ణనము రమణీయమైన నిసర్గభావనాబలమునకు తార్కాణము.

''పాటపాడెను, చెట్లుచామలు కోటిచెవులను గ్రోలియలరగ
తాటివనమున నాగి చంద్రుడు తాను చెవియొగ్గన్.''

ఆవిడపాటను చెట్లుచేమలు కోటిచెవులతో గ్రోలినవట. అస్తోన్ముఖుడైన చంద్రుడు తాటివనములో ఆగి తాను చెవియొగ్గి వినెనట. ఆమె పాట మానవులనేకాదు; జడప్రకృతిని సైతము సమ్ముగ్ధ మొనర్చినభావము లలితమధురఫణితిలో వ్యక్తముచేయబడినది. చెవులు లేని చెట్లకుశ్రోతృత్వమును, మనుష్యులకొరకు తన ప్రయాణమాపుకొనని చంద్రునికి క్షణకాల స్తబ్ధతను కల్పించి, అభూతవిషయములకుగూడ వాస్తవికతాభ్రాంతి కలిగించినాడు కవి. ఇది కృత్రిమతా వాసనలేని భావనామార్గముచేత సాధింపబడినది.

'పూర్ణమ్మ'లో గురజాడవారి భావనాశక్తి అంచులను లోతులను ముట్టినది. పూర్ణమ్మ సృష్టియే చిత్రమైనది. ఆమె 'పుత్తడిబొమ్మ.' ఆమెనడకలు 'పళ్ళనుమీరినతీపి' కలవట. ఇది

1. ముత్యాలసరాలు.
2. పారిజాతాపహరణము : నందితిమ్మన.

నవ్యప్రయోగము. నడకలు తీపికలవని ఎవ్వరనలేదు. నడకలనగానే హంసాదుల గమనము స్ఫురించుట కవిసమయము. గురజాడ ఆమెనడకలలో మాధుర్యగుణమును ధ్వనింపజేసినాడు. కావ్యగుణములలో ప్రసాదమాధుర్యగుణములు ప్రసిద్ధములేకదా. ఆ మాధుర్యగుణ మామెనడకలలో నున్నది. ఆమెనడకలు ఆమె మనోలక్షణము ననుసరించియున్నవి. ఆమె మనస్సులోని మాధుర్యగుణము నడకలలో సైతము చోటుచేసికొన్నదని ధ్వనింపజేసినాడు కవి. ఆమె పోడుములు పువ్వులను మీరినవట. అనగా ఆమె సుమకోమల గాత్రియనుట స్పష్టము. ఈ విధముగా ఆమె రూపవర్ణనముమాత్రమే చేసి అంగవర్ణన ప్రత్యేకించి చేయకపోవుట గురజాడ త్రొక్కిన క్రొత్తజాడ.

పూర్ణమ్మ దుర్గలోలీనమైన ఘట్టమున గురజాడచేసిన వర్ణన క్రమభావనా శక్తికి కనక పతాకమువంటిది.

'కన్నులకాంతులు కలవలచేరెను మేలిమిజేరెను మేనిపసల్.
హంసలజేరెను నడకలబెడగులు దుర్గను జేరెను పూర్ణమ్మ."

ఆమె దుర్గలో ఐక్యమైనది. అంతేకాని నశించలేదు. ఆమె భౌతికదేహము సైతము నశించలేదు. అది పంచీకరణము చెందినది. ఇది సాంప్రదాయికమార్గమే మానవులు మరణించిన తరువాత వారి ఊపిరి గాలిలో కలసిపోవును. శరీరము మట్టిలో లీనమగును. ఇట్లే మిగిలినవి. ఇదే పంచత్వము చెందుటయన్నది. (మానవుని పాంచభౌతిక శరీరము పంచభూతములలో కలసిపోవుట.) ఈ సంప్రదాయమును గర్భీకరించుకొని కవిసమయములను సమన్వయించుకొని గురజాడ పైచరణములలో ధ్వనిని ప్రవేశపెట్టెను. ఆమె మరణించిన తర్వాత ఆమె కన్నుల కాంతులు కలువల నాశ్రయించినవి. శరీరకాంతులు బంగారము నాశ్రయించినవి. నడకల బెడగులు హంసలను చేరినవి. ఆవిడ దుర్గను చేరినది. అనగా ఆమెయాత్మమాత్రము దుర్గలో ఐక్యమైనదని అర్థము. ఆమెకన్నులు కలువలవంటివని, శరీరకాంతి పసిడివంటిదని, ఆమె నడకలసొబగులు హంసలతో సామ్యముగలవని ప్రాచీన కవిసమయములనే వ్యంగ్యమధురముగా ప్రవేశపెట్టినాడు.[1] ఇంకొకవైపు ఆమె పంచీకరణము ధ్వనింపజేసినాడు. ఆమె ఆత్మ మహాశక్తిలో లీనమైనదన్న భావమును గంభీరముగా వ్యక్తముచేసినాడు. అందువలననే ఆయన చిత్రించిన పాత్రలు, చేసినవర్ణనలు, కల్పించిన వాతావరణము మనకన్నులయెదుట జరిగినట్లే, మన మనుభవించినట్లే యనిపించును. వర్డ్సువర్తు చెప్పినట్లుగా ఈయన 'Colouring of the imagination' తో కూడుకొన్న స్వాభావిక వర్ణనలుచేసి తెలుగుకై తను క్రొత్తతెన్నులలో నడిపించినాడు.

1. ఆమెనడకలలో మాధుర్యగుణమున్నదని తెలిపితిని. ఇవి నడకలబెడగులు, కేవలము నడకలు కావు. నడకల బెడగులుకాబట్టి అంచనడకలతో సామ్యమూహింపబడినది.

రచన (శైలి, పదప్రయోగము) :

గురజాడ వ్యర్థపదాడంబరమును నిరసించెను.[1] అలతియలతితునియల కాహాళసంధించిన ఎథమున పదము లమరవలెనన్న తిక్కన్నమాట దక్కించెను. చరణములు దేనికది తునిగి పోవునట్లుగా, పదములు దేనికది విడిపోవునట్లుగా రచనసాగించెను. ఈయన రచన అల్పసమాస కమేకాదు, కొంతవరకు అసమాసకమనవలె. వ్యావహారిక పదములకు సమస్తభావ ప్రకటన సామర్థ్యమున్నదని, అది యన్నివిధముల కావ్యోపయోగియని నిరూపించెను.

'మెచ్చనంటావీవు; నీవిక
మెచ్చకుంటే మించిపాయెను;
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా.'

విడివిడిమాటలే ప్రయోగించినను ఈ పంక్తులలో అనికౌసలలోనిశక్తి దాగియున్నది. దీనిలోని మాటలన్నియు వ్యవహారములోనివే. "దేశభక్తి'లోని ప్రతిపంక్తిలో ఈ శక్తియే కనిపించును. వాడుకమాటలే వాడినను ఆయన ఎక్కడ జారిపోలేదు.[2] ప్రాచీన కవులలో తిక్కన్న, వేమన్న ఈ రచనాపద్ధతికి ఒజ్జబంతులు. వారి ఒరవడిలో నడచినను గురజాడ వారికి మించిన రీతినిగూడ సాధించెను. అదియే వాడుకపదముల కూర్పు. ఇట్టికూర్పు కవికి కత్తిమీది సామువంటిది. లోకవ్యవహారము నున్నదియున్నట్లు ప్రదర్శింపవలసియుండును. అనగా పర్యాయపదముల గారడి కిందులో పీలులేదు. పదముల పటాటోపముతో భావదారిద్ర్యమును కప్పిపుచ్చుకొనుట కవకాశములేదు. ఏది చెప్పినను వాడిగా, వేడిగా చెప్పవలసియుండును. సూటిగా గుండెలోనికి దింపవలసియుండును. అప్పారావుగారు వాడుకమాటలద్వారా ఇవన్నిటిని సాధించినారు. మామూలు వ్యావహారిక పదములలో ఆయన గ్రీకుగాథను పలికించినాడు (డామను పితియస్). విశ్వమానవగీతము కాదగిన జాతీయగీతము రచించినాడు. పూర్ణమ్మవంటి కరుణ రసాత్మకమైన గాథ నిర్మించినాడు. 'లవణరాజుకల'వంటి వివిధరసభరితములైన కథన కృతులు కల్పించినాడు. 'దేశమంటేమట్టికాదోయ్, దేశమంటేమనుషులోయ్'వంటి మహాసూక్తులను

1. 1909 మే ఒకటవతేదీని వ్రాసిన కన్యాశుల్క ద్వితీయముద్రణ పీఠికలో అప్పారావుగా రిట్లనిరి.

"ఒకేమూతలో పోతపోసే పునరావృత సాహిత్యప్రక్రియలవల్ల, వృత్త్యనుప్రాసశ్లేషాను ప్రాసాది బిగింపుల పద్యరచనా పద్ధతులవల్ల, నిరంకుశ గ్రాంథికభాషా నిర్దాక్షిణ్యంవల్ల తెలుగు వికాసానికి తీవ్ర అవరోధం కలుగుతుంది."

2. 'అప్పారావుగారు మహాశిల్పి, సంఘసంస్కర్త. వాడుకభాషలో వ్రాసిన పాటలు రమ్యమైన కళాసృష్టికలవి. పండితులు విని భావం బాగానే ఉంది, భాష బాగులేదంటారు. భాష బాగులేక పోతే భావం యెల్లా స్ఫురిస్తుంది.'

—విశ్వనాథ : నవ్యసాహిత్య పరిషదధ్యక్షోపన్యాసము : భారతి 1940 ఏప్రిలు.

ప్రకటించినాడు. ఒక్కమాటలో చెప్పవలెనన్న మట్టిని మాణిక్యముగా మార్చియిచ్చినాడు.[1] అప్పారావుగారు ప్రయోగించిన కొన్ని వ్యావహారిక భాషాప్రయోగములివి. మించిపోయెను (మించి పోయెననుటకు), పట్నము (పట్టణమనుటకు), ఇస్త్రీ, వుండడా ('వు' ప్రయోగము). మొక్కుతూ, మనిషిమాత్రుడియందు, వొట్టిమాటలు, మతంవేరైతేను ఏమోయ్, వెతుకులాడే మున్నగునవి. వారు చేసిన కొన్ని అపూర్వ (వ్యాకరణదూర)మైన పదప్రయోగములు : ప్రేమవిద్దె, కవిత కోవిల, వాడయి (వాడి + అయి) మున్నగునవి.

గురజాడవారు వాడుకభాషను ప్రయోగించినంత మాత్రమున, దీర్ఘసమాసములను వ్యర్థ పదాడంబరమును నిరసించినంత మాత్రమున, వారికి సంవిధానముపై దృష్టిలేదని యనుకో గూడదు. 'ఏకైక దినప్రబంధఘటికా సద్యశ్శత గ్రంథకల్పన' సంవిధానపుష్టికి భంగకరమని వారుభావించిరి. అర్థపటుత్వము, శబ్దౌచిత్యము సాధించుదృష్టితోనే తాము ముత్యాలసరములు చేపట్టినట్లు వ్రాసిరి.

"చిత్రములు వ్రాయునప్పుడూ, జిలుగుచెక్కునప్పుడూ శిల్పకుడు ఎట్టి పరిశ్రమము చేయునో, అట్టి పరిశ్రమము చేసినగాని కావ్యగుణము లబ్బనేరవని మామతము."[2]

అప్పారావుగారి శిల్పదృష్టికి వారి పూర్ణమ్మ, ముత్యాలసరాలు, లంగరెత్తుమువంటివి చక్కని నిదర్శనములు.

"విరిగిపెరిగితి పెరిగివిరిగితి
కష్టసుఖముల పారమెరిగితి
పండునన్నవి ఆశలెన్నో
యెండిరాలగ బొగిలితిన్."

"దేవతలతో జోడుకూడితి
రక్కసులతో కూడిఆడితి
కొత్తమిన్కుల తెలివిపటిమను
మంచిచెడ్డల మార్చితిన్."

1. అప్పారావుగారు 'ముత్యాల సరాలు'లోని గేయములలో క్రమముగా వాడుక మాటలను పెంచ సాగిరి. ముఖ్యముగా 'మనిషి'అన్న గేయములో అన్నియు వ్యావహారిక పదములేయని చెప్పవచ్చును.

"ఈ మధ్యనే ఆంధ్రభారతికి నేనొక మూడుచరణాల గేయాన్ని పంపించాను. అందులో పాతశబ్దాలు లేవు. వ్యవహారిక భాషాపదాలను సులవుగ, యథేచ్ఛగ ఇముడ్చుకునే ఛందస్సులను మనం సృష్టించుకోవాలి." —గురజాడ లేఖలు : పుట 208

మూడుపాదముల గేయమనగా 'మనిషి'యే. ముత్యాల సరాలలో మూడుపాదముల గేయ మిదితప్ప వేరులేదు.

2. వ్యాస చంద్రిక : పుట 25.

"పంజరంబున నున్నకట్లను
పగలదన్నగలేక (సుక్కితి
నింగిపర్వగలేని జన్మము
నీరసంబని రోసితిన్"[1]

వంటి చరణములలో భావమునకు తగినభాష, వాక్యశిల్పము, మిరుమిట్లు గొల్పుచుండును. ప్రధానముగా వారిరచన సానలుదీరని జాతిరత్నము. సమరభేరి వినిపించగనే చకచ్చకితచేతనులై ఈటెయో, బల్లెమో, కత్తియో, కర్రయో – ఏది చేతికిచిక్కిన నది తీసికొని విజృంభించు యోధులను తలపించు రచన వారిది. అందువలన శిల్పదృష్టితో చూచినచో కొన్ని పంక్తులు నిలువవు. అంతమాత్రమున వారికి శిల్పదృష్టి లేదనికాదు. పైనిపేర్కొన్న యుదాహరణములలో వారి శబ్దార్థశిల్పము జిలుగువన్నెలతో సాక్షాత్కరించలేదా?

### ఛందస్సు : ముత్యాలసరము :

గురజాడవారుచేసిన అత్యంత సాహసోపేతమైన ప్రయోగములలో ముత్యాలసర మొకటి. పద్యమునుండి గేయమునకు తిరిగిపోవుటయే గొప్పప్రయోగము. అందులో ఒక్క మాత్రానియమముతప్ప, యతిప్రాసల నియమములేని గేయమును చేపట్టుట, పైగా వాడుకమాటలు ప్రయోగించుట, ఆ గేయము నుబుసుపోకకుగాక ఉదాత్తవిషయములను భావమయముగా వ్యక్తీకరించుటకు సాధనముగా చేయుట, ఒక దానికన్న నొకటి అపూర్వప్రయోగములు. కాళిదాసనగానే మందాక్రాంతవృత్తము జ్ఞాపకమువచ్చినట్లు, వేమన్నయనగానే 'ఆటవెలది' అందెలు ఘల్లుమన్నట్లు, పాలకురికి సోమనాథుడనగానే ద్విపద మదిలో కదలినట్లు, గురజాడకవియనగానే 'ముత్యాలసరము' నృత్యాలు సల్పును. మూడున్నర చిన్నపాదముల గేయములో ముక్కోటి తెలుగుల కష్టసుఖాలను గానముచేసినాడాయన. సమస్తమానవజాతికి కల్యాణసందేశ మిచ్చినాడాయన. 'ముత్యాలసరా'ల సంపుటిలో ఒక్కపూర్ణమ్మమాత్రము భిన్నఛ్ఛందస్సులో నున్నది. ఇది 'తకకిట' 'తకకిట' అను నాలుగు నాలుగుమాత్రల గణములతో నడచు చతురస్రగతిలోనున్నది. మిగిలిన గేయములన్నియు ఒకే ఛందస్సులో నున్నవి. మాత్రావిభజనచేసి చూడగా అవి 3 + 4 = 7 మాత్రలగణములతో పరుగులుదీయు మిశ్రగతిలోనికి చేరును. దానినే ముత్యాలసరమని గురజాడవారు ఏ శుభముహూర్తమున నామకరణముచేసిరో అప్పటికి ఇప్పటికి దానిని ముత్యాలసరమేయని అందరనుచున్నారు.

మొదటిరోజులలో ముత్యాలసరము ఛందస్సుపై విమర్శలువచ్చినవి. ఒకానొక 'శతావధాని'గారు విమర్శించిన వ్రాతలకు గురజాడవా రిట్లు సమాధాన మొసగిరి.

"యూరోపియను భాషలలో కవులు కొత్తవృత్తములను కల్పించి భాషాభివృద్ధి చేయలేదో? కొత్తవృత్తములను కల్పించవచ్చునన్నచో నా నేర్పుకొలది నేనొక కొత్తతోవ తొక్కితిని.

---

1. లంగరెత్తుము : ముత్యాలసరాలు.

తప్పేమి ? నలుగురూ ఆమోదించిరా నేను కల్పించిన వృత్తములను అవలంబింతురు. ఆమోదింపరా పరిత్యజింతురు.''[1]

అంతటి చిత్తశుద్ధితో ప్రయోగము చేసినందుననే ఇప్పటికి చెక్కు-చెదరకుండ ముత్యాలసరము నిలిచిపోయినది. ఆయన ప్రారంభించిన తర్వాత ఒకటి రెండేండ్లలోనే నాటి యువకవుల హృదయపీఠి నలంకరించినది.[2]

**ముత్యాలసరాల లక్షణము :**

తెలుగు ముత్యములకోవవలె ముద్దైనలిపిగల భాష. తెలుగుపలుకులు ముత్యములవంటివి. ముత్తెము రూపమున చిన్నది, తేటదనముకలది. అట్లే చిన్నచిన్న తేటమాటలకూర్పు గురజాడ కవిత్వము తాను తెలుగుపలుకుబడికి ప్రాధాన్యమిచ్చి తెలుగు దేశిచ్ఛందస్సులో కవిత్వము వ్రాయుచున్నాడు కావున మిశ్రగతిలో నడచు ఛందస్సునకు తన అభిరుచి కనుగుణముగా 'ముత్యాలసరాలు'అని పేరుపెట్టుకొనియుండును. ఇంతకుమించి ఈ నామౌచిత్యమున కాధారములు మరేమియులేవు.

ముత్యాలసరములో నాలుగు పాదములుండును. మొదటి మూడు పాదములలో $3+4$, $3+4=14$ మాత్రలుండును, నాలుగవ పాదములో 7 మొదలు 14 వరకుండును. గురజాడ చేసికొన్న నియమమిది.[3] నడకనుబట్టి యిది వసుచరిత్రాదులలోని

"బాల బాలరసాలమిది శుక
పాలిపాలిటి యమరసాలము
గేలిఁగేలిడి గ్రుచ్చ గదురా
గిల్లు గిల్లుము తత్ప్రవాళము"

అను వృషభగతిరగడను పోలియున్నది. జానపదగేయములలో ప్రసిద్ధమైన

'గుమ్మడేడే గోపితల్లీ
గుమ్మడేడే ముద్దుగుమ్మా
గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడేడమ్మా' అనుదానికి

మేలుకొలుపు పాటయగు

1. వ్యాస చంద్రిక : పుట 38.
2. రాయప్రోలు, జనవరాజు, విశ్వనాథ మున్నగువారు ముత్యాలసరము ననుసరించిన ప్రథములు.
3. వ్యాసచంద్రిక : ముత్యాలసరాల లక్షణము (వ్యాసము).

'మేలుకో నవనీతచోరక
మేఘసుందరనీలమేచక
— — —
మేలుకోవయ్యా' అనుదానికి

అచ్చముగా ప్రతిబింబముగా నున్నది. కన్నడములోని భామినీషట్పది యీ గతిలోనే నడచును. దానిలో మూడుపాదములే యుండును. మొదటి రెండుపాదములు 14 మాత్రలలో నడచి, మూడవపాదములో 14 + 9(3 + 4 + 2) మాత్రలగును. మూడవపాదములో నాలుగవ పాదములోని 9 మాత్రలు వచ్చిచేరినవన్నమాట. వీనిని నాల్గవపాదముగా వ్రాసినచో ఇదియును ముత్యాలసరమేయగును. ఈ విషయములో శ్రీవాత్సవగా రిట్లనుచున్నారు. "గోవుపాటయనునది ముత్యాలసరమువలె నడచినట్లు కానవచ్చుచున్నది. అందు 14 మాత్రలఛందస్సు నాలుగు పాదములను నడిపినది.''[1]

''ఒకజాతి పార్సీగజలుయొక్క నడక ముత్యాలసరములలో తెచ్చుటకు నే ప్రయత్నించితి'' నని గురజాడవారే వ్రాసికొన్నారు.[2] ముత్యాలసరములోని ఛందస్సున కనుకూలముగా నడచు పార్సీగజలిది.

వాఇజాకీఁ జల్వాబర్ మహ్రాబొ మెంబర్ మీకునంద్,
చూఁబఖిల్వత్ మీరవంద్ ఆఁ కారెదీగర్ మీకునంద్ —హాఫిజ్

ఈ విధముగా ముత్యాలసరము మిశ్రగతిలో నడచు వృషభగతిరగడకు, ఆ ఛందస్సులోనే నడచు తదితర జానపదగేయముల వరుసలకు సరిపోవుచున్నది. అయినను దీనిలో వానికి మించిన విలక్షణత యేమున్నదో గమనింపవలెను. 'వృషభగతిరగడ'లో అంత్యప్రాస నియమమున్నది. యతిప్రాసల నియమమున్నది. జానపదగేయములలో 'గుమ్మడేడే' మున్నగువానిలో ప్రాసనియమమో, యతినియమమో విధిగానున్నది. పైగా వీనిలో 4వ పాదము 9 మాత్రలతో మాత్రమే ముగియుచున్నది. అప్పారావుగా రీలక్షణములనన్నిటి నతిక్రమించి స్వేచ్ఛనవలంబించిరి. యతిప్రాసల నియమమును బుద్ధిపూర్వకముగా నుల్లంఘించిరి. వారు వృత్తములను తృణీకరించినది, వానిలోని యతిప్రాసల నిర్బంధములకు కినిసియే. మరల వానిని కోరి తెచ్చుకొనుట క్రొత్తసంకెళ్ళను తగిలించుకొనుటయే. ఈ యభిప్రాయముతోనే వారక్కడక్కడ సహజముగా దొరలినచో తప్ప, యతిప్రాసలను ప్రయోగింపలేదు.[4] పైగా బుద్ధిపూర్వకముగా కొన్ని

1. పరిశోధన : గురజాడ ప్రత్యేకసంచిక : పుట 81.
2. వ్యాసచంద్రిక : పుట 25.
3. ఈ గజలులో 3 + 4 = 7 మాత్రలగణములుగల మిశ్రగతియే యున్నట్లు స్పష్టము.
4. లవణరాజుకల, దామనుపితియసుతో మాత్రము ప్రాసనియమము బాలుసార్లు పాటింపబడినది. కథనమువలని విసుగును తప్పించుటకేమో ?

చోట్ల తానుల్లంఘించినట్లు కొన్నిప్రయోగములు చేసిచూపినాడు. మొట్టమొదటి గేయములో 'వెలుగునీటను గ్రుంకెచుక్కలు, చదలచీకటి కదలబారెను' అన్నప్పుడు యతిని (రెండు పాదములలో ఆద్యక్షరసామ్యము) ఉల్లంఘించిరి. ఇందులో ప్రాస ఎప్పుడోతప్ప పడలేదు. ఇక రగడలోని అంత్యనియమముగూడ ఆయన త్రోసిపుచ్చెను. వంగభాషలో మైకేలు మధుసూదన దత్తు ఇట్లేచేసెను. యతిప్రాసలు నిర్బంధములుగాగాక, కేవల మలంకారార్థము ప్రయోగించినచో రసవత్తరకావ్య సృష్టిచేయవచ్చునను ధైర్యముతో చిరకాలము యోచించియే గురజాడవారీప్రయోగము చేసినారు. పాదములను త్రుంచుట విషయమున, పాదసంఖ్యానియతి విషయమున, వాడుకభాష నా ఛందస్సులో పొదిగెడు విషయమున, ఎప్పటికప్పుడు క్రొత్తప్రయోగములుచేసి సాధించినారు. "నా ముత్యాలసరాల గేయములను క్రమానుగతంగా మీరు పరిశీలించినట్లయితే, ఒకదానిలోకంటే ఇంకొక దానిలో నేను సాధించిన అభివృద్ధి మీకు స్పష్టపడుతుం"[1]దని వారు 1912లో గున్నయ్యశాస్త్రిగారికి వ్రాసిన లేఖలో అన్నారు.

ఇక ముత్యాలసరాల గేయములలో అప్పారావుగారు చూపిన వైవిధ్యము గమనించవలసియున్నది. ఈ వైవిధ్యము పాఠకుల కొకే ఛందస్సువలన విసుగుకలుగకుండుట కుపయోగపడినది. పాలకురికి కేవలము ద్విపదలో రెండుకావ్యములు వ్రాసినను వాని గమనములో, తూగులో చమత్కారముచూపి ఒకే ఛందస్సువలన కలిగెడు విసుగును తప్పించినాడు. అప్పారావుగా రిట్లేచేసిరి.

1. నాలుగు పాదములు సమానముగా కూర్చినవి.[2]

'వెలుగునీటను గ్రుంకె చుక్కలు
చదలచీకటి కదలబారెను;
యెక్కడనో వొకచెట్టుమాటున
నొక్కకోకిల పలుకసాగెను.' పుట 1.

2. చివరిపాదములో 12 మాత్రలు : చివరగురువు.

గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా. పుట 1.

1. గురజాడ లేఖలు : పుట 208.
2. ఈ గేయములన్నియు విశాలాంధ్ర ప్రచురణాలయమువారి 'ముత్యాలసరాలు' తృతీయ ముద్రణ ప్రతినుండి గ్రహింపబడినవి.

3. చివరిపాదములో 12 మాత్రలు : చివరి రెండు లఘువులు.

పట్టపగలే నట్టివీధిని

—— —— ——

—— —— ——

పట్టమేలే రాజువట. పుట 37.

4. చివరిపాదములో 9 మాత్రలు.

మతములన్నియు మాసిపోవును

—— —— —— ——

—— —— —— ——

యవని విలసిల్లున్. పుట 4.

5. చివరిపాదములో 8 మాత్రలు.

యెల్లలోకము వొక్కయిల్లై

—— —— —— ——

—— —— —— ——

వేడుకలు కురియు. పుట 4.

6. చివరిపాదములో 3 మాత్రలు.

పట్టమేలే రాజుగర్వం

—— —— ——

—— —— ——

అమరె పుట 38.

7. మొదటి మూడుపాదములలో 18 మాత్రలు.

తగటు బంగరుచీరె కట్టి
కురుల పువ్వులసరులు జుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి
సొంపు పెంపారన్. పుట 31.

8. మూడవపాదములో 12 మాత్రలు మాత్రమే.

పాతసంధులు పాతిపెట్టుము
యుద్ధములకవి ఉనికిపట్టులు
లోకమంతయు యేకమై
— — — — పుట 64.

9. 5 పాదముల గేయము.

వచ్చెనిది బంగారుకాలము
వాంఛలెల్లను తీరుసుజనుల
కాంగిలేంసుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్యమిచ్చుచు
సంతతము వర్ధిల్లుగావుత. పుట 64.

10. 2 పాదములది.

అనుడు చింతలువాని, కైకై
జేరి చొచ్చితి మపుడు చితి. పుట 27.

11. పాదనియతిలేక స్వేచ్ఛగసాగిపోవు గేయము.

చూ॥ కాసులు. పుట 7.

12. పాదమధ్యమున అధికమాత్ర.

వింటి మీపోకిళ్లవింటిని
కంటినిద్దుర కానకుంటిని
యీ చిన్నమనసును చిన్నబుచ్చుట
— — — — — పుట 5.

13. పాదాదిలోనే అధికమాత్ర.

దేశాభిమానము నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పటోకోయ్. పుట 12.

14. అధికపాదము (ఎందులోను ఇముడనిది.)

పట్టమేలేరాజు — ——
— — — —

— — — —

కన్నమరికలదా
*వైశ్యజాతికి వన్నె. పుట 33.

15. పాదపూర్తికాక రెండుఖండముల (Stanzas) వరకు అల్లుకొనిపోయిన భాగములు. చూ. 'కన్యక' పుట 86.
('విద్యనేర్చిన' నుండి 'రాజులైమనుడయ్యె' వరకు)

16. మాత్రలు (ఒకటి రెండు) లోపించినవి.
మొన్న పట్టమునందు ప్రాజ్ఞులు
మొట్టమొదట మెట్టుయిదియని. పుట 4.

'తోక ముత్యాలసరము':

ఇవికాక అప్పారావుగారు 'కన్యక'లో 4 వ పాదమును 9 మాత్రలతో ముగించి వెంటనే 7 మాత్రలుగల 5 వ పాదము చేర్చిరి. దీనిని 4 వ పాదములోనే కలిపెదమన్న లయ చెడిపోవును; నడకకుంటును. అందుకే 5 వ పాదము అవసరమైనది. ఇక దీని సారస్యము పరిశీలింతము.

'పసిడికరవల పాలపెరుగులు
పళ్ళెరమ్ముల పళ్ళుపువ్వులు
మోములందున మొలకనవ్వులు
చెలగి చెలికత్తెల్
వెంట నడిచిరి.'

దీని నొక విధముగా సాధింపవచ్చును. 'చెలగిచెలికత్తెల్' చదివిన పిమ్మట సరిగా 5 మాత్రల కాలమాగి 'వెంటనడిచిరి' అన్నచో లయభంగము జరుగదు; సరికదా మరల 'చెలగి చెలికత్తెల్' అనవలెననిపించి, పాటక్రిందికి దిగును.

'చెలగి చెలికత్తెల్ (తకిటకిట)
వెంటనడిచిరి; (చెలగి చెలికత్తెల్).

ఈ పద్ధతిలో తరువాతి కవులు పాటలు రచించిరి. దువ్వూరి రామిరెడ్డిగారి
'గాలియడుగుల నెవరికోసరము
ఓ మోహశీలా
కదలివచ్చితి వీ నిశీథమున'

వంటి వీ ప్రభావముగల రచనలే. ఈ పద్ధతిని తోకముత్యాలసరమను పేరుతో గిరరాఘవ స్వామిగారు ఒక క్రొత్తవాడుక తెచ్చిరని, 'ముసలమ్మగారి కార్తీగస్నాన'మను హాస్యరచనలో దీనిని ప్రయోగించిరని శ్రీశ్రీ గారు వ్రాసినారు.[1] దీనికిని గురజాడవారే ఆద్యులని తెలినది.

ఇన్నివిధములుగా ముత్యాలసరాలను నడిపించిన ప్రయోగశీలి గురజాడ. అయినను వీరి ముత్యాలసరము గనిలోనుండి మొట్టమొదట తీయబడిన లోహమువంటిదని, ఆయన దానిని మెలకువతో నిర్వహించలేదని, ఎటుకానిచోట విరువబడిన పాదములు (కాసులు) ఆయన ఛందో వ్యవస్థకు బలహీనత నాపాదించుచున్నవని కొంద రభిప్రాయపడినారు.[2]

దీనిలో కొంతవరకు నిజమున్నది. ఈ ఛందస్సులోనే తరువాతి కవులగు రాయప్రోలు, అబ్బూరి, కృష్ణశాస్త్రి, బసవరాజు, కవికొండల, శ్రీశ్రీ మున్నగు కవు లద్భుతగేయములను రచించుట కాదనలేము. కాని గురజాడ 'ఛందోవ్యవస్థకు బలహీనత నాపాదించు' ముత్యాల సరములుమాత్రము రచించలేదు. ఆయనచేసిన వ్యాకరణాది దోషములు, ప్రమాదపతితములు కావు. బుద్ధిపూర్వకముగా చేసిన తిరుగుబాటులు. ఆయన కొన్నిచోట్ల పాదనియతిని పాటించక పోవు టయు సంకల్ప పూర్వకమైన ప్రయోగమే. రచనలో వైవిధ్యముకొరకు, కథాకథనములో సౌలభ్య సౌకర్యములకొరకు చేసినపనియది. తీరికగా చెక్కిన, నగిషీతీర్చిన భాగములున్నవి (పూర్ణమ్మకథ, దేశభక్తి మున్నగునవి.) ముడిసరుకువలె ముందు పారవేసినవి ఉన్నవి ('కన్యక'లో కొన్ని చరణములు). కాని ఒకటి రెండుమాత్ర లొకటి రెండుచోట్ల లోపింప జేయుటతప్ప ఆయనచేసిన ఛందోవ్యతిక్రమము రేదు. స్థూలదృష్టితో చూచినచో 'కాసులు' అను గేయమున ఛందోభంగము జరిగినట్లే యనిపించును. ఉదాహరణకు

> తీవలకు తలిరుల తెరంగున
> కాంచనము సింగారమందురు
> లలనలకు గానిమ్ము; కాని
> కమ్మనితావి గ్రమ్మెడి—

క్రింద గీటుగల భాగములలో లయతప్పినది. నడక దెబ్బతిన్నది. ఇది ఛందోభంగమే యనిపించును. ఇట్టిసందర్భము లీగేయములో పెక్కుచోట్లగలవు. కాని ఒకటి గమనింపవలసి యున్నది. ఈ గేయము 'Run-on-verse' ధోరణిలో రచింపబడినది. అనగా దీనిలో లయ బద్ధమైన నడకయే తప్ప; ఇన్నిపాదములని పాదమునకిన్ని మాత్రలని నియమములేదు. అంత మాత్రమున లయభంగము మాత్రము జరుగలేదు. ఇప్పుడు ముద్రింపబడిన ప్రకారము 'కాసులు' చదివినచో తప్పక ఛందోవ్యతిక్రమము కన్పట్టును. అది అచ్చువేసిన పద్ధతినిమార్చి, పాదముల

1. గురజాడ : శ్రీశ్రీ : పుట 20.
2. ఈ అభిప్రాయము శ్రీశ్రీగారే ప్రకటించుట గమనింపదగినది.
చూ|| గురజాడ : శ్రీశ్రీ : పుట 24.

నింకొక విధముగా కూర్చినచో, విరుపులు మరియొక విధముగా జరిపినచో, ఏమాత్రమ ఛందస్సు, లయ, నడక బెణకని గేయమిది. ఈ మొత్తము గేయమును తిరుగవ్రాసి ఈ విష యమును నిరూపించితిని. స్థలాతిరేకము జరుగునని దాని పూర్తి పాఠమును అనుబంధములో చేర్చితిని. మచ్చునకు పైభాగమునే తీసికొందము. దానినిట్లు విరిచి ఛందోవ్యతిక్రమమును తప్పించవచ్చును.

"తీవలకు తలిరుల తెరంగున
కాంచనము సింగారమందురు
లలనలకు గానిమ్ము; —
కాని కమ్మని తావిగ్రమ్మెడి—"

సరిక్రొత్తగా చేయబడిన ఈ పాదవిభాగముతో ఛందోవ్యతిక్రమము తప్పినది. లయ తెగిపోకుండ సాగినది. ఈ విధముగానే మొత్తము గేయములో లయతప్పినట్లు కనిపించిన భాగముల పాదపునర్విభజనముచేసి, గురజాడ ఈ గేయమున ఛందోభంగము చేయలేదని, ఇది Run-on-verse ధోరణిలో అక్కడక్కడ కొంత ఊపిరితీయుచు పరుగెత్తు గేయ ప్రక్రియయని నిరూపింపవచ్చును.

ఇక గతివైవిధ్యములో భావపుష్టి కలిగించిన కొన్ని గేయభాగముల నుదాహరింతును.

1. ఏ పాదమున కా పాదము విరిగిపోయి ఒకదానిలోనొకటి చొచ్చుకొనిపోవు గుణము కథాకథనమునకు దోహదకారి. నన్నయసీస మట్లేయుండును. గేయము సాధారణముగా ఏ పాదమున కా పాదము విరిగిపోవు స్వభావము కలది. గురజాడవా రెక్కడోతప్ప ఎక్కడి కక్కడికే విరిచి వ్రాసిరి. ఆ విధముగా విరుగకుండ వ్రాసిన భాగములు కథనరీతికి గొప్ప గాంభీర్యమును సంతరింపజేయుచున్నవి.

'లవణరాజుకల'లో మలినవృత్తులు మానిన మాల తొల్లిటి ఋషివలె తోపింపజేయు ఘట్టమున ఇట్లుకలదు

'పండుగెడ్డము; నిండుకన్నుల నిండ శాంతరసంబు; పలుకుల
కదలి గాంభీర్యంబు, ఒడలిని దివ్యతేజంబున్."

ఈ విధముగా పాదమునుబట్టి భావము విడిపోక, భావమునుబట్టి పాదములో విరుపు లేర్పడుటతో గేయమునకు 'హుందాతనము', భావమునకు పట్టు కలిగినవి.

2. ఏ పాదమున కా పాదము విడిపోయిన కొన్ని సందర్భములలో గొప్ప వేగమును, ఉద్ధతిని సాధించిన ఘట్టములున్నవి. 'కన్యక'ను జూచిన రాజు ఈ విధముగా పల్కెను.

'పట్టవలెరా దీని బలిమిని కొట్టవలెరా మరునిరాజ్యం —
కట్టవలెరా గండపెండెం రసికమండలిలో.'

ఇందులో మొదటిమూడు పాదములలోని పట్టవలెరా, కొట్టవలెరా, కట్టవలెరా అను మూడు పదములు ఒకేలయలో, ఒకేతూగులో పేర్చబడుటవలన రచనలో ఔద్ధత్యమేర్పడినది. రాజు దుష్టశీలమునకు దోహదము కలిగినది.

3. 'పూర్ణమ్మ'లో గురజాడ చతురస్రగతిని ప్రయోగించెనని ఈ వరకే వ్రాసితిని. ఇది 'తకకిట'యను నాలుగు మాత్రలతో నడచు ఛందస్సు. ఇందులో మొదటి మూడు పాదములు సమమాత్రలు కలిగినవే. 4 వ పాదములో మాత్రము 16 మాత్రలకు బదులుగా 13 మాత్రలే యుండును. దీనితో ప్రతి Stanza పిమ్మట ఊపిరి తీసికొనుటకు వీలుకలుగును. కథాకథన పద్ధతి కీరీతి ఉపయోగకారి. 4 పాదములు సమానమాత్రలలో సరిపెణలవలె సాగినప్పుడు ఊపిరాడని స్థితి కలుగును. వర్ణనల సందర్భమున ఈ రచన ఉపయుక్తమే; కాని కథాకథన పద్ధతి కిది అంత అనువైనదికాదు. గురజాడ రచనలలో చాలభాగము కథనశైలిలో నున్నవి కాబట్టియే వారు 4 వ పాదమును కొంత తగ్గించి ప్రయోగించినారు. అందులో 'పూర్ణమ్మ'వంటి కరుణరసాత్మకమైన కథాకావ్యమునకు 4 వ పాదములో 3 మాత్రలు తగ్గుటతో ప్రతి Stanza చివర 3 మాత్రలకాలము విశ్రాంతికి వీలుచిక్కి కథాకథనమునకు బలమేర్పడినది.

'మేలిమిబంగరు మెలతల్లారా
కలువలకన్నుల కన్నెల్లారా
తల్లులగన్నా పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను.'

ఈ విధముగా ప్రతి Stanza దేనికది స్వతంత్ర కావ్యఖండముగా ఉండిపోవుటకు వీలు కలిగినది.

4. గురజాడవారు యతిప్రాసలను కేవలము ఐచ్ఛికములుగానే స్వీకరించినారని ఈ వరకే వ్రాసియుంటిని. 'లవణరాజుకల' అను కథాత్మక ఖండకావ్యమున వీరు సగమునకుపైగా ప్రాసనియమమును పాటించిరి. ఇందులో 96 Stanza లున్నవి. వానిలో దాదాపు 58 Stanza లలో ప్రాసనియమము (3 పంక్తులకు మాత్రమే) పాటింపబడినది. ఇక 'డామన్ పితియస్'లో మాత్రము 4,5 Stanza లలో తప్ప అంతట ప్రాసమును పాటించిరి. ప్రాసమనగా ప్రతి పాదములో ద్వితీయాక్షరసామ్యమే కదా. ఒకే అక్షరము పునరుక్తమైనప్పుడు కలుగునది చమత్కారము. 'డామన్ పితియస్' కథనకావ్యము కాబట్టి అర్థగతమైన చమత్కారముతో పాటు, శబ్దగతమైన చమత్కారమునుగూడ ఆశించి గురజాడవా రీపద్ధతి నవలంబించిరేమో.[1]

1. వీరు వేసెడి కొన్ని ప్రాసము లిట్లుండును. 1. అలరు – అలమి – ఉల్లము, 2. కాని – కనుల – పనులు. 3. కష్ట – గోష్ఠి – ఇష్ట. వీనిలో మొదటిదానిలో 'ల'కు ద్విత్వ 'ల'కు ప్రాసము. రెండవదానిలో దీర్ఘపూర్వాక్షరమునకు, హ్రస్వ పూర్వాక్షరమునకు ప్రాసము. 3 వ దానిలో ష్ట, ష్ఠ లకు ప్రాసము. ఇట్టి వింకను గలవు.

### నీలగిరి పాటలు :

గురజాడవారు ముత్యాలసరములకు ముందుగా వ్రాసినపాట లివి. వీనిలో ఏ నవ్యతయు లేదు. మన ప్రాచీనకీర్తనల పరిమళము నలదుకొన్న శుద్ధసాంప్రదాయికమైన రచనలు. ఇవి మొదట 1909 లో ఆంధ్రభారతిలో ప్రచురింపబడినవి. తర్వాత పుస్తకరూపమున వెలువడినవి. ఇటీవల 'ముత్యాలసరాల' సంపుటిలోనే చేర్చబడినవి. ఇవి మొత్తము ఆరుపాటలు. వీనిలో ఖండగతిలో (జంపెతాళము) నడచుపాట 'లేవొకోమంత్రము' అనునది. త్ర్యస్రగతిలో (రూపక తాళము) నడచుపాటలు రెండు, 'ఊటిచోద్యమేమి చెపుదు', 'నాటిమాట' అనునవి. మిశ్రగతిలో (ఆదితాళము) నడచుపాటలు రెండు, 'ఉమాపతి యర్చన', 'చిత్తరువనిచూడ' అనునవి. ఇక చతురస్రగతిలో నడచుపాట ఒకటి. అది 'నీలగిరిపాటలు' అను శీర్షికతో ప్రచురింపబడిన మొదటిపాట. వ్రాసినవి ఆరుపాటలేయైనను వానిని నాలుగు విభిన్నగతులలో నడిపించుట ప్రత్యేకత. ఇవి కేవలము సాంప్రదాయిక మార్గమున రచింపబడినవి. ఈ పాటలన్ని అన్నమాచార్య కీర్తనలను పోలియున్నవి. ముఖ్యముగా 'లేవొకోమంత్రము'లనునది అన్నమయ్య పాటలను అధికముగా తలపింపజేయును. ఈ పాటలలో ఒకటి తప్ప మిగిలినవన్నియు పల్లవి, అనుపల్లవి, చరణములను విభాగముతో వ్రాయబడినవి. నీలగిరి వస్తువగుట కొంత నవ్యమైనది. 'ఊటిచోద్యమేమి చెపుదు'వంటి కొన్ని యెత్తుగడలు నవ్యమైనవి. మిగిలిన రచన భావవిషయమున భాషావిషయమున పరమ సాంప్రదాయికముగానున్నది. నీలగిరి 'బృందారకముని బృంద సేవితమగు నందనవనము'తో పోల్చబడినది. 'అచ్చరఁగేరెడు మచ్చెకంటులిట మించుతీవలన మించిచరింతుర'ని వర్ణింపబడినది. అక్కడ విరిసిన 'విరులు ఇక్షుధన్వుదొన'లట. ఆ పర్వతముపైగల హ్రదములు 'శివుని జటాజూటమునను గంగపగిది' మాటుమణగి యున్నవట. అక్కడి 'వెండిమబ్బులు'; 'వెన్నునిసిగనమరియున్న వేల్పుతరువు విరులమాడ్కి' నున్నవట. 'చిత్తరువనిచూడ' అనుపాటలోని 'మత్తకాశిని', 'చిత్తజునపరంజిచిలుక'యట. ఆమె రాక నభ్యర్థించు ప్రియుడు చేయునది 'విరివిల్లుపైనాన' యట.

ఈ విధముగా నీలగిరిపాటలలో భావము, భాష కేవలము సంప్రదాయబద్ధమైనవే. చివరికి అరసున్నలు, శకటరేఫములుగూడ విస్మరింపబడలే దీపాటలలో. పాటలన్నిటిలో ప్రాయికముగా ప్రాసనియమము, కొన్నిచోట్ల యతినియమము పాటింపబడినవి. ఉపమలు, ఉత్ప్రేక్షలు ప్రాచీన కావ్యములలోనివేయని నేను పైని ఇచ్చిన ఉదాహరణమువలన తేలినది. శారీరకస్థితినిబట్టి అప్పారావుగారు ఏటేట ఊటీ వెళ్ళెడివారు. ఆ విధముగా తమ తనుమనస్సుల నాకర్షించిన 'ఊటీ'పై కృతజ్ఞతతో వ్రాసిన పాటలివి; 'ప్రయోగదృష్టి'తో వ్రాసినవికావు. అందువలననే వీనిలో నవ్యత యేమాత్రము లేదు.

### ఇతర కవుల ప్రభావములు :

గురజాడపై ఇరువురు మహాకవుల ప్రభావమున్నది. ఒకరు వర్డ్సువర్తు; రెండవవారు రవీంద్రుడు. ఈ యిరువురినిగూర్చి అప్పారావుగారు ప్రశంసా పూర్వకముగా వ్యాసములు

వ్రాసినారు. రవీంద్రునితో ఉత్తరప్రత్యుత్తరములుగూడ జరిపియున్నారు. అయినను వర్డ్సువర్తు కవిత్వప్రభావ మీకవిపై ప్రసరించినట్లు రవీంద్రుని రచనల ప్రభావము పడలేదు. రవీంద్రుని వ్యక్తిత్వవిశిష్టతమాత్ర మితని నాకర్షించినది. మొదట వర్డ్సువర్తు ప్రభావమును పరిశీలింతము.

### వర్డ్సువర్తు; గురజాడ :

1. వర్డ్సువర్తు Lyrical Ballads ద్వితీయ ముద్రణపీఠికలో ప్రకటించిన కవితాసిద్ధాంతములకు గురజాడవారి ముత్యాలసరములలో ప్రతిబింబించిన కవిత్వతత్త్వమున కెంతో సాదృశ్యమున్నది. గోపనమునకు, కృత్రిమత్వమునకు దూరముగా, నిసర్గసుందరముగానుండు ప్రకృతి యొడిలో పుట్టిపెరుగు పల్లీయుల బ్రతుకుతీరులను కవితావస్తువుగా చేసికొనవలెనని వర్డ్సువర్తు అభిప్రాయపడెను, అతని మైకేలు, గురజాడ లవణరాజుకలలోని మాలెత ఆ దృష్టితో నిర్మింపబడిన పాత్రలే.

2. కవితారంగమున నేపథ్యములో నుండిపోయిన ప్రకృతికి గజ్జెకట్టించిన మహాశయుడు వర్డ్సువర్తు. అతనికి ముందున్న కవు లక్కడక్కడ చిత్రించిన ప్రకృతి ప్రాచీనప్రబంధముల నుండి ఎరువుతెచ్చుకొన్నది. ప్రత్యక్షదర్శనమువలన అనుభవించినదికాదు. వర్డ్సువర్తు అట్లు కాక తాను తనివితీర దర్శించిన ఋతుపరివర్తనమును, కొండలను; నదీనదములను, పూలను, గాలిని, నింగిని, నేలను స్వభావరమ్యముగా వర్ణించెను. మానవుని వయోదశలలో మొదటిదియు, అన్నిటికన్న నిష్కల్మషమైనదియునగు బాల్యమును మిన్నులకెత్తుట ఈయన ప్రత్యేకత. పసివానిని పరమర్షిగా, శిశువును భవిష్యత్పితగా భావించుట ఈయన విశిష్టగుణములు. అప్పారావుగారుగూడ, తమకుపూర్వము కవిసమయ పంజరములో చిక్కిన ప్రకృతికి విముక్తి కలిగించినారు. తెలుగుదేశములో తాము కనులారచూచిన ప్రకృతిదృశ్యములనే మనసార వర్ణించినారు. ప్రభాత వర్ణనలో ఆయన చూపిన వాస్తవికత ఈ వరకే పరిశీలించిచూపినాను. 'లవణరాజు కల'లో ఆయనచేసిన వర్ణనచూడుడు.

"తాడివనములు తూర్పుకొండను
గొడుగులెత్తెను; చామరంబులు
నిడిపెజీలుగు, ఉడుగణంబులు
దవ్వులను నిలిచెన్.
చల్లగాలులుసాగె యలలుగ
జల్లుజల్లున రాల్చెపూవులు."

'డామన్ పిథియస్'లో కొండకోన ప్రక్కనున్న భవనరాజము, దానిలోని నారింజచెట్లు, ఆలివుచెట్లు, ద్రాక్షపందిరులు ప్రకృతివర్ణనలలో చేరిన రమ్యవిషయములు 'పూర్ణమ్మ'లో దుర్గాదేవి మందిరచిత్రణ మిట్లున్నది.

"కొండలనడుమను కోనొకటున్నది
కోనకినడుమా కొలనొకటుంది
కొలనిగట్టునా కోవెలలోపల
వెలసెను బంగరుదుర్గమ్మ."

ఇక పూజారింటబుట్టిన పూర్ణమ్మ "ఏయేవేళల పూచేపువ్వుల ఆయావేళల" దుర్గకు అందించెడిదట. "ఏయే ఋతువుల పండేపళ్ళను ఆయా ఋతువుల"లో అందించి బంగరు దుర్గను భక్తితో కొలిచెడిదట. వసంతాగమనముతో ఆ ప్రకృతిలో కలిగిన పరిణతిని గురజాడ వారు చిత్రించిన తీరు ప్రకృతి కవిత్వమునకు తురాయివంటిది.

"ఆమనిరాగా దుర్గకొలనులో కలకలనవ్వెను తామరలు
ఆమనిరాగా దుర్గవనములో కిలకిలపలికెను కీరములు."

ఈ విధముగా వర్డ్సువర్తు కవివలెనే గురజాడవారు ప్రకృతిని ఊహల ఇంద్రజాలములేని స్వభావరమ్యదృష్టితో చిత్రించినారు. ఇదే వారి ప్రత్యేకత. గురజాడవారి కవితా సంపుటిలో లేని ప్రకృతివర్ణనలు కొన్ని వారి 'మాటామంతీ'లో దొరికినవి. 'ప్రకృతి అనే పుస్తకం'అను శీర్షికతో వారు చేసిన వర్ణనలు వర్డ్సువర్తు మున్నగు 'ప్రకృతికవుల' రచనలు కేమాత్రము తీసి పోవు. ప్రకృతిని పుస్తకముగా భావించుట వర్డ్సువర్తు ప్రభావమే. ప్రకృతిని ఒజ్జగా భావించిన తొలికవి వర్డ్సువర్తు. అప్పారావుగారు పైశీర్షికక్రింద ప్రకృతి దర్శనముతో తమలో కలిగినభావ పరంపరలను వర్ణించినారు. ఇవి వచనములో నుండుటవలన కవిత్వముక్రిందికి రాకున్నను, కొంత వరకు వచనగీత పరిమళమును గుబాళింపజేయుచున్నవి.[1] మచ్చున కొకటిరెండు పొందుపరుతును.

"వానవెలిసెను. నీటి బిందువులు ఆకులనంటి చెట్లను ముత్యములతో గప్పియున్నటుల చేసెను. వెలగాడ కొండపై వొక నల్లని మేఘపుళకలము చందురునిపై సన్ననిబట్టవలె కమ్మి మళ్ళీ అంతలోనే పక్కకు వొత్తిగిలినది. పొన్నాకులపై చంద్రకాంతి ప్రతిఫలించి ఆకులకు తళతళ మెరుగులు పెట్టినది."[2]

"గాలి యీలలువేస్తూ తలుపుసందుల దారిచేసికొని ధ్వనిచేస్తున్నది.........గుంపులు గుంపులుగా సైనికులవలె నిల్చున్న తాటిచెట్లు...చిన్నచిన్న మేఘములు అభ్రకమువలె తెల్లగా వున్నవి. గాలికి దూదిపింజలవలె మబ్బులు తేలిపోతున్నవి."[3]

"కొండచిలువవలె భయంకరమైన కళ్లుపెట్టుకొని కోటవద్దనుంచి రైలు వస్తోంది".[4]

1 'లయ' యన్నది ఈ వర్ణనలలో లేదు. అది యొక్కటి యున్నచో ఇవి వచన గీతములే అయి యుండెడివి.
2. 'మాటామంతీ – అవీ ఇవీ' : పుట 83.
3, 4. 'మాటామంతీ - అవీ ఇవీ' : పుట 85, 86.

ప్రకృతి నీవిధముగా వర్ణించుట ఆనాడు గణనీయ నవ్యత. ఈ వర్ణనలలో కనిపించు తాటిచెట్లు అప్పారావుగారి కవిత్వమున రెండుమూడుసార్లు చోటుచేసికొన్నవి.

3. కవిత్వమునకు ప్రయోజనముండవలెనని వర్డ్సువర్తుకవి భావించెను. Lyrical Ballads పీఠికలో అతడిట్లనెను.

"—The poems in these volumes will be found distinguished at Least by one mark of difference, that each of them has a worthy purpose." తాను ప్రయోజనగర్భితమైన రచనలు చేసినానని చెప్పుచు వర్డ్సువర్తు Idiot Boy, Mad Mother, We Are Seven అను రచనలను పేర్కొన్నాడు. ఇవి సందేశాత్మకమైన రచనలు.

అప్పారావుగారు కవిత్వమునకు గొప్ప సాంఘిక ప్రయోజనమున్నదని భావించిరి. వారి కన్యాశుల్కము సమాజములోని కుళ్లు నెత్తిచూపుటకు ఉపయుక్తమైన రచన. వారి ముత్యాల సరములలో ముత్యాలసరమను గేయము సంఘమున పాతుకొనిపోయిన మూఢవిశ్వాసముల కెదురుదిరిగిన రచన. అట్లే వారి దేశభక్తి, పూర్ణమ్మ, కన్యక మున్నగునవి సాంఘికనైతిక ప్రయోజనమును ప్రతిపాదించిన కావ్యఖండములు. కావ్యప్రయోజనమునుగూర్చి అప్పారావుగారే స్వయముగా ఇట్లనిరి.

"Literature cannot have a higher function than to show up such ను (bad) practices and give currency to a high standard of moral ideas".[1]

4 కవిత్వమున కలంకారప్రాయమని పలువురు భావించెడు శైలీప్రాబల్యము (Diction) ను వర్డ్సువర్తు నిరసించెను. ఆయన ఇట్లు వ్రాసెను. "There will also be found in these volumes little of what is usually called poetic diction; I have taken as much pains to avoid it as others ordinarily take to produce it."[2]

అప్పారావుగారు కృత్రిమపదబంధములను, అసహజమైన శైలిని ఏ విధముగా నిరసించినది ముందే తెలిపియుంటిని.

5. పద్యగద్యములకు భేద మంతగాలేదన్న సిద్ధాంతము వర్డ్సువర్తు ప్రత్యేకతగా కనిపించును. వచనమువలెనున్న కవిత్వమును Prosiasm పేరుతో ఈసడించు విమర్శకుల నాతడు విమర్శించెను. ఛందస్సు (Metere) ను వదలినచో ఉత్తమ కావ్యములనబడుచున్న వానిలో అధికభాగము వచనసదృశమైనదేయని అభిప్రాయపడెను. మిల్టన్ వ్రాసిన Paradise Lost కావ్యమున రసవత్తరమైన ఘట్టములలో చాలభాగము వచనసమ్మితమే యనెను. పైగా వర్డ్

1. కన్యాశుల్కము మొదటికూర్పు పీఠికలో. (కావ్యం....ఉపదేశయుజే' యన్న ప్రాచీన సూక్తికి సరిపడుచున్నదిది.)

2. Lyrical Ballads: ద్వితీయ ముద్రణ పీఠిక.

ఛందస్సువలన కలిగెడు ఆనందము స్వల్పమని, వస్తుచిత్రణములో నేర్పు చూపవలెనుగాని ఛందస్సులో ఏ మున్నదని నిరసించెను.

అప్పారావుగా రిట్టిసిద్ధాంతములు చేయనప్పటికిని, ఆయన లక్ష్యరూపమున ఈ బాటనే అనుసరించెను. పద్యకవిత్వమునకు పరంపరగా ప్రాప్తించిన కృత్రిమత్వము నీతడు త్రోసి పుచ్చి, దేశిచ్ఛందస్సులను స్వీకరించి, వానిని వచనమునకు దగ్గరగా నడపెను. పద్యమునకున్న నిర్బంధములను (యతిప్రాసలనిర్బంధములు) తృణీకరించుటతో, సరళమైన గేయచ్ఛందస్సులలో కవిత్వము చెప్పుటతో, ఈతడు వర్డ్సువర్తు సిద్ధాంతమునకు సన్నిహితుడైనాడు.

6. వర్డ్సువర్తు వ్రాసిన చిన్న చిన్న కధాకావ్యములచేతగూడ అప్పారావుగారు ప్రభావితులై యుందురు. వర్డ్సువర్తు వ్రాసిన Narrative Poems వంటివే వీరి 'లవణరాజుకల', 'డామను పితియస్' మున్నగునవి. వర్డ్సువర్తు 'Lucy Gray' అను గేయము 'పూర్ణమ్మ'ను తలపింప జేయును. రెంటి అవసానము విషాదాంతమే. 'Lucy Gray' లోని And many a hill did Lucy climb; But never reached the town' అన్నప్పుడు 'పూర్ణమ యింటికి రాదాయే' అన్నమాటలు తళుక్కుమనును.

'Yet some maintain that to this day
She is a living child;
That you may see sweet Lucy Gray
Upon the lonesome wild'

అన్న పాదములు రేఖామాత్రముగా

'కన్నులకాంతులు కలవలచేరెను
మేలిమిజేరెను మేనిపసల్
హంసలజేరెను నడకలబెడగులు
దుర్గనుజేరెను పూర్ణమ్మ'

అను పంక్తులను స్మరింపజేయును, 'Tempest'లో షేక్స్పియరు దీనికి కొంచెము పోలిక లున్న భావములే వెల్లడించెను.

'Full fathom five thy father lies
Of his bones are coral made
Those are pearls that were his eyes
Nothing of him that doth fade
But doth suffer a sea-change
Into something rich and strange.'

ఇది టెంపెస్టునాటకములో Ariel పాడిన పాట. Ferdinand తో (నాయకుడు) అతని తండ్రి చనిపోయినాడని కల్పించి Ariel ఈ విధముగా అనెను. పైవాని యర్థమిది. 'అతని యెముకలు పగడపు దీవులలో కలసిపోయినవి. కనులు నక్షత్రములుగా మారినవి. శరీరములో ఏ భాగము నశింపలేదు. అందముగా రూపాంతరము పొందినది.' పూర్ణమ్మ శరీరముకూడ నశించినట్లుకాక రూపాంతరము పొందినట్లే వర్ణింపబడినది. కాబట్టి ఈ రెంటిలో పోలికలున్నట్లు స్పష్టపడినది. కాళిదాసరచిత రఘువంశములోని అజవిలాపమునగూడ ఈ పంక్తులను స్ఫురింప జేయు శ్లోకమున్నది. ఇందుమతీ మరణానంతరము అజు డీవిధముగా విలపించును.

శ్లో॥ 'కలమన్యభృతాసు భాషితం కలహంసీషు మదాలసం గతం
పృషతీషు విలోలమీక్షితం పవనాధూతలతాసు విభ్రమః.'

దీనిలో నడకలను కలహంసలయందు చేర్చిపోయినదనుట గురజాడవారి రచనకు మాతృక యన్నట్లున్నది.

ఇంగ్లీషు కాల్పనిక కవులలో వర్డ్సువర్తు ధోరణి విలక్షణమైనది. ఈతని కావ్యవస్తువును, రచనారీతిని, భావవ్యక్తీకరణ పద్ధతిని షెల్లీ కీట్సు మున్నగు కాల్పనికకవు లంతగా ఆదరించ లేదు. అయినను కాల్పనికోద్యమ ప్రవక్తలలో ప్రథముడుగా వర్డ్సువర్తునే పరిగణింతురు. అట్లే అప్పారావుగారి రచనారీతులను తరువాతి భావకవులలో ప్రముఖులగు కృష్ణశాస్త్రి, వేదుల, నాయనిమున్నగువా రనుసరించలేదు. అయినను వర్డ్సువర్తువలె విలక్షణమైన కవితాముద్రగల కాల్పనికకవి అప్పారావుగారు.

### రవీంద్రుడు; గురజాడ :

రవీంద్రుడు, గురజాడ ఒకేసంవత్సరము (1861) లో జన్మించిన కవీంద్రులు. రవీంద్రుని రచనలు గురజాడవారి నమితముగా ఆకర్షించుటవలన అతనితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటయేకాక, కలకత్తావెళ్ళి అయనను దర్శించుకొన్నాడు. రవీంద్రుడు దేశీయచ్ఛందస్సు నకు కావ్యయోగ్యత కలిగించిన ప్రయోగశీలి. ఏకేశ్వరత్వమును విశ్వసించి, అంధవిశ్వాసము లను ప్రతిఘటించిన మహనీయుడు. అందువలన రవీంద్రుని వ్యక్తిత్వము గురజాడవారిని ప్రబలముగా ఆకర్షించినది. అయినను గురజాడవారు రవీంద్రుని వ్యక్తిత్వముద్వారా ప్రభావితు లైనారే కాని ఆయన రచనల ననుకరించినవారు కారు. ఇరువురిలోని ధర్మసామ్యము యాదృచ్ఛి కముగా సంభవించినదే కాని ఆదానప్రదానములవలన సంక్రమించినది కాదు.

### సమాన ధర్మములు :

ఇరువురు కవీంద్రులు తమ రచనలద్వారా, కాలగతి నెదురొడ్డి నిలువగలిగిన — కాలపరీ క్షల కాగగలిగిన - సార్వజనీనతను, శాశ్వతత్వమును సాధించిరి. ఆంగ్లేయులను ద్వేషించకయే జాతీయతను, దేశభక్తిని ప్రబోధించిరి. ఇరువురిని మానవోద్యమము ప్రబలముగా ఆకర్షించినది.

మానవునిలోని దివ్యాంశపు నివాళులెత్తుటయే యిరువురి ఆశయము. ఇరువురును మానవ ప్రేమికులు. ఇరువురికి ప్రకృతియే ఆరాధ్యము. గురజాడ ప్రకృతియను పుస్తకము అన్ని పుస్తకములకన్న మిన్నయని భావించెను. ఇరువురును ఖండకావ్యములద్వారా అఖండ రసస్పృష్టి చేసిరేకాని, మహాకావ్యరచన జోలికి పోలేదు.

గురజాడ వ్రాసిన 'మనిషి' అనుగేయమునకు 'గీతాంజలి'లోని ఒక గేయమునకుగల భావతుల్యత స్పష్టముగా కనిపించుచున్నది. ఇరువురిలో ఎవరోయొకరు మరొకరి ననుకరించిరేమోయన్నంత సమానధర్మములు గలిగియున్నది. ఆ రెంటిని పొందుపరిచి చూపుదును.

'మ ని షి'

మనిషిచేసిన రాయిరప్పకి
మహిమకలదని సాగిమొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం

గాను చూస్తావేల బేలా ?
దేవుడెకడో దాగెనంటూ
కొండకోనల వెతుకులాడే
వేలా ?

కన్నుతెరిచిన కానబడడో ?
మనిషిమాత్రుడియందు లేడో
యెరిగికోరిన కరిగియీడో
ముక్తి."

ఇక 'గీతాంజలి'లోని క్రింది గేయమును గమనించుడు.

"Whom dost thou worship in this lonely dark corner of temple with doors all shut ? Open thine eyes and see thy God is not before thee ! He is there where the tiller is tilling the hard ground and where the path-maker is breaking stones. He is with them in sun and in shower and his garment is covered with dust ........................ Come out of thy meditations and leave aside thy flowers and incense."[1]

1. 'గీతాంజలి' లో XI వ గేయములోని కొంత భాగము.

చిత్రమేమనగా గురజాడవారిగేయము రవీంద్రుని గీతాంజలి (ఇంగ్లీషులో) వెలువడక ముందే రచింపబడినది. గురజాడవారి 'నరులచెమటను తడిసి మూలం ధనం పంటలు పండ వలెనోయ్' అన్న భౌతిక (ఆర్థిక) దృక్పథమును రవీంద్రుడు కుటీరపరిశ్రమలను ప్రోత్సహించుటకై స్థాపించిన సంస్థ (శ్రీ నికేతనము) ద్వారా నిరూపించెను. ఈ విధముగా తుల్యభావములు కలిగిన కవులు వీరు.

### మానవతా వాదము :

దీనిని Humanism అను పదమునకు సమానార్థకముగా వాడుచున్నారు. పాశ్చాత్య దేశములందు అంకురించి వర్ధిల్లిన ఈ వాదము బ్రహ్మసమాజముద్వారా తెలుగుదేశములోని కొందరు విజ్ఞులపై ప్రభావమువేసినది. గురజాడ బ్రహ్మసమాజమున కతీతుడు. మానవ కారుణ్య విషయములో మాత్రము బ్రహ్మసమాజమత సిద్ధాంతము ననుసరించినాడు. అంతే. వాస్తవమున కతడు ఒక మతమునకు ముడివడియున్నవాడు కాడు. పాశ్చాత్యలోకమున రాజరికము, ఫ్యూడలిజము నశించిపోయిన పిమ్మట విజృంభించిన ఉద్యమము మానవతావాదము. ఈ ఉద్యమము సామాన్యునికి సార్వభౌమత్వము ప్రసాదించినది. కులమతభేదములను కూకటివేళ్ళతో పెల్లగించుటకు ప్రయత్నించినది. మానవులందరికి స్వామ్యము, సామ్యము ఉండవలెనని ఎలుగెత్తి చాటినది. వ్యక్తిస్వేచ్ఛను బలపరిచినది. అంధవిశ్వాసములకు స్వస్తిచెప్పి విజ్ఞాన చక్షుస్సు నందించినది. శాస్త్రీయదృక్పథమును పెంపొందించినది. వాస్తవికతకు నీరాజనము పట్టినది. దీని ప్రాబల్యముతో మానవుల మధ్యనున్న కృత్రిమమైన కుడ్యములు, ఎల్లలు తొలగిపోయినవి. ఈ మహోద్యమ ప్రభావమే గిడుగు, కందుకూరి, గురజాడల దృక్పథములలో అంతస్సూత్రముగా ప్రవహించినది. కందుకూరి స్త్రీజనోద్ధరణకై, దురాచార నిర్మూలనకై చేసిన కృషికి ఈ మానవతావాదమే పునాది. గిడుగువారు కృతకభాషకు బంధవిముక్తి కలిగించుటకు, సామాన్యుని నుడికి గుడికట్టించుటకు చేసిన అనంతకృషి మానవోద్యమస్పర్శ కలిగియున్నదే. గురజాడవారి కన్యాశుల్కములో ఈ మానవతావాదమే తొంగిచూచుచున్నది. మధురవాణి పడుపుకత్తెయైనను ఆమెలోని ఉత్తమత్వమును ప్రదర్శించుటకు ప్రయత్నించుట, ప్రమాదవశమున నైతికముగా కాలుజారిన బుచ్చమ్మవంటిపాత్రలపై సానుభూతి గలుగునట్లు చిత్రించుట, మానవోద్యమమునకు సంబంధించినవే. ఇక ముత్యాలసరాలలో 'మనిషి' అన్నగేయము మానవోద్యమమునకు అచ్చమైన ప్రతినిధిరచన. 'మనిషి' చేసిన రాయిరప్పకు మహిమకలదని మ్రొక్కుచు, 'మనుష'లనే రాయిరప్పలకన్న కనిష్ఠముగా చూచెడివారి నీ గేయములో వారు నిరసించిరి. దేవు డెక్కడో కొండకోనలలో లేడని, జ్ఞాననేత్రము విప్పిచూచినచో మానవ మాత్రునిలోనే యున్నాడని ప్రబోధించిరి. ఇది మానవతా వాదమునకు సంబంధించిన దృక్పథమే. ఈ గేయముద్వారా వారు మానవునిలోని దివ్యాంశకు నివాళులెత్తిరి. మానవుని కీయవలసిన విలువను ప్రబోధించిరి. అట్లే 'ముత్యాలసరములు' అన్న గేయములో ముందుముందు జాతి బంధములనెడు గొలుసు లూడిపోవునని, యెల్లలోక మొక్కయిల్లగునని, మతములన్నియు

మాసిపోవునని, జ్ఞానమొకటియే నిలిచి వెలుగునని భవిష్యద్యుగమునకు నాంది పల్కిరి. గురజాడవారి క్రాంతదర్శిత్వమునకు, మానవపారమ్యదృష్టికి ఈ యభిప్రాయములు ముకుర సదృశములు.

### సంఘ సంస్కరణము :

మానవతావాదములో గర్భితమైయున్న అంశమిది. వంగదేశమున రామమోహనరాయలు, తెలుగునాట కందుకూరి, రఘుపతి వేంకటరత్నం నాయుడుగారలు ఈ సంఘసంస్కరణోద్యమమునకు మూలపురుషులు. గురజాడవారు సంఘములోని జంబాలమును కడిగివేయుటకు 'కన్యాశుల్కము' రచించిన ట్లీవరకే మనవిచేసితిని. ఆయన గేయములలో అనేకసందర్భములందు సంఘసంస్కరణదృష్టి వజ్రధారాధాళధళ్యములు వెలార్చుచున్నది. ముత్యాలసరాలలో మొదటిగేయము తోకచుక్క పొడుచుటవలన ఏదో అనర్థము సంభవించునను మూఢవిశ్వాసమును ఖండించుటకు వ్రాసినది. 'ధూమకేతువు'ను 'వేల్పులలనల కేలివెలితొగ'గా వారు భావించిరి. సందేశ సౌందర్యములకు వంతెనవేసిన ఘట్టమిది. అందుకే దానిని 'నింగితొడవు'గా ఉత్ప్రేక్షించిరి. అది యిదియనుట యెందుకు ? తాను దానిని 'సంఘసంస్కరణ ప్రయాణ పతాకగా' భావింతునని మంద్రగంభీర స్వరమున ప్రవచించిరి. గాంధీజీ హరిజనోద్యమము ప్రారంభించకముందే వీరు 'లవణరాజుకల'లో

'మలినదేహుల మాలలనుచును
మలినచిత్తుల కధికకులముల
నెలవొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే'

యని, మాలయన్న భేదము కులమునుబట్టికాక మనస్సునుబట్టి కలుగవలెనని ప్రతిపాదించి ప్రాచీన వర్ణవ్యవస్థను ఖండించిరి.

'మంచిచెడ్డలు మనుజులందున
ఎంచిచూడగ రెండెకులములు
మంచియన్నది మాలయైతే
మాలనే అగుదున్'

అని హరిజనసమస్యకు, అస్పృశ్యతాసమస్యకు ఏనాడో కావ్యత్వము కల్పించిరి. 'పూర్ణమ్మ'లో వృద్ధవివాహమును నిరసించిరి. కాసుకులోనై కన్యలను ముసలివారికి ముడివేయు సాంఘికదురాచారమును ఖండించిరి. ఈ విధమైన అక్రమమునకులోనైన పూర్ణమ్మయను కన్య ఆత్మహత్యకు కడగిన విషయము కరుణరసమహితముగా చిత్రించి, సంఘములోనున్న ఆ దురాచారమును పెల్లగించుటకు పూనుకొనిరి.

ప్రేమ తత్త్వము :

గురజాడ ప్రతిపాదించిన ప్రేమ రెండువిధములుగా నున్నది 1. పవిత్రదాంపత్యరక్తి. 2. విశ్వమానవప్రేమ. ఈ రెంటిని తన కవిత్వముద్వారా నిరూపించినా డీకవీంద్రుడు.

1909 మే 1 వ తేదీని అప్పారావుగారు వంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలో ప్రేమతత్త్వమును మహోదారఫణితిలో నిర్వచించిరి. జీవితము నీటిబుడగవంటిదని, సౌందర్యము అశాశ్వతమని సిద్ధాంతములు ప్రవచించెడు వేదాంతులసూక్తులను లెక్కపెట్టవలసిన అవసరములేదని. జీవిత మశాశ్వతమైనంత మాత్రమున ఇంద్రియ సుఖములు పూర్తిగా వర్జనీయములుకావని, అయినను హద్దుమీరిన ఇంద్రియలోలత్వము తప్పక దూష్యమని స్పష్టపరిచిరి.

''మానవజీవితంలోకాని లేదా సారస్వత కల్పనలలోకాని ఎందులోనైనా స్త్రీ పురుష శారీరకానుభవాలూ, ఆనందాలూ, వాటి వర్ణనలూ తత్తదుచిత స్థానంతో వుండాలి. ఇపుడు వీటికి అనుచిత ప్రాధాన్యమిచ్చి గోరంతలు కొండంతలు చేస్తున్నారు.''[1]

ఇంద్రియ సుఖములను నిరసించకయే స్వచ్ఛమైన ప్రేమకు వీరు అగ్రస్థానమిచ్చిరి. అనగా గార్హస్థ్యధర్మమునకు లోబడియున్న ప్రేమను వీరు ప్రతిపాదించిరని తేలినది. దాని పరిధిని దాటిన శృంగారమును వీరు ఈసడించిరి. 'కావ్యాలలో శృంగారం' అను వ్యాసములో వీరేశలింగంగారిని తీవ్రముగా నిరసించిరి. ఇందుకు కారణము వీరేశలింగంగారు తమ 'అపూర్వ బ్రహ్మచర్య ప్రహసన'మను ప్రహసనమున పరకీయశృంగారమును నింపివేయుటయే. వీరేశలింగంగారిని మహాపురుషుడని ప్రశంసించిన గురజాడ; వారుచిత్రించిన అసభ్యశృంగారమును తీవ్రముగా విమర్శించెననగా, ఆయనకు సభ్యశృంగారముపట్ల, పవిత్ర ప్రేమపట్లగల అభిప్రాయ తీవ్రత గమనింపదగినది. ఈ సిద్ధాంతమును లక్షణమాత్రముననేకాక లక్ష్యరూపముననుగూడ గురజాడ నిరూపించెను. 'కాసులు' అన్న గేయము ఈ పవిత్ర దాంపత్యరక్తిని ప్రతిపాదించిన రచనయే. నగలు తేలేదని మగనిపై అలిగిన మగువ నుపలాలించు మాటలు ఇందులో చిత్రింపబడినవి. 'సతులనేరను కమలవనముకు పతులప్రేమయె వెవెలు'గని, 'ప్రేమకలుగక బ్రతుకు చీకటి'యని, 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును ప్రేమనిలిచిన ప్రేమనిలుచు'నని దీనిలో ప్రవచించిన సూక్తులు.

''మరులుప్రేమని మదిదలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మములేని నేస్తము

1. గురజాడ లేఖలు : పుట

మగువలకు మగవారికొక్కటె
బ్రతుకుసుకముకు రాజమార్గము''[1]

అను చరణములలో అప్పారావుగారు ప్రేమకు. కామమునకుగల భేదమును నిరూపించినారు. కామము వయసుతోనే చల్లారునని, అచ్చమైన ప్రేమయొక్కటే దంపతులపాలిటి రాజమార్గమని తద్వారా వారు జీవితమును సుఖమయముగా చేసికొనవచ్చునని స్పష్టపరిచినారు. ఈ విధముగా వీరు పవిత్రమైన దంపతీప్రేమకు పట్టాభిషేకము చేసినారు.

రెండవది విశ్వమానవప్రేమ. తోడిమానవుని హృదయమిచ్చి ప్రేమించుటకన్న ఘనకార్యములేదని అప్పారావుగారు భావించిరి. క్రీస్తు ఏది బోధించెనని యనుకొనుచున్నామో. షెల్లీ దేనిని కవితాసత్యమని కళావిలాసమని ప్రవచించెనో, దేనిని గౌతమబుద్ధుడు ఉత్తమ ఘంటాపథమని మనకు ఉపదేశించెనో, అదే నిజమైన ఉన్నతప్రేమయని వీరభిప్రాయపడిరి. అది యేదోకాదు, మానవజాతిపై మనకుండవలసిన ప్రేమ; అనగా విశ్వమానవ ప్రేమయే. అందుకే అప్పారావుగారు మతము నారాధించుటకన్న మానవుని ప్రేమించుట గొప్పయని చాటగలిగిరి. 1909 మే 21 వ తేదీని మునిసుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలో తమ అభిప్రాయము నిట్లుద్ఘాటించిరి.

''మతవిశ్వాసాలనేవి ఆచరణకు అసాధ్యమైనవి; నిరోధకమైనవి; గుదిబండలవంటివి. మానవుని ప్రేమించడమన్నది అతి సాధారణమైన జీవితసూత్రం. ఇతరులను ప్రేమించడంవల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తున్నది. మనం వొకరికియిచ్చే ప్రేమ మళ్ళీ మనకు ప్రేమను కొనితెస్తుంది. వొకరినొకరు ప్రేమించుకొనడం ఎంత మహత్తరమైనదని. ఈ భూమిమీదకు స్వర్గం దిగివచ్చినంత. భూలోక స్వర్గమే.''[2]

బ్రహ్మసమాజ మొకవైపు, వివేకానందుడు ప్రబోధించిన హైందవమత ప్రాశస్త్య మొకవైపు భారతదేశమునంతటిని లోగొనుచుండగా, మతముకన్న మానవప్రేమ గొప్పదని, మతము గుడిబండవంటిదని చాటగలిగిన ధైర్యము గురజాడవారి కుండెడిది. ఇరువదవశతాబ్ది వేగుబోకలోనే ఇంతటి విశాలమైన అభిప్రాయములు కలిగియుండుట గొప్పవిషయము. ఈ నాటికి ఆశ్చర్యము కలిగించు మహనీయమైన సిద్ధాంతములు గురజాడవారివి. ఈ విశ్వమానవప్రేమను వారు ముత్యాలసరాలలో మొదటి గేయములోనే

'యెల్లలోకము వొక్కయిల్లై వర్ణభేదములెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమబంధము వేడుకలు కురియ'

అను పంక్తులలో చాటినారు. నిర్వేలమైన ప్రేమయనగా విశ్వమానవ ప్రేమయే. వారి 'దేశభక్తి' గేయము ఈ విశ్వమానవ ప్రేమకు స్వర్ణపతాక.

1. ముత్యాలసరాలు : పుట 9. 2. మహాకవి లేఖలు : పుట 96.

'దేశమనియెడు దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్' అనియు
'అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్'అనియు

అప్పారావుగారు విశ్వమానవప్రేమను శంఖమొత్తి చాటినారు. ఇక ప్రత్యేకముగా వారి దేశభక్తి సిద్ధాంతమును పరిశీలింపవలసి యున్నది.

**దేశభక్తి:**

గురజాడవారిది ప్రాంతపుటెల్లలను, దేశసీమలను, జలధులను దాటిన విశాలదృష్టి. ఆయన దేశభక్తిలో అంతర్వాహిని విశ్వమానవప్రేమ. దేశభక్తినిగూర్చి ప్రసంగవశమున వారు గిడుగు సీతాపతిగారితో నిట్లనిరట.

"చూశావా ! ఈ దేశభక్తి, ఈ స్వదేశాభిమానం, మన హృదయాన్ని ఎంత సంకుచిత మైనదానిగా చేస్తుందో. నలుగురితోపాటు నేనును, మన భారతదేశం - అందులో మన తెలుగు దేశం - అందులో మన బ్రాహ్మణజాతి - అందులో మన ఆరువేల నియోగిశాఖ అని ఎంచు కుంటూ దురభిమానం పొందుతూ ఉంటాను. ఈ విధంగా మన అభిమానాన్ని అంతకంతకు సంకుచితం అయేటట్టు చేస్తుంది ఈ దేశాభిమానం. ఎంతో విశాలహృదయంతో చూస్తేనేకాని ఈ విశ్వమంతా మనదే అనే సర్వజనీనమయిన అనురాగాన్ని పొందలేము."[1]

దేశాభిమానమునుగురించి ఇంతటి విశాలమైన నిశ్చితాభిప్రాయములున్నవారు కాబట్టియే వారు ముత్యాలసరాలలో, మూఢాచారములతో ముగ్గిపోవుచున్న దేశీయులను 'చన్నకాలపు చిన్న బుద్ధు'లని సూటిగా అధిక్షేపించిరి.

'కన్నుకానని వస్తుతత్త్వము కాంచనేర్పరు లింగిరీజులు;
కల్లనొల్లరు; వారివిద్యల కరచి సత్యము నరసితిఙ'

అని ఇంగ్లీషువారి వివేచనాత్మక దృష్టిని ప్రశంసించిరి.[2] అయినను బెంగాలీసాహిత్య ములో గొప్ప తిరుగుబాటుచేసిన మైకేలు మధుసూదనదత్తుగారికి వీరికి ఉన్న వ్యత్యాస మిక్కడనే యున్నది. మధుసూదనదత్తు దృష్టికి ఆర్యవీరులు కుటిలురుగా కనిపించిరి. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారన్నట్లు దత్తుధోరణి 'I hate Rama and his rabble but Ravana is a fine chap'[3] అనువరకు పోయినది. అప్పారావుగా రట్టివారు కానేకారు. వారికిగల జాతీ

1. పరిశోధన : గురజాడ ప్రత్యేక సంచిక : పుట 6.
2 అప్పారావుగారికి ఆంగ్లాభిమానము మెండు అన్నమాట సరియైనదికాదు. ఇది ముందు చర్చింపబడును.
3. 'తెనుగుదుక్కి'.

యాభియాన మెవరికిని వీగిపోనిది. కాని, వారి దేశభక్తి యెల్లల కతీతమైనదను విషయము విస్మరింపరానిది. విశ్వమానవుల జాతీయగీత మనదగిన ఆయన 'దేశభక్తి' గేయములో ఈ తత్త్వమే ప్రతిపాదింపబడినది. దేశమును ప్రేమించుమనెనేకాని 'ఫలానా' దేశమని అనలేదు. దేశభక్తి యనగా కేవలము నదీనదములను, కొండలను, కోటలను స్తోత్రము చేయుటకాదని, 'మనుష' లను ప్రేమించుటయే అచ్చమైన దేశభక్తియని సూచించిరి. 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్న పంక్తులలో ఈ మహత్తరసత్యమే ఇమిడియున్నది.[1]

### జాతీయ దృక్పథము :

అప్పారావుగారు మనవారిని 'చన్నకాలపు చిన్నబుద్ధు' లనుటవలన, వెంటనే ఇంగ్లీషు వారిని మిన్నులకెత్తుటవలన వారికి జాతీయాభిమానము లేదేమోయని అనుమానించుటకు వీలున్నది. ఇంగ్లీషువారు ప్రత్యక్షప్రమాణములనుతప్ప, అంధవిశ్వాసముల ననుసరించువారు కారని, వారికి 'తోకచుక్క' మున్నగువానిపై నమ్మకములు లేవని, మనమును వారివలెనే సత్యాన్వేషణదృష్టి పెంపొందించుకొని, గ్రుడ్డినమ్మకములను పోద్రోలవలెనని ప్రబోధార్థమై చెప్పిన మాటలవి. వానిని ప్రకరణమునుండి విడదీసి వ్యాఖ్యానించగూడదు. అప్పారావుగారి 'దేశభక్తి' గేయము భారతజాతిని దృష్టిలోపెట్టుకొని, అంతర్జాతీయ దృక్పథమునకు సమన్వయించునట్లుగా రచింపబడిన జాతీయరచన. మనదేశమున జాతీయోద్యమబీజములు పడకముందే అప్పారావుగారు పాశ్చాత్యనాగరకతను ప్రతిఘటించిన సందర్భములున్నవి. 1901 (అగస్టు 9) లో వారు వ్రాసికొన్న డైరీలోని క్రిందివాక్యములనుబట్టి వారి జాతీయదృక్పథము విదితమగును.

"పాశ్చాత్యనాగరికత కొన్ని అంధవిశ్వాసాలను పోగొట్టుతున్నమాట యధార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతి శూన్యమైనది. ఇది సంపూర్ణస్వాతంత్ర్యముకాదు. నామమాత్రమైనది. ఇది అన్యులకు చోటివ్వదు. ఇటువంటినాగరికత, మనుజులను అవలక్షణములకు, అస్థిరత్వమునకు, దోషములకు గురిచేసి, అక్కడకు తీసుకుపోయి దిగవిడవక తప్పదు."[2]

పారతంత్ర్యమునకు నిరసనగా అలనాడే అప్పారావుగా రింతటి తీవ్రాభిప్రాయములు ప్రకటించిరనగా వారికి దేశాభిమానము, జాతీయాభిమాన మెంతగాఢముగా నుండెనో మనమే ఊహించుకొనవచ్చును. ఇంగ్లీషువారి పాలనవలన వారి నాగరకతవలన మనకు సంక్రమించిన దుర్లక్షణములను ప్రతిఘటింపవలసిన అవసరమును వా రీవిధముగా ఉద్ఘాటించిరి.

"ఈ అవలక్షణములను, దోషములను, చెడుగులను......... దిగ్విజయముగా ఎదిరించి పోరాడుట నేటి ప్రప్రథమసమస్య."[3]

1. ఈ 'దేశభక్తి'గేయమును గురించి ముందుముందు చర్చింతును.
2, 3. మహాకవి డైరీలు : పుట 215.

1901 లోనే ఇంతటి తీవ్రమైన జాతీయాభిమానము కలిగియుండుట విస్మయావహమైన విషయము.

ఒకవైపు ఆంగ్లనాగరకతను ఆంగ్లపరిపాలనా వ్యవస్థను నిరసించుచు ఇంకొకవైపు వీలు చిక్కినపుడెల్ల అప్పారావుగారు భారతజాతి ఘనతను చాటుటకు ప్రయత్నించిరి. గోమఠం శ్రీనివాసాచార్యులుగారు ఇంగ్లీషులో రచించిన హరిశ్చంద్రనాటకమునకు తాము వ్రాసిన పీఠికలో భారతజాతి తాత్త్వికదృక్పథము శిఖరాగ్రముల నందుకొన్నదని, సత్యముపట్ల భారతీయులదృష్టి అమోఘమైనదని అభిప్రాయపడిరి. ఇక్కడ వారిమాటలనే పొందుపరుచుట మరింత ఉచితమని భావింతును.

"భారతీయుల ఆదర్శాలు యెట్టివో ఇతరదేశాల కారుణ్యవాదులకు హరిశ్చంద్రుని జీవిత కథ విశదపరుస్తుంది. అదేవిధంగా అది భారతీయులకు వొకవిషయాన్ని తేటపరుస్తుంది. శతాబ్దాల తరబడి రాజకీయ బానిసత్వంవలన మరుగుపడివున్న ఉదాత్త జాతీయ మనఃప్రవృత్తిని విద్యావంతులైన హిందువులకు బహిర్గతంచేసి, వారిలో వారి ప్రభావానికి లోనౌతున్న వ్యక్తులలో అట్టి ప్రవృత్తిని కలిగించడానికే ఇది దోహదపడవచ్చును.[1]

ఈ వాక్యములలో భారత జాతీయ జీవనక్షేత్రమున కలుగవలసిన భావి విప్లవమును అప్పారావుగారు చక్కగా ధ్వనింపజేసినారు. ఈ విధముగా జాతీయోద్యమ ప్రారంభమునకు ముందే చక్కని జాతీయ భావములు గలవారు వీరు. వీరు కవిత్వరూపమున ప్రకటించిన దేశ భక్తిమాత్రము విశ్వమానవప్రేమకు రూపాంతరము.

## కొన్ని ఖండకావ్యముల పరిశీలనము :

'ముత్యాలసరాల' సంపుటిలోని ముత్యాల సరములు, కాసులు, కన్యక, మనిషి, పూర్ణమ్మ అను గేయముల విశిష్టతను సందర్భమునుబట్టి వివరించితిని. ఇక మిగిలినవి లవణరాజుకల. డామన్‌పితియస్, దించులంగరు, లంగరెత్తుము, దేశభక్తి అను గేయములు. వీనిలో 'దించు లంగరు' అను గేయము ప్రథమ ప్రపంచ సంగ్రామమువిమ్మట వ్రాయబడినది. 'నరుల వీనుగ పెంట పోకల నాటివెలయును శాంతివృక్ష'మని శాంతిసందేశమునిచ్చు గేయమిది. 'లంగరెత్తుము' అను గేయము ఆత్మాశ్రయరీతికి చెందినది. బ్రతుకులోని చేదుతీపులకు, ఆదర్శములకు, వాస్తవ ఘటనలకు కలిగిన ఘర్షణను అప్పారావుగారు ఈ గేయమున రసవత్తరముగా చిత్రించిరి. ఈ గేయముగూడ ప్రథమ ప్రపంచ సంగ్రామజ్వాలలు జగత్తున కంటుకొనుచున్న కాలములోనే వ్రాయబడినది.

'డామన్‌పితియస్' అనునది గ్రీకు కథావస్తువు నాధారముగా జేసికొని వ్రాయబడిన కథా కావ్యము. ఇందులో ఆదర్శమైత్రి సరళ రమ్యరీతిలో చిత్రింపబడినది. శిల్పదృష్ట్యా దీనిలో విశేషములు లేవు.

1. మాటామంతీ : అవీఇవీ : పుట 117.

ఇక మిగిలినవి రెండు. ఒకటి లవణరాజుకల, రెండవది దేశభక్తి. లవణరాజుకల జ్ఞానవాశిష్ఠములోని వస్తువును గ్రహించి చేసిన రచన. దీనినిగూర్చి రెండేండ్లక్రింద 'జయంతి' పత్రికలో దుమారము రేగినది.[1] అప్పారావుగారు మూలవస్తువున కన్యాయము చేసినట్లు విమర్శకు లారోపించినదానిలో సత్య మెంతకలదో వివరముగా చర్చింతును.

**'లవణరాజుకల' :**

జ్ఞానవాశిష్ఠములోని లవణోపాఖ్యానము గురజాడవారి 'లవణరాజుకల'కు మూలము. ఈ కథ నాతడు తన శేముషీ వైభవముతో, సమకాలీన పరిస్థితుల కనువగునట్లుగా, పరిణామశీల మైన సమాజములోని ప్రవృత్తుల కనుగుణముగా ఎట్లు మలచుకొనెనో నిరూపింతును.

మూలములోని లవణోపాఖ్యానము రామునికి వశిష్ఠునికి జరిగిన సంవాద సముచ్చయము. వశిష్ఠుడు రామునికి మనస్సు లక్షణమును వివరించుచు, స్వప్నస్వరూపమును తెలుపును. స్వప్నాదులయందు మనస్సంకల్పముచే గోష్పాదముమేర అనేక యోజనముల దూరమగునని, అనేక యోజనముల ప్రదేశము గోష్పాదమాత్రమగునని, బ్రహ్మకల్పము క్షణమాత్రమగునని, క్షణము బ్రహ్మకల్పమగునని విశదీకరించును. ఇంద్రజాలము స్వప్నాదులలోసుదేయని తెల్పుట కును, జగద్రూపమగు ఈ యింద్రజాలము మనస్సులో నెట్లున్నదో విస్తరించుటకును అతడు లవణోపాఖ్యానము చెప్పెను.

మూలకథ ప్రధానముగా వేదాంతపరమైయున్నను వర్ణనా బహుళముగానున్నది. గురజాడ వారు తమ కావ్యములో వర్ణనలను చాలవరకు తగ్గించి, కథాసంబంధమైన జవజీవములను పెంచిరి. మూలకథను శాంతరస ప్రధానముగా మార్చుకొనిరి. ఆ యంగిరసమున కనుగుణమైన వర్ణనలను మాత్రమే ఒకటి రెండుసార్లు చేసిరి. గురజాడవారిది ప్రధానముగా కథాదృష్టి. ఆ కథా కథనమువెనుక ఆయనకున్న లక్ష్యమువేరు; మూలకర్త దృష్టి వేరు. ఆయన మూలకథలో ఏ యే మార్పులుచేసినది, ఏ దృష్టితో చూచినది, అవి ఎంతవరకు ఔచితీగర్భితములైనది ముందు వివరింతును.

**గురజాడవారి మార్పులు :**

1. మూలకథ మనోలక్షణమును, సంకల్పలక్షణమును వివరించుటకు ఉద్దిష్టమైనట్లు తెలిపితిని. గురజాడవా రీవిషయమునే స్పృశించక సూటిగా కథతో ప్రారంభించి, ప్రతిపాద్య విషయము వేదాంతసంబంధమైనది కాదని, కేవలము కథానుబద్ధమైనదని వ్యంగ్యముగా సూచించిరి.

2. మూలములో కథాప్రారంభమున రాజువర్ణన రెండు శ్లోకములలో కావ్యసంప్రదాయ ముల కనుగుణముగా చేయబడినది.

1. ఈ ప్రకరణము 1960 చివర రచించితిని.

'యద్యశః కుసుమోత్తంస పాండురస్కంధమండలాః
సర్వేశైలా విరాజంతే హారాః ప్రోద్ధూళితా ఇవ
జిహ్మతాం యోనజానాతి నదృష్టాయేనగృధ్నుతా
ఉదారతా యేన ధృతావాచకేన యథాఽభిధా.'[1]

కేవల సాంప్రదాయికమైన రాజుగారి యశోవర్ణన కథకు అంతగా అవసరముకాదని గురజాడ దీనిని వదలివేసి 'నిండుకొలువున లవణుడను రాజుండె'నని ప్రారంభించి వెంటనే 'ఇంద్రజాలికు'ని ప్రవేశపెట్టెను.

3. ఇంద్రజాలప్రభావముతో లవణరాజు గుఱ్ఱమునెక్కి అడవిలో తిరిగి తిరిగి, చివరకొక వృక్షశాఖను వ్రేలాడుచున్న తీగను పట్టుకొని వ్రేలాడును. గుఱ్ఱమెటకో వెడలిపోవును. అప్పుడు రాజు స్నానపానాదులులేక, చలికి గడగడవడకుచు, పండ్లు పటపట కొఱుకుచు, 'సీత్కృతులు' సేయుచు ఆ రాత్రి వేగించినట్లు మూలమున కలదు. ఈ సన్నివేశముద్వారా జీవి దుస్థితిని నిరూపించుట మూలగ్రంథము ఉద్దేశము. గురజాడవారి దృష్టి అది కానేకాదు. లవణుడు ముందు రానున్న మాలెతను పెండ్లియాడుటయే ప్రధానవస్తువు కాబట్టి రాజుదుస్థితి ప్రసక్తి బొత్తిగా వదలివేసెను. ఆయన కొంతసేపు నిదురించి, కనువిప్పినంతనే 'కన్నులయెదుట వెలసెను వింతలోకము సంజకెంజాయన్' అని రమ్యమైన వాతావరణ సృష్టికి నేపథ్యము రచించెను. మూలమునలేని సంధ్యాది ప్రకృతివర్ణనలు ప్రవేశపెట్టి ముందుజరుగనున్న శృంగార కలాపమునకు రంగము సిద్ధపరిచెను.

'వెలుగునీడలు కనులకింపై మెలగిచెలగెడి నాకసంబున
వ్రేలుమబ్బుల యంచులంటను రగిలె రత్నరుచుల్.'

ఇది సంధ్యావర్ణన. తదనంతరము జరిగిన చంద్రోదయము నీ విధముగా వర్ణించెను.

'గగనరాజ్యము గ్రమ్మవేడుక మగటిమిని తన కళలుగూర్చుచు
పగలు వెన్నునదన్ని సోముడు పైనమై వెడలెన్.'

తర్వాత తాడివనములను, జీలుగుచెట్లను, చల్లగాలులకు జల్లుజల్లునరాలు పూవులను వర్ణించి, ఆ రాజునకు ఉల్లమలరెనని తెలిపి, దానితోపాటు ఆకలి బడబవలె అడరెనని స్పృశించి వదలెను. అనగా రాజున కొకవైపు చిత్తాహ్లాదము కలుగుచుండెనని, మరియొకవైపు క్షుత్తు కలిగియుండెనని తేలినది.

4. ఇంతలో ఓదనధారిణియగు ఒక చండాలకన్య కనిపించుటయు, ఆకలితోనున్న రాజు ఆమె నన్నము పెట్టుమని యడుగుటయు, ఆమె తన తండ్రికొరకు అన్నము తీసికొని పోవు

1. జ్ఞానవాశిష్ఠము : ద్వాదశసర్గము : 9, 10 శ్లోకములు.

చున్నాననియు, తన్ను వివాహమాడుట కంగీకరించినచో అన్నము పంచియీయగలనని చెప్పుటయు మూలములో కలదు. గురజాడవా రిక్కడ చక్కని మార్పును ప్రవేశపెట్టిరి. లవణ రాజునకు మొదట వింతగానమొకటి వినిపించును. అది చెవులకు సోకినంతనే ఆ రాజునకు 'పూర్వవాసన పిలిచి' నట్లయ్యెను. అపుడాతడు ఆకలిమరచెను. ఇడుమలు మరచెను. ఇంతలో శ్యామలాంగియగు ఒక జవ్వని కనిపించినది. ఆమె పాటను వినగానే పూర్వవాసన పిలిచినట్లయ్యె ననుటలోనే గురజాడవారు తాము ప్రతిపాదించు వస్తువునకు బీజావాపముచేసిరి. రాజునకు, ఆ సుందరికి జన్మజన్మల అనుబంధము కలదని ధ్వనింపజేసిరి. రాజు కామైకదృష్టికలవాడు కాడు. ఆమెను చూడకముందే, గానమువినగానే అతడు పరవశుడగుట, ఆకలిని మరచిపోవుట, అతని జన్మాంతరవాసనలు మేల్కొనుట, ముందు జరుగనున్న కథాఘట్టమున కెంతో ఉపస్కారముగా నున్నవి. నాయికను ప్రవేశపెట్టుటలోనేకాక, ఆమె రూపవర్ణనమునగూడ గురజాడవారు ఔచిత్యమును కనబరిచిరి. మూలములోని శ్యామలాంగి 'తరళతారకనేత్ర' (చంచలాక్షి), 'అధవళాంబర.' చండాలురు నీలాంబరమును ధరించుట ఆచారము. గురజాడవారు నాయికను 'చంచలనేత్ర'గా చిత్రించలేదు. 'అరమొగిడ్చిన కన్నుగవతో, చెదరియాడెడి ముంగురులతో, బెదురుయెరగని బింకమొప్పిన బెడగునడకలతో' సాగుచు పాటపాడినట్లు, ఆ పాటను 'చెట్లుచామ'లకై పాడినట్లు వర్ణించినారు. ఆ పాటనువిని 'తాటివనమున నాగి చంద్రుడు తాను చెవియొగ్గి'నాడట. ఈ కల్పన అత్యుదాత్తముగా నున్నది. కేవలము ప్రకృతియొడిలో పుట్టిపెరిగిన పరమసాధుజీవనగా ఆమె చిత్రింపబడినది. అందుకే ఆమెపాడినది చెట్లుచేమలకొరకు. ఆమెపాట ప్రకృతినిసైతము తాదాత్మ్యమున ముంచివేసినది. ఆమె 'అరమొగిడ్చిన కన్నుగవతో' పాడినదనుటలో గాంభీర్యము ఇనుమడించినది. ఆమె గానము నెవరిగూర్చి చేసెనోకాని 'లవణు'డనుమాట నడుమ వినిపించినట్లుగా రాజునకు తోచినట్లు గురజాడవారు మరియొక మార్పుచేసిరి. వీరు పూర్వజన్మానుబంధమును దృఢపరుచుటకే ఈ మార్పుచేసిరి. ఆమె 'అధవళాంబరత్వ' ప్రసక్తినే పరిహరించిరి.

5. మూలములో రాజు పదేపదే ఆమె నన్నముపెట్టుమని యడుగును. గతజన్మము లందు సైతము నిన్నుకొలిచి అన్నముకుడిచిన తీరు మనస్సునకు తోచుచున్నదని, తాను అన్యుడను కానని, కాబట్టి అన్నము పెట్టుమని రాజడిగినట్లుండగా, దానిని మార్చి గురజాడవారు ఆ యిరువురి పూర్వజన్మానుబంధమును మరల ఉగ్గడించిరి. తాను మాలెతకాబట్టి అన్నముపెట్టుట కనర్హురాలనని ఆమె పలికిన తర్వాత రాజు నీటోటి ఉత్తమలక్షణములుగల స్త్రీ మ్లాలెతయెట్లగునని, గుణమున్నప్పుడు వర్ణప్రసక్తి లేదని 'నిక్కచ్చి'గా తెలుపును. రాజు కేవలము కామదృష్టితో త్వరపడి యన్నమాటలు కావవి. 'కొన్ని నిమిషము లెన్నియెన్నో కన్నవిన్నవి ధర్మముల' నెన్నుకొని, 'నిశ్చయమాత్మదోపగ' పలికిన వాక్కులు.

'మంచిచెడ్డలు మనుజులందున యెంచిచూడగ రెండెకులములు
మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్'

అని రాజుపల్కినమాటలు అతని సంస్కారదృష్టికి పతాకలు.

6. మూలములో మాలెత తండ్రివర్ణన జుగుప్సాకరముగానున్నది. అతడు 'దురాకృతి', 'భయప్రదుడు', 'అసృజ్మయచక్షువు', 'కృతాంత' సదృశుడు. గురజాడవారు ఈ పాత్ర భయంకరత్వమును పరిహరించుటయేకాక ప్రియంకరత్వమును తెచ్చిపెట్టిరి. అతడు పుట్టుకచేత మాలయైనను గురూపదేశముపొంది 'మలినవృత్తులు'మానుకొన్న ప్రాజ్ఞుడు. పశువుల మేపుచు పొట్టపోసికొనెడి కృషిజీవి. 'జంతుహింస చేయనొల్లని' భూతదయాపరుడు. పండుగడ్డముతో, కన్నులలో శాంతరసముతో, పలుకులలో కడలిగాంభీర్యముతో, ఒడలిదివ్యతేజముతో తొల్లిటి ఋషిని తలపించువాడు. ఈ పాత్రచిత్రణముద్వారా జ్ఞానమునకు వర్ణప్రసక్తిలేదని గురజాడ వారు నిరూపించిరి.

7. మూలములో రాజు మాలెతను పెండ్లియాడినపిదప వారికి 'దుఃఖద'యైనకన్య, 'అనర్థము'వంటి కొడుకులు గలిగినట్లుకలదు. గురజాడవారు దీనిని బొత్తిగామార్చి, 'చక్రవర్తుల కొమరులను' కన్నట్లు చిత్రించిరి. వారున్నపల్లెలో కరవురాగా మూలమువ కడగొట్టు బిడ్డడు 'తాత దేహ్యేశమే మాంసం పాతుంచ రుధిరం క్షణాత్'అని ఆక్రందించినట్లు కలదు. ఇది జుగుప్సావహమైనది. దీనిని గురజాడవారు పూర్తిగా పరిత్యజించిరి. సంతానము దుర్భరస్థితి చూడలేక లవణుడు చితిపేర్చుకొని దూకనుద్యుక్తుడైనట్లు మూలమున కలదు. తెలుగులో భార్యాభర్తలిరువురు కలిసి చితినిజొచ్చినట్లు చిత్రించి, గురజాడవారు ఆ దంపతుల అన్యోన్యరాగబంధమును దృఢపరిచిరి.

8. మూలములో ఇంద్రజాలము ముగిసినపిమ్మట, లవణుడు వింధ్యపర్వతప్రాంతములందు తాను స్వప్నమున చూచిన భార్యాపుత్రులను వెదకుటకుపోవును. అక్కడ తిరుగగా తిరుగగా, అత్తగారుకన్పడి తనకూతురు, పిల్లలు కనిపించుటలేదని తెలిపి రోదించును. రాజు విస్మయచకితుడగును. అంతేకథ. ఆ తర్వాత రాజు ఈ విధముగా రెండులోకములు గాంచి, అవిద్యాస్వభావము నెరిగినవాడై ఇల్లుచేరుకొనెనని కలదు. మూలములోని చివరి శ్లోకమిది.

'ఇత్యేవం రాఘవావిద్యా మహతీ భ్రమదాయినీ
అసత్సత్తాం నయత్యాశు సచ్చాసత్తాం నయత్యత.'[1]

అవిద్య లేనిదానిని ఉన్నట్లుగాను, ఉన్నదానిని లేనట్లుగాను భ్రమింపజేయునని దీని తాత్పర్యము.

తెలుగులో అట్లుకాక రాజు తన స్వప్నవృత్తాంతము చెప్పినపిమ్మట ఒక గుఱ్ఱముపై ఒక తాపసియు, కన్యయు వచ్చి కొలువున ప్రవేశింతురు. ఆ కన్య యవనదేశాధీశుని కూతురని, లవణుని వలచెనని, అందుకారాజు కానుకగా పంపెనని, వచ్చిన తాపసుడు తెలుపును. లవణుడామెను చూచి పరవశుడై 'స్మయహర్షాతిరేకము లాత్మపెనగొన'గా డాసి, చేకొని, 'వచ్చితివ నా

1. త్రయోదశ సర్గము : 158 శ్లోకము

ప్రియసఖీ'యని గద్దెపై చేర్చెను. లవణుడు కలలోచూచిన 'మాలెత'యే ఈ యవనాధీశుని కూతురని ఈ మార్పులోని ఆంతర్యము.

**ఔచిత్యము :**

ఇంత వివరముగా వ్రాసిన ఈ మార్పుల ఔచిత్యము నిక విశదీకరింతును.

ఈ కథలో నేనిదివరకు మనవిచేసినట్లుగా శృంగారరసము అంగి. శాంతాద్భుతములు అంగరసములు. జననాంతర సౌహృద మవిచ్ఛిన్నమని, దానిముందు వర్ణాదిబంధములు పుటుక్కున తెగిపోవునని నిరూపించుట దీనిలోని ప్రధానవస్తువు. ఈ వస్తువును సమర్థముగా నిర్వహించుటకు గురజాడవారు పై మార్పులన్నిటిని చేసిరి. మూలగ్రంథములోని వస్తువునకును దీనికిని మౌలికముగానే భేదమున్నది. మూలములో మనోవైలక్షణ్యమును చిత్తవికారమును ప్రతిపాదించుటకే ప్రయత్నము జరిగినది. గురజాడవారు చిత్తసంబంధమైన బంధములకు సింహాసనము వేసిరి. భవభూతి ఉత్తరరామచరిత్రములో

"వ్యతిషజతి పదార్థా నాంతరః కోపి హేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే"

అని యన్నట్లుగా, గురజాడవారు ప్రేమయన్నది వర్ణాదిబహిరుపాధుల నాశ్రయించియుండదని, ఆంతరమైన ఒక అనిర్వాచ్యమైన కారణమే ప్రేయసీప్రియులను ముడివేయునని నిరూపించిరి. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలములో పలికిన

"తచ్చేతసాస్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అనుమాటలనే లవణుని ముఖతః గురజాడవారు ప్రకటించిరి.

మూలములో జగత్తుమిథ్యయని, చిత్తవృత్తు లనిత్యములని సిద్ధాంతీకరింపబడినది. గురజాడవారు దీనికి విరుద్ధముగా అభిప్రాయపడిరి. ఆ అభిప్రాయములను వారి మాటలలోనే తెలుపుదును.

'యెప్పటికి అనుభూతమెద్దియొ అప్పటికి అది నిక్కువంబే
యెప్పుడో లోకంబుకల్లగు ననుట యిపుడెట్లో'

'చిత్తమందున కీలితములై నిత్యఖేదము నిచ్చుతలపుల
నెత్తివైచును - లేరె, హా ! యిది చెప్పగల ప్రాజ్ఞుల్.'

ఈ చరణములలో ఇంద్రియసన్నికర్షజన్యమైన అనుభూతిజ్ఞానము లసత్యములనెడు వేదాంతుల సిద్ధాంతమును గురజాడవారు ఖండించిరి. వేదాంతులు సత్యమును వ్యావహారిక

మనియు, పారమార్థికమనియు ద్వివిధముగా పరిగణించిరి. వీనిలో వ్యావహారిక సత్యమనగా ప్రత్యక్షాది ప్రమాణములవలన కలిగిన జ్ఞానమని వారును అంగీకరించిరి. కాని పారమార్థిక జ్ఞానదృష్ట్యా సర్వవ్యవహారములు, సర్వప్రమాణములు మిథ్యయని వారు నిర్ణయించిరి. గురజాడవారు దైనందినజీవితమున పారమార్థిక సత్యమునకు ప్రసక్తిలేదని భావించిరి. చిత్తములో కీలితములై ఖేదమును కలిగించు తలపులు సత్యములుకావను శూన్యవాదమును విమర్శించిరి. ప్రధానముగా జన్మజన్మాంతర సంస్కారమునుబట్టి ఏర్పడిన అనురాగబంధము అవిచ్ఛిన్నమని, ఆదరణీయమని నిరూపించిరి. స్వప్నము మిథ్యయని మూలములోనుండగా, స్వప్నముసైతము సత్యముకావచ్చునని ప్రతిపాదించిరి. వ్యావహారిక సత్యమే జీవితసత్యమని నిరూపించిరి. అందుకే 'పుస్తకమాత్ర పరిజ్ఞానము' నీసడించిరి. అనుభవమున కగ్రతాంబూలమిచ్చిరి. అనుభవైక ప్రమాణమగు దర్శనమే నిజమైనదని చాటిరి. ఇది ఒకరకముగా ప్రత్యక్షవాద మనవచ్చును. పాశ్చాత్య విజ్ఞానసంపర్కమువలన కలిగిన మార్పులలో ఇదియొకటి. జగన్మిథ్యాత్వమును ప్రతిపాదించు వేదాంతమునుకాదని, జీవితసత్యమే శాశ్వతసత్యమని ఈ విజ్ఞానము బోధించినది. ఇది భౌతిక (Materialistic) దృష్టికి సన్నిహితమైనది. బేకన్ (Bacon) అను ఆంగ్లతత్త్వవేత్త ప్రతిపాదించిన 'ఎంపిరిసిజము' (Empiricism) అనుసిద్ధాంతము ప్రత్యక్షానుభవమునే బలపరుచుచున్నది. 'ఎంపిరిసిజ'మనగా ప్రత్యక్షప్రమాణముపై ఆధారపడు దృక్పథము.[1] ఈ సిద్ధాంతము కొంతవరకు గురజాడవారిదృష్టికి స్వరూపాధాయకమై యుండును. అంతమాత్రమున జన్మాంతరవాసనలను వారు విస్మరించలేదు. ఇదే అచ్చమైన 'కొత్తపాతల మేలుకలయిక.'

గురజాడవారు ఈ కావ్యమును ఏ దృష్టితో రచించినను సూక్ష్మపరిశీలనానంతరము పై విషయమే బోధపడును. ఈ కావ్యము ప్రధానప్రయోజనము జననాంతర సౌహృదములోని ఉదాత్తతను నిరూపించుటయే. అట్టిదానికి వర్ణాదిభేదములు అడ్డురావని అనుషంగికముగా తెలుపబడినది. అనుభవమే అన్నిటికన్న ప్రమాణమైనదని నిరూపింపబడినది.

### 'దేశభక్తి' గేయము :

గురజాడవారి 'దేశభక్తి' గేయమువంటిది భారతసాహిత్యములోనే లేదని చెప్పవచ్చును. బంకించంద్రుని 'వందేమాతరం', రవీంద్రుని 'జనగణమన', ఇక్బాల్ 'సారేజహాఁసె అచ్ఛా' అను గేయములు గొప్ప జాతీయగేయములు. ఐనను ఇవి భారతదేశసంకీర్తనమే ప్రధాన లక్ష్యముగాగల గేయములు. సాధారణముగా ఏ దేశము జాతీయగేయమైనను ఈ ధోరణిలోనే యుండును. అప్పారావుగారి గేయములోని విశేషమేమనగా – ఇది యొకవైపు స్వదేశీయులలో జాతీయాభిమానము నూరిపోయుచునే, ఎల్లలుదాటి ఎగసిపోయి సమస్తజాతులను, విశ్వమానవకోటిని పలుకరించుచున్నది. అందువలననే ఏ జాతీయగేయమునకు లేని విశిష్టత దీనికబ్బినది. ఈ గేయమువంటివి ఇంగ్లీషుసాహిత్యములో ఉన్నవేమోయని పరిశీలించగా Tennyson వ్రాసిన

1. Relying on experiment not on theory.

'Love thou thy land' అన్న మకుటముగల గేయము కనుపించినది. ఈ ఆంగ్లగీతము మకుటమునకు తెలుగు గేయములోని 'దేశమును ప్రేమించుమన్నా'యను మొదటి పాదమునకు బింబప్రతిబింబభావ మున్నది. దీనినిజూచి మొత్తము గేయము చదివిచూడగా రెంటికి కొంత సంవాదము కొంతభేదము కనిపించినవి. ఈ తారతమ్యమును పరిశీలించుట అవసరమనుకొందును.

టెన్నిసనువలె గురజాడ 'Thy land' అనలేదు. గతమును తృణీకరించరాదని, గతముకన్న మనము గొప్పవారమని విర్రవీగుట భావ్యముకాదని టెన్నిసను అభిప్రాయపడెను.

'A wind to puff your idol-fires
And heap their ashes on the head
To shame the boast so often made
That we are wiser than our Sires.'

గురజాడ 'మంచిగతమున కొంచెమే' యని, గతమును గ్రుడ్డిగా విశ్వసించరాదని చాటెను. గురజాడదృష్టి టెన్నిసనుకన్న పరిణామవ్యగ్రమైనది. గురజాడకు గతముకన్న భవిష్యత్తు గొప్పది. 'వెనుకబడితే వెనకెనోయ్' యని ఈయన ప్రబోధము. టెన్నిసను మొదట ప్రేమ యన్నది స్వార్థపరిధుల కతీతమైనదని తెలిపి, వెంటనే 'For, English natures, freemen, friends, thy brothers, and immoral souls' అను పంక్తులలో ఇంగ్లీషువా రెన్నడు స్వార్థబుద్ధులుకారని, ప్రేమ వారి నిసర్గగుణమని ధ్వనింపజేసెను. గురజాడవారిది దేశమునకు ఎల్లలలకు అతీతమైన దేశభక్తియని ఈ వరకే వివరించితిని. ఇక టెన్నిసను గేయములోని కొన్ని భావములకు గురజాడవారి గేయమునకుగల పోలికలు గమనింతము.

'Watch that main currents draw the years
Cut Prejudice against the grain'

అన్న మాటలలోని అభిప్రాయమే కొంచెము మార్పుతో 'ఒరులమేలుకు సంతసించ' వలసి నదిగా రూపొందినది.

'Nor toil for title, place, or touch
Of pension, neither count for praise
It grows to guerdon after - days :
Nor deal watch - words over much'

అన్న చరణములలోని భావము 'దేశాభిమానము నాకు కద్దని వట్టిగొప్పలు చెప్పుకోకోయ్'గా అవతరించినది.

'Certain, if knowledge bring the sword
That knowledge takes the sword away'

అను పంక్తులలోని కత్తికన్న జ్ఞానముమిన్నయను భావసారమే కించిద్రూపభేదముతో 'కత్తి వైరము కాల్చవోయ్'గా నిలచినది. ఈ విధమైన పోలిక లొకటి రెండున్నను, గురజాడవారి గేయములోని విశ్వమానవప్రేమను శ్రీశ్రీ ప్రతిపాదించలేదు. ఈ పోలికలనుబట్టి ఆలోచించినచో ఆంగ్లకవితానిష్ణాతులైన అప్పారావుగారి గేయమును చూచియుందురనియే తోచుచున్నది.

## తదనంతరకవులపై ప్రభావము :

ఆధునికాంధ్రకవిత్వప్రవక్త లిద్దరిలో అప్పారావుగా రొకరని ఇంతవరకే మనవిచేసియుంటిని. అప్పారావుగారి కవిత్వములోని బహుముఖవిశిష్టతను నిరూపించుటకు ప్రయత్నించితిని. అప్పారావుగారు తరువాతికవుల కందించిపోయిన ప్రక్రియలివి

1. ముత్యాలసరము (క్రొత్త ఛందస్సు).
2. గేయములో కథాకావ్యరచన (పూర్ణమ్మ).
3. ఆత్మాశ్రయ కవిత్వరీతి.

'లంగరెత్తుము' అను గేయములో

'విరిగిపెరిగితి; పెరిగివిరిగితి కష్టసుఖముల పారమెరిగితి
పండునన్నవి ఆశలెన్నో యెండిరాలగ బొగిలితిఁ
అందజాలని పళ్ళకోసము అఱ్ఱుజాపితి; నేలపాకిన
చెట్లపళ్ళను విలవలెరుగక పాదరక్షలమట్టితిఁ'

వంటి పాదములు తరువాత తరువాత భావకవిత్వమున ఆత్మాశ్రయరీతిలో రచింపబడిన విషాద గీతములకు మార్గదర్శకమైనవి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'చుక్కలు' అను గేయములో

'చేతికందెదు పూలకొఱకై
చేయిచాపక చేరికోరక
దూరముగ లేవంచువానిని
దూఱివదలితిని.

పక్షివలె నాకాశనిర్మల
పథవిహార స్వేచ్ఛఁగోరితి
పక్షములులేవంచెఱుంగక
ప్రాకులాడుచుఁ బొగిలితిఁ'[1]

అను పాదములు అప్పారావుగారి పాదములను స్ఫురింపజేయును.

1. కృష్ణపక్షము : పుట ౬౬.

4. ప్రబోధ కవిత్వము

ప్రబోధకవిత్వమునకు అప్పారావుగారే మార్గదర్శకులు. 'దేశభక్తి', 'మనిషి' ప్రబోధ గేయములే. దీని ప్రభావము తరువాతి నవ్యకవులపై విపరీతముగా ప్రసరించినది.

5. సంఘసంస్కరణ కవిత్వము.

వీరి ముత్యాలసరాల గేయము సంఘసంస్కరణకవిత్వమునకు మేలుబంతి. ఈ ప్రక్రియ తరువాతి కాలమున మంగిపూడి, రాయప్రోలు, జాషువా మున్నగువారి చేతిలో సిద్ధినందినది.

6. ప్రణయ కవిత్వము.

'లవణరాజుకల'లో సభ్యమైన ప్రణయకవిత్వమునకు అప్పారావుగారు బీజములు వేసినారు.[1]

7. బాలగేయము

అప్పారావుగారు 'మిణుగురులు' అనుపేర రెండు బాలగేయములను రచించిరి. ఇవి ప్రాచుర్యము పొందినవి కాకున్నను, బాలగేయరచనకు మార్గదర్శకములని చెప్పవచ్చును. వానిలో ఒకటి యిట్లున్నది.

'అరిటికాయబజ్జీ
మిసప్పప్పుసొజ్జీ
కలసిమెలిసితిందాం
కథలు విథలు విందాం

— — —

ఏనుగు ఎక్కినమనం
ఏవూరెళుదాం ?
ఎనుగు ఎక్కి మనం
ఏలూరెళదాం.'[2]

ఇట్లు సాగిపోవు గేయమిది.

ఈ విధముగా కవిత్వములో అనేక నవ్యప్రక్రియలకు వీరు మార్గదర్శకులైనారు. వీరి ముత్యాలసరమును చేపట్టినవారిలో రాయప్రోలు, అబ్బూరి, దువ్వూరి, కృష్ణశాస్త్రి, వేదుల, బసవరాజు, మల్లవరపు, శ్రీశ్రీ, పురిపండామున్నగు ప్రసిద్ధకవులున్నారనగా ఆ ఛందస్సునకు

1. 1909 లోనే రాయప్రోలువారు 'లలిత'లో ఇది చేసిరి. అయినను అది స్వతంత్రకావ్యముకాదు కాబట్టి అప్పారావుగారిని పేర్కొంటిని.
2. 'ముత్యాలసరాలు' : తృతీయ ముద్రణ : పుట 68.

కలిగిన ప్రాచుర్యము వీరే చెప్పనక్కరలేదు. వారి నిర్యాణానంతరము జరిగిన సంతాపసభలో గాడిచర్లవారు ప్రసంగించుచు మరికొన్ని సంవత్సరములు అప్పారావుగారు జీవించియుండి తాము అవలంబించినరీతులలో అధికసంఖ్యాకముగా కావ్యములను సృష్టించియున్నచో ఆయన తెలుగు దేశమునకు రవీంద్రులయ్యేడివారని యనిరి. ఇవి దాదాపు 45 సంవత్సరములక్రింద అన్న మాటలు. అప్పటికే అప్పారావుగారు సమకాలీనపండితులదృష్టిలో అంతటిస్థాన మాక్రమించుకొన్నవారు. వారిమిత్రులు కిళాంబిరంగాచార్యులుగారన్నట్లుగా 'ప్రజాసామాన్యరక్తధ్వజము' నెత్తిన కవీంద్రుడాయన. 'నాది ప్రజలవుద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను'[1] అన్నంత వజ్రసంకల్పముతో నవ్యసాహిత్యమార్గములలో ప్రస్థానము చేసిన ప్రవక్త ఆయన.

1. మహాకవి డైరీలు: పుట 228.

# రాయప్రోలు సుబ్బారావు:

క్షీణప్రబంధయుగమున వెఱ్ఱితలలు వేసిన రీతిప్రాధాన్యమునకు, శబ్దచిత్రలౌల్యమునకు. నిర్వేలశృంగారమునకు, నీరససంప్రదాయపాలనమునకు విరుగుడుగా రసగుళికలవంటి రమ్యకావ్యములను సృష్టించినకవి రాయప్రోలు సుబ్బారావుగారు. వీరు గురజాడవారివలె ఒక్కుమ్మడిగా సంప్రదాయమున కెదురుదిరిగినవారు కారు; సంప్రదాయమునకు లోబడినవారును కారు. తారుణ్యదశలో ఆశుకవితాప్రవాహము వెంబడి కొంతదూరము కొట్టుకొని పోయినను, త్వరలోనే తప్పు గమనించి యేటికెదురీది క్రమక్రమముగా ప్రవాహదిశనే మార్చివేసిన నవ్యకవిత్వయుగకర్తలు వీరు. దేవతలో, రాజవంశీయులో కావ్యమునందు నాయికానాయకులుగా ఉండనర్హులని అనుకొనుచున్న కాలములో, వీరు సామాన్యమానవులను కావ్యపాత్రలుగా క్రైసేసినారు. ప్రకృతి యనగా ప్రాచీనకావ్యములద్వారా దిగుమతియైన 'లవలీలుంగలవంగ' ప్రభృతి లతలు, చందనతమాలపనసఖర్జూరాది వృక్షములేయను భావము ప్రబలిన రోజులలో; చిరునిమ్మచెట్లతో, తాంబూలలతలతో, మధ్యాహ్నమల్లికలతో, కాశీరత్నములతో, కందిదాపులతో, అనాసమొక్కలతో, తులసితోటలతో, తాటియాకుదడులతో, నీటుగుల్కు తెలుగునాటి పల్లీపరిసరములను, ప్రకృతి చిత్రములను కావ్యప్రాంగణమున ప్రవేశపెట్టినారు. 'వాణివాయింప మ్రోగిన వీణమీద పారసీకగీతములు' పల్కించినారు. 'ఋషుల నీవారములు' ఫలించిన పొలములలో గులాబీలు పూయించినారు. కచకుచవర్ణనలతో కకావికలై పోయిన కావ్యనాయికను సమాదరించి, ఆమె యంతరంగములోని అమృతమును వెలికిదీసినారు. భోగ్యవస్తువుగా కేవల వర్ణ్యవస్తువుగా పరిగణింపబడుచున్న 'స్త్రీ'ని దేవీపీఠముపై అధివసింపజేసినారు. ప్రకృతిని తల్లిగా, దేవతామతల్లిగా సంభావించినారు. లఘుకథా కావ్యరచనకు దారులుతీసినారు. లక్షణబద్ధమైన కవిత్వము వ్రాయుచునే దేశికవితకు దివ్వెలెత్తినారు. శృంగారకరుణములు రెండే కావ్యరసములని సిద్ధాంతీకరించుచునే 'కడుపులోనున్న కందలుకదలంగ' 'కంగుల వీరకాసెగట్టి' రంగమున దుమికిన జాతీయవీరుల పౌరుషకీర్తనలను గానముచేసినారు. హేయములు, క్లిబములు, జుగుప్సాయుతములగు వస్తువులకు కావ్యయోగ్యతలేదని చెప్పుచునే 'పులివిస్తరాకు'మీద రమ్యాతిరమ్యములైన పద్యములు చెప్పినారు. దాదాపు ఒక అర్ధశతాబ్దముపాటు కథాకావ్యము, ఖండకవిత, గేయకవిత, ప్రేమగాథ, ప్రబోధకవిత, సంఘసంస్కరణకవిత్వము, స్మృతికావ్యము, ప్రకృతికవిత్వము, పల్లీయకవిత్వము, అభ్యుదయగీతము మున్నగు బహుప్రక్రియలలో ధారావాహికముగా కవితామధువు నందజేసినారు. భావకవిత్వమునకు భాష్యములనదగిన సిద్ధాంతకావ్యములు రచించినారు. ఆచార్యశంకరులకు, రవీంద్రునికి, ఖయ్యామునకు అనువాదములు

వెలయించినారు. ఈ విధముగా అనంతకవితారీతులలో ప్రస్థానించిన రాయప్రోలువారి కవితా వ్యక్తిత్వ క్రమవికాసమును, ప్రయోగవైవిధ్యమును, సాంప్రదాయికతను పరిశీలించి చూపుటకు ప్రయత్నింతును.

**ప్రథమదశ :**

రాయప్రోలువారికి చిన్ననాటినుండియే సాహిత్యవాతావరణ మేర్పడినది. వీరి మేనమామ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో గొప్ప విద్వాంసులు. వీరివద్దనే రాయప్రోలువారు అభిజ్ఞానశాకుంతలమును ఉత్తరరామచరిత్రమును సవిమర్శముగా చదువుకొనిరి. ఈ రెండు గ్రంథములు వారిలోని సంప్రదాయమునకు పునాదులుగా నిలచినవి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తిరుపతివెంకటకవుల శిష్యులు. వీరు అవధానములను నిర్వర్తించెడివారు. వీరి సాహచర్యమువలన రాయప్రోలువారికి చిన్ననాటనే ఆశుకవిత్వము, అవధానచాతుర్యము అలవడినవి. కొంతకాలము సుబ్బారావుగారు శాస్త్రిగారితోకలసి అవధానములుగూడ నిర్వర్తించినారు. గుమగుమలాడు కొతిమేరచేలమీద, కుండపొదుగులతో ఐహూభారముగా నడచు చూడియావుల మీద, ఊరిచెరువులనుండి నీళ్ళుమోసికొనిపోవు గ్రామభామలమీద తొలినాళ్ళలో వీరు కొన్ని పద్యములు వ్రాసినారట. ఆ పద్యములు వారికే జ్ఞప్తికిలేవని వారే స్వయముగా అన్నారు.[1] ఈ విధముగా 1909 వరకు సాగిపోయినది.

1908 - 9 లలో రాయప్రోలువారు రాజమహేంద్రవరమునందు విద్యాభ్యాసముచేయు చుండిరి. అవి 'ఆంధ్రకేసరి'పత్రిక ఉచ్చదశలో నున్నరోజులు. ఆ పత్రిక సంపాదకత్వ భారము నిర్వహించుచున్న చిలుకూరి వీరభద్రరావుగారు, అత్తిలి సూర్యనారాయణగారు రాయప్రోలువారి ప్రతిభకు పాదులువేసిరి. తత్ఫలితముగా వారు 'జాతీయోద్ధారకులు' అను వ్యాసము వ్రాసి ఆ పత్రికలో ప్రచురించిరి. శాకుంతలపరిశీలనమువలన కలిగిన భావములను నిర్భయముగా, నిరంకుశముగా సంఘటించి అత్తిలివారి ప్రోత్సాహబలముతో ఈ పత్రికలోనే వారము వారము ప్రకటించిరి. క్రమముగా ఆ పత్రిక 'అజ్ఞాతసంపాదకత్వము' వారికి లభించినది. అప్పుడే వృత్తిచేత న్యాయవాదియైనను, ప్రవృత్తిచేత సాహిత్యవేదియైన గంటిలక్ష్మన్నపంతులుగారి పరిచయము ప్రాప్తించినది. వారొకసారి గోల్డుస్మిత్ Hermit ను చదివి వినిపించి, అందందు వివరణముచేసి, 'దీనిని తెలుగులో పెట్టండి' అని ఆదేశించిరి.[2] ఆంగ్లములోని Hermit తెలుగులో 'లలిత'గా రూపొందినది. 'ఒక వియోగిని విలాపము'గా వెలసినది. 1909 లో 'లలిత' కావ్య రచనముతో రాయప్రోలు జీవితమున క్రొత్తమలుపు ప్రారంభమైనది.[3] వారి తరువాతి కావ్యము లన్నిటికి బీజములనదగిన అభిప్రాయములు, భావనారీతులు ఈ కావ్యములో నున్నవి. ఐనను 1912 లో పునర్ముద్రణ జరుగువర కిది సాహితీపిపాసువుల దృష్టి నంతగా ఆకర్షించలేదు. వీరు

1. నా తొలిరచన : ప్రసంగము : ఆకాశవాణి మద్రాసు కేంద్రమునుండి : 1942.
2. రాయప్రోలువారి 'లలిత'లోని 'నివేదన' నుండి : 1944 ప్రచురణ.
3. దీని విషయము ముందు ముందు విపులముగా చర్చింతును.

1910 లో టెన్నిసనురచించిన 'డోరా' అను లఘు కథాకావ్యమును 'అనుమతి' యనుపేర తెనిగించిరి. ఇదియును ఎవరిదృష్టి నాకర్షించినట్లులేదు. 1912 లో 'తృణకంకణ' రచనతో రాయప్రోలువారు నవ్యకవిత్వమునకు ప్రవర్తకస్థాన మధిష్ఠించినారు. వస్తువులో, భావములో, రచనలో నవ్యతసాధించిన కావ్యమిది. అయినను 1909 నుండి 1912 వరకున్న మూడేండ్ల కాలమున వీరు స్తబ్ధులుగా, సంప్రదాయదాసులుగా లేరు. ఒక విధముగా, ఆంగ్లకావ్యపరివర్తనముతో 1909 లోనే వారిలో నవ్యత తొంగిచూచినది. ఈ మధ్యకాలమున వారిలో పరివర్తనాగ్ని యేవిధముగా మందమందముగా రగులుచుండెనో పరిశీలింతము.

1909 (1831 శాలి. శ. చైత్రము) ఆంధ్రభారతి సంచికలో రాయప్రోలువారు ప్రచురించిన 'కళాకవిత్వములు' అను వ్యాసమున వారు ఏ విధముగా దేశమున ఉవ్వెత్తుగా పొంగుచున్న పరిణామమును గమనించిరో క్రింది వాక్యములనుబట్టి తెలియును.

''చిట్టిబొట్టు నోముఁబట్టి ప్రభాతాలంకరణంబునకై వేగిరపడు చిఱుపడంతి స్వదేశీచీర గట్ట నుత్సహించుచున్నది. పాశ్చాత్యసాంఘికపరివర్తనాసంపర్కంబునఁ బరకీయదుర్భ్రమాభ్రమవివశుడై, దాస్యసంకలితుడైన యాధునికవిద్యాపరుండును...పవిత్రమగు భారతదేశముపై భక్త్యనురాగనిర్భరత ప్రసరించుచున్నాడు...ఇట్టి బోధోదయవేళ కళాకవిత్వములును భావోదయమునందమి దురూహ్యము.''

ఈ విధముగా దేశీయులు కళాకవిత్వములలో భావపరివర్తనము పొందవలసిన యవసరమును వారు గుర్తించుచునే ఇంకొకవైపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో అవధానములందు పాల్గొనుచుండిరి. అయినను ఈ సంప్రదాయదాస్య మెంతకాలమో కొనసాగలేదు. 1911 లో బుచ్చిరెడ్డిపాళెంలో బెజవాడ పట్టాభిరామిరెడ్డిగారినిగూర్చి[1] వారు చెప్పిన పద్యములలో ఆశుకవిత్వముపై విరక్తి భావమును ప్రకటించిరి. అంతకుముందే కొప్పరపుకవుల ఆశుకవిత్వమునకు తలయూచి రెడ్డిగారు వారిని 'చొక్కపు బంగారుగంట'లతో సత్కరించిరట. రెడ్డిగారి వదాన్యబుద్ధిని ఒక చెంప ప్రశంసించుచునే రాయప్రోలువా రాశుకవిత్వము నీరీతిగా తూర్పారబట్టిరి.

'— — — — —

కపురంపుంబలుకుల్ దెనుంగులివి వేగప్రక్రియాధోరణీ
విపరీతానిలధాటిలో చెరిగినన్ విధ్వంసమైపోదె త
ద్విపులామోదము, మెత్తురే రసికు లీవిన్యాసవైకల్యముఁ.'[2]

కపురపు తునకలవంటి తెలుగుపలుకుల విపులామోదమును విధ్వంసముచేసెడి ఆశుకవిత్వప్రభంజనమును పై విధముగా నిరసించి, తన కాశుకవితాసన్యాసమిప్పించి, రమ్యాక్షరక్షోణివైపు మరల్చుమని ఇష్టదేవత నీ విధముగా ప్రార్థించిరి.

1. వీరు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి జనకులు.
2. రాయప్రోలువారి అముద్రిత పద్యము.

''తేనుగేతీయని, దందుపద్యపదరీతిక్రీడ లత్యంతమో
హనముల్ శోభనముల్ తదీయరసరక్తాలాపనంబుల్ లభించి
చిన వాగర్థకలాకలాపజయలక్ష్మికా గాలికింబుత్తునే
జననీ ! యేమిటికింక ఆశుకవితాసన్న్యాస మిప్పించవే.''

''రసమో, భావమొ, జీవదర్థసుకుమారవ్యంజనామంజుళ
బ్దసమాసారచనంబొ, సాధుహృదయస్పందప్రతిష్ఠాకథా
విసరంబో, సకలార్థశూన్యమగు నీ వేగాతివేగో క్తిదు
ర్వ్యసనంబేటికి త్రిప్పుమింకజననీ ! రమ్యాక్షరక్షోణికిన్.''[1]

రసము, భావము, వ్యంజనామంజుళబ్దసమాసరచనము, సాధుహృదయస్పందప్రతిష్ఠాకథావిస రముగల రమ్యాక్షర రచనామార్గమున ప్రయాణించవలెనని రాయప్రోలువారు దీక్షగై కొనిరి. ఈ ఘట్టముతో వారి కవితాజీవితములోని ప్రథమదశ పరిసమాప్తమైనది. వస్తుభావరచనలలో నిస్తులనవ్యతను కాంక్షించిన ద్వితీయదశ ప్రాప్తించినది. అప్పటినుండి అభినవకవితకు వారు ఆచార్యులైనారు.

రాయప్రోలువారిలో క్రొత్తదనమునకు పాదులు వేసినవారిలో వారి పిన్నిగారు ప్రథమస్మర ణీయలు. సాహిత్యాభిరుచి యున్న విదుషీమణియామె. 'లోకయాత్రలో క్లిష్టగ్రంధులు విప్పి వేయగల వివేకవతి.'[2] రాయప్రోలువారి కామె జ్ఞానచక్షుస్సును ప్రసాదించినది. ఆమె కోరికపై వారు శంకరాచార్యులవారి 'భజగోవింద'మును తెలుగులోనికి పరివర్తనము చేసిరి. మూలములోని ఛందస్సులోనే దీనిననువదించుట ప్రత్యేకత.

'గోవిందాయని శ్రీగోవిందుని
పూజింపర యోమూఢమతీ
భజియింపర యోబండమతీ.'[3]

ఈ విధముగా ఇది సాగిపోవును. ఆమె ప్రభావ మింతటితోనే తీరిపోలేదు. ఒకమారు ఆమె కోరి కపై రాయప్రోలువారు అనసూయచరిత్రము చదివి ముగించిరి. అదివిని వారి పిన్ని యిట్లనెను.

'నాన్నా చు చావురా ! త్రిమూర్తులుకూడా ఎలా తల్లికంటితోచూస్తే చంటిపిల్లలైనారో ? ఈలాంటిభావం మన కథాకలాపాల్లో ఇంకా అధికంగా ఉంటే ప్రేమభాండం తొణికేదా ? ఏ గ్రంథంలో విన్నా ఆడవాళ్ళనుగూర్చి ఏమేమో వ్రాస్తారు మగవాళ్ళు.''[4]

1. వనమాల : పుట 39.
2. 'తృణకంకణరజతోత్సవసంచికానీరాజనం'నుండి
3. రాయప్రోలువారి అముద్రితరచనలనుండి గ్రహించితిని.
4. నా తొలిరచన : ప్రసంగము : రాయప్రోలు

ఈ వాక్కులు రాయప్రోలువారి లేతగుండెపై చెరుగని ముద్ర వేసినవి. ముక్తకంఠమైన వారి 'అనంతరరాగసంహితకంత' కిదే అమృతబీజమని, అప్పటినుండి 'క్షీరసాగరశయన'యను గీతము విన్పడినప్పుడు ప్రేమస్వరూపిణియగు తల్లి, ఆమె వక్షఃస్థలముపై స్తన్యపానము చేయు శిశువు వారి భావాంబరరూపదర్శన మిచ్చెడువారని రాయప్రోలువా రభిప్రాయపడినారు.[1] వారికావ్యములలో స్త్రీకి దివ్యత్వమబ్బుటకు, ప్రకృతికి మాతృస్థానము కలుగుటకు, వారి పిన్నిగారిమాట లెంతో దోహదము చేసినవని స్పష్టమైనది.

రాయప్రోలువారి మనఃపరివర్తనమున కిది ఆంతరంగికమైన ప్రభావ మనుకోవచ్చును. ఇక బహిఃప్రభావములను గమనింతము. కందుకూరివారి సంఘసంస్కరణ మహోద్యమ మప్పటికే ఉప్పెనవలె విజృంభించినది. గిడుగువారి భాషాసంస్కారమహోద్యమము పండితులలో 'దడ' పుట్టించినది. 1912 లో కన్యాశుల్కపునర్ముద్రణము వెలువడుటతో, దానిలోని నాటక లక్షణములనుగూర్చి, నాయికానాయకులనుగూర్చి, రసౌచిత్యములనుగూర్చి విమర్శలు దుమారమువలె రేగినవి. శృంగారరసముపై సుదీర్ఘచర్చలు సాగినవి. ఛందస్సులగురించి వివాదములు వెడలినవి. ఈ వాదప్రతివాదములలో కందుకూరి, కౌమట్రాజు, జయంతి, గురజాడ గిడుగు ప్రభృతి దిగ్దంతులు పాల్గొనుటతో అపూర్వవిషయములు తెరవదలి రచ్చకెక్కినవి. వానిలో శృంగారశుచిత్వ మొకటి. విప్రలంభప్రాధాన్య మొకటి. దేశీయచ్ఛందఃప్రాశస్త్య మొకటి. ఈ మూడింటిని రాయప్రోలువా రాకళించుకొన్నారు. ఈ వాదోపవాదములతో రాయప్రోలువారి దృక్పథములో పరిణామశీలకమైన మార్పు వచ్చినది. 'అటు తంజావూరి శృంగారముతో అసహ్యపడి, ఇటు పూర్వశృంగారవ్యవస్థ నచ్చక ఊగులాడుచున్న అంతరము'[2]లో రాయప్రోలువారికి పైవాదప్రతివాదములవలన క్రొత్తబాట స్ఫురించినది. వారు ప్రతిపాదించిన 'అమలిన శృంగార' సిద్ధాంతమున కీకాలమే ప్రాతిపదిక యనవచ్చును.

1914 వరకు రాయప్రోలువా రింగ్లీషుకావ్యముల నంతగా చదువలేదు. వర్డ్సువర్తు, కీట్సు, షెల్లీమున్నగువారి కావ్యములను క్షుణ్ణముగా పరిశీలించిన దీకాలముననే. 1914 తర్వాతనే వారు రవీంద్రున కంతేవాసులై శాంతినికేతనసౌరభ్యమును, వంగకవితామాధుర్యమును గుండెకు పట్టించుకొనిరి. ఈలోపుగానే విజ్ఞానసర్వస్వరచనలో కౌమట్రాజువారి సాహచర్య భాగ్యము లభించినది. కౌమట్రాజువారి సాహచర్యముతో రాయప్రోలువారి జ్ఞాననేత్రము మరింత కాంతిమంతమైనది. దీనికితోడుగా కొంతకాలమునకు దుగ్గిరాలగోపాలకృష్ణయ్యగారి మైత్రి యేర్పడినది. ఈ ప్రభావములన్ని కించిత్కాల వ్యత్యాసముతో ఏకీకృతమై రాయప్రోలువారిలో నవ్యత్వమునకు కవాటములు తెరచినవి.

1. నా తొలిరచన : ప్రసంగము : రాయప్రోలు.
2. అభినవకవిత (వ్యాసము) : రాయప్రోలు : ఆంధ్రప్రభ దినపత్రిక.

**'లలిత':**

గంటి లక్ష్మన్న పంతులుగారి ప్రోత్సాహముతో రాయప్రోలువారు 1909 లో Hermit ననుసరించి 'లలిత' రచించినారని ఈ వరకే మనవిచేసియుంటిని. 1909 లో ప్రచురింపబడిన తొలిముద్రణమున 186 పద్యములేయుండగా మలి ముద్రణమున 156 పద్యములైనవి. లక్ష్మన్న గారు చవిచూపిన ఆంగ్లసాహిత్యరుచిఫలితముగా రాయప్రోలువారికి 'కాసారకవుల' (Lake Poets) రచనలు మరులుగొల్పినవి. ఆ వాసనతో, ఆ భావనాబలముతో అవతరించిన పద్యములే 'లలిత'లో సందర్భసన్నివేశముల కొలది ఒప్పారినవని రాయప్రోలువారన్నారు.[1] 1912 లో వెలువడిన ద్వితీయముద్రణమునకు రమాకాంతాచార్యులవా రింగ్లీషులో ప్రవేశిక రచించిరి. చెళ్ళపిళ్ళవారు తెలుగులో అభిప్రాయము నొసంగిరి. చెళ్ళపిళ్ళవా రీకావ్యములోని నవ్యత నీ విధముగా సమర్థించిరి.

'ఇందుఁ గథాముఖము సనాతనకావ్యసంప్రదాయముల ననుసరింపక నాయికావిలాప ముతోఁ బ్రారంభమగుచున్నది......ఇందలి యితివృత్తము హూణకవికృతినుండి కైకొనబడినది. కాని యాయాయి వర్ణనములు స్వకపోలకల్పితములే."

రమాకాంతాచార్యులవారు వ్రాసిన పీఠికలో ఈ కావ్య మింగ్లీషుసాహిత్యప్రభావముతో జయప్రదముగా రచింపబడిన మొట్టమొదటి తెలుగుకావ్యమని అభిప్రాయపడిరి. ఆచార్యులవారి వాక్యములు అనేకాలోచనలను ప్రేరేపించునవిగా ఉన్నవికాబట్టి వానిని ఉదాహరించుట సమంజస మని భావింతును.

"This poem, which I have been priviliged to introduce to the literary public of Andhra world, is, I believe, the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the sacred passion of love under the direct inspiration of the votaries of English Muse and as such, marks a new epoch in the development of Modern Telugu literature."

ఇంతేకాక, వీరికిముందు ఇంగ్లీషుకవుల కావ్యముల ననువదించినవారున్నను వారి రచనలు మౌలికభావసంపత్తి లేనందున ఆంధ్రసాహిత్యములో నవోన్మేషము కలిగింపలేకపోయెనని, ఈ కవి అట్లుకాక ప్రకృతిలోనుండి సూటిగా అనుభూతులను చేదుకొని, వానిని శబ్దచిత్రములుగా మార్చి, తన కావ్యమున ప్రవేశపెట్టి క్రొత్తజీవమూదెనని ఆచార్యులవా రభిప్రాయపడినారు. ప్రబంధకవిత్వములోని పారంపరికమైన పదాడంబరమును, కృత్రిమశైలీవిన్యాసమును ఈ కవి త్యజించి నవ్యతకనబరిచెనని ఆచార్యులుగారు వ్రాసినారు. ప్రకృతిని అత్యంతరమణీయ ముగా చిత్రించుటలో రాయప్రోలువా రనితరసాధ్యమైన కౌశలము చూపినారని ఆచార్యులుగారు ఇట్లభినందించిరి.

1. లలిత: నివేదన: 1944 ముద్రణ.

"The crystal stream, the limpid lake, the crimson twilight, the starlit night, the rosy morning, the melting mist, the flowery creepers, the reddened blossoms, the warbling birds, the humming bees, the grazing fawns, which form the object of some of the poetic descriptions conjure up a scene of great picturesqueness."

ఆచార్యులవారి అభిప్రాయమునుబట్టి చూచినచో 'లలిత' మొట్టమొదటి నవ్యకావ్యమను టలో విప్రతిపత్తియుండదు. కాని తల్లావఝ్ఝలమున్నగువారు 'తృణకంకణమే నవ్యకవిత్వమున కాదిగ్రంథ'మని అభిప్రాయపడిరి. పైగా ఆంగ్లమాతృక కనుకరణము కాబట్టి 'లలిత'ను నవ్య కావ్యమనవచ్చునో లేదో యను సందేహము కలుగకమానదు. మనము క్రొత్తవని యనుకొన్న వర్ణనలు మాతృకలోనివేమో ? కాబట్టి దీనినవ్యత్వమును నిర్ధరించుటకుముందు మాతృకతో తారతమ్య పరిశీలనముచేసి చూపవలసియుండును. నవ్యకవిత్వమున కన్నివిధములుగా (రచన, ప్రచురణ) ప్రథమగ్రంథ మనిపించుకోదగిన యోగ్యతకలది కాబట్టి దీనినిగూర్చి విపులముగా పరిశీలనచేయుట సముచితమని భావింతును.

### కథాసంగ్రహము :

కావ్యములో నుండవలసిన పాత్రసమగ్రత, విభావానుభావాదిభావపౌష్కల్య మిందులోలేవు. ఏకభావాశ్రయమైన ఇతివృత్తము కలదిది. కాబట్టి యిది ఖండకావ్యము. దీని కథాసంగ్రహమిది.

వియోగదోదూయమానమానసుడైన ఒక పాంథుడు ఆత్మీయవిషాదభావములను ప్రకటించుచు అడవిలో తిరుగుచుండును. కొంతసేపటికి 'పొంతనివాసంబుగనున్న ఒక్కముని' ఆ పాంథుని పల్కరించును. స్వాగతసాంత్వనోక్తులు పలుకును. తెల్లవారును. పాంథుడు ముని రూపమునకు, వనసౌందర్యమునకు ముగ్ధుడగును. ముని కాలోచితకృత్యములను దీర్చికొని వచ్చి పాంథుని వేదనకు హేతు వేమియని ప్రశ్నించును. అతడు తనవృత్తాంతమంతయు చెప్పును. తాను పథికుడనుగానని, జయపాలుడను రాజుకూతురునని, పేరు లలితయని, తాను మనసార వరించిన సత్యవర్ధనుడు నిరాశుడై అడవులబట్టెనని నివేదించును. అనంతరము తనప్రియుడు లేని జీవితము నిరర్థకమని పలికి పరాఙ్ముఖియైన ఆ యబలను మునివేషధారియైన యువకుడు హఠాత్తుగా కౌగిలించుకొనును. అడడే సత్యవర్ధనుడు. ఇరువురును అతిపరవశులై, అనురాగ విహాయసమున తనివితీర విహరించిరి.

### తారతమ్య పరిశీలనము :

ఇక మూలకథకు రాయప్రోలువారి రచనకుగల తారతమ్యమును పరిశీలింతము.

కథ పాంథునివిలాపముతో ప్రారంభమగును. కాని అది రెండు Stanza లు మాత్రమే యున్నది.

'Turn, gentle Hermit of the dale
And guide my lonely way

To where you taper cheers the vale
With hospitable ray.'

'For here forlorn and lost I tread
With fainting steps and slow,
Where wilds, immeasurably spread
Seem 'lengthen'ing as I go.'

ఈ వాక్యములతో పాంథుని విలాపము ముగిసినది. వెంటనే ముని సమాధాన మిచ్చినట్లు చిత్రింపబడినది. తెలుగులో ఈ రెండు Stanza లు 33 పద్యములుగా రూపొందినవి. పాంథుని హృదయవేదనలు విపులముగా వ్యక్తీకరింపబడినవి. అతని విరహబాధ ప్రబంధరీతిలో చిత్రింపబడినది. అతనికి దప్పికలిగినట్లు, సరోవరములోని నీరుత్రాగి దాని నుపశమించుకొన్నట్లు కల్పింపబడినది. ఈ సందర్భముననే సరోవరవర్ణన, సూర్యాస్తమయవర్ణన, సంధ్యారాగవర్ణన, తారకావర్ణన ప్రవేశపెట్టబడినవి. తర్వాత ఆటవికులనుద్దేశించి తన్ను రక్షింపవలసినదిగా పాంథుడు చేసిన ఆక్రందనము చిత్రింపబడినది. ఆ తర్వాత మూలములోనున్నట్లుగా ముని సాంత్వనోక్తులు చేర్చబడినవి. మూలకథలో ఆ రాత్రియే, పాంథునిబాధలకు హేతువేమని మునియడిగినట్లు కలదు. తెలుగులో మరునాడు తెల్లవారినపిమ్మట, ముని కాలోచితకృత్యములను తీర్చుకొనివచ్చి ప్రశ్నలువేయును. ఈలోపుగా ప్రభాతవర్ణన, ప్రభాకరవర్ణన, మునికుమారుని ముఖమును చూచుటతో పాంథునిమనస్సులో కలిగిన వికారవర్ణన, వనవర్ణన తెలుగులో ప్రవేశించినవి. మూలములో ముని యిట్లు సంభాషించును. "ఇంటినుండి గెంటబడితివా ? విశ్వాసహీనుని చెలిమిచేసితివా ? ఎవరినైనను ప్రేమించితివా ? ప్రేమ పేరునకే. అది డుల్ల; కేవలవినోదము. నిజమైన ప్రేమ ప్రపంచములో లేదు. ఉన్నదో పక్షుల (పావురముల) యందున్నది. యువకా ! నీ బాధలు ఉపశమించుకో. స్త్రీలను త్రోసివేయుము." ఈ మాటలనగానే పాంథుని చెక్కుల మీద పొంగివచ్చిన 'యెఱుపువన్నె' అతని స్వభావమును బయటపెట్టినది. అతడు తాను భగ్నజీవినని, టైనునదీతీరములో నివసించిన తండ్రి కేకైక పుత్రినని, ఎందరో తన్ను ప్రేమించగా తానొకసుందరుని వలచితినని, అతడు హిమమువంటి సుమమువంటి పవిత్రహృదయము కలవాడని, అతనిని నిష్కారణముగా తన గర్వముచేత చంచలక్రియలచేత నిక్కుటెక్కులచేత ఉడికించితినని, అతడు నిరాశాహతుడై నిష్క్రమించినాడని, అందుకు తాను పశ్చాత్తప్తనైనానని, అతనికొరకు మరణించుటయే తన కర్తవ్యమని పాంథరూపధారిణియగు పడతి నివేదించును. ఇది విని 'అమంగళము ప్రతిహతమగుగాక' యని మునికుమారు డామెను కౌగిలించుకొనెను. ఆమె సంభ్రమచకితయై పెనగులాడి చివరకు తన ప్రియుడగు ఎడ్విన్ అని తెలిసికొనెను.

తెలుగులో ఈ భాగము కొన్ని మార్పులు పొందినది. ముని మొదట పల్కరించిన తర్వాత పాంథుడు బొటబొట కన్నీరుకార్చును. అప్పుడు ముని మరల అతనినోదార్చును. 'దైవసృష్టి అగోచరస్థాయి' కలిగియుండునని, ప్రేమపరిణామ మనంతముఖవిస్ఫుటమైనదని, ప్రేమయే

మోహముగా, వాత్సల్యముగా, స్నేహముగా అవస్థాభేదమునుబట్టి రూపొందునని తెలిపి ప్రణయ రహస్యతత్త్వమును ప్రబోధించును. అప్పుడు పాంథుడు నిజవృత్తాంతము నివేదించును. తన జననము రాచవాడలనని, తండ్రి జయచంద్రుడని, తాను జన్మించిన కొన్నినాళ్ళకే తల్లి మరణించెనని, యుక్తవయస్సు వచ్చినపిమ్మట తానొక హృదయమోహనుని వలచితినని, అతని 'సహవాస మభిలషించి త్రికరణవిశుద్ధమగు తఱితీపినోపి' నిశాంతపద్మిని విధాన మెలగుచుంటి నని, చివరకు తనవలపు 'వృధావ్యధ'యైపోయెనని, 'వలచిన వన్నెలాడడవిపట్టె'నని, 'పక్షిలేని కొమ్మయిన నావంటి వనిత'ఉండి ఫలమేమని మరణమున కుద్యుక్తనైతినని వివరించెను. పాంథ వేషధారిణియగు లలితను మునికుమారుడు హఠాత్తుగా కౌగిలించినపిమ్మట ఆమె 'చలీకృతకు రంగిక'వోలె 'సమీపశాల్మలీప్రాంతము చాటునంది' 'ఆగ్రహరోషకషాయరక్తిమల్' 'నవారుణాధరము కాంతుల పంతములాడ' అతని చేష్టను నిందించును. 'కన్నుల న్నసరక్తబిందువు'లు చిందగా ఉపాలంభించును. అప్పుడు మునికుమారుడు, ఆమె మనసారవలచిన సత్యవర్ధనుడనని తెలిపి 'లలితా'యని పిలుచును. ఆమె అతని 'మోమునుగని రూపురేఖలను పోల్చి' 'చెలిమి నాతని కౌగిట చేర్చు'ను. వారి 'ప్రణయవ్రతదీక్ష' ఈ విధముగా ఫలించినది.

**మూలమునకు మెఱుగులు :**

అందందు ప్రవేశపెట్టబడిన వర్ణనలేకాక, లలితలో మూలమునకు వన్నెపెట్టు ఘట్టములెన్నోయున్నవి. మూలములో ముని, పాంథుని నోదార్చుచు ఈ యాశ్రమము త్రోవతప్పిన వారికి ఆశ్రయమువంటిది; దీనిలో నీవు సేదదీర్చుకోవచ్చునని అనును. తెలుగులో ఆ విధముగా పలికి, 'నన్ను పిశాచియని సందేహించకు; 'విధివ్యతిరేకముచే నిరాశమీఱందపమాచరించెడి విరక్తుడగాని మఱొండుగాసుమీ' అనును. ఈ వాక్యములలో సత్యవర్ధనుని వృత్తాంతము ధ్వనించుచున్నది. ఇంకొకచోట ముని 'వాడినవల్లివోలె వసివాడిన నీదుతనూవికాసమున్ చూడగ జాలి పుట్టెడు'అని యనును. 'కిశోరహరిణీకరిణి, దుర్గమస్థలమున్ కలయద్రిమ్మరెద' వనును. 'హరిణి'శబ్దము స్త్రీ వాచకమగుట ఇందులోని చమత్కారము. అట్లే 'నలిగిన నలినముగతి మెఱుగులుమాసి ముడుంగు నీదుకోమల ముఖము'అని యన్నప్పుడు పాంథుని స్త్రీత్వము ఝుమ్మని ధ్వనించును. మునిపల్కిన పల్కుల నాలకించి పాంథుడు 'ముగ్ధలవలీసుకుమారి' యనంగ నిల్చెనట. 'కన్నులలో వెచ్చనినీళ్ళుజాఱ రవ్వంతయు శాంతిగానక యొయారముగా వగలంగలంగె'నట. మునిసాంత్వనోక్తులతో మనస్సుకరగిన బాలపాంథుని అపాంగపార్శ్వములు తడిపి పచ్చి ముత్తియములు బొటబొటజారెనట. ఈ వర్ణనలన్నియు ఆమె'లలితా'త్వమును లలితముగా స్ఫురింపజేయునవి. ఆమె లలితయని చివరకు తెలిసికొన్న తర్వాత ఈ పదప్రయోగములలోని సారస్యము బోధపడును.

మూలమున మున్యాశ్రమములో పిల్లిపిల్ల సయ్యాటలాడుచున్నట్లు, గడ్డిపురుగు కుంపటి చుట్టు కిచకిచమనుచున్నట్లు వాతావరణము కల్పించబడినది. వీనిని త్యజించి, మూలములోలేని కురంగక్రీడలు ప్రవేశపెట్టి కవి ఆశ్రమవాతావరణ వర్ణనమున ఔచిత్యము గూర్చియున్నాడు.

మూలములోలేని వనవర్ణనకథ కుపస్కారకముగానున్నది.[1] వనము వేదాంతిమనమువలె, వెత్తిలేని విశ్రాంతసరస్సు మాదిరి, 'శుకముఖాక్షరరమ్యకథానులాపలీలాభరమై' యున్నట్లు వర్ణింపబడుటతో శాంతరసమునకు చక్కనినేపథ్యమేర్పడినది. కథయంతయు వనములోనే జరిగినట్లు వర్ణితమైనది. నాయకుడు మునివేషధారియై పర్ణశాలలోనుండును. వేషమేకాక అతని హృదయము సైతము సత్త్వదీపకముగానున్నది. నాయిక ప్రియవియోగముతో వైరాగ్యోన్ముఖియై యున్నది. కావ్యమున వియోగశృంగారముతోపాటు పరిగణ్యమైన రసము శాంతము. కాబట్టి వనవర్ణన ఏతదభిముఖముగా సాగుట విశిష్టత. రాయప్రోలువారు చేసిన ముఖ్యమైన మార్పిది. మూలములో నాయికానాయకులు పరస్పరము ప్రేమించుకొందురు. ఐనను నాయిక అనవసరముగా నాయకుని ఉడికించి ఆనందించినట్లున్నది.

"For still I tried each fickle art,
Importunate and vain;
And while his passion touch'd my heart,
I triumph'd in his pain."

ఇది ఉదాత్తనాయిక లక్షణముకాదు. దీనిని పరిహరించి రాయప్రోలువారు లలిత సత్యవర్ధనుని త్రికరణశుద్ధితో ప్రేమించినట్లు, 'హిమవదవసానమున చెలువెనయనున్న మారుతాగమ మీక్షించు మల్లికవలె' అతని సహవాసముకోస మువ్విళ్ళూరుచున్నట్లు, 'సిగ్గుజడియింప' తంద్రితో తన ప్రణయవృత్తాంతము చెప్పకపోవుటవలన కాలముగడచిపోయి నిరాశుడై తాను 'వలచినవన్నె లాడదవిపట్టె'నని చిత్రింపబడినది. ఈ మార్పు నాయిక నుదాత్తస్థాయికి చేర్చినది. ఎంతకాలమైనను తన కోర్కెలు ఫలించనందున నాయకుడు నిస్పృహతో అడవులబడిపోవుట ఔచితీమంతముగానున్నది. మునివేషధారి నాయిక నమాంతముగా కౌగిలించుకోగానే ఆమె విభ్రాంతయై పెనగులాడినట్లు మూలమున కలదు.[2] ఈ సన్నివేశమున నాయికచిత్తవృత్తులు చిత్రించుటకు, ఆమె రోషకంపితాధరయై మునికుమారు నీ రీతిగా నిందించినట్లు మార్చబడినది.

"ఓయి కుహనాయతీ! యిది యొప్పునయ్య ?
అబలనొకతె, ననాథయై యడవిచిక్కి
దిక్కుమాలిన దానిని చక్కపిలిచి
నీతిమాలితి కాల్పనే నీదువ్రతము."

ఈ విధమైన మార్పువలన నాయిక అసిధారానిశితమైన శీలమునకు మరింత పదునేర్పడినది.

1. మిగిలిన ప్రభాతాదివర్ణనలు కథాదృష్టితో విశేషగుణములుగలవి కావు.
2. 'The wondering fair one turned to chide'—Hermit.

## సాంప్రదాయికత : నవ్యత :

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథంతే'యను అభియుక్తోక్తి ప్రకారము కావ్యము 'శ్రీ' తో ప్రారంభమగుట సంప్రదాయము. రాయప్రోలువా రీసంప్రదాయ మును వదలి 'ఓ సుగుణాలవాల'యని ప్రారంభమొనర్చిరి. అంతేకాక నాయికావిషాదకథన ముతో దీనిని మొదలుపెట్టి గొప్పనవ్యతను కనబరిచిరి. 'ముసలమ్మమరణము'లో అంత మున (విషాదాంతము కాబట్టి) ఉన్న నవ్యతను ఈ కావ్యమున వీరు ఆదిలోనే ప్రవేశపెట్టిరి. ఇక మూలకథను పెంచివ్రాయుటలోగల ఉద్దేశము పాత్రల ఆత్మభావప్రకటనమునకు మన స్తత్త్వ విశ్లేషణమున కవకాశము కలిగించుటయే. ఇది నవ్యతయనియే చెప్పవలెను. ఇందులో ప్రతిపాదింపబడిన ప్రేమసిద్ధాంతము తాత్త్వికచ్ఛాయలు గలిగియున్నది. కాల్పనికకవిత్వములో కేవలవర్ణనలే యుండవు. ఆ వర్ణనల నంటుకొని ఒక గంభీరమైన తాత్త్వికచింతనము పూస లలో దారమువలె ప్రవహించుచుండును. ఈ కాల్పనికకవితారేఖ లలితలో తొంగిచూచుచున్నది. రాయప్రోలువారి విలక్షణరసనిద్ధాంతమైన 'అమలినశృంగార' తత్త్వము రేఖామాత్రముగా ఈ కావ్యములోనే తళుక్కుమనుచున్నది. ఈ విషయము ముందుముందు వివరింతును. ఈ విధ ముగా వస్తువర్ణనతోపాటు ఒక తత్త్వమును ప్రతిపాదించుట మరియొక నవ్యత. ఈ కావ్యమున వృత్తవిషయములోగాని, పదప్రయోగములలోగాని రాయప్రోలువా రెక్కువ నవ్యత చూపలేదు. సంధికార్యము పాటింపకపోవుట[1] పద్యకావ్యములలో అప్పటికి ప్రయోగమే యనవచ్చును. కన్నీళ్ళను పచ్చిముత్తెములనుట, తప్పుడే ఊరినతేనెను పచ్చితేనెలనుట నవ్యతాగంధముగల ఊహింపులే[2] ఇక వర్ణనల విషయము: ఈ కావ్యములో ప్రవేశపెట్టబడిన విరహవర్ణన, సూర్యోదయాస్తమయవర్ణన, తారకావర్ణన, సరోవరవర్ణన, వనవర్ణన మున్నగునవి ప్రాచీన ప్రబంధములలో కొల్లలుగానున్నవే. ప్రబంధపరిచయములేక కేవల మాంగ్లసాహిత్య పరిజ్ఞాన మున్నవారు ఈ వర్ణనలుచూచి ప్రకృతికవిత్వమని ప్రస్తుతించుటకు వీలున్నది. కాని యీ వర్ణ నలలో అంతగా నవ్యతలేదు. ప్రభాతసమయములో 'రథాంగదంపతుల' వియోగము; విరహ వర్ణనలో "హారముభారమై ......... రుచ్యపదార్థకల్పితాహారము కారమై ......... చంద నాద్యలంకారము వైరమై" అనుధోరణి పరమసాంప్రదాయికమైనది ఈ వర్ణనలోని అంత్యనియమ మచ్చముగా పోతన్న ప్రభావమును పుణికిపుచ్చుకొన్నదే. ఇక మధ్యమధ్య ప్రయుక్తములైన 'కొలకుపొలతుక', 'సూనశరుకోలలు', 'గాటపున్వలపు', 'వియోగవారిధి', 'ప్రాణములెంతటిపో', 'మహోగ్రకరాగ్రదవానలము'మున్నగునవి ప్రాచీన ప్రబంధములలోని పదబంధములను స్ఫురింప జేయును. అంధకారమును వర్ణించుటకు

---

1. 'ప్రస్తుతించి; ఒక మావిసమీపము చేరి.'
   'ఈ వనవీధియందు ఇరవేదియులేదని.'
2. 'కోడెకోయిలలు', 'వలపువాకిలితీయుట' నవ్యప్రయోగములే.

'జగమను విచిత్రనాటకశాలయందు
తరణి యస్తంగతుండైనతటి, విషాద
భరముసూప దించిన నీలితెరయనంగ
అంధకారంబలమె దిశాబంధురముగ'

అనుదాని కాధారము మూలమున లేకున్నను. దీనిలో విజాతీయవాసన గుబాళించుచునేయున్నది. సంప్రదాయ సిద్ధములైన కవిసమయములను, ఋతుధర్మములను క్రొత్తగా మలచుకొన్న పద్యము లిందులో కొన్నియున్నవి.

'తొలకరివానచుక్కల శైత్యమునగాని
　　దగదీర్చుకొనని చాతకమునియతి
చిగురుపండుగశోభ లిగురెత్తిననగాని
　　పలుకని కొదమకోయిలవ్రతంబు
మెఱుగుమబ్బులనీడ లొరసినప్పుడకాని
　　పురివిప్పని మయూరముల విధంబు
కటికియెండల మండుకలిగాని కుసుమోద
　　యముగాని కన్నెకుందములనోము'

అను పద్యము అట్టిదే.

**ప్రేమ సిద్ధాంతము:**

రాయప్రోలువారి 'అమలినశృంగార' సిద్ధాంతమున కీకావ్యములోనే బీజములున్నవని వెనుక వ్రాసియుంటిని ఈ సిద్ధాంతము బొగాములనుగూర్చి ముందుముందు వివరముగా చర్చింప వలసియున్నది. కాబట్టి ప్రస్తుతము దాని స్వరూప మెట్లు ప్రతిపాదితమైనది మాత్రమే ఉల్లే ఖింతును.

మునివేషధారియైన నాయకుడు పాంథవేషధారిణియైన నాయికకు ఇచ్చిన ఉపన్యాసమును బట్టి, రాయప్రోలువారి దృష్టిలో ప్రేమము, వాత్సల్యము, మోహము, ప్రణయము తుల్యము లేయని అనిపించును. తల్లిబిడ్డల వాత్సల్యము, మైత్రీశీలుర సాధుస్నేహము, ధర్మనిష్ఠులగు దంపతుల దాంపత్యము, 'ప్రేమరసాతిరేక పరిపూర్ణీభూత' జీవములై వర్ధిల్లునని వీరభిప్రాయ పడిరి. వాత్సల్యాదిభావములన్నియు ప్రేమపరిణామదశలని వీరి యుద్దేశము. క్షీరకంఠమున అంబాయని యెల్గెత్తు లేగదూడలో కొమ్మమీద కమ్మగా కలవరించు శకుంతికలో వాత్సల్యరూప కముగా ప్రేమమాహాత్మ్యమే ప్రకటితమగునని వీరు నిర్ధరించిరి. ఒకచోట స్నేహమే ప్రేమ మునకు మూలమని వీరు సిద్ధాంతీకరించిరి. చివరి పద్యములలో వీరు చెలిమి, మోహము,

దాంపత్యము, ప్రేమము, అనురాగము, ప్రణయము అనుపదములను ఇంచుమించుగా ఒక యర్థములోనే వాడిరి. ఈ విధముగా ప్రేమతత్త్వమే ఎన్నిరూపముల విస్తరించునో ఈ కావ్యములో వీరు ప్రతిపాదించిరి. అయినను వీరి ప్రేమసిద్ధాంతము, అమలిన శృంగారతత్త్వము, 'తృణకంకణము'లోనే స్థాయినందుకొన్నవి.

'లలిత' వర్ణనలలో సాంప్రదాయికత కనబరిచినను, పదప్రయోగములో విశృంఖలత్వము చూపకపోయినను, కథాప్రారంభములో, నిర్వహణములో నవ్యత కనబరిచినది. ప్రేమసిద్ధాంతమునకు సరిక్రొత్త వ్యాఖ్యానమిచ్చినది. కొన్నికొన్ని క్రొత్తపదబంధములను, కావ్యావరణమున ప్రవేశపెట్టినది. యౌవనోదయదశను వ్యక్తీకరించుటకు 'తెరలె గవాక్షములపాలయి కన్నులు' వంటి ఉక్తివైచిత్ర్యముతోగూడిన నవ్యభావములను కల్పించినది. పాత్రల రూపవర్ణనకు, మనస్తత్త్వచిత్రణకు, ప్రకృతివర్ణనలకు, ప్రకృతికి కథకుగల సంబంధనిరూపణమునకు ప్రయత్నించినది. మూలమని ఒకటియున్నను దాని నతిశయించు రీతిలో, స్వతంత్ర వృత్తిలో నడచినది. ప్రేమగాథ ఆధునికపరిస్థితుల కనుగుణముగా చిత్రించబడినది. ఈ విధముగా చూచినచో రాయప్రోలు వారి 'లలిత' ప్రప్రథమ నవ్యకావ్యమనుటకు విప్రతిపత్తి యుండకూడదు

**అ ను మ తి :**

ఇది టెన్నిసన్ వ్రాసిన 'డోరా' కావ్యమున కాంధ్రీకృతి. 1910 లో ప్రచురింపబడినది ఈ కావ్య ప్రారంభములోని 'ప్రస్తావన' పద్యములనుబట్టి చూడగా రాయప్రోలువారు నవ్యతకొరకెంత యుత్కంఠకలిగి యుండెడివారో స్పష్టమగును.

'హూణకవీశ్వరాభరణమై తగు నాటెనిసన్ కవీంద్రుడు డో
రాను తెనుఁగునందు నలరారగజేసితిఁ దల్లిబాసపై
నూనిన గారవంబునఁ నవోదయతత్వ కవిత్వ మాంధ్రవై
జ్ఞానికమండలంబునఁ బ్రకాశము సేయు తలంపుపెంపునన్'

కాని వీరి నవ్యతా ప్రీతి ఇంకను ఆంగ్లకవిత్వానువాదముమేరకే పరిమితమై యుండుట గమనింపదగినది.

ఈ కావ్యము బాపట్ల బోర్డుహైస్కూలు హెడ్మాస్టరు, 'హూణవాఙ్మయసుధాకూపారవీచీధురంధరుడు'నగు పంచాపకేశయ్యరుగారికి అంకితము చేయబడినది. ఈ యనువాదము చేయుటకు రాయప్రోలువారికి అయ్యరుగారు ప్రోత్సాహమిచ్చిరట భావపురి (బాపట్ల) విద్యార్థులీకృతిని ముద్రింపించిరి.

ఈ కావ్యములో 'డోరా' యనునది 'అనుమతి' పాత్రగా రూపొందినది. తన్ను పెండ్లి చేసికోవలసినవాడు ఇంకొక తరుణిని పెండ్లాడినను అతని మరణానంతర మతని భార్యాపుత్రుల కొరకు 'అనుమతి' యను కన్య యేవిధముగా త్యాగముచూపెనో ఈ కథలో వర్ణింపబడినది.

దీనిని కవిగారు యథామాత్నకముగానే తెనిగించిరి. లలితలో చూపిన స్వాతంత్ర్య మిందు చూప లేదు. ఈ కావ్యమున వాడిన పద్యములలో అధికభాగము వృత్తములే. రెండు మూడు సీస పద్యములున్నను శిథిలబంధము కలిగియున్నవి. చంపకము. ఉత్పలము, రెండు మూడుచోట్ల అయిదుపాదములుగా వ్రాయబడినవి. ఈ కావ్యములోని వర్ణనలలో దాదాపన్నియు సాంప్రదాయి కముగానే యున్నవి.

'చిలుక గోరువంక కలయిక చెలిమినమరు నాపడుచు జంట,' 'గుణాఢ్యున్ తపఃఫలమున్ జంపితి' వంటివి ప్రాచీన కవితాగంధముగలవే. 'ఎచ్చటనుంటి నిన్న? యితడెవ్వరి బాలకు? డేమిసేయ నేడిచ్చట కేగుదెంచితి'వంటి పద్యములనడక పురాణకవితామార్గమున నున్నది. 'నిలయంబెల్ల ప్రశాంతభారమయమై యుండె' నన్నప్పుడు కొంత విజాతీయవాసన తొంగిచూచు చున్నది. ఎదియెట్లున్నను ఈ కావ్యము మూలములోని కథారామణీయకమును తెలుగులోని కందించు దృష్టితోనే రచింపబడినది. రాయప్రోలువారి సొంతగొంతు ఈ కావ్యములో ఎచ్చటను వినిపించదు.

## కష్టకమల :

రాయప్రోలువారి కావ్యములలో 'తృణకంకణ' మగ్రేసరమైనది. ఇది ప్రచురించిన పిమ్మటనే వారి యితర కావ్యములగు కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారము, రమ్యాలోకము, మాధురీదర్శనము అనునవి వెలువడినవి. వీనిలో చివరివి రెండు సిద్ధాంతకావ్యములు. వానిని గూర్చిన ప్రసక్తి అమలినశృంగారాదిసిద్ధాంతములను చర్చించునప్పుడు వచ్చును. తృణ కంకణము వస్తుభావరచనా విషయకముగా తురాయివంటిది కాబట్టి దాని నవ్యతను తరువాత నిరూపింతును. ఈ లోపుగా కష్టకమల, స్నేహలత, స్వప్నకుమారము అనువానిని గురించి పరిశీలింతము.

రాయప్రోలువారు 'కష్టకమల' రజతోత్సవముద్రణసంచికలో (1938) వ్రాసిన 'ప్రస్తావన'లో ఈ కావ్యవస్తువు 'శ్రవణపాతమైన ఒక యుదంత'మని స్పష్టపరిచిరి. వారి 'ప్రస్తావన'ను బట్టి కావ్యకథాస్వరూపమును, దాని ఆంతర్యము నీ విధముగా గ్రహింపవచ్చును.

ఈ కావ్యములోని పూర్ణయను ఇల్లాలు 'సకలత్వగుణ పరిపూర్ణ' ఆమె అనపత్య. పొరు గింటి 'కుమారు'డను బాలుని కొడుకుగా పెంచుకొన్నది. కమలకు పూర్ణ మేనత్త. పూర్ణ పుట్టింటి వారియిల్లు, కమలయిల్లు దగ్గరదగ్గరగానున్నవి. కుమారకమలాంబలు చిన్నప్పటినుండి మైత్రీముద్రితులై యుండిరి. పూర్ణ వారి స్నేహవల్లికి చల్లని పాదుగానుండెను. కుమారుడు కొంతకాలమునకు చదువుకొరకు నగరమునకేగెను. కమల పుట్టింటనే యుండెను. వీరి పెండ్లి మాట యెవ్వరు నెత్తలేదు. ప్రవాసమున కుమారుని ఊహలు మారెను. స్నేహభావము కామ ముగా పరిణమించెను. కమల యింకను పసిది. ఆమె "మనోవనము ఇంకను పూతకురాని

పసిమొక్కల మడిగానే ఉండెను."[1] కుమారుడు తన వలపును దెలుపుచు వ్రాసిన ఉత్తరమును జూచి కమల చకితయై పోయినది. అంతకు ముందామె ఆతనిని కేవలసోదరభావముతో చూచి నది. అతడు హఠాత్తుగా పెండ్లియనగానే తట్టుకోలేక కళవళపడినది. ఆమెకు ఉత్తరము తలవంపుగా తోచినది. వారిమధ్య రసభావములు సంకులమై పోయినవి. స్థాయినందుకోలేక సతమతమైనవి. ప్రకృతిగూడ ఈ క్లిష్టగ్రంధి విప్పుటకు కమలమరణమే యేకైక మార్గమని నిశ్చయించినది. కమల ఉయ్యాల ఊగుచు దైవికఘటనమున మరణించినది. 'ఈ భావవిన్యాస మందలి కష్టరేఖయే ఈ కృతికి బీజము.'

ఈ కథలోని పరమార్థమేమి? సోదరీసోదరభావమున్నచోట కామభావము ప్రవేశించి కష్టాంతముగా పరిణమించుట. కమల, కుమారుడు ఏకోదరులు కాకున్నను, అంతటి స్నేహ భావముతో పెరిగినవారు. అందువలన కవి వీరి సోదరభావమునే ప్రతిపాదింపదలచుకొన్నాడు. కమల హృదయములో ఈ భావమే రక్తదఘ్నముగా నున్నది. కుమారుడు చిన్ననాటిచెలిమిని కామములో పర్యవసించుకొన్నాడు. పవిత్రస్నేహము నపార్థముచేసికొన్నాడు. ఈ అపార్థమునకు కమలజీవితము బలియైనది. సోదరీసోదరభావమున్నప్పుడు కామము నిషిద్ధమని ఈ కథ బోధించు చున్నది. ఈ కథకు సంప్రదాయస్పర్శ లేకపోలేదు. ఋగ్వేదములో 'యమయమీసంవాదము'న ఈ కథాబీజమున్నది. యమీయములు సోదరీసోదరులు. యమి యముని కామించి ఇట్లనును.

'రాత్రీభిరస్మా అహభిర్దశస్యేత్
సూర్యస్యచక్షు ర్ముహురున్మిమీయాత్
దివాపృథివ్యా మిధునాసబంధూ
యమీర్యమస్య బిభృయాదజామి.'[2]

'రాత్రిందివములు, ద్యావాపృథ్వులు మిధునములై ఒక బంధములోనున్నట్లుగా యమి యముని భరించుగాక'యని యమి తన సోదరుడగు యముని వరించి యనును. యమి కోరికను యముడు నిరాకరించును. పురాణములలోని 'కచదేవయాని' కథలో ఈ స్పర్శయే కలదు. వీరు ఏకో దరులు కాకపోయినను, కచునికి దేవయాని గురుపుత్రియగుటవలన ఆమెపై సోదరీభావమే యున్నది. ఆ సోదరీభావముండుట వలననే ఆమె కామేచ్ఛ నాతడు నిరాకరించెను. ఈ రెండు కథలలో కామభావమును వెల్లడించినది స్త్రీయే. 'కష్టకమల'లో పురుషుని కిది అంటగట్టబడినది. స్త్రీ యొక్క ఉదాత్తత ఉన్మీలింపబడినది.

ఈ కావ్యమంతయు కమలకు జరుగనున్న అనర్థమును సూచించుచు నడచిపోయినది. శరీరమున కేది అత్యంతసుందరముగా నుండునో దానిచేతనే ఆ వ్యక్తికి మరణము ప్రాప్తమగు

1. కష్టకమల (1988 ముద్రణ): ప్రస్తావన.
2. ఋగ్వేదము: 10 వ మండలము: సూక్తము 10.

నను విశ్వాసము మనలోనున్నది. కమల జడ అందమైనదిగా అనేకపర్యాయములు చిత్రింప బడినది. చివర కదియే ఆమె మృత్యుపాశమైనది. దీనిలోని 'అజవిలాపము' విషాదచ్ఛాయ కొరకే చిత్రింపబడినది. కుమారుడు కమలకు వ్రాసిన ప్రణయలేఖలో అవ్యక్తధోరణిలో విషాదచ్ఛాయ తొంగిచూచుచున్నది. ఈ విధముగా విషాదాంత కావ్యమునకు కావలసిన రేఖా సామగ్ర్య మిందులో ప్రవేశపెట్టి రాయప్రోలువారు కావ్యరచనారహస్యమును పొందుపరిచిరి. వారి కావ్యములలో కథాపుష్టిదృష్టితో చూచినచో ఈ కావ్యమే శేఖరప్రాయమైనది. విషాదాంత కావ్యములలో రామలింగారెడ్డిగారి 'ముసలమ్మమరణము' తర్వాత ఎన్నదగిన కావ్యమిది. తెలుగువారి ఆచారవ్యవహారములను, తెలుగుపల్లెల సొంపుసొగసులను, తెలుగుకన్నెల లేత మనసులలోని తీరుతీయములను హృద్యముగా చిత్రించిన కావ్యమిది. ఈ విషయము తర్వాత వివరింపబడును.

### స్నేహలత :

ఈ కావ్యము మొదటికూర్పు 'స్నేహలతాదేవి' యనుపేర ముద్రింపబడినది. 1914 లో 'అభినవకవితామండలి' దీనిని ప్రచురించినది. దీనికి వ్రాసిన పీఠికకుముందు రాయప్రోలువారు ఆట్వే (Ottway) వ్రాసిన క్రిందిపద్యము నుదాహరించిరి.

'Oh woman; lovely woman; nature made thee
To temper man; We had been brutes Without you;
Angels are painted fair, to look like you
There is in you all that We believe of heaven
Amazing brightness, purity and truth
Eternal joy, and ever lasting love.'

ఇవి కావ్యములోని 'స్నేహలత' పాత్ర ఉదాత్తతకు ఉపశ్రుతిగానున్న వాక్యములు. స్త్రీలేనిదే పురుషుడు జంతుప్రాయుడని, సృష్టికి స్త్రీ వికాసహేతువని పైచరణముల యభిప్రాయము.

'స్నేహలతా'దేవి యను కన్య 14 సంవత్సరముల తరుణవయస్సులోనే పితృగృహపరి రక్షణకై, వరశుల్కనిరసనగా ఆత్మార్పణము చేసికొన్నది. ఇది వంగదేశములో జరిగిన వాస్తవకథ. ఆత్మబలికిముందు ఆమె తండ్రిపేర వ్రాసిపెట్టిన లేఖలో 'పితృగృహపరిరక్షణము' సూచింపబడినదిగాని 'కన్యకాధర్మము'ను గురించిన ప్రసక్తిలేదని రాయప్రోలువారన్నారు. ఈ కావ్యములో వారు కన్యకాధర్మమునుగూర్చిన భావమును సమున్మేషింపజేసిరి. ఆమె లేఖను మాత్రము యథాతథముగా ఛందోబద్ధమొనర్చిరి. ఈ కావ్యములో 'ప్రియంవద' పాత్ర రాయ ప్రోలువారి కల్పనయే. గంగాతీరమున స్నేహలతాప్రియంవదలకు (ఈ యిరువురు నెచ్చెలులు) మధ్య, గంగాజలమునకున్న భిన్నశక్తుల విషయమున జరిగిన సంభాషణమున భవిష్యత్తులో జరుగనున్న విషాదకథ ధ్వనింపచేయబడినది. ఈ కావ్యప్రారంభములోని

'నిత్య సంధ్యాకుమారీమణీమతల్లి
కట్టుచీరచెఱంగులు కాలుపోల్కి
అస్తగిరిమస్తకమున సన్యస్తకాంతి
కాయుడగు సూర్యభగవాను చాయలలమె'

అను పద్యమునగల సూర్యాస్తమయవర్ణనలో స్నేహలతాదహనవృత్తాంతము వ్యజ్యమానమైనది. స్నేహలత నిప్పంటించుకొన్నపిమ్మట, ఆమె నగ్నిజ్వాలలు చుట్టుకొన్నప్పుడు ఆమె చెంగల్వ కొలనులో రాయంచవలె, తామ్రపర్ణీజలములో ముత్యాలబొమ్మవలె, కుంకుమరంగవల్లికలనడుమ కర్పూరలతికవలె నున్నట్లు వర్ణింపబడినది. ఇక్కడ ఎనిమిది సాదృశ్యము లీయబడినవి.

'చూడదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి'

యని ప్రతిపద్యముచివర పునరుక్తమైనది. ఈ సాదృశ్యపరంపరను, పాదపునరుక్తికి మార్గము తీసినవారు రాయప్రోలువారే. తదనంతరకాలమున వెంకటపార్వతీశ్వరకవులు మున్నగువారు దీనిననుసరించిరి. ఈ కావ్యములోని వస్తువు సాంఘికము. వరశుల్కనిరసనకై ఉద్దేశింప బడినది. కాని రాయప్రోలువా రీకావ్యమున కన్యాకౌలీనమును సమర్థించుటకు కావ్యమునిండ ఆర్షవాతావరణము కల్పించిరి. గంగాతీరములో జరిగిన సంభాషణ సొంత మిట్లే నడచినది. గంగాస్రవంతి ఆభిజాత్యమును వర్ణించుటతో స్నేహలతపాత్ర కుదాత్తత కూర్చబడినది.[1] స్నేహలత ఆత్మ 'ద్వాదశార్కమండలమునుదాటి' పోయినదను వర్ణనలో జీవుడు మరణించిన పిమ్మట చంద్ర, వాయులోకములకు, క్రమముగా ఆదిత్యలోకమునకు వెడలిపోవునను ఉపనిష ద్భావము గర్భీకృతమైయున్నది. ఈ విధముగా రాయప్రోలువా రీకావ్యములో సంప్రదాయ సిద్ధమైన ఆర్షవాతావరణమునే ప్రతిపాదించినారు. అక్కడక్కడ 'పచ్చియెడద', 'బాష్ప దుగ్ధములు' మున్నగు నవీనపదబంధములున్నవి. 'పంకనిర్మగ్నకంఠమౌ పాడియావు పగిది నున్నది ఋషులున్న భరతభూమి' యన్నప్పుడు ఆంగ్లపాలన ధ్వనించుచున్నది.

'మాతృదేశాభిమాన ప్రమాణబుద్ధి చేకొని విదేశవస్తువుల్ తాకమనుచు
భరతపుత్రకు లెందఱెందఱొ వ్రతంబు లూనినారంచు వింటి'

అను పద్యములో విదేశవస్తుబహిష్కారవిషయము ప్రబోధితమగుచున్నది. ఈ విధముగా సమకాలీనమైన సాంఘికస్థితిగతులను చిత్రించుచు, వరశుల్కనిరసము, భారతస్త్రీ ఆత్మోన్న త్యము అంగభూతములుగాగల విషాదమధుర కావ్యమిది.

1. "వెండికలశములట్లు బింబించు శిఖరమస్తకములెత్తి చూచు బ్రహ్మాండమెల్ల
పర్వతవతంసు డీమె యబ్రంపుతండ్రి; యెంత కౌలీనమో యీ స్రవంతిమణికి.'

### స్వప్నకుమారము :

కథాసంగ్రహము : ఒక యువకుడు స్వప్నములో కనిపించిన సుందరినిజూచి మోహపీడితుడై ఆమె చేలచెరగు పట్టిలాగును. ఆమె 'మనసీయక మోమునిచ్చుట' మంచిదికాదని మందలించి, అతనిచేతి కొక మధుపాత్ర నందించును. అంతటితో యువకుడు తృప్తిపడక మరల ఆమెపై మరులుగొని వెన్నాడును. అప్పుడామె పరిశుద్ధప్రేమతత్త్వమును, బాధలోని మాధుర్యమును, విశదపరిచి అతనిని ప్రసన్నునిగాజేయును. స్వప్నము విరిగిపోవును. యువకునిలో జ్ఞానభాను డుదయించును.

తృణకంకణములోని కథ మట్టమధ్యాహ్నము జరిగినది. ఇందులో రాత్రి జరిగినట్లు చెప్పబడినది. యువకులకు సహజమైన కామప్రవృత్తిని దమించుట కీకథ కల్పింపబడినది. స్త్రీని భోగ్యవస్తువుగా మాత్రమే చూడగూడదని, ఆమెలోని సోదరీత్వమును, మాతృత్వమును విస్మరింపరాదని, ఈ కథ బోధించుచున్నది. స్వప్నములో కనిపించిన సుందరి మాతృస్థానమందుండుటవలన, సృష్టికిమూలము బాధయని, బాధపడుటలోనే ప్రణయమునకు పరిపాకదశ యబ్బునని యువకునికి సాధికారికముగా ప్రబోధించినది. ఈ కావ్యములో వియోగమాధుర్యము, ప్రవాసమాధుర్యము, బాధలోని ఆంతర్యము ప్రతిపాదింపబడినవి. ఈ కావ్యముసాంతము కుమారునికి సుందరికిమధ్య సంవాదముగానే సాగిపోవును. కుమారుని మనస్సులో క్రేళ్ళురికెడు మోహభావములు, సుందరి శుద్ధప్రేమగురించి చెప్పిన వాక్యములు కావ్యమున ప్రధానస్థాన మాక్రమించినవి. ఇందులో ఒకటి రెండుచోట్ల వాత్సల్యప్రసక్తియు కలదు. పద్మభ్రమరముల కనాదిగానున్న ప్రేయసీప్రియసంబంధము తృణీకృతమై మాతృపుత్రసంబంధము కల్పింపబడినది. ఇదియొక అపూర్వప్రయోగము. కవిసమయములకు కాలదోషముపట్టినదని నిరూపించి సరిక్రొత్త వ్యాఖ్యానముచేసిన అతి నవ్యప్రయోగము.

'దప్పిగొని చేరిన మిళిందతనయులకును
పూలపాలిచ్చి చీకట్లపోవకుండ
కడుపులో దాచుకొనద పంకజము ప్రియుడ !
చేరదీసిన మమకారమేరికేలుక.'

ఈ భావము మాతృపీఠస్థాయియైన స్త్రీ ముఖమునుండి వినిర్గతమగుట ఔచిత్యమునకు పతాకవలెనున్నది.

చిట్టచివరి పద్యములో ఈ కావ్యమంతటికి బీగమువంటి భావము నిక్షిప్తమై యున్నది.

'ఆయెడ చేయిసాచి అభయాభినయప్రియమైన మోమునన్
పాయలువాఱి వత్సలత పాలనుబోలె, ప్రజాస్తనంధయా
ప్యాయనమూర్తి యొండునిలువంబడె, స్వప్నకవాటబంధముల్
తీయ స్మరించితిన్ భగవతీప్రకృతి స్తిమితస్వరూపమున్.'

యువకుని కల కరగిపోయినది. భళ్ళున తెల్లవారినది. అప్పుడాతనికి 'తూరుపుటాశ'లో ఈ దివ్య దృశ్యము కనిపించినది. సమస్తప్రజాశిశువులకు ఏకైకజననియగు భగవతి స్వరూపిణియగు ప్రకృతి సాక్షాత్కరించినది. ఆ ప్రకృతియే స్వప్నములో మాతృస్థానమలంకరించిన సుందరి. ఈ విధముగా కామరుక్పీడితులైన యువజనులకు మాతృమూర్తియైన ప్రకృతి యేవిధముగా జ్ఞానోదయము కలిగించెనో ఊహించి కథాసూత్రబద్ధము చేసినారు రాయప్రోలువారు.

ఈ కావ్యములో వీరు సరిక్రొత్త పదబంధములను, అర్థచిత్రములను ప్రయోగించినారు. 'భావగీత'మను శబ్దము తొలిసారిగా ఇందులోనే వాడబడినది.[1] ఆకాశమున కారుచీకట్లు వ్యాపించినవనుటకు 'చదలు పెన్నెఱులల్లుచున్న'దనిరి. చుక్క 'నింగివిసరిన యొడిసెల రంగుబెడ్డ' వలె వ్రాలినదనిరి. ఇంకను 'వెన్నెలలుగూడ కనులకు వెన్నరాచె', 'కన్నెవిరులు సమర్తాడు కాలము', 'పూలసంకెళ్లు', 'చింతాపుష్పములు', 'పూలపాలు', 'విస్మయవ్యధలు కాల్చుట' మున్నగు సరిక్రొత్త ఊహలను, పదచిత్రములను ప్రయోగించిరి,

ఈ కావ్యములో కథావైచిత్ర్య మేమియులేదు. స్త్రీలోని మాతృత్వము నిర్దేశించుటకే ఇది రచింపబడినది.

**తృణ కంకణము :**

కథాసంగ్రహము : పదునాలుగేండ్ల పడతియొకర్తు ఊరిబయట మండుటెండలో నడచిపోవుచుండును. కొంత దూరమున ఒక యువకుడు స్వగతవిలాపములతో కంచెను దాటుచుండెను. ఇరువురు చూచుకొనిరి. చేయిచేయికలిపి చిత్తరువులవలె కొండొకసేపు నిల్చుండిరి. అతడు కుశలమేనాయని ఆమెను ప్రశ్నించును. ఆమె గద్గదికతో సమాధానమొసగును. ఆశైశవము ప్రేమించుకొని విడిపోయిన వియోగులు వారు. ఆమెకు పెండ్లియైనది. అతడామెను ధ్యానించుచు కాలము నీడ్చుచుండెను. తల్లికామితము నిరాకరించుట (వివాహము చేసుకొనకుండుట) తగునాయని ఆమె గుప్పకుతుకతో ప్రశ్నించును. అతడు 'బాష్పజ్ఞేయవిద్యార్థినై కాలమ్మున్ వయసున్ వ్యయించెద'నని విరక్తిభావము ప్రకటించును. ఆమె 'ప్రేమబంధములు తెగద్రెంపిన తెగని'వని, 'కలసినయంతనే చెలికారము'కాదని, 'అంతరంగంబుల నతుకంగ జాలిన అపూర్వపులంకెయె స్నేహ'మని అతని నోదార్చును. ఆ యువకుడు మున్నెన్నడో ఆమె మణిబంధమున కట్టిన పట్టుతోరమును తీసివేసి అప్పుడే రచించిన తృణకంకణమును తొడుగును. ఆ తృణకంకణము తమ ప్రేమకు మధురలాంఛనమని చెప్పి 'సోదరీ'యని సంబోధించును. ఆ 'యమృతవతి' తనవ్రేలి 'వలపుటుంగరము' ప్రియసఖుని హస్తము నలంకరించినది. తర్వాత వారిరువురు విడిపోయిరి.

'కడిగిన మృగమదపాత్రిక
విడువని పరిమళముపగిది; విధినియమములన్

---

1. 'భావగీతము నిక రచింపంగనేమొ'

విడబడియును వారల పెం
పుడుమై తీవ్రప్రేమబంధములు తెగవవురా'

అను పద్యముతో కావ్యము ముగియును

ఈ కథకు పూర్వరంగము మధ్యలోని ఒకటిరెండు పద్యములద్వారా పాఠకు డూహించుకో వలెను. శైశవమునుండి ఆయిరువురు స్నేహరమ్యులై యుండిరనియు, విధివశమున ఆమె కింకొకరితో పెండ్లిజరిగెననియు, అత డామెనే స్మరించుకొని వెర్రిగా తిరుగుచుండెననియు, తల్లి యెంత చెప్పినను ఇంకొకరిని పెండ్లియాడుట కిచ్చగించలేదనియు, ఇరువురు చాలకాలము తర్వాత కలనికొన్నపిమ్మట ఈ కథ జరిగెననియు భావించుకొన్నచో తృణకంకణ కావ్యములోని నవ్యత, రమ్యత బోధపడును.

'లలిత'లోని నాయికానాయకులకన్న వీరు నిత్యజీవితమునకు సన్నిహితులు వారు రాజ పక్షియులు. వీరు 'మధ్యతరగతి'వారుగా కనిపింతురు. 'లలిత'లో ప్రబంధవాసనలు పోలే దనుటకు ప్రభాతాదివర్ణనలే తార్కాణలు. ఈ కావ్యములో ఒక్క అనవసరవర్ణనలేదు. నాయిక రూపవర్ణనకు బదులుగా గుణవర్ణనయే ప్రధానముగా పాటింపబడినది. 'పసినిమ్మపండ్లచాయలు కొసరెడి యా కుసుమగంధి కోమలపుటొడల్' వంటివి ఒకటిరెండు సందర్భములందున్నను అవి అప్పటి యామె దురవస్థాచిత్రణమునకే ఉద్దిష్టములైనవి. ఆ కుసుమగంధియొడలు ఎండదెబ్బకు 'కసుగందిన కవటాకన పసివాడె' ననుటతో అట్టిస్థితియే చిత్రింపబడినది. ఆ కాలమున (కావ్య రచనాకాలమున) బందరు కలంకారిచీరలు ప్రసిద్ధముగా నుండెడివి. ఈ చీరనుబట్టి, ఆమె 'కాలికడియాల'నుబట్టి. ఆమె 'మధ్యతరగతి'కి చెందిన స్త్రీ యనియే తేలినది. ఆమె శీలవర్ణన క్రిందిపద్యమున చేయబడినది.

'నా ప్రియసఖి, అనురూప గు
ణప్రచుర ! ప్రసన్నశీల ! నవనీతశిరీ
షప్రణయమృదులహృదయ.'

నాయకుడుగూడ కాముకుడు కాడు. తాను మనసార ప్రేమించిన తరుణి అన్యదత్తయైపోయెనని దుఃఖించినవాడు. ఆమె వివాహితయైనపిమ్మట ఆమెపై స్వచ్ఛమైన అనురాగమునుమాత్రమే నిలిపెనుగాని మరులుగొన్నవాడు కాడు. ఈ కావ్యములోని నాయికానాయకులిరువురును ఆదర్శ ప్రాయులు. తాత్కాలికముగా దుఃఖతరంగములు పొరలివచ్చినను ఎవరును విరక్తిచెంది సన్న్యా సము పుచ్చుకోలేదు. జీవితము నేవగించుకోలేదు. ప్రాపంచికబంధములను త్రెంచుకొని పలా యనముచేయుటకు ప్రయత్నించలేదు. కుత్తుకలో గరళము నొత్తిపట్టుకొన్న ధీరస్వాంతులు. ఇరువురును భగ్నప్రణయులే. కాని యిరువురును అమలినప్రేమలోని, అస్ఖలితస్నేహభావము లోని ఆంతర్యము నాలోకించి ఆస్వాదించినవారే. మొదట తమ యిరువురికి పెండ్లియగునను ఆశతో నాయకు డామె మణిబంధమునకు పట్టుదారమును కట్టెను. అది విఫలమైనది. తర్వాత

వారు కలిసికొనిరి. యువకు డామెకు తాను పూర్వముకట్టిన పట్టుతోరమును తీసివేసి తృణ కంకణము కైసేయును. ఇది ఆతని అంతఃకరణమున జరిగినమార్పునకు సంకేతము. అతని పూర్వరాగమునకు పట్టుదారము చిహ్నము. ఇప్పు డాస్థితిలేదు. ఆమె పరకీయ. కాబట్టి దానిని తీసివేసి క్రొత్తకడియము తొడిగెను. ఈ తృణకంకణము ఆ యిరువురి నడిమి స్నేహబంధ మునకు స్థిరమైన సంకేతము. 'తృణకంకణ'మన్న విషయమే క్రొత్తది. గరికతో కడియము చేయుటయన్న భావము క్రొత్తకదా! ప్రకృతియొడిలో పుట్టిపెరిగిన అమాయికప్రవృత్తి గరికది. అందువలన తమ పరిశుద్ధ ప్రేమబంధమునకు చిహ్నముగా 'తృణకంకణ'రచన చేసినాడతడు. దానిని 'బాష్పజలాంజలి'తో ఏరీతినైనను వాడకుండ చూచుకొమ్మని విజ్ఞప్తిచేసినాడు. దానికి బదులుగా ఆమె వలపుటుంగరము నిచ్చినది. వలపుటుంగరమనగా తాను వలచిన ఉంగరమే. దీనిని ముద్దుటుంగరమునకు పర్యాయముగా స్వీకరించవలెను. ఈ విధముగా అన్యోన్యపరిదత్త చిహ్నములతో స్నేహబంధమును సంకేతించుట తెలుగు సాహిత్యమున నవీన ప్రయోగము. పవిత్రప్రేమకు వివాహాదివ్యవస్థ లంతరాయములుకావని, అంతరంగముల్ నతుకజాలిన లంకెయే స్నేహమని, దాని నారాధించినవారికి సంయోగవియోగములు సమవృత్తుచేయని ఈ కావ్యమిచ్చిన సందేశము. లలితలోని ప్రేమతత్త్వము, స్వప్నకుమారములోని వియోగబాధామాధుర్యము మరియు వాత్సల్య, మోహ, దాంపత్యాద్యనేకరూపములలో ప్రస్ఫుటించు అమలినశృంగార తత్త్వము; ఈ కావ్యమున అంచులుదీర్చుకొని భాసించినవి. ఈ సిద్ధాంతములు ముందుముందు చర్చింపబడును కాబట్టి ప్రస్తుత మితర నవ్యతలను పరిశీలింతము.

'అడుగులుబొబ్బలెత్త'అను కష్టాదిప్రారంభమే ఈ కావ్యమునకు నవ్యతనాపాదించు ప్రథమవిషయము. ఉదయలక్ష్మికి ముత్యాలదండలో మంచుబిందువులు సంధ్యాకాంత వియోగ బాష్పములని, 'శారదశశాంకవిశదనిశాంతములను' మబ్బులు మంచుకన్నీళ్ళు గార్చునని ఈ కవి సరిక్రొత్త భావచిత్రముల నందజేసినాడు. 'వలపుల పూలసంకెలలు'. 'విరక్తిబాష్పములు', 'విశ్వాసబాష్పములు' మున్నగునవి అత్యంతనవీనములైన పదబంధములు. యువకుడామెతో 'బాష్పజ్ఞేయ విద్యార్థినై' కాలమును గడపుదుననును. బాష్పజ్ఞేయవిద్యార్థి యనగా కన్నీళ్ళలో జీవితసూక్ష్మములను చదువుకొను విద్యనర్థించినవాడని యనుకోవలె బాష్పములనుబట్టి మాన వుని అంతరంగదర్శనము చేయవచ్చును. నాసిక ఇరువైపులనున్న కనుగొలకులలో బాష్పకణ ములు నిలిచినచో అవి ఆనందబాష్పములు. చివరికొలకులందు నిలిచినచో దుఃఖాశ్రువులు. ఈ బాష్పరహస్యమును తెలిసికొన్నవాడతడు. అనగా జీవితమునే తెలిసికొన్నవాడు. బాష్ప జ్ఞేయ విద్యార్థియన్నమాటలో రాయప్రోలువా రింతటి గంభీరభావమును పొదిగినారు.[1] ఈ పద్య ములోనే 'నిశ్శాంతి' అను ప్రయోగమున్నది. నిశ్శాంతియనగా శాంతిలేనిదనికాదు. శాంతి కవతలి దశయని ప్రకరణమునుబట్టి అర్థముచేసికోవలెను. ''బాష్పజ్ఞేయవిద్యార్థినై కాలమును వయసును వ్యయించెదను. అపుడు నాకు నిశ్శాంతివలన సౌఖ్యము లభించు''నని అతడనును. శ్రేయస్సను

1. ఇది రాయప్రోలువారి వ్యాఖ్యానమే.

శబ్దమున్నది. 'నిశ్శ్రేయసము' అను మరియొక శబ్దమున్నది. 'నిర్' అనునది వట్టి ఉపసర్గయే. ఇది చేర్చగా రెండవశబ్ద మేర్పడినది. శ్రేయస్సనగా లౌకిక పారలౌకికార్థములుగల పదము. 'నిశ్శ్రేయస్సు' కేవలము పారలౌకికార్థముగలది. ఈ మర్యాదలోనే రాయప్రోలువారు 'నిశ్శాంతి' శబ్దమును సృష్టించి, దానిని శాంతికి పారమ్యస్థితియను అర్థమున ప్రయోగించినారు. ప్రాచీన పదముద్వారా నవ్యార్థమును తేగలిగినారు.

ఆ యిరువురు విడిపోవుముందు వారిపై పూలు 'వకుళసుకుమారతరుమతల్లికలనుండి' అమృతాక్షతలవిధాన కురిసినవని వర్ణించినారు. అక్షతలనగా క్షతిలేనివనియే అర్థము. కాని యిది లోకమున చెల్లుబాటులేని అర్థము. దంపతులలో ఎవరు మరణించినను 'అక్షతల' ప్రభావము క్షతమైనదనియే అర్థము. ఈ కావ్యపాత్రలపై కురిసిన అక్షత లట్టివికావు. అమృతమైనవి. వారి స్నేహమట్టిదని - అమృతమని - ఇవి సూచించుచున్నవి. వారి స్నేహమయజీవితమునకు ప్రకృతిచూపిన సానుభూతియిది. ఈ విధముగా రాయప్రోలువా రొక్కొక్క పదమున సంప్రదాయసిద్ధమైన శక్తిని, నూత్నభావయుక్తిని లక్షించి ఈ కావ్యమున ప్రయోగించినారు.

ఈ కావ్యములోని ప్రకృతిచిత్రణకు కొన్ని ఉదాహరణములు. క్రిక్కిఱియు కొమ్మ లాశలనెక్కి నీడపందిళ్లుగట్టుచున్నవి. తరుచ్ఛాయలలోని ఇసుకతిన్నెలు కలవారియింటి బిడ్డల వలె నున్నవి. వెదురుపొదలు మృదురవములతో పిలుచుచున్నవి. పెంపుడుజింక మొగము నుండి తృణపరిమళము గుబులొ్కనుచున్నది. ఈ విధముగా ఇంగ్లీషుకాల్పనికకవుల ప్రకృతి వర్ణనలలోని సహజరామణీయకమును పొదుగుకొన్న వర్ణనలివి.[1]

### సిద్ధాంత గ్రంథములు :

రాయప్రోలువారు నవ్యాంధ్రకవుల కెట్లాద్యులో, నవ్యాంధ్రకవిత్వలక్షణగ్రంథకర్తలకు నట్లే. వీరి రమ్యాలోకము, మాధురీదర్శనము కవితాసంబంధమైన లక్షణములను ప్రధానముగా చర్చించిన గ్రంథములు. ఈ రెండు గ్రంథములు రసవత్తరమైన పద్యములలో వ్రాయబడి కావ్యస్థాయి నందుకొన్నవి. రమ్యాలోకములో భాష, ప్రకృతి, ప్రేమ మున్నగువానినిగూర్చి, మాధురీదర్శనములో సృష్టిరహస్యము, స్త్రీపురుషయోగము, రతి, భావము, రసము మున్నగు వానినిగూర్చి సిద్ధాంతములు చేయబడినవి. వీనిలో కొన్ని పద్యములు ప్రాచీనుల లక్షణశ్లోకముల కనుకరణములో అనుసరణములో అయియున్నవి. మరికొన్ని స్వోపజ్ఞకములుగా నున్నవి.

'ఈ యనంతచైతన్యబృంహితమయిన జ
గత్తులో జన్మభూమి స్వర్గంబయగును' (రమ్యాలోకము)

అన్నది 'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'అన్న ప్రాచీనసూక్తికి ప్రతిబింబమే. అట్లే

1. వీరికావ్యములలో మిగిలినది 'మధుకలశము.' ఇది ఉమర్ఖయ్యాం రుబాయిల కనువాదము. దీనినిగూర్చి 'భావకవిత్వ' ప్రకరణమున చర్చింపబడును.

'చిన్నినివ్వరిసిగవలె సన్నగా త
ళుక్కుమన నాత్మకలజూచె నొక్కద్రష్ట' (రమ్యా)

యన్నది 'నీవారశూకవత్ తన్వీ పీతాభా స్వస్త్యణూపమా'అను ఋగ్వేదములోని శ్రీసూక్తము (ఖిలసూక్తము)ను స్ఫురింపజేయును. ఇక "మూఢులిచ్చయించెదరు సంభోగసుఖము'' అన్నది పండితరాయల 'మూఢాఃసంభోగమిచ్ఛంతి'అన్న శ్లోకభావమేయని వారే విశదపరిచినారు. ఇవి కాక ఎక్కడోయున్న వ్యాకరణసూత్రములను గ్రహించి వీరీగ్రంథములో ప్రయోగించుటకూడ కలదు.

'సుప్రసిద్ధదేశ్యంబులన్ శుద్ధసంస్కృ
తములతో కల్పదగు సంప్రదాయమనడె
వామనుడు.' (రమ్యా)

నిజమే. కావ్యాలంకారసూత్రవృత్తిలో 'అతిప్రయుక్తం దేశభాషాపదం'అను సూత్రమునకు వామను డీవివరణమిచ్చెను. 'అతీతకవిభిః ప్రయుక్తం దేశభాషాపదం ప్రయోజ్యం'. ఇందు కుదాహరణముగా దేశభాషాపదమైన 'హాలా'యనునది సంస్కృతసమాసములో ఎట్లు చోటు చేసికొనెనో వివరించెను. అట్లే ఆధునికులుగూడ సంస్కృతాంధ్ర పదసమ్మేళనము శ్రుతిసుఖము న్నచో చేయుదురని సుబ్బారావుగా రభిప్రాయపడిరి. ఈ విధముగా ఉపనిషత్తులలో, ప్రాచీన లక్షణగ్రంథములలో, తమ మనసుకెక్కిన శ్లోకములఛాయలను తెలుగున ప్రవేశపెట్టినారు వీరు. అంతేకాక నవ్యులు వృథివిని తల్లిగా, దేవతామతల్లిగా భావింతురని వీరనిరి. 'సృష్టియందె యీశ్వరుని అర్చింత్రు కవులు'వంటి క్రొత్తసిద్ధాంతములెన్నో ఈ గ్రంథమున కలవు. వేదము లోని 'మేదినీసూక్తము'న పృథ్వీసమర్చనమున్నను, అది యింతటి స్ఫుటాకృతిలో లేదు. ఇక ఈ రెండు గ్రంథములలోని ముఖ్యమైన సిద్ధాంతములను వింగడించి చూపుదును.

**భాషాసిద్ధాంతము :**

రమ్యాలోకము ప్రారంభములోనే దేవతాస్తుతికి బదులుగా 'కోకిలస్వామికి' మ్రొక్కి రాయప్రోలువారు నవ్యతను ప్రవేశపెట్టిరి. కోకిలస్వామియనగా వాల్మీకియే. 'కూజంతంరామ రామేతి'యను చాటుశ్లోకములోగల 'కవితాశాఖాం'అనుదానిని వీరు మామిడికొమ్మగా భావించి, వాల్మీకిని కోకిలస్వామిగా ఉద్దేశించి, అభినవస్వరకల్పన కుద్యమించి నమస్కరించిరి. ద్రాక్షా కదళీపాకముల లోపములను తీర్చు తెలుగులోని తారుణ్యప్రౌఢిమలను వెలార్చుటకై ఆదికవి స్తుతి చేసిరి.

తెలుగుభాష తేనెలొల్కుభాషయని వీరి సిద్ధాంతము. దీనినే 'ఆంధ్రావళి'లో 'తెనుగు మాన్యము'అను శీర్షికక్రింద ఇట్లు సమర్థించినారు.

"పాలక్రొమ్మీగడల్ పచ్చివెన్నయి విచ్చి
తీయని నునుపూసలాయెనేమొ ?
కమ్మని మకరందకణములు స్నేహించి
చిన్నారిపలుకులై చిక్కెనేమొ ?
పూలలావణ్యంబుపొంగి చక్కదనాల
విందులై రుచులెక్కి పెరిగెనేమొ ?
సెలయేటియయ్యాల కులుకుటొయ్యారముల్
ముద్దుముచ్చటలయి ముదిరెనేమొ ?
పాటకును పద్యమునకు నమ్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు సాజముగ సాగి
పోరునకు పొత్తునకుచాలి పొందిపొసగు
మా తెనుగుతల్లిమెడకిదే మల్లెదండ."

తెనుగుతల్లియనగా ఆంధ్రభాషాజననియనియే యర్థము. తెలుగుభాషలో మీగడల, వెన్న పూసల, తేనెచుక్కల, పూల మాధుర్యలావణ్యములు, సెలయేటి కులుకుటొయ్యారము లున్నవని, అది గేయమునకు పద్యమునకు సమానముగా ఒదిగి నడచునని, సమరవర్ణనకు, ప్రణయ వర్ణనకు చక్కగా సరిపోవునని ఈ పద్యములోని భావము.

ఇంతటి మధురభాషకాబట్టియే పునర్జన్మయన్నది యుండి అది తనకు కలిగినచో తెనుగే మాతృభాషగా ఉండవలెనని కోరుకొన్నారు వీరు.

'భాషకంటె నవ్యులకు తపస్సులేదు' అని రాయప్రోలువారి మరియొక సిద్ధాంతము. దీనికి ముందు సాహితీపరులెవ్వరును భాషయే తపస్సని అనలేదు. శబ్దబ్రహ్మోపాసనము మనకు అనాది సదాచారమేయైనను, పూర్వము భాషయే తపస్సన్నంత స్పష్టముగా చెప్పబడలేదు. రాయప్రోలు వారు తల్లినుడికంటె పరమామృతము లేదని, అందువలననే భాషార్చనకన్న మిన్నయైన తపస్సు లేదని సూత్రీకరించిరి. ఒక అర్ధదశాబ్దముపాటు అనంతవస్తువైవిధ్యముగల రసవత్కావ్య ఖండములతో వారు ఈ భాషాతపస్సునే నిర్వర్తించి తమమాట నిలబెట్టుకొన్నారు. భాషా స్వరూపవిషయములోను వారు నవ్యులే. భాషలో మార్పు సహజమని వారి యభిమతము.

'కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మాఱునపుడు వాఙ్మయమును మారు నిజము.' (రమ్యా)

నిజమే. క్రొత్తనీరు తొల్కరియేళ్లలో క్రుమ్మిపారగా ప్రాతనీరు పారిపోవుట ఆశ్చర్య మేమియు కాదు. Old order changeth yielding place to new అన్న ఆంగ్లోక్తి తాత్పర్య

మిదే. ఈ మార్పునకు వారు స్వాగతము పల్కిరి కాబట్టియే పద్యములలో సైతము 'బందమేయు' వంటి వ్యావహారికపదరూపములను, 'బాలమామిళ్ల'వంటి మిశ్రసమాసములను స్వీకరించినారు. ఈ మార్పు నంగీకరించినవారు కనుకనే వాణివాయింప మ్రోగిన కవితావీణపై పారసీకగీత శ్రుతులను రవళింపజేసినారు.[1]

## ప్రకృతి సిద్ధాంతము :

నిర్గుణబ్రహ్మము కష్టసాధ్యమగుటచేత ప్రత్యక్షప్రమాణమైన ప్రకృతి నారాధించుటయే తమ లక్ష్యమని వీరు చెప్పుకొనిరి. చిన్నినివ్వరిముల్లువలె తళుక్కుమను పరబ్రహ్మమును ప్రాచీనులుచూడగా, వీరు 'నవ్యతృణకంకణాభరణప్రయుక్తి'తో ప్రేమయోగమును భావించినారు. పరతత్త్వముకన్న ప్రకృత్యుపాసన గొప్పయని సిద్ధాంతీకరించినారు. ఇదియును నవ్యసిద్ధాంతమే. సృష్టిస్థితిసంహారకారకురాలైన జగన్మాతను మాతగా భావించి యారాధించుట ప్రాచీనసంప్రదాయమే. కాని పరతత్త్వారాధనకన్న ప్రకృతిపూజ గొప్పదని మనప్రాచీనులు తెలుపలేదు. ఈ ప్రకృత్యారాధనతత్త్వము ఇంగ్లీషుకాల్పనికకవుల ప్రభావముగలదే. అయినను రాయప్రోలు వారి తత్త్వము దాని కనుకరణముకాదు. ఈ ప్రకృతితత్త్వమును వీరు మానసికముగ లలితా దేవిగా, వాచికముగా మాతగా ఆరాధించినారు. మన సంప్రదాయమునుబట్టి ప్రకృతి శక్తి స్వరూపిణి. వీ రాదృష్టితోనే ప్రకృత్యారాధన చేసిరి.

> "పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
> తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి (గా)" (రమ్యా)

ఈ తత్త్వమే పృథ్వీస్తుతిగా రూపొందినది. వక్షమున కొండలబరువులనుదాల్చి, కడుపుగోయు నదులను గారవించు క్షమామహత్తు వీరిని విభ్రాంతుల నొనర్చినది. ఈ పృథ్వీసమర్చనాగుణము, ఈ ప్రకృత్యారాధనాతత్త్వము 'జన్మభూమి'వంటి కవితాఖండికలలో వారిచేత 'లేదురా ఇటువంటి భూదేవి యెం'దని కీర్తింపజేసినవి. వారి దేశభక్తి కవిత్వమున కీతత్త్వమే నాందివంటిది.

## ప్రేమ సిద్ధాంతము :

రాయప్రోలువారి కావ్యములలో లలిత, తృణకంకణము, కష్టకమల, స్వప్నకుమారము మున్నగు కావ్యములు ప్రణయము ప్రధానవస్తువుగాగలవే. ఈ కావ్యముల కచ్చమైన లక్షణము లనదగిన సిద్ధాంతములు రమ్యాలోకములో, మాధురీదర్శనములో నున్నవి. మాధురీదర్శనము లోని 'రతి' మీమాంస, 'స్త్రీపుంసయోగ' చర్చ, రమ్యాలోకములోని సంభోగవియోగశృంగారా దులచర్చ, వాత్సల్యాదిభావచర్చ, సౌందర్యార్చనాచర్చ; వారి ప్రేమసిద్ధాంతమునకు – అనగా – శృంగారరససిద్ధాంతమునకు బహుముఖములుగా విస్తరించిన శాఖలే. 'అమలినశృంగారము' వీనిలో ప్రధానాంశము. ఈ శీర్షికక్రింద ఈ విషయములన్నిటిని కూర్చి విపులముగా చర్చిం

1. మధుకలశము - ఉమర్‌ఖయ్యాం పద్యముల కనువాదము.

తును. వారి కావ్యములలో సగమునకుపైగా ఈ సిద్ధాంతముకలవి కాబట్టి విపులచర్చ తప్పలేదు.

**అమలిన శృంగారము :**

రాయప్రోలువారు కరుణశృంగారరసములు రెండే రసవిపాకమునకు సమర్థములని అభిప్రాయపడిరి, పూర్ణానందాస్వాదమునకు శృంగారరసము, మనోదోషశుద్ధికి కరుణరస ముపయుక్తములని వీరి భావము. వీనిలో రెండవది అరిస్టాటల్ ప్రతిపాదించిన కెథార్సిస్(Catharsis) అను లక్షణమునకు సరిపోవునట్లున్నది.[1] ఈ రెండు రసములలో శృంగారరసశేఖరత్వమును వీరంగీకరించిరి. శాంతము రసముకాదు పొమ్మనిరి. శాంతరసస్థాయిలో అంతఃకరణము విషయవిముక్తమైపోవును. విషయవికారమున్నప్పుడే రసప్రసక్తియుండును. అదిలేనిది రసము కాదని, అన్నిరసములకు పర్యవసాయియైన దశకావచ్చునని వీరి అభిమతము. రసానుభూతి విషయసంవలితమేయైనచో, 'రసము బ్రహ్మానందసహోదర'మను ప్రాచీనులమతము ఎట్లు సమర్థనీయమగునను ప్రశ్న ఇచ్చట జనించుచు. ప్రాచీనులుతెలిపిన బ్రహ్మానందము ఇంద్రియములకు మనస్సునకు అతీతమైనది. రసానుభవము అట్టిదికాదు. అది ఇంద్రియములకు, అంతఃకరణమునకు లోబడియేయుండును, కావున బ్రహ్మానందరసానందముల కేకత్వములేదను మతముపై వీరి సిద్ధాంత మాధారపడియున్నట్లు తోచును. శృంగారరసమునకు సంభోగ మవధియన్న పూర్వుల సిద్ధాంతమునుగూడ వీరు త్రోసిపుచ్చిరి. సంభోగశృంగారము ఉపాధిమాత్రమైనది కాబట్టి ఇది క్షయమైనదని, వియోగశృంగారము అనుపాధికము కాబట్టి అక్షయమైనదని, ఇదే శ్రేష్ఠమని వీరి సిద్ధాంతము. ఉపాధియనగా లాక్షణికులు చెప్పిన ఆలంబనవిభావము. వియోగములో ఈ ఆలంబనవిభావము ప్రత్యక్షముగానుండదు. అది కేవలము మనోగమ్యము. అట్టి అనుభూతి అనుపాధికమగు వియోగశృంగారమని రాయప్రోలువారి అభిప్రాయము. స్థూలముగా చూచినచో సౌందర్యశృంగారము లొక్కటే. కాని వీరు ఈ రెంటికి తారతమ్యము కనబరిచిరి.

'ఉపాధిగతము సౌందర్య; మనుపాధికము రసాధికారిశృంగారము' (రమ్యాలోకము). సౌందర్యము శరీరగతము; అనగా అవయవనిష్ఠము. ఇది శరీరముక్తమైనప్పుడే శృంగార మగునని వీరి భావము. ఈ విధముగా ఉపాధి నాశ్రయించని శృంగారము విశ్వశ్రేయఃకారి యని వీరభిప్రాయపడిరి. సౌందర్యలహరిలో అంబాశరీరవర్ణనము స్థూలముగ ఉపాధిగతముగా కనిపించినను, తద్విశిష్టమైన నిగూఢార్థము దానిలోనున్నది. అనగా అది శరీరముక్తమైన ఆత్మసౌందర్య వర్ణనమే. అది అమలిన శృంగారస్థాయికి చెందినది. ధ్యానప్రపంచముననున్నప్పుడు సర్వము అనుపాధికముగానే భాసించును. దానికి ఆశ్రయప్రసక్తి లేదు. నవ్యులు భావప్రపంచమున ఈ యనుపాధికమైన సౌందర్యమును సాధించుచున్నారని, 'ఏతదమల సౌందర్యా

---

1. 'Catharsis' అనగా 'through pity and fear to purge the feeling' అని అరిస్టాటల్ వివరించెను. —Poetics

ర్చనాతిరేకము' ఉ్కృభావనచేత ఆనందమై ఫలించునని రాయప్రోలువారి వాదసారాంశము. ఇంతకు సౌందర్యమువలన శృంగారమువలన వీరు పొందునది అమలినమైన ఆనందము. 'అమలినానందము' అనగా లౌకికవాసనల కతీతమైన ఆనందము. అదే రసానందము. ఈ యానందమే రాయప్రోలువారికి ధ్యేయము.[1] వియోగశృంగారములోనున్న పావిత్ర్యమును దృష్టినిడుకొని వీరు 'అమలిన శృంగారము' అను క్రొత్తసిద్ధాంతమును లేవనెత్తిరి. ఇది అలవోకగా లేవదీసినది కాదు. ఉపనిషత్తులు మొదలుకొని ఆలంకారికుల లక్షణగ్రంథములవరకున్న రససిద్ధాంతము లన్నిటి నవలోడనముచేసి, మథించితీసిన నవ్యనవనీతమిది. 'అమలినశృంగారము' నుగూర్చి వీరిసిద్ధాంతమును పరిశీలించుటకుముందు శృంగారరసమును. దానికి సన్నిహితములైన ప్రేయోవాత్సల్యాదిరసములను, పాశ్చాత్యుల Platonic love తత్త్వమును సంగ్రహముగా చర్చింతును.

### శృంగారరసచర్చ :

భరతుడు శృంగారరసమును త్రివిధముగా విభజించెను. 'త్రివిధాకృతి శృంగారోజ్ఞేయో ధర్మార్థకామకృత్'[2] అని అతడిచ్చిన లక్షణము.[3] ధర్మశృంగారమనగా ధర్మనిబద్ధమైన శృంగారము. బాహ్యసౌందర్యముచేతనే ఆకృష్టులుగాక ఆత్మసౌందర్యమును పెంపొందించుకొనుట, తాత్కాలికసౌఖ్యముకాక భవిష్యత్శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొనుట, ఈ ధర్మశృంగార లక్షణములు. సీతారాములశృంగార మిట్టిదే. అర్థముదృష్ట్యా జరిపినది అర్థశృంగారము. అన్న భార్యకొరకు అన్ననుచంపి ఆమెనేలుకొనుట అర్థశృంగారముక్రిందనే చేరును. దశకుమారచరిత్రమున ఉపహారవర్మకథ ఇట్టిదే. కామప్రధానమైనది కామశృంగారము. రావణుని సీతావ్యామోహ మిట్టిదే. ఈ మూడింటిలో ధర్మశృంగారమే ఆదరణీయమని భరతాదిలాక్షణికు లభిప్రాయపడిరి.

శృంగారరసమునకు రసరాజ్ఞీత్వమును ప్రతిపాదించినవాడు భోజుడు. కామము సృష్టికి మూలమైనదను అభిప్రాయము నాధారముగాచేసికొని భోజు డీ సిద్ధాంతమును స్థాపించెను. ఉపనిషత్తులలో కామమే సృష్టికి మూలమని కలదు.

---

1. ఈ యానందప్రాధాన్యమునే ఉపనిషత్తు లుగ్గడించినవి.

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్
ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతాని జాయంతే
ఆనందేన జాతాని జీవంతి
ఆనందం ప్రయం త్యభిసంవిశంతి." —తైత్తిరీయోపనిషత్తు.

2. నాట్యశాస్త్రము : 20 అధ్యాయము : 76 శ్లోకము.

3. అర్థకామశృంగారములకు భరతుడిచ్చిన వివరణమిది.

"అర్థస్యేచ్ఛాయోగాత్ బహుధా చైవార్థతో ఒర్థశృంగారః
... ... ... ... ...
కన్యావిలోభనం వా ప్రాప్తం స్త్రీపుంసయోస్తు రమ్యంవా
నివృతం వాసావేగం జానీయాత్ కామశృంగారమ్". —నాట్యశాస్త్రము 20 అధ్యా.

"ఆత్మావా ఇదమగ్ర ఆసీత్ - తదైక్షత-
సోఽకామయత - ఏకోఽహం బహుస్యాం ప్రజామేయ."[1]

ఆత్మసంకల్పమే మిధునముగా రూపొందినది. సృష్టియంతయు దీని పరిణామమే. అధర్వవేద మునగూడ కాముడే మొదట ఉద్భవించెనని కలదు. మహాభారతములో కామస్తుతి కలదు. బ్రహ్మ, ఈశ్వరుడు మున్నగు దేవతలకన్న కామమే ఆదిశక్తియనియు ఈ స్తుతులలో కలదు. మనువు 'అకామస్యక్రియా కాచిత్ విద్యతే నేహకర్హిచిత్' అను సూత్రమున కామప్రాబల్యము నుద్ఘాటించెను. భగవద్గీతలో 'ధర్మావిరుద్ధమైన కామము నేనే'యని ఈశ్వరు డభిప్రాయపడినట్లున్నది. కామము యొక్క ఈ ఆధిక్యమును గుర్తించియే భోజుడు శృంగారరసశేఖరత్వమును స్థాపించెను. ఆయన సిద్ధాంతమిది.

"రసోభిమానోహంకారః శృంగార ఇతిగీయతే
యోర్థః తస్యాన్వయాత్ కావ్యం కమనీయత్వమశ్నుతే
విశిష్టాదృష్టజన్మాయం జన్మినామంతరాత్మసు
ఆత్మసర్వగుణోద్భూతే రేకోహేతుః ప్రకాశతే."[2]

శృంగారమునకు అహంకారము, అభిమానము, రసము పర్యాయవాచకములు. ఈ శృంగారము వలననే కావ్యము కమనీయమగును. ఇది అనేక జన్మవాసనల ఫలితము. సర్వగుణోద్భూతికి ఈ శృంగారమే హేతువు. ఇది భోజుని శృంగారనిర్వచనము. ఫ్రాయిడ్ సిద్ధాంతములకు మూలమైన 'Ego' అనునదే భోజుడుచెప్పిన అహంకారము. అదే అన్నిటికి మూలము. అదే కామము. కామమే శృంగారము.

### ప్రేయోరసము :

రాయప్రోలువారు శృంగారమునకు, ప్రేయోవాత్సల్యములకు లంకెవేసినారు. అందువలన ప్రేయోరసవాత్సల్యరసముల సంగ్రహస్వరూపము నివేదింతును.

రుద్రటుడు తొలిసారిగా ప్రేయోరసమును ప్రతిపాదించినవాడు. దండి భామహులు దీనిని అలంకారముగామాత్రమే గ్రహించిరి. 'స్నేహప్రకృతిః ప్రేయాన్'. ఇది ఇతడిచ్చిన సూత్రము. స్నేహము కారణము, ప్రేయస్సు కార్యమని భావము. అనగా స్నేహము స్థాయి భావము. ప్రేయస్సు రసము. మృచ్ఛకటికమున మైత్రేయుడు తన మిత్రుడగు చారుదత్తుని కొరకు ప్రాణమిచ్చుటకు సిద్ధపడును. ఇక్కడ ప్రేయోరసమున్నది. స్నేహమునకు సాహచర్యము ప్రధానమని రుద్రటుడనెను. యువతీయువకుల ప్రేమయేకాక మాతాపుత్రుల ప్రేమ, మిత్రులమధ్యగల ప్రేమమున్నగునవి లోకముననున్నవి కాబట్టి శృంగారముకన్న విలక్షణమైన

1. బృహదారణ్యకోపనిషత్తు. 2. సరస్వతీకంఠాభరణము.

మరియొక రసము ఆవశ్యకమును గుర్తించి రుద్రటు డీ ప్రేయోరసమును స్థాపించెను. నిర్వ్యాజమైన మనస్సు, నర్మవాక్కులు, ఆర్ద్రాంతఃకరణము, అన్యోన్య సుహృద్భావము ప్రేయోరస లక్షణములు. ఇది కేవలము పురుషులమధ్యనో, స్త్రీలమధ్యనో ఉండనక్కరలేదు. స్త్రీ పురుషుల మధ్యనున్నను అది ప్రేయోరసమేయగును.

**వత్సల రసము :**

వత్సలరసమునకు లక్షణముచెప్పినవారిలో విశ్వనాథుడు ప్రముఖుడు. ఆయన లక్షణమిది.

"స్ఫుటం చమత్కారితయా వత్సలంచ రసం విదుః స్థాయీ వత్సలతా స్నేహః"[1]

చమత్కారకారియగుటవలన వత్సలముగూడ రసమని, దాని స్థాయి స్నేహమని విశ్వనాథుని యభిప్రాయము. ఈ రసమునకు పుత్రాదు లాలంబనములు, వారి చేష్టలు, విద్యాశౌర్యాదయాదులును ఉద్దీపనములు. ఆలింగన గాత్రస్పర్శ శిరశ్చుంబనేక్షణపులకములు; ఆనందబాష్పములు మున్నగునవి అనుభావములు. అనిష్టశంక, గర్వము, హర్షమమున్నగునవి సంచారిభావములు. రఘువంశములో రఘునిబాల్యము, దిలీపుని వాత్సల్యము వత్సలరసమున కుదాహరణములు. ఇది పితాపుత్రసంబంధము. భ్రాత్రాలంబనముగూడ ఈ రసములోనే చేరును. రామలక్ష్మణులప్రేమ వత్సలరససంబంధియే.

వత్సలరసమునకు స్థాయివిషయమున లాక్షణికులలో భిన్నాభిప్రాయములున్నవి. మందార మరందచంపువులో దీనిస్థాయి కారుణ్యము లేక కరుణయని చెప్పబడినది. కవికర్ణపూరగోస్వామి మమకారము దీనిస్థాయియని వ్రాసెను. ఇందుకు యశోదాకృష్ణుల సంబంధము నాతడు ఉదాహరించెను. జగన్నాథుడు వత్సలరసము రసముకాదని భావమమాత్రమేయని యనెను.

మరికొందరు స్నేహమునుగూడ రసమనిరి. వీరి అభిప్రాయము ప్రకారము ఆర్ద్రత దీనికి స్థాయి. స్నేహము, వాత్సల్యమమున్నగునవి రతియొక్క రూపాంతరములేయని హేమచంద్రు డభిప్రాయపడెను.[2] కాని ఇది ఆలోచించవలసిన విషయము. స్నేహము రతికి రూపాంతరమన్నచో రామసుగ్రీవుల స్నేహము శృంగారరసమగును. సోదరప్రేమ రతికి రూపాంతరమన్నచో రామలక్ష్మణులప్రేమ శృంగారమగును. అట్లే వాత్సల్యము రతిభేదమైనచో యశోదాకృష్ణులప్రేమ శృంగారమనవలసివచ్చును. కాబట్టి హేమచంద్రుని అభిప్రాయమును నిశితముగా పరిశీలించినచో ఇన్ని విప్రతిపత్తులున్నవి. వీరి దృష్టిలో వాత్సల్యాదులు కేవలము భావములే కావచ్చును. వీనికి రసత్వసిద్ధికి కావలసిన ఉత్కర్షలేదని వీరి అభిమతమైయుండవచ్చును. కాని యిది సమంజసమైనదికాదు. యశోదాకృష్ణుల వాత్సల్యము, రామవియోగానంతరము దశరథుని స్థితి రససిద్ధినందుకోగలిగిన ఉత్కర్షలేని భావములా ? కావున వాత్సల్యాదులకు రసత్వ మంగీకరించుటలో విప్రతిపత్తి కూడదు.

---

1 సాహిత్యదర్పణము.

2. "స్నేహోభక్తిర్వాత్సల్యమితిహ, రతేరేవవిశేషా :" కావ్యానుశాసనము.

## ప్లేటో ప్రేమసిద్ధాంతము :
**(Platonic Love)**

ఆధునికవిమర్శకులు రాయప్రోలువారి 'అమలిన శృంగారము'నకు Platonic love తో పోలికచూపినారు. వీరు Platonic love అనగా సంయోగరహితమైన స్త్రీపురుషుల ప్రేమ యని ఊరకుండిరేగాని Platonic love మూలతత్త్వము నావిష్కరించలేదు, ప్లేటో ప్రతిపాదించిన ప్రేమసిద్ధాంతమును క్షుణ్ణముగా పరిశీలించిననే కాని రాయప్రోలువారి సిద్ధాంతమునకు, దానికిగల సంవాదమును చర్చించుటకు వీలుపడదు.

Platonic love ను గూర్చి Encyclopaedia Britannica ఇచ్చిన నిర్వచన మిది.

"—a term commonly applied to an affectionate relation between a man and a woman into which the sexual element does not enter."

ఈ నిర్వచనము స్థూలదృష్టితో చేయబడినది. స్త్రీ పురుషులమధ్యగల పవిత్రబంధమే Platonic love అని దీనిప్రకారము బోధపడుచున్నది. పలువు రీయభిప్రాయమునే ప్రమాణమని నమ్మిరి. ఇది సరియైన నిర్వచనము కాదు. ముందుముందు ఈ విషయము తెల్లమగును.

ఈరోస్ (Eros) గ్రీకుల ప్రేమదేవత.[1] ఈ ప్రేమ (దేవత) ఉదాత్తకార్యములకు, ఉన్నతాశయములకు ప్రేరకమని ప్లేటో అభిప్రాయపడెను. ఈ ప్రేమ రెండు విధములు. ఒకటి Eros of Aphrodite Pandemos. పురుషుడు స్త్రీసౌందర్యమును వలచుట ఈ శ్రేణికిచెందిన ప్రేమ. రెండవది Heavenly Aphrodite. ఇది పురుషులమధ్య ఉండెడిప్రేమ; శరీరమునకు బదులుగా ఆత్మనిష్ఠమైన ప్రేమ. ఒకే లింగమునకు చెందిన మానవుల (Homo-sexual) తోనే పవిత్రప్రేమ సాధ్యమగునని, వీరికి శారీరకసంయోగప్రసక్తిలేదని ప్లేటో తెలిపెను. అయినను వీరిలోగూడ (ముఖ్యముగా పురుషులలో) సంయోగవాంఛ కలుగవచ్చునని దానిని దమించుకొనుట వారికర్తవ్యమని, Homo - sexual సంబంధము తుచ్ఛమని 'రిపబ్లిక్'లో ఖండించెను. ఆత్మనిగ్రహము ప్రేమకెంత అవసరమైనదో ఈ విధముగా ప్రవచించెను.

"In addition love is richly endowed with self-control. Every one admits that self-control is mastery over pleasures and desires, and that no pleasure is stronger than love."[2] ఈ వాక్యములలో ఆత్మనిగ్రహమువలన సాధ్యమగు ప్రేమ అన్నిటికన్న శ్రేష్ఠమని అభిప్రాయపడెను.

ప్లేటో దృష్టిలో స్త్రీపురుషులు సమానులు (Equals) కారు. అందువలన సమానులు కానివారిమధ్య ప్రేమసంబంధము నీతడు నిరసించెను. ఇతనికిముందు స్త్రీకి సమాజమున గౌరవ

1. క్రమముగా ఈ పదము ప్రేమకు పర్యాయమైపోయినది.
2. Symposium : Plato.

స్థాయిలేదు. ఇతడు స్త్రీలకు 'సమాన హక్కు'లను కోరినను లైంగికసంబంధమైన విషయము లందు మాత్రము స్త్రీ పురుషుల సమానత్వమును గుర్తించలేదు. పైగా స్త్రీ పురుషులమధ్య అక్షయ ప్రేమ ఉండుటకు వీలులేదని భావించెను. స్త్రీ పురుషులు కేవలము సంతానార్థము సంబంధము జరుపుకోవలెనని ఈత డభిప్రాయపడెను.

"The actual law which he proposes, in consequence, forbids homo-sexual relations altogether, and allows intercourse only with the woman by whom one intends to have a child."[1]

ఈ విధముగా సంతానార్థముతప్ప స్త్రీ సంసర్గము తుచ్ఛమైనదని ప్లేటో అభిప్రాయపడెను. ఈ కలయిక సృష్టిప్రయోజనముమాత్రమే కలదని, ఇది ఉదాత్తాశయములను సాధించునది కాదని, జీవితముల నున్నతపథములనడుపు ఆత్మైక్యము (Union of the souls) స్త్రీసాంగత్యమువలన సాధ్యముకాదని, ఒక పురుషునికి సమానస్కంధుడైన (Equal) మరియొక పురుషుని సాంగత్యములోనే ఇది సాధ్యమని ఇతడు స్పష్టపరిచెను. స్త్రీ శారీరకసౌందర్యము పురుషుని అధఃపతితునిగాజేయునని, అందువలననే శారీరకప్రేమ తుచ్ఛమైనదని ఇతడు భావించెను.

"The bad man is the common or vulgar lover, who is in love with the body rather than the soul, he is not constant because what he loves is not constant; as soon as the flower of physical beauty which is what he loves, begins to fade, he is gone 'even as a dream' and all his professions and promises are as nothing."[2]

ప్లేటోనాటి సాంఘికవ్యవస్థ ఆయన అభిప్రాయములపై ప్రధానప్రభావము వేసెను. నాటి సమాజమున స్త్రీకి పురుషునితో సమానప్రతిపత్తి లేకపోవుట, సైనికులుతప్ప విజ్ఞానులు, మేధావులు స్త్రీతో లైంగిక సంబంధములను నిరసించుట-ఈరెండంశములు ప్లేటో ప్రణయతత్త్వముపై ప్రభావమువేసినవి. అతని జీవితముగూడ వీనికి తోడైనది. జీవిత ప్రారంభదశలో ప్లేటో సైనికుడుగా ఉండెడివాడు. తరువాత తాత్త్వికుడుగా మారెను. అతని గురువగు సోక్రటీసు మరణానంతరము తత్త్వచింతనలోపడి ఒక పీఠము స్థాపించి గురుపదవి నధిష్ఠించెను. అందువలన అతని జీవితమున ఎన్నడు స్త్రీ సాంగత్యమునకు వీలుకలుగ లేదు. అతడు ఏ స్త్రీని ప్రేమించినట్లు ప్రమాణములుగూడ లేవు. అందువలన అతడు స్త్రీ సాంగత్యమును అంత హేయముగా చిత్రించినాడు. ఏదియెట్లున్నను స్త్రీ పురుషుల మధ్య ఉదాత్తప్రేమ ఉండుటకు వీలులేదని ప్లేటో ఖండితముగా చెప్పుట విచారింపదగినదే. పురుషుడు స్త్రీతో కలసియున్నప్పు డాతడు స్త్రీ శారరీకసౌందర్యమును చూచి స్పందింపక తప్పదని, ఆయన స్త్రీ పురుషుల ప్రేమను తిరస్కరించినట్లున్నది.[3]

1. **Plato's thought : G. M. A. Grubbe : P. 118.**
2. **Symposium : P. 60 (1952-Penguine Series).**
3. **It is regrettable; no doubt, that in this philosophy the love or man for woman had no place, that he therefore sought his higher Eros between man and man."**
**—Plato's thought : P. 117.**

పురుషుల శరీరసౌందర్యమునుగూడ ప్లేటో అల్పమైనదిగానే భావించెను. కాని, బాహ్య సౌందర్యము ఆత్మసౌందర్యము నందుకొనుటకు వాహికయైనచో క్షంతవ్యమని ఈతఁ డభిప్రాయ పడెను. సోక్రటీసు ఒకసారి ఒక అందమైన యువకునిజూచి 'ఈ శరీరమునకు తగినట్లుగా అందమైన ఆత్మయున్నచో ఎంత బాగుండెడి'దని అనెనట. సాధారణముగా యువకుడు మొదట ఒకానొక వ్యక్తి ఆంగికసౌందర్యమునకు ముగ్ధుడై ప్రేమించసాగునని, క్రమముగా దానిని దాటి ఆత్మసౌందర్యమువైపు మొగ్గుచూపునని ప్లేటో అభిప్రాయపడెను. "The next stage is for him to reckon beauty of soul more valuable than beauty of body."[1]

ఈ యాత్మసౌందర్యమును ప్లేటో Divine Beauty (దివ్యసౌందర్యము) అనెను.[2] ఈ యాత్మసౌందర్యోపాసన వికసితహృదయములకు పరిణతబుద్ధులకుమాత్రమే సాధ్యమని, ఆ వ్యక్తులును పురుషులైనప్పుడుమాత్రమే సంభవమని ప్లేటో సిద్ధాంతసారము.

ప్లేటో ప్రతిపాదించిన ఈ ప్రేమసిద్ధాంతము రినైజాన్సు (Renaissance) యుగమున కొంతవరకు అవహేళనపాలైనది. క్యాస్టిగ్లియాన్ (Castiglione) మున్నగు విజ్ఞానులు క్రొత్త వ్యాఖ్యానముచేసి దీనిని నిలబెట్టుటకు ప్రయత్నించిరి. ఇంద్రియతర్పణముచేయు సౌందర్యము నుండి ఆత్మికమైన సౌందర్యమువైపు, ఆత్మికసౌందర్యమునుండి ఆధ్యాత్మికసౌందర్యమువైపు మానవుని నడిపించు మహత్తరశక్తియే Platonic love అని వెనుకటి అభిప్రాయమునకే వెల్ల వేసి చూపిరి. ఉత్తమప్రేమికుడు తాను ప్రేమించిన స్త్రీతో మానసికముగా తాదాత్మ్యమును పొందవలెనని, అందుకు చుంబనము చక్కనిసాధనమని క్రొత్తసిద్ధాంతము లేవనెత్తిరి.[3] చుంబనము శారీరకమైన క్రియకాక ఆత్మైక్యమునకు సాధనమని చెప్పుట విచిత్రముగానేయున్నది. Platonic lover యువకుడుగా ఉండరాదనియు క్యాస్టిగ్లియాన్ అభిప్రాయపడెను. 63 యేండ్ల మైకెలేంజెలో (Michelangolo) 48 యేండ్ల విట్టోరియా కొలోనా (Vittoria colonna) అను స్త్రీని ప్రేమించుట Platonic lover నకు ఆదర్శమని ఈతఁడనెను. ఒకవేళ Platonic lover తరుణ వయస్కుడైనచో అతడు శారీరకవాంఛావలయమును దాటిపోవలెనని ఈతడు స్పష్టపరిచెను.

ఈ వాదముప్రకారము స్త్రీ పురుషులమధ్య పవిత్రరాగబంధముండుటకు వీలున్నదని తేలినది. ఇది ప్లేటో ప్రతిపాదించిన సిద్ధాంతమునకు భిన్నమైనదని స్పష్టపడినది. ప్లేటో సిద్ధాంతమునకు భిన్నముగా క్యాస్టిగ్లియాన్ మున్నగువారు చేసిన ఈ సిద్ధాంతమే Platonic Love యౌననెడి అభిప్రాయము రానురాను దృఢపడినది. క్రమక్రమముగా 17 శతాబ్దిలో ఇది పరిహాసపాత్రమై పోయినది. జాన్ క్లీవ్‌లాండ్ (John cleve land) అనుకవి 'Platonick love is

1. **Symposium : P. 92.**
2. **Symposium : P. 95.**
3. **"For the Kiss Says castiglione, is rather union of soul than of body, since it has power to draw the soul to itself, and seperate it from the body."**

**—The Religion of Beauty In woman : J. B. Fletcher ; P. 155.**

nothing else but merely melancholy' అని విమర్శించెను. సక్లింగ్ (Suckling) అను రచయిత ఎగ్లోరా (Aglaura) అను నాటకమున Platonic love ను ఎగతాళిచేయుట కొక పాత్రచేత ఇట్లనిపించెను. "A mere trick to enchance the price of kisses etc." విలియం కార్ట్‌రైట్ (William Cartwright) అనుకవి 'No Platonique love' అను గీతమున ఆత్మలసంయోగ మసంభవమని విమర్శించెను.[1]

ఈ రీతిగా Platonic love క్రమశః ఎగతాళిపాలైనను కొందరు మహాకవు లీ సిద్ధాంతమునకు లక్ష్యములగు కావ్యములను సృష్టించిరి. డాంటీ (Dante) వ్రాసిన Divine comedy లో, స్పెన్సర్ (Spenser) వ్రాసిన Four Hymnes లో ఈ సిద్ధాంతచ్ఛాయలే యున్నవి. స్పెన్సర్ 'Hymne in Honour of Beautie, Hymne in Honour of Love' అను గేయములలో ఇంద్రియగతమైన ప్రేమనుండి Intellectual love (మానసిక ప్రేమ) వరకుగల పరిణామము వ్యక్తముచేయబడినది. Hymne to Intellectual Beautie లో ఆత్మపరమాత్మల-సమైక్యము నిరూపింపబడినది. షేక్స్పియర్ సానెట్ల (Sonnets) లోగూడ ఈ సిద్ధాంతమే తొంగిచూచుచున్నది. షెల్లీ ప్రేమతత్త్వమున దీని ఛాయలున్నవి.

### అమలిన శృంగారచర్చ :

రాయప్రోలువారు ఆశ్రమములన్నింటిలో గృహస్థాశ్రమము వైపే మొగ్గుచూపిరి. మంత్రమహిమానుభూతికలిగి తురీయాశ్రమము నవలంబించు బ్రహ్మర్షిగణము, 'నీతిబాహుబలస్ఫూర్తి'తో క్షాత్రధర్మము చేపట్టు నృపకులము, 'ప్రేమసూత్రము'ను విడిచినవారు కారు. యాజ్ఞవల్క్యాదులగు బ్రహ్మర్షులు, జనకాది రాజయోగులు, గృహస్థాశ్రమధర్మము నిర్వర్తించినవారే. అనగా వారును శృంగారము నాశ్రయించినవారే. శృంగారము గృహస్థాశ్రమధర్మములలో ముఖ్యమైనది కాబట్టి ఈ గృహస్థాశ్రమమును రాయప్రోలువారు పైకెత్తిరి. తైత్తిరీయోపనిషత్తులో 'ప్రజాతంతుంమావ్యవచ్ఛేత్సీః' అని కలదు. ఈ ప్రజాతంతువును అవిచ్ఛిన్నముగ కొనసాగించుటకు గృహస్థాశ్రమమేకదా మూలము ! కాళిదాసుకూడ రఘువంశమున "ప్రజాయైగృహమేధినాం" అని ఈ ధర్మమునే బలపరిచెను. గృహస్థాశ్రమమున శృంగారమును సంతానతంతువుకొరకు నిర్వర్తించుట రాయప్రోలువారికిని సమ్మతమే. సంభోగవిధి 'సుప్రజాతంత్రనిర్వాహ సూత్రమగుట'వలన దంపతీనిష్ఠధర్మముగా వీరు భావించుచున్నారు. కాని శృంగారమునకు పరమార్థము సంయోగమన్న భావమును వీరంగీకరించలేదు. కారణమేమనగా సంభోగవిధి విషయమయమైనది. అది కార్యము. కార్య మెప్పుడును అక్షయమైనది కాదు. కాబట్టి దంపతీనిష్ఠమైనప్పు డీ సంభోగ శృంగారము సమాదరణీయమేకాని, 'నవ్యుల' దృష్టిలో, 'అక్షరానందసిద్ధి' దృష్టిలో అది అప్ర

1. "I climbed from sex to soul, from soul to thought, But thinking there to move, Haedlong I rowl'd from thought to soul, and then From soul I lighted at the sex again." —Quoted in "The Religion of Beauty in Woman" : P. 204.

ధానమనిరి. ఇందుకు వీరు పండితరాయలన్న 'మూఢాస్సంభోగమిచ్ఛంతి' అన్న శ్లోకమును తెలుగున అందించిరి. ఇచట మూఢులనగా మూర్ఖులను వ్యావహారికార్థము కాదు. మోహబుద్ధులని యర్థము. మోహమతులు కేవలము సంభోగము నిచ్ఛగింతురు. తాముమాత్రము 'వియోగ మాధుర్యలీలావిపాక మనుభవింప నజ్ఞాదెద' నన్నపండితరాయల భావమును తమదిగా ప్రవచించి నారు వీరు. ఈ యమలినసౌందర్య (శృంగార) సమర్చనమే తమ ధ్యేయమని అన్నారు. దీని కుపశ్రుతివంటి భావమే యిది.

"సురతసంస్పర్శలేని ఈ శుచిమదమల
జీవితానురాగాదులఁ జిలకరించు
కానరాని శృంగారము—" (రమ్యా)

'శృంగారః శుచిరుజ్జ్వలః' అన్న ప్రాచీనులసూక్తియే వీరి అమలినశృంగారమున కాలంబనము. సంభోగములో అది వికారమునందును కాబట్టి దానిని వీరు పరిగణించలేదు. 'రతి'ని సంభోగ శృంగారమునకు స్థాయిగా ప్రాచీనులు చెప్పిరి. 'రతి'యనగా సురతమని స్థూలముగా వ్యవహా రార్థము. దీనిని వీరొప్పుకొనరు. రతివేరు, సురతమువేరు. సురతమనగా స్త్రీ పురుషుల లైంగిక సంబంధము. 'రతి' 'రమ్' ధాతువునుండి వచ్చినది. 'రమ్' (క్రీడాయాం) అనగా ఆనందించుట యని అర్థము. యోగు లాత్మారాములు. అనగా ఆత్మరతి కలవారు. వైదిక సాహిత్యమున 'రతి' ఆనందపరముగానే యున్నది. భగవద్గీతలోను ఈ యర్థములోనే యున్నది 'యస్త్వాత్మరతి రేవస్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః' అని. ఆత్మరతునికి కర్తవ్యాకర్తవ్యములులేవని దీని తాత్ప ర్యము. ఈ విశాలార్థములోనే రాయప్రోలువారు దీనిని గ్రహించిరి. 'మాధురీదర్శనము'లో 'రతి' స్వరూపము చర్చించిరి. వైష్ణవమతములోని 'మహామాధురీభావ'మును దృష్టిలో పెట్టుకొని దీనిని సమర్థించిరి. ఇందుకు నన్నయవాడిన 'స్త్రీపుంసయోగము'[1] ను క్రొత్తగా వ్యాఖ్యానించిరి. 'స్త్రీపుంసయోగ'మనగా కేవలము లౌకిక సంయోగముకాదు. "సాయుజ్యయుక్తి". ఈ యర్థమున గ్రహించి వీరు స్త్రీపురుషసంయోగమునకు యోగప్రతిపత్తి భాసింపజేసిరి. ప్రాణులకెల్లను రతి సర్వాంగీణమై విలసిల్లునని, కాని అది యమలినమై కల్యాణపరమవర్చస్కధురీణమై, మహామాధురీభావము నందుటకు (ఆత్మలు లయమగుటకు) వీలేదని వీరు ప్రశ్నించిరి. రతి చిత్ప దార్థము. అది మొదట బీజప్రాయముగానుండి క్రమక్రమముగా విస్ఫుటించి, పల్లవించి, కుసు మించి, ఫలించునని వీరి యభిప్రాయము. 'తరుణోదయ' (యౌవనోదయ) కాలమున అది 'పయోధరసుందరమై' కామాభిముఖముగానున్నను, క్రమశః మిధునబంధమున 'నిర్జరపరిణతి' గొనునని వీరనిరి. మొదట 'అంగజధర్మకలాపము'గా నున్న 'రతి' 'అనంగపరానందశోభన స్ఫూర్తి' పొందుననిరి. అనగా ప్రాథమికదశలోని కాయసంబంధమైన విషయకలాపము, అను భావాదులచేత ఉత్తుంగమై తుదకు అశరీరమైన పరానందమున లీనమగును. సూక్ష్మసుందరములై

1. 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' శ్లోకము : ఆంధ్రమహాభారతము : అవతారిక.

మనస్సున ద్రవించిన 'ద్రవరతులు' (Emotions) అశరీరమైనమధనములోబడి అమృతస్థితిని పొందునని, అదే ఆనందపదవియని వీరి భావము.

ఈ రీతిగా 'రతి'కి 'సురతము'నకు వీరు భేదము పాటించిరి. సురతస్పర్శలేని శుద్ధమైన అనురాగముగల 'అబోధశృంగారము' సర్వోత్తమమైనదనిరి. ఇక దంపతులలో సురతస్పర్శలేని శృంగార మెట్లుండునన్నది ప్రశ్న. ప్రజాతంతువుకొరకేకదా గార్హస్థ్యము? సంయోగములేనిది అది ఎట్లు సాధ్యమగును? వీరు ప్రజాతంత్వర్థము దంపతుల సంయోగసిద్ధిని సమర్థించినవారే. అయినను అదియొక అవస్థకుమాత్రమే పరిమితమై యుండవలెనని, క్రమక్రమముగా ఉత్తమ సంస్కారులైన దంపతులు శరీరవిముక్తమైన సౌందర్యము నర్చించవలెనని వీరి యభిప్రాయము. వయసుగడచుకొలది వారిశృంగారము స్నేహపర్యవసాయి కావలెనని వీరి సిద్ధాంతము. భవభూతి ఉత్తరరామచరిత్రమున ఈ విషయమునే ప్రతిపాదించెను.

> ''కాలేనావరణాత్యయాత్ పరిణతే యత్స్నేహసారే స్థితం
> భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకంహి తత్ ప్రాప్యతే.''

కాలము గడచినకొలది భార్యాభర్తలసంబంధము కేవలము స్నేహాత్మకముగా పరిణమించునని దీని అభిప్రాయము దీనినే రాయప్రోలువారు పరిగ్రహించిరి.

శృంగారమునకు రెండుదశలున్నవి. ఒకటి సంయోగము, రెండవది వియోగము. వీనిలో వియోగమునకే వీరు ప్రాధాన్యమిచ్చిరని యీవరకే మనవిచేసితిని. ఇది యెంతవరకు సమంజసము? లాక్షణికముగా పరిశీలించినచో వియోగమన్నది ఒక అవస్థయేకాని గమ్యమో, లక్ష్యమో కాదు. 'నవినావిప్రలంభేన సంయోగం పుష్టిమశ్నుతే'[1] యని లాక్షణికోక్తి. విప్రలంభములేనిదే సంయోగమునకు పుష్టికలుగదని దీని తాత్పర్యము. భంగ్యంతరముగా ఇందులో సంయోగమే లక్ష్యమని చెప్పబడినదికదా! కాళిదాసు వియోగములోనే ప్రేమ రాశీభూతమని చెప్పెను.

> ''స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసినస్తే త్వభోగా
> దిష్టే వస్తు న్యుపచితరసాః ప్రేమరాశీభవంతి.''[2]

విరహమునందు స్నేహము క్షీణించునన్నియందురు. కాని వియోగమునందే యిష్టవస్తువులపట్ల ప్రేమము రసోపచితమై రాశీభూతమగునని కాళిదాసుని అభిప్రాయము. దీనినే రాయప్రోలువారు

> 'సరససాంగత్య సుఖవికాసములకన్న
> దుస్సహవియోగభరమె మధురము సకియ' (తృణకంకణము)

1. విశ్వనాథునిసాహిత్యదర్పణములో ఉద్ధృతము.
2. మేఘసందేశము : ద్వితీయసర్గము : 52 శ్లో.

అని చెప్పిరి. కాళిదాసాదులు చెప్పిన వియోగము సంయోగమునకు దారితీయునదే. వీరు వియోగమునకే చరమస్థాయి కలిగించిరి. ఈ విప్రలంభము విరక్తికి సన్నిహితమైనదికాదు.

"కనుల నొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజనల్ గొనుటకన్న
కొసరి 'యేమోయి'యని పిల్చుకొనుటకన్న
చెలుల కిలమీదనేమి కావలయు సఖుడ"

అని తృణకంకణనాయికచేత వీరనిపించిరి. దీనినిబట్టిచూడగా వీరు ప్రతిపాదించిన వియోగము శరీరస్పర్శలేనిది మాత్రమే. లాక్షణికులు దశావస్థలని చెప్పిన 'చక్షూరాగమనస్సంగా'దులలో వీరు చక్షూరాగమును, మనస్సంగమమును, ప్రలాపము (పిలుపు)ను ధ్యేయములుగాచెప్పిరి. పూర్వసంప్రదాయములో ఇవి సంయోగశృంగారమునకు సోపానములవంటివి మాత్రమే. వానికి ప్రాధాన్యమిచ్చుటలోనే వీరి ప్రత్యేకతయున్నది. వీరి కావ్యములలో తృణకంకణము అయమలిన శృంగారమునకు ముఖ్యగ్రంథము. ఇందులో ఇరువురు యువతీయువకులు చిననాటినుండి ప్రేమించుకొందురు. విధివశమున వారిరువురికి వివాహము జరుగలేదు. యువతికి మరియొక పురుషునితో పరిణయమైనది. యువకుడు భగ్నాశుడై ఆమెను ధ్యానించుచునే కాలము గడుపుచుండును. వారిరువురుకలిసికొన్నప్పుడు. వారిలో ఏ మాత్రము కామవికారముకాని, సంయోగకాంక్షకాని కలుగలేదు. విధికి విలపించుటయే తప్ప వీసమెత్తయినను వారు మనోవికారములకులోనుగారు. దర్శన భాషణములతో, మనస్సులలో ఒండొరులను స్మరించుకొనుటతో జీవితమును గడుపుటకు నిశ్చయించుకొందొరు. యువకుడు వివాహితుడుకాక అట్లేయుండిపోవును. ఆ యిరువురిమధ్య వెనుకటి చెలికారము మరింత పక్వమైనది. ఇరువురనుభవించినది వియోగమునే. ఈ వియోగ బాధలోనే ఒక మాధుర్యమున్నదని, ఆ మాధుర్యమునే వారు జీవితమంత అనుభవింతురని రాయప్రోలువారి సిద్ధాంతము.

ఈ సిద్ధాంతమును ప్రతిపాదించుటకు రెండు కారణము లూహకందుచున్నవి. ఒకటి : ప్రబంధకావ్యములలో ప్రాయికముగా స్త్రీ భోగ్యవస్తువుగా చిత్రింపబడినది. కచకుచవర్ణనలతో తృప్తిపడక కవులు నాభిని, నూగారును, వళులనుగూడ వర్ణింపసాగిరి. ఇది తత్పూర్వకావ్యములలోనున్నను ప్రబంధక్షీణయుగములో 'వేలమువెర్రిగా' మారిపోయినది. రాజకుమారి కనిపించగానే రాజకుమారునికి మరులుపుట్టును. ఆమెకునంతే జరుగును. ఫలితము విరహజ్వలనము. తర్వాత శైశిరోపచారములు, దౌత్యము, పరిణయము, సంతానప్రాప్తి. ఈ విధముగా స్త్రీని కేవలము కేళీవస్తువుగాచూచుట రాయప్రోలువారికి బాధకలిగించినది. రెండవది : ఆనాటి సమాజములో అప్పుడప్పుడే ఆంగ్లవిద్యానాగరకతల సంపర్కముతో నూతనభావములు వీవసాగినవి. 'కాలేజీ విద్యల'వలన యువతీయువకులు పరస్పరము చూచుకొనుటకు, మాటాడుకొనుటకు, కలసితిరుగుటకు వీలుచిక్కినది. వారొకరినొకరు ప్రేమించుకొనసాగిరి. సమాజ

ములో ప్రాచీనవిశ్వాసము లింకను 'పెళ్ళగిలి'పోలేదు. నవీనభావములకు స్థిరత్వమేర్పడలేదు. వానిపై పెద్దలముద్ర పడలేదు. ఒకరకముగా అది ప్రాచీన నవీనభావములు ఘర్షణస్థితిలోనున్న సంధియుగము. ఈ స్థితిలో యువతీ యువకుల స్వచ్ఛంద ప్రేమ ఎన్నో ప్రతిఘాతములకు దారి తీసినది. కుల, మత, వర్ణవ్యవస్థ వారికడ్డువచ్చినది. తత్పర్యవసానముగా వారి ఆశలు నడు మంతరముననే అడుగంటినవి. కొందరు సాహసులు తెగించి ముందుకడుగువేసిరి. సాంఘిక వ్యవస్థకు వ్యతిరేకముగా తిరుగుబాటుచేసిరి. ఫలితము-వారి జీవితములు చితికిపోవుట. ఈ విధ ముగా సమాజములో నాడు 'ప్రేమ' సిద్ధాంతమువలన కలుగుచుండిన దుష్పరిణామములను గమ నించి రాయప్రోలువారు ఈ రెంటికి పరిష్కారముగా 'అమలినశృంగారము'ను. వియోగాధిక్య మును సిద్ధాంతీకరించిరి. వట్టిమాటలతోచెప్పక గట్టికావ్యములద్వారా నిరూపించిరి. స్త్రీని భోగ్య వస్తువుగా చేసికొన్న ప్రాచీనవ్యవస్థను, కట్లుత్రెంచుకొనిపోవు యువతీయువకుల నవీనప్రేమా వస్థను, అదుపులోపెట్టుట కీసిద్ధాంతమును స్థాపించిరి. ఈ దృష్టితో చూచిననేకాని వీరి సిద్ధాంత ముల సారస్యము సుబోధముకాదు.

ఇక ప్లేటో ప్రేమతత్త్వమునకు వీరి సిద్ధాంతమునకుగల తారతమ్యము పరిశీలింతము. ప్లేటో దృష్టిలో స్త్రీ పురుషులప్రేమ నిషిద్ధమని ముందే మనవిచేసితిని. ఈ విషయములో వీరు పరస్పరభిన్నమార్గములలోనున్నారు. రాయప్రోలువారు సంభోగశృంగార మప్రధానమన్నను, స్త్రీని తుచ్ఛముగా చూడలేదు. పైగా స్త్రీని పురుషునికన్న ఒకమెట్టు ఎత్తుగానే చూచిరి. వీరి కావ్యములలోని పాత్రలలో స్త్రీలకే ప్రాధాన్యమున్నది. వారినే ధీరస్వాంతలుగా, సహనమూర్తు లుగా, త్యాగజీవనలుగా చిత్రించి పురుషులకన్న వారిని ఉన్నతపీఠమున అధిష్ఠింపజేసినారు. కాబట్టి ఈ విషయములో ప్లేటోకు వీరికి పోలికయేలేదు. ప్లేటో స్త్రీ పురుషులమధ్య ఆత్మసంబంధ మైన ఐక్యమునకు వీలులేదని, స్త్రీతో చెలిమిచేసినచో ఆమె శరీరసౌందర్యమునకు లోబడక తప్పదని, అందువలన స్త్రీ పురుషుల స్నేహమున కర్థములేదనియనెను రాయప్రోలువారు దీనికి భిన్నదృక్పథమును ప్రతిపాదించిరి. స్త్రీ ప్రకృతికి ప్రతినిధి. ఆమె అవస్థాభేదమునుబట్టి ప్రేయసిగా, ఇల్లాలుగా, భగినిగా, 'సహచరి'గా, జననిగా రూపొందునని, 'పురుషవృషభము'ల అంతరంగములను మసృణీకరించునది స్త్రీయని రాయప్రోలువారి ప్రతిపాదనము. పైగా వీరి కావ్య ములలో నాయికానాయకులు సమానస్థాయిలోనుండి స్నేహము నెరపినవారు. కాబట్టి ఈ విష యములో ప్లేటోకు వీరికి పోలికలేదు. ఇక ఉన్న సామ్యమొక్కటే. శారీరకసౌందర్యముకన్న ఆత్మసౌందర్యము గొప్పది. ఆంగిక సంయోగముకన్న ఆత్మసంయోగము గొప్పది. ఈ తత్త్వ మును ఇంచుమించుగా ఇద్దరొకేవిధముగా ప్రతిపాదించిరి. అంతమాత్రముచేత వీరి 'అమలిన శృంగారము' Platonic love ఒక్కటేయనుట సమంజసముకాదు. పైగా మూలతత్త్వములోనే ఈ రెంటికి ఎంతో తారతమ్యమున్నదని పైన నిరూపించితిని.

ప్లేటో ప్రేమసిద్ధాంతముగాని, ప్రాచీనుల శృంగారరసతత్త్వముగాని సాధింపని మరియొక సిద్ధాంతమును రాయప్రోలువారు ప్రతిపాదించిరి. శృంగార, ప్రేయో, వాత్సల్యాదిరసముల

సమీకరణమది. శృంగారమునకు శుచియను నామాంతరమున్నది. శుచియనగా జుగుప్సాది విరహితమై ప్రకాశించునదని అర్థము. ఈ విశాలమైన అర్థములో వీరు స్నేహమును, వాత్సల్యమును, శృంగారమునకు రూపాంతరములుగానే గ్రహించిరి. శృంగారమునకు మమత, అనురాగము, ప్రేమ, ప్రణయము, స్నేహము మున్నగు అనేకార్థములను భావించుకొనిరి. ద్వేషాభావములైన సర్వప్రవృత్తులను 'శృంగార'వలయములోనే చేర్చుకొనిరి. స్నేహ, సురత, వాత్సల్యములు ప్రేమ కంగములని, ప్రేమయే అంగియని వీరనిరి (రమ్యా). ఇచ్చట ప్రేమశబ్దమును శృంగారపర్యాయముగానే గ్రహించిరి.

"విప్రలంభసంభోగముల్ విస్తరించి
సంగ్రహించిరి శృంగారశాఖలయిన
స్నేహవత్సలాదుల ; నతిస్నిగ్ధహృదయు
లగు కవులకిపుడవి వరేణ్యంబులయ్యె" (రమ్యా)

అనుపద్యములో స్పష్టముగా శృంగారమునకు స్నేహవత్సలాదు లంగములని (శాఖలని) అభిప్రాయపడిరి. ఇది శాస్త్రదృష్ట్యా చూచినచో నిలుచు సిద్ధాంతముకాదు. కాబట్టియే వీరు దీనికి క్రొత్త వ్యాఖ్యానము కల్పించుకొనిరి. శృంగారమునకు స్థాయిభావమైన 'రతి'ని ప్రాచీనలాక్షణికులు చెప్పిన 'సంయోగము', కామము అను అర్థములలోకాక 'చిత్పదార్థము', 'ఆనందబిందువు'అను అర్థములలో వీరు స్వీకరించిరి. శృంగారమునకు ఆనందరూపాంతరమైన 'రతి'ని స్థాయిగా స్వీకరించినప్పుడు ప్రేయోవాత్సల్యాదులు శృంగారవలయములోనే వచ్చిచేరుటలోవిప్రతిపత్తిలేదుకదా ! ఈవిధముగా సరిక్రొత్తవ్యాఖ్యానముతో వీరు తమ సిద్ధాంతమును నెలకొల్పిరి. తల్లికి పుత్రుని గండచుంబనముతో కలిగెడు పులకరింపు ఒకవిధమైన శృంగారమేయని వీరి భావము. పూర్వావస్థలో, అనగా పురుషసాంగత్యదశలో, తరుణి తానుపొందలేని అక్షరానందమును శిశుచుంబనాదులలో పొందునని వీరి యభిప్రాయము. దీనిని పుత్రశృంగారమని వీరనిరి. తల్లి పసివాడైన తనపుత్రునిముందుగూడ వక్షోజములపై పైటలేకుండ ఉండలేదను లౌకికసత్యములోని ఔచిత్యమును వీరీ సిద్ధాంతమునకు సమన్వయింపజేసిరి."స్నానమాడి, పెన్నెరులఱజాఱముడిచి, నొసటకుంకుమ పాదాలపసుపుమెఱయ"తెల్లనివలువ ధరించి తులసీపూజచేయు మాతృమూర్తి ధీరమంగళరూపము మాతృశృంగారమని వీరనిరి. ఈ దృష్టితో చూచినచో శంకరాచార్యులవారు దేవీస్తనకలశములను వర్ణించుట మాతృశృంగారమే యనవచ్చును. 'భువనసమ్మోహనుడైన పురుషుని'జూడగా, ఇతని కేతల్లి పాలిచ్చినదోయని జనులకు కలుగుభావమున మాతృశృంగారమే తొంగిచూచుచున్నదని వీరనిరి. స్త్రీ పురుషులమధ్య, లేక లింగసాజాత్యముగలవారి మధ్యఉండెడు సురతప్రసక్తిలేని స్నేహభావమును వీరు స్నేహశృంగారమనిరి. రతి దేవతాపరమైనచో భావమని ప్రాచీనులనిరి.[1] రాయప్రోలువారు దీనినే ఆప్తశృంగారమనిరి. దేవతలు ఆప్తకోటిలోనివారేకదా ! ఇక సోదరీ

1. 'రతిర్దేవాదివిషయావ్యభిచారీ తథాంచితః భావః ప్రోక్తః' —కావ్యప్రకాశము.

సోదరులమధ్య ప్రేమభావమును వీరు సోదరీశృంగారమనిరి. ఈ విధముగా శృంగారపరిధిని విస్తరింపజేసి సమస్తద్వేషాభావప్రవృత్తులను, ఆనందమూలకములైన భావములను శృంగారరస ములో పర్యవసించునవిగా మార్చి నూత్నసిద్ధాంతమును స్థాపించిరి. అయినను Platonic love వలె వీరితర్వాత ఈ 'అమలినశృంగారము' అవహేళన పాలుగాకున్నను, అంతగా ఆదరము కూడ పొందలేదు. నాయని, కృష్ణశాస్త్రి, వేదులమున్నగు కవుల వియోగశృంగారకీర్తనముపై వీరి ప్రభావమున్నది. అంతేకాని వీరివలె 'అమలినశృంగారము'ను సమర్థించుటకెవ్వరును కావ్య రచనచేయలేదు. వాత్సల్యాదులను వీరివలె ఎవరును శృంగారపర్యవసన్నములుగా చేయలేదు. ఈ సిద్ధాంతములోని గుణాగుణములకేమికాని 'అమలినశృంగార'మను క్రొత్తసిద్ధాంతమును స్థాపించిన గౌరవము మాత్రము రాయప్రోలువారికి దక్కినది. Platonic love కన్న ఈ సిద్ధాంతము ఉదాత్తమైనదనుటలోగూడ సందేహములేదు.

**స్త్రీ సమారాధనము :**

ప్రబంధవాఙ్మయమున కేవలము కాముకావరణములోనే ప్రదర్శింపబడిన 'స్త్రీ' కి ఉన్నత పీఠమునిచ్చినవారు రాయప్రోలువారని యీవరకే మనవిచేసితిని. అంతవరకు స్త్రీయొక్క ఉన్నత స్తనములపై కేంద్రీకృతమైన కవులదృష్టిని వీరు ఆమె ఉన్నతాశయములవైపు మరలించిరి. 'అస్తి నాస్తివిచికిత్సాహేతుశాతోదర'ము పైననే సంలగ్నమగుచూపునకు ఆత్మసౌందర్యదిదృక్ష కలిగించిరి. స్త్రీలకవమానహేతువులైన 'ఉవిదలకుబుద్ధి పెడతలనుండుగాదె'మున్నగు అభిప్రాయములను త్రోసిపుచ్చి, స్త్రీలోని మహాగుణములకు నివాళులెత్తిరి. స్త్రీ సమాధిక్యతత్త్వమునకు వ్యాస భారతములోని క్రింది శ్లోకము వీరికాలంబనమైనది.

"ధృతిః క్షమా దయాశౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః
సప్తైతాః సమిధః శ్రియః." (అరణ్యపర్వము)

ధృతి, సహనము, దయ, శుచిత్వము, కారుణ్యము, ప్రసన్నవాక్కు, మిత్రులపట్ల అనభిద్రోహ మను ఏడు గుణములు స్త్రీని ఉన్నతపదవిపై అధిష్ఠింపజేయునవని వ్యాసుని అభిప్రాయము. ఈ గుణములను ప్రదర్శించుటకు రాయప్రోలువారు తృణకంకణము, స్నేహలతాదేవి, కష్టకమల, స్వప్నకుమారము, రూపనవనీతము మున్నగు గ్రంథములు వ్రాసిరి. వీరి కావ్యములన్నియు నాయికాప్రధానములే. అన్నిట నాయికలు ధీరస్వాంతలే. విషమపరిస్థితులకెదురొడ్డి నిలచి, పురుషునికే జ్ఞానోపదేశముచేయగల ధృతిమతులువీరు. తృణకంకణములోని నాయిక భగ్నమనోరథుడైన పూర్వప్రియునికి సాంత్వనముపలికిన ధీర. తాను ప్రేమించిన ప్రియుడు (అభాల్య మిత్రుడు) తనకు కాకుండపోయినను, 'ముక్కుముఖమెరుగని'వానికి తాను ముడిపెట్టబడినను, నిశ్చలహృదయముతో వజ్రసదృశమైన సంకల్పముతో ప్రవర్తించిన శీలవతి. కష్టకమలలోని

నాయిక కోరకదశదాటని పసిపిల్లయైనను ఇంగితము గుర్తెరిగినది. తాను సోదరభావముతో చూచినవాడు తనను కామదృష్టితో చూడగా మొదట తబ్బిబ్బైపోయినను, సమాజమునుండి పరుగెత్తుకొనిపోయినదికాదు. నలుగురితో ఈ విషయము వెల్లడించినదికాదు. స్నేహలతలోని నాయిక శుచిత్వమునకు, త్యాగమునకు ప్రతీక. కారుణ్యము పోతపోసినమూర్తి. అందువలననే పితృగృహరక్షణార్థము ప్రాణదానముచేసినది. స్వప్నకుమారములోని నాయిక ప్రకృతికి ప్రతిబింబమైన స్త్రీయే. స్త్రీలోని దయాశీలమునకు, ఆమెలోని మాతృత్వమునకు ఈ పాత్ర రూపాంతరము. కాముకుడైనయువకునికి జ్ఞానబోధచేసిన కమనీయపాత్రయిది. ఆంగ్లమాతృకలుగల లలిత, అనుమతి కావ్యములుగూడ స్త్రీ ప్రధానములైనవే. తాను ప్రేమించిన ప్రియుడు అడవులబట్టగా, భోగభాగ్యములతో తులదూగు పితృ(రాజ) గృహమునువీడి, ప్రియునికొరకు కరణ్యములబడి తిరిగి కడకు తన గమ్యముచేరుకొన్న ధృతిమతి లలిత. అనుమతిలోని అనుమతిపాత్ర దయాత్యాగములకు పుట్టినిల్లు. తనకు భర్తకావలసినవాడు మరియొక మగువను పెండ్లాడినను, అతని మరణానంతరమా స్త్రీకొరకు, ఆమె కొడుకుకొరకు, త్యాగము కనబరిచిన మానిని యీమె. ఇక రూపనవనీతములో ప్రధానపాత్ర వకుళమాల. ఈమె మిత్రానభిద్రోహమునకు. దయాగుణమునకు సంకేతము. స్త్రీప్రకృతిలో దాక్షిణ్యాంశ అధికమని, ఆ గుణ మామెచేత ఏ పనియైన చేయించునని వకుళపాత్రద్వారా రాయప్రోలువారు నిరూపించిరి. వకుళమాల నవనీతుని భార్య. ఆమె దాక్షిణ్యమయి. 'దైన్యయాచనాదులకు అవశంగా కరిగిపోయే స్వభావశీల.'[1] ఆమె మిత్రుడు సుందరుడు. అతడు 'సంగీత, సాహిత్యములలో నిష్ణాత', 'కామకౌతుకి'. అతని భార్యపేరు సుందరి. వకుళాసుందరులు మిత్రులు. ఒకమారు 'స్తన్యప్రదానము'అను చిత్రమును చూపించగా సుందరుడు వకుళచేలాంచలములాగి "ఆమె స్తన్యదానం చేస్తుంటే, నీవునాకు స్నేహదానం చేయరాదా"[2] అనెను. 'కర్పూరదీపం ఆర్పివేస్తావా'[3] అని పెనగులాడెను. అతడీవిధముగా "క్రూరంగా మోమోటపెట్టితే......(వకుళ) అమలినమైన తనస్నేహంతోపాటు, అస్ఖలితమైన తన శీలమును కూడ ధారపోసింది."[4]

పరపురుషునికి పరకాంత శీలదానముచేయుట యెంతవరకు సమర్థనీయము? దీనిని ప్రతిపాదించుటలో రాయప్రోలువారి ఆంతర్యమేమిటి? వకుళ శీలదానము స్తన్యప్రదానమువంటిది. ఆమెలో ఏ వికారము కలుగలేదు. కేవలము మిత్రుని కాంక్ష చెల్లించుటకామె స్తన్యప్రాయముగా తన శీలమును సమర్పించినది. శీలదానముతోపాటు పచ్చని తన జీవితమునే సమర్పించినది. అప్పటినుండి ఆమె విరక్తయైపోయినది. అకామయోగము నవలంబించినది. తన భర్త పొందును గూడ పరిహరించినది. వల్లభమతములో శీలదానముకన్న మహాదానము లేదని యందురు. ఆమె

1. రూపనవనీతము : పరిచయము : (ఇది కావ్యముకాకున్నను తత్త్వప్రతిపాదనదృష్ట్యా వారి కావ్యములతో పోలికగల గ్రంథము.)
2. రూపనవనీతము : పుట 39. 3. రూపనవనీతము : పుట 40.
4. రూపనవనీతము : పుట 33.

శీలదానము చేసినపిమ్మట జీవితసౌఖ్యమును చవిచూడలేదు. పురుషుని కామతృప్తి కామె తన జీవితమునే త్యాగముచేసినది. కారణము? స్త్రీలో దాక్షిణ్యాంశ అధికాధికముగా నుండుటయే. వకుళమాలాపాత్ర ఈ సత్యమును బోధించుటకే సృష్టింపబడినది. వకుళమాలానామకరణములో గూడ ఎంతో ఔచిత్యమున్నది. వకుళమునకు వాడిన పిమ్మటనే పరిమళమతిశయించును. వకుళమాల శీలమట్లే. శీలదానము చేసినపిమ్మటనే ఆమె ఉదాత్తత పెరిగినది. ఆమె త్యాగశీలమును సమర్థించుటకు రాయప్రోలువారు అహల్యావృత్తాంతము నుదాహరించిరి. అహల్య పలుగురనుకొనుచున్నవిధముగా ఇంద్రుని మారువేషమునకు మోసపోయి భ్రష్టశీలకాలేదని, ఇంద్రుడు యాచించగా కాదనలేక శీలదానముచేసి శిలయైపోయినదని వీరుచేసిన క్రొత్తవ్యాఖ్యానము. అహల్య చరిత్రలో ప్రదానమేతప్ప ఆదానములేదు. ఆమె శీలదానముచేసి జీవితమును సమాప్తము చేసికొన్నది. త్యాగములోనే జీవితసాఫల్యమును చూచినది. కాబట్టి యిట్టి సందర్భములలో జారత్వమునకు, శీలదానమునకుగల భేదమును గమనింపవలసియున్నది. వకుళ అట్లేచేసినది. వకుళను స్త్రీలోని దాక్షిణ్య, దయా, క్షమాదిగుణములకు ప్రతీకగా రాయప్రోలువారు సృష్టించి, స్త్రీ ఆధిక్యమునే నిరూపించిరి.

ఏక్షణాన రాయప్రోలువారి పినతల్లి 'అనసూయ' కథను క్రొత్తవ్యాఖ్యానముచేసి చెప్పినదో, ఆ క్షణమునుండి రాయప్రోలువారికి సృష్టి భగవత్స్వరూపిణిగా, స్త్రీ మాతృస్వరూపిణిగా కనిపించసాగినది. ఆచార్యశంకరులకు దేవీస్తనద్వంద్వమునందు సూర్యచంద్రులు ద్యోతమైనట్లు వీరికి పాలకుండలో, అమృతకలశములో గోచరించసాగినవి.[1] పయోధరములకన్న 'పాలిండ్ల'లో ఉన్న ప్రత్యేకత రుచులీనసాగినది. స్త్రీకి పర్యాయవాచకములుగానున్న వరారోహ, రంభోరు, పర్వతస్తని, నతనాభి మున్నగుపదములు అనుభూతిభంజకములుగా కనిపించసాగినవి. భవభూతి సీత, కాళిదాసు శకుంతల, వారి చిత్తరంగముపై క్రొత్తరేఖలతో సాక్షాత్కరింపసాగినవి. భవభూతి ప్రతిపాదించిన 'సుమానుషప్రేమ' ఆరాధ్యముకాసాగినది. స్త్రీ తల్లిగా, దేవతామతల్లిగా భాసింపసాగినది. స్త్రీకి కవికిగల సంబంధమిట్లు కన్పించినదివారికి.

"(స్త్రీని) కవి కాముకునివలె కామింపక, తల్లివలె దగ్గరకుపోవును. ఆమె యౌవనావస్థయందుగూడ ప్రకృతికృపణుడైన పురుషుని ధూర్తచారణమునకు లొంగక నిండుకుండవలె నిలుచును. అబలాసమ్మిళితముగ నాతనికి పుత్రభావము నుపదేశించును."[2]

ఈ విధముగా రాయప్రోలువారు స్త్రీలోని మాతృమూర్తిత్వమును, దైవతాంశమునుదర్శించి స్వప్నకుమారాదికావ్యములద్వారా నిరూపించిరి. చివరికి అనాదిగానున్న పద్మభ్రమరముల ప్రేయసీ ప్రియసంబంధము త్రోసివేసి దానిని వాత్సల్యసూత్రములో ముడివేసిరి.

'సందెలను దారిదప్పు మిళిందసుతుల
తేనెపాలిచ్చి చీకట్ల దిరుగనీక

1, 2. భావకవిత్వము : రాయప్రోలు : భారతి : శ్రీముఖమాఘము.

ఉదయమగుదాక యొడిలోన నిదురబుచ్చు
చేరదీసిన మమతకు చిక్కె నళిని.'[1]

ఇది అపూర్వవిషయము. ఏ లాక్షణికులును, కవులును ఈ సంబంధమూహింపలేదు. అట్లే రాధామాధవుల బాహ్యశృంగారమును నిరసించి వీరు పరిశుద్ధప్రణయస్ఫూర్తి కలిగించిరి. ఆధునికాంధ్రకవిత్వములో స్త్రీ సమారాధనతత్త్వమునకు రాయప్రోలువారే మొట్టమొదటి ఆచార్యులు.[2]

## కవిత్వములో నవ్యత :

**1. వస్తువు :** 'తృణకంకణా'ది కావ్యములలోని వస్తునవ్యత నీవరకే చర్చించియుంటిని. 'కష్టకమల'లో వీరు మధ్యతరగతి బ్రాహ్మణుల జీవితమును వస్తువుగా గ్రహించుట నవ్యత. ఖండకావ్యములలో రామన్న, భూదేవి అను కాపుదంపతుల జీవితచిత్రణము వస్తునవ్యతకు మరియొక తార్కాణ.[3] 'ఆంధ్రావళి'లోని 'తెల్లకుచ్చులపాగ అల్లల్లనసియాడ చిన్నిగొర్రెల మేపు చిన్నారిగొల్లాడ' అను గేయములో Pastoral Poetry కి బీజములున్నవి. ఈ గేయము గొల్లవాని గుడిసెను 'ముత్యాలభవనము'గా చిత్రించినది. గొల్లవారి బ్రతుకును గొప్పగాజేసి చిత్రించుట అప్పటికి క్రొత్తదనమే. ఆటవికుల వేషములను వారి యాసమాటలను పూర్వకావ్యములలో చిత్రించుటలేకపోలేదు. శుకసప్తతి మున్నగు కావ్యములలో శ్రమజీవుల వేషవర్ణనలు చూపట్టును. కాని వారి జీవితముపై సానుభూతికన్న సహృదయులకు వినోదము కలిగించుటయే ఆ కాలపు కవుల లక్ష్యమైనట్లు తోచును. వీరు ప్రతి ఉగాదికి వ్రాసిన పద్యములు గతానుగతికమైన వసంత వర్ణనలకన్న వినూత్నధోరణిలో నడచినవి. వానిలో సౌందర్యదృష్టితోపాటు వాస్తవికసామాజికదృష్టికూడ నవ్యత. ఈ పద్ధతి తరువాతికవుల కుపాదేయమైనది. కవిత్వముయొక్క, భాషయొక్క అవతారక్రమమును చెప్పుట మరియొక నవ్యత.[4] కోయిలగూర్చి పద్యములువ్రాసిన వారిలో ప్రథములు వీరే. తరువాతి భావకవులలో ఈ శీర్షికను స్పృశించనివారు లేరు

వ్యక్తుల ప్రశంసాగీతములకు, స్మృతిగీతములకు (Elegy) వీరే మార్గదర్శకులు. గోఖలే నిర్యాణము పిమ్మట వీరు వ్రాసిన పద్యము లానాటి సమాజమును కదలించివేసినవి అట్లే రాధాకృష్ణుడు, రవీంద్రుడు, రామలింగారెడ్డి, గిడుగు మున్నగువారినిగూర్చి వీరు వ్రాసిన ప్రశంసా పద్యములు, స్మృతిగీతములు వీరి వస్తునవ్యతకు తార్కాణలు. వీరి వస్తువైవిధ్యమునకు 'పులియాకు'పై వ్రాసిన పద్యములు మచ్చుతునకలు. విస్తరాకుపై ఇంతటి రమ్యమైన కవిత్వము చెప్పినవా రప్పటికి ఇప్పటికిలేరు. పులియాకు ప్రస్తుతస్థితికాక, అది పచ్చగా బ్రతికిన

1. స్వప్నకుమారము. 2. భావకవులు దీనిని పెంపుచేసిరి.
3. దీనిని వారి అముద్రితరచనలలో చూచితిని : ప్రచురణవిషయము తెలియదు.
4. చిల్క, కవిత అన్న శీర్షికలిట్టివే.

నాటిస్థితియే వీరికి వ్యక్తమైనది. అది వీరి సౌందర్యదృష్టికి సంబంధించిన విషయము. జుగుప్సావహములైన వస్తువులలోగూడ సౌందర్యదర్శనముచేసెడి తత్త్వము వీరిది. అందుకే పులియాకును జూచి

"ఏ పసికొండదండ నటియించు సరిల్లలనానితంబబిం
బోపరిభాగభోగములయోజ విరాజిలు సైకతంబులఀ
గాపురముండిరోకదె వనస్పతులాదిని నీ సగోత్రులీ
మాపులకక్కటా బయసిమాలితివో పులియాకువిస్తరీ"[1]

యని జాలిపడి, 'రేగిరేగని ముంగురుల్ నొసటనర్తింపంగ నేకొమ్మ బాహాగంధామలవీచికల్ సుడియ నిన్నందించెనో బిత్తరీ'[2] యని దాని గతవైభవమును స్మరించి నిట్టూర్చిరి.

**2. భావము :** వీరి భావములలోని క్రొత్తదనమునుగూర్చి ఆయా కావ్యములను పరిశీలించినప్పుడు వివరించితిని. ఇకవీరి ఖండకావ్యముల నాధారముగాజేసికొని వానిలోని భావనానవ్యతను విశదీకరింతును.[3]

రాయప్రోలువారికి సృష్టిలో అనేకపదార్థములు వాత్సల్యస్ఫూర్తితో మిసమిసలాడుచున్నట్లు కనిపించినవి. అందుకే వారు పూలలోనితేనెను 'పూలపాలు'గా భావించిరి. వసంతములో పూలు వికసించుటను 'పూలుపసుపాడి'నవని, 'సుమములు బాలెంతరాద్రవోల్కి' కనిపించినవని యనిరి. వసంతములోనే, 'పసుపుపంచెడు పూలనోముపాటల'ను భావించిరి. 'కడుపులో తేనెలుగల కన్నెపూవు'లని వానిని సంబోధించిరి. తరంగిణులను 'సస్యములకు పాలిచ్చు వాత్సల్యవతులు'గా భావనచేసిరి. పున్నమరాత్రులను 'పండువెన్నెలజున్నుబాలు చేపినరే'లని భావించిరి. 'తేమొదవు'వెన్నెలపాలు పిదుకుననిరి. పండిన దానిమ్మపండ్లను దృష్టిలోపెట్టుకొని దానిమ్మకు 'పగడాలకానుపు' కలిగినట్లు చమత్కరించిరి. ఈవిధముగా వీరి నవ్యభావనలో అధికాంశము వాత్సల్యస్ఫోరకముగానే పర్యవసించినది. ఇవికాక రాత్రిని 'బుసలుగొట్టే ప్రవాహము'గా, బాష్పములను స్ఫటికమాలగా నవ్యరీతులలో భావించిరి. చుక్కలు మెరయుటకు 'మైలవిడిచిన నీలికోకను మఱల మెఱసెను పూలచుక్క'లనిరి. ఉత్సాహమును వ్యంజింపజేయుటకు 'నాల్కగూడ క్రొత్త చక్కిలిగింతల గుస్తరించి'నదనిరి. నాల్కకు చక్కిలిగింతయనుట నవ్యాతినవ్యభావము. అట్లే 'పాటలు తలాడగాగొని పవ్వళించుట', 'తలపు దీపముచూపుట', 'పలవు వాకిలి తీయుట'వంటి అపూర్వభావములను ప్రదర్శించిరి.[4]

---

1. 2, వనమాల : పుటలు : 87, 88.

3. ఈ ఉదాహరణములను ఆంధ్రావళి, జడకుచ్చులు, వనమాలనుండి గ్రహించితిని.

4. వీరు సుందరి కపోలములను తమలపాకులతో, పెదవిని దానిమ్మపూవుతో ఉపమించుట అపూర్వ విషయము.

'తమలపాకులవంటి సుందరికపోల—'
'దానిమ్మపూవంటి తరుణికెమ్మోవి.'—.

**3.** రచన : ప్రసాదమాధుర్యగుణములు గంగాయమునలవలె సంగమించిన మధురశైలి వీరిది. సంప్రదాయసిద్ధముగా కొన్ని శ్లేషలు ప్రవేశపెట్టి వానిద్వారా రచనకుదాత్తతను కలిగించి నారువీరు. ఆ శ్లేషలను పనసతొనలవలె కష్టసాధ్యములుగావు; కదళీద్రాక్షాఫలాదులవలె సుల భాస్వాద్యములు. శాఖలు చిగురించినవనుటకు వీరు 'పుల్కరించె పల్లవకులరాగరంజనమెలర్పగ కొమ్మ'లనిరి. చెట్లు ఎర్రని చిగుళ్లతొడిగినవనుటకు 'కొమ్మలుపట్టెను కుంకుమబరిణ'లనిరి. ఇవి జుమ్మనిస్ఫురించు శ్లేషలు. రెండవదానిలో శ్లేషతోపాటు చమత్కారము పెనవేసికొన్నది. కృష్ణానది యెండిపోయినదనుటకు 'జీవనశోషణల్' గనినదనుట, పరుగెత్తెడు మబ్బులను 'మింట బాఱెడు ఘనుల చాపలము'గా చమత్కరించుట, 'స్నేహనిధికి భిక్షాటనసేయుట' మున్నగునవి ఇతడు ప్రయోగించిన కొన్ని రమ్యశ్లేషలు.

రాయప్రోలువారు ప్రాచీన కావ్యరీతిని వదలక వృత్తరచనచేసినను కొన్ని సరిక్రొత్త పద బంధములను సృష్టించి తమ నవ్యతాప్రీతిని కనబరిచినారు. ఇవి కోకొల్లలుగానున్నను కొన్నిటి నైనను ఉదాహరించుట అవసరమని భావింతును.

కాంక్షాక్షీరము, బాష్పదుగ్ధముల్, భ్రమరబాల, నీరదసుత, సందెచిన్నది, నగ్నగీతములు, గర్వసౌరభము, కంటకకిరీటము, వెన్నెలపూలు, కోడెకోయిలలు, కన్నెతేనియ, కన్నెయెండ, సస్యపయస్సులు, పసితెమ్మెర, పచ్చిముచ్చటలు, పచ్చిపువ్వులు, పచ్చిముగ్గులు, పూలచెఱగులు, నింగిబాలెంత మున్నగునవి.

నవ్యులలో తెలుగునుడికారమునకు, పలుకుబడికి దారితీసినవారు రాయప్రోలువారే.[1] కడుపులోనున్న కండలు కదలుట, పుచ్చిన శల్యములు మాంసగించుట, గోచీపదల్చి వీరకాసె గట్టుట మున్నగునవి పేర్కొనదగిన నుడికారపుచిందులు.

భాషావిషయములోగూడ రాయప్రోలువారు స్వాతంత్ర్యమువహించినారని వెనుక మనవి చేసితిని.[2] మధ్యాహ్నమల్లె, బాలమామిళ్లు, బాలగులాబీలు మున్నగు మిశ్రసమాసములను, బంద మేసి, నటికేటి మున్నగు వ్యాకరణవిరుద్ధప్రయోగములను (పద్యములలో); రమణించు, మసృ

1. 'అప్పారావుగారు (గురజాడ)గాని, సుబ్బారావుగారుగాని చేసినది యేమనగా రసపుగూడైన అనేక దేశీయశబ్దాలను, నుడికారాన్ని రసవ్యంజకంగా కథలలో అతికి 'అబ్బాయీ! భాషకాయువుపట్టు ఇల్లా ప్రయోగింపబడే శబ్దం. ఇది దేశీయమైన శబ్దం. జాతియొక్క హృదయం ఈ శబ్దంలో ఆడుతుంది' అని చూపించారు. —నవ్యసాహిత్యము : విశ్వనాథ : భారతి 1940 ఏప్రిలు.

2. ఇది వీరు ఉద్దేశపూర్వకముగా చేసిన ప్రయోగమే. "కవి శబ్దప్రయోగముపట్ల తప్పక నిరం కుశుడుగా నుండవలయుననియే నా కాంక్ష."

రాయప్రోలు—ఆధునికాంధ్రసారస్వతము (వ్యాసము) : గ్రంథాలయ సర్వస్వము. సంపుటి. 1 : సంచిక. 3. 1915.

ణీకరించు; స్వదించు, కన్నెగిల్లు, తీయగిల్లు మున్నగు అపూర్వప్రయోగములను చేసి తమ నవ్యతాసక్తిని కనబరిచిరి.[1]

**ఛందస్సు :**

రాయప్రోలువారు తమ కథాకావ్యములన్నిటిలో సంప్రదాయసిద్ధమైన వృత్తములను, జాత్యుపజాతులను వాడినారు.[2] ఆంధ్రావళి, జడకుచ్చులు, వనమాల అను ఖండకావ్య సంపుటులలో మాత్రము వారనేకదేశీయచ్ఛందములను ప్రయోగించినారు.

జన్మభూమి, కీలకము, శ్రీ రవీంద్రకవి మున్నగు గీతములు ద్విపదలోనున్నను కొంచెము చివరలు లాగదీసినచో ఖండగతి (5 మాత్రల ఛందస్సు)లో సాగిపోవును. 'అడివోరి చిన్నాడు' అను గేయము అచ్చముగా ఖండగతిలో నడచినది.

'అడివోరిచిన్నాడ ! అమృతధారలవాడ
అభినందనములివే అందుకో చెలికాడ.'

'తెల్లకుచ్చులపాగ' అన్న గేయము ఇట్టిదే.

వీరు గురజాడవారి ముత్యాలసరము ననుకరించి కొన్ని గేయములు రచించిరి. అయినను వారివలె వీరు యతిప్రాసలను విసర్జించలేదు. యతియో, ప్రాసయతియో విధిగా పాటించిరి. ముత్యాలసరమనగా $3 + 4 = 7$ మాత్రలతో నడచు మిశ్రగతియేయని వెనుకనే తెలిపియుంటిని. వీరి ముత్యాలసరములలోనుండి మచ్చునకొకటి.

'వెండిగొలుసులు-లంకెవేసి ప్ర
చండమగు నీ నీలితెరలను
తూర్పువాకిలి తలుపు రెక్కల
తొలగలాగెదరెవ్వరో.' (ప్రభాతము)

---

1. 'విపంచికాలత' అను సమాసమున 'లత'ను వీణతీగ అను అర్థములో ప్రయోగించుట క్రొత్తయే.
2. వృత్తములలో వీరు క్రొత్త ప్రయోగములేమి చేయలేదు. కాని 'ధ్వన్యాలోకము' (అనువాద పద్యముల)లో మాత్రము కొన్ని యతిప్రాసలులేని పద్యములు రచించిరి.

"సుకవుల్ కొందఱు నవ్యదృష్టిని రసావర్తంబు గావించి వో
యిన వాంఛావిషయార్థముల్ నయవిపశ్చిద్వాణి నగ్గించుచున్
నిరతక్రాంతులమైతి మీభువనవైచిత్రీ వశాసక్తిమై
తులసీతోషణ ! నీదుభక్తి సమసౌఖ్యంబబ్బదయ్యెన్‌గదా." —జడకుచ్చులు.

ఈ మధ్యనే వీరు కాళిదాసు మేఘసందేశమును దూతమత్తేభము అనుపేర యతిప్రాసలులేకుండ మత్తేభవృత్తములలో అనువదించినారు. యథామూలముగా ఉండుటకే వీరు ఈ రీతినవలంబించినారు. యతిప్రాసలులేకుండ మొత్తము కావ్యమే రచింపబడుట కిదే ప్రథమమనుకొందును.

వీరి ముత్యాలసరములలో ఏ పాదమునకాపాదము విడిపోదు. పద్యములోని రీతియే వీరు గేయములో ప్రవేశపెట్టిరి.

"కాలనాటకమందు ప్రథమాం
కమున సుకవి ఉషఃప్రవేశము"
"ఈ మహోత్సవ మధుమదపదభి
రామసూక్తము——————" (ప్రభాతము)

ఈ విధముగా ఒక పాదములోనికి మరియొక పాదము చొచ్చుకొనిపోవుటయేకాక శిథిలబంధము లేని దృఢశయ్య వీరుసాధించినారు. గేయములోగూడ 'ఈ మహోత్సవమధుమదపదభిరామ సూక్తము'వంటి సుదీర్ఘ సమాసములు, ఆశానితంబిని, కాళవక్త్రము, రక్తామిషమువంటి ప్రౌఢ పదబంధములను ప్రయోగించినారు. గేయమునకు పద్యములోని ప్రౌఢత్వమును తీసికొనివచ్చిన ప్రథమనవ్యకవి రాయప్రోలువారే. అట్లని సరళమధురమైన గేయములు వీరు రచించలేదనికాదు. 'ఎవరు' (జడకుచ్చులు) అను ఖండకావ్యములో జానపదగేయవాసనగల 'భామపదము'ను ప్రవేశపెట్టినారు.

"పున్నమ జాబిలి నోభామా
పూచినవేళల నోభామా
నెవ్వగ తారలు నోభామా
నిదురింపని నిశి నోభామా."

ఇది 4 మాత్రల గణముల చతురస్రగతిలోనున్న పాట. ప్రతిపాదముపిమ్మట 'భామా'అనుపదము పునరుక్త మగుట దీని విశిష్టత.

వీరు చతురస్రగతిలో వ్రాసిన కొన్ని గేయములలో ముత్యాలసరములోవలె చివరిపాదములో కొన్ని మాత్రలు తగ్గించివ్రాసినారు. ఇదియును గురజాడ ఒరవడియే (చూ. పూర్ణమ్మ). కాని వీరువ్రాసిన ఒక్కగీతముమాత్రము సమపాదముగా చతురస్రగతిలో కనిపించుచున్నది.

'పదవేచెలి, కాళ్ళగజ్జియల్
రవళింప వెదుళ్ళ పల్లికిన్
తొలిప్రొద్దుల చల్దియన్నముల్
తిని త్రిమ్మరవచ్చు స్వేచ్ఛగా.' (వనమాల)

దీనిని రాయప్రోలువారు 'విజ్ఞాపన'లో వియోగినీవృత్తమనిరి. నిజమే. పదవే + చెలి + కాళ్ళ + గజ్జియల్; ఈ విధమైన విరుపులతో చదివినచో ఇది వియోగినీ వృత్తమేయగును కాని ఇంకొక

విధముగా విరిచినచో ఇది అచ్చమైన చతురస్రగతిలోనికి వచ్చిపడును. క్రింది విభజన గమనించుడు.

'పదవే + చెలికా + ళ్ళగజ్జె + యల్ (తక)
రవళిం + పవెదు + ళ్ళపల్లి + కిఞ (తక)

ఈ పద్ధతిలో ఇది 4,4 మాత్రలుగ విరిగి లయదప్పకుండ నడచినది. చివర మాత్రము రెండు మాత్రలు లోపించినవి. ఈ విధముగా ఈ గేయమంత విడదీసి చూపవచ్చును. కాబట్టి దీనిని చతురస్రగతిలో చేర్చితిని. ఈ గతిలోనే గతివైవిధ్యము సాధించిన ఇంకొక గేయమున్నది.

"ఉగాదిప్రొద్దున ఉత్సవములలో
మనోరథాల్ మధుమయ పథమంటగ
ప్రియమ్ముగా నినుపిల్తుము రావోయ్
నవీన వత్సరనాథ మన్మథా."[1]

ఇందులో ప్రతిపాదము మొదట 'జగణము'వంటి మాత్రల కూర్పువలన నడకలో ఉద్ధతి సాధింపబడినది. శ్రీ శ్రీ 'హలాలనన్నీ పొలాలదున్నీ'అను గేయములో ఈ నడకయే కలదు.

ఖండగతిలో సాధారణముగా ప్రతిపాదములో 5 + 5 + 5 + 5 = 20 మాత్రలుండుట చూడనగును. వీరును ఇట్లే వ్రాసినారు. 'ఈ గీతము'[2]అను గేయములో మాత్రము మొదటి నాలుగు పాదములు 20 మాత్రలతో వ్రాసి తర్వాతి 4 పాదములు 10, 10 మాత్రలతో రచించినారు. అనగా ఈ గేయములో ప్రతి Stanza లో 8 పాదములుండును. మొదటి నాలుగు ఒక్కొక్కటి 20 మాత్రలవి, తర్వాతి నాలుగు ఒక్కొక్కటి 10 మాత్రలవి. 'ఈ గీతము' 1910 లోనే రచింపబడినది. ఇది వారి మొట్టమొదటిగేయమని రాయప్రోలువారు నాతో అన్నారు. ఇంకొక గీతము, 'చిల్క'అనునది ఈ ఛందస్సులోనేయున్నది. దానిలోగూడ గతివైవిధ్య మున్నది. దానిలో మొదటి మూడుపాదములొక్కొక్కటి 10 మాత్రలతో నడచును. చివరిపాదము (నాల్గవది)లో మాత్రము 20 మాత్రలుండును. ఇంచుమించుగా ఇది పై గేయమునకు ప్రతిలోమముగా నున్నది.

"పుట్టింది ఒకచిల్క
పొలము పచ్చలపైట
పొరలు వాకలనాట
అల్లారు ముద్దుగా—అందాల హద్దుగా." (ఆంధ్రావళి)

1. రాయప్రోలువారి 'అముద్రిత' గేయములనుండి గ్రహించితిని.

2. వనమాల.

ఇందు మొదటి రెండు పాదములకు యతినియమున్నది. రెండు, మూడు పాదములకు అంత్య ప్రాసనియమమున్నది. 4వ పాదములోగూడ 2వ గణమునకు (ముద్దుగా) 4వ గణమునకు (హద్దుగా) అంత్యనియమమున్నది. నాల్గవపాదములో యతికూడ పాటింపబడినది. ఈ విధముగా ఇన్ని నిర్బంధములతో మొత్తము గేయము మొక్కవోకుండ నడచినది. ఇది 1910 లోనే రచింపబడినది. ఈ రెండు గేయములలోని గతిప్రభావము 'కిన్నెరసాని'లోని కొన్ని పంక్తులపై నున్నది. ముఖ్యముగా

"నాదమై స్వరపరిచ్ఛేదమై తాపాప
నోదమై నవరసాస్వాదనామోదమై
లలితంబుగా ప్రియావళితంబుగా సుధా
మిళితంబుగా నభోగళితంబుగా రాలి" —'ఈ గీతము'

వంటి పాదములలోని అనుప్రాసలు 'కిన్నెరసాని'లో అడుగడుగున కనిపించును. అట్లే 'చిల్క' లోని 'పుట్టింది ఒక చిల్క, పెరిగింది ఆ చిల్క, త్రావింది ఆ చిల్క, పల్కింది ఆ చిల్క' వంటిప్రతి Stanza ముందటి పాదములు, 'చల్లవెన్నెలరేల, చందమామలమోల'వంటి అంత్య నియమముల ముక్తాయింపుల ముద్ర 'కిన్నెరసాని'లో బహుళముగా కనిపించును.

ఈ విధముగా రాయప్రోలువారు మాత్రాచ్ఛందస్సులో చక్కని ప్రయోగములు చేసినారు. భావకవులు పలువురికి వీరి పద్యరచనతోపాటు గేయరచన ఆదర్శమైనది; అనుకార్యమైనది.

## దేశభక్తి కవిత్వము

తెలుగులో దేశాభిమానకవిత్వము, జాతీయగంధముగల ప్రబోధకవిత్వము ఈ శతాబ్ది ప్రథమపాదములోనే ప్రారంభమైనను దానికి రాయప్రోలువారి కృతులలోనే సమగ్రస్వరూప మేర్పడినది. రాయప్రోలువారికిముందు దేశభక్తికవిత్వమున కెవరు బీజావాపముచేసిరో, దాని క్రమవికాసమెట్లుజరిగెనో 'భావకవిత్వప్రకరణము'లో విపులముగా, సోదాహరణముగా పరిశీలింప వలసియున్నది. ఈ కవిత్వమున కగ్రేసరత్వము వహించిన రాయప్రోలువారిగురించి సంగ్రహముగా ముచ్చటించుటయే ప్రస్తుతోద్దేశము. వీరు 1914 లోనే 'అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు' మున్నగు పద్యములురచించిరి. ఈ పద్యములను నెల్లూరులో జరిగిన ఆంధ్రమహాసభలో ఆంధ్రరత్న దుగ్గిరాలగోపాలకృష్ణయ్యగారు ఘంటాఘోషముగా చదివి వినిపించగా, సభ్యజనము సాగరసదృశముగా పొంగిపోయినదట. అంతకు ముం దాంధ్ర రాష్ట్రమువిషయములో పరస్పరభిన్నాభిప్రాయములతో కీచులాడుకొను నాయకు లీపద్యములచేత ప్రబోధితులై ఏకీకృతులైపోయిరట. ఈ విధముగా 1914 లో ప్రారంభమైన రాయప్రోలువారి దేశభక్తికవిత్వము రెండుమూడు దశాబ్దములపాటు బహుముఖములుగా విజృంభించినది. 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీ తల్లిభూమి భారతిని'వంటి గేయములలో వీరు భారత

జాతీయభావమును ప్రబోధించిరి. 'చావలేదు చావలే దాంధ్రజనమహోజ్జ్వల చరిత్ర'యని ఆంధ్రాభిమానమును వ్యక్తమొనర్చిరి. 'తెనుగుతల్లి'అను శీర్షికతో భిన్నప్రాంతములలో విడివడి యున్న ఆంధ్రులసమైక్యమును సూచించిరి. 'ఆంధ్ర'అను శీర్షికక్రింద 'రాష్ట్రాభిమానమును చాటిరి. 'తెనుగుమాన్యము'అను శీర్షికక్రిందగల పద్యములలో ఆంధ్రభాషాప్రాశస్త్యము నుగ్గడించిరి. 'తెనుగుతల్లి'అను పదమును మొదట ప్రయోగించినది వీరే. 'తెనుగువాణి', 'తెనుగు కత్తి', 'తెనుగు భూమి' మొదలైనవాని వెనుకగల ఆంధ్రజాతీయావేశమునకు దారులు తీసినది వీరే. తెలుగునదులను, తెలుగురాజుల శౌర్యపరాక్రమములను, తెలుగుసిరిని స్ఫుటమైన రేఖలతో చిత్రించిన ప్రథములువీరే. ఈ విధముగా నాదేశము, నాజాతి, నాభాషఅన్న ' అహంకార దర్శనము' నాంధ్రులలో కలిగించిన దేశభక్తికవిత్వమును వెలయించి, ఆ శాఖకాచార్యత్వము వహించినవారు రాయప్రోలువారు.

### ప్రకృతి కవిత్వము :

నవ్యకవులు ప్రకృతినేవిధముగా వర్ణించిరో, ప్రకృతికి కవికిగల సంబంధమేమియో రానున్న ప్రకరణములో వివరముగా పరిశీలింతును. రాయప్రోలువారు ప్రకృతివర్ణనలకెట్లు పాదులువేసిరో ప్రస్తుతవక్తవ్యాంశము. వీరు'లలిత'లో చేసిన ప్రకృతివర్ణనలు చాలభాగము ప్రబంధ గంధమున్నవే. తృణకంకణాదులలో ప్రకృతి యేవిధముగా వర్ణితమైనదో ఇంతవరకే ఆయా సందర్భములందు వివరించితిని. 'కష్టకమల'లో ప్రకృతి నిసర్గరమ్యముగా వర్ణింపబడినది.

ఒక చిన్నపల్లె. దానిలో తాళదళీకుటీరములు, అందులో ఒక యిల్లు. ఆ యింటిలో 'లేదీగెల పూలపోకడల తిన్ననయైన యనంటిచాలులు'. ముత్తెపుదండవలె ఏగెడి 'పౌడుపుటీలు', 'నిగనిగలెగయు కన్నెచిగుళ్ళ గుత్తుల నీడలారెడు చిఱునిమ్మచెట్లు', 'పురివిచ్చినట్లు చిమ్ముల కొమ్మపందిళ్లుసాచు కుమారరసాలతరులు', చువ్వలవలె ఎదిగిన పోకచాళ్ళు, పున్నాగమొక్కలు, వెదురులు, గున్నగోరంటపొదలు, పోకలను కౌగిలించు తాంబూలలతలు, పందిరులనెక్కు లేత ద్రాక్షవల్లికలు, చేమంతిమడులు, బంతిపూల కుదురులు, మధ్యాహ్నమల్లికలు, కాశీరత్న లవలికలు... ఈ విధముగా తెలుగుపల్లెలలోని ప్రకృతిని చక్షుర్గోచరమైన రీతిలో (స్వభావ సిద్ధముగా) వస్త్వాశ్రయ (Objective) ధోరణిలో వీరు చిత్రించిరి.

'తెనుగుతోట' తెలుగుదేశమును, తెలుగునాడులోని ప్రకృతిని చిత్రించిన కావ్యము. ఈ కావ్యములో 'ఆవాహన' అన్న శీర్షికక్రింద సెలయేరును, గొల్లపిల్లను, లేళ్ళను, కొమ్మలను, పువ్వుల నుద్దేశించి చక్కని భావనచేసిరి. ఐదవ ఖండములో బువ్వదుత్త నెత్తినబెట్టికొనిపోవు 'రవికదొడుగని గొల్లకుఱ్ఱ'దానిని, ఒడిసెల వలెవాటుగాతాల్చి పొలముకాచుటకేగు కాపుకూతురును మనోహరముగా వర్ణించిరి. స్థూలముగా ప్రకృతికవిత్వమనిపించినను ఈ కావ్యము అన్యాపదేశముగా రచింపబడినట్లున్నది. 'పాడవమ్మ గీతాసఖీ భావపదము' అన్నదానిలోనే చమత్కారమున్నది. 'గీతాసఖి'లో 'గీత'యనగా వట్టిపాటకాదు. ఇందులో భగవద్గీతాస్ఫురణ

మున్నది. అనగా ఈ కావ్యములో వ్యంగ్యముగా నిద్రాణజాతికి సంబంధించిన ప్రబోధమున్నదని గ్రహింపవలెను. మొదటి ఖండములో 'నిదురనెలతలునచ్చిరి నిదురలేప' అను పద్యమున జాతికి నిద్రావస్థపోవలెనని సూచించిరి మూడవ ఖండములో

"భయపడంబోకు, ముందంజ పాయజనదు
తోడిబిడ్డల సావాస మీడదగదు
— — — —
పొడుచుచున్నది తూరుపుకడన ప్రొద్దు
లేచిరావమ్మ ! మా తల్లి లేచిరమ్మ"

అను పాదములలో పర్ణవ్యత్యాసనిరసనము, ఆశాసందేశము, స్వాతంత్ర్యప్రబోధము గర్భితముగా నున్నవి'. అట్లే ఐదవ ఖండములో

"తల్లిపాలుద్రావిన మహోత్సాహపూర్తి
పెనగి చెర్లాటలాడెడు పెంపుమిగుల
ఇరుగుపొరుగులేగల క్రీడ లరయవమ్మ"

అను పంక్తులు కేవలము ప్రకృతికవిత్వమువలె కనిపించినను, వీని వెనుక ఇతర దేశములు జాగృతమైనవన్న విషయము ధ్వనించుచున్నది. ఆరవ ఖండములో

"తేనెవంచుకపోయెడు మౌనపరుల
పత్రముల నూడ్చుకొనెడి యుపాయమతుల
— — — — —
తెలియగాలేడు తోట నేవలనగాచు
లేచిరావమ్మ ! మా తల్లి లేచిరమ్మ"

అను పాదములలో మన సంపద నేవిధముగా ఇంగ్లీషువారు కొల్లగొట్టుకొని వెళ్ళిపోవుచున్నారో సూక్ష్మముగా ధ్వనింపజేసినారు. ఈరకముగా ప్రకృతికవిత్వముద్వారా అన్యాపదేశముగా జాతీయప్రబోధముచేసిన కావ్యమిది.

### సంఘసంస్కరణ కవిత్వము :

గురజాడవారితోపాటు రాయప్రోలువారుగూడ సంఘసంస్కరణ కవిత్వము రచించుటలో మార్గదర్శకులు. 'స్నేహలత' వరశుల్కనిరసనకై రచించిన కావ్యము. గురజాడవారి 'పూర్ణమ్మ' ఇట్టిదే. వీరప్పుడప్పుడు రచించిన ఖండకావ్యములలో కొన్ని ఎప్పటికప్పుడు సమాజములోని దురాచారములను ఖండించుటకువ్రాసిరి. 'ధాన్యముదోచీ, ధనమును పాతీ

లోకమునంతా వ్యాకులపెట్టే' హింసామార్గమును మార్చవలసిన అవసరము నుద్ఘాటించిరి. 'జాతివిద్వేషాలతో' మారణకృత్యములకు పాల్పడుచున్న జాతీయులకు శాంతిభిక్ష పెట్టవలసిన అవసరమును గుర్తించిరి.[1] వీరు సంఘ సంస్కరణ కవిత్వము నెక్కువగా వ్రాయక పోయినను ఈ శాఖలో వీరి 'స్నేహలత' మకుటమువంటిదని చెప్పవచ్చును.

### సాంప్రదాయికత :

రాయప్రోలువారు మొదట సాంప్రదాయికమైనరీతిలో సంస్కృతాంధ్రములనభ్యసించి క్రమక్రమముగా ఆంగ్లకవిత్వమర్యాదలను ఆకళించుకొనిరి. అందువలన వీరెన్ని క్రొత్తరీతులను ప్రవేశపెట్టినను, స్వచ్ఛందప్రయోగములను చేసినను, పూసలలో దారమువలె వీరిని సాంప్రదాయికత విడువలేదు. వీరి రమ్యాలోకము, మాధురీదర్శనము ఉపనిషదుక్తులను, ధ్వన్యాలోకము, లోచనము మున్నగు లాక్షణికోక్తులను పుక్కిటబెట్టుకొన్న మీమాంసాకావ్యములు. ఇక ఇంగ్లీషు వాసన తోపింపజేయు 'కుశలమేనెచ్చెలీ ! అనుకూల పవనమోహనమ్ముశలేదినములు' (How is weather) వంటి వానిలోగూడ సాంప్రదాయికవాసన లేకపోలేదు. ఈ పంక్తులను వెనుకకుతిరిగి పరిశీలించగా 'శాంతానుకూల పవనశ్చ' అన్న శాకుంతలములోని మాటలు స్ఫురించును. అయినను కొన్ని సాంప్రదాయికముగా అనిపించినను, అత్యంత నవ్యములైన ప్రయోగములు. 'నీరదసుత' ప్రయోగమట్టిదే. 'నీరదసుత' యనగా మేఘకుమారియని అర్థము. మబ్బునకు ప్రాచీనకవులు స్త్రీత్వమూహింపలేదు. మేఘుని పురుషుడుగా విద్యుల్లతను స్త్రీగా చెప్పుటయే సంప్రదాయము.[2] వీరు మేఘమునకు కుమారీత్వము కల్పించుట నవ్యత. 'జలదాంగన'వంటి తరువాతి కవుల ప్రయోగములకు వీరే మూలము.

'కష్టకమల'లోని వైదికవాతావరణము, 'స్నేహలత'కావ్యమున, గంగాతీరమున జరిగిన సంభాషణములోని ఆర్షవాతావరణము, వీరి సాంప్రదాయికతకు నిదర్శనములు. ఒకటి రెండుచోట్ల తప్ప కవిసమయముల విషయములో వీరు సాంప్రదాయికతనే కనబరిచిరి.

### ఇతరకవుల ప్రభావము :

సంస్కృతకవులలో కాళిదాసు, భవభూతి రాయప్రోలువారిపై ప్రభావమువేసిరి. లాక్షణికులలో ఆనందవర్ధనుని ప్రభావమున్నది. ఇంగ్లీషుకవులలో 'సరళపదవిరళార్థవిస్ఫురణము'

---

1. 'ఏమేమొ పాడేవు' అను గేయములో.

2. "ఏతత్కృత్వా ప్రియమనుచిత ప్రార్థనావర్తినో మే
సౌహార్దాద్వా విధుర ఇతివా మయ్యనుక్రోశబుద్ధ్యా
ఇష్టాన్ దేశాన్ విచర జలద ప్రావృషా సంభృతశ్రీ
ర్మా భూదేవం క్షణమపిచతే విద్యుతా విప్రయోగః"

—మేఘ సందేశము (ఉత్తరమేఘము)

నందు, ప్రకృతిచిత్రణమునందు, వర్డ్సువర్తు వీరికి ప్రథమదర్శకుడు. వీరి మాధురీదర్శనమునకు రాబర్ట్ బ్రిడ్జెస్ (Robert Bridges) వ్రాసిన 'Testament of Beauty' అను గ్రంధమునకు, ఆనందసౌందర్యములద్వారా పరబ్రహ్మము నందుకోవచ్చునను అభిప్రాయములో మాత్రము పోలికలున్నవి షెల్లీ వ్రాసిన 'To a skylark' ప్రభావముతో రాయప్రోలువారు 'కోయిల' అను పద్యములు రచించిరి.[1] ఇది కొంతవరకు షెల్లీగేయమున కనుసరణమనియే చెప్పవచ్చును. దాని ప్రభావముతో రచించినట్లు రాయప్రోలువారు చెప్పుకోలేదు. Skylark ను షెల్లీ ఆనందమునకు, స్వేచ్ఛావిహారమునకు సంకేతముగా స్వీకరించెను. రాయప్రోలువారు 'నేత్రములకు కానరావు మధురమ్ముగ పాడెదవెందు కోయిలా'యని, 'మాధురీధురీణసారళ్యసంప్రీణనమ్ము క్రుమ్మరించెదు నీగీతి'యని కోకిలను సంబోధించిరి.

ఇంతకుమించి రాయప్రోలువారిపై ఇతరాంగ్లకవులప్రభావ మంతగానున్నట్లు కనిపించదు. 1916,17 సంవత్సరములలో వీరు శాంతినికేతనమున రవీంద్రుల సాక్షాత్ శుశ్రూషలో నుండిరి. అంతకుముందే రవీంద్రుని యనువాదములను చదివి వారి రచనలచేత ప్రభావితులై యుండిరి. 1909,10 ప్రాంతములలోనే రవీంద్రుసిగీతములు యథాతథముగా 'ఆంధ్రభారతి'లో ఇతర పత్రికలలో ప్రచురింపబడుచుండెడివి. వానిలోని తత్సమపదములనుజూచి తెలుగుకవులు ప్రభావితులై యుండిరనుకొనుటకు వీలున్నది. రాయప్రోలువారును ఆ విధముగాను, అనువాద మూలముగను, రవీంద్రునిరచనలు కొన్ని చదివినను, శాంతినికేతనమున కేగినపిమ్మటనే వారి రచనలపై రవీంద్రుని ప్రభావము గాఢముగా ప్రసరించినది. రవీంద్రుని సౌందర్యార్చన రాయప్రోలువారిని ముగ్ధులనొనర్చినది. సృష్టి ప్రేమమయమన్న రవీంద్రభావము వీరిపై ప్రభావము వేసినది. సుఖదుఃఖములు ప్రాణికి సహజములైనను, మానవుడు దుఃఖమునకు లొంగిపోక ఆనందధామమువంక ప్రస్థానించవలెనన్న రవీంద్రతత్త్వమునే రాయప్రోలువారు తృణకంకణములో, లక్షణ గ్రంధములలో ప్రతిపాదించిరి. రవీంద్రునిరచనలకనువాదములని స్పష్టముగా వీరు చెప్పుకొన్నఖండిక 'వసంత'మొక్కటే.[2] ఇదికాక 'సంక్రాంతి'యను గేయముపై వ్యావహారిక పదప్రయోగవిషయములో రవీంద్రుని ప్రభావమున్నదని రాయప్రోలువారే నాతో అన్నారు. 'బుద్ధభిక్ష'[3]లోని కథ రవీంద్రుడు వ్రాసిన 'శ్రేష్ఠభిక్ష' అన్నగేయములోనిది, 'పాలబాన'[4]పై రవీంద్రుని భావనాప్రభావమున్నది. సఖీసంవరణము'[5]పై, 'మరచిపోతేనేమిలే'[6] అన్నగేయముపై వంగభాషలోని 'వైష్ణవపదావళి'లోని మధురభక్తితత్త్వరేఖలున్నవి. వీనిలో సఖీసంవరణముపై గీతాంజలిలోని ఎనిమిదవగీతము, ఇరువదిఆరవ గీతము ప్రభావము రేఖాప్రాయముగా కనిపించుచున్నది. గీతాంజలిలోని ఈ రెండుగీతములలో భక్తుడు (ప్రేయసి) భగవంతుని (ప్రియుని) కొరకు చేసిన నిరీక్షణము చిత్రింపబడినది. భక్తుడు భగవంతుని కొరకు నిరీక్షించగా అతడెంతకు రాలేదు. కొంతసేపటికతని పదధ్వను లింటిముంగిట వినిపించినవి.[7] ఈ భావమే కించిద్భేదముతో

1. జడకుచ్చులు. 2, 3, 4. ఆంధ్రావళి. 5. జడకుచ్చులు. 6. వనమాల.

7. 'I have not seen his face, nor have I listened to his voice; only I have heard his gentle footsteps from the road before my house'. —Gitanjali: 18వ గీతము.

'బేలతనంబున వేచిననాడు
నాచాయ రాదేమి నానాయకుండు' (జడకుచ్చులు)

అని రాయప్రోలువారి కవిత్వములో తొంగిచూచినది. 'వాకిటపొంత నావల్లభుడుండ చూచి సైపగలేదె సుదతి నామనసు' అన్నపంక్తులలో ఈ భావమే మందహాసముచేసినది. అట్లే గీతాంజలిలోని

'He came when the night was still; he had his harp in hands; and my dreams became resonant with its melodies'[1]

అను పంక్తులలోని అభిప్రాయమే ఇంకొకవిధముగా రాయప్రోలువారి

'— — —దీపము తీసి
శయనింపబోయెడు సమయమునందు
చోటిమ్మనుచు సోలుచునువచ్చు సఖిరా'[2]

అను పాదములలో వ్యక్తమైనది. రవీంద్రుని గేయములో భక్తుడు ఎదురుచూచి ఎదురుచూచి నిద్రించుచుండగా ప్రభువు వచ్చును. రాయప్రోలువారి రచనలో ఎదురుచూచి ఎదురుచూచి విసిగి నిద్రించుట కున్ముఖుడగుచుండగా ప్రభువు వచ్చును. ఇంతే భేదము. కాని ఈ రచనలో రవీంద్రునితత్త్వము స్పష్టముగా కనిపించును.

### అనంతర కవులపై రాయప్రోలువారి ప్రభావము :

రాయప్రోలువారి ప్రభావము అనంతరకవులపై ఏ విధముగా ప్రసరించినదో ఇంతవరకే అక్కడక్కడ సూచించితిని. పద్యములలో లఘుకథాకావ్యరచనకు వీరే మార్గదర్శకులు. అబ్బూరివారి 'మల్లికాంబ' వీరి ఒరవడికలదే. కావ్యములలో తెలుగుదేశము వాతావరణమును చిత్రించుటకు వీరే త్రోవచూపినారు. పింగళి కాటూర్ల 'తొలకరి'లోని ప్రకృతికవిత్వమునకు, జనపదజీవనచిత్రణమునకు వీరే మూలపురుషులు. దేశభక్తికవిత్వమునకు రూపముదిద్దినది వీరేయని వెనుక మనవిచేసితిని. వీరి ప్రభావముతోనే విశ్వనాథవారి 'ఆంధ్రప్రశస్తి', 'ఆంధ్ర పౌరుషము', కొడాలివారి 'హంపీక్షేత్రము' మున్నగు కావ్యములు వెలువడినవి. మేఘము, కోకిల మున్నగు ప్రకృతిసంబంధమైన అంశముల నుద్దేశించి 5,10 పద్యములతో రసవత్కవిత్వము చెప్పుటకు వీరే మార్గదర్శకులు. భావకవులలో పలువురు వీరిచేత ప్రభావితులై కోకిలపై, మేఘముపై పద్యములు రచించిరి. వీరి 'ప్రవాసరాధిక'లోని పద్యములు రాధాకృష్ణుల ప్రణయ తత్త్వచిత్రణకు మూలరచనలు. ఈ పద్ధతిలోనే వేదుల, కృష్ణశాస్త్రిగార్లు మనోహరమైన పద్యములు రచించిరి. 'విరహవీధి'లోని

1. 26 వ గీతములోని భాగము.
2. 'జడకుచ్చులు'లో 'సఖీసంవరణము'.

'హేమపాత్రల చందన మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి హారములను
సానలందింకె స్నానకషాయగంధ
మబల ! యెవనికోసము సగమయి తపింతు' (జడకుచ్చులు)

వంటి పద్యములు 'వాసకసజ్జిక' నుద్దేశించి రచింపబడినవి. ఈ పద్యరీతి భావకవులలో పలువురికి ఒరవడియైనది.

'పిలుపు'అన్న శీర్షికక్రింద రాయప్రోలువారు రచించిన పద్యములు 'విరహవిషాద' కవిత్వమునకు బాటలువేసినవి. ఆత్మాశ్రయరీతిలో విరహబాధలను వ్యక్తముచేసిన పద్యములివి.

'నిశలు పులకించె, కనులకు నిదురరాదు
పైదలీ ! యేమిటికి నన్ను బాధపెట్ట ?
ఏ పొదల దాగిపాడె దీ హృదయదళన
దారుణములైన నగ్నగీతమ్ములెత్తి.'

ఈ పద్యములోని భావతీవ్రతను కృష్ణశాస్త్రి, వేదుల, నాయని మున్నగువారు సొంతముచేసికొని, ఎన్నో విషాదకావ్యములను రచించిరి. ఈ ఖండికలోనేయున్న

"నా విరహగంధగీతి కన్వయముచెప్ప
శిరసులెత్తుచునున్నవి చిగురుపొదలు.
నవ్వుచున్నది కడల నందంపుసందె
కావిరంగుల రంగైన మోవివిరిచి"

అను పద్యములోని కవిహృదయావస్థకు ప్రకృతికిగల సంబంధము చిత్రించురీతి-తరువాతి భావకవులకు శిరోధార్యమైనది.

'అమరావతీ పట్టణమున'వంటి సీసపద్యములలోని పదశిల్పము, వాక్యశిల్పము, ఎత్తుగడ విశ్వనాథ, జాషువా, తుమ్మల మున్నగువారి జాతీయకావ్యములలోని పద్యరచనపై ప్రభావము వేసినవి. వీరి నుడికారపుసొంపు జాషువా, తుమ్మల మున్నగువారిని ప్రబలముగా ఆకర్షించినది. ఒకవస్తువును సంబోధించుచు ప్రతిపద్యమున ఒక్కొక్కరీతిగా సంబోధనములు గుప్పించుట జాషువా, తుమ్మల మున్నగువారి కావ్యములలో చూడనగును. దీనికి రాయప్రోలువారే దారి చూపినవారు. 'పులియాకు'ను సంబోధించుచు 'పులియాకు విస్తరీ'యని, 'పులియాకు బిత్తళీ'యని, 'పత్త్రావళీ'యని భిన్నరీతులలో సంబోధించి చమత్కారమును కలుగజేసిరి. జాషువాగారి 'గబ్బిలము'లో పక్షినుద్దేశించి అనేక సంబోధన లీధోరణిలోనేయున్నవి. బ్రతికియున్నవారిపై ప్రశంసా

పద్యములు, మరణించినవారిపై స్మృతిగీతములు వ్రాయుటలో రాయప్రోలువారు మొదటివారు కాకున్నను, ఈ మార్గమునకు పట్టుకలుగజేసినవారు. దేశనాయకులనుగూర్చి (గోఖలే మున్నగు వారు), కవులనుగూర్చి (సరోజిని, శివశంకరశాస్త్రి మొదలగువారు), వీరులనుగూర్చి (కోడిరామ మూర్తి మొదలగువారు) వీరు ప్రశంసాపద్యములను రచించి తరువాతివారికి వస్తువైవిధ్యము చూపిరి. ఇంకను హిందీలోని 'మీరా' గీతములకు, సంస్కృతములోని 'సౌందర్యలహరి' వంటి వానికి అనువాదములు రచించి ప్రక్రియాబాహుళ్యము నందించిరి. ఈ విధముగా వస్తుభావరచ నలలో అనేక నవ్యమార్గములు చూపి ఇంగ్లీషు కాల్పనికకవిత్వములోని కొన్ని రీతులకు, వంగ వైష్ణవ సంప్రదాయములకు, అమలిన శృంగారాది నూత్నసిద్ధాంతములకు, కథాకావ్యాది బహు విధప్రక్రియలకు, దేశభక్తికవిత్వాదిప్రబోధకవిత్వమునకు మార్గదర్శకులైన కవీంద్రులు రాయప్రోలువారు.

ఇంతటితో ఆధునికాంధ్రకవిత్వయుగకర్తలిరువురిని గురించిన పరిశీలనము ముగిసినది. ఇక నవ్యకవిత్వములో 3, 4 దశాబ్దులపాటు వెలుగొందిన భావకవిత్వమునుగూర్చి, దాని వివిధ శాఖలనుగూర్చి విపులముగా చర్చింతును.

# భావ కవిత్వము

ఇంతవరకు గురజాడ రాయప్రోలులతో ప్రారంభమైన నవ్యకవిత్వ లక్షణములను, దాని కీయిరువురు యుగకర్తలు కలిగించిన వికాసస్ఫూర్తిని వివరించియుంటిని. స్థూలదృష్టితో చూచినచో ఈ నవ్యకవిత్వములో తాలోత్తాలమైన ఉద్యమములు రెండేరెండు. ఒకటి భావ కవిత్వము; రెండవది అభ్యుదయకవిత్వము. అధివాస్తవికకవిత్వము మున్నగునవి కొంతవరకు అభ్యుదయకవిత్వములో అంతర్భవించునవే. పై రెండుద్యమములలో భావకవితోద్యమము దాదాపు మూడు దశాబ్దములపాటుగా ఆంధ్రసాహిత్యకేదారమున పసిడిపంట పండించినది. శేషాద్రిరమణకవులు, కొమండూరి కృష్ణమాచార్యులువంటి ప్రాచీనపక్కికి చెందిన విద్వత్కవులుగూడ భావకవిత్వమును స్పృశించిరి. కావ్యవ్యాకరణతీర్థులగు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారివంటి విద్వద్విమర్శకులు దీనిని శాస్త్రీయదృష్టితో సమర్థించిరి. అభ్యుదయ కవిత్వ యుగకర్తయైన శ్రీశ్రీగారుసైతము తొలిరోజులలో అసంఖ్యాకముగా భావకవితాఖండికలు రచించిరి. 1940 లోపల కలముపట్టినవారెవ్వరును దీని ముద్రను తప్పించుకొనలేకపోయిరి. ఒక్కమాటు భావకవితావిహాయసమును పరికించినచో రాయప్రోలు, విశ్వనాథ, వెంకటపార్వతీశ్వరులు, కృష్ణశాస్త్రి, దువ్వూరి, బసవరాజు, నండూరి, వేదుల, నాయని, పింగళి, కాటూరి, జాషువా, తుమ్మల, తల్లావఝ్ఝల, బాపిరాజు మున్నగు కవినక్షత్రములు అక్షరకాంతి వృష్టిని కురియుచు కనిపించును. వీరిలో ఎల్లరు సంస్కృతాంధ్రసారస్వతములను, కొందరు వీనితో పాటు ఆంగ్లసాహిత్యమును మథించినవారే. అలవోకగా చదివి వదలినవారుకాక ఒంటబట్టించుకొన్నవారే. ప్రతిభావ్యుత్పత్తులలో గరీయసయైన ప్రతిభ వీరిలో పలువురిలో అగ్రేసరముగా నున్నది. దాని కనురూపమైన వ్యుత్పత్తికిని ఏ మాత్రము లోటులేదు. ప్రతిభావ్యుత్పత్తులను సముచిత ప్రమాణమున జీర్ణించుకొని రచనలుచేసిన నవ్యకవులలో భావకవులకే ప్రథమ తాంబూలము. పైని పేర్కొనబడిన కవులీభావకవిత్వములోని వివిధశాఖలకు ప్రతినిధులవంటివారు. వీరుకాక ప్రతిభామహితమైన భావకవిత్వమును వెలయించిన కవులు పరశ్శతముగా నున్నారు. సమానలక్షణములున్నవారినందరిని పేర్కొనుటకన్న ఆ లక్షణమున కాద్యులను, దానిని విలక్షణరీతిలో భాసింపజేసినవారినిమాత్రమే ముందుముం దుదాహరింతును. పేర్కొనవలసి వచ్చినచో ఇంచుమించుగా ప్రతిభావకవి రచనలు ఉదాహరణయోగ్యములుగానే యుండును. భావ కవులెల్లరు ప్రకృతికవిత్వము, ప్రణయకవిత్వము, దేశభక్తికవిత్వము, స్మృతి కావ్యములు, భక్తికవిత్వమున్నగు ప్రక్రియలను కొంచెము వ్యత్యాసముతో స్వీకరించినవారే. కాబట్టి

వారిలోనుండి ముఖ్యులైన ఏ పదుగురి రచనలనో ఉదాహరణములుగా తీసికొనవలసివచ్చినది. అంతమాత్రమున మిగిలిన కవులు, వారి రచనలు అప్రధానములనికాదు.

### భావకవిత్వ నిర్వచనము :

రాయప్రోలువారి కావ్యములలో 'భావపదము', 'భావగీతము' తొలిసారిగా కనిపించు చున్నవి.[1] తరువాత విశ్వనాథవారి గిరికుమారుని ప్రేమగీతములలో[2], కృష్ణశాస్త్రిగారి ఊర్వశిలో[3] 'భావగీతము' ప్రయోగింపబడినది. తరువాత తరువాత అనేకులు 'భావగీత'పదమును ప్రయోగించిరి. రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, నండూరి మున్నగువారు భావ కవులని, వారి కవిత్వము భావకవిత్వమని సాహిత్యలోకమున రూఢమైపోయినది. 'భావకవిత్వ' మను పదమును గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రిక సహాయసంపాదకులు నున్నప్పుడు సృష్టించిరని డా. గిడుగుసీతాపతిగారు తమ 'History of Telugu Literature' (Part II) లో వ్రాసిరి. గాడిచర్లవా రీపదమును మాటిమాటికి ఆంధ్రపత్రికలో ప్రయోగింపగా, ఇది నవ్యకవిత్వమునకు పర్యాయమైపోయినదని, ఈ కవిత్వమువ్రాసెడి కవులు భావకవులని పిలువబడిరని సీతాపతిగారభిప్రాయపడినారు. తృణకంకణములోని ప్రకాశకుల విజ్ఞప్తిలో 'భావకవిత్వ' పదము తొలిసారిగా వాడబడినది. దీనినివ్రాసినవారు గాడిచర్లవారేయని రాయప్రోలు వారు నాతో అన్నారు. క్రమముగా సాహితీసమితిలోని కవులందరు, తర్వాత తర్వాత నవ్య సాహిత్యపరిషత్తులోని అధికసంఖ్యాకులును భావకవులుగా వ్యవహరింపబడిరి. కట్టులో, జుట్టులో, నడకలో, నాణెములో భావకవులు తమ ప్రత్యేకతను చూపిరి. చెవులమీదుగా వ్రేలాడు గిరజాలు, నడిమిపాపట, వల్లెవాటుగావేసిన కండువా, జానువులను దాటెడి 'బెంగాలీపద్ధతి లాల్చీ', తళతళ మెరసెడి కండ్లజోడు, ఎప్పుడు గుప్పుమను అత్తరుపరిమళము-ఇవి భావకవిని మిగిలిన కవుల నుండి వేరుచేసెడి లక్షణములైనవి. కొంతకాలము తల్లావఝ్ఝల, వేదుల, మునిమాణిక్యం, నోరి, కృష్ణశాస్త్రిమున్నగు కవులు, అప్పటికి ఇప్పటికి కృష్ణశాస్త్రిగారు, పైని పేర్కొన్న రీతిలోనున్న భావకవులైనారు. కృష్ణశాస్త్రిగారి 'గిరజాలు', కండువా మున్నగునవి తరువాతి యువకవులకు అనుకరణీయములైనవి. కృష్ణశాస్త్రిగారి వేషమేకాక పద్యరచనము, పద్యపఠనము తరువాతి యువభావకవులకు మార్గదర్శకమైనవి. రానురాను 'భావకవి'యను పదము ఉచ్చరించగానే కృష్ణశాస్త్రిగారు స్ఫురించెడి పరిస్థితి యేర్పడినది.

భావకవిత్వమును నిర్వచించినవారిలో పంచాగ్నులవారు, విశ్వనాథవారు గణనీయులు.

''కవియొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడిన''దో అది భావకవిత్వమని విశ్వనాథవారన్నారు,[4] ఇది ఇంగ్లీషు విమర్శ

1. 'పాడవమ్మగీతాసఖీ భావపదము': రాయప్రోలు : తెనుగుతోట.
2. 'ఈ ప్రణయ భావగీతములివియ'-'గిరికుమారుని ప్రేమగీతాలు'
3. 'అపూర్వమధురరక్తి స్ఫురియించుగాని అర్థమ్ముగాని భావగీతమ్ములవి'.
4. 'లిరికల్‌పోయిట్రీ' (వ్యాసము) ; విశ్వనాథ : భారతి : అక్టోబరు, 1939.

కులు Lyrical Poetry కి చేసిన నిర్వచనముతో తులదూగుచున్నది. Lyrical poetry నిర్వచనమిది.

"The Lyric has the function of revealing, in terms of pure art, the secrets of the inner life, its hopes, its fantastic joys, its sorrows, its delirium."[1]

కవి తన మనస్సులోని సుఖదుఃఖములను, విభిన్నకాంక్షలను, 'లిరిక్కు'ద్వారా వ్యక్తము చేయునని ఈ నిర్వచనమువలన స్పష్టమైనది. దీనినే విశ్వనాథవారు కొంచెము మార్పుతో స్వీకరించిరి.

కవికొండల వెంకటరావుగారు 'భావము యొక్క కవితాస్వభావము భావకవిత్వ'మనిరి.[2] 'సృష్టిసౌందర్యము'అను సమాసమునకు సృష్టిచే ప్రతిపాదింపబడు అందమని అర్థమున్నట్లే, 'వీరధర్మమునకు వీరుడు నిర్వర్తించువిధియని అర్థము' చెప్పుకొన్నట్లే 'భావకవిత్వ'మను సమాసమును గ్రహింపవలెనని వీరు వ్రాసిరి. అనగా వీరి దృష్టిలో భావముచేత ప్రతిపాదింపబడు కవిత్వము భావకవిత్వమన్నమాట. ఇదిలక్షణదృష్ట్యా నిలుచు నిర్వచనముకాదు. ఈ వ్యాసము లోనే వీరు 'పాఠకులు కేవలం పదములకూర్పునందలి కవితాతత్త్వమునే కాక భావమునందలి కవిత్వమును జూఅగొనుట ప్రారంభించి పైకిచెప్పడంచేత ఈ భావకవిత్వం అనే పదము వ్యవహారంలోకి వచ్చిందని నేననుకుంటాను' అన్నారు. ఈ నిర్వచనములో స్పష్టతలేకున్నను, భావప్రధానమైనది భావకవిత్వమను విషయము దీనివలన బోధపడుటకు వీలున్నది. నవ్యకవిత్వమునకు ప్రముఖవ్యాఖ్యాతలగు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 'కవేర్భావఃకవిత్వం-భావప్రధానం కవిత్వం భావకవిత్వమ్'[3] అని పై విషయమునే బలపరిచిరి.

శ్రీశ్రీగారు భావకవిత్వము నిట్లు వివరించిరి.

'హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించే అధికారం కలదు. అట్టి అతని సంచారాలలో ఏ సన్ముహూర్తాననో కావ్యగీతం ఒకటి మెరుగులుతీరిన విలక్షణ రచనాధోరణిలో వెలుగు చూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం ఇది.'[4]

కవి హృదయములో తటిత్తువలె అప్రయత్నముగా మెరసిపోయిన భావముల అక్షరాకృతియే భావకవిత్వమని శ్రీశ్రీగారి వివరణమువలన తేలిన సారాంశము. ఇది వివరణమేకాని

1. Lyrical Poetry : Encyclopaedia Britannica.
2. ప్రబుద్ధాంధ్రలో 'భావకవిత్వము' (వ్యాసము) : జూలై 1934.
3. 'ఆధునిక కృతులు' (వ్యాసము) : భారతి : ప్రమోదూత: వైశాఖము.
4. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి లేఖనుండి : భారతి : జూన్ 1934.

నిర్వచనముకాదు. జమ్ములమడక మాధవరామశర్మగారు 'సాహిత్యదార్శనికత' అను వ్యాసములో[1] భావకవిత్వమునుగురించి ప్రస్తావించుచు భావకవిత్వమను పదము తొలుదొల్త ఉద్భటుని కావ్యాలంకారసంగ్రహములోనే యున్నదని, దానికి లఘువృత్తి వ్రాసిన ప్రతీహారేందురాజు దానిని వివరించిన వాక్యములను పొందుపరిచిరి. ఆ వాక్యములివి.

"ఏషాం రత్యాదికానాం భావానాం పంచాశత్సంఖ్యానాం యాన్యనుభావాదిభిః చతుస్సంఖ్యైః సమస్తత్వేన వ్యస్తత్వేనచ యథాయోగం సూచనాని స్వలక్షణస్వరూపాణాం సామాన్యావష్ఠాపాదితానాం ప్రతిపాదనాని తైః కావ్యముపనిబధ్యమానం ప్రేయస్వత్. ప్రేయశ్శబ్దవాచ్యేనప్రియతరేణ రత్యాలంబనేన విభావేన రతిరుపలక్ష్యతే, తయాచ సాహచర్యాత్ రత్యాదయో భావాః పంచాశదవగమ్యంతే, ఏవంచభావకావ్యస్య ప్రేయస్విదితి లక్షణయావ్యపదేశః"

సమస్తముగాగాని వ్యస్తముగాగాని రత్యాదిపంచాశద్భావములు ఆలంబనముగా కలిగి వెడలునది 'ప్రేయస్వీత' అను లక్షణముగల భావకావ్యమని ప్రతీహారేందురాజుమతము. ప్రేయస్వీతయనగా శృంగారప్రధానమైనగుణము. భావకావ్యమనగా శృంగారప్రధానమైన కావ్యమనియే ఈతని అభిప్రాయమని తెలినది. ఈ దృష్టితోచూచినచో ఆధునికభావకవిత్వమంతయు శృంగారకవిత్వమే కావలసివచ్చును. కాని భావకవిత్వములో శృంగారరసముతోపాటు వీర కరుణాద్యనేకరసములకు స్థానముండుటవలన ప్రతీహారేందుని మతము ప్రకృతవిషయమున కంతగా వర్తింపదు.

ఆధునికులలో విశ్వనాథవారు, పంచాగ్నులవారు భావకవిత్వమునకు లక్షణబద్ధమైన నిర్వచనములిచ్చుటకు ప్రయత్నించినారు. ప్రాచీనుల కావ్యములు అఖండకృతులు కావున వారి గ్రంథములలో భావములకు స్థాయికలిగించి రసస్ఫూర్తిని కలిగించుటకు వీలున్నదని, ఖండ కావ్యములలో పరిమితమైన కావ్యశరీరముండుటవలన 'రసాంగములగు విభావానుభావాదులు సమగ్రంగా గ్రహించడానికి' వీలులేదని, 'ఏదో ఒక భావాన్ని ఆధారముచేసికొని అల్పావకాశంలో పూర్ణంగా రససిద్ధిని చేకూర్చేయత్నం' నవ్యులుచేయుదురని పంచాగ్నులవారభిప్రాయపడినారు.[2]

ఇక విశ్వనాథవారి నిర్వచనము గమనింతము.

"కావ్యములు రసప్రధానములు. ఖండకావ్యములు భావప్రధానములు. కావ్యములందు ప్రతిపద్యమునందు భావముండవచ్చును. కాని కావ్యము సమష్టిమీద రసాభిముఖముగా పోవును. ఖండకావ్యములందును భావములు రసవ్యంజకములు కావచ్చును. కాని ఖండకావ్యములు ప్రధా

1 ప్రతిభ : ఆరవ సంపుటి.

2. నవ్యసాహిత్యపరిషదధ్యక్షోపన్యాసము : ప్రతిభ : ధాతవసంతము.

నముగా ఒక భావమును ఆశ్రయించియేయుండును. అందుచేత దీనిని భావకవిత్వము అన వచ్చును.''[1]

ఈ నిర్వచనములవలన తేలిన సారాంశమిది. ప్రాచీన కావ్యములలో శతకములు, చాటువులుతప్ప మిగిలినవి కథాత్మకములు. కథయున్నప్పుడు విభావానుభావసాత్త్వికవ్యభిచారి భావముల కవకాశముండును. విభావాదిసామగ్రీసంయోగముతో రసము నిష్పన్నమగును.[2] ఖండ కావ్యములు ప్రాయికముగా కథారహితములు. వీనిలో విభావాదిసామగ్రికి వీలులేదు. ఇవి యేదో ఒక భావమునుమాత్రమే ఆశ్రయించును. అనగా ఖండకావ్యము (భావకవిత్వము) ఏదో ఒక భావము - నాశ్రయించుకొనియుండుటవలన అది రసవ్యంజకమగునేకాని రససిద్ధిపొందదు భావ కవిత్వము 'రసవ్యంజకము కావచ్చును' అన్న విశ్వనాథవారి అభిప్రాయము, మరియు, (ఖండ కావ్యములో) 'అల్పావకాశంలో పూర్ణంగా రససిద్ధిని చేకూర్చేయత్నం' జరుగునన్న పంచాగ్నుల వారి అభిప్రాయము. పై విషయమునే ప్రకటించును. ఇంతకు భావకవిత్వము రససిద్ధినందు కొనదా యన్నదే ప్రశ్న. రససిద్ధినందుకొనలేక, కేవలము భావముగానే నిలిచిపోయిన కవిత్వము ఉదాత్తస్థాయిలోని కెట్లు చేరునను సందేహము కలుగక తప్పదు. భావకవిత్వమునకు నా వివరణమిది.

కవిత్వమునకు వస్తు, భావ, రచనలను మూడంగములున్నవి. కవిత్వమునకనగా కావ్య మునకనియే నా ఉద్దేశము. కావ్యమునకు కవిత్వమునకు కించిద్భేదమున్నది. కావ్యములో కథ అనివార్యము. అది ప్రబంధములలోవలె అల్పముగానైన ఉండవచ్చును. లేక ఇతిహాసాదులలో వలె ప్రధానముగానైన ఉండవచ్చును. కవిత్వమట్లుకాదు. అది కథారహితముగాగూడ ఉండు టకు వీలున్నది. అమరుకుని శ్లోకములు, గాథాసప్తశతి శ్లోకములు (గాథలు) తెలుగు, శతకముల లోని పద్యములు వస్తు (కథా) ప్రాధాన్యములేనివి. అనగా వీనిలో - కవిత్వమున్నది కాని ఇవి సమగ్రకావ్యములుగా పరిగణింపబడలేదు. ప్రాచీనులు వీనిని ఖండకావ్యములని, ముక్తకములని, అనిబద్ధకావ్యములని, చాటువులని తెలిపినదీదృష్టితోనే. కావున ఈ ఖండకావ్యములను తీసివేసి నచో ప్రాచీనకావ్యములన్నియు కథాత్మకములే. వానిలో పురాణములు, ఇతిహాసములు (భార తాదులు) వస్తుప్రధానములైనవి. వస్తువనగా కథయనియే తాత్పర్యముకదా! ఇక ప్రబంధములు అల్పవస్తుకములైనను, రచననాశ్రయించి బ్రతికినవి. అనగా వీనిలో వస్తుబలమునుమించిన, శైలీరమ్యత, సమాసచాలననైపుణి, వృత్తనిర్మాణపటిష్ఠత, పదగుంఫనచాతుర్యము ఉన్నవి. ఈ గుణములన్నియు రచనాగతములేకదా![3] ఊహాలంఘనమునకు భావబలమునకు ఎంతో వ్యత్యాస

1. ఆంధ్రపత్రిక (వారపత్రిక) 1988 జనవరి. సంచిక 5.
2. 'విభావానుభావవ్యభిచారిసంయోగాత్ రసనిష్పత్తిః' : భరతుడు.
3. ఈ రచనాప్రాధాన్యముతోపాటు ప్రబంధములలో అర్థవైచిత్ర్యముకొరకు ఉత్ప్రేక్షాద్యనేకాలంకార ములు ప్రయోగింపబడినవి. ఈ యలంకారములు బహుళముగా సహజభావజన్యములు కాక, ప్రయత్నపూర్వకముగా ఊహలచేత సాధింపబడినవి.

మున్నది. ఊహాశక్తి ధీజనితమైనది. హృదయగతమైనదికాదు. భావము హృదయములో కలిగిన వికృతి. అనగా అది హృదయసంబంధి. కవిత్వధర్మము హృదయాహ్లాదకరత్వము. హృదయమును రంజింపజేయుటకు హృదయసంబంధమైన వికారములను, సుఖదుఃఖాది ద్వంద్వములను స్వభావరమ్యముగా చిత్రింప వలసియుండును. ప్రాయికముగా ప్రబంధములీశక్తిని కోల్పోయినవి.[1] అనగా వస్తుభావరచనలను త్రిగుణములలో ఇవి 'భావము'ను అంతగా సమాదరింపలేదు. పురాణములు, ఇతిహాసములు గూడ వస్తువున కిచ్చిన ప్రాధాన్యము భావమునకీయలేదు. ఈ రెంటిలోని లోటును దీర్చుటకు వెలువడిన కవిత్వమే భావకవిత్వము. అనగా భావకవిత్వములో వస్తురచనలకన్న భావమునకే ప్రాధాన్యముండునని నా అభిప్రాయము. దీనిలో భావము తరువాత రచనకు, దాని తర్వాత వస్తువునకు ప్రాధాన్యముకలదు. ఈ విధముగా భావకవిత్వమునకు ప్రాచీనకావ్యములలో లేని ఒకానొక విలక్షణత యేర్పడినది. గడ్డిపువ్వు, గగనగంగ, చిన్నిపాపచిఱునవ్వు, కన్నతల్లి కంటిచూపు, కలకంఠకూజితము, కాకియఱపు-అన్నియు భావకవిత్వమునకు వస్తువులైనవి. ఈ వస్తువులకు ప్రాధాన్యముండక, వస్తుభావనదర్శనశ్రవణములవలన కవికిగలిగిన చిత్తవృత్తులను చిత్రించుటకే ప్రాధాన్యమేర్పడినది. అట్లే భావకవిత్వములో వృత్తరచనాచాకచక్యము, సమాసచాలనము మున్నగు రచనాశ్రయగుణములు అప్రధానములై పోయినవి. భావతీవ్రతను గుండెలను దూసికొనిపోవునట్లు ప్రకటించుట భావకవిత్వలక్షణమైనది. ఈ విధముగా భావకవిత్వమనగా వస్తుభావరచనలలో భావమునకు ప్రాధాన్యమిచ్చిన కవిత్వమని తేల్చవచ్చును. భావకవిత్వమునకు కొందరు గానయోగ్యతను, వ్యంగ్యప్రాధాన్యమునుగూడ చేర్చిరి. గానయోగ్యత అనునది కవిత్వగుణము కాదు; సంగీతగుణము. వ్యంగ్యప్రాధాన్యమనునది అన్నికాలములలోని ఉత్తమరచనకు చెందిన లక్షణము. కావున భావకవిత్వమునే వ్యంగ్యప్రధానమనుట చెల్లదు. వ్యంగ్యము ఉత్తమకవిత్వ ధర్మము కావున దానిని ప్రత్యేకముగా పేర్కొనవలసిన అవసరములేదు.

లాక్షణికదృష్టితో పరిశీలించినచో 'భావకవిత్వము'లో విభావాదిసామగ్రీపుష్కలతలేదు. కావున ఇది రసపుష్టినందుకొనలేదని యనిపించును. కాని 'రస' శబ్దమునకు కొంత వెసులుబాటు కల్పించుకొని చూడవలసిన అవసరమున్నది. ప్రాచీనలక్షణమునుబట్టి చూచినచో వస్త్వాశ్రయములుగాని శతకాదులకు రససిద్ధిలేదనవలసివచ్చును. అమరుకుని శ్లోకములకదే గతిపట్టును. అమరుకుని ఒక్క శ్లోకము ప్రబంధసదృశమైనదన్న అభిప్రాయమునకర్థమేమి ? ప్రబంధపఠనమువలన కలిగెడు ఆనందము ఒక్క శ్లోకమువలన కలుగునని. ఈ యానందము రసానందమే కదా. అమరుకుని ఒక్క శ్లోకము రసానందకందమైనప్పుడు భావకవిత్వము రసపరిణతినందు కొనదనుటలో అర్థములేదు. ''వాక్యం రసాత్మకం కావ్యం'' అన్న విశ్వనాథుని సూత్రమున కర్థము రసాత్మకమైన ఒక వాక్యమే కావ్యమగునని కాకున్నను, వాక్యసముదాయమని చెప్ప

1. పారిజాతాపహరణము, మనుచరిత్ర మున్నగు కొన్నిప్రబంధములలోని కొన్నిసన్ని వేశములు మాత్రము సహజరమ్యమైన భావచిత్రణకు తార్కాణములు.

కొన్నను, అది యొక సత్యమును బోధించుచున్నది. రసనిష్పత్తికి విధిగా విభావాదిసామగ్రీ బాహుళ్యమక్కరలేదు. ఇందుకు వారుదాహరించిన 'శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనైః' అన్న శ్లోకమే ప్రమాణము. ఇది కావ్యమని వారి అభిప్రాయముగదా. దీనిలో పెద్ద కావ్యములో ఉండవలసిన విభావాదిసామగ్రీబాహుళ్యమేది ? అయినను ఇది రస సిద్ధికలిగిన వాక్యసముదాయమనికదా అర్థము. అట్లే భావకవిత్వముగూడ విభావాదిపుష్కలత లేనందున రసపరిణతము కాదేమో అన్న శంకకు తావులేదు. భాగవతములో గోపికాగీతలున్నవి. ఇవి కావ్యములో నున్నప్పుడు కథ పూర్వాపరములతో ఆ సన్నివేశమును సమన్వయించుకొని చూతుము. అప్పుడాఘట్టము రసోన్ముఖముగా భాసించును. ఈ ఘట్టమును విడదీసి చూచినచో రససిద్ధి కలుగదా ? విడదీసినప్పుడు పాఠకుడు ఆ ఘట్టమునకు ముందున్న స్థితిగతులను తానే భావనద్వారా సాధింపవలెను. అప్పుడు తప్పక రసోదయమగును. కావున కథలోనున్నప్పుడే ఒక సన్నివేశము రససిద్ధి పొందుననుటకు వీలులేదు. ఒక ఉదాహరణముతో దీనిని వివరింతును.

'ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొరకు చెమ్మగిల నయనమ్ములేదు;
పసిడివేకువ పెండ్లిండ్లబడిన యెవరు
కరగనేర్తురు జరఠాంధకారమృతికి.'

— కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము.'

ఇది ఆత్మనాయకమైన పద్యరచన. కవియే నాయకుడని స్పష్టము. ఎవరు మరణించుచున్నారు ? ఎందుకు మరణించుచున్నారు ? అనువిషయములు మనకు తెలియవు. కాని భావనచేసికొనవలెను. ఈ కవి యేదో ఒక తీవ్రప్రతిఘాతముతో గుండెప్రీలి అత్యంత నైరాశ్యముతో, దుఃఖభారముతో క్రుంగిపోయి చివరకు మరణోద్యుక్తుడైనాడన్న భావము దీనివలన సాధింపనగును. తనమరణమునకు లోకము ఒక్క అశ్రుబిందువైన చిందలేదన్న అభిప్రాయము పైపద్యములోని క్రింది పాదములలో ధ్వనించుచున్నది. లోకము ప్రభాతశోభలతో కలకలలాడుచున్నది. కరగిపోవుచున్న చీకటియెడ దానికి సానుభూతియేమి ? తాను లోకముదృష్టిలో జరఠాంధకారము. అందువలన తనమృతికది సానుభూతిచూపదు. ఈ పద్యము విన్న పిమ్మట లోకమునకేమికాని పాఠకునికిమాత్రము సానుభూతితో కనులు చెమరించుటకవకాశమున్నది. ఈ పద్యమునకు కరుణరసోత్పాదనశక్తియున్నదనుటలో సందేహముండకూడదు. మరి విభావాదిసామగ్రి పుష్కలముగా లేని ఈ ఒక్క పద్యమెట్లు రసనిష్పత్తి కలిగించినది ? కావున కథనుబట్టి, పద్యసంఖ్యనుబట్టికాక భావతీవ్రతనుబట్టి, దానిని వ్యక్తీకరించు సుందరరచనారీతినిబట్టి రససిద్ధి కలుగుటకవకాశముండునని తేలినది. భావకవిత్వము భావప్రధానమైనదనగా రసరహితమైనది; రసదృష్ట్యా అప్రధానమైనది కాదని, వస్తుభావరచనలలో భావమునకగ్రతాంబూలమిచ్చిన కవిత్వమని, అది ఉత్తమశ్రేణిదైనప్పుడు రసశిఖరమునందుకొను రచనయేయని నా అభిప్రాయము.

## భావకవిత్వ స్వరూపము :

భావకవిత్వము ప్రధానలక్షణము అంతర్ముఖత్వము. ఈ అంతర్ముఖత్వమువలన కవి స్వానుభవములను వాడిగా, వేడిగా, ఒక్కొక్కప్పుడు స్ఫుటాస్ఫుటముగా చెప్పుట కవకాశము కలుగుచున్నది. ఈ కవితామార్గమున మనస్సుపొరలలోని భావరేఖలను శబ్దచిత్రములద్వారా వ్యక్తమొనర్చుటకు తీవ్రమైన ప్రయత్నముచేయుటకు వీలుకలుగును. అభిధ, లక్షణ, వ్యంజన అనెడు శబ్దవృత్తులేకాక శబ్దములకు రంగులు, వాసనలుఉండునని భావకవి అభిప్రాయపడెను.[1] శబ్దమునకు రంగులు, వాసనలు ఉండుననుట భావకవిత్వములోని అస్పష్టతను సమర్థించుటయే. పదచిత్రములలోని క్రొత్తదనము, అనుభూతిప్రకటనములోని నవ్యత – ఈ రెండు గుణములు భావకవిత్వమును కొంత అస్పష్టముగాజేసినవి. అందుకే కృష్ణశాస్త్రిగారు 'ఏదియొ అపూర్వ మధురరక్తి స్ఫురియించుగాని అర్థమ్ముగాని భావగీతమ్మ'లనిరి.[2]

భావకవిత్వమునకు అంతర్ముఖత్వము ప్రధానగుణమని మనవిచేసితిని. ఈ అంతర్ముఖత్వమువలన భావకవిత్వమున క్రింది విధమైన ఛాయలు స్ఫుటాకృతి దాల్చి నిలిచిపోయినవి.

1. స్త్రీ పురుషుల బాహ్యసౌందర్యమునకు బదులుగ ఆత్మసౌందర్యము, గుణసౌందర్యము కవిత్వమున వర్ణ్యములైనవి.

2. కవి తనకు కలిగిన సుఖదుఃఖములను తెరమరుగులేకుండ వెర్రిగా వెల్లడించుకొన్నాడు.

3. ఒక్కొక్కప్పుడు అవస్థాభేదమునుబట్టి అతనికి కొండంత సహనమేర్పడినది. దానికి తోడు దార్శనికదృక్పథమలవడినది.

4. ప్రకృతివర్ణనలలో బాహ్యవిషయములకు బదులుగా సుకుమారమైన సౌందర్యతత్త్వము నిర్దేశించుట జరిగినది. అనగా చర్మచక్షువునకు కనిపించిన ప్రకృతికాక మనోనేత్రమునకు భాసించిన ప్రకృతియే వర్ణ్యమైనది.

5. జాతికి సర్వాంగవికాసము కలిగించు సంప్రదాయసిద్ధమైన సంస్కారదృష్టి కలిగినది. పూర్వజన్మవాసనలు మరల ఊపిరిపోసికొన్నవి.

6. తాను విన్న, కన్న ఏ చిన్న సంఘటనయైనను తనహృదయతంత్రులను ఝమ్మనిపించి, కవిత్వరూపమున వెలిజిమ్ముకొనివచ్చినది.

7. ఆత్మార్పణతత్త్వము, ఆరాధనతత్త్వము పాదులుదన్నుకొన్నవి. అంతశ్చేతనములోని చైతన్యము హద్దులు త్రెంపుకొని వెలువడినది.

8. సామాన్యమైన లౌకికసంతోషమునకు బదులుగా సర్వేసర్వత్ర అలౌకికానందము అంచులు దీర్చుకొన్నది. చిత్రకవిత్వమును భావకవి నిరసించుటలో ఈ అంతర్యమేయున్నది.

---

1. కృష్ణశాస్త్రిగారు అనేకసభలలో ఈ విషయమును వ్యక్తముచేసిరి.
2. 'ఊర్వశి'లో :

9. కవి తన కొలబద్దలతో జీవితమును కొలుచుటమాని తన వ్యక్తిత్వమును విస్మరించి,ఇతరుల సుఖదుఃఖములలో లీనమైపోయెడిస్థితి యేర్పడినది. దీనినే కీట్సు 'Negative capability' అనెను. ఇది భావకవిత్వములో కాననగును.

ఈ భావకవిత్వమన్నది ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యములలో రేఖామాత్రముగా మొదటి నుండియు ఉన్నదే. ఇది పాశ్చాత్యసాహిత్యములో పందొమ్మిదవశతాబ్ది ప్రారంభములోనే, మన సాహిత్యములో ఇరువదవశతాబ్ది ప్రారంభములోనే హఠాత్తుగా మొలకెత్తినదికాదు. వస్తుప్రధానములైన ప్రాచీనకావ్యములలోగూడ భావకవిత్వరేఖలను దర్శించుటకువీలున్నది. 'యీనీడ్' అనునది Virgil రచించిన వస్తుకావ్యము. డాంటీ తాను ప్రేమించినయువతి తనకు కాకుండ పోయినందున, తన అసంపూర్ణప్రేమగాథను కథానాయకుడైన 'ఈనిస్'నందును, డైడో వియోగమునందును ఆరోపించి, భావకవిత్వకాంతులను విరజిమ్మినాడని విమర్శకుల అభిప్రాయము. మన సాహిత్యములో కాళిదాసు మేఘసందేశకావ్యమిట్టిదే. కాళిదాసులోని వియోగానుభూతియే యక్షయక్షీవిరహగాథగా, సందేశకావ్యముగా రూపుదిద్దికొన్నదని చెప్పవచ్చును. 'సంజయరాయబారము'లో తిక్కనామాత్యుడు స్పష్టముగా కనిపించునన్నది విమర్శకులలో పలువురను కొనుచున్నదే. భాగవతములోని గోపికాగీతలలో, భ్రమరగీతలలో పోతన్న మధురభక్తితత్త్వమే వెల్లడింపబడినదనుటయు ప్రసిద్ధమే. ఈ విధముగా ప్రాచీనకావ్యములలో భావకవిత్వరేఖలున్నను అవి అప్రధానములుగానుండిపోయినవి. వస్తూన్మీలనమున కుపకరించుసాధనములే కాని వానికి స్వయంసమగ్రతలేదు. ఇక శతకాదులు అచ్చమైన భావకవిత్వములోనికే వచ్చిచేరినను వానిలో భక్తియో, రక్తియో, క్వచిత్తుగా అధిక్షేపమో తప్ప వైవిధ్యములేదు. భావకవిత్వములోవలె సౌందర్యదృక్పథమును, తాత్త్వికదృష్టిని, కవి వ్యక్తిత్వములోని విశ్వతోముఖత్వమును ప్రదర్శించునవికావు. కాళహస్తీశ్వరశతకమున్నదనగా అది అర్థకామములతో విసుగెత్తిపోయిన కవి చిత్తవృత్తిని మాత్రమే పశ్చాత్తాపరూపమున చూపును. దాశరథిశతకమిట్టిదే. ఈ విధముగా శతకములు సాధించని విశిష్టతను, వైలక్షణ్యమును భావకవిత్వము సాధించినది.

**భావకవిత్వము : ఇంగ్లీషుకాల్పనిక కవిత్వము :**

భావకవిత్వముపై, ఇంగ్లీషుసాహిత్యములో పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభములో వచ్చిన Romantic poetry (కాల్పనికకవిత్వము) ప్రభావమున్నదని వెనుకటి ప్రకరణములలో తెలిపియుంటిని. భావకవిత్వావిర్భూతికి అంతరహేతువులను తర్వాత వివరింతును. ప్రస్తుతమీ ఉభయకవిత్వములకుగల సామ్యభేదములను సంగ్రహముగా పేర్కొందును.

భావకవిత్వములోని శాఖలనీవిధముగా స్థూలముగా విభజింపవచ్చును. 1. ప్రణయకవిత్వము. (Love poetry) 2. ప్రకృతికవిత్వము (Nature poetry) 3. భక్తికవిత్వము (Mystic poetry) 4. దేశభక్తికవిత్వము (Patriotic poetry) 5. సంఘసంస్కరణకవిత్వము (Reformative poetry) 6. స్మృతికావ్యములు (Elegies). ఇవి స్థూలముగా

నేను విభజించిన శాఖలు. వీనిలో ఒక్కొక్కటి అనంతవైవిధ్యముగలది. ప్రణయకవిత్వమునే తీసికొందము. ఇది రెండు విధములుగా నుండును. ఒకటి వస్త్వాశ్రయరీతి. అబ్బూరి వారి 'మల్లికాంబ,' దువ్వూరిరామిరెడ్డి 'కడపటి వీడ్కోలు' మున్నగునవిట్టికావ్యములే. రెండవది ఆత్మాశ్రయరీతి. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, నాయనవారి సౌభద్రుని ప్రణయయాత్ర మున్నగువానిలో ఈ కవిత్వమేకలదు. ఈ విధముగా పైన పేర్కొన్న ఆరు శాఖలలో ప్రక్రియాబాహుళ్యము కనిపించును. ఈ ప్రక్రియలన్నియు రొమాంటికుకవిత్వప్రభావముకలవి కావు. వీనిలో ప్రణయకవిత్వము, స్మృతికావ్యములు ప్రాయికముగా ఇంగ్లీషుకాల్పనిక కవిత్వముద్రగలవే. దేశభక్తికవిత్వముపై దీని ప్రభావమంతగా లేదు. సమకాలీనపరిస్థితులను బట్టి, రాజకీయోద్యమములనుబట్టి పెకలివచ్చిన కవిత్వమిది. సంఘసంస్కరణకవిత్వముగూడ సాంఘికస్థితిగతులనుబట్టి ఉద్భవించినదే. భక్తికవిత్వముపై కొంత సాంప్రదాయికముద్ర, కొంత బ్రహ్మసమాజప్రభావమున్నది. ఈరీతిగా 'కొత్తపాతలమేలుకలయిక'తో, సంప్రదాయప్రయోగముల సముచితమేళనముతో తెలుగునాట వెలుగులుచిమ్మినదీ భావకవిత్వము.

### భావకవిత్వము : అపప్రచారము :

కొంతకాలమువరకు భావకవిత్వమువలె హేళనకు, నిందకు గురియైన మరియొక నవ్య కవిత్వోద్యమము లేదనవచ్చును. ఇది బయలుదేరినప్పటినుండి సంప్రదాయవాదులు దీనికడ్డు పుల్లలు వేయసాగిరి. భావకవులలో ఇంచుమించుగా అందరును వ్యావహారికోద్యమమును బలపరిచినవారో, నిశ్శబ్దముగానుండి స్వీకరించినవారో అయినందున, ఆంధ్రసాహిత్యపరిషత్తు మున్నగు గ్రాంధికాంధ్రసంరక్షకసంస్థలు దీనికెదురొడ్డి నిలిచినవి. కాశీభట్లబ్రహ్మయ్యశాస్త్రిగారివంటి పండితులు దీనిని విమర్శించుచు పద్యములు, వ్యాసములు ప్రచురించిరి. ప్రత్యేకముగా భావకవిత్వమునకు నిరసనముగా గ్రంథములను ప్రచురించినవారిరువురు. ఒకరు ఉమాకాంతపండితులు, రెండవవారు అనంతపంతుల రామలింగస్వామిగారు. వీరిలో ఉమాకాంతపండితులు అనేకవిషయములలో నవ్యులైనప్పటికి కవిత్వవిషయములో మాత్రము నిష్ఠురముగా ప్రవర్తించిరి. భావకవిత్వమునకు 'పులుముడు,' 'శబ్దవాచ్యత' మున్నగు దోషములనంటగట్టి దీనిని తీవ్రముగా ఖండించిరి. పూర్వలాక్షణికులేర్పరిచిన కొలతబద్దలతో ఈ కవిత్వమును కొలుచుటవలన వీరిదృష్టికిది విడ్డూరముగా తోచినది. దేశకాలపరిస్థితులనుబట్టి, విదేశీయసాహిత్యప్రభావమునుబట్టి ఈ కవిత్వమును పరిశీలించినచో వారికింతటి నిరసనదృష్టి కలిగెడిదికాదు.

అనంతపంతులరామలింగస్వామిగారు 'శుక్లపక్షము' అను గ్రంథరూపముతో భావకవిత్వము నధిక్షేపించిరి. ఇందులో విఘ్నకవి, కుకవి, వికటకవి, కవిరాజు, భావకపిత్వము భావ తురంగము, భావకవి, గణాధిపతి మున్నగు శీర్షికలున్నవి. 'కవిరాజు'అను శీర్షికతోగల పద్యములలో ఒక అప్రతిభుడైన కవి ఉదరపోషణార్థము

'కొండమీద విన్న గూగూలు
కొండక్రింద గిన్న వాగూలు
అప్పన్న చెవినున్న పోగూలు
అనవేమారెడ్డి యీగూలు'

అను భావగీతమువ్రాసి వేమారెడ్డిప్రభుని ఆస్థానములో చదివెనని, దానిని గొప్ప భావపూర్ణమైన గీతమని, అతడు భావకవియని, ఆ గీతమును భావనచేసినచో మహార్థము స్ఫురించునని శ్రీనాథుడు వివరించిచెప్పి, ఆ కవిని కాపాడినట్లుగా ఇందులో కల్పింపబడినది. అర్థములేని మాట ప్రోవే భావకవిత్వమని 'ఈ పద్యములలో 'కవిగారు' హేళనచేసిరి. మిగిలిన పద్యశీర్షికలన్నియు ఇంచుమించుగా ఈ ధోరణిలోనే సాగినవి. భావకవులు అఖిలజీవేశ్వరునివిడిచి జీవితేశ్వరిపై; రేడులను రెడ్లనువిడిచి పసులకాపరులపై పద్యములు వ్రాసినారని అధిక్షేపింపబడినది. ఇరువదవశతాబ్ది మూడవపదిలో వ్రాసిన కావ్యములలో ఇట్టి అభిప్రాయములను వెలిపుచ్చుట, 'కృష్ణపక్షా త్త కాకము'వంటి మాటలతో సమకాలికులైన సుప్రసిద్ధభావకవులను వీరెత్తిపొడుచుట గమనింపదగినవి.

ఈ రెండు ముఖ్యగ్రంథములే కాక, పత్రికలలో భోగిరాజునారాయణమూర్తివంటివారు పద్యరూపములో, పొక్కులూరి లక్ష్మీనారాయణ పోలూరి రామబ్రహ్మంవంటివారు విమర్శనవ్యాసరూపములో ఈ కవిత్వముపై దుమ్మెత్తిపోసిరి.[1] వీరి ఆగ్రహమున కెక్కువ గురియైనవారు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. వీరు ప్రత్యర్థులచే ఎంతగా దూషింపబడిరో, సహృదయులచేత అంతగా భూషింపబడిరి. భావకవిత్వమును నలుమూలల ప్రచారముచేసినవారిలో వీరగ్రేసరులు. భావకవుల కావ్యములను పాథేయముగా మూటగట్టుకొని వీరుచేసిన ప్రయాణములెవరు చేయలేదేమో? సాహితీసమితి స్థాపనతో భావకవులకొక గూడేర్పడినది. నవ్యసాహిత్యపరిషత్తు స్థాపనతో అది అపరంజిమేడగా రూపొందినది. ఎన్ని పాటుపోటులువచ్చినను అచంచలముగా మూడు నాలుగు దశాబ్దులపాటు సాగిపోయిన కవితోద్యమమిది.

1. కొందరు భావకవిత్వమును 'భావకవిత్వ'మని ఎగతాళిచేసిరి. మరికొందరు భావములేని కవిత్వముండునాయని అధిక్షేపించిరి. ఇంక కొందరు 'అభావకవిత్వ'మని వెక్కిరించిరి. భావకవిత్వము పరిణాహమును తెలిసికొనలేక కొందరు దీనిని ప్రేమకు సంబంధించిన వట్టి 'అపస్మారక కవిత్వ' మని తేల్చివేసిరి. భావకవిత్వమనగా వట్టి ప్రేమకవిత్వమనుకొనుటవలన ఇంత అపప్రచారము వచ్చినది.

## భావకవిత్వ శాఖలు :

### 1. ప్రణయ కవిత్వము :

#### 'ప్రణయ' నిర్వచనము :

'ప్రణయ'శబ్దమును ప్రాచీనకవులు, లాక్షణికులు స్త్రీ పురుషులమధ్యగల శృంగారము లోనేకాక సాధారణ 'స్నేహ'మను అర్థములోను వాడిరి. దశరూపకకారుడు 'మానోపి ప్రణ యేర్ష్యయోః'అని ప్రణయమానమును, ఈర్ష్యామానమును పేర్కొన్నాడు. ప్రణయమానమనగా ప్రణయకోపము. కాళిదాసు శాకుంతలములో, కుమారసంభవములో ప్రణయమును స్నేహార్థము లోను, స్త్రీ పురుషుల ప్రేమయను అర్థములోను వాడియున్నాడు.

"మయ్యేవ విస్మరణదారుణచిత్తవృత్తౌ
వృత్తంరహః ప్రణయమప్రతిపద్యమానే"[1]

ఇందులో 'ప్రణయము' స్త్రీ పురుషులప్రేమపరముగా వాడబడినది. ఇక స్నేహమను అర్థములో వాడిన సందర్భము.

"అపి ప్రసన్నం హరిణేషు తే మనః
కరస్థదర్భప్రణయాపహారిషు."[2]

ఈ రెండర్థములలోకాక ప్రాచీనులు యాచన, ప్రీతి, ఆసక్తిమున్నగు అర్థములలో ప్రణయ శబ్దమునుపయోగించిరి. 'ప్రణయము' 'మానము'తో అనుబద్ధమైయున్నప్పుడే శృంగారార్థములో గ్రహించిరి. లాక్షణికముగా చూచినచో ప్రణయము కేవలశృంగారవాచికాదు. శృంగారమునకు నాయికానాయకులే ఆలంబనవిభావములు. ప్రణయమునకు పరస్పరభావసంబంధముగల యే ఇద్దరు జీవులైనను కావచ్చును. కొంతవరకు అచేతనములనుగూడ మన ప్రాచీనులు ప్రణయమున కాలంబనముగా చేసికొనిరి. చంద్రుని ప్రియుడుగా, కలువను ప్రేయసిగా - ఊహించుటలో ఈ రహస్యమే యిమిడియున్నది. ఈ దృష్టితో పరిశీలించినచో ప్రణయము స్నేహమునకు పర్యాయ పదముగా భాసించును. కాని భావకవిత్వములో 'ప్రణయము' దాదాపు స్త్రీ పురుషులమధ్య (నాయికానాయకులమధ్య) గల ప్రేమపరముగానే వాడబడినది. ప్రణయకవిత్వము, ప్రణయ

1. అభిజ్ఞానశాకుంతలము : ఐదవ అంకము.
2. కుమారసంభవము : పంచమసర్గ.

కావ్యములు, ప్రణయభావన, ప్రణయగీతములు మున్నగుపదములలో సూచితమైనది శృంగార మునకు పర్యాయమైన అర్థమే. ప్రణయమునకు స్నేహమున్నగు అనేకార్థములుండగా కేవలము నాయికానాయకుల ప్రేమఅను అర్థములోనే వాడుటలో ఔచిత్యమేమి? భావకవిత్వము సంయోగ వియోగశృంగారములలో వియోగశృంగారమునకే ప్రాధాన్యమిచ్చినది. భావకవుల సంయోగ శృంగారముగూడ చక్షూరాగ, సంభాషణ మనోరంజనములతో చాలవరకు తృప్తినందినది. వీరు 'సహసానఖంపచ స్తనద త్తపరిరంభ' ధోరణిలో సంయోగశృంగారమును చిత్రించినవారు కారు. వీరు ప్రేయసీప్రియులకు పార్వతీపరమేశ్వరత్వమును గూర్చిన వారు. నీడలట్లైక్య మగుటకు కాంక్షించినవారు. వీరి సంయోగశృంగారము సభ్యతాపరిధిలోనే ఉండిపోయినది. వీరి దృష్టిలో స్త్రీకి పూజ్యస్థానము కలిగినది. స్త్రీని కేళీపదార్థముగాకాక సహచరిగా, ప్రేయసిగా, ఇల్లాలుగా వీరు భావించిరి. అందువలన వీరు స్త్రీ పురుషులమధ్యగల శృంగారభావమును ప్రణయముగా నుల్లేఖించిరి. అనగా వీరు చిత్రించిన నాయికానాయకప్రణయము శృంగారావధిలోనే స్నేహమాధుర్యమును చవిచూచినది. అందువలన ప్రణయశబ్దము ఈ కవిత్వములో ఔచిత్య గర్భితమనియే చెప్పవచ్చును.

వీరు సంయోగశృంగారముకన్న వియోగశృంగారమునకే ప్రాధాన్యమిచ్చిరని తెలిపితిని. అంతమాత్రమున వీరిధ్యేయము సంయోగవిముఖతకాదు. తత్ప్రాప్తినే వీరును ఆశించిరి. కాని విప్రలంభదశలో ప్రణయపరిపాకముండుట గ్రహించి దానిని మిన్నులకెత్తిరి. వియోగములోని వింతమాధుర్యము ఉత్కృష్టమైనదని వీరు గ్రహించిరి. ఏ వస్తువైనను పొందుటకు ముందున్న ఉత్కంఠ, పొందిన పిమ్మట ఉండదు. ఆ వస్తువును పొందుటకుచేసిన ఊహలో, భావనలో, నిర్మించుకొన్న ఆశలపందిళ్ళలో ఒక విచిత్రమైన ఆనందానుభూతిరేఖ గర్భితముగానుండును. వస్తుప్రాపణానంతరము కలిగిన ఆనందములో గాఢతలేదు. అప్పటి మనఃస్థితి దూదిపింజలవలె తేలిపోవునది. గాఢపరిమళమువలె మనస్సులనంటిపెట్టుకొని నిలుచునదికాదు. ఈ రహస్యమును గమనించియే భావకవులు వియోగమాధుర్యముననుభవించి ప్రణయమును ఆదశలోనే కమనీయముగా చిత్రించిరి. భావకవులలో ప్రణయసంకీర్తనముచేయని కవి లేడని చెప్పవచ్చును. ప్రణయమింతగా కీర్తితమగుటకుగల హేతువులనుల్లేఖింతును.

### ప్రణయకవిత్వ హేతువులు :

భావకవులలో ప్రముఖులుగా పరిగణింపబడినవారు పాఠశాలలలో, కళాశాలలలో ఆంగ్ల విద్యనభ్యసించినవారే. విద్యాభ్యాసకాలమున వారికి పాఠ్యభాగములుగానున్న వర్డ్సువర్తు, షెల్లీ, కీట్సు మున్నగు ఆంగ్లభావకవుల ప్రేమగీతులు, Sonnets, చదివి వారు ముగ్ధులైపోయెడివారు. సహజముగా వారు సారస్వతాభిలాషకలవారు కావున పాఠ్యేతరములైన ఇంగ్లీషుగీతములను గూడ చదివి తమ సంస్కారమును పెంపొందించుకొన్నారు. ఇంగ్లీషు కాల్పనికకవిత్వములోని స్వచ్ఛందప్రణయము వారి నాకర్షించినది. ప్రేమించుటయన్నది ఉదాత్తకృత్యమని వారికి

తోచినది. దీనికితోడు మేఘసందేశాది కావ్యములలోని వియోగశృంగారమాధుర్యము వారి మనసులకెక్కినది. ఈ రెంటికి నాటి సామాజికపరిస్థితులు తోడైనవి. పూర్వసంఘమునందు యువతీ యువకులుకలసికొనుటయే 'అపురూపము'. అట్టి కలయిక ఏ కారణముచేతనైన కలిగినచో అది వారియందలి సర్వజీవసామాన్యమైన కామభావమునకే ఉద్గమనము కలిగించెడిది. అందు పురుషుడు ప్రథమదోషియనుట సహజము. ప్రాచీనసంఘములో కవియనగా పురుషుడే. స్త్రీలు కవిత్వముచెప్పుట, కావ్యములు వ్రాయుట మిక్కిలియరుదు. కావున పురుషుని భావోద్రేకమునకు పతాకగా మాత్రమే స్త్రీవ్యక్తి భాసించినది. అది పూర్వపు సాంఘిక పరిస్థితి.కందుకూరి సంఘసంస్కరణోద్యమఫలితముగా అప్పటికే బాల్యవివాహములపై వైముఖ్యమేర్పడినది. వితంతువివాహములు ప్రారంభమైనవి. ప్రాయములోనున్న స్త్రీలు పురుషులతోపాటు సభలలో, సమావేశములలో పాల్గొనసాగిరి. స్త్రీవిద్యావశ్యకత ప్రచారము చేయబడినది. పురుషులతో పాటు తరుణులుగూడ పాఠశాలలలో, కళాశాలలలో విద్యాభ్యాసముచేయసాగిరి. ఈ విధముగా నాటి యువకవులకు తరుణులను స్వేచ్ఛగా దర్శించెడి అవకాశము కలిగినది. వారితో సల్లాపము చేసెడి వీలుచిక్కినది. ఈ విధముగా దర్శనసల్లాపములతో వారి హృదయములలో ప్రేమ బీజములు పడినవి. ఆనాటి యువకవి తాను ప్రేమించిన ఒకానొక తరుణిని గూర్చియో, తనకు తారసిల్లిన అందకత్తెలలో ఎవరో ఒకరిని దృష్టిలో పెట్టుకొనియో ప్రేమగీతములల్లసాగెను. సౌందర్యారాధనము తమకు పవిత్రకర్తవ్యమనుభావన వారిలో బలపడజొచ్చెను. అయినను ఈ కవులలో ఎల్లరును తాము చూచిన స్త్రీని గురించియే కవితాగానము చేయలేదు. వీరిలో కొందరు ఒక ప్రత్యేకవ్యక్తిని కాక, తామూహించిన సౌందర్యమునకు సంకేతముగా ఒక ఊహాప్రేయసిని సృష్టించుకొని ఆమెచుట్టు కావ్యసూత్రములల్లిరి. మరికొందరు తాము ప్రేమించిన కన్యలు ప్రాప్తించక ఆశాభంగము జరుగగా వియోగవిషాదగీతుల నాలపించి, చివరకు ఆ విషాదమునే వరించి, భావశాంతిపొంది, ఒక అలౌకిక జగత్తును కల్పించుకొని, ఆ జగత్తులోని ప్రత్యణువులో తమప్రేయసీస్వరూపము నాలోకించి ఆరాధించిరి. ఈ రకముగా భావకవిత్వములో ప్రణయము, ప్రేయసి అనేకావస్థల నధిగమించినవి. ప్రణయకవిత్వావిర్భూతికి పై హేతువులే కాక కవుల వయస్సుగూడ ప్రధానమైనది. ఇంచుమించుగా పాతికేండ్లు నిండకముందే రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, విశ్వనాథ, తల్లావఝ్ఝల, నోరి, అబ్బూరి మున్నగు కవులు సర్వోత్తమములైన ప్రణయకావ్యములు రచించియున్నారు. పరిస్థితులతోపాటు వారి తరుణవయస్సుగూడ ప్రణయ కవిత్వమునకు దారులు తీసినదని చెప్పవచ్చును.

### ప్రణయకవిత్వములోని రెండురీతులు :

**1. వస్త్వాశ్రయరీతి :** భావకవిత్వములో ప్రణయకవిత్వము రెండు రీతులుగా ప్రవహించినది. ఒకటి ఆత్మాశ్రయరీతి.(**Subjective trend**) రెండవది వస్త్వాశ్రయరీతి (**Objective trend**). ఈ రెంటిలో ఆత్మాశ్రయరీతియే బలీయమైనది. భావకవిత్వములో వస్తువునకు ప్రాధాన్యములేదు. అంతమాత్రమున ఈ కవిత్వమంతయు వస్తురహితముకాదు. రాయప్రోలువారి

తృణకంకణములో కవిగారి అభిప్రాయములే పాత్రలముఖతః ప్రస్ఫుతమగును కావున అది భావ కవిత్వమేయగును. కాని అందులో ఒక చిన్నకథ, రెండు పాత్రలున్నవి. దీనిని కేవలము ఆత్మాశ్రయకావ్యమనుటకు వీలులేదు. కావున భావకవిత్వములో వస్త్వాశ్రయరీతికి చెందిన కావ్యముగా దీనిని పేర్కొనవలసియుండును. ఈదృష్టితోనే నేను ఈ విభాగమును చేసితిని. రాయప్రోలు తర్వాత వస్త్వాశ్రయరీతిలో చక్కని ప్రణయకవిత్వమందించినవారు క్వచిత్తుగానున్నారు. ఉన్న కొన్ని కావ్యములలో ఉత్తమమైనవి అబ్బూరివారి మల్లికాంబ, దువ్వూరి రామిరెడ్డిగారి 'కడపటి వీడ్కోలు', వెంకటపార్వతీశ్వరుల జలజమాలిక. ఇక సంగ్రహముగా వీనిని పరిశీలింతము.

**మల్లి కాంబ :**

మల్లికాకమలలు 'చిరస్నేహబద్ధలగు చెలులు'. వారిలో మల్లిక వివాహిత, కమల నవోఢ. కమల ప్రవాసియగు తన ప్రియునివద్దనుండి వచ్చులేఖలను మల్లికవద్ద దాచుకొనెను. మల్లిక భర్త సందేహముపాలై ఆ యుత్తరములను రహస్యముగా విప్పిచూచి, అవి తనయిల్లాలికి వ్రాయబడినవేయని భ్రమపడి ఆమె మరణమునకు కారకుడయ్యెను. తరువాత కమలవలన యథార్థము తెలిసికొని పశ్చాత్తప్తుడై యెచటికో వెడలిపోయెను. వెడలిపోవుముందు ఒక లేఖవ్రాసిపెట్టిపోయెను.

ఈ కావ్యములో కమలకు మల్లికకు జరిగిన సంభాషణలో ప్రణయతత్త్వము చెప్పబడినది. మల్లిక కరుణాంతరంగగా చిత్రింపబడినది. ఆమె రూపకులమ్ములందనురూపుడగు భర్తతో చేసిన కాపురములోని తీపి వర్ణింపబడినది. మల్లిక మరణానంతరముచేసిన ప్రభాతవర్ణనము ఆ దుఃఖగాఢ కనుగుణముగా నున్నది. 'నీరదకుమారిక'వంటి నూత్న ప్రయోగములు, కావ్యము చివరనున్న 'లేఖ' రాయప్రోలువారి ప్రభావమును సూచించుచున్నవి. కాలకాంభికుడు'వంటి సాంప్రదాయికపదబంధము లొకటిరెండున్నవి. ఈ విధముగా ఈ కావ్యములో 'ప్రణయలేఖల' మూలమున గలిగిన భ్రాంతితో పండువంటి సంసారమున కలిగిన ఉపప్లవము చిత్రింపబడినది.

**జలజమాలిక :**

ఈ కావ్యము నాయికాస్వగతముగా రచింపబడినది. అన్నపూర్ణ సోమయాజుల యింటి ఆడపడుచు. ఆమెకు తన మేనత్తకొడుకగు చంద్రశేఖరునితో చిన్ననాటినుండియే చెలిమి యేర్పడినది. ఆమె మొట్టమొదటిమాట 'బావ'యనియే పలికినదట. అన్నపూర్ణకు పదిరెండేండ్ల ప్రాయమున్నప్పుడు ఆమె, బావ కలసి ఒక కొలనిగట్టున గూర్చుండిరి. చంద్రశేఖరుడు కొలనిలోదిగి కమలములుకోసి ఆమెకందించుచుండగా, ఆమెమాలిక గ్రుచ్చుచుండెను. చివరికొక శతపత్రమును గోయుచుండగా కాలు బురదలో దిగబడి నీటమునిగిపోయెను. అన్నపూర్ణ ఆర్తస్వరమువిని ఆమె తలిదండ్రులువచ్చి అతనిని వెలికిదీసి కాపాడిరి. ఇంతటి సాహసియైన వరుని చేపట్టి తనకూతురేమి బాగుపడునని అన్నపూర్ణతల్లి వారి వివాహమున కంతరాయము కలిగించెను.

అన్నపూర్ణకు మరియొక సంబంధమేర్పరిచెను. వివాహసమయమునకు ఆ పెండ్లికొడుకామెను వివాహమాడనని తంతిపంపించెను. అన్నపూర్ణతండ్రి హతాశుడై, ఆమె మేనమామనుచేరి అమ్మాయిని చంద్రశేఖరునికిచ్చి పెండ్లిచేయవలసినదని ప్రార్థించును. అతడియ్యకొనడు. చంద్రశేఖరుడు విరక్తుడై విదేశములకు వెడలిపోయెను. ఇంతలో అన్నపూర్ణ రజస్వలయైన విషయముతెలిసి కులమువారాకుటుంబమును వెలివేసిరి. క్రమముగా ఆమె తలిదండ్రులు శోకదగ్ధులై మరణించిరి. అన్నపూర్ణ చివరకు తెన్నుగానక ఆత్మహత్య చేసికొనెను. చనిపోవుముందు తన ప్రియుని కందీయవలసినదిగా ఆ. పట్టణపురాజునకొకలేఖ వ్రాసినది. ఆ లేఖనుజూచికొని చంద్రశేఖరు డామెను ప్రకృతిలో లీనమైన ప్రణయస్వరూపిణిగా భావించుకొని 'జన్మజన్మంబులిట్లె నా సకియవగుచు, మదవతీ! శాంతిసుఖము నందెదవుగాక'అని తన్ను తానాశ్వాసించుకొనెను.

ఈ కావ్యములో ప్రధానవస్తువు ప్రణయమే. చిననాటి చెలిమికాండ్రేవిధముగా పరిస్థితు లడ్డురాగా విడిపోయిరో, వారి పచ్చనిబ్రతుకులేవిధముగా వసివాళ్వాడిపోయినవో చిత్రింపబడినది.

'పాపమతులై చరించెడు పరులకొఱకు అచ్ఛపుంబ్రేమ' నాశనమగుట తగదను సందేశమును ఈ కావ్యమందించుచున్నది.

**కడపటి వీడ్కోలు :**

ఒకానొక ఋషివాటికలో జరిగిన కథయిది. శారదయనుఋషికన్య, గౌతముడను ఋషి కుమారుడు బాల్యసఖులు. ఒకమాటు శారద నట్టనడివాకలో కాలుజారిపడిపోగా గౌతముడామెను రక్షించెను. ఎనిమిదేండ్ల పిమ్మట ఆ సంఘటనరూపమున వారిరువురు కలిసికొనిరి. అమె హృదయములో అణగారిన తీయనివలపులు గౌతమునిచూడగానే మొలకలెత్తినవి. తన కూతురును గౌతముడు కాపాడినాడని తెలిసికొని, శారద తలిదండ్రులాతని నెంతో గౌరవించిరి. శారదా గౌతములు కొన్నినాళ్ళపాటుగా ఆ ఋష్యాశ్రమములో కలసికొనుచుండిరి. ఒకనాటి పున్నమ రేయిలో వారిరువురు కలని విహరించుచుండగా శారద గౌతమునియెడల తనకుగల వలపును వెల్లడించినది. ఆతడందుకియ్యకొనక 'పుణ్యమతులకు సౌందర్యపూజనమే' ఆనందదాయకమని, సుందరవస్తువును తనదిగా జేసికొను ప్రయత్నము తగదని, తనకామెపై కామభావములేదని, పవిత్రప్రేమమాత్రమే కలదని చెప్పి, ఆమె పదేపదే కోరినను నిరాకరించును. అప్పుడామె భగ్నమనోరథయై యేటిప్రక్కన తాము కూర్చున్న చెట్టుకొమ్మదిగి, కడపటివీడుకోలిమ్మని, అతని కంఠమును తన బాహువులతో బిగించివేసినది. ఆ పెనుగులాటలో ఇరువురు వాగులోబడి పోయిరి.

'ఎంతపుణ్యంబు చేసెనో యీస్రవంతి
ప్రేమవాంఛల రెంటిఁ జీర్ణించికొనఁగ'

అన్న కవివాక్యముతో ఈ కావ్యము విషాదాంతముగా ముగియును.

ఈ కావ్యములోని నాయకుడు రాయప్రోలువారి పాత్రలను పోలినవాడు. నాయిక అను రాగశీలముగల అమాయికహృదయ. తాను చిననాటినుండి ప్రేమించినప్రియుని పెండ్లియాడుటకు నిశ్చయించుకొని తన అభిప్రాయమును వెల్లడించినది. అతనిదేమో చిత్రమైనప్రకృతి. వివాహమనగా 'పసిడిగొలుసుల'బంధమని అతని యభిప్రాయము. అతనికి 'అమల తృణభూమి శయ్యాతలము.' సూర్యచంద్ర నక్షత్రములు దీపములు. 'సాంధ్యజలదము'లాతని 'పడుకింటి బొమ్మలపటాలు.' అతడు సంసారవాసనలు నిరసించిన విశ్వప్రేమశీలి. 'వలపుతలపులు పూలసంకెలలు'గా భావించినవాడు. ఈ యిరువురికి బంధము పొసగలేదు. చివరకు విధి ఆయిరువురిని కాలప్రవాహములో కలిపివేసినది. ఈ కావ్యములో రాయప్రోలువారి అమలినశృంగార తత్త్వము ప్రతిపాదింపబడినది. ప్రకృతిప్రేమలోని ఉదాత్తత నాయకునిముఖతః చెప్పబడినది. ఈ రెండు విషయములలో రాయప్రోలువారి ప్రభావముగల కావ్యమేయిది. సంభాషణచాలనములో', 'బందమేయు', 'వలపుదలపులు,' 'పూలసంకెలలు' మున్నగు పదప్రయోగముల విషయములోను ఈ కావ్యముపై రాయప్రోలువారిముద్ర స్పష్టముగా కనిపించుచున్నది. ఇరువురు అవివాహితులైన సందర్భమున రాయప్రోలువారు ఇట్టి అమలినశృంగారమును ప్రతిపాదించలేదు. ఇరువురిలో ఒకరు వివాహితులైనప్పుడు, వారి చెలిమిని పెంపొందించుటకే తత్త్వమును ప్రతిపాదించినారు. ఐనను 'కష్టకమల'కథకు దీనికి కొంతసామ్యము లేకపోలేదు. దానిలో కమల తన బాల్యస్నేహితుడు తన్ను పెండ్లిచేసికొమ్మనగా కళవళించిపోయినది. ఇందులో నాయకుడు అట్లే విముఖుడగును. అందులో ముగ్ధత్వమే ఆ కలవరమునకు కారణము. ఇందులో నాయకుని విచిత్రమనస్తత్త్వమే హేతువు. కొంతవరకు రాయప్రోలువారి కావ్యప్రభావమున్నను ప్రణయకావ్యములలో విశిష్టతగడించుకొన్న కావ్యమిది.

### స్నానఘట్టము :

ఇది కాళ్ళకూరి గోపాలరావుగారు రచించిన కావ్యము. దీనిని 'అభినవభావకావ్య'మని కవిగారు చెప్పుకొన్నారు. ఇందులో నాయికతప్ప నాయకుడు లేకపోవుట నవ్యత. మూర్తీభవించిన స్త్రీ సౌందర్యమే దీనిలో కథానాయిక. 'సౌందరీ'నాయిక స్నానఘట్టమునకుబోయి, వస్త్రము నుదికికొని, కొలనిలో స్నానమాడి, బిందెలో నీరు నింపికొని ఇంటికి వెడలిపోవుట ఇందులోని వస్తువు. ఈ వస్తుచిత్రణమునకై కవిగారుచేసిన వర్ణనలన్నియు ప్రబంధకవుల మూసలో తయారైనవే. దీనిని భావకావ్యమనుటకు హేతువిట్లు విచారింపనగును. ఈ కావ్యములో నాయకుడు లేడని తెలిపితిని. స్నానసుందరి కొలనిలోనికి ప్రవేశించినప్పటినుండి 'ద్రష్టలు' ఆమె సౌందర్యమును సందర్శించుచున్నట్లు వర్ణింపబడినది. ద్రష్టలెవరో కవిగారు చెప్పలేదు. కాబట్టి 'ద్రష్ట' శబ్దమును నేత్రమునకు పర్యాయముగా గ్రహింపవలెను. కావున నేత్రమే ఈ కథలోని నాయకుడు. 'లోచనశృంగారలోలనాయకుడు' స్పర్శనాదులులేక దర్శనమాత్రముననే సౌందరీనాయికాసౌందర్యమనుభవించినట్లు చివరి ఘట్టమున కలదు.

'తనుయోగమించుకంతయులేని కతన
శృంగారమునకు శుచిత్వమిందొప్పు'

నని కవిగారికావ్యమున అమలినశృంగారమునే ప్రతిపాదించిరి. ఈ దృక్పథముపై రాయప్రోలువారి ప్రభావమున్నదని వేరే వ్రాయనక్కరలేదు. సౌందర్యము సందర్శనమునకే కాని సంస్పర్శనమునకు కాదను పాశ్చాత్యప్రణయకవుల ధోరణికి లక్ష్యముగా ఈ కావ్యము రచింపబడినట్లు గోచరించుచున్నది. ఇదియును వస్త్వాశ్రయరీతిలో రచింపబడిన నవ్యకావ్యమే. కావున దీనిగూర్చి పేర్కొంటిని. వస్త్వాశ్రయములైన ప్రణయకావ్యములలో కొడవటిగంటి వెంకటసుబ్బయ్య 'భిక్షువు' అను కావ్యముగూడ ఎన్నదగినదే. ఈ కావ్యములో నర్మదయను యువతి సతీశుడను పేరుగల తన మేనమామకొడుకును చిన్ననాటి ప్రేమించును. ఆమె భాగ్యవంతులబిడ్డ. అతడు దరిద్రుడు. ఆమె శ్రీమంతులబిడ్డయగుటవలన తనను ప్రేమించునో లేదోయని, అపార్థముచేసికొని అతడు భిక్షువుగామారెను. ఆమె ఎంతబ్రతిమాలినను వినక 'నర్మదాపుణ్యాతీరమంజులారణ్యసీమ నెమ్మదివసింప'గా వెడలిపోవును.

## 2. ఆత్మాశ్రయరీతి :

### (i) స్వేచ్ఛంద ప్రణయము :

భావకవులు ప్రేమయన్నది ప్రాణికి సహజలక్షణమని భావించిరి. చెట్టునకు మొగ్గదొడిగెడుచేష్ట, కోరకమునకు వికసించుగుణము, విరికి వలపులవెదజల్లువిద్య, వలపునకు గుబులొ్కను అలవాటుకలవని, ఇదియంతయు దేనికొరకనగా ప్రేమకొరకేయని వారు సమాధానమిచ్చిరి.[1] పువ్వులెందుకు సౌరభమును చిమ్మునో, చందమామ యెందుకు వెన్నెలవెదజల్లునో, సలిలమేల పారునో, గాడ్పేలవిసరునో, ఆ కారణముచేతనే నేను నిన్ను ప్రేమింతునని భావకవి ప్రేయసితో తెలుపును.

"సౌరభములేల చిమ్మ పుష్పవ్రజంబు ?
చంద్రికలనేల వెదజల్లు చందమామ ?
ఏల సలిలంబుపాఱు ? గాడ్పేలవిసరు ?
ఏల నాహృదయంబు ప్రేమించునిన్ను.[2]"

ఈ పద్యముపై షెల్లీ 'Love's philosophy' అను గేయము ప్రభావము ప్రబలముగా కనిపించును.

1. వెంకటపార్వతీశ్వరకవుల కావ్యకుసుమావళిలో 'ప్రేమకొఱకు' (పద్యములు) : ప్రథమసంపుటి : ద్వితీయభాగము : పుట 106.

2. కృష్ణపక్షము : కృష్ణశాస్త్రి : పుట 32.

"The mountains mingle with the river
And the rivers with the ocean,
The winds of Heaven mix forever
With a sweet emotion;
Nothing in the world is single;
All things by a law divine
In one spirit meet and mingle
Why not I with thine.'

ప్రకృతిలో సంయోగగుణమన్నది ప్రధానమని, పరస్పరప్రేమయే దీని మూలసూత్రమని షెల్లీ చెప్పిన అభిప్రాయమునే కృష్ణశాస్త్రిగారు చెప్పియున్నారు. 'వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపి హేతుః' అని పలికిన భవభూతి భావముకూడ దీనిలో ధ్వనించుచున్నది. బసవరాజు అప్పారావు గారు పవిత్రమైన ప్రణయమునకు హేతువుండదని, అది 'అందపుతళుకుల కతీతమైనదని' ఆత్మను ఆత్మను కలిపికుట్టుదారమే నాదుప్రేమకుఁ గారణమ్ము'[1] అని భవభూతిచెప్పిన 'అంతర్మర్మాణి సీవ్యతే' అన్న శ్లోకములోని భావమునే సొంతగొంతుతో వినిపించిరి. ఈ విధముగా భావకవులు జీవులకు ప్రేమ సహజమైనప్రవృత్తిగా భావించి తత్సమారాధనమునకై కవితాద్రవ్యమునుపయోగించిరి. ఈ ప్రణయభావన తుమ్మెదవలె మనస్సులో ఝుంకరించుచుండగా తన ప్రేయసి నుద్దేశించి 'లోకముతో మనకేటికి లోలాక్షీ రాపోద'మనిరి.[2] చివురించిన మావులక్రింద 'చేయికి చేయి జేర్చి, పెఱచింతనలన్ మరపించురాగముల్ దీయుచు వాసనల్ పరిమళించెడు చోటులందు' విహరించుటకై; 'ప్రేయసిలేచిర'మ్మని పిలిచిరి.[3] 'లేతమనసుల్ తడిచేసెడు చెట్లచాటున' పొలముగట్లనీడలలో మేనులానుకొని కూర్చుందము రమ్మని ప్రణయిని కాహ్వానము పంపిరి. స్వచ్ఛందప్రణయమును కాంక్షించిన కవికి నేల, ధూళి పిలిచిన వినిపించదు. అతడాకుతో ఆకై, పూవులో పూవై పోవనిచ్చగించును. సంఘము విధించిన 'కఠినదాస్యశృంఖలలు' చెదరిపోగా 'గగనతలము మార్మ్రోగగా కంఠమెత్తి జగమునిండ స్వేచ్ఛాగానఝురులు'[4] నింపును. ఆ స్థితిలో అతనికి సార్వభౌమభోగములు రుచించవు. అతడు తన ప్రేయసి, తాను, 'ప్రవిమలప్రేమ సామ్రాజ్యపట్టభద్రు'లైనట్లు భావించుకొని తృప్తిపడును.[5] అఘవిదూషితమగు తన హృదయములో కోమలతమమైన పవిత్రప్రేమ అంకురించుటెట్లను సందియమక్కరలేదని, శర్వరీతమో వీధులలోనే పూర్ణతేజస్వియైన చంద్రుడు రాడాయని ప్రశ్నించును.[6] ఈ విధముగా భావకవి స్వచ్ఛమైన స్వచ్ఛందప్రణయమును తన జీవితధ్యేయముగా పెట్టుకొని, అందుకనుగుణమైన ప్రేయసినన్వేషించి ఆమెనారాధించును.

1, 2. బసవరాజు అప్పారావు గీతాలు : ప్రేమకారణము : పుట 126.
3, ఊహాగానము : అబ్బూరి : పుట 16.
4. కృష్ణపక్షము.
5. 6. కృష్ణపక్షము పుటలు 30, 34

(ii) పూర్వరాగము :

తాను ప్రేమించిన సుందరి తనకెప్పుడు వశమగునోయని భావకవి ఎదురుతెన్నులు చూచును. తన ప్రేయసికి సంఘము, విధి అడ్డురాకుండఁగాకయని దైవమును ప్రార్థించును.

"ప్రకృతికాంతాధరరసమ్ము వడియగట్టి
పోతపోసినట్లొప్పు నాప్పులగులాబి
క్రూరకంటకహతి సొంపు గోలుపోక
కన్నులకు విందొనర్చెడు కాలమెపుడొ"[1]

యని ఆందోళనపడును. తన ప్రేయసిగులాబి. అది కంటకముల పాలుగాకుండ తన చేజిక్కవలయును. తన ప్రేయసి మినుకుమినుకుమని 'మిన్నున మెఱయుచుక్క'; అది కాఱుమబ్బుల తెరదాటి కదలివచ్చి తన హృదయములోఁజొచ్చి ప్రకాశింపవలసియున్నది. ఈ విధముగా ఆందోళనపడిన భావకవి తన అప్రాప్తమనోహరి అనుగ్రహవీక్షణము కోరుకొనును. మోమున మోముచేర్చి ముద్దిడుకొను తమకము తనకులేదని, ఆమె తనను 'వైజ్ఞానికసాధుభాషణముల' తనియించిన చాలునని, కమనీయశోభచే ఆమె తనను కౌగిలించుకొన్న పదివేలని భావించును.[2] ఈ విధముగా పూర్వారాగావస్థలో ఆమె దర్శనభాషణములతోనే కవి తృప్తుడగును.

(iii) *సంయోగదశ* :

పూర్వరాగము విమ్మటిది సంయోగదశ. ప్రేయసీ సమాగమము కొరకు కవి ఉవ్విళ్ళూరు చుండును. ఆ మబ్బు ఈ మబ్బు ఆకాశమధ్యాన అద్దుకున్నట్లు మనమైక్యమౌదామే'యని ఆమెను ప్రార్థించును.[3] మూఢవిశ్వాసశృంఖలములను విదలించుకొని వలపుకౌగిటిముడి పట్టుబడినచో తమ 'శరీరసుఖస్పర్శనమునకు' 'అణువణువుకూడ నవజీవన మనుభవించు'నని, తామువేగు టోకలో రాలు పూలజతవోలె ఆనందప్రపూరములో జన్మజన్మాలయాత్ర సాగింతమని ప్రేయసితో నివేదించును.[4] ప్రేయసి ప్రియునిపిలుపు విన్నది. ఆ ప్రేమజీవుల జననాంతరసౌహృదము ఒక్కమాటు గుబాళించినది. 'ప్రకృతిసౌధపుదక్షిణద్వారమంత తెఱచుకొనివచ్చి' 'మృదులపవమాన పరిమళోర్మికలు' వారిని దృఢాశ్లేషములో బిగించిపోయినవి.[5] అపుడు వారు లౌకికబంధములను త్రెంచుకొని 'యుగయుగముల ప్రేమవియోగభారమూర్ఛవైచుచు' లోకముమాటయే మరచి శరదుదయోత్సవములలో మైమరచిపోయిరి.[6] వారిసంయోగదశ

1. సౌభద్రుని ప్రణయయాత్ర : నాయని : 'ఎపుడొ' శీర్షిక.
2. ఊహాగానము : పుట 18.
3. బసవరాజు గీతాలు : పుట 41.
4. దీపావళి : వేదుల : పుట 16.
5. 6. దీపావళి : పుటలు 18, 22.

అపూర్వమాధుర్యములను వెల్లివిరియించినది. ఆ ప్రేయసీప్రియు లొకరినొకరు చూచుకొనుచు పవ్వళించగా పరస్పరాలోకన మార్గణములు వారి హృదయజీవమర్మములను కలచి, అమృతరస గర్భితములైన అలలను ఆవరింపజేసినవి.[1] అతనికి నిద్రవచ్చి కనులు మూసికొని పోగా ఆమె అతని కనులలో కనులుంచినది. అపుడాతని హృదయములో కోటిలోచనము లేకకాలములో వికసించినవి. అతవి నాసికలో ఆమె నిశ్వాసపవనము నింపగ అతని అంత రంగములో ఆనంతకోటి జీవవాయుతరంగములు చెంగలించినవి.[2] ఇట్టి సంయోగమాధుర్యమును ప్రేయసీప్రియులనుభవించినట్లు భావకవిత్వము చిత్రించినది. సంయోగమనగానే చౌశీతిబంధ ముల ప్రసక్తి, ఉపరత్యాదుల ప్రసక్తిలేనిదే శృంగారప్రబంధయుగములో పంక్తి కదలలేదు. ఇట్లను టతో పూర్వకావ్యములలో సభ్యమైన సంయోగవర్ణనలు లేవని నాయభిప్రాయముకాదు. భవభూతి చిత్రించిన సంయోగశృంగారమునకు ఉత్తరరామచరిత్రములోని 'కిమపి కిమపి మందం' వంటి శ్లోకములు చక్కని తార్కాణలు. అట్లే మన ప్రబంధములలో అందందు సభ్యమైన సంయోగ వర్ణనలు లేకపోలేదు. కాని వీనిలో భావకవిత్వములోని విశిష్టత కొరవడినది. భావకవిత్వములోని 'సంయోగదశ' చుంబనావస్థను దాటిపోలేదు. ఆ చుంబనమునుగూడ వీరెంతో చమత్కారముగా వర్ణించిరి.

> 'బింబఫలములబోలు నీ పెదవులెపుడు
> ఈయధరమంటి వేడిముద్దిచ్చె, నపుడె
> అంకితంబయ్యె నాహృదయంబునీకు
> నృపతిముద్రాంకితంబైన లేఖయట్లు.'[3]

**(iv) *ఆశాభంగము; విప్రలంభము :***

తాను ప్రేమించిన సుందరియును తాను కలయకముందే, ఆమె తనకు కాకుండపోగా ప్రియునికికలుగు ఆందోళనము భావకవిత్వములో ప్రధానముగా చిత్రింపబడినది.

> 'తళుకుమని కనిపించి వలపువెల్లువముంచి
> వలపించిమాయమై వనటగూర్చితివా'[4]

అన్న పాదములలోని భావము ఈ అవస్థను సూచించునదే. ప్రేయసి తనపై అనురాగసుధా వీచికలు గురియుచుండగా, తానామెను తనదానిగా జేసికొనుటకు ప్రయత్నించుస్థితిలోనుండగా విధియడ్డువచ్చినది. ప్రియుడామెగళములో విసరిన ప్రేమప్రసూనమాలను విధి నడుమనేపట్టి నలిపివైచినది. ఆ దుర్విధియే ఆ ప్రణయజీవులకు మధ్యనున్న పరమాణువులకు వాగ్బంధనము

---

1. 2. సౌభద్రునిప్రణయయాత్ర : పుటలు 99, 100.
3. కృష్ణపక్షము : పుటలు 48, 50.
4. కృష్ణపక్షము : పుటలు 48, 50.

కల్గించి వానిని దూతకర్మనుండి నివర్తింపజేసినది.[1] ఈ విధముగా అంతరాయము కలిగించిన విధికి వ్యతిరేకముగా భావకవి యెలుగెత్తినాడు.

'ఎవ్వడే రాక్షసుడు మనమీదనున్న
యవధియంతయుఁ దానయైయాక్రమించి
వికటదంష్ట్రాభయంకర వికృత వదన
విషమహాసుండు నన్నిట్లు వెక్కిరించు.'[2]

ఈ విధముగా తమస్వచ్ఛందప్రణయమున కడ్డువచ్చిన పరిస్థితులకు రాక్షసత్వమంటగట్టినాడుకవి.

తాను ప్రేమించిన సుందరియును, తాను ప్రేమరజ్జువులతో ముడివడియుండగా దుర్విధి అతనినుండి ఆమెను వేరుచేయుటయో, ఆమెను రూపుమాపుటయో జరుగును. తన జీవితాశయమే పూవుగా మారినదనుకొన్న ప్రేయసి తనకొక గులాబిపూవువంటిది. తాను, ఆ ప్రసవము, కనులు విచ్చి చూచికొనుచు కాలముగడపుచుండగా, ఎదలను నిశ్శబ్దముగా పల్కరించుకొనుచుండగా

"అల్లదిగియె
ఒక్క క్రూరార్కకిరణమ్ము; ఉర్వివాలి
(నా) గులాబి సోలితూలి (నన్ను) వీడె."[3]

ఈ రీతిగా తన ఆశలు నేలగూలినందుకు కవి విలపించును. అపుడతనికి ఎడతెగని బాధయే మిగిలినది. పై పంక్తులు రవీంద్రుడు వ్రాసిన క్రిందిపంక్తులను తలపించుచున్నవి.

"—I have not my roses, only the pain remains," (Gardener LVII)

తన ప్రాణములోని ప్రాణమైన ప్రేయసీవియోగమునకు కవి ఈ విధముగా క్రుంగిపోయి ఆ ప్రేయసీసమాగమమునకు లోకమడ్డురాగా దానిని నిర్భయముగా నిందించును. తన రెక్కలు విరిచి, తనను పంజరములో బంధించుట పాడికాదని ఆక్రోశించును. విహగదంపతుల వలె నీలినింగినీడలో, చిటారుకొమ్మపై కాపురముచేతుమనుకొన్న ప్రేయసీప్రియులమధ్య విఘాతము కలిగించుట తగదని ఎలుగెత్తిచాటును. 'ఏటిపనియిదిలోకమా! హృదయదళనదారుణ మహోగ్రకార్యంబు దలచినా'వని[4] లోకముగుండెమీద చేయివేసి ప్రశ్నించును. కాని లోకము నిర్దాక్షిణ్యమైనది. అది చేయవలసినంతచేసినది. ప్రేయసీప్రియులమధ్య అఖాతము సృష్టించినది. ముండ్లకంచెలు నిలిపినది. కవి ప్రేయసీవియోగము సహించక ఒకమాటు అఖాతములో దిగబడెను. ఇంకొకమాటు ముండ్లకంచెలో కాల్మోపెను. తనప్రేయసికొరకు మిన్నుమన్నంతయు

---

1, 2. సౌభద్రుని ప్రణయయాత్ర : పుటలు 121, 125.

3. వైతాళికులు : నోరిపద్యము : పుట 69.

4. కృష్ణపక్షము : పుట 40.

గాలించెను. లోకమాతనిని ముష్కరముగా నిర్బంధించినది. పికమునకు సహజమైనగానము వల దని శపించినట్లు, అతని ప్రేమను నిషేధించినది. దీనితో కవి నిరాశానిహతుడై, వియోగ దందహ్యమానుడై పోయినాడు. అతడు 'వేయికరములు సాచికొని, వేయికన్నులు విరిసికొని వేయిగుండెలు కొట్టుకొనగా' ప్రేయసికొరకు వేచియున్నాడు.[1]

'కంటిరెప్పలు మింటికప్పుల
నంటిపోయె నిరీక్షణంబున
ఫాలతలమున రక్తనాడులు
భగ్గుభగ్గున మండుచున్నవి'[2]

అని తన బాధాతిరేకమును వ్యక్తపరిచినాడు. తాను రేయింబవళ్లు ప్రేయసికొరకు చేసిన నిరీక్షణలోని ఉత్కటత్వ మీ చరణములలో కనిపించుచున్నది. షేక్స్పియరు విప్రలంభదశలో ఈ విధముగానే నిరీక్షించినాడు.

'It is my love that keeps mine eyes awake;
My own true love that doth my rest defeat,
To play the watchman ever for thy sake;
For thee watch I, whilst thou dost wake elsewhere.'[3]

ఈ విధమైన నిరీక్షణలో, అన్వేషణలో జీవితములోని విలువైన గడియలు కర్పూరమువలె కరగి పోయినవి. విప్రలంభస్థితిలో విధూతుడైన భావకవికి చంద్రుడు, ఆషాఢమేఘము, మలయపవనము మున్నగునవి ఆప్తమిత్రములవలె కనిపించును. ఇది పూర్వకవిత్వమునకు భావకవిత్వమున కున్న వ్యత్యాసము. ప్రాచీనకావ్యములలో విరహియైన నలునికి దక్షిణానిలము 'కాలాంతఃపుర కామినీకుచతటీకస్తూరికాసౌరభశ్రీలుంటాకము'గా, 'చందనాచలతట శ్రీఖండ సంవేష్టితవ్యాళ స్ఫారఫణాకఠోరవిషనిశ్వాసాగ్నిపాణింధమము'గా అతిక్రూరముగా కనిపించినది.[4] వరూధినికి చంద్రబింబము 'గోవధనుసేయు తురకల దైపము'గా కనిపించినది. త్రిపురసంహారవేళ హరుడు రథచక్రముచేయుటకై చంద్రుని మేనిని తొలిచి రంధ్రముచేసెను. ఆ రంధ్రపుగాయము 'సెలవాఱి' చావనైన చావలేదేయని ఆనాటి నాయిక చంద్రుని నిందించినది.[5] ప్రాచీనకావ్యములలోని నాయిక విరహస్థితిలో

'అళులకునులుక్క మందమలయానిలమన్న భయంబునెందు, కో
యిలగని బెగ్గడించు—'[6]

1. 2. మధుకీల : మల్లవరపు . పుటలు 51, 52.
3. Shakespeare's sonnets : LXI.
4. శృంగారనైషధము : ద్వితీయాశ్వాసము.
5. మనుచరిత్రము : తృతీయాశ్వాసము.
6. కుమారసంభవము : నన్నెచోడుడు.

భావకవిత్వములో చంద్ర, మలయానిలాదులు ప్రియమిత్రములుగా భాసించునంటిని భావకవి చంద్రునుద్దేశించి

'విరిసిన పూలవెన్నెలల వెల్లువఁ జక్కఁదనాల హంసవై
యరిగెదు నిన్ను జూచి నిశలందున నాకగుబాష్పశాంతి'[1]

అని యనును. సంధ్యాసమీరునితో తనను ఎచ్చటికైన తీసికొనిపోవాయని యాచించును.[2] ఆ స్థితిలో శ్రావణమేఘగర్జకు పెంపుడునెమిలిసైతము పురివిప్పి ఆడకపోగా, తనవలెనే విరహస్థితిలో నున్నట్లు కవిభావించును (వేదుల). చకోరినిజూచి దీనికి పున్నమ యెప్పుడు ప్రాప్తించునోయని నిర్వేదించును (వేదుల). తనకాషాఢమేఘమన్న ఎంతో ఇష్టమనును (విశ్వనాథ). ఈ విధముగా భావకవి విప్రలంభదశలో నున్నప్పుడు ప్రకృతిని అసహ్యించుకొనడు. ప్రకృతిలోని ప్రత్యంగ మతనికి చిత్తశమనము గూర్చునదిగా కనిపించును.

(v) విషాదస్థితి :

భావకవిత్వములోని విప్రలంభశృంగారములో విషాదభావన పరాంకోటినందుకొన్నది. ఈ విషాదము అనేకభంగులలో విస్తరించినది. ప్రణయకవిత్వములోని ఈ దుఃఖభావన ఉత్తర రామచరిత్రలో, వాల్మీకిరామాయణములో, సీతావిరహమువలన రాముడుపొందిన శోకోద్వేగ మును స్మరింపజేయును. తలిరుప్రాయములోనున్న కవి ప్రణయజీవితము లోకముయొక్క నిష్ఠురపదఘాతముతో నలిగిపోయినది. అతనికి అతని ప్రేయసికి మధ్య కాలరాక్షసుడు ఇనుప తెరలు వ్రేలాడదీసినాడు. అప్పుడాతడు భగ్నాశుడై బ్రతుకుటెడారిలో పయనించినాడు. తన జీవితములో ఇక సుఖములేదని గమనించినాడు.

'వికృతహాసకరాళదంష్ట్రికలు మెరయ
నీలకైశికకాళి మమ్మొలగింప
ఒక్కయెడ విస్ఫులింగములుమిసికొనుచు
తొంగిచూచుచున్నది దుఃఖదేవి' (పెనుమర్తి)

అని దుఃఖమేరీతిగా తన ఆనందధామములో అడుగుపెట్టనున్నదో గ్రహించినాడు. కీట్సు ఈఅభి ప్రాయమునే వెలిపుచ్చినాడు.

'Ay in the very temple of delight
Veild Melancholy has her sovran shrine'.—Ode on Melancholy

విషాదము రాహువువలె తన్ను గ్రసించినది. అప్పుడేమియుచేయలేక కవి విలవిలదన్నుకొన్నాడు.

1. దీపావళి : 'సుధాకరా' : పుట 74.
2. కృష్ణపక్షము : పుట 60.

'దారుణపు జీవితంపు టెడారిలోన
తీరని పిపాస నేదారి తెన్నులేక
నేనె నాదుఃఖబాష్పశోణితలహరుల
నే విసుగువేసటలు లేక త్రావినాను'[1]

అని తనదుఃఖోద్వేగమును ప్రకటించినాడు. కడుపుగాల్చెడు మండుటాకలితో ఒడలెరుగక కాలమృత్యువును కబళించసాగినాడు.[2] లోకము తనకుచేసిన అన్యాయమునకు, తన ఆశయ భంగమునకు గుండెపగిలిపోగా షెల్లీ ఈ విధముగానే "I fall upon the thorns of life, I bleed'' అని రక్తాశ్రువులు రాల్చినాడు. లోకమతనికి 'నిత్యహింసారిరంసావినిద్రరుద్ర' భీకరముగా కనిపింపసాగినది. కాఱుకొన్న అమాసచీకటులమధ్య గుండెలు మరణవాద్యముల వలె కొట్టుకొనగా విలపింపసాగినాడు.[3] లజ్జావిషాదదురంతభారవహనమునకోర్వక, ఆతని బ్రతుకు పాతాళలోకంపుటిరుకుసందులకు దిగబడిపోగా భరింపలేక తన్నేద్వనిందని ఎలుగెత్తినాడు.[4] 'దుర్భరశోకవిషమగీతులేడ్చివైతు; ఎలుంగెత్తి యేడ్చివైతు'నన్నాడు.[5] ఆతనికి రోదసినిండ శోకగీతములే వినిపించినవి.[6] అకాలమృత్యుగర్జాకలితాట్టహాసములలో ప్రేమవిహ్వలాశాకరు ఐమ్ములౌ గుసగుసలు విన్పించగా, ఉలూకవిలోకములు చెమర్చగా రక్తబాష్పములు సోనలు వారనేడ్చినాడు కవి.[7] అతడు గొంతెత్తి యేడ్వగా ప్రకృతిసైతము చకితమైపోయినది. అతనిని కాంచగానోపలేక

"— — — — కన్నులట్టె
యార్చికొనినవి తారకలు; అపుడు మొగిళు-
లల్లనల్లన నలనల్లనై భరమ్ము
లైన నిట్టూర్పుదొంతరలైనవి; అపుడు
కుంచుకొని కుంచుకొని కుహూకుహరవాటి
(నను) దొలగి దవ్వు దవ్వులు చని శిరాలు
వాల్చికొనినవి తిమిరాలు భయవశాన''[8]

ఈ విధముగా దుఃఖపీడితుడైన కవి ఒకానొక విచిత్రమైన మనఃస్థితికిలోనైనాడు. నైరాశ్యమును వరించినాడు.

'నాకుగాదులు లేవు నాకుషస్సులు లేవు
నేను హేమంతకృష్ణానంతశర్వరిని'[9]

1. 2. 3. దీపావళి : పుటలు 39, 39, 48.
4. 5. కృష్ణపక్షము : పుటలు 65, 66. 6. 7. దీపావళి : పుట 45.
8. 9. ప్రవాసము : పుటలు 94, 101.

అని చెప్పుకొన్నాడు. 'ఎవ్వరనుకొంటిరో నన్ను ఏననంతశోకభీకరతిమిరలోకైకపతిని'అని ఉద్ఘోషించినాడు. 'కంటకకిరీటధారినై కాళరాత్రిమధ్యవేళల జీమూతమందిరాల' కొలువు తీర్చినాడు.[1] కంటకకిరీటమును తలదాల్చుటయనగా దుఃఖమును వహించుటయని అర్థము. దుఃఖవరణము బైబిలు సంప్రదాయము. దుఃఖమునుద్దేశించి కృష్ణశాస్త్రి మున్నగువారు కవిత్వము వ్రాయుటగూడ బైబిలు సంప్రదాయమే. బైబిలులో దుఃఖము హృదయ ప్రక్షాళనమునకు సాధనమని చెప్పబడినది. Glorification of sorrow బైబిలుచూపిన బాటయే. దీని ప్రభావము బ్రహ్మసమాజబోధలపైపడినది. కృష్ణశాస్త్రిగారు 'కురియుమురా కన్నీరును మరిమరి విలపించుమురా'వంటి భావములు వెల్లడించుటకు పై ప్రభావములు పనిచేసినవి. 'Give me the bread of tears' అని బైబిలులో కలదు. జీససు బొమ్మను 'Crown of thorns'తో (కంటకకిరీటముతో) చూపించుట బైబిలు సంప్రదాయమే. క్రీస్తు దుఃఖమును వరించిన మహాత్ముడు. ఈ సంప్రదాయమునే గ్రహించి భావకవులు తమకన్వయించుకొన్నారు. కొన్నిసార్లు ఈ దుఃఖోద్వేగము మృత్యువరణమువరకుపోయి బీభత్సముగా పరిణమించుట కలదు.

'నా మరణశయ్య పరచుకొన్నాను నేనె' యనుటలో ఈ పరిణామమే కలదు. ఈ మృత్యువరణము కీట్సులో కనిపించుచున్నది.

"— — — — for many a time
I have been half in love with easeful death,
Called him soft names in many a mused rhyme,
Now more than ever seems it rich to die."[2]

ఈ విషాదభావము విలాపమునకు, మృత్యువరణమునకు మూలప్రవృత్తి. అయినను ఈభావములన్ని ఒక క్రమములో కలుగునని కావు. ఒక్కొక్కమాటు ఈ భావములన్నియు ఏకత్రగతములై కవిగుండెను కలచివేయును. దీనినే భావశబలయందురు. ఈ భావములకు తోడుగా కవి లోకము నసహ్యించుకొని 'పలాయనతత్త్వము'ను పాటించుట కలదు. నైరాశ్యమును తన జీవితసర్వస్వముగా వరించుట కలదు. తర్వాత విషాదవిషములోనే ఆనందామృతము నాస్వాదించుట కలదు. ఈ చిత్తవృత్తులను క్రమముగా వివరింతును.

### (vi) పలాయనతత్త్వము : నిరాశావాదము :

కవికి ప్రపంచము మృగతృష్ణలయింద్రజాలముగా 'అకాలమృత్యుగర్జాకలితాట్టహాస'[3] మయముగా కనిపించిన తర్వాత, అతడీ ప్రపంచమునేవగించుకొనును. 'యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'అన్నట్లు దుఃఖోద్వేగములోనున్న కవికి వాస్తవికజగత్తు దుఃఖమయముగా కనిపించును. అతడీ జగత్తునుండి దూరదూరాలకు, రహస్తీరాలకు ఎగిసిపోవలెనని ఇచ్ఛ

1. కృష్ణపక్షము : పుట 63. 2. Ode to a nightingale.
3. దీపావళి : పుట 45.

గించును. చంద్రునితో 'ఈ యామిని మాత్రమే తిరుగులాడెద నేఁ జిఱుమబ్బువోలె నీతో మన సార, నొక్కపరి దోడ్కొని పోమ్మటకో సుధాకరా'అని మొరపెట్టుకొనును,[1] సంధ్యాసమీరము నుద్దేశించి

'ఓయి సంధ్యాసమీరణా, రేయితోడఁ
గారు చీఁకటితోడ దుఃఖమ్ముకూడ
పరువు పరువున నాకొఱ కరుగుదెంచు;
నీదు నునులేతఱెక్కలమీద వడిగ
నెత్తికొని పోవరాదె నన్నెచటికేని''[2]

అని యాచించును. ఈ చరణములు 'O lift me as a wave, a leaf a cloud' అని West wind నుద్దేశించి షెల్లీ పలికిన వాక్కులను స్ఫురింపజేయుచున్నవి. లోకావరణమును దాటి, మిన్నుల కెగిసిపోవలెనను ఈ పలాయనతత్త్వము (Escaping from bitter realities of life) షెల్లీ, కీట్సులనుండి మన కవిత్వమునకు సంక్రమించినది. తెలుగుపైగల కాల్పనిక కవిత్వప్రభావములలో ఇది బలీయమైనది. దీనిని కాల్పనికోద్యమకాలములో Romantic melancholy అనిరి. దీని తత్త్వమిది.

'Longing for the unattainable ideal; and the feeling that the sensitive artistic genius is bound to be destroyed by the materiaiistic crowd.'[3]

షెల్లీ 'Ode to the west wind'లో ఈ తత్త్వమే కనిపించుచున్నది. కీట్సు 'Ode to nightingale' అన్న గీతములో ఈ తత్త్వము సమగ్రాకృతి దాల్చినది.

"— and leave the world unseen
And with thee fade away into the forest dim
— — — — — — — — —
Fade for away, dissolve, and quite forget
What thou among the leaves hast never known."

అను చరణములలో కీట్సు జగత్తునువీడి గహనాటవులలోనికి ఎగసిపోవు కాంక్షనే వ్యక్తము చేసెను. జీవితములో తాముపొందిన Weariness, fever, fret (అశాంతస్థితి)అను వానినుండి తప్పించుకొనుటకు కోకిలలతోపాటు సమీరముతోపాటు పారిపోయిన బాగుండునని షెల్లీ, కీట్సు భావించిరి. కృష్ణశాస్త్రిగారి 'పలాయనతత్త్వము'పై ఇది ప్రబలప్రభావమును వేసినది. 'కోకిల' అన్న శీర్షికతో పెనుమర్తి వెంకటరత్నంగారు వ్రాసిన పద్యములో కీట్సు వెల్లడించిన భావమే

1. దీపావళి : పుట 74.
2. కృష్ణపక్షము : పుట 60.
8. Dictionary of world Literary Terms.

వ్యక్తీకరింపబడినది. కోకిల ఇతనికి ఆనందసహధర్మచారియైన ఒకతేజోలేశము'గా కనిపించుటలో కొంత తాత్త్వికదృష్టియున్నను, ప్రధానముగా కీట్సు ప్రభావమే పనిచేసినది. ఈ పద్యమందుకు తార్కాణము.

'నన్నుఁ గ్రమ్మిన బాహ్యబంధము లెడల్చి
మ్రోగుచున్నది నీ గీతముగ్ధరవము
ఎగిరివత్తునులే ! యుగవిగమవేళ
నిన్నుగూడి మాధుర్యముల్ నింపుకొరకు.'

(vii) విషాదమాధురి :

విషాదక్లిన్నమైన కవిమనస్సులో అనేకభావములు తరగలెత్తివచ్చును. పలాయనతత్త్వము అతని మనోవికృతిదశలలో ఒకటి. మృత్యువరణము అట్టిదే మరియొకటి. ఈ విధముగా ఆటుపోటులతో, ఊహాపోహలతో, అనేకభావప్రతిఘాతములతో కల్లోలితమైన కవిహృదయసాగరములో అమృతోదయమగును. హాలాహలగర్భములో అమృతరేఖలను దర్శించెడు 'సమదృష్టి' అతనికి కలుగును. 'Invocation to misery'అను గీతములో షెల్లీ దుఃఖమును ప్రేయసిగా, తోడునీడగా, సోదరిగా, ఆనందసంధాయినిగా భావించినాడు.

'Come be happy sit near me' అని దుఃఖమును సంభావించినాడు. తెలుగు భావకవి కూడ ఈ విధముగానే దుఃఖమును తనకు తోడునీడగా భావించినాడు.

"నాకు నిశ్వాసతాళవృంతాలు కలవు
నాకు కన్నీటిసరులదొంతరలు కలవు
నాకమూల్యమపూర్వమానందమొసగు
నిరుపమనితాంతదుఃఖంపునిధులు కలవు"[1]

అని విచిత్రముగా చెప్పికొన్నాడు.

'ప్రేమదాహాన నెదదతపించుకాలది
అమృతమొలికింతు స్మితనయనాంచలముల'[2]

అని దుఃఖములోనే ఆనందమును ప్రదర్శించినాడు. కన్నీటికెరటములలో వెన్నెలను, నిట్టూర్పుగాడ్పులో నెత్తావిని, అశనిపాతమ్ములో అంబువును. హాలాహలమ్ములో అమృతమును దర్శించగలిగినాడు.[3]

1. కృష్ణపక్షము : పుట 64.
2. దీపావళి : పుట 53.
3. కృష్ణపక్షము : పుట 56.

'Our sweetest song are those that tell of saddest thoughts' అన్న షెల్లీవలె విషాదభావనలోనే ఆనందగీతామృతము ననుభవింపగలిగినాడు. కృష్ణశాస్త్రి, వేదుల ఈ విధమైన భావచ్ఛాయలను ప్రదర్శించినవారిలో ప్రముఖులు

విషాదవిషమును ఆనందామృతరసముగా మలచుకొనుశక్తి కలిగినపిమ్మట కవి తన 'దరిద్రకుటీరాంగణమున' 'చైత్రప్రభాత పరిమళములు' విరిసినట్లు పొంగిపోయినాడు.[1] అప్పుడప్పుడు తనకుతానే 'శోకమ్ముడిగి పాడుమోకవీ'[2] యని సంబోధించుకొన్నాడు. నీలిమంటల పొగలలో, కారుమబ్బుల చీకటుల త్రోవలలో, కంటకకిరీటముతో, ఎఱుపుచెర్రమంటమూలుగులతో తిరుగాడిన కవికి అమృతసౌందర్యలోకమునుండి వీచిన నూత్నానిలవీచికలు సోకినవి. అంతకుముందు వికృతమై కనిపించిన పాడులోకమే పల్లవరమ్యముగా, పరమశోభాప్లావితముగా భాసించినది. తన మనస్సులో క్రొత్త ఆశలు రెక్కలు తొడుగుకొన్నవి.

'పూల చిరునవ్వులో పొంగిపోవు వలపు
గాలియూర్పుల చిఱుతరంగాల వలపు
చివురుజొంపాల వెచ్చని కవుగిలింత
పులుగుగొంతుక తీయని పులకరింత
నేడె నా హృదయమ్ములో నిండిపోయె'[3]

నని కవి వసంతకోకిలమై ఆనందకుహూకూజితముల వెలార్చినాడు. గళములో గరళమును, తలపై నెలవంకను నిలుపుకొన్న శివునివలె కావ్యలోకమున నిలిచిపోయినాడు. ఇది ప్రణయ కవిత్వములో ఉత్కృష్టమైనదశ. ఈ విధముగా విషాదశాంతితో, వినూత్నమైన ఆశాకాంతితో రెక్కలు విప్పిన కవిభావన సంకుచితమైనపరిదులను దాటి విశాలాకాశావకాశములలోనికి విస్తరించినది. ఇంతవరకు తానొక ప్రేయసికొరకు కలలుకనెను. ఆ కలలు ఫలోన్ముఖమైనపిమ్మట నేలరాలినవి. తన ఆశలు భగ్నమైపోయినవి. తనకు ప్రేయసీసమాగమము సిద్ధించలేదు. అందుకై అతడు విలపించినాడు. లోకమును నిందించినాడు. తన్ను నిందించుకొన్నాడు. మృత్యువును వరించినాడు. దుఃఖమే సర్వస్వముగా భావించినాడు. గుడ్లగూబవలె కొంతకాలము ఇరుల సందులలో తలదూర్చినాడు. చివరకు దుఃఖములోనే ఆనందరేఖలను దర్శించి, తన మనస్సులోని విషాదనీలయవనికను తొలగించి అంతరంగమును చిన్మయతేజోమయ మొనర్చినాడు. ఈ స్థితిలో అతనికి పూర్వప్రేయసి జ్ఞాపకముండదు. ఒక ప్రత్యేకవ్యక్తిపై మరులుకొను పరిధినుండి అతిగమించి తనలోని సౌందర్యతృష్ణకు మూర్తికల్పనము చేసికొన్నాడు. ఊహాప్రేయసిని సృష్టించుకొన్నాడు. ఈ దశ ప్రణయకవిత్వములో సర్వోత్తమమైనది.

1. దీపావళి : పుట 107.
2. మధుకీల : మల్లివరపు : పుట 81.
3. దీపావళి : పుట 107.

(viii) ఊహాప్రేయసీసృష్టి :

సముద్రుడు ఎడదలో బడబాగ్నిని ముడుచుకొని శీతలతరంగచామరములతో విశ్వంభరను లాలించు మహాయోగి. సముద్రునికి, విప్రలంభవ్యధావిధురితాంతఃకరణుడైన ప్రణయకవికి ఊహాసంభాషణము జరిగినది. ఆకాశము తన ప్రియురాలని, ఆమె తనకందకుండ నిల్చినను తాను బెంగపెట్టుకొనలేదని, తన ప్రేమసందేశముతో ఆమె మబ్బులరూపమున పులకరించునని, చంద్రకిరణాలే తమకౌగిలింతలని, వర్షబిందువులే తమచుంబనములని, సముద్రుడా కవితో చెప్పును. అతడింక ఇట్లనును.

'నాయనా ! కవివంటావు; ప్రియురాలిని సృష్టించుకొనలేనివాడవు కవివా ? కావాలంటే కనురెప్పపాటులో త్రిభువనైకమోహిని, ప్రణయైకమూర్తి దొరకదటోయ్'[1]

ఈ సాగరసందేశము వినగానే కవిమనస్సులో మధనము జరిగినది. 'నాకుగాదులులేవు నాకుషస్సులులేవు', అని వెనుక తాను పాడుకొన్నపాట వెలితిగా కనిపించినది. తన పాతపాటలన్ని తిరుగపాడుకొన్నాడు. తాను దర్శించిన వ్యక్తులలోని లావణ్యాలవములను ప్రోగుచేసి హృదయమున భద్రపరచుకొన్నాడు. 'ఎక్కడెక్కడిదో కంటబడిన సౌందర్యమల్లా', 'స్ఫురించినప్రేమల్లా' తెచ్చినాడు. కనులుమూసి తెరచినాడు. శాంతించినాడు. అప్పుడు చతుర్దశభువనములలోని ఏకైకసౌందర్యస్వరూపిణి 'స్వచ్ఛసుధాపరిపూర్ణ ప్రణయైకమూర్తి' భాసించినది. "ఆమెనాది, నాప్రియురాలు, నేనుప్రియున్ని, నాకుప్రేమదొరికింది. సరే. సౌందర్యమూ దొరికింది."[2] ఈ భావనతో కవి ఆమెను తనలో ఐక్యముచేసికొనెను. తానామెతో కరగిపోయెను. అభేదస్థితి యేర్పడినది. ఈ కథనము భావకవులయందు ఆత్మాశ్రయప్రణయరీతిలో రచనలుచేసిన అందరికి వర్తించును. షెల్లీ 'Hymn to Intellectual Beauty' అన్న గేయములో వ్యక్తినిష్ఠమైన సౌందర్యముకాక రాశీభూతమైన సమస్తజగత్సౌందర్యమునే కీర్తించెను.

'Spirit of Beauty, that dost consecrate with thine own hues all thou dost shine upon of human thought or form' అను పాదములలోను, 'Man were immortal and ommipotent Didst thou, unknown and awful as thou art, keep with thy glorious train firm state within his heart'. అను పంక్తులలోను మానవునిజీవితమున ఆదర్శసౌందర్యమునకున్న ప్రభావమును వ్యక్తీకరించెను. సౌందర్యము నిత్యనివాసము చేసినప్పుడే మానవుడు మృత్యుంజయుడగునని స్పష్టపరిచెను. బసవరాజు అప్పారావుగారు ఈయంశమునే 'ఆనందలోకమరయుటకన్నను కాననిసౌఖ్యము కలదా'యని, 'సౌందర్యోపాసనమునకన్నను సద్వ్రతమెయ్యది చెపుమా'యని గానము చేసిరి.

1. నాప్రణయలేఖల కథ (వ్యాసము) : కృష్ణశాస్త్రి : 'సఖి' : రుధిరోద్గారిపుష్పసంచిక :
2. నా ప్రణయలేఖల కథ :

రవీంద్రుడుకూడ ఈ యాదర్శసౌందర్యమునే 'ఊర్వశి'గా క్రోడీకరించెను.[1] కృష్ణ శాస్త్రిగారు విశ్వసౌందర్యము భావనచేసినపిమ్మటనే ఊహాప్రేయసిని సృష్టించుకొని ఊర్వశియని నామకరణముచేసిరి. క్షీరసాగరగర్భమునుండి తమ ఆనందసందేశమును, కల్యాణసందేశమును కావ్యజగత్తున కందించిరి. మల్లవరపువిశ్వేశ్వరావుగారు నిరీహస్థితిలోనుండగా ఒక అర్ధరాత్ర మున ఊహాప్రేయసి అవతరించినది. మొదట ఆమె దరస్మితము అంతరిక్షమున జాలై కురిసి నది. తారయై మెరసినది. పూవై విరిసినది. పిమ్మట ఆమె అతని కెంతటి ఉత్సాహమునిచ్చి నదో కవి ఈ విధముగా పాడుకొన్నాడు.

'ఈలోనే నీకాంతితనువు నాదేహందరిసి
అలపుగొన్న నాస్వప్నజీవితావరణం మేలుకొలిపి,
నా హృదయోద్భవనంలో దీపం నిలిపితివే
విలసితలావణ్య శ్రీవై, స్త్రీవై, నీవై
నీవెవరైనా నీపేరేమైనా కానీ
నవనిత్యయౌవనానందప్రాణీ.'[2]

క్రమక్రమముగా ఆమెసుధాలాపనము వీనులలో, వననిధి నిధ్వనులలో, తనలోని అణువణువులో వినిపించినది, ఆమెయే 'విద్యున్నారి'గా, 'జీవనదేవత'గా 'ఇంద్రజాలి'గా, 'ఉరుతిమిర మరుసంచారిణిగా', 'చిరతరాత్రిసంభరితవిరహిణి'గా, 'నీరదరథసంచారిణి'గా, 'ధీరవిషాదకారిణి'గా, బహుభంగుల భాసించినది. ఆమెయే 'సుప్తమధుకీల';'అమరలోకముభూమినదుకు తీయనిమంట'. 'అపారదూరానందవిజ్ఞానమయజగద్వీథీనివాసిని'.

వేదులసత్యనారాయణశాస్త్రిగారికి ఊహాప్రేయసి 'కవిభావనావిలాసినీ నిత్యసైరంధ్రి'గా', 'స్వప్నలోకరాజ్ఞి'గా భాసించినది. ఆమె 'చంద్రికావసనాంచలోచ్చాలనముల చిరవిరహవాసనల నెగజిమ్ముకొనుచు తాండవించి'[3]న అమృతసౌందర్యలక్ష్మిగా సాక్షాత్కరించినది. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారికి ఈ ఊహాప్రేయసి 'నీలగగనాంతవికస్వరతారకాసుమవ్యాప్రియమాణ దేహ'గా, 'తపఃఫలసిద్ధిమూర్తి'గా కనిపించినది. ఇంకొకకవికి ఆమె 'సుధాబాల'గా, స్వర్గ మార్గమున పూలపల్లకీలో ఊరేగు 'మధురప్రమీల'గా మిరుమిట్లుగొలిపినది.[4] బాపిరాజుగారికి 'శశికళ'గా రూపొందినది; ఇట్లు భావకవిప్రముఖులలో పలువురు తమసౌందర్యతృష్ణకు తగి నట్లుగా ఊహాప్రేయసులను సృష్టించుకొని చిత్తశాంతిని పొందిరి. ఈ సృష్టికి షెల్లీ, కీట్సు, రవీంద్రుల సౌందర్యారాధనతత్త్వము ప్రోద్బలకమైనది.

1. 'ఊర్వశి' విషయములో భిన్నకవుల దృక్పథములను ముందువివరింతును.
2. కళ్యాణకింకిణి : మల్లవరపు : పుట 6
3. దీపావళి : వేదుల : పుట 70.
4. 'సుధాబాల' : సంపత్ : మహోదయము : పుట 300.

(ix) ప్రేయసీపూజ్యత :

భావకవిత్వములో ప్రేయసికి పూజ్యస్థానము లభించినది. స్త్రీ అంగసౌందర్యమునుకాక ఆత్మసౌందర్యమును వీరెప్పుడు మనస్సుచేత భోగించిరో అప్పుడే స్త్రీ వీరిదృష్టికి ఆరాధనీయగా కనిపించినది. పాశ్చాత్యదేశములలో 'రినైజాన్సుయుగము'న స్త్రీ మానవులమనస్సులలోని దుష్టత్వమును ప్రక్షాళనముచేయు మహత్తరశక్తిరూపిణిగా భావింపబడినది.

'who does not know that women cleanse our hearts of all evil and low thoughts, of cares, of troubles, and of those heavy dejections that follow in the train of these.'[1]

భావకవులలో ప్రేయసికి పూజ్యతకల్పించుటలో రాయప్రోలువారు ప్రథములు. వీరి దృక్పథము నింతవరకే వివరించితిని. ప్రేయసీపూజ్యత తదనంతరభావకవులలో ఉత్తరోత్తరాభివృద్ధిగాంచినది. ప్రేయసిని వారు అంతరంగశాంతిదేవతగా, ఆశాపథాంతరాళపారిజాతముగా, తపఃకల్పవల్లిగా భావించిరి.[2] పలువురామెను దేవీపీఠముపై నధిష్ఠింపజేసిరి. షేక్స్పియరుగూడ తన ప్రేయసిని దేవిగా సంభావించెను

'I grant I never saw a goddess go-
My mistress when she walks, treads on the ground.'[3]

నాయని తనప్రేయసిని సంబోధించుచు

'దైవతమవీవు నీదు ప్రత్యక్షమునకు
గడియలెంచుచునుండు భక్తుడను నేను.'[4] అనెను.

తల్లావఝ్ఝల నీ పాదయుగళి ధ్యేయమ్మునా'కనెను.[5] బౌద్ధులు పవిత్రముగానెంచు త్రిరత్నములు తనకున్నవని,అవి ఆమె గుణగణము, విద్యానిరతి, యౌవనశోభయన్నవేయని చమత్కరించెను. బౌద్ధుల 'త్రిశరణము'లనుగూడ ఆమెవాక్కులపట్ల, అంఘ్రిపంకేరుహములపట్ల, కటాక్షములపట్ల అన్వయించుకొనెను. ప్రేయసీసమారాధనమున విశ్వనాథ శిఖరములందుకొన్నాడు. త్రిభాగశేషమైన దీర్ఘ హేమంతయామినులలో, కలతనిద్దురలో, స్వప్నకలనచేత ఆమె సాక్షాత్కరించునని, అప్పుడామె పృథివియంతయు పాదపీఠముగనలవరిచి, అనంతాకాశము నావరించి, 'అనిలవీచికా స్తంభనమాచరించు'నని, ఆ స్థితిలో ఆమెను 'అగ్నివరుణులు' సేవించుచుందురని వీరుఅభివర్ణించినారు.[6] కృష్ణశాస్త్రిగారు తమప్రేయసిని 'మఘవమస్తకమకుటమాణిక్యరాజ్ఞి'గా

1. క్యాస్టిల్గియోనిఅను ఇటలీరాజకీయవేత్త అభిప్రాయము.
Quoted in 'The Religion of Beauty in woman': P. 22.
2. దీపావళి : 3. Sonnets: cxxx.
4. సౌభద్రునిప్రణయయాత్ర : 5. హృదయేశ్వరి :
6. గిరికుమారుని ప్రేమగీతాలు :

సంబోధించి. ఆమె తమజీవితమున అవతరించుటతో 'ఈశ్వరాలోకమే యిటు వెడలెనో నేడు' అను సందేహము కలిగినదని వెల్లడించినారు.[1] మల్లవరపువిశ్వేశ్వరరావుగారు 'పూతభావనా కృతి'తో తమ ప్రేయసి 'కంఠపూజసలుపు'టకు తమ వనములో నవసుమమ్ములు పూయించినామని చెప్పుకొన్నారు.[2] ఈ విధముగా భావకవులు తమ ప్రేయసిపట్ల ఎనలేని గౌరవప్రపత్తిని కన బరిచినారు.[3]

ప్రేయసిని వీరెంత పూజ్యభావముతో చూచినను 'నీ'వనియే సంబోధించిరి. ఒక్క పిలకాగణపతిశాస్త్రిగారు మాత్రము 'మీరు'అని సంబోధించి నవ్యతచూపిరి.

'మీ మధురహాసలేశోదయమున దేవి !
తోచె నానందవిస్మృతాత్మునకు నాకు
ఏ మహారాజరాజాధిరాణ్మహార్ఘ
హైమమకుటమణిప్రభాధామముననీ !
— — — — —
మీ స్మరణసాగరామృతోర్మికల.........'[4]

(x) *కులపాలికా ప్రణయము :*

భావకవులలో కులపాలికాప్రణయమును రమ్యముగా చిత్రించినవారిలో విశ్వనాథ, నాయని అగ్రేసరులు. విశ్వనాథ 'గిరికుమారుని ప్రేమగీతాలు', నాయని 'సౌభద్రుని ప్రణయయాత్ర', 'ఫలశ్రుతి'అను కావ్యములు ఈ ప్రణయచిత్రణకు ప్రతినిధికావ్యములు. కులపాలికాప్రణయ చిత్రణమున వీరిపై పాశ్చాత్యప్రభావము లేదు. ఇది మనగడ్డలో పుట్టిపెరిగిన సంప్రదాయమే. భారతీయుల గృహస్థాశ్రమధర్మము ఇంద్రియాతీతమైన అనురాగరజ్జువులతో పెనగొన్నది. భవభూతి యిల్లాలిని

'ఇయంగేహేలక్ష్మీ రియమమృతవర్తిర్నయనయో
రసావస్యాః స్పర్శోవపుషి బహుళశ్చందనరసః
అయం బాహుఃకంఠే శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యానప్రేయో యది పర మసహ్యస్తు విరహః'[5]

1. ఊర్వశి : 2. మధుకీల :
3. 'As a worshipper of beautiful, the modern poet brings a pure heart and a great reverence to the delineation of the heroine.' —K. Lakshmi Ranjanam 'Love in Modern poetry' : Triveni 1939.
4. ప్రతిభ : నవంబరుసంచిక : 1936.
5. ఉత్తరరామచరిత్రము : ప్రథమాంకము :

అని వర్ణించియున్నాడు. భార్యను

"కార్యేషుదాసీ కరణేషుమంత్రీ
భోజ్యేషుమాతా శయనేషురంభా
రూపేచలక్ష్మీ క్షమయాధరిత్రీ
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ" (చాటువు)

అని మనపూర్వులు వ్యాఖ్యానించినారు. భావకవులలో 'కులపాలిక' శృంగారమును దివ్యస్థాయికి తీసికొనిపోయి, దంపతులకు ప్రకృతిపురుషభావము సమన్వయించినకావ్యములు గిరికుమారుని ప్రేమగీతాలు, సౌభద్రునిప్రణయయాత్ర.

ఈ కావ్యములలో సాత్త్వికశృంగారము చిత్రింపబడినది. ప్రేమతాదాత్మ్యమే బ్రహ్మసాయుజ్యమని నిరూపించుట వీనిఉద్దేశము. ఈ కావ్యములలోని నాయికానాయకులు ఇంద్రియాతీతమైన నిర్మలప్రేమయందు సమాధిపొంది ఆనందపీయూషమును సాధించినవారు. గిరికుమారుని ప్రేమగీతాలలో 'దేవీ' సంబుద్ధి కేవలము ప్రేయసీపరమైనదికాదు. 'దేవి'యనగా మాతృస్వరూపిణియని, ఈశ్వరియని భావించుకొనవలెను. అందుకే విశ్వనాథ దేవికి, ప్రేయసికి ఒక్కొక్కమాటు అభేదము చూపినాడు. తనసతిని, తనను పార్వతీపరమేశ్వరులతో పోల్చుకొన్నాడు. తాను జ్ఞానాకృతియై గరళము గళమున నిల్పుకొంటినన్న సందర్భమున ఈ విషయమే ధ్వనింపజేసినాడు. ఆ గరళమును గళమున నిలుపుకొన్నప్పుడే తమకు పార్వతీపరమేశ్వరత్వము అన్వర్థమైనదని తెలిపినాడు.

'అది-గళమ్ముననిలిపినయపుడె నీవు
నేనునొకటైతిమే పురంధ్రీ! శశికళ
సాంద్రశిశిరముగ్ధ సుధారసస్రవంతి
మనశిరస్సుల తాండవించెనె లతాంగి.'

'నీవియోగమ్మటంచు నే నిక్కువముగ నెఱుగనేయెఱుఁగను'అను పద్యమున ఈ అర్ధనారీశ్వరభావమునే ధ్వనింపజేసెను. రానురాను కవికి అద్వైతదృష్టి విస్తరించినది. జ్యేష్ఠమాసపు తొలిసంజలవెన్నెలలు తనసీమంతినిదరహాసములుగా, సంధ్యాకాలశీతలసమీరము తనదయిత నర్మోక్తిగా భావించుకొని ప్రకృతితో తాదాత్మ్యముచెందినాడు. అతడు సూర్యుడుగా, ఆమె ప్రొద్దుపొడుపుపూవుగా భావించుకొన్నాడు. వారి ఆలోకనమాలికలచేత పృథివ్యాకాశములకు తేజోమయములైన ముఖ్ఖపడినవని, ఆమె భూవాయ్వాకాశముల కతీతమగు అంబికా స్వరూపిణియని కీర్తించినాడు. అట్లని అతడు లౌకికస్థాయిలోని దాంపత్యశృంగారమును స్పృశించక పోలేదు. తన్ను 'వరలక్ష్మీదయితుడు'గా పేర్కొన్నాడు. వారి పరస్పరప్రేమబంధమునకు కారణము పిత్రాజ్ఞ, జననియనుమతియని చెప్పుకొన్నాడు. ఆమెసౌందర్యముతోపాటు శీలము,

కులీనత అతని అగాధప్రేమకు ప్రోద్బలకములని స్పష్టపరిచినాడు.[1] తాను గిరికుమారుడు. అతని ప్రేమ తుంగగిరిసానువులపై మహావేగముతో ప్రవహించునట్టిది. అట్టి ప్రేమోద్వేగము కూడ ఆమెప్రభావముతో ఆసకట్టలకొగ్గి చిరువాకలై ప్రవహించెనని విన్నవించుకొన్నాడు.[2] ప్రేమకొలకులలోపూచిన శతపత్రము కోసితెచ్చి ఆమె కర్పించెను.

"ఇది సభక్తికమర్పిత మిది భవచ్ఛి
రంబునను నీదుమోముపై వ్రాలి దేవి!
శారదాఫాలబాలశశాంకరేఖ
వలెఁ జెలంగె నా పూర్వతపస్సుచేత."[3]

ఈ పద్యమున వారి దాంపత్యములోని మధురగభీరభావము ప్రసన్నమగుచున్నది

'వత్సలాఫాలమున నెలవంకగుఱుతు', 'ఈ యమర్త్యాచ్ఛచంద్రిక లెన్నినాళ్ళు' అను పద్యములలో[4] నాయని తనది 'సదాశివత్వపదవి'యని చెప్పుకొన్నాడు. దాంపత్యధర్మము నుజ్జీవింపజేసిన పురాణగాథలలోని నాయికానాయకులను ఇతడు తనకావ్యములలో ప్రస్తావించినాడు. సావిత్రిప్రస్తావనమట్టిదే. ప్రళయముసైతము ప్రణయశక్తిని, దాంపత్యబంధములోని మహిమ్మతను చలింపజేయలేదని సావిత్రి నిరూపించినది. దాంపత్యమునకు, ప్రణయమునకుగల ఈ అచంచలసత్త్వమును నిరూపించుటకే నాయని సావిత్రి నుదాహరణముగా తీసికొన్నాడు.

'ఫలశ్రుతి'లో నాయికానాయకులసంయోగము 'మర్త్య'పరిధిని దాటినది. అది జీవాత్మపరమాత్మలసంయోగముగా భావింపబడి కూర్చబడినది. 'ఊర్పుసల్పని నా ముక్కులూదియూది నీదుపవననిశ్వాసమ్ము నింపినావు' అనుపద్యములో శృంగారభావము వెనుక వేదాంతభావము ధ్వనించినది. లౌకికముగా కనిపించుభావములను ఆధ్యాత్మికగంధనిర్భరములుగా ఉపలక్షించుట నాయని సాధించిన ప్రత్యేకత. ఐనను వీరు శుద్ధలౌకికదంపతులవలె కనిపించు ఛాయలు ఇందులో లేకపోలేదు. 'మనము మేనత్తమేనమామలబిలమ్ము'అను పద్యములో చిన్ననాటినుండియే ఈ యిరువురుకలిసి ఆడుకొనుచుండిరని, అప్పుడే లోకులు వీరిని దంపతులుగా భావించిరని నాయని స్పష్టపరిచినాడు. 'బావ ! యనుమాట ప్రేమప్రపంచమునకు నీవు పెట్టినపేర'న్నాడు.[5]

'నిత్యక్రీడ' అను శీర్షికక్రింద వ్రాసిన మూడుపద్యములలో పరిశుద్ధమైన దంపతీప్రేమను దినముతో ఉపమించినాడు. సూర్యోదయకాలమున ప్రారంభమైన నీడలు క్రమముగా ప్రొద్దెక్కిన కొలది తగ్గిపోయి, ఏ వస్తువులనుండి అవిప్రారంభమైనవో ఆ వస్తువులలోనే మధ్యాహ్నసమయమున కలసిపోయి, మరల సాయంసమయమున క్రమముగా విస్తరించి నలువైపుల ప్రసరించి ప్రకృతిలో లీనమైపోవును. అట్లే తానుగూడ తన జీవితప్రారంభమున ఆమె నీడకొనలవెంట

1 2. 3. గిరికుమారుని ప్రేమగీతాలు.

4. 5. ఫలశ్రుతి.

ఆమెపదాంభోరుహముల చేరికొని, జీవితమధ్యాహ్నకాలమున ఆమెలోఐక్యమై, ప్రాయపుప్రొద్దు వాలుచుండగా ఆమెనీడలో కలసిపోయి, తన స్వచ్ఛప్రణయమును దిగ్దిగంతములందు వ్యాపింప జేయుదునని ఈ పద్యములలో ధ్వనింపజేసినాడు. ఇది దంపతీప్రణయమునులోని మూడుదశలను సూచించు భావనారీతి. ఈ విధముగా లౌకికదాంపత్యచ్ఛాయలతోనే అలౌకికదాంపత్యశీలమునకు, అద్వైతభావసిద్ధికి దారితీసిన కావ్యమిది.

## కొందరు శృంగారనాయికలు :

భావకవిత్వములో నాయికాశృంగారము శిఖరస్థానమందుకొన్న కావ్యములు ఊర్వశి, కిన్నెరసానిపాటలు, యెంకిపాటలు, శశికళ, హృదయేశ్వరి, సౌభద్రునిప్రణయయాత్ర వీనిలో ఊర్వశి, శశికళ, హృదయేశ్వరిలోనినాయిక సౌభద్రునిప్రణయయాత్రలోని వత్సల ఆయా కవులు వైయక్తికముగా ప్రేమించిన సుందరీమణులు. ఊర్వశి, శశికళ లౌకికవాసనల కతీత మైన ఊహాస్పృష్టులు. హృదయేశ్వరిలోని నాయిక, ప్రణయయాత్రలోని వత్సల లౌకికగంధ మున్న నాయికలు. ఆ కవులజీవితముతో పెనవేసికొనిపోయిన వాస్తవికమూర్తులు. కిన్నెర, యెంకి కవుల నిత్యజీవితముతో ఏ మాత్రము సంబంధించినవారుకారు. కవితాకళాదృష్ట్యా వారిని కదలించి రూపుదిద్దుకొన్న అమృతమూర్తులు.

## కవులు : వారిప్రేయసులు :

కవులు తాముప్రేమించిన సుందరీమణులను కావ్యనాయికలుగ చేసికొనువిషయము మొదట ప్రస్తావింతును. తాము నిత్యజీవితమున చూచినసుందరికి హృదయమర్పించి ఆమెను త్రికరణశుద్ధిగా ఆరాధించినకవులు ప్రాచీనసాహిత్యమున కనిపించరు. వారుప్రేమించిన ఘట్టము లుండియుండవచ్చునుగాని వారు వానిని కావ్యరూపమున ప్రదర్శించలేదు. పూర్వకాలమున ఆత్మాశ్రయకవిత్వమున కస్తిత్వములేకపోవుట ఇందు కొకకారణమైయుండవచ్చును. ప్రాచీన సాహిత్యములో 'పద్మావతీచరణచారణచక్రవర్తి'యైన జయదేవు డిందుకు అపవాదముగా ఉన్నాడు. కాళిదాసు శ్రీనాథుడుమున్నగువారినిగూర్చిన శృంగారగాథలున్నవికాని వానికి ఆ కవులు అక్ష రాకృతి కలిగించలేదు. ఇరువదవశతాబ్దిలోని భావకవులు తమ ప్రేయసీమూర్తులను కావ్యనాయి కలుగా చేసుకొనుటలో గొప్పనవ్యత చూపినారని చెప్పవచ్చును తెలుగుకవులకీ ధోరణి పాశ్చాత్య కవులనుండి సంక్రమించినది. పాశ్చాత్యసాహిత్యజగత్తులో చాలకాలమునుండి కవులు తాము ప్రేమించిన తరుణులనుగురించి భావగీతము లల్లుటకలదు. జీవితకాలమంత తనప్రేయసికొరకు తహతహలాడి, పలికిన ప్రతిపదములో, పాడిన ప్రతిగీతములో ఆమెసంకీర్తనము చేసినవారు న్నారు. తమ ఆశాసౌరాశలను, వేదనను, వేడుకను ఆమెపేర వెలిపుచ్చుకొన్నారు. డాంటీ, పెట్రార్క్ (Petrarch), సిడ్నీ, షేక్స్పియరు, షెల్లీ, కీట్సు, బైరను, బ్రౌనింగు, రోసెటీ మున్నగువారు ఈ శాఖలో ప్రసిద్ధులైనకవులు.

డాంటీ (Dante) పేరుమోసిన ఇటాలియనుకవి. ఈతడు తన తొమ్మిదవయేటనే బ్యాట్రిస్ పోర్టినారీ (Beatrice portinari) అను అమ్మాయిని ప్రేమించెను. అప్పుడా అమ్మాయి

పయస్సు కూడా అంతే. తర్వాత ఇరువురు పెండ్లిచేసికొనిరి. ఆమె తనయిరువదినాల్గవయేటనే మరణించినది. డాంటీకి తనప్రేయసి ఆదర్శమూర్తియు, జీవనదేవతయునైనది. ఆయన కవితా తంత్రికలను జుమ్మనిపించిన రసరాజ్ఞి ఆమెయే. ఆయన కావ్యములలో మకుటమణియైన డివైన్‌కామెడీ (Divine Comedy)లో తన ప్రేయసిని 'ముక్తిసీమంతినిగా' వర్ణించినాడు డాంటీ.

పెట్రార్క్ ఇటలీకవి. ఇతడు లారా (Laura) అను సుందరీమణిని ఒక శుక్రశుభ వాసరమున చర్చిలో దర్శించినాడు. ఆమెనుచూడగానే ఆతనిలో వలపుతలపులు మొలకెత్తినవి. అప్పటికే ఆమె వివాహితయట. అయినను తాను లారాను ప్రేమించుట మానలేదు. అతని తొలిరచనలలో అసంపూర్ణప్రణయముకొరకు, అందనిలక్ష్యముకొరకు చేసెడి 'వేసటలేని వెర్రి అన్వేషణము' చిత్రింపబడినది. ఆమెజీవితకాలమున, జీవితాంతమున ఈ కవి దాదాపు ३६६ గేయముల నామెనుద్దేశించి రచించెను. తనస్వప్నము చెదరిపోగా ఈతడు లోకమున కెదురు తిరుగలేదు. ఇంద్రియవాసనలకు, ఆధ్యాత్మికచింతనలకు జరిగిన సంఘర్షణకు తీయని విషాద సంగీతము సమకూర్చినాడు. ఈతడు లారానుద్దేశించివ్రాసిన సానెట్లు శతాబ్దములతరబడిగా పాశ్చాత్యవాఙ్మయమును ప్రభావితమొనర్చినవి. పెట్రార్క్, లారాఅను పేర్లు తాత్త్వికభావ దమితమైన కామోద్రేకము (Passionate love)నకు సంకేతములుగా నిలిచిపోయినవి.

ఇంగ్లీషుకవులలో ఫిలిప్‌సిడ్నీవ్రాసిన 'Astrophel and Stella'అను కావ్యము ప్రణయ గీతముల సంపుటి. ఈ గీతములలో నాయిక స్టెల్లా (Stella). సిడ్నీ తాను చిన్ననాడు ప్రేమించిన లేడీ రిచ్ (Lady Rich) అను కామినీమణి మరియొకనిని పెండ్లియాడగా కలిగిన ప్రణయ భంగముతో ఈ గీతములు వ్రాసినాడని, స్టెల్లాఅనునది ఆవిడనుద్దేశించి పెట్టుకొన్న పేరని సిడ్నీలీ (Sidney Lee) అభిప్రాయపడెను.[1] వాస్తవికజీవితములో సిడ్నీప్రేమించిన తరుణియే స్టెల్లాయని అనువారు లేకపోలేదు. స్టెల్లాపట్ల సిడ్నీ ప్రదర్శించిన ప్రణయారాధనతత్త్వము ఎలిజబెత్‌కవిత్వయుగమున ఒకసంప్రదాయముగా మారిపోయినది. మహాకవి స్పెన్సరు స్టెల్లా నిట్లు ప్రశంసించెను.

"Stella the faire; the fairest star in skie
As faire as venus or the fairest faire."

షెక్స్పియరుసానెట్లు 'Dark Lady' నుద్దేశించి వ్రాయబడినవి. ఈ Dark Lady అతడు ప్రేమించిన సుందరి అవ్యక్తనామము. కొందరు ఈమె అతని ఊహాసౌందర్యమునకు, ఆదర్శప్రణయమునకు ప్రతీకయందురు. కాని సానెట్లలోని కొన్నివర్ణనలనుబట్టి చూచినచో ఒకానొకతరుణి అతనిహృదయమును దొంగిలించినట్లు బోధపడును.

1. **Introduction to the 'Elizabethen Sonnets : Quoted in 'Religion of Beauty in Woman' ; P. 150.**

"I do forgive any robbery, gentle thief,
Although thou steal thee all my poverty."[1]

చూపులతూపులతో తనకు ముక్తిప్రసాదించుమని ఆమెను ఈ విధముగా అర్థించినాడు కవి.

"———— but since I am near slain
Kill me outright with look and rid my pain."[2]

ఇట్టి ఘట్టములను పరిశీలించగా షేక్స్పియరు తాను ప్రేమించిన తరుణినిగూర్చియే ఈ గీతములు వ్రాసినట్లు స్పష్టమగును. ఇతని కొన్ని సానెట్లలోని ప్రేమస్నేహములకుగల సంఘర్షణనుబట్టి కొందరు ఇట్లూహించిరి:—ఈ కవి ప్రేమించిన యువతి ఆతని ప్రియమిత్రుని ప్రేమించెను. మొదట అతడు నిర్విణ్ణుడైపోయినను క్రమముగా శాంతినలవరుచుకొని ఆమెను స్వీకరింపవలసినదిగా అతని మిత్రుని కోరెను. ఈ గీతములలో అక్కడక్కడగల అతీంద్రియసౌందర్యారాధనము ఈ విషయమునే ధ్వనింపజేయుచున్నది.

ఇంగ్లీషుకాల్పనికకవులలో కీట్సుషెల్లీబైరనుల భగ్నప్రేమగాధలు ప్రసిద్ధములు. కీట్సు ఫ్యానీబ్రౌన్ (Fanny Browne) అను సుందరిని ప్రేమించెను. ఫ్యానీలేని గదిలోని గాలి తనకెంతో అనారోగ్యకరమని, ఆమెకొరకు తాను ప్రాణదానముచేయుటకు సిద్ధమనిచెప్పు వరకు పోయిన దీతనిప్రేమ. బ్రతికియుండగా కీట్సు ఆమెను పొందలేకపోయినాడు. పొంది నది ఆమె తృణీకారమే. ఆమెను ప్రేమించినప్పటి వివిధమానసికదశలు అతని 'ఓడ్ టు నైటింగేలు'లో, 'ఓడ్ టు ది గ్రీషియన్ అర్న్'లో, 'ఎండిమియాన్'లో ప్రతిఫలించుచున్నవి. 'Ode to Fanny' అన్నగేయము ఆమె తనను తిరస్కరించినపిమ్మట వ్రాసినది. 'Lamia'అను దీర్ఘగేయమున లామియా ఎవరోకాదు; ఫ్యానీయే. ఈమె ఇందులో సర్పకన్యగా చిత్రింపబడి నది. లైసిన్స్ (Lycins = ప్రేమికునిపాత్ర) కీట్సు. ఈ గేయములో ఫ్యానీ సర్పమువలె ప్రవర్తించి తనను నాశనముచేసినదన్న విషయము ధ్వనించుచున్నది.

షెల్లీ మొదట హారియట్‌గ్రోవ్ (Harriet Grove) అను కన్యను ప్రేమించెను. ఈ ప్రేమ నడుమనే చెరిగిపోయినది. తర్వాత హారియట్ అను ఇంకొకకన్యను వివాహమాడెను. వివాహానంతరము ఎమీలియా వివియాని (Emilia Viviani) అను తరుణిని ప్రేమించెను. Epipsychidion అన్నది వివియానీని దృష్టిలోపెట్టుకొని రచించిన ప్రణయకావ్యమే. ఇతడు Mrs. Williams అను యువతినిగూడ ప్రేమించెను. 'Rarely,' "Spirit of Delight'. One word is too often'; 'When the Lamp...,' 'Rough Wind,' 'To Jame', 'The Magnetic Lady' మున్నగు గేయములన్నియు ఈమెను దృష్టిలో పెట్టుకొని వ్రాసినవే.

బైరను 'మేరీచావర్త్' (Mary Chaworth) ను మనసార ప్రేమించినాడు. 1805 మొదలుకొని, ఆమెకు మరియొకరితో పెండ్లియగునంతవరకుగల పందొమ్మిదేండ్లకాలములో

1. 2. Sonnets: XL. CXXXIX.

ఈతడు వ్రాసిన ప్రణయగేయములన్నిటియందు ఆమె యేదోఒకరూపమున తళుక్కుమన్నది. మాన్ఫ్రెడ్ (Manfred)లోని నాయిక ఈమెయే. Don Jaun లో లేడీఎడిలీన్ (Lady-Adeline) ఈమెయే.* 'The Dream'అన్నగేయములో ఇతని భగ్నప్రణయమే వస్తువైనది. 'Last words to Greece'అన్నగేయములోగూడ ఈ ప్రణయవేదనయే ధ్వనించుచున్నది.

బ్రౌనింగ్ ఎలిజబెత్ బ్యారెటుతో ప్రణయకలాపము జరిపి, ప్రణయగీతములు కురియించి చివరకామెను పెండ్లిచేసికొనగలిగినాడు. స్విన్‌బర్న్. రోసెటీమున్నగు కవులుగూడ తాము ప్రేమించిన సుందరీమణులనుగూర్చి, భగ్నప్రణయమునుగూర్చి ఏదో ఒకరూపమున నివేదించు కొన్నవారే.

మనభావకవులు ఈ కవులందరి ప్రణయకలాపములను, తత్ఫలితముగా వారువ్రాసిన గేయములను పరిశీలించుట కవకాశముకలిగినది. ఇంగ్లీషువిద్య ఇందుకు దోహదముచేసినది. తరుణదశలోనున్న మనకవులను ఇంగ్లీషుకవుల స్వచ్ఛందప్రణయ మాకర్షించినది. వారివలెనే వీరును ప్రేమింపసాగిరి. వారివలెనే వీరును భగ్నాశులై ప్రణయకావ్యములు రచించిరి. కొందరు తమప్రేయసులనే నాయికలుగా చేసికొనిరి. హృదయేశ్వరి, సౌభద్రునిప్రణయయాత్ర ఈ ధోరణులు స్ఫుటముగాగల కావ్యములు.

### 'హృదయేశ్వరి' :

కవి తానొకసుందరీమణిని చూచి ప్రేమించుట, ఆమెను వివాహమాడుటకు నిశ్చయించుట, మొదట ఆమె అందుకంగీకరించుట, పరిస్థితులఒత్తిడివలన తర్వాత ఆమె నిరాకరించుట, కవి విరహకాతరుడగుట-'హృదయేశ్వరి' కావ్యములోని వస్తువు. ఈ కావ్యములోని నాయికపేరు స్పష్టముగాలేదు. కాని ఆమె నిత్యజీవితములోని విశేషములు కొన్ని సూచింపబడినవి. ఆమె యింటిముందు పొగడచెట్టున్నదని, ఆమె 'శ్రీరామచరితమానసము' పఠించుచుండునని, అపుడప్పుడామె తన యూరిలోనున్న నృసింహాలయమునకేగునని, ఒకప్పుడు 'కపిశవర్ణమనోజ్ఞాంశుకము దాల్చి', జారుముడితో అంగణమున దిరుగుచుండునని, ఆమెకు హిందూస్తానీ సంస్కృతభాషలిష్టము లని ఈ కావ్యపరిశీలనమువలన స్పష్టమగువిషయములు. ఆమె యింటిముందున్న పొగడచెట్టు ఈ కావ్యమున మాటిమాటికి వర్ణింపబడినది. బైరనుకవికూడ తానుప్రేమించిన మేరీ ఇంకొకరిని పెండ్లియాడి కాపురముచేయుచుండగా ఆమెయింటిముందున్న చెట్లను 'The Dream' అను గేయమున పదేపదే వర్ణించినాడు. తల్లావఝ్ఝలవారి 'వకుళమాలిక'అను కావ్యము హృదయేశ్వరి'కి అనుబంధమనిపించును. ఇది 'గీతికాస్వగతము'. దీనిలో 'ఇందిరామాధవులు' నాయికానాయకులు. హృదయేశ్వరిలోని నాయికయే ఇందులో ఇందిరగా రూపొందినదేమో ? కవియే మాధవుడేమో? ప్రథమదశలో స్నిగ్ధరమ్యమైన నాయికాప్రేమ, పరిస్థితులఅవరోధముతో కుంఠితమై, క్రమశః ప్రియనిరాసకమైపోయిన ఉదంతము ఇందులో చిత్రింపబడినది.

**వత్సల :**

నాయనివారి వత్సల అందరుకవుల ప్రేయసులవంటిదికాదు. అమె అతనిమేనత్తకూతురు. పూర్వము అభిమన్యుడు, అతనమేనమామకూతురగు శశిరేఖ (వత్సల) పరస్పరము ప్రేమించు కొనిరి. రాజ్యభ్రష్టులై కానలనివసించు పాండవేయులకుచెందిన అభిమన్యునికి తనకూతురునిచ్చు టకు బలరాముడు నిరాకరించెను. ఐశ్వర్యవంతుడు, సమ్రాట్టునుఅగు దుర్యోధనుని కొడుకున కీయదలచెను. వత్సలాభిమన్యులవలెనే కావ్యనాయికయగు 'వత్సల'యును కవిగారును ప్రేమించు కొనిరి. వారిబాల్యముననే ఆమెతండ్రి తనకూతురును అతనికిచ్చి పెండ్లిచేసెదనని, తనచెల్లెలికి వాగ్దానముచేసెను. కాని కొంతకాలమునకు తనఅభిప్రాయము మార్చుకొనెను.

'చెప్పెనత్తమ్మ చేతిలో చేయివైచి
నీకుమారునికిచ్చెద నాకుమార్తె
ననుచు మును నాన్న; నేడు పేరాసదగిలి
తోసిరాజనె చేసిన బాసలన్ని.'[1]

వత్సలకు, కవికి దినదినము ప్రేమానుబంధము దృఢపడినది. బిచ్చమెత్తుకొనిజీవించుచు, వల్లకాటిలోనివసించు శివునివరించిన పార్వతివలె, తాను తనబావను పరిణయమాడుట కుద్యుక్త యైనది. కఠినవృక్షమును కౌగిలించుకొని ప్రాకిపోవు జాజితీగవలె తనప్రియునితో పెనగొను టకు నిశ్చయించినది. కవియన్నట్లు వత్సల 'వలపుబావిలోతెన్నినిలువులో' కొలుచుట కష్టము. చిన్ననాటినుండి అతనిని 'బావ' 'బావ'యని పిలుచుచు అనురాగము క్రుమ్మరించినది. ఆ విధ ముగా ప్రేమించుకొన్న ఆ ఇరువురినడుమ కాలము కత్తులునాటగా కవికి రక్తాశ్రువులురాలినవి. 'సౌభద్రుని ప్రణయయాత్ర'లో ఈ నిర్వేదమే అచ్చుగ్రుద్దినట్లు కనిపించుచున్నది. 'ఫలశ్రుతి'లో వివాహానంతరసంయోగశృంగారము సభ్యముగా చిత్రింపబడినది.

ఈ కావ్యములోనిప్రత్యేకత 'మేన' సంబంధమున్న యువతీయువకుల పరస్పరప్రేమ. ఇంగ్లీషుకవులలో ఈ విధముగా ప్రణయము జరిపినవారులేరు. వారి సాంఘికవ్యవస్థలో ఈ వెసు లుబాటు లేదు. ఈ కావ్యమున ప్రణయము భగ్నముకాక వివాహరూపమున ఫలశ్రుతినందుట ఇంకొకప్రత్యేకత. ప్రేమించి పెండ్లాడినవారి దాంపత్యములోని మాధుర్యము అనితరమైనది. దానినీకవి రసమహితముగా చిత్రించినాడు. పేరునకు సౌభద్రునిప్రణయయాత్రయైనను, ఇందు లోని సౌభద్రుడు నాయనివారే. వత్సల మొదట వారిప్రేయసి; తర్వాత ఇల్లాలు.

ఇక ఊహాప్రేయసులైన ఊర్వశిని గూర్చి, శశికళనుగూర్చి చర్చింతును.

**ఊర్వశి :**

విశ్వసౌందర్యములోని ఉజ్జ్వలభావమునకు రూపసృష్టియే ఊర్వశి. తరతరములనుండి మానవుల మనోమందిరములలో నివాసమేర్పరుచుకొన్న గంధర్వానుభూతియామె. అటు వేద

1. సౌభద్రుని ప్రణయయాత్ర : వత్సలవలపు.

ఋక్కాలకాలమునుండి ఇటుభావగీతములకాలముపరకు, అటు అమరవాణినుండి ఇటు ఆంధ్ర వాణివరకు, అక్షరరమ్యముగా ప్రవహించిన సౌందర్యమూర్తియామె. కృష్ణశాస్త్రిగారి ఊర్వశీ స్వరూపమును పరిశీలించుటకుముందు వేదకాలమునుండి ఆధునికకాలమువరకు ఏ యేకవులు ఊర్వశి నేవిధముగా చిత్రించిరో వివరింపవలసియున్నది. మొట్టమొదట ఊర్వశీప్రసక్తి ఋగ్వేదములో, యజుర్వేదములోనిశతపథబ్రాహ్మణములో కనిపించుచున్నది. గ్రీకుల ఈరాన్ సైకీలవలె, స్కాండినేవియన్ల ఎరిజా (Ereja) ఒడోర్ (Oddur)లవలె, వేదములలోని ఊర్వశీ పురూరవులు ప్రేయసీప్రియులు. మూడునియమములకులోనై పురూరవుడు ఊర్వశిసంయోగము పొందగల్గును. వానిలో ఒకటి ఊర్వశికి పురూరవుడు దిసమొలతో కనిపించకుండుట. ఒకరాత్రి గంధర్వాపహృతములగు గొర్రెపిల్లలను కాపాడుమని ఊర్వశివేసిన కేకలకు ఉలికిపడి లేచి పురూరవుడు మెయిపుట్టములను సవదరించుకొనకయే లేచివచ్చును. అతని నగ్నమూర్తిని జూచిన ఊర్వశి సమయభంగమునకు కినిసి స్వర్గమునకు నిర్గమించును.[1] ఈ యితివృత్తమున కామశృంగారము, కరుణము ప్రధానరసములైనవి. సమయభంగముపిమ్మట పురూరవుడు ఊర్వశి కొరకు విలపించగా 'ప్రథమోషస్సువలె నేను నీ దగ్గరనుండి వెడలిపోయితిని. నీవు ఇంటికి తిరిగి పొ'మ్మని ఆమె యనును. 'సౌందర్యమమర్త్య'మని, 'ఇంద్రియనిగ్రహములేనివాడు సౌందర్యాభాసతోనే తృప్తిచెందు'ననియనును. అప్పటికే ఆమెగర్భవతి. అయినను పురూరవునికింకను కామతృప్తి కాకపోవుటతో ఆమెకొరకు విలపించును. ఈ యిరువురిలో నాయకుడు కేవలము కామి. ఆమె మర్త్యలోకమునకుదూరమైన అప్సర. అతడు అమర్త్యతనందుకొనుటకు సన్నద్ధుడు కాలేదు. కాబట్టి ఆ యిరువురికి వియోగముతప్పలేదని వేదములలోని ఊర్వశీవృత్తాంతము బోధించును.

సంస్కృతసాహిత్యములో వేదములపిమ్మట ఊర్వశీవృత్తాంతమును చిత్రించినవాడు కాళిదాసు.[2] విక్రమోర్వశీయములో ఈయనచిత్రించిన ఊర్వశి కొంతవరకు స్వార్థప్రకృతిగల వేశ్యవలె, 'దర్బారు'నర్తకివలె కనిపించును. అయినను చతుర్థాంకమున విక్రముని విరహచిత్రణము ఉదాత్తరీతిలోనున్నది.

1. గ్రీకుల Psyche, Eros ల సంబంధము ఊర్వశీ పురూరవుల వృత్తాంతముతో కొంతవరకు పోలియున్నది. Psyche అనగా మానవాత్మ Eros అనగా ప్రణయదేవత. వీరినిగూర్చి ఒక కథయున్నది. Eros సైకిని చీకటిలోనే కలసికొనుచుండెడివాడు. వెలుగులో తనముఖము చూడగూడదని అతడు కట్టడిచేసెను. ఒకరాత్రి దీపకాంతిలో సైకీ Eros ముఖమును చూచినది Eros అంతర్ధానమైనాడు. వివేకపు వెలుగులో ప్రణయానుభవమును దర్శించుటకు ప్రయత్నించుట ఆ యనుభవమును కోల్పోవుటకేయని దీని అంతరార్థము. కీట్సు 'Ode to Psyche' అను గేయములో ఈ విషయము ధ్వనింపజేసినాడు.

2. రామాయణ, భారత, హరివంశ, విష్ణుపురాణాదులలోగూడ ఊర్వశీప్రసక్తి యున్నదిగాని అది విశేషమైనదికాదు.

అరవిందుడుచిత్రించిన ఊర్వశి మానవుని కర్తవ్యమునుండి తిరోహితునిగాజేసెడి కేవల సౌందర్యమూర్తి.[1] విక్రముడు ఊర్వశీసౌందర్యవాగురలలోపడి కర్తవ్యమును విస్మరించుట అరవిందునికి నచ్చలేదు. అందువలననే అతడు ఊర్వశిని మానవునిలోని కామదాహమును రెచ్చగొట్టు ఆజ్యముగామాత్రమే భావించినాడు.

కామమూర్తిగా చిత్రింపబడిన ఊర్వశికి విలక్షణమైన రూపరేఖలుతీర్చిన కవీంద్రుడు రవీంద్రుడు. ఊర్వశిపుట్టుకనుగూర్చి రెండుగాథలున్నవి. ఒకటి దేవదానవులు క్షీరసముద్రమును మథించినపిమ్మట అప్సరలందరితో జన్మించినదనుట. రెండవది నారాయణుని 'ఊరువుల'లో నుండి పుట్టినదనుట. ఈ రెండుగాథలలో రవీంద్రుడు మొదటిదానినే గ్రహించినాడు. ఒకచేత విషపాత్రతో, ఇంకొకచేత అమృతపాత్రతో క్షీరసాగరతరంగములపై నిల్చిన చిరయౌవనిగా, కాడలేనిపూవుగా ఊర్వశినభివర్ణించినాడు. రవీంద్రుని ఊర్వశీసృష్టిపై ఋగ్వేద ప్రభావము, కాళిదాసు ప్రభావమేకాక గ్రీకుగాథల ప్రభావముగూడ గమనింపదగినది. ఊర్వశి సాగరతరంగములమీద కాలూనినిల్చినఘట్టము గ్రీకుదేవతయగు అఫ్రడైటీ (Aphrodite) ని తలపించును. ఈ దేవతకూడ నురుగులోపుట్టినదే (Aphrogenia = Foam-born). ఊర్వశిని ఒకచేత విషపాత్రతో, ఇంకొకచేత అమృతపాత్రతో చిత్రించుటలో స్విన్‌బర్న్ వ్రాసిన 'Ode on Aphrodite' అను గేయప్రభావమున్నది. స్విన్‌బర్న్ ఇట్లనెను.

'A bitter flower from the bud
Sprung from the sea without roots
Sprung without graft from the years.

ఇందులోని 'Bitter Flower' అన్నదానిని రవీంద్రుడు 'విషము'గా చిత్రించినాడు. 'without roots' అన్నదానిని 'వృంతములేనిపుష్పముగా' మలచుకొన్నాడు. స్విన్‌బర్న్ చిత్రించిన 'Perilous Goddess'గూడ సముద్రమునుండియే పుట్టును. ఆమె ఒకచేత 'ambrosia' (అమృత) పాత్ర, ఇంకొకచేత విషపాత్రధరించినదని స్విన్‌బర్న్ వర్ణించినాడు. టెన్నిసన్ 'Dream of women' అన్న గేయమున ఆలపించిన

'I saw wherever light illumineth
Beauty and anguish walking hand in hand
The downward slope to death'

అన్న పాదములలోని భావముసైతము రవీంద్రుని 'ఊర్వశి'గేయమున ధ్వనించును.

1. "Thus Urvasi here symbolized the beauty that tempts and enfeebles man, and drags him away from his duty to the country and dedication to higher causes, binding him to his future".

—Urvasi in Legend and Literature: G. Dharma Rao: Triveni 1952 July.

ఋగ్వేదములోని ఊర్వశీపురూరవుల సంవాదఘట్టముగూడ రవీంద్రుని ప్రభావితునిగా జేసినది. ఊర్వశి పురూరవునినుండి ఒకకొడుకునుకన్నపిమ్మట విడిపోవును. తర్వాత ప్రతి వత్సరాంతమున ఒకసారివచ్చి అతనితో సంభోగించి క్రమముగా ఆరుగురుపుత్రులనుగనెను. ఊర్వశి అవస్థాభేదమునుబట్టి వధువుగా, భార్యగా, తల్లిగా రూపొందుట దీనిలోనిరహస్యము. ఈ భావమునే గ్రహించి రవీంద్రుడు

'Neither mother nor daughter are you, nor bride, Urvashi woman you are; to ravish the soul of Paradise'[1] అని గానముచేసెను. ఊర్వశిని ఉషస్సువలె మునుగులేనిమూర్తియని కీర్తించెను. ఇట్లు ఊర్వశిని అలౌకికసౌందర్యమునకు అపూర్వమైనప్రతీకగా సృష్టించుట రవీంద్రునివిశిష్టత. ఇక కృష్ణశాస్త్రిగారి ఊర్వశీసృష్టిలోని వైలక్షణ్యమును పరిశీలింతము.

పురాణగాథలలోని ఊర్వశి ఋషులను పదభ్రష్టులజేయుటకు ఉపకరించినది. తెలుగు కావ్యములలో ఎవ్వరును ఊర్వశిని కావ్యవస్తువుగా గ్రహించలేదు. ఉత్తరహరివంశమున మాత్రము నాచనసోముడు ఊర్వశిని 'సంతనెన్నడో జవ్వనమ్ముకొన్న గడసాని'గా పచ్చిపచ్చిగా చిత్రించినాడు. ఆ ప్రకరణమట్టిది. రవీంద్రుని ఊర్వశి స్వర్గమర్త్యములకు స్వర్ణసేతువు రచించిన సౌందర్యదీధితి. రవీంద్రునివలెనే కృష్ణశాస్త్రిగారిని ఊర్వశీభావన తన్మయునిజేసినది. అంతకుముందాతని హృదయసాగరగర్భమున జరిగిన కల్లోలములకు ఫలితముగా హాలహలముద్భవించినది. కృష్ణపక్షప్రవాసములు ఆ కటికచేదును పుక్కిటబట్టుకొన్న కావ్యములే. ఊర్వశీకావ్యావతరణముతో అతనిహృదయమున అమృతభాండముదయించినది అతనిని ఆనందింపజేసెడి ఆర్ద్రప్రేమ, ఆదర్శసౌందర్యము ఈ లోకమునలేవని తెలిసికొని, తానూహించిన ప్రతిసౌందర్యఖండమును, ప్రేమశకలమును ఏరితెచ్చుకొని నిర్మించుకొన్న ఉజ్జ్వలసౌందర్యరాశి ఊర్వశి[2]. ఊర్వశి ఇతరాప్సరసలవంటిదికాదని శాస్త్రిగారే తమప్రసంగములో ఇట్లన్నారు. ''ఒక్కచక్కనిస్త్రీ యెలా ఉందో దాన్ని లోకము రంభఅంటుంది. స్త్రీ ఎలాఉండాలో దాన్ని కవి ఊర్వశి అంటాడు.''[3]రంభ సౌందర్యము లౌకికమని, ఊర్వశిసౌందర్య మలౌకికమని శాస్త్రిగారభిప్రాయపడినారు. అందుకే నారాయణుని ఊరువులోనుండి ఊర్వశిపుట్టుటతో అపూర్వసౌందర్యావిర్భూతియే లక్ష్యము కాబట్టి ఈ కథయే తమకిష్టమని శాస్త్రిగారు స్పష్టపరచినారు. ఆమె అతనికి 'దివ్యమందారసుమము'గా, 'మోహినీహాసమల్లీప్రఫుల్లరుచి'గా, 'శ్రీలలితవైజయంతీపరిమళము'గా భాసించినది. ఆమెను చూడగానే కవి

'నీవు తొలిప్రొద్దునునుమంచుతీవసొనవు
నీవు వర్షాశరత్తులనిబిడసంగ
మమునబొడమిన సంధ్యాకుమారి'

---

1. Collected poems and plays of Tagore : Macmillan & co. Ltd. ప్రథ : 1958 : P. 409.

1. 2. ఊర్వశి (రేడియో ప్రసంగము) : ప్రజామిత్ర : 1938 జులై 10.

వని ఆనందపరవశుడై గానముచేసినాడు. ఆమెను 'ఉషఃకాలకౌముదిసొగసు' వైతివన్నాడు. ఈ భావనపై రవీంద్రుడన్న 'Like the dawn you are without veil.........you rose.........on the first day of the first spring' అనుమాటలలోని అభిప్రాయము రేఖామాత్రముగా లేకపోలేదు. అట్లే ఊర్వశి ప్రియునితో

'హాలాహలానలమె అమృతశీతలరసమె
తోడుబుట్టులునాకు; తోడునీడలునాకు;

అన్నప్పుడు రవీంద్రుడుచెప్పిన అమృతవిషపాత్రలప్రసక్తి స్ఫురించును. సంయోగవియోగ ములు, సుఖదుఃఖములు తనను వీడవని దీని అభిప్రాయము. స్థూలముగా ఒకటిరెండు సాదృశ్య రేఖలున్నను కృష్ణశాస్త్రిగారి ఊర్వశీసృష్టి రవీంద్రునిదానికన్న విలక్షణమైనది. రవీంద్రునికి ఊర్వశితో ఎట్టియనుబంధములేదు. అతడు దూరమున నిల్చి ఆమెసౌందర్యమును వర్ణించి తృప్తి పడెను. కృష్ణశాస్త్రిగారిఊర్వశి వారిప్రేయసి. ప్రేయసిఅనగా వ్యక్తిగతమైనదని అర్థముకాదు. ఊర్వశి విశ్వప్రేయసియని, 'తొలి వియోగిని నేనె తొలి ప్రేయసిని నేనె'యను మాటలలో వారే వెల్లడించినారు. అంతవరకామె విశ్వప్రేయసి.[1] కాని వెంటనే 'అనాటికినాటికేనునీదాననే' అని ఆమెకు కవికిగల దృఢానుబంధమును వ్యక్తమొనర్చినది. అతనికామె గొప్పఆవేశమునిచ్చినది. ఆయనభావనలో స్నానమాడి, మానవత్వగంధమలదుకొన్నది. ఆమె అతని 'జీర్ణజీవిత ప్రాంగణ మున' ప్రవేశించగానే అతని 'ముదుసలినిరాశలు' నీడలై పరుగులుదీసినవి. అతనిబ్రతుకు నందన చైత్రమైనది. అప్పటి తనస్థితిని కవి యిట్లు పాడుకొన్నాడు

"నేడు నా జీవితముకూడ నిర్జరాంగ
నాదరస్మితమయి ప్రపంచాలుప్రాకు
పిలుచు నీరేడులోకాల ప్రేమకొరకు
పరపు నాహృదయము చరాచరములకును."[2]

అప్పటినుండి కవిహృదయములో 'విశ్వవీణాగళమ్ముఘోరుఘోరున' మ్రోతపెట్టినది. ఆయన విశ్వ ప్రేమనుపాసించసాగినాడు, అయినను ఆమెయెక్కడ ? అతడెక్కడ? అతడు ఇరులలోనున్న వాడు. ఆమె 'కరుణచే వలపుచే తరళమైన' రసాంతరంగ. ఆమె సురభిసౌదామనిగా, తరళ మధు ధారగా అతనిముందవతరించగా అతడు 'కలుగునా నాకు నీవియోగమ్ము సకియ'యని ప్రశ్నించి నాడు. 'పెంధూళిగదలలేక వెలుగులేక యెగురలేని' శిలలవంటి తనకనులపై ఆమెకనురెప్పల జాలిచూపులు పారిజాతదళములుగా, తారాతోరణములుగా, నింగినీడలమెట్లుగా, నీలిమొయిలు విరుపులుగా, అలరులుగ, అలలుగ, కలలుగ తూలిసోలిపడుటతో అతడు 'లజ్జాగాఢవేదనాగ్ని'లో

1. 'సీతమ్మ లోకైకమాత అయితే ఊర్వశి విశ్వప్రేయసి'. —ఊర్వశి (ప్రసంగము): కృష్ణశాస్త్రి.
2. ఊర్వశి : కృష్ణశాస్త్రి.

బడి ఆందోళితుడై 'కలుగునా నాకు నీ వియోగమ్ము సకియ'యని మరల ప్రశ్నించెను 'ప్రియతమా! నినువదలు'కొనలేనని జాలిగా పలవరించెను. అప్పుడాతని కనురెప్ప సెజ్జలపై ఒకస్వప్నము వాలినది. ఆ కలలో వారిరువురును నందనవీధులలో వెడలిపోయిరి. అక్కడ 'తెలివెన్నెల మల్లె పూవుల'ను తనదోయిలిలోనించి అతనిచరణధూళులను తనకౌదలనించి, జాలిగా ఊర్వశి ఇట్లనెను

"ప్రియతమా ! దాసి యక్షయప్రేమసేవ
కీలతాంతాలమొత్తాలు చాలునోయి
నింగిమూలల నీలిపందిళ్లపరచి
యెంతతెలిమల్లెతోట వేయించినానో".

ఈ విధముగా ఊర్వశీసంయోగము స్వప్నావస్థలో లభించినట్లు కృష్ణశాస్త్రిగారు చిత్రించినారు. మొదట విప్రలంభవ్యథలోనున్నప్పుడు ఊర్వశిని కఠోరప్రణయశాలినిగా చిత్రించినను, తర్వాత ఆమెను 'ప్రణయకరుణముల' సమ్మేళనముగా భావించినారు. వాస్తవజీవితమున ఊర్వశీసంయోగము కుదురదనువిషయము ధ్వనింపజేసినారు. 'పతితవెట్లౌదు, నేనెట్లుపక్షినౌదు' నన్నగేయ భాగములో ఆమె క్రిందికిదిగుట, తాను పైకెగురుట అసాధ్యమని వ్యక్తపరిచినారు అందుకే స్వప్న రూపమున సంయోగముజరిగినట్లు, నందనవిహారముచేసినట్లు కల్పనమొనర్చినారు.

ఈ కావ్యముచివరగల నటరాజస్తుతి ఔచితీమండితమైనది. శివుడు కరుణాస్వరూపుడు. ఈ కావ్యము కరుణము అంగిరసముగాగలది.

"ఏ విధాన సౌందర్యరసైకజీవి
నిలువనేరుతునిట నొక్కనిముసమేని
మామకీన జీవితశుష్కమార్గముల త్వ
దీయపాదమంజీరముల్ మ్రోయకున్న'

అని కవి నివేదించుకొన్నాడు. దుర్భరవిషాదముతో, దురంతలజ్జాభారముతో కుమిలిపోయిన కవి చివరిదశలో నిస్స్పృహుడై లోకాతీతుడై పరమేశ్వరపాదసాన్నిధ్యమును-అనగా శివైక్యమును ఆశించినాడు. జీవనయాత్ర ముగియువరకు, పరమేశ్వరదర్శనము జరుగువరకు ఆటతో పాటతో శివునివలెనే నృత్యశీలినౌదునని విన్నవించుకొన్నాడు. రక్తినుండి భక్తివైపుజరిగిన క్రమప్రస్థానము ఇందులో ధ్వన్యమానమగుచున్నది.

**శశికళ :**

బాపిరాజుగారి స్వప్నమూర్తి సౌందర్యావధియైన శశికళ ఒకవిధముగా ఈ కవికిమె ఇష్ట దేవత. భావకవులలో వారి హితులందరికి ఇష్టదేవతలున్నారని, తనబ్రతుకుబ్రతుకలిపి వలపించు

చతుర 'శశికళ'యని వారే వ్రాసికొన్నారు. 'ఎండిమియాన్'అనుశీర్షికక్రింద వారువ్రాసిన గేయములో 'శశికళా'సాక్షాత్కారవృత్తాంతమున్నది. తమగురువగు కూల్డ్రేగారితో బాపిరాజుగారు తీర్థయాత్రలు చేయుచుండగా ఒకసంఘటన జరిగినది. నదిలోయలో, వెన్నెలలో బండమీద మేనువాల్చి నిదురపోవు బాపిరాజుగారిపై ఒకానొకవెన్నెలవెలుగో, అప్సరసయో వ్రాలినది. దానినే తర్వాత కూల్డ్రేగారు చిత్రముగారచించి 'ఎండిమియాన్'అని నామకరణముచేసిరి. ఎండిమియాన్ అనువాడు గ్రీకుదేశపుగోపబాలుడు. అతిసుందరుడు. అతడొంటరిగా నిద్రించుచున్నప్పుడొక అప్సరస అతనిని వలచివచ్చి అతనిపై వ్రాలినదట. ఈ కథను కీట్సుమున్నగు కాల్పనికకవులు కావ్యరూపమున చిత్రించినారు. బాపిరాజుగారికి జరిగిన సంఘటన ఈ వృత్తాంతమునే పోలియున్నది. కలలో తనమీదవ్రాలిన ఆ దివ్యసుందరికే, ఆయపూర్వసౌందర్యరేఖకే బాపిరాజుగారు 'శశికళ'యని పేరుపెట్టుకొన్నారు. ఆమెకొరకొక చిన్నలోకమును సృష్టించినారు.

'చంద్రలోకం తూర్పుదెసలో
సూర్యలోకం పశ్చిమంలో
చిన్నిలోకం ఒకటి ఉన్నదే
ఓనా వెన్నెల చిన్నారిపడుచా
ఆ లోకమేలే
కన్నెరాణివి నువ్వే నువ్వేనే.'[1]

ఈ లోకమున ఒకపూజాపీఠమునమర్చి, ఆమెనాసీనురాలినిజేసి, ఆమెకు పట్టముగట్టి, 'నాఅమృతమూర్తివి, ఆత్మమధ్యవునీవే'యని కీర్తించినారు.

బాపిరాజుగారు సృష్టించిన శశికళ అలౌకికగంధమలదుకొన్న అలకానగరిసుందరియేకాని నిత్యజీవితమున తారసిల్లిన తరుణికాదు. ఆమె అతనికి ప్రియురాలేకాదు; గురువు; శిష్యురాలు. ఆమెయే సూర్యసుత, చంద్రబాల, గానశిల్పచిత్రాదికళామూర్తి. ఆమె 'నగలలంకరించనికల.' ఆమెయే అతని బాణి, వాణి, రాణి. ఆమె స్వప్నములో తళుక్కుమని మాయమైపోయినపిమ్మట ఆమెకొరకతడు కొండలుకోనలు గాలించినాడు. సర్వరసానందములకు నిలయమైన దేవళమ్ము నిర్మించికొని ఆమెకొర కెదురుతెన్నులుగాచినాడు. ఆమె మరల అతనికి సాక్షాత్కరించలేదు. ఆయనబ్రతుకే ఒకఅన్వేషణమైనది. ఆమెకును తనకును నడుమనున్న భౌతికరూపబంధములను తెరగా భావించికొని

'ధవళమైనదీ, తలపుదాటినది
దానికి మొదలూ చివరాలేనిది
నీకు ఇవతల, నాకు అవతల
తెర ఉన్నాది బాలా'[2]

---

1. శశికళ : పుట 19. 2. శశికళ : పుట 1.

అని బాధపడినాడు. క్రమముగా ఆత్మసాయుజ్యముపొంది లోకమంతట ఆమెదివ్యలీలనే సందర్శించినాడు.

'కాలాన్ని కట్టేసి కాలికిందనురాతు
నాలోన నీవు నిత్యయౌవనవు'

అని కాలాతీతుడై తుష్టాంతరంగుడైనాడు. ఆమెగాంధర్వము 'గ్రీవగంగోత్తరీపావనోద్ధూత మందాకినీస్వచ్ఛ'మై విరియగా 'ఆనందపరవశుడై' భగీరథత్వము వహించినాడు. 'అమృతాప్లావితతనూకమనీయమూర్తి'యై 'నిత్యావిద్యాహృదయమృత్యుంజయు'డైనాడు. పర్యవసానముగా ప్రణవస్వరూపిణియైన తనభావనాదేవిని తనలో పొదిగికొన్నాడు. అప్పుడు 'వనధికలశాంబుధి, 'జనులెల్లదేవు'లైనారు.

బాపిరాజుగారీవిధముగా స్వప్నములోదర్శించిన దివ్యసౌందర్యమునకే రూపకల్పనచేసికొని, ఆమెతో సంయోగవియోగములనుభవించి, సమస్తకళాప్రసూనములతో ఆమెనారాధించి, తాదాత్మ్యసిద్ధినందిరి. కాటూరివెంకటేశ్వరరావుగారన్నట్లుగా 'అతనిఆత్మయందలి సౌందర్యబోధయే శశికళ. ఆమెనారాధిస్తూ తన బ్రతుకును, లోకాన్ని సౌందర్యంతో నింపాలనేదే అతని జీవితాశయం.'[1]

### కిన్నెర :

విశ్వనాథవారి 'కిన్నెరసానిపాటల'లో, నాయిక కిన్నెరసాని. భద్రాద్రిదగ్గరగల కొండ చుట్టుతిరిగి ప్రవహించు వాగుపేరు కిన్నెరసాని. ఆ కొండను, ఆ నదిని చూచినపిమ్మట విశ్వనాథవారి మనస్సులో కలిగిన భావవీచీప్రచారమొకకథాకల్పనగా, ఒక మధురవీణాఝుంకృతిగా రూపుదిద్దుకొని రవళించినది. వారిదృష్టికి నది నాయికగా కనిపించినది. కొండ నాయకుడుగా భాసించినాడు. పెనుగొండయందలి బృందావనమునుజూచి శక్తిమతీకోలాహలపాత్రములను భట్టుమూర్తి సృష్టించినట్లే, విశ్వనాథవారికిన్నెరసానిచుట్టు కథకల్పించియుందురని పుట్టపర్తినారాయణాచార్యులుగారభిప్రాయపడినారు.[2] 'ఈ కథ జనప్రచారంలోలేదు. కిన్నెరసానివాగు భద్రాద్రిపోయే త్రోవలోవుంది. ఆ వాగుచూశి ఆ మధురనామం నిరంతరం మననంచేసుకోవటంవల్ల కల్పించుకొన్నకథయిది"యని విశ్వనాథవారు చెప్పికొన్నారు;[3] కిన్నెరసానికావ్యమునకు పూర్వకథయిది.[4] కిన్నెర మహాపతివ్రత. కొడుకుసౌఖ్యమెరుగని అత్త కిన్నెరమీద నిందలారోపించగా కిన్నెర హృదయము శోకముచేత ప్రళయసముద్రమైనది, భర్త యేమిఅనలేని, చేయలేనిస్థితిలోనున్నాడు. కిన్నెర ఆవేశముతో అడవులవెంట పరుగెత్తినది. భర్త వలవని ఆమెను కౌగిలించికొన్నాడు.

1. బాపిరాజుగారి శశికళాసృష్టి (వ్యాసము): వాణి: 22-11-1958.
2. 'మహాకవి విశ్వనాథ' : (వ్యాసము) : భారతి : చిత్రభాను మాఘము.
3. జయంతి : 2వ సంచిక.
4. ఈ కథాకల్పనముగూర్చి విశ్వనాథవారే కావ్యప్రారంభమున వ్రాసికొన్నారు.

'ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరైవాగై ప్రవహించింది. అతడుశోకించిశోకించి శిలఅయినాడు.' ఈ కల్పన పూర్వరంగమునకు చెందినది. కావ్యమంతయు ఈ సంఘటన పిమ్మట జరిగిన వృత్తాంతకథనమే.

ఈ కథాకల్పనపై ఏ యితరప్రభావములేదని విశ్వనాథవారన్నారు. దీనికి మూలములని చెప్పలేముగాని పోలికలున్నకథలొకటిరెండున్నవి. ఇందులోని చమత్కారమంతయు నదిని నాయికగాభావించుట; నాయిక నదిగామారిపోవుట. వాల్మీకిరామాయణమున ఒకచిన్నకథ యున్నది. విశ్వామిత్రునిచెల్లెలు కౌశికి విశ్వామిత్రుడు సిద్ధాశ్రమములో తపస్సుచేసికొనుచుండగా, అన్నగారిమీదిప్రేమతో ఆమె ఆ యాశ్రమమువద్ద నదీరూపమున ప్రవహింపసాగినది. ఇంతకు మించి సంస్కృతాంధ్రసాహిత్యములలో వనిత వాగుగామారినజాడలు కనిపించవు. 'శుక్తిమతీ కోలాహల'ఘట్టమును వసుచరిత్రలో రామరాజభూషణుడు రమ్యముగావర్ణించినాడు. ఈ కథలో శుక్తిమతీనది స్త్రీరూపమున నర్మదాద్యన్యనదులతోకలసి బ్రహ్మసభకుపోయివచ్చుచుండగా కోలాహలుడడ్డగించి అమెతో బలవంతముగా రమించెను. ఈ ఘట్టమును వర్ణించుటలో నదీపరముగా, నాయికాపరముగా శ్లేషించి భట్టుమూర్తి చమత్కారముచూపినాడు. నదికి నాయికాభావమిచ్చుటలో తప్ప 'కిన్నెరసాని'కి దీనికి పోలికలేదు.

ఇంగ్లీషుకవిత్వములో షెల్లీవ్రాసిన 'ఎరితూజా' (Arethusa)అన్నగేయములోని కథకు కిన్నెరసానికి కొన్నిరేఖామాత్రమైన పోలికలున్నవి. ఎరితూజా ఒకచిన్ననదిపేరు. మబ్బుల నుండి, కొండశిఖరములనుండి దిగి నృత్యముసేయుచు మెలికలుతిరుగుచు ఇది పడమటి దిశగా ప్రవహించినది.

'She lept down the rocks
With her rainbow locks
Her steps paved with green
The down ward ravine
With slopes to the Western gleems'.

ఈ నడకలు కిన్నెరసానినడకలను స్ఫురింపజేయుచున్నవి.[1]

---

1. కిన్నెరసానిపాటలలోని కిన్నెరసానినడకలు చదివినప్పుడు రామాయణమున భగీరథునివెంట పరుగెత్తు గంగనడకలు రేఖామాత్రముగా స్ఫురించును.

'మున్ను భగీరథభూపతి
వెన్నువెంట పరుగెత్తిన
అన్నాకథనీవైఖరి
నున్నది నీచవ్వత్రోవ'

అనుపాదములలో విశ్వనాథ దీనిని ధ్వనింపజేసినాడు.

'And gliding and springing
She went, ever singing,
In murmurs as soft as sleep;
The Earth seemed to love her
And Heaven smiled above her,
As she lingered towards the deep.'

ఈ పంక్తులలో కిన్నెరనృత్యసంగీతములవిషయము వాసనాప్రాయముగానున్నది. ఆ నదిని పృథివ్యాకాశములు ప్రేమింపసాగినవనుటలో ఆమెసౌశీల్యము ధ్వనింపబడినది. కిన్నెరశీలమిట్టిదే. ఈ నదిని ఆల్ఫియస్ (Alpheus) అను నదీదేవత (పురుషుడు) చెరపట్టవలెనని వెంబడించెను. ఎరితూజా ఆర్తనాదముతో సముద్రమువైపు ప్రవహించెను.

'Oh save me oh guide me
And bid the deep hide me.'

ఈ యాక్రందనమువిని సముద్రము జాలిపడినది.

'The Loud ocean heard
To its blue depth stirred.'

ఇందులో 'కథఅడ్డముతిరిగినది'. సముద్రుడు 'కిన్నెరసాని'లో ప్రతినాయకుడు, కిన్నెర తల దాచికొన్నది గోదావరియనుమరియొకనదిలో. ఈ కథలో అట్లుగాక ఇంకొకనది ఎరితూజాను కామించి వెంటబడినది. ఆమెకాశ్రయమిచ్చినది సముద్రము. అయినను రెండునదులు. ఒక సముద్రము ఈ రెంటిలోనుండుట గమనింపదగినది. పైగా ఇందులో కవి నదికి స్త్రీత్వమిచ్చినాడనుటకు ఎరితూజా మొరపెట్టుకొన్నప్పటి 'for he grasps me now by the hair'అనునది చక్కని నిదర్శనము.

'The loud ocean heard
To its blue depth stirred"

అను పంక్తులు అచ్చముగా కిన్నెరసానిలోని 'గోదావరీదేవిగుండెగూడులుకదలి'అన్న భావనతో సరిపోవుచున్నవి. నేను మొదట నివేదించినట్లుగా పోలికలుచూపుటయే నాఉద్దేశముకాని మూల నిరూపణముచేయుటకాదు.

తెలుగులో అబ్బూరిరామకృష్ణారావుగారు రచించిన 'నదీసుందరి'యను ఏకాంకరూపకములోని వస్తువునకు 'కిన్నెరసాని'లోని వస్తువునకు కొంచెము పోలిక కనిపించుచున్నది. 'నదీసుందరి' కిన్నెరసానిపాటలకు ముందుగానే ప్రచురింపబడుట గమనింపదగినవిషయము. 'నదీసుందరి'లోని నాయిక కావేరి. ఆమె నదీకన్య. దైవవశమున కులపతిఆశ్రమమున కన్యగా పదునెనిమిదేండ్లవరకు పెరిగినది. ఆ తరుణప్రాయములో ఆమెకు, మునికుమారుడగు అగస్త్యునికి ప్రేమానుబంధ

మేర్పడినది. ఇరువురుకలసి ఒకనాటివెన్నెలరేయి సహ్యాద్రిపంక్తులందు విహరింపనేగిరి. ఒకానొక రమణీయనికుంజమున కాలుమోపగనే కావేరి మనుష్యరూపమును విడనాడి నదిగామారిపోయినది. ఆ ప్రవాహమునుండి 'జీవనపతీ ! ప్రతిసంవత్సరమును ఈ దినమునకై వేచియుందును' అన్నమాటలు వినిపించును.[1] వనకన్యకలు, ఉద్యానదేవతలు, లతాకన్యలుచేరి 'కావేరి దేవేరియై వచ్చెనే'దని పాటపాడుదురు. ఈ రూపకములో కన్య నదిగామారిపోవుట, ఆమెకొక ప్రియుడుండుటఅను రెండంశముల ప్రభావము 'కిన్నెరసానిపాటల'లోనివస్తువుపై ప్రబలముగా పనిచేసినది. ఈ విధములైన సంవాదరేఖలొకటిరెండు అందందుకనిపించినను విశ్వనాథవారి 'కిన్నెరసాని' ఆంధ్రకవితాప్రపంచములో అపూర్వసృష్టి; అమృతవృష్టి.

కిన్నెరసానిపాటలలోని కథాకల్పనము మానవజీవనపరముగాసాగినది. కిన్నెర మొదట మానవాంగన. తదనంతరము వాగుగామారినది. కథాకల్పనమున పూర్వభాగములోనివిషయములు ఉత్తరభాగమునకు ప్రాతిపదికలైనవి. కిన్నెరపాతివ్రత్యము భర్తశిలయైపోయినపిమ్మట అతని చుట్టుతిరుగుటలో సూచితమైనది. కిన్నెర ఉద్విగ్నహృదయమే ఆమెనృత్యసంగీతములకు మూలము. ఆమె అత్తచేసిననింద భరించలేదు. అట్లే తరువాత కడలిపొంగునుజూచి కలవరపోయినది. 'కొడుకుసుఖమెరుగనిఅత్త'యని విశ్వనాథవారు 'కల్పన'లో అన్నదానినిబట్టి కిన్నెరకు, ఆమె భర్తకుమధ్యగల అనురాగమయదాంపత్యము ధ్వనించినది. 'అత్తయనుపదము ఇంటిపెత్తనమునకు, మూర్ఖత్వమునకు సూచిక.'[2]

అత్తపెట్టిన ఆరడికోర్వలేక కిన్నెర అడవులబట్టినది. ఆమె 'రసాకృతి'కావున 'ధునీవైఖరి'వహించినదని, భర్త శిలాత్ముడుకాబట్టి శిలయైపోయినాడని విశ్వనాథవారు వర్ణించినారు. ఈ యిరువురిదుఃఖమొకటేయైనను వారివారివాసనలపురస్కరించుకొని పరిణామములు భిన్నములైనవి. స్త్రీ ప్రకృతిస్వరూపిణి. కాబట్టి ఆమెలలితమధురస్వభావముకలది. కిన్నెరసాని నదియగుటలో ఈ రహస్యమున్నది. పురుషుడు స్త్రీకన్నగభీరుడు, ధీరుడుకాబట్టి అతడు నదీత్వము వహింపలేకపోయినాడు, స్తబ్ధుడైనాడు; అనగా శిలీభూతుడైనాడు. దుఃఖభారముచేత అతని గుండె జడీభవించుట ఇందలినిరహస్యము. భర్త రాయియైపోయినఘట్టము చదివినప్పుడు భవభూతిపలికిన

'అనిర్భిన్నగభీరత్వాదంతర్గూఢఘనవ్యథః
పుటపాకప్రతీకాశో రామస్య కరుణోరసః' అను శ్లోకము

స్ఫురించునని పుట్టపర్తివారన్నారు.[1]

1. నదీసుందరి : (1931 ముద్రణ) : పుట 59.
2. కిన్నెరశృంగారము : (వ్యాసము) : సాళ్వకృష్ణమూర్తి : భారతి 1959 జూన్.
3. మహాకవివిశ్వనాథ : (వ్యాసము) : భారతి : చిత్రభానుమాఘసంచిక.

ఈ పాటలలో ప్రధానపాత్ర కిన్నెర. ఆమె పతిశీలమును అడుగడుగున రసాభిముఖముగా చిత్రించుటయే విశ్వనాథవారిలక్ష్యము. కిన్నెరను తెలుగువారింటిపడుచుగా ఉపలక్షించి వారు ఈకావ్యరచనచేసినారు. తెలుగునాట భార్యాభర్తలనడిమి లోకవృత్తమును, తత్పరిణామమును వెల్లడించినారు. 'కిన్నెరపుట్టుక'లో విప్రలంభము నాయకపరముగానున్నది. 'ఓహో కిన్నెర సానీ'యని ఆమెవెంటపరుగిడి, ఆమె నదిగామారినవిమ్మట భర్తవిలపించినఘట్టమిది. 'కిన్నెర నడక'లో విప్రలంభము నాయికాపరముగాసాగినది. 'కదలిపొంగు'లో సముద్రునిరతిభావము నిక్షిప్తమైయున్నది. 'కిన్నెరదుఃఖ'మనుశీర్షికలో ప్రత్యాశారహితమైనకరుణస్థితి నిరూపింపబడినది. 'గోదావరీసంగమము'న నాయికా శీలరక్షణమునకు ఆశ్రయప్రాప్తికలిగినది, 'కిన్నెరవైభవము'న నాయికాప్రాశస్త్యము, ఆమెనిర్వాణప్రయత్నము సూచింపబడినవి. ఇదియంత లోకవృత్తమే.

'కిన్నెరనృత్యము', 'కిన్నెరసంగీతము'అనుభాగములలో శబ్దనాదరస్యతయటుండగా, కిన్నెరదంపతుల పూర్వ (సంయోగ) శృంగారము ధ్వనించుచున్నది. ఆమె నత్తవారింటికిసాగ నంపుట, ఆమె 'తల్లిదగ్గరనుండి తనమెడకుపలుపోసి లాగగాబడ్డట్టిలేగ'వోలె కదలిపోవుటమున్నగు వానిలో పూర్వస్థితిని నెమరువేయించుటజరిగినది.

కిన్నెర భర్తను విడిచిపోవునప్పుడు భర్త ఆమెజడబట్టి, చేలాంచలములాగి, పాదానతి చేసినట్లు ధ్వనించుచున్నది. ఇవి కుపితనాయికకు నాయకుడుచేయు లాలనరీతులు.

'పరుగెత్తెడు నీ వేణీబంధము పూనితి చేతను
కరమున వేణికిబదులుగ కాల్వగట్టె నీటిపొరలు.
ఎడమచేత నీకొంగును ఒడిచి పట్టుకొంటి చెలీ
తడిచేతను కొంగులేక తడబడితిని ప్రియురాలా.
నీ పాదమ్ములు మోచిన నా ఫాలమ్మున చెమ్మట
ఈ పగిదిని వాగువైన నీ పైప్రేమము చూపెడి.'

ఈ చరణములలో కుపితయైనకిన్నెరను పతి లాలించురీతితోపాటు అపూర్వభావనాశక్తి ప్రదర్శితమైనది. ఈ వర్ణన కిన్నెర మానవత్వమునుండి నదీత్వమునకు పర్యవసించుచున్న సంధికాలావస్థను సూచించుచున్నది. అతడామెవేణిని గ్రహించెను. అది నీరైపోయెను. కొంగుపట్టుకొనెను. కొంగు నీరైపోయెను. పాదములపై ప్రణమిల్లెను. పాదములు నీరైపోయెను. అతని ఫాలములోని చెమట ఈ విషయమునే సూచించును. తలనుండిపాదములవరకు క్రమముగా చేసినవర్ణనమిది. ఆమె పైనుండిక్రిందివరకు వరుసగా జలజలప్రవహించిపోయిన దశాత్రితయమునకు విశ్వనాథవారివర్ణన దృశ్యచిత్రణమువంటిది.

'కిన్నెరసంగీతము'న కాంక్షామాత్రముగా కిన్నెరమనసున గునిసియాడిన సంతానప్రాప్తి చెప్పబడిన'దని సాళ్వకృష్ణమూర్తిగారభిప్రాయపడినారు.[1] ఇందుకు వారీఘట్టమున 'వింతగా

1. కిన్నెరశృంగారము (వ్యాసము)

సిగ్గందుట', 'విరియుట', తెల్లతెల్లనగుట', మైనిగలు నదురుచూపుట' మున్నగునవి గర్భిణీలక్షణములని వ్యాఖ్యానించినారు. ఒకవిధముగా ఈ వర్ణనలామె 'అంతర్వ్యక్తి జీవితదశాక్రమము'ను ధ్వనింపజేయుననుటలో విప్రతిపత్తియుండకూడదు. కావ్యాంతమున

'తెలుగు దైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతని దర్శనముచే సేత్రోవ
కాచింది కిన్నెరా'[1]

అన్నపాదములలో ఆమె భద్రాద్రిరామునిచరణసన్నిధిని లీనమై బ్రహ్మసాయుజ్యముపొందినదనుఅర్థము నిగూఢముగానున్నది. ఈ రీతిగా విశ్వనాథవారు కిన్నెరను పతిశీలము, రసహృదయము మేళవించుకొన్న ప్రణయనాయికగా చరితార్థముచేసినారు.

**యెంకి :**

భావకవిత్వములోని శృంగారనాయికలలో యెంకి విలక్షణమైనది. ఊర్వశి, శశికళ మున్నగువారు వెన్నెలనురుగులు పోతవోసినమూర్తులు. వారికి యెంకికి పోలికలేదు. యెంకి అడవిమల్లెవంటిది. ఊర్వశ్యాదులు నందనమందారసుమములవంటివారు. యెంకి అడవిమల్లెవంటిదైనను అంతరంగమున పారిజాతపరిమళము గుబాళించినది. దానినంటుకొనియే మృత్సాన్ద్రగంధము గుప్పుమనుట ఆమె అంతర్వ్యక్తివిశేషము.

'గుండె గొంతుకలోన కొట్లాడుతాది
కూకుండనీదురా కూసింత సేపు'

అన్నపాటతో యెంకి తెలుగుదేశమున అవతరించినది. ఆమెబాల్యాదులు మనకు తెలియవు. ఆమెఅవతరణమే తరుణవయోదశతో జరిగినది. ఈ పాటతోనే నండూరిసుబ్బారావుగారి గొంతుముడి విడిపోయినది. వసంతకాలమున తొలితొలిచివుళ్ళనుదిని జీరవదలినగొంతుతో కుహూకూజితములనాలపించిన పుంస్కోకిలమువలె, ఆయన క్రమముగా 'యెంకిపాటల'ను గానముచేసినాడు. భాషలో, భావములో, వస్తువులో, ఛందస్సులో, పదవరణములో అపూర్వమైన నవ్యత సంతరించికొన్న రసగీతముల నవతరింపజేసినాడు.

సుబ్బారావుగారు యెంకిపాటలువ్రాయునాటికి గురజాడ, రాయప్రోలు, అబ్బూరి, వెంకటపార్వతీశ్వరకవులు కవితాలోకమున క్రొత్తపాతలమేలుకలయికతో క్రొమ్మెరుంగులు చిమ్ముచున్నారు. వల్లూరిజగన్నాథరావుగారి కోడిపాటలతో, గొల్లపాటలతో, 'చల్ మోహనరంగా'వంటి జానపదగేయములతో యువలోకము పులకితమైపోవుచున్నది. సుబ్బారావుగారు మొదటినాళ్ళలో జానపదగేయఫక్కిలో రచింపబడిన వల్లూరిజగన్నాథరావుగారి పాటలను గొంతెత్తి కమ్మగాపాడి

1. కిన్నెరసానిపాటలు : పుట 65.

వినిపించుచుండెడివారట. ఒకవైపు ఆంగ్లవిద్యాభ్యాసమువలన వర్డ్సువర్తు, బర్న్సు, షెల్లీ, కీట్సుమున్నగు భావకవుల ప్రణయగీతములు చదివెడి అవకాశముకలిగినది. ఇంకొకవైపు చల్ మోహనరంగావంటి జానపదగేయము లాతనితరుణహృదయములో పులకలుపేర్చినవి. గురజాడ వారిముత్యాలసరాలు, దేశీయపుపలుకుబడికి వారుచేసిన ప్రాణప్రతిష్ఠ, లవణరాజుకలలోని ప్రకృతివర్ణనలు, నండూరివారిని ముగ్ధునిచేసినవి. ఈ ప్రభావములసమష్టిస్వరూపమే యెంకిపాటల అవతరణము. ముఖ్యముగా ఇంగ్లీషులో బర్న్సుకవి స్కాట్లండుదేశపుజానపదభాషలో రసవత్తరమైన గేయములు రచించుట ఈయననాకర్షించినది. బర్న్సు కలముపట్టకముందు స్కాచుభాషను స్కాట్లండుదేశీయులే ఏవగించుకొనెడివారు. వట్టిమట్టియని అందరనుకొనుచున్నభాషలో వజ్రమాణిక్యకాంతులను వెలార్చినాడు బర్న్సు. స్కాట్లండులోని కర్షకభాషను, జానపదసంగీతమును సముచితరీతిలో ప్రతిచేసుకొన్న బర్న్సుకవిరచించినపాటలు త్వరలోనే స్వదేశీయుల విదేశీయులమన్ననలందికొన్నవి. బర్న్సుకవివలెనే సుబ్బారావుగారు 'తూర్పుకాపువారియాస'లో దేశీయమైనపలుకుబడితో, జానపదగేయములవరుసలలో పాటలురచించి విప్లవముసాధించినారు. విషయము సూటిగా గుండెకుతగులునట్లుచెప్పుటలో వీరు హౌస్‌మన్‌పద్ధతినవలంబించినారు. చిన్నచిన్న మాటలలో మిన్నులనంటు ఔన్నత్యమును సాధించుటలో వీరు గాథాసప్తశతికారుని, అమరుకుని అతిగమించినారు.

యెంకిపాటలు జానపదభాషలో రచింపబడినవైనను దీనిలోని భావములన్నియు వారివి కావు; వీనిలో కొంతదూరముపోయినపిమ్మట నాయికానాయకులు నిమిత్తమాత్రులగుదురు. సుబ్బారావుగారు తమప్రణయాడుభూతులనే ఆ పాత్రలరూపమున ప్రకటించినట్లు తెలుపుకొన్నారు. 'యెంకి నా ప్రేమరసానికాశ్రయము; నా శృంగారవాక్కునకు విశ్రామస్థానము; నా వలపులకు నిధానము'.[1] మొదటికొన్నిపాటలలో యెంకి కేవలము జానపదకన్యవలె కనిపించును. 'కన్నుగిలికిస్తాది, నన్నుబులిపిస్తాది, దగ్గిరసకూకుంటె అగ్గిసూస్తాది' అన్నప్పుడు, 'జామురేతిరియేళ జడుపుగిడుపూమాని'నాయుడుబావ చేనిలోనుండగా 'నీలిసీరాగట్టినీటుగా' వచ్చినప్పుడు, 'నీకాపుర మేడనే'అని నాయుడుబావప్రశ్నించగా 'నీ నీడలోనే మేడకడుతా నాయుడుబావ' అన్నపుడు, యెంకిలో అచ్చమైన పల్లెటూరిపిల్లవాలకమే అగుపించును. ఈ దశలో యెంకినాయుడుబావలు కేవలముప్రేమికులు. వారికప్పటికి పెండ్లికాలేదు. 'గుండెగొంతుకలోన'అన్నపాటలో, 'హౌన లచ్చిమి'అన్నపాటలో యెంకి 'మందొమాకోయెట్టిమరిగించినాదీ' మున్నగుమాటలు ఉంపుడుకత్తెలపట్లమాత్రమే చెల్లునని బసవరాజుగారు విమర్శించిరి. ఈ విమర్శ సమంజసమైనదికాదు. ఆమె పరకీయకాదు. తాను మనసిచ్చినవానికొరకు డోలాందోళితయైనకన్య. కొన్నినాళ్ళకు వీరికి వివాహమైనది. కన్నుగిలికించుట, బులిపించుట తగ్గిపోయినవి. తనభర్త ఊరికివెళ్ళి చెప్పిన గడువుమేరకు రాకపోగా ఆమె 'వొళ్లంతఉలికులికిపడి'నట్లు, 'తనయెనకఎవరోనడిసినట్లు', తన భర్తయే కనులకుగట్టినట్లు ఆమెకు స్ఫురించెను. అప్పుడామె 'రాసోరింటికైనరంగుతెచ్చేపిల్ల'.

1. యెంకిపాటలగాలిదుమారము (వ్యాసము) : 1926 ఆంధ్రపత్రికఉగాది.

ఆమె 'కళ్ళె త్తితేసాలు కనకాబిసేకాలు'. ఆమె 'పదముపాడినదంటె పాపాలుపోవాల.' వివాహానంతరము యెంకినాయుడుబావల దాంపత్యజీవితము ధర్మనిష్ఠితమైపోయినది. వారిరువురు కలసి భద్రాద్రికేగిరి. తిరుపతిని దరిసించిరి. యెంకికి క్రమముగా 'సంకలోసంబ్రాలుపడు'కుఱ్ఱవాడు కలిగినపిమ్మట ఆమె భవభూతియన్న 'ఇయంగేహేలక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః' అన్న స్థాయినందుకొన్నది. తరువాతిపాటలలో యెంకి దేవతగా నాయుడుబావ భక్తుడుగా కనిపింతురు. అలంకారశాస్త్రరీత్యా యెంకి అష్టవిధనాయికలలోని స్వాధీనపతిక. 'ఈ రేయినన్నొల్లనేరవా' అన్నపాటలోమాత్రము విప్రలబ్ధలక్షణము కనిపించును. ఈ పాటలలో దేనికది ఒక రసవత్కావ్యము. ప్రతిగేయమున ఇరువురిలోఒకరు ఆలంబనవిభావముగానున్నారు. ఉద్దీపనములున్నవి. అశ్రుపాతాద్యనుభావములున్నవి. సంచారిభావములున్నవి. ప్రాచీనలాక్షణికదృష్టితోచూచినను ప్రతి పాటలో రసనిష్పత్తికి వీలున్నది.

యెంకి మాధురీధురీణమైన దాంపత్యధర్మమునకు అచ్చమైనప్రతీక. జానపదాంగనయైనను ఆమెలో పూర్వజన్మార్తమైన సంస్కారబలమున్నది. 'యెలుతురంతామేసి యేరునెమరేసింది', 'యెన్నెలలసొగసంత యేటిపాలేనటర'వంటి స్వగతములలో ఆమె ఊహాసౌందర్యమభివ్యక్తమగును. 'సికలోనసికకలిపి మొకముమొకమూకలిపి, వెలుగుదేవతకు చక్కలిగింతవెట్టింది' వంటి చరణములలో ఆమె ఆత్మౌన్నత్యము ధ్వనించును.[1] 'గోవుమాలచ్చిమి'అన్నపాటలో యెంకి నాయుడుబావల గార్హస్థ్యధర్మము చక్కగా నిరూపింపబడినది. ఇందులో గోవు లక్ష్మితో రూపింపబడినది. లక్ష్మి ఐశ్వర్యమునకు, అభ్యుదయమునకు సంకేతము. గోవు చతుర్విధపురుషార్థములలో గరీయమైన ధర్మమున కధిష్ఠానము. నాయుడుబావ యెంకితో కూర్చుండి కథలుచెప్పుచుండగా గోవు తలద్రిప్పినదట. అనగా వారి కామప్రవృత్తిని ధర్మదేవత గమనించి ఆమోదించినదని యర్థము. యెంకి సరసములాడుటకు జంకుచుండగా గోవు 'సూసిసూడక కన్నుమూసి తెరిసే'దట. అనగా ధర్మబద్ధమైన కామముపట్ల తనకుగల ప్రసన్నబుద్ధిని వ్యక్తముచేసినది. వారిరువురు పోట్లాడుకొనగా గోవు తెల్లవోయినది. ధర్మశృంగారము నాచరించు దంపతుల ప్రణయకలహమునుజూచి గోలక్ష్మి విభ్రాంతయైనదని దీని తాత్పర్యము. ఈ చిన్నగేయములో వారి ఉదాత్తమైన ధర్మశృంగారము చిత్రింపబడినది. 'ఆరిపేయవెదీపమూ' అన్నపాటలో, 'లేపకేనాయెంకి'అను పాటలో ఇంద్రియాతీతమైన సౌందర్యము, స్వేచ్ఛప్రణయము నిక్షేపింపబడినవి. ప్రథమదశలో ప్రవాసముననున్న తనభర్తనుగూర్చి 'దూరాననారాజుకేరాయిడౌనో' అని 'సీమసిటుకనగానె సెదరి'పోవు మనసుగల యెంకి క్రమముగా 'కళ్ళలో చందురుని ఖైదుగొని నిదురించు' పరిణతదశ నందుకొన్నది. అయినను అప్పటికి ఇప్పటికి ఆమె 'యెల్తురువిల్ల'. తానెదురునిలిచెనా కాశీదేవునిచే తలతడుముకొనునట్లుచేయు సౌందర్యమూర్తి.

యెంకిపాటలలోని నాయికానాయకులగు యెంకినాయుడుబావలగురించి పండితులు కొందరు అమూల్యాభిప్రాయములు వెల్లడించినారు. పురాణంసూరిశాస్త్రిగారు యెంకినాయుడుబావలు కేవ

1. 'సూపుతో మాటాడి వూపిరితొ తెనిగించు' అన్న గేయభాగములో కుశాగ్రధిషణ వ్యక్తమైనది.

లము జీవేశ్వరులేయని అన్నారు. పంచాగ్నులవారు వీరిని 'శృంగారరసాధిష్ఠానదేవతలగు రతీ మన్మథు'లని యన్నారు. వేదంవెంకటరాయశాస్త్రిగారు రంభానలకూబరులు అలంకారశాస్త్ర విరుద్ధముగా శృంగారసల్లాపముచేసిన దోషమువలన కలియుగములో యెంకినాయుడుబావలుగా జన్మించినారని చమత్కరించినారు. ఇంకను గిడుగువారు, వేటూరివారు, మల్లంపల్లివారు. వేదాల తిరువెంగళాచార్యులుగారుమున్నగు పండితులు యెంకిపాటలలోని ప్రాశస్త్యమును నిరూపించినారు. పొక్కులూరిలక్ష్మీనారాయణవంటివారు యెంకినాయుడుబావలు సంకరదంపతులని నిందించినను, వారి పవిత్రదాంపత్యమునకు ఏమాత్రము పొచ్చెముగాని, మచ్చగాని కలుగలేదు. అట్లే ఉమాకాంత పండితులు వీనిని 'చంద్రయ్యనారాయణమ్మ'పాటల వరుసలోనికి విసగివేసినను, ఇవి 'ఆంధ్ర ధ్వన్యాలోకము'[1] వంటి లక్షణగ్రంథములకే శిరోధార్యములుకాక తప్పలేదు. ఇక సాహిత్య రసికులసంగతి చెప్పనక్కరలేదు. యెంకిపాటలప్రభావము యువకవులపై మూడునాలుగు దశాబ్దములపాటుగా ప్రసరించినది. ఈ పాటలననుసరించి లచ్చిపాటలు, సీతిపాటలు, లంబాడీ పాటలు, కాపుపాటలుమున్నగునవెన్నో వెలువడినను, ఇవి యెంకిపాటల నీడలనుగూడ అందు కొనలేకపోయినవి. ఈ పాటలధోరణిలోనే పెకలివచ్చినను, మౌలికత కొరవడకుండ రసాత్మలను రంజింపజేసినవి కొనకళ్ళవెంకటరత్నంగారి 'బంగారుమామపాటలు'. ఇవి ఇటీవలే పుస్తక రూపమున వెలువడినవి. అంతకుముందు పత్రికలద్వారా, రేడియోద్వారా, సభలద్వారా అశేష ప్రచారముగాంచినవి. వీనిలోని నాయకుడు 'బంగారుమామ.' నాయికపేరు లేదు. 'కోడలుపిల్ల' అనిమాత్రము కవిగారు పేర్కొన్నారు. అందువలన ఇందులోని నాయికగూర్చి చర్చచేయవల సిన వీలుకలుగలేదు.

యెంకిపాటలద్వారా కవితాలోకమున ఒకక్రొత్తప్రయోగమును, శృంగారనాయికాజగత్తున కొక కలికితురాయిని సమకూర్చిన నండూరివారి ప్రతిభ నాన్యతస్సాధ్యమైనది.

---

1. వేదాల తిరువేంగళాచార్యుల రచన :

# 2. దేశభక్తి కవిత్వము

దేశభక్తికి స్వధర్మము, ఋతము మూలభూతములైనవిషయములు. దేహసౌష్ఠవము ప్రత్యంగవికాసముపై ఆధారపడియున్నది. అట్లే దేశముయొక్క సర్వాంగీణస్ఫూర్తి ఆదేశములోని నదులు, కొండలు, చెట్లు, మృత్తికమున్నగువానిపై ఆధారపడియున్నది. వేదకాలమునాటి ఋషులు పాడుకొన్న నదీసూక్తము, పృథ్వీసూక్తము మున్నగునవి దేశమాత బాహ్యస్వరూప సంకీర్తనములు. వీనిలో వారి తపశ్శక్తిగూడ గర్భితముగానున్నది. దేశములో తృణకాష్ఠజల సమృద్ధియున్నప్పుడే ఆధ్యాత్మికశక్తి వికసించుటకు వీలున్నదనిగుర్తించియే వారు పృథివ్యాదులను స్తుతించిరి. భారతదేశము కర్మభూమి. కర్మాచరణమునకు దేశభక్తి మూలసత్త్వమని వారు గమనించిరి. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నప్రాచీనసూక్తి ఈ విషయమునే అభివ్యక్తముచేయుచున్నది. ఆధునికకవులు గానమొనర్చిన దేశభక్తి మాత్రముజాతీయభావననుండి పుట్టినదే.

### భారతజాతీయోద్యమము :

ఆధునికాంధ్రకవిత్వములో దేశభక్తి రెండుపాయలుగాప్రవహించినది. ఒకటి భారత జాతీయాభిమానసంబంధి; రెండవది ఆంధ్రాభిమానసంబంధి. ఈ రెండుపాయలు వెలువడుటకు ముందు దేశములోని స్థితిగతులను పరిశీలింతము.

### పూర్వరంగము :

1905 నకుముందు భారతదేశములో జాతీయోద్యమము బలపడలేదు. ఆంధ్రదేశీయుల మనస్సులలో జాతీయాభిమానము అంకురస్థితిలో మాత్రముండెడిది. ఆంగ్లప్రభుత్వము 1905 లో వంగదేశమును రెండుముక్కలుగాజేయుటతో భారతీయులగుండె భగ్గుమన్నది. అటు వంగదేశములో చెలరేగిన ఆందోళనాగ్నిశిఖలతో ఇటు ఆంధ్రదేశమట్టుడికిపోయినది. బిపిన్‌చంద్రపాల్‌గారు కలకత్తానుండి బయలుదేరి బరంపురం, విశాఖపట్టణములమీదుగా, ఆంధ్రదేశములోని రాజమండ్రి, విజయవాడ, బందరు, నెల్లూరుమున్నగుముఖ్యపట్టణములలో తెల్లదొరల దౌర్జన్యకాండకు వ్యతిరేకముగా ఇచ్చినఉపన్యాసములు, వాని తెలుగుఅనువాదములు, ఆంధ్రప్రజలలో అంతవరకే రగులుచున్న జాతీయోద్యమవైశ్వానరమును మరింత ప్రజ్వలింపజేసినవి. రాజమహేంద్రవర సభలో చంద్రపాల్‌గారి ఉపన్యాసమువిని ఉద్రిక్తులై చిలకమర్తిలక్ష్మీనరసింహంగారు వ్రాసి చదివిన[1]

1. 1906 ప్రాంతములో.

"భరతఖండంబు చక్కనిపాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులుబిగియబట్టి"

అనుపద్యము సభను ఉత్సాహతరంగితమొనర్చినది. ఆ పద్యప్రభావమంతటితోనే తీరిపోలేదు. ఆంధ్రదేశములో ఆనాడు వ్యాప్తిలోనున్న అన్నిపత్రికలకెక్కినది. హరికథలలో దూరినది. ఆంధ్రులజిహ్వాగ్రములపై తాండవించినది. బంకించంద్రుడు పూరించిన 'వందేమాతరం'నినాదము చంద్రపాల్‌గారి పర్యటనతో ఆంధ్రదేశమంతట ఉద్యమస్ఫూర్తితో, ఝంఝూగతితో వ్యాపించి నది. మిల్లుగుడ్డలబహిష్కారము, నేతబట్టలస్వీకారము ముమ్మరించినది. దేశములో నలుమూలల దేశభక్తి ప్రపూరితములైనపాటలు, నాటకములు, హరికథలు వ్యాపించినవి. స్త్రీలు పురుషులేకాదు. "చిన్నపిల్లలు, తుదకుగోరువంకలుగూడ 'వందేమాతరం, మందేరాజ్యం' అని పలుకుట పరిపాటి యైనది."[1]

చిలకమర్తివారి 'భరతఖండంబు'అన్నపద్యము తెలుగులో భారతజాతీయోద్యమసంబంధ మైన తొలిరచనయని చెప్పవచ్చును. ఈ పద్యముతో జాతీయోద్యమకవిత్వమునకు బీజావాపనము జరిగినది. రాయప్రోలుప్రభృతులుచేసిన దోహదముతో అది వర్ధిల్లినది. 1907 మేనెలలో ప్రభు త్వము లాలాలజపతిరాయ్‌ను బంధించి బర్మాలో నిర్బంధించినది. అందుకు నిరసనగా ఆంధ్ర దేశములోని అన్నిప్రధాననగరములలో విద్యార్థులు సమ్మెలుచేసిరి. 'వందేమాతర'పతకములను ధరించి, 'వందేమాతర'ధ్వజములను చేతబూని వీధులలో ఊరేగింపులు సాగించిరి. ఈ సంఘ టనతో జాతీయోద్యమవహ్నికాజ్యముపోసినట్లైనది. దేశీయులలో కలిగిన యీసంచలనమును చిలకమర్తివారు ఆవేశపూరితమైన రీతిలో కవితాబద్ధముచేసిరి.

"చెరసాలల్ పృథుచంద్రశాలలెయగున్, చేదోయిగీలించున
య్యరదండల్ ఖిరిదండలయ్యెడును, హేయంబైన చోడంబలే
పరమాన్నంబగు, మోటుకంబళులు దాల్పన్ పట్టుసెల్లాలగున్,
స్థిరుడై యే నరుడాత్మదేశమును భక్తింగొల్చు నవ్వానికిన్."

భరతఖండంబె యొకపెద్ద బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్కగదినుండి మార్చి వేరొక్కగదిని
బెట్టుటేకాక చెరయంచు వేరగలదె."

ఈ పద్యములలో జాతీయభావస్ఫులింగములు చిటపటలాడిపోవుట గమనింపదగినది. జాతీయ భావమును వ్యంగ్యముగానో, అన్యాపదేశముగానో చిత్రించక, సూటిగా ఆంగ్లప్రభుత్వమును

1. సంగ్రహాంధ్రవిజ్ఞానకోశములో దిగవల్లి వెంకటశివరావుగారి వ్యాసము : పుట 496.

విమర్శించిన మొట్టమొదటి జాతీయకవి చిలకమర్తివారే. వీరితర్వాత రాయప్రోలువారికిమధ్య మంగిపూడివెంకటశర్మ మున్నగుకవులు జాతీయకవితాగానము చేసినవారు. చెన్నాప్రగడభాను మూర్తిగారు 'భారతధర్మదర్శనము'లో పారతంత్ర్యస్థితిని, భారతదేశములోని ఆర్థికహైన్యమును చక్కగా చిత్రించినారు. మంగిపూడివెంకటశర్మగారు 'భారతమాత' అనుశీర్షికతో భారతదేశము ప్రాచీనౌన్నత్యమును గానముచేసినారు.[1] వీరు 1912 లో మాతృభూమికి తమకుగల అనుబంధమును

'చెలగి నేను విదేశసీమలయందు
బహుసుందరోద్యానవనములయందు
... ... ... ... ...
విహరించుచున్నను, వేవేగమునను
నాజన్మభూమికి నన్నుగొంపోవ
వాయువునకు నేను స్వాగతంబిడుదు'

అనియుగ్గడించి 'జననీజన్మభూమిశ్చ' అన్నసూక్తికి కావ్యత్వముకల్పించినారు. ఇవి గోల్డుస్మిత్ వ్రాసిన 'Wherever I roam What ever realms to see my heart untravelled fondly turns to thee'[2] అన్నపంక్తులను స్మరింపజేయుచున్నవి. చిత్రమేమనగా వెంకట శర్మకారికి ఇంగ్లీషుభాషావాసనయేలేదట.[3] 1912 లోనే వెంకటశర్మగారు 'ఆంధ్రభారతి'లో ప్రచురించిన ఒకఖండకావ్యములో దేశమాతపై తమకుగల అపారభక్తినీవిధముగా వెల్లడించినారు.

''నాస్వకీయంబిది నాజన్మభూమి
యిదియంచు మనసార నెన్నడుగాని
యొకసారి తలపోసి యుల్లముప్పొంగ
హర్షింపనట్టి హతాత్ముండు కలడె
మునుపు తానెందుండి పుట్టెనో యట్టి
దుమ్ములోపలికిని దుఃఖింపబడకె
కీర్తింపబడకె శ్లాఘింపగాబడకె
గౌరవింపబడకె క్రమ్మరబోవు.''

ఈ చరణములు ఇంగ్లీషుకవిత్వములో దేశభక్తికి పేరెన్నికగన్న వాల్టరుస్కాటువ్రాసిన

'Breathes there the man with soul so dead
Who never to himself hath said,

1. ఆంధ్రపత్రిక : ఉగాది సంచిక : 1911.
2. Deserted village.
3. పురాణం సూరిశాస్త్రిగారు : "గ్రంథాలయ సర్వస్వము" (వ్యాసము) : 1924 అక్టోబరు :

This is my own my native land ;
— — — — — — —
— — — — shall go down
To the vile dust, from hence he sprung
Unwept, unhonour'd, and unsung'[1]

అనుపంక్తులకు ప్రతిబింబములో యన్నట్లున్నవి. మంగిపూడివారు ఎవవరిద్వారానైనను ఈ ఆంగ్ల మూలములోని భావమును గ్రహించి వ్రాసిరో, లేక 'సంవాదినోః మేధావినాంబుద్ధయః' అన్న సూక్తిని సార్థకముచేసిరో చెప్పలేము.

ఈ విధముగా జాతీయాభిమానకవితారేఖలు మంగిపూడిమున్నగువారి రచనలలో తొంగి చూచుచున్నవి. అయినను చిలకమర్తివారిలోని తీవ్రత వీనిలోలేదు. ఇవి సంప్రదాయసిద్ధముగా మాతృదేశసంకీర్తనముతో నిలిచిపోయినవి. రాయప్రోలురచనలలో చిలకమర్తి భావతీవ్రత, ఉద్యమస్ఫూర్తి రెండును చోటుచేసికొన్నవి.

1915 లో గోఖలేనిర్యాణవార్త వినగానే రాయప్రోలులో పొంగులెత్తిన భావోర్మికలలో జాతీయోద్యమకవిత్వము తొంగిచూచినది. అంతకుముందే వారు తృణకంకణాదికావ్యములతో నవ్యకవిత్వమునకు పాదులువేసిరి. గోఖలేనుస్మరించుచు ఆయన వ్రాసినక్రిందిపద్యములో ఆంగ్ల ప్రభుత్వనిరసనము స్ఫుటముగా కనిపించుచున్నది.

''దొరలందగించిన బిరుదుమోజునద్రుళ్లి
నాయకధర్మంబు బాయలేదు
ప్రభువులవిశ్వాసపదమెక్కి దుర్నీతిఁ
బ్రజలపక్షము భంగపఱపలేదు
స్వార్థలోభమున కపటనాటకములాడి
తల్లికడుపు చెడదలపలేదు
సమయనీతి త్యజించి సంక్షోభ విడివడ
కలహకవాటముల్ కదపలేదు

నీతిచాతుర్యమును స్తవనీయమయిన
దేశసేవనదీక్షయు దీర్చినావు,
యోగివోలెను ఫలనిస్పృహుండవగుచు
మేలుకీళ్ళు సహించి గోపాలకృష్ణ.''[2]

1. Lay of the Last Minsirel అను సుదీర్ఘగీతములో :
2. 'అస్తమయము' అను శీర్షిక : ఆంధ్రపత్రిక : 1915 ఉగాది సంచిక.

ఇంకొకపద్యములో 'భస్మసు ప్తవహ్నిలతికమ్రాది మార్పడిన యీ మహదార్యకుమారపాళి మేల్కొలిపితి దేశపూజ కొఱకున్' అని గోఖలేగారి దేశనేతృత్వమును కీర్తించినారు.

ఈ విధముగా ప్రారంభమైన వీరి జాతీయాభిమానము 'జన్మభూమి' మున్నగుపద్యములలో పతాకస్థాయినందినది. 1920-25 వరకు అనేకనవ్యకవులు వీరితోపాటు శ్రుతికలిపి భారతజాతీయోద్యమమును కావ్యరూపమున కీర్తించిరి. భారతజాతీయోద్యమము నవ్యకవులలో దేశభక్తి భావములను బహుముఖములుగా ప్రసారించినది. 1916-20 మధ్యజరిగిన హోంరూలుఉద్యమము, యువకవులలోని జాతీయభావప్రకటనకు కాహళలందించినది. రష్యానెదిరించి దిగ్విజయమును సాధించినజపాను ఆనాటి తెలుగుయువకులలో నవోత్తేజముకలిగించినది. జపాను ప్రాచ్యదేశమగుటవలన ఈ యుత్తేజము ప్రత్యక్షముగా కలిగినది. యువకవులు ఆంగ్లవిద్యాసంపర్కము వలన, అమెరికా, రష్యామున్నగుదేశములు స్వాతంత్ర్యముకొరకు జరిపిన ఉద్యమములనుగురించి చదివి తమలోని జాతీయభావములకు పదునుపెట్టుకొనిరి. భారతజాతీయోద్యమవీచికి పాశ్చాత్య చరిత్రపఠనమొక బలవత్తరమైనకారణమని అంగీకరింపకతప్పదు.

తెలుగులో జాతీయోద్యమకవిత్వమునకిన్ని ప్రభావములు పనిచేసినవి. రవీంద్రుని జాతీయ గేయములు అప్పటికే దేశములో బహుళవ్యాప్తిగాంచినవి. 1905 లోనే ఆ కవీంద్రుడు వంగదేశములోజరిగిన 'స్వదేశిఉద్యమ' ప్రభావముతో ఉద్విగ్నుడై

"Blessed am I that I am born to this land and that I had the Luck to love her"[1] అని మాతృదేశముపట్ల తనకుగల గాఢాభిరతిని ఉద్ఘాటించెను. 1912 లో 'ధర్మసంగీత్'అనుశీర్షికతో వ్రాసిన 'జనగణమనఅధినాయక జయహే' అన్నగేయములో భారతదేశము అఖండవైభవమును కీర్తించెను. భారతదేశములోని నదులను, పర్వతములను స్మరించెను.

"Touched by golden rays of the Love
India awakes up and bends her head at thy feet"[2]

అని భారతదేశములో కలుగుచున్న జాతీయజాగృతిని వ్యక్తీకరించెను. 1917 లో కలకత్తాలో జరిగిన భారతజాతీయకాంగ్రెసుసభలో 'India's Prayer'అనుగేయమును స్వయముగా గానము చేసెను. ఇది ప్రధానముగా మానవోద్యమమునకు సంబంధించిన గేయమైనను

"Make us strong that our worship may flower in Love, and bear fruit in work"

వంటిపంక్తులలో జాతీయోద్యమకృషికి సంబంధించినఛాయలు స్ఫురించుచున్నవి. భారతజాతీయోద్యమకవిత్వము ఆంధ్రదేశములో వెల్లివిరియుటకు, దేశములోని ఉద్యమములతోపాటు, రవీంద్రునిజాతీయగేయములుగూడ కొంతవరకుపకరించినవనవచ్చును.

---

1. Poems: Visva-Bharathi Publication: 1946: పుట 54.
2. Poems: పుట 70.

**జాతీయాభిమానము :**

**స్వాతంత్ర్యప్రబోధము :**

తెలుగులో వెలువడిన దేశాభిమానకవిత్వములో ఆంధ్రదేశాభిమానసంబంధికవిత్వమే విస్తారముగానున్నది. భావకవులలో భారతజాతీయతను ప్రబోధించినవారిలో దువ్వూరి, బసవ రాజుమున్నగువారు కొందరేయున్నారు. రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి, జాషువా, తుమ్మల మున్నగువారు ఎక్కువగా ఆంధ్రాభిమానమును వెలార్చినవారే. రాయప్రోలువారు భారతజాతీయ తకు సంబంధించివ్రాసిన ఒకటిరెండుశీర్షికలే ఈ శాఖలో మకుటాయమానముగా నిలిచిపోయినవి. వారి 'జన్మభూమి' గేయము జాతీయకవితాపురంధ్రికి శిరోభూషణమువంటిది.

'ఏదేశమేగినా, ఎందుకాలిడిన
ఏపీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లిభూమి భారతిని
నిలుపరా నీజాతినిండుగౌరవము' (ఆంధ్రావళి)

అని ప్రారంభమగు ఈ గేయములో వారు 'జననీజన్మభూమిశ్చ' అను సూక్తినే ప్రబోధించినను అంతకుముందెవ్వరందించని చైతన్యమును తొణికిసలాడించినారు. ఇంతస్పష్టముగా, ఇంత సజీవముగా మాతృభూమిపైగల మక్కువను అంతకుముందెవ్వరుగానముచేయలేదు. 'లేదురా యిటువంటిభూదేవియెందు' అనుటలో జాతీయాభిమానమంచులుదాటి పొంగిపోయినది. భారతదేశ ప్రాచీనవైభవము, ఆధ్యాత్మికశక్తి జ్ఞప్తికెలయించబడినవి. పొలములలో రత్నములు మొలచినవని, వార్ధిలో ముత్యాలుపండినవని, పృథివిదివ్యౌషధుల్‌పితికినదని, భారతదేశపు సిరిసంపదలు కీర్తింపబడినవి. చివరకు

'అవమానమేలరా ! అనుమానమేల
భారతీయుడనంచు భక్తితోపాడ'

అనుపంక్తులలో జాతీయభావము ప్రబోధరూపకముగా తరగలెత్తినది. ఈ గేయము నాటికి నేటికి అనేకులహృదయములను మందిరములుగా మార్చుకొని నెలకొన్నది. అసంఖ్యాకసభలలో గానముచేయబడి జాతీయాభిమానమును రేకెత్తించినది. గురజాడవారి 'దేశభక్తి' గేయము తర్వాత దేశీయులలో జాతీయభావజాగృతి కలిగించిన గేయములలో ఇది అగ్రపంక్తిలోనిదన వచ్చును.

ఈ గేయముపై వర్డ్సువర్తుప్రభావము రేఖామాత్రముగా కనిపించుచున్నది. ఇంగ్లీషుకాల్ప నికకవిత్వములో దేశభక్తికవిత్వము అంతప్రధానమైనదికాదు. ఇంగ్లండు Norman పరిపాల నలో ఉన్నకాలమున 'Britania rule the waves' వంటి గేయములు కొన్ని వెలువడినవి. బ్రిటనుకు స్వాతంత్ర్యము సిద్ధించుటతో ఇట్టిగీతములు రావలసిన అవసరము లేకపోయినది. భారత

దేశము చిరకాలము దాస్యశృంఖలాబద్ధమైయుండుటవలన ఇక్కడి కాల్పనికకవులు దేశభక్తి కవిత్వమును అనంతముగా వెలయించిరి. ప్రణయకవిత్వముతర్వాత భావకవిత్వక్షేత్రములో దీనిదే పైచేయి. కాని ఇంగ్లీషుకాల్పనికకవిత్వము ప్రణయకవిత్వముపై ప్రభావమువేసినంతగా దేశభక్తికవిత్వముపై వేయలేదు. అయినను కాల్పనికకవిత్వములో గతవైభవస్మరణము (Glory of the past) ఒక ముఖ్యాంశమే. కాల్పనికకవులలో వర్డ్సువర్తుమున్నగువారు స్వదేశీయ గతవైభవస్మరణముచేసిరి. స్కాటు ఈ శాఖలో ఎక్కువ కృషిచేసినకవి. అతని 'Breathes there the man' అన్నగేయము ఇంగ్లీషుసారస్వతములో ప్రసిద్ధిగాంచినది. తెలుగుదేశమున ఆంగ్లసాహిత్యపాఠ్యగ్రంథములలో ఏనాడో చేరినదిది. ఈ గేయము ప్రభావము రాయప్రోలువారి 'జన్మభూమి'పై, ముఖ్యముగా 'అవమానమేలరా ; అనుమానమేల, భారతీయుడనంచు భక్తితో పాడ'అనుచరణములపై స్ఫుటముగా కనిపించుచున్నది.

'సూర్యునివెలుతురుల్ సోకునందాక
ఓడలజండాలు ఆడునందాక
అందాకగల యీ యనంతభూతలిని
మనభూమివంటి చల్లని తల్లిలేదు'

అను చరణములలోని భావము టెన్నిసను 'National song' లోని

'There is no Land like England
Where'er the light of day be'

అనుపంక్తులతో, వర్డ్సువర్తుపలికిన దేశభక్తిగీతములోని

"I travelled among the unknown men,
In Lands beyond the sea;
Nor, England did I know till then
What love I bore to thee."

అను పంక్తులతో చక్కగా సంవదించుచున్నది.

'లేరురా మనవంటి పౌరులింకెందు'

అన్న వాక్యము అచ్చముగా టెన్నిసనుపలికిన

'There are no men like English men'

అనుదానికి ప్రతిబింబముగానున్నది. కాని టెన్నిసను గేయములోనున్నట్లుగా "There are no maids like English maids, So beautiful as they be" అన్నంతవరకు రాయప్రోలు వారు పోలేదు.

'ఏ పూర్వపుణ్యమో ఏ యోగబలమొ
జనియించినాడ వీ స్వర్గఖండమున'

అన్న పాదములు, రవీంద్రుని

"Blessed am I that I am born to this Land and that I had the luck to Love her"

అనుగేయభాగములోని భావమును స్ఫురింపజేయుచున్నవి.

ఈ ఒక్కగేయముపై ఇన్నిగేయముల ప్రభావమున్నను, ఇది తెలుగు సాహిత్యములో ఎన్నడులేని క్రొత్తదనమును ప్రవేశపెట్టినరచన. ప్రబోధముతోపాటు, భారతదేశపురాతన వైభవమును జోడించుటవలన ఈ గేయమునకు ఇంగ్లీషుకవులగేయములలోలేని విశిష్టత అలవడినది. భావముతోపాటు పదబంధములలో మాధుర్యముండుటవలన ఈ గేయమాంధ్రదేశమంతట అనిలోర్మియై విస్తరించినది.

రాయప్రోలువారితర్వాత 'ఆత్మవిశ్వాససూర్యోదయ' కాంతులతో భారతజాతీయప్రబోధ గీతములాలపించినకవి దువ్వూరిరామిరెడ్డిగారు. వీరు జాతీయతకు అస్థిపంజరములనుసైతమాడించు శక్తియున్నదని యీ శతాబ్దిరెండవపదిలోనే గుర్తించినారు. 'అంబుదంబుల అమృతపూరంబు లొలుక'గా 'ఇంద్రధాపంపుతోరణమింపుగులుక'గా వినువీధిలో వెడలు స్వాతంత్ర్యరథమును దర్శించి అద్భుతావృతులైనారు. నిజమే. అప్పటికి స్వాతంత్ర్యభావస్యందనమింకను గగనవీధుల లోనే యున్నది. క్రిందికిదిగలేదు. అది ఆకాశవీధులలో నున్నను, దాని సత్త్వమును గమనించినద్రష్టరామిరెడ్డిగారు. ప్రజాహృదయమే ఆ రథమందు దీప్తిమయమై కనుపట్టినదని, అదే దేవీ రూపములోనున్నదని, ఆ శాంతిదేవి (స్వాతంత్ర్యదేవి) ఒకచేతన్ రుధిరంపుపాత్ర వేఱొక్కంట పీయూషపాత్రిక గైకొని, కరుణావేశము దీపింపగా

'పచ్చినెత్తురు నమృతంపుపాత్రఁబోసి
దివ్యదుగ్ధంబుగా............'[1] మార్చినదని

అభివర్ణించినారు. సభ్యతామిషతో దేశములనస్వతంత్రముగాజేసి పీడించుపాలకుల అన్యాయమిక ముందుచెల్లదని, పచ్చినెత్తురు, అమృతముకలయుటయనగా పారతంత్ర్యమువిరిగి స్వాతంత్ర్యము ప్రాప్తించుటయని ధ్వనింపజేసినారు వీరు. అంతేకాక

"పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు
మణిమయకిరీటములు భోగమందిరములు
చక్రసంఘర్షణంబునఁ జదిసిపోయి
యవియివియనంగరాక రూపఱెడు—"[2]

1. కవికోకిల గ్రంథావళి: ద్వి. భా. పుట: 84.
2. కవికోకిల గ్రంథావళి: రెండవభాగము: పుట 84.

నని, ఆ రథపు మోకులనుపట్టిలాగునవి కరులో తురగములో కాక ప్రజలేయని, ఆ చక్రనేములు తాకినస్థలములెల్ల సస్యలక్ష్మికి కళ్యాణశాలలయ్యేనని, స్యందనాసీనయైనదేవి శాంతిగానముచేసిన దని, ప్రజాచైతన్యమునకు, స్వాతంత్ర్యభావనకు, మూర్తిని స్ఫూర్తిని కలిగించినారు రామిరెడ్డిగారు. ఇది ఒకవైపు భారతజాతీయోద్యమద్యుతులను వెలిజిమ్ముచున్నను, ఇంకొకవైపు సామ్యవాద స్ఫులింగములను వెలార్చుచున్నరచన. 'జగన్నాథరథచక్రాలను శ్రీశ్రీ గగనవీధినుండి మరలించక పూర్వము, రామిరెడ్డిగారు అక్కడ స్వాతంత్ర్యరథాన్ని ప్రజలు మోకులతో లాగుతుంటే చూశారు.'[1] రాయప్రోలువారి 'అహంకారదర్శనము' రామిరెడ్డిగారిలో 'ఆత్మవిశ్వాససూర్యోదయము'గా మారినది. రామిరెడ్డిగారివలె జాతీయభావనకు, సంఘచైతన్యమునద్దినవారు భావకవులలో లేరని చెప్పవచ్చును. రామిరెడ్డిగారు 'నైవేద్యము' అను శీర్షికతో భారతమాతృచరణపూజకై తరలిపోయిన సామాన్యప్రజలగీతిని వినిపించినారు. ఆ మాతృపదసన్నిధిలో పూజ్యులు, అధములు, ధనికులు, బీదలుఅనెడి భేదములేక అందరునిలిచి హారతులెత్తిరి. కన్నెపూలనుదోయిలించిరి. ఏమిలేనివారు కొందరు 'కంటిక్రొన్నీటిముత్యాల' కానుకలిడిరి. కవిమాత్రము 'హృదయపు సుగంధదీప' మర్పించి ధన్యుడైనాడు. వీరి 'మాతృమందిరము' అన్న పద్యములలో మాతృమందిరసందర్శనతత్పరులైన యాత్రికులనుద్దేశించి దుర్బలచిత్తులు, దుష్టచేష్టితులు, కార్యశూన్యులు, మోసగాండ్రు మాతృమందిరమును తిలకించలేరని 'ఆకాశవాణి' హెచ్చరించును. దారిప్రక్కనున్న ఒక పునుక మాతృదేవీబలిమంటపమందు యజ్ఞపశువుగనిల్చు సాహసికుడున్న యెడల ముందుకడుగువేయుడని ప్రబోధించును. యాత్రికులు 'దిగాలుపడి' కూలబడుదురు. ఒక్క యువకుడుమాత్రము పుష్పాంజలిపట్టి నిల్చుండును. అతడు మాతృపాదంబులంబడు భాగ్యమున్న 'గిరులైననన్నడ్డగింపఁ దరంబె'యని వజ్రసంకల్పుడై నిల్చుండును. ఈ పద్యములలో మాతృచరణసన్నిధిని ఆత్మలను కర్పూరముగా వెలిగించనిదే స్వాతంత్ర్యఫలము సిద్ధించదను ప్రబోధమున్నది. త్యాగభావముయొక్క ఆవశ్యకమును వ్యంగ్యరమ్యముగా చిత్రించినారు రామిరెడ్డిగారు. ఇవికాక వీరు 'మేలుకోభారతకుమారా మేలుకోరా తరుణధీరా'యని ప్రబోధగేయములు వ్రాసియున్నారు. మాతృదేశముపట్లగల భక్తిని రామిరెడ్డిగారివలె అసిధారాసదృశమైన ఆవేశముతో వెల్లడించినవారు వేదుల సత్యనారాయణశాస్త్రిగారు. తమకుతాము పూవుగా భావించికొని, 'కానుకనై ధరాధిపుల కాళ్ళకడంబొరలాడివాడిపోలే'నని, 'ధరాపరాగపటలీమలినమ్మగు ద్వారతోరణాస్థానము నందురింబడగజాల'నని ఉద్ఘోషించినారు.

"నీచపుదాస్యవృత్తి మననేరని భారత మాతృదేశసే
వాచరణమ్మునం దసువులర్పణఁజేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోటఁ దదసృగ్రుచులఁ వికసించి, వాసనల్
వీచుచు, రాలిపోవగవలెం దదుదాత్తసమాధిమృత్తికఁ"

1. 'ఆత్మవిశ్వాససూర్యోదయము' (వ్యాసము) : రమణారెడ్డి : కిన్నెర 1954 జనవరి.

అను కాంక్షను వ్యక్తీకరించినారు. ఇది తెలుగులో విలక్షణమైన భావతీవ్రతగలరచన. కవిగారు పేర్కొనలేదుగాని దీనికి మాఖన్‌లాల్‌గారి 'ఫూల్‌కీచాహ్' అను హిందీగేయము మాతృక. ఆ మూలమునను బంధములో చేర్చినాను. వీరితోపాటు భారతమాతృవైభవమును గానముచేసినవారు పలువురున్నారు. భారతమాతకు సంబంధించినపద్యములనో, గేయములనో ప్రచురించని తెలుగు పత్రిక ఆనాడు లేదనవచ్చును. ఒకకవి భారతసవిత్రిని 'వెన్నతోడనె చతుర్వేదబుక్కులుపంచి' సుతులచుంచుదువ్వినదిగా భావించెను.[1] ఇంకొకకవి 'సింధుగంగానదీజలక్షీరమెపుడుగురిసి బిడ్డలఁ బోషించుకొనుచున్న పచ్చిబాలెంతరాలు మా భరతమాత' యనెను.[2] మరియొకకవి మాతనుద్దేశించి 'నీదుపాదయుగళమేది నీరధి నిత్యాభిషేకశీకరశీతలపుఁ బ్రోది'యని కీర్తించెను.[3] వెంకటపార్వతీశ్వరులు 'పరమార్థనిధియైనభారతభూమి, పైసకుకొఱంగాక పాడగుచుండ', 'పరమధామంబైన భారతభూమి బానిసతనములోబడి క్రుంగుచుండ' ఆర్యసంతతివారు, 'కనుమూసి కాలంబు గడపుటతగునె'యని హెచ్చరించిరి.

## గాంధీ ప్రశస్తి :

భావకవులురచించిన జాతీయగీతములలో కళామూల్యములుకొఱవోకుండ గాంధీజీని కీర్తించిన వారిలో బసవరాజుఅప్పారావుగారు ముఖ్యులు. వీరి 'కొల్లాయిగట్టితేనేమి' అన్నపాట ఆనాడు ఆబాలగోపాలమును, పండితపామరులను రంజింపజేసిన రసగుళిక. 'వెన్నపూసామనసు; కన్నతల్లిప్రేమ, పండంటిమోముపై బ్రహ్మతేజస్సు'అను వర్ణన, గాంధీజీరూపమును హృదయమును హృద్యముగా ఆవిష్కరించినది. 'చకచకనడిస్తేను జగతికంపించేను, పలుకుపలికితేను బ్రహ్మ వాక్కేను'అను వర్ణన గాంధీజీ కర్మవీరత్వమును, బ్రహ్మర్షిత్వమును చక్కగా ధ్వనింపజేసినది.[4] గాంధీప్రశస్తికి ఈ గేయము మకుటాయమైనది. వీరేవ్రాసిన 'గాంధీమహాత్ముడు బయలుదేరగా కలకలనవ్వింది జగత్తూ కలకలనవ్వింది'[5] అనుగేయము భారతదేశముపై గాంధీజీకిగలప్రభావమును చక్కగా వ్యక్తముచేసినది. 'మాలమాదిగలమొర'అన్న గేయములో బసవరాజుగారు, గాంధీజీకి మాలమాదిగలు తమయిక్కట్లను నివేదించుకొన్నట్లుగా చిత్రించినారు. దేశీయులలో కల్గినజాగృతి నుద్దేశించి 'గాంధీమహాత్ముడు కనిపెట్టినట్టి సత్యాగ్రహమంత్రముతో'' వారిమత్తువదలినదని గానము చేసినారు. గాంధీజీప్రారంభించిన 'ఉప్పుసత్యాగ్రహము'ను దృష్టిలోపెట్టుకొని స్వరాజ్యలక్ష్మి పెండ్లిలో సంద్రమె పెండ్లిల్లని, సదస్యులు దేవతలని ఉప్పే తలంబ్రాలని, అద్భుతముగా ఊహాకల్పనముచేసినారు.[6] ఆ పెండ్లికి గాంధీని వశిష్ఠుడుగా, కస్తూరిబాయిని ముత్తైదువుగా, పరమాత్ముడు సాక్షిగా భావించినారు. ప్రచారార్థముద్దేశించినను, కళామూల్యములను పుక్కిటబెట్టుకొన్న గేయ

1. పతిగపంట : తుమ్మలసీతారామమూర్తి : పుట 86.
2. ఖండకావ్యము : ప్ర. భా. : జామవా : పుట 8.
3. మాతృదేశసంకీర్తనము : కవికొండలవెంకటరావు : పుట 17.
4. బసవరాజుఅప్పారావుగీతాలు : పుట 148.
5, 6. బసవరాజుఅప్పారావు గీతాలు : పుట 147.

మిది. గాంధీగారిని మానవమాత్రుడుగా మహాత్ముడుగానేకాక పరమాత్ముడుగా భావించెడు ధోరణి అప్పటికే ఏర్పడినది. ఆయనపేర హారతులు వెలసినవి.

"జయగాంధీదేవా మంగళం జయమంగళంబునీకు
సత్యాగ్రహాశ్రమతాపసా శాంతిస్వభావమానసా."

ఈ రీతిగా ఎన్నో హారతిపాటలు వెలువడినవి. ఈ మధ్యనే 'గాంధీసహస్రనామస్తోత్రము' నాకంట బడినది.

**ప్రచారగీతములు :**

గాంధీజినిగూర్చి, రాట్నమునుగూర్చి, స్వరాజమునుగూర్చి, వివిధజాతీయోద్యమములను గూర్చి ప్రచారస్థాయిలో గేయములు, పద్యములు వ్రాసినవారు పలువురున్నారు. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి 'స్వరాజ్యరథము', 'స్వరాజసమస్య'అను ఖండకావ్యములు బాలగంగాధర తిలక్, గాంధీమున్నగుదేశనాయకులు నడిపిన స్వరాజ్యోద్యమము ప్రభావముతో వచ్చినవే. మాధవ పెద్దిబుచ్చిసుందరరామశాస్త్రివంటి విద్వత్కవి స్వరాజ్యసమస్యపై, హరిజనసమస్యపై, ప్రచార గీతములు రచించినాడు. 'అంటరానివారెవరొకారు మాకెంటరానివారే' అన్న గీతముపీరిదే. ప్రచార గీతములద్వారా సామాన్యప్రజలలో స్వాతంత్రశంఖారావము చేసినకవులలో గరిమెళ్ళసత్యనారాయణ అగ్రగణ్యుడు.[1] ఇతడు వ్రాసిన 'మా కొద్దీతెల్లదొరతనమూ' అనుపాట 1921, 22, 23 సంవత్సరములలో పాడని యువకుడు, వినిపించని కాంగ్రెసుసభ లేదట. ఈ గేయములోనే ఇతడు

"నూటనలుబదినాల్గు నోటికి తగిలించి
మాటలాడవద్దంటాడు; మమ్ము
పాటపాడవద్దంటాడు; టోపీ
తీసివీపున బాదుతాడు"

అని ఇంగ్లీషుప్రభుత్వపుదమననీతిని నిష్కంపముగా నెదిరించెను. 'సీమగుడ్డలువీడి మీరిక క్షేమ మొందండి'అని విదేశవస్తుబహిష్కారమును బలపరిచెను.[2] 'పరదేశవస్త్రములె బ్రహ్మచెముడువలె' వ్యాపించినవని, 'దానినరకెడిఖడ్గధార రాట్నమే'యనెను.[3] ఇంగ్లీషుప్రభుత్వమువారి పన్నుల విధానమును ఉప్పుపన్ను, పప్పుపన్ను, ఊరికెళితెపన్నుబాబు, కొప్పుకాస్తదేముడికి మొక్కుకుంటే పన్నుబాబు' అని ఎగతాళిచేసెను.[4] 'శిలావతుఉద్యమము'గూర్చి 'గాంధీఇర్విన్ ఒడంబడిక, గురించి, ఆ కాలమునజరిగిన ప్రతిసంఘటనముగురించి, ఎప్పటికప్పుడీతడు గేయములద్వారా ప్రబోధము జరిపినాడు. కొందరుకవులు హిందూమహమ్మదీయుల ఐక్యమునుగూర్చి "మనపాలి

1. దామరాజు పుండరీకాక్షుడుగూడ ప్రచారగేయములు రచించినవారిలో గణ్యుడు. ఇతని 'శ్రీగాంధి నామం మరువాం మరువాం' అను గేయమాలాలమున అహాళప్రసిద్ధమైనది.
2. 3. 4. స్వరాజ్యగీతములు : రెండవభాగము.

భాగ్యమేమందు హిందూమహమ్మదీయులపొందు ఘనతరధైర్యముగల్గించునాథుడు గాంధి మహాత్ముడు ఖైదండయైనాడు[1] అని గానముచేసినారు. దుగ్గిరాలగోపాలకృష్ణయ్యగారి 'రాంభజన' కీర్తనలు చమత్కారధోరణిలో రచించిన జాతీయగీతములే.

> ''ముప్పయికోట్లప్రజలు రాంభజన – పంజరబంధమైనారు
> బంధాలు త్రెంపుకొని రాంభజన – అవతలపడాలి
> గంధిమంత్రమిదేను రాంభజన – స్వరాజ్యమంత్రం
> ఒక్కటే మంత్రం రాంభజన – మేలైన మంత్రం.''[2]

ఈ విధముగా 'రాంభజన' పునరుక్తితో సాగిపోవు కీర్తనలివి. మంగిపూడి పురుషోత్తమశర్మగారు "పొలిపొలీ : బలిబలీ" అనుపాటలో

> ''హిందూముసల్మానులందఱము వచ్చాము
> బౌద్ధసిఖులు ఏక భావులై వచ్చాము
> పారసీక్రైస్తవులు పరుగున వచ్చాము
> బ్రాహ్మణపంచముల్ బలిసి కలిసొచ్చాము
> మాభేదభావములు మంటకలిపేశాము
> మమ్ముమన్నింపవమ్మా
> మా తల్లి
> మమ్మాదరింపవమ్మా''[3]

అని స్వరాజ్యదేవతను ప్రార్థించినారు.

రాట్నమునుగురించి భావకవులలో చక్కనిగీతములు రచించినవారున్నారు. 'ఓ చిన్ని రాటమా ఒయ్యారిరాటమా, ఒప్పైనరాటమా వడివడివడుకు' అని ప్రచారస్థాయిలో ప్రారంభించి,

> ''మోడుమోకులు చిగుర్వేసెడి పోలిక
> నీ బట్టగట్టేరు వడివడివడుకు
> జాబిల్లి కిరణంపుఁజందాన సాగెడు
> నీ దారమెంతురు వడివడివడుకు''[4]

అని కవిత్వగంధము గుబాళించునట్లు వ్రాసినవారున్నారు.

---

1. జాతీయగీతములు : తెలుకువారవెంకటరామయ్య, దామోజీపురపువెంకటనరసింహారావు : పుట 8.
2. రామదండుపాట : దుగ్గిరాల : పుట 6.
8. కోయిలపాటలు : 'పొలిపాట' :
4. మాతృదేశసంకీర్తనము : కవికొండల : పుట 4.

"రాట్నములను ద్రిప్పరేమ్రా మీ రమణీమణుల కీర్తి
రమణీయముగవెలుగ —॥రాట్న॥"

అని చమత్కరించినవారున్నారు.[1]

భావకవులలో అగ్రేసరులైన బసవరాజు, దువ్వూరికూడ రాట్నపుపాటలను రచించిరి.

"సిగ్గులేదానీకు శరములేదా (శె)
అన్నమైనాలేక బీదలల్లాడుతుంటేను
సీతాకోకచిలుకలాగ సీమగుడ్డగట్టితిరుగ ॥సిగ్గు॥
పూటకూడులేని ప్రజకు రాటమొకటే పెన్నిధుండ
మోటంచు పవిత్రమైన రాటంఖద్దరు వెక్కిరింప"[2]

అని సీమగుడ్డకట్టువారిని తీవ్రముగామందలించి. ఖద్దరుపావిత్ర్యమును. ఆవశ్యకమును ప్రబోధించిరి. దువ్వూరివారు 'తిప్పవేరాట్నమా దేశచరితంబు, విప్పవేరాట్నమా విజయకేతనము' అని గానము చేసిరి. ఈ విధముగా ఆనాటి జాతీయోద్యమములోని ప్రత్యంశము కవులను కదలించివేసినది.

**భారతజాతీయత; వస్త్వాశ్రయరీతి :**

భారతజాతీయతను ఆత్మాశ్రయరీతిలో రచించిన పద్యములనుగురించి గేయములనుగురించి ఇంతవరకు వివరించితిని. అట్లుగాక ఏదోఒకవస్తువునుగ్రహించి భంగ్యంతరముగా భారతజాతీయతను ప్రబోధించిన రచనలు కొన్నియున్నవి. ఈ వస్తువులలో కొన్నిపౌరాణికములు, కొన్ని చారిత్రకములు. 'ద్రౌపదీసందేశము'[3] రూపములో దువ్వూరిరామిరెడ్డిగారు జాతీయతను ప్రబోధించినారు. కొందరుకవులు కర్ణునిప్రశంసించునెపముతో, దుర్యోధనునికి నివాళులెత్తెడుమిషతో ఆంధ్రులలో జాతీయపౌరుషాగ్ని రగిలించుటకుప్రయత్నముచేసినారు. 'పాంచాలీసాంత్వనము' అనుశీర్షికతో చామర్తిరాజశేఖరరావుగారు ఇంగ్లీషువారిని ధార్తరాష్ట్రులుగా, ద్రౌపదిని భారతాంబగా, భారతజాతీయవిముక్తిని కృష్ణస్వామిగా ధ్వనింపజేసినారు. వారి పాంచాలీసాంత్వనము ఈ విధముగా సాగినది.

"చేసేతంగడుమూర్ఖులై భరతలక్ష్మిన్నిన్ను సాధ్వీమణిం
గాసింబెట్టిరి ధార్తరాష్ట్రులకటా ! కాలంబుదాపయ్యె ; బా
ధాశేషందిగనాడి యార్యమహిళాధర్మంబు పాటించి వే
ణీసంహారముసల్పి మానగదవే నీసాహసోద్యోగముల్"[4]

1. స్వరాజ్యగీతములు : రెండవభాగము : గరిమెళ్ళ : పుట 7.
2 బసవరాజుఅప్పారావుగీతాలు : పుట 149.
3. కవికోకిల గ్రంథావళి : రెండవభాగము : పుట 47.
4. బృందావనము (ఖండకావ్య సందోహము) :

'కరుణశ్రీ'గారు 'ధనుర్భంగము' అనుశీర్షికతో రచించిన పద్యములలోని వస్తువు రాముడు శివధనువును విరిచి సీతను పెండ్లియాడుటయేయైనను ఒకటిరెండుచోట్ల జాతీయతావాసన గుబాళించుచున్నది. రాముడు ఫెళ్లుమని విల్లువిరువగా

"చెల్లరే విల్లువిరచునే నల్లవాడు
పదిపదారేండ్ల యెలరాచపడుచువాడు
సిగ్గుసిగ్గంచు లేచి గర్జించినారు
కనులుగుట్టిన తెల్లమొగాలవారు."[1]

ఇందులో 'నల్లవా'డనుపదమును భారతజాతీయవీరునికి; 'తెల్లమొగాలవా'రన్న పదమును ఇంగ్లీషుదొరలకు సంకేతముగా గ్రహింపవచ్చును. దీనిలోనే సీతమ్మపెండ్లి 'భరతజనయిత్రి ప్రేమబాష్పాలలోనయ్యెనతివైభవముగ' అన్నమాటలు పైఅభిప్రాయమునే బలపరుచుచున్నవి. కొందరు సత్యభామపౌరుషమును కథావస్తువుగా తీసికొని జాతీయాభిమానమును ప్రజ్వలింపజేసినారు. పెనుమర్తివెంకటరత్నంగారు 'దీపావళినాడు' అనుశీర్షికలో ఇట్లేచేసిరి. క్రిందిపద్యమాధోరణికి మచ్చుతునక :-

"మాభరతమాత తన వీరమసృణమూర్తి
సత్యభామను నొడియందుసంతరించి
చూపుచున్నది కనినారె సోయగములు
చూచులే మీహృదంతరలోచనములు[2]

చారిత్రకకథావస్తువులలో 'రసపుత్రుల', మహారాష్ట్రుల, సిక్కుల వీరగాధలు కవులదృష్టినాకర్షించినవి. 'తేజబహద్దరు' అనుసిక్కువీరుడు కాలవశమున ఔరంగజేబుచేతజిక్కెను. అతనిని ఆ మొగలుచక్రవర్తి 'వంటయింటికుందేలువైతివి; ఇప్పటికైనను ఇస్లాముమతము స్వీకరింపు'మని పల్కెను. రోషతామ్రాక్షుడై తేజబహద్దరు

"క్రూరతనూది నీ విపుడు కోసెదునాశిర; మంతమాత్రఁజే
కూరదునీకు సంతస మకుంఠితశౌర్యులు సిక్కుజోదులీ
వీరుని నెత్రుచుక్కకొకవేవురుపుట్టి మొగల్ప్రభుత్వధా
త్రీరుహమున్ బెకల్తురు గరిష్ఠులు కూకటివేరులూడగన్,"[3]

అని ఔరంగజేబును ధిక్కరించి, చివరికి అతనిచేత నిహతుడగును. 'ఆదర్శవీరుడు'అను శీర్షికతో తుమ్మలవారు దీనిని రసవత్తరమగు ఖండకావ్యముగా రచించిరి. ఇందులో సిక్కువీరుని భారత

1. ఉదయశ్రీ : ప్ర. భా. 2. రత్నాపణము.
3. పఱిగపంట : తుమ్మల : పుట 47.

జాతీయశక్తికి ప్రతినిధిగా భావింపవలెను. ఈ రకమైన ఖండకావ్యములు ఆకాలమున అనేకము వెలువడినవి. విశేషమేమనగా భారతజాతీయభావనను గర్భీకరించుకొని రెండుమహాకావ్యములే వెలువడుట. అవి రెండును ప్రొద్దుటూరులోనే సూర్యచంద్రబింబములవలె ఉదయించిన తేజః పిండములు; ఓజఃపుంజములు. ఒకటి రాణాప్రతాపసింహచరిత్ర; రెండవది శివభారతము.

ఈ రెండుకావ్యములును మహాకావ్యలక్షణములుగలవే. రెండును సంప్రదాయసిద్ధమైన వృత్తములతో, వస్తువిన్యాసముతో, పదసమ్మేళనముతో రచింపబడినవే. ఏ విధముగాజూచినను ఇవి నవ్యకవిత్వములోనికి రావు. భావకవిత్వములోనికి అసలే రావు. కాని యీ రెండు కావ్యములును భారతజాతీయోద్యమప్రభావమును వాసనామాత్రముగా కలిగియున్నరచనలే. అందుకే వీనినిగూర్చి ముచ్చటించుచుంటిని.

### రాణాప్రతాపసింహచరిత్ర :[1]

రాణాప్రతాపుడను రసపుత్రవీరుడు అక్బరునకు వ్యతిరేకముగా కత్తిగట్టిన మహావీరుడు. ఈతడు రక్తపిపాసతోగాని, సామ్రాజ్యకబళనకాంక్షతోగాని సమరము నడపినవాడుకాడు. ధర్మస్థాపనముకొరకు ఖడ్గయుక్తముగాజరిపిన సాత్త్వికయుద్ధమితనిది. అందుచేతనే గాంధీజీ స్వాతంత్ర్య సంగ్రామముతో ఇది సంవదించుచున్నది. ప్రతాపుడు అక్బరునుగెల్తునను విశ్వాసముతో యుద్ధము చేయలేదు. భారతజాతీయధర్మము పరపాదమట్టనములకు నలిగిపోదని నిరూపించుటకే చేసెను. 'అసిలేనిసేన'తో అర్కుడస్తమించని సామ్రాజ్యమును కూలద్రోయుదునను దృష్టితో గాంధీజీ స్వాతంత్ర్యోద్యమము లేవదీయలేదు. 'స్వాతంత్ర్యము భారతీయుల జన్మహక్కు'ను సత్యమును నిరూపించుటయే అతని ప్రధానధ్యేయము. ఈ విషయములో ఇరువురికెంతో పోలికయున్నది. రాణాప్రతాపుడు

'కాన విజయంబె ముఖ్యంబుగాదు మనకు
ధర్మనిర్వహణంబు కర్తవ్యమిపుడు'

అనిపల్కిన మాటలీసత్యమునే చాటుచున్నవి. అక్బరుచక్రవర్తితో దాదాపు పాతికేండ్లు హోరాహోరిగా పోరాడి, కానలలో, కొండలలో నివసించి, తిండిలేక గడ్డిరొట్టెలుసైతముదినుచు బ్రతికి, కడకు స్వాతంత్ర్యము సంపాదించిన రాణాప్రతాపుని వీరకృత్యములీకావ్యములో వర్ణింపబడినవి. ఇది భారతీయులు మహాత్మునినాయకత్వములో స్వాతంత్ర్యసిద్ధికై చేసిన త్యాగములను, పడిన యిడుమలను అడుగడుగున స్మరింపజేయుచున్నది. విశ్వనాథవారన్నట్లుగా ఈ కావ్యము అస్వతంత్రజాతికొక స్మృతిగ్రంథమువంటిది.[2]

1. కర్త రాజశేఖరశతావధానిగారు.
2. 'రాణాప్రతాపసింహచరిత్ర' (వ్యాసము) : భారతి : స్వభాను కార్తికము.

**శివభారతము :**[1]

పసివారినుండి పండుముసలులవరకు భారతీయులందరి 'చిత్తవృత్తినుడికించి సివమెత్త జేయునట్టిది' శివాజీ జీవితచరిత్ర. రసపుత్రులతర్వాత సనాతనధర్మపునరుద్ధరణకై కంకణము గట్టినవారు మహారాష్ట్రులు. వారిలో శివాజీ నిదాఘమార్తాండునివంటివాడు. అతడరులకుమాత్రమే అట్టివాడు. ఆప్తులకు శరత్సుధాకరుడు. త్రిపురాసురసంహారమును, అపారతపస్సాధనను జరిపిన శివమూర్తిని తలపించు వీరశాంతములు శివాజీలో కుదురుకొన్నవి. రాణాప్రతాపుడక్బరు నెదిరించగా, అంతకుకఠినుడైన ఔరంగజేబునెదిరించి అతనిప్రక్కలో బల్లెమైనిలిచి, అనేక దుర్గములనుకొల్లగొట్టి, ఆర్తులనుకాపాడి, చివరికి పట్టినపట్టుసాధించి పట్టాభిషిక్తుడైన మహావీరుడు శివాజీ. ఈతని వీరకృత్యమేకాక ధర్మబుద్ధియును ఈ కావ్యములో రసవత్తరముగా చిత్రింపబడినది. శివాజీ నెత్తురుడుకెత్తగా పరుగెత్తుకొనిపోయి యుద్ధముచేయలేదు. దాదోజీ, రామదాసుమున్నగు రాజనీతిజ్ఞుల ఉపదేశములను అడుగడుగున స్వీకరించి ధర్మసంగ్రామము జరిపినాడు. ధర్మరక్షణకై, భారతజాతిప్రతిష్ఠాపునఃప్రతిష్ఠాపనమునకై అతడు ఏకైకవీరుడుగా నిలిచినాడన్న క్రిందివర్ణన నలుబదికోట్లప్రజలకు నాయకత్వమువహించిన గాంధీని స్మరింపజేయును.

'పరభూపాలకపాలనంబు విసిగింపన్, దండయాత్రల్ పోరిం
బోరిఁజీకాకొనరింప, జాతిమతముల్ భగ్నంబులై పోవఁ ద
త్పరిహారంబునకొక్క నాయకునకై పారాడు దేశీయు లె
ల్లరుఁ దోడై రిశివాజి, కుద్యమముసల్పన్ ధర్మరక్షార్థమై.'[2]

రామదాసు శివాజీకిచేసిన ధర్మోపదేశములో 'ధర్మనౌక'ను కదలితుఫానులోనుండి దరిజేర్పవలసిన అవసరము వచ్చినదనికలదు. ఈ సందర్భమునసేఉన్న క్రింది పద్యములలో జాతీయోద్యమ ప్రభావము స్పష్టముగా కనిపించుచున్నది.

'చెదరిపోయినయంగముల్ కుదురుపఱచి
సడలువారిన తంతువుల్ చక్కదీర్చి
యనుగతశ్రుతి భువనమోహనముగాగ
హాయిఁ బలికింపలెమ్ము జాతీయవీణ.'[3]

'దేవమునిధేనువిప్రసాధ్వీపదాబ్జ
పావనపరాగపరిపూతభరతభూమి
కలిపురుషదుర్విహారకశ్మలముగాగఁ
జూడజాలక శివపతీ ! చూతునిన్ను'

1. కర్త : గడియారం వెంకటశేషశాస్త్రిగారు.
2. 3. శివభారతము : ద్వితీయ తృతీయాశ్వాసములు : 243, 178 పద్యములు.

ఈ విధముగా దేశభక్తిని, ధర్మపథానురక్తిని ధ్వనిప్రాయముగా ప్రబోధించిన మహాకావ్యమిది. ఈ రెండుకావ్యములు కేవలసాంప్రదాయికములేకావున వీని కవితాశక్తినిగూర్చి వ్రాయుట ప్రస్తుత విషయముకాదు.

ఆంధ్రోద్యమకవిత్వము :

'నాదుజాతి నాదేశము నాదుభాష
అను అహంకారదర్శనమందుమాంధ్ర'[1]

అని యిరువదవశతాబ్ది ద్వితీయపాదములో రాయప్రోలువారు ప్రబోధించినారు. ఈ పద్యభాగములో ప్రతిపాదితమైన 'అహంకారదర్శనమే' రాష్ట్రోద్యమకవిత్వమునకు బీజభూతమైనది. అభిమానము అహంకారలక్షణము. ఈ అహంకారదర్శనముతో తెలుగుకవులకు పూర్వచరిత్రలో ఆంధ్రులు సాధించినవిజయములు, సంతరించుకొన్న వైభవములు తళుక్కున స్మృతిపథమున మెరసిపోయినవి. విషాదరేఖాశబలితమైన ఒకానొకఅభిమానము రాష్ట్రోద్యమకవితగా వెలిదన్నుకొనివచ్చినది. వంగదేశములో, బీహారులో జరిగిన భాషాసంబంధమైన ఉద్యమములు ఈ భావమునకు జవజీవములనిచ్చినవి. సంఘసంస్కరణోద్యమము, గ్రంథాలయోద్యమము, ఆంధ్రోద్యమము ఈ భావమునకావిష్కరణమును కూర్చినవి. ముట్నూరికృష్ణాపత్రిక. కాశీనాథుని ఆంధ్రపత్రిక ఆంధ్రరాష్ట్రోద్యమమునకెత్తిన పతాకములైనవి. 1907 లో విజ్ఞానచంద్రికామండలిస్థాపనము. 1910 లో గుంటూరులో ఆంధ్రయువజనసాహిత్యసంఘసమావేశమున జరిపిన ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన తీర్మానము, 1912 లో కలకత్తాకుబదులుగా ఢిల్లీ రాజధానియగుటతో జరిగిన ఉత్సవముల సంరంభము, 1913లో భాపట్లలో జరిగిన ప్రథమాంధ్రమహాసభ- ఈ సంఘటనల సమష్టిప్రభావమే ఆంధ్రరాష్ట్రోద్యమకవిత్వముగా రూపొందినది. ఈ యుద్యమకవిత్వము కేవలము ప్రచారపరిధిలో పెరుగలేదు. అచ్చమైన కవితాత్మనిముద్చుకొని వెలువడినది. విజ్ఞానచంద్రికామండలి స్థాపనముతో, మరుగుపడిన ఆంధ్రచరిత్ర 'త్రవ్వకము' ప్రారంభమైనది. గవ్వలున్నవని అందరనుకొనుచున్న ఆంధ్రులచరిత్రలో రవ్వలు లభించినవి. దీనితో ఆనాటి చారిత్రకులతోపాటు యువకవులకుగూడ ఆంధ్రచరిత్రశేషములింకను కనుగొనవలెనను ఉత్సుకత కల్గినది. ఆంధ్రుడు, ఆంధ్రజాతిక్రమపరిణామము, ఆంధ్రసంస్కృతినాగరకతల క్రమవికాసము, ఆంధ్రులసామ్రాజ్యనిరాణాదులు, లలితకళలకు ఆంధ్రులెత్తిన నివాళులు, ఆంధ్రుల వాణిజ్యము, నౌకావ్యాపారము, ఆంధ్రులకరవాలాంచలధాళధళ్యములుమున్నగు అనేకవిషయములపై ఆనాటి చారిత్రకులు, కవులు తమదృష్టిని కేంద్రీకరించిరి, చారిత్రకులాంధ్రచరిత్రను త్రవ్వి తండముల కెత్తిరి. వానిలోని ఉజ్జ్వలవస్తువులను, స్వర్ణమట్టములను సంగ్రహించి ఆంధ్రకవులు మహోద్వేగముతో గీతికలాలపించిరి. ఆంధ్రకవికి (భావకవికి) శ్రీహర్షునికంటె శ్రీకృష్ణదేవరాయలే అప్తుడైనాడు. అలకోజ్జయినులకంటె అమరావతీరాణ్మహేంద్రవరములు, నారదభక్తిసూత్రముల

1. 'ఆంధ్రావళి': 'ఆంధ్ర' శీర్షిక.

కంటె త్యాగరాజకీర్తనలు రక్తబిందువులై పోయినవి. రాయప్రోలువారిలో ఆంధ్రరాష్ట్రోద్యమ కవిత్వము మొదటిసారిగా స్ఫుటమైనఆకృతి దాల్చినది. విశ్వనాథ, తుమ్మల, కొడాలిమున్నగు దీనికి వారు మరింతనిండుదనమును కూర్చిరి. ఇక దీని క్రమపరిణామమును వివరింతును.

ఆంధ్రాభిమానమన్నది ప్రాచీనాంధ్రకావ్యచరిత్రలో అంతగా అగుపించదు. ఇది ఈ శతాబ్దిలోని విశిష్టతయేయనవచ్చును. అయినను ప్రాచీనాంధ్రకావ్యములలోగూడ ఆంధ్రాభిమాన రేఖలున్నవని విస్మరించరాదు. నన్నయచేసిన మూలభారతములోలేని వేంగిదేశవిభవవర్ణనము అతని ఆంధ్రాభిమానమునకు గుర్తన్నను; అది ప్రధానముగా వైదికవాతావరణము కల్పించుటకే చేయబడినది. శ్రీనాథుడు తొలిసారిగా 'దేశభాషలందు తెలుగు లెస్స'[1] అని స్వభాషాభిమానమును స్పష్టముగా ఉద్ఘోషించినకవి. అతని భీమేశ్వరపురాణములో గోదావర్యాదులవర్ణనలున్నను, అవి ప్రధానముగా భక్తిమూలకమైనవి. అతని పల్నాటివీరచరిత్రమాత్రము ఆంధ్రుల పౌరుషగాధకు అచ్చమైన అక్షరరూపము. కాకతీయులకాలములో సంస్కృతమున రచింపబడిన 'ప్రతాపరుద్ర యశోభూషణము'లో ఆంధ్రవీరుల పరాక్రమవర్ణనలున్నవి. అన్నిజాతులలో ఆంధ్రజాతికిగల విశిష్టతను ఈ లక్షణగ్రంథము రసవత్తరముగా నుగ్గడించినది. ప్రబంధకాలములో కృష్ణదేవరాయల కౌక్షేయకములు, వారిదండయాత్రలు ఉల్లేఖింపబడినవేకాని ఆ వర్ణనలలో ఆంధ్రవీరులప్రసక్తి గాని, ఆంధ్రదేశప్రస్తావనగాని కనిపించదు. ప్రబంధకవులు చేసిన కృష్ణరాయల పౌరుషవర్ణనము కేవలము రాజభక్తితో వెలువడినదేకాని దానికిని 'ఆంధ్రత్వ'మునకు సంబంధములేదు. కృష్ణరాయలు తెలుగుదుర్గములగు 'కొండవీడునగల్ప'గా, 'బెల్లముకొండఅచ్చుచెఱచ'గా, 'కంబము మెట్టుకదల్చ'గా[2], ఆనాటిఆంధ్రకవులు 'భళా'యని ఆ కర్ణాటక్షితినాథుని కరవాలధారాచకచ్చకలను వర్ణించిరేకాని ఆంధ్రులకుపట్టిన దుర్దశనుగూర్చి కన్నీటిచుక్క వదలలేదు. ఆనాటిసంఘ వ్యవస్థ అట్టిది. ప్రబంధక్షీణయుగములో ఆంధ్రులకు పౌరుషమేలేనప్పుడు, కవిత్వములో దాని ప్రసక్తియేలేదు. కావున ఈ శతాబ్దిలోనే ఆంధ్రజాత్యభిమానము తొలిసారిగా బహుముఖములుగా వికసించినదని చెప్పవచ్చును.

రాయప్రోలువారికిముందు ఆంధ్రాభిమానమును కవితారూపములో వెలయించినవారు కొందరున్నారు. వారినిగూర్చి సంగ్రహముగా తెలుపుదును. 1914లో గడ్డముకొండారెడ్డిగారు 'ఆంధ్రమాతృస్తవము'అనుశీర్షికతో ప్రచురించిన పద్యములలో ఆంధ్రమాత ప్రాచీనవైభవస్తుతి, ప్రస్తుతస్థితినిగూర్చిన సంతాపముకలవు. ముఖ్యముగా వీరు పరరాజభయంకరమైన ఆంధ్రులగత పౌరుషమును స్మరించి దేశీయులను ప్రబోధించిన పద్యము గమనించదగినది.

"శకయవనాదినాయకుల సేనలఁబాఱ
దోలిన శౌర్యమేమూలనాగె

1. క్రీడాభిరామము :
2. 'ఉదయాద్రివేగ' అను పద్యము : పారిజాతాపహరణ కావ్యావతారికలో.

జావాసుమాత్రాప్రశస్తసర్వద్వీప
పాలకత్వాప్తి యే వార్ధిబడియె
మగధరాజ్యవిదాహియగుచు వెల్గినబాహు
విక్రమంబే వినువీధికెగసె
ముమ్మాఱు ఢిల్లీశుమూకలదోలిన
శౌర్యమేయేటిలోజాఱె నేడు
విజయనగరమహారాజ్యవిభవరక్ష
యవనసైన్యాటవీదాహహవ్యవాహ
కీల యెవ్వారిపటుశౌర్యలీల ? యట్టి
ఆంధ్రు లాంగ్లేయసేనకనర్హులైరె."[1]

1916 లో మండపాకపార్వతీశ్వరశాస్త్రిగారు 'ఆంధ్రసంవత్సరాది'అను శీర్షికక్రింద వసంతకాలప్రకృతిని చిత్రించువ్యాజముతో ఆంధ్రరాష్ట్రభావనను వెల్లడించిరి.

"ఆంధ్రులదుర్దశలడుగంటునని తెల్ప
నుత్తరగాడుపులుక్కుదక్కె

— — — — —

ఆంధ్రప్రత్యేకరాష్ట్రాసక్తి చాటించె
మదపికంబులు పంచమస్వనమున"[2]

ఈ విధముగాసాగిన పద్యమిది.

1917 లో గాదెజగన్నాథస్వామిగారు తత్కాలీనాంధ్రదేశదుస్థితిపట్ల వగపును, భవిష్యత్కర్తవ్యమును 'ఆంధ్రదేశప్రశంస'యను శీర్షికతో వెల్లడించిరి. ప్రఖ్యాతసుతులనుగన్న ఆంధ్రమాత 'చెన్నరాష్ట్రంబుననుజేరి చెడగనేల, వంగదేశంబువలె స్వయంవ్యక్తిగల్గి' వర్ధిల్ల వలెనని ఉద్ఘాటించిరి. శాలివాహనుని, విష్ణువర్ధనుని, ప్రతాపరుద్రుని, కృష్ణరాయలను - వారి పౌరుషమును కీర్తించిరి. ఆంధ్రదేశము భారతదేశమున జనసంఖ్యలో మూడవదై, వైశాల్యములో రెండవదై వర్తించుచున్నదని దీనిని ప్రత్యేకరాష్ట్రముగా చేయకున్నచో అది యెట్లువర్ధిల్లునని వీరు తమపద్యములలో ప్రశ్నించిరి.[3] తిరుపతివెంకటకవులుగూడ 'మనమండలంబున మనతల్లి వేఱ వసింపగా గృహముకట్టింపవలయు'నని ప్రత్యేక రాష్ట్రావశ్యకమును వ్యంగ్యముగా ప్రబోధించిరి.

1. 2. ఆంధ్రపత్రిక : ఉగాదిసంచికలు 1914, 1918.
3. ఆంధ్రపత్రిక : ఉగాది సంచి · 1917.

వంగదేశవిభజనకు, గాంధీజీసత్యాగ్రహమహోద్యమమునకు మధ్యకాలములో భారతరాజకీయరంగమున చెప్పుకొనదగిన బలమైన సంఘటనలు జరుగలేదు. అందుకే యీ నడిమి కాలముననే ఆంధ్రోద్యమము విజృంభించగలిగినది.

రేఖలురేఖలుగా తొంగిచూచుచున్న ఆంధ్రోద్యమకవిత్వమునకు రాయప్రోలు రచనలలో సమగ్రబింబాకృతివచ్చినది. 'అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు', 'ఓరుగల్లున రాజవీరలాంఛనముగా పలుశాస్త్రశాలలు నిలుపునాడు', 'పొట్నూరికి సమీపమున ఆంధ్రసామ్రాజ్యదిగ్జయస్తంభమెత్తించునాడు' ఆంధ్రసంతతికుండిన అభిమానమును, ఆవేశమును మరల ఉద్దీపింపజేయవలెనని అతడు ప్రబోధగీతమాలపించినాడు. 'ఆంధ్రనౌకల'ను, 'ఆంధ్రతేజస్సు'ను, 'ఆంధ్రపౌరుషము'ను, తెనుగువాణి'ని, తెనుగుకత్తి'ని, 'తెనుగుభూమి'ని కీర్తించినాడు.[1]

"జాతినదేశగౌరవము చక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి, సమానరాష్ట్రముల్
కూరిమినాసజేయ తెనుగుంబుడమిన్ కయిసేయరయ్య"[2]

అనియు, 'రణరక్తబంధురారుణమైన ఖడ్గతిక్కనకత్తికడిగినకదనభూమి' యీనాడు పాదయిపోయి 'బ్రతికిచెడ్డ యాంధ్రుల పూర్వవైభవము'నే చాటుచున్నదనియు, గతమునకు కన్నీరుకార్చి, వర్తమానమునుదోబ్బోధించి, 'ఆంధ్రోద్యమవల్లరీకుసుమరక్షాబంధనైపద్యతుందిలబాహాబహులాంజలుల్ భరతధాత్రీఛత్రసింహాసనస్ఖలితచ్ఛాయలనుజ్జ్వలింపగల భాగ్యంబింక' కలదనియు ఆశాసంగీతము వినిపించినాడు.[3] కర్ణాటరాజ్యరంగములలో తెలుగుకవులకు బ్రహ్మరథముపట్టిన ఘట్టములను స్మరించినాడు. కన్నడనుడికి వంకలుదీర్చిన పంపడు ఆంధ్రుడని గర్వించినాడు. తర్కమహాసముద్రమును ఆపోశనముపట్టిన అన్నంభట్టపండితుడు, 'గోలకొండకిరీటకోటికాంతులు' దిద్దిన అక్కన్నమాదన్నలు తెలుగుబిడ్డలని పొంగిపోయినాడు.

"గడ్డపాఱలు గోగుకాడలవలె ముళ్ళు
వేసినారట కొండవీటిరెడ్లు
శివుడు గంగనుబోలె చెరువుగండి ప్రవాహ
మాపినా రద్దంకికాపుమగలు"[4] అనియు

"సేవింపరే కమ్మసేనాపతులు శత్రు
ర కకుంకుమలనరణమొసంగి

1. తరువాతికవులకు ఈ మాటలన్నియు కావ్యవస్తువులుగా మారినవి.
2. 3. 4.: ఆంధ్రావళి: 'ఆంధ్రమాత' శీర్షిక.

వెలయింపరే వెల్మవీరులు బెబ్బులి
బిడ్డలై పరసీమ గొడ్డువోవ
అర్చింపరే బ్రాహ్మణాచార్యులుభయభా
షావ్యవసాయసస్యమ్ము లెత్తి"[1] అనియు

'కులాలవారి'గ గతములోని ఆంధ్రుల వీరకృత్యములను, విజ్ఞానసంపదను అభివర్ణించినాడు. గత వైభవవర్ణనతోనే తనియక

''పెనుజడల్ విరబోసికొని తాండవంబాడు
ఈర్ష్యాపిశాచి నట్టింటిలోన
సవతిబిడ్డవిధాన నవయు తల్లితెనుంగు
విశ్వవిద్యాలయవీథులందు"[2] అనియు

వర్తమానస్థితికి కుమిలిపోయి, 'అహంకారదర్శన'మందుమని ఆంధ్రజాతిని వెన్నుతట్టి మేల్కొల్పినాడు. ఆంధ్రుల ఐశ్వర్యమును, వాణిజ్యవైభవమును, నౌకావ్యాపారమును 'తెనుగుతల్లి'అను శీర్షికక్రింద వర్ణించినాడు.[3] 'తెనుగుమానకము'అను శీర్షికతో ఆంధ్రభాషామాధుర్యమును వ్యక్తీకరించినాడు. ఆంధ్రుల సంగీతశిల్పనైపుణికి, ఆంధ్రస్త్రీల 'సాహససౌకుమార్యములకు' నీరాజనమెత్తినాడు. ఈ విధముగా ఆంధ్రాభిమానముకు సంబంధించిన సర్వాంగ ములను గూర్చి, సర్వాంశములనుగూర్చి గానముచేసి తరువాతికవులకు విస్తృతప్రణాళిక వేసినాడు. విశ్వనాథాదులు వీరువేసిన ప్రణాళికలోనే నడచి 'గరగరల్ పచరించి'నారు. మరి వస్త్వాశ్రయరీతిలో ప్రాచీనాంధ్రులపౌరుషమును స్మరించిన కావ్యములు కొన్నియున్నవి. ఏటుకూరివెంకటనరసయ్య గారి 'మగువమాంచాల', 'నాయకురాలు' ఈ ధోరణికి చెందిన కావ్యరత్నములు. ఆంధ్రాభిమానమును గానముచేసిన ప్రతిభావంతులగు కవులనేకులుండుటవలన వారిని పేరుపేరున పిలువక, తత్త్వనిర్దేశమే ప్రధానముగాచేసికొని అవసరమైన ఉదాహరణములందించుట సముచితమని భావింతును.

**ఆంధ్రజాత్యభిమానము :**

ఆంధ్రాభిమానము ముత్తెఱగులుగా ప్రవహించినది. ఒకటి జాత్యభిమానము. రెండవది దేశాభిమానము. మూడవది భాషాభిమానము. రాయప్రోలువారన్న 'నాదుదేశము–నాజాతి–నాదు భాష'యన్నసూత్రమునకే ఇదివృత్తి. ఈ మూడుపాయలలోనే ఆంధ్రాభిమానముయొక్క సర్వతోముఖస్ఫూర్తి ఇమిడియున్నది. ఈ మూడింటికిని గతవైభవస్మరణము, వర్తమానస్థితిపట్ల విచారము, భవిష్యత్కర్తవ్యప్రబోధము ముఖ్యలక్షణములు.

1. 2. ఆంధ్రావళి : 'ఆంధ్ర' :
3. ఆంధ్రావళి :

(i) శౌర్యప్రశస్తి :

ఆంధ్రులు 'పాటలీపుత్రముకోటకొమ్మలపై' పతాకమునాటిన చారిత్రకవృత్తాంతము తెలుగుకవిని కదలించినది. 'ఆంధ్రయువకులు తూరుపుకనుమదుర్గములనేలినదినమ్ము' అతని రక్తమునుడుకెత్తించినది.[1] 'తెలుగుజోమల తుటారికటారి చెలరేగి పగఱఁజీల్చినదినంబు'ను[2] స్మరణకుతెచ్చుకొని కవి నిట్టూర్చినాడు. అటుపాటలీపుత్రమును, ఇటురాయచూరును, అటు ఢిల్లీశుని, ఇటుచోళపాండ్యభూపులనెదిరించిన ఆంధ్రులగతశౌర్యము జ్ఞప్తికిరాగానే అట్టిబంగారు యుగమున తానుపుట్టక 'ఏలపుట్టితి నిపుడిసీ ! యేటిబ్రతు'కని ఉస్సురుమన్నాడు.[3] ఆంధ్రుల పరాక్రమఘట్టములను

"కోటగోడలనుండి కుప్పించి సింహంబు
లోయన నరులపైనురుకలేదా
కొండయడుగునుండి కొండపైవరకు నూ
గించి తేజీల దూకించలేదో
కోటతల్పులను డీకొనవచ్చు కుంభికుం
భమ్ముల గ్రుద్ది చంపంగలేదా"[4]

అనియు, ఆంధ్రవీరుడు భ్రూభంగమొనరింపగా ముగురురాయలయశమ్ము బొగ్గువోలిక నల్లనై పోయెననియు గతపౌరుషస్మరణతో మిన్నులందుకొని

'ఆంధ్రపౌరుషమాటలాడు చోటులు శిలా
ద్రుతిని మార్గమునిరోధించి నిలిచె'
'పట్టపేనుగులు గర్వసమేతముగనేగు
కడల జిల్లేడుమొక్కలు జనించె' నని,

ప్రస్తుతస్థితికి వేడికన్నీటిబొట్లు విడిచినాడు. ఇంకొకదశలో తెల్గుపరాక్రమము పొలిపోవలేదని, అది టంగుటూరిమున్నగువారిలో మల్లడించినదని ఊరటచెందినాడు.[6] 'యావదాంధ్రవిషయమ్ము నొక్కరాజ్యమ్ముజేసి విజయదుందుభిపై దెబ్బవేయువఱకుఁ దెలుగుఁబసిపాపకైన నిద్రింపదగునె'యని కర్తవ్యమును ప్రబోధించినాడు.

"కంచికోటల కంచుతల్పులు ఖంగుఖంగున మ్రోగునప్పుడు
తంజనగరపుకోటగోడలు చెంగుచెంగున నెగురునప్పుడు"

తెలుగువారలపరాక్రమమెంతటివ్వై తెగిసినదో తెలిసికొనుమని తెలుగుబిడ్డలకు హెచ్చరించినాడు.[7]

1. ఆంధ్రపౌరుషము : విశ్వనాథ. 2. 3. రాష్ట్రగానము : తుమ్మల.
4. 5. : ఆంధ్రపౌరుషము. 6. రాష్ట్రగానము.
7. త్రిపురనేనిరామస్వామిచౌదరి : సమదర్శిని : 1931-32 ఉగాదిసంచిక :

ఈ పౌరుషకథనములో వెలమ, రెడ్డి, కమ్మ, కాపు, నియోగిమున్నగు వివిధవర్ణములను పేరెత్తిచెప్పుట గమనింపదగినది. అంతేకాక స్త్రీల పౌరుషరేఖలను చిత్రించుటకూడ ఎన్నదగినది. 'కలము ఖడ్గము పట్టగలనేర్పువడసిన రెడ్డినాగమ్మ', 'జగమగంటిమినాంధ్రజగతిఁ బాలించిన' రుద్రమ్మ, 'గండికోటను మల్కదండుపైదూకిన గోవిందమాంబ', 'మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు' మల్లాంబ, 'వీగివచ్చిన హృదయేశు వెక్కిరించి పోరికంపిన' చానమ్మ ఈ కవుల హృదయములను కదలించిన వీరాంగనలు.[1]

(ii) ఐశ్వర్యప్రశస్తి :

ఆంధ్రదేశము గతములో సాగించిన విదేశవాణిజ్యమును, నౌకావ్యాపారమును, సాధించిన సిరిసంపదలను ఆంధ్రకవులు అత్యంతావేశముతో స్మరించినారు. పంజాబునుండి తెచ్చిన కర్పూర పాదపములను పెరండ్లలో పెంచినారని, గోవానుండి రప్పించిన పచ్చిజవ్వాజిని దంతంపు జాడీలలో దాచినారని, కొండవీటిగులాబిగుత్తుల అత్తర్లు కీలుతిత్తులలో బిగించి' పంపినారని, పారసీకాశ్వములను పూన్చినరథములపై ఆంధ్రప్రభువులు విజయయాత్రలు వెడలినారని గానము చేసినారు.[2]

"పాకాలచెరువు చెంపలపండు ధాన్యముల్
అన్యదేశాధీశులడుగునాడు
అద్దంకికోడెల నాబోతులకునయి
దూరాగతులుకొని త్రోలునాడు"

'తెలుగుతల్లి లాలాటికాతిలకదీప్తి ఖండఖండాంతరముల'లో ప్రకాశితమైనదని ఉప్పొంగిపోయినారు.[3] ఆంధ్రుల నౌకావ్యాపారమును ప్రశంసించుచు

"ఈజిప్తునుండి కృష్ణాజలమ్ములకు బా
రంబాటగా పరాక్రమముజూపి
సకలదీవుల విజయధ్వజములనాటి
తనదు తెరచాప వార్ధిరాజునకు కట్టు
కోకగా —"4

పూర్వము ఆంధ్రనౌక రేడుసంద్రములమీద తిరుగాడినవని తలచికొని పులకించినారు. శాతవాహనులకాలములో, ధాన్యకటకమున విదేశీయులతో జరిగిన నౌకావ్యాపారము ఈపద్యములో ధ్వనించుచున్నది. ఆంధ్రదేశమున 'బూదికిజీవమునిచ్చు ఓషధు'లున్నవని, 'రారాజుల కిరీటరంగమ్ము లెక్కనిక్కిన వజ్రములగన్నగను'లున్నవని, 'కొల్లూరికోహినూరు' తెలుగుతల్లికొప్పులో పూవు

1. రాష్ట్రగానము : 'ప్రశస్తి'. 2. ఆంధ్రావళి : 'తెనుగుతల్లి.'
3. ఆంధ్రావళి : 'తెనుగుతల్లి' 4. రాష్ట్రగానము :

వలె విరాజిల్లినదని కీర్తించినారు. ఆంధ్రభోగము కనుగొన్నచో ఇతరులకు 'పండ్లుపుల్లనై పోవు' నని తమదేశాభిమానమును ప్రకటించుకొన్నారు.[1] ఆంధ్రులు రతనాలు, ముత్యాలు రాసులుపోసి రాయలరాచవీటిలో అమ్మెడివారని, మంచుతెరలనీసడించు సెల్లాలు బందరుదుకాణములలో మెఱ సెడివని, మోటుపల్లిరేవున కస్తూరిని కొల్లలుకొల్లలుగా దిగుమతిచేసెడివారని, చంద్రవోలుపుర ములో మంటికుండ, నులకమంచమనగానేమియో తెలియని ఐశ్వర్యముతో ప్రజలు తులదూగెడి వారని ఆంధ్రకవులు అల్లనాటి తెలుగుసిరిని కీర్తించినారు.[2]

(iii) కళాప్రశస్తి :

శిల్ప, సంగీత, కవిత్వాదిలలితకళలలో ప్రాచీనాంధ్రులు సాధించిన కౌశలమును భావ కవులు తనివితీర కీర్తించినారు. సంగీతములో 'నాదధేనువుపిండి నవనీతమందించిన త్యాగరాజు', 'లీలాతరంగిణీకూలతీర్థానందుడైన' నారాయణతీర్థులు, 'శ్రీకృష్ణుకాలిగజ్జెలమ్రోతల లయించిన' క్షేత్రయ్య వీరి స్తుతులకు పాత్రులైనారు.[3] సంగీతము నాంధ్రులు ఉగ్గుపాలతోనే త్రావి ఉమిసిరట. కవిత్వములో (ప్రాకృతభాషలో) అమృతరుచులు వెలార్చిన హాలుడుగూడ ఆంధ్రుడు గానే వీరికి స్మరణీయుడైనాడు. ఇక నన్నయతిక్కనాద్యాంధ్రకవులప్రశస్తి ఎల్లలు దాటిపోయి నది. శిల్పములో ఆంధ్రులు ప్రపంచవిఖ్యాతిగాంచిరని వీరభిప్రాయపడిరి తాజమహాలునిర్మించిన వారిలో ఆంధ్రులు పరువురున్నారను అభిప్రాయముతో వీరు ఆంధ్రశిల్పులకీర్తిని మిన్నందజేసిరి.[4] అజంతాఎల్లోరాలలోని శిల్పనిర్మాణము ఆంధ్రుల చేతిచలువేయని భావించిరి.[5] 'చీనాపగోడాల సిగమీదిపుష్పమై' ఆంధ్రుని రాతిచెక్కడపుచెణుకు పొడమినదని పొంగిపోయిరి.[6] ఆంధ్రశిల్పముపై ఇన్నిశతాబ్దుల నిష్ఠురపాదములు పడినను అది కసుగందకుండ ఇప్పటికిని నిలిచియున్నదని పేర్కొనిరి.

"తలవంచలేదు విఠ్ఠలరాయదేవుడు
పటుశతాబ్దాభీలభారమునకు
నవసిపోలేదు సానువుగణేశుని బొజ్జ
బహుకాలదీర్ఘోపవాసములకు
తఱిగిపోలే దుగ్రనరసింహమూర్తికి
జక్షుర్ద్వయమున వెచ్చందనమ్ము
దసిలిపోలేదు కోదండరామస్వామి
తనువులో బిగువుకుందనపు దళుకు."[7]

1. 2: రాష్ట్రగానము : 3. ఆంధ్రావళి : 'ఆంధ్ర'
4. ముంటాజుమహలు : జాషువా. 5. రాష్ట్రగానము : పుట 80.
6. ఖండకావ్యము (3 వ భాగము) : 'తెలుగు వెలుగు': జాషువా :
7. ఖండకావ్యము (3 వ భాగము) : 'అశ్రుపూజ': జాషువా :

ఈ విధముగా ఆంధ్రశిల్పప్రశస్తి సాగినది. మరి దక్షారామము, హంపీక్షేత్రము, ఓరుగల్లుకోట, పెనుగొండలక్ష్మిమున్నగు కావ్యములలో అనల్పశిల్పప్రశస్తియున్నది. 'చక్రటాళ్ళలో జీవ సౌందర్యమహిమము' నిల్పుకొన్న కళామందిరములలోని శిల్పమునుగని

'ఏరీతి మలచిరో యీ స్తంభములయందు
ప్రోవుగ్రమ్మిన మల్లెపూవుచాలు
ఏలేపనంబున నీకుడ్యములకెల్ల
దనరించినారొ యద్దాలతళుకు'[1] అని

ఆశ్చర్యమును ప్రకటించిరి. శిల్పములలోని గజసింహప్రతిమలను చూచి

'ఈమత్తగజముల నేవిధి సృజియించె
ఎన్నేళ్ళకును జావకున్నవిచట
ఈమృగేంద్రమ్ముల నేస్రష్టసృష్టించె
ఉఱిమిన గర్జించుచున్నవిచట'[2]

అని, గండశిలలే పూవులుగా ఆకులుగా కాయలుగా రూపుదిద్దుకొన్నవని ముగ్ధభావమును వెల్ల డించిరి. ఒక శిల్పకళానిలయమునుజూచి అచ్చట 'ఏ తెనుగుపురాణశిల్పి యొకతీయని స్వప్నము నిల్పిపోయెనో'యని విస్తుపోయిరి.[3] ఈ విధముగా లలితకళలన్నిటిలో ప్రాచీనాంధ్రశిల్పమే భావకవులప్రస్తుతి నధికముగా చూరగొన్నది.

**దేశాభిమానము :**

పరంపరగా చరిత్రలోవినవచ్చు ఆంధ్రజాతిబహుముఖవైభవమ్మును వర్ణించుటయేకాక భావ కవులు ఆంధ్రదేశభౌతికస్వరూపమునుగూడ అద్భుతావేశముతో ఉల్లేఖించిరి. ఈ దేశాభిమానములో క్షేత్రప్రశస్తి ముఖ్యమైనది. దీనితోపాటు నదీప్రశస్తి, దుర్గప్రశస్తియున్నవి.

**(i) క్షేత్ర ప్రశస్తి :**

ఆంధ్రచరిత్రలో కాకతీయసామ్రాజ్యమునకు రాజధానియైన ఓరుగల్లు, వేంగీచాళుక్యులకు రంగస్థలమైన రాజమహేంద్రవరము, ఆంధ్రశాతవాహనుల విహారణస్థలమై శిల్పకళానిలయమైన అమరావతి, రెడ్డిరాజులొడ్డోలగముదీర్చిన 'కొండవీడు', విజయనగరరాజుల ప్రోపున, ప్రాపున వెలసిన హంపీపెనుగొండలు, శిల్పసృష్టికి మేళనస్థలమైన దక్షారామము నవ్యాంధ్రకవుల మైమరపించిన మహనీయక్షేత్రములు. వీనిలో హంపీక్షేత్రప్రశస్తికి కొడాలిసుబ్బారావుగారి హంపీ క్షేత్రము, గంటిజోగిసోమయాజిగారి 'రామచంద్రునిహంపీయాత్ర' చక్కని నిదర్శనములు.

2. పెనుగొండలక్ష్మి : పుట్టపర్తినారాయణాచార్యులు : పుట 22.
3. ఓరుగల్లుకోట : 'శిల్పములు' : శ్రీనివాససోదరులు
4. దక్షవాటి : 'దర్శనము' : ఇంద్రగంటిహనుమచ్ఛాస్త్రి

### హంపీక్షేత్రము :

కొడాలిహంపీక్షేత్రము కరుణరసార్ద్రమైన కావ్యము. కవి హంపీదర్శనముతర్వాత గతవైభవమును తలచుకొని గుండెలోనుండి వెలికిజిమ్మిన బాష్పసంగీతమిది.

'శిలలుద్రవించియేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలో
పలి గుడిగోపురంబులు, సభాస్థలులైనవి కొండముచ్చుగుం
పులకు, చరిత్రలో మునిగిపోయినదాంధ్రవసుంధరాధిపో
జ్జ్వలవిజయప్రతాపరభసంబొకస్వప్నకథావిశేషమై'[1]

అనుపద్యము 'అపిగ్రావారోదితి' యన్నట్టుగానున్నది. ఇందులో చాకలిదానిమేడ, హంపీస్థాపన, విద్యారణ్యులు, కనకాభిషేకము, తళ్ళికోటయుద్ధము మున్నగు కావ్యఖండికలున్నవి. ఇవన్నియు ఏదోఒకవిధముగా హంపితో అనుబంధమున్నవే. ఈ ఖండికలలో ఎక్కువగా ఆంధ్రరాజుల శౌర్యసాహసములకు సంబంధించినవే కలవు. 'కనకాభిషేకము'అను శీర్షికలో శ్రీనాథుడు కర్ణాట ప్రభుని ఆస్థానములో గౌడడిండిమభట్టుకంచుఢక్కను పగులగొట్టించిన వృత్తాంతమున్నది. డిండిముని ఓడించుటయనగా తెలుగు ప్రతిభ దక్షిణదేశమున స్థిరపడుటగానే ఈకవికి భాసించినది. 'చాకలిదానిమేడ'అన్నపద్యములు చిత్రమైనవి. రామరాజు చాకలికన్నెనువలచి దానికిమేడ కట్టించెనట. ఈ మేడను చూడగానే కవికి పూర్వవైభవము ఆదర్శమహితముగా స్ఫురించినది. విద్యారణ్యస్వామిని ఈ కవి ప్రశంసించుటకు ముఖ్యకారణము ఆ స్వామి 'తెల్లుభువనప్రళయంబున కడ్డు కట్టవేసిన మహనీయమూర్తి'కావున. ఆంధ్రులకపకీర్తికలుగుట ఈతనికి సహింపరానిది. రామరాయలు తళ్ళికోటయుద్ధమున చూపినచేష్టలీతనికి నచ్చలేదు. తళ్ళికోటవలన ఆంధ్రావనికి జరిగిన అపారనష్టమునకీయన యెంతో వాపోయినాడు. తిరుమలరాయదు రెండువందలగజముల వెడల్పున్న 'కొండగొండె'ను రక్షింపలేక పిక్కబలముచూపెనని వినగానే ఈతని రక్తముడికి పోయినది. తానే ఆదినములలో బ్రతికియుండినచో ఆనెగొందెను కాపాడియుండునని బాధపడినాడీ కవి. ఈతనికి హంపిలోని జడపదార్థములుసైతము చైతన్యకేతనములుగా స్ఫురించినవి. జీర్ణమై పోయిన కుగ్రామము తెనుగురారాజుయొక్క పండినయశస్సును చూపించునదిగా భాసించినది. ఈ విధముగా హంపికిసంబంధించినదంతయు ఇతనికి స్వప్నమువలె కనిపించినది.

### రామచంద్రుని హంపీయాత్ర :

'రామచంద్రునిహంపీయాత్ర' బైరనుకవి రచించిన 'Child Harolde's piligrimage' అనుకావ్యమునుసరించి వ్రాసినకావ్యము. రామచంద్రుడనుయువకుడు ఆంగ్లవిద్యాభ్యాసము చేసిన పిమ్మట హఠాత్తుగా భావపరివర్తనముకలిగి, ఆంధ్రాభిమానము పరవళ్ళుత్రొక్క, ఆంధ్రశిల్పవైభవమునకు అమరక్షేత్రమైన హంపీనగరపు శిథిలములను జూచుటకువెడలెను. శిథిలశిల్పసందర్శన

1. హంపీక్షేత్రము : పుట 1.

ముతో అతనికికలిగిన భావవీచికలు కవితామయముగా, తాత్త్వికచింతనాబంధురముగా కవి చిత్రించినాడు. విఠ్ఠలాలయవర్ణన,కృష్ణరాయలవర్ణనమున్నగువానిలో కవి అపారప్రతిభను కనబరిచినాడు. ఈ కావ్యము మూలకావ్యములోని స్థూలరేఖలను మాత్రము గ్రహించెను. మూలములో Child Harolde అనువాదుగూడ ప్రసిద్ధచారిత్రకస్థలములను చూడబోవును. ఇంతకుమించి ఈ రెండు కావ్యములకెక్కువ పోలికలేదు. క్షేత్రప్రశస్తికి సంబంధించిన కావ్యములలో ఎన్నదగినదిది.

### దక్షారామము :

ఇంద్రగంటిహనుమచ్ఛాస్త్రిగారి కావ్యమిది. దక్షారామము సుప్రసిద్ధశైవక్షేత్రము. 'ప్రఖ్యాత త్రిలింగములలో భీమేశ్వరుడొకడు' శ్రీనాథుడు తన భీమేశ్వరపురాణములో 'దక్షవాటిక' నమృతవాక్కులతో ఓలలాడించినాడు. దక్షారామదర్శనముతో కవిలోకలిగిన రసస్పందనమే ఈ కావ్యముగా అవతరించినది. ఈ క్షేత్రమునకుచెందిన పురాణగాథలను, చరిత్రను, దృష్టిలో పెట్టుకొని ఈకావ్యము రచింపబడినది. వ్యాసర్షిని దక్షవాటికలో బ్రహ్మసూత్రములు వ్రాయుమని అగస్త్యుడుచేసిన ప్రబోధము, భీమేశ్వరాలయములో అన్నయమంత్రి శ్రీనాథుని భీమఖండ కృతిని స్వీకరించుట-అను రెండుసంఘటనలుమాత్రము కవి స్వకపోలకల్పితములు. ఈ కవి కావ్యాంతమునగల సింహావలోకనములో

> 'శ్రీదక్షవాటికాశృంగారదేవతా
> సేవఁగస్తూరివాసించునాడు'[1]

ధన్యతమమైన 'జన్మమ్ముగనక పుట్టి నేడిట నేనెంత పొరపడితిని'అని వాపోయినాడు. 'ఈ తెన్గు చిన్నఊరేనా? మహాగ్రంథనిర్మాణగరిమ సంధించె ముని'కని ఆశ్చర్యపడినాడు.[2] 'దక్షారామ పురమ్ములోనిపుడు గంధర్వాప్సరోభామినీసాక్షాత్కారములేదు'అని శ్రీనాథునిచాటువు స్మృతికి రాగా నిట్టూర్చినాడు.[3] శైవక్షేత్రమును కావ్యవస్తువుగా తీసికొన్నను ఆంధ్రాభిమానమును వ్యక్తీకరించిన కావ్యమిది.

### ఓరుగల్లుకోట :

ఇది శ్రీనివాససోదరులు రచించిన కావ్యము. హంపీక్షేత్రముధోరణిలోనే రచించినను, ఈ కావ్యములో 'ఆంధ్రేతరులకు కంటకమైనవిషయాలు' లేకపోవుట ప్రశంసింపదగినది. ఈ కావ్యపీఠికలో జి. వి. కృష్ణారావుగారన్నట్లుగా ప్రాచీనశిల్పనైపుణ్యమును, కవితాశక్తిని. ఉత్సాహశక్తిని పురస్కరించుకొని, ఆంధ్రులను నూతనోత్తేజితులను చేయుటయే ఈ కావ్యము లక్ష్యముగా కనిపించుచున్నది. 'ప్రతాపరుద్రునిశిరస్సు' చూచినప్పుడు, కోటలోనిదేవాలయ శిథిలములలోనున్న 'వేణుగోపాలప్రతిమ' కంటబడినప్పుడు, నందికేశ్వరుడు గోచరించినప్పుడు పెల్లుబికిన భావములు ఈ కృతిలో చక్కగా చిత్రింపబడినవి. 'భారతనారీహృదయము'అను

1. 2. 3. దక్షారామము : 'సింహావలోకనము'

శీర్షికతో రుద్రమదేవిపై యుద్ధమునకు పురికొల్పుటకు తోడిరాజులను చేరదీసి దేవగిరిరాజుచేసిన ఉపన్యాసము వర్ణింపబడినది. రుద్రమదేవినధిక్షేపించుచు దేవగిరిరాజు ఉపన్యసించినపిమ్మట రుద్రమదేవి ఆగమనము.

'భారతనారీహృదయము
కోరకమునకన్న మృదువు, కుత్సితవిధికిన్
దారుణనిర్ఘాతమ్మను
నేరనిగతిఁ గఠినతీవ్రనిష్ఠురముసుమా'

అని ఆమెపలికిన పౌరుషోక్తులలో శౌర్యరసోల్బణము రమ్యముగా చిత్రింపబడినది. 'వేయి స్తంభాలగుడి'అన్న శీర్షికక్రింద ఆ గుడి శిల్పరామణీయకము వర్ణింపబడినది. ఈ విధముగా ఓరుగల్లుకుసంబంధించిన చారిత్రక ఘటనలు, శిల్పములు కేంద్రాంశములుగా ఆంధ్రాభిమానమును ప్రబోధించిన కావ్యమిది.

**పెనుగొండలక్ష్మి :**

ఈ కావ్యమును పుట్టపర్తినారాయణాచార్యులుగారు తమ పంద్రెండ్రవయేట వ్రాసిరట. వారి పందొమ్మిదవయేట ఇది ప్రచురింపబడినది. "హంపీక్షేత్రము'న కంటెను 'పెనుగొండ లక్ష్మి' పదునై దేండ్లుపెద్దదియే.''అని పుట్టపర్తివారే స్వయముగా వ్రాసికొన్నారు:[1] అనగా ఈ కావ్యము 'క్షేత్రప్రశస్తి'కి చెందినకావ్యములలో మొట్టమొదటిదనవలసివచ్చును. ఇది కవిగారు చిన్ననాట వ్రాసినదైనను క్షేత్రప్రశస్తికి చెందిన మిగిలిన కావ్యములకు ఏ మాత్రము తీసిపోదు.

ఈ కావ్యములో కోట, రాజవీధి, శిల్పము, బాలయ్యగోరిమున్నగుశీర్షికలతో రచనలున్నవి. తిమ్మరుసు, తిరుమలరాయడు, భట్టుమూర్తి, విద్యారణ్యులు, కృష్ణరాయలప్రశస్తి అందందు కలదు. 'గగనమహలు' అన్నశీర్షికక్రింద

"రాయలపాదముద్రలు దలఁదాల్చి సొం
పులుదిద్దుకొన్నట్టి కలికిమిన్న
— — — — —
కాపుకైతలకు ద్రాక్షాపాకమునుగూర్చి
గానంబుఁజేసిన కవికుమారి
వగతుర్రయెదంద నిప్పుకల్ రగులబెట్టి
యుదధిగర్భంబు సుడివడి హోరుమనగ

1. పెనుగొండలక్ష్మి : ఉపోద్ఘాతము.

తెనుగుఢంకాలు మ్రోగిన దివ్యభూమి
కనుము తమ్ముడా ! జీర్ణంబు గగనమహలు"[1]

అనుపద్యము పెనుగొండకుసంబంధించిన ప్రాచీనరాజ్యవైభవమును, పరాక్రమక్రమమును,కవితా ప్రాగల్భ్యమును ధ్వనింపజేయుచున్నది. చివరనున్న 'తెలుగురాయడు' అన్నశీర్షికలో ఈ నేల లోని వర్తమానస్థితినిజూచి 'బాష్పస్నిగ్ధముగ్ధాంజలుల్' సమర్పించినాడు కవి.

ఇవికాక కొండవీడు, దేవరకొండమున్నగు దుర్గములపై వ్రాసిన చిన్నకావ్యఖండికలు అనేక ములున్నవి. వానిలో 'కొండవీడు'నకు సంబంధించిన ఒకటిరెండు ఖండకావ్యములను ప్రస్తా వించి ముగింతును. దువ్వూరిరామిరెడ్డిగారు 'కొండవీడు'అను శీర్షికతో వ్రాసిన పద్యములలో ప్రాచీనరెడ్డినృపాలురసంతతికి చెందిన రెడ్లు ఈనాడు 'సీరచోదకవృత్తి' గ్రహించిరనియు,

"దురమందున్ మెఱుపట్లు శోభిలినకత్తుల్ నేడు రూపాంతర
స్ఫురణన్ సీరములందుఁ గఱ్ఱులుగ నేపున్ సొంపు వోనాడి యీ
ధరణీగర్భము జీల్చుచున్నవి — "[2]

అనియు చమత్కరించి, గతవైభవమును, వర్తమానదుస్థితిని మరొకమాదిరిగా స్మరింపజేసిరి. విశ్వనాథవారి 'కొండవీటిపొగమబ్బులు' జీర్ణాంధ్రవైభవమును స్మరింపజేయు విషాదరేఖాశబలిత మైన ఖండకావ్యము. పొగమబ్బులు రాజవైభవముడిగిపోయిన కొండవీటిదుర్గలక్ష్మికి వెర్రి యలంకృతులను కైసేసినవని వర్ణించి, మబ్బులుసైతము నాటిరాజులమీది అభిమానగౌరవ ములు విస్మరించలేదని ఈ కవి ధ్వనింపజేసినాడు.

(ii) నదీప్రశస్తి :

తెలుగుదేశమున ప్రవహించు గోదావరి, కృష్ణా, తుంగభద్రా, పెన్నానదులను కేంద్రము లుగాచేసికొని కొన్నిఖండకావ్యములు, కొన్నివర్ణనలు కూర్చబడినవి. ఈ రచనలు ఆంధ్రాభిమాన మును రేకెత్తింపజేయుటకే ఉద్దేశింపబడినవి. దేశభౌతికసంపదలో నదీసంపత్తి ప్రథమ గణ్యమైనది. ఆ నదులు తెలుగుకవులకు 'సస్యములకు పాలిచ్చు వాత్సల్యవతులు'గానేకాక పూర్వాంధ్రుల నౌకావ్యాపారమునకు సాధనములుగాను గోచరించినవి. పూర్వాంధ్రరాజులు నదీ తీరములలోనే తమరాజధానులు స్థాపించుకొన్నారు. కృష్ణాతీరములోని ధాన్యకటకము, గోదావరీ తీరములోని రాజమహేంద్రవరము, తుంగభద్రయొడిలోనున్న హంపి, పెన్నానది పార్శ్వమున గల విక్రమసింహపురము[3] (నెల్లూరు) ప్రసిద్ధమైనవే. అందువలన వర్తమానాంధ్రకవులకు నదులు ప్రాచీనాంధ్రవీరుల పౌరుషగాథలను స్మరింపజేయునవిగా కనిపించినవి. అంతేకాక కృష్ణా

1. పెనుగొండలక్ష్మి : 'గగనమహలు'.
2. కవికోకిలగ్రంథావళి : రెండవభాగము.
3. మనుమసిద్ధి రాజధాని :

తీరములోని అమరావతి, నాగార్జునకొండ, తుంగాతీరములోని హంపీక్షేత్రము శిల్పకళలో వాసి గాంచినవి. కళాపోషణకుపకరణములైనందున ఈ నదులు ఆంధ్రకవుల హృదయములను చూరగొన్నవి. ఈ పద్యముగమనింతము.

"గోదావరీపావనోదారవాఃపూర
మఖిలభారతము మాదన్ననాడు
తుంగభద్రాసముత్తుంగగానముతోడ
కవులగానము శ్రుతిగలయునాడు
పెన్నానదీసముత్పన్నకైరవదళ
శ్రేణిలో తెన్గువాసించునాడు
కృష్ణాతరంగనిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు
అక్షరజ్ఞానమెఱుగదో యాంధ్రజాతి
విమలకృష్ణానదీసైకతములయందు
కోకిలంపుబాట పిచ్చుకగూండ్లుకట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు."[1]

ఈ పద్యములో నాలుగుతెలుగునదులను కేంద్రములుగాగ్రహించి కవి ప్రాచీనకాలములో జరిగిన సాహిత్యశిల్పకళావిలసనమును, ఆంధ్రజాతి అఖిలభారత ప్రశస్తిగడించిన స్వర్ణఘట్టమును స్మరింపజేసినాడు. నదులను కేంద్రములుగాపెట్టుకొని వస్తువును ధ్వనింపజేసిన పద్యములలో ఇది అగ్రసరము. ఇంకొకపద్యములో ఈకవియే ఆంధ్రవీరులు 'అరికంఠరక్తచిహ్నములు పోవుటకునై' పెన్నానదిలో కత్తిపొన్నుగడిగి, శత్రుకంఠవిలుంఠనకార్యములో కలిగిన తాపమును నివారించుటకై కృష్ణానదిలోమున్కలిడి, తుంగభద్రాసముత్తుంగరావమును 'రిపుశ్రీభేదకముగ ఘోషింప' జేసెడివారని అభివర్ణించెను. ఈ నదులన్నిటిలో గౌతమీకృష్ణలే అధికముగా వర్ణింపబడినవి. గోదావరినుద్దేశించి

'శబ్దశాసనుని ద్రాక్షాకవిత్వమునుంగా
మించి యెన్నాళ్ళులాలించినావొ'[2]

అని ఒకకవి నన్నయను స్మరించుకొనగా, ఇంకొకరు

1. ఆంధ్రపౌరుషము : విశ్వనాథసత్యనారాయణ.

2. ఖండకావ్యము : 2వ భాగము : 'అఖండ గౌతమి' : జాషువా :

"చాళుక్యులదినాల సరిగంచుచీరగ
 ట్టించితి మాతెన్గుటెక్కెమందు
మాతెన్గుభారతస్ఫీతికి తేనియ
 పచ్చిమాధుర్యమప్పిచ్చినావు

— — — — —

జనని ! మానేటి యప్రయోజకతజేసి
కనులవెంట బాష్పంబులు కారజొచ్చె"[1]

నని ప్రాచీనకవితాప్రశస్తికి జోతలిడ, వర్తమానదుస్థితికి ఖిన్నుడైనాడు.

ఈ విధముగానే 'కృష్ణవేణి'నుద్దేశించి వ్రాసినరచనలలోగూడ నదీస్మరణతో కవిలో గల్గు ఆంధ్రాభిమానావేశములు వ్యక్తముచేయబడినవి.

'ఏయనూహ్యయుగంబుల నీవు తెల్గు
నెత్తురులవెచ్చదనములు నేర్చినావొ ?
నీగభీరమూర్తిని గన్న నేడు నాకు
(వె) ? తెలుగు తెలుగును అమృతగీతులు నదింతు."[2]

**దేశాభిమానము :**

ఆంధ్రభాషాభిమానము పూర్వకవులకు లేదనికాదు. దానిని వారు కావ్యరచనారూపముననే నిరూపించిరి. శ్రీనాథుడు 'దేశభాషలందుతెలుగులెస్స'యని కీర్తించెను. కృష్ణరాయలవంటి 'సాహిత్యసమరాంగణచక్రవర్తి'దానిని

'తెలుగదేలయన్న దేశంబుతెలుగేను
తెలుగువల్లభుండ; తెలుగొకండ
ఎల్లనృపులుగొలువ నెరుగవే బాసాడి
దేశభాషలందుఁదెలుగులెస్స'[3]

యని బలపరిచెను. తెలుగుతీపిని ప్రాచీనమహాకవులు పల్వురు కీర్తించిరి. కాని ఆధునికకాలమున దానిప్రశస్తిని చాటవలసిన ఆవశ్యకమింకెంతో యేర్పడినది. ఆంగ్లభాష అధికారభాషగా నుండుటవలన తెలుగునకు మొన్న మొన్నటిదాక దిక్కుమొక్కులేనిస్థితి యేర్పడినది. ఈ స్థితిలో ఆంధ్రాభిమానము తీవరించిన భావకవులు, జాతి, దేశాభిమానములతోపాటు భాషనుగూడ చేర్చిరి. మీగడలు, తేనెలు, పూలలావణ్యము, సెలయేటిఒయ్యారము 'కలగలిసి'తెలుగుభాషగా రూపొందె

---

1. నీరాజనము : విశ్వనాథ : శారద : 1923 ఏప్రిలు సంచిక.
2. రత్నాపణము : పెనుమర్తి : పుట 41.
3. ఆముక్తమాల్యద : పీఠిక :

నని వారుత్ప్రేక్షించిరి.[1] అంతేకాక ఆంధ్రవాణి 'లేజవరాలిమోవికి జిలేబికి బాలరసాలపల్లవ శ్రీ'కి రుచులుచిందెడిదని ప్రస్తుతించిరి.[2] ఈ విశాలవిశ్వములో తెలుగునుబోలిన వచస్సు నభస్సుమని తెలుపుటకు 'ఎల్లఖండమ్ములవారి మెప్పులేసాక్ష్యము'లని, తెలుగును 'Italian of the East' అన్న బ్రౌనుదొరమాటలను దృష్టిలోపెట్టుకొని మిన్నులకెత్తిరి.[3]

'ఊరక రాష్ట్రమూడిపడునొక్కొ మహేశ్వరినట్లు మాతృభా
షారమణిన్ భజించుటకు సంబరమందని చచ్చుజాతికిన్'[4]

అని ఆంధ్రభాషాసేవచేయనిదే రాష్ట్రమురాదని, వంగసోదరులు నక్షత్రములవలె మెరయుటకు వారి భాషారాష్ట్రమే కారణమని, అందుకై మాతృభాషాభ్యసనము అనివార్యమని హెచ్చరించిరి.[5]

ఆంధ్రాభిమానము :

వస్త్వాశ్రయరీతి :

వస్త్వాశ్రయరీతిలో ఆంధ్రాభిమానమును ప్రబోధించినకావ్యములుఅతి స్వల్పముగానున్నవి. వానిలో విశ్వనాథవారి 'ఆంధ్రప్రశస్తి' అన్నిరీతులప్రశస్తమైనది. ఆంధ్రులచరిత్రలోని ఉజ్జ్వల ఘట్టములనేరుకొని వారు ఖండకావ్యములు రచించినారు. ఇవి వాల్టర్‌స్కాటువ్రాసిన Battle of Bannockburn, Battle of flodden field' అను చారిత్రకఖండకృతులను స్మరింపజేయు చున్నవి. వీరిచేతిచలువతో కంకాళమువంటి చరిత్రకు ప్రాణప్రతిష్ఠ జరిగినదని ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనంగారభిప్రాయపడినారు.[6] 'ఆంధ్రప్రశస్తి'లో 'పూర్వాంధ్రధరాధినాయకకథామంజూషికా రత్నగాథా పద్యావలిపేరి' 'మహాప్రబంధరచనాసౌందర్యపున్ వాసనల్ తీపై కమ్మగ' ఖండకావ్యహారములల్లబడినవి.[7] ఈ కావ్యములో శ్రీకాకుళము రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిన ఆంధ్రవిష్ణువు, ఆంధ్రశాతవాహనసామ్రాజ్యమును నిర్మించిన 'శాతవాహనుడు' ఆంధ్రచక్రవర్తిత్వమును నిలిపిన 'గౌతమీపుత్రశాతకర్ణి', వేగిక్షేత్రము; ప్రోలరాజు, చంద్రవంకయుద్ధము మున్నగు విషయములనుగూర్చి రచించిన ఖండకావ్యములున్నవి. గౌతమీపుత్ర శాతకర్ణి శకులను జయించుటకుచేసిన జైత్రయాత్ర, వేగిక్షేత్రములోని వర్ణనలు చల్లారిపోయిన ఆంధ్రుల గుండెలలో జ్వాలాతోరణములను వెలార్చును. వేగిక్షేత్రములోని ప్రత్యణువు పురావైభవపునీతమని వీరు తెలిపిరి.

'ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనంబుండి స్మృత్యర్థమనెనొ

1. ఆంధ్రావళి : 'తెనుగుమాన్యము' : రాయప్రోలు.
2. రాష్ట్రగానము : 'మాతృభాష' : తుమ్మల :
3. 4. 5. రాష్ట్రగానము : 'మాతృభాష :' తుమ్మల.
6. The Poetry of patriotism in Telugu (ఆంగ్లవ్యాసము) : Triveni : 1940 అక్టో :
7. ఆంధ్రప్రశస్తి : 'నతి'.

— — — — —

ఈ నా శరీరమిందివతశించిన గాలి
యెంత పౌరాతన్యమేచికొనెనో'

వంటివర్ణనలు కరుణగభీరముగాసాగి పూర్వవైభవస్మృతికి పూలదివ్వెలెత్తును. 'ముఖలింగము'లో కళింగగాంగులు తెలుగురాజులుగా భావింపబడి వారికీర్తి ఉగ్గడింపబడినది. ఈ శీర్షిక క్రిందనే

''నాజాతి పూర్వప్రథాజీవరహితమై
శక్తి నాడులయందు చచ్చిపోయి

— — — — —

నామాతృభాష నానాదుష్టభాషల
యౌద్ధత్యమును తలనవధరించి
ఏమిమిగిలిన దీనాటికిట్లు పొంగు
లొలయు వర్షానదీగభీరోదకముల
దైన్యగర్భచారిత్రముల్ దక్క భిన్న
గిరిశిఖరదుర్గపరిదీనగీతిదక్క''

అనుపద్యములో వర్తమానకాలమున అంధ్రదేశభాషలకుపట్టిన దుర్గతిని, దైన్యమును చిత్రించి విశ్వనాథవారు వ్యంగ్యముగా కర్తవ్యప్రబోధముచేసిరి. ఇది ఆత్మాశ్రయరీతిలోనున్న రచన.

''తెలుగునదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెన్గునేల ముగించనిమ్ము
నేటితో నస్వతంత్రతానియతమైన
యీ బ్రదుకు తెన్గువారు భరించలేరు''

అన్నకళామాతమున్న పద్యమీశీర్షికక్రిందనేయున్నది. స్వాతంత్ర్యసిద్ధికై విశ్వనాథవారు పొందిన ఉద్వేగమీపద్యములో 'చెలియలికట్ట'నుదాటి విజృంభించినది.

ఈ కావ్యసంపుటిలోని కొన్నిపట్టములు ఆంధ్రులచరిత్రలో ప్రశస్తమైనవికావు. 'మాధవవర్మ' కథయిట్టిదే. మాధవవర్మ క్రీ. శ. 850 ప్రాంతములో బెజవాడనేలిన పల్లవప్రభువు. ఈతడు జైత్రయాత్రలు చేసినవాడుకాడు. చరిత్రలో కీర్తిధ్వజమునిల్పుకొన్న కృష్ణరాయాదుల కోవలోనివాడు కాడు. ధర్మముకొరకు, న్యాయముకొరకు కన్నకొడుకునుగూడ కత్తికెరగావించుట కాజ్ఞాపించిన ఆ ప్రభువు ధర్మనిరమునకు ముగ్ధులై విశ్వనాథవారు దీనిని స్వీకరించిరి. ప్రాచీనాంధ్ర రాజుల పౌరుషాదులతోపాటు ధర్మనిరతికూడ అంధ్రాభిమానప్రేరకముగా భావించి వారీ రచన

చేసినారు. ఈ కావ్యములోని అన్ని ఖండికలలోను 'మాతృదేశావిలదుఃఖదారిత'మైన విశ్వనాథ వారి హృదయపుపొంగులు కనిపించును.

**అభిమానాతిరేకము :**

ఆంధ్రాభిమానమును సహేతుకమైనరీతిలో, రసవన్మార్గములో ప్రవేశపెట్టిన రాయప్రోలు వారే అభిమానాతిరేకమునకు దారితీసిరి. అభిమానమన్నది అహంకారలక్షణమంటిని. ఆ యభిమానము హద్దులోనున్నప్పుడే ఎల్లరికి ధ్యేయమగును. కాని కుండపోతగా వానకురిసినతరువాత నదీనదములు, ఏర్లు, కాల్వలు, పిల్లకాల్వలు, స్వచ్ఛమైన వాననీటితోపాటు 'తుక్కు-దూగర,' ఆకులలములు, చెట్టుచేమలు, ఒకటేమిటి-ఎదురైన ప్రతివస్తువును వెంటతీసికొని ఉరకలుతీసినట్లుగా; ఒక మహోఝంఝాప్రభంజనము వీచినప్పుడు మన్నుమిన్నేకమై ధూళిగ్రమ్మినట్లుగా, ఒక ఆవేశము కట్టలుత్రెంచుకొనివచ్చినప్పుడు అది ముందువెనుకలు పరికించదు. హేతువు దాని ధాటి కాగదు. ఆంధ్రరాష్ట్రోద్యమముతో ఒక్కుమ్మడిగా చెలరేగిన రాష్ట్రాభిమానకవిత్వములోగూడ అనేకసందర్భములలో అభిమానము 'దురభిమానము'గా పరిణమించినది. 'దురభిమాన'మను పదమువాడుట సమంజసము కాదేమోయని 'అభిమానాతిరేక'మనుచుంటిని. ఈ విధమైన అభిమానము ఆయుగలక్షణము. ఇదిపెద్దదోషముకాదు. నాటి కాలస్వభావమట్టిది; కవుల చిత్తవృత్తి అట్టిది. కవులుప్రకటించిన 'అభిమానాతిరేకము' ఆనాటి ప్రజలకానందమే కలిగించినది; కాని ఆలోచనలకు తావీయలేదు.

'తనగీతి అరవజాతిని గాయకులనుగా దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి'యని రాయప్రోలువారు త్యాగరాజకీర్తనలను దృష్టిలోపెట్టుకొనియన్నను, ఈ కీర్తనలే అరవలను గాయకులుగా తీర్చిదిద్దిన వనుట స్వాభిమానమునుమించినమాటయే. ఈ కవిలో బీజప్రాయముగానున్న ఈ యభిమానాతిరేకము విశ్వనాథ, తుమ్మలమున్నగువారిలో విస్తరించినది. విశ్వనాథవారు 'ఆంధ్రపౌరుషము'లో 'ఆంధ్రపౌరుషమనమాటలా ః రిపూత్కారముల గుండెలు వినినంతబ్రద్దలయ్యె'అన్నది కవిత్వసంబంధమైన అలంకారముగా గ్రహింపవలెనేకాని ఉన్నదున్నట్టు తీసికొన్నచో కుదురదు. చారిత్రకులు అగస్త్యుడాంధ్రవంశీయుడేయన్నవిషయమును తీసికొని విశ్వనాథవారు 'ప్రథమాంధ్రస్వామి'గా అతనినికీర్తించిరి. ఇంతవరకు నయమేకాని ఆదికవియైన వాల్మీకికూడ ఆంధ్రదేశములోనే పుట్టెనని వీరనుట నిశ్చయముగా అభిమానాతిరేకమేకదా.[1] 'ఆంధ్రరాజలక్ష్మి'కి 'రోమీయులైన వీరులు రెండుకెలకుల రమ్యమౌవింజామరలు వీచి'రట. ఆమెపేరువినగానే 'రిపూత్కారములశిశువులు భూధరాంతముల వోరుపెట్టి'నారట. ఇవి కృష్ణరాయాదులకోడిపోయి అడవుల

1. 'తొలికవి మాయాంధ్రక్ష్మా
తలమందున బుట్టినతడె తద్వరవక్త్రో
జ్జ్వలదివ్యమధునదంబున
గ్రొత్తకులంబు పూతసరణి వహించెగా.'

బట్టిన రిపురాజులదుస్థితిని ఇంతలంతలుగా ఉత్ప్రేక్షించినప్రబంధకవుల వర్ణనలను పోలియున్నవి కావా ?

ఈ గుణము 'తుమ్మల'వారిరాష్ట్రగానములో 'పఱిగపంట'లోని కొన్నిఖండకృతులలో, విశృంఖలముగా కనిపించుచున్నది. ఆంధ్రశిల్పి అజంతాఎల్లోరాలను నిర్మించినాడన్నది అసమంజసముకాకపోవచ్చుగాని, అరవలను దోమలనుట,ఆంధ్రుని వేదండమనుట కేవలమభిమానాతిరేకము వలన వెలువడినమాటలే.[1] తెలుగువారికి రాష్ట్రమువచ్చినచో వారివిత్తముగుడిచి త్రేచెడి భాగ్యము పోవునని 'పాలలోఁబడిన బల్లులకై వడి తల్లడిల్లుచున్' 'అఱవల్ గఱువల్ నిరసించు ధర్మముల్'[2] అన్నధోరణికూడ పైతీరులోనేయున్నది. హిందీని, ఇంగ్లీషును పట్టుకొనిప్రేలాడు తెలుగువారిని, తెలుగును విస్మరించరాదని వీరు విమర్శించిరి.

'పోతన్నకలము సొంపుల నెఱుంగకమున్నె
తులసిదాసునికై తతో పనేమి'[3]

అని వీరనుట అభిమానాతిశయమని అనలేము. కాని 'వంగభస్మము'అను శీర్షికతో వీరు వ్రాసిన పద్యములలోని స్వాభిమానతీవ్రత పాఠకులకాశ్చర్యము కలిగించకమానదు.

'సిగ్గు సిగ్గు తెల్గుసీమల దత్తు, ఠా
కూర్, బెనర్జి, సేను, ఘోషు, బోసు
రే, యటన్న పేర్లు రేగెను; ప్రెగ్గడ
భట్టు, సెట్టి వీడువట్టిపోయె''[4]

అనుపద్యమిందుకు మచ్చుతునక. జాతీయోద్యమమున ప్రముఖపాత్రవహించిన సురేంద్రనాథ్ బెనర్జీ, సుభాస్‌చంద్రబోసుమున్నగువారు ఆ కాలమున భారతదేశములోని అన్నిరాష్ట్రములలో ప్రసిద్ధులైనవారు. వారి వ్యక్తిత్వములచేత ప్రభావితులైన కొందరాంధ్రులు తమబిడ్డలపేర్లకు బెనర్జీ, బోసుమున్నగువానిని చేర్చిరి. ఇది ఆంధ్రులకు విజాతీయమైనదని తుమ్మలవారు తీవ్రముగా ఖండించిరి. 'స్వస్థానవేషభాషాభిమానము' నూటికినూరుపాళ్ళున్న కవులువీరు. కట్టులో, బొట్టులో, జుట్టులో ఆంధ్రత్వమునాచరించిచూపిన 'మహాత్ముని ఆస్థానకవులు'. అందువలననే ఆంధ్రత్వముపట్ల వీరిస్వాభిమానము గట్టుత్రెంచుకొని ప్రవహించినది. 'తెలుగునాడు'అను శీర్షికతో కర్లపాలెంకృష్ణారావను కవిగారు

1. ''వేదండమయ్యయ్యో! దోమలనాశ్రయించుకొని జోహారిచ్చె నీనాటికిఁ'' (రాష్ట్రగానము)
2. రాష్ట్రగానము : 'అఱవలు'
3. రాష్ట్రగానము : 'మాతృభాష'
4. పఱిగపంట : 'వంగభస్మము' : పుట 121.

'తెలుగునాడును గొల్వరా తమ్ముడా
తెలుగుగాలిని బీల్చరా !
తెలివిగలవాళ్ళంత తెలుగువారేనోయి'[2]

అనిరి. ఎంతచిత్రము ! ఇంక కొంద రిట్లేచేసినవారున్నను విస్తరభీతిలో వారిరచనలను పేర్కొ నలేను. 'ఆంధ్రాభిమానము'యొక్క తీవ్రత నెత్తిచూపుటకే యీ మాత్రము సాగదీసితిని. ఈ చర్చప్రయోజనముకూడ ఆ యుగలక్షణమును ప్రతిబింబింపజేయుటకే. పరిశీలనదృక్పథమే తప్ప ఈ చర్చవెనుక విమర్శనాదృష్టి ఏమాత్రములేదని మనవిచేయుచు ఈ విషయమును ముగింతును.

1. 'మల్లెపూలు'

# 3. ప్రకృతి కవిత్వము

## (Nature Poetry)

### ప్రకృతి: భారతీయకవితా సంప్రదాయము :

భావకవిత్వములో ప్రణయకవిత్వము, దేశభక్తికవిత్వము ప్రధానములైనవి. ప్రకృతి కవిత్వము ... అగ్రపంక్తిలో నిలిచిన శాఖయే. ప్రకృతివర్ణన లీనాటివికావు. కవితావతరణమే ప్రకృతివర్ణనలతో ప్రారంభమైనదనవచ్చును. గడగడమని ఒకమేఘము గర్జించినప్పుడు; తళుక్కుని ఒకమెరుపు మెరసినప్పుడు, ఫెళఫెళార్భటులతో పిడుగుపడినప్పుడు, వానకురిసినప్పుడు, వెన్నెలవిరిసినప్పుడు ఆదిమానవుని మనస్సులోని ఉద్వేగోల్లాసములు, హాసత్రాసములు, వినోదవిస్మయములు ఛందోరూపముగా మందహాసముచేసినవి. అవన్నియు ప్రకృతివర్ణనలే. వైదిక ఋషులు పాడిన ఋక్కులిట్టివే. ఋగ్వేదములోని ఉషస్సూక్తములో నిసర్గరమ్యమైన ప్రకృతి వర్ణనలున్నవి. ఆర్యులు ఆరునెలలపాటుగా గాఢతమసములో మునిగియుండెడు ఉత్తరదేశ వాసులగుటవలన, వారికి ప్రభాతకాంతులు బ్రహ్మానందసంధాయకములుగా నుండెడివి. ఆ యుషః కాంతులనుజూచి వారు పసిపిల్లలవలె గంతులువేసి కేరింతలిడి పాడుకొన్నారు. వారి గానతరంగములే ఋక్కులుగా నిలిచిపోయినవి. కావున మానవుడు ప్రకృతియొడిలోపడినప్పటినుండి ప్రకృతికి సంబంధించిన వర్ణనలు బయలువెడలినవి.

### 'ప్రకృతి'శబ్దవిచారము :

దృశ్యమానమైన స్థావరజంగమాత్మకమైన జగత్తంతయు ప్రకృతియని స్థూలముగా భావింపవచ్చును. కాని సాంఖ్యదర్శనములో ప్రకృతికీయర్థములేదు. 'ప్రకరోతి ఇతిప్రకృతిః,' అనగా ఏదిచేయునదో అదిప్రకృతి. ప్రపంచమునకు మూలకారణము ప్రకృతియని దీనిభావము. అవ్యక్తము, మాయ, మూలము అనునవి దీనికి పర్యాయపదములు. ప్రకృతిపురుషులలో పురుషుడు ప్రకృతియుకాడు, వికృతియుకాడు. అతడు దేనికి కారణభూతుడుకాడు. ప్రకృతియొక్కటే అవికృతి. అది అన్నిటికి కారణము. దానినుండియే సమస్తముద్భవించినది. దీనినే 'ఆద్యాప్రకృతి రవికృతిః'అని సాంఖ్యకారికలు తెలిపినవి. ఈ 'ఆద్యప్రకృతియై'న ప్రకృతి త్రిగుణాత్మకము. ఇదే వికృతిచెందగా సృష్టియైనది. అనగా సృష్టి వికృతియేకాని ప్రకృతికాదని తేలినది. ఆధునిక కాలములో ఏసృష్టిని, ఏదృశ్యమానజగత్తును ప్రకృతియనుకొనుచున్నామో సాంఖ్యము దానిని వికృతిగా మాత్రమే భావించినది. సాంఖ్యములోని తాత్త్వికదృష్టితో మనకు నిమిత్తములేదు. 'ప్రకృతి' శబ్దము దృశ్యమానజగత్తులోని చెట్లు, గుట్టలు, నదులు, తీగలు, పూలు, కోకిలలు, తుమ్మెదలుమున్నగువానికే రూఢమైపోయినది. ఆ దృష్టితోనే యీచర్చ సాగింపవలసియున్నది.

### వేదములలో ప్రకృతి :

వేదములలోని ప్రకృతివర్ణనలు చాలవరకు స్వభావోక్తిరమ్యములు. ఇవి ఎక్కువగా వస్త్వాశ్రయరీతిలో చేయబడినవే. వాతసూక్తము, నదీసూక్తము, పర్జన్యసూక్తము, ఉష స్సూక్తము, పృథివీసూక్తము మున్నగునవి ప్రకృతివర్ణనలకు సంబంధించినవే. ఈప్రకృత్యంగము లన్నిటిని వైదికఋషులు పరమాత్మతో సమన్వయింపజేసిరి. ప్రకృతిని పరమాత్మ విరాట్స్వరూప ముగా వారు భావించిరి.

"అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశస్శ్రోత్రే వాగ్వివృతాశ్చవేదాః
పద్భ్యాంభూమి రేషసర్వాంతరాత్మా."[1]

దీనిలో సర్వాంతర్యామికి అగ్నిశిరస్సుగా, చంద్రసూర్యులు నేత్రములుగా, దిశలుకర్ణములుగా, వేద ములువాక్కులుగా, భూమిపాదములుగా భావింపబడినవి. పృథివీసూక్తము మున్నగువానిలో ఆత్మా శ్రయరీతియేయున్నను కవి సుఖదుఃఖాదివిభిన్నమానసికదశలు వానిలో చిత్రింపబడలేదు.

'సానోభూమిర్విసృజతాం మాతాపుత్రాయ మే పయః'[2] (మాతయైనపృథివి నాకు పయస్సు నిచ్చుగాక). ఈ సూక్తములో పృథివికి మాతృత్వము భావనచేయబడినది.

'యాస్యాంవృక్షాః వానస్పత్యాః
ధ్రువాః తిష్ఠంతి విశ్వః
పృథివీం విశ్వధాయసం
ధృతాం అచ్ఛావదామసి.'[3]

ఇందులో పృథివి వృక్షములను, వనస్పతులను ఇచ్చునదిగా పొగడబడినది. పృథివీసూక్తములో పృథివిని దేవతగా సంభావించుటకూడ కలదు. ఈ విధముగా వేదములోని ప్రకృతివర్ణనలు ప్రాయి కముగా అద్భుతావహమైనదృష్టితో, జీవితావసరములకు ప్రకృతికిగల సంబంధమును పురస్క రించుకొని చేయబడినవే. అయినను 'అహమాదిత్యైరుతవిశ్వదేవైః' (నేనుసూర్యుడనౌదును) మున్నగు అచ్ఛమైన ఆత్మాశ్రయకవితాచ్ఛాయలును లేకపోలేదు. ప్రకృతినిజూచి తాత్త్వికచింత నములో పడిపోయిన భాగములుగూడ లేకపోలేదు.

### ప్రాచీనకావ్యములలో 'ప్రకృతి' :

ఆదికావ్యమైనరామాయణములో ప్రకృతివర్ణన సర్వతోముఖముగా భాసించినది. ప్రకృ తిని అంగిగాచేసికొని రచింపబడిన ప్రాచీనకావ్యములలో కాళిదాసు 'ఋతుసంహారము' గణనీయ.

1. బృహదారణ్యకోపనిషత్తు.
2. అధర్వవేదము : పృథివీసూక్తము.
3. అధర్వవేదము : పృథివీసూక్తము.

మైనది. అయినను ఇది కేవలము ఆయాఋతువులందలి ప్రజల శృంగారజీవితమునే ప్రధానముగా చిత్రించినది. కవి స్వానుభవభాష్యములకిందు తావులేదు. దీనిననుసరించియే అనన్య ప్రతిభాసంపత్తితో, తెలుగు ఋతువులను చిత్రించినారు విశ్వనాథవారు. కాళిదాసాదులుచేసిన ప్రకృతిచిత్రణపై వాల్మీకీయప్రభావమేయున్నది కావున దిఙ్మాత్రముగా వాల్మీకి రామాయణము లోని ప్రకృతివర్ణనల స్వభావమునుమాత్రమే పరిశీలింతము. వాల్మీకిచేసిన ప్రకృతివర్ణనల నీవిధముగా విభజింపవచ్చును.

1. ప్రకృతిని కేవలము నేపథ్యముగా వర్ణించుట:- రామాయణములోని వృక్షవర్ణన, మృగపక్షివర్ణన, సరోవరాదులవర్ణన ఇట్టివే.

2. ప్రకృతికి పాత్రలకు సంబంధము నిరూపించుట;

ఈ సంబంధము సానుభూతిగా, నిరసనగా - రెండురీతులలో భావింపబడినది. రాము దరణ్యములకు వెడలిపోవుచుండగా అయోధ్యాపట్టణబాహ్యోద్యానములు విలపించినట్లు వాల్మీకి వర్ణించినాడు.

> "ఉద్యానాని పురాభాంతి మత్తప్రముదితానిచ
> జనానాం రతిసంయోగేష్వత్యంతం గుణవంతిచ
> తాన్యేతాన్యద్యపశ్యామి నిరానందానిసర్వశః
> ప్రస్తపర్ణైరనుపథం విక్రోశద్భిరివద్రుమైః"[1]

మొదట ప్రమత్తములుగా ప్రముదితములుగానుండిన ఉద్యానములు రామునిస్థితినిగని దారిపొడుగున ఆకులురాల్చుచు తమ దుఃఖమును వెల్లడించినవట. పాత్రతో ప్రకృతి సానుభూతి చూపిన సందర్భమిది.

సానుభూతిచూపుటయేకాక ప్రకృతి కథాగతికి తోడ్పడినట్లు వర్ణించిన సందర్భములుగూడ రామాయణములోనున్నవి. సీతను రావణుడపహరించినపిమ్మట, రాముడు పర్ణశాలసమీపమున ఆమెకొరకు దీనముగా దిక్కులు చూచుచుండగా అచ్చటిలేళ్లు ఆయనకు మార్గముచూపించినట్లు వర్ణింపబడినది.

> "ఏతేమృగామహావీర్యా మామీక్షంతే ముహుర్ముహుః
> వ్యక్తుకామాఇవహిమే ఇంగితాన్యుపలక్షయే
> — — — — — ...
> దక్షిణాభిముఖాస్సర్వే దర్శయంతో నభస్థ్సలం
> మైథిలీహ్రియమాణా సా దిశంయామన్వపద్యత.

1. అయోధ్యాకాండము : 71 సర్గము : 26, 27 శ్లోకములు :

తేనమార్గేణ ధావంతో నిరీక్షంతే నరాధిపం
యేన మార్గంచ భూమించ నిరీక్షంతే స్మ తే మృగాః''[1]

ఉత్తమపాత్రలకన్యాయము జరిగినప్పుడు ప్రకృతినిరసనమును ప్రకటించినట్లు వర్ణింపబడిన సందర్భములుగూడ రామాయణములోనున్నవి. రావణుడు సీతనపహరించుకొనిపోవునప్పుడు

"నవాతి మారుతస్తత్ర నిష్ప్రభోఽభూ ద్దివాకరః''[1]

అనుశ్లోకములో రావణుడు సీతాదేవియెడల చేయుచున్న ముష్కరత్వమునకు వాయువు వీపలేదని, సూర్యుడు కాంతివిహీనుడైనాడని వర్ణించి వాల్మీకి ఈ అభిప్రాయమునే ప్రకటించెను.

3. ప్రకృతినిసంబోధించి స్వవిషయముచెప్పుకొనుట :

ప్రకృతితో ఆత్మవిషయములను చెప్పుకొనుటయన్నది రామాయణముతోనే ప్రారంభమైనది. సీతాపహరణానంతరము రామచంద్రుడు బిల్వార్జునతిలకతాళచూతాశోకాదివృక్షములను, గజవ్యాఘ్రమృగాదిజంతువులను పేరుపేరునపిలిచి తనసీత యెక్కడున్నదని ప్రశ్నించెను[3] రావణుడపహరించి తీసికొనిపోవునప్పుడు గోదావరిని, వనదేవతలను సంబోధించి సీతాదేవి తన దుఃఖమును వెల్లడించుకొనెను.

వాల్మీకిరామాయణములో ప్రకృతి యిన్నిఅంచులనుండి పరిశీలితమై వర్ణింపబడినది.

ఇక ప్రాచీనాంధ్రకావ్యములలో ప్రకృతియెడలగల దృక్పథమును సంగ్రహముగా నివేదింతును. నన్నయమొదలగు పురాణకవులు ప్రకృతిని స్వభావోక్తిరమ్యముగానే చిత్రించిరి. నన్నయ

'ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల జొంపములన్
పూచిన మంచియశోకములన్ సురపొన్నల పొన్నల గేదగులన్'[4]

అన్న ధోరణిలో వనవర్ణనము

"కమ్మని లతాంతమ్ములకుమ్మొనసివచ్చుమధు
పమ్ముల సుగీతనినదమ్ములెసగెంజూ
తమ్ముల లసత్కిసలయమ్ముల....''[5]

అన్నధోరణిలో వసంతకాలవర్ణనము చేసెను.

---

1. అరణ్యకాండము : 64 సర్గము : 15, 18, 19 శ్లోకములు.
2. అరణ్యకాండము : 52 సర్గము : 12 శ్లోకము :
3. అరణ్యకాండము : 60 సర్గము :
4. ఆంధ్రమహాభారతము : ఆదిపర్వము : 4 ఆశ్వా :
5. ,, ,, ,, 5 ఆశ్వా :

తిక్కన ఒకటిరెండుచోట్ల ప్రకృతికి పాత్రలకుగల తాదాత్మ్యమును చిత్రించెను.

'ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్న సరసి
వేడినిట్టూర్పులోయన వెడలెఁ గ్రొత్త
తావి మూతులువిచ్చు నెత్తమ్మివిరుల.'[1]

ద్రౌపది కీచకునిచేత తాడితయైనపిమ్మట చేసిన ప్రభాతవర్ణనమిది. ద్రౌపదికిజరిగిన అవమానమునకు బాధపడిన సరోవరము వేడి నిట్టూర్పులోయనగా అప్పుడే వికసించు తామరలనుండి పరిమళము వెడలినదని వర్ణించి తిక్కన ప్రకృతి పాత్రపట్ల సానుభూతిచూపినట్లు కల్పనచేసినాడు. ఈ విధమైనవి పురాణయుగమునను, ప్రబంధయుగమునను క్వాచిత్కముగానున్నవి. చర్మచక్షువునకు కన్పించు ప్రకృతిదృశ్యములనే ప్రాయికముగా పురాణకవులు వర్ణించిరి. వీరివర్ణన లెక్కువగా భాషాభావములలో స్వాభావికతను సంతరించుకొన్నవి. ప్రబంధకవులు ప్రకృతిదృశ్యములను యధాతధముగా వర్ణించిన పట్టులు కొన్నియున్నను, వారు కనిపించినప్రకృతికి కల్పనాశిల్పములను జోడించి కృత్రిమత్వమును ప్రవేశపెట్టిన ఘట్టములే కోకొల్లలు. వాల్మీకిలోని స్వాభావికత, కాళిదాసులోని భావుకత, పురాణకవులలోని సాధుత, ప్రబంధకవిత్వములోని ప్రకృతివర్ణనలలో లోపించినవి. 'వలిమలయల్లువాడు తలవాకధరించిన పూవుగుత్తి, వేల్పులగమి జీవగఱ్ఱ...... వెన్నెలల్ మొలచినపాదు',[2] వంటి స్వభావరమ్యములైన వర్ణనచేసిన కవియే నక్షత్రములను 'తెలివివెన్నెలవెండితీవలునిగిడించు చదలుకమ్మచ్చుబెజ్జము'లతో, చంద్రకిరణములను 'కెరలి చీకటిమ్రానుగెడపంగ నిక్కిన సమయగజంబుదంతంబు'లతో, చంద్రబింబమును అమరులు అమృతాంబునిధిలోని అమృతరసమును చేదుకొనుటకుపయోగించెడు 'వెండిచేరులఁబటికంపుఁ గుండ'తో ఉత్ప్రేక్షించి భావనను బహిష్కరించి కృత్రిమమైన క్లిష్టకల్పనలకు లోనైనాడు.[3] అట్లే 'సాంద్రచంద్రిక తుహినబాష్పములుగురిసె'వంటి భావనారమ్యములైన వర్ణనలుచేసిన కవి 'ఒండొండ బొండుమల్లియల దండడిందొరగు పుప్పొళ్ళనుప్పతిల్లు నెత్తావులకు వెకలులై యాడు మొకరితుమ్మెదల రొదలుగల మెఱుగుడంబురువులట్టు మిసమిసనిమెఱవ నసిమెఱుంగు మొత్తంబుల నుమిసియుమిసి'[4] అన్నరీతిలో సుదీర్ఘమైన వచనమును అనుప్రాసముల బలాత్కారముతో రచించి అర్థవ్యక్తికి దూరమైనాడు. వెన్నెలను చకోరికలారగించిన దృశ్యమును నందితిమ్మన అపూర్వమైన భావనాబలముతో, స్వాభావికతకు దూరముకానిపద్ధతిలో రచించినాడు. ఈ పద్యము ప్రబంధకవిత్వములోని వర్ణనలలో అన్నివిధములుగ కలికితురాయివంటిది.

1. ఆంధ్రమహాభారతము : విరాటపర్వము.
2. పారిజాతాపహరణము : పీఠిక.
3. పారిజాతాపహరణము : ద్వితీయాశ్వాసము : 37, 39, 40 పద్యములు.
4. మనుచరిత్ర : తృతీయాశ్వాసము : 28 పద్యము.

"విరహులమైసోకి వేడియౌవెన్నెల
పచ్చివెన్నెల నులివెచ్చఁజేసి
కలువపుప్పొళ్ళచేఁ గసటైనవెన్నెల
వలిపెవెన్నెలలోన వడియదేర్చి
చంద్రకాంతపునీటఁ జాలైనవెన్నెల
ముదురువెన్నెలజుట్టుబదనుజేసి
సతులమైపూతపిసాళించు వెన్నెలఁ
దనుపువెన్నెల రసాయనముగూర్చి
చిగురువిలుకాని జాతరజేయఁబూని
కొలముసాములనందఱఁ గూడబెట్టి
వంతగలయంగ బువ్వంపుబంతివిందు
పెట్టి, రెలమి చకోరపుఁ బేరటాండ్రు."[1]

అయినను ఇట్టివర్ణనలు ప్రబంధవాటికలో ఎక్కడోకాని లభించవు.

**నవ్యకవులదృష్టి :**

నవ్యకవులు కొంతవరకు వాల్మీకికి సన్నిహితులు. వీరు ప్రబంధకవులకామడదూరములో నుండిపోయిరి. వాల్మీకియొక్కస్వాభావికరీతితోనే వీరు తృప్తిపడక ప్రాయికముగా ప్రకృతిని స్వీయసుఖదుఃఖప్రకటనకు, ఆత్మానుభూతిసమున్మీలనమునకు ఆలంబముగాగ్రహించిరి. ప్రకృతి వీరి చర్మచక్షువునుదాటి హృదయనేత్రములో ప్రవేశించినది. అనగా కంటికికనిపించిన ప్రకృతి కాక గుండెకు స్ఫురించినప్రకృతియే వీరికివర్ణ్యమైనది. వీరు రాత్రి, చీకట్లు మున్నగువానిని వర్ణించవలసివచ్చినప్పుడు వాని బహిఃస్వరూపమునకు ప్రాధాన్యమీయలేదు. తద్దర్శనముతో వారి అనుభూతులలో కలిగిన పరిస్పందనమునకే ప్రాణప్రతిష్ఠచేసినారు. 'నల్లరాలేచాన నడిచింద'ని[2], 'కొసమొదలుగనరాని మసకచీకటిరేయి'యని[3], 'కారుమొయిళ్ళకాటుకపొగల్ వెళ్ళగక్కు తమాలవాటి'[4]యని ఊర్కొనిరేకాని

"కవిసెమటియునుఁగాకోలకాలకంఠ
కంఠకలకంఠకరిఘటాఖంజరీట
ఘనఘనాఘనసంకాశగాఢకాంతిఁ
గటికచీకటి రోదసీగహ్వరమున"[5]

---

1. పారిజాతాపహరణము : తృతీయాశ్వాసము : 49 పద్యము.
2. కోకిలమ్మపెళ్లి : విశ్వనాథ. 3. దీపావళి : వేదుల.
4. కృష్ణపక్షము : కృష్ణశాస్త్రి. 5. మనుచరిత్రము : తృతీ. ఆశ్వా. : 19 పద్యము.

అని చీకటిని వర్ణించుటకు నల్లనివస్తువులపట్టిక పేర్చలేదు. 'నీలాభ్రసరసిలో నిండుజాబిల్లి రాయంచవలె విహారము సల్పుచుండె'నని భావుకత ప్రదర్శించిరేకాని, చంద్రుడు

''— కాలభిషగ్వరుండవిరతంబై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి ఘుటికాసిద్ధౌషధంబో......''[1]

యని సందర్భముమోయలేనంత శాస్త్రజ్ఞానభారమును దించలేదు. సందర్భమునుండి విడదీసి చూపిన పద్యములు కావివి. ఆయాసందర్భములలో ఔచిత్యమును పరిశీలించి నిర్ణయించుకొన్న ఉదాహరణలు. ఈ విధముగా-ఏవోకొన్ని అపవాదములుతప్ప-ప్రబంధకవుల ప్రకృతివర్ణనలకు ఆధునికులకు ఎంతోవ్యత్యాసమున్నది. నేను పెద్దనను, నందితిమ్మనను మాత్రమే స్వీకరించుటలో ఒక ఔచిత్యమున్నది, ఈ యిరువురే ప్రబంధకవులకు భిక్షపెట్టినవారు. వీరితరువాతి కవులలో పలువురు (కృష్ణరాయలవంటివారొకరిద్దరుతప్ప) వీరిననుకరించి, 'అతనికంటె ఘను' డనిపించుకొన్నవారే. అందుకే వారినుదాహరించుట భావ్యముకాదని ఈ ప్రతినిధులనే ఎన్నుకొంటిని. ఈ కవులు వ్రాసినవి ప్రబంధములు. వానిలో క్లిష్టకల్పనలకున్న ప్రాధాన్యము స్పష్టమైన భావనాశక్తికి లేదు. అందుకే పోటీపడి వారు ప్రకృతిని సహృదయులకందకుండ గగనములో విసరివైచిరి. మననవ్యకవులు ఆ ప్రబంధక్షీరము లారగించినవారేయైనను, వీరు వానిలోని బలహీనతలను పరిహరించినారు. భావకవులలో ప్రకృతిని వర్ణనకొరకు వర్ణించలేదు, ప్రకృతి వర్ణన లష్టాదశవర్ణనలకు సంబంధించినవి. ఇవిలేనిదే ప్రబంధములకు కావ్యత్వములేదు భావకవులకు ఆ భయములేదు. కేవలము చంద్రసూర్యులనే, సుమబంభరములనే వర్ణించవలెనన్న నియమము వీరికిలేదు. 'దాక్కొని' 'దారంటఇరుక్కొని'యున్న గడ్డిపూవునుగూడ వీరు తమకావ్యమాలలో చేర్చుకొనిరి. ఇంకొకచిత్రమున్నది. వీరికి ప్రకృతిసందర్శనముతో ఊహలు రెపరెపలాడలేదు. హృదయతంత్రులు స్పందించిపోయినవి. జడప్రకృతి చైతన్యసముద్రముగా కన్పించినది. ఆ ప్రకృతి వీరికి చుంచుదువ్వుచున్నట్లో, సీత్కరించినట్లో, కిలకిలనవ్వులు కురిపించినట్లో, కణకణనిప్పులు రాల్చుచున్నట్లో అవస్థాభేదమునుబట్టి భాసించినది. ప్రకృతివారి హృదయమునకు కన్పించినట్లు వర్ణించుటలోనే భావకవులు ప్రాచీనకవులకన్న విలక్షణత్వము చూపిరి. వేదనాశీలియైన భావకవి 'చిత్తతాపంబుబాపుకో చేలగట్టకరిగికూర్చుండ'గా, 'భారంబు పంచుకొన్న ప్రాణసఖులట్లు'పైరు తలవంచుకొన్నది.[2] అట్లే దుఃఖితుడైన ఇంకొక కవికి 'దారి పోయెడు మందపవనుడు' జాలిగ నిట్టూర్చినట్లు, కోకిలము కోయని గొంతునెత్తి యేడ్చినట్లు స్ఫురించినది.[3] ఒక్క దుఃఖస్థితిలోనేకాదు. వివిధమానసికస్థితిగతులలో ప్రకృతి కవిజీవితములో భాగస్వామినియైనది. పారతంత్ర్యశృంఖలాబద్ధమై స్వజాతి జిగిచచ్చిన కాలములో భావకవులు

---

1. మనుచరిత్రము : తృతీ. ఆశ్వా. 198 పద్యము.

2. కవికోకిల గ్రంథావళి : రెండవభాగము : 3. కృష్ణపక్షము :

జన్మించినారు. వారికెటుచూచినను నిరాశానిస్పృహలు వికటాట్టహాసముచేసినట్లు కన్పించినవి. ఆత్మతృప్తికి, సత్యాన్వేషణకు ప్రకృతియే వారికిశరణ్యమైనది. ప్రకృతి వారిని దేవతా మతల్లియై చేరదీసి లాలించినది. ఒజ్జవలె దీవించినది. మిత్రమువలె ఆశ్వాసించినది. ఇక భావ కవిత్వములో ప్రకృతియొక్క విశిష్టస్థానమునుగూర్చి పరిశీలించుటకుముందు వారిపై ఇంగ్లీషు కాల్పనికకవుల ప్రభావమును చర్చింతును.

## 'కాల్పనిక' కవితాసంప్రదాయము :

ఇంగ్లీషుకాల్పనికకవిత్వములో ప్రకృతిప్రీతి, ప్రకృత్యారాధనము ప్రధానలక్షణములు. 'ఆభాస-ఐతిహాసిక'కవిత్వములోని నీరసత్వముతో విసిగిపోయిన నాటికవులకు ప్రకృతియొక ఆలంబనముగా, తోడునీడగా కన్పించినది. సమకాలీనసమాజములోని పరిస్థితులతో విసిగిపోయి పలాయనచిత్తవృత్తిలోనున్న నాటికవులకు ప్రకృతి తాపోపశమనము కలిగించినది. కవుల స్వాభిరుచులనుబట్టి ప్రకృతిలోని ఆలంబనవిభావములు పనిచేయసాగినవి.[1]

ప్రకృత్యారాధనముచేసిన కాల్పనికకవులలో వర్డ్సువర్తు అగ్రగణ్యుడు. ప్రకృతిని తారతమ్యదృష్టితోకాక తాదాత్మ్యదృష్టితో పరిశీలించవలెనని ఇతడభిప్రాయపడెను.

'One impulse from a vernal wood
Will teach you more of man,
Of moral evil and of good
Than all the sages can'

అని ఈ కవి ఋషులకన్న ప్రకృతియిచ్చెడిపాఠము గొప్పదని భావించెను.

18 వ శతాబ్దిలో ఇంగ్లీషుప్రజలు నగరములందే క్రిక్కిరిసిపోయిరి. హత్యలకు సంబంధించిన నవలలుతప్ప వారికానాడు ప్రీతికలిగించు సాహిత్యము కొరవడినది. ఆ స్థితిలో వర్డ్సువర్తు గొంతు ఇట్లు వినిపించినది.

'The stirring accident is not my trade;
To freeze the blood I have no ready arts.
It is my delight alone in summer shade
To pipe a simple song for thinking hearts.'

ఉద్రేకములనుడుకెత్తించు వస్తువును తీసికొని కావ్యములల్లుట తనపనికాదని, నెత్తురును గడ్డకట్టించెడు భయానకగాధలల్లుశక్తి తనకులేదని, ఆమనినీడలో కూర్చుండి రసాత్మలకు సరళసంగీత మందించుటలోనే తనకానందమున్నదని వర్డ్సువర్తు వక్కాణించెను. ఇది ఆనాటి కావ్యవస్తువుల

---

1. 'Romanticism harped on man rather than men.'
—Dr. P. Guha Thakurta in his essay 'Nature cult in Romantic poetry'
—Triveni. sept. 1927.

మీద వర్డ్సువర్తుచేసిన తిరుగుబాటు. ఈ విధమైన తిరుగుబాటుతో ఆయన ప్రకృతినాశ్రయించెను. అతనికి గులాబిపువ్వు, Daffodil మున్నగునవి మానవునికి ప్రకృతియొసగెడు మహితసందేశ వాహికలుగా కన్పించినవి. గుట్టలు, పుట్టలు, చెట్లుచేమలు, ప్రకృతిమహాశక్తిరూపాంతరములుగా భాసించినవి, సూర్యోదయమాతనికి కేవలము వర్ణసమ్మేళనముగాకాక Spiritual Consecration (ఆధ్యాత్మిక సమర్పణము)గా భాసించినది. 'Tintern Abbey' అను దీర్ఘగీతముతో అతని ప్రకృతికవిత్వమునకంతటికి సమగ్రలక్షణములున్నవి. ప్రధానముగా ఈ గీతము నాశ్రయించుకొని అతని ప్రకృతికనిత్వములోని వివిధాంగములను పరిశీలింతును.

'టింటర్న్ఆబీ' అనునది ఒకచర్చిపేరు. కవి మొదట దీని పరిసరములనుజూచి, అయిదేండ్లతర్వాత తిరిగివచ్చి అయిదేండ్లకాలములో తనకుకలిగిన పరిణామములను నివేదించుకొనును.

(i) *ప్రకృతి : భౌతికానందము :*

ప్రకృతినిజూచి భౌతికమైన ఆనందమునుపొందుట ఈ కవిత్వములో ప్రాథమికగుణము-ఇది భారతీయకవిత్వములోనున్నదే.

'— I have owed to them
In hours of weariness sensation sweet,
Felt in the blood and felt along the heart,' —Tintern Abbey.

ప్రకృతిసందర్శనముతో తనలో కలిగిన మధురానుభూతి యీ చరణములలో వ్యక్తమైనది.

(ii) *ప్రకృతి : అంతర్ముఖత్వము :*

మొదట ప్రకృతిని తిలకించి భౌతికానందముపొంది, తరువాత ఆత్మికమైన ఆనందసమాధిలోనికి ప్రవేశించుట దీనిలక్షణము. దీనికుదాహరణము Tintern Abbe యలోనే కలదు.

"———that blessed mood
In which the burden of the mystery
In which the heavy and the weary weight
Of all this unintelligble world
Is lightened--
The breath of this corporeal frame
And even the motion of our human blood
Almost suspended, we are laid asleep
In body and become a living soul
We see into the life of things."

జటిలాతిజటిలములైన జీవితసమస్యలను అర్థముచేసికొనగల మనఃస్థితి, శరీరములో రక్తప్రసారమాగిపోయి ఆత్మమేల్కొని ప్రపంచరహస్యములను పరిశోధించుటకు పూనుకొనుస్థితి, ప్రకృత్యారాధనమువలన కలుగునని దీనిసారాంశము. ఇది ఆత్మానందదశ.

(iii) ప్రకృతి : తాదాత్మ్యము :

ఈ లక్షణము వర్డ్సువర్తుకన్న షెల్లీరచనలలో అధికముగా కనిపించును. ఇతడు వ్రాసిన 'The cloud', 'To The Skylark'అను గేయములు ఈ లక్షణమును సమగ్రముగా

(vi) ప్రకృతి : పారమార్థికత :

ఈశ్వరశక్తిని దర్శించుటకు ప్రకృతి దర్పణముగా భావించుట దీనిలక్షణము.

".........And I have felt
A presence that disturbs me with the joy
Of elevated thoughts; a sense sublime
Of something for more deeply interfused,
Whose dwelling is the light of setting suns,
And the round ocean and the living air,
And the blue sky and in the mind of man."

ఈ చరణములలో-ప్రకృతిలో ఉన్నతభావములవలన పారవశ్యమును ప్రసాదించు ఒక దివ్య మూర్తిని తానుదర్శించినానని, ఆ మూర్తి ప్రకృతిలో అంతర్లీనమైయున్నదని, అది అస్తమించెడి సూర్యునివెలుగులో, సాగరములలో, సమీరములో, నీలాకాశములో, మానవహృదయములో అధివసించుశక్తియని వర్డ్సువర్తు భావించినాడు పరమాత్ముడు సర్వాంతర్యామియను భావమే దీనిలో ధ్వనించుచున్నది.

(v) ప్రకృతి : బాల్యప్రకృతి :

ఆదిమానవునిలోని అమాయకత్వము, నాగరికతముదిరిన మానవునిలోలేదు. అట్లే పసితనములోని నైర్మల్యము పండువయసులో ఉండదు. మానవుడు పెరుగుచున్నకొలది హృదయము బండబారి బుద్ధి సంకీర్ణమై దివ్యధామమునకు దూరమగుచుండును. కావున పరిణతమానవుడెంత ప్రయత్నించినను శారీరకముగా మరల బాల్యమును పొందలేకున్నను, స్మరణమాత్రము చేతనైనను తానుకోల్పోయిన శైశవప్రకృతిని, అమాయికతాప్రవృత్తిని తిరిగి పొందగల్గునని వర్డ్సువర్తు 'Ode on the Intimation of Immortality' అను గేయములో ప్రతిపాదించెను. బాల్యస్మృతిచిత్రణము కాల్పనికకవిత్వలక్షణములలో నొకటి. ఈ లక్షణమచ్చముగా ప్రకృతి కవిత్వపరిధిలోనిదే. వర్డ్సువర్తు రచించిన ఈ Ode ప్రభావము రవీంద్రుడు వ్రాసిన

"On the sea-Shore of endless worlds children meet. The infinite sky is motionless over head and the rest-less water is boisterous"[1]

అనుగేయముపై స్ఫుటముగా కన్పించుచున్నది. పై పంక్తులు వర్డ్సువర్తుగేయములోని

1. 'The Crescent Moon: 'On the Sea shore';

"And see the children sport upon the shore
And hear the mighty waters rolling ever more"

అను పంక్తులకు ప్రతిధ్వనులుకావా ?

ఇంకొకగేయములోగూడ వర్డ్సువర్తు మానవుడు పెరిగినకొలది జీవితపుచెరసాలతలుపుల చీకటినీడలు శిశువులను ముసురుకొనునని అభిప్రాయపడినాడు. శైశవదశను కీర్తించినవారిలో ఈతనితోపాటు బ్లేకు ముఖ్యుడు. ఇతడు Songs of Innocence అనుపేర రచించినగేయములు బాల్యమును మిన్నులకెత్తినవే.

ఈ లక్షణములేకాక ప్రకృతిలో Romantic Melancholy (కాల్పనికవిషాదప్రవృత్తి)ని చూచుట, Pantheistic feeling (ప్రకృత్యారాధనతత్త్వము)ను ప్రదర్శించుటకూడ కలదు. Pantheistic feeling అనగా మానవుని ఆత్మకన్న మహత్తరమైనఆత్మ ప్రకృతిలోని ప్రత్యంగములో నున్నదని భావించుట. ప్రకృతిని అర్థముచేసికొనుటయనగా పరమార్థమును సాధించుటయే యని వీరభిప్రాయపడిరి. దీనినే టెన్నిసను ఇట్లనెను.

"Little flower—if I could understand
What you are, root and all, and, all in all,
I should know what God and man is."

కాల్పనికకవులు ప్రకృతినెన్నివిధములుగా భావించి చిత్రించిరో వివరించితిని. భావకవుల ప్రకృతికవిత్వముపై ఆంగ్లకాల్పనికకవుల ప్రభావము విశేషముగా పడినది. ప్రకృతిని ఆత్మాశ్రయరీతిలో చిత్రించుట కాల్పనికకవులనుండి నేర్చుకొన్నదే. రామాయణములో అచ్చటచ్చట-భారతము, మనుచరిత్రమున్నగు ప్రాచీనకావ్యములలో ఒకటి రెండుచోట్ల-ప్రకృతికి పాత్రలకుగలసంబంధము నిరూపింపబడినను, కవిఅనుభూతులకును ప్రకృతికినిగల అనుబంధము చిత్రింపబడలేదు. మనుచరిత్రలో ప్రవరుడు వరూధినిని త్రోసిపుచ్చినపిమ్మట పెద్దనచేసిన సూర్యాస్తమయవర్ణనలో[1] తరుణియెడల ప్రవరాఖ్యుడుచేసిన తిరస్కారచేష్టకు కినిసి సూర్యు డెఱ్ఱబడినాడోయేమోయని కలదు. ఇక్కడ కవి బయటపడినాడని కొందరు వ్యాఖ్యానించిరి. పెద్దన వరూధినిపక్షము వహించినాడనిరి. అదిసరియేకాని దీనిని పాత్రపట్ల ప్రకృతిచూపిన సానుభూతి యని యేలఅనుకొనగూడదు ? అస్తమయసూర్యునిఅరుణిమను కోపమునకుమాత్రమే సంజ్ఞగా చేసికొనుటకు వీలున్నది. ఆ ధర్మమును దృష్టిలోపెట్టుకొనియే కవి ఈ యుత్ప్రేక్షచేసినాడు. అంతకుమించిన పక్షపాతప్రసక్తిలేదిక్కడ. ఈ విధమైన ప్రకృతిపాత్రల తాదాత్మ్యమెక్కడో

1. "తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుడై
యరిగె మహీసురాధముడహంకృతితోనని రోషభీషణ
స్ఫురణ వహించెనోయన నభోమణిదాల్చె కషాయదీధితిన్." —మనుచరిత్ర. తృతీ. ఆశ్వా.

తప్ప కన్పించదు. మిగిలిన ప్రకృతివర్ణనలన్నియు కవిసమయముల మూసలలో పోసితీసినవే. వానిని కత్తిరించివేసినను కథకు లోపములేదు; కావ్యసౌందర్యము తరిగిపోదు.

### భావకవిత్వములో ప్రకృతి :

భావకవిత్వములో ప్రకృతిని స్వాభావికముగావర్ణించిన సందర్భములింతవరకే పేర్కొంటిని. అది అంతవిలక్షణమైనదికాదు. వర్ణ్యవస్తువున్నగు కాల్పనికకృతులవలె ప్రకృతితో సుఖ దుఃఖములు నివేదించుకొనుట, ప్రకృతిలో ఆత్మాంశను సందర్శించుట, ప్రకృతిని మాతృమూర్తిగా, దేవతగా గ్రహించుట, ప్రకృతిదర్శనముతో అంతర్ముఖులై పోవుట మున్నగు లక్షణములు భావ కవిత్వములో కన్పించుచున్నవి. వానిని వివరించి చూపుదును.

భావకవికి ప్రకృతియే కవితారచనకు ప్రేరకమైనది. అందుకే అతడు భావనాబలమున్నది ప్రకృతియున్నదిష్టముండిన పదములకేమి కొఱతయని చాటినాడు.[1] ప్రకృతియే అనేకరూపము లలో ప్రత్యక్షమై అతనిలోని కవితాశక్తి నావిష్కరించినది.

> "రమణనొకసారి నీలాంబరంబుదాల్చి
> చెలగియొకసారి వెన్నెలచీరదాల్చి
> పొసగనొకసారి మంచుమేల్ముసుగుదాల్చి
> లీలనొకసారి మేఘమాలికనుదాల్చి
> — — — — —
> గడియకొకరీతిగా నలంకారసరణి
> నెఱపుచున్నది ప్రకృతి నీనికటమందు."[2]

ప్రకృతిలోని ఆకాశము, వెన్నెల, హిమతుషారము, మేఘమాలికలు కవితావిష్కృతికి హేతువు లగుచున్నవని భావకవి అభిప్రాయము. 'పూవులమెత్తదనమును, తేనెలతియ్యదనమును, తుమ్మె దలకమ్మదనమును, వెన్నెలచల్లదనమును, చుక్కలచక్కదనమును వెలయించి ప్రకృతి హృద యము పులకింపజేయవలెనని"[3] భావకవి ఆశయము.

'చూతపల్లవఖాదిని పికాంగనాగాననిస్వనము', 'కుందనపుదళుక్కు', 'కలువపూరేకు పొత్త ముల మెత్తదనము', 'మలయపర్వత సానువులనుండి దిగుమతియగు కమ్మతెమ్మెరలు', 'వెన్నెల తేటనిగ్గు', 'పచ్చకప్పురపుదావి', 'పటీరజలము', పూవుదేనె', మున్నగుచిరంతన ప్రకృత్యంగ ములనే గ్రహించి భావకవి వానికి క్రొత్తమెరుగులు దిద్దుకొన్నాడు.[4]

1. 2. 'కవిగీతము', 'ప్రకృతి' : కావ్యకుసుమావళి : వెంకటపార్వతీశ్వరకవులు :
3. నా తొలిరచన : (ఆకాశవాణి ప్రసంగము) : వెంకటపార్వతీశ్వరకవులు : 1942.
4. తొలకరి : పింగళి : కాటూరి.

భావకవి తనకు కవితాప్రేరకమైన ప్రకృతిని మనసార ప్రేమించును. 'ప్రకృతిపురుషులభేదములు. దేవునిబూజించుమనుటెంతయో, చెట్టునుప్రేమింపుమనుటయందును అంతవిలువకల' దని భావకవి స్పష్టపరిచినాడు.[1] అందుకే అతడు మల్లెలను, మొల్లలనేకాక 'దారంట గడ్డినిరుగ్గాని'యున్న పూలనుగూడ ప్రేమించినాడు. ఆ పువ్వులు కవిని

'ఒక్కడ నడుస్తూవుంటే
చుక్కలు పొడుస్తూవుంటే
మక్కువ గూర్చోమంటాయి''.[2]

అవి యంతటి సుకుమారహృదయములుగలవికావున భావకవి వానినంతగా ప్రేమించినాడు. గడ్డిపూలనుజూచినప్పుడుకూడ వాని 'జీవమునకుసాటియే'దని అతనికనిపించును.[3] తాను పెంచినతీగ పెల్లగింపబడినప్పు డెంతో నిర్వేదమును ప్రకటించును.[4] వానకురిసి వెలిసినపిమ్మట ఆకుమళ్ళలో తడిసి వింతచెలువమునువాల్చెడు గడ్డిపూలనుజూచి ఆనందపరవశుడగును.[5] చివరకు పూలను ద్రుంచుటసైతము భావకవి సహింపలేడు.

''కన్నులవిందుసేయు సుమకాండముద్రుంచి విచిత్రశోభలన్
జెన్నొలకించు నీ ప్రకృతిచిత్తము నెత్తురులొల్కఁజేయ నే
నెన్నడుబూన; లేఁబొడుపుటెండలు సోకినఁ బుల్కరించుపూఁ
బిన్నల హత్యచేయఁదలపెట్టుట క్రూరము నన్నుబోటికిన్.[6]

భావకవి ప్రకృతిని మానవులకన్నమిన్నయని భావించినాడు. వర్డ్సువర్తుమున్నగువారు ఇట్లే భావించిరి. ఆ విషయమింతవరకే మనవిచేసితిని.

1. వివిధకుసుమావళి (కావ్యసంపుటి) : కవికొండలవారి పీఠిక.
2. దాక్కుని వుంటాయి : కవికొండలగేయము : 'విశాలవిశ్వము' లో
3. 4. 5. వివిధకుసుమావళిలో : 'శాద్వలసుమము', 'తీవ', 'వర్షానంతరము'
6. కుసుమాశ్రువులు : (ఖండకావ్యసంపుటి) : దువ్వూరి.

ఈ పద్యములు 1918–21 మధ్యకాలమున రచింపబడినవి. కరుణశ్రీగారి 'పుష్పవిలాపము' వీని తరువాతి రచనకావున అది వీని ప్రభావముగలదే యనవలెను. ఈ పద్యము అభిజ్ఞానశాకుంతలములోని క్రింది శ్లోకమును స్మరింపజేయుచున్నది.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా
నా దత్తే ప్రియమండనాపిభవతాం స్నేహేన యా పల్లవమ్
అద్యేవః కుసుమప్రసూతిసమయే యస్యాభవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్'' —చతుర్థాంకము.

శకుంతల అలంకారప్రియయైనప్పటికిని చిగుళ్ళనుకోసెడిది కాదను అభిప్రాయము ఇందులో గమనింపదగినది.

'గిరులకొమ్ముల నడవుల తిరుగుచుండి
కోకిలమ ! యెంతమృదువుగ కూయుచుంటి !
నాగరకలోకములయందు నడచుచుండి
ఎట్లు పలుకుచునుంటిమో యేముచూడు.'[1]

ఈ పద్యములో మనుజుల మాటలకన్న కోకిల కూజితములు మహితములని ధ్వనించు చున్నది. కొండసెలయేళ్ళనీటిని గతికి నిర్మాయియైనహరిణము, 'వగరువెన్నెలచివళ్ళు' పంట నొక్కి రససిద్ధినందినచకోరము, 'వ్యవహారకుశలు'గు, 'శుష్కజీవనులు'నగు మానవులకన్న గొప్పవని భావకవి అభిప్రాయపడినాడు.

ఈ ప్రకృత్యాధిక్యమే భావకవిని వినమ్రునిగాజేసినది. సౌరభమును జిమ్ము పుష్పవ్రజము చంద్రికలను వెదజల్లు చందమామ, 'మావిగున్నకొమ్మను మాధుమాసవేళ' పాడు కోయిల స్వార్థ రాహిత్యము, పరోపకారదృష్టి భావకవిని ముగ్ధునిగానొనర్చినవి.[2] అందుకే అతగు ప్రకృతిని ఆనంద హేతువుగ భావించి దానిని సమీపింపగోరినాడు. 'హేమమణిరత్నగణము'ను విసర్జించి, 'తారకాశోభితాంబరతలము'క్రింద విహరించనిచ్ఛగించినాడు.[3] 'ముత్తియంపుసరముల'నుపదలి 'సెలలతరగలనురువులవెలుపు' చూడనెంచినాడు.[4] 'సందెవేళ, పొలముగట్టు, చల్లగాలి' అత నిలో అపూర్వభావోదయమును కలిగించినవి.[5] 'పొడుపుమలపయి బంగరుముగ్గులుంచి సంజ మబ్బులకుంగరాల్ సంతరించిపోవు' సూర్యుడు అతనికి మిత్రుడుగా భాసించినాడు.[6]

కవికి ప్రకృతి యెప్పుడానందకందముగా భాసించినదో, అప్పుడే చీకుచింతలన్నిమరచి దానిలో లీనమగుటకు కాంక్షించెను. 'ఆకులో ఆకునై, పూవులో పూవునై కొమ్మలో కొమ్మనై ఈ యడవిదాగిపోనా'యని అతడు తహతహపడెను.[7]

"పగడాలచిగురాకు తెరచాటుతేటినై
పరువంపువిరిచేడె చిన్నారిసిగ్గునై"[8]

అడవిలో దాగిపోవలెనని ఉత్కంఠచూపెను. తాను 'కలవిహంగమపక్షములతేలియాడు'దునని, 'తారకామణులతో తారనై మెరియు'దునని, 'మొయిలుదోనెలలోన పయనం' బొనర్చెదనని,కడకు 'పొడుచుచిన్కునైపడిపోదు'నని ఎలుగెత్తిచాటెను.[9] ఇట్లుచేయగా ఎవ్వరైన నవ్వుకొన్నచో 'నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు'అని లోకమును విదల్చివేసెను. తాను ప్రకృతిలో లీనమగుటకు కాంక్షించుటయేకాక ఒక్కొక్కసారి ప్రకృతిగా తానెందుకు జన్మించలేదేయని వాపోవును.

---

1. 'పశ్య' : విశ్వనాథ : ప్రతిభ 1936 ఆగస్టు.
2. 'ఏల ప్రేమింతును' : కృష్ణపక్షము.
3. 4. 'దివ్యభాగ్యము', 5. 'అతనిపాట' : కృష్ణపక్షమునుండి.
6. 'లోకము', 7. 'మొదటిరచన', 8. 9 : స్వేచ్ఛాగానము 2 : కృష్ణపక్షమునుండి.

"సాంద్ర
గిరితటవిహారశృంగారకేళి సొలసి
రమణఁ జరియించు జలధరార్భకునిగాగ
నేల సృజియింపడో నన్ను నీశ్వరుండు"[1]

అని తనమనోరథమును వెల్లడించుకొనును. అట్లే 'తుహినాంబుకళిక'గా, 'మలయూటకాల్వ'గా, 'కలువ'గా, 'చుక్క'గా ఈశ్వరుడు తన్నెందుకు సృష్టించలేదని బాధపడును.

భావకవి ప్రకృతిని ప్రణయమునకుద్దీపనముగా గ్రహించినాడు. 'ప్రేయసి లేచిరమ్ము చివురించినమావులక్రింద'యని,[2] 'చెలియా వెన్నెలబైట మంచుతడిఁబూచీపూవకున్నట్టి పువ్వుల నెత్తావులు' మోచెడు 'ఉద్యానకోమలమందానిలపోతముల్ మనల సన్మానింపగా' సుఖింతము రమ్మని, ప్రకృతిని ప్రణయోద్దీపనసాధనముగా భావించినాడు.[3] ప్రకృతిని ప్రణయోద్దీపకముగా భావించుట మనకు క్రొత్తకాదు. శృంగారరసముయొక్క ఉద్దీపనవిభావములలో మనలాక్షణికులు చంద్రికామలయానిలాదులను చేర్చినవిషయము ప్రసిద్ధమే. భావకవి ఇంతటితోనే ఆగిపోలేదు. తనప్రణయినినుద్దేశించి 'మనము చకోరదంపతులమై తెలివెన్నెలతీవెగుంపులో చనిచని తారకా కుసుమసౌరభవాహినిదోగి కోసితెచ్చినవిరుల' నలంకరించుకొందమని యనును.[4] భావకవికి తేనెలు, మంచుబొట్లు కలిసిపోగా 'ప్రణయశృంగారము' స్ఫురించినది.

"చికిలిపూదేనెలకు తుషారకణములకు
నేమి సంబంధబాంధవ్య మీశరత్తు
ప్రాతవేళావికాసిపుష్పములకొనల
కలసికొన్నవి ప్రణయశృంగారమొలయ."[5]

పూదేనెలు, తుషారకణములు కలసిపోవుటలో శృంగారమున్నదని భావించుటయందు ప్రణయకవి స్వానుభవము ద్యోతకమగుచున్నది. అనగా వానినిచూడగా అతనిప్రణయభావన ఉద్దీపించిన దని అర్థము.

భావకవికి ప్రకృతి ప్రణయోద్దీపనముతోపాటు, తాపోపశమనమునకుగూడ ఉపస్కారకమైనది. అతని ఆశలు మోడువారినపుడు సంధ్యాసమీరునితో తననెచ్చటికైన ఎత్తుకొనిపొమ్మని ప్రార్థించును.[6] తనను 'సంజమబ్బులపవడాలదాయలందొ, తరణి బంగారుకిరణాల మెఱుగులందొ' లీనమొనరించుమని వేడుకొనును.[7] దుఃఖాక్రుసంతప్తుడై చంద్రునిజూచి 'వెన్నెలల

1. 'కవిమనోరథము': దువ్వూరి ఖండకావ్యములు.
2. ఉషాగానము : అబ్బూరి.
3. ప్రణయాహ్వానము : దువ్వూరి ఖండకావ్యములు.
4. 5. సౌభద్రునిప్రణయయాత్ర: 'ప్రణయాహ్వానము'. 'అవధి'.
6. 7. కృష్ణపక్షము :

వెల్లువఁ జక్కఁదనాలహంసవై యరిగెడునిన్నుఁజూచి నిశలందున నాకగుబాష్పశాంతి'యని కృతజ్ఞతాభారముతో వంగిపోవును.[1] 'సుందరతరచంద్రికాపులకితమ్మగునింతటి తీయనైన రాతిరి తెలవారిపోవక యిదేగతి నాకయి నిల్వరాదొకో'యని యాచించును.[2] ఈ విధముగా దుఃఖోపశమనమునకు భావకవి ప్రకృతినే ఆశ్రయించును.

ప్రకృతికంతటిశక్తియున్నదని గ్రహించినాడు కావుననే భావకవి దానినొజ్జగా గ్రహించినాడు. ప్రకృతి అతనికి హృదయపుస్తకపుటలనువిప్పి కన్పించినది. అప్పుడాతడు 'వేగుజామున వికసించు విరులయందు' 'ప్రకృతిసామ్రాజ్యపాలనాపద్ధతులను', సాగరసంగీతములో 'విశ్వసృష్టిప్రకారముల'ను నేర్చుకొన్నాడు.[3]

'శ్యామలాకాశఫలకమునందుఁ దరళ
కాంతివెదజల్లు తారకాక్షరములొనర
విశ్వవైశాల్యబోధకవిద్యనేర్తు
శర్వరీగర్భశాంతి యొజ్జగవిధింప'[4]

అని స్పష్టముగా ప్రకృతి తన ఉపాధ్యాయినియని వెల్లడించినాడు.

'శైశవస్మృతి' ప్రకృతికవిత్వములో చేరునంటిని. వర్డ్సువర్తువలెనే తెలుగుభావకవి 'శైశవ' స్మృతికిసంబంధించిన గీతము లాలపించినాడు. 'శైశవస్మృతి'ని'ఇహస్వర్గానుభూతి'గా భావించినాడు.[5] వానమబ్బులనుజూడగానే కవికి శైశవము తళుక్కున స్ఫురించినది. అతని పసినాటి తలపులు ముసురుకొన్నవి, 'అట్టిశైశవమిప్పుడలరునేనాకు'అని, మబ్బులుమాత్రము 'పసినాటి చిన్నారిప్రాయంబువిడక యనుదిన'నవ్యముగా అలరుచున్నవని, వానినిజూచినప్పుడు తాను తన వయస్సును మరచిపోయి, వానచిన్కులలో నాడవలతునని, కాని లోకము 'ఆడికలకు' భయపడి ఇంటిలోనే బందీయైయున్నానని తనవేదనను వ్యక్తీకరించెను.[6] దీనిపై వర్డ్సువర్తు, బ్లేకు రచించిన శైశవసంబంధిగీతముల ప్రభావమున్నది. తాత్కాలికముగా భావకవినావరించిన నిర్వేదతపస్సు అతనిలో శైశవస్మృతులను పెకల్చినది. ఇప్పటిజీవితము 'దుఃఖతుంగతరంగదోదూయమాన'మగుచున్నదని, శైశవము దానికి కూలమువలెనుండెడిదని, దానినిదాటి జీవితసముద్రమధ్యమున జిక్కుకొన్నానని కవి వాపోవును. 'పసిపాప' చిరునవ్వులు దుఃఖతాపనివారకములని ఇట్లు భావించును.

''ముత్తెములగ్రుమ్మరించు నీముద్దునగవు
ఘోరసంసారదుఃఖనివారకంబు

1. 2. దీపావళి : ''సుధాకరా'.
3. 4. 5. దువ్వూరి ఖండకావ్యములు.
6. శైశవస్మృతి : దువ్వూరి ఖండకావ్యములు.

అకలుషము తావకీనదృగంచలార్చి
కష్టతమసవిపాటనకారణంబు."[1]

ఈ రకమైనరచనలు తెలుగులో ఎక్కువగాలేవు. నాళం కృష్ణారావుగారు బాలురకుసంబంధించిన పద్యము లనేకము రచించిరి. అంతేకాని బాల్యస్మృతులను రేకెత్తించునవి కావివి.[2] ఈ బాల్య స్మరణమునకు ప్రకృతియే ప్రధానహేతువు.

భావకవి ప్రకృతిని తాత్త్వికచింతనమునకు ఉపస్కారకముగాగూడ గ్రహించినాడు. వర్డ్సువర్తు ప్రకృతిదర్శనముతో ఎట్లు అంతర్ముఖుడయ్యెనో ఇంతవరకే వివరించితిని. భారతీయ కాల్పనికకవులలో అగ్రేసరుడగు రవీంద్రుడుగూడ ప్రకృతినుండి తాత్త్వికభాష్యములు గ్రహించెను. "Nature looked at my face with the profound calm and tender melancholy of a mother gazing at her ailing son"[3] అని రవీంద్రుడు 'ఛిన్నపత్ర' అనుగేయములో ప్రకటించెను. ప్రకృతిదర్శనముతో ఆతనిలోగలిగిన తాత్త్వికదృష్టి ఈ గేయమున వ్యక్తమైనది. తెలుగుకవికూడ 'గటిక'వంటి సామాన్యపదార్థమునుజూచి అంతర్ముఖుడై ఇట్లు గానము చేసినాడు.

"ఏను నీవైతినో యెవరికిం దెలియు
మున్నుగతించిన పుట్టువులందు!
ఈవు నేనౌదునో యెవరెఱుంగుదురు
రాబోవుజన్మాల రాకపోకలకు:
గుసగుసచెప్పెదు; గునిసియాడెదవు
నీలోన వెలిగెడు నిర్మలజ్యోతి
వెలికొత్తఁ బోరాటపెట్టుచున్నదియె."[4]

గటికనుజూచి పూర్వజన్మానుబంధమును స్మరించుట, దానిలో నిర్మలజ్యోతి వెలుగుచున్నదని భావించుట కవిలోనితాత్త్వికదృక్పథమునకు తార్కాణలు. అట్లే 'పొగవన్నె మబ్బుపై నెగిరెడు కొంగబారు' కవి భావవీథిలో 'భౌతికరూపబంధంబులెడసి పుణ్యలోకముఁజేరు ముక్తాత్మలుగా' దోచినది.[5] ప్రకృతిదర్శనమువలనకలుగు తాత్త్వికచింతనకిది చక్కనినిదర్శనము. 'చుక్క'

1. రత్నాపణం: 'పసిపాప': పెనుమర్తివెంకటరత్నం.
2. దాశరథిగారి 'బాల్యము' అను గేయము ఈ శాఖకుచెందిన రసవత్ప్రసూనము. కాని అది 1950 తర్వాతిదగుటవలన ప్రస్తుతము వక్తవ్యముకాదు.
3. ఇది ప్రియరంజనసేనచేసిన ఆంగ్లానువాదము: 'Modern Review' 1935 మే.
4. 5. దువ్వూరిఖండకావ్యములు: 'గటిక', 'వానకాలపు పరిచేలు.'

లను జూచినప్పుడుకూడ అతనికి తాత్త్వికజిజ్ఞాస కలిగినది.[1] వాని పుట్టుచందమును కనుగొన వలెనను కాంక్ష ఏర్పడినది. వానిని మునిభర్గులుగా, బ్రహ్మాస్త్రసగ్యంత్రితమతులుగా, అగ్నిమయము లగు ధేనువులుగా, పతిచితినెక్కిన తరుణీరత్నములుగా, పతిశీలలైన భారతీయవితంతువులుగా, ఉత్తమసత్రమాట్టులుగా, దేశభక్తులుగా, సుకవులుగా పరిపరివిధములుగా భావించుకొని చివరకు

"కాలెడిపొట్టతో విరతిగాననిచింతలలో విశీర్ణమై
సోలెడిమేనితో బడుగుఁజూపులతో నిజరక్తమాంస కం
కాళము లర్థమత్తులకుఁగా నిచటన్ బలివెట్టిరెవ్వరా
మాలలుమాదిగల్ గగనమంటపమెక్కిరె యిట్లు చుక్కలై"[2]

అని కవి అంతర్ముఖుడై ప్రశ్నించుకొన్నాడు. ప్రకృతిదర్శనముతో కవికిన్ని తాత్త్వికవిచార ములు తట్టినవి. చిత్రమేమనగా ఈ సందేహములలో కవియనుకొన్న యేసమాధానమైనను సమంజసమే. భావకవికి వేగుచుక్కను చూచినప్పుడుగూడ తాత్త్వికచింతనము కలిగిన సంద ర్భములున్నవి. ఆ చుక్క 'విశ్వమోహనరూపవిజ్ఞానకళల మెఱయించి జీవులమేలుకొల్పు' నదిగా భాసించినది.[3]

ఇక భావకవికి ప్రకృతి 'తల్లిగా, దేవతామతల్లిగా' భావించినవిషయము మిగిలినది. రాయప్రోలువారినిగూర్చి వ్రాసినప్పు డీవిషయమును వివరముగా పేర్కొంటిని. పునరుక్తియగు నని మరలవివరించుటలేదు. ఈ విధముగా భావకవికి ప్రకృతి పలురీతుల భాసించి అతనిలో అనే కానుభూతులను రేకెత్తించినది. అతడును తనకుగల విభిన్నమానసికప్రవృత్తులను ప్రకృతిలో సమన్వయించికొని సంతృప్తుడైనాడు, ప్రకృతిపురుషుల కనాదిగానున్న విచిత్రసంబంధమును భావకవి తన రచనలద్వారా వ్యక్తపరిచినాడు. ఇకపల్లీజీవనమునుగూర్చి, పల్లీయప్రకృతినిగూర్చి చర్చింతును.

### పల్లీజీవనచిత్రణము :

### 1. పల్లీయ ప్రకృతి :

మన ప్రాచీనకావ్యములలో వనవర్ణనల సందర్భమున కొంత ప్రకృతికవిత్వమున్నది. కాని పల్లీయప్రకృతిచిత్రణము క్వాచిత్కము. హంసవింశతి, శుకసప్తతిమొదలైన కథాకావ్యము లలో వివిధవృత్తులకు వర్ణనలకు సంబంధించిన వివరములు, పల్లీయుల ఆచారవ్యవహారములు, వారి ఆహారవిహారాదులను గూర్చిన వివరములున్నవేకాని, వారి అమాయికమనస్సులలోని నిర్మలప్రవృత్తులను చిత్రించుప్రయత్నము జరుగలేదు. అట్లే పల్లెటూళ్ళలోని పైరుపచ్చలను, చెట్లుచేమలను, గోవులను, గొఱ్ఱెకదుపులను, ప్రకృతిదృశ్యములను వర్ణించు ప్రయత్నముగూడ

1. 2. పతితపంట : 'చుక్కలు' : తుమ్మల.
3. కావ్యకుసుమావళి : (తృతీ. భాగ.) ప్రథమ సంపుటి : వెంకటపార్వతీశ్వరులు.

జరుగలేదు. కృష్ణరాయలు ఆముక్తమాల్యదలో విల్లిబుత్తూరివర్ణనసందర్భమున వరిమళ్ళను, వానిలో నిద్రించు ఖాతువులను, ఊరిబయటి పురాతనతీర్థకుండములను, వానిలో కొళకొళమను నీరు కోళ్ళనువర్ణించి తెలుగులో పల్లీయప్రకృతిచిత్రణకు పాదులువేసెను. అయినను ఇట్టివి స్వల్పము గానే సాగినవి. ఆధునికకవిత్వములోనే పల్లీయప్రకృతికి అంగిత్వభాగ్యము కలిగినది. విశ్వనాథవారి 'ఋతుసంహారము' ఋతువులనుగూర్చిన వారి భావనాశక్తికి నిలువుటద్దమువంటిది. ఆయాఋతువులలో పల్లెపట్టులలోని బహిఃప్రకృతిలో, ప్రజలజీవితరంగములో జరుగు మార్పులను వివరముగా చిత్రించినకావ్యమిది. గ్రీష్మములో వీరు వర్ణించిన 'నలిగిపోయినపురికొసవలె స్రుక్కి-చను నల్లికండ్లపాము', 'ఎండిముండ్లగు బ్రహ్మదండిమోళ్లు', 'గాలికిలేచు ఎండుజిల్లెడు కాయలప్రత్తి' మున్నగునవి అచ్చముగా పల్లెటూళ్ళకు సంబంధించినవే. అట్లే వర్షర్తువులో చూలు తేళ్ళకడుపుడిప్పలను చీల్చుకొని వెలువడినపిల్లలు, 'నీటిపడెంబయనించనేర'క ఒడ్డిగిలబడు కాగితపుపడవలు, ఛూడిగేదెకు పెయ్యదూడయేపుట్టునోయని జోస్యముచెప్పు తుంగకాడలు కేవలము పల్లెటూళ్ళకుసంబంధించిన విశిష్టలక్షణములే. ఈ విధముగా వీరు ఋతువర్ణనలలో పల్లీయ ప్రకృతిని 'రసపుగూర్లైన' తెలుగుపలుకుబళ్ళతో రమణీయముగా చిత్రించిరి. అయినను దీనిలో 'దీప్తిమాధుర్యావధిశిరస్సుధాంశుభాస్వన్మనోహరవిలాపమ్ములగుచు'వంటి ప్రబంధప్రకృతిచిత్రణమును తలపింపజేయు పద్యములు లేకపోలేదు. ఏదియెట్లున్నను తెలుగుదేశములోని పల్లీయప్రకృతిని అంగిగా చిత్రించినవానిలో ఈ కావ్యమగ్రగణ్యమైనది.

వీరితోపాటు పల్లీయ ప్రకృతిదృశ్యములను కన్నులకు గట్టించినవారిలో పింగళికాటూరులు దువ్వూరి, కవికొండల, బాపిరాజు పేర్కొనదగినవారు. ప్రభాతసమయమున పల్లెటూరిలోని వివిధదృశ్యములను కాటూరివెంకటేశ్వరరావుగారు కన్నులకుగట్టినట్లు ఈవిధముగా చిత్రించినారు.

"తొలికోళ్ళయెచ్చరింతలు రెక్కలల్లార్చి
మలుకోళ్లగములు మాఱెలుగుసూప
మునుమున్న మేల్కొన్న ముదియవ్వ కదురుఝుం
కృతిసుతిగా నూలికృతులువాడ,
గరకంకణధ్వనుల్ కవ్వంపు జప్పుళ్లు
బెరయగా నిల్లాండ్రు బెరుగుదరువ,
బులుగుల కలకలమ్ములతోడ, గలయంపి
సవ్వడుల్ తీయనై సందడింప
మోటగిలకల రవళితో దోటలకును
జలముతోడు బలీవర్దములను గాపు

లదలుపన్ మోకుజవ్వాట లాలకించు
చల్లనన్మేలుకాంచు మా పల్లెటూరు."[1]

'సంక్రాతి'అనుశీర్షికతో పింగళికాటూరులుచేసిన పల్లీయప్రకృతిచిత్రణము స్వభావరమ్యమైనది.

"పొలములఁ రేల గ్రుడ్డివెన్నెలలలోనఁ
గుప్పలఁ నూర్చుకావులు గొంతులెత్తి
పదములఁ బాడదొడగిరి, పచ్చపూల
జనుపచేలకు ముత్యాలసరులుగూర్చి
మిరపపండ్లకు కుంకుమ మెరుపుదాల్చి
బంతిపూవుల మొగములల్లంతవిచ్చి."[2]

ఈ రీతిగా పుష్యమాసములోని పల్లీయప్రకృతి వర్ణింపబడినది. 'జొన్నచేను' అను శీర్షికతో ఈ కవులు 'కంకివెడలినలేతకారుజొన్నచేను'ను, దానిలో మంచెపైనుండి పిట్టలదోలు చిన్నవానిని, ఆ చేనుగట్లపై ఒత్తుగాపట్టినగడ్డిని, ఆ చేనుప్రక్కలోనున్న 'సెనగపూరైకదొడిగినచిన్నదాని'ని, చేనులోని దోసతీవెలను, 'తీయనిపాలుగారు పచ్చజొన్న'లేతగింజలను–ఒకచిన్నవానికి, ఒక చిన్న దానికి చేనులోజరిగిన సంవాదరూపమున రమ్యముగా చిత్రించినారు. ఇంతటి స్వాభావికచిత్ర ణము మన ప్రాచీనకావ్యములలో అరుదు.

## 2. పల్లీజనప్రకృతి :

ఇక పల్లీయుల జీవితరేఖలను ఈ కవులేవిధముగా చిత్రించినది వివరింతును. పల్లీయు లలో కర్షకులు ప్రధానులు. వారితోపాటు కోతకూలీలు (పాలేర్లు), గొల్లవారు, పడవసరంగులు మున్నగువారున్నారు. వీరు సహనమూర్తులై దుర్భరజీవితయాత్రను అలతిచిరునవ్వులతో గడుపు జానపదులు. వీరి నిత్యజీవితములోని 'కష్టనిష్ఠురము'లను, వేడుకలను నవ్యకవులు యథార్థ దృష్టితో చిత్రించిరి. అంతేకాని వీరిని ఆదర్శవ్యక్తులుగా సృష్టించలేదు. కాపువారు, గొల్లవారు, పడవసరంగులుమున్నగు పల్లీయుల బ్రతుకుతెరువులు మన ప్రాచీనకావ్యములకెక్కలేదు. ఈజాతు లకుసంబంధించిన వేషభాషలను బసవపురాణము, శుకసప్తతిమున్నగునవి చిత్రించినను మానవు లుగా వారి మనోంతరాళములయందలి ప్రవృత్తులను అవి చిత్రించలేదు. నవ్యకవులు పల్లీయుల బ్రతుకులపై కావ్యములల్లుటకు రెండు హేతువులున్నవి. ఒకటి స్వదేశీయము; రెండవది విదే శీయము. ఈ శతాబ్దిరెండవపాదములోనే భారతరాజకీయరంగమున గాంధీమహాత్ముడు ప్రవక్తృ స్థానమధిష్ఠించినాడు. మూడవపదిలో అతనిప్రభావ మింద్రజాలమువలె దేశీయులను ముగ్ధులనొనర్చి నది. గాంధీజీచేసిన నినాదములలో 'Back to villages' ('పల్లెటూళ్ళకు తరలండి') అన్నది

1. మావాళ్ళు : మావూరు : పౌలస్త్యహృదయము : గుడిగంటలు సంపుటిలో
2. 'సంక్రాంతి' : 'తొలకరి' లో

ఒకటి. నగరములలో కేంద్రీకృతమైన సాంఘికవ్యవస్థ పల్లెటూళ్ళలో పరచుకొనిపోవలెనని, పల్లెటూళ్ళే భారతదేశమునకు గుండెకాయలవంటివని ఆయన ప్రతిపాదించెను. అతని ప్రభావము వలన నవ్యకవులదృష్టి గ్రామీణప్రకృతిపై ప్రసరించుటకు వీలుకలిగినది. గాంధీజీ ప్రబోధించిన 'నిరాడంబరత్వము', 'అమాయకత్వము' పల్లీయులలోనే విడిదిచేసికొన్న విషయము ఈ కవులు గమనించిరి. పైగా ఈ కవులలో పలువురు పల్లెలకు సంబంధించినవారగుటతో పల్లెప్రజల ప్రతుకులలోని వెలుగునీడలతో వీరికి గాఢపరిచయమేర్పడినది. ఇది స్వదేశీయప్రభావము. రెండవది విదేశీయప్రభావమంటిని. అది యింగ్లీషుకాల్పనికకవిత్వముద్వారా వచ్చినది. ముఖ్యముగా వర్డ్సువర్తుకవి మైకేల్ (Michael) మున్నగుకావ్యములలో కాపువారిజీవితమును కావ్యవస్తువుగా చేసికొనుట, కాపువారికష్టసుఖములను చిత్రించుట, పల్లీయుల బ్రతుకులేకాక వారి భాషకూడ కావ్యయోగ్యతకలిగినదేయని నిరూపించుట, 'లిరికల్ బ్యాలడ్స్' పీఠికలో దీని నొకసిద్ధాంతముగాచేసి ఉద్ఘాటించుట–ఈ అంశములన్నియు సమష్టిగా నవ్యకవులపై ప్రభావము వేసినవి. తత్ఫలితముగా 'కృషీవలుడు'వంటి కర్షకనాయకములైన కావ్యములు వెలువడినవి. పడవలవాళ్ళమీద, చేపలుపట్టువారిమీద, గొల్లవాళ్ళమీద, అనేకగీతములు వెలువడినవి. ఇక వివిధజాతులవారినిగూర్చి వెలువడినకావ్యములనుగూర్చి గీతములనుగూర్చి సంగ్రహముగా చర్చింతును.

(i) కర్షకులు :

కర్షకులనుగూర్చి 'నిర్ఝరసారవేగము'తో కావ్యములు వ్రాసినవారిలో దువ్వూరిరామిరెడ్డి గారగ్రగణ్యులు. 1919 లోనే వీరు 'కృషీవలుడు'అను కావ్యమును ప్రచురించి 'కర్షకవాఙ్మయము'నకు బాటలువేసిరి.[1] అబ్బూరివారురచించిన 'కాపుపాట' పేరునకేకాని అందులో కాపువారి యితివృత్తములేదు. చల్లని ప్రకృతిపర్యంకమున కూర్చుందమని ప్రేయసినిగూర్చి పాడిన పాటయది. నండూరివారి 'యెంకిపాటలు' పల్లీజనప్రకృతిలోని సర్వాంగీణత్వము కలిగినవికావు. ప్రణయకలాపమే కేంద్రబిందువుగా పెట్టుకొన్నవి. రామిరెడ్డిగారి 'కృషీవలుడు' పొలముకాపుల జీవితములలోని సర్వతోముఖవిశిష్టగుణములను చిత్రించినకావ్యము. ఈ కావ్యములో కాపుల, కాపుటిల్లాండ్ర దైనందినచర్యలు సూక్ష్మదృష్టితో పరిశీలింపబడినవి. వారిచర్యలకు, మనఃప్రవృత్తులకు ఋతువులతో సమన్వయముచేసిచూపుట కవి సాధించిన ఇంకొకవిశిష్టత. వేగుబోకనుండి యిరులుమూగువరకు సాగెడు కాపువారికృషిజీవనమునకు ఋతువర్ణనలు జోడించుటవలన పసిడికి పరిమళమబ్బినది. ఈ కావ్యము భావనాశక్తికి, పరిశీలనశక్తికి వంతెనయైనిల్చినది. ఈ కావ్యములో రెడ్డిగారు కర్షకజీవితమునకు సంబంధించిన విశేషములనేకము పొందుపరిచినారు. పొదుగునిండుగ పాల్చేపిన తఱిపిపెయ్యలను, 'గిడ్డగముల'ను దొడ్డివెడలించుకుర్రవానిని, దధిమథించెడు కాంతల గీతములను, చలికప్పుగప్పి విచ్చలవిడి లేయెండగ్రాగెడు చిట్టితల్లులమ, తుంగకు గఱికకాడలకు

---

1. 'కృషీవలుజీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుగుగ్రంథములలో ఇదియె మొదటిది'

— కృషీవలుడు : ఉపోద్ఘాతము. కట్టమంచి :

అల్లిన సాలెగూళ్ళను, చేతికొడవలి జళిపించుచు మునుము తఱిగెడి కన్నెమాలెతను, పరిగయేరెడు పేదలను స్వభావరమ్యముగా చిత్రించి పల్లెటూళ్ళలోని కర్షకజీవనమును సాక్షాత్కరింపజేసినారు. ఈ బహిఃప్రకృతినేకాక కర్షకునిబ్రతుకులోని సుఖదుఃఖములను స్వాభావికత పోలివోవకుండ వర్ణించినారు. మంచెమీద కావలియున్న కాపుకన్నె దారిబోవువారడిగినంతనే ఇంటిలో తనలేమిడి యైన తలపక చేతికందినకంకులను గోసియిచ్చును. 'ఉండితిన్నను లేక పస్తున్నగాని' పరుల కష్టార్జితమునకు కర్షకు డాసపడడు. ఆకలితో అతనిపంచకరుగుఅతిథి తినకత్రావక పోయిన దిన ముండదు. కాపువానికి

'పల్లెయెల్లయె సర్వప్రపంచసీమ
ప్రియయొకర్తయె రమణీయవిగ్రహంబు'.

'ధారుణీపతిపాలనదండము'కన్న అతనిహలము గొప్పది. ఇట్టిస్వార్థరహితుడుగూడ పంటలుదెబ్బ దినుటతో అప్పులపాలైనాడు. అతడు 'వాయిదామించవచ్చినవడ్డియప్పు, పడతిసొమ్ముల కుదు వకుఃబడ్డయప్పు' చెల్లించవలసివచ్చును. 'సిరిగలయాడుబిడ్డలు విచిత్రపుజాలనగల్' ధరించగా, కాపుటిల్లాలు 'ప్రేమరత్నము'తోనే తృప్తిపడును. 'అతులసంసారసాగరమందుఃగాలజలము సుకృతదుష్కృతవాతచలితమగుచు, సుఖవిషాదపుఃదరగలై'' సుడియుచుండగా కాపుపడతి పతిని పడవయై గట్టుకుచేర్చును. వేసంగిలో భద్రపరచుకొన్న పిడికలతో, తాటిచుండ్లతో, 'బొప్పర్ల'తో 'బొళ్ళెంబు'లతో కొన్నినాళ్లు వంటపనిసాగినది. వానకాలమున

'తడిసిన పచ్చికట్టియలు తంగెడుతప్పర తాటియాకులం
బడతుక ప్రొయ్యిలో దుఱిగి పైఃబొగ లెత్తగనూదుగాని కూ
డుడుకదు కాకకుం బొగకు నుప్పతిలెం గడగంట బాష్పముల్.''

కాపుటిల్లాలి ఈ యవస్థ ఆముక్తమాల్యదలోని 'గగనమునీరుబుగ్గ కెనగా', 'ఇల్లిల్లుదిరుగ' అను పద్యములలోని భావమును స్ఫురింపజేయును. ఈ విధముగా కాపువాని జీవిత చక్రమునకున్న అన్నిఅంచులను ప్రతిబింబింపజేసిన కావ్యమిది.

తుమ్మలసీతారామమూర్తిగారు కృషీవలాశ్రయములైన పలుఖండకావ్యములు రచించిరి. 'క్షేత్రజీవి'అను శీర్షికతో పరధర్మములను, పట్టణములనుజూచి పరువులెత్తు కర్షకునుద్దేశించి

'కదురుగలచోటు కవ్వంబు కదలుచోటు
కలవులకు ధూమకేతు'[1]

వని కృషిజీవనములోని ప్రాశస్త్యమునుగ్గడించిరి. 'శివరక్షకుడు'అను శీర్షికక్రింద శివునికి, కర్షకునికి అభేదము చిత్రించిరి. ముమ్మొనలములుకోల, బసవన్నమున్నగు సమానధర్మము

1. పఱిగపంట :

లతో ఈ సాదృశ్యము నిరూపించిరి.[1] గంగులశాయిరెడ్డిగారు తెలంగాణాకర్షకుని బ్రతుకు తెరువును దృష్టిలోనిడుకొని 'కాపుబిడ్డ'యను కావ్యము రచించిరి. తెలంగాణమునకేచెందిన వాన మామలై జగన్నాథాచార్యులుగారు కాపువానిని రాముడుగా, వాని యిల్లాలిని సీతగా భావించి 'కాపు రామాయణ'మను మహాకావ్యమును రచించిరి. ఈ కావ్యము (కొన్నిపద్యములుతప్ప) ప్రచురింప బడలేదు.

(ii) గోపకులు :

ఆంగ్ల 'కాల్పనికకవిత్వము'న Pastoral poetry అను ప్రక్రియ ఎన్నదగినది. తెలుగులో గోపాలురజీవితమును కావ్యవస్తువుగాజేసికొనుటకు ప్రధానముగా Pastoral poetry ప్రభావమే కారణము. Pastoral poetry అనగా జానపదులు పాడుకొన్న కవిత్వముకాదు. నాగర కులైనకవులు గోపాలురజీవితమునకు ముగ్ధులై రచించిన కవిత్వము. మొట్టమొదట థియోక్రిటస్ (Theocritus) అను సిసిలీకవి (280 B. C లో) ఈ ప్రక్రియకు దారితీసెను. ఇతడు వ్రాసిన Pastoral Monologue పద్ధతినే తరువాతికవులనుసరించిరి. క్రమముగా గ్రీకురోముదేశములకు ఈ ప్రక్రియ ఎగబ్రాకినది. వర్జిల్ (virgil) గ్రీకుభాషలో వ్రాసిన ఎక్లాగ్ (Eclogue) ఈ జాతి కావ్యములకు శిరోభూషణము. పెట్రార్క్, డాంటీమున్నగు ప్రణయకవులుగూడ గోపగీత ములు (Pastoral poems) వెలయించిరి. ఇంగ్లీషులో స్పెన్సరుతో ఈ ప్రక్రియ ప్రారంభమైనది. ఇతని 'Shepherd's Calandar', సిడ్నీ రచించిన అర్కేడియా (Arcadia), ఎలన్‌రామ్సే వ్రాసిన 'Gentle Shepherd' అను కావ్యములు క్రమముగా వెలువడినవి. ప్రణయకవులెల్లరు ఈ ప్రక్రియను చేపట్టి గేయములు రచించిరి. ఈ ప్రభావముతోనే తెలుగులో గోపకుల నితివృత్త ముగా జేసికొని కావ్యరచన జరిగినది. Pastoral poems ను 'గోపకావ్యము'లని ఆంధ్రశేషగిరి రావుగారన్నారు.

మనప్రాచీనసాహిత్యమున గొల్లవారిజీవితము ప్రధానాంగముగా చిత్రించిన కావ్యములు లేవు. భాగవతములోని గోపగోపికాసంచారములు, ఎఱ్ఱాప్రగడహరివంశములోని శ్రీకృష్ణునిబాల్య క్రీడలు ఈ ఛాయలున్నవేకాని వీనిలో శ్రీకృష్ణుని దివ్యత్వప్రసక్తి అంతస్సూత్రముగానుండుట వలన ఇవి అచ్చమైన గోపకావ్యశాఖలో చేరవు వ్రేపల్లెలోని గొల్లవారి ప్రయాణ సన్నాహమును వర్ణించు హరివంశములోని ఈ వర్ణన వ్రజజీవనచిత్రణకు చక్కని నిదర్శనము.

"బండ్లమెట్టింపుపై బరువు లెక్కింపుమీ
దళ్ళను బూన్పు కావళ్ళనునుపు
పదిలంబుగా నేతిపనటులు క్రొత్త గో
నెల బియ్యములు పట్టునివరివడ్లు

1. పతిగపంట :

నోడ పెరుగుపాలు నొనరంగఁబోసి చా
పలు మంచములు మీద బలియఁ గప్పు
గొడుపు వాదోళ్ళుమొదలుగాఁ జెడకయుండ
వలయు ముల్లెల్లఁ దెమ్ము గందలపుటెడ్ల
నాయితము సేయు ముదుసళ్ళనాడువారి
గంపమోపులు ముందరఁ గదలుమనుము''

అని మఱియుఁబెక్కుభంగులయెలుంగుల నొక్క కోలాహలంబెసంగ మందయంతయు నొక్క పెట్టకదలి............''.[1] ఆంధ్రభాగవతమున శ్రీకృష్ణుడు గొల్లపిల్లలతో చల్దులుగుడిచిన ఘట్టమున ఈ కవితాచ్ఛాయలు ప్రతిబింబించుచున్నవి.[2] రఘువంశములోని గొల్లవారిప్రసక్తి రేఖామాత్రమైనది. గీతగోవిందములోని గోపికావృత్తాంతము మధురభక్తిసూత్రముతో ముడివడి నదికాబట్టి అది 'గోపకవిత్వము'కాదు.

నవ్యకవిత్వమున కర్షకసంబంధమైన జీవితములు చిత్రింపబడినంతగా గొల్లవారి జీవితములు చిత్రింపబడలేదు. దువ్వూరిరామిరెడ్డిగారి 'వనకుమారి' ఈ శాఖకేకైక ప్రతినిధియని చెప్పవచ్చును. ఈ కావ్యములో దురదృష్టవశమున రాజ్యభ్రష్టుడైన ఒకరాజు, అతనిచిన్నకూతురు, అడవిలో గొల్లవారుగా నివసించినవృత్తాంతము ప్రధానవస్తువు. ఆ రాజుకూతురునకు ప్రాయము వచ్చినపిమ్మట ఆమె గొఱ్ఱెలుమేపుచున్నఘట్టముతో ఈ కావ్యము ప్రారంభమగును. ఆమె గొఱ్ఱెలనుమేపుచు తిరిగినఘట్టము ఈ కావ్యమున రసవత్తరముగా చిత్రింపబడినది. గొఱ్ఱెలమంద జడివానకు చెల్లాచెదరైపోయినపిమ్మట, కారుచీకటిలో త్రోవగానక, గొఱ్ఱెలకై పరితపించు ఆ 'వనకుమారి'మనస్తత్త్వము చక్కగా నిరూపింపబడినది. ఆమె యేవిధముగా అడవియొడిలో పెరిగినదో, ఆమె చిత్తవృత్తులెంతనిసర్గరమణీయములో వనకుమారి స్వగతరూపమున నివేదింపబడినవి. ఈ కథ చివరికి ప్రేమగాథగా పరిణమించును. ప్రస్తుతాంశమునకు దానితో ప్రసక్తి లేదుకావున దానినిగూర్చిచెప్పక విడుచుచున్నాను. పుట్టుకతోనే గొల్లవారుకాకున్నను, గొల్లవారుగా జీవించినవారి జీవితమును చిత్రించినకావ్యమిది. అయినను ఇది 'గోపకావ్యము'ల పంక్తిలో చేరునదే.

### (iii) ఇతర వృత్తులవారు :

పల్లీయులలో అనేకవర్గములవారు, వృత్తులవారుందురు. వీరిలో ఆలకాపరులు మొదలుకొని అంట్లుతోమెడు దాసివరకు కావ్యవస్తువులుగా చేసికొన్నవారు కవికొండల వెంకటరావుగారు. 'రక్తకుల్యగాథ'అను శీర్షికతో వీరు పడవలాగువారి పాటను మనోజ్ఞరీతిలో రచించినారు.

1. హరివంశము : పూర్వభాగము : 6 వ ఆశ్వాసము :
2. దశమస్కంధము : పూర్వభాగము : 494, 497 పద్యములు.

'రార వెంకటరెడ్డి రార పోతన్న
రావడంలేదు వల లాగులాగంఁడ్రా
రక్తకుల్యకు కొత్తశక్తొచ్చెనేడు
రావడంలేదు వలలాగు లాగంఁడ్రా.'[1]

ఈ విధముగా ఈ పాటసాగిపోవును. పడవలాగువారితోపాటు పడవమీదనున్న పిల్లనుగూడ వీరు

'నదినిండనీరున్నదీ నావపై పిల్లున్నదీ
పిల్లాకువొళ్ళున్నదీ వొళ్లెల్లవయసున్నదీ'[2]

అని వర్ణించివారు. 'ప్రకృతిచందనము' అను కావ్యములో వీరు మంగలికుర్రవానినిగూర్చి, 'జంతిక'లమ్ముకొను వృద్ధురాలినిగూర్చి రచనలుచేసిరి. ఈ కావ్యములోనే కళ్ళములో ధాన్యపుగింజ లేరుకొను ముసలిదాని ఆత్మతృప్తిని గొప్పగా చి తించిరి. 'కలరుతము' అను కావ్యసంపుటిలో అంట్లుతోముకొనిబ్రతుకు దాసిజీవితమును హృదయంగమముగా చిత్రించిరి. అప్పలమ్మ ఒక దాసి పేరు. ఆమెమగడు జూదము, పానము మున్నగువ్యసనములకులోనై ఒకనాడు పోలీసులచేత జిక్కి, తనను రక్షింపవలసినదిగా భార్యను బ్రతిమాలును. అప్పలమ్మ మనసుకరగి మెడలోని బంగారుతీగదీసి మగనిచెర విడిపించి

'తీగపోతె పోయెగాని
మగడు దక్కెననుచు' పొంగిపోయినట్లు

చిత్రించి వెంకటరావుగారు సామాన్యమానవులలోని మాన్యభావములనుల్లేఖించిరి. కోతకూలీల గూర్చి, రోడ్లుబాగుచేసెడువారినిగూర్చికూడ వెంకటరావుగారు ప్రత్యేకముగా గేయములు రచించిరి. పల్లీయులైన శ్రామికులు వీరికవిత్వమున జీవచైతన్యముతో మిరుమిట్లుగొల్పుచుందురన్న గణపతిశాస్త్రిగారి యభిప్రాయము యథార్థమైనది.[3]

వీరివలెనే పల్లీయుల బ్రతుకుతెరువులను చిత్రించినవారు దువ్వూరి, బాపిరాజు, కొనకళ్ళ వెంకటరత్నంగార్లు. రామిరెడ్డిగారు రచించిన 'ముసలిమాలెత'[4] అన్నపద్యములలో కాటికి కాళ్ళు చాచుకొనియున్న ముసలిమాలెతపై కవి జాలిపడగా ఆ వృద్ధురాలు

'కాలుసేతులు నున్నంతకాల మొరుల
చేతికూటికి నాసింపఁ జిన్నతన'మనును.

ఆమె 'నైతికగుణాతిశయము'నకు సంతసించి కవితనయింటిలో ప్రతిదినము 'మజ్జిగన్నము' తీసికొమ్మని పల్కగా ఆయవ్వ 'కూలిచూపినాకుఁగూడుపెట్టు'మని, 'తిరిపమెత్తితిన్నఁ దీఱునా

1. 2. విశాలవిశ్వము : పుట 18.
3. 'కవికొండలవెంకటరావు కవిత్వం' : పి. గణపతిశాస్త్రి : భారతి : విజయ పుష్యము.
4. ఖండకావ్యములు.

ఆకలి'యని సమాధానమిచ్చును. ఈ పద్యములలో పల్లెటూరిలోని ముసలిమాలెత శ్రమైకజీవన ప్రియత్వము, ఉదాత్తబుద్ధి చిత్రించబడినవి. అడవిబాపిరాజుగారు 'గోధూళి'అను పాటల సంపుటిలో ఆకుమళ్ళలోపనిచేయు భార్యాభర్తల (ప్రేయసీప్రియుల) జీవితరేఖలను రమ్యముగా చిత్రించినారు.

'యెయ్యవేగూడ నాపిల్లా'అని
యెయ్యరోయి గూడ యెయ్యరా
ఓ సిన్నిబావా
యెయ్యరోయి గూడ వేయరా !' యని

ఆకుమళ్ళకు గూడవేసినప్పటి ఘట్టములను

'పంటపండిస్తాము పాలాయబావా
కుప్పవేయిస్తాము కొలతోటబావా'
'పోలో పోలో పొలి పొలి పొలి
దూడల్ని తోలేమూ
దున్నల్ని నడిపేమూ
మిలమిలా బంగరు
వెలిగేను గింజాలూ'

మున్నగు గేయములలో పంటకు, కళ్ళములకు సంబంధించిన సన్నివేశములను, 'పాలమ్మపాలు తియ్యన్నిపాలు' వంటిపాటలలో పాలమ్ముగొల్లభామలను స్వభావసిద్ధముగా వర్ణించినారు. ఇంతే కాక వీరు 'తోటమాలికూతురు'పై, 'గౌళ్ళసెల్లాయికూతురు'పై వ్రాసినపాటలీశాఖలోనివే. తన భర్త ఆవులనుతోలుకొని మన్నెముపోవునప్పుడు భార్యమనస్సులోనివేదనను ఆర్ద్రముగాచిత్రించినారు వీరు. ఈ సంపుటిలోనే గంగిరెద్దులవానిగూర్చి, ఒంటెద్దుబండివానినిగూర్చిన పాటలున్నవి. ఇవన్నియు పల్లీయులకుసంబంధించినవే. ఈ పాటలన్నియు యెంకిపాటలవలె పల్లీయులభాషలోనే రచింపబడుట ఇంకొకవిశేషము.

కొనకళ్ళవెంకటరత్నంగారి'బంగారిమామపాటల'లో పల్లీజనప్రకృతి ప్రధానముగాచిత్రింపబడినది. ఈ పాటలలో యెంకిపాటలలోవలె శృంగారరసమే అంగి అయినను ఊరిలో తిండికి గడవక 'పట్నవాసము'నకై వెళ్ళిపోవు రైతులనుగూర్చి గుండెగూడు కదలునట్లు వర్ణించినారు. 'వెళ్ళిపోదామా' అను పాటలో

"ఈనమోపై వున్నపైరులు
ఏటిమునకల పాలుజేసి

కొంపగోడీ విడిచి పట్టెడు
కూటికై ఊరేగవలెరా''

— — — —

''ఒళ్ళు పెంచిన గడ్డమిదే
ఒరిగిపొయ్యే రాణలేదో
ఊరుగానీ ఊరిలో చితి
పేర్చు కొమ్మని నొసటివ్రాలో''

అనుచరణములలో పల్లీయులకు తమ పంటపైరులతో, ఊరితో ఉన్న దృఢానుబంధము కరుణామయముగా వర్ణింపబడినది. ఈ సంపుటిలోనే రోడ్డురోలరులాగు శ్రామికుల ఆత్మవేదనను వ్యక్తీకరించు కళాఖండము ఈ పాట. ఈ పాటలోని

"మారువాడి అప్పుకంటె మాయదారి బ్రతుకుకంటె
బరువా ఇంతోటి పెద్దబండరాయి మామయ్య
లాగారా హయిలెస్స లాగరా
రోడ్డురోలరు ముందడుగై సాగరా''

వంటిచరణములలో కూలీల ఆర్తనాదము హృదయవిదారకముగా ధ్వనించును. రెంటాలగోపాలకృష్ణగారు రచించిన 'పల్లకిబోయీల'ను పాట ఈ తెగకుచెందినదే. 'శారీరకవాంఛలు కన్నులకొకమాయతెరనుకప్పగా, కంటతడిబెట్టే ఇల్లాలినికాలదన్ని' చీకటితప్పుచేయుటకు పొరుగూరికి పోవుచున్న 'పెద్దమనిషి' పల్లకినిమోసెడు బోయీల విషాదగీతికయిది.

'రాళ్లైనమోయొచ్చు
రథమైన లాగొచ్చు
గుండెలేనీ మనిషి
కూర్చున్న పల్లాకి
రంపాలతో కోసి
నట్టూగ ఉండాది'[1]

అన్న బోయీలపాటలో వారినిస్సహాయతతోపాటు, బుస్సుగొట్టుచున్న సాంఘికచైతన్యముకూడ ద్యోతకమగుచున్నది.

1. సర్పయాగం: 'పల్లకిబోయీలు': రెంటాల: పుట 80.

ఇంతవరకు పల్లీయులలో వివిధవృత్తులకు, వర్ణములకు, తెగలకుచెందినవారినిగూర్చి నవ్యకవులు బహుముఖముగా చేసినరచనలలోని విశిష్టతనుగూర్చి వివరించితిని. ఈ రచనలలో కొన్ని ప్రాచీనసంప్రదాయముల నేమరకుండ రచించినట్టివి. దువ్వూరి 'వనకుమారి', కృషీవలుడు' అట్టివే. బాపిరాజుగారెన్నో పాటలను పూర్తిగా జానపదభాషలోనియాసలో రచించినారు. కవికొండలవారు పల్లీయులపలుకుబడిని గ్రహించి, జానపదగేయముల వరుసలలో, వివిధగతులలో సంతరించినారు. కొనకళ్ళవారిపాటలలోని భాష శిష్టవ్యావహారికమునకు, జానపదులభాషకు మధ్యస్థముగానున్నది. రెంటాలగేయములో బోయీలపలుకుబడి చోటుచేసికొన్నది.

భావకవిత్వములో ప్రకృతికవిత్వమెన్నితీర్లుగా భాసించినదో నిరూపించుటకు ప్రయత్నించితిని. పల్లీయులకు సంబంధించినపాటలు కోకొల్లలుగానున్నను విలక్షణమైన కొన్నిటిని మాత్రమే స్వీకరించితిని.

# 4. సంఘసంస్కరణ కవిత్వము

ఆంధ్రదేశములో పందొమ్మిదవశతాబ్ది అంతముననే వీరేశలింగంగారు సంఘసంస్కరణ మహోద్యమము ప్రారంభించిరి. ఇరువదవశతాబ్దినుండి ఆయన ఉద్యమము మరింత విజృంభించినది. వీరేశలింగంగారికి ఈ ఉద్యమనిర్వహణలో రఘుపతివేంకటరత్నంనాయుడుగారు కుడి భుజమై నిల్చిరి. భాషాసాహిత్యరంగములలో గిడుగుగురజాడలవలె, సంఘసంస్కరణరంగములో ఈ యిరువురు మహానుభావులు సూర్యచంద్రులవలె ప్రకాశించిరి. వీరేశలింగంగారు, వెంకటరత్నమునాయుడుగారు నడపిన యీ సంఘసంస్కరణోద్యమమే ఏకేశ్వరారాధనము, విగ్రహారాధనిరసనము, బాల్యవివాహ ఖండనము, వితంతువివాహకరణము మున్నగు అనేక శాఖలుగా రూపొందినది. ఈ శాఖలన్నిటికిమూలము మానవోద్యమదృక్పథము. గతశతాబ్ది లోనే వంగదేశమున రాజారామమోహనరాయలు మానవోద్యమమును మహోచ్చస్థితికి తీసికొని వెళ్ళిన మహనీయుడు. ఈ మానవోద్యమమునకు Italian Humanism నకు పోలికలున్నవి. ఇటలీలో జరిగిన రినైజాన్సుఉద్యమమువలన మానవోద్యమదృక్పథము వేరూరినది. మానవునిపై మధ్యయుగములలో చర్చివిధించిన కఠిననిర్బంధములను త్రెంచివేయుట, విజ్ఞాన మందరి సొత్తుగా భావించుట ఈ ఉద్యమము ప్రధానలక్షణములు. పరిపూర్ణస్వేచ్ఛననుభవించినవాడే నిజమైనమానవుడని ఈ ఉద్యమము ప్రచారముచేసినది.

'Only a free man, it was held, was in the complete sense a man at all, a slave was only half a man.'[1]

ఈ ఉద్యమము వ్యక్తికి వ్యక్తికి మధ్యనున్న ఎల్లలను తుడిచివేసినది; గోడలను పడగొట్టినది. కులమతవర్ణ వ్యత్యాసములు వ్యక్తిజ్ఞానవికాసమునకు నిరోధకములు కాగూడదని స్పష్టపరిచినది. ఈ ఉద్యమము రేకెత్తినకాలమున పాశ్చాత్యలోకమున గ్రీకుభాషలోని క్రింది వాక్యము వేదవాక్యమైనది.

'Homo Sum : humani nil a me alienum Puto'.

(I am a man : there is nothing human that, I think, does not concern me.)[2]

1. The Classical Background of English Literature : J. A. K. Thomson : P. 174 : pub : 1948.
2. Quoted in the above book : P. 175.

ఈ Italian Humanism నకు రామమోహనరాయల మానవోద్యమమునకు పైని చెప్పిన విషయములన్నిటితో సామ్యమున్నది, అంతమాత్రముచేత రామమోహనరాయల మానవోద్యమము భారతీయసంప్రదాయములను, భారతీయవిజ్ఞానమును నిరసించలేదు. వానిని సహేతుకదృష్టితో పరిశీలించి 'మంచియన్నది పెంచ'వలెనని ఉద్బోధించినది. ఇది వ్యక్తి స్వాతంత్ర్యము నొకవైపు కోరుచునే, జాతిస్వాతంత్ర్యమును ప్రతిపాదించినది. జాతికి స్వాతంత్ర్యము, సర్వాంగీణవికాసము కలుగవలెననగా మొదట ఆ జాతిశరీరమునకు అణువు వంటి ప్రతిమానవుడు వికసింపవలెను. అందుకే ఈ ఉద్యమము వ్యక్తిస్వేచ్ఛ కగ్రతాంబూల మిచ్చినది. వ్యక్తిస్వేచ్ఛకడ్డువచ్చు సంఘదురాచారములను, మూఢవిశ్వాసములను కూకటి వేళ్ళతో పెల్లగించుటకు ప్రయత్నించినది. 'మామూలుమానవు'ని మకుటధారిచేయుటకు ప్రయత్నించిన ఉద్యమమిది. దీనిలక్ష్యములను కృష్ణశాస్త్రిగారు ఈ విధముగా సమన్వయించినారు.

"ఈ జగత్తు, మానవుడు, వాని అనుభవాలు, అన్నీ గట్టిపరమార్థాలనే శాస్త్రీయదృక్పథం, వాస్తవికతకూడా ఈ ఉద్యమలక్షణాలే. 'అసీమమైన ఈ సృష్టిలోతూర్పేది; పడమరేది అని, ఒక హృదయం, రెండు స్పందాలు' అనిన్నీ, 'నాజాతి మానవజాతి' (His case is human kind) అనిన్నీ, 'బ్రతుకుతే స్వతంత్రుణ్ణయి బ్రతుకుతాను, లేకపోతే ఉండనే ఉండను' (I will be free or not be at all) అనిన్నీ, రాగల ప్రతిమానవుడూ చాటుతాడని ఈ ఉద్యమం అంటుంది."[1]

రామమోహనరాయలు వంగదేశమున ఎగురవేసిన ఈ ఉద్యమధ్వజమును తెలుగునాట మొట్టమొదట వీరేశలింగంగారందుకొన్నారు. రామమోహనరాయల ఉద్యమమునకు బ్రహ్మసమాజము వాహికగానుండెడిది వీరేశలింగంగారు ఈ సంఘమును ఆంధ్రదేశములో స్థాపించి దీని ద్వారా తమ సంస్కరణకార్యములు జరిపినారు. వీరేశలింగంగారు ప్రారంభించిన బాల్యవివాహఖండనము, కన్యాశుల్కనిరసనము మున్నగువానితోపాటు ఆ కాలమున వర్ణవ్యవస్థానిరసనము కూడ శిరసెత్తినవి. కొంతకాలముతర్వాత సంఘవ్యవస్థానిరసనము ప్రారంభమైనది. దీనికి త్రిపురనేని రామస్వామిచౌదరిగారు మూలపురుషులు. ఇవన్నియు మానవోద్యమలక్షణములే. మానవోద్యమము రెండవతరములో గాంధీయదృక్పథముగా రూపొందినది. గాంధీజీ సర్వోదయ సిద్ధాంతములీతరమున బహుళ ప్రచారమునందినవి. మానవోద్యమములోని ఈ రెండు శాఖలను దృష్టిలో పెట్టుకొని సంఘసంస్కరణకవిత్వము వెలువడినది. కొందరు వితంతువిలాపమును వినిపించిరి. కొందరు కన్యాశుల్కమును నిరసించిరి. కొందరు వర్ణవిభేదపిశాచమున కెదురు దిరిగిరి. కొందరు గాంధీజీ నడిచినబాటలో కాల్మోపి హరిజనసమస్యను కావ్యవస్తువుగా జేసికొనిరి. ఇంకకొందరీబాటలోనే విశ్వమానవప్రేమను పతాకగాగొని ప్రస్థానించిరి. ఇక ఈ లక్షణము లన్నిటిని వర్గీకరించి వాని తత్త్వమును నిర్దేశించుటకు ప్రయత్నింతును. సంఘసంస్కరణకవిత్వముపై మానవోద్యమము, 'గాంధీయిజము'మున్నగు స్వదేశీయ ప్రభావములేకాని విదేశీయ ప్రభావము అణుమాత్రమైనను లేదు. ఆంగ్లకాల్పనికకవులు సంఘసంస్కరణగీతముల నంతగా

1. పాతికసంవత్సరాల తెలుగు కవిత్వము: భారతి: 1949 జనవరి.

వ్రాయలేదు. అందువలన ఈ కవిత్వముపై కాల్పనికకవిత్వప్రభావము ప్రసరించుటకు వీలులేక పోయినది.

(i) *దురాచారనిరసనము :*

ఈ శతాబ్ది మొదటిపదిలో విరివిగా అతి బాల్యవివాహములు జరిగెడివి. ఈ దురాచారము బొడ్డుకోయనికూనకు-చివరకు కడుపులోనున్న బిడ్డకుకూడ-వివాహసంబంధము నిశ్చయించునంత వరకు పోయినదని గురజాడఅప్పారావుగారు తమ డైరీలలో వ్రాసికొన్న విషయమునుబట్టి గమనించవచ్చును.[1] వీరేశలింగంగారి సంస్కరణవజ్రఘాతముతో అతిబాల్యవివాహపద్ధతి చూర్ణమైపోయినది. బాల్యవివాహములు చాలవరకు సన్నగిల్లినవికాని పూర్తిగాపోలేదు. బాల్యవివాహముల వలన వితంతువులసమస్య బయలుదేరినది. ముఖ్యముగా అగ్రవర్ణములవారిలో బాలవితంతువుల సమస్య తీవ్రరూపము దాల్చినది. శుల్కమున కాసపడి తలిదండ్రులు వృద్ధులకు తమ కూతుళ్ళ నంటగట్టుటతో ఇది మరింతవిషమించినది. ఆనాటికవి 'పైకమిచ్చినవారికే బాలికలను గట్టిపెట్టుట యిదియేటికర్మ'మని ఆక్రోశించినాడు.[2] భోగరాజు నారాయణమూర్తిగారివంటి వీరగ్రాంధికవాదులుకూడ వితంతువివాహములను సమర్థించుచు 1911 లోనే పద్యములను రచించిరి. 'విధవావిలాపము'అను శీర్షికతో వీరు వ్రాసిన పద్యములలో వితంతువులదుర్గతి నీ విధముగా చిత్రించిరి

'తెలివకు ముద్దుముచ్చటలు దీరకమున్నె శిరోజముల్ తెగం
గొలుగుదురయ్య పాపమని గొంకరటయ్య, పునర్వివాహముల్
జరుపుట ధర్మమంచెవరి శాస్త్రమునన్ గలదయ్య ? యిట్టుల
య్యరె ! విధవాంగనల్ జులకనైరిగదయ్య ! పురాకృతంబునన్.'[3]

మంగిపూడి వెంకటశర్మగారు వితంతువుల దుర్దశను చిత్రించుటకు ప్రత్యేకముగా ఒక కావ్యమే రచించిరి. దానిపేరు 'బాలవితంతు విలాపము'. ఇందులో శర్మగారు బాల్యవివాహములను నిరసించిన పద్యము గమనింతము

'పొత్తిళ్ళలోనున్న నెత్తురుకందుల
  పెండ్లిండ్లుసేయ భావించునొకడు
పురుడువోవకమున్నె బొట్టెల నమ్మంగ
  బేరసారములు గావించునొకడు
కన్నులుతెలవని కసుగాయలను గట్టి
  పెట్టి వృద్ధులను సేవించునొకడు

1. మహాకవిడైరీలు :
2. బాలవితంతువిలాపము : మంగిపూడి వెంకటశర్మ :
3. విధవావిలాపము : ఆంధ్రపత్రిక : 1911 సంవత్సరాది సంచిక :

పాలైనవిడువని పసికూనలను గూర్చ
వెసరాయబారి రావించునొకడు.'[1]

ఈ కావ్యములో వీరు వృద్ధవివాహములను నిశితముగా విమర్శించిరి. వనితలకు వైధవ్యమువలన ప్రాయములోనే వచ్చిపడుదురవస్థను హృదయద్రావకముగా చిత్రించిరి. గాజులను, పసుపుకుంకుమలను, వ్రతములను, వన్నెచీరలను, పూలను, పుణ్యకార్యములను కోల్పోయి మోడువలె, అడవిగాచిన వెన్నెలవలె ఉండిపోయెడు వితంతువుల దుర్భరదుఃఖగాథలను వారి స్వగత రూపమున ఈ కావ్యమున వినిపించిరి.

వరశుల్కనిరసనగా భోగరాజు నారాయణమూర్తిగారు ప్రత్యేకముగా 'పండుగకట్న'మను కావ్యము రచించిరి. రచనలో ఇది ప్రాచీనపద్ధతికి చెందినదేయైనను దీనిలోనివస్తువు నవ్యమైనది. అత్తవారిని పీడించి కట్నములు తీసికొనెడు అల్లుండ్ర దుర్బుద్ధి నీ కావ్యములో కవిగారు నిశితముగా విమర్శించిరి. కావ్యప్రారంభమునచేసిన సూర్యాస్తమయవర్ణనలోసైతము వస్తునిర్దేశము చేసి చమత్కారమును ప్రదర్శించిరి. ఆ పద్యమిది—

'శ్రీగలయత్తగారు తొలిచెప్పినరీతినిఁ గట్నమీయమిన్
జేగురుమోముతో నలిగి చివ్వుననేగెడు క్రొత్తయల్లుడో
నాగ నిజారుణప్రభలనంతముగా దిశలన్ వెలుంగఁ దా
నేగె దివాకరుండు జగమెల్లఁ దమంబున దుస్తమమ్ముగన్."

చంద్రోదయవర్ణనసైత మీ పద్ధతిలోనేచేసి క్రొత్తదనము ప్రవేశపెట్టిరి.

గురజాడవారు 'పూర్ణమ్మ'ను, రాయప్రోలువారు 'స్నేహలత'ను ఈ శుల్కమునకు నిరసనగా వ్రాసిన విషయము ఆయాసందర్భములందు ప్రస్తావించితిని.

వనితలను వంటయింటికుందేళ్ళవలె అణగద్రొక్కియుంచు పద్ధతిని ఆనాటికవి తీవ్రముగా ఖండించినాడు. స్త్రీలు స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు, విద్యాగౌరవములకర్హులని ఉద్ఘాటించినాడు. స్త్రీలకుగల అష్టదిగ్బంధములను దృష్టిలో పెట్టుకొని 'ఆడుపుట్టువుపుట్టుటే అసలుతప్ప'ని సంఘము నధిక్షేపించినాడు.[2]

'బాలురకెట్టులో బాలలకట్టులే
యున్నతవిద్యల నొసగుడయ్య
యువకులకెట్టులో యువతులకట్టులే
స్వేచ్ఛాప్రదానంబు సేయరయ్య'[3]

అని దేశీయులను ప్రబోధించినాడు.

1. బాలవితంతువిలాపము : 18 వ పద్యము :
2. 3. అబలావిలాపము : మంగిపూడి వెంకటశర్మ : ఆంధ్రపత్రిక : 1914 ఉగాది సంచిక.

ఏకేశ్వరారాధనము, విగ్రహారాధనానిరసనము, బ్రహ్మసమాజము ప్రచారముచేసిన ధ్యేయములలో ముఖ్యమైనవి. తెలుగునాట ఈ లక్ష్యములను ప్రచారముచేయుటకు 'బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరములు' ముఖ్యపట్టణములలో నెలకొల్పబడినవి. కందుకూరివారు, వెంకటరత్నము నాయుడుగారు దీనికి మూలస్తంభములు. వీరి సిద్ధాంతములకులోనైన యువకులు విగ్రహారాధన ధోరణిని పద్యగేయరూపమున నిరసించిరి. నాటి ప్రముఖయువకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

''శిథిలాలయమ్ములో శివుడులేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్యశంఖము గొంతు తెరువలేదోయి
పూజారి గుడినుండి పోవలేడోయి
చిత్రచిత్రపుపూలు చైత్రమాసపుపూలు
ఊరూర ఇంటింట ఊరకే పూచాయి
శిథిలాలయమ్ములో శిలకెదురుగా కునుకు
పూజారి కొకటేని పూవులేదోయి''

అను గేయమున భక్తిభావమున్నచోట పరమాత్మడున్నాడని, అతడు ఆలయములోనే బందీయై యుండడని, విగ్రహారాధనాతత్త్వమును వ్యంగ్యముగా ఎత్తిపొడిచినారు.

(ii) *వర్ణవ్యవస్థానిరసనము :*

మానవోద్యమము కుల, మత, వర్ణవ్యత్యాసముల నెదిరించినదని ఈ వరకే మనవిచేసితిని. తెలుగునాట బ్రహ్మసమాజ మీ తత్త్వమునే ప్రచారముచేసినది. బ్రహ్మసమాజప్రభావముతో కంఠమెత్తినకవి వర్ణవిద్వేషశృంఖలలను తెగద్రెంచుడని ఉద్ఘోషించినాడు.

'గుణములేనివాని దేకులమైతేనేమి
తృణమైతేనేమి శ్రీచరణమంటునేని
ఏ కౌటిల్యము వీని నేర్పరిచిందోకాని
చీకటిగదులున్నే జగదీశ్వరాలయములోనే'[1]

అని, పరమేశ్వరసన్నిదానములో వర్ణప్రసక్తిలేదని స్పష్టపరిచినాడు. ఈ ప్రబోధము భక్తిని కేంద్రముగా పెట్టుకొనిసాగినది. ఇది మనకు క్రొత్తగాదు. భక్తిజ్ఞానములకు వర్ణప్రసక్తిలేదని భారతములోని ధర్మవ్యాధునిచరిత్రము నిరూపించుచున్నది. భగవద్రామానుజుల వైష్ణవమతము దీనినే ప్రతిపాదించినది. 'పల్నాటి చాపకూ'డిందుకు నిదర్శనము. శైవమతము దీనినే నొక్కి చెప్పినది. పాలకురికి బసవపురాణములోని శివభక్తులచరిత్రములు దీనికి సాక్ష్యములు. కావున

1. కృష్ణశాస్త్రిగారిగేయము : (బ్రహ్మసమాజ గీతములలోనిది).

భగవత్సన్నిధానములో కులప్రసక్తిలేదన్నది ఈనాటిదేకాదు. కాని వర్ణవ్యవస్థను సాంఘిక చైతన్యదృష్ట్యా నిరసించుట ఈ యుగములోనే ప్రారంభమైనది. పూర్వము భక్తివిషయమున అన్నికులములవారికి సమానప్రతిపత్తియున్నదేమోకాని సాంఘికవిషయములందు అగ్రనీచవర్ణ భేదములు లోతుకుదిగియున్నవే. నవ్యకవి ఈ వర్ణవ్యవస్థ కెదురుదిరిగినాడు. గుణమునుబట్టికాక కులమునుబట్టి మానవుల హెచ్చుతగ్గుల నిర్ణయించు వ్యవస్థను ఇతడు నిరసించినాడు. కడజాతి వానికి సంఘముచూపిన నిర్దాక్షిణ్యమున కెదురుదిరిగి కావ్యముల రూపమున సవాలుచేసినాడు. గగనగంగకూడ కడజాతివాని తలమీద పులిమినపంకమును కడిగి కరుణించలేదయ్యెనని ఆక్రోశించినాడు. ఈ విధమైన ఆక్రందనలకు జాషువాగారి 'గబ్బిలము'న అక్షరరూపము సిద్ధించినది. 'భరతోర్వరకుంగడగొట్టుబిడ్డ'డైన అరుంధతీసుతుడు తన దుస్థితిని కైలాసపతికి విన్నవించవలసినదని గబ్బిలముతో తెలిపిన సందేశమిది. ఈ కావ్యములో జాషువాగారి కవితాహృదయము పరిపూర్ణపరిణతినందినది. దీనితో కవి ఆనాడు బిగిసికొనిపోయిన వర్ణవ్యవస్థలోని కుళ్ళును వెలిచిమ్ముటకు ప్రయత్నించినాడు. 'సనాతనధర్మధేనువుల్ పిదికినపాలు పేదకు (అంటరానివానికి)లభింప'వని, అతనిగాలిసోకగా 'నాల్గుపడగల హైందవనాగరాజు' కసరి బుసగొట్టునని', 'ప్రతిమల పెండ్లిసేయుటకు వందలువేలు వ్యయింత్రుగాని దుఃఖితమతులై'న వారి పాత్రలలో భరతమేదిని మెతుకువిదల్పదని నిశితమైన వ్యంగ్యముతో వర్ణవ్యవస్థవలని దుఃస్థితిని ఎత్తిచూపినాడు.

### (iii) సంఘవ్యవస్థానిరసనము :

జాషువాగారు కేవలము వర్ణవ్యవస్థవలన సంఘములో జరుగుచున్న అన్యాయములనే విమర్శించిరి. ఒక్క వర్ణవ్యవస్థయేకాదు, సంఘములోని సమస్తవ్యవస్థ కుళ్ళిపోయినదని హుంకరించి తెలుగునాట విప్లవశంఖము పూరించినవారు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు. సంఘశరీరమునకు వర్ణవ్యవస్థ ఒక అంగము. ఈ ఒక్క అంగమునకు చికిత్సచేసినంతమాత్రమున అది బాగుపడదు. అందుకు అన్నియంగములను పరిశీలించవలెను; అనగా రుగ్మతకు మూలకారణమేమో కనుగొనవలెను. ఈ దృష్టితోచూచిన త్రిపురనేనివారికి సమస్తసంఘవ్యవస్థ వ్యాధిగ్రస్తమైయున్నట్లు కనిపించినది. సంఘములో అధికారముద్రదాల్చిన పురాణములు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు అగ్రజాతులవారు తమ స్వార్థముకొరకు కల్పించుకొన్న కట్టుకథలని; వారందించిన పురాణముల నల్లమందుతో మిగిలినజాతులు మైకములో, మౌఢ్యములో పడియున్నవని, సంఘవ్యవస్థ నామూలాగ్రముగా మార్చిననేకాని కడమజాతులకు విముక్తిలేదని చౌదరిగారి సిద్ధాంతము. ఈ సిద్ధాంతముద్వారా వారు పురాణములలోని కథలు బూతులని, బూటకములని నిరూపించుటకు ప్రయత్నించిరి. ఆర్యులు ద్రావిడులకుచేసిన అన్యాయమును వెల్లడించిరి. రాక్షసులెవరోకాదు ద్రావిడులేయని, రామాదులద్వారా ఆర్యులు దక్షిణదేశములోనున్న ద్రావిడులను అన్యాయముగా హతమార్చినారని ఎలుగెత్తిచాటిరి. పూర్వులు 'ఆర్యాస్త్రైవర్ణికః' అని వాకొనగా, స్వార్థపరులు రానురాను శూద్రులనెడుతెగను సృష్టించినారని ఈసడించిరి. తమ పరిశోధన వలి

తముగా తేలిన చతుర్యుగలక్షణములను సరిక్రొత్తగా వినిపించిరి. శంబుకవధ, ప్రహ్లాదచరిత్ర మున్నగువానిలో ఆర్యులు ద్రావిడులకు (రాక్షసులకు) వ్యతిరేకముగాచేసిన పన్నాగములనెత్తి చూపి పాఠకులను దిగ్భ్రాంతులనొనర్చిరి. భగవద్గీతలోని 'చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్'అను సూత్రమునకు వ్యతిరేకముగా ఇంకొకభగవద్గీత (బ్రహ్మనాయడుకృష్ణుడుగా) రచించిరి. ఈ సిద్ధాంతములన్నిటిని వారు 'సూతపురాణము'అనుపేర వెలయించిరి. సూతుడనుమహర్షి పురాణములలోని కొన్ని కథ లేవిధముగా కల్పితములో, వానిసత్యస్వరూపమేమో కవికి వివరించినట్లుగా ఈ పురాణము సాగిపోయినది. రచనావిషయమున అచ్చముగా తిరుపతి వెంకటకవుల ఒరవడిలో, సంప్రదాయ సిద్ధముగాసాగిన గ్రంథమిది. కాని వస్తువునుబట్టి నవ్యకవిత్వములోనికి చేరును.[1]

(iv) *గాంధీయదృక్పథము :*

గాంధీజీ మానవోద్యమమును వ్యక్తిస్వాతంత్ర్యపరిధినుండి సమష్టిమానవశ్రేయఃపథములో ప్రవేశపెట్టిన మహనీయుడు. మతము, వివాహము మున్నగు సమస్యలకన్న ముందుగా సంఘములోని ఆర్థికదుఃస్థితిని, భావదారిద్ర్యమును తొలగించవలెనని ప్రతిపాదించినాడు. జాతికి రాజకీయముగా,ఆర్థికముగా, సాంఘికముగా స్వాతంత్రమువచ్చినప్పుడే మానవునికి మానవునికిగల సంబంధములు దృఢపడునని అభిప్రాయపడినాడు. ఈ దృష్టితోనే ఆయన ప్రాచీనఋషులు ప్రబోధించిన ధర్మసూత్రములకు క్రొత్తవ్యాఖ్యానము రచించినాడు. భగవద్గీతలోని కర్మయోగమునకు ప్రాధాన్యమిచ్చినాడు. మానవునిమనస్సును జయించుటకు శక్తికన్న కారుణ్యమే ప్రబలమైనదని నిరూపించినాడు. జాత్యభ్యుదయమునకు గ్రామవికాస మత్యవసరమని ప్రబోధించినాడు. సత్యము, ధర్మము, ప్రేమ అను విశాలసూత్రములద్వారా తన దృక్పథమును దేశీయులకందించినాడు. గాంధీజీ సిద్ధాంతముల ప్రభావము నవ్యకవులలో కొందరిపై విశేషముగా ప్రసరించినది. వారిలో తుమ్మలవారగ్రేసరులు, వారి 'ధర్మజ్యోతి' ధర్మవీరమునకు; 'ఆత్మార్పణము' ఆత్మార్పణ తత్త్వమునకు (దయావీరమునకు) మచ్చుతునకలు. ఈ రెండుకావ్యములలో మొదటిది వారి తండ్రిగారి ధర్మతత్పరతను, నిస్స్వార్థచిత్తవృత్తిని చాటుకథ. కవిగారి తండ్రిగారు తన ముంగిటికి వచ్చివాలిన బంగారుముద్దలను 'నా కెందు'కని త్రోసిపుచ్చిన ఉదంతము చిత్రించిన కావ్యమిది. రెండవది భారతములోని 'లుబ్ధకపోతోపాఖ్యానము'ననుసరించి పెంచివ్రాసిన కావ్యము. ఒక కపోతము తన భార్యనే పొట్టబెట్టుకొన్న కఱకుబెఱుకువాని కడుపుమంట చల్లార్చుటకై కనికరించి ఆత్మార్పణము చేయగా, ఆయెఱుకువానిలోగలిగిన మనఃపరివర్తనము దీనిలో చిత్రింపబడినది. ఇందులో ఆత్మార్పణతత్త్వము ప్రతిపాదింపబడినది. జీవకారుణ్యము అవశ్యకము ధ్వనింపజేయబడినది. ఈ రెండుకావ్యములు గాంధీగారి బోధనల ప్రభావముద్రగలవే. ఈ

1. సూతపురాణము గ్రాంధికభాషలో, ప్రాచీన సంప్రదాయములలోనే రచింపబడినను, సాహిత్యాదర్శములకు, సంప్రదాయములకు ఎదురుదిరిగిన రచనకావున, ఈ రచన నవ్యసాహిత్యములోనే చేరునని విశ్వనాథవారు నవ్యసాహిత్యపరిషదధ్యక్షోపన్యాసములో అభిప్రాయపడిరి.
చూ॥ 'నవ్యసాహిత్యము' : భారతి : ఏప్రిలు 1940.

కావ్యములేకాక గాంధీగారి ప్రభావమునకు సంపూర్ణముగాలోనై తుమ్మలవారు గాంధీగారి 'ఆత్మకథ'నే రసవన్మహాకావ్యముగా రచించిరి. ఇది అనువాదము కావున రచనలలో నవ్యతా ప్రసక్తిలేదు. అయినను గాంధీజీ జీవితమును కావ్యవస్తువుగా జేసికొనుటలోగల నవ్యత గమనింపదగినది. గాంధీగారి నిర్యాణము పిమ్మట అనేకులా మహాత్మునిపై కావ్యములు రచించిరి. అవి స్మృతికావ్యములలో చేరును కావున వానినిక్కడ పరిశీలించుటలేదు.

గాంధీయదృక్పథములో విశ్వమానవప్రేమ, జీవకారుణ్యము గణనీయమైనవి. పింగళి కాటూర్ల 'సౌందరనందము' స్థూలదృష్టికి ప్రణయకావ్యమువలె కన్పించినను, విశ్వమానవప్రేమను, జీవకారుణ్యమును ధ్వనింపజేసిన కావ్యము. విశ్వనాథవారు ఈ కావ్యమునుగూర్చి వ్రాయుచు 'ప్రమోదకుమారచటర్జీశిల్పపుటొత్తిడి ఆకృతికట్టి, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి ప్రభావముతో కలసి సౌందరనందంగా మూర్తికట్టి'నదని వ్రాకుచ్చిరి.[1] ప్రస్తుతము ఈ కావ్యములోని శిల్పము ప్రసక్తముకాదు; వస్తువు మాత్రమే. ఆ వస్తువుపై ముట్నూరివారి ప్రభావమున్నదని పై మాటలలో సూచితమైనది. ముట్నూరివారు మానవోద్యమమునకు సంబంధించిన గాంధీవాదులు. వారిధ్యేయములలో విశ్వమానవప్రేమ, జీవకారుణ్యము, సత్యాన్వేషణ ముఖ్యమైనవి. ఈ కావ్యములో ఆ లక్షణముల ప్రభావమున్నదనియేకదా తేలినది. ఈ కావ్యములోని సుందరీనందులగాథ అశ్వఘోషుడురచించిన 'సౌందరనందము'లోనిది. ఈ రెంటికిపోలిక యింత మాత్రమే. ఈ కావ్యములోని శిల్పవిన్యాసము, భావరామణీయకము, వస్తుసమున్మీలనము, పాత్రపోషణము ఈ కవులకు స్వోపజ్ఞకములైన గుణములే. ఈ కావ్యములోని భావశిల్పాదికసౌందర్యమునుగూర్చి పరిశీలించుటకిది అదనుకాదు. దీనిలోని వస్తువుపై గాంధీయదృక్పథము ప్రభావమెంతవరకున్నదో నిరూపించుటయే ప్రస్తుతాంశము. భార్యాలోలుడై సమస్తలోకమును మరచిన నందునికి బలవంతముగా బుద్ధుడు సన్యాసమిచ్చి అతని మనస్సును మార్చును. అతడనుకొన్న ప్రేమ 'అఖిలజంతుసామాన్యమై'నదని, 'అచ్చపుప్రేమ'కు 'విషయాదివికారము'లుండవని ప్రబోధించును. బుద్ధుడు నందునికి బోధించిన ధర్మసార మీ పద్యములోనున్నది.

'కొడుకులులేనివారలకుఁ గూరిమిబిడ్డవు; మాతృహీనులౌ
బుడుతలకెల్లఁ దల్లివయిపోషణసేయుము, 'నా' యనంగలే
కడలెడు దీనులన్ మనుపు, మార్తులకాదరువై భజింపు, మీ
పుడమి దివమ్ముసల్పుమిదెపో, పరమార్థము బౌద్ధజాతికిన్.'[2]

ఎల్లలులేని ప్రేమ, వెల్లివిరిసెడు జీవకారుణ్యము బౌద్ధజాతి లక్ష్యములని, అవే యెల్లరి కాదరణీయములని ఈ పద్యములో ప్రబోధింపబడినది. గాంధీగారు ప్రబోధించిన లక్ష్యములును ఇవే. గాంధీగారి ప్రభావమువలననే యీ కవులదృష్టి బౌద్ధమువైపు మరలినది. అప్పటికి బౌద్ధమతము

1. నవ్యసాహిత్యము : (వ్యాసము) : భారతి 1940 ఏప్రిలు.
2. సౌందరనందము : ధర్మసంవాదము :

భారతదేశమున ప్రచారములోలేదు. దాని ఊసెత్తిన వారెవ్వరులేరు. కావున నేరుగా బౌద్ధమత ప్రభావముతో వచ్చిన కావ్యముకాదిది, తిరుపతివెంకటకవులుగూడ ఈ శతాబ్ది ఆరంభమున బుద్ధచరిత్ర రచించిరి. అందులో విశ్వమానవప్రేమ, జీవకారుణ్యము ఇంత విలక్షణముగా రూపు దిద్దుకోలేదు. గాంధీగారి ప్రభావము వారిపై అప్పటికి సోకలేదు. సౌందరనందము 1932 లో తొలుత ప్రచురింపబడినది. అప్పటికే గాంధీజీ భారతదేశమునకు మహాత్ముడు, పితామహుడు అయినాడు. అతనిమాటలు మంత్రమ్మలైనవి. అతడు మెట్టినయెడ ప్రయాగయైనది. పింగళి కాటూరికవులలో కాటూరివారు గాంధీయదృక్పథముగలవారని వారి 'గుడిగంటల'ద్వారా నిరూపితమైనది. కావున 'సౌందరనందము' గాంధీయదృక్పథమును ధ్వనింపజేయు కావ్యమని నా యభిప్రాయము.

గాంధీగారు సాగించిన ఉద్యమములలో అస్పృశ్యతానివారణ మొకటి. పంచములుగా, అస్పృశ్యులుగా, శ్వపచులుగా హిందూసంఘముచేత నిరాదృతులైనవారికి 'హరిజను'లను పేరును రూఢమొనర్చినది గాంధీగారే. గాంధీగారి ప్రభావము భారతదేశమందంతట ఎంత బలీయముగానున్నను, తరతరములుగ వేళ్ళు పాతుకొనియున్న అస్పృశ్యతాసమస్య నిర్మూలనము కాకపోయినది. ఈ స్థితిలో తెలుగుదేశములోని నవ్యకవులు గాంధీగారి అస్పృశ్యతానివారణ సిద్ధాంతమును కావ్యకాహళలద్వారా ఉద్ఘోషించుటకు పూనుకొనిరి. కవిత్వేతరప్రక్రియలలో హరిజనసమస్యను వస్తువుగా తీసికొని తీర్చబడిన కళాఖండము 'మాలపల్లి'. గాంధీజీ హరిజనోద్యమమును ప్రారంభించకముందే గురజాడవారు 'లవణరాజుకల'లో 'మంచియన్నది మాలయైతే మాలనే యగుదున్' అని ఉద్ఘాటించిన విషయ మింతవరకే వ్రాసియుంటిని. గురజాడవారి తర్వాత 1920 నుండి ఈ హరిజనోద్యమము గాంధీగారి చలువవలన భారతదేశమందంతట వ్యాపించినది. తెలుగుకవు లనేకులు హరిజనోద్ధరణను, హరిజనదేవాలయప్రవేశమును సమర్థించుచు గీతములు, పద్యములు వ్రాసిరి. ఏనాడో వెంకటపార్వతీశ్వరకవులు 'పంచమాభినందనము'లో

'మమతదప్పిన యాతడు మాలగాక
మాటదప్పిన యాతడు మాలగాక
అన్నెమునుఁ బున్నెమెఱుగని యట్టి మాల
మాలయే ? దేవుమెతఁ బూలమాలగాక'[1]

అని అస్పృశ్యతానివారణమునకై గళమెత్తిరి. బ్రహ్మభట్ట పట్టాభిరామశర్మగారు

'మాలలు మాలలా ! భరతమాతృగళస్థిరరత్నరత్నసం
లాలితమాల; లాంధ్రమహిళాకచకల్పితనవ్యమల్లికా
మాల, లనార్య సంతతివిమానశిరోగ్రలసత్పతాకినీ
మాలలుగాని, వట్టికసుమాలపు మాలలుగారు కారిలన్'[2]

1 కావ్యకుసుమావళి : ప్రథమభాగము, ద్వితీయసంపుటి.
2. 'మాలలు': ఆంధ్రపత్రిక : 1920 ఉగాది సంచిక.

అని పంచమోద్ధరణకై కలమెత్తిరి.

దేవాలయ ప్రవేశార్హతలేక హరిజనులు కుమిలిపోయినస్థితిని, వారి నివేదనరూపమున కొందరు కవులు గీతములు రచించిరి. పురిపండా అప్పలస్వామిగారి గీతమిది.

"గుడిలోని దైవమా అలింపవోయి
గుడిలోని దయ్యమా పైకిరావోయి
నీ పాదపూజకై వెదకితెచ్చిన పూలు
నీ పాదసేవకై నింపితెచ్చిన నీళ్ళు
పనికిరావంటారు మైలపడెనంటారు.
మాలమెట్టిన నేల మాలముట్టిన నీరు
మాలపాడిన పాట మాలలాడిన మాట
మైలపడెనంటారు పనికిరాదంటారు."[1]

ఈ గీతములో మాలలకున్న భక్తితాత్పర్యములు, వానికి సమాజముచేసిన నిరోధము చిత్రింపబడినవి.

హరిజనదేవాలయప్రవేశవిషయమై, అస్పృశ్యతానివారణవిషయమై ఇటీవలికాలమున ముఖ్యముగా 1945-55ల మధ్య-అనేకగీతములు, ఖండకావ్యములు వెలువడినవి. వాని నన్నిటిని తడవక అన్నిటిలో తలమానికముపంటి 'గుడిగంటలు'[2] అన్న ఖండకావ్యమునుగురించి మాత్రము సంగ్రహముగావ్రాసి ఈ చర్చ ముగింతును.

'గుడిగంటలు'లో కవి లక్షలాది హరిజనుల ముక్తకంఠములనుండి వెలువడు వేదనాస్వరములకు శబ్దరూపము కల్పించి, ఏడుకొండలమీద 'శ్రీనీళలు జోలవాడ శయనించిన దేవర'కు నివేదించినాడు. హరిజనులతో కవి పొందినతాదాత్మ్య మీ కావ్యమున గోచరించును. హజారపుకొల్వు వాకిటకూడిన హరిజనులకు ద్వారకవాటములు తెఱపించుమని కవి తానై విన్నవించును. ఏ మాలడు ఆలనుగాచి క్షీరముల్ పిదికి నీ కర్పించునో, ఎపడు తాను పండించిన ధాన్యమును నీ గరిసెలలో నింపునో, ఎవడొక్క ప్రొద్దులిడి ముప్రొద్దునిన్నర్చించునో అట్టివానికి మోముచూపించవా యని భగవంతుని ప్రశ్నించును. హరిజనులకుగల దైవభక్తి నీ విధముగా వెంకటేశునికి విన్నవించును.

'తిన్నాడొ పస్తులేయున్నాడొ, ముప్రొద్దు
గుడవఁబెట్టును నీకుఁగడుపునిండ
కట్టెనో మైగోచిపెట్టెనో దువ్వలు
వలుదెచ్చి నీకిచ్చుఁ దలకుమొలకు

1. 'గుడిలోని దైవమా': ఆంధ్రభూమి: 1938 జూన్ సంచిక.
2. కాటూరి వెంకటేశ్వరరావుగారి రచన.

నీరాడెనో ధూళిపొరాడెనో, సుగంధి
　　నీరమ్మ్రులార్చు నీ రేపుమాపు
ఎండెనో తడిసెనో, ఎండవానలుసోక
　　కుంద నీకిదు గుళ్ళగోపురములు
నేడుకాదుగదా యితండూడిగమ్మ
సలుపుఁటొకనాడుఁ గోరికదెలియనడుగ;
వడుగవచ్చిన గుడిదూరి గడియవైచి
కూరుచుంటివి కొండెక్కి గొప్పదొరవు.'

ఈ పద్యములో కవి హరిజనుల భక్తిప్రపత్తిని వ్యాజస్తుతిగర్భితముగా నివేదించినాడు. ఇంతలో రమారమణుని అంఘ్రిసరోజయుగదర్శనము కలిగినది. హరిజనులు - 'పిల్లలు, పాపలు, ఆల్మగలు, వృద్ధులు' - ఆ శ్రీపాదసందర్శనముతో చరితార్థులైరి. ఇది భక్తిప్రధానమైన రచనగా భాసించినను వస్తువు హరిజనులకు సంబంధించినది. ఆ హరిజనోద్ధరణసమస్య గాంధీయదృక్పథమునకు చెందినదేయని వేరే వివరింపనక్కరలేదు.

కాటూరివారు వ్రాసిన 'పౌలస్త్యహృదయము'లో గూడ రేఖామాత్రముగా గాంధీతత్త్వప్రభావమున్నది. ఈ కావ్యమున రావణుడు 'ద్వేషభక్తి'ద్వారా (వైరభక్తియిదే) రాముని దర్శించి సాయుజ్యము నందినట్లు చిత్రింపబడినది. ఇది అపూర్వవిషయము. వస్తునవ్యత యట్లుండగా, రాముడు సాగరతీరమున విడిసినాడన్న వృత్తాంతమును వినిపించిన సముద్రునితో రావణుడన్న క్రింది పద్యములో గాంధీతత్త్వము స్ఫురించును.

'చూడుము నెచ్చెలీ ! విభునిజూచితివేకద ! చెప్పుమెట్టులు
న్నాడొ రఘూద్వహుండు; లలనావిరహవ్యథఁ గ్రాగి చిక్కియు
న్నాడొ ? దశాస్యకంఠదళనప్రవణాగ్రహవృత్తివెల్గుచు
న్నాడొ? అధిజ్యధన్వ దరుణద్యుతిరంజితనేత్రకోణుడై.'

గాంధీజీ దృష్టిలో శత్రువులు లేరు. ఆయనకెల్లరు మిత్రులే. జగత్తుసర్వము ఆయనదృష్టికి ప్రేమమయమే; పరమేశ్వరమయమే. లోకవిద్రావణుడగు రావణునికిగూడ రాముడు మనోభిరాముడైనాడు. ఆయన చేతిలో మడిసిపోవుట తన జీవితధ్యేయము. అట్లని రాముని కాళ్ళబడుటకతడు రాయియో, రప్పయోకాదు;[1] కోతిగాదు;[2] గ్రద్దకాదు;[3] పోరితోతప్ప అతనిచేత మడియుటకు వీలులేదు. అందువలననే ఈ 'ద్వేషభక్తి' మార్గము ననుసరించెను. నేను మొదటనే మనవిచేసినట్లు ఇది జీవునికి పరమాత్మకుగల ఒక విలక్షణప్రవృత్తిని దృష్టిలో పెట్టుకొని వ్రాసిన రచన,

1. శిలారూపములోనున్న అహల్య. 2. సుగ్రీవాదులు. 3. జటాయువు.

అనగా ప్రధానముగా భక్తిరచన. కాని రావణుని మనస్తత్త్వవిశ్లేషణముచేసినచో గాంధీతత్త్వ చ్ఛాయలు కన్పడును.

ఇంతవరకు సంఘసంస్కరణకవిత్వములో ముఖ్యమైన అంగములను మాత్రమే పరిశీలించిచూపితిని. ఇవికాక మద్యపాననిరసనము, వ్యభిచారనిరసనము మున్నగువానిగూర్చి అసంఖ్యాకముగా గేయములు రచింపబడినవి. ముఖ్యముగా మద్యపాననిషేధమునుగూర్చి వచ్చిన గేయములసంఖ్య కంతులేదు. వీనిలో దాదాపన్నియు ప్రచారస్థాయిని దాటిరానందున వానిగురించి చర్చించలేదు. గరిమెళ్ళ సత్యనారాయణగారు రచించిన ఒక్క గీతముమాత్ర ముదాహరింతును.

> 'కల్లుత్రాగబోకు - కడుపుమాడ్చుకోకు
> నీ యిల్లుగుల్లసేయకోరి తమ్ముడ - నీయిల్లు...
> పిల్లాజెల్లాలేద్వ - తల్లిదండ్రులువగవ
> నీ ముల్లెవ్యర్థముసేయకోరి తమ్ముడ-నీముల్లె...
> ఇల్లాలుసురుపొంద - ఇతరులెల్లరుతిట్ట
> కల్లుత్రాగబోకురోరి తమ్ముడ - కల్లు...'

ఈ విధముగా సాగిపోవు దీర్ఘగీతమిది.

# 5. భక్తి కవిత్వము

## (Mystic Poetry)

భావకవిత్వములో ఇంతవరకు పేర్కొన్న వివిధ శాఖలతోపాటు భక్తికవిత్వముకూడ ఫలప్రదముగా వర్ధిల్లినశాఖ.

'సాత్వస్మిన్ పరప్రేమరూపా'అని నారదభక్తిసూత్రములలో భక్తి నిర్వచింపబడినది. స్త్రీ పురుషులకుండు పరస్పరానురాగము కేవలప్రేమయే. భగవంతునియెడలగల ప్రేమ దీనికి భిన్నము. అందుకే దీనిని భగవద్రతియన్నారు. ఇది అహంకార రహితమైనది; అవ్యాజమైనది; విషయగంధ విదూరమైనది. సమాధిగతులైన మునీంద్రులు స్వస్వరూపజ్ఞానమును విస్మరించి నట్లు, భక్తులు భగవచ్చింతనలో స్వార్థము సన్యసింతురు. వారి చిత్తము భగవదధీనమైయుండును. ఇది భక్తికి నేపథ్యరంగము. పూజ్యపూజకభావమే భక్తికి మూలబీజమువంటిది. పూజ్యపదార్థ మును పొందుటకు భక్తుడుచేయు ప్రయత్నము సాధన. ఈ సాధన అనేకరూపముల నుండ వచ్చును. దాస్యభక్తి, సఖ్యభక్తి, వాత్సల్యభక్తి, మధురభక్తి మున్నగునవి దీని రూపాంత రములు. లక్ష్యమన్నిటికొకటే. హనుమంతునిది దాస్యభక్తి; అర్జునునిది సఖ్యభక్తి; యశోదది వాత్సల్యభక్తి; గోపికలది మధురభక్తి. స్థూలముగా మనసంప్రదాయములో భక్తిస్వరూపమిది. రామాయణభాగవతాదిగ్రంథములలో ఈ భక్తిభేదములన్నిటికి లక్ష్యములున్నవి. భావకవులలో భక్తికవిత్వమును వెలయించినవారు పలువురున్నారు. ఆస్తికత్వము భావకవిత్వ లక్షణములలో ఒకటని రాయప్రోలువారంగీకరించినారు.[1] వీరిలోకొందరు త్రిమూర్తుల ప్రతినిధియైన జగదీశ్వ రిని ఉపాసించినవారున్నారు. ఆ జగదంబను సమీపించుటకు పంచభూతాత్మకమైన ప్రకృతిని ఆశ్రయించినారు. ప్రకృతిద్వారా పరమాత్మసాయుజ్యముకొరకు భావకవులు చేసిన ప్రయత్న మును 'ప్రకృతి కవిత్వ' విభాగములోనే మనవిచేసియుంటిని. ఈ తెగకుచెందిన భక్తిమార్గము భావకవిత్వమున ప్రబలముగా లేదు. భావకవులలో అధికులు మధురభక్తిమార్గమునే ఆశ్ర యించిరి. కొందరీమార్గములోనే అహంకారత్యాగమును, ఆత్మనిందను ప్రదర్శించిరి. ఇది మధుర భక్తికన్న భిన్నమైనమార్గము. వెంకటపార్వతీశ్వరుల ఏకాంతసేవ మధురభక్తికి చక్కని నిదర్శ నము. వారి 'భావసంకీర్తనము'లో దాస్యభక్తి, వాత్సల్యభక్తి, నిర్గుణభక్తి, ఆర్తభక్తి మున్నగు అనేకలక్షణములున్నవి. వీనితోపాటు ఈషణత్రయనిరసనము, పరిదేవనము, శరణాగతి, నామగుణసంకీర్తనము, పరతత్త్వగవేషణముకూడ కలవు. ఈ శాఖలతోపాటు తత్త్వప్రధాన

1. భావకవిత్వము : (వ్యాసము) భారతి : శ్రీముఖమాఘము.

మైన కవిత్వముగూడ వెలువడినది. ఈ శాఖలన్నిటిపై ప్రాయికముగా మన భారతీయ సంప్రదాయ ప్రభావమే యున్నది.

ఇంగ్లీషు కాల్పనికకవిత్వములోగూడ ఈ భక్తికవిత్వము బలమైన శాఖయే. మనము భక్తియన్నదానినే వారు Mysticism గా భావించిరి. Christianity, Transcendentalism[1] కాల్పనిక కవిత్వములోనికే చేరునని విమర్శకులభిప్రాయపడిరి. కాల్పనిక కవులలో బ్లేక్, టెన్నిసన్, కూపర్ మున్నగువారు మిస్టిక్ కవులు. వీరిలో బ్లేకు మకుటమణి. తొలుత ఈ Mysticism స్వరూపమును సంగ్రహముగా నివేదింతును.

**Mysticism[2] :**

Mystic అనగా

"One who sees by contemplation and self surrender to obtain union with or absorption into the deity or who belives in the spiritual apprehension of truths inaccessible to the understanding" అని ఆక్స్ఫర్డు ఇంగ్లీషుడిక్షనరీ యిచ్చిన అర్థము. భక్తుడు భగవంతుని ప్రత్యక్షముగా చూచుటకు, అతనిలో లీనమగుటకు పొందు ఉత్కంఠయే మిస్టిసిజమని దీనితాత్పర్యము. ఇది మన భక్తినిర్వచనమునకు సన్నిహితముగానే యున్నది. పరమాత్మలో లీనముగుకాంక్షతో భక్తుడు తదన్వేషణము ప్రారంభించును. జీవితము అవతలిగట్టునుగూర్చిన చింతన ప్రారంభించును. బహిరింద్రియ నిర్ణీతములైన యెల్లలనుదాటి కనిపించని సూక్ష్మప్రకృతిలోనికి ప్రవేశించి దానినావిష్కరించుటకు ప్రయత్నించును.

Mystics ప్రపంచములోని సర్వపదార్థములలో పరమాత్మ స్వరూపమును దర్శింతురు. రాబర్ట్ బ్రౌనింగను కాల్పనికకవి సర్వము భగవన్మయమనెను.

'In the star, in the stone; in the flesh, in the soul and cloud.'

ఈ ధోరణిని వారు Pantheism అనిరి. కూపర్ అను కవికూడ

"Nature is but a name for an effect
Whose cause is God" ('The Task')

1. Transcendentalism (అతీత్యవాదము) అనగా అనుభవమునుదాక అతిలోకశక్తులను విశ్వసించు తత్త్వము.

2. Mystic poetry కి సమానార్థకముగా 'మర్మకవిత్వ'మను పదమును దువ్వూరి రామిరెడ్డిగారు ప్రయోగించినారు. కాని ఇది అంతసరియైనదికాదు. వారు 'మర్మకవిత్వము' అను వ్యాసములో ఆధ్యాత్మిక కవిత్వమును, మధురభక్తి కవిత్వమును పాశ్చాత్యుల సింబాలిజమును ఒకే ప్రణాళికలోవేసి పరిశీలించినారు. మన ఆధ్యాత్మిక కవిత్వమునకు, బోద్లేర్ మున్నగు పాశ్చాత్యకవుల సింబాలిక్ కవిత్వమునకు రెడ్డిగారు 'మర్మకవిత్వమ'ను పదమునే ఉపయోగించినారు. Mystic poetry అనగా ప్రధానముగా మనభక్తికవిత్వమువంటిదే. దానిలో మర్మత ఉండవచ్చు; ఉండకపోవచ్చు. మర్మతయన్నది భావవ్యక్తీకరణమునకు సంబంధించిన గుణముమాత్రమే.

అనెను. మిస్టిక్‌కవి దృష్టిలో ఈ ప్రపంచములోని ఏ పదార్థము ఉపేక్ష్యము, అల్పముకాదు. బ్లేకు వ్రాసిన క్రింది చరణములలో ఈ సత్యమే నిరూపింపబడినది.

'To see a world in a grain of sand
And a heaven in a wild flower
Hold infinity in the palm of your hand
And eternity in an hour.'

ఈ విధముగా దృశ్యప్రపంచములోని ప్రతి పదార్థము ఏదోఒక అతీతశక్తికి అదృశ్యశక్తికి ప్రతీకగా ఉన్నదనుభావమే మిస్టిసిజమునకు దారితీసినది. ఆ అదృశ్యశక్తి నందుకొనుటకు మానవుడు, జ్ఞాని, వేదాంతిచేసెడు ఉడ్డీనమే మిస్టిసిజము సారాంశమనవచ్చును.

సర్వము భగవన్మయమనుతత్త్వము మనకు క్రొత్తకాదు. భారతీయతత్త్వశాస్త్రమంతయు ఈ సిద్ధాంతము మీదనే ఆధారపడియున్నది.

'యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి'[1]

అని భగవద్గీతలో పరమాత్మని విశ్వవ్యాప్తిలక్షణము బోధింపబడినది. అరవిందుడు

'In the blue of the sky, in the green of the forest,
Whose is the hand that has painted the glow'

అను పంక్తులలో నింగినీలిమ, అడవిలోని పచ్చదనము ఆ భగవంతుని విలాసములేయని అభిప్రాయపడినాడు. తెలుగుకవికూడ భగవంతుని

'పూలకంచాలలో రోలంబములకు రే
పటి భోజనము సిద్ధపరచు' వాడుగా
తెలవారకుండ మొగ్గలలోన చొరబడి
వింతవింతల రంగువేయు' వాడుగా[2]

చిత్రించినాడు. కావున ఈ విషయములో పాశ్చాత్యుల మిస్టిక్‌కవులకు ప్రాచ్యుల భక్తకవులకు భేదమేమియులేదు.

ఇంగ్లీషు సాహిత్యమున మిస్టిక్ కవిత్వముతోపాటు Meta-physical poetry అను మరియొక శాఖయున్నది. ఇది మొదటిదానికన్న కొంచెము భిన్నమైనది. ప్రశ్నించుట దీని ప్రధానగుణము. ఈ సృష్టికి మూలమేమి? పరతత్త్వస్వరూపమేమి? మానవునికి పరమాత్మకుగల సంబంధమేమి? ఈ విధమైన జిజ్ఞాస ఈ కవిత్వమునకు ముఖ్యగుణము. మిస్టిసిజములో ఆత్మ

1. భగవద్గీత : VI-30.
2. ఉదయశ్రీ : ప్రథమభాగము : కరుణశ్రీ.

సమర్పణము, పరతత్త్వముపై విశ్వాసమేకాని హేతుజిజ్ఞాసయుండదు. ఈ రెంటికిగల తారతమ్య మిట్లు చెప్పబడినది.

'—Metaphysician seeks to know the beginnings or causes of things, whereas the mystic feels he knows the end of things, that all nature is leading up to union with the one.'[1]

స్థూలదృష్టితో చూచినచో మెటఫిజికల్ కవిత్వము మనవేదములలోని పరతత్త్వ జిజ్ఞాసతో సంవదించుచున్నది.[2] కాని ఒకచిన్న వ్యత్యాసము గమనింపవలసియున్నది. మెటఫిజికల్‌కవి పరతత్త్వగవేషణమునకి భౌతిక ప్రపంచమునే సాధనముగా స్వీకరించును. భారతీయులపరతత్త్వ జిజ్ఞాస బహిఃప్రపంచము నాశ్రయించదు. పాశ్చాత్యుల మిస్టిక్‌కవికి, మన భక్తకవికి మరియొక వ్యత్యాసమున్నది. ప్రాచ్యులు ఇంద్రియ సంప్రాప్తమైన జ్ఞానము జ్ఞానముకాదనిరి. దేహము నశ్వరముకావున దానిద్వారా పరమాత్మదర్శనము జరుగదని భావించిరి. అందుకే వారంతర్ముఖులైరి. మనోబుద్ధిచిత్తాహంకారములనుదాటి, ఆత్మముకురమున పరమాత్మప్రతిబింబమును దర్శించుకొనిరి. పాశ్చాత్యుల మిస్టిక్ కవిత్వమునకు సాధనమైన క్రైస్తవమత మట్టిదికాదు. అది భగవంతుడు మానవరూపమున అవతరించునని విశ్వసించినదికావున మానవుల పరస్పర సంబంధములోనే దివ్యత్వమున్నదని భావించినది. అందుకే పాశ్చాత్యదేశములోని ఆధ్యాత్మికకవి ఆత్మలోనికి దిగిపోలేదు. బహిర్ముఖుడైనాడతడు. అనగా భగవంతునికొరకు ఆకాశమువైపు తలయెత్తి చూచినాడు. మనవారిదృష్టిలో ఏ బహిఃప్రపంచము ఆధ్యాత్మిక సాధనకు ప్రతిబంధకమైనదో అదే పాశ్చాత్యుల కుపస్కారకమైనది. ఈ రెండు దృక్పథములకున్న భిన్నత్వమును స్పర్జన్ (C. F. E. Spurgeon) ఇట్లు స్పష్టపరిచిచాడు.

"The ultimate goal of the eastern mystic is summed up in his assertion 'I am Brahman', where as the Western mystic believes that 'he who sees the Infinite in all things sees God."[3]

మనవారుగూడ సృష్టిలో పరమాత్మయొక్క అంశను దర్శించిరికాని వారి చరమలక్ష్యము అంతర్ముఖత్వముద్వారా, ఆత్మదర్శనముద్వారా సాధింపబడినది.

### 1. పారమార్థిక కవిత్వము :

నవ్యకవి సృష్టియొక్కటేయని, ఈశ్వరుడొక్కడేయని భావించెను. తాపత్రయసంతప్తమైన యీ లోకమునకు పరమాత్ముడే ఏకైకగమ్యమని భావించెను. ననలు, సొనలు, మంజుకుంజములు, ఆ పరాత్పరుని ఆనందహాసలేశాంకురములుగా భావించెను. ప్రతిపుష్పము భావకవికి భగవంతుని ప్రణయలేఖగా భాసించినది. పరమాత్ముడు

1. Mysticism In English Literature : C. F. E. Spurgeon : P. 18.
2. దీనికి ఇంగ్లీషులో John Donne ముఖ్యుడు.
3. Mysticism In English Literature : P. 28.

'సడలుమేనికి పీవన, బడలునెదకు
తీయనగు నుడి, వడులు పూదీవకమృత
జీవమిడు వానజడి' గా[1],

దీనపావనుడుగా కనిపించినాడు. అప్పుడు కవి తన్నుతాను చూచుకొనగా తానెంత పాపియో, అహంకారియో, అల్పుడో అర్థమైనది. భగవంతునితో తన క్షుద్రగుణములను మొరపెట్టు కొన్నాడు. 'కుక్కగొడుగుక్రిందఁగూర్చుండి, ఛత్రాధిపతిననుకొని', బడలువడితినని, 'కుమ్మరి సారెపైజేరి భూచక్రంబెల్ల నాయధీనంబనినమ్మి దండధరుండనై కన్నుగానక యలజడిబడితి'నని, చివరకు 'గొడుగు ముడిగిపోయినది; కులాలచక్రంబు తునియలై పోయిన'దని, అప్పుడు తానెంతటి అధమమర్త్యుడో తనకు తెలిసినదని ప్రభునితో నివేదించుకొన్నాడు.[2] తానెన్నో పాపములు చేసియుండును. అందువలననే భగవంతుడు తన్ను మన్నించుటలేదు ఈ విషయమును గ్రహించి పరమాత్మునితో 'నా మహాపాపము రూపింపు మరిశిక్షకైన నేనోర్చుకొందు'[3]నని మొరపెట్టు కొన్నాడు. పూర్వము తాను ధనవంతుడుగా నున్నప్పుడు పదిమందికి పోషకుడనని, సుగుణ పరుడనని, జ్ఞానవంతుడనని, పలువురి మెప్పుపొందితినని, ఇదియంతయు తన మహత్త్వమని పొంగిపోయితినని, ఇప్పుడు పరమాత్ముని పాదయుగళభక్తితప్ప ఏదియు మిగులలేదని నివేదించుకొని కవి అహంకార త్యాగమును ప్రకటించెను.[4] ఒక్కొక్క చిత్తప్రవృత్తిదశలో తానుచేసిన పాపకార్యములకు, తన అహంకారబుద్ధికి తానే సలసలక్రాగిపోయి భగవంతునితో

"ఈ మహాపాపి, గర్విష్ఠ, నీ కిరాతు
గరుణఁజేరంగదీయకు - కాలయవను
చేతి గండ్రగొడ్డండ్రతో చిన్నచిన్న
ఖండములుగ నరుకనిమ్ము"[5]

అన్నంతతీవ్రముగా తనబాధ వెల్లడించుకొనెను.

తనవి గడ్డిపూవులని, అతని యిష్టమైనచో వానినాతని పూదండలో మెరసిపోనిమ్మని, తనవి లేతగీతములని, అతనికిష్టములైనచో అతని కీర్తనములో మ్రోగిపోనిమ్మని, తనది పేదజీవిక యని అతని యిష్టమైనచో అతనిరాజవీధిలో సాగిపోనిమ్మని ఆత్మన్యూనత్వమును; భగవదాధిక్యమును ప్రకటించెను.[6]

1. ఋగ్వేది : కృష్ణశాస్త్రి : (రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి ఆంగ్లసూక్తులకనువాదము).
2. 3. 4. భావసంకీర్తనము : వెంకటపార్వతీశ్వరకవులు : 5, 39. 78 పద్యములు.
5. కలువరేకులు : వి. టి. కె. ఆచార్య : 1929 ప్రచురణ.
6. మహతి : కృష్ణశాస్త్రి : 43 వ గీతము.

ఇంతటి పశ్చాత్తాపమును ప్రకటించినను, ఇంతగా అహంకారత్యాగ మొనర్చినను, ఇంతగా తన అల్పత్వమును ప్రసరించినను పరమాత్మసాన్నిధ్యము లభించలేదు. ఆ స్థితిలో కవికి కన్నీరొక టే శరణ్యమగును.

'కురియుమురా కన్నీరును మరి మరి విలపించుమురా
సరముగూర్చి పరమేశుడు తాల్చునురా పాపీ'[1]

అని తన్నుతాను సంబోధించుకొనును. మలినబాష్పమౌక్తికమ్ము మిలమిలమని కనులమెరసినచో తళతళమని తారలు నటియించునను.[2] 'గాఢలజ్జానుతాపసంకలితహృదయనీరజదళాల రాలు కన్నీటిచుక్కగాక' కానుకగా నీకేమొసంగగలుగుదునని పరమాత్మునితో విన్నవించుకొనును.[3]

"ఎట్లు నిన్నూహ సేయుటో యెఱుగలేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు.
రాజరాజేశ్వరకిరీటరాజఘటిత
రత్నమాణిక్యకాంతినీరాజనార్చి
తాంఘ్రినీరేజయుగళుడవయ్య ! చింపి
పాతలం గట్టికొని జీర్ణపటకుటీర
పాకికాప్రాంగణముల నివాసమేల ?"[4]

అని ప్రభుని వింతచేతల నర్థముచేసికొనలేక క్రుంగిపోవును. ఈ గీతము రవీంద్రుని క్రిందిగేయ భాగమును స్మరింపజేయును.

"Pride can never approach where thou walkest in the clothes of the humble among the poorest and the lowliest and lost."[5]

ఈ విధముగా భావనచేసికొన్న కవిభగ్నాశలు, తాపాగ్ని, ఆత్మలోజరుగు సంగ్రామము, సందేహములు-అన్నికలసి ఉప్పొంగిపొరలి అశ్రురూపమున ప్రవహించును. అశ్రుసమర్పణములోని ఉదాత్తత నింతగా గుర్తించుట; దానిని మిన్నులకెత్తుట నవ్యకవిత్వములోని ప్రత్యేకత. థామస్‌మూర్ (Thomas Moore) అను ఇంగ్లీషుకవి

'Bless tears of Soul-felt penitence
In whose benign redeeming flow
Is felt the first, the only sense
of guilt-less joy that guilt can know'[6]

1. 2. కృష్ణపక్షము : 'పాపీ' : (ఈ గేయము తొలుత 'కన్నీరు' అను పుస్తకములో ప్రకటితమైనది).
3. 4. కృష్ణపక్షము : 'నాకానుక', 'క్రుంగిపోదు'.
5. గీతాంజలి : రవీంద్రుడు.
6. Quoted by Sri P. Ramaswamy in his Introduction to 'కన్నీరు'.

అను గేయఖండములో కన్నీరు ఆత్మప్రక్షాళనమునకు అమూల్యమైన సాధనమని అభిప్రాయపడి నాడు. తెలుగుకవికూడ

'ఎదమెత్తనగుటకై సొదగుందరా అంత
మదిగల యహమ్మెల్ల మాసిపోవునురా'[1]

అని ఆత్మక్షాళనతత్త్వము ననుసరించినాడు. కన్నీరు ఊషరక్షేత్రమువంటి హృదయమును పదనుపరిచి సమస్త కాలుష్యములను పోద్రోలి, అభినవజీవకళలను చిగురింపజేయునని భావించి నాడు. తాను జలజల కన్నీరుకురిసినతర్వాత పరమాత్మ సాన్నిధ్యము లభించినట్లే తృప్తుడైనాడు.

'కలుషదుర్దాంతపంకసంకలితకుహర
ముల జనించు మదీయాశ్రుమలినధార
స్వామి, భవదీయపాదదేశమునఁ బాఱి
పరమపావనజాహ్నవీప్రతిభఁగాంచు.'[2]

ఈ విశ్వాససూర్యోదయమైన పిమ్మట భక్తునికి, భగవంతునికి భేదభావముండదు. ఈ విధముగా పరమాత్ముని స్వరూపమును నిర్గుణమార్గమున భావించుకొని, అతని సర్వోత్తమత్వమును కీర్తించి, తన అల్పత్వమును నిరసించి, అహంకారమును గళితమొనర్చి, ఆత్మను కన్నీటిలో తడిపి, ఆ భగవచ్చరణసన్నిధానమున సమర్పించి తాను తృప్తుడైనాడు. భగవంతునికి, భక్తునికి గల సంబంధ మీరీతిగా నిరూపితమైన భక్తికవిత్వశాఖను 'పారమార్థిక కవిత్వ'మని పేర్కొన్నదిందుకే.

## 2. మధురభక్తి కవిత్వము :

'వాసుదేవఃపుమానేకః నార్యశ్చసకలంజగత్' అనియు, 'గోవిందఏవపురుషో బ్రహ్మాద్యాః స్త్రియ ఏవచ'అనియు మనప్రాచీనులభిప్రాయపడిరి. ఈ యభిప్రాయమునకు లక్ష్యములైన వైష్ణవగీతములు శ్రీకృష్ణుని మన్మథమన్మథుడుగా చిత్రించినవి. 'పుంసాంమోహనరూపాయ నమః'అని కీర్తించినవి. పరమపురుషుడే పురుషుడు; ఇతరులందరు స్త్రీలను అభిప్రాయము వైష్ణవ వాఙ్మయమున స్థిరపడిపోయినది. శైవులుగూడ పార్వతీపరమేశ్వరులను శృంగారమూర్తులుగా చిత్రించుకొన్నను వారిది 'భక్తిశృంగారము'.[3] అనగా ప్రారంభమున భక్తిగా కనిపించినను క్రమముగా శృంగారమే దానికి పరమావధి. వైష్ణవులట్లుగాక 'శృంగారభక్తి'ని ప్రతిపాదించిరి. అనగా శృంగారముతో ప్రారంభమై భక్తిలో పర్యవసించుమార్గము వీరిది. ఇంకొక విలక్షణత ఈ రెంటికి నడుమనున్నది. శైవులు పార్వతీపరమేశ్వరుల నిత్యసంయోగమునే చిత్రించిరి.

1. బసవరాజుఅప్పారావు గీతాలు. 2. కృష్ణపక్షము : 'కన్నీరు'.
3. శివునిదారుకావనవిహారవృత్తాంత మీ సందర్భమున గమనింపదగినది.

వారికి విరహదశ గమ్యముకాలేదు. వైష్ణవులట్లుకాక రాధాకృష్ణుల గోపీకృష్ణుల విరహశృంగారమునే విశేషముగా చిత్రించిరి. ఈ విధముగా చిత్రింపబడిన గోపీకృష్ణులశృంగారము జీవాత్మ పరమాత్మల వియోగసంయోగములకు సంకేతము. భగవంతుని ప్రియునిగా భావించుకొని తన్ను తాను ప్రేయసిగా భావించుకొనుటయే మధురభక్తి. రాధాకృష్ణులు, గోపికాకృష్ణులు జీవాత్మ పరమాత్మల మధురభక్తికి పర్యాయపదములై పోయినారు. మధురభక్తిలో సర్వాత్మసమర్పణము భగవద్వియోగదుస్సహత్వము ముఖ్యములు. గోపికలు కృష్ణభగవానుని తమప్రియుడుగా భావించుకొని ఆత్మసర్వస్వమాతనికి అప్పనవెట్టిరి. అతడు సాక్షాత్కరించగా పరవశలై పాడిరి. అతడుదూరమైనప్పుడు దుర్భరవియోగాగ్నిలో తుకతుక ఉడికిపోయిరి. శ్రీకృష్ణుని వేణుగానము వినగానే పతులను, సుతులను విడిచి, అన్నపానములను మరచి, యమునానదీతీరమునకు పరుగెత్తిరి గోపికల క్రీడలన్నియు అంతఃకరణసంబంధములే. కాని కాయజములుకావు. రాసక్రీడ లిట్టివే. సమస్తకర్మబంధములను తెగద్రెంచుకొని వారి జీవాత్మలు ఈశ్వరేచ్ఛానుసారముగా చేసిన దివ్యనృత్యమే రాసక్రీడ. ఒకవేళ శ్రీకృష్ణుని జగన్మోహనాకారమునుజూచి మొదట గోపికలు మదనపీడితలైనను క్రమముగా ఆ భావము విగళితమైపోయి 'పరాభక్తి'గా మారినది. నారదభక్తి సూత్రములలోని

'నాస్త్యేవ తస్మిఞ్ తత్సుఖిసుఖత్వమ్' (24వది)

అను సూత్రములో భగవంతునితో క్రీడించినప్పుడు గోపికలకు సుఖముగాని, తత్సుఖభావముగాని లేవని స్పష్టముచేయబడినది. అనగా కృష్ణునకు సౌఖ్యము సమకూర్చుటయే తప్ప వారికి స్వసుఖభావనలేదు. అహంకారవిదూరమైన భక్తియిది.

మధురభక్తిశాఖ భారతీయ సాహిత్యములన్నిటిలో పూచి, కాచి, ఫలించినది. భాగవతము, కృష్ణకర్ణామృతము, గీతగోవిందము సంస్కృతములో మధురభక్తి శాఖకు వెలసిన సుధాకళికలు. మహారాష్ట్రుల 'అభంగ'గీతములలో ఇది కనిపించును. హిందీలో 'మీరాబాయి పదావళి'లో, వంగదేశమున చండీదాసు మున్నగు వైష్ణవకవుల గీతములలో, రవీంద్రుని 'భానుసింహపదావళి'లో ఈ భక్తితత్త్వమే నిర్దేశింపబడినది. చైతన్యుడు తన అవసానదశలో కృష్ణవియోగములో కుమిలికుమిలిపోయినట్లు, జ్ఞానదేవుడు, తుకారాం మున్నగువారు భగవంతుని వియోగముతో తపించిపోయినట్లు ప్రమాణములున్నవి. ఇస్లాముకవులలో హఫీజు, రూమీ, జామీ మున్నగువారుసైతము జీవాత్మ పరమాత్మలమధ్యగల తాత్త్వికబంధమునే రకరకములుగ గానముచేసిరి. పాశ్చాత్యులుగూడ క్రీస్తును, జీవాత్మను, వరుడుగా, వధువుగా భావించిరి.

తెలుగున అన్నమాచార్య కీర్తనలలో, ఆంధ్రభాగవతములో, క్షేత్రయ్య పదములలో మధురభక్తి పరాకాష్ఠనందుకొన్నది. ముఖ్యముగా భాగవతములోని గోపికాగీతలిందుకు పసిడి తునకలవంటివి నవ్యకవిత్వములో వెలువడిన భక్తికవిత్వమున మధురభక్తియే అధికమని మనవిచేసితిని. దీని అవతరణకు ఆంధ్రభాగవతము, క్షేత్రయ్యపదములు, గీతగోవిందము, కృష్ణకర్ణామృతము మూలప్రభావములు. వీనితోపాటు రవీంద్రుని 'గీతాంజలి' ప్రభావమునుగూడ

విస్మరించుటకుపీలులేదు. గోపికాకృష్ణుల ప్రస్తావనయేలేక సూటిగా ప్రభువును ప్రాణేశ్వరునిగా, విశ్వమంతయు ప్రాణవిభునిమందిరముగా భావించుటలో రవీంద్రుని ప్రభావము, వంగవైష్ణవగీతముల ప్రభావమున్నది. ఇంతకుమించి ఈ విషయమున ఇంగ్లీషు కాల్పనికకవుల ప్రభావ మిసుమంతయులేదు.

నవ్యకవిత్వములో మధురభక్తి కవిత్వమునకు వెంకటపార్వతీశ్వరుల 'ఏకాంతసేవ' ప్రతినిధికావ్యము. ఈ కావ్యము మొదట 1922 లోనే ప్రచురింపబడినది. అప్పటికే 'గీతాంజలి' వెలువడినది. ఈ రెండు కావ్యములలోని వస్తువొకటే. ఆస్తిక్యభావమును మధురముగా చిత్రించిన కావ్యములివి. రెంటిలోను యుగయుగముల విశ్వమానవుని మధురసాధన 'మధురముగ, మార్దవంబుగా, మంజులముగ, మానసానందకరముగా, మంగళముగ' చిత్రింపబడినది. ఈ రెండును 'ప్రవిమలభక్తి యుక్తుడైనభక్తుడు పరమేశ్వరునిగూర్చిపాడు' మధురగీతములే. స్థూలముగానున్న ఈ సాదృశ్యమును పురస్కరించుకొనియే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు 'వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమునకీ మహాకవుల-భక్తుల 'యేకాంతసేవ' యట్టిదని నా అభిప్రాయము' అని యన్నారు.[2] అప్పటినుండి 'ఏకాంతసేవ' గీతాంజలికనుకరణమేమోయన్న అభిప్రాయము కొందరికి కలిగినది. ఇది సరికాదు. ఇవి దేనికది విశిష్టములైనవి. ఏకాంతసేవలోనున్నది కేవలము మధురభక్తియే. భక్తుడు తన్నుతాను ప్రియురాలిగా భావించుకొని హృదయేశ్వరుడగు పరమేశ్వరుని సందర్శనముకొరకు, సాయుజ్యముకొరకు తపించుట, అందుకు ప్రకృతిలోని కోకిలలను, తుమ్మెదలను చెలులుగా, ప్రణవవనంబులోపలి పుష్పరథములుగా[3] భావించుకొని ప్రాణేశ్వరునికి సందేశముపంపుట, చివరకిరువురి వదనంబులు, ఇరువురి నయనంబులు, ఇరువురి హృదయములొకటియై పరమేశ్వరునితో తాదాత్మ్యసిద్ధినందుట - ఇది ఏకాంతసేవలోని యితివృత్తము. ప్రాచీనాంధ్రశతకకర్తల భక్తిపాకము, కృష్ణకర్ణామృతము, కృష్ణలీలాతరంగిణి మున్నగువానిలోని రాధామాధవుల శృంగారము మిళితమై 'ఏకాంతసేవ'గా వెలువడినది.

రవీంద్రుని 'గీతాంజలి' కేవలము మధురభక్తికి సంబంధించినదికాదు. ఆ కావ్యములోని భక్తుడు కొన్నిచోట్ల మధురభక్తికిచెందిన నాయికగా కనిపించినను, మిగిలినచోట్ల ప్రకృతిప్రేమికుడుగా, సౌందర్యారాధకుడుగా, విశ్వగాయకుడుగా గోచరించును. అందలి సంబోధనలు నిరాకారనిర్గుణపరమాత్మ నుద్దేశించినట్లేయుండును. రాధ కృష్ణునిపిలిచినట్లుండదు. అనగా గీతాంజలిలో వినిపించునది పరుషముకాని పురుషవాక్కు. శాంతచిత్తములోనుండి సాగరగంభీరముగా వెలువడినవాక్కు. అతనిది కేవలమొక అనంతాన్వేషణ; ఆధ్యాత్మికగవేషణ. ప్రభువాతనికి ప్రియుడు మాత్రమేకాదు; తండ్రి; అన్న; చెలికాడు;[4] మృత్యువు ఆ ప్రభునిదూత.[5] ఇంకొకదశలో ప్రభువెవ్వరని ప్రశ్నించినచో అతడేమియు బదులుచెప్పలేడు.

1. 2. ఏకాంతసేవ : పీఠిక : 3. ఏకాంతసేవ :
4. గీతాంజలి : LXXVII లోని భావము.
5. 'Death, thy Servant, is at my door' : గీతాంజలి : LXXXVI.

'They come and ask me 'Who is he' ? I Know not how to answer them. I Say, indeed, I Cannot tell'.[1]

కావున రవీంద్రుని గీతాంజలి వాస్తవికత, హేతుసంబద్ధత, సౌందర్యతత్పరతఉన్న మిస్టిక్ కవిత్వమని చెప్పవలెను. ఈ రెండుకావ్యములు సరళమైనభాషలో, మృదులమైనశబ్దములతో, సామాన్యమైన దేశిచ్ఛందస్సులో, మధురభావనామయముగా రచింపబడినవి. అంతకుమించి వీనికి పోలికలేదు.

ఈ మధురభక్తి కవిత్వము నవ్యకవితా కేదారమున రెండు పాయలుగా ప్రవహించినది. రాధాకృష్ణుల గోపికాకృష్ణుల సంయోగ వియోగములను, మోదవిషాదములను, ఆయా పాత్రలనే ఆశ్రయించి చిత్రించునదొకటి. దీనిని స్థూలముగా వస్త్వాశ్రయరీతి యనవచ్చును. వస్త్వాశ్రయ మనగానే ఈ రీతిలో కథకు ప్రాధాన్యమున్నదని అర్థముకాదు. ఇదియు భావప్రధానమైన రచనయే కాని నాయికానాయకులలో కవి ఆత్మానుభూతి చిత్రణకంతగా ప్రసక్తియుండదు. గీతగోవిందము మున్నగువానిలోవలె రాధాకృష్ణుల, గోపీకృష్ణుల పాత్రచిత్రణము, మనస్తత్వనిరూపణము ఇందులో ప్రధానము. కవి తన్నుతాను గోపికగానో, రాధికగానో భావించుకొని కృష్ణాన్వేషణము సేయుట, కృష్ణవియోగములో దహించుకొనిపోవుట, ఆ వియోగస్థితిలో తనబాధలను, మధుర వేదనాశీలమైనగాథలను 'వెళ్ళబోసికొనుట' రెండవపాయకుచెందినవి. ఇది ఆత్మాశ్రయరీతికి సంబంధించినదనవచ్చును. ఈ రెండుపాయలను నవ్యకవులు స్వీకరించిరి. మొదటిపాయకు విశ్వనాథవారి 'శృంగారవీధి' నిస్తుల నిదర్శనము.

'మదనమహీపతిప్రసవమార్గణభిన్నశరీర'యైన రాధిక వేపథుస్థితివర్ణనతో ఈ కావ్యము ప్రారంభమగును. ఆమె 'నిర్దయుడైన గోపరమణీప్రియునే' స్మరించుచు 'విరహబాధానిబిరీసయై' పాంథకన్యావ్యధాకరములగు పండువెన్నెలలను, కోకిలాగీతులను మున్నగువానిని ఉపాలంభించును. ఇంతలో ఆమె పంపున ప్రణయదౌత్యమునకు వెళ్ళిన దూతిక తిరిగివచ్చి రాధతో 'మనము జ్ఞాపకమా ? యదువంశమౌళికన్'అనును. తర్వాత రాధ మూర్ఛావస్థ, శిశిరోపచారములు వర్ణింపబడును. శ్రీకృష్ణునిమనస్సులో రాధాభావము వ్యాపించును. అతడు రాధను చేరదీసి అనునయించును. తదనంతరము రాధాకృష్ణుల సంయోగము, స్వామివేణుగానము, రాధస్వప్నము మున్నగునవి వర్ణింపబడినవి. ఈ కావ్యము రాధాకృష్ణుల విరహవిప్రలంభమునకు సంయోగమునకు వంతెనవంటిది. స్థూలముగా శృంగారగాథవలె కనిపించినను ప్రణయపథముద్వారా ప్రణవము నందుకొనుపద్ధతిలో సాగినకావ్యమిది. 'శ్రీకృష్ణదేవుని నిర్వేదము'అను ఖండికలో నాయికలు రుక్మిణీసత్యభామాకుబ్జాదులెందరో కనిపించినను, వారందరిసమష్టిరూపమే దీనిలోని ఏకైక నాయిక. అదే పంచభూతాత్మకమైన ప్రకృతి. రుక్మిణి ఆకాశలక్ష్మి. సత్య జ్యోతిరంగన. అష్ట మహిషులలో మిగిలిన ఆరుగురు వాయుదేవతలు. రాధయే జలము, కుబ్జ ధరారమణి, నాయకుడగు

1. గీతాంజలి : CII.

కృష్ణుడే పురుషుడు. చివరకు వీరిశృంగారకలాపమంతయు మాయగా పర్యవసించినది. 'దేవ దేవుడును దిగ్గనలేచి మఱీవుమాయవా ! తెలిసినదెంతచేసితివి ధీపరివంచనకేళికాకృతీ'అన్న పద్యభాగములో ఈ విషయము స్పష్టమైనది. తరువాతి పద్యములో ఆమాయ దగ్ధమైనట్టు వర్ణింప బడినది. అనగా 'పెద్దమద్దివలెనిక్కిన మోహపువ్యూహము' దగ్ధమైనదని తాత్పర్యము. ఈ విధ ముగా ఈ కావ్యములో ప్రకృతిపురుషుల సంయోగవియోగదశలు వ్యంగ్యముగా నిరూపింపబడినవి. గీతగోవిందాదుల సంప్రదాయములోనే నడచినను మన ప్రబంధశిల్పమునకు ఈ కావ్యము నంద నోద్యానము వంటిది.

కృష్ణశాస్త్రిగారి 'అన్వేషణము', కృష్ణుని 'మురళికామందమందమాధురులరుచులు'గుండెలో రగిలిపోవగా, 'ఎలదేటిచిఱుపాట సెలయేటికెరటాలబడిపోవు విరికన్నె వలపువోలె' పరుగులెత్తిన గోపిక విప్రలంభవేదనను, సంయోగమాధురిని వర్ణించిన ఖండకావ్యము.[1] కరుణశ్రీగారి 'కరుణా మయి', 'రాధనురాప్రభూ ః నిరపరాధనురా ః అనురాగభావనారాధనమగ్నమానసనురా' అని కృష్ణవిరహములో ఆక్రందించిన రాధికవేదనను చిత్రించు ఖండకృతి.[2] వీరి 'పారవశ్యము'లో గూడ బృందావనవీధులలో ప్రణయకుపితయైకూర్చున్నరాధిక చిత్తవృత్తి, 'రాధికామానస విహారరాజహంస'యైన కృష్ణుని 'దాక్షిణ్య' స్వభావము వర్ణింపబడినవి. 'రాధపై ప్రేమ యధి కమో మాధవునకు, మాధవునిపైని రాధప్రేమయె ఘనమ్మొ ః'[3] అను మధురజిజ్ఞాసతో సమాప్త మగు కలకంఠకృతియిది. చామర్తిరాజశేఖరరావుగారి 'బృందావన'మను కావ్యసంపుటిలోని 'శరద్రాత్రి'మున్నగునవి, గురజాడరాఘవశర్మగారి 'కల్పలత'లోని 'గోపికాహృదయము' మున్నగునవి, బసవరాజు అప్పారావుగారి 'గోపికాగీతములు'[4] మున్నగునవి, వట్టికొండ విశా లాక్షిగారి 'ప్రణయభిక్ష'[5], చావలిబంగారమ్మగారి'రాధ'[6], వేదులవారి 'బాధ', 'సంధ్యాన్వేష ణము'[7] మున్నగునవి రాధానాయికములో కృష్ణనాయకములో అగు ఖండకావ్యములు.

ఆత్మాశ్రయరీతిలో నవ్యకవులు తమ్ముతాము గోపికగానో, రాధికగానో భావనచేసికొని రమ్యాతిరమ్యములైన ఖండకావ్యములను, క్రమగీతులను గానముచేసినారు. కవి తన్నుతాను 'వరనందనోద్యానవనలక్ష్మి'గా, భగవంతుని 'తరుణశృంగారమాధవుడు'గా సంకేతించుకొన్నాడు.[8] 'దాసిగానుంటకైన తగనాప్రాణేశ' యనియు, 'పాదమ్ములు నొచ్చినంత పట్టుటకైనను దగనా' యనియు సేవాభావము వెలిపుచ్చినాడు.[9] ప్రాణేశ్వరుడు ఎట్టకేలకు తనయింటికిరాగా లజ్జా భారముతో, శిశిరవాతస్పర్శచే వణకిపోవు సుమవల్లికవలె ఉక్కిరిబిక్కిరై పోయి

1. కృష్ణపక్షము : 'అన్వేషణము'
2. 3 : ఉదయశ్రీ : (ప్రథమ భాగము) : 'కరుణామయి.'
4. బసవరాజు అప్పారావుగీతాలు. 5. 6. 'మహోదయము'లో.
7. 'దీపావళి'లో. 8. ఏకాంతసేవ. 9. బసవరాజు అప్పారావుగీతాలు : 'తగనా'.

కృష్ణశాస్త్రిగారుగూడ 'మహతి' అను గేయసంపుటిలో 'దాసిగానుండుటకైన తగనా ప్రాణేశ' యను పల్లవితో ఒకపాట రచించిరి. —'మహతి': 41 గేయము.

'పాడుసిగ్గు వీడదాయె ప్రాణేశ ! దేవా ! నీ
చూడచక్కనైనమోము చూడలేక వెఱగుపడితి'[1]

నని నివేదించుకొన్నాడు. ఒక్కొక్క మానసికస్థితిలో కవికి భగవంతుడు 'కాంతరూపమున' కన్నులబడెను. అప్పుడతడు 'అతివా నీ ప్రాణనాథుడెవడని' యడుగగా 'ఆడుదానివలె హృదయము కానుక యర్పించినతడె నానాథుడనె'నట.[2] భగవంతుని కాంతారూపమును భావనచేయుట దీనిలోని విలక్షణత.

మధురభక్తి కవిత్వమున శ్రీకృష్ణుని వేణుగానమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. ఈ కవిత వెలయించినవారు వేణుగానమును వర్ణించక విడువలేదు. 'వాయింపుమామురళి హాయింపు మాకృష్ణ'యని[3], 'ఏదియింకొక్కమారూదరా నీమురళి'యని[4], 'ఏదిమరొక్కమాటు హృదయేశ్వర గుండెలు పుల్కరింపగా ఊదగదోయి'యని[5], కవి రాధాముఖముననో తానే రాధగా మారియో కృష్ణుని అర్థించినాడు. మురళీగానమువలన కవిలో బృందావనము విరిసినది. యమునా తటిని మొరసినది. మురళీరవము విశ్వమంతట వ్యాపించగా జోలపాడినట్లు అనుభూతిచెంది సృష్టిసమస్తము సుషుప్తిలో మునిగిపోయినది. బాలగోపాలునిపాట అతనిచేతిలోని మురళినేకాక కవిలోని 'మోడుబెడద'ను, 'శిధిలజీవనమ్ము'ను మ్రోయించినది.[6] ఆ మురళీగానములో

'మంజులసుమామృతములోని మధురిమమ్ము
మధురచంద్రాతపములోని మార్దవమ్ము
మృదుసమీరమ్ములోని పరీమళమ్ము'[7]

కలవని కవి భావించినాడు. ఆ 'పాటతీపి'ని భరించుశక్తి తనకులేదని గ్రహించి

'మ్రోయింపకోయ్ మురళి మ్రోయింపకోయ్
తీయతేనియబరువు మోయలేదీబ్రతు'[8]

కని, ఆ పిల్లనగ్రోవిపిలః ్రలో 'కాలుచల్లదనాలు', 'కనలు తీయదనాలు', ఏదో 'సౌఖ్యజ్వాల' యున్నవని కవి చకితుడైపోయినాడు.[9] మురళీగానమాధుర్యమువలన తనకుగలిగిన పారవశ్యమును తట్టుకొనలేని అత్యంతసుకుమారహృదయముయొక్క విచిత్రమైన అవస్థ ఇట్లు ప్రకటింప

1. బసవరాజు అప్పారావు గీతాలు : 'పాడుసిగ్గు'.
2. 3. బసవరాజు అప్పారావు గీతాలు : 'కాంచితి : కాంచితి', 'మురళీకృష్ణుడు'.
4. దీపావళి : 'మురళి'.
5. ఉదయశ్రీ : (ప్ర. భా.) 'కరుణామయి'.
6. కృష్ణపక్షము : 'అన్వేషణము'.
7. దీపావళి : 'రాధ'.
8. 9. 'నేదిరేయి' : కృష్ణశాస్త్రి : 'వైతాళికులు' నుండి.

బడినది. ఈ విధముగా 'వేణుగానము' మధురభక్తి కవిత్వములో గోపికారాధల-లేక మధుర భక్తిని గానముచేసిన కవుల-అంతరంగములందు రసవృష్టిని కురియించినది. ఎక్కడో 'సుఖము దుఃఖములేని సుషుప్తిలోన' మేనుమరచి నిదురించువారిని 'శీతపవనపక్షములపై ఎత్తుకొని పోయి నది.[1] ఈ వేణుగానము శ్రీకృష్ణుడు గోపికల నాకర్షించు సాధనము మాత్రమేకాదు, దీనివెనుక గభీరతత్త్వమిమిడియున్నది. శ్రీకృష్ణుడు పరమాత్మ; గోపికలు జీవాత్మలు. జీవాత్మ పరమాత్మనుండి ఇప్పుడు విడివడియున్నది. ఒకప్పుడీరెండు అఖండముగా నుండెడివి. ఖండవస్తువు అఖండత్వసిద్ధి పొందుటకుత్కంఠ పొందును. అనగా జీవాత్మలు పరమాత్మలో లీనమగుటకు పెనగులాడును. ఈ రెంటి మధ్యనున్న తగులమును బలీయమొనర్చు సూత్రమే వేణునాదము. విశ్వనాథవారందుకే వేణుగీతమును 'బ్రహ్మగీత'మనిరి.[2] 'బాలకృష్ణునుషిర'ము 'ఆమ్నాయముల్ మ్రోసెడు'ననిరి.[3] వ్రజసుందరుని మోహనవేణువునుండి వెడలిన నాదబ్రహ్మమును గోపికలతోపాటు పక్షులు గోవులుసైతము ధ్యానదృష్టితో వినెననిరి.[4] ఆంధ్రభాగవతమున మురళీగాన వర్ణనలో ఈతత్త్వమే ధ్వనించుచున్నది.

### 3. తాత్త్విక కవిత్వము :

తెలుగుసాహిత్యమున 'ప్రబోధచంద్రోదయము'వంటి కావ్యములలో ప్రతిపాదింపబడినది తాత్త్విక కవిత్వమే. శిష్టవాఙ్మయమునటుంచి చూచినచో, జానపదవాఙ్మయములోను ఏతత్తత్త్వసంబంధమైన కవిత్వము పెల్లుగా కనిపించును. మోక్షసాధనమార్గములలో ఒకటైన జ్ఞానమార్గము నాశ్రయించిన ధోరణియిది. ఇందులో జిజ్ఞాస ప్రధానమైనది. గూఢత, ఒకానొకప్పుడు 'అయోమయము' దీనిలక్షణములు. 'మొనలుమీదుగ తలలు క్రిందుగ మొలచియున్నది వృక్షమూ'వంటి జానపదగేయములలోని గూఢమైన తత్త్వమును కొంద'రయోమయ'మనగా, మరికొందరు అర్థవంతమైనదనిరి. పై పాదమునకే 'ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్'అను ప్రవచనమాధారమని పండితులు సమర్థించిరి. 'నిలువదు నిలువదుకాయం నిమిషంలోపల మాయం' వంటిగేయములలో, 'తొమ్మిది తొట్లల తోలుకొంపయిది'వంటి పంక్తులలో దేహము, దేహములోని నవరంధ్రములు సూచింపబడినవి. దేహము నశ్వరత్వము ప్రతిపాదింపబడినది. పోతులూరివీరబ్రహ్మం, దూదేకులసిద్ధప్పవంటి 'తత్త్వ'కవుల 'కాలజ్ఞానతత్త్వము'లలోని 'మేకపోతుకుచన్నులొచ్చెను'మున్నగువానికి అద్భుతత్వమే ప్రయోజనముతప్ప అర్థము చెప్పుట క్లేశభూయిష్ఠము. ఈ తత్త్వములలోనే 'ఎఱుక'యన్నది 'బట్టబయలు'కు సంబంధించినదని, ఆ 'యెఱుక'లోనే సమస్తము పుట్టుచు గిట్టుచుండునని ప్రతిపాదింపబడినది. 'ఎఱుక'యనగా జ్ఞానము, అవిద్యానాశకమైన భగవత్పరిజ్ఞానము. ఇట్లే ఈ తత్త్వములలో మృత్యువు ప్రాణికోటికి సహజమని, దేహము బుద్బుదప్రాయమని, జగత్తు నశ్వరమని బోధింపబడినది. ఈ విధమైన తాత్త్వికకవితారేఖలను నవ్యకవులు స్వీకరించలేదు. వీరు పోతులూరి వీరబ్రహ్మంవలె,

1. కృష్ణపక్షము : 'అన్వేషణము' :
2. 3. 4. శృంగారవీధి : 'బ్రహ్మగీతము'

కొంతవరకు వేమన్నవలె సంసారత్యాగమును, వైరాగ్యప్రాశస్త్యమును బోధించలేదు. నవ్య కవిత్వములో వెలువడిన తాత్త్వికకవిత్వమే బహుస్వల్పము. కొందరు ప్రాచీనసంప్రదాయమునకు చెందిన కవులు శతకాదులద్వారా జగత్తు అశాశ్వతత్వమును, పరమేశ్వరసత్త్వమును ప్రతిపాదించినను అది నవ్యకవిత్వములో చేరునదికాదు. కావున దానితో మనకు ప్రసక్తిలేదు. నవ్య కవులలో తాత్త్వికకవిత్వము వ్రాసిన కొద్దిమందిలో దువ్వూరిరామిరెడ్డిగారు ప్రథమగణ్యులు. మృత్యువును ప్రాచీనులు దంష్ట్రాకరాళముగ చిత్రించగా, నవ్యులు 'ఆనందదాయకమైన వాసంత కల్య'గా చిత్రించినారు.[1] ఇది అపూర్వమైన విషయము. మృత్యువును ప్రియమైన వస్తువుగా భావించుట నవ్యకవులు సాధించిన విశిష్టత. ఇంగ్లీషు కాల్పనికకవుల ప్రభావముతో తెలుగు కవులలో కల్గిన భావమిది. షెల్లీవ్రాసిన 'On Death' అనుగేయము మృత్యువునుగూర్చి అనేకప్రశ్నలు కురియించిన జిజ్ఞాసాత్మకమైన గేయము. కీట్సు

'Death is life's high need
Death is the crown of Life'

అని మృత్యువును కీర్తించెను. ఆంగ్లకాల్పనికకవులు మృత్యువును, నిద్రను అక్కచెల్లెండ్రుగా భావించినారు. 'Death is here death is there, death is every where' అని మృత్యువు పట్ల నిర్భయతను ప్రదర్శించినారు. వీరి ప్రభావము రవీంద్రునిపై ప్రసరించినది. కీట్సుఅన్నట్లు గానే రవీంద్రుడు 'గీతాంజలి'లో 'Oh Death! you are the last goal of my life, Please converse with me' అనెను. మృత్యువు తన తలుపుదట్టినప్పుడు తన పూర్ణజీవిత భాండమును సమర్పింతుననెను. మృత్యువును ప్రియునిగా సంభావించెను.[2] ప్రభుసమాగమము నకు మృత్యువును సాధనముగా భావించెను.

"The flowers have been woven and the garland is ready for the bridegroom. After the wedding the bride shall leave her home and meet her lord alone in the solitude of night.'[3]

ఇందులో కవి తాను ప్రేయసినని, మృత్యువు ప్రియుడని, తమ యిరువురి వివాహము పిమ్మట తాను తన యిల్లువదలిపోయి తన నిజమైన ప్రభువును కలసికొందునని భావనచేసినాడు. మృత్యువు నీవిధముగా ప్రభుదూతగా భావించుటలో గొప్ప తాత్త్వికదృక్పథమున్నది. వీరి దృష్టిలో జీవితము స్వయంసమగ్రమైనదికాదు. ఎన్నో మృత్యుపరంపరల పర్యవసానము. ఒక మహాచైతన్యమూర్తినుండి ఒక్కొక్కప్రాణి అగ్నికుండమునుండి స్ఫులింగమువలె వెలువడి విడివడి మరల దానిలోనే సమసిపోవును. అట్లే వివిధప్రాణులవిషయము. మృత్యువు ఒక జన్మకు మరియొక జన్మకు సంధిసూత్రము. రవీంద్రుడు పునర్జన్మసిద్ధాంతము నీరూపమున

1. కవికోకిల గ్రంథావళి : ఖండకావ్యములు : 'మృత్యువు'
2. 'Maranare Tunha mana shyama Saman'
3. గీతాంజలి : XCI.

అంగీకరించినాడు. ఈ జన్మ సమాప్తము కాకతప్పదు. క్రొత్తజన్మ రాకతప్పదు. ఈజన్మ నుండి ఇంకొక జన్మకు కొనిపోవు సాధనము మృత్యువేయైనప్పుడు దానికి వెరవవలసిన పనిలేదని రవీంద్రుడభిప్రాయపడినాడు. అందుచేతనే మృత్యువువచ్చి తన చెవిలో ఏదో గొణుగుచుండగా 'Grasp my hand and take me' అనియు, 'Raise my veil and look at my face proudly' అనియు నిష్కంపముగా మృత్యువును సంబోధించినాడు.[1] మృత్యువునుగూర్చి కాల్పనికకవుల అభిప్రాయమును, రవీంద్రుని దృక్పథమును ఇంతవివరముగా చెప్పుటలోగల ఉద్దేశము ఈ తత్త్వములోని నవ్యతను పరిశీలించి చూపుటకే. మృత్యువునుగూర్చి ఇంగ్లీషు కాల్పనికకవుల ప్రభావము-ప్రధానముగా రవీంద్రుని ప్రభావము-రామిరెడ్డిగారిపై ప్రసరించినది. ఆ ప్రభావముతోనే అతడు మృత్యుదేవతను సంబోధించినాడు.[2] జీవితము, మృత్యువు జంట బిడ్డలవంటివన్నాడు. మోసగింపులు, టక్కుటతనమూమని తనతో 'సఖ్యంబునెఱపుమ'ని అడిగినాడు. మృత్యువును 'సకియ'గా భావించుట రామిరెడ్డిగారి విలక్షణత. ఆమెనుద్దేశించి 'అందంబులకునెల్ల అందంబవీవు'అని సంభావించినాడు. ఆమెకన్నులిందీవరములని, ఆమె లేతచెక్కుటద్దములలో పన్నీరుపువ్వుల పస వెల్లివిరియునని, ఆమె 'రసార్ద్రమైనవాతెఱ'

'వచ్చిద్రాక్షరసానఁ బలుమాఱునాన
వైవ మెత్తగనైన పవడంబుచేత
రచియింపబడె'

ననియు ఊహించినాడు. చివరికామెను 'పెండ్లికూతురా'యని పిలిచినాడు. రామిరెడ్డిగారూహించిన మృత్యుమూర్తి రవీంద్రుని ఊర్వశిలోని కొన్ని లక్షణములను పొదుగుకొన్నట్లు భాసించును. అతడామె 'సుఖకరనిశ్శబ్దచుంబనము'లనాశించినాడు. దీనిలో రవీంద్రుడన్న మృత్యువునకు సంబంధించిన 'Cold kisses' లోని భావన ప్రతిఫలించుచున్నది.[3] రామిరెడ్డిగారు

'ప్రాణికోటులఁ బరపారంబుఁ జేర్చు
నుడుపంబు నేర్పుతో నడుపంగఁ బ్రకృతి
నియమించె నిన్ననో నిశ్చలకర్ణ
ధారిణీ ! నవమూర్తి'

అను చరణములలో రవీంద్రుడు భావించినట్లుగా మృత్యువు పునర్జన్మకు వాహికయను అభిప్రాయమే వ్యక్తముచేసినారు. ఈ రీతిగా మృత్యువును ప్రేయసిగా సంభావించి, ఆమెను

1. The Gardener: LXXXXI
2. ఇక్కడినుండి మృత్యుసంబంధమైన ఉదాహరణములన్నియు దువ్వూరి రామిరెడ్డిగారి 'మృత్యువు' అను ఖండకృతినుండి యిచ్చినవే.
3. The Gardener; LXXXI.

మోహనాకృతిగా, దివ్యమూర్తిగా భావించి, పునర్జన్మకు కేలుసాచిన మధురతాత్త్వికదృష్టి రామిరెడ్డిగారి 'మృత్యు'వను ఖండకావ్యమున ప్రతిపాదింపబడినది.

రామిరెడ్డిగారే రచించిన 'పిచ్చిబికారి'యను ఖండకావ్యము తాత్త్వికదృష్టిగల రచన. ఒక విరాగి మాయాకుమారి దగ్గరకుపోయి బిచ్చముపెట్టుమని యడుగును. ఆమె తాను 'ఉత్తిచేతుల రాణి'నని 'నీకు ఏమియ్యగల'నని బదులుపల్కెను. అప్పుడు బికారి

'నీజడకట్టులో నిద్దురవాడి
నలిగిన చంపకదళములమాల
బిచ్చంబుపెట్టుమీ పిచ్చిబికారి
సంతృప్తినొందును; చాలించుయాత్ర'[1]

అని అనును. ఇందులో గర్భితమైన తత్త్వమిది. పిచ్చిబికారి జిజ్ఞాసువునకు సంకేతము. ఒక విధముగా యోగులున్మత్తులేకదా. ఆ బికారికి కన్పించినది మాయాస్వరూపము. ఆమె జడలో వాడిన సంపెంగపూలదండను యాచించుటయనగా, తాను తరించుటకు జ్ఞానమార్గమును ప్రసాదించుటయేయని గ్రహింపవలెను. వీరి 'దీపనిర్వాణము'అను ఖండికలో, తన చేతిలోని బంగారు దివ్వె యెంతవెలిగించినను పయ్యరపిచి వెంటనే ఆరిపోయినట్లు, 'వెలిగించి వెలిగించి విసిగివేసారి' తుఫానుకరళ్ళలో 'త్రుళ్ళింతలాడు చుక్కానిలేని' పడవవలె తాను 'ధూళిగ్రుంగుచు' పోవుచున్నట్లు వర్ణింపబడినది. ఇందులో జీవికి సంక్రమించు నైరాశ్యము తాత్త్వికదృష్టితో చిత్రింపబడినది. నవ్యమార్గమున తాత్త్వికకవిత్వమును వెలయించినవారిలో దువ్వూరివారి రచనలు ప్రాతినిధ్యము వహించును. కావున వీనినిగూర్చి అధికముగా వివరించితిని. వెంకటపార్వతీశ్వరులుగూడ తాత్త్వికకవిత్వమున దువ్వూరివారికేమాత్రము తీసిపోరు. వీరు 'విచారలహరి'లో 'జలధరంబులయందు జలములేగాక పిడుగులేమిటికి గల్పింపగాబడెనో'యని, ప్రకృతిసూక్ష్మములపట్ల జిజ్ఞాసాదృష్టిని ప్రదర్శించిరి.[2] అత్యగాధము, భయదమునైన కాలసముద్రమునకు అలలు సంవత్సరములని, అది 'జీవకోటినేత్రవారిధారలతో' నిండునని, తీవ్రగతిలో ఎల్లప్రొద్దులందు 'మర్త్యత్వతీరములనొరసి యిరుదెసలందాకుచుండు'నని[3] ప్రకృతినైజమును అంతర్ముఖులై పరిశీలించి చూపిరి.

### 'మదిరా' తత్త్వము :

ఉమరుఖయ్యాము పారసీకభాషలో రచించిన 'రుబాయీల'కు తెలుగులో వెలసిన కావ్యములు రాయప్రోలువారి 'మధుకలశము', దువ్వూరిరామిరెడ్డిగారి 'పానశాల', మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి 'ఉమరుఖయ్యాం', రామచంద్ర అప్పారావుగారి 'అమరుక'

1. ఖండకావ్యములు : 'పిచ్చిబికారి'
2. 3. కావ్యకుసుమావళి : తృతీ. భాగ. : ప్రథ. సం. : 'కాలసముద్రము'

కావ్యము. వీరేకాక ఆదిభట్ల నారాయణదాసుగారు, మల్లవరపు విశ్వేశ్వరరావుగారు మున్నగు కవులు గేయరూపమున, పద్యరూపమున ఉమరుఖయ్యాముని రుబాయీలననువదించిరి. ఈ కావ్యము లన్నిటిలో ప్రధానమైనది ఖయ్యాము ప్రతిపాదించిన 'మదిరాతత్త్వ'మే. హిందీలో 'బచ్చన్' అను ప్రముఖకవి మధుబాల, మధుశాల మున్నగుకావ్యము లీధోరణిలోనే వ్రాసి, ఆ సాహిత్య ములో 'హాలావాద'శాఖను ఆవిష్కరించినాడు 'హాలా'యనగా మధువు; మదిర. ఆ దృష్టితోనే దీనిని 'మదిరాకవిత్వ' మంటిని. మదిరతోపాటు 'మదిరాక్షి'కూడ ఈ కవిత్వములో ముఖ్యమైన దను విషయము విస్మరింపరానిది.

ఈ కవిత్వము స్థూలముగా భోగలాలసతను, క్షణికసౌఖ్యములను ప్రతిపాదించునదిగా కనిపించినను, దీనివెనుక ఒక గభీరతత్త్వమున్నది. దానిని సంగ్రహముగా పొందుపరుతును.

ఉమరుఖయ్యాము కవియేకాక గణితశాస్త్రజ్ఞుడు; జ్యోతిశ్శాస్త్రవేత్త: వివిధశాస్త్రజ్ఞుడు. అన్నింటికిమించి తాత్త్వికుడు. ఆయన తాత్త్వికులందరివలెనే సృష్టిరహస్యములను కనుగొను టకు ప్రయత్నించినాడు. ఈ సృష్టిప్రయోజనమేమో, ప్రాణికోటి యెందుకు పుట్టుచున్నదో, యెందుకు గిట్టుచున్నదో వితర్కించుకొన్నాడు. గులాబీపూవులోని రామణీయకము, కోమ లాంగిలోని లావణ్యము, చూచిన అనుభవించిన మరునిమిషములో ఎట్లునశించిపోవుచున్నవో ఆయన గమనించినాడు. అందరివలెనే జీవితము బుద్బుదప్రాయమని, సృష్టిసౌందర్యము నశ్వర మని గ్రహించినాడు. ఏనాటికైనను నశించువస్తువులను, ఈనాడే ఎందుకనుభవింపగూడదను అభిప్రాయ మాతనికి కలిగినది. జీవితము క్షణభంగురమని విరక్తులైపోవు వేదాంతులదృష్టి అతనికి రుచింపలేదు జీవితము సుఖదుఃఖభూయిష్ఠమని అందరికి తెలిసినప్పుడు సుఖమునే యెందుకాస్వాదించరాదని ఆయన నిర్ణయించుకొనెను. సౌఖ్యానుభవముద్వారా పరమాత్మనెందు కందుకొనగూడదని ఆయన భావించుకొనెను. ఆదృష్టితోనే తనకు పరమప్రియములైన మదిరను మదిరాక్షిని సేవించెను. ఈతని 'రుబాయీల'లో ప్రయోగింపబడిన మధువు, పానపాత్ర, సాకీ అన్నమాటలు జీవాత్మ పరమాత్మలకు సంకేతములని, ఇవి సూఫీసిద్ధాంతములను గర్భీకరించు కొన్న ప్రతీకలని విమర్శకు లభిప్రాయపడినారు. మదిరాక్షిని, 'మదిర'ను ఆనందమునకు పర్యాయములుగా తీసికొన్నచో, వానిద్వారా ఖయ్యాము పరతత్త్వప్రాప్తికై చేసినప్రయత్నము స్పష్టమగును. ఈ విధముగా 'మదిరాతత్త్వము'ను క్రొత్తగా సాహిత్యలోకమున ప్రవేశపెట్టి జగత్తునంతటిని దీనికి వశముచేసినవాడు ఖయ్యాము. మొదట ఈతని 'రుబాయీలు' 1856 లో ఫిట్జుగెరాల్డు అను ఇంగ్లీషుకవిచేత ఆంగ్లభాషలో అనూదితములై ప్రకటింపబడినవి. మొదటి ముద్రణప్రతులు చెత్తపొత్తములశ్రేణిలోచేరి అణాకు రెండణాలకమ్ముడుపోయినను, క్రమముగా రెండవముద్రణతో ఖయ్యాము ప్రతిభ ఖండఖండాంతరములందు వ్యాపించినది. తెలుగులో మొట్టమొదట ఈరుబాయీలను (ఆంగ్లానువాదము ననుసరించి) రచించినవారు రాయప్రోలువారే. వీరి 'మధుకలశము'లోని కొన్నిపద్యములు తొలుత 'భారతి'లో 1924 లోనే వెలువడినవి. తర్వాత 1935 లో పుస్తకరూపమున ఆకృతిలో, ఆత్మలో పరిణామముపొంది వెలువడినవి.

దువ్వూరివారి 'పానశాల'లోని కొన్నిపద్యములు భారతిలో 1928 జనవరి, ఫిబ్రవరి, మార్చి సంచికలలో ప్రచురితమై తర్వాత పుస్తకరూపముదాల్చినవి. ఈ 'రుబాయీల'ను పారసీకమునుండి సూటిగా అనువాదముచేసిన ప్రత్యేకత మొదట రామిరెడ్డిగారికే దక్కినది. మిగిలినవారిలో నారాయణదాసుగారుతప్ప అందరు ఆంగ్లానువాదముననుసరించి చేసినవారే. నారాయణదాసుగారీ రుబాయీలను అచ్చతెనుగులో రచించుట ఒక ప్రత్యేకత. ఇందరి 'రుబాయీల'ననువదించినను దువ్వూరివారి 'పానశాల', రాయప్రోలువారి 'మధుకలశము'-ఈ రెండే ఆంధ్రదేశమున ప్రసిద్ధములైనవి. ఈ రెంటిలో ఆంధ్రులరసనాంచలములపై ఆడిన అనేకపద్యములు 'పానశాల' లోనివేయనుట సత్యదూరముకాదు.

ఇంతటితో భక్తికవిత్వములోని మూడుతెగలకు సంబంధించినచర్చ ముగిసినది. భావకవిత్వములో ప్రణయకవిత్వము, దేశభక్తికవిత్వము, ప్రకృతికవిత్వము, సంఘసంస్కరణ కవిత్వము, భక్తికవిత్వము అను ప్రధానమైన శాఖలనుగూర్చిన పరిశీలనము సమాప్తమైనది. ఇంగ్లీషు కాల్పనికకవిత్వములో ప్రత్యేకముగా ఎలిజీ (Elegy) యను ఒక శాఖయున్నది. తెలుగుపై ప్రసరించిన ఇంగ్లీషు కాల్పనికకవిత్వప్రభావమువలన ఈ శాఖగూడ మనకవిత్వమున చోటుచేసికొన్నది. కావున మనసంప్రదాయదృష్ట్యా దీనికొక ప్రత్యేకతలేకున్నను, ఆంగ్లకవితా సంప్రదాయదృష్ట్యా ఉన్నందున దీనినిగూర్చి సంక్షేపముగా చర్చింతును.

# 6. స్మృతికావ్యములు :

## (Elegies)

పాశ్చాత్యుల ఆత్మాశ్రయకవిత్వములో (Elegy) (స్మృతిగీతము) ప్రధానమైనది. దాని నిర్వచనమిది.

'The Elegy is a lyric expressive of melancholy or grief, in particular, when commemorative of dead friend'.[1]

ఈ నిర్వచనములో మిత్రస్మృతి అని ప్రత్యేకముగా పేర్కొనబడినను అప్తులైనవారెవరైనను వారి మరణముగూర్చి స్మృతిరూపకముగా గేయమో, పద్యసముదాయమో, కావ్యమో వ్రాసినచో అది ఎలిజీయే అగును. ఎలిజీ అనగానే వెంటనే స్ఫురించునది గ్రే వ్రాసిన 'Elegy in a country churchyard' అను గీతము. ఇదికాక మిల్టన్ వ్రాసిన లిసిడస్ (Lycidas), కీట్సు మరణముపట్ల షెల్లీ వ్రాసిన ఎడోనెస్ (Adonais). బ్రౌనింగు వ్రాసిన లా సేజియస్ (La saisiaz) పేర్కొనదగినవి. టెన్నిసను వ్రాసిన 'In Memorium' అనునది మిత్రనిర్యాణమును గూర్చినది. ఇతడే వ్రాసిన 'Break, break, break' అను గీతమువ్యక్తిగతముగా కవికి జరిగిన వ్యాఘాతములను చిత్రించునది. అర్నాల్డువ్రాసిన 'Hein's Grave' అను స్మృతి గీతములో సాహిత్యవిమర్శ చోటుచేసికొన్నది. పిచ్చికుక్క చావునుగురించి గోల్డుస్మిత్ వ్రాసిన ఎలిజీ ఈ ప్రక్రియలో సాధింపబడిన వస్తు వైవిధ్యమునకు చక్కని తార్కాణము. ఈ స్మృతిగీతములలో Pastoral Elegy అను తెగయొకటి కలదు. ఒక గొల్లవాని రూపములో కవి వెల్లడించిన స్మృతి గీతములు ఈ తెగలోచేరును.[2] ఈ స్మృతిగీతములలోకవి కేవలము వ్యక్తిగత విషయములనే నివేదించడు. ఒక స్మృతిలో కొట్టుకొనిపోయి తాత్త్వికదృక్పథము వెల్లడించును. ఆత్మ విషయముతోలపాటు జగత్పరమైన శాశ్వత సత్యములనుగూడ ప్రకటించును. ఇంగ్లీషుకాల్పనికకవిత్వములో ఎలిజీ ప్రధానముగా దేశనాయకపరముగా, మిత్రపరముగా రూపొందినది. ఇక తెలుగు నవ్య కవిత్వములో దాని స్వరూపమును వివరింతును.

ఎలిజీకి తెలుగులో శోకగీతమని, శోకకావ్యమని పర్యాయపదములు వాడబడినవి. తాపీ ధర్మారావుగారు 1911 లో తామురచించిన ఒక ఎలిజీకి ఏమితోచక 'కారుణ్యము' అని తెలుగులో

1. Encyclopedia Americana : Volume 17.
2. గ్రీకులదృష్టిలో ఎలిజీ విశాలార్థముకలది. జీవితములోని అన్ని అంచులు Elegiac పద్ధతిలో స్పృశింపబడినచో దానిని ఎలిజీ అనియే వారు భావించిరి.

నామకరణముచేసిరట.[1] కాని దీనికి సమానార్థకముగా స్మృతిగీతము, స్మృతికావ్యము అను పదములే సముచితముగా నుండునని నేను భావించితిని. గీతములుగానేకాక పద్యకావ్యములుగా గూడ ఈ స్మృతిరచనలు వెలువడినందున అన్నిటికి వర్తించు దృష్టితో 'స్మృతికావ్య'మను పేరుంచితిని. బ్రతికియున్నవారినిగూర్చి వ్రాసిన 'ప్రశంసాకావ్యములు' ఈ కోవలోనికిరావు. మరణించినవారి స్మృతిపరముగా వ్రాసినవిమాత్రమే స్మృతికావ్యములనుటకు వీలున్నది.

తెలుగులో మొట్టమొదటి స్మృతికావ్యము శ్రీనాథుని 'కాశికావిశ్వేశుఁగలసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయడిచ్చు'అను పద్యముతో ప్రారంభమైనదేమో ?[2] తనకురత్నాంబరములిచ్చిన వీరభద్రారెడ్డి, కస్తూరిప్రసాదించిన 'తెలుంగురాయరాహుత్తుడు', 'హేమపాత్రాన్న' మొసగిన 'విస్సన్నమంత్రి', 'దినవెచ్చము'నకు వలసిన ధనమిచ్చిన 'మైలారువిభుడు' ఈ పద్యమున స్మరింపబడిరి. ఈ పద్యములో వీరభద్రారెడ్డివంటి ప్రముఖరెడ్డిప్రభువుతోపాటు తెలుగురాజు, మైలారు విభుడు, విస్సన్నమంత్రి పేర్కొనబడుటతో చారిత్రక పరిశోధనకు వలసినవస్తువు దొరికినది.

అల్లసానిపెద్దన కృష్ణరాయల నిర్యాణానంతరము పలికిన 'ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూతయొసగి యెక్కించుకొనియె'అనునది స్మృతికావ్యప్రక్రియకుచెందిన చాటుపద్యమే. ఇంతకు మించి మన ప్రాచీన సాహిత్యమున ఇష్టుల మరణముపట్లవ్రాసిన ప్రసిద్ధ స్మృతికావ్యములులేవు. నవ్యకవిత్వములో ఈ ప్రక్రియ ఆంగ్లసాహిత్యాధ్యయనమువలననే మూడుపూవులారుకాయలుగా వర్ధిల్లినది. అయినను ప్రాచీనధోరణికిచెందిన కొందరు కవులుగూడ ఈ శతాబ్దివేగుబోకకుముందే స్మృతికావ్యములు రచించుట గమనింపదగినది. గతశతాబ్ద్యంతమున వావిలాలవాసుదేవశాస్త్రిగారు రచించిన పిత్రారాధనము, రుక్మిణీస్మరణము స్మృతికావ్యములే. వీనిలో మొదటిది పితృస్మృతి; రెండవది సతీస్మృతి. వడ్డాదిసుబ్బారాయుడుగారుగూడ సతీస్మృతి, సుతస్మృతి రచించిరి. 1904 లోనే ఆదినారాయణమూర్తియనువారు ప్రేయసీస్మృతి వ్రాసిరి. డి. జగన్నాథరావుగారు 1910 లో మిత్రస్మృతిరచించిరి.[3] కాని వీరువ్రాసిన ఈ రచనలలో ప్రక్రియలోనేతప్ప కవిత్వమున నవ్యతలేదు. నవ్యకవులలో మొట్టమొదటి స్మృతికావ్యము రచించినవారు రాయప్రోలు సుబ్బారావుగారే. గోపాలకృష్ణగోఖలే నిర్యాణవార్త వినగానే వీరు చక్కని స్మృతికావ్యము (ఖండకావ్యము) రచించిరి. తర్వాత బసవరాజుఅప్పారావు, విశ్వనాథ, నాయనిసుబ్బారావు మున్నగువారు రసభరితములైన గీతములు, కావ్యములు వెలయించిరి.

ఈ స్మృతికావ్యముల వైవిధ్యమును దృష్టిలోపెట్టుకొని వీనిని నాలుగు వర్గములుగా వింగడించితిని. 1. దేశనాయకస్మృతి : ఇందు రాజకీయ సాంఘిక కళాదిరంగములలో ప్రసిద్ధులైనవారినిగూర్చిన కావ్యములు వచ్చును. 2. సతీస్మృతి : అగ్నిసాక్షిగా వివాహమాడిన ఇల్లాలి మరణముపట్ల వ్రాసిన వీవర్గములో చేరును. కేవలము ప్రేయసీనిర్యాణముపట్ల వ్రాసినవి

1. పాఠపాఠీ : 'నల్లిమైకారుణ్యము' 2. శ్రీనాథునిచాటువు.

3. History of Telugu Literature: Dr. G. V. Sitapathi: Part II. 'Elegies' నుండి.

ప్రణయకవిత్వములోని 'విషాద' విభాగమున చేరును. 3. సుతాదికస్మృతి : పుత్రుడు లేక పుత్రిక మరణానంతరము వ్రాసిన వీవర్గమునచేరును. 4. ఆప్తస్మృతి : సోదరీసోదరులు, మిత్రులు మున్నగువారి నిర్యాణముతో వెలువడిన రచన లిందులో చేరును. ఇక ఒక్కొక్క శీర్షికక్రింద నవ్యకవిత్వములో వెలువడిన స్మృతికావ్యములను పరిశీలింతును.

### 1. దేశనాయకస్మృతి :

రవీంద్రుని అస్తమయమునకు బాష్పస్తంభితకంఠులై రాయప్రోలు రచించిన 'రవీంద్రుని అస్తమయము' అనుపద్యములు ఈ శాఖలో గణనీయములైనవి. రవీంద్రుని నిర్యాణముతో ప్రకృతి సమస్తము నిస్తబ్దమైపోయినట్లు ఈ కవి భావించినాడు. కిన్నెరలు శ్రుతులాపి నిదురించినవని, రంగుగిన్నెలలోని వన్నెలచిన్నెలు మాసిపోయినవని, 'కావ్యకలకంఠీకంఠరాగము' గాద్గద్యము వహించినదని కరుణావేశముతో పల్కినాడు.[1] ఏదో చైతన్యవైకల్యము జరుగనోపునని, లేకున్న 'అమృతగీతాకలాపపూరణమయిన' ఆ మహాత్ముని 'తనువంశలత'ఎట్లు తెగునని దుఃఖించినాడు.[2]

గురజాడ అప్పారావుగారి నిర్యాణానంతరము దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వ్రాసిన గేయముగూడ చక్కని స్మృతికావ్యము. అప్పారావుగారి 'గీతశీకరములు'

'యుగయుగంబులనుండి మ్రోగెడు
విశ్వగానవియత్తరంగిణి
భంగములనువ్పొంగు'[3]

నని ఈ కవి ఎంతోయెత్తుగా ఊహించినాడు. 'ఆంధ్రరత్న' దుగ్గిరాలగోపాలకృష్ణయ్యగారి మృతికి బసవరాజు అప్పారావుగారు

'ఏలపాడేనింక యమునాకళ్యాణినే
లీలామానవుడు గోపాలుడు లేడాయె'

అని దుఃఖావిలురైనారు. ఈ కవిగారు కోలారులోని బంగారు గనులలో తిరుగుచుండగా ఆంధ్రరత్న మరణవార్త పిడుగువలె వినిపించినదట. ఈ విషయమునుగూడ వీరు గేయబద్ధము చేసినారు. గోపాలకృష్ణయ్యగారిని గోపాలుడుగా భావించి వర్ణించినారు. గోపాలకృష్ణయ్యగారికి 'యమునాకళ్యాణి' రాగమిష్టమట. ఈ గేయములో ఇక 'యమునాకళ్యాణి'పాడు భాగ్యము లేదని విలపించినారు. ఇట్టి స్మృతిగీతములలో అనేకవైయక్తికవిషయముల ప్రస్తావన యుండుట గమనింపదగినది. విశ్వదాత కాశీనాథునివారు శివైక్యముచెందగానే దేశములోని ఆంధ్రకవులందరు స్మృతిగీతములు సమర్పించినారు. వానిలో తుమ్మలవారువ్రాసిన పద్యము[4]పేర్కొనన

1. 2. వనమాల. 3. కృష్ణపక్షము : 'మహాకవి'.
4. పఠిగపంట : 'విశ్వదాత'

దగినది. ఈ పద్యములో విశ్వదాత 'మాతృదాస్యపాశచ్ఛేదకౌశల్యమునుగన్న కర్మయోగి'గా, 'బలికర్ణమాంధాతల విస్మృతికిందెచ్చు విశ్వదాత'గా, 'చదువులమ్మకు సేవసలుపు బంటుగా' కీర్తింపబడినాడు.

దేశనాయకస్మృత్యర్థము ప్రత్యేకముగా సుదీర్ఘమైన ఖండకావ్యములు వ్రాసినవారు కొందరున్నారు. ముఖ్యముగా గాంధీజీనిర్యాణానంతరము వెలువడిన దీర్ఘఖండకృతులకు, చిటిపోటి కైతలకు లెక్కలేదు. జాషువాగారి 'బాపూజీ' కావ్యము ఈ సందర్భమున ఎన్నదగినది. 'ముగ్గినపండు,' 'క్షమాప్రవాసి'యగు మహాత్ముడు తుపాకిగుండ్లకు బలియైపోయిన విషయమును తలచుకొని కవి 'ఇదియేపోవడమా ! జగజ్జనక ! రానేరావుగా' అని ఆక్రోశించినాడు. 'భారత జ్యోతిగప్పుననారిపో'యినదని, 'జగమొక్కుమ్మడి తొమ్ముగ్రుద్దుకొని మూర్ఛన్‌దేలి తబ్బిబ్బు చెందిన'దని, 'ఖదరురాటాలఝుంకారరవళి'తోపాటు 'గండుపేదలనోటికబళరాసి'కూడ ఆగిపోయినట్లేయని కరుణరసాత్మకముగా చిత్రించినాడు. కావ్యమున మిగిలినభాగమున గాంధీజీవితములోని ప్రధానఘట్టములను స్మరించినాడు.

### 2. సతీస్మృతి :

1902 లోనే రవీంద్రుడు తన సతీనిర్యాణముతో 'స్మరణ్'అనుపేర రెండు స్మృతిగీతములు రచించినాడు. 'Love, thou hast made one vast wonder Life and Death for me' వంటి పంక్తులను పరిశీలించగా ఆయన సతీస్మృతితో తాత్త్వికచింతనలో పడిపోయినట్లు తోచును.[1]

తెలుగున సతీస్మృతిలో కావ్యములు వ్రాసినవారిలో విశ్వనాథవారు, దువ్వూరివారు, వెంకటపార్వతీశ్వరులలో ఒకరైన బాలాంత్రపు వెంకటరావుగారు ప్రథమగణ్యులు. వీరిలో విశ్వనాథవారు 'వరలక్ష్మీత్రిశతి'అనుపేర మూడువందల పద్యములు రచించిరి. పరమపదించిన వారి సతీమణిపేరు వరలక్ష్మి 'వరలక్ష్మీత్రిశతి' 'వియోగకావ్య'మని కవియే స్వయముగా వ్రాసికొనెను. ఇది కర్మశతకము, స్మృతిశతకము, నిత్యశతకముఅను మూడుభాగములుగానున్నది. కావ్యప్రారంభములో వ్రాసిన

'ఓ సఖా ! ప్రియభార్యా వియోగమెఱుఁగ
నట్టియోపూర్వసత్కృతీ ! యకట ! నీవు
కర్మశతకంబు చదువకు ! మర్మఘాతి
నీ వెఱుగలేవు దానిలోని దగు —'

అనుపద్యమున కర్మశతకములోని మర్మచ్ఛేదకమైన దుఃఖతీవ్రత ధ్వనింపజేసినాడు. ఈ పద్యమును పురస్కరించుకొని ఇప్పటికి ఈ కర్మశతకము చదువనివారున్నారు. ఈ శతకములో వారి సతీమణి ప్రాణోత్క్రమణప్రాయశ్చిత్తములతోపాటు, దహనకర్మ, అస్థిసంచయనము,

1. Poems : Viswa - Bharathi : 1946.

సపిండీకరణము, గోదానము, గౌరీపూజ, అస్థినిమజ్జనము మున్నగుకర్మలు వర్ణింపబడినవి. స్మృతిశతకమున విభిన్నమానసికదశలలో కవిమనస్సున పొడసూపిన సతీస్మృతికణములు చిత్రింపబడినవి. నిత్యశతకములో దుఃఖనిత్యత, కర్మనిత్యత నిరూపింపబడినవి. ఇందులో కఠ కేన ప్రశ్నాద్యుపనిషత్తులలోనున్న మృత్యు జీవితములకు సంబంధించిన జిజ్ఞాస సాగినది. నిత్య శతకములోని చిట్టచివరిపదిలో సమస్తప్రాణికోటికి శాంతి ప్రవచింపబడినది. ఈ కావ్యములో వరలక్ష్మీస్వభావచిత్రణమునుబట్టి, ఆమె పతిశీలత్వమాత్మదఘ్నముగానున్న సాధ్వియని స్పష్ట మగును, ఆమె

'తనప్రేమలోతు చిక్కని దృగంతచ్ఛటా
శ్రీగాని నోటితో జెప్పలేదు
తన దుఃఖభారమెల్లను నిశ్చలాపాంగ
ములఁగాని నాల్కతో బలుకలేదు.'[1]

ఆమె 'కనులందెయెల్ల బ్రదుకుబ్రదికి', 'కనులందే ప్రాణముల్ వదలిపెట్టి'న యోగిని.[2] వెలగల చీరలేదని, సొమ్ములులేవని, పతి దుఃఖపడినప్పుడామె 'శాశ్వతమాధనంబు ? మీరలు కల'రదేచాలు నన్న 'మైథిలీశీల'.[3] ఆమె 'ప్రేయోరూపముదాల్చివచ్చిన గౌరీదేవి'వలె పతిభావనలో నిల్చినది. విపరీతమైన మనోవికారముగల పతిని సమ్యక్చీలునిగాచేసినది. 'వట్టినీరసబుద్ధి'యైన అతనిని 'రసోత్థపథముల సత్కవీశ్వరుని'జేసినది. అట్టి 'ప్రాణాధిక'తోడ పోవుటెరుగక రక్షోమతితో బ్రతికియున్న తన మందభాగ్యమునకు కవి యెంతగానో కుందిపోయినాడు. మైథిలీశీలయైన తన సతిలేని తన కాయము దహనయోగ్యమైన వట్టికట్టెగా భావించినాడు. కృష్ణలో ఆమె అస్థులను కలుపుచున్నప్పుడు

'అంతె పేరునకంతె భార్యాస్థిగాని
నాశరీరాస్థి నిజము కృష్ణార్పణమ్మ'

అని పొగిలిపోయినాడు. 'నానావిచిత్రజన్మకృతాస్మదఘరాశి' పండిపండి ఆ విధముగా పరిణ మించినదని దుఃఖించినాడు. తన గిడసవారిన కఠినోక్తులు, ప్రాతమాటలు ఆమెకరుణవలననే 'భావుకజగత్తునకర్థవిచారయోగ్యమై'[4]నవని ఆమె స్మృతికివచ్చినపుడనుకొన్నాడు. చివరికి సృష్టిలోని పూవులలో తీవెలలో 'వరలక్ష్మీముద్ర'యే గమనించి 'లోలోదీర్ఘోరుతపంబుజేసికొని, దుఃఖయోగిగా మారిపోయినాడు. నవ్యకవులు భార్యాసంస్మృతికికట్టిన అక్షరసౌధములలో 'వర లక్ష్మీత్రిశతి' తాజమహలువంటిది.

సతీస్మృతిలో వెలయించిన ఇంకొక చక్కని కావ్యము దువ్వూరిరామిరెడ్డిగారి 'భగ్న హృదయము'[5]. ఈ కావ్యములో కవి తన దుఃఖతీవ్రతను పూర్తిగా వ్యక్తముచేయజాలలేదని తెలుపు టకు టెన్నిసన్‌వ్రాసిన 'Im Memorium' లో నుండి ఉదాహరించిన

1. 2. 3 : కర్మశతకము. 4. స్మృతిశతకము.
5. కవికోకిల గ్రంథావళి : రెండవభాగము.

'But the Large grief which these enfold
Is given in outline, and no more'

అనువాక్యములవలన గ్రహింపవచ్చును.

ఈ కావ్యప్రారంభమునగల ప్రకృతివర్ణనలో కవి విషాదచ్ఛాయలు ప్రవేశపెట్టినాడు.

'జలధరమాలికామలినశయ్యను మిత్రుడుగూలె, నేడ్పులా
ర్పులఁ బులుగుల్ కులాయముల పొంతలకేగక కొమ్మలెక్కి ము
క్కులఁదడిలేకయూర్చు; వడగూరిన పోలికఁబూలతీగలుం
దలలనువాంచు; గాలివెడతాకున మ్రాల్గు సహానుభూతితోఁ'.

అంతేకాక పూర్వము కవికి కనుపండువై తనరిన మోహనవస్తువులన్నియు 'బాష్పముల్ దొనక'గా, నీరవభాషలో అతనినోదార్చినట్లు వర్ణింపబడి, ప్రకృతికి కవికిగల అనుబంధము చిత్రితమైనది.కవి గారి సతీమణి 'యౌవనంపుబంగరుచషకంబులో నురుగుగ్రమ్మెడియాసవమింకని' ఇరువదియైదవ యేటనే కాలదుర్గతివలన అస్తమించినది. ఆమె అకాలమృతివలనగలిగిన చిత్తభ్రమణముతో కవి

'హృదయమును దొంగిలించిన రీతిగానె
స్మృతినిసైతంబు నీవు హరింపు మతివ'

యని విలపించినాడు. పొలమునుండిరాగానే వాకిలికడనిల్చి స్వాగతమిచ్చు తన అర్ధాంగి నిర్యాణముతో తన యిల్లు మఠముగా మారినదని, తన 'యౌవననందనము' నుసియైపోయినదని, 'ఆమని ప్రేమదేవతాజీవవిహీనమూర్తిపయిఁ జిట్టెముగట్టె సమాధిపోలికన్'అని అసిధారాతీవ్ర మైనబాధను వ్యక్తపరిచినాడు. తన సతీవియోగముతో నాలుక త్రుప్పుపట్టినదని, 'కావ్యాలపనం బొనర్చుతల' పంకురించదని, వ్రాయబూనినచో పూర్వము తేలికకాలిగుజ్జుపుగతిన్ దూకెడుభావ మిప్పుడు లివచచ్చి ముందడుగువెట్టదని వాపోయినాడు. ఈ విధముగా కొన్నినాళ్ళు దుఃఖించిన కవి మనస్సులో మార్పుకలిగినది. కర్మఫలము దైవాధికారమని, సుఖదుఃఖములను సమదృష్టితో స్వీకరించుటయే ప్రాణికర్తవ్యమని నిశ్చయించుకొని, 'దానిచితిపైన నిర్మింతుఁదాజమహలు' అన్నంత ఆశాజీవియైనాడు.

బాలాంత్రపు వెంకటరావుగారు తమ సతీనిర్యాణముతో వ్రాసిన 'విరహసంగీతము' అను స్మృతిగీత మీసందర్భమున పేర్కొనదగినది. ఆమెమరణముతో 'విశ్వమును వెలయించు వెన్నెలపాట', 'కోరికల్ చిగురించు కోకిలపాట' కడలేనిపాటలో గలసిపోయినవని వీరు భావించి నారు. ఆమెయొక పతగియని, ఆమె 'బంగారుతెక్కలనీడ'లో నాడు తానొకగేస్తునసుకొంటినని, ఇప్పుడామె జ్ఞాపకమురాగా 'కనులఁగడగుచుంటి కడవెడు నీళ్ళతో'నని కరుణావిలముగా తమ అను తాపమును ప్రకటించినారు.

### 3. సుతాదిక స్మృతి :

దువ్వూరివారు 'శిశువియోగము' అనుఖండికలో తమబిడ్డ పసికందుగానున్నప్పుడే కను మూసినందుకు దుఃఖించినారు. అంతవరకే వారు భార్యావియోగముతో విలపించుచుండగా శిశు వియోగము 'గోరుచుట్టుమీద రోకటిపో'టైనది. ఈ దుఃఖాధిక్యముతో

'పూవురాలిన జిఱుపిందెపూపయైన
నంటుకొనియుండునన్న పేరాసనుంటి;
మృత్యునిశ్వాసపవనంబురేగి సుడిసి
ఖావిఫలమును గసుగందుఁ బైకివిసిరె'[1]

నని వాపోయిరి. ఈ శిశువు సుతుడో, సుతయో కవిగారు పేర్కొనలేదు.

సుతాస్మృతిలో రచింపబడిన గేయములలో బసవరాజుఅప్పారావుగారి 'నిర్యాణసుఖము' పేర్కొనదగినది.[2] 'మంగళప్రద' కవిగారి కూతురుపేరు. ఆ చిట్టితల్లి మరణించుటతో వారికి 'కత్తిపెట్టిపొడిచి'నట్లయినది. 'కోయిలొకసారి కూసిపోయి'నట్లు, 'పండొకటి చేతిలోబడి జారి పోయినట్లు పాపాయిమరణముతో కవి బాధపడినాడు. 'చలిపిడుగు' గర్జించగా సుతావియోగ దుఃఖితుడైన కవి ఈ విధముగా చెప్పుకొన్నాడు.

'బంగారుబొమ్మ నాదు మంగళప్రదమ్మయొంటి
రుద్రభూమి కటికనేల నిద్రించెడు నొడలుమరచి,'[3]

అందువలన 'చలిపిడుగా గర్జింపకు'మని బ్రతిమాలుకొన్నాడు. తన చిట్టితల్లి మినుకుమినుకున మెరయు చుక్కలలో ఒక్కటిగా మారినదేమోయని పలవించినాడు. ఇంతలో దీపావళి వచ్చినది. అందరికివచ్చిన దీపావళికాక తనకు 'దివ్యదీపావళి' వచ్చినది. వేదాద్రినాథుడే కవియింట వెలసి ఉయ్యాల తొట్టెలో ఊగినాడు. పుత్రోదయముతో కవికి సుతావియోగవ్రణము కొంత తగ్గిపోయి నది. 'వేదాద్రిశిఖరాల వెలిగేటి జ్యోతి, నాపూరిగుడిసెలో దీపమై' యున్నదని కవి ఆనంద లోకపుటంచులను చుంబించినాడు. ఇంతలో కొన్నినాళ్ళకే, మానిపోని గుండెగాయముమీద గొడ్డలి దెబ్బ పడినట్లయినది. 'వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి మినుకుమని కాసేపు కునికిపోయింది.'[4]

'కాపురమొచ్చిన కన్నిపాపాయి
ఇల్లుకాళీజేసి వెళ్ళిపోయాడు'

అని కవి తీవ్రమైన దుఃఖోద్వేగముతో కుమిలిపోయినాడు. ఈ చరణములలో తన బ్రతుకెట్లు శూన్యమైపోయినదో కవి సూచించినాడు. చిన్నమాటలలో మిన్నుమన్నుల నేకముచేయుభావము

1. కవికోకిల గ్రంథావళి : మొదటిభాగము.
2. 3. బసవరాజు గీతాలు : 'చలిపిడుగు'.
4. బసవరాజు గీతాలు : 'జీర్ణం జీర్ణం'

వెలిపుచ్చినాడు. కృష్ణశాస్త్రిగారన్నట్లుగా బ్రతుకును బ్రద్దలుచేసికొని నెత్తురుజీర అంటుకొని వెలికివచ్చిన గేయభాగమిది. వారే అన్నట్లుగా 'ప్రపంచకావ్యభాండాగారాల్లో గొప్ప పంక్తుల్లో ఇదొకటి.'[1]

### 4. ఆప్తస్మృతి :

మాతాపితరులు, సోదరీసోదరులు మున్నగువారి స్మృత్యర్థము వెలువడిన కావ్యములను, గీతములను ఈ శ్రేణిలో చేర్చితిని. వీనిలో మాతృస్మృతిలో వెలువడిన రచనలే యెక్కుడుగా నున్నవి. నాయని సుబ్బారావుగారి 'మాతృగీతాలు' ఈ ధోరణిలో రచింపబడిన కావ్యములలో శిఖరాయమాణమైనవి. జననియగు ఉదయమ్మ అస్తమయముతో కవి ఉద్విగ్నుడై

'ఎవ్వడాక్రూరకర్ముడెవడు ! నీల
జలదనిర్ముక్తశైశిరశర్వరీప్ర
శాంతమలవాటుపడిన నిశాంతమందు
అకట నట్టింటిదీపమ్మునార్పినాడు'

అని దుర్విధిని దూషించినాడు. 'పోయినదిపార్వతీదేవి పూలరథముకదలినది మారినది వల్లకాడు పూలవనముగా నేటి'కన్న జనుల మాటలను స్మరించుకొని బాష్పతర్పణము చేసినాడు. ఆమె వైకుంఠపదవి నధిష్ఠించినదని, ఆమె స్పర్శచేత వైతరణిలో 'అమరశైవాలినీసహస్రములు' పుట్టినవని, ఆమె పుణ్యవతీత్వమును స్మరించుకొన్నాడు. తల్లిమరణముతర్వాత కవి సర్వావస్థల యందు ఆమె స్మృతినే అనుభవించినాడు. వినాయకచవితిరాగా తనతల్లిచేతి ఉండ్రాళ్ళు కుడుములికలేవని విలపించినాడు. ఉగాదికి బ్రాహ్మణుడుపంచిన వేపపూతపచ్చడి మాతృవియోగము వలన కాలకూటపుముద్దవలె భావించినాడు. శివరాత్రిరాగా నిరుడు శివరాత్రికి తన్ను వెంటబెట్టుకొని యేటిలో స్నానముచేసిన అమ్మ 'నేడు భవజటాకల్లోలినీతరంగశీకరస్నాన మొనరించుచున్న'దని సంభావించినాడు. సముద్రతీరమునకేగినను, స్నానమునకు బావికేగినను తల్లికి సంబంధించిన స్మృతులే పెల్లగిలివచ్చినవి. 'తల్లియొడ్డును ముద్దుగొను' బావిలోని అలలు 'అమ్మ యేదిరా'యని కవిని ప్రశ్నించినవట. నీటిపైకెగసిన నీటిపాము 'నీకులేదమ్మ'యని అన్నదట. అప్పుడు కవి 'శోకవహ్నితప్తహృదయు'డై 'నాకులేదమ్మ' అని యింటిదారిపట్టినాడు. ఈ విధముగా సర్వకాలములందు సమస్త ప్రదేశములందు కవి మాతృమూర్తిస్మృతులే వెలయించుకొన్నాడు.

పెనుమర్తి వెంకటరత్నంగారు మాతృస్మృతికై వ్రాసిన కావ్యము ఈ సందర్భమున పేర్కొనదగినది.[2] ఈ కావ్యములో అశ్రుపూజ, శోకగీతి, శ్రావణాశ్రువులు మున్నగు ఖండికలున్నవి. మాతృమరణముతో తన బ్రతుకున 'దివాంధగీతము' మ్రోగుచున్నదని, విలయాంధ

1. బసవరాజు గీతాలు : పీఠిక. 2. 'రత్నాపణము'లో.

తమస్సులు చుట్టుముట్టినవని, తన 'మధుప్రవాహములు స్వప్నములై' చెదరిపోయినవని కవి దుఃఖించినాడు.

'జన్మజన్మాలనాటి వాత్సల్యలతలు
విరియబూచిన పూవులు పరువుమాసె
ఐహికఋణానుబంధము లస్తమించి
అమృతధారలె కాలకూటాగ్నులుమిసె'

నని విధిపై పరీత్యమునకు విలపించినాడు. నాయనివారివలెనే ఈ కవికిగూడ శ్రావణమాసము వచ్చినను, వినాయకచవితి, ఉగాదిమున్నగు పండుగలు వచ్చినను మాతృస్మృతియే ఆవహించి కనులను చెమ్మగిల్లజేసినవి. మాతృస్మృతిలో ఖండకావ్యములు రచించినవారిలో కొడాలిసుబ్బా రావుగారుగూడ గణనీయులు.

'పితృస్మృతి'లో రచింపబడిన స్మృతిగీతము లెక్కువగా లేవు. మోటూరి వెంకటరావు గారు పితృమరణమునకు, సోదరీమరణమునకు పొగిలిపోయి 'ఆహుతి'అను గేయము రచించి నారు.[1] తనకుగలిగిన ఆశయభంగమును

'గాలిమేడలు హిమనగమ్ముల
గట్టుకొని నా బ్రతుకునేటికి
గాజుపెంకులువోలె ముక్కలు
గాఁగ జితికినది'

అను చరణములలో ఈ కవి చిత్రించుకొన్నాడు. నేలకొరిగిన గాలమేడల గాజుముక్కలను తాను కూడదీయుచున్నానని పరిదేవించినాడు. ఈ కవియే రచించిన 'ఓచెల్లి'అను ఖండకృతి సోదరీ స్మృతికెత్తిన కర్పూరకళిక. కవియొక్క దుఃఖగాఢత, దుర్భరవేదనాశీలిత దీనిలో పదునైన భావములలో పక్వమైన భాషలో వ్యక్తముచేయబడినవి. కవి, అతని ఏకైకసోదరి కలసి మెలసి చిననాడు ఇసుకతిన్నెలమీదగూర్చుండి యెన్నోపాటలు పాడుకొన్నారు. విరిదోటలో విహరించినారు. ఆ విధముగా అన్యోన్యస్నేహముతో పెరిగిన అతనిసోదరి పెండ్లియైనపిమ్మట ఒక సంవత్సరమునకే పాపాయిని ప్రసవించి కన్నుమూసినది. ఈ దారుణసంఘటనముతో కవిని తమస్సులావరించినవి. సృష్టి వికల్పమునొందినట్లనిపించినది. ఆమెదహనముచేయబడిన శ్మశానవీధిని తలచుకొని

'.......................ఎవ్వరేనియీ
దారిని సుంతమోపినపదక్రియ సోకునాయెమొ నీ హృదం
భోరుహమంచు; దద్దరిలిపోయెద నెత్తిలువాఋనేలగా'[2]

1. 'హిమగళము'. 2. హిమగళము : 'ఓ చెల్లి'.

అని అశ్రుతర్పణమాచరించినాడు. సోదరీస్మృతిలో ఇతడు వెలిపుచ్చిన భావతీవ్రతకు క్రింది పద్యము చక్కని నిదర్శనము.

'ఇపుడొక రక్తవీచి పెకలించిన నాకనులిర్లై బొత్తలై
రెపరెపలాడి, శూన్యనిబిరీసనిశాంధతమస్సు జీవితాం
తపుఁదుది ప్రాణవాయువులఁ దాకినదాక శిలాద్రవంపుటూ
రుపునయి 'చెల్లెలా'యనెడు రోదనమొక్కటెనింతు రోదసిన్.'[1]

విశ్వనాథసత్యనారాయణగారభిప్రాయపడినట్లుగా 'ఓ చెల్లి'అను విషాదకావ్యములో ఇతని కవిత్వము పరాకాష్ఠనందుకొన్నది.[2]

దువ్వూరివారి 'సోదరీస్మృతి'యనునదికూడ ఈ శ్రేణిలోని రసవత్తరరచనయే.

'చెల్లెలా! నీవు స్వర్గమ్ముఁ జేరికొన్న
వత్సరంబులుఁ గడచియుఁ బ్రకృతియందు
నీదుచిహ్నంబులెల్లెడ నింపినావె'[3]

అని కవి ప్రకృతియంతట సోదరీమూర్తి ఛాయలనే సందర్శించినాడు. మొయిలువిడిన శశిరేఖను జూచి పొత్తిగుడ్డలు తొలగింపగా కనిపించు సోదరీముఖమును స్మరించినాడు. 'సందెవేళల పలుచని జలదములను పూతపూచెడి వెంగావిపూల సౌరునవ్వునెద' చెల్లెలిచెక్కులలో నటియించు కాంతిమంజిమము తలచుకొన్నాడు.

అబ్బూరి రామకృష్ణరావుగారు, కవికొండల సాంబశివరావుగారి మృతికిపగచి 'సోదరస్మృతి' అను ఖండకావ్యము రచించినారు.[4] ఈ పద్యములలో వీరు సాంబశివరావుగారి భక్తిభావమును, సేవాశీలమును, శాంతవృత్తిని స్మరించినారు.

"నీమధురతేజోరూపసీమఁ దలచి
నీవు మొదలుపెట్టిన యక్షరావళులనుఁ
గూర్చి యల్లెదమింక మానేర్చినట్లు
మానవప్రేమపూర్ణనిర్వాణగీతి"

అనుపద్యములో అతనిజీవితమే తమకు సందేశముగా పరిణమించినదని ఆశాభావము వెల్లడించినారు. ఈ విధముగా రచింపబడిన అనేక స్మృతికావ్యములలో దినుసుకొకటిరెండుమాత్రమే చూపితిని.

1. 2. హిమగళము : 'ఓ చెల్లి', 'ఆభాషణము.'
3. కవికోకిల గ్రంథావళి : రెండవభాగము : 'సోదరీస్మృతి'.
4. 'ఊహాగానము'లో.

ఇంతవరకు భావకవిత్వములోని వివిధశాఖలగురించి విపులముగా చర్చించితిని. ఇక ఈ మొత్తముశాఖలను సమన్వయముచేసికొని వస్తుభావరచనలలో భావకవులుచేసిన ప్రయోగములు పరిశీలింతును. ఒకవిషయమిక్కడ గమనింపవలసియున్నది. ఇంతవరకు నేను నిరూపించిన శాఖలన్ని దేనికది విడివడిలేవు. ప్రణయకవిత్వమున ప్రకృతివర్ణన లున్నవి. ప్రకృతికవిత్వములో భక్తిభావములున్నవి. పైగా ఈ యన్నిశాఖలను స్పృశించిన కవులు కొందరున్నారు. కావున స్థూలముగమాత్రమే ఈ కవిత్వతత్త్వమును, సత్త్వమును నిర్దేశించుట కీ విభాగము చేసితిని. ఆయా శాఖల తత్త్వమును నిరూపించునప్పుడు నేనుచేసిన ప్రయత్నమంతయు ప్రధానముగా వాని వస్తునవ్యతకు సంబంధించినదే. కావున మరల వస్తునవ్యతనుగురించి చెప్పుట పునరుక్తమే యగును. కావున దానినివదలి భావకవిత్వమున భావములో, రచనలో చేయబడిన ప్రయోగముల నెత్తిచూపెదను.

## భావకవిత్వము : భావనవ్యత :

మానవుని మనోవ్యాపారము తొలుదొల్త కవిత్వరూపముననే ఆవిష్కృతమగును. ఆది మానవుడు ప్రకృతి తనను గుర్రురిమిచూచినప్పుడు, కొసచూపులు విసరినప్పుడు, సీత్కరించినప్పుడు, చిరునవ్వులు చిందినప్పుడు హృదయమునరేకెత్తిన విస్మయవినోదవిషాదాదిభావములను పాటలరూపముననే వెలిపుచ్చుకొన్నాడు. అందుకే T. S. Eliot 'Hyperbolically, one might say that the poet is older than any other human being' అని అన్నాడు. ఇలియట్ అతిశయోక్తిలో చమత్కరించినను, కవిత్వము సూర్యరశ్మియంతటి సనాతనమైనదను అభిప్రాయము ధ్వనించుచున్నది. వచనముకన్న కవిత్వము ముందుపుట్టినట్లే, వస్తునామముల (సంకేతముల) కన్న, ఉపమారూపకములు ముందుపుట్టినవి. ఒక ప్రత్యేకవస్తువు పేరు ఇదమిత్థమని తెలియనిదశలో మానవుడు ఉపమారూపకములద్వారా దానిస్వరూపమును తెలిసికొనగల్గినాడు. ఉదాహరణమునకు కంచరగాడిదను తీసికొనుడు. ఆ జంతువునకు కంచరగాడిదయని పేరు నిర్ణీతముకానప్పుడు, లేదా దానిని చూడనివారికి దానినిగూర్చి చెప్పవలసివచ్చినప్పుడు, గుఱ్ఱమువంటిదనియో, గుఱ్ఱము, గాడిద–ఈ రెండుపోలికలున్న ఒకానొక జంతువనియో చెప్పవలసియుండును. ఈ విధముగా ఉపమానసాహాయ్యముతో పదార్థజ్ఞానమునకు వీలుకలిగినది. కవిత్వములో ఉపమారూపకాద్యలంకారములకున్న యీ ఆవశ్యకమే అలంకారప్రాబల్యమునకు పాదువేసినది. ఆనందవర్ధనాదిధ్వనివాదులు అలంకారకావ్యములను రెండవశ్రేణిలోనికి చేర్చినను, కవుల కలంకారములమీదిమమకారము పోలేదు. వాల్మీకి, కాళిదాసువంటి మహాకవులే ఉపమారూపకముల వ్యామోహమునుండి తప్పించుకొనలేకపోయినారు. వాల్మీకి కొన్నిచోట్ల ఉపమాన పరంపరలను ప్రయోగించి వాచ్యదోషమునకు పాల్పడినాడని విమర్శకుల అభిప్రాయము. కాళిదాసు అనవసరమైన సందర్భములలో ఉపమాప్రయోగముచేయగా విమర్శకులు వ్రేలెత్తకుండ ఉండలేకపోయినారు. ఇంతగా ఎందుకు మనవిచేసితిననగా అలంకారములు – ముఖ్యముగా ఉపమారూపకములు కవిత్వమునకు ఆవశ్యకములైనవని నిరూపించుటకే.

ఇంగ్లీషు కవిత్వములో మన ఉపమకు సిమిలీ (Simile) అని, రూపకమునకు మెటఫర్ (Metaphor)అని వాడుదురు. ఆ భాషలో మిగిలిన అలంకారములు కొన్నియున్నను ఈ రెంటికే ప్రాచుర్యములభించినది. ఈ రెంటిలో వారు మెటఫర్‌పై పే మొగ్గుచూపిరి.[1] కవిత్వములో ఎన్ని క్రొత్తప్రయోగములు జరిగినను, ఛందస్సులో ఎన్నిమార్పులు వచ్చినను, కావ్యవస్తువులో ఎన్ని పరిణామములు కలిగినను ఈ రూపకాలంకారముమాత్రము అక్షయముగా ఉండిపోవునని, కవి ప్రతిభ కిదేనికషోపలమని ఆంగ్లవిమర్శకు లభిప్రాయపడిరి మన విమర్శకులుగూడ కవిశక్తి అతని ఉపమాప్రయోగములోనే బయటపడునని తెలిపిరి. ఈ విధముగా ఆంధ్రాంగ్ల విమర్శకుల చేత మిన్నులకెత్తబడిన ఈ యలంకారములు భావప్రకర్షను వెల్లడించుటకు ముఖ్యమైన సాధనములు. ఈ అలంకారములనే ఆంగ్లేయులు Images గా పేర్కొనిరి.

### పదచిత్రములు (Images) :

ఇంగ్లీషు కాల్పనికకవిత్వములో ఇమేజరీ (Imagery) ప్రధానస్థాన మాక్రమించినది. క్లాసికల్ కవిత్వములో కేవలము బాహ్యాలంకారముగా[2]నున్న ఇమేజరీ కాల్పనికకవిత్వములో ఆత్మస్థానమాక్రమించినది. ఇమేజరీ యనగా స్థూలముగా కల్పనయనవచ్చును. ఇమేజ్ అనగా కల్పనాచిత్ర మనవలె. కాని దీనికన్న పదచిత్రమనుటలోనే సామంజస్యమున్నది. చిత్రకళకు రంగులవలె, కవితాకళకు పదములు ప్రధానమైన ఉపకరణములు. చిత్రకారుడు రంగులద్వారా తన భావమునకు ఆకృతి కల్పించి ప్రాణప్రతిష్ఠచేసినట్లే, కవి తన పదబంధములద్వారా భావమునకు మూర్తికల్పనచేయును. అనగా పదములతో బొమ్మలు కట్టునేర్పు కవిది.

'నావుడు శౌరికినిట్లనె
నావేలుపుతపసి మర్త్యులాడెడిరీతిఁ
నీవిట్లుపలుకనుచితమె
యేవిశ్వజనీనచరిత ! యెఱుగనెనిన్నుఁ'[3]

అను పద్యము వట్టమాటలప్రోవేతప్ప బొమ్మకట్టలేదు. ఈ కవియే సత్యభామ శోకస్థితిలోవ్రాసిన

'తలవాంచి మగుడ ముసుగిడెఁ
గొలుకుల డిగజాఱి జాలుకొను బాష్పంబుల్

1. 'Trends come and go, diction alters, metrical fashions change, even the elemental subject-matter may change almost out of recognition: but metaphor remains, the life-principle of poetry, the poet's chief test and glory'.
—The Poetic Image: C. Day Lewis: page 17; pub: 1947.
2. 'Like cherries tastefully arranged on a cake'.
3. పారిజాతాపహరణము: ప్రథమాశ్వాసము: 48 వ పద్యము.

పలుచనిచెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁబురుడింపన్'[1]

అను పద్యములోని ఉపమాలంకార మామె కపోలలాలిత్యమును, బాష్పధారాప్లుతిని కన్నులకు గట్టుచున్నది. ఇంగ్లీషు విమర్శకుల దృక్పథముతో చూచినచో ఇది చక్కని పదచిత్రము (Image). వట్టి పదములకూర్పుతోకాక, దానిలో అలంకారమును పేర్చి చిత్రమును కట్టెడునేర్పు దీనిలో కనిపించుచున్నది. కావున 'ఇమేజ్' అనుదానికి పదచిత్రమే సమంజసమనిభావించి నేను దానినే వాడితిని. భావకవిత్వములో పలువురు ప్రముఖకవులపై ఇంగ్లీషు కాల్పనికకవుల ప్రభావ మున్నది. ఆ కవులలో షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తు మున్నగువారు ఈ పదచిత్రములను విశేషించి ప్రయోగించినారు. కాల్పనికకవిత్వవిమర్శకులెల్లరు ఆ కవిత్వమును విమర్శించునప్పుడు, ఆయా కవుల ప్రతిభను తూచుటకు ఈ పదచిత్రములనే ప్రమాణముగా స్వీకరించిరి. ఇంతకు ఉపమా రూపకాద్యలంకారములనే మరొకవిధముగ చెప్పగా పదచిత్రములైనవి.

సంగ్రహముగా పదచిత్రమును 'Picture made out of words' అని నిర్వచింప వచ్చును.[2] ఈ నిర్వచనము ప్రకారము 'నావుడుశౌరికినిట్లనె' అను పద్యముకూడ పదచిత్రమే యనవలసివచ్చును. అందుకే దీనికి ఇంద్రియసంబంధిగుణమును (Sensuous quality) జత కూర్చినారు. ప్రాతికేయులు, అడ్వర్టయిజుమెంటులు (ప్రచార ప్రకటనలు) వ్రాయువారుగూడ ఒక్కొక్కప్పుడు ఇంద్రియప్రీణనము కలిగించురీతిగా పదబంధములు కూర్తురు. అయినప్పు డవియు పదచిత్రములేనా? కాదు. ఇంద్రియతర్పణము కలిగించుటతోనే దాని ప్రయోజనము తీరదు. ఆ పదచిత్రమువెనుక రసావేశముండుట అత్యంత ప్రధానము. ఈ దృష్టితో చూచినచో 'Poetic image is a Word-picture charged with emotion or passion.'[3] అను సి. డి. లూయీ నిర్వచనము సమగ్రముగానేయున్నది.

ఇంగ్లీషు విమర్శకులు ఇమేజరీని Sensuous Imagery అని, Intellectual Imagery అని స్థూలముగా రెండు భాగములుచేసిరి. మొదటిది ఇంద్రియముల (Senses) కు తృప్తి కలిగించునది. రెండవది బుద్ధికి. ఈ దృష్టితో పరిశీలించి కీట్సు కవిత్వములో ఇంద్రియతర్పణము కలిగించు పదచిత్రములధికమని, షెల్లీలో మనస్తర్పణము కలిగించున వెక్కువని వీ రభిప్రాయ పడిరి.

'నీవు తొలిప్రొద్దు నునుమంచుతీవసొనవు' అన్న కృష్ణశాస్త్రిగారి పదచిత్రము వీరి దృష్టితో చూచినచో నయనేంద్రియతర్పణము కలిగించునది. 'తొలిప్రొద్దు తెమ్మెరత్రోవలోఁ బయనమై పరువెత్తు కోయిలపాటవోలె' అన్న పదచిత్రము శ్రవణతర్పణము కలిగించునది. ఇట్లే మిగిలినవి మిగిలిన ఇంద్రియములకు తృప్తికలిగించును. ఈ విధముగా పరిశీలించినచో కొన్ని చిక్కు-

1. పారిజాతాపహరణము: ప్రథమాశ్వాసము: 111 వ పద్యము.
2. 3. The Poetic Image: pages: 18, 19.

లున్నవి. కొన్ని పదచిత్రములు ఏకకాలముననే ఇంద్రియములకు, హృదయమునకు స్పందనము కలిగించును. 'గుబులుకొను లేతనెత్తావి గుసగుసలెవో'[1] అనుదానిని తీసికొందము. ఇందులో గుసగుసలు శ్రవణసంబంధులు. నెత్తావి ఘ్రాణసంబంధి. 'నెత్తావిగుసగుసలు' అనునది అపూర్వ భావరమ్యమైన కల్పన. పరిమళముల గుసగుసలు అనునది అటుచెవికి, ఇటునాసికకు గాక నేరుగా గుండెకుతాకెడు పదచిత్రము. కావున Sensuous Imagery దృష్టితో మన భావ కవుల భావనవ్యతను పరిశీలించుటకష్టము. అయినను కృష్ణశాస్త్రిమున్నగు భావకవులపై కాల్పనిక కవిత్వములోని పదచిత్రముల ప్రభావముండుటవలన నేనుగూడ ఆ దృష్టితోనే ఈ పరిశీలనము ప్రారంభించితిని.

భావకవులలో కృష్ణశాస్త్రిగారుతప్ప విశ్వనాథ, బసవరాజు, నాయని, వేదుల, తల్లావఝ్ఝల, దువ్వూరి మున్నగు కవులు ప్రాయికముగా సంప్రదాయసిద్ధమైన పదచిత్రములనే ఉపజ్ఞాబల ముతో రమ్యముగామార్చి ప్రయోగించినారు. వీరు ప్రాచీనకవిసమయములను పాటించుచునే అక్కడక్కడ భావనవ్యతకొరకు ప్రయత్నించిరి. కృష్ణశాస్త్రిగారిపై ఊహలో, ఉక్తిలో, అలం కారములలో, భావప్రదర్శనములో కాల్పనికకవుల ప్రభావము విశేషముగా ఉండుటవలన వారు కల్పించిన పదచిత్రములలో సమధికభావనవ్యత కనిపించును. వారితోపాటు మిగిలిన కవులు ప్రయోగించిన పదచిత్రములనుగూడ ముందుముందు పేర్కొందును.

ఈ పదచిత్రములను రెండు తెగలుగా విభజించుట సమంజసమనితోచును. 1. భావ చిత్రములు, 2. ఊహాచిత్రములు. పదచిత్రమన్నప్పుడది ఊహయో, భావమో మూలముగా కలిగియుండక తప్పదు. ఈ రెంటిలో ఏదోఒకటిలేని వట్టిపదముల కూర్పునకు బొమ్మకట్టు నేర్పుండదు. మరి యీ రెంటిలో భావప్రకర్షయున్నది భావచిత్రము. ఊహాధిక్యమున్నది ఊహా చిత్రము. ఈ రెండును విశిష్టమైన పదచిత్రములే. భావకవులలో భావచిత్రములున్నంతగా ఊహా చిత్రములు లేవు. ప్రబంధకవిత్వములో ఊహాచిత్రములు కోకొల్లలు. వారి సూర్యచంద్రాదివర్ణన లన్నియు ఈ యూహాచిత్రములకు చక్కని నిదర్శనములు.[2]

### (i) భావచిత్రములు :

మొదట కృష్ణశాస్త్రిగారి భావచిత్రములను పరిశీలింతము. ఇవి వారి ప్రవాసము, ఊర్వశి నుండి గ్రహింపబడినవి.

> 'ఈ ప్రవాసయాత్రారతి నిటులె నేను
> కదలిపోవుదు నాశావకాశములను

1. కృష్ణశాస్త్రిగారి ప్రవాసమునుండి.
2. "వీరి (ప్రబంధకవుల) ఊహ గారడివాని మంత్రదండమువంటిది. దాని స్పర్శతగిలితేసరి, సూర్యుడూ చంద్రుడూ కాలపుహొంతకానిచేతిలోసంగడాలు; తిలకము ఊర్ధ్వముఖతీక్ష్ణశరాగ్రము." —శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు; 'ఆధునికకవిత్వము' (వ్యాసము) : ఉదయిని.

ఒక్క నిట్టూర్పువోలిక, ఒక్కమౌన
బాష్పకణమటు, ఒకగాఢవాంఛపగిది.'

ఈ పద్యములో మూడు భావచిత్రములున్నవి. కవి హృదయములోని మూడు అవస్థలకు ఈ పద బంధములు రూపకల్పనము చేయుచున్నవి. ప్రవాసయాత్రలోసాగిపోవు కవిలోని దైన్యమునకు 'నిట్టూర్పు', నిగూఢ దుఃఖభావమునకు 'మౌనబాష్పకణము', ప్రగాఢమైన ఆశాదృష్టికి 'గాఢ వాంఛ' చక్కని మాటబొమ్మలు. ఈ మూడును సూటిగా హృదయతర్పణము కావించునవి కావున భావచిత్రములు.

కవి మృత్యుఘోషమును మరచిపోయి బిచ్చగానివలె చేయిసాచినాడు. అప్పుడు

'వట్టిబయలున నొకమోడుచెట్టువోలె
ఎత్తినదికరమెత్తినట్లే కృశించె.'

లోకము నిర్దాక్షిణ్యముగా అతనిమీదినుండి నడచిపోయినది. లోకమేకాదు. మృత్యువుగూడ అతని పైనుండి నడచిపోయినది. ఈ విషయము ఎత్తినచేయి ఎత్తినట్లే కృశించుటగా చెప్పబడినది వట్టిబయలులోనిల్చిన మోడుతో కృశించినచేతిని పోల్చుటవలన కవిలోని దారుణనైరాశ్యస్థితి చక్కగా వ్యంజితమైనది.

కవి తన విషాదములో తానే దాగిపోయినాడు. ఆ స్థితి యిట్లున్నది.

'రేయికడుపున చీకటిచాయవోలె
తమసుబెడద దివాంధగీతమువిధాన.'

రాత్రిలోని చీకట్లనీడ, చీకట్లలోమ్రోగెడు గుడ్లగూబపాట – ఈ రెండు పై గీతభాగములో స్ఫురించును. ఆ స్ఫురణ రేయికడుపులోని చీకటిచాయ, చీకటిలోని గూబపాట అను రెండు భావ చిత్రములద్వారా సాధింపబడినది. స్థూలదృష్టితో అందుకొనలేని స్ఫూర్తియిది. అనగా ఇవి రెండును కనులువిప్పి చూచినచో, చెవులు విప్పివిన్నచో అంతుచిక్కనవికావు.

'ఆమెకన్నులలో ననంతాంబరంపు
నీలినీడలుకలవు; వినిర్మలాంబు
పూరగంభీరశాంతకాసారచిత్ర
హృదయములలోని గాటంపునిదురచాయ
లందునెడనెడగ్రమ్ము; సంధ్యావసాన
సమయమున నీపపాదపశాఖికాగ్ర
పత్రకుటిలమార్గములతోపల వసించు
ఇరుల గుసగుసల్ వినబడుచుండు'

కనుపాపలు నల్లగానుండుట ఈ భావచిత్రముల కాధారవిషయము. ఆకాశము, లోతైన కాసారము, కడిమిచెట్టుకొమ్మలోని ఆకులసందులలోని చీకట్లు నల్లనివి. ఈ మూడువిషయములలోని గుణము లామెకన్నులలో నున్నట్లు వర్ణింపబడినది. మొదటిచిత్రము ద్వారా ఆమె కనులలోని భావముల అనంతత్వము, రెండవదానిద్వారా అగాధత్వము, మూడవచిత్రము ద్వారా అజ్ఞేయత్వము ధ్వనింపజేయబడినవి. ఈ మూడుచిత్రములు కనుల భౌతికస్వరూపమును గాక వానిలో దాగిన రక్తిని, శక్తిని పట్టిచూపుచున్నవి. ఇవికాక కృష్ణశాస్త్రిగారు ప్రయోగించిన 'అనలమై కాల్చు నిశ్శబ్దము'అనునది వియోగతీక్ష్ణతకు, చెలియ కురులు 'నీలమేఘ నిశ్వాసము'లటులున్నవన్నది దుఃఖచండతకు, 'బ్రతుకుబ్రతుకెల్ల ఒక్కనేత్రముగ'అన్నది నిరీక్షణతీవ్రతకు ఆకృతికల్పించిన భావచిత్రములు.

ఇతర భావకవులలో వేదులవారి 'రేయివిప్పిన నీలిరెక్కలనీడ', 'స్వప్నపు నీలిక్రొందెరలు' చక్కని భావచిత్రములు.[1] తన 'హృదయనాళము'ను పలికించుమని ప్రభువును ప్రార్థించు ఘట్టమున ఆ పాటను 'శ్రావణ కృష్ణపక్ష తిమిరమ్ములు పుల్కలతో వినన్'[2] అను ప్రయోగము చీకట్లకు రూపుకల్పించి, వానికి సత్త్వనిర్ణయముచేసి, పుల్కలను మొలకెత్తించిన రమణీయభావ చిత్రము. ఇంతవరకు మనదృష్టిలో పరుచుకొని, విరిసికొనియున్న చీకట్లు ఈ వర్ణనతో మూర్తి దాల్చి కనులయెదుట నిల్చున్నవి.

విశ్వనాథవారి 'కిన్నెరసాని పాటల'లో కిన్నెర దుఃఖమును తెలుపుటకు చేసిన

'బొట్టుబొట్టుకొకవేయియెదలుగా
తరగతరగకొకవేయినోళ్ళుగా
బడలినీరమై యేడుపుమయమై'

అన్న వర్ణనలోగల భావచిత్రములు కిన్నెర దుఃఖతీవ్రతను కన్నులకు గట్టించును.

'నిదురలో వెన్నెలలు నిశ్వసించాయి'.[3] ఇది మల్లవరపువారువేసిన భావచిత్రము. చీకటికి వేదులవారు పుల్కలు కల్పించినట్లే వీరు వెన్నెలలచేత నిట్టూర్పించిరి. కొమఱ్ఱాజు వినాయకరావు గారు 'మౌనమ్ముతోన నించికొందును మదీయహృత్పాత్ర'[4]యని నిర్గుణమైనమౌనమునకు ఆసవత్వము కల్పించిరి.

కృష్ణశాస్త్రిగారి 'పల్లకి'యన్న ఖండకృతి అపూర్వభావచిత్రములను మోసికొనిపోవు పల్లకి వంటిది.[5] ఈ శీర్షికక్రింద నున్నపద్యము లైదింటికైదు చక్కని భావచిత్రములు. ప్రాణసఖుడు తనకొరకు పల్లకిపంపినాడనువార్త వినగానే

1. 2. దీపావళి: 3. మధుకీల.
4. హృదయశ్రుతి: (ఖండకావ్య సంపుటి): 5. వైతాళికులు.

'పీడనివియోగమునవేగు బ్రోదుమేను
తలిరుతోరణమై సుమదామమయ్యె' నట.

అప్పుడామె కయిసేసికొన్నవి 'మొయిలు వసనమ్ములో ప్రొద్దుపొడుపు నగలొ'. ఆమె 'పూల పల్లకిలో పూలమాల'గా కూర్చున్నది. బోయవాండ్లు 'ఓహోహో'యనగా

'వీటివెలుపల మేల్కొనె తోటతెరువు

తోటపోలిమేరకాలువ తొనకెనిదుర.'

పైని పేర్కొన్నవన్నియు విలక్షణమైన భావచిత్రములు. పూలపల్లకిలో తాను పూలమాలవలె కూర్చున్నదనుట ఆమె సౌకుమార్యమునకు పరాకాష్ఠ. ఈ శీర్షిక చివరిపద్యములో కృష్ణశాస్త్రిగారు పల్లకి నుద్దేశించిచేసిన సంబోధనలివి.

'ప్రణయవల్లకి పల్లకీ! ప్రసవభర వ
సంతవల్లిక పల్లకీ! శక్రచాప
వక్రరేఖ పల్లకీ! మధుస్వప్నశాఖ పల్లకీ!'

ఇందులోని భావచిత్రములు ఒకదానిమించినదొకటి. వీణగా, పూలతీగగా, ఇంద్రధనూరేఖగా పల్లకి చిత్రింపబడినది. ఈ మూడుచిత్రముల తర్వాత వేసిన 'మధుస్వప్నశాఖ పల్లకీ'యన్నది దృశ్యజగత్తునకు సంబంధించినదికాదు. తీయనిస్వప్నమునకు శాఖాత్వము కల్పింపబడినది. వట్టి వృక్షశాఖ కాక స్వప్నశాఖ యనుటతో ప్రకరణములోని మాధుర్యభావమున కుత్కర్షయేర్పడినది. కనిపించని కల కవితారూపమున సాక్షాత్కరించినది.

ఈవిధముగా భావకవులు ప్రధానముగా హృదయతంత్రికలను స్పందింపజేయు మెత్తని భావచిత్రములనే అధికముగా ప్రయోగించిరి. విస్తరభీతితో మిగిలినకవులను గూర్చి ప్రస్తావించలేదు. ఇక కొందరు కవులు ప్రయోగించిన ఊహాచిత్రములను పరిశీలింతును.

(ii) *ఊహాచిత్రములు :*

భావచిత్రములు ప్రధానముగా హృదయమునకు సంబంధించినవని, ఊహాచిత్రములు బుద్ధికి సంబంధించినవని స్థూలముగా అనుకొనవచ్చును. వర్ణ్యవస్తువులతో తాదాత్మ్యముచెందుట కంటె దూరముగా నిల్చుండి, బుద్ధికి పనికల్పించి వేసిన చిత్రము లూహాచిత్రములు. భావకవులు ప్రబంధకవులవలె మెదడును కిర్రుమనిపించునట్లుగా క్లిష్టకల్పనలు చేయలేదు. క్లిష్టకల్పనలు వీరిలో ఎక్కడోతప్ప కనిపించవు. వీరు వేసిన ఊహాచిత్రములు చప్పున చిత్తదీప్తి కలిగించునవి. భావకవి తాళవృక్షములను బొగ్గుకంబములుగా ఊహించినాడు.[1] ఇది అపూర్వవర్ణన. ఈ వర్ణన

1. కవికోకిల గ్రంథావళి : ఖండకావ్యములు.

చదివినతర్వాత ఆలోచించిచూడగా కవి వేసినబొమ్మ మన కాశ్చర్యముకలిగించును. జడివాన 'పాములు వ్రేలాడుపగిది' నున్నదన్నాడు కవి.[1] మరణించిన తనప్రేయసి 'చావుబ్రతుకుల మధ్య విశాలమైన కలలవంతెనగట్టె'నన్నాడు.[2] ఇంకొకకవి గులాబినిజూచి 'ప్రకృతికాంతాధరరసమ్ము పడియగట్టి పోతపోసినట్లొప్పు'చున్నదన్నాడు.[3] అధరోష్ఠమునకు అరుణిమ వర్ణ్యము ఈ సంప్రదాయమును తీసికొని కవి గులాబినిట్లు చమత్కరించినాడు. ఈ వర్ణనలో గులాబి యేరీతిగా ప్రణయోద్దీపకమైనదో సూచితమైనది. దాని రామణీయకము వ్యంజింపబడినది. ఇంకొక కవికి 'ఊగులాడే కదలితరగలు నాగుబాములకోడెల'వలె ప్రాకుచు కనిపించినవి.[4] ఈ కవికే చల్లని నీడలు 'కాన్గుకొమ్మలలోనఁ జీకటులుముదిరి, ముడులుపడి నేలపై రాలిపడినయట్లు'[5] భాసించినవి. విశ్వనాథవారి 'కిన్నెరసాని'లోని కిన్నెరవర్ణనలో కిన్నెర 'పదుపుకట్టినలేళ్ళకదుపులా', 'కదలు తెల్లనిపూలనదివోలె', 'వదలు తెల్లనిత్రాచుపడగలా'ఉన్నట్లుగా చేసినఊహాలన్నియు ఒక్కొక్కటి ఒక చక్కనిబొమ్మను సాక్షాత్కరించుచున్నవి. కిన్నెరసాని 'పెద్దకాల్వ'గా ప్రవహించినప్పుడు ప్రయోగించిన

'బంగారుతీగలో పానకమ్మైపోయె
కొబ్బరిపాలు వాకలుకట్టినట్లయ్యె
వెయ్యావులొకసారి పిదికినట్లైపోయె'

అన్నవి ఈ తెగకుచెందిన ఊహాచిత్రములే.

జాషువాగారు చుక్కలను 'ఆకాశరామ నీల్లాడుచక్కదనాల బుడతలు'గా ఊహించినారు. జాబిలి రాట్నముగా, వెన్నెల నూలుగా చక్కని ఊహాచిత్రములు గీసినారు.[6] ఇంతవరకు నేను చూపినవన్నియు ఒకటిరెండు రంగులతో, రేఖలతో గీయబడినవి. విశ్వనాథవారు రంగులను, రేఖలను ఎక్కువగా వాడిన ఊహాచిత్రములలో నుండి ఒక్క ఉదాహరణ మిత్తును.

'కరకరిక్రొత్తత్రవ్వికరకట్టగఁబోసిననింగిలోనఁ జం
దిరుడనుతూమునఁ మెఱుపుతీవలచెర్వులనుండి దంపతి
స్ఫురదురుచేతమఁ పొలముబోదెలవెంబడిఁ బర్వులెత్తుచుఁ
విరిసిన జాలువెన్నెలలు..................'[7]

---

1. 2. కవికోకిల గ్రంథావళి : ఖండకావ్యములు.
3. సౌధ దుని ప్రణయయాత్ర : నాయని.
4. కోకిలమ్మపెళ్ళి : విశ్వనాథ.
5. గిరికుమారుని ప్రేమగీతాలు : విశ్వనాథ.
6. స్వప్నకథ. 7. శశిదూతము.

ఇది సాంప్రదాయికదృష్టితో చూచినచో మాలారూపకము. ఈ పద్యమున నింగిలో కట్టబోని, చంద్రుడను తూమున, మెఱుపుతీవలచెరువునుండి, దంపతుల హృదయమనెడు పొలముబోదెలలో పరువులెత్తు చంద్రికాప్రవాహముయొక్క బొమ్మ గీయబడినది ఈ చిత్రణము సంప్రదాయ ధోరణిలోనేయున్నను వెన్నెల కీవిధమైన ఊహాకల్పనముచేయుట నవ్యాతినవ్యమైనది.

సంప్రదాయమును స్పృశింపక - దానిని చెనకక - స్వతంత్రరీతిలో భావకవులు భావములో, ఊహలోచూపిన క్రొత్తపోకడలను పైన వివరించితిని. కొన్నిసందర్భములలో ఈకవులు ప్రాచీన కవిసమయములనుకాదని క్రొత్తవి సృష్టించుకొన్నారు. రాయప్రోలువారి 'దానిమ్మపూవంటి తరుణి కెమ్మోవి' నవ్యప్రయోగమే. దువ్వూరివారి 'గులాబీపూలకెనయౌ కపోలములు' అపూర్వ ప్రయోగమే.[1] ఇది పారశీకకవితాసంప్రదాయమునుండి దిగుమతియైన కవిసమయము. శివశంకర శాస్త్రిగారు ప్రేయసికన్నులను 'ఆంగ్లబాదామఫల రూపహారు'లుగా వర్ణించినారు. ఇది సరిక్రొత్త ప్రయోగము. ఈరకముగా భావకవులలో ప్రాచీనకవిసమయములకు సైదోడుగా సృష్టించిన నూత్నకవిసమయములున్నవి. అయినను అధికముగా ప్రాచీనకవిసమయములకు క్రొత్తరంగులు వేసి ప్రయోగించుటయే జరిగినది. భావచిత్రణలో వీరుచూపిన నవ్యత కవిసమయోల్లంఘనములో చూపలేదు. వీరు వాడినపదములు వేనికవి ప్రబంధవాసనలుకలవైనను, అవి సమ్మేళనముపొంది నప్పుడు నవ్యత తొంగిచూచినది. వీరు గేయములుకాక వృత్తములు. జాతులు సంప్రదాయ పద్ధతిలోనే రచించినను, వానిలో గూడ ఏదోఒక నవ్యతారేఖ ననలెత్తినది.

## రచనలో నవ్యత :

**1. శైలీసౌకుమార్యము :** భావకవిత్వము ప్రధానముగా ప్రసాదమాధుర్యగుణములు కలది. దేశభక్తి కవిత్వమున తప్ప ఓజోగుణ మిందుకనరాదు. అందుచేత ఈ కవిత్వమునకు లలితమధురపదవిన్యాసము, శైలీసౌకుమార్యము, అలతిపలుకుల జిలుగువిరుపులు సహజ గుణములై పోయినవి. ప్రాచీనాంధ్రకవులలో నన్నయవృత్తరచన వీరి నాకర్షించినది. ప్రణయ కవిత్వములోని వృత్తములన్నియు ప్రధానముగా నన్నయశైలిని, కొంతవరకు తిమ్మనాది లలిత కవుల బాణిని పుణికిపుచ్చుకొన్నవి. దేశభక్తి కవిత్వములో గతవైభవస్మరణకు ప్రధానముగా వీరు సీసపద్యము నుపయోగించుకొన్నారు. సీసపద్యము వీరిచేతిలో శ్రీనాథుని గతులను తల పించినది. 'గనుగుసీసము' నెవరో ఒకరిద్దరు వ్రాసిరి. తక్కినఅందరును ఏపాదమున కాపాదము కదనుద్రొక్కు 'గుఱ్ఱపుసీసము'లు వ్రాసినవారే.[2] 'అమరావతీపట్టణమున', 'ఏరాజు పంచెనో ఇచట శౌర్యపు పాయసము' మున్నగు అసంఖ్యాకమైన సీసములిట్టివే. ఇంతేకాక వీరు సీసపద్య

1. ఖండకావ్యములు : 'అనార్కాలి'లో.
2. నన్నయ్యవ్రాసిన సీసములలో ఎక్కువభాగము ఒక పాదములోనిది ఇంకొకటి అల్లుకొనుపోవునవే. వీనిని విశ్వనాథవారు 'గనుగుసీసము'లనిరి. ఈ తూకములోనే నేను ఏ పాదమునకది విరిగిపోయి దూకుడుగా సాగిపోవు సీసమును 'గుఱ్ఱపు సీసము' అని చమత్కరించితిని.

ములలో శ్రీనాథాదులవలె గేయగతిని సాధించిరి. కృష్ణశాస్త్రిగారి 'నునుమబ్బులేదున్న కొనలపై సోనలౌ, నెలవంక చిరునవ్వు చలువపాట'వంటి పద్యము లిందుకు తార్కాణలు. గీతపద్యము నడకలో గూడ భావకవు లపూర్వమైన విరుపులను, జిలుగులను సాధించిరి. దీనిని ఛందశ్చర్చా సందర్భమున వివరింతును. కొందరు వరుసగా దీర్ఘ సంస్కృతసమాసము గుప్పించి చివరికి తెనుగుమాట నతికి చమత్కారము సాధించిరి.

'ప్రబలనీరంధ్రాభ్రజనితగాఢధ్వాంత
నిబిడహేమంతరాత్రీకుంతలములలో
చుక్కలా.' (కృష్ణపక్షము)

భావవైశద్యముకొరకు కొందరుకవు లొకేపదమును మాటిమాటికి ప్రయోగించిరి.

'ప్రణయతరంగిణుల్ ప్రవహించుచోట
ప్రణయలతావళుల్ ప్రాకెడుచోట
ప్రణయపల్లవము లుద్భవమందుచోట.' (ఏకాంత సేవ)

ఈక్రమములోనే దాదాపు ఇంక పంద్రెండు చరణములందు 'ప్రణయ'శబ్దము పునరావృత్తమైనది.[1] ఈ పద్ధతి రానురాను వెగటుపుట్టించినను క్రొత్తలో క్రొంజవులూరించినది. కొందరు కవులు కొన్నిభావములను ముక్తపదగ్రస్తరీతిలో ఇట్లు వెల్లడించిరి.

'మధురచంద్రికలలో మధురామృతంబు
మధురామృతంబులో మధురరసంబు
మధురరసంబులో మధురభావంబు.' (ఏకాంత సేవ)

ఇంతేకాక 'ఏకాంత సేవ'లో ఒకేభావమును సాదృశ్యపరంపరలతో చెప్పుట, ఒకేవాక్యశిల్పమున వరుసగా అనేకపాదములను కూర్చుట కలదు.

భావకవులలో కృష్ణశాస్త్రిగారి చేతిలో ప్రాతశబ్దములే క్రొత్తపరిమళములను, క్రొత్త వన్నెలను సంతరించుకొన్నవి. 'ఏలదేటి చిఱుపాట సెలయేటి కెరటాలఁబడిపోవు విరికన్నె వలపు', 'తొలిప్రొద్దుతెమ్మెరత్రోవలో పయనమై పరువెత్తు కోయిలపాట'. 'కారుచీకటికొసలు' మున్నగు వానియందలి అచ్చమైన తెలుగుమాటల కూర్పులో, 'కరుణార్ద్రవీక్షణపరిమళములు' 'విరహ వీక్షణభయంకరమాధురులు', 'చండమృత్యుగభీరగర్జారవములు', 'అగమ్యతమస్వినీగర్భ కుహరాలు', 'హేమంత కృష్ణానంతశర్వరి', 'అంగుళీకిసలయచంచలాంచములు' మున్నగు సంస్కృతసమాసముల పోహళింపులో, అపూర్వనవ్యతాభరితమైన కామనీయకము వెల్లివిరియు చున్నది. తెలుగు కవిత్వమున జిలుగునగిషీలకు, 'సన్నపోగారుతనము'న కెంతవిలువున్నదో అంత

1. దీనినే అక్కిరాజు ఉమాకాంతంగారు 'పులుముడుదోష'మనిరి.

కృష్ణశాస్త్రిగారు సాధించిచూపినారు. వీరికై లికిమించిన సౌకుమార్యమును సాధించుటకు ప్రయత్నము చేయుటయనగా మధుధారను జలధారగా మార్చుటయే. అనగా శాస్త్రిగారి భావకృతులు సౌకుమార్య మాధుర్యములకు చరమసీమలని నా యభిప్రాయము.

**2. పదబంధములు :** అత్యపూర్వములైన పదబంధములు ప్రయోగించుటలో భావకవిత పరాంకోటి నందుకొన్నది. ఏనాడును ఏకవియు శబ్దములను సృష్టించలేదు. ఇకముందు ఎవరైన సృష్టించినను ప్రభుత్వముద్రపడని నాణెమువలె అది చెల్లుబాటులోనికిరాదు. శబ్దములపై ప్రభుత్వ ముద్రయనగా ప్రజావ్యవహారముద్ర యన్నమాట. ప్రజావ్యవహారములోనో, లేక ప్రాచీనగ్రంథ ములలోనో ఉన్నమాటలనే ఏకవియైనను ప్రయోగించును. ఐనచో పదప్రయోగమున భావకవుల నవ్యతయేమి ? ఆ పాతపదములను పోహళించుటలోనే వీరు క్రొత్తదనము సాధించిరి.[1] వాల్మీకి, కాళిదాసు, జయదేవుడు, నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పెద్దన, వేమన ఈ గ్రథన కౌశలము వలననే తమ ప్రయోగనవ్యత కనబరిచిరి. నవ్యకవులుగూడ అపూర్వరీతిలో పదబంధ ములను సృష్టించి తమ ప్రయోగప్రియత్వమును ప్రకటించిరి. నావుడు, వెండియు, కొనకొని, సరవి, మానుగ మున్నగు 'పాదపూరణ' పదములను త్యజించిరి.[2] సాధ్యమైనంతవరకు పాద పూరణాదులకై పూర్వులు చేసిన ప్రయత్నమును విసర్జించిరి. ఇక నవ్యకవులలో కొందరు ప్రయోగించిన అతినవ్యమైన పదబంధములలో కొన్నిటి నుదాహరింతును. ఇవి రూపకములు కావచ్చును. లేక కర్మధారయాది సమాసములుకావచ్చును.

**(i) *కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశినుండి :***

నీలంపుసిగ్గు, దరహాసకౌముది. అశ్రుఝరులు, హాసమృదులవాసనలు, కొసరుతేనియలు, నెత్తావిగుసగుసలు, నిర్జీవనిశ్శబ్దము, సురభిశాహ్వానములు, కైశికధ్వాంతనిశ్శబ్దము, రహస్తీరాలు, నిదురచెర, నీలినీడ, కారురాతిరికొసలు, కార్చిచ్చుమంటయేళ్ళు, వలపుటాకలి, మూగకనులు, వేదనాసుఖము, అరుణారుణాంధగీతి, అమవసకన్నీటిపాట, ఇరుల గుసగుసలు, ముదుసలి నిరాశలు, పాటరెక్కలు, తీయతేనియబరువు, విశ్వవీణాగళము, విరహవిపంచి, సురభిసౌదామని, నిదురపొదిగిళ్లు.

**(ii) *దీపావళినుండి :***

బాష్పభాషణములు, పూలవెన్నెలలు, మబ్బుకన్నెలు, వలపునివాళి, తేనెతావులబరువు, తలిరుటెడద, జీవితంపుటెడారి, ఆశావిపంచి, మబ్బుకౌగిళులు, రేయికాటుకకనులు, చంద్రికా వసనము, విరహవిషాదరేఖ, నిసికంటినీరు, తెమ్మెరయూర్పు.

---

1. 'త ఏవ పదవిన్యాసాః తా ఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్'. —ధ్వన్యాలోకము : 4 వ ఉద్యోతము.

2. విశ్వనాథప్రభృతులొకరిద్దరిట్టివివాడినారు. వీరు నవ్యులేకాక సంప్రదాయవాదులుగూడ కావున ఇట్లు చేసిరి.

(iii) శశిదూతము నుండి :

పోతువెన్నెలలు, పూలదీపము, వెలుగుపోచలు, నులివెచ్చ చిక్కవెన్నెలలు: కల్పపరంతి యూరుపులు, తావిదివ్వియ, వెచ్చవెన్నెలలు.

(iv) సౌభద్రుని ప్రణయయాత్ర నుండి :

తుషారదూతికలు, మేఘపతాకలు.

(v) మధుకీల నుండి :

లేతగుసగుసలు, గాలిబాలిక, తలిరుతురాయి,

(vi) గబ్బిలము నుండి ;

జాలివెన్నెల.

(vii) హిమగళము నుండి :

మంచుమంట.

విలక్షణమైన కొన్నిటినిమాత్రమే ప్రసిద్ధకావ్యములనుండి ఏరికూర్చితిని. మిగిలిన కావ్యములలో ఇట్టి నూత్నపదబంధములున్నను విస్తరభీతిచే పేర్కొనలేదు.

ఛందస్సు :

భావకవులు వృత్తములను, జాత్యుపజాతులను, మాత్రాచ్ఛందోఘటితములైన గేయములను సమానాభిరుచితో సంతరించినారు. గద్యపద్యమయమైన చంపూరీతి రాయప్రోలుతోనే పరిత్యక్తమైనది. భావకవులుగూడ ఈ పద్ధతిలోనే కేవల పద్యగేయకావ్యములు రచించిరి గద్యపద్యముల సమ్మేళనముస్థానే పద్యగేయసమ్మేళనము వీరి ప్రత్యేకత. సౌభద్రుని ప్రణయయాత్ర, గిరికుమారుని ప్రేమగీతాలు, మల్లికాంబ మున్నగునవి కేవలము పద్యమయములు. కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి, ఊహాగానము మున్నగునవి పద్యగేయ మిశ్రమములు. కిన్నెరసానిపాటలు, వకుళమాల, యెంకిపాటలు, శశికళ మున్నగునవి కేవలము గేయకృతులు. వీరిలో శివశంకరశాస్త్రిగా రనేకగతులలో అసంఖ్యాకమైన గేయపద్యరూపకములు రచించినారు. కాని ప్రక్రియనుబట్టి ఇవి నాటకవిభాగమున చేరునుకావున వీనిని ప్రస్తావించుటలేదు.

వృత్తములలో ఒకటిరెండు ప్రయోగములు చేసినవారు శివశంకరశాస్త్రిగారు. వీరు మూడు పాదములతో,[1] రెండుపాదములతో[2] వృత్తములు రచించిరి. వృత్తములలో ఇంతకుమించిన ప్రయోగములు జరుగలేదు. గీతపద్యములలో మాత్రము కొన్ని ప్రత్యేకప్రయోగములు జరిగినవి.

1. 'ఆవేదన'లో : 'ఉన్నతభూధరంబు' అను ఉత్పలము.
2. 'ఆవేదన'లో : 'ప్రీతిన్నాడుసుధాసమానమగు' అను శార్దూలము :

పూర్వకావ్యములలో తేటగీతి నాలుగుపాదములవరకే పరిమితమైయుండెడిది. ఇంగ్లీషులోని సానెట్ ప్రభావము వలన నవ్యకవులు దీని చతుష్పాదనియతినితొలగించిరి. అయినను సానెట్‌లోని పాదనియమమును వీరు పాటించలేదు. భావమెక్కడ విరుగునో అక్కడికే పాదము సమాప్తమగు పద్ధతిని వీరు ప్రవేశపెట్టిరి[1]. ఒక్కొక్కమాటు రెండవపాదము మధ్యలోనే ఆపివేసిరి.

'ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
వోలెనున్న దినాస్థితి——' (గిరికుమారుని ప్రేమగీతాలు)

కొన్ని సందర్భములలో పద్యమును మధ్యనే ప్రారంభించిరి.

'.................జయముజయము
లలితసుమనోజ్ఞకావ్యమంజులలతాంత' (కృష్ణపక్షము)

కొన్ని గీతపద్యములు మనకు వాని ఛందోవిషయకమైనజ్ఞానము లేకుండజేయునట్లుగా రచించిరి.

'నింగినీడలమెట్లుగా, నీలిమొయిలు
జిలుగువిరుపులుగా, పులుగులుగ, నలరు
లుగ, నలలుగా, కలలుగాగ——' (ఊర్వశి)

ఇది చదువుచున్నప్పుడు మన మొత్తియొత్తి, ఆగియాగి, బలమైన వచనము చదువుచున్నట్లు తోచును. ఈ పద్యములోనే 'కలలుగాగ'అను పదముపిమ్మట గల 'సొగయబోని విసివికోని వింతవలపు వేడివేడి'అను పదములు త్ర్యస్రగతిలో నడచు గేయగంధమును కలిగియున్నవి. కృష్ణశాస్త్రిగారి 'అతనిపాట'అన్న తేటగీతులలోగూడ

'సందెవేళ, పొలముగట్టు, చల్లగాలి
— — — — —
మొగముగంటిఁ, గనులగంటి, మొగిలుఁగంటి' (కృష్ణపక్షము)

అనుపదముల ప్రయోగములోని చమత్కారము వలన త్ర్యస్రగతి స్ఫురించును. వృత్తములలో ప్రాసస్థానమున అక్షరసామ్యమున్న పదముల ఆవృత్తిచేత సాధించెడి చమత్కారమును భావకవులు గీతపద్యముల మధ్యలోగూడ సాధించినారు.

'పచ్చనీమేనా కేసారి వార్షుకాభ్ర
లీనసౌదామనీపింగలిమము నంగు

1. 'నన్నుగని యేరు జాలిచెందంగవలదు' అన్న కృష్ణశాస్త్రిగారి గీతమాలిక 18 పాదములలో తీగవలె సాగిపోవును.

లీవిలూనజపాపాటలిమము చలద
లీగరున్మోహనశ్యామలిమము తన్వి '[1]

సీసపద్యములను వచనగేయములుగా మలచుకొని అట్లే అచ్చువేసి ఇంద్రజాలముచేసినవారు వెంకటపార్వతీశ్వరకవులు.[2] ఇంద్రజాల మెందుకంటిననగా ఒకరు చెప్పెడివరకు అవి సీసములని స్ఫురించదు. వానిని రచించునప్పుడే ఆ మెలకువ వారికుండుటవలన ఆపద్యములు 'ముమ్మూర్తుల' కమ్మని వచనగేయములవలె సాగిపోవును. మచ్చునకు మొదటి పద్యము.

'నాభారతి తనమనసువచ్చిన పసిపాపలగూడి
తొక్కుపల్కులను బల్కుచున్నది.
తనయీడు చిన్నబిడ్డలజేరి
పదముల( బాడుచున్నది.
తనచెలికత్తెలనెల్ల దగ్గఱజేర్చి
యోమనగుంటలాడుచు( బ్రొద్దుగెంటుచున్నది.
ఎరువుబొమ్మల(దెచ్చి పెళ్ళిళ్ళలో
గుజ్జెనగూళ్ళను( గూర్చుచున్నది.
ఎపుడీబాల భారతీదేవియేయన(గ బలుకునో
పరాత్పరు బొగడునో—
జగమ్మెబొమ్మరిల్లుగ నాడ(గలుగునో
అపుడు పితామహుడేయయిపోదును ప్రభు!'

చిత్రమేమనగా ఈ రచనలో ప్రతి రెండవపాదము క్రియాంతముగా నున్నది. అక్కడికి చెప్ప దలచుకొన్న విషయము, భావము సమాప్తమగుచున్నవి. భావమునుబట్టి చరణముల హ్రస్వత్వ దీర్ఘత్వము లేర్పడినవి. అందువలన ఇది వచనగేయముయొక్క లక్షణములకు మరింత సన్నిహితమైనది. దీనిని సీసముగా మార్చి చదువుకొందమన్నచో వచ్చెడి చిక్కు ఇంతంతకాదు. కొన్ని పంక్తులను సీసముగా మార్చి చదివిన ఇట్లుండును.

"నాభారతి తనమనసువచ్చిన పసిపా
పలగూడి తొక్కుపల్కులను బల్కు
చున్నది తనయీడు చిన్నబిడ్డలజేరి
పదముల(బాడుచున్నది తనచెలి"

1. గిరికుమారుని ప్రేమగీతాలు. 2. భావసంకీర్తనము.

దీనిని సీసపద్యముగా చదువుట కెంత క్లేశము కావలయునో స్పష్టమైనదనుకొందును. నేను మొదటనే మనవిచేసినట్లు సీసపద్య లక్షణములను దృష్టిలో నుంచుకొని వచనగేయములుగా పఠింప బడుటకు చేసిన రచన యిది. కావున ఈ పద్యములను సీసపద్యము లనుటకన్న వచనగేయము లనుటలోనే సరసత, సార్థకత కలవు.

'భుజంగ ప్రయాతము' వంటి ప్రాచీనవృత్తములకు వెల్లవేసి గేయాభాసకలుగునట్లు కొందరు కవులు రచించినారు.

'లతాంతార్ద్రరాగమ్ములంబాడు తేటుల్
వసంతమ్ము కాంతిప్రవాహమ్ములందుఁ.' (ఊహాగానము)

ఇది మాత్రాచ్ఛందస్సు దృష్ట్యా ఖండగతిలో నడచినది. ఇందు ప్రతిపాదములో మొదటిమాత్రను తీసివేసినచో లక్షణముగా ఐదైదుమాత్రలలో నడచును. అయినను నే నుదాహరించిన రెండు పాదములలో తప్ప తర్వాత ప్రతి రెండు పాదములకు ప్రాసము, యతి పాటింపబడినవి. మొదటి గేయఖండములో 7 పాదములున్నవి. రెండవదానిలో 8 ఉన్నవి.

ఇక భావకవుల గేయములలో ప్రధానమైన గతిచమత్కారమును, లయ విన్యాసమును వివరింతును.

**ఖండగతి :**

భావకవులు రచించిన గేయములలో అధికభాగము ఐదైదుమాత్రల 'ఆవృత్తు'లతో నడచు ఖండగతిలోనే యున్నవి. ఎంకిపాటలలో ఏ కొన్నియో తప్ప అన్నియు ఈ గతిలోనే కలవు. కృష్ణశాస్త్రిగారి గేయములుగూడ అధికభాగ మీ గతిలోనే కలవు. ఇది ద్విపదకు, సీసమునకు సన్నిహితమైనదగుటవలన, భావకవులు మొదట పద్యములతోనే తమ కవితాసాధనము ప్రారంభించినందువలన, ఈ ఖండగతి అనుకొనకుండ వారిని వశపరుచుకొన్నది. ఖండగతిలోనే పాద సంఖ్యతో, మాత్రాధిక్యముతో, మాత్రాలు ప్తితో ఈ కవులు సాధించిన నవ్యతను పరిశీలింతును.

కిన్నెరసాని పాటలలో అధికభాగము ఖండగతియే కలదు. 'కిన్నెర నడకల'లో మొదటి రెండుపాదములు 5 + 5 = 10 మాత్రల చొప్పున నుండి, తరువాతి 3 పాదములు ఇరువదేసి మాత్రలు కలిగియుండును. ఈ భాగములో ఒక్కొక్క గేయఖండములో ఐదేసి పాదము లున్నవి. 'కిన్నెరనృత్యము'లో ఈగతిలోనే 7 పాదముల గేయఖండములున్నవి. మొదటి 4 పాదములు పదేసి మాత్రలతో, అయిదవది 20 మాత్రలతో సాగిపోవును. 6 వ పాదము

'నటనాలు మొదలెట్టె + నే + క్రొన్నిటి
తుటుములా కదలాడెనే'

అని యుండును. 'మొదలెట్టె' వరకు 5 + 5 = 10 మాత్రలున్నవి. 'నే' తర్వాత మూడు మాత్రల కాలము దీర్ఘముతీసి 'క్రొన్నిటి' యందుకొనవలసియుండును.

'నటనాలు మొదలెట్టెనే (తకిట) క్రొన్నీటి
తుటుములా కదలాడెనే.[1]

ఈ మూడుమాత్రలకాలము దీర్ఘము తీయగా చిత్రమైన తూగువచ్చును. కిన్నెరసాని పాటలలో, కృష్ణశాస్త్రి మున్నగువారి గేయములలో ఈవిధమైన విరుపు లనేకములున్నవి. ఈ పద్ధతి తెలంగాణములో ప్రసిద్ధమైన గౌరమ్మ పాటలలో[1] ఉన్నదే. విజయరాఘవుని యక్షగానములో

'......................
పడ సేవాడుగాదే - ఓ చెలియ
పడ సేవాడుగాదే'

వంటి పాదములలోను ఇది కన్పడుచున్నది. ఈరీతిని చేపట్టి భావకవులు వివిధరసభావములను మెప్పించిరి.

'కిన్నెర సంగీతము'లోని గతి పైరీతిలో నున్నది. కాని ప్రతి గేయఖండము ఆరారు పాదములు కలిగియున్నది. మొదటి రెండుపాదములలో ఇరువదేసి మాత్రలు, మూడునాలుగుపాదములలో పదేసిమాత్రలు, చివరి రెండుపాదములు పైన పేర్కొన్నరీతిగా నడుమ విరుపులు కలిగియున్నవి.

'గోదావరి సంగమము'లో ఈ గతిలోనే గొప్ప చమత్కారము సాధింపబడినది. ప్రతి గేయఖండములో 6 పాదములున్నవి. అది యిట్లు సాగును.

"గోదావరీదేవిగుండె జలజలలాడి
ఆదగొని మనసు కదలాడీ జాలి
పాదులో పెల్లగిలిపూడీ కిన్నెరా
గేదంగితెల్లరేకెత్తు క్రొత్తరగలో
చాదుకొని పెనుతరగలూగే ఆవాగు
నాదుకొనియామె వగసాగే."

ఇందులో రెండు, మూడు, అయిదు పాదములలో విరుపులు ప్రవేశపెట్టబడినవి. రెండవపాదములో 'కదలాడీ - జాలి' కి మధ్య మూడుమాత్రల కాలము, మూడవపాదములో ఒక్కమాత్ర కాలము దీర్ఘము తీయవలసియుండును. 5 వ పాదములో ఒక్కమాత్రకాలమే పొడిగించవలసియుండును. ఈవిధముగా మాత్రాలు ప్తిచేసి దీర్ఘముతీయుటతో రాగభావములకు మంచి అవకాశము లభించినది. 'కిన్నెరవైభవము"లో చివరిపాదమునకు ముందుగల విరుపు 5 మాత్రల కాలము నాక్రమించుకొన్నది.

1. 'నానోముసీకిస్తునేగౌరమ్మ నీనోమునాకియ్యవే'.

'మెరసిందికిన్నెరా (తకతకిట) ఒడ్డుల్లు
ఒరిసిందికిన్నెరా.'

అబ్బూరివారు ఈ 5 పాదముల గేయఖండములో మొదటి రెండుపాదములు ఇరువదేసి మాత్రలతో, మధ్యలో రెండుపాదములు పదేసి మాత్రలతో, చివరిది మరల ఇరువదేసి మాత్రలతో నడపినారు.[1] వీరి 'సరోజినీదేవి'అను గేయము ఖండగతివాసనగల వచనగేయము

'తొలిప్రొద్దురేకలు
పులుగుల కేకలు
తలసూపు మోకలు
కడలేని బంగారుగనులు; సరోజినీగానకళ కలములు.'

ఇందులో మొదటిపాదమున ఒకమాత్ర, రెండవదానిలో రెండు, మూడవదానిలో ఒకటి, చివరిదానియందు మధ్యలో ఒకటి చేర్చినచో ఖండగతిగా మారును. వీరి 'పృథివీప్రశంస', 'ఆంధ్రవీర కంఠీరవ'అనుగేయములలో ఈవిధముగా మాత్రలుపెంచినచో అవి ఖండగతిలో చేరును. లేకున్న లయభంగము జరిగినట్లనిపించును.

ఈ గతిలోనే మాత్రాధిక్యముతో గతివైవిధ్యము సాధించిన గేయములు కొన్నియున్నవి.

'కడలినట్టడుగుపొడ + ము
ముత్తియమ : నీదుకాం + తిఁ
బడయగను మునుగవలె + నా
వలలెన్నొపన్నవలె + నా—'

దీనిలో ప్రతి పాదముచివర ఒకటిరెండు మాత్రలు పెంచుటతో లయలో మంచి తూగువచ్చినది.[2]

ముత్యాలసరములోవలె ఖండగతిలో గూడ చివరిపాదము సగముమాత్రమే రచింపబడిన గేయములు కొన్నియున్నవి.

'జలరాశికద్దరినె మిలమిలా మెరిసేటి
జలజమ్ము సౌరభమె వలచాను.'[3]

కవికొండలవారు 'సయ్యాటా, తియపాటా' అను గేయమున మొదటి రెండుపాదములలో ప్రతి పాదము పిమ్మట ఈ రెండు మకుటములను చేర్చి లయవైవిధ్యము సాధించినారు.

1. ఊహాగానము : 'తిక్కనసోమయాజి'.
2. 'ఆశయము' : కవికొండల : 'వైతాళికులు'నుండి. వీరి 'నావపైపిల్ల' అనుగేయ మీ రీతిలోనే రచింపబడినది.
3. 'ఆకాశతార' : మల్లవరపు : కల్యాణ కింకిణిలో

'నల్లన్ని మట్టికీ - తెల్లన్ని నురువుకూ - సయ్యాటా
నదిపిల్లపాయకూ - ఉదధికెరటానకూ - తియపాటా.'[1]

తర్వాత సాగిన చరణములలో ఈ 'సయ్యాటా తియపాటా'యను మకుటప్రసక్తిలేక గేయము సరళముగా నడచిపోవును.

రాయప్రోలువారు 'ఓభామా'అను మకుటము పునరావృత్తితో చతురస్రగతిలో గేయము నడపినట్లే, తల్లావఝ్ఝలవారు ఖండగతిలో 'ఓనాథా'అను మకుటము పునరావృత్తితో నడపిరి.

'చల్లనౌసాయాహ్న — మోనాథా
చక్కనౌ మార్గాన — ఓనాథా (వకుళమాలిక)

కృష్ణశాస్త్రిగారు రీగతిలో వ్రాసిన ఒకగేయమునకు ముందు అధికాక్షరముచేర్చి చమత్కారము చేసిరి.

'నీ
కనురెప్పకొనలనొక చినుకైనకదలనీ'

ఇందులో 'నీ' అని కొంతసేపాగి 'కనురెప్పల' నందుకొనవలెను. అట్లుకాక నీకను + రెప్పకొ + నలనొక + చినుకై + నకదల + నీ అను ధోరణిలో చదువుకొనుచుపోయినచో ఇది చతురస్ర గతిలో చేరును. కాని దాని తర్వాతనే యున్న

'ప్రళయకాలానంతభయదపాథోరాశి
వలె విశ్వమెల్లముంచెత్తుసుమ్మా'

అన్న పాదము లందుకు ప్రతిబంధకములు. ఇవి ఖండగతిలో నున్నట్లు స్పష్టముగదా. ఇక త్ర్యస్రగతిని గూర్చి వివరింతును.

### త్ర్యస్రగతి :

ఇది 3, 3 మాత్రల ఆవృత్తిలో నడచుగతిగల ఛందస్సు. దీనిలోగూడ ముత్యాలసరములో వలె చివరిపాదమున కొన్నిమాత్రలు తగ్గింపబడిన సందర్భములున్నవి.

'ఈ బ్రదుకున విఫలమైన ఈప్సితములు స్వర్గసీమ
మరలపూచి సఫలీకృతమై విలసిల్లుగా.'[2]

4 పాదములు సమానముగా ప్రయోగింపబడినవున్నవి.

1. విశాలవిశ్వము : కవికొండల.
2. మధుకీల :

'లేతలేతతీగెవోటి పూతపూచెను
తేనెమారు చిన్నిపూలు తేరిచూచెను
మందమలయవాయువోటి మలసివీచెను
అందమైనపూలు తమసుగంధమొసగెను.'[1]

ఈ గేయములో ప్రతిపాదమున 3 + 3 + 3 + 3 + 3 + 3 + 1 = 19 మాత్రలున్నవి, చివరికి లఘువుండుటతో పాదము చమత్కారముగా విరిగినది. ఈ పాదము లెంతపొడవుగా నున్నవో, అంతపొట్టిగా నున్న త్ర్యస్రగతి గేయములుగూడ కలవు.

'మెట్లుమెట్లు రాతిమెట్లు
కారునల్ల రాతిమెట్లు.'[2]

ఈగేయమున ప్రతిపాదములో 3 + 3 = 6 మాత్రలే యున్నవి.

ఖండగతిలో చేసినట్లుగానే ఈ గతిలోగూడ ప్రతిపాదమున ఒకమాత్ర పెంచి క్రొత్త ఊపు సాధింపబడినది.

'అవితారలు—యుగాలనుండి
ఆ నిర్ఝరపథాలనిండు
హసితోదయసుధాలవాలు.'[3]

ఈ గేయములో చివరి 'డి', 'డు', 'లు' అనుమాత్ర లధికములు. వీనిమీద ఒక్కొక్కొక్కనగాని తర్వాతి పాదమును పలుకుటకు వీలుండదు.

ఖండగతిలో వలెనే త్ర్యస్రగతిలో చివరికి విరుపులు ప్రవేశపెట్టబడిన సందర్భములున్నవి.

'అనిశమునాకొరకుమీర
లనుభవించుచున్నబాధ
అవగతంబెనాకు, కాని
తాళుడునాథా—నాకోసము
తాళుడునాథా.' (వకుళమాలిక)

'తాళుడునాథా' తర్వాత 4 మాత్రల కాలము ఊపిరిదీసినగాని లయ సరిపోదు. ఇది 5 పాదముల గేయఖండమగుట ఇంకొక విశేషము.

ఈ గతిలో మల్లవరపువారు కొన్ని చమత్కృతిమంతమైన ప్రయోగములు చేసినారు.

1. 'అమరత', 'సామ్యము' 2. 'మెట్లు': బాపిరాజుగేయము: 'వైతాళికులు'.
3. 'రెండులోకాలు': హిమగళము.

'తూగాడుతరంగాల
నూగాడురాగమాల
ఏగాలిమర్మరాలరేగెనో
ఏదూరతీరాల్రమోగెనో.'1

ఇందులో 'తూగాడు'అనుపదమున 5 మాత్రలే యున్నవి. కాని యిది (3 + 3) ఆరుమాత్రలుగా చదువుకొనవలెను. అనగా 'తూ' అన్నదానిని సాగదీసి ఒక్కమాత్రకాలము పెంచి చదివినచో ఇది త్ర్యస్రగతిలో చేరును. తూగాడు, నూగాడు, ఏగాలి, ఏదూర అన్న పాదములన్నిటిలో ఈవిధముగా (మొదటి అక్షరమును మాత్రమే) సాగదీసి చదివినచో స్వరదైర్ఘ్యమువలన హాయి, లయవైచిత్రి చేకూరును. దీనికి విభిన్నముగా ఇంకొక గేయము వీరే రచించిరి. దానిని పేర్కొందును.

'ఏనాటిదీ రత్నవేది
కావాసిత దివ్యవీణ
ఈనాటికితెరచి మీటి
తీవుబాల ! నా బ్రదుకున.'2

ఈ విధముగానే మిగిలినగేయము సాగిపోవును. పై పాదములలో మొదటిది మాత్రమే ఒడు దొడుకుగా నున్నది. మిగిలిన మూడు 3, 3 మాత్రలతో విరిగిపోవు గణములే. మొదటిదానిలో ఒకమాత్ర పెరిగినది, దీనిలో 'ఏ'ను చదువునప్పుడు ఎ, ఏ లకు మధ్యగల స్వరమును పలికి గభాలున 'నా' అందుకొన్నచో ఒక వింత తూగువచ్చును. తాళలయభంగముకాదు. వీరే 'కీలాంజలి' అనుగేయమున 4 పాదముల ఖండములో A, B, A, B పద్ధతిని ప్రవేశపెట్టిరి.

| | | |
|---|---|---|
| 'స్మృతిలోకం | A | 6 మాత్రలు |
| తలుపుతెరవకే | B | 8 మాత్రలు |
| చితిమంటలు | A | 6 మాత్రలు |
| పైకిపర్వనే'3 | B | 8 మాత్రలు |

ఇది రాయప్రోలువారి 'పదవే చెలికాళ్ళ గజ్జియల్' అనుగేయమును పోలియున్నది. ఆ పాదము లోని సగముభాగము ఇందులో ఒక పాదమైనది. రాయప్రోలువారి పై గేయమును నేను చతురస్ర గతిలో చేర్చితిని. దీనినిగూడ

'స్మృతిలో + కం తలు + పుతెరవ + కే'

అని చతురస్రగతిలోనికి దింపవచ్చును. కాని కవిఉద్దేశమదికాదు. స్మృతిలోకం, చితిమంటలు అన్నపిమ్మట కొంత ఊపిరితీసికొనుట ఆవశ్యకము. లయదృష్ట్యా చక్కని ప్రయోగమిది. బసవ

1. కళ్యాణకింకిణి : 'ప్రశ్న' : 2. 3. 'కళ్యాణకింకిణి : 'ఈనాటికి', 'కీలాంజలి'.

రాజు అప్పారావుగా రీ త్ర్యస్రగతిలో రచించిన గేయమున నాలుగుపాదములలో చివరిపాదమును ముత్యాలసరములోవలె త్రుంచి 'పగడాలదండ' అని నామకరణము చేసినారు.

'జలజలమనిపాతెడునీ
సెలయేటిదరింగూర్చొని
విలపించెదవేలనిటులు
చెలియచెప్పవే.'[1]

ఇది గురజాడవారి ముత్యాలసరమునుజూచి పెట్టినపేరు. కాని యీపేరు వీరి యీ రచనతోనే ఆగిపోయినది.

**చతురస్రగతి :**

ఇది 4, 4 మాత్రల గతిలో నడచు ఛందస్సు. కిన్నెరసాని పాటలతో ఈగతి సమమాత్రాకముగా, సమపాదముగా ప్రయోగింపబడినది.

'ఊగులాడు కెరటాలనాపుకొన
సాగులాడుతరగల్లు నిల్పుకొన
ప్రాకిపోవుతనగుణము చంపుకొన
చాలకచాలకచాలకచాలక.' (కిన్నెరదుఃఖము)

తల్లావఝ్ఝలవారు ఈగతిలో రచించిన పాదముల చివర 'ప్రియురాలు' అనుమకుటము పునరావృత్త మొనర్చి నవ్యత సాధించిరి.

'వార్తచేరగనె ప్రియురాలు
వచ్చెనెదురుగా ప్రియురాలు'. (వకుళమాలిక)

దువ్వూరి రామిరెడ్డిగారు 'ఆమనినిషా' అను గేయములో కొన్నిచోట్ల మాత్రలను పెంచి వ్రాసిరి.

'జాగ్రత్త! జాగ్రత్త! మాయజగత్తని
శాస్త్రములెల్లనువిప్పెదవు
భాగ్యముఃభోగము చంచలమంచును
బైరాగిధర్మముఁ జెప్పెదవు.'

దీనిలో మొదటిపాదమున రెండు 'జాగ్రత్త'లలో రెండుమాత్రలు పెరిగినవి. చివరిపాదమున 'బైరాగి'లో ఒకటి పెరిగినది. ఇది ఉద్దేశపూర్వకముగా లయవైచిత్ర్యము కొరకు చేసిన

1. 'శామాసుర' (గేయము): గ్రంథాలయసర్వస్వము: సంపుటి 1: సంచిక 8: 1915.

ప్రయోగమే. దీని నెత్తుకొనునప్పుడు మొదటి అక్షరమగు 'జా'ను సగము మ్రింగవలెను. 'బైరాగి'లో 'బై' తర్వాత 'రా' ను వెంటనే అందుకొనవలెను. అప్పుడు లయభంగము జరుగక పోవుటయే కాక విచిత్రమైన 'ముక్తాయింపు' వినిపించును.

తెలుగులో ఈ 'గతి' క్వచిత్తుగా ప్రయోగింపబడినది.

**మిశ్రగతి :**

మిశ్రగతి 'ముత్యాలసరము'గా నవ్యకవిత్వమున అశేషవ్యాప్తిగాంచిన మాత్రాచ్ఛందస్సు. ఏక్షణమున గురజాడవారు దీని నాంధ్రభారతీగళమున కై సేసిరో అప్పటినుండి యిది అనంతర కవులందరకు ఆరాధ్యమైనది. రాయప్రోలువారు దీని ననుసరించిన ప్రథములలో ఒకరు. విశ్వనాథవారు 'కోకిలమ్మ పెళ్ళి' సొంతము ఈ ఛందములోనే రచించిరి. అబ్బూరి, దేవులపల్లి, వేదుల, నండూరి, బసవరాజు మున్నగుకవులు కనీస మొక్క ముత్యాలసరమైనను కూర్చిరి. అందువలన ఈ గతిలో సాధింపబడిన వైచిత్రులను మాత్రమే పేర్కొందును. దువ్వూరివారి రెండు గేయము లీ సందర్భమున గణనీయములు. మొదటిది–

'గాలియడుగుల నెవరికోసరము
ఓమోహశీలా
కదలివచ్చితివీనిశీథమున.'[1]

ఇందులో 'ఎవరికోసరము' తర్వాత 4 మాత్రల కాలము ఊపిరితీసికొనవలసియుండును. ఇది రెండుపాదముల మధ్యలో చేసిన విరుపు. రెండవగేయములో నాలుగుపాదములు సమమాత్రలతో సాగదీసినపిమ్మట నాల్గవదానిని విరిచి ఒక 5 మాత్రలగణము, ఒక 4 + 5 = 9మాత్రలగణము విడివిడిగా ప్రవేశపెట్టబడినవి.[2]

"సందెవేళలఁ బాలతేకులు
క్రిందికురలగఁ గాంచికాంచి మ
రందబిందులు కన్నుఁదమ్ముల
జిందఁబొగిలెదు ప్రకృతిచేష్టకు
కామినీ
సుందరగామినీ."[3]

ఇందులోని గతి 'కామినీ'వర కేకధాటిగా సాగిపోవును. 'కామినీ' పిమ్మట విరుపున్నది. ఈసంధి కాలములో 5 మాత్రలకాలమాగి 'సుందరగామినీ' అని అందుకొనవలసియుండును. మంగళ హారతులలో అనేక మీ పద్ధతిలో వ్రాయబడినవి కలవు.

1. 'అభిసారిక' : ఖండకావ్యములు.
2. ఒక్కగణముమాత్ర మీ గేయములో ఇందు కవపాదముగా నున్నది (అప్సరఃకామినీ అనునది).
3. 'ఆగంతుకి' : ఖండకావ్యములు.

మిశ్రగతితో మొదట రెండుమాత్రలు పెంచి వ్రాసిన గేయరీతికి అబ్బూరివారి 'పూజా శిరీషములు' చక్కని ఉదాహరణము.

'పూజాశిరీషములేరుకొంటివి A
పోయివచ్చెదో ? జవ్వనీ B
తేజోవిలీనదృగంచలమ్ముల A
తేజిచూచెదవెవ్వని ?' B

ఈ గేయములో మొదటిపాదమున "పూ' అన్న రెండుమాత్రలు, మూడవపాదములో 'తే' అన్న రెండుమాత్రలు అధికముగా ప్రవేశించినవి. వీనిని లోలోపల గబాలున చదువుకొని 'జాశిరీష' యని, 'జోవిలీన' యని ఎత్తుకొన్నచో లయభంగము జరుగదు. ఈ గేయమంతట రెండవనాల్గవ పాదముల కంత్యప్రాసము పాటించుట ఒక ప్రత్యేకత.

**వచనగేయము[1] :**

భావకవులలో వచనగేయములు వ్రాసినవారిలో కవికొండల, రామచంద్రఅప్పారావు, మల్లవరపు, దువ్వూరి పేర్కొనదగినవారు. కవికొండలవారు 'నక్కాసామిగాడు' అను వచన గేయమును 1933లోనే రచించిరి.[2] దీనిని 'వచనగీతిక'యని వారే స్వయముగా వ్రాసికొన్నారు.

"నక్కాసామిగాడు
వాడొకమాలవాడు
రాజుగారికవ్వతంలో పాలేరువాడు
వాడుపోయాడు
— — — — —
'దెందులూరు' కాడాక్కుండావెళ్ళిన మెయిల్నీ
ఆగిన మాప్యాసెంజరురయిల్నీ
రెండింటినీకూడామఅచి
స్థాయి — — —
ఆ కథలో లీనమైపోయినాం
ఆకబుర్లలో కలసిపోయినాం
ఆకాడే ఉండిపోయినాం
రేయి. — — — —"

ఈవిధముగా ఈ గేయము సాగిపోయినది. రచన శుద్ధవ్యావహారికములో నుండుట, చమత్కారమైన అంత్యనియమములుండుట, పాదవిభాగము ఆధునిక వచనగేయములవలె నుండుట - ఈ గేయములోని ప్రత్యేకత.

1. 'వచనగేయము' స్వరూపస్వభావములనుగూర్చి ముందుముందు చర్చింతును.
2. 'నక్కాసామిగాడు' : కృష్ణాపత్రిక : 1933 జూన్ 17.

1938 లో మల్లవరపువారు ప్రచురించిన 'కళ్యాణకింకిణి'లో 'స్త్రీ' అను శీర్షికతో చక్కని వచనగేయమున్నది. ఇది శ్రీశ్రీ 'కవితా ! ఓ కవితా' అను గేయమును పోలియున్నది.

'ఓనవయువతీ ఎవతెవు
నీవీరాత్రినన్ను మేలుకొల్పావు.'

ఇట్లున్నది దీని ఎత్తుగడ. ఇవి మాత్రాచ్ఛందోవాసన అంతగాలేని పాదములని స్పష్టము. ఇట్టివి మరికొన్ని యున్నవి. వీనిలో మధ్యమధ్య మాత్రాచ్ఛందోరీతులు తొంగిచూచినవి.

దువ్వూరి రామిరెడ్డిగారు 1921-25ల మధ్య చేసిన రచనల సంపుటియగు 'నైవేద్యము'లో 'లూతీ' అను వచనగేయమున్నది.

'ఎవరురా నావీణాతంత్రుల
నిట్టుల సళ్ళించిపెట్టిరి ?
ఎవరురా నాగంగాతీర్థము
నిట్టుల గలయంపిచల్లిరి.'

దీనిని ప్రయత్నించి చతురస్రగతిలోని కీర్వవచ్చును. కాని స్థూలముగా వచనగేయమువలె కన్పించు రచనయిది. వీరి 'ఆనందసత్రము' అనుగేయముకూడ మాత్రానియమములేవి వచన గేయగంధముగల రచన.[1] ఈ సంపుటిలోనేయున్న 'మోహినీప్రకృతి' అనుగేయముకూడ ఇట్టిదే.

'ఓరె ! నా జీవనకుచక్కురుఁరంబు
పాతెఁగూలంకషపూర్ణముగ
జాతెరా, పరలోకజీర్ణతటంబు
పూరసంఘర్షణశీర్ణముగ.'

ఇవి రవీంద్రుని Blank verse గేయముల ప్రభావముతో చేసిన రచనలనిపించును.

రామచంద్రఅప్పారావుగారి 'రక్తవిహారము' అను గేయము కొంతదూరము వచనగేయమై సాగి, మధ్యలో తేటగీతిగా మారి, మరల వచనగేయమై, కడకు గీతముగా ముగియును.

''నేభయంకరకాముకుడ
నాకరాలచితిని
కన్యకలు వెన్నవలె కరగిపోదురు;

1. నైవేద్యము.

అట్టిననునీవు
మోహపాశాలవలన
పొర్లుకెరటాలనురుగు కేశాలవలన
సొగసువలన ఆకర్షించి శాసింతువు

— — — — —

రెండుగులాబిపూలవోలె
కాల్వకెగురిది
ఈ చంద్రికారహోనిశీథిలో, రహః కేళిలో
కలసిపోదము.
తప్తశోణితస్నాతములైనగాని పూలు
యుగయుగాలను తావిముంచబోవు.''[1]

పైన గీట్లుగలభాగములు తేటగీతిపాదములు. మిగిలిన గేయమంతయు వచనగేయసదృశమైనదే.

విశ్వనాథవారు 'శృంగారవీధి' చివర 'రాధిక'యను శీర్షికతో వచనములు వ్రాసినారు.

'ఓయీ! నాథుడా! నీయెడల నామనస్సే నిత్యాశంకిగాని నీప్రణయకుసుమము నా యెడల ననార్తవమోయీ! నీ ప్రేమవాహిని నాయందు అనావర్తమోయి'. ఇవి వెంకటేశ్వరవచనముల ధోరణిలో రచింపబడిన విన్నపములవలె కనిపించినను, ఆనాడు ఉదీయమానముగానున్న వచన గేయప్రక్రియయే ఈ రచన కూపిరులూదెనని ఊహింపవచ్చును.

అభ్యుదయ కవితాయుగమున శిష్టా, నారాయణబాబు, పఠాభి, శ్రీశ్రీ మున్నగు కవుల చేతిలో సహస్రాంచలములతో మెరసిన వచనగేయమునకు భావకవిత్వయుగములోనే – ఇరువదవ శతాబ్ది మూడవపదిలోపుగానే – బీజావాపము జరిగినట్లు తేలినది.

భావకవిత్వములోని ప్రధానశాఖలను గూర్చి, వానిలోని వస్తుభావరచనల నవ్యతను గూర్చి చేసిన విపులపరిశీలన మింతటితో ముగిసినది. భావకవిత్వములో దాదాపు ఇరువది ముప్పదిమంది ప్రతిభామహితులైన కవులున్నను వారి ప్రతినిధుల రచనలనే ఉదాహరణములుగా తీసికొంటిని. అంతమాత్రమున మిగిలినకవుల రచన లుదాహరణయోగ్యములు కావని తాత్పర్యముకాదు. గ్రంథ విస్తరభీతిచే అన్నిటిని పేర్కొనలేదని మరల మనవిచేయుచున్నాను.

1. వైతాళికులు.

# భావకవిత్వముపై తిరుగుబాటు:

గతప్రకరణములో భావకవిత్వముయొక్క వివిధశాఖ లేవిధముగా 'మూఁడుపూవు లారు కాయలు'గా విలసిల్లినవో వివరించితిని. 1930 వరకు ఆంధ్రకవితారంగమున భావకవిత్వము అప్రతిహతమైన ప్రభావముకలిగియుండినది. కవిత్వము వ్రాయనేర్చిన యువకులెల్లరు దీనిప్రభావమునకు లోబడినవారే. 1930 నుండి ఈ కవితాశాఖ క్షీణదశకు రాసాగినది కృష్ణరాయల కాలములో వెలువడిన ప్రబంధకవిత్వమునకు, తంజావూరుయుగములో బయలుదేరిన ప్రబంధములకు ఎంతఅంతరమున్నదో, 1920-30 ల మధ్యకాలమున వెలువడిన భావకవిత్వమునకు, తదనంతర రచనలకు అంతటి అంతరము పొడసూపినది. రాయప్రోలు, కృష్ణశాస్త్రి ప్రభృతుల రచనల కంథానుకరణము ప్రబలినది. శబ్దవ్యక్తీకరణమునకే ప్రాధాన్యమేర్పడి, అర్థగాంభీర్యమడుగంటినది. పదముల 'సన్నపోగారుతనము'పైననే దృష్టికేంద్రీకృతమైనందున భావనాబలము సన్నగిల్లిపోయినది. ఆత్మవ్యక్తీకరణధోరణి నానాటికి ముదిరిపోయి సంఘదృష్టి మరుగుపడిపోయినది. ఈ స్థితిలో క్షీణదశోన్ముఖమైన భావకవిత్వమునకు వ్యతిరేకముగా తిరుగుబాటుచేసి, సరిక్రొత్త ప్రయోగములనుచేసిన కవులు శిష్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీరంగం నారాయణబాబు, పఠాభి. వీరితోపాటు గొంతుకలిపినవారు ముద్దుకృష్ణ, పురిపండా అప్పలస్వామి ఈ కవులొక్కుమ్మడిగా జూలుదులుపుకొని విప్లవకంఠమెత్తి గర్జించినవారుకారు. ఆతరములోని కవులందరివలెనే వీరును ప్రథమదశలో భావకవిత్వము వ్రాసిరి. ప్రేయసికొరకంగలార్చిరి. శిష్లా'విష్ణుధనువు'లోని ప్రధానవస్తువు ప్రణయమే అయినను దానిని వ్యక్తీకరించుసాధనము మారినది. పురిపండా, ముద్దుకృష్ణ మొదటిదశలో భావగీతములు వ్రాసినవారే. శ్రీశ్రీ భావకవిత్వము గురించి ముందు వివరముగా పరిశీలింతును. నారాయణబాబుగారు వ్రాసిన వలపు చెలమలు, సంధ్యావేగము మున్నగునవి అచ్చమైన భావగీతములు.

> 'దీర్ఘనిశ్వాసపవనాగ్ని దిశలఁజెరగి
> మన వియోగనిదాఘాగమనసమయము
> రాగ, వేగ, రాగాంబుపూరంబులింకె
> తొలిసుఖస్మృతులను తడిచలియిసుకల'[1]

అని నారాయణబాబుగారు ప్రేయసీవిరహసంబంధి స్మృతులను పెల్లగించుకొన్నారు; 'సంధ్యావేగము'అను కావ్యఖండికలో

1. 'వలపుచెలమలు': ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక : 1928.

'సంధ్యచివురాకుదోనెలో చల్లనైన
తుహినబిందువునా చుక్కతోచెనంత
విరహదావానలజ్వాల వేడివెతల
వలపులొలికించు తీయనితలపుభాతి'[1]

అని ప్రణయానుభూతికి, ప్రకృతివర్ణనకు లంకెవేసి భావకవితామార్గములో విహరించినారు. తమకుముందున్న భావకవిప్రముఖుల ప్రభావముతో అనుకరణశీలమైన రచనలు చేసినను, ఈ కవుల ప్రతిభ నివురుగప్పిన నిప్పువలె అవకాశముకొరకెదురుచూచుచుండినది. భావకవిత్వముపట్ల సహజముగా వీరిలో కలిగిన విముఖత్వము, క్రొత్తదనము కావలయునను కాంక్ష, పాశ్చాత్య సాహిత్యములోని అతినవ్యరీతుల ప్రభావము, భారతదేశరాజకీయసాంఘికరంగములలో జరుగుచున్న మార్పులు, ప్రపంచరాజకీయపరిణామములు – ఇన్నిప్రభావములు కలిసి ఈకవులహృదయములలో గుడుసుళ్ళు తిరిగి, కొంతకాలమునకు క్రొంగ్రొత్తప్రయోగముల రూపములో వెలువడినవి. ఈకవులలో ఏ యొక్కరును మొదటిదశలో ఒక ప్రత్యేకకవితోద్యమమునకు చెందినవారుకారు. అలజడియే ఊపిరిగా, తిరుగుబాటే ధ్యేయముగా రచనలుచేసినవారు. ఛందస్సులో శిష్ట్లా, పఠాభి ; వస్తుభావములలో శ్రీశ్రీ, నారాయణబాబు తిరుగులేని తిరుగుబాటును లేవదీసినారు. వీరి తిరుగుబాటుతత్త్వమును గూర్చి తెలుపుటకుముందు పాశ్చాత్యసాహిత్యరంగములో వెలువడిన కొన్ని ముఖ్యమైన నవ్యకవితాధోరణులను పరిశీలింతును.

## పాశ్చాత్యసాహిత్యరంగములోని నవ్యకవితాధోరణులు :

పాశ్చాత్యసాహిత్యరంగములో ఫ్రాన్సుదేశము అనేకనూత్నకవితారీతులకు ప్రయోగశాలవంటిది. కాల్పనికవాదమునకు వ్యతిరేకముగా ఈ దేశములో అనేకకవితాధోరణులు తలెత్తినవి. ముఖ్యముగా చిత్రకళలో జరిగిన కొన్ని ప్రయోగములు క్రమశః సాహిత్యమునకు అనువర్తితమైనవి. ఫ్రాన్సులో ఈ శతాబ్ది తొలిదశకమున పొడసూపిన కళాసంబంధమైన ఉద్యమములలో క్యూబిజము, ఇంప్రెషనిజము, సింబాలిజము పేర్కొనదగినవి. చిత్రములను బుద్ధికందునట్లుగాక కంటికి కనిపించునట్లు చిత్రించుట ఇంప్రెషనిజము ధ్యేయము. దూరముగానున్న అడవిని చిత్రించవలెనన్నచో చెట్లను ఆకుపచ్చగా, నీడలను నల్లగా చిత్రించుట సంప్రదాయము. ఇంప్రెషనిజము దీనిని త్రోసివేసినది. ఈ తెగకు చెందిన చిత్రకారుడు చెట్లను Purple (ఎరుపు) వర్ణములో, నీడలను నీలిరంగులో చిత్రించి నవ్యతను ప్రదర్శించినాడు. సుదూరాటవులలోని చెట్లు ఎరుపువన్నెలో, నీడలు నీలిరంగులో కనిపించుట ప్రత్యక్షానుభవమునకు సన్నిహితమైన లక్షణము. సంప్రదాయముకన్న ప్రత్యక్షానుభవమునకే ప్రాధాన్యమిచ్చిన

1. సమదర్శిని : ఉగాదిసంచిక : 1980.

ప్రయోగమిది. ఇది సింబాలిస్టు ఉద్యమమునకు సైదోడుగా పుట్టినఉద్యమమే. ఇంప్రెషనిజము తర్వాత ఫ్రెంచి కళారంగములో శిరసెత్తిన ఉద్యమము క్యూబిజము. దీనికి పికాసో నాయకుడు. నీగ్రోకళ ప్రభావముతో వెలువడిన ఉద్యమమిది. దృశ్యప్రపంచమును 'Cubes'(కోణాకృతులు)గా విడదీసి చిత్రించుట ఈ ఉద్యమలక్ష్యము. ఈ తెగ చిత్రకారులకు వర్ణమేళనముపై, రేఖావిన్యాస ముపై శ్రద్ధయుండదు. ప్రకృతిలోని 'అపురూప'మైన అంశములను చిత్రించుటలోనే వీరికి ఆసక్తి మెండు.[1] మొదట Geometrical figures (రేఖాకృతుల)తో ప్రారంభమైన క్యూబిక్ చిత్రకళలో క్రమముగా Pictorial Lyricism (చిత్రరూపములో మౌనసంగీతము), మార్మికత వొడసూపినవి. స్పష్టతకు దూరమై భావవైశద్యము కోల్పోయినను ఈ చిత్రకళ వాద్యసంగీతమువలె హృదయ స్పందకమైనది. ప్రథమ ప్రపంచయుద్ధముతో ఇది ఆగిపోయినది. యుద్ధానంతర మీకళారీతిలోని అంతస్సారము సర్రియలిజములో లీనమైపోయినది. కవితారంగములో ఈ యుద్యమములు ప్రత్యక్షముగా వెలువడకున్నను, పరోక్షముగా వీని ప్రభావము నవ్యకవులపై ప్రసరించినది.

### ఫ్యూచరిజము : (భవిష్యద్వాదము)

1909లో ఇటలీలో మెరినెటీ (Marinetti) అను రచయిత నాయకత్వములో Futurist Manifesto ప్రకటింపబడినది. పాతబొమ్మలను చూచి ఆనందమును ప్రకటించుట శవములో జీవముపోయుట వంటిదని, గతచరిత్రజ్ఞానము కేవలము విషపానమని, గ్రంథాలయములలోని పుస్తకములకు నిప్పంటించి, ఏటికాలువలను మ్యూజియములలోనికి మరలించి వానిని ముంచి వేయవలయునని, సమస్తకళారూపములను, సాహిత్యసృష్టిని ధ్వంసముచేయవలెనని, ఆ శిథిల ములనుండియే నూతనసృష్టి వెలువడునని ఈ ఫ్యూచరిస్టు ప్రణాళిక ప్రకటించినది. ప్రపంచము నకు యుద్ధమొక్కటే ఆరోగ్యమును ప్రసాదించు వరమని ఈ ప్రణాళిక ఉద్ఘాటించినది.[2] చలన చిత్రములనుంది, వార్తాపత్రికల శీర్షికలనుండి, యంత్రములనుండి కవితావస్తువును స్వీకరించుమని ఉద్బోధించినవి. దీని నాయకుడగు మెరినెటీ ధ్వనులే సంగీతమని, మాటలే కవిత్వమని, రంగులే

1. **'When trying to express the charm of a woman, they sought to capture not the exact shade of her hair but rather it's undulating quality, not the rich and firm substancc of her contour but the graceful sweep of her alluring suppleness.'**

**—From Cubism to Sur-realism In French Literature': Georges Lomaitre : P. 84.**

2. **To admire an old picture is to pour out our sensitiveness into a funeral urn, instead of casting it forward in voilent gushes of action....come....seize the pick axes and hammers ! Sap the foundations of the venerable cities...would you poison yourselves by a knowledge of history....we wish to glorify war - the only health given in the world'**

**—Quoted in Literature & psychology : P. 137 : pub 1951.**

శిల్పచిత్రములని ప్రకటించినాడు. ఇతని 'ట్రిపోలీయుద్ధము' అను గేయము కేవలము ధ్వన్యను కరణములతో నిండియున్నది. మెరినెటీ ప్రారంభించిన ఈ ఉద్యమ మెంతోకాలము సాగలేదు. కాని ఈతని స్వప్నమును హిట్లర్ సత్యముగా మార్చినాడు.

1912 లో రష్యాలో ఫ్యూచరిజము మొలకెత్తినది. 'A slap in the face of public taste' అనుపేర ఆ సంవత్సరము ఫ్యూచరిస్టు మ్యానిఫెస్టో ప్రచురింపబడినది. దీనిమీద సంతకముచేసినవారిలో మైకోవస్కీ ఒకడు. గతమంతయు బూదికుప్పయని, గతములోని భాష వాడరాదని, ప్రణయము, సాహసము మున్నగువస్తువులు పనికిరావని పుష్కిన్, డాస్టోవస్కీ, టాల్‌స్టాయి మున్నగువారిని త్రోసిపారవేయవలెనని ఈ ప్రణాళిక ఘోషించినది.[1] కాని అనతి కాలములోనే మైకోవస్కీ తన యీ దృక్పథమును మార్చుకొని ప్రజాసారస్వతమును సృష్టించెను.

### డాడాయిజము : (విధ్వంసనవాదము)

డాడాయిజము ప్రథమప్రపంచసంగ్రామఫలితముగా వెలువడిన ఉద్యమము. యుద్ధ కాలములోని అరాజకస్థితి ఫలితముగా యువకుల మనస్సు లుద్రిక్తములును, ఉన్మత్తములునుకాగా వెలువడిన ఉద్యమమిది. కొందరు యువకు లా కాలమున యుద్ధములో పాల్గొనుచుండిరి. వయసు చాలక యుద్ధములో పాల్గొనజాలని యువకులు, యుద్ధరంగములో క్షతగాత్రులై తిరిగి వచ్చినవారు, నిరాశానిస్పృహలతో క్రుంగిపోయి విపరీతమైన అశాంతితో తట్టుమిట్టాడుచుండిరి. పూజామందిరములు విద్వేషాగ్నిని, హత్యాకాండలను రెచ్చగొట్టు నిలయములైపోయినవి. కళలు, సారస్వతము యుద్ధమునకు ప్రచారసాధనములైపోయినవి. భవిష్యత్తు చీకటిగోయిగా, వర్తమానము పాతాళకుహరముగా కనిపించసాగినది. నైతికస్థాయి పూర్తిగా దిగజారిపోజొచ్చినది. నిర్మూలనమే తప్ప నిర్మాణకాంక్ష పొడసూపలేదు. ఎటుచూచినను క్రోధము, వైరము, నిరాశ అలముకొన్నవి. యుద్ధము ప్రారంభమైనపిమ్మట క్యూబిస్టుగ్రూపులోని ఎపొలీనియర్ (Apollinnaire), జేకబ్ (Jacob) మున్నగు కవులు డాడాయిజమువైపు మొగ్గుచూపిరి. 1916 లో ట్రిస్టన్‌జారా (Tristan Tzara) నాయకత్వములో 'డాడాయిజము'అను నామకరణము జరిగినది. 1918 లో Dadaist Manifesto ప్రచురింపబడినది. ఈ నూతనోద్యమమునకు ఏ పేరు బాగుండునని ఆలోచించి చివరకు జారా ఒక నిఘంటువును కనులుమూసికొని తెరచిచూడగా 'Dada' అనుపదము తొలుత కనిపించినదట. అర్థరహితము, అరాజకమునగు తమ నూతనోద్యమమున కాపేరు సముచితమని భావించి 'డాడాయిజము'అను పేరుంచబడినదట. డాడాయిజమొక తాత్త్వికదృక్పథమో లేక సాహిత్యసిద్ధాంతమోకాదు. ఫ్యూచరిజమువలె నిరాశ నుండి, కసినుండి ఉద్భవించిన కుక్కగొడుగిది. డాడాయిస్టులు తాము ప్రదర్శించు అరాజక ప్రవర్తనతోనే ఆత్మతృప్తిపొందిరి. ఈ తృప్తి ఎదుటివాని ఒడలిమీద సూదులుగుచ్చి ఆనందించు

1. 'Throw Pushkin, Dostoevsky, Tolstoy etc,' overboard from the steamre of modernity.'
—Quoted in Creative Experiment : C. M. Bowra : p. 98 : pub : 1949.

ధోరణికి చెందినది. నాగరకత నాశమైపోవుచున్నదని వీరు ఆక్రందించిరి. అందు కధిక్షేపమును, అవహేళనను, దూషణమును సాధనములుగా చేసికొనిరి. లోకము భూషించిన ప్రతి సాంఘి కాదర్శమును వీరు తూలనాడిరి. కట్లు త్రెంచుటయే తప్ప కట్టడమువైపు వీరి దృష్టి పోలేదు. గతనిరాసము, లోకమును వికృతముగా చూచుట, అయోమయత్వము వీరి ప్రధానగుణములు. తమ ధ్యేయము తమకే తెలియదని వీ రంగీకరించిరి. 1920 లో ఫ్రాన్సిస్‌పికాబియా (Francis Picabia) అను డాడాయిస్టు ఇట్లనెను.

'You donot understand, of course what we are doing ! well; my dear friends, we understand is still less ; How wonderful, isn't, that you are right !......you don't understand ? neither do I ; how sad.'[1]

డాడాయిస్టు సారస్వతములో వస్తువుగాని, భావముగాని, రచనాక్రమముగాని లేవు. అర్థ రహితమైన వాక్యవిన్యాసము, అయోమయములైన శీర్షికలు ఈ సాహిత్యలక్షణములు. కొంత కాలము సమాజములో గందరగోళము లేవదీయుట తప్ప ఇది సాధించినదేమియులేదు.[2] 1921 నాటికి ఆంద్రీబ్రిటన్ (Andre Breton) మున్నగువారు దీనినుండి విడిపోగా ఈ ఉద్యమము నశించినది. కొడిగట్టి ఆరిపోవుచున్న ఈ డాడాయిజములోనుండియే సరిక్రొత్త తేజస్సుతో స్రియలిజము వెలువడినది.

## స్రియలిజము : (అధివాస్తవికత)

1924 లో ఆంద్రీబ్రిటన్ నాయకత్వములో 'Manifeste du Surrealisme' (Manifesto of Surrealism) ప్రచురింపబడినది. బ్రిటన్‌తోపాటు లూయీ అరగాఁ (Louis Aragon), సోపాల్ (Soupault), పాల్‌ఎల్వర్డు (Paul Eluard) మున్నగువారు ఈ ఉద్యమ కర్తలు. ఈ ఉద్యమమునకు 1919 లోనే బీజముపడినది. ఆంద్రేబ్రిటన్ 1919 లో ఒక సాయం కాలము నిద్రోన్ముఖుడై యుండగా వ్యాకరణరీత్యా సరిగానున్న చరణము స్ఫురించినది.దానితోపాటు ఇంకకొన్నిచరణములు వెలికుబికినవి. వీనినన్నిటిని చేర్చినచో ఒక గేయమగునను విషయమాతనికి తట్టినది. తర్వాత బ్రిటన్, అతని మిత్రుడు సోపాల్‌కలిసి ప్రశాంతమైన ఒకగదిలో కూర్చుండి, ఆలోచనకతీతులై, నిద్రోన్ముఖమైనఅవస్థలో కలిగెడుభావములను వెంటవెంట కాగితముపై వ్రాసి కొనిరి. ఆ రెంటిలోని పాదములు, వానిభావములు అసంబద్ధముగానున్నను, వానిని చదివినప్పుడేదో ఒక అనుభూతికలుగకపోలేదు. తమ రచనలను జాగ్రత్తగా పరిశీలించినపిమ్మట ఆరచయితలిర్వురు ఇంతకాలము తమలో గుప్తముగా పడియుండిన ప్రగాఢానుభూతుల కా రచనలు దిగ్దర్శకములని

1. Quoted in : 'From Cubism to Surrealism in French Literature' P. 171.
2. డాడాయిస్టులు అప్పుడప్పుడు సమావేశము లేర్పరిచి, ప్రేక్షకులను కుళ్ళిన కోడిగ్రుడ్లతో కొట్టెడివారట. తమ సమావేశములెంతగా అల్లరిపాలైనచో అవి అంతగా జయప్రదమైనట్లు భావించెడివారట.

భావించిరి. సర్రియలిజమునకు వ్యక్తావ్యక్తము (Sub-conscious) పునాదియనుభావము దృఢపడినది.

సర్రియలిజము మొదట తాత్త్వికదృక్పథముగా, మనస్తత్త్వశాస్త్ర సిద్ధాంతముగా వేరూనినది. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణశాస్త్రము (Psycho-analysis) దీనికి వెన్నెముక వంటిది. ఐన్‌స్టీన్ రిలేటివిటీ సిద్ధాంతము (సాపేక్షసిద్ధాంతము) గూడ దీనిపై ప్రభావమువేసినది. క్రమముగా ద్వితీయ ప్రపంచసంగ్రామకాలమునాటికి ప్రపంచమంతట ప్రముఖ సాహిత్యసిద్ధాంతముగా ఇది వ్యాపించినది.

సర్రియలిజమునకు వ్యక్తావ్యక్తావస్థ ప్రధానమైనది. హేతుబద్ధమైన చదువుల వలన మానవుడు బాల్యదశలో అనుభవించిన అనుభూతులు బండబారిపోవునని, ఆ అనుభూతులు వ్యక్తావ్యక్తమునాశ్రయించినప్పుడే రూపుదిద్దికొనునని ఈ ఉద్యమము భావించినది. వ్యక్తావ్యక్తమును విశ్శృంఖలముచేయుటయే సర్రియలిస్టుల ముఖ్యధ్యేయము. ఈ ధ్యేయమును సాధించుటకు వీరు గతనిరసనము, సంప్రదాయనిరసనము ప్రధానకర్తవ్యముగా భావించిరి. వ్యంగ్యము, అధిక్షేపము, హాస్యము, అవహేళనసాధనములుగా చేసికొనిరి. సౌందర్యమునకు, నీతికి సంబంధించిన ప్రాచీన సూత్రములను తుడిచిపెట్టిరి. అయినను డాడాయిస్టులవలె వీరు అశ్లీలము నాదరించలేదు. జుగుప్సావహమైనరీతిలో గతమును తృణీకరించలేదు. వీరు గతమూల్యములను సహేతుకముగా నిరసించిరి. అందుకు అధిక్షేపముకంటె లలితహాస్యము (Humor) నకు ఆదరమిచ్చిరి. ప్యారడీలను (వికటకవిత్వమును) చేపట్టిరి. స్వప్నస్థితిలోని చైతన్యమున కగ్రతాంబూలమిచ్చిరి. శబ్దముచేత చిత్రమైన గారడీలు చేసిరి. డాలీవేసినబొమ్మలు, పాల్‌ఎల్వార్డుకవి గేయములు, మాన్రే (Man Ray) ఛాయాచిత్రములు, బ్యూన్వెల్ (Bunuel) తీసిన చలనచిత్రములు, ఆంద్రీ బ్రిటన్ విమర్శలు సర్రియలిజమును పతాకస్థాయికి గొంపోయినవి. అందుకే 'రాజకీయాలలో నానాజాతిసమితి ఎటువంటిదో కళాప్రపంచములో సర్రియలిజము అట్టి'దని శ్రీశ్రీగారన్నారు.[1]

1929 నుండి ఇంగ్లండులో ఈ ఉద్యమము వేరూది నిల్చినది. డేవిడ్ గ్యాస్కాయిన్ (David Gascoyne) 'New Verse' అను కవితాసంపుటిని (సంకలన గ్రంథమును), సర్రియలిస్టు గీతములను ప్రకటించెను. 1936లో లండన్‌లో 'సర్రియలిస్టు ఎగ్జిబిషన్' ఏర్పాటుచేయబడినది. రోజర్ రఫ్టన్ (Roger Roughton) సర్రియలిస్టురచనల ప్రచారనిమిత్తము 'Contemporary poetry and prose' అను సాహిత్యపత్రిక పదిసంచికలు ప్రచురించెను. డిలాన్‌థామస్ కూడ సర్రియలిస్టు ప్రభావముగల ప్రముఖకవియే. 1942 నాటికి గ్యాస్కాయిన్ మారిపోవుటతో ఇంగ్లండులో ఈ ఉద్యమము చల్లారిపోయినది.

అంతకుముందున్న సంవిధానముపై తిరుగుబాటు జరుపుటవలన సర్రియలిజము కొంతవరకు పురోగామి దృక్పథముగల ఉద్యమమే. కాని హేతుబుద్ధిని త్రోసిరాజని, అవ్యక్తములోని

1. నేటికవిత : కొత్తపోకడలు : శ్రీశ్రీ : భారతి : 1939 ఫిబ్రవరి.

వ్యక్తావ్యక్తములోని అనుభూతుల కగ్రస్థానమిచ్చినందువలన ఇది అరాజకధోరణిలో పడిపోయినది. సమకాలీనసమాజమునకు సాంఘికచైతన్యమునకు దూరమైపోయినది. క్రిస్టఫర్ కాడ్వెల్ ఈ ఉద్యమమునుగూర్చి విమర్శించుచు ఈ అభిప్రాయమునే వెల్లడించెను. తన కాలములోని సాంఘిక నియమములను పుటుక్కున త్రెంచివేసి 'హద్దుపద్దు' లేని వ్యక్తిస్వేచ్ఛను కోరుట సర్రియలిస్టుల అభ్యుదయవ్యతిరేకధోరణికి నిదర్శనము. మడ్డికట్టుకొనిపోయిన సమాజములోని ప్రాతరీతులను సమూలముగా పెల్లగించివేయవలెనను సంకల్పము వీరి అభ్యుదయధోరణికి చిహ్నము. ఈ రెంటిలో మొదటి ధోరణియే ప్రబలముగా నున్నందున ఈ ఉద్యమమడుగంటినదని కాడ్వెల్ అభిప్రాయపడినాడు.[1]

## ఇమేజిజము : (భావచిత్రవాదము)[2]

ఇంగ్లీషు సారస్వతములో కాల్పనికోద్యమము తర్వాత వెలువడిన ఉద్యమము 'విక్టోరియనిజము'. కొంతకాలమునకు విక్టోరియనిజము గూడ క్రొత్తదనము కోల్పోయి ప్రతిధ్వనిగా పరిణమించినది. పలుకుబడులలో, పదబంధములలో. రచనారీతిలో గతానుగతికమైన ధోరణి ప్రబలినది. ఈతెగకు ప్రతికూలముగా Edwardian School, Georgian school తలలెత్తినవి. కాని ఈ తెగలుగూడ ప్రతిక్షణపరివర్తనాత్మకమైన ప్రజల అభిరుచులకు తృప్తికలిగించలేకపోయినవి. ఈ తెగలన్నిటికి ప్రతిగా 1914 లో ఇమేజిజము పొడసూపినది. దే ఇమేజిస్టు ('Des Imagistes') అను కవితాసంకలనము ద్వారా ఇమేజిస్టులు తొలిసారిగా రంగముపై నిల్చిరి. హ్యూమ్, ఫ్లింట్, ఎజ్రాపౌండు, హెచ్. డి. మున్నగు కవులు ఇమేజిస్టు కవులలో ఎన్నదగినవారు. ఈ తెగకు Imagist అను పదమును ప్రతిపాదించినవాడు పౌండు. 1917 వరకు ఈ కవులు మూడు కవితాసంకలనములను ప్రచురించిరి తర్వాత ఈ ఉద్యమము చల్లారిపోయినది.

దీర్ఘగీతములను, వర్ణనాత్మకగీతములను ఇమేజిజము నిరసించినది. కథ, వర్ణనలు అచ్చమైన కవితాత్మకు భంజకములని, కేవలము భావచిత్రములు కుదించినదే ఉత్తమకవిత్వమని ఈ యుద్యమము ప్రబోధించినది. ఎజ్రాపౌండు Image నిట్లు నిర్వచించెను.

'An Image is that which presents an intellectual and emotional complex in an instant of time'.[3]

పరిమితకాలములో హృదయమునకు, బుద్ధికి సంప్రీతికలిగించు భావచిత్రముల నందించుట ఇమేజిజము లక్ష్యము. ఈ కవుల లక్షణము లివి. 1. విషయమును సూటిగా అందుకొనుట.

1. Illusion and Reality : pub : 1956.
2. Image నకు అర్థము పదచిత్రమేయైనను, Imagism నకు భావచిత్రవాదమని పలువురు వాడినందున నేనును దానినే స్వీకరించితిని.
3. Quoted in 'The Trend of Modern Poetry' by Geofforey Bullough : P. 81 ; pub : 1949.

2. వ్యక్తీకరణములో సంక్షిప్తత (Brevity) 3. భావచిత్రములను ప్రయోగించుట.
4. Organic rhythm (అంతర్లయ) ను వాడుట.

ఈ లక్షణములతో పాటు ఇమేజిస్టుకవులు జపాను కవిత్వములోని టంకా (tanka), హొక్కు (Hokku) అను ఛందస్సులను స్వీకరించిరి. (Hokku 3 పాదముల గీతము, tanka 5 పాదములది.) ఇంగ్లీషు కవిత్వములో ఈ ఛందస్సులు ప్రయోగించుట నవ్యతయే. తొలిరోజులలో టి. యస్. ఇలియట్ కూడ ఈ తెగకు చెందిన కవిగా నున్నాడు. ఇమేజిజము వచనగేయమునకు మంచివ్యాప్తిని కలిగించినది.

### సింబాలిజము : (ప్రతీకవాదము)

సింబాలిజము 20 వ శతాబ్దికి పూర్వమే ఫ్రాన్సులో మోసులెత్తినది. బాడ్లేర్, వెర్లేన్, మలార్మే సింబాలిస్టుకవిత్వధోరణికి ప్రతినిధులు. వీరిలో 'ప్రతీకల' (Symbols) విలువను పైకెత్తిచూపినవాడు బాడ్లేర్. వానికి మెరుగుపెట్టినవాడు వెర్లేన్. వానికి తాత్త్వికగంధము నందించినవాడు మలార్మే. శాస్త్రజ్ఞానజన్యమైన వాస్తవికతావాదము ఇంద్రియాతీతమైన సత్యము నంగీకరింపదు. ఇందుకు విరుద్ధముగా ఈ యుద్యమ మింద్రియాతీతమైన భావజగత్తువైపు అంజ వేసినది. ఈ కవులు సంగీతశాస్త్రములో రాగములకున్న ప్రాధాన్యము కవిత్వములో శబ్దముల కున్నదని, రాగము భావమును వ్యంగ్యముగా సూచించినట్లే కవిత్వములోని ప్రతిశబ్దము సూచ్యార్థ ప్రధానముగా నుండవలెనని భావించిరి. భావప్రకటనము చేయుట కవిత్వధర్మము కాదని, భావ సూచనయే దాని లక్ష్యముకావలెనని మలార్మే ప్రకటించెను. విషయవివరణముకాక వాతావరణ కల్పనము ప్రధానమనెను. పరువురికి చుక్కలుగల ఆకాశము శూన్యముగా కనిపించినది. మలార్మే కది 'Phantom palace' (ఇతరులకు కనిపించని సౌధము)గా భాసించినది. ఆస్తికులు ఆకాశమును భగవంతుని సౌధమందురు. ఈత డా విషయమును వాచ్యముగా చెప్పక ధ్వనింప జేసినాడు. ఉపమానము వ్యంగ్యమునకు భంగము కలిగించునని సింబాలిస్టుల అభిప్రాయము. సంగీతమువలెనే కవిత్వము అవ్యక్తమాధుర్యము నందించవలెనని వీరు భావించిరి. సింబాలిజము ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు మున్నగుదేశములన్నిటిలో వ్యాపించినను, ఇది ప్రజాప్రాతిపదికకు దూరముగానే నిలిచిపోయినది. జీవితసమస్యల నుండి ఎగిరిపోవలెనని ఈ ఉద్యమము బోధించి నందున ప్రజల సానుభూతిని కోల్పోయినది. ఇంగ్లీషుభాషలో మొదటిదశలో రోజెటి, తరువాతి కాలములో యేట్సు (W. B. Yeats) ప్రముఖ ప్రతీకవాదకవులు. టి. యస్. ఇలియట్ వ్రాసిన Waste Land మున్నగు కృతులలో సింబాలిజము ఛాయలున్నవి.

### Left - Wingers : (వామపక్షీయులు)

1930 తర్వాత ఇంగ్లీషుకవిత్వము ఇంకొక మలుపుతిరిగినది. ఇమేజిజము, సింబాలిజము, నిరాశావాదము మున్నగు ధోరణులకు వ్యతిరేకముగా ఆడెన్ (W. H. Auden) స్టీఫెన్ స్పెండరు (Stephen spender), డే లూయిస్ (Day Lewis) వంటి కవులెదురుతిరిగి క్రొత్త

బాట త్రొక్కిరి. 'New Signatures' అను కావ్యసంపుటిరూపమున 1932 లో ఈ కవులు తమ గేయములను ప్రకటించి, సాహితీప్రియులకు సంభ్రమముగొల్పిరి. వీరికి పూర్వమే ఇలియట్ వ్రాసిన Waste Land మున్నగు కృతులు బహుళవ్యాప్తినందినవి. ఇలియట్ ఊహలలో, కావ్య శిల్పములో సర్క్రొత్త ప్రయోగములుచేసిన కవియైనను, అతని ఆధునికనాగరకతానిరసనము అభ్యుదయవాదులకు విడ్డూరముగా కనిపించినది. ఆడెన్ ప్రభృతులు ప్రచురించిన 'New - Signatures' సరిక్రొత్త ప్రయోగమునకు శ్రీకారముచుట్టినది. ఈ సంపుటిలోని కవులు రాజకీయ ముగా వామపక్షీయులు (Left - Wingers). ఈ కవులందరు విశ్వవిద్యాలయములలో ఆర్థిక శాస్త్రము, మనోవిజ్ఞానశాస్త్రము, రాజకీయశాస్త్రము మున్నగునవి పఠించినవారగుటవలన వీరికి నవ్యదృష్టియేర్పడినది. సమకాలీనపరిస్థితులను సానుభూతితో పరిశీలించి వానిని చమత్కార మయముగా కవితాబద్ధమొనర్చెడి నేర్పు వీరి కలవడినది. ఇలియట్ దృష్టికి నగరజీవితము హాస్యాస్పదముగా కనిపించినది. విజ్ఞానశాస్త్రఫలితముగా వెలువడిన పౌగయంత్ర మాతనికి విడ్డూరముగా తోచినది. ఆడెన్ మున్నగు వామపక్షీయకవులట్లుగాక యాంత్రికనాగరకతకు నివాళులెత్తినారు.[1] శాస్త్రజ్ఞానఫలితముగా వెలసిన యంత్రములు మానవుని పురోభివృద్ధికి సోపాన పంక్తులని ఆడెన్ ఉద్ఘోషించెను. పెట్టుబడిదారీశక్తుల పెత్తనములో మెదలు క్రుంగిపోవుచున్న సమకాలీన మానవుని విముక్తికి మార్క్సిజమే చక్కనిమందని ఈతడు ప్రకటించెను. రోగగ్రస్త మైన సమాజమునుజూచి ఇలియట్‌వలె నిస్పృహ వెల్లడించుటకు బదులు ఆడెన్ ఆ రోగహేతువు లను కనుగొనుటకు ప్రయత్నించెను. మధ్యతరగతిప్రజలలోని ఆర్థికదుఃస్థితిని తనకవితలో చిత్రిం చెను. సున్నితమైన హాస్యమునాలంబనముగాచేసికొని 'చెడు'ను దుయ్యబట్టెను. అవసరమైనప్పుడు వ్యాకరణము నుల్లంఘించెను. వీరిలో స్పెండరు, లూయిస్ రొమాంటిసిజమును, రియలిజమును సమన్వయముచేసికొన్న కవులు. వీరు గులాబీపువ్వునకు, పౌగయంత్రమునకు సమన్వయము కూర్చి రచనలుచేసిరి. ఆడెన్, స్పెండరు స్పెయిన్‌లో ప్రజాశక్తులకు వ్యతిరేకముగా ఫ్రాంకో జరిపిన సమరమును నిరసించుచు గీతములు వ్రాసిరి. ఆడెన్ వ్రాసిన 'Dance of Death' మార్క్సిస్టు దృక్పథమును జీర్ణించుకొన్న రచన. లూయిస్ వ్రాసిన 'Magnetic Mountain', హ్యూమెక్‌డయార్మిడ్ (Hugh Mc Diarmid) వ్రాసిన 'First Hymn to Lenin' చక్కని అభ్యుదయగేయములు. ఈ విధముగా 1930 నుండి ఇంగ్లీషు కవిత్వముపై వామపక్షీయుల

1. రోనాల్డు బాట్రెల్ (Ronald Bottrall) అను కవి కావ్యవస్తువులో వచ్చిన మార్పునిట్లుల్లేఖించెను.

**'Nightingales, Anangke, a sunset, or a meanest flower**
**Were formerly the potentialities of poetry.**
**Microscopic anatomy of ephermerides,**
**Power - house stack, girder - ribs, provide a crude base.'**

**—'The Trend of Modern poetry': P. 186.**

**యంత్రభాగములుగూడ ఏ విధముగా విజ్ఞానశాస్త్రప్రభావఫలితముగా కవితావస్తువుగా స్వీకరింపబడి నవో దీనిలో స్పష్టము చేయబడినది.**

ప్రభావము ప్రసరించినది. ముఖ్యముగా ఆడెన్ ప్రభావము తదనంతర కవులపై గుక్క త్రిప్పు కొననీయకుండపడినది. 'New Signatures' తర్వాత వెలువడిన 'New country' అను కవితాసంకలనముగూడ అభ్యుదయకవితామార్గములో పయనించినదే.

ఇంతవరకు పేర్కొన్న కవితోద్యమములలో క్యూబిజము, ఇంప్రెషనిజమువంటివి ప్రధానముగా చిత్రకళకు సంబంధించినవి. మిగిలినవానిలో ఇమేజిజము కేవలము కవితాశిల్పమునకు సంబంధించినది. సింబాలిజముకూడ అట్టిదే. ఇవి వస్తువులో మార్పు తెచ్చినవికావు. డాడాయిజము కేవలము విధ్వంసనాత్మకమైనది. ఫ్యూచరిజ మించుమించుగా అట్టిదే. మిగిలినవానిలో సర్రియలిజము, వామపక్షీయులవలంబించిన భౌతికవాదదృక్పథము ఎన్నదగినవి. ఆధునికాంధ్ర కవులను ప్రధానముగా ఈ రెండు కవితోద్యమములే కదలించివేసినవి. శ్రీశ్రీ, నారాయణబాబు సర్రియలిజముచేత ప్రభావితులై అనేకగేయములు రచించిరి. శ్రీశ్రీ Left - Wingers మార్గములో పయనించి తెలుగులో మార్క్సిస్టుప్రభావముగల గొప్ప గేయములను సృష్టించినాడు. ఇక పఠాభిపై ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సెక్సు' ప్రాధాన్యము బలవత్తరమైన ప్రభావము వేసినది. నారాయణబాబుగారి గేయములలో ఇమేజిజము ఛాయలు బహుళముగా నున్నవి. సర్రియలిజములోని రచనాసంవిధాన క్రీడలను, ఇ. ఇ. కమింగ్స్ (E. E. Cummings) వంటి చమత్కారకవుల 'గమ్మత్తు'లను, శబ్దముల కసరత్తులను శిష్ట్లా, పఠాభి స్వీకరించినారు. సింగరాచార్య, పూషావంటివారు కొన్ని డాడాయిస్టు గీతములు రచించినారు. పఠాభి ఆర్ద్రలపై ఇలియట్ నగరజీవనచిత్రణము చెరిగిపోని ముద్రవేసినది. ఇలియట్ కొన్ని కావ్యఖండికలలో ప్రకటించిన నైరాశ్యము బైరాగికి ప్రధానవస్తువై పోయినది. యుద్ధకాలములో ఫ్యూచరిస్టు, డాడాయిస్టు కవులు ప్రకటించిన బీభత్సధోరణి దేశిరాజు కృష్ణశర్మవంటివారి కాలంబనమైనది. ఈ విధముగా పాశ్చాత్యకవితారంగములో బయలుదేరిన ఉద్యమములలో అధికాంశములు తెలుగులోని నవ్యకవుల ను త్తేజితమొనర్చినవి. అయినను సర్రియలిజమువంటి ఒకటి రెండు ఉద్యమములుతప్ప మిగిలినవంతగా పనిచేయలేదు. పైగా ఒక కవిపై ఒకే ఉద్యమముకాక, అనేకోద్యమములు ప్రభావము వేయుటతో, అతడు సృష్టించిన రచనలు ఒక ప్రత్యేకధోరణి కొదిగిపోలేదు. శ్రీశ్రీపై రియలిజము, మార్క్సిజము, సింబాలిజము, సర్రియలిజము మున్నగు అనేకధోరణుల ప్రభావమున్నది. అట్లే నారాయణబాబుపై సర్రియలిజము, ఇమేజిజము, సింబాలిజము మున్నగువాని ప్రభావమున్నది. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'వ్యక్తావ్యక్తము'లోని భావములను వదలిపెట్టి, కేవలము కామోద్రేకప్రధానమైన గేయములు పఠాభి రచించినాడు. శిష్ట్లా భావకవిత్వమునకు, అతి నవ్యకవిత్వమునకు మధ్య ఊగిసలాడినాడు. కావున శ్రీశ్రీ ప్రభృతులు ఒక ప్రత్యేకమైన కవితాధోరణికి చెందినవారని చెప్పుటకు వీలులేదు.

ఒక్క విషయము మాత్రము నిష్కర్షగా చెప్పవచ్చును. ఇరువదవ శతాబ్దిలోని మేధావి వర్గమును తమ గుప్పిటపట్టుకొన్న వ్యక్తులు – కాదు శక్తులు రెండు. ఒకటి ఫ్రాయిడ్, రెండవది మార్క్స్. ఫ్రాయిడ్ మనోవిజ్ఞానశాస్త్రమునకు విప్పిన మంత్రకవాటము ఫలితముగా సాహిత్య

రంగములో సర్రియలిజము వెలువడినది. మార్క్సు ప్రవచనములు 'భౌతికవాద' ప్రధానమైన అభ్యుదయకవితారీతులకు దారితీసినవి.[1] తెలుగులో ఈ రెండు ప్రభావములు ప్రథమగణ్యము లైనవి. ఇక తెలుగుకవులుచేసిన తిరుగుబాటునుగూర్చి సంగ్రహముగా పొందుపరుతును.

**తిరుగుబాటు స్వరూపము :**

1930 - 40 ల మధ్య శ్రీశ్రీ, శిష్ట్లా, నారాయణబాబు, పఠాభివంటి అతినవ్యకవులు భావ కవిత్వమునకు నిరసనగా ధ్వజమెత్తిరని వెనుక పేర్కొనియుంటిని. వీరి తిరుగుబాటు ఒక ప్రణాళికలోగాని, ఒక త్రాటిపైగాని నడచినదికాదు. కొంతకాలమువరకు భావకవితాపంజరములో చిక్కి విలవిలలాడి, క్రమముగా ఆ పంజరమునుండి బయటపడి విశాలగగనములో స్వచ్ఛంద ముగా విహరించిన కవులువీరు. వీరిలో శ్రీశ్రీ 1933 లోనే భావకవిత్వవలయమునుండి బయట పడి, మార్క్సిజముచేత ప్రభావితమైన గీతములు రచించినాడు. ఇంచుమించుగా శ్రీశ్రీతోపాటే గొంతుమార్చుకొన్న ప్రతిభాశాలి నారాయణబాబు. శ్రీశ్రీ అభ్యుదయగేయములు రచించిన కాలములో ఇతడు భావచిత్రప్రధానమైన రచనలు విరజిమ్మినాడు. శిష్ట్లా 1931 ప్రాంతము నుండియే అతినవ్యరచనలుచేసినను అవి 'విష్ణుధనువు' రూపమున 1938 లోగాని రాశికి రాలేదు.[2] ఈయన 'నవమిచిలుక' 1938 లోనే వెలువడిన గేయసంపుటి. ఇక పఠాభి 'ఫిడేలురాగాలడజన్' 1936-37 ల మధ్య వెలువడిన అతినవ్యకవితాసంపుటి. ఈ నలుగురి దారులు వేరు. కావున ఎవరిప్రభావ మెవరిపై కలదను ప్రసక్తిలేదు. నలుగురును పాశ్చాత్యకవితాధోరణులచేత ప్రభా వితులైనవారే. పైగా నలుగురు నాలుగు త్రోవలు త్రొక్కినారు. ఈ నలుగురికి తిరుగుబాటు మాత్రము సమానలక్ష్యము. సరిక్రొత్త ప్రయోగములతో సాహిత్యజగత్తును సంభ్రమచకిత మొనర్పవలెనను కోర్కె ఈ నలుగురికుండినది. వీరిలో శ్రీశ్రీ రానురాను అభ్యుదయ కవిత్వము నకు, అధివాస్తవికకవితకు ప్రయోక్తయు, ప్రవక్తయునైనాడు. ఇంచుమించుగా రెండుమూడు దశాబ్దములపాటు యువజనులను, నవకవులను తేజపరిచిన యుగకర్తయైనాడు. కావున ప్రత్యేకముగా శ్రీశ్రీ వివిధ దశలను ముందుముందు వివరముగా పరిశీలించిచూపుదును. ప్రస్తుత మీ నలుగురిలో మిగిలిన ముగ్గురు కవులుచేసిన తిరుగుబాటు స్వరూపమును సంగ్ర హింతును.

1. ఇరువదవశతాబ్దిలో మార్క్సు ప్రభావమును ఎ. సి. వార్డు (A. C. Ward) ఇట్లు వెల్లడించెను.

**'Salvation through Christ and damnation through Sin Were the alpha and omega of John Donne and of the puritans; salvation through Marx and damnation through capitalism were the twentieth century substitutes'.**

**(జాన్‌డన్ మున్నగు తాత్త్వికకవుల మతమునకు క్రీస్తుద్వారా మోక్షము, పాపముద్వారా వినాశమనునవి ప్రాతిపదికలు. మార్క్సుద్వారా మోక్షము, పెట్టుబడిదారి విధానముద్వారా వినాశన మనునవి ఇరువదవ శతాబ్దికవులకు పర్యాయములు).**

2. చూ॥ 'విష్ణుధనువు' : పీఠిక : (తల్లావఝ్ఝలవారిది).

**శిష్ట్లా :**

'నవమిచిలుక', 'విష్ణుధనువు' అను కావ్యసంపుటులద్వారా భావకవిత్వముపై తిరుగుబాటు చేసిన అతినవ్యుడు శిష్ట్లా. 'నవమిచిలుక మున్నుడి' అను గేయములో

'ఇది పూర్వకవిత్వంగాదు, ఇది నవ్యకవిత్వం గాదు, ఇది భావకవిత్వం గాదు,' 'ఇది నూతనములో బహునూతన కవిత్వం' అని భావకవిత్వవ్యతిరేకతను స్పష్టముగా ప్రకటించెను. తన నూతనకవిత్వమునకు 'ప్రాహ్లాదకవిత్వ'మను పేరుపెట్టుకొనెను ప్రాహ్లాదకవిత్వములో ప్రౌఢత్వమున్నదని, పామరత్వమున్నదని 'దేశికి విదేశికీ నేస్తమున్న'దని స్పష్టపరిచెను. అనగా తనకవిత్వము పండితపామరరంజకమని, అది దేశీయసంప్రదాయములతోపాటు విదేశిరీతులను మేళవించుకొన్నదని ఈ కవి అభిప్రాయము. ప్రాహ్లాదకవిత్వమనగా ప్రహ్లాదునికి సంబంధించిన కవిత్వమని ఈతడు వ్యక్తీకరించెను. శంక, అధైర్యము. అస్థిరత, అవరోధము, హిరణ్యకశిపుదని, మనస్సు నరసింహమూర్తియని, అది హృదయసభామంటపస్తంభమును పగిల్చి బయటికి విజృంభించగా 'ప్రాహ్లాదకవిత్వము' 'ఆహ్లాదము'గా ఉద్భవించునని భాష్యము చెప్పెను. ప్రాహ్లాదకవిత్వప్రయోజనము నీ విధముగా ప్రకటించెను.

'ప్రాహ్లాదకవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్పుతుంది. పరుగెత్తే పామరుణ్ని నిలేస్తుంది.'[1]

తన కవిత్వము ప్రజలలోని పామరత్వమును తొలగించి, స్తబ్ధతను తుడిచివేసి వారిలో ఆశలు పెంపొందించునని, జాగృతికలిగించునని, ఈ విధముగా అది ఉత్తమ ప్రయోజనగర్భితమని కవి అభిప్రాయము. ఈ నిర్వచనమును పురస్కరించుకొనియే దీనికి 'విమర్శ' వ్రాసిన గోపీచంద్‌గారు భావకవులపై జరుగుచున్న 'ప్రోలిటేరియన్ విప్లవమున' కీ కవి దారితీయుచున్నాడని, అయినను ఈ కవి కావ్యము అచ్చముగా శ్రామికవర్గ సంబంధికాదని, 'ఈకవిత్వంలో బూర్జువా వాసన, ప్రోలిటేరియన్‌యాస' కనిపించుచున్నవని వ్యాఖ్యానించినారు. గోపీచంద్‌గారి వ్యాఖ్యానము సత్యదూరముకాదు. నవమి చిలుకలోని వస్తువు ప్రజాసామాన్యమునకు సంబంధించినది. ముఖ్యముగా గ్రామజీవనములోని వివిధసంఘటనలను గర్భీకరించుకొని ఉదయించినది. వస్తువు విషయములో ఇది అచ్చమైన ప్రజాకవిత్వము; తన్నిర్వహణలో మాత్రము అభ్యుదయ కవిత్వస్థాయి నందుకొనలేదు. వస్తువులో, ఛందస్సులో, 'నవమి చిలుక' చక్కని ప్రయోగమని చెప్పవచ్చును.

శిష్ట్లా ప్రచురించిన ఇంకొక కవితాసంపుటి 'విష్ణుధనువు'.[2] ఇది 'నవమి చిలుక'కు కొంచెము ముందే ప్రచురింపబడినది. పీఠికకు ముందుగానే కవి యిట్లు వ్రాసికొన్నాడు.

1. నవమిచిలుక : మున్నుడి : ప్రచు. 1938.
2. 1938 జనవరిలో ప్రచురితము.

'జన్మనక్షత్రమే
అహంకారమనే
విష్ణుధనువే
వెన్నెముకనంటియే
ఉంటుంది.'

ఈ సంపుటిలోని చివరిగేయములో ఈ వాక్యమునకు లక్ష్యరూపమున్నది.

'మేనియందణగి యణగి
మనసంత 'వయమ్'
అనే అహముచేయు
విష్ణుధనువువంచి
చేరవలె సీతదరికి! శివధనువు ఫెళ్ళుమనును.'

మేనిలోని వెన్నెముకయే విష్ణుధనువు. అదే 'అహము'. విష్ణుధనువును వంచినప్పుడే సీతాసాన్నిధ్యము లభించును. ఎట్లు? అహమను విష్ణుధనువు వంగుటతో శివధనువు ఫెళ్ళుమని విరుగును. శివధనుర్భంగముతో సీతాప్రాప్తి కలుగును. విష్ణుధనువు అహమునకు సంకేతము కాబట్టి, అహము విరిగినప్పుడే సీతాసాన్నిధ్యము-అనగా ముక్తిసీమంతినీ సాన్నిధ్యము లభించునని దీనితాత్పర్యము. ఈ లక్ష్యముతోనే ఈ సంపుటికి విష్ణుధనువను నామకరణము జరిగినది.

ఈ కావ్యసంపుటిలోని వస్తువులో చెప్పికొనదగిన నవ్యతలేదు. ప్రేమసిద్ధాంత ప్రవచనమే ఈ సంపుటిలోని ముఖ్యధ్యేయము. అయినను పురాణవ్యక్తులను సంగ్రహించి, వారిని సరిక్రొత్త రీతిలో సమన్వయించుకొనుటలో నవ్యతకలదు. కవి తానే రాముడుగా, తనప్రేయసి సీతగా భావించుకొన్నాడు. సీతారాముల ఆత్మసందర్శనమే ప్రేమయోగముగా కల్పనచేసినాడు. కృష్ణుడు, నరసింహుడు, శివుడు మున్నగుదేవతలు, ప్రవరుడు మున్నగు సత్పురుషులు, అభిమన్యుడు, ఉదయనుడు మున్నగు క్షత్రియవీరులు తన రామునిలో ఉన్నట్లు భావించికొన్నాడు. సీతయే పరాశక్తి, అలివేలుమంగ, చెంచిత, నిశీథమూర్తి - చివరకు ఆంధ్రదేవి గూడ. రాముడాంధ్రుడు, అతని సీతానురక్తియే దేశభక్తి. అనగా తన ప్రియానురక్తి దేశభక్తియన్నమాట. ఈవిధముగా ప్రేమయోగమును పరిణద్ధదృష్టితో పరిశీలించి ఈ సంపుటిలో ప్రపంచించినాడు. సాంప్రదాయికమైన పదబంధములను, విశ్వాసములను తీసికొని దానిని పునస్సృష్టిచేసి నవ్యతసాధించినాడు.[1] ఈ పునస్సృష్టివలన అస్పష్టతయనులోపము ఇతని కవిత్వములో ప్రవేశించినదనువిషయముమాత్రముపేక్షింపరానిది.

1. 'శిష్టాచేసిన సాహితీసేవఏమిటి అంటే వేలకొలది సంవత్సరాలనుంచీ అందరినోటాపడి అరిగిపోయి వాటంచెడిన నిస్సారమైన మాటలను పునస్సృష్టి చేయడానికి ప్రయత్నించాడు. (Re-creation of Words).' —శ్రీరంగం నారాయణబాబు: 'సంఘర్షణ'కు వ్రాసిన 'ప్రవర' నుండి.

ఛందస్సు విషయములో శిష్ట్లా అద్భుతమైన ప్రయోగములు చేసినాడు. విష్ణుధనువులో ప్రయత్నపూర్వకముగా ఛందస్సును వికృతమొనర్చినాడు. కొన్ని పద్యపు తున్కలను. కొన్ని మాత్రాబద్ధగేయఖండములను, కొన్ని వచనపుతుంటలను ఇష్టమువచ్చినట్లు పేర్చి విశృంఖల మన స్తత్వమును ప్రదర్శించినాడు. ప్రాచీనగద్యమువలె స్ఫురించు వాక్యములు కొన్ని, జానపద గేయఖండములు కొన్ని చేర్చి తన గేయములను వచనగేయములకు మాత్రాగేయములకు మధ్య ఊతగొట్టించినాడు. 'ఝుంఝూమారుత ఝర్ఝరీధ్వను'లని శార్దూలమువలె సాగిపోయిన గేయము వెంటనే 'జముకుచు జముకుచు అలలై' అని చతురస్రగతిలో పరుగులు దీయును. భాషావిషయములో గూడ శిష్ట్లా కొంత నిర్లక్ష్యతను, విశృంఖలతను కనబరిచినాడు. 'మోయుచున్నది, వచ్చితిని, చిత్రితముజేసి'వంటి గ్రాంధికరూపములు ప్రయోగించి, వెంటనే 'కూలుతూ'వంటి ప్రయోగములు చేసినాడు. 'పోయినయ్యి', 'ఊపుతున్నయ్యి', 'వెన్నెల్లో'వంటి వ్యావహారిక రూపములను యధేచ్ఛగా వాడుకొన్నాడు. భావకవు లీ రీతిగా గ్రాంధికవ్యావహారికరూపములను 'కలగాపులగము' చేయలేదు. పైగా ఈ కవి 'సుదిన ఉదయ'. 'సదన ఉద్యాన', 'మందార చెక్కిళ్లు' 'కేయూర వయ్యారి' వంటి అపరూపములను యధేచ్ఛగా ప్రయోగించినాడు. 'శ్రీకుచోపరిచేలాంచలము' అన్న పోతన్న ప్రయోగమును నడుమ విరిచి 'శ్రీపరిచేలాంచలము'అని గుప్పించినాడు. అట్లే 'గజప్రాణావనోత్సాహియై' అన్నదానిని 'గజప్రాణోత్సాహియై'అని మార్చివేసినాడు. ఇవి తెలియక చేసిన తప్పులనుటకు వీలులేదు. భాషను ప్రయత్నపూర్వకముగా వికృతమొనర్చవలెనను తిరుగుబాటు మన స్తత్త్వమిది 'సింబాలిజము'లో శబ్దార్థముకన్న వాతావరణకల్పనము ప్రధానము. పైని ప్రయోగించిన అపప్రయోగము లర్థరహితములైనను ఒక విచిత్రార్ధ స్ఫురణము కలిగించుచున్నవికదా యనుభావముతో కవి ఈ చమత్కారములు చేసియుండును. పురాణ సంబంధి పాత్రలను తీసికొని క్రొత్తభావములను వెల్లడించుటలో ఈ కవిపై టి. యస్. ఇలియట్ ప్రభావమున్నది. కొన్ని సంకేతముల ద్వారా అర్థస్ఫురణము కన్న వాతావరణ స్ఫురణము కలిగించుటలో ఇతనిపై సింబాలిజము ప్రభావమున్నది, వచనగేయములో సమగ్రమైన కావ్యసంపుటిని ప్రచురించుటలో ఇతడే ప్రథముడు. వచనగేయము విషయములో శ్రీశ్రీ ప్రభృతుల కితడు మార్గదర్శకుడైనాడు. 'నవమిచిలుక'లోని వచనగేయములు చక్కని వ్యావహారికశైలిలో, శయ్యాసారళ్యముతో, మంద్రగతిలో, లలితమైన అంతర్లయలో నడచిపోవును. గేయములు పాదములుగా కాక ఖండము (Para) లుగా విభక్తమై 'గీతాంజలి'లోని గేయములను తలపించుచుండును. ఇతడు భావకవిత్వముపై తిరుగుబాటు చేసెనేకాని క్రొత్తబాట వేయలేదని ఒప్పుకొనక తప్పదు.

**పఠాభి :**

పఠాభి పూర్తిపేరు పట్టాభిరామిరెడ్డి. పట్టాభి అను శబ్దమును 'పఠాభి'గా మార్చుకొనుటలోను ఇతని నవ్యతాప్రీతి కనిపించుచున్నది. ప్రమాదినామ సంవత్సరములో ఇతని కవితాసంపుటి 'ఫిడేలురాగాలడజన్' అనుపేర ప్రకటింపబడినది. ఈ సంపుటి ముఖపత్రముపై 'ఫిడేలు' అను అక్షరములకు బదులుగా ఫిడేలు బొమ్మ చిత్రింపబడినది. దాని క్రింద 'రాగాలడజన్' అను

అక్షరములు ముద్రింపబడినవి. ముఖపత్రముద్రణములోగూడ ఈ కవి నవ్యతచూపినాడు. ఫిడేలు పాశ్చాత్యవాద్యము. పాశ్చాత్యవాద్యమైన ఫిడేలుపై ఆధునికకాలమున కర్ణాటకసంగీతము పలికించినట్లుగా, ఇంగ్లీషు కవితా రీతులను తెలుగుభాషలో ప్రదర్శించవచ్చునను ఉద్దేశముతో కవి ఈ నామకరణము చేసియుండును. 'రాగాలడజన్' ఈ సంపుటిలోని పండ్రెండు గేయములకు ప్రతీకగా వాడబడినది. శ్రీశ్రీ ఈ సంపుటికి వ్రాసిన 'ఇంట్రో'లో[1] పేర్కొన్న 'విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం' అన్న అభిప్రాయమున కీ కవితాసంపుటిలోని ప్రతిగేయము ప్రత్యక్షసాక్ష్యము. ఈ యభిప్రాయము ఆస్కార్‌వైల్డు వెల్లడించినాడు.[2] కళలన్నియు ప్రయోజన రహితమైనవని, వైచిత్ర్యమే కళల ప్రయోజనమని ఆస్కార్‌వైల్డు ప్రవచనము. ఇతడు 'కళ కళ కొరకే' అన్న సిద్ధాంతమును బలపరిచిన కవి. పఠాభిపై ఈ సిద్ధాంతప్రభావము ప్రగాఢముగా నున్నది. పైగా కర్త, కర్మ, క్రియలకు విడాకులిచ్చినా డితడు. భావకవిత్వమున కెదురుతిరిగి, తాను 'అహంభావకవి'నని చెప్పుకొన్నాడు. 'కాంగ్రెసు రాష్ట్రపతిస్థానానికోసం, బాబూ సుబాసు బోసుతో పోటీజేసి ఓడిపోయిన డాక్టర్ పట్టాభినిగాన్నేను, మరో పఠాభిని' అని అనవసరముగా పట్టాభివంటి జాతీయనాయకుని ఎత్తిపొడిచినాడు.[3] తనకు విచిత్రమైన భావములున్నవని, కన్నులలో చెలిసోకుపులు, మయిక్రాసోకుపులున్నవని చిత్రముగా చెప్పికొన్నాడు.

'నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాలనడుముల్ విరుగదంతాను :
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని
చాలదండిస్తాను'[4]

అని తెలుగువ్యాకరణముపై, ఛందస్సుపై దాడిచేసినాడు. ఇంగ్లీషు 'భాషాభాండారము'లో నుండి ఇష్టమువచ్చినట్లు మాటలు దోచుకొందునని ఘంటాఘోషముగా చెప్పికొన్నాడు. చివరకిట్లనెను.

'అనుసరిస్తాను నవీనపంథా; కానీ
భావకవిణ మాత్రము కాన్నే
నహంభావ కవిని.'[5]

ఈ పంక్తులలో పఠాభికి గల అహంకారము, విశృంఖలత్వము, వైచిత్రీప్రియత్వము గోచరమగును. అనుటతోనే ఊరకుండక అన్నంతపనిచేసిన తిరుగుబాటుదా రీతడు. తెలుగులో ఇంత నిర్భయముగా, నిరంకుశముగా తిరుగుబాటు ప్రకటించినవారు లేరు. ఈ సంపుటిలోని గేయములన్నియ వచనగేయములే. ఈ గేయములలో ప్రధానవస్తువు కామము (సెక్సు). 'సెక్సు'

1. 'ఇంట్రో' Introduction కు హ్రస్వరూపము.
2. వక్రోక్తి కావ్యజీవితమన్న ప్రాచీనుల అభిప్రాయము దీనితో పంతదించుచున్నది. ఐనను అతినవ్యులపై ఈ విషయములో ఆస్కార్‌వైల్డు ప్రభావమేయున్నది.
3. 4. 5. 'ఫిడేలురాగాలడజన్ : ఆత్మకథ' : పుటలు 1, 2.

గురించి, వైచిత్రి గురించి తరువాతి ప్రకరణములో వివరముగా చెప్పవలసియున్నది. ప్రస్తుత మితడు చేసిన తిరుగుబాటును గూర్చి సంగ్రహముగా నివేదంపవలసియున్నది.

ఈ సంపుటిలో కవి పద్యముల నడుములేకాక, గేయముల నడుములుగూడ విరుగదన్నినాడు. వచనగేయములను నడిపించుటలో గూడ ఇతనికొక నియమములేదు. అంతర్లయ, ఊపు, విరుపు మొదలైన వచనగేయగుణము లీ సంపుటిలో కొరవడినవి. వచనములోని కర్త, కర్మ, క్రియలను తలక్రిందులుచేసి గేయరూపములో పేర్చినట్లు కనిపించును.

'ముఖరింపుచున్నది మాకర్ణాలలో
గుండియలందుగూడ, వెండిరూపాయి
ఘలంఘలా శ్రావ్యసంగీతము కర్ణపేయముగా.'[1]

కొన్నిచోట్ల వట్టి వచనము వ్రాసినట్లుండును.

'భ్రూవిక్షేపముచేతనే బంధ్ర్ల
బలవంతముగా నడుపగల మహా
సామర్థ్యంబున్న దతడికి.'[2]

ఈ లక్షణములన్ని పఠాభి తిరుగుబాటుధోరణికి నిదర్శనములే. ఈ సంపుటిలోని భాష గూడ ఒక పద్ధతిలోలేదు. గ్రాంధికరూపములు, వ్యావహారికరూపములు 'చెట్టపట్టాలు' పట్టుకొని పోవుచుండును. గ్రాంధికభాష నవహేళనచేయు దృక్పథముతో ఈ కవి 'భరతనాట్యం బాడుచున్న', 'నన్నుం ధరించినది', 'తీవ్రాతితీవ్ర తపస్సుంజేయుచున్నాడో' మున్నగు ప్రయోగములు బుద్ధిపూర్వకముగా చేసినాడు. విడిగా యధేచ్ఛగా ఇంగ్లీషుమాటలను ప్రయోగించుటతో ఆగక సమాసములలో గూడ ఇంగ్లీషుపదముల నిరికించినాడు. 'దుస్సాధ్య కాంపిటీషను', 'మేమాస మధ్యాహ్నకాలము' 'హంగ్రీకనులు', 'ప్రభాతరేజరు' మున్నగున విట్టివే. భాషాచ్ఛందస్సుల విషయములోనే కాక వస్తువులోగూడ గొప్పప్రయోగములుచేసిన కవి ఇతడు. నగరజీవనచిత్రణమునకు నాందిపాడిన దీతడే. ఆధునికజీవితములోని వివిధఘట్టములను గూర్చి కవిత్వము వ్రాయుటలో ప్రథముడీతడే. శబ్దార్థ వైచిత్ర్యములో నవ్యత తీసికొనివచ్చినవా డీతడే. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సెక్సు' ప్రాధాన్యమును తెలుగు కవిత్వములో తొలిసారిగా ప్రవేశపెట్టినవాడీతడే. శ్రీశ్రీ 'ఇంట్రో'లో వెలిపుచ్చిన 'అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తి విశ్శృంఖలంగా షికారుపోవచ్చును' అనుమాటలను 'అక్షరాల' నిరూపించినవా డీ కవి. ఇతడు వ్రాసిన 'నేనహంభావకవి'ని అన్నమాటను పురస్కరించుకొని ఈ తెగకు చెందిన కవిత్వమునకు 'అహంభావ కవిత్వము' అని నోరి నరసింహశాస్త్రిగారు నామకరణము చేసినారు. కాని తిరుగుబాటుచేసిన కవులందరు 'అహంభావ'మును ప్రదర్శించువారే కావున ఈపేరు ప్రత్యేక కవితాధోరణికి చెల్లదను దృష్టితో నేను దానిని స్వీకరించలేదు.

1. 'జాబిల్లి' (శీర్షిక): పుట 3. 2. 'పోలీసు' (శీర్షిక): పుట 15.

**నారాయణబాబు :**

భావకవిత్వములోని ఆదర్శవాదమునకు ఎదురుతిరిగి వాస్తవికతావాదము (Realism)ను ప్రతిపాదించిన కవి నారాయణబాబు. జీవితగ్రీష్మమును దర్శించుటకు భావకవులు చల్లని సులోచనముల జోడు కనులకు తగిలించుకొందురు. ఆ జోడున్నంతకాలము ఊష్మతీవ్రత అనుభూతము కాదు. దానిని తీసివేసినప్పుడు గ్రీష్మతాపము కన్నులకు ఎరచినట్లు తగులును జోడును తీసివేయుట యనగా ఆదర్శవాదము నుండి వాస్తవికతవైపు మరలుట. మొదట శ్రీశ్రీతో పాటు భావకవితాగగనములో సంచరించిన నారాయణబాబు కొన్నినాళ్ళకు కన్నులకు తగిలించిన 'చలువద్దాలజోడు' తీసి నేలకు విసరినాడు. అప్పుడు జీవిత గ్రీష్మమును దర్శించగా కనిపించినది, అనిపించినది అతడే ఈవిధముగా చెప్పికొన్నాడు.

'హృదయములో పొగలూ సెగలూ రేగి వీధి కాలువనీటిలో బురదలో ఆపశోపాలు పడిపోతున్న శ్వానాథుడు. ఊరిబయట పొలంలో ఇనకిరణాలు క్రౌర్యంతో కాయక్లేశపడుతున్న సేద్యగాని శరీరంమీద పండిస్తున్న ఘర్మమౌక్తికాలతో ఒక తాజమహలు కట్టాలని బుద్ధిపుట్టింది.'[1]

ఈ వాక్యములలో కవి వాస్తవికతావాదమునకు నీరాజనమెత్తినాడు. బురదలో పడి పొరలాడుచున్న కుక్క తమకు కావ్యవస్తువన్నాడు. ఈ కాలములోనే శ్రీశ్రీ 'కుక్కపిల్లా అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా – హీనంగా చూడకు దేన్నీ, కవితామయమేనోయ్ అన్నీ'[2]అని ప్రవచించిన అభినవ'ఋక్కు'లను నారాయణబాబు లక్ష్యరూపములో ప్రదర్శించి తన వాస్తవికతావాద దృక్పథమును వెల్లడించినాడు. ఇతడు 1937 లోనే వ్రాసిన 'దేశమాత' గేయమున ఒకస్త్రీ 'గుప్పెడు అన్నం గుక్కెడు నీళ్ళకు' తపించిపోయి, ఎండకాలపు మండుటెండలకు కమిలిపోయి కడకు 'అసువులువీడి చచ్చిన దేశమాతయై చాపచుట్టగ నేలకు వాలిన'దని వర్ణించినాడు. ఆమె చావునకు

'వీధికాలువను
విశ్రమించిన
శ్వానాథు డొక్కడు
నిశ్వసించినాడు'[3]

అని, అందరు హేయముగా చూచు బురదగుంటలోని కుక్క పలువురు దేశనాయకులకన్న మిన్నయైనదని అభిప్రాయపడినాడు.

ఈ వాస్తవికదృక్పథమే నారాయణబాబు దృష్టిని రష్యావైపు మరలించినది. 'రక్తపతాకం శక్తినాలుక అగ్నికిరీటం ఆకాశమున మునిమాపు కేకలువేస్తూ పిలిచింది'[4] అని ఆశాంబరములో

1. 'సంఘర్షణ'కు వ్రాసిన 'ప్రవర' నుండి. 2. మహాప్రస్థానం.
3. 'దేశమాత' : ప్రతిభ : 1937 అక్టోబరు.
4. 'సామిధేని' ; ప్రతిభ : 1938 జనవరి.

కనిపించుచున్న నూత్నశక్తుల ఆహ్వానమును గుర్తించి గొంతెత్తినాడు ఇందులోని 'రక్తపతాకం' శ్రీశ్రీ ప్రకటించిన 'నవకవిత'లోని 'ఎగరేసిన ఎర్రనిజెండా'. 'శక్తినాలుక' శ్రీశ్రీ గేయములోని 'కలకత్తా కాళిక నాలిక'. మరి 'అగ్నికిరీటం' శ్రీశ్రీ 'మహాప్రస్థాన' గీతములో సూచించిన 'అగ్ని కిరీటపు ధగధగల'లోనివే. ఈ మూడు సంకేతములుగూడ రష్యాలోని శ్రామికవర్గచైతన్య మునకును, ప్రపంచము నలుమూలల చెలరేగుచున్న విప్లవశక్తుల విశ్వరూపమునకును ప్రతీకలుగా ఈ యిరువురు కవులు గ్రహించినారు. ఈవిధముగా శ్రీశ్రీ తో పాటు విప్లవశక్తుల నాహ్వానించిన పురోగామికవి నారాయణబాబు.

భావకవిత్వమునకు వ్యతిరేకముగా జెండాయెత్తిన నలుగురు కవులలో నారాయణబాబొక రని ఈవరకే చెప్పియుంటిని. భావకవిత్వములోని అతీంద్రియకల్పనలకు, లలితశైలికి, మధుర పదసమ్మేళనమునకు, అద్భుతసౌందర్యదృష్టికి విరుద్ధముగా ఈ కవి తిరుగుబాటుచేసినాడు. ఇంద్రియగోచరమైన చైతన్యమంతయు కవికి వర్ణ్యమని, సౌందర్యమొక్కటే ఆరాధ్యము కాదని, అసుందరవస్తువులను గూడ కవితావస్తువులుగా స్వీకరించుట తగునని ఇతడు నిరూపించినాడు.

'కొమ్మలు తలలూపగ
కమ్మని కోకిల
కూజితాలకు
వెన్నెల విహారములకు
కన్నెగాలి కౌగిళ్ళకు
ఇదికాలం కాదంది'[1]

అని భావకవిత్వరంగములోని ప్రణయకవితాశాఖను నిరసించినాడు. 'పాతాళమ్మున పతితులు పలవించే మాటల జిలిబిలితేటల చీకటిగుండె కదిల్చే జాలిపాట పాడమంది లోపలకే చూడమంది'[2] అని యథార్థజీవితచిత్రణమును బలపరిచినాడు. ప్రకృతిలోని బీభత్సమును గమనించిన కవి దానిని చిత్రింపవలెగాని, ఇసుకలో తలదూర్చిన ఉష్ట్రపక్షివలె పరిస్థితుల నేమరియుండరాదని ఉద్ఘోషించినాడు. లోకమంతయు భయానకస్థితిలో తట్టుమిట్టాడుచుండగా "విద్యుద్దీపం వెలుగున గదిలో ఖ్యాతిగడించే గీతంవ్రాసి ప్రేయసి కంకితమీయాలంటూ మూతిబిగించి చేతులు నలుముతు కూచున్నావ''అని 'కవి' అను శీర్షికతో ప్రేమైకవస్తుకవులను తూర్పారబట్టినాడు. విభిన్నశక్తుల సంకులసమరక్షేత్రమైన సమాజమును వివిధ దృక్కోణముల నుండి పరిశీలించి ఒక్కొక్కమాటు వాస్తవికముగా, కొన్నిసార్లు అధివాస్తవికముగా చిత్రించుటకు ప్రయత్నించినాడు. అందుకే తన కవిత్వములో ఉండకూడని వస్తువే లేదని, వాడకూడని భాషయే లేదని ఈతడు ఘంటాఘోష ముగా ప్రకటించి సిద్ధాంతరూపముగనే కాక కవితారూపమునను నిరూపించినాడు.[3] 'దేశమాత'లో

1. 2. 'ఏమంది' (గేయము).
3. 'చాకలాడు, సంతబయలు, కుక్క, గాడిద, కుష్ఠుతాలువ, ఫేక్టరీకూత, మరఫిరంగి, మందుగుండు, బీదవాడు, భిక్షువర్షీయసీ, అన్నీ-అవేమిటి ఇవేమిటి-లోకంలో ఉన్నవన్నీ' కవితావస్తువులే.
—'సంఘర్షణ'లోని 'ప్రవర' నుండి.

'చాలీచాలని చిరిగిన చీర'తో, 'గుక్కెడు అన్నం గుక్కెడు నీళ్ళ' కొరకు పరితపించు భిక్షుక స్త్రీని వస్తువుగా స్వీకరించినాడు. 'కావాలి' అను గేయములో కాష్ఠజ్వాలలను, 'ఆరిన చితి'ని, 'రాబందుల'ను స్వీకరించినాడు. 'విశాఖపట్టణం'అను గేయమున నగరములోని మంటాపథముతో పాటు ఇరుకుసందులలోని విషయములను గూడ వర్ణించినాడు.[1]

'కదనకుతూహలరాగం' అను గేయములో నారాయణబాబు మహోద్వేగముతో విప్లవశంఖ మును పూరించినాడు. 'రుధిరజ్యోతిర్ జ్వలనాలలనా ప్రియుండ విప్లవఋషిని, విద్రోహికవిని ఆహవరంగం నా హృదంతరంగం, పగిలిన ఖలేజాలె నా పాటల జలేజాలు' అని ఈతడు పాడిన పాట వంగదేశ విప్లవకవి 'నజురులిస్లాం' 'బిద్రోహి'గేయమును స్మరింపజేయుచున్నది.'బిద్రోహి' యనగా వంగభాషలో విప్లవకారుడని యర్థము. నారాయణబాబు గూడ తాను 'విప్లవఋషిని', 'విద్రోహికవి'నని ఉద్ఘాటించినాడు. 'మరఫిరంగినై మహతిగ మీటి, కదనకుతూహలరాగం వినిపిస్తాను' అని ప్రతిజ్ఞచేసినాడు. ఇది ద్వితీయ ప్రపంచసంగ్రామకాలమున జపానువారి దండ యాత్ర నుద్దేశించి వ్రాసిన గేయము. అభ్యుదయగేయపఙ్క్తికి చెందినదిది. ఇట్టివేకాక శ్రీశ్రీ తో పాటు అధివాస్తవికగేయములకు శ్రీకారముచుట్టిన కవి ఇతడు. "చిన్నా", 'గేదిపెయ్యి', 'నీవెవరె' వంటివి అచ్చముగా అధివాస్తవికగేయములే. 'లెందోయి ! ఋషులు' అన్న గేయము మానవజీవితములో 'సెక్సుప్రాధాన్యము'ను దృష్టిలో పెట్టికొని వ్రాసినది. వాస్తవికతను, అధివాస్తవికతను రెంటిని సమన్వయపరచుకొన్న అతినవ్యుడు నారాయణబాబు. ఇంగ్లీషు కవిత్వ ములోని 'ఇమేజిజము' ప్రభావము కంఠదఘ్నముగాగల తెలుగుకవి ఇతడొక్కడే.

'కాలం కాలిన గుడ్డపీలికై ధూళిరేగినది'[2]
'పేదవాని కడుపుమంట కాలిపేలిపోవు కోర్కె
గగనమ్మున చుక్క'[3]

వంటి భావచిత్రములు ఇమేజిస్టు కవితాశిల్పమునకు చెందినవే. 'శబ్దార్థాలతో కుదించి సొగసైన విగ్రహాలను నిర్మించే' శిల్పమిది.[4] ఈవిధముగా భావకవిత్వమున కెదురుతిరిగి వాస్తవికతను, అధివాస్తవికతను సమానముగా ఆరాధించిన ప్రయోక్త నారాయణబాబు.

ఈ నలుగురితోపాటు కొంచెము ముందువెనుకలుగా అతి నవ్యకవితారీతులలో సాధనచేసిన వారిలో పురిపండా, ముద్దుకృష్ణ, 'పాప' గణనీయులు. 'ఒకరేయి' అను శీర్షికతో ముద్దుకృష్ణ వ్రాసినగేయమున అందనిలోకముల కన్వేషణము వెర్రితనమని, దివి నుండి భువివైపు దృష్టి మరలించవలెనని కవికాలిలో గ్రుచ్చుకొన్న గులాబిముళ్ళతో చెప్పబడినది. ఆదర్శవాదమును నిరసించి, వాస్తవికతవైపు మరలవలెనను ప్రబోధము వ్యంగ్యముగా గల రచనయిది.

1. 'రుధిరజ్యోతి' (అముద్రితగేయసంపుటి) నుండి ఈ గేయములు గ్రహించితిని.
2. 'దేశమాత' నుండి. 3. 'తెనుగుర్రాత్రి' నుండి.
4. 'రుధిరజ్యోతి' : ఒక ప్రస్తావన' (వ్యాసము): రోణంకి అప్పలస్వామి : భారతి 1952 సెప్టెంబరు.

'బడలికకు తాళజాలక
సడలు అవయవాలను
ఆపి నిలపలేక
మానవాళి పొలిమేర
గుమ్మాల కడకు
వేచివేచి నిలిచినకాంతి
సౌమ్యసిల్లినదని
దుర్వార్త తూరుపునుంచి'[1]

వంటి వచనగేయములు ఆకాలములోనే రచించి ముద్దుకృష్ణ వచనగేయరచనలో శిష్ట్లాతో పాటు తాను గూడ శ్రీశ్రీ కి మార్గదర్శకుడైనాడు.[2] ముద్దుకృష్ణ 1932 లోనే 'జ్వాల' అను సాహిత్య పత్రిక వెలువరించి భావకవిత్వ వ్యతిరేకోద్యమమునకు నాందివాచకము పలికినాడు. 'జ్వాల' మొదటి సంచికలోని సంపాదకీయ వాక్యములను గమనించిన నిది స్పష్టమగును.

"మనం కూపస్థంగా వుండడం వల్లనో, పురాతనమగతచేతనో, రక్తంలో నీరసం చేతనో, నూతనతేజస్సుకు గుడ్లగూబలమౌతున్నాము. ఇది పనికిరాదు......యువకుల దృష్టికి ఒక క్రొత్తదారి కనబడుతూఉన్నది...మార్పుతప్పదు...దీనికి అడ్డు వీల్లేదు. వచ్చినా ఆగదు. పిరికివారికి ముక్తిలేదు. అందుచేత నచ్చని పాతబంధాలను తెంపివేయడానికి ఎంతైనా సాహసిసాము."

పురిపండా అప్పలస్వామి మొదట భావకవిత్వము వ్రాసినను క్రమముగా శ్రీశ్రీ సాహచర్యములో జాగృతుడై అభ్యుదయకవియైపోయినాడు 'దైవం' అన్న శీర్షికతో ఇతడు వ్రాసిన గేయములో అంధవిశ్వాసములపట్ల తీవ్రనిరసన కలదు. తరతరముల నుండి 'దైవ'మను భావన మానవునకు నల్లమందువలె మత్తెక్కించి, ఆడించుచున్నదని అధిక్షేపించినాడు.

'మోసం ద్రోహం ఈర్ష్యా క్రౌర్యం
ఫణాలు చాచిన పాపజగతిలో
మానవశవాల మంటపాలపై
ప్రభువుల పతాకలెగిరే భువిలో

1. 'కాంతి' గేయమునుండి.
2. 'శిష్ట్లా ప్రభావంతో ముద్దుకృష్ణ వ్రాస్తున్న వచనగీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణముఖతా నేనువినేవాడిని' - శ్రీశ్రీ : కృత్యాద్యవస్థ : వాణి 22-6-1954.

రాతివిగ్రహం రక్షిస్తుందా ?
పూజామంత్రం బువ్వెడుతుందా'[1]

అని తీవ్రమైన ధోరణిలో పాలకవర్గమును, దైవముపట్ల అంధవిశ్వాసమును ఖండించినాడు. 'అనలపతాకం' అను శీర్షికతో

'అనలపతాకం, అనలపతాకం
అంబరవీధుల మెరిసింది

—— ——

జానిసలారా ! వంచితులారా
గొలుసులు త్రెంపుక లేవండి'[2]

అని పీడితప్రజాకోటిని మేల్కొల్పినాడు. ఈ గేయము శ్రీశ్రీ 'మహాప్రస్థాన' గీతముచేత ప్రభావితమైనట్లు స్పష్టము.

ఈ కాలముననే 'ప్రతిభ'లో 'పాప' కొన్ని వచనగీతములు ప్రకటించి క్రొత్త ప్రయోగములు చేసినాడు.

''గుండెమీదొకరాయిలా - కూర్చుంది తమస్సు
అండవిరిగి పడిందీ - అంధలోకంలో మనస్సు
ఆకాశమయినా నా - కగుపడ్డం లేదు
నాకోసం వెలిగించు ప్రియా - నీ కళ్ళలోరాత్రి మనమైత్రి.''[3]

'పాప' వ్రాసిన ఈ వచనగేయములో ఒక క్రమశిక్షణ యున్నది. 1950 తర్వాత కుందుర్తి, తిలక్ మున్నగువారిచేతిలో వచనగేయముపొందిన నగిషీ, సాధించిన సమగ్రమూర్తిత్వము, 'పాప' వ్రాసిన ఈ గేయమున తళుక్కుమనుచున్నవి. ఇంచుమించుగా పాదములు సమానముగానుండుట, రెండేసి పాదములకు ప్రాసనియమముంచి పద్యవాసన కలిగించుట, ప్రతి పాదములో యతి నియమమును పాటించుట, మొదటిరెండు పాదములకు అంత్యప్రాస నియమముండుట– ఈయన్నిటిని మించి ఒక క్రమపద్ధతిలో ప్రవహించు అంతర్లయ యుండుట ఈ గేయములోని శిల్ప విశేషములు. అనతికాలములోనే ఆరుద్ర ఈ సంవిధానము నాకళించుకొని రవ్వలు రాల్చినాడు.

వీరేకాక పిఠాపురం యువరాజా కూడ 'నామరహితం', 'తీరని కోర్కెలు'అను కవితా సంపుటుల ద్వారా సరిక్రొత్తప్రయోగములు చేసినవాడే. ఇతని 'నామరహితం' పేరులేని కవితా

1. 'దైవం': ప్రతిభ: 1937 అక్టోబరు.
2. 'నవ్యాంధ్రసాహిత్యవీధుల'లో ఉదాహరింపబడినది.
3. 'మనమైత్రి': ప్రతిభ: 1941 ఏప్రిలు.

సంపుటి. పుటకు నాలుగైదు పంక్తులను ముద్రించుట, ఒక్కొక్క పంక్తిలో నాలుగైదు అక్షరము లుండుట. వచనము, పద్యము, గేయముకాని విచిత్రచ్ఛందస్సులో రచనచేయుట వలన ఇతడు అతినవ్యులలో ఒకడైనాడు.

ఇంతవరకు భావకవిత్వముపై తిరుగుబాటుచేసిన ముఖ్యుల గురించి సంగ్రహముగా వివరించితిని. వారిలో అగ్రేసరుడైన శ్రీశ్రీ నిగురించి వివరముగా తెలుపుదునంటిని. శ్రీశ్రీ కి, మిగిలిన తిరుగుబాటుదార్లకున్న భేదమేమనగా, మిగిలినవారు తిరుగుబాటుచేసిరే కాని క్రొత్త బాటవేయలేదు; అలజడియేతప్ప ఆలోచనను వారవలంబించలేదు నిర్మూలనము, నిర్మాణము రెంటిని నిర్వర్తించినవాడు శ్రీ శ్రీ. సంప్రదాయమును జీర్ణించుకొన్న సరిక్రొత్త ప్రయోగములను చేసి అభ్యుదయకవితా యుగకర్తయైనాడు. అందుకే అతని గూర్చి విపుల పరిశీలనము జరుపుట అవసరమైనది.

# నూతన యుగకర్త శ్రీశ్రీ:

1940 తర్వాత ఒక దశాబ్దముపాటు ఆంధ్రసాహిత్యలోకము నుత్తేజితమొనర్చిన అభ్యుదయ కవితోద్యమమూలవిరాట్టు శ్రీశ్రీ. భావకవిత్వమునకు విరుద్ధముగా జెండాయెత్తుటతోనే కాక, శ్రామికవర్గచైతన్య మూపిరిగాగల ఒక సరిక్రొత్త కవితారీతికి పాదులువేసిన స్రష్ట శ్రీశ్రీ. భావకవుల చేతులలో వైదర్భీరీతులను వెలార్చుకొన్న గేయమును గౌడీరీతిలో నడిపిన ఛందో రహస్యవేత్త శ్రీశ్రీ. వాస్తవికతతో పాటు అధివాస్తవికతను, వ్యక్తిచైతన్యముతో పాటు సంఘ చైతన్యమును సమానాధికారముతో ప్రవచించిన ప్రవక్త శ్రీశ్రీ. ఐనను విరాట్‌స్వరూపము నందుకొనుటకుముందు శ్రీశ్రీ వామనమూర్తిపొందిన వివిధదశలను పరిశీలించుట అత్యావశ్యకము. ప్రథమదశలోని శ్రీశ్రీ రచనాస్వరూపమును పరిశీలించినగాని, అతని పరిణతిదశలోని రచనల మహత్త్వము బోధపడదు. అందుకొరకు శ్రీశ్రీ రచనాజీవితమును ప్రథమదశ, పరివర్తనదశ, పరిణతిదశయను మూడుభాగములుగా వింగడించితిని. ఈ త్రిదశలలో శ్రీశ్రీ పొందిన 'త్రివిక్ర మత్వ'మును క్రమముగా నివేదింతును.

## 1. ప్రథమదశ :[1]

గురజాడ 'ముత్యాలసరాలు' రచించిన సంవత్సరము – అనగా 1910 లో – చెను. ఆ యేడే బరంపురములో వర్ణాంతరభోజన మేర్పాటైనది. దేశములన్నియు ప్రపంచ సంగ్రామము కొరకు మీసములు మెలివేయుచున్నవి. శ్రీశ్రీ ఈ వాతావరణములో జన్మించినాడు. తరువాతికాలములో గురజాడకు సరియైనవారసుడైన శ్రీశ్రీ 'ముత్యాలసరాలు' రచింపబడిన సంవత్సరమే జనించుట విధిచమత్కారము. అక్షరాభ్యాసమైన 'ఏడున్నర్ధమున'కే శ్రీశ్రీ కంద పద్యము చెప్పినాడట. ఆ పద్యములో యతిప్రాసలు, గణములు హుళక్కియట. తర్వాత తండ్రి ఆదేశముతో సులక్షణసారము, అప్పకవీయము, ప్రబంధములు పఠించినాడు. మనుచరిత్రను, శ్రీనాథ రామకృష్ణుల కావ్యములను లోతుగా పఠించి, వాని ఒరవడిలో పద్యములు రచించినాడు,[2] తదనంతరము వెంకటపార్వతీశ్వరుల ప్రభావముతో 'అపరాధ పరిశోధక నవలలు' వ్రాసినాడు.

1. శ్రీశ్రీ బాల్యదశనుగూర్చి వ్రాయుటలో ఆరుద్రవ్రాసిన 'శ్రీశ్రీ' అను వ్యాసము చాల ఉపకరించినది ప్రచు : అభ్యుదయ : 1947 జులై.
2. 'శ్రీశ్రీ కవితావృక్షం అప్పుడే విత్తనంలోంచి వస్తున్నది. వేరు ఇంకా జీవితంలోని ఖనిజ ద్రావణాలని పీల్చే శక్తిలోలేదు. ప్రబంధాల బీజదశాలలోని ఆహారాన్నే ఉపయోగించుకొని శ్రీశ్రీ రచన చేశాడు.' —'అభ్యుదయ'లో ఆరుద్రవ్యాసము.

పదేండ్లు నిండకముందే శ్రీశ్రీ రచనావ్యాసంగములోనికి దిగుట గమనింపదగిన విషయము. 1920 లో ఆంధ్రదేశమున సాహితీసమితి అవతరణతో శ్రీశ్రీ ఉత్సాహితుడై విశాఖపట్టణములో నారాయణబాబు. కాళూరి నరసింగరావులతో కలసి కవితావ్యాసంగము ప్రారంభించినాడు. క్లిష్ట ప్రాసలతో సాముగరిడీలు చేసినాడు. 1926 లో పురిపండా, వడ్డాది సీతారామాంజనేయులు, శ్రీశ్రీ కలసి కవితాసమితి స్థాపించిరి. 1928 లో శ్రీశ్రీ రచించిన భావగీతములు, పద్యములు 'కవితా సమితి' తొలిప్రచురణగా 'ప్రభవ' రూపమున వెలువడినవి. 'ప్రభవ' నాటికి శ్రీశ్రీ 'శ్రీరంగం శ్రీనివాసరావు' గానే యున్నాడు.

### 'ప్రభవ' :

'ప్రభవ' లోని కవితాఖండికలను పరిశీలించినచో శ్రీశ్రీ భావకవిత్వధోరణి స్పష్టముగా బోధపడును. ఈ సంపుటిలోని ఖండికలు త్రిభాగవిభాగితములు. ప్రకృతిగీతములలో స్వేచ్ఛా ప్రియత్వము, మేఘశకలవర్ణనము, రజనీసముద్ర ప్రకృత్యాది వర్ణనలు, మృత్యుప్రబోధము ఉన్నవి. ప్రణయగీతములలో 'అభిసారికా', 'వియోగశాంతి', 'నిరీక్షణ' ప్రభృతిఖండములున్నవి. ప్రకీర్ణగీతములలో తాండవశివుని ప్రళయనర్తనము, అంతిమయాత్రయను తాత్త్విక (Mystic) గేయము, 'మతస్వీకృతి' యను లఘుకథాకావ్యము కూర్చబడినవి. ఈ శీర్షికలన్నియు ఆనాడు ప్రసిద్ధులైన భావకవులు స్వీకరించినవే. వస్తువరణములోనే కాక భావనలో, పదప్రయోగములో, పద్యరచనలో శ్రీశ్రీ సమకాలికకవిప్రముఖులగు కృష్ణశాస్త్రి, విశ్వనాథ మున్నగువారి ననుక రించినాడు. ముఖ్యముగా కృష్ణశాస్త్రిగారి ప్రభావము కావ్యమంతట కనిపించుచున్నది.

'గాలియొసగెడు క్రొత్తఱెక్కలు ధరించి
అతినిరాఘాటముగ విహాయసపథాల
నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు'[1]

అన్న పాదములలోని ఉడ్డీనకాంక్ష కృష్ణశాస్త్రిగారిదే.

'ఓ వలాహకశకలమా ! నీవుకూడ
నావలెఁ బరిభ్రమించుచున్నావదేల'[2]

అను పంక్తులు కృష్ణశాస్త్రిగారి 'ఓయి సంధ్యాసమీరణా' యను గీతపద్యమును జ్ఞప్తికి తెచ్చు చున్నవి.

'ఎఱుగవే నన్ను లోకభీకరమహోగ్ర
ఫణివిషస్ఫీతమృత్యురూపిణిగ నీవు'[3]

అన్న పాదములు కృష్ణశాస్త్రిగారి

1. 2. 3. ప్రభవ : పుటలు 12, 13, 25.

'ఎవ్వరనుకొందురో నన్ను ఏననంత
శోకభీకరతిమిరలోకైకపతిని'

అన్న పాదములలోని శయ్యను, ఊహాసంవిధానమును పుణికిపుచ్చుకొన్నవి. ఈ సంపుటిలోని 'వియోగశాలి', 'నిరీక్షణము'అను ఖండికలు నాయని వేదులగారల ప్రభావము గలవి. అక్కడక్కడ ఓజోగుణప్రధానముగా ప్రయుక్తములైన పదబంధములు విశ్వనాథవారి దారిలో తీర్చి దిద్దబడినవి.

భావకవుల లలితభావన, మృదులశయ్య, కోమల సమాసగుంఫనముతో పాటు వారిలో అక్కడక్కడ కనిపించు వ్యర్థపదములు ఈ సంపుటిలో సర్వత్ర కలవు. 'రజనీగానము' అను శీర్షికతో వ్రాసిన మొదటి పద్యమే యిట్లున్నది.

'వివిధసూనవితానశోభితకుజప్ర
శస్తసుప్రమదావనస్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వలదివ్యశర్వరీప్ర
శాంతవేళ సమంచితసౌఖ్యమొసగె.' (పుట 20)

పున్నమిరేయిలో పూలతోట హాయిగూర్చినదనుటకు ఈకవి యింతగా సాగదీసినాడు. ఈ ఒక్క పద్యములోనే వితాన, ప్రశస్త, సు, స్థలము, సాంద్ర, సముజ్జ్వల దివ్య, ప్రశాంత, సమంచిత యను తొమ్మిది పరిహార్యములైన పదములున్నవి. ఇది చాలవరకు కాలదోషమే కాని ప్రతిభా దారిద్ర్యదోషముకాదు. నాటి యువకవులపై భావకవిత్వ మేవిధముగా గ్రుక్కతిప్పుకొన లేనంతగా ప్రగాఢముద్ర వేసినదో ఈ యుదాహరణము వలన తేలినది. ఇంతటి అనుకరణశీల మున్న యీ సంపుటిలో గూడ శ్రీశ్రీ భవిష్యత్ప్రతిభ తటిత్ప్రాయముగా భాసింపకపోలేదు. 'ప్రకృతి గీత' యను శీర్షికతో ఆరు పద్యములున్నవి. వానిలో మూడు గీతములు; మూడు శార్దూలములు. వాడినవి రెండేరకముల వృత్తములైనను, వానిని ఒక క్రమములో బిగించి కవి చమత్కారము కలిగించినాడు. మొదట గీతము, తర్వాత శార్దూలము, మరలగీతము, తర్వాత శార్దూలము. గీతపద్యములోని శైలి మాధురీధురీణముగా నుండుట, శార్దూలమోజోగుణ ప్రధానముగా నడచుట ఇందులో గమనింపదగిన కవితాశిల్పము. ఛందస్సుల నుపయోగించుటలో కవికి గల ప్రజ్ఞ కీ శీర్షిక మచ్చుతునక.

'గీతపద్యాలు' అన్నశీర్షిక కవికి గీతపద్యములపై గల మక్కువను తెలుపుటకే వ్రాయబడినది.

'పద్యములు ముఖ్యముగ గీతపద్యములవె
యొసగు నింతింతకాని సంతసమునాకు.' (పుట 36)

ఈ పంక్తులే ఒకసారి పూర్తిగా, ఇంకొకసారి సగము పునరుక్తమైనవి. తనకు గీతముల పట్ల గల అతిప్రీతిని దెలుపుట కీ పునరుక్తి పద్ధతి పోషకముగా నున్నది. 'మహాప్రస్థానము' లోని గేయములలో ఈ పునరుక్తి వలన కవి భావతీవ్రతను వ్యక్తమొనర్చినాడు.

'అభిసారిక'యను శీర్షిక క్రింద వ్రాసిన పద్యములు శ్రీశ్రీకి శబ్దముపైగల ప్రభుతను స్పష్టమొనర్చును.

'ఈ నిశీధిని ప్రబలఝంఝూనిలప్ర
సారవిదళితవృక్షసంచయకలితము
కులిశఘాతప్రతారణకుశలకుధర
పంక్తిసన్నిభఘనపయోవాహయుతము.' (పుట 30)

భావకవుల సమాసములకు కించిద్భిన్నమైన శైలి యీ పద్యములలో భాసించుచున్నది. 'భీప్రద క్రకచోగ్రదంష్ట్రాప్రభూతవిస్ఫురత్తేజము'వంటి సమాసములలో శ్రీశ్రీ సొంతగొంతు కొంతకొంత ధ్వనించుచున్నది. ఈ సంపుటిలోని ఒకటిరెండు చక్కని యూహలు శ్రీశ్రీ మౌలికతకు నివాళు లెత్తుచున్నవి.

'ఈదుకొనిపోతి మామకహృదయకుహర
జనితభావనౌకాధిరోహణమొనర్చి
కంధరతరంగనివహసంకలితమహిత
గగనసాగరగంభీరగర్భమందు.' (పుట 21)

మేఘతరంగములు గల గగనసాగరములో భావనౌకపై పయనించుట ప్రతిభాగర్భితమైన ఊహా చిత్రము.

'ప్రళయనర్తనము' అను శీర్షికతో తాండవశివు నుద్దేశించి వ్రాసిన పద్యములు ఓజోగుణ ప్రవణములు.

'కాలాంతప్రభవార్కకోటిఘృణిసంకాశప్రతాపస్ఫుర
త్ఫాలాక్షజ్వలదగ్నిదగ్ధసకలబ్రహ్మాండభాండుండవై
జ్వాలాదీప్తమహాప్రభావగరిమన్' (పుట 35)

అన్నపద్యము ఒకవైపు తిక్కనాదుల సంప్రదాయమును స్ఫురింపజేయుచున్నను, ఇంకొకవైపు నడకలో, భావనలో శ్రీశ్రీ వ్రాయనున్న 'జగన్నాథరథచక్రాల'లోని ప్రళయచిత్రణపటిమకు బీజ ప్రాయముగా నున్నది.

'ప్రభవ'లో శ్రీశ్రీ అనుకరణతత్పరతను, అక్కడక్కడ మెరుపుతీగెలవలె స్ఫురించు ప్రతిభారేఖలను పరిశీలించిచూపితిని. ఇక మహాప్రస్థానము వెలువడుటకు ముందున్న 'పరివర్తన దశ'ను గూర్చి ముచ్చటింతును.

## 2. పరివర్తన దశ :

1928 లో శ్రీశ్రీ కి కొంపెల్లి జనార్దనరావు సహవాస మేర్పడినది. జనార్దనరావు సాహచర్య ఫలితముగా వెనుక తాను వ్రాసిన 'ప్రభవ'లోని పద్యములన్నియు రెండవశ్రేణికి చెందిన ప్రతిధ్వనులని శ్రీశ్రీ నిర్ణయించుకొన్నాడు, అప్పటినుండి క్రొత్తదనము కొరకు కోరిక యీరిక లెత్తసాగినది. దాని ఫలితముగా 1929 లో 'సుప్తాస్థికలు' అను కవితాఖండిక వెలువడినది.

'అవి ధరాగర్భమున మానవాస్థికాప
రంపరలు, సుప్తనిశ్శబ్దసంపుటములు.
అటనాకే దీర్ఘయామిని, అనిశాశ్మ
శానశయ్యకు ప్రాతఃప్రసక్తిలేదు.
ఆ అగమ్యతమోరహస్యాంగణాన
తాండవించును మృత్యుశైత్యమొకటె.

— — — — —

నా కనుంగవ కన్నీళులైకరంగు
అవి ఒనర్చెడు నీరవాహ్వానమెరిగి

— — — — —

అవి చలించును తమ చర్మకవచమెపుడొ
బ్రతికినదినాల తలపోతబరువుతోఁ.'

ఈ పద్యములు శ్రీశ్రీ వ్రాసిన భావకవితా శాఖలో చివరివి వీనిలో దీర్ఘయామిని, అగమ్యతమోరహస్యాంగణము, నిశాశ్మశానశయ్య. నీరవాహ్వానము అను పదచిత్రములు కృష్ణశాస్త్రిగారిని స్ఫురింపజేయును. మానవాస్థికలను వస్తువుగా స్వీకరించుటలో శ్రీశ్రీ ప్రత్యేకత కనిపించుచున్నది. చర్మకవచము గూడ శ్రీశ్రీ మౌలిక సృష్టియే. ఈ పద్యములలో శ్రీశ్రీ క్రొత్త ఊపిరులు తీసికొన్నట్లు కన్పించును. ఆరుద్ర అన్నట్లుగా 'సుప్తాస్థికల'తో శ్రీశ్రీ కుబుసము విడిచినాడు.[1] 'ఖండశశి'అను శీర్షికతో వ్రాసిన మరియొక రచన గూడ శ్రీశ్రీ పరివర్తనదశలో మైలురాయివంటిది.

'ఖండేందుమూర్తి ! ఆకాశకర్పరమెల్ల
నిండు నీ గ్రుడ్డివెన్నెల ధూమధూపమై

— — — — —

సంపెంగవిరిపైడిచాయలో నాకేమొ
వంపుతేరిన కత్తివలె నుంటివీరేయి.'[2]

1. శ్రీశ్రీ : ప్రచు : అభ్యుదయ.
2. ఖండశశి : శ్రీశ్రీ : ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక : 1932,

ఈ పంక్తులలో శ్రీశ్రీ నిశితమైన భావనాశక్తి తొంగిచూచుచున్నది. గతానుగతికమైన ధోరణిని విడిచి క్రొత్తగా చెప్పవలెనన్న కాంక్ష స్ఫుటముగా కన్పించుచున్నది. ఖండశశి గ్రుడ్డివెన్నెల ధూమధూపమువలె నుండుట, నెలవంక వంపుతేరిన కత్తివలె నుండుట అత్యంత మౌలిక ప్రజ్ఞకు సంబంధించిన భావచిత్రములు. 'మహాప్రస్థానం'లో 'ఒకరాత్రి'అను శీర్షికతో శ్రీశ్రీ వ్రాసిన

'విశ్వమంతా నిండి వెలిబూడిపోలె -
బహుళపంచమిజ్యోత్స్న భయపెట్టునన్ను.
— — — — —
ఆకాశపుఎడారిలో కాళ్ళుతెగిన
ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి'

అన్న పంక్తులలోని అపూర్వభావచిత్రములకు 'ఖండశశి'లోని పై పంక్తులు పునాదిరాళ్ళవలె నున్నవి. శిల్పములో భావకవితావాసన పోకున్నను, భావనలో మాత్రము శ్రీశ్రీ లో కల్గిన మార్పున కీ గేయము నిలువుటద్దము వంటిది.

శ్రీశ్రీ పరివర్తనదశలో చివరిమైలురాయి 'విద్యున్మాలికలు'. ఇది 1933లో ప్రచురింపబడినది.[1]

'బారులు బారులుగ తీరిన
మబ్బు గుబ్బలుల దారుల
దారితప్పి చరించె
ఆరేయి తరళ సరశేరమ్మదములు.
— — — — —
వేటకాని కోలలకు కూలి
వేదనలతూలు హరిణాలకండ్లు
జాలికి పురుటిండ్లు-
దిక్కుదిక్కులకంపిన దీనంపుచూడ్కులే
ఆనాటి
ప్రళయతాండవ భయంకరసౌదామినులు.'

ఇది శ్రీశ్రీ వ్రాసిన మొదటి వచనగేయము. అంతకుముందు వ్రాసినవి పద్యములు, మాత్రాగీతములు మాత్రమే. ఈ గేయములో చరణనియమములేదు. ఒక ఇదమిత్థమైన లయలేదు. పఠాభి, శిష్ట్లా మున్నగువారి వచనగేయములను పోలినదిది కాని అంతవరకు పఠాభి గాని శిష్ట్లా గాని రచనలు చేసినట్లాధారములు లేవు. నారాయణబాబు గూడ వచనగేయములు వ్రాయలేదు.

1. విద్యున్మాలికలు : ఆంధ్రపత్రిక ఉగాది సంచిక : 1933.

కావున ఆ నలుగురిలో శ్రీశ్రీయే మొట్టమొదటి వచనగేయమును వ్రాసినవాడని తేలినది. ఐనను ఈ గేయమున నడుమనడుమ 'స్వర్గవీధీవిహారతారకలు మాని' మున్నగు పద్యపుతునకలుండుట వలన శ్రీశ్రీపై ఇంకను పద్యవాసన పోలేదని ఊహించుటకు వీలున్నది. ఏది యెట్లున్నను ఇంత వరకు పద్యచ్ఛందస్సునో, గేయచ్ఛందస్సునో ఆశ్రయించుకొనియున్న శ్రీశ్రీ ఛందోనియమోల్లంఘనముచేసి ఈ గేయము రచించుట సాహసోపేతమైన ప్రయోగము,

### 3. పరిణతిదశ :

1930 లో శ్రీశ్రీ టైఫాయిడ్‌తో మంచముపట్టినాడు. అతనిలో అపూర్వమైన అలజడి ప్రారంభమైనది. మానసికముగా. శారీరకముగా అతనిలో 'ఆకలియుగము' రెక్కలు విప్పి కొన్నది. భావకవిత్వధోరణి ఇగిరిపోయినది. ఒకవైపు స్వరాజ్యశంఖధ్వనులు వినిపించినవి. ఇంకొకవైపు నిత్యము మృత్యువుకౌగిలిలో గిలగిలతన్నుకొను పీడితప్రజాలోకము కనిపించినది. అతని హృదయములో అట్టడుగునపడియున్న చైతన్యము పడగెత్తియాడినది.

'రావద్దు రావద్దులోనికి
రాస్తున్నానొకగీతం
రావద్దు రావద్దులోనికి
ననుచూడ, కాదిదివేళ
నా మనఃకార్మికశాల
క్రక్కేది చండాగ్ని సెగలు'[1]

అని తనలోతానే గొణుగుకొన్నాడు.

'కలలోపుట్టి, కలలోపెరిగి
ఉద్రేకంతోనిండి, ఉన్మాదంతోపండి
కాలకూటపు గొట్టపుపొగలలో
గంధకద్రావక కాసారంలో
గండభేరుండాల కౌగిలింతలలో'[2]

అని అద్భుతవిషయములను చెప్పుట కుద్యుక్తులాగినాడు.

'వాకిట్లో, చీకట్లో ఎవరోకేక
నేనేలే...నేనేలే...నేనేలే'[3]

అని పలవరించి అర్ధోక్తిలో ఆగిపోయినాడు. తనలో జరుగుచున్న ఈ ప్రచండమథనమునకు ఫలితముగా 1933 లో (జూన్ 2 వ తేదీన) 'జయభేరి' వెలువడినది. ఛందస్సుల సర్వపరి

1, 2. 3. ఈ మూడు శ్రీశ్రీ అసంపూర్ణగీతములు; అముద్రితములు గూడ. 'కృత్యాద్యవస్థ' అను ఆకాశవాణి ప్రసంగములో శ్రీశ్రీ వీనిని పేర్కొన్నాడు. వాణి ; 22.5.1954.

ష్వంగమును, భావకవితాస్వర్ణపంజరమును వదలిపెట్టి క్రొత్తఛందస్సులో సరిక్రొత్తవస్తువుతో వెడలిన గేయము 'జయభేరి'.

'నేనుసైతం ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను
— — — — —
నేనుసైతం భువనభవనపు
బావుటానై పైకిలేస్తాను'

అని శ్రీశ్రీ ఆలపించినాడు. ఇది ఆత్మాశ్రయరీతిలో వ్రాసిన గేయమైనను దీనిలోని వ్యక్తి చైతన్యము సామాజికచైతన్యములో భాగస్వామి. ఇది శ్రీశ్రీ సొంతగొంతుకను లోకమునకు చాటిన ప్రప్రథమగేయము.

'జయభేరి' రచన పిమ్మట సమాజజీవితమున సౌందర్యమున్నదని శ్రీశ్రీ గమనించినాడు. అతీంద్రియసౌందర్యముకొరకు అర్రులుసాచుటకన్న, చుట్టుప్రక్కలనున్న సజీవప్రకృతిలోనే సుందర కవితావస్తువులు నిక్షిప్తములైయున్నవని గ్రహించినాడు. ఈ నవ్యదృక్పథముతో పాశ్చాత్యకవులైన స్విన్‌బర్న్, ఎడ్గార్ ఎలెన్‌పో, బ్రౌనింగు, బాడ్లేర్ మున్నగువారి రచనలను చదువనారంభించినాడు. వారి సంవిధానము నాకళించుకొన్నాడు. బాడ్లేర్, మపాసా, పో తనకు ఋషితుల్యులుగా భావించుకొన్నాడు.[1] వీరు 'నా కావ్యజీవితాన్ని ప్రోదిచేసి, నా ఆదర్శాలను మలచిన ప్రముఖులు' అని ప్రకటించినాడు.[2] పో వ్రాసిన రేవెన్ (Raven), హెలెన్ (Helen), ఎనాబెల్ లీ (Annabal Lee) మున్నగు గేయములను చదివి జీర్ణించుకొన్నాడు. శబ్దసంగీతమునకు భావగాసమునకు స్విన్‌బర్న్ రచనలను ఆదర్శముగా గ్రహించినాడు. బాడ్లేర్ రచనలలోని అవ్యక్తమాధురులను అనువాదములద్వారా ఆకళించుకొన్నాడు. నాడులమీద విద్యుచ్ఛక్తి నడిపించు మపాసా రచనలను ఆస్వాదించినాడు. ఈ విదేశకవితారీతులతో పాటు తెలుగులోని శ్రామిక జనుల పాటలను పరిశీలించినాడు. గురజాడ ముత్యాలసరాలపై పరిశోధనచేసి వాని నిగ్గులను కనులకద్దుకొన్నాడు. మాత్రాచ్ఛందస్సులను, అప్పకవీయములోని తాళబద్ధమైన వృత్తములను పరిశీలించిచూచినాడు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణశాస్త్రమును, మార్క్స్ ప్రతిపాదించిన గతితార్కిక భౌతికవాదసిద్ధాంతములను జాగ్రత్తగా అధ్యయనముచేసినాడు. ఇంతటి విజ్ఞానమును పునాదిగా చేసికొని 1934 ఏప్రిలు 12వ తేదీని 'మరోప్రపంచం మరోప్రపంచం మరోప్రపంచం పిలిచింది' అను చరిత్రాత్మకగేయమును సృష్టించినాడు. ఈ గేయమే రానున్నతరములో 'అభ్యుదయ కవిత్వము'నకు నాందిగీతముగా మారినది. 'మహాప్రస్థానం' అను గేయసంపుటికి ముకుటాయమానముగా నిలిచిపోయినది.

1, 2, ఒక సంభాషణశకలము (వ్యాసము) : శ్రీశ్రీ : ప్రబుద్ధాంధ్ర 1935 జనవరి.

'మహాప్రస్థాన' గేయము :

'మరోప్రపంచం' అని ప్రారంభమై 'హోమజ్వాలల భుగభుగల' తో సమాప్తమైన ఈ గేయము అయిదు నిమిషముల వ్యవధిలో రచింపబడినదని శ్రీశ్రీయే స్వయముగా చెప్పు కొన్నాడు.[1] ఈ గేయమును ముగించి మొదట వ్రాసిన 'కదంతొక్కుతూ, పదంపాడుతూ, కాంద్రు కాంద్రుమని గర్జిస్తూ' అన్న పాదములలో రెండవది తృప్తికలిగించకపోగా, దానిని 'హృదంతరాళం గర్జిస్తూ' అని సవరించి, కొన్ని నెలలైన పిమ్మట 'మహాప్రస్థానం'అను శీర్షికతో 'జ్వాల'లో ప్రచురించినాడు. ఈ పాటలోని ఆవేశమునకు ప్రధానముగా ప్రోద్బలము కలిగించిన వివియని శ్రీశ్రీ స్వయముగా క్రిందివానిని పేర్కొనెను.

1. ఫ్రెంచివారి జాతీయగీతము.

3. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ 'షరూహువాహై జంగ్' అనుపాట.

3. నజ్రుల్ ఇస్లాం విప్లవగీతములు.

4. ఎడ్గార్ ఎలన్ పో గేయములు.

5. గురజాడ, కవికొండల గేయములు,

6. 1934 ఫిబ్రవరి 18 వ తేదీన 'పో' గంటల ననుకరించుచు శ్రీశ్రీ ఒకగేయము వ్రాసి నాడట. అందులో

'హరోంహరోంహర హరహరహరహర
హరోంహరా అని పలికే గంటలు'

అను పంక్తులు మిగిలిన చరణములతో తూగకపోవుటతో వానిని ఉపసంహరించుకొన్నాడట. రెండునెలల పిమ్మట ఆ పంక్తులే 'మరోప్రపంచ' గీతమును పలికించవచ్చును.

7. బరంపురం నవ్యసాహిత్యపరిషత్తులో శివశంకరశాస్త్రిగారు వినిపించిన

'మారోమారో, మారోమారో
ఒకటి రెండు మూడు నాలుగు

అన్న శిష్టా గేయము ఒక ప్రోద్బలము కావచ్చును.

ఇవికాక ఈ పాటలోని ఆవేశానికి ప్రధానప్రోద్బలాలు లామర్సెయ్యే, లా ఇంటర్ నేషనల్, బర్న్సు రచించిన 'బెన్నాక్‌బర్న్', అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన 'ది ట్వెల్వ్' అని శ్రీశ్రీ వేరొకచోట వ్రాసినారని సంపత్‌రాఘవాచార్యగారు పేర్కొన్నారు.[2] ఇన్నిప్రభావముల ఫలితముగా

1. 'కృత్యాద్యవస్థ'.
2. శ్రీశ్రీ నూతన కవిత్వం : తెలుగుసంక్రాంతి (సాహిత్యపత్రిక)

ఈగేయము వెలువడినను ఇది దేనికిని అనుకరణమో, అనుసరణమో కాక స్వతంత్రగీతమువలె నిలిచిపోయినది. శ్రీశ్రీ పేర్కొన్న ఈ ప్రభావములు ప్రేరకశక్తులు మాత్రమే. రకరకములైన ఆహారపదార్థములు ఆరోగ్యవంతుని శరీరములో ప్రవేశించి రక్తముగా మారినట్లుగా, ఈ ప్రేరక శక్తుల ప్రోద్బలముతో శ్రీశ్రీ నిద్రాణప్రతిభ జాగృతమై పడగెత్తి తాండవించినది. ముఖ్యముగా నజురులిస్లాం వ్రాసిన 'విప్లవగీతి' లోని

'స్వాగతనినాదము లివ్వండి
నవయుగపతాకం రెపరెపమంటున్నది
అడ్డులేని తుఫాను విరుచుకపడుతున్నది'[1]

అను పంక్తులు, యువకులను గూర్చి నజురుల్ వ్రాసిన

'ఓ పురోగామిసైనికా! నడు!
వడివడిగా నడు!

నవయుగ స్రష్టలారా! నడవండి ముందుకు
విజయం చేపట్టిన వీరులం మనం
తీరాలూ, పారావారాలూ, దరులూ, గిరులూ
అన్నిటినీ ఆక్రమిద్దాం మనం.''[2]

వంటి పంక్తులు, 'విద్రోహి' పూర్తిగేయము శ్రీశ్రీ గేయమునకు మూలకందము లనుకొనవచ్చును. ఈ ప్రభావముల నొకవంక జీర్ణించుకొని తెలుగుతనము కొరవడకుండ గుండెలో డిండిమములు మ్రోగించు చండప్రచండగతిలో, మాటలను ఈటెలుగా, బాకులుగా, మంటలుగా మార్చి శ్రీశ్రీ ఈ గేయము రచించినాడు. చలం అన్నట్లు ఈ గేయము ద్వారా శ్రీశ్రీ యువకసైన్యాలకు, నూతన యుగనిర్మాతలకు నేపథ్యసంగీతము వంటి, Marching Band వంటి క్రొత్తరకముగా కదనుత్రొక్కించు సంగీతము వినిపించినాడు.[3] దిక్కులను, దేవతలను ఊపివేసినాడు. సమకాలీన సమాజమును, అంతర్జాతీయపరిస్థితులను రెంటిని సమన్వయించుకొని, సామాజికవిప్లవము నర్థించి ఈ గేయరూపములో విప్లవశంఖ మొత్తినాడు. గురజాడ దేశభక్తి గీతము సత్త్వప్రధానముగా రచింపబడిన ప్రపంచ ప్రజాగీతము. శ్రీశ్రీ 'మహాప్రస్థానము' ఓజోరజోగుణప్రధానముగా వ్రాయబడిన ప్రపంచ ప్రజాగీతము. ఇందులోని సైనికులు యుద్ధసంబంధులుకారు. వీరరక్తము పొంగులువారుచున్న పీడితులు–విశ్వశ్రామికులు. ఇందులోని 'మరోప్రపంచం' స్వర్గమో, కైలాసమోకాదు, 'ధరిత్రినిండా నిండిన' సమసమాజము. ప్రపంచములోని అరవభాగమున

1. 2. ఈ గేయములను సర్వర్‌పిగార్ ఉర్దూలో అనువదించినాడు. వానినే నేను తెనిగించితిని.
3. 'మహాప్రస్థానం'లో చలం వ్రాసిన యోగ్యతాపత్రం.

శ్రామికవర్గ ప్రభుత్వము నేర్పరిచి క్రమముగా విశ్వమంతట వర్గరహితసమాజమును నిర్మించుట కుద్యుక్తమైన సోవియట్‌రష్యా ఈ 'మరోప్రపంచము'నకు రేఖారూపముగా నిల్చిన ప్రతీక కావచ్చును. అప్పటికే శ్రీశ్రీ రష్యావిప్లవముచేత ప్రభావితుడైనట్లు అతని మాటల వలననే గ్రహింపవచ్చును.

'ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు రష్యన్ విప్లవంలో ఆకృతి ధరించడం నాకు కనపడింది. సామాజికవిప్లవానికి సాహిత్యవిప్లవం చాలన్న దృఢనిశ్చయం ఏర్పడింది.'[1] ఈ గేయముతర్వాత 1940 వరకు 'మహాప్రస్థాన' కవితాసంపుటిలోని గేయము లన్నియు రచింపబడినవి. 1934 లోనే బాటసారి, ప్రతిజ్ఞ; 1937-38 లో అభ్యుదయం, వ్యత్యాసం, నవకవిత; 1939 లో కవితా ఓకవితా, కేక; 1940 లో జగన్నాథుని రథచక్రాలు మున్నగు ముఖ్యగేయములు రచింపబడినవి. 1940 తర్వాత శ్రీశ్రీ అధివాస్తవికమార్గములోపడి రుబాయత్, కొంటెకోణాలు, టాంటాం మున్నగు రచనలుచేసినాడు. 1940 వరకు రచింపబడి 'మహాప్రస్థానం' సంపుటిలో ప్రచురింపబడిన గేయములలో అధికభాగము మార్క్సిజమును గర్భీకరించుకొన్న రచనలు. కావున ముందు 'మహాప్రస్థానం'లోని మార్క్సిస్టు దృక్పథమును విపులముగా చర్చింతును. అధివాస్తవికగేయములను గూర్చి ఆ శీర్షికను గురించి చర్చించినప్పుడు వివరింతును.

### మహాప్రస్థానము : మార్క్సిజము :

'మహాప్రస్థానం' లో మార్క్సిజము ముఖ్యసూత్రము లేవిధముగా కవితారూపమున ప్రవచింపబడినవో తెలుపుటకు ముందు మార్క్సిజము స్వరూప స్వభావములను వివరించుట అత్యవసరము. డార్విన్ పరిణామసిద్ధాంతము, హెగెల్ భావవాదము (Idealism) - ఈ రెంటిని ఆధారముగా చేసికొని మార్క్స్, ఎంగెల్సు గతితార్కికభౌతికవాదసిద్ధాంతమును నెలకొల్పిరి. తెలుగులో గతితార్కికభౌతికవాదము Dialectical materialism అను అర్థమున రూఢమైనది. కావున శబ్దచర్చను విడిచి గతితార్కికభౌతికవాదతత్త్వమును పరిశీలింతును.

### గతితార్కికభౌతికవాదము :

హెగెల్ అను జర్మనుతత్త్వవేత్త గతితార్కికసిద్ధాంతమునకు పునాదివేసెను. ఇతడు హెరాక్లిటస్ అను ప్రాచీనగ్రీకుతాత్త్వికుని సిద్ధాంతముల నాధారముగా చేసికొని, శాస్త్రీయదృక్పథముతో, ప్రపంచములోని ప్రతివస్తువు మార్పుచెందునని, పరస్పర సంబంధములేని ప్రాణులు, పదార్థములు, సంఘటనలు లేవని నిరూపించెను. అనవరతపరిణామశీలకమైన ప్రపంచమునకు మూలము 'భావము' (Idea) అని ఇతని అభిప్రాయము. ఇతని సిద్ధాంతములకు భావవాదము ప్రాతిపదిక. ఇతనికి ముందుండిన తత్త్వవేత్తలు మార్పును గురించి వివరించినప్పుడు స్థలమును మాత్రమే పరిగణించెడివారు. ఇతడు స్థలముతోపాటు కాలమునుకూడ దృష్టిలో నుంచుకొన

1. 'కృతజ్ఞతావ్యవస్థ'లో.

వలెననెను. ప్రతిపదార్థము పరస్పరవైరుధ్యములతో కూడుకొన్నదని, సంఘర్షణయే పదార్థ ముల ప్రధానధర్మమని నిరూపించెను.

మార్క్సు ఎంగెల్సులు హెగెల్‌లోని భావవాదధోరణులను విడిచిపుచ్చి, అతని గతి తార్కికపద్ధతిని మాత్రము స్వీకరించిరి. వీరిది 'గతితార్కికభౌతికవాదము.' బాహ్యప్రకృతిలో జరుగు మార్పులే సామాజికపరివర్తనకు మూలహేతువులని వీరు నిరూపించిరి. భౌతికశక్తుల ప్రభావము మన ఆలోచనలపై ప్రసరించినప్పుడే మనము ప్రపంచమును మార్చుటకు ప్రయ త్నింతుమనిరి. ప్రపంచము పదార్థనిర్మితము. మానవుని సమస్తావయవములు పదార్థ (పంచ భూత) నిర్మితములే. సమస్తాంగములలో ముఖ్యమైనది 'మెదడు.' ఈ మెదడుగూడ పదార్థ నిర్మితమే. మానవుని క్రియాశీలిత కిది కీలకస్థానము. సమస్తాలోచనలకు, వివేకమునకు ఇది కేంద్రబిందువు. దీని కతీతముగా 'ఆత్మ' యన్నది లేదు. పదార్థమునకు చలనము, చైతన్యము నైసర్గికగుణములు. అనగా స్వభావతః పదార్థము గతిశీలకమైనది. దానిని నడిపించునవి ప్రకృతి శక్తులే కాని దైవికశక్తులు కావు. మానవుని జీవితము పదార్థములోని ద్వంద్వశక్తుల సంఘర్షణ ఫలితముగా రూపుదిద్దుకొనుచుండును. కావున భావము స్వతంత్రమైనదను హెగెల్ వాదము సమంజసమైనదికాదు. దీనిని మార్క్సువిధముగా స్పష్టపరిచెను.

'హెగెల్ అభిప్రాయంలో ఆలోచనాక్రమం మనోభావమనే పేరుతో ఒక స్వతంత్ర శక్తిగా వ్యవహరిస్తుంది; అదే వాస్తవజగత్తుకు మూలం. మనోభావం యొక్క బాహ్యస్వరూపమే వాస్తవజగత్తు కాని నా అభిప్రాయంలో వాస్తవజగత్తు యొక్క ప్రతిబింబమే మనోభావం. అది ఆలోచనల రూపంలో బహిర్గతమవుతూఉంటుంది.'[1]

మార్క్సు ఈ గతితార్కికభౌతికవాదమునకు మూడు సూత్రములను ప్రతిపాదించెను. 1. పరస్పర విరుద్ధశక్తుల మధ్య సంఘర్షణ, 2. విరోధవైరుధ్యసూత్రము (Negation of the negation), 3. పరిమాణము గుణముగా మారుపద్ధతి.[2]

ప్రతివస్తువులో రెండు విరుద్ధగుణములుండును. వీని సంఘర్షణలోనే అభ్యుదయమున్నది. విద్యుచ్ఛక్తిలో Negative Current, Positive Current పరస్పర విరుద్ధశక్తులు. వీని సంఘర్షణవలన వెలుతురు, వేడి, చలనము పుట్టును. అట్లే పరమాణువులలో ప్రోటాను ఎలక్ట్రానుల ఘర్షణ సహజమైనది. ఈ సూత్రమును పురస్కరించుకొని మార్క్సు ఎంగెల్సులు పెట్టుబడిదారీవ్యవస్థ శైథిల్యమును గూర్చి జోస్యముచెప్పిరి. పెట్టుబడిదారీవ్యవస్థలోని పరస్పర విరుద్ధశక్తుల విజృంభణమే దాని వినాశనమునకు దారితీయునని వ్యాఖ్యానించిరి. ఇదే వర్గకలహ సిద్ధాంతము.

1. గతితార్కికభౌతికవాదం : కంభంపాటి సత్యనారాయణ : పుట 79.
2. ఈ తెలుగుమాటలు కంభంపాటివారు వాడినవి. వానినే నేను స్వీకరించితిని.

రెండవసూత్రము 'విరోధవైరుధ్యము'. లోకములోని ప్రతివస్తువులో, ప్రతివ్యవస్థలో, ప్రతిజాతిలో అంతర్వైరుధ్యములుండును. ఆ వైరుధ్యముల ఫలితముగా మూలపదార్థము నాశనమైపోవును. పాతది ధ్వంసమగుట, దాని శిథిలములనుండి క్రొత్తది ఉద్భవించుట సహజధర్మము. శీతోష్ణస్థితి మరియు నీటి ప్రభావమువలన భూమియందలి ధాన్యపుగింజ నుండి మొక్క బయలుదేరును. మొక్క భూమివెలుపలికి వెడలినపిమ్మట క్రమముగా ఆ గింజయే నశించును. కోడిగ్రుడ్డు పిల్లయగుట యిట్టిదే. ఈ విధ్వంసనము స్వయంశక్తిచోదితము. కోడిగ్రుడ్డును చితుకగొట్టినచో దానిలో నుండి పిల్ల పుట్టదు. కావున యాంత్రికమైన వైరుధ్యమువలనగాక గతితార్కికమైన వైరుధ్యము వలన జరిగిన విధ్వంసనము వినూత్నసృష్టికి దారితీయును. ఈ సూత్రమును పురస్కరించుకొని మార్క్సు మానవసమాజములోని ఆదిమకమ్యూనిస్టు వ్యవస్థ, బానిస యజమానులవ్యవస్థ, పెట్టుబడిదారీవ్యవస్థ, కమ్యూనిస్టువ్యవస్థ - ఏవిధముగా క్రమముగా ఒకదానినొకటి ధ్వంసముచేసి వెలువడినవో వివరించెను. ఉత్పత్తిసంబంధములకన్న ఉత్పత్తిశక్తులు పురోగమించుటవలన వర్గప్రాతిపదిక మీద ఏర్పడిన సమాజవ్యవస్థ విధ్వంసముకాక తప్పదని నిరూపించెను. కమ్యూనిస్టువ్యవస్థ వర్గరహితమైనది కావున దాని విధ్వంసనప్రసక్తియే లేదనెను.

మూడవసూత్రము ప్రకారము వస్తువులు లేక ప్రాణులు, వ్యవస్థలు క్రమాభివృద్ధిచెంది, కడ కొకదశలో క్రొత్తరూపము ధరించును. నీటి ఉష్ణోగ్రతను హెచ్చించగా ఒకదశలో అది ఆవిరిగా మారిపోవును. అట్లే పెట్టుబడిదారీవ్యవస్థ అభివృద్ధిచెంది - అనగా దాని పరిమాణము హెచ్చి - ఒకానొకస్థితిలో విప్లవశక్తుల ప్రతిఘటనముతో బ్రద్దలైపోవును. పర్యవసానముగా దానికి సరిక్రొత్తగుణ మేర్పడును.

ఈ మూడు సూత్రములు కలసి గతితార్కికభౌతికవాద మేర్పడినది. ఈ వాదమునకు వర్గకలహసిద్ధాంతము గుండెకాయవంటిది. మానవజాతి చరిత్ర (దేశచరిత్రల) నీ సిద్ధాంతము సరిక్రొత్తవెలుగులో పరిశీలించును. ఈ సిద్ధాంతముల చక్షువులతో శ్రీశ్రీ 'మహాప్రస్థానం'ను పరిశీలించుటకుముందు 1926-40 ల నడుమగల అంతర్జాతీయ, జాతీయ, రాజకీయ, సాంఘిక స్థితిగతుల నుల్లేఖించుట అవసరమని భావింతును.

### అంతర్జాతీయజాతీయపరిస్థితులు :

1925 సంవత్సరమునుండియే కాంగ్రెసునాయకత్వము దేశమున బలపడినది. కాంగ్రెసులోని విద్యావంతులలో యువకులలో అప్పటికే విప్లవభావాంకురములు పొడసూపినవి. 1926 నుండి కాంగ్రెసులో వామపక్షీయులు, అతివాదులు బలపడసాగిరి. అనేక రాష్ట్రములలో Workers and Peasants Parties (కార్మిక కర్షక సంఘములు) స్థాపింపబడినవి. గాంధీతత్త్వముపై కొంత అసంతృప్తి చెలరేగినది. దేశమంతట యువజనసంఘములు నెలకొన్నవి. టెర్రరిస్టు సంఘములు తలలెత్తినవి. 'హిందుస్తాన్ రిపబ్లిక్ ఆర్మీ' ఇట్టి సంస్థయే.

1927 లో బొంబాయి కార్మికులచేత ప్రప్రథమముగా 'మేడే' (మే దినము) ఉత్సవము బ్రహ్మాండముగా జరుపబడినది. దేశీయ శ్రామికవర్గ మంతర్జాతీయకార్మికమహోద్యమముచేత ప్రభావితమైనదనుటకు ఇది నిదర్శనము. 1928 నుండియే కార్మికోద్యములు వర్గసంఘర్షణసిద్ధాంతము నవలంబించినవి. 1929 జనవరిలో జరిగిన 'శాసనసభ' సమావేశములో ఇచ్చిన ఉపన్యాసమున అప్పటి రాజప్రతినిధి లార్డుఇర్విన్ కార్మికోద్యమమున కమ్యూనిస్టుసిద్ధాంతములకున్న ప్రాబల్యము నరికట్టవలసిన అవసరము నుద్ఘాటించెను. తత్ఫలితముగా భారతదేశములోని కార్మిక నాయకులలో ప్రముఖులందరిని ప్రభుత్వము నిర్బంధించినది. 1934 లో (ఏప్రిలు 23న) బొంబాయిలో వేతనముల తగ్గింపునకు నిరసనగా పెద్దయెత్తున జనరల్ స్ట్రైక్ (సార్వజనీనపు సమ్మె) జరిగినది. ఇది కాన్పూరు, నాగపూరు, అహమదాబాదు మున్నగు నగరములకు వ్యాపించినది. 1930-33 లలో జరుపబడిన శాసనోల్లంఘనోద్యమమున పాల్గొని చెరసాలలో ప్రవేశించిన కాంగ్రెసు కార్యకర్తలకొరకు వామపక్షీయులచేత జైళ్ళలో మార్క్సిజమునుగూర్చి 'అధ్యయన తరగతులు' నిర్వహింపబడుటతో వారికి గాంధీతత్త్వముపై విముఖతకలిగినది. చెరసాలల నుండి విముక్తులైన తర్వాత ఆ కార్యకర్తలు గాంధీగారి విధానముద్వారా కాక, మార్క్సు ప్రవచించిన మార్గమున కర్షకకార్మికవర్గములో చైతన్యము రేకెత్తింపవలెనని నిర్ణయించుకొనిరి. 1930 తర్వాత యూరపులోని పెట్టుబడిదారీదేశములలో కలిగిన ఆర్థికసంక్షోభము బూర్జువావర్గపు పునాదులనే పెల్లగించివేసినది. దానికి పర్యవసానముగా పెట్టుబడిదారీదేశములలోని కార్మికోద్యమము, భారతదేశమువంటి వలసరాజ్యములలోని జాతీయోద్యమము చైతన్యసందీప్తమైనవి. సోవియట్ రష్యాలోని సామ్యవాదవ్యవస్థయొక్క దినదినాభ్యుదయము ప్రపంచప్రజలందరిలో విప్లవాత్మకమైన పరివర్తనము కలిగించినది. భారతదేశములో 1934 లోనే మార్క్సు ప్రభావముగల కాంగ్రెసులోని వామపక్షీయులు 'కాంగ్రెసు సోషలిస్టుపార్టీ'ని స్థాపించిరి.

1936 నాటికి కాంగ్రెసులోగూడ గణనీయమైన మార్పువచ్చినది. లక్నోలో ఆ సంవత్సరము జరిగిన కాంగ్రెసుసభలో సామ్యవాదవర్గము బలపడినది. దీనికి జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వము వహించుట గమనింపదగిన విషయము. ఈ సభలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసమున నెహ్రూ సామ్యవాద సిద్ధాంతములపట్ల తన అభిమానమును ప్రకటించెను. పార్లమెంటరీవిధానమువలననే కాక, నానాటికి చెలరేగుచున్న ప్రజల విప్లవమనోరథములను ఉద్యమరూపమున ప్రవేశపెట్టవలెనని ఈ సభలో తీర్మానింపబడినది. భారతదేశస్వాతంత్ర్యోద్యమము ప్రపంచప్రజల స్వాతంత్ర్య సంగ్రామములో ఒక భాగముగా గుర్తింపబడినది. ఫాసిజమునకు, సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగా తీర్మానముచేయబడినది. ప్రపంచప్రజలు సాగించుచున్న ఫాసిస్టు వ్యతిరేకోద్యమమునకు జాతీయోద్యమ మంతర్భాగమని విశదీకరింపబడినది.

1937 లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుకు ఘనవిజయము లభించినది. కొన్నిరాష్ట్రములలో కాంగ్రెసుప్రభుత్వములు స్థాపింపబడినవి. అధికారములోనికి వచ్చినపిమ్మట కాంగ్రెసు 'పౌరహక్కుల' విషయములో చెప్పుకొనదగిన విజయములను సాధించినది. 'రాజకీయ ఖైదీల'

ననేకులను విడుదలచేసినది. రాజకీయకార్యకర్తలపట్ల అంతకుముందున్న నిర్బంధముల సడలించివేసినది. వార్తాపత్రికలపై అంతవరకున్న ఆంక్షలను పూర్తిగా తొలగించివేసినది. ఈవిధముగా రాష్ట్రస్థాయిలోగూడ కాంగ్రెసుప్రభుత్వములుండుటతో ప్రజలలో అపూర్వ రాజకీయ చైతన్యము తరగలెత్తినది.[1]

1934-39 ల మధ్య ఫాసిస్టురాజ్యముల దురాక్రమణధోరణి ముదిరిపోయినది. 1935 లో ఫాసిస్టుదేశమగు ఇటలీ అబిసీనియాపై దాడిచేసి ఆక్రమించుకొన్నది. 1936లో ఇటలీ జర్మనీలు సమష్టిగా స్పెయిన్‌లో ప్రజాప్రభుత్వమునకు వ్యతిరేకముగా తిరుగుబాటుచేయించినవి. ప్రజా ద్రోహియగు ఫ్రాంకోను బలపరిచినవి. 1937 లో జపాను మంచూరియా నాక్రమించుకొన్నది. 1938 లో జర్మనీ ఆస్ట్రియాను, జకోస్లేవికియాను ఆక్రమించుకొన్నది. 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామము ప్రారంభమైనది.

1934-36 ల నడుమ ఫ్రాన్సులో ఫ్రెంచి కార్మికవర్గము మరియు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వముతో 'Popular Front' ఉద్యమము సాగినది. 1934 లోనే ఫ్రెంచి ఫాసిస్టులు ఫ్రాన్సులో ఫాసిస్టునియంతృత్వమును నెలకొల్పుటకు ప్రయత్నించగా ఫ్రెంచి కార్మికవర్గము వారి యెత్తులను పూర్తిగా భగ్నమొనర్చినది. 1936 ఎన్నికలలో ఫ్రాన్సులో ఈ 'పాప్యులర్ ఫ్రంట్'పక్షము గెలుపొందినది.

ఈ కాలముననే వలసదేశములగు ఈజిప్టు, పాలస్టయిన్, ఇరాన్, క్యూబా, ఫిలిప్పైన్ దీవులు, లిబియా. మొరాకో మున్నగు దేశములలో సామ్రాజ్యవాదవ్యతిరేకత వెల్లువికినది. చైనాలో సామ్రాజ్యవాదదేశమగు జపానుకు వ్యతిరేకముగా జాతీయైక్యమహోద్యమము సాగినది. ఈ యుద్యమములన్నిటికి సోవియట్ రష్యా వేగుచుక్కవలె మార్గదర్శకమైనది. భారతదేశములో 1936 - 37 ల నడుమ కార్మికసంఘముల సంఖ్య పెరిగినది. బొంబాయి, కాన్పూరు, అహ మదాబాదులోనే కాక మద్రాసు, మలబారు, బెంగాలులో గూడ కార్మికోద్యమము సుసంఘటిత మైనది. 1938 - 39 ల నాటికి కర్షకోద్యమము తీవ్రగతిలో పురోగమించినది. 1935 నుండి విద్యార్థుల ఉద్యమము క్రమాభివృద్ధిపొందినది. అండమాన్ ఖైదీల విడుదలకొరకు బెంగాలులో విద్యార్థులు జరిపిన ఆందోళనము ప్రభుత్వపు పునాదులనే కదలించివేసినది. 1939 లో ప్రారంభ మైన ప్రపంచయుద్ధమునకు నిరసనగా ఒకవైపు కాంగ్రెసు ప్రయత్నములు చేయుచుండగా, ఇంకొకవైపు కార్మికులు సమ్మెలరూపమున తీవ్రమైన ఆందోళన ప్రకటించిరి. 1939 అక్టోబరు రెండవతేదీనాడు బొంబాయిలో 90000 కూలీలు యుద్ధమునకు, సామ్రాజ్యవాదులకు నిరసనగా సమ్మెచేసిరి. ప్రపంచస్థాయిలో యుద్ధమునకు వ్యతిరేకముగా కూలీలు జరిపిన మొదటి సమ్మె ఇదే. ఈ సమ్మె వెనుక మార్క్సు ప్రవచించిన వర్గచైతన్యము సమగ్రముగా పనిచేసినది.

1. "The partial extension of freedom of press and publication in the congress provinces was reflected in an enormous growth of literature of political enlightenment.' —"India Today" by K. palme Dutt : P. 480 ; Pub : 1947.

ఇవి 1926 నుండి 1940 లోపుగా భారతదేశమునను విదేశములలోనుఉన్న రాజకీయ పరిస్థితులు. శ్రీశ్రీ వీనిచేత ప్రేరితుడై మార్క్సిస్టు విజ్ఞానపువెలుగులో 'మహాప్రస్థానం' రచించినాడు.

### 'మహాప్రస్థానం'పై మార్క్సిస్టు సిద్ధాంతముల ప్రభావము :

శ్రీశ్రీ 'దేశచరిత్రలు' అను గేయము గతితార్కిక భౌతికవాదమునకు నిలువుటద్దము వంటిది. దేశచరిత్రలలోని అంతర్యమును కుండ బ్రద్దలుకొట్టినట్లుగా ఈ గేయమున శ్రీశ్రీ వెల్లడించినాడు.

'ఏ దేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతిచరిత్ర సమస్తం
పరపీడనపరాయణత్వం'

అన్న పంక్తులు శ్రీశ్రీ గతితార్కికదృష్టికి నిదర్శనములు. బూర్జువాచరిత్రకారులు దేశచరిత్రను వివిధదేశములకుమధ్య జరిగిన యుద్ధముల పరంపరలుగా చిత్రించిరి. రాజుల దండయాత్రలు, రాజకీయవేత్తల చాకచక్యములు సేనానుల అసిధారాధాళధళ్యములు చరిత్రలలో ప్రధానముగా వర్ణింపబడినవి. ఒకదేశముపై మరియొకదేశపురాజు దండెత్తిపోవుటకు ఆరాజు రాజ్యవిస్తరణకాంక్షయో లేక అవినీతి దృక్పథమో కారణమని చరిత్రలలో వ్రాయబడినది. జాతిగౌరవమును, దేశప్రతిష్ఠను నిలుపుకొనుటకు కొందరు రాజులు శత్రురాజులతో పోరాడినట్లు చిత్రింపబడినది. చరిత్ర నీ దృక్పథముతో చూచుట మార్క్సిజము సమ్మతించదు.

'In the first place; it considers that the real science of history must deal with the peoples, and only with individuals in so far as they represent something much wider than themselves - some movement of the people.'[1]

శ్రీశ్రీ యీ దృక్పథమును

'ఏ యుద్ధం ఎందుకు జరిగెనో
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో
తారీఖులు దస్తావేజులు
ఇవి కాదోయ్ చరిత్రకర్థం'

1. What Is Marxism by Emile Burns: P. 2: Pub: 1959.

'నైలునదీ నాగరకతలో
సామాన్యుని జీవనమెట్టిది
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు'

అను చరణములలో స్పష్టముగా వెల్లడించినాడు.

బ్రిటనులో జమీందారీవర్గముపై ఉద్యమము లేవదీసి ఆ వర్గమును కూలద్రోసిన విప్లవ కారుడు క్రాంవెల్. ఈ తిరుగుబాటును చరిత్రకారులు రోమన్‌కాథలిక్ మతమునకు చెందిన మొదటిచార్లెస్ రాజునకు వ్యతిరేకముగా క్రాంవెల్ జరిపిన పోరాటముగా చిత్రించిరి. మార్క్సిజము దీనిని భిన్నదృక్పథముతో పరిశీలించును. క్రాంవెల్ కాలమునాడు అధికారములో నున్నది జమీందారీవర్గము. దానికి నిరసనగా పెట్టుబడిదారీవర్గము, చిన్నవర్తకులు, రైతులు మున్నగు వారి సాహాయ్యముతో చేసిన తిరుగుబాటే క్రాంవెల్ జరిపిన పోరాటము. చార్లెసురాజు వ్యక్తిగత విషయములతో ఈ తిరుగుబాటునకు ప్రసక్తిలేదు. మార్క్సిజము వ్యక్తుల యిష్టానిష్టములపై ఆధారపడక, వాని వెనుకగల శక్తులను పరిశీలించునది కావున క్రాంవెల్ చేసిన తిరుగుబాటును జమీందారీ వ్యవస్థపై పెట్టుబడిదారీవర్గము చేసిన పోరాటమని వ్యాఖ్యానించినది. ఈ అంశమును శ్రీశ్రీ

'ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగునపడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తేదాగని సత్యం'

అని హెచ్చరించినాడు. ఇంతటి చారిత్రకదృక్పథ మున్నందువలననే చెంగిజ్‌ఖాన్, తామర్లేన్, నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ, చివరకు సికందరువంటి ప్రపంచ విజేతనుగూడ నరహంతలని ఘోషించి నాడు. పారశీకులు, పెంఢారులు మున్నగు యుద్ధపిపాసువులు చేసిన ఘనకార్యము "కాలానికి కత్తుల వంతెన' కట్టుటయే యని నిష్కర్షగా ప్రకటించినాడు. రణరంగము కానిచోటు ప్రపంచ ములో ఎక్కడచూచినను దొరకదని, గతచరిత్రయంతయు రక్తముతో లేక కన్నీళ్ళతో తడిసిన దని హృదయవిదారకమైన నగ్నసత్యమును వెల్లడించినాడు. రక్తము రణరంగములో పాల్గొన్న యోధులది. కన్నీళ్ల ఇంటిలో నున్న ఆ యోధుల భార్యలవి ; బిడ్డలవి.

ఈ గేయములో శ్రీశ్రీ వర్గసంఘర్షణసిద్ధాంతమును అత్యంతస్పష్టముగా ప్రతిపాదించి నాడు. మార్క్సుఎంగెల్సులు ప్రకటించిన 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' లో ప్రథమవాక్యమే వర్గసంఘర్షణ సిద్ధాంతమును ప్రతిపాదించునది. ఆ సూత్రము, దాని వివరణము ఇట్లున్నవి.

**"The history of all hitherto existing society is the history of class struggles.**

Free man and slave, patrician and plebeian, cord and serf, guild-maker and journeyman, in a word, oppressor and oppressed stood in constant opposition to another. carried on an uninterrupted, now hidden, now open fight, a fight that each time ended either in a revolutionary reconstitution of society at large, or in the common ruin of the contending classes.''

మానవజాతి చరిత్రసమస్తము వర్గసంఘర్షణఫలితమేయన్న మార్క్సు సిద్ధాంత సారమును శ్రీశ్రీ

'పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను'

అని ఒక్కమాటలో ఆశ్చర్యకరమైన నైపుణితో అందించినాడు. ఋక్కులలోని సంగ్రహతను, సరళతను, గభీరతను పుణికిపుచ్చుకొన్న వాక్కులివి. ఈ పంక్తులలో చెప్పబడిన 'పరస్పరం సంఘర్షించిన శక్తులు' మార్క్సు వివరించినవే. ఉత్పత్తివిధానము సమాజములో వర్గములను కల్పించినది. చరిత్రలో ప్రతియుగమున కష్టించువా డొకడు, ఫలితము ననుభవించువాడొకడు. బానిసయుగములో బానిస, యజమాని. జమీందారీయుగములో రైతు, జమీందారు. పెట్టుబడిదారీయుగములో కార్మికుడు, పెట్టుబడిదారు. ఈ వర్గములు పరస్పరవిభిన్నగుణములు కలవి. కావున వానికి ఘర్షణ తప్పదని మార్క్సు ప్రవచనము. ఉత్పత్తిసాధనములను తన కైవసముచేసికొన్నది కావున పాలకవర్గ మెల్లప్పుడు పాలితవర్గమును పీడించుచునేయుండును. దీనినే శ్రీశ్రీ

'నరజాతిచరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకతినడం'

అని వ్యాఖ్యానించినాడు.

'బలవంతులు దుర్బలజాతిని
బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి'

అను పాదములలో బానిసయుగమున యజమానులు బానిసల రెక్కలు విరుగగొట్టిన ఉదంతమును, జమీందారీయుగమున భూస్వాములు రైతుల నోట్లుకొట్టి గద్దెలెక్కిన విషయమును సూత్రప్రాయముగా వెల్లడించినాడు.

'ధనవంతుల పన్నాగాల్లా
ఇంకానా! ఇకపై చెల్లవు'

అని పెట్టుబడిదారీవర్గమును ప్రతిఘటించినాడు.

పెట్టుబడిదారీవ్యవస్థ ఏ విధముగా జమీందారీవ్యవస్థ నణగార్చినదో, ఆ విధముగా దాని కెదురు తిరుగునని మార్క్సు చెప్పినాడు. పెట్టుబడిదారీవ్యవస్థ అభివృద్ధి అయినకొలది దానితో సమముగా కార్మికవ్యవస్థ బలపడక తప్పదు.[1] క్రమక్రమముగా 'విరోధ వైరుధ్య' సూత్రప్రకారముగా పెట్టుబడిదారీసమాజము నాశనోన్ముఖమైపోవుట తప్పదు. పెట్టుబడిదారీ వ్యవస్థలోని దోపిడీ విధానమును నిర్మూలించుటకు విశ్వశ్రామికులందరు ఏకముకావలెనని మార్క్సు ప్రబోధించినాడు. దీని ప్రభావముతో శ్రీశ్రీ

'చీనాలో రిక్షావాలా
చెక్ దేశపు గనిపనిమనిషీ
ఐర్లాండున ఓడకళాసీ
అణగారిన అర్తులందరూ—
హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో
ఖండాంతర నానాజాతులు
చారిత్రక యథార్థతత్వం
చాటిస్తారొకగొంతుకతో' (దేశచరిత్రలు)

అని విశ్వశ్రామికుల సమష్టిచైతన్యమును గూర్చి గానముచేసినాడు.

'ప్రతిజ్ఞ' అను గేయములో శ్రీశ్రీ శ్రామికవర్గచైతన్యమును అచ్చమైన మార్క్సిస్టు దృక్పథముతో ప్రకటించినాడు. కార్మికుల శ్రమశక్తిని దోచుకొను పెట్టుబడిదారీవ్యవస్థను తీవ్రముగా నిరసించినాడు. ఆదిమకమ్యూనిస్టుసమాజములో వర్గవిభజనలేదు. అందరు కలిసి ప్రోగుచేసిన ఆహారమును సమష్టిగా అనుభవించెడివారు. బానిసయుగములో వర్గభేదము తలయెత్తినది. జమీందారీ యుగములో ఉత్పత్తివిధానము వ్యక్తిగతమైపోయినది. ఈ వ్యవస్థలో స్థానికావసరములకు మాత్రమే ఉత్పత్తిజరిగెడిది. ఈ విధానమునుండి మొలకెత్తిన పెట్టుబడిదారీ విధానములో లాభముకొరకు ఉత్పత్తిచేయుట ప్రారంభమైనది. ఉత్పత్తి పరికరములు కొందరికి స్వాధీనమైనవి. ఈ యజమానులు పెట్టుబడిదారులు. వీరి మగ్గముల ముందు, రాట్నములముందు యంత్రముల ముందు నిల్చుండిపనిచేయువారు కార్మికులు. జమీందారీ సమాజములో రైతులు పొలము సాగుచేసి పంటపండించి, అందులో కొంతభాగముమాత్రమే జమీందారుకిచ్చి మిగిలిన

1. 'In proportion as the burgeoisie, i-e, capital, is developed, in same proportion is the proletariat, the modern working class, developed—a class of labourers, who live only so lo.g as they find work, and who find work only so long as their labour increases capital.' —Manifesto of the Communist Party.

దెంతైనను తామే అనుభవించెడివారు. పెట్టుబడిదారీవ్యవస్థలో ఇది తలక్రిందులైనది. కార్మికులు నిర్ణీతకాలములో ఎంతసరు కుత్పత్తిచేసినను వారికి ప్రయోజనములేదు. వారికి వారి 'కూలిడబ్బులు' మాత్రము వచ్చును. వస్తువుల అమ్మకముమీద యజమానికి వచ్చిన లాభములో కార్మికునికి భాగములేదు. అనగా యజమాని కార్మికుని కిచ్చెడి ఫలితముకన్న వారి శ్రమశక్తిని ఎన్నోరెట్లుగా వినియోగించుకొని, ఆ శ్రమశక్తి ద్వారా ఉత్పత్తి అధికముచేయించి, ఎక్కువలాభములు గుంజుచున్నాడని తేలినది. దీనినే మార్క్సు దోపిడి (Exploitation) అన్నాడు. పెట్టుబడిదారీ సమాజమున ఈ దోపిడి అన్నిరంగములలో నున్నదని, కార్మికులలో వర్గచైతన్యమునకు వారు సుసంఘటితులై పెట్టుబడిదారీవర్గమునకు విరుద్ధముగా విప్లవము లేవదీసెదరని, అది అవసరమని మార్క్సు భాష్యము చెప్పినాడు దీనినే లెనిన్ ఇట్లనెను.

"The exploited class need political rule in order completely to abolish all exploitation, i.e., in the interests of the vast majority of the people, and against the insignificant minority consisting of the modern slave-owners–the land lords and capitalists."[1]

మార్క్సు లెనిన్లు ప్రవచించిన ఈ సూత్రములలోని శ్రమశక్తి విలువను శ్రీశ్రీ గమనించినాడు. పెట్టుబడిదారీసమాజములో శ్రమశక్తిని దోచుకొనుచున్న వైనము పసికట్టి

'ఘర్మజలానికి, ధర్మజలానికి
ఖరీదుకట్టే షరాబులేడోయ్' (ప్రతిజ్ఞ)

అని నిర్వేదము ప్రకటించినాడు. ఈ నిర్వేదము నుండియే ఆశావాద ముదయించినది.

'శ్రమ నిష్ఫలమై, జని నిష్ఠురమై
నూతిని గోతిని వెదకేవాళ్ళు-
అనేకులింకా అభాగ్యులంతా
అనాథులంతా, అశాంతులంతా
దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో
విప్లవశంఖం వినిపిస్తారోయ్'

అని లెనిన్ చెప్పిన భాష్యమును కవితామయమొనర్చినాడు.

మార్క్సిస్టు దృక్పథములో సాహిత్యపరమావధి శ్రామికవర్గచైతన్యమును చిత్రించుటయే. కళలు, కవిత్వము, తత్త్వము శ్రామికుల సుఖదుఃఖములను, వారి ఆశయములను చిత్రించుటకే

1. The State and Revolution : Lenin : P. 89.
IV Russian Edition : Foreign Language Publishing House.

అంకితముకావలెనని మార్క్సిస్టుల దృఢ నిశ్చయము. శ్రీశ్రీ ఈ దృష్టిని సమగ్రముగా ఆకళించుకొన్నాడు.

'నాలోకదలే నవ్యకవిత్వం
కార్మికలోకపు కల్యాణానికి
శ్రామికలోకపు సౌభాగ్యానికి' (ప్రతిజ్ఞ)

సమర్పణముచేతునని శపథమొనర్చినాడు. అంతేకాదు.

'కమ్మరికొలిమీ, కుమ్మరిచక్రం
జాలరిపగ్గం సాలెలమగ్గం
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్తచిహ్నాలు' (ప్రతిజ్ఞ)

తనగీతికి భావము, భాగ్యము, ప్రాణము, ప్రణవమని ఉద్ఘాటించినాడు. ఈ చిహ్నాలు సమస్త శ్రామికవర్గమునకు సంబంధించినవి. కమ్మరికొలిమి, కుమ్మరిచక్రము మున్నగునవి తన కవితావస్తువులని చెప్పుకొన్నాడు. అనగా శ్రామికుడే తన కావ్యనాయకుడని అర్థము. సోవియట్ రచయిత మాక్జింగోర్కీ 1934 ఆగస్టు 17వ తేదీన మాస్కోలో జరిగిన ప్రథమ సోవియట్ రచయితల మహాసభలో ఈ విషయమునే స్పష్టపరిచినాడు.

'We must make labour the principal hero of our books. i.e., man as organized by labour process, one who, in our country, is equipped with the might of modern techniques, and is, in his turn, making labour easier and more productive, and raising it to the level of an art.'[2]

గోర్కీవాక్యములలోని అభిప్రాయమునకు శ్రీశ్రీ గేయభాగము లక్ష్యము.

బూర్జువానాగరకత వాస్తవికతలో సౌందర్యము చూడలేదని, అది ఊహాకల్పితవిషయము లలో, అతీంద్రియస్వప్నములలో మాత్రమే సౌందర్యమున్నట్లు భావించునని మార్క్సిస్టులు విమర్శింతురు. మార్క్సిస్టు దృక్పథమునకు ఇరువదవ శతాబ్దిలో ప్రముఖభాష్యకారుడైన క్రిస్టొఫర్ కాడ్వెల్, బూర్జువాసమాజమున శ్రమకు సంబంధించిన సౌందర్యమునకు విలువలేదని, ధనమే ఆ సమాజమున సుందరాతిసుందరవస్తువని విమర్శించినాడు.[2] సమాజము యొక్క సుశిక్షితమైన

1. 'Maxim Gorky on Literature' :
Foreign Language Publishing House (Moscow) : P. 264.
2. 'Cash is the music of labour in bourgeois society. Cash achieves objective beauty. Labour in itself becomes increasingly distasteful and irksome, and cash increasingly beautiful and desirable.'
—Further Studies In Dying Culture : P. 108 : Pub : 1950.

గతిలోనే సౌందర్య మిమిడియున్నదని, ఆగతి శ్రమవలననే సాధ్యమని, కావున శ్రమయే సౌందర్యమని కాడ్వెల్ స్పష్టపరిచెను.

'Beauty, then arises from the social ordering of the effective elements in socially known things. It arises from the labour process'.[1].

ఈ మార్క్సిస్టు దృక్పథమును శ్రీశ్రీ యేనాడో అక్షరబద్ధమొనర్చినాడు.

'శ్రమైకజీవనసౌందర్యానికి
సమానమైనది లేనేలేదని' (ప్రతిజ్ఞ)

ఉద్ఘోషించి, 'యథార్థజీవిత యథార్థదృశ్యం పునాదిగా' జనించబోవు భావివేదములను జగత్తు కందింతునని ప్రతిజ్ఞచేసినాడు. శ్రీశ్రీ మార్క్సిజము నెంత లోతుగా అధ్యయనముచేసినాడో ఈ ఉదాహరణములను బట్టి స్పష్టమగును.

'దేశచరిత్రలు' 'ప్రతిజ్ఞ' యను రెండుగేయములద్వారా శ్రీశ్రీపై గల మార్క్సిజము ప్రభావమును విశదీకరింప ప్రయత్నించితిని. ఇవియేకాక 'మహాప్రస్థానం', 'అవతారం', 'నవ కవిత', 'ఋక్కులు', 'నీడలు', 'పేదలు', 'వాడు', 'వ్యత్యాసం', 'గర్జించు రష్యా' మున్నగు నవి కూడ మార్క్సిస్టుతత్త్వమును జీర్ణించుకొన్న గేయములే.

రష్యాలో నెలకొల్పబడిన శ్రామికవర్గప్రభుత్వముచేత, రష్యాసాధించిన కార్మికస్వర్గము చేత ప్రభావితమైనగేయము 'మహాప్రస్థానం'. తరతరముల దాస్యభరముతో క్రుంగిపోవుచున్న ప్రపంచపీడితప్రజల కిచ్చిన ఆశాసందేశమది. 'అవతారం' పాలకులకు వ్యతిరేకముగా పాలితులు చేసిన తిరుగుబాటును సూచించు వ్యంగ్యరచన.

'కనకదుర్గా చండసింహం జూలుదులిపి, ఆవులించింది
ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది'

మున్నగు పాదములలో కనకదుర్గఅధిరోహించు సింహమామెపై తిరుగుబాటుచేసినదని, ఇంద్రుని ఐరావతము ఆయననే సవాలుచేసినదని సూచింపబడినది. ఇట్లే యముడు, సూర్యుడు, శివుడు మున్నగుదేవత లెక్కువాహనములు వారిపైన తిరుగుబాటుచేసినట్లు ధ్వనింపబడినది. ఈ తిరుగు బాటు విలయమునకు, విప్లవమునకు సంకేతము. ప్రాతవ్యవస్థ శిథిలమై క్రొత్తవ్యవస్థను ప్రస వించుచున్న మార్క్సు ప్రవచనము ఈ గేయములో ప్రపంచింపబడినది. 'పుడమితల్లికి పురుటి నొప్పులు, క్రొత్తసృష్టిని స్ఫురింపించాయి'అను చివరిపంక్తి పెట్టుబడిదారీవ్యవస్థ విధ్వంసమై దానిస్థానే శ్రామికవర్గము తలయెత్తునన్న మార్క్సిస్టు సూత్రమును బోధించుచున్నది.

సింధూరం, రక్తచందనం మున్నగునవి నవకవనమునకు కావలెనని 'నవకవిత' లో శ్రీశ్రీ ప్రకటించినాడు. అతడిచ్చిన పట్టికలోని సింధూరము, రక్తచందనము, పులిచంపిన

1. **Further Studies In Dying Culture : P. 108 : Pub : 1950.**

లేడినెత్తురు, ఎర్రనిజెండా, కాళికనాలిక, రుద్రాలికనయనజ్వాలిక, ఎర్రనివస్తువులు, మార్క్సిజము నకు వారసులైన కమ్యూనిస్టుల జెండా ఎర్రనిది. పైగా ఎర్రరంగు విప్లవచైతన్యమునకు సంకేతము. అందుకే ఈ వస్తువులన్నియు నవ్యకవిత్వమున కవసరమని శ్రీశ్రీ అనెను. తర్వాత ఘాటెక్కిన గంధకధూమము, రగులుకొను రాక్షసిబొగ్గు, బుక్కాగుండా, విద్యుత్తేజము మున్నగునవి ఒకవరుసలో; రాంబందుల రెక్కలచప్పుడు, పొగగొట్టపు భూంకారధ్వని, ఝుంఝూ నిలషడ్జధ్వానము మున్నగున వింకొకవరుసలో పేర్కొని ఇవికూడ నవకవనమునకు కావలెనని తెలిపినాడు. ఆ తర్వాత

'కదలేదీ కదలించేదీ
మారేదీ మార్పించేదీ'

కావలెనన్నాడు. నవకవిత్వమునకు గంధకధూమము మున్నగున వేల కావలయును ? రాంబందుల రెక్కల చప్పుడు మున్నగున వెందుకు ? ఎందుకనగా 'ఘాటెక్కిన గంధకధూమం', 'పోటెత్తిన సప్తసముద్రాల్' 'కదలేవి'. మరి రెండవవరుసలోని 'రాంబందుల రెక్కల చప్పుడు' మొదలు కొని 'ఝుంఝూనిలషడ్జధ్వానం' వరకు 'కదలించేవి'. పాలకవర్గమునకు వ్యతిరేకముగా పాలితులను పీడితులను నడిపించుటకు కవిత్వ మొకసాధనమని మార్క్సిస్టులు విశ్వసింతురు. అందుకే శ్రీశ్రీ నవకవనమునకు 'కదలేదీ, కదలించేదీ' కావలెనని, ఆ గుణములుగల వస్తువులపట్టిక నందించినాడు.

'కుక్కలు' అన్న గేయములో కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల, రొట్టెముక్క, అరటి తొక్క మున్నగునవి కవితామయములని ప్రబోధించినాడు కవితావేశమున్నచో హీనమని పల్వురు భావించు పైవస్తువులలో శోభాలేశము లభింపదాయని ప్రశ్నించినాడు. ఇది మార్క్సిస్టుల వాస్తవికతావాదము (Realism) నకు సంబంధించిన సిద్ధాంతము. అప్సరసలు, స్వర్గము, నందనవనము మున్నగు అతీంద్రియవస్తువులు, పూలు, సెలయేళ్లు, మబ్బులు మున్నగు హృద యంగమమైన వస్తువులేకాక జుగుప్సావహమైన వస్తువులుగూడ కావ్యవస్తువులుగా స్వీకరించుటకు తగినవని ఈ దృక్పథము బోధించును. వాస్తవికత పేరున జీవితములోను ప్రకృతిలోను ఉన్న దుర్గంధమును గూర్చి మాత్రమే వ్రాసి, చీకట్లను మాత్రమే చిత్రించి చేతులు దులుపుకొనుట మార్క్సిజమునకు సమ్మతముకాదు. అది వాస్తవికతావాద లక్ష్యముగూడ కాదు. శ్రీశ్రీ వాస్తవి కతావాదమునకు సంబంధించినకవి. కుక్కపిల్ల, అగ్గిపుల్ల మున్నగువానిని గూడ 'కళ్ళుంటూ ఉంటే చూసి' వ్రాసినచో అవి ఆనందదాయకములుగా, రసమయములుగా మారునని ఇతడు ఉల్లేఖించినాడు.[1]

1. ధనంజయుడు దశరూపకమున వ్రాసిన క్రింది శ్లోకమున కిది సన్నిహితముగా నున్నది.

'రమ్యం జుగుప్సిత ముదార మథాపినీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వాప్యవస్తు కవిభావకభావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతిలోకే'.

'నీడలు'లో నీడలను 'యుగయుగాల దోపిడిలో, నరనరాలరాపిడిలో' 'బిక్కచిక్కి బిక్కచచ్చి'న పేదవారి బ్రతుకుజాడలకు సంకేతములుగా చిత్రించినాడు. 'పేదలు'లో పేదల బ్రతుకుల లోని దైన్యమును దయామయముగా విలోకించిచూపినాడు. 'వాడు'అను గేయములో 'శ్రమశక్తి'ని దోచుకొన్న పెట్టుబడిదారు చేయు దౌర్జన్యము నుల్లేఖించినాడు. 'వ్యత్యాసం'లో భాగ్యవంతులకు, నిర్భాగ్యులకు గల వ్యత్యాసమును గీటుగీసి చూపినాడు. పాలకవర్గము తన స్వార్థమును కాపాడు కొనుటకు 'న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు' నిల్పికొన్నదని, పాలకుల జీవితము 'వడ్డించిన విస్తరి'యని, పీడితులకు, నిర్భాగ్యులకు అలజడియే జీవితమని, ఆందోళనయే ఊపిరని, తిరుగుబాటే వేదాంతమని, పాలక పాలితవర్గముల మధ్యగల వ్యత్యాస మును సూత్రప్రాయముగా తెలిపినాడు. 'జగన్నాథుని రథచక్రాలు'లో జగత్తున జరుగుచున్న అన్యాయముల నణచివేయుటకు విప్లవశక్తి అవతరించుచున్నదని హెచ్చరించినాడు. పతితులకు; భ్రష్టులకు, బాధాసర్పదష్టులకు దుర్దినములు తొలగిపోవగా, స్వాతంత్ర్యము, సౌహార్దము, సమ భావము పునాదులుగా నూతనలోక ముదయించునని ఆశాసంగీత మాలపించినాడు.

ఈ విధముగా 'మహాప్రస్థానం'లోని కావ్యఖండికలలో సగమునకుపైగా మార్క్సిజమును జీర్ణించుకొన్న రచనలు. వీనిలో కొన్నికొన్ని గేయములు మార్క్సిస్టుతత్త్వమునకు భాష్యముల వంటివి. ముఖ్యముగా 'దేశచరిత్రలు' అను గేయము గతితార్కికచారిత్రకభౌతికవాదమునకు, 'ప్రతిజ్ఞ' 'ప్రొలిటేరియట్' కవిత్వమునకు, 'మహాప్రస్థానం' ప్రబోధకవిత్వమునకు అక్షరచేతన ములు. ఇక శ్రీశ్రీలోని మిగిలిన కవితాగుణముల గురించి వివరింతును.

**వస్తునవ్యత :**

మార్క్సిస్టుదృక్పథముతో చరిత్రను పర్యాలోకించుట, మానవసమాజమును పరిశీలించుట, శ్రామికవర్గచైతన్యమునుగూర్చి గానముచేయుట శ్రీశ్రీ వస్తునవ్యతలో గణనీయమైన విషయములు. 'కవితా ఓకవితా'లో పేర్కొన్న కాలువనీళ్ళలో జారిపడిన త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, 'కడుపు దహించుకపోయే పడుపుకత్తె రాక్షసరతిలో అర్ధనిమీలితనేత్రాల భయంకరబాధల పాటల పల్లవి', 'ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం' మున్నగునవి పరిస్థితుల ఇనుపతెరల వెనుక నలిగిపోవుచున్న జీవితసత్యములు. ఇట్టివానిని కవితావస్తువులుగా చేసికొని శ్రీశ్రీ అపూర్వమైన ప్రయోక్త అనిపించుకొన్నాడు. 'బాటసారి' లో 'కూటికోసం, కూలికోసం, పట్టణంలో బ్రదుకుదామని' తల్లిమాటలు చెవిని పెట్టక బయలుదేరిన బాటసారి నిస్సహాయస్థితిలో పొందిన దయనీయమైన మృత్యువును వర్ణించినాడు. 'భిక్షువర్షీయసి'లో ఆరినకుంపటివంటి కాంతిలేని గాజుకన్నులముసలిది, ఆ ముసలియవ్వ ప్రక్క ఎముకముక్క కొరుకు కుక్క, ఈగను గబుక్కున అందుకొను తొండ, ఎంగిలాకు కవితావస్తువులు. 'ఉన్మాది'లో 'బొమికలన్నీ ప్రోవు పట్టిన కుర్రవాడు' - 'వెర్రివాడు' కావ్యనాయకుడు. 'బుద్ధిమంతులు' చేసిన అన్యాయఫలితముగా వెర్రియెత్తిన కుర్రవాడితడు. 'సంధ్యాసమస్యలు'లో విద్యార్థి, ఉద్యోగి, పేదసంసారి కావ్య నాయకులు. 'శైశవగీతి' బాల్యపు చెరగినపదముల చిహ్నములకొరకు కువ్వికూరుగేయము.

'మానవుడా' అనునది ప్రపంచమానవుని విశ్వరూపమును ప్రదర్శించుగేయము. 'మిథ్యావాది' జగత్తంత మిథ్యయను వేదాంతులను మెత్తగా వెక్కిరించు రచన. 'జ్వాలాతోరణం', 'అవతారం' జగత్ప్రళయమును, నూతనసృష్టిని ధ్వన్యాత్మకముగా చిత్రించిన రచనలు. 'జయభేరి'లో ఆశావాదియైన వ్యక్తికి సాంఘికచైతన్యములోగల భాగస్వామ్యము చిత్రింపబడినది. ఈ విధముగా శ్రీశ్రీ గ్రహించిన కవితావస్తువులన్నియు అంతకుముందెవ్వరు స్పృశించనివి.

**భావనవ్యత :**

శ్రీశ్రీ గేయములన్నియు సంవిధానచాతుర్యము, శబ్దప్రయోగచణత్వము, భావనాబలము, ఛందఃపటిమ పెనవేసికొన్న కళాఖండములు. వస్తువును తీర్చిదిద్దుటలో ఈ నాలుగు శక్తులు విడదీయరానిరీతిగా ఉన్మీలనము పొందినవి. అందువలన శ్రీశ్రీ భావచిత్రములను విడిగా తీసి చూపుట సాధ్యముకాదు. కొన్ని గేయములలో మాత్రము మిగిలిన శక్తుల ప్రమేయమంతగాలేని స్వచ్ఛమైన భావనాశక్తి ప్రజ్వరిల్లినది. 'ఒకరాత్రి'అన్న గేయమిట్టిదే. బహుళపంచమినాటి వెన్నెల గగనమంతయు నిండి పొగవలె క్రమ్మి కవిని భయపెట్టినది. ఆకాశపుఎడారిలో ఇసుక తుపాను రేగినది. అట్టి భయానకస్థితిలో కొండ 'కరికళేబరములా' కనిపించినది. కరికి గిరికిగల సాదృశ్యమును పురస్కరించుకొని కొండను కరివలెకాక కరికళేబరమువలె నున్నదని భావించుట చక్కని భావనాశక్తికి నిదర్శనము. ఈ గేయములోనే ఉన్న

'ఆకాశపుఎడారిలో కాళ్లుతెగిన
ఒంటరి ఒంటెలాగుంది జాబిలి'

అన్న ఊహాచిత్రము అతినవ్యమైనది. 'ఖండశశి'లో విరహతాపమనుభవించుచున్న శ్రీశ్రీ కి నెలవంక 'వంపుదేరిన కత్తివలె' కనిపించినది. అప్పటిస్థితిలో దిగులుతో పొగిలిపోవుచున్న కవి మనస్సునకు ఆకాశ మెడారివలె, అందులో బహుళపంచమినాటి చంద్రుడు ఒంటరి ఒంటెవలె కదలక మెదలక కనిపింపసాగినవి.

'బాటసారి'లో దిక్కులేని బాటసారి గుండెమీద 'రాత్రి నల్లనిరాతి పోలిక' కూర్చున్నదని శ్రీశ్రీ వర్ణించినాడు. రాత్రి ఘనపదార్థముకాదు. స్పర్శనయోగ్యముకాదు. కాని శిరోవేదనతో దీనాతిదీనస్థితిలో ఎక్కడో పడియున్న నిస్సహాయుడైన బాటసారికి రాత్రి యెంత బాధాకరముగా పరిణమించినదో శ్రీశ్రీ ఈ ఉపమానము ద్వారా వ్యక్తమొనర్చినాడు. 'ఆకాశదీపం' అన్న ఖండిక గూడ శ్రీశ్రీ భావనాశక్తికి పటువైన నిదర్శనము. సాయంకాలము ఒకానొకగదిలో జరిగిన ఒక దురదృష్టజీవి మరణోదంత మీ గేయములోని వస్తువు. సాయంకాల మారున్నరకు 'గది లోపల చినుకులవలె చీక'ట్లట. అప్పుడప్పుడే ముసురుకొనుచున్న మొలకచీకట్లను చినుకులతో పోల్చుట విచిత్రభావుకతకు నిదర్శనము. ఆ గదిలోని దీపము

'చీకటిబోనులో సింహములా నిల్చున్నది
కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులాగున్నది.'

గదిలో బందీకృతమైనచీకటి బోనువంటిది. అందులోని దీపము సింహమువంటిది. దీపజ్యోతికి చీకటిని చెండాడు సమర్థతయున్నది. కాని ప్రస్తుతమది బోనులోని సింహమువలె నిస్సహాయ స్థితిలో నున్నది. అనగా చివరి చమురుచుక్కలను పీల్చుచున్నది. ఈ ఉపమానము మౌలిక ప్రజ్ఞాజనితము. కత్తిగంటుమీది నెత్తుటిచుక్కవలె నున్నది చీకటి. కత్తిని నల్లగానున్నట్లు చెప్పుట కవిసమయము. చీకటిలోని దీపము నిట్లుపోల్చుటలో చక్కని యౌచిత్యమున్నది.

శ్రీశ్రీ నిసర్గ రమణీయమైన భావనాశక్తికి 'శైశవగీతి' పతాకప్రాయమైన గేయము. ఇందులో శైశవదశవంటి కృత్రిమతారహితమైన భావన, శైలి ప్రయోగింపబడినవి. దీనిలో గ్రీష్మమును వర్ణించునప్పుడు 'కంచువృషభముల అగ్నిశ్వాసం క్రక్కే గ్రీష్మ'మనుట ప్రగాఢభావనాపటిమకు దిక్సూచి, కంచుతో చేయబడిన వృషభములు గ్రీష్మతాపముతో క్రాగి పోవును. ఆ వృషభముల నోళ్ళనుండి, ముకుపుటములనుండి పీచుగాలి ప్రచండతాపభరితముగా నుండును. 'అగ్నిశ్వాస' మను పదచిత్రములో ఇంతటిభావన మిళితమైయున్నది. ఇవికాక 'జయభేరి', 'నీదలు' మున్నగునవి శ్రీశ్రీ భావనవ్యతకు మచ్చుతునుకలు.

**శబ్దశక్తి :**

'మహాప్రస్థానం'లోని గేయములలో చాలభాగము వీరరౌద్రరసభరితములు. అందుచేత శ్రీశ్రీ ఆ రసముల కనుగుణమైన ఓజస్సుగల శబ్దముల నేరుకొన్నాడు. భావకవిత్వములో దేశాభిమానకవిత్వములో తప్ప మిగిలిన శాఖలలో-పూలరేకులవంటి, పాలమీగడలవంటి శబ్దములే ప్రయుక్తములైనవి. క్రమక్రమముగా భావకవుల చేతులలో బడి శబ్దము మెత్తబడిపోయినది. స్వల్పప్రతిభులైన కొందరివలన శబ్దము 'పోటోనీళ్ళకుం బల్చనై' యన్నంతగా దిగజారి పోయినది. తెలుగు ప్రబంధములను - అందులో శ్రీనాథుని కావ్యములను, పాండురంగ మాహాత్మ్యము మున్నగు ప్రౌఢకావ్యములను-కూలంకషముగా పఠించుటవలన శ్రీశ్రీ కి శబ్దముపై అమోఘమైన ప్రభుత్వమేర్పడినది. పద్యరచనలో అప్పటికే సాధనచేసినందున చక్కని ధారా శక్తి యలవడినది. ఈ ఉభయశక్తుల బలముతో శ్రీశ్రీ అనంత శబ్దభాండాగారము నుండి జవము, జీవము, కండ, గుండెగలశబ్దముల నేరికొని వానిచేత కసరత్తులుచేయించినాడు; రస వృష్టులు కురియించినాడు. రమణారెడ్డిగా రన్నట్లుగా శ్రీశ్రీ చేతిచలువతో 'శబ్దాన్ని ఆశ్రయించిన స్త్రీత్వం వైదొలగి, బృహన్నల గాండీవిగా పరిణమించినట్లు శబ్దానికి బటువూ దిటవూ ఏర్పడినవి.'[1]

శబ్దముల నేరుకొనుటలో శ్రీశ్రీ గొప్ప చాకచక్యము చూపినాడు. ముఖ్యముగా అంత్య ప్రాసలను, అంతఃప్రాసలను కూర్చుటలోనే శ్రీశ్రీ శక్తి నిక్షిప్తమైయున్నది. అంతఃప్రాసలనగా అనుప్రాసలే. శ్రీశ్రీ గేయములలో ఈ రెండురకముల ప్రాసలు ఎడనెడలేనివి లేవు. ఒకొ్కక్క

1. ఆంధ్రఅభ్యుదయకవిత్వ సింహావలోకనం (వ్యాసం) : కె. వి. రమణారెడ్డి : ఢిల్లీ ఆంధ్రసంఘం రజతోత్సవసంచిక : 1960.

మాటు 3, 4 పాదముల పాటు ప్రాసను పాటించి శ్రీశ్రీ శబ్దముల నబ్దములవలె గర్జింప జేసినాడు.[1]

'కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం.' (మహాప్రస్థానం)

'పొలాలనన్నీ
హలాలదున్నీ
ఇలాతలంలో హేమంపిండగ.' (ప్రతిజ్ఞ)

కొన్నిచోట్ల ఆదిప్రాసలతో పాటు, బహుళముగా 'అంతఃప్రాస'లను ప్రయోగించినాడు.

'నా విసరినరసవిస్మృమరకుసుమపరాగం' (కవితా ఓ కవితా)

'దారుణమారణదానవభాషలు
ఫేరవభైరవభీకరఘోషలు' (కేక)

——హేమంతవసంత
ధ్వాంతకాంతివిక్రాంతివేళలో.' (జ్వాలాతోరణం)

అంత్యప్రాసప్రయోగదక్షతకు కొన్ని ఉదాహరణములు.

'స్మరిస్తే పద్యం
అరిస్తే వాద్యం
అనలవేదికముందు అస్రనై వేద్యం.' (ఐ)

'విషంక్రక్కే భుజంగాలో
కదంత్రొక్కే తురంగాలో
మదంపట్టిన మాతంగాలో' (స్విన్‌బర్న్‌కవికి)

'సఖులవలన పరిచ్యుతులు
జనులవలన తిరస్కృతులు
సంఘానికి బహిష్కృతులు.' (జగన్నాథుని రథచక్రాలు)

2. శ్రీశ్రీ శబ్దశక్తికి చూపబడిన నిదర్శనములను పోలినవి మన ప్రాచీనకావ్యములలో లేకపోలేదు. వానిని గేయచ్ఛందస్సున నవ్యభావ పకటనమునకు ఉపయోగించుకొనుటలోనే శ్రీశ్రీకి ప్రత్యేకత కలదు.

ఈ మూడురకములైన ప్రాసచమత్కృతులతోపాటు శ్రీశ్రీ ఇంక కొన్ని శబ్దక్రీడ లాడినాడు. ఆ క్రీడలు మూడురకములు.

(1) ప్రతిశబ్దము ఒకేరకమైన అక్షరముతో ప్రారంభించి వెంటవెంట ప్రయోగించుట. ఇది ఇంగ్లీషులో alliteration పద్ధతికి చెందినది.

'ప్రదీప్తకీలా ప్రవాళమాలా
ప్రపంచవేలా ప్రసారములలో' (జ్వాలాతోరణం)

'దుర్హతి, దుర్గతి
దుర్మతి, దుర్మృతి' (పరాజితులు)

'సంరంభం, సంక్షోభం,
సమ్మర్దన, సంఘర్షణ.' (జగన్నాథుని రథచక్రాలు)

(2) కించిదర్థభేదముతో ఒకే తూకమున్న పదములను గుప్పించుట.

'నా వినుతించే
నా విరుతించే' (ప్రతిజ్ఞ)

'సమర్పణంగా
సమర్చనంగా' (ప్రతిజ్ఞ)

'తల్లడిల్లే
కెళ్ళగిల్లే' (బాటసారి)

(3) అర్థదృష్టితో కాక శబ్దప్రీతితో కొన్ని జంటపదముల నుపయోగించుట.

'సంచరిస్తూ, సంచలిస్తూ' (బాటసారి)

'పరిక్లమిస్తూ, పరిప్లవిస్తూ' (ప్రతిజ్ఞ)

'చండచండం, తీవ్రతీవ్రం' (బాటసారి)

## శ్రీశ్రీ ఛందోరీతులు :

'ప్రభవ' సంపుటిలోని పద్యములను పరిశీలించినచో శ్రీశ్రీకి గల వృత్తరచనాచణత్వము స్పష్టమగును. జాతులలో గీతపద్యము తనకు ప్రియమైనదని శ్రీశ్రీ యే స్వయముగా చెప్పుకొన్నాడు. 'ప్రభవ' ప్రచురణ తర్వాత శ్రీశ్రీ వృత్తరచనాసన్యాసముచేసి మాత్రాచ్ఛందస్సులలో, వచనగీతములలో విలువైన ప్రయోగములుచేసినాడు. మాత్రాచ్ఛందస్సులను అప్పకవీ

యములోని రగడభేదములనుండియే కాక ప్రాచీనసంస్కృత గేయముల ప్రభావముతో మలచుకొన్నాడు.

'ఏముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి
నెత్తురుమండే శక్తులునిండే
సైనికులారా రారండి' (మహాప్రస్థానం)

అను గేయభాగములోని 'అంతఃప్రాసలు, అంత్యప్రాసలు' గీతగోవిందములోని

'ముఖరమధీరం, త్యజమంజీరం
రిపుమివ కేళిషులోలం
చలసఖికుంజం సతిమిరపుంజం
శీలయ నీలనిచోళం'

అను పంక్తుల సంవాదముతో ఉద్భవించినవని శ్రీశ్రీయే చెప్పుకొన్నాడు.[1]

'మరో ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది'

అను గేయభాగము శంకరాచార్యుల

'భజగోవిందం భజగోవిందం
గోవిందంభజ మూఢమతే'

అను గేయముయొక్క స్ఫురణముతో వెలువడిన ఛందోరీతియని వ్యక్తపరిచినాడు. ఒకే పద సముచ్చయమును ముమ్మారు పలికించుటలో, నడకలో, పై రెంటికి సన్నిహితసాదృశ్యమున్నది. పాశ్చాత్యులభివృద్ధిపరిచిన Semantics అను సంవిధానమును తాను బాగుగా పరిశీలించితినని Semantics అనగా కవిత్వముచేయు సవ్వడియని శ్రీశ్రీ అభిప్రాయపడినాడు.[2] ఇది తిక్కన వ్రాసిన

'త్రిభువనశుకదృఢపంజర
విభవమహితునకు, సమస్తవిష్టపనిర్మో
కభుజంగపతికి— —'

అను కందపద్యములో ఏ విధముగా ధ్వనించునో తాను వ్రాసిన

'ఆ చెలరేగిన కలగాపులగపు
విలయావర్తపు బలవత్ఝురవత్పరివర్తనలో' (కవితా ఓ కవితా)

---

1. 2. 'కృత్యాద్యవస్థ'నుండి.

అను గణబద్ధముకాని పాదములోనైతమట్లే ధ్వనించునని శ్రీశ్రీ అన్నాడు.[1]

శ్రీశ్రీ వ్రాసిన మాత్రాచ్ఛందస్సులను లోతుగా పరిశీలించినచో వానిలో కొన్ని భాగములపై తెలుగు కావ్యములలోని ఆశ్వాసాంతపద్యముల ప్రభావ మెంత సాంద్రముగనున్నదో స్పష్టమగును. ఆశ్వాసాంతపద్యములలో భుజంగప్రయాతము, పృథ్వి, తోటకము, మాలిని, కవిరాజ విరాజితము మున్నగు వృత్తములు ప్రాయికముగా కన్పించును. ఇవి మత్తేభశార్దూలములవంటివి కావు. అక్షరగణనియమముతో కదనుద్రొక్కు అచ్చమైన గేయములు. స్థూలముగా చూచినచో ఇవి మాత్రాచ్ఛందస్సులే యనిపించును శ్రీశ్రీ గేయములపై ఈ వృత్తముల ప్రభావమును సంగ్రహముగా తెలుపుదును.

'పౌలాలనన్నీ
హాలాలదున్నీ
ఇలాతలంలో హేమంపిండగ' (ప్రతిజ్ఞ)

అను చతురస్రగతిలోని గేయపాదములు

"సుధీమధురవాక్
సుధాసుముఖినా
గమాంబాసుతా —"[2]

అను పృథ్వీవృత్తము నడకలను పుణికిపుచ్చుకొన్నవి. ఇందులోని చమత్కారము పౌలాల, హాలాలవంటి విలోమగణముల పేర్పులోనున్నది.

'దారుణమారణదానవభాషలు
ఫేరవభైరవభీకరఘోషలు' (కేక)

అను గేయపాదములు

'త్వరితాధరితానిలవాజినట
త్వరజోరురజోభరగూఢరవి —'[3]

అను తోటకవృత్తపాదముల గమకమును స్ఫురింపజేయును.

'హింసనచణ
ధ్వంసరచన
ధ్వంసనచణ
హింసరచన' (జగన్నాథుని రథచక్రాలు)

---

1. Semantics అనగా కవిత్వముచేయు నవ్వడియను శ్రీశ్రీ అభిప్రాయము రూఢమైనదికాదు. Semantics న కర్థము. అర్థపరిణామశాస్త్రము. 'A science of the development of the meaning of words'. —'Chamber's Dictionary.'
2. మనుచరిత్ర. 1. పారిజాతాపహరణము.

అను పంక్తులలోని తాండవగతి

'కమలఝూట
కలితకూట
కనకవాట'[1]

వంటి తరళవృత్తగతిని స్మరణకు తెచ్చును.

ప్రదీప్తకీలాప్రవాళమాలా' (జ్వాలాతోరణం)

వంటి పంక్తులలోని అంత్యప్రాసకేళి

'పరుషదహనకీలా
ప్రస్ఫురచ్చక్రవాళా —'[2]

లోని అంత్యనియమాదులకు సన్నిహితముగానున్నది. ఈ విధముగా తెలుగులోని తాళబద్ధమైన ప్రాచీనవృత్తముల నడకలను, వానిలోని అంత్యప్రాసల ఒడుపులను చక్కగా ఆకళించుకొని గేయములలో ప్రయోగించిన ప్రయోక్త శ్రీశ్రీ.

ఇవికాక మాత్రాచ్ఛందస్సుల గతులలో కొన్ని చిత్రమైన మార్పులుచేసి నూతనత్వమును సాధించినాడితడు.

'యమునిమహిషపు లోహఘంటలు
మబ్బుచాటున
ఖణేల్‌మన్నా<u>యి</u>.' (అవతారం)

ఈ గేయములోని నడక మిశ్రగతియే. కాని 'యి' అను మాత్రనుపెంచి దీనికి క్రొత్తబెడగును సమకూర్చినాడు. ఈ గేయముసాంత మిట్టి సంవిధానములోనే నడచినది. 'ఐ' అను శీర్షికతో వ్రాసిన గేయము ఖండగతిలో నడచినను వచనపద్య భ్రాంతికలిగించునట్లు చేసినాడు.

'భూతాన్ని
యజ్ఞోపవీతాన్ని
వైప్లవ్యగీతాన్ని నేను.'

చరణవిభాగములోని చమత్కారమువలన ఇది సాధ్యమైనది.

'నవకవిత'లోని

'సిందూరం రక్తచందనం
బంధూకం సంధ్యారాగం

---

1. వసుచరిత. 2. మనుచరిత్ర.

పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రనిజెండా'

వంటి పాదములనడక 'సిందూ + రంర + క్తచంద' అన్న రీతిలో చదువుకొన్నచో చతురస్రగతి లోనికి వచ్చును 'సిందూరం, రక్తచందనం' అన్న ధోరణిలో విరిచి చదివినచో వింతగతివచ్చి ఆది చతురస్రమునకు భిన్నముగా ధ్వనించును.

'సాహసి' అను గేయములో

'ఎగిరించకు లోహవిహంగాలను
కదిలించకు సుప్తభుజంగాలను
ఉండనీ
మస్తిష్క-కులాయంలో
మనోవల్మీకంలో'

అను పాదములు వచనగేయభ్రాంతి కలిగించును. కాని వీనిని 'ఎగిరిం + చకులో + హవిహం + గాలను' అన్న ధోరణిలో విభజించినచో చతురస్రములోనికే వచ్చిచేరును పై రెండు, క్రింది రెండు సమపాదములమధ్య 'ఉండనీ' అను అతుకువచ్చి దీనిని వచనగీతమునకు సన్నిహితముగా మార్చినది. ఇది శ్రీశ్రీ అన్నట్లుగా జంతుపరిణామశ్రేణిలో సర్పమునకు, పక్షికిని నడుమగల 'Archaeo ptiryx' అను ప్రాచీనపక్షివంటిది. అనగా ఛందోగీతమునకు వచనగీతమునకు మధ్యస్థముగా నిలుచునది.

'ఆశాదూతలు' అను గేయములో

'స్వర్గాలు కరిగించి
స్వప్నాలు పగిలించి
రగిలించి రక్తాలు, రాజ్యాలుకదిపి
ఒకడు తూరుపుదిక్కునకు'

అను పంక్తులలో మొదటిరెంటిలో స్పష్టమైన ఖండగతిని, మూడవదానిలో ద్విపదగతిని, చివరి దానిలో వచనగేయములోని లయను నిక్షిప్త మొనర్చినాడు.

'బుక్కులు' లో

'కుక్కపిల్లా
అగ్గిపుల్లా
సబ్బుబిళ్ళా'

అను ధోరణిలో మొదట మూడుమూడు పాదములను మిశ్రగతిలో నడపి వెంటనే

'హీనంగా చూడకుదేన్నీ
కవితామయమేనోయ్ అన్నీ'

అని చతురస్రములోనికి సాగదీసినాడు. ఒకే గేయములో ఒక సంవిధానక్రమమున రెండు రకముల గతులను ప్రవేశపెట్టినాడు.

'కవితా ఓ కవితా' అను సుదీర్ఘగేయము వచనగేయజాతికి (Vers Libre) చెందినది. ఈ గేయమున కుటిలో చీకటిలో మున్నగు అనుప్రాసముల వేగవంతమైన నడక, సజాతీయ శబ్దసమ్మేళనము గమనింపదగినది. ఇది మాత్రాచ్ఛందోగంధముగల వచనగేయము శ్రీశ్రీ వచనగేయములలోచేసిన ప్రయోగములకిది చక్కని నిదర్శనము. అతడు వచనగేయములలో వైవిధ్యము సాధించుటకే గేయము వ్రాసినాడు. గణబద్ధచ్ఛందస్సులనుకొలచు కొలతబద్దలతో వీనిని కొలచుటకు ప్రయత్నించరాదని స్పష్టపరిచినాడు. జలాంతర్గామి అనుసరించు నియమములతో విమానముకట్టువడు ధర్మములను కొలవకూడదని అభిప్రాయపడినాడు.[1] వచనమునకు నడక, కవిత్వమునకు పరుగు ముఖ్యగుణములు. వచనముచేత పరుగెత్తించి దానిని కవిత్వముగా మార్చుటకు వీలున్నది. ఛందస్సహాయములేకుండగనే వచనముచేత పరుగులు తీయింపవచ్చును. శ్రీశ్రీ అన్నమాటలివి.

'అనుప్రాసలవల్లను, ఒకమాటగాని, కొన్ని మాటలనుగాని, పునశ్చరణచేయడంవల్లను, యమకంవల్లను, వాక్యరూపాన్ని మార్చడంవల్లను వచనగీతంలో ఈ గుణాన్ని సాధింపవచ్చును'[2]

'కవితా ఓ కవితా' అను గేయములో శ్రీశ్రీ తన ప్రకటనను నిరూపించుకొనెను. ఈ గేయమున 'యువకాశలనవపేశల', 'చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణ', 'ఘూకం కేకా, భేకం బాకా', 'నానాగానానూనస్వానావళితం'వంటి అనుప్రాసములవలన, 'విన్నానమ్మా! విన్నా, నేనో విన్నాను', 'కవితా ఓ కవితా' వంటి మాటల పునశ్చరణవలన, మధ్యమధ్య సంబోధనలు ప్రయోగించుటవలన, 'మరినిన్నుస్మరిస్తే నా కగుపించే దృశ్యాలా! వినిపించే భాష్యాలా', 'ఇంకా నేనేం విన్నానా'. 'నీకై మేలుకొనిన సకలేంద్రియములతో, ఏది రచిస్తున్నానో చూస్తున్నానో' వంటి వాక్యముల రూపపరివర్తనమువలనను శ్రీశ్రీ ఈ గేయమును వచనగేయమున కాదర్శముగా మలచినాడు. ఈ గేయములోని అంతర్లయ సెలయేటిగతిని పురుడించుచున్నది. 'నాయువకాశల నవపేశలసుమగీతావరణంలో', 'నానాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరిచుంబనలో', 'విలయావర్తపు బలవత్ఝురవత్ పరివర్తనలో'వంటి మాత్రాచ్ఛందోగంధముగల పాదములవలన గూడ ఈ వచనగేయము సుశిక్షితమైన జవనాశ్వధాటిలో నడచినది.

శ్రీశ్రీ వచనగేయములన్నిటిని ఈ గతిలోనే వ్రాయలేదు. యమకము, అనుప్రాసలు మున్నగు గుణములులేని వచనగేయములనుగూడ రచించి వైవిధ్యము సాధించిచూపినాడు.

1. 'నా కవిత్వం' (వ్యాసం) : ఆంధ్రశిల్పి : 1947 ఫిబ్రవరి.
2. 'కృత్యాద్యవస్థ'నుండి.

'కొంపల్లి జనార్దనరావుకోసం' అనునది నడకలో 'కవితా ఓ కవితా'లోని శిల్పమును పుణికిపుచ్చుకొన్నను, అనుప్రాసాదుల 'హడావిడులు'లేని శుద్ధవచనగేయము. 'ఆకాశదీపం', 'వ్యత్యాసం' ఈ తెగకుచెందిన వచనగేయములే.

'అదృష్టవంతులుమీరు
వెలుగును ప్రేమిస్తారు
ఇరులను ద్వేషిస్తారు
మంచికీ చెడ్డకీ నడుమ
కంచుగోడలున్నాయి మీకు
— — — —
అందుకే వడ్డించినవిస్తరి మీ జీవితం.'

ఇది శుద్ధవచనమువలె కనిపించు గేయమైనను, భావోద్వేగమువలన దీనికి వేగమబ్బినది. 'ఆకాశదీపం'లో

'గదిలో ఎవరూలేరు
గదినిండా నిశ్శబ్దం
సాయంత్రం ఆరున్నర
గదిలోపల చినుకులవలె చీకట్లు'

అను పంక్తులుగూడ వట్టి వచనమువలె కనిపించినను, పదచిత్రములతో, కథనశైలితో ఆ లోటును తీర్చినాడు శ్రీశ్రీ.

గేయరచనాసంవిధానములో శ్రీశ్రీ క్రొత్తపోకడలు పోయినాడు. 'ఆః' అను గేయము 6 పాదములుగలది.

''నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నే నెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు —
నెత్తురు క్రక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే —''

ఇంతే. మూడుమూడు పాదములకొక గేయభాగము. ఆ మూడు పాదములుగూడ ఒక ప్రత్యేక శిల్పములో రచింపబడినవి. మొదటి భాగములోని 'వీరు' తర్వాత మనము 'ఆః!' అని చదువు

కొనవలెను. అట్లే చివరిభాగములోని 'వీరే' తర్వాత 'ఆః !' అని చదువుకొనవలెను. అప్పుడు గాని గేయములోని చమత్కారమవగతముకాదు.

'అవతలిగట్టు' అనుగేయ మిట్టిదే.

- -'ఇవేమిటీ వింతభయాలు

— ఇంట్లో చీకటి.'

ఈ రీతిగా ప్రశ్న, సమాధానము. మూడు ప్రశ్నలు, మూడు సమాధానములు. ఈ సంవిధాన చమత్కృతివలన చెప్పదలచుకొన్న విషయమునకు సంక్షేపగుణమలవడినది. 'కేక' లో

'నిద్రకువెలియై

నే నొంటరినై

నాగదిలోపల చీకటిలో

చీకటిలోపల నాగదిలో

నాగదిలో

చీకటిలో'

అను పాదములలోని వాక్యశిల్పము బహుచమత్కారముగా నిర్మింపబడినది. 'నా గదిలోపల చీకటిలో' అన్న పాదమునే విలోమముగా 'చీకటిలోపల నాగదిలో' అని కూర్చినాడు. తర్వాత క్రమముగా రెండవ మూడవ పాదములలోని చివరిమాటలు 'నా గదిలో, చీకటిలో' అని పేర్చినాడు. ఈ గేయముమొత్త మీరకమైన సంవిధానములోనే సాగినది. 'కేక'లో కవి చిత్రింపదలచుకొన్న భయానకవాతావరణమునకీ వాక్యవిన్యాసము, పదములకూర్పు పోషకముగా పరిణమించినవి.

'మానవుడా'అను వచనగేయము సంబోధనప్రథమావిభక్తులవలన వింతనడకను సంతరించుకొన్నది. ఈ గేయములో సగముశబ్దములకుపైగా సంబోధనలే. 'రసైకజీవీ ! కవీ ! నటుడా ! శిల్పాచార్యా'వంటి కొన్ని సంబోధనల నొకే పాదములో పేర్చి

ఖైదీ !

రౌడీ !

ఖూనీకోర్ !

బేబీ !

వంటివానిని విడిగాచేర్చి చమత్కారము చూపినాడు.

## శ్రీశ్రీపై సంప్రదాయముద్ర :

శ్రీశ్రీ దేవతలను, దయ్యములను నిరసించినాడని, కుక్కపిల్ల, అగ్గిపుల్లలనుగూడ కవితా వస్తువులుగా చేసికొన్నాడని, వ్యాకరణములను సంకెళ్ళుగా, ఛందస్సులను సర్పపరిష్వంగములుగా, నిఘంటువులను శ్మశానములుగా త్రోసిపుచ్చినాడని, వెన్నెలనవ్వులు కురియించవలసిన కవితాసతిని పీనుగుపెంటలలో ఊరేగింపజేసినాడని కొందరు విమర్శించుటకు వీలున్నది. శ్రీశ్రీ ఒక్కుమ్మడిగా సంప్రదాయమును ఛేదించిన పచ్చితిరుగుబాటుదారని, అతని రచనలను పైపైన చదివినవారికి అనిపించుటలో ఆశ్చర్యములేదు. కాని లోతుగా పరిశీలించినచో ఇట్టి యభిప్రాయములు సరియైనవికావని తేలును. ఈనాటికి శ్రీశ్రీ గేయములు పండితపామరులకు సమప్రమాణములో చవులూరించుచున్నవి. వందలకొలది యువకవుల కొరవడులైనవి. ఆంధ్రకవితారంగమున ఒక నూత్నశకస్థాపనకు హేతువులైనవి. జాతి జీవితములో ఇంతటి మహత్తరపాత్ర వహించిన రచనలు సంప్రదాయచ్ఛేదకములు కానేరవు. సంప్రదాయమును జీర్ణించుకొనని రచనలు పేకమేడలవలె కూలిపోవునేకాని ఇంతకాలము నిలువలేవు. తెలుగుభాషలోని అతినవ్యకవులలో శ్రీశ్రీవలె సంప్రదాయస్తన్యమును గ్రోలినవారు క్వచిత్తుగానున్నారు. పురాణసంప్రదాయములు, మతసంప్రదాయములు, సంస్కృతిసంప్రదాయములు, కవితాసంప్రదాయములు ఉత్తమ ప్రమాణములో అలవరచుకొన్న ప్రతిభ శ్రీశ్రీది. గతమునుండి నేర్చుకొనుటకుపోయి గతమునకే కట్టుబడినవారి శ్రేణిలోనికి రాడీతడు. గతగర్భమునుద్రవ్వి రతనాలు సేకరించి వానిని వర్తమానకాలమున కనుగుణముగా వినియోగించుకొన్నాడు. గతసంప్రదాయక్షీరమును కాచి దానిలోని మీగడనుమాత్రము సంగ్రహించినాడు సంప్రదాయబలముతో సరిక్రొత్త ప్రయోగములను చేయ సాహసించినాడు. ఛందస్సులో, భావనలో, శబ్దప్రయోగములో, సంవిధానములో, వస్తువరణములో శ్రీశ్రీ చేసిన నవ్యప్రయోగముల నీనరకే వివరించితిని. ప్రస్తుతమతని రచనలలో గల సంప్రదాయముద్రనుగూర్చి ముచ్చటింతును.

'అవతారం' అను గేయములో శ్రీశ్రీ జగత్ప్రళయముతర్వాత వచ్చెడు నూత్నసృష్టిని వ్యంజింపజేసినాడు. పాలకవర్గముపై పాలితవర్గముచేసిన తిరుగుబాటును సూచించుటకు పురాణ సంప్రదాయములను స్వీకరించుటలో శ్రీశ్రీపైగల సంప్రదాయప్రభావము గోచరమగును. 'ఉదయ సూర్యుని సప్తహయములు నురుగులెత్తే పరువుపెట్టేయి' అని ఇతడన్నాడు. భౌతికవిజ్ఞానమును విశ్వసించి, అంధవిశ్వాసములను నిరసించిన శ్రీశ్రీ సూర్యుని సప్తాశ్వములను స్వీకరించుటలోనే చమత్కారమున్నది. ప్రాతకవిసమయములద్వారా క్రొత్తభావమును స్ఫురింపజేసెడి నేర్పు ఈ గేయములో భాసించుచున్నది. అట్లే 'యమునిమహిషపు లోహఘంటలు మబ్బుచాటున ఖణేలుమ'నుట. ఈ పాదము తిక్కనవ్రాసిన 'యమమహిషఘంటికానాదము'ను స్ఫురింపజేయుచున్నది. ఈ గేయము మొత్తము శ్రీశ్రీకిగల హైందవపురాణపరిచయమును ద్యోతితమొనర్చుచున్నది. ఈ గేయములోని 'నరకలోకపు జాగిలమ్ములు' మాత్రము మన సంప్రదాయమునకు చెందినవికావు. ఇది గ్రీకు సంప్రదాయము. నరకద్వారమునందు Cerberus (సెర్బరస్) అను

మూడుతలల కుక్క కావలియుండును. ఇది నరకములోపలివారిని వెలుపలికి పోనీయదు. గ్రీకు పురాణ సంప్రదాయమిది.[1] ఈ జాగిలములను Hell – hounds అందురు. ఏ సంప్రదాయ మైనను సంప్రదాయమేకదా! శ్రీశ్రీ పరిణద్ధదృష్టి ఈ ఉదాహరణముతో మరింత ప్రకాశమాన మైనది.

'జ్వాలాతోరణం'లో ప్రపంచమున ప్రళయానంతరము జరుగు నవ్యసృష్టిని గూర్చి ఉల్లేఖించినాడు. ప్రాతవ్యవస్థ ముక్కచెక్కలగు సందర్భమును తెలుపుటకు

'ఇదేమిలోకం హిరణ్యనేత్రుని
పదాఘాతమున ప్రతిధ్వనించగ
కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు
గదాఘాతమున గడగడలాడగ'

అను సంకేతములను ప్రయోగించినాడు. ఇవి పురాణసంప్రదాయసంబంధులే. హిరణ్యాక్షుని పదాఘాతము, భీమసేనుని గదాఘాతము ప్రాచీనవ్యవస్థలో జరుగుచున్న కల్లోలమునకు సంజ్ఞలుగా గ్రహించినాడు.

'మరోప్రపంచం'వంటి విప్లవగీతములోగూడ శ్రీశ్రీపైగల సంప్రదాయముద్ర కనిపించుచున్నది. దీనిలోని

'హరోం హరోం హర
హర ! హర ! హర ! హర !

అను సైనికులనినాదము శివాజీ సైన్యములోని 'హరహరమహాదేవ' అను నినాదముల ప్రభావమును కలిగియున్నది. 'మరోప్రపంచం'లో త్రేతాగ్ని మండుచున్నదని, అగ్నికిరీటపు ధగధగలు, హోమజ్వాలల భుగభుగలు వెలయుచున్నవని శ్రీశ్రీ అన్నాడు. 'త్రేతాగ్ని' అచ్చముగా వైదిక సంప్రదాయమునకు చెందినదే. హోమజ్వాలలిట్టివె. సరిక్రొత్త చైతన్యమునకు త్రేతాగ్నిని, హోమజ్వాలలను సంకేతములుగా స్వీకరించినాడు 'అగ్నికిరీటము'లో కిరీటము ప్రభుత్వమునకు సంకేతము. నూతనవ్యవస్థలో ప్రభుత్వము రాజులదికాదు; రైతులది, కూలీలది. అందువలన దానిని రత్నకిరీటమనక అగ్నికిరీటమన్నాడు. అగ్నిని శ్రామికజనవిప్లవమునకు ప్రతీకగా గ్రహించినాడు. 'కిరీటము' వెనుకగల సంప్రదాయమే ఈ పదబంధమునకు పునాదివంటిది. ఈ గేయములోనే ముందుకునడువుమని ఉద్బోధించు సందర్భమున శ్రీశ్రీ 'ధనంజయునిలాసాగండి' అన్నాడు. 'ధనంజయ'శబ్దము సాభిప్రాయప్రయోగము. రాజసూయయాగసందర్భమున నలు

1. 'At the entrance of Hedes (నరకము) stands the watch-dog, Cerberus, who prevents any of the dead from going out again.'

— Oxford Companion to Classical Literature.

దిక్కులకేగి సమస్తరాజులను జయించి, వారి ఐశ్వర్యమును చేజిక్కించుకొన్న 'విజయు'డీ శబ్దమున కనిపించుచున్నాడు. 'ధనంజయ' శబ్దము వెనుకగల సంప్రదాయము అప్రతిహతపురోగతికి తులలేని ప్రతీకగా నిలచినది. 'జయభేరి' లో

'నేనుసైతం ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను'

అన్నది వైదికసంప్రదాయమును జీర్ణించుకొన్న కవితప్ప వ్రాయలేనిది. అనంతమైన సామాజిక చైతన్యమునకు తానుగూడ ఒక ప్రతినిధినని కవి చెప్పదలచుకొన్నాడు. దీనికి ప్రపంచమనెడు హోమాగ్నిలో తన్ను సమిధగా పేర్కొనుటతో గొప్ప భావోల్బణము కలిగినది. ఈ గేయములోనే

'నాకుహూరుతశీకరాలే
లోకమంతా జల్లులాడే
ఆముహూర్తాలాగమిస్తాయి'

అని అన్నాడు. ఇందులో వసంతమును, కోకిలను ధ్వనింపజేసినాడు. తాను కోకిలయై కుహూకారము చేసినప్పుడు లోకము వసంతానుభూతిని పొందునని దీనిలోని వ్యంగ్యము. వసంతకోకిలల సంప్రదాయమును ఇట్లు రమ్యముగా వ్యంజింపజేసినాడు కవి.

'కవితా ఓ కవితా'లో తననుడి కవితాదేవికి గుడికావలెనని, తనగీతము నైవేద్యముకావలెనని కోరుకొన్నాడు. మతసంబంధమైన సంప్రదాయాభిజ్ఞతతో వెలువడిన రూపకములివి. అట్లే దీనిలోని

'నానాడులతీగలపైసాగిన
నాదబ్రహ్మపుపరిచుంబనలో'

వంటి పంక్తులలోని భావము యోగసంప్రదాయములను తెలుసుకొనినగాని స్ఫురించునదికాదు. 'బాటసారి' లో బాటసారి మరణించినపిమ్మట

'పల్లెటూళ్ళో తల్లికేదో
పాడుకలలో పేగుకదలింది'

అను పాదమున తరతరములనుండి హైందవసమాజమున ప్రచారములోనున్న విశ్వాసముల్లేఖింపబడినది.

'అద్వైతం'లో 'నీమోవికి కావిని నేనై'యన్నది ఆంధ్రకవితా సంప్రదాయమును పుడిసిలించుకొన్నవర్ణన. 'పేదలు'లో పేదల కన్నులు 'గోమాతల కన్నులతమ్ములు' అని పోల్చినాడు. 'గోమాత' అన్న పదము హైందవాచారమును మేళవించుకొన్నది.

'ఆకాశదీపం'లో ఒకానొకగదిలో సాయంకాల మారిపోయిన దీపమునుగూర్చి శ్రీశ్రీ యిట్లనెను.

'ఆకాశతార ఆహ్వానగానంచేసింది
దీపం ఆరిపోయింది
తారగా మారిపోయింది.'

కాంతి పంచభూతములలో లీనమగునను సంప్రదాయము ఈ పాదములందు ధ్వనించుచున్నది. దీప కాంతి నక్షత్రములలో లీనమై నక్షత్రముగా మారిపోయినది. ఇంకొక చమత్కారమున్నది. ఆ గదిలో ఆవేళ ఒక దురదృష్టజీవి మరణించెను. అతని ఆత్మ పంచభూతములలో లీనమైనదను వ్యంగ్యముకూడ దీనిలో లేకపోలేదు. ఇక 'జగన్నాథునిరథచక్రాలు'లోని జగన్నాథుని రథమును గూర్చి చర్చింపవలసియున్నది జగన్నాథునిరథము వాచ్యార్థమున 'పూరీ' క్షేత్రములోని జగన్నాథరథము. కాని దీనివెనుక సాంప్రదాయికమైన వ్యంగ్యార్థమున్నది. అరవిందుడు జగన్నాథ రథమునకుగల ప్రత్యేకార్థమును ఇట్లు చెప్పెను 'ఆదర్శసమాజములోని మనుష్యసమష్టి కంత రాత్మయగు భగవంతుని వివాహము జగన్నాథుని యాత్రారథము. ఐక్యము, స్వాధీనత, జ్ఞానము, శక్తి ఆ రథముయొక్క నాలుగుచక్రములు.'[1] శ్రీశ్రీ గేయములోని జగన్నాథరథముకూడ అరవిందుడన్న ఆదర్శసమాజమునకే సంకేతము. కాని అరవిందుడు జగన్నాథ రథమునుగూర్చి విపులీకరించుచు, దాని స్వరూప మెవరికిని గోచరముకాదని, ఆ మూర్తి విశ్వపురుషునిహృదయము నందు నిలిచియున్నదని, అనేకావరణములచేత ఆవృతమైయున్నదని అభిప్రాయపడినాడు. శ్రీశ్రీ జగన్నాథరథస్వరూపము దీనికి భిన్నమైనది. దాని స్వరూపము కవికి స్పష్టముగా తెలియును. అది 'మొయిల్దారినబయల్దేరిన' రథము. ఆ మహారథగమనముతో వింధ్యాచలసంధ్యాచలాది మహానగములు గిరగిర తిరిగిపోవుచున్నవని కవియనెను. అరవిందుడు 'ద్రష్టలును కర్తలునగు అనేకభగవద్విభూతుల యనేకప్రయత్నములద్వారమున దానిని మెల్లగా వెలువరించి స్థూల జగత్తున ప్రతిష్ఠించుట అంతర్యామియొక్క అభిసంధి'యన్నాడు.[2] శ్రీశ్రీ దృష్టిలో ద్రష్టలు, కర్తలు శ్రామికులే. భగవద్విభూతుల ప్రయత్నముచేత జగన్నాథునిరథము క్రిందికి దిగదు. మానవుల స్వప్రయత్నముచేతనే అది భూమిపై ప్రతిష్ఠింపబడును. దీనినే శ్రీశ్రీ స్పష్టముగా ప్రకటించినాడు.

'మీకోసం కలంపట్టి
ఆకాశపుదారులంట
అడావుడిగ వెళిపోయే
—— —— —— ——

1. జగన్నాథునిరథం (వ్యాసము) : ఆర్ద్ర : తెలుగు స్వతంత్ర.
2. జగన్నాథునిరథం (వ్యాసము) : „ „

జగన్నాథుని రథచక్రాల్
రథచక్రప్రళయఘోష
భూమార్గంపట్టిస్తాను.'

గేయముచివర

'వచ్చేశాయ్, వచ్చేశాయ్
జగన్నాథ, జగన్నాథ
జగన్నాథ రథచక్రాల్'

అని ఆదర్శసమాజావతరణమును కీర్తించినాడు. ఈ విధముగా సంప్రదాయసిద్ధమైన 'జగన్నాథ రథము'ను స్వీకరించి, దానిని మార్క్సిస్టు దృక్పథముతో మలచుకొనుటలో శ్రీశ్రీ 'కొత్తపాతల మేలికలయిక'ను సాధించినాడు.

ఈ 'జగన్నాథరథము'ను రోణంకి అప్పలస్వామిగారు ఇంకొకవిధముగా వ్యాఖ్యానించినారు. 'జగన్నాథుని అనే శబ్దం పాశ్చాత్యులు జగర్‌నాట్‌గా వాడతారు. జగర్‌నాట్ విధ్వంసక హేతువు. లోకంలో ఉన్న అన్యాయాలను, దుర్మార్గాలను, వ్యత్యాసాలను, జగన్నాథుని రథ చక్రాలు పిండిపిప్పిచేస్తాయని అతని ఆశ.'[1] 'జగన్నాథ'యను సంస్కృత శబ్దమునకు ఇంగ్లీషులో 'Juggernaut' (జగ్గర్‌నాట్) అనునది అపభ్రంశరూపము దీనికి 'Idol of Krishna dragged yearly in procession on car under whose wheels devotees, it is said, formerly threw themselves; superstition to which people sacrifice themselves or others' అని ఆక్సుఫర్డు నిఘంటువిచ్చిన వివరణము.

ఈ దృష్టితో పరిశీలించినను జగన్నాథుని రథమునకు సాంఘిక న్యాయమను అర్థమే వచ్చును. నింగిలోసాగు జగన్నాథరథచక్రములను నేలపైకిదింపవలెనని శ్రీశ్రీ కోరుట, పాశ్చాత్యుల దివిని భువిపైకి అవతరింపజేయవలెనను ఆశయముతో సంవదించుచున్నది.

## శ్రీశ్రీపై ఇతరకవుల ప్రభావములు :

శ్రీశ్రీ విదేశీయసారస్వతములలో ఫ్రెంచి, ఇంగ్లీషు కావ్యములను బాగుగా చదువుకొన్నాడు. ముఖ్యముగా ఇంగ్లీషు సారస్వతములోని అత్యాధునికరీతులను కూలంకషముగా పఠించి జీర్ణించుకొన్నాడు. 'మహాప్రస్థానము'లోని 'పేదలు' ఫ్రెంచిగీతికి, 'అద్వైతం' స్విన్‌బర్న్ వ్రాసిన 'A match' అను గేయమునకు అనుసరణలు. ఈ గేయముల మూలములను శ్రీశ్రీయే స్వయముగా పేర్కొన్నాడు.

1. శ్రీశ్రీపై రోణంకివారి వ్యాసము : విశాలాంధ్ర : 28-9-1962.

మొదట 'పేదలు' గూర్చి పరిశీలింతును. ఈ గేయము Les Pauvers' (లేపోవోవ్) అను ఫ్రెంచిగీతమున కనువాదము. దీని రచయిత Emile Verhaeren. ఈ గీతమునకు 'పేదలు' అనువాదమని శ్రీశ్రీ పేర్కొన్నను, ఇందులో అతని మౌలికప్రజ్ఞ గుబాళించుచునేయున్నది. మచ్చున కొకటిరెండు పాదములను పరిశీలింతము. ఫ్రెంచిగీతములో ఒక పాదమిది.

'Il en est de pauvres coeurs
A vee en eux, des lacs de pleurs
Qui sont pales, comme les pierres
D'un cimitiere.'

దీనికింగ్లీషు అనువాదమిది—

'Thus there are poor hearts
With in them, lakes of tears
Which are pale (grey) like
Stones in a cemetery.'[1]

పేదలగుండెలున్నవి. వానిలో కన్నీటిచెరువులున్నవి. అవి గోరీలతోటలోని రాళ్ళవలె పేలవముగా నున్నవని ఫ్రెంచి గీతము అర్థము. దీనినే శ్రీశ్రీ

'అంతేలే, పేదలగుండెలు
అశ్రువులే నిండినకుండలు
శ్మశానమున శశికాంతులతో
చలిబారిన వెలిరాబండలు'

అని తెనిగించెను. గుండెలు అశ్రువులునిండిన కుండలనుటతో, సరస్సులనుటకన్న మిన్నయైన ఔచిత్యమేర్పడినది. 'గోరీలతోట' విదేశసంప్రదాయమునకు చెందినది. దానిని శ్మశానముగా మార్చుటలో శ్రీశ్రీ జాతీయతను పోషించినాడు. పేలవమైన రాళ్ళనుటకన్న 'చలిబారినరాబండ' లనుటతో మూలములోలేని రసపుష్టి కల్గినది.

శ్రీశ్రీకి అభిమానపాత్రులైన ఇంగ్లీషు కవులలో స్విన్‌బర్న్ ముఖ్యుడు. ప్రత్యేకముగా శ్రీశ్రీ స్విన్‌బర్నుపై గీతము రచించుటతో ఇది స్పష్టమైనది. 'స్విన్‌బర్న్ కవికి' అను గీతమున ఇతడు స్విన్‌బర్న్‌కవి పాటలను 'విషంక్రక్కే భుజంగాలో', 'కదంత్రొక్కే మాతంగాలో', 'మదంపట్టిన మాతంగాలో'యని పేర్కొన్నాడు. శబ్దసంగీతమును సృష్టించుటలో, పదములను కదనుత్రొక్కించుటలో ఇంగ్లీషు కవులలో స్విన్‌బర్న్ అందెవేసినచేయి. శబ్దశక్తిసంపన్నుడైన శ్రీశ్రీకి స్విన్‌బర్న్‌పై అభిమానముండుట అత్యంతసహజము. స్విన్‌బర్న్ పాటలను 'ఎర్ర

1. ఈ ఆంగ్లానువాదము రోజంకివారుచేసినది (శ్రీశ్రీపైని వ్యాసములో).

కాంతుల ఇనోదయము, రెక్కవిప్పిన రివల్యూషన్, కడలివలపు, వలపుకడలి'గా శ్రీశ్రీ ప్రస్తుతించినాడు. స్విన్‌బర్న్ రచనలుచదివి, ముఖ్యముగా 'A match' అను గీతముతో సమ్మోహితుడై 'అద్వైతం' అను గేయము రచించినాడు. ఈ గేయములో ప్రణయము ప్రధాన వస్తువు. ప్రేమికుడు తన ప్రేయసిని సంబోధించి, తనకును ప్రేయసికినిగల సత్త్వాతారతమ్యము నుగ్గడించి, చివరకు అద్వైతభావము ప్రకటింపుట ఈ గేయమున కాననగును. ఈ గేయములో మూలమునకు మెరుగులుదిద్దిన సందర్భములున్నవి. దీనిని 'A match' ప్రభావముతో వ్రాసితినని శ్రీశ్రీ చెప్పకొనకపోయినచో, ఈ గేయము స్వతంత్రరచనయే అనిపించెడిది. భావనలో, పదప్రయోగములో అంతటి మౌలికత దీనిలో భాసించుచున్నది. 'అద్వైతం'లోని మొదటి పాదము స్విన్‌బర్న్ రచనలోలేదు.

'ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపుటంచులుచూస్తాం
ఆనందపు లోతులుతీస్తాం'

ఈ ప్రారంభపంక్తులు శ్రీశ్రీ స్వోపజ్ఞకములే. మూలములోని

'If you were April's lady
And I were lord in may'

అన్నది తెనుగుదనమునకు దూరమైనదని గమనించి శ్రీశ్రీ

'వాసంతసమీరం నీవై
హేమంతతుషారం నేనై'

అని మార్చుకొన్నాడు. ఈ గేయములోని 'నీ ఎగిరిన జీవవిహంగం, నా పగిలిన మరణమృదంగం', 'నీ తలపున రేకులుపూస్తే, నా వలపున బాకులుదూస్తే' వంటివి శ్రీశ్రీ ఉపజ్ఞాజనితములే. అట్లే దీనిలోని 'మరణానికి ప్రాణంపోస్తాం, స్వర్గానికి నిచ్చెనవేస్తాం' అన్న పంక్తులు, కాలానికి కళ్ళెంవేస్తాం, ప్రేమానికి గొళ్ళెంతీస్తాం' అన్నవి మూలమున రేఖామాత్రముగానుండగా వానిని శ్రీశ్రీ సుందరశిల్పములుగా తీర్చిదిద్దినాడు. కంకణనిక్వాణం, జీవననిర్యాణం, విషవాయువులు, విరితేనెలు, అర్ణవం, అంబరం, వలయములు, విలయములు శ్రీశ్రీ సొంతగొంతునుండి వెడలిన సుందరశ్రుతులేకాని మూలములోనివికావు.

ఈ రెండు గేయములలో ఒకటి అనుకరణము; రెండవది అనుసరణము. శ్రీశ్రీ మిగిలిన గేయములపై ఏ కవి ప్రభావము స్పష్టముగా కనిపించదు. అక్కడక్కడ కొన్ని పంక్తులు మాత్రము కొందరిముద్రను లోగొన్నవి. ముఖ్యముగా 'దేశచరిత్రలు' అను గేయములోని కొన్ని పంక్తులు జాన్‌మేస్‌ఫీల్డు (John Masefield) వ్రాసిన 'A Consecration' (అంకితము) అను

గేయము ప్రభావములో నడచినవి. ఈ గేయమున ప్రభువులగూర్చికాక సామాన్యులగూర్చిపాడు కొందునని ఈ కవి చాటినాడు.

'Not of the princes and prelates with periwigged charioteers
Riding triumphantly Laurelled to lap the fat of the years
Rather the scorned the rejected-the man hemmed in with spears;

— — — — — — — — —

Not the be - medalled commander, beloved of the throne,
Riding cock-horse to parade when the bugles are blown
But the lads who carried the koppie and cannot be known.'[1]

ఈ పంక్తులలోని భావమే శ్రీశ్రీ గేయములోని

'సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహసమెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకికాదోయ్
అదిమోసిన బోయీలెవ్వరు !'

అను పాదములకు ఊపిరులూది జాతీయముద్రతో సాక్షాత్కరించినది. మేస్ఫీల్డు గేయములోని

'The sailor, the Stoker of Steamers, the man with the clout'

అన్న పంక్తిలోని అభిప్రాయము రూపుమార్చుకొని

'ఐర్లాండున ఓడకళాసీ
అణగారిన ఆర్తులందరూ'

అనురూపమున అవతరించినది. ఇంతకుమించి మేస్ఫీల్డుగేయము ప్రభావము శ్రీశ్రీపై కనిపించదు.

ప్రపంచ ప్రఖ్యాతుడైన రష్యన్‌విప్లవకవి మైకోవస్కీ ప్రభావము శ్రీశ్రీ అభ్యుదయగేయములపై స్థూలముగా కలదు. 1917 లోనే మైకోవస్కీ 'Our March' అను గేయము ద్వారా పీడితజనులను విప్లవపథములో నడువవలసినదిగా సందేశమిచ్చెను. ఈ గేయములోని

'Tramp squares with rebellious treading
Up, heads! As proud peaks be seen.
In the second flood we are spreading
Every city on earth will be clean'[2]

1. Collected works of John Masefield: William Heinmann Ltd. London; Pub: 1932.
2. Quoted in 'Creative Experiment': P. 117.

వంటి పాదములలోని ఉద్వేగము శ్రీశ్రీ ప్రబోధగీతములలో నున్నది. మైకోవస్కీ తన యిరువదవ యేట వ్రాసిన గేయములోని 'With mice old men I have nothing to do' అను పంక్తిలోని భావము శ్రీశ్రీ 'మహాప్రస్థానం' లోని

'ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి'

అనుపంక్తులలో ప్రతిధ్వనించుచున్నది. మైకోవస్కీ ఫ్యూచరిజము ప్రభావముతో పలికిన పంక్తులివి. 1918 లో మైకోవస్కీ వ్రాసిన 'Left March' అనుగేయము ప్రజాశత్రువుల పతనమును, విప్లవవాదుల విజయమును చిత్రించినది. ఈ గేయములో కవి తాను పదునేనుకోట్ల రష్యన్ ప్రజలకు ప్రతినిధినని చెప్పుకొన్నాడు.

'150,000,000 speak through these
Lips of mine.'[1]

ఈ ఆత్మప్రత్యయమును శ్రీశ్రీ 'ప్రతిజ్ఞ'లో ప్రదర్శించినాడు. 'జగన్నాథుని రథచక్రాలు'లో పీడితుల నోదార్చుట యందు ఈ ధోరణి కనిపించుచున్నది.

పాశ్చాత్యసాహిత్యరంగములోని అభ్యుదయ (విప్లవ) కవులలో టర్కీకి చెందిన నాజిం హిక్మత్, చిలీదేశపు కవి పాబ్లోనెరూడా గణనీయులు. వీరిలో నాజింహిక్మత్ వ్రాసిన విప్లవ గేయములు 1920-18 ల నడుమ టర్కీలోని సామ్రాజ్యవ్యవస్థను కదలించివేసినవి. కాని శ్రీశ్రీ మహాప్రస్థానం రచించునాటికి ఈ కవి రచనలు అనూదితములైనట్లు కనిపించదు. పాబ్లోనెరూడా మైకోవస్కీ ప్రభావముతో గళమెత్తిన విప్లవకవి. ఇతని గీతములు 1936 లోపుగా వ్యాప్తిపొందలేదు. కావున శ్రీశ్రీపై ఈ యిరువురి ప్రభావమున్నదని చెప్పుటకు వీలులేదు.

ఇక భారతదేశములోని కవుల ప్రభావమును పరిశీలింతము. శ్రీశ్రీ 'మహాప్రస్థానం' వ్రాయునాటికి వంగసాహిత్య గగనమున నజురులిస్లాం, రవీంద్రుడు సూర్యచంద్రులవలె విరాజిల్లుచుండిరి. అప్పటికే ఈ యిరువురి రచనలు ఇంగ్లీషు మున్నగుభాషలలో అనూదితములై దేశవ్యాప్తిపొందినవి. ముఖ్యముగా నజురులిస్లాం గేయములలో 'విద్రోహి', 'విప్లవగీతి' మున్నగు గేయములు యువకులలో విప్లవజ్వాలలను రెపరెపలాడించినవి. అప్పటికే తాను నజురులిస్లాం గేయములు చదివి ప్రభావితుడైనట్లుగా శ్రీశ్రీయే స్వయముగా ఆమోదించినట్లు 'మహాప్రస్థాన' గీతము పుట్టుకను గురించి వ్రాయునప్పుడు తెలిపియుంటిని. ఆ గీతముపై నజురులిస్లాం వ్రాసిన 'విప్లవగీతి' ప్రభావమును పేర్కొనియుంటిని. 'విద్రోహి'లో వీరయువకుల నుద్దేశించి

1. Quoted in 'Creative Experiment': P. 125.

'ఓ వీరయువకా ! నా శిరస్సు శిఖరములాంటిదని అను
హిమాలయశిఖరముకన్న మిన్నఅని అను
ఈ విషయాన్నే పదేపదే అను
గగనాన్నిచీలుస్తూ, స్వర్గవర్గాలను తిప్పేస్తూ అను.
విప్లవకారుణ్నని, తుఫానునని,
అగ్నిజ్వాలనని అను, పదేపదే అను.
నాదారికడ్డుగావున్నవాళ్ళెవరైనా త్రోసివేస్తానను.'[1]

ఈ గేయపంక్తులలోని భావము 'మరోప్రపంచం'గీతముపై సమష్టిగా ప్రభావము వేసియుండును. నజురుల్ తన్ను గూర్చి చెప్పుకొన్న గేయములోని

'అమిఉల్కా
అమిశని
అమిధూమకేతుజ్వాలా'

అన్నపంక్తులు శ్రీశ్రీ వ్రాసిన 'ఐ' శీర్షికతో గల గేయములోని

'భూతాన్ని
యజ్ఞోపవీతాన్ని
వైప్లవ్యగీతాన్నినేను'

అను పంక్తులలోని సంవిధానమునకు మార్గదర్శకములనిపించును. ఇవికాక నజురుల్ ప్రచురించిన 'ప్రళయశిఖ', 'యుగవాణి', 'అగ్నివీణ' అను కవితాసంపుటులలోని విప్లవగీతములలో నుండి కొన్నిరచనలు శ్రీశ్రీని కదల్చియుండును.

రవీంద్రుని కాల్పనికదృక్పథమునకు శ్రీశ్రీ వాస్తవిక దృక్పథమునకు 'చుక్కెదురు.' కాని రవీంద్రుడు వ్రాసిన 'ఝురఝురబరిషేబారిధారా' అనుగేయము శ్రీశ్రీ 'బాటసారి'పై కొంత ప్రభావమువేసినట్లు ఊహించుటకువీలున్నది. రవీంద్రుని గేయములోని క్రిందిపంక్తులను గమనింతము.

"Ceaseless is the welter of rain that wearies the sky.
Alas for the forsaken ; Alas for the homeless wanderer
The shrieks of the wind die away in sobs and sighs.
The night is hopeless like eyes of the blind.
The thunder growls, the lightning flashes its teeth."[2]

1. 'విద్రోహి'లోని కొన్ని పాదములకు నేనుచేసిన భావానువాదమిది.
2. Poems : Viswa Bharathi : Calcutta : Pub : 1946.

వీనిలోని భావమే ఇంచుమించుగా 'బాటసారి'లోని క్రింది పాదములలో తొంగిచూచుచున్నది.

'కూటికోసం, కూలికోసం
... ... ... ...
బయలుదేరిన బాటసారికి
మబ్బుపట్టీ, గాలికొట్టీ
వానవస్తే, వరదవస్తే
చిమ్మచీకటి క్రమ్ముకొస్తే
దారితప్పిన బాటసారికి
ఎంతకష్టం ?
.... .... .... ....
వానవెలిసీ మబ్బులోఒక
మెరుపుమెరిసింది.'

ముఖ్యముగా ఈగేయములోని 'దారితప్పిన బాటసారికి, ఎంతకష్టం'అనుమాటలు పూర్తిగా రవీంద్రుడన్న 'Alas for the forsaken! Alas for the homeless wanderer' అను మాటలను స్మరింపజేయుచున్నవి. ఇల్లు వీడి బయలుదేరిన బాటసారి దీనావస్థను చిత్రించుటలో మాత్రము శ్రీశ్రీ రవీంద్రుని గేయము ననుసరించినట్లు విశదమగుచున్నది. ఈ వస్తువును నిర్వహించుటలో ఇతడు మరల మౌలికతను చూపినాడు. రవీంద్రుడు బాటసారి దయనీయస్థితిని తెలుపుటతోనే గేయమును ముగించినాడు. శ్రీశ్రీ 'బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకొంటోంది' అని గేయమును విషాదాంతముగా మార్చి కరుణమహితముగా పరిణమింపజేసినాడు. పైగా రవీంద్రుని గేయములోని బాటసారికిలేని తల్లిని ప్రవేశపెట్టి శ్రీశ్రీ తన గేయమును మరింత ఆర్ద్రి మొనర్చినాడు.

ఇంతవరకు – 'మహాప్రస్థానం'లో నూత్నప్రయోగములు గల గేయములన్నిటిని గూర్చి చర్చించి, వానినిగ్గుల నేరిచూపితిని. ముఖ్యముగా ఈ సంపుటిలోని గీతములపైగల మార్క్సిజము ప్రభావమును, ఛందోభావనవ్యతలను. శబ్దపటిమను, సాంప్రదాయికతను, ఇతరకవుల ప్రభావములను వివరించిచూపితిని. 1940 తర్వాత శ్రీశ్రీ వ్రాసిన చమత్కారపద్యములను, అధివాస్తవిక గేయములను, ఆ యా విషయములను చర్చించినప్పుడు స్పృశింతును. శ్రీశ్రీ 'మహాప్రస్థానం' వ్రాయునాటికి మార్క్సిస్టు దృక్పథముతో వ్రాయబడిన రచనలకు 'అభ్యుదయ సాహిత్య' మను పేరు రూఢికాలేదు. తెలుగునాట 1940 తర్వాతనే – అనగా మహాప్రస్థానంలోని గేయములన్ని ప్రచురింపబడినపిమ్మటనే – 'అభ్యుదయకవిత్వ' మనుపేరు వ్యాప్తినొందినది. ఇక అభ్యుదయ కవిత్వోద్యమప్రగతి నుల్లేఖింతును.

# అభ్యుదయ కవితోద్యమము :

## అభ్యుదయరచయితల సంఘం :

1935 నాటికే భారతదేశములోని మేధావులు, రచయితలు కొందరు మార్క్సిస్టు దృక్పథముచేత ప్రభావితులైనట్లు ఇంతవరకే తెలిపియుంటిని. 1935లో లక్నో కాంగ్రెసుసభలో జవహర్‌లాల్‌నెహ్రూగారి అధ్యక్షోపన్యాసము భారతదేశములోని ప్రగతిశీలురకు కొండంత బలము నిచ్చినది. వారి లోలోపల గుడుసుళ్ళువడుచున్న ప్రగతిభావములకు విశాలవిహాయసము నందించినది. సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకముగా కంచుకోటవలె నిలబడి ప్రతిఘటించు రష్యా వారిలో క్రొత్తఆశలను రేకెత్తించినది. ఆంగ్లప్రభుత్వదౌర్జన్యమునకు నిరసనగా, మాటిమాటికి కయ్యమునకు కాలుదువ్వుచున్న ఫాసిజమునకు నాజిజమునకు వ్యతిరేకముగా, సమాజములోని ఆర్థికవ్యత్యాసములకు ప్రతికూలముగా ప్రగతిశీలురలో అపూర్వమైన సముత్తేజము, సంచలనము కలిగినవి. ఈ దృక్పథమును రంగరించుకొన్న రచయితలు సాహిత్యముద్వారా తమ అభిప్రాయ ములను సమస్త ప్రజానీకమునకు తెలిపి, వారిని జాగరితులుగా చేయుటకు సంఘటితులుకావలసిన అవసరమేర్పడినది. ఈ యవసరమే 1935 లో అఖిలభారతాభ్యుదయరచయితల సంఘముగా రూపుదిద్దుకొన్నది. 1936 ఏప్రిలు 10వ తేదీన లక్నోలో ఈ సంఘము ప్రథమమహాసభ మున్షీ ప్రేంచంద్ అధ్యక్షతను జరిగినది. ప్రేంచంద్ తన అధ్యక్షోపన్యాసమున విశ్వజనీనదృష్టిగల రచయిత పెట్టుబడిదారీవిధానమును, సామ్రాజ్యవాదధోరణిని సహింపలేడని, రచయిత కర్తవ్యము వినోదవిలాసములను చిత్రించుట కానేకాదని, ప్రస్తుతసమాజమును దివ్వటీపట్టి నడిపించుటయే అతని ధ్యేయమని యెలుగెత్తిచాటినాడు.[1] జవహర్‌లాల్‌నెహ్రూ ఈ సభ కిచ్చిన సందేశములో అభ్యుదయసాహిత్యము గురించి యిట్లనెను. "ప్రాచీనరచయితల దృష్టిలో ధనికదరిద్రభేదము శాశ్వతమైనది. ఈ భేదభావమును నిర్మూలించవచ్చునను విషయము వారికి స్ఫురించనేలేదు. ఆధునికకాలములో శాస్త్రవిజ్ఞానము, పరిశ్రమలు రాకపోకల సౌకర్యము లభివృద్ధిపొందుటతో ఈ భేదభావమును నిర్మూలించెడి యవకాశము కలిగినది. ప్రతిమానవుడు ఆర్థికముగా స్వయం పోషకస్థితిలో నుండు చక్కని వీలేర్పడినది. ఈ యవకాశమునకు వాస్తవస్థితిని కలిగించుటకు ప్రయత్నించుట అభ్యుదయరచయిత కర్తవ్యము.[2]"

1. సర్దార్ జాఫ్రీవ్రాసిన 'తరక్కీపసంద్‌అదబ్' అను ఉర్దూ గ్రంథమునుండి సంగ్రహించితిని (అను వాదము నాదే): పుట 47.
2. 'తరక్కీపసంద్‌అదబ్' : పుట 47

ఈ సంఘ మీవిధముగా మున్షీ ప్రేంచంద్, జవహర్‌లాల్ నెహ్రూ వంటి ప్రముఖుల ఆశీర్బలముతో ప్రారంభమైనది. అనతికాలమున విశ్వకవి రవీంద్రుని ఆశీస్సులను చూరగొన్నది. ఏడెనిమిది సంవత్సరములలో భారతదేశములోని అన్ని ప్రాంతములందు దీనికి శాఖలేర్పడినవి. కేవలము సాహిత్యసంబంధమైన కృషితోనే తృప్తిపడక, యెప్పటికప్పుడు ఉద్వేత్తగా నెగయుచున్న జాతీయాంతర్జాతీయ సమస్యల కనుకూలముగనో, ప్రతికూలముగనో పరిస్పందించిన సాహిత్యోద్యమ మిది. రచయితలలోని రాజకీయచైతన్యమునకు దారులుతీసిన తొలి ఉద్యమ మిది. రచయిత లుష్ట్రపక్షులవలె ఇసుకలో తలదూర్చి ప్రపంచమున కతీతముగా నుండజాలరని, వారును రక్తమాంసమజ్జానిర్మితులు కావున ఇతరులవలెనే తత్కాలీనరాజకీయార్థికసాంఘిక సమస్యలకు సంచలితులుకాకుండ ఉండలేరని నిరూపించినది. పెట్టుబడిదారీవ్యవస్థను, సామ్రాజ్యవాదతత్త్వమును, యుద్ధవాంఛను సూటిగా నిరసించినది. ఆకలి, దరిద్రత, అసమానత, పరాధీనత మున్నగు సాంఘికవ్యాధుల నిర్మూలనమునకు కృషిచేసినది. మతవర్ణవర్గభేదములను, జాత్యహంకారమును పునాదులతో పెల్లగించివేయవలెనను దీక్షపూనినది. సాహిత్యము రచయితల వైయక్తిక క్రీడాకందుకముకాదని, సమష్టిచైతన్యమునకు ప్రతిబింబమని, పీడితప్రజాసముద్ధరణమే రచయిత చరమలక్ష్యమని యీ సంఘము తన ప్రణాళికలో స్పష్టమొనర్చినది.[1] అఖిలభారతాభ్యుదయరచయితల సంఘములో ప్రముఖుడగు ప్రఖ్యాత ఉర్దూకవి సర్దార్‌జాఫ్రీ యీ సంఘస్థాపనోద్దేశము నిట్లు విశదీకరించినాడు. 'సాహిత్యము గాలివలె నిర్వేలముగా, మహానదివలె ప్రవాహరమ్యముగా, పక్షులకలకూజితములవలె స్వచ్ఛందసుందరముగా నుండవలెనని మా కోరిక. ఈ లక్ష్యసాధనకే మేము అభ్యుదయరచయితల సంఘమును స్థాపించినాము.'[2] ఇంతటి సల్లక్ష్యములతో స్థాపింపబడిన ఈ అభ్యుదయరచయితలసంఘము ఆంధ్రప్రాంతమున 1943 లో నెలకొల్పబడినది. తెనాలిలో జరిగిన ప్రథమాభ్యుదయరచయితలసంఘసభకు తాపీధర్మారావుగారు అధ్యక్షతవహించిరి. శ్రీశ్రీ, అనిసెట్టి, సోమసుందర్, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, చదలవాడ పిచ్చయ్యవంటి యువరచయితలు ఈ సంఘపతాకము క్రింద చేరి, క్రమముగా ఒక దశాబ్దముపాటు ఆంధ్రదేశములోని వివిధప్రాంతములందు వార్షికసభలు నిర్వర్తించిరి. సాహిత్యపాఠశాలలను నడిపించిరి. తెలుగుతల్లి, ప్రజాశక్తి, అభ్యుదయఅను సాహిత్యపత్రికలను తమ ఆశయప్రచారమునకు కొంతకాలము నిర్వహించిరి. అక్కడక్కడ ముద్రణాలయములను నెలకొల్పిరి. వీరేశలింగం, గురజాడ, గిడుగు, కొమఱ్ఱాజువంటి మహారచయితల వర్థంతుల నాంధ్రదేశమంతట జరిపించి, సాహిత్యము ప్రజలకొరకేయను లక్ష్యమును బలపరిచిరి. ఈ అభ్యుదయకవులలో ఇంచుమించుగా అందరు తమతమ అభ్యుదయగేయములను సంపుటులుగా ప్రచురించిరి. నవ్యసాహిత్యపరిషత్తువలె విద్యాధికులలోనేకాక యీ సంఘము విద్యాగంధములేని రైతులలోను కార్మికులలోను ఆశ్చర్యకరమైన సంచలనము కలిగించినది. బుర్రకథలు, వీధి

1. 'It is the object of our Association to rescue literature from the conservative classes...to bring arts into closest touch with the people'.

2. 'తరక్కిపసంద్ అదబ్' : పుట 98.

భాగవతములు, గొల్లసుద్దులు, జంగముకథలు, జముకులకథలు మున్నగు జానపదకళారూపముల ద్వారా యీసంఘము సాహిత్యమునకు, ప్రజాజీవితమునకు అవినాభావబంధమును నిరూపించినది.

ఆధునికాంధ్రకవిత్వములో భావకవిత్వముతర్వాత చెప్పుకొనదగిన ఉద్యమము అభ్యుదయ కవితోద్యమమే. దానివలెగాక యిది ఒక నిర్ణీతపద్ధతిలో, ఏకైకలక్ష్యముతో, సమస్త దేశభాష లలో ఒకేకాలమందు వ్యాప్తమైనది. ఇక 1935 నుండి 1945 లోపుగా భారతీయభాషలలో వెలువడిన అభ్యుదయకవిత్వమునుగూర్చి సంగ్రహముగా ముచ్చటింతును. ఆతరువాత అభ్యుదయ కవిత్వలక్షణములను సూత్రప్రాయముగా పరిశీలించిచూపుదును.

### భారతీయ భాషలలో అభ్యుదయకవిత్వ ప్రగతి:

భారతీయభాషలలో అఖిలభారతకీర్తిసంపాదించినవాడు వంగకవి నజురుల్ ఇస్లాం. ఇతడు వ్రాసిన 'విద్రోహి'గేయము సమస్తభారతదేశములో సంచలనము కలిగించినది. ఈ గేయరచనతో భారతదేశములోని అనేకాభ్యుదయకవుల కీతడు మార్గదర్శకుడైనాడు. 'విద్రోహి' రచించిననాటి కాలపరిస్థితులివి. భారతీయులు సామ్రాజ్యవాదవ్యతిరేకసంగ్రామమునకు నడుములు బిగించు చుండిరి. జలియన్‌వాలాబాగ్ సంఘటనలతో దేశీయుల హృదయవ్రణములను కెళ్లగించినట్లైనది. వంగభాషలో రవీంద్రసాహిత్యములోని కాల్పనికరీతుల పట్ల యువకులకు కొంత విముఖతయేర్పడి నది. ఈస్థితిలో వెలువడిన 'విద్రోహి' గేయము వాస్తవికతకు, సాహిత్యమునకు లంకెవేసి చూపినది. ప్రజావళికి ఆత్మశక్తిని, అఖండధృతిని ప్రసాదించినది. యుగవాణిని వినిపించినది. నజురుల్ ఇస్లాం ఈధోరణిలోనే వ్రాసిన అనేకగీతముల ప్రభావముతో వంగభాషలో అభ్యుదయ కవితోద్యమము బలపడినది. జీబనానందదాస్, గోకుల్‌నాగ్, బుద్ధదేవ్‌బోస్, ప్రేమేంద్రమిత్ర మున్నగు యువకవులు అభ్యుదయకవిత్వమునకు దోహదమొనర్చిరి. ప్రేమేంద్రమిత్ర తన ఆశయము నిట్లుద్ఘోషించెను.

'I am the poet of the carpenters, of the brass-workers, of the day labourers

I am the poet of the low.'[1]

ఉర్దూభాషలో 1931నుండియే అభ్యుదయరచనాబీజములు పడినవి. ప్రాతఅనుభవములను చిత్రించిన ప్రేంచంద్‌వంటి రచయితలుగూడ 1935 నుండి నూతనజీవితమును గూర్చి, నూతన దృక్పథముతో రచనలుచేయసాగిరి 1935తర్వాత ఉర్దూసాహిత్యరంగమున అభ్యుదయకవితో ద్యమము ముమ్మరించినది. జోష్, ఫైజ్, జాఫ్రీ, మక్దూం మున్నగుకవులు వాస్తవికదృక్పథ ముతో వర్గసంఘర్షణను, సమసమాజస్థాపనమును, సమరవిముఖతను తమ గేయములలో

1. **'Contemporary Indian Literature'** అను గ్రంథములో వంగభాషనుగూర్చిన వ్యాసము నుండి : పుట 27 : **Pub : 1957.**

చిత్రించిరి. హిందీభాషలో అభ్యుదయకవిత్వమునకు ప్రేంచంద్ మార్గదర్శియనవచ్చును. ఈ ఉద్యమమునకు హిందీభాషలో 'ప్రగతివాదము' అను పేరువచ్చినది. యశ్‌పాల్, నాగార్జున్, అంచల్ మున్నగువారు ఈ ఉద్యమమున పాల్గొని రచనలుచేసిరి. సుమిత్రానందన్‌పంత్ వంటి కాల్పనికకవి (ఛాయావాదకవి) కూడ ఈ ఉద్యమముచేత ప్రభావితుడై చక్కని అభ్యుదయ గేయములు రచించినాడు.

అస్సామిభాషలో ద్వితీయప్రపంచయుద్ధకాలమున మార్క్సిస్టుదృక్పథముచేత ప్రభావితులై యువకవులు వర్గసంఘర్షణ, పెట్టుబడిదారీవ్యవస్థకు వ్యతిరేకత, సామ్యవాదము మున్నగు వస్తువులను కవితావస్తువులుగా స్వీకరించిరి. ప్రాతఛందస్సును త్రోసివేసి వచనగేయమును చేపట్టిరి. మరాఠీభాషలో 1930 ప్రాంతములోనే 'రవికిరణమండల్' అనుసంస్థ స్థాపితమై అభ్యుదయ రచనలకు బాటలువేసినది. ఒరియాభాషలో కాల్పనికధోరణికి చెందిన 'సబుజాన్' (Greens) అను కవితాశాఖకు నిరోధకముగా 'ప్రజాకవిత్వము' పేర అభ్యుదయకవిత్వము అలలెత్తినది. సచీ రౌత్రే (Sachi Routray), అనంతపట్నాయక్ వంటి కవులు దీనికి నాయకులు. సచీ వ్రాసిన 'Pali Sree' అన్నది పేరొందిన అభ్యుదయకవితా సంపుటి.

దక్షిణప్రాంతమున తమిళములో తప్ప మిగిలిన అన్నిభాషలల అభ్యుదయకవిత్వము ఉద్యమరూపమున ప్రవహించినది. కన్నడములో 1939 నుండి ఈ ఉద్యమము ప్రారంభమైనది. 'రసఋషి' యను కవితాసంపుటి ఈధోరణిలో వెలువడిన చక్కని గ్రంథము. ప్రముఖకన్నడకవి బేంద్రే విప్లవపూరితమైన అభ్యుదయగేయములు రచించి ఈ ఉద్యమమునకు తోడ్పడినాడు. మళయాళభాషలో 1936లో 'పురోగమనవాదము' అనుపేర ఈ ఉద్యమము ప్రారంభమైనది. శంకరకురుప్, కృష్ణవారియర్, అక్కిట్టం, భాస్కరన్ మున్నగువారు పేర్కొనదగిన అభ్యుదయ కవులు. దక్షిణమున ఈ ఉద్యమమునకు బహుళవ్యాప్తి కూర్చినది తెలుగుభాషతర్వాత చెప్పుకో దగినది మళయాళమే.

ఈ భాషలలోని అభ్యుదయకవులందరు మార్క్సిజముచేత ప్రభావితులైనవారే. దానికి తోడుగా ప్రపంచప్రఖ్యాతులైన నాజింహిక్మత్, మైకోవస్కీ, పాబ్లోనెరూడా మున్నగువారి గేయములను అనువాదముల రూపమున చదువుకొని ఉత్తేజితులైనవారే. ఈ కవులలో గూడ పరస్పరానువాదముల ద్వారా ప్రభావితులైనవారున్నారు. ముఖ్యముగా నజ్రుల్ ఇస్లాం ప్రభావము భారతదేశములోని అభ్యుదయకవులందరిపై ప్రసరించినది. హరీంద్రనాథ్‌చటోపాధ్యాయ వ్రాసిన 'షురూహువాహై జంగ్' వంటి పాటలు, మక్దూంమొహియుద్దీన్ ద్వితీయప్రపంచసంగ్రామకాలమున వ్రాసిన 'యేజంగ్‌హైజంగే ఆజాదీ' అను ప్రసిద్ధగేయము భారతీయభాషలలో పలువురిని ప్రభావిత మొనర్చినవి. ఇక తెలుగులో అభ్యుదయకవితోద్యమ ప్రగతిని నివేదింతును.

### అభ్యుదయకవిత్వ నిర్వచనము :

అభ్యుదయకవిత్వము ఉద్యమరూపము వహించుటతో ఏది అభ్యుదయ కవిత్వమను జిజ్ఞాస బయలుదేరినది. ప్రాచీనసంప్రదాయమునకుచెందిన సహృదయ విద్వాంసులు దీనిని 'విశ్వ

శ్రేయఃకావ్యమ్', 'అభ్యుదయపరంపరాభివృద్ధిగా'వంటి ప్రాచీన సూక్తుల నాధారముగాజేసికొని సమర్థించినారు. నవ్యులు మార్క్సిజమును, భౌతికవాదమును, వాస్తవికతావాదమును కొలమాన ములుగాజేసికొని నిర్వచించినారు. సాహిత్యమున జరిగిన ఒక క్రొత్తప్రయోగమును పరిశీలించు నప్పుడు దేశకాలపరిస్థితులను దృష్టిలోనుంచుకొనుట అత్యవసరము. తెలుగులో తొలికావ్యము వ్రాసిన నన్నయకుమించిన అభ్యుదయకవి యెవరు? ద్విపదకావ్యములద్వారా సాహితీలోకమున తిరుగుబాటు లేవదీసిన పాలకురికిసోమనాథుడు అభ్యుదయకవి కాడా? రాజులను, పూజారులను, అవసరమైనప్పుడు దేవతలను ధిక్కరించిన శతకకవులు అభ్యుదయకవులుకారా? ఇట్టి సందేహము లను విమర్శకులు కొందరు వెల్లడించినారు. ఇవి పాక్షిక సత్యములే. కాని అభ్యుదయ కవిత్వమును నిర్వచించెడి కొలమానములు వేరు. భావకవిత్వమునుగూర్చి వివరించునప్పుడు ఈ విషయమును కొంత సూచించితిని. భావకవిత్వము వస్తుభావరచనలను మూడంశములలో భావమునే ప్రధానముగా ఆశ్రయించిన ఆత్మాశ్రయరీతియని మనవిచేసియుంటిని. అంతమాత్రము చేత ప్రాచీనకావ్యములు భావరహితములనుట సమంజసమైనదికాదు. అట్లే శ్రీశ్రీ ప్రభృతులు వ్రాసినది అభ్యుదయకవిత్వమన్నప్పుడు ప్రాచీనకావ్యములు, భావకవిత్వము అభ్యుదయకరమైనవి కావాయను సందేహము సముచితమైనదికాదు. నన్నయ 'విశ్వశ్రేయఃకావ్యమ్' అనుటలోని అంత రార్థము వేరు. అహోబలపండితీయములో ఈ సూత్రము 'కీర్త్యాదిసమస్త శ్రేయస్సాధనం కావ్య మిత్యర్థః' అని వ్యాఖ్యానింపబడినది, అనగా కావ్యము కీర్త్యాది సమస్తశ్రేయస్సులకు సాధనమని దీని అర్థము. మమ్మటుడుగూడ కావ్యము కీర్తిని, అర్థమును, వ్యవహారవేత్తృత్వమును, అమం గళ పరిహారమును, సద్యఃపరనిర్వృతిని కలిగించునని చెప్పెను.[1] ప్రబంధకవుల 'అభ్యుదయ పరంపరాభివృద్ధి'యన్న వాక్యములోని అభ్యుదయము ప్రధానముగా పారలౌకికాభ్యుదయము. అనగా మన పురాణకవులుగాని, ప్రబంధకవులుగాని కావ్యమును కేవలము భౌతికాభ్యుదయహేతు వని చెప్పలేదు. 'కావ్యంయశసేఽర్థకృతే' అన్న శ్లోకములోని కావ్యప్రయోజనములన్నిటితో ఆధునికకవి లేకీభవించలేరు. ముఖ్యముగా ఆధునికకాలమున వెలువడిన అభ్యుదయకవిత్వము పూర్తిగా భౌతికవాదపు పునాదులపై నిర్మితమైన మార్క్సిజముచేత ప్రభావితమైనది: దీనిలో ఆముష్మికచింతనకు ప్రసక్తిలేదు. కర్మసిద్ధాంతమునిది నమ్మదు. విధినిది పూజించదు. అదృశ్య శక్తులు మానవుని జాతకరేఖలను చిత్రించునను విశ్వాసమునిది నిరసించును. మానవుడు తన అస్తిత్వమునకు తానే కారకుడు. అతని మంచిచెడ్డల కతడేబాధ్యుడు. మానవులలోనే అధికార తృష్ణ, అర్థపిపాస, సమరకాంక్షగల వర్గమొకటియున్నది. ఈ వర్గము పెట్టుబడిదారులతో, సామ్రాజ్యవాదులతో కూడుకొనియున్నది. ఇది సామాన్యులను తన గుప్పిట పెట్టుకొన్నది. సామాన్యులలో కార్మికకర్షకాది పీడితజనులున్నారు. ఇది శ్రామికవర్గము. ఈ శ్రామికవర్గము యొక్క భౌతికశ్రేయస్సును గోరునది అభ్యుదయ కవిత్వము. పాశ్చాత్య విజ్ఞానము, ఆధునిక

1. 'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' —కావ్యప్రకాశము.

నాగరకత, నానాజాతిసమ్మేళనము, వసుధైకకుటుంబభావన మున్నగు నవ్యసిద్ధాంతములద్వారా పరిశీలించినప్పుడు అభ్యుదయకవిత్వమును సరిగా అర్థముచేసుకొనుటకు వీలున్నది. మన దేశము లోని అభ్యుదయ కవిత్వము ఇన్ని ప్రభావముల సమష్టిఫలితముగా రూపుదిద్దుకొన్నది. కావున దానిని నిర్వచించుటకు ఈ పరిస్థితులను, ప్రభావములను దృష్టిలోపెట్టుకొనకతప్పదు. అభ్యుదయ కవిత్వము నీ దృష్టితో నిర్వచించినవారిలో రాజమన్నారుగారు, కృష్ణశాస్త్రిగారు, శ్రీశ్రీగారు ప్రముఖులు. వీరి నిర్వచనములను దిగువ పొందుపరుతును.

రాజమన్నారుగారు అభ్యుదయరచయితలసంఘసభలోనిచ్చిన అధ్యక్షోపన్యాసమున అభ్యుదయ మనుదానిలో రెండు గుణములున్నవని, ఒకటి మార్పు, రెండు వృద్ధియని, సంఘ వృద్ధికి తోడ్పడు మార్పే అభ్యుదయమని సూచించిరి. ప్రతిపరిణామము పురోగమనశీలము కలిగి యుండునదికాదు. దాడాయిజము సంఘములోవచ్చినమార్పే. కాని సమాజమును ముందుకు నడి పించుటకు బదులుగా ముక్కచెక్కలుచేయు ధోరణి దానిది. కావున ప్రగతిశీలకమైనమార్పు అభ్యుదయకవిత్వ ప్రధానలక్షణము. రాజమన్నార్‌గారు అభ్యుదయరచనకు కావలసిన గుణముల నిట్లు వివరించిరి. "అభ్యుదయరచన సమకాలికమైన జీవిత పరిస్థితులకు, రాజకీయవాతావర ణానికి, ఆర్థికసమస్యలకు, సమాజసంఘర్షణలకు, నైతికసందర్భాలకు, ఐహికాముష్మికసిద్ధాం తాలకు, వైజ్ఞానికవిశేషాలకు, అనుగుణ్యంగా అనుకూలంగా తగినట్టి అవసరమైనట్టి మార్పులతో విలసిల్లవలెను.[1]"

రాజమన్నార్‌గారి వివరణము అభ్యుదయకవిత్వమునకు సంబంధించిన అన్నియంచులను స్పృశించుచున్నది. దీని పరిధిగూడ విశాలమైనదే. ఆముష్మికసిద్ధాంతములనుగూడ చేర్చుటలో వీరి దృష్టిపరిణాహము బోధపడును. మిగిలినవారు దీనిని చేర్చలేదు.

దీనిని కృష్ణశాస్త్రిగారీవిధముగా నిర్వచించిరి. 'పీడింపబడేవాళ్లూ పీడించేవాళ్లూవున్న యీ వర్గసమాజం ఉండాలని ఎవరూకోరరు. రానున్న విధానంలో సాధారణమానవుడే మకుటధారి. పురోగమిస్తున్నలోకాన్ని ప్రతిఘటింపజూచేవారు ఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనికసమాజం పోవాలనుకోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన.'[2]

శాస్త్రిగారి నిర్వచనము మార్క్సిజమును దృష్టిలోపెట్టుకొని చేయబడినదే. కాల్పనికోద్య మములో మానవుని మస్తకముపై మకుటముంచిన శాస్త్రిగారు అభ్యుదయకవిత్వనిర్వచన సందర్భమున 'సాధారణ' మానవుని మకుటధారిచేయుట గమనింపదగినది. ఈ నిర్వచనము సమగ్రమైనదనుటలో విప్రతిపత్తిలేదు.

1. 'అభ్యుదయ కవిత్వము' : 1947 మార్చి : అభ్యుదయ : పుట 87.
2. తృతీయాభ్యుదయరచయితలమహాసభ అధ్యక్షోపన్యాసము : తెలుగుతల్లి : 1946 మార్చి.

శ్రీశ్రీగారు 'అభ్యుదయ రచయిత : విప్లవదృష్టి' అనువ్యాసమున అభ్యుదయరచయిత దేనిమీద విప్లవము తెచ్చినాడను ప్రశ్నకు సమాధానముగా వ్రాసిన దిగువ పంక్తులలో కొంత వరకు అభ్యుదయకవిత్వనిర్వచనము నిక్షిప్తమైయున్నది. "వీరు తెచ్చిన విప్లవం రసావిష్కరణ కు, రసాస్వాదానికి సంబంధించినది. సాహిత్యం ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథం మీద వీరు తిరగబడుతున్నారు. నేటి రచయితలకు ప్రజలే ప్రమాణము. కొన్ని కారణాలవల్ల సాహిత్యానికి దూరమైపోయిన ప్రజల జీవితాలను మళ్ళీ సారస్వతోన్ముఖంగా తిప్పటానికి నేటి రచయితలు పాటుపడుతున్నారు."[1]

శ్రీశ్రీ నిర్వచనముగూడ పూర్తిగా మార్క్సిస్టు దృక్పథమునకు సంబంధించినదే. ఈ నిర్వచనములో; ప్రజల జీవితములు కొన్ని కారణములవలన సాహిత్యదూరములైనవని శ్రీశ్రీ అన్నాడు. ఈ కొన్ని కారణములలో సాంఘికచరిత్ర సమస్త మిమిడియున్నది. మార్క్సు చెప్పిన యుగవిభజనమును దృష్టిలోనిడికొని అన్నమాటలివి. ఆదిమకమ్యూనిస్టుసమాజములో ఉత్పత్తి పరికరములు సమష్టిగానుండెడివి. అందువలన ఆనాడు వర్గభేదములేదు. ప్రజల జీవిత గాథలే పాటలుగా, కథలుగా వెలువడినవి. తర్వాత బానిసయుగము వచ్చినది. ఈ యుగమున యజమానులు బానిసల నోళ్ళునొక్కి సారస్వతమును తమవైపు త్రిప్పుకొనిరి. తదనంతరము వచ్చిన జమీందారీయుగమున సారస్వతము జమీందారులచేతిలో కీలుబొమ్మయైపోయినది. విధిలేక కవులు రాజులను, భోగులను కావ్యనాయకులుగా చేసికొని రచనలుచేసిరి. ప్రజలు తెరమరుగున పడిపోవలసివచ్చినది. పిమ్మటవచ్చిన పెట్టుబడిదారీయుగమున సాహిత్యము పెట్టుబడిదారుల అభిరుచుల ప్రకారము మారిపోయినది. ధనికుల, భోగుల అధికారకాంక్షలు; వారి ఆశయములు, సమస్యలు కావ్యవస్తువులైపోయినవి. ఉత్పత్తి పరికరములు వీరి పిడికిటిలో నున్నందుననే సామాన్య ప్రజలు సాహిత్యమువకు దూరమైపోయినారని, ప్రస్తుతయుగమున శ్రామికవర్గచైతన్యము మహోజ్జ్వలముగా విజృంభించుచున్నందున సాహిత్యములో వారిజీవితసమస్యలనుచిత్రించు తరుణమాసన్నమైనదని, అట్టి సాహిత్యమే అభ్యుదయసాహిత్యమని శ్రీశ్రీ యభిప్రాయమైయున్నది. మార్క్సు నిరూపించిన చారిత్రకభౌతికవాదము (Historical Materialism) శ్రీశ్రీయన్న 'కొన్ని కారణాల' వెనుక నిగూఢముగానున్నది.

ఇక అభ్యుదయకవిత్వముపైగల కొన్ని సందేహములకు సమాధానము లిచ్చుటకు యత్నింతును.

అభ్యుదయరచయితలు గతమును పూర్తిగా నిరసించిరని ఒక అభిప్రాయము బహుళ వ్యాప్తమైయున్నది. గతనిరాసము అభ్యుదయరచయితల ముఖ్యలక్ష్యములలో ఒకటియను విషయము నిర్వివాదమే. కాని గతములోని మంచిని స్వీకరించి చెడును నిరసించుట నిజమైన అభ్యుదయకవిలక్షణము. మార్క్సిజము గతము నెట్లు పరిశీలించవలెనో ఋణముగా బోధించినది

1. 'అభ్యుదయ రచయిత : విప్లవదృష్టి :' తెలుగుతల్లి : 1946 మార్చి.

గతచరిత్రను బూడిదకుప్పయని త్రోసివేయక, ఆ బూడిదలో దాగియున్న విస్ఫులింగములను వెలికిదీయవలెనని స్పష్టపరిచినది. అభ్యుదయకవులలో పలువురీదృష్టినే కలిగియున్నారు. ప్రస్తుతసామాజికపురోగతినరికట్టు గతవిశ్వాసములను, మతసంప్రదాయములనిది త్రోసివేసినది. ప్రాచీనసాహిత్యమున కొన్ని కావ్యములు వర్ణవ్యవస్థను బలపరుచుచున్నవి. వానిని అభ్యుదయ కవి స్వీకరించడు. తులసీదాసరామాయణమున ఒకచోట మద్దెల, పశువులు, స్త్రీలు ఎల్లప్పుడు మర్దించతగినవారనియున్నది. దీనిని అభ్యుదయకవి స్వీకరించలేదు. రామాయణములోని పితృ వాక్యపరిపాలనగుణము, భ్రాతృప్రేమ, ధర్మానురక్తిమున్నగుగుణముల నీతడు తప్పక స్వీక రించును. అట్లే ప్రాచీనాంధ్రకావ్యములందు ఆయా సందర్భములలో ప్రయోగింపబడిన 'గత కాలముమేలు వచ్చుకాలముకంటెన్', 'ఉవిదలకు బుద్ధి పెడతలనుండుగాదె' అన్నవానిని సార్వ కాలికసత్యములుగా అభ్యుదయకవి ఆమోదించడు. పైగా ఈతనిదృష్టి 'మంచిగతమున కొంచెమే నోయ్' అన్నదానికి సన్నిహితమైయున్నది. ఈ దృష్టికలవాడు కావుననే శ్రీశ్రీ 'తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?' అని ప్రశ్నించగలిగినాడు. ఇంతమాత్రముచేత తాజ మహలువంటి బ్రహ్మాండమైన కళాసృష్టిని నిందించుట ఇతని ధ్యేయముకాదు. తాజమహలు రామ ణీయకమును చూచుటతోనే తృప్తిపడక, దానిని నిర్మించుటకు జీవితములను ధారవోసిన శక్తులను గూడ స్మరించవలెనని శ్రీశ్రీ అభిప్రాయము.[1] శ్రీశ్రీ గతితార్కికభౌతికదృష్టి నవగాహనము చేసికొనెడి సత్తువలేక కొందరు తాజమహలునుగూర్చి వింతధోరణిలో రచనలుచేసిరి. పినపాల వెంకటేశ్వరరావను కవి తాజమహలునుగూర్చి వ్రాయుచు

'ఏశ్రమికులో కండలునరికి
యిటుకలుగా పేర్చిరి వరుసగ
— — — — —
ఏసాదలొ నెత్తుటి అడుసుతో
అతికించిరా యిటుకలనన్నిటి
— — — — —
కూలిజనుల నెత్తుటిసరసిలో
తేలిన కమలం తాజమహలు'[2]

అని సుందరమైన కళాహర్మ్యమును జుగుప్సావహముగా చిత్రించినాడు. ఇది చారిత్రకదృష్టి గల అభ్యుదయకవి చేయవలసిన వర్ణనకాదు.

1. తాజమహలను హేళనచేసిన అభ్యుదయకవులను లేకపోలేదు. ఉర్దూలో ప్రముఖాభ్యుదయకవులు సాహిర్‌లుధ్యాన్వీ, కైఫీఆజమీ 'తాజమహలు'శీర్షికతో ఇట్టిగేయములే వ్రాసిరి. ఇది సరియైనపద్ధతి కాదని సర్దార్‌జాఫ్రీ 'తరక్కీ-పసంద్ అదబ్'లో విమర్శించెను.
2. తెలుగుతల్లి : 1946 మార్చిసంచిక.

అభ్యుదయకవిత్వము శబ్దశిల్పమును విస్మరించినదని మరియొక విమర్శయున్నది. అభ్యుదయకవిత్వమునకు సరళత, స్పష్టత ప్రధానగుణములు. దీనిలో విషయమునకే ప్రథమతాంబూలము. భాషకు రెండవస్థానమే యున్నది. నికృష్టజీవితము ననుభవించు పేదవాడు ధనికుని దృష్టిలో అసభ్యముగానే కనిపించవచ్చును. అది దృక్పథములోని భేదము మాత్రమే. ప్రజల నిత్యవ్యవహారములోని పలుకుబడులను యథాతథముగా స్వీకరించుట అభ్యుదయకవిత్వ ధ్యేయము. సమాసార్భటులు, మారుమూలపదములు, ప్రౌఢపదబంధములు లేనంతమాత్రమున అభ్యుదయ కవిత్వమున శబ్దశిల్పము కొరవడినదనుటకు వీలులేదు. రవీంద్రు డొక సందర్భమున 'ప్రజల భాషలో వ్రాయడం తన హోదాకు తక్కువనుకునేవాడు వ్రాసే శ్రమతీసుకోనక్కరలేదు' అని అన్నదానిలో ఈ సత్యమే ఇమిడియున్నది.[1] అభ్యుదయకవిత్వమునకు ప్రధానలక్షణములైన శిల్పసారళ్యమును. శబ్దసారళ్యమును ప్రముఖరచయిత క్రిస్టోఫర్‌కాడ్వెల్ ఇట్లు సమర్థించినాడు.

'......This art (proletarian art) has a simplicity and openness of theme which goes with a certain crudity and clumsiness in handling the technique; rather like a proletarian occupying for the first time a role in administration which hitherto has been peculiarly the prerogative of the bourgeois.'[2]

అభ్యుదయకవుల కొక ప్రత్యేకరాజకీయవర్గముతో సంబంధమున్నదని, అభ్యుదయరచనలకు శాశ్వతత్వములేదని మరి రెండు ముఖ్యమైన విమర్శలున్నవి. కవి ఒక ప్రత్యేకరాజకీయ వర్గము కొరకు ప్రచారముచేసినచో అది అతని వ్యక్తిగతవిషయము. కవిత్వములో రాజకీయ నినాదములను గుప్పించవచ్చునా అన్నదే ప్రశ్న. కమ్యూనిస్టునాయకుడు మావ్-సే-టుంగ్ కూడ 'చక్కనివిషయంతో కూడివున్నా కళాసౌష్ఠవంలేక వట్టినినాదాలబోర్డుల్లాగావుంటే వాటిని తిరస్కరిస్తా'మని ఉద్ఘాటించినాడు.[3] కావున శిల్పములేని వట్టిరాజకీయనినాదములు కవిత్వముకాదన్నదే అభ్యుదయకవుల దృక్పథమని తేలినది. ఇక శిల్పరమణీయముగా నున్నంతమాత్రమున ఒక రాజకీయపక్షమునకు ప్రచారముచేయుట సముచితమేనా యనుప్రశ్న ఉదయించును. దీనికి శ్రీశ్రీ యిట్లు సమాధానమిచ్చినాడు. 'తాను యే సాంఘికదురన్యాయాలను నిర్మూలించాలని ఆవేదనపడుతున్నాడో, వాటి నిర్మూలనకే ఒక రాజకీయపక్షంగూడా ప్రచారంసాగిస్తే కవి తన శిల్పాన్ని తప్పకుండా ఆ పక్షానికి అంకితంచేసి తీరుతాడు.'[4]

ఇక రచనల శాశ్వతత్వ సమస్య. అభ్యుదయకవులు వర్తమానసమస్యలను కవితావస్తువులుగా స్వీకరించుట దోషముకాదుసరికదా గుణము. ప్రపంచప్రఖ్యాతులైన కవులందరు వర్తమాన

1. అభ్యుదయరచయితలసంఘద్వితీయవార్షికసభాప్రారంభోపన్యాసములో సజ్జాద్‌జహీర్ ఇచ్చిన ఉపన్యాసము నుండి : తెనుగుతల్లి : 1945 ఏప్రిలు.
2. Illusion And Reality : P. 291 : Pub. 1956.
3. కళలు : సారస్వతము ఎవరికోసము : మావ్-సే-టుంగ్.
4. 'అభ్యుదయ రచయిత : విప్లవదృష్టి' : (వ్యాసము) : తెలుగుతల్లి : పుట 15.

సమస్యలను స్వీకరించినవారే. వాల్మీకి తన యుగవాణినే రామాయణము ద్వారా వినిపించెను షేక్స్పియరు తననాటి వస్తువులనే స్వీకరించి వ్రాసెను. భారతరచనలో నన్నయ తనకాలమున కవసరమైన వైదికమతప్రాశస్త్యము నుగ్గడించుటకు ప్రయత్నించెను. అంతమాత్రమున వీరి రచనలకు శాశ్వతత్వము లేకుండపోయినదా? దినదినము వాని విలువ పెరుగుచునేయున్నది. కావున వస్తువు తాత్కాలికమైనంతమాత్రమున అది కవితావస్తువు కాకుండపోదు. దానిని తీర్చి దిద్దు సంవిధానమును బట్టి, భావనాబలమును బట్టి దానికి శాశ్వతత్వమేర్పడును.

ఇంతవరకు అభ్యుదయకవిత్వముపైగల విమర్శలలోని ప్రధానాంశములకు సమాధానము లిచ్చుటకు ప్రయత్నించితిని. ఈ సమాధానములు అభ్యుదయకవిత్వములోని ఉత్తమపార్శ్వము నెత్తిచూపుటకును ఉపకరించినవనుకొందును. సమాజములోని పీడితప్రజల ఆందోళనలను, ఆశయములను చిత్రించుటకు అభ్యుదయకవిత్వము నిర్వహించినపాత్ర మాత్రము విస్మరించుటకు వీలు లేనిది. 'It cannot be denied, however, that the main spirit of the writing of progressive writers is bound to act as a leaven, and serve to mirror the struggles and the aspirations of a world weary with exploitation of various kinds'.[1]

### తెలుగులో అభ్యుదయ కవిత్వవికాసము :

1943 లో అభ్యుయరచయితలసంఘస్థాపనతో ఈ కవిత్వము విశ్వరూపముదాల్చినది. శ్రీశ్రీ 'మహాప్రస్థాన' సంపుటిలో సమస్తదేశములకు, ప్రపంచమానవులకు సంబంధించిన సంఘటనలను, అనుభవములను మాత్రమే వర్ణించినాడు. ప్రత్యేకముగా కొన్నిదేశములలోని ఉద్యమముల నీతడు స్వీకరించలేదు. శ్రీశ్రీ వదలిన ఈ యంశమును తరువాతి అభ్యుదయకవులు స్వీకరించిరి 1944 లో వెలువడిన 'నయాగరా' కవితాసంపుటి ఈ ధోరణికి ప్రతినిధి వంటిది. బెల్లంకొండ రామదాసు, కుందుర్తిఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం అను ముగ్గురి కవుల గేయము లీ సంపుటిగా వెలువడినవి. సీతారామరాజు మన్యవిప్లవము, దండిసత్యాగ్రహమున పాల్గొన్నందున ప్రభుత్వముచేత యావజ్జీవకారాగారశిక్ష విధింపబడిన విప్లవనాయకుడు ఠాకూర్ చంద్రసింగ్ వీరచరిత్రము మున్నగు సంఘటనలు వీరికి కవితావస్తువులైనవి. అంతేకాక పారిస్ వీధులు, చైనాలోయలు, బర్మాఅడవులు, మాస్కోగేట్లు, సోల్జర్లు, టాంక్ డ్రైవర్లు, గెరిల్లాల గుంపులు, కొడవలిపదును, 'ఎర్రటిజెండా', సమ్మెటపెట్టు, నిప్పులగొంతుక మున్నగునవి వీరి గేయములలో స్థానమేర్పరుచుకొన్నవి. శ్రీశ్రీ స్వీకరించిన జగన్నాథ రథచక్రములు, 'అవతారము' లోని యముని మహిషపులోహఘంటల వంటి సంకేతములుకాక వాస్తవికసంఘటనలు. నగ్నానుభూతులు స్వీకరింపబడినవి. అభ్యుదయకవిత్వ వికాసదశలో గమనింపదగిన మజిలీ 'నయాగరా'

1. **Triveni: 1943 June: (Editorial నుండి).**

కవితాసంపుటి. రమణారెడ్డిగా రన్నట్లుగా 'శ్రీశ్రీ కల్పించింది వాతావరణం మట్టుకే కాగా 'నయాగరా' కల్పించింది ఆ వాతావరణంలోని స్థూలరేఖలు'.[1]

'నయాగరా' కవితాసంపుటి ప్రచురింపబడినతర్వాత పలువురభ్యుదయకవుల గేయములు పుస్తకరూపమున వెలువడినవి. 1950 లోపుగనే వెలువడినవానిలో దాశరథి 'అగ్నిధార' (1949), 'రుద్రవీణ' (1950), సోమసుందర్ 'వజ్రాయుధం' (1949), ఆరుద్ర 'త్వమేవాహం' (1949), అనిసెట్టి 'అగ్నివీణ' (1949), నారపరెడ్డి 'అశ్రుమాల' (1950), రెంటాల 'సంఘర్షణ' (1950), గంగినేని 'ఉదయిని' (1950) మున్నగునవి అభ్యుదయకవితాధ్వమున మైలురాళ్లవంటివి. 1950లో శ్రీశ్రీ 'మహాప్రస్థానం' పుస్తకరూపమున వెలువడినది. పైసంపుటులతో పాటు 1950 తర్వాత పుస్తకరూపము దాల్చిన రమణారెడ్డి 'భువనఘోష' (1955)[2], నారపరెడ్డి 'నావీణ' (1953), కుందుర్తి 'తెలంగాణ' (1956), పుట్టపర్తి 'పురోగమనం' (1951), రెంటాల 'సర్పయాగం' (1957), సోమసుందర్ 'కాహళి' (1953) మున్నగునవి అభ్యుదయకవితోద్యమమున ఎన్నదగిన కవితా సంపుటులు. వీనిలో కొన్నిసంపుటులలోని గేయములు, అవి సంపుటీకరింపబడుటకు మూడు నాలుగు సంవత్సరములు ముందుగానే పత్రికలలో వెలువడి ప్రజల అభిమానమును చూరగొన్నవి. కావుననే 1957లో వెలువడిన కొన్ని సంపుటులను గూడ ఈ శీర్షిక క్రింద స్వీకరించితిని.

ఇక అభ్యుదయకవులలో ప్రముఖుల రచనల నాధారముగా జేసికొని వారు చిత్రించిన కవితాధోరణుల నావిష్కరింతును.

### 1. వర్గసంఘర్షణ :

అభ్యుదయకవిత్వమునకు వర్గసంఘర్షణ ప్రథమగణ్యమైన లక్షణము. దీనిలోనే గత నిరాసము, ప్రస్తుతపు 'బూర్జువా' వ్యవస్థ తిరస్కారము ఇమిడియున్నవి. 'ఏదేశ చరిత్ర చూచినా, ఏమున్నది గర్వకారణం, నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం' అన్న శ్రీశ్రీ వాక్కులు తదనంతరాభ్యుదయకవులకు ఋక్కులైనవి. ఆ వెలుగులోనే వారు గతచరిత్ర పర్యాలోకనము ప్రారంభించిరి.

'నరచరిత్ర క్రిక్కిరిసిన, ప్రళయసమర సంఘర్షణ
జారిన వీరులరక్తం, ఆరని వనితల దుఃఖం'[3]

అని వీరు గతచరిత్రలోని రక్తాశ్రుమలీమసత్వమును నిరసించిరి. చరిత్ర చీకటిగదిని వెదకినచో కనిపించునవి 'పెద్దల, విద్యావంతుల, ధనరాజుల, తరతరాలబూజుల, వొతిపాతగాజుల విలువ' లని యీసడించిరి.[4] గతచరిత్రలోని ఘనవిజయములను జాతిని జాతి దోచుకొన్న పురాతన

1. అభ్యుదయకవిత్వం (వ్యాసము) : అభ్యుదయ : 1955 జులై : పుట 100.
2. రమణారెడ్డి 'అడవి' దీనికిముందు వెలువడిన కవితాసంపుటి. దీనిలో ప్రచురణకాలము తెలుపబడలేదు.
3. అగ్నివీణ : అనిసెట్టి : పుట 58. 4. రుద్రవీణ : దాశరథి : పుట 36.

గాధలుగా తేల్చివేసిరి. అంతేకాక ఇంతకాలము సమాజమొక చెరసాలవంటిదని, దానిని పూజారులు, సమ్రాట్టులు, అమాత్యులు, మతాధిపతులు, మతాధినేతలు కలసి నిర్మించిరని తీవ్రముగా ప్రతిఘటించిరి.[1] గతనిరసనముతో పాటు వర్తమానములో అధికారమువహించుచున్న 'బూర్జువా' విధానము వీరి నిరసనకు గురియైనది. 'ఒకవేపున అధికోత్పత్తి, మరోవేపు డొక్కల కరువూ' కల బూర్జువాసమాజ మంతరించవలెనని వీరు కాంక్షించిరి.[2] పాశ్చాత్యదేశములలో 1940-35 ల మధ్యకాలమున వచ్చిన ఆర్థిక సంక్షోభమునకు జడిసి, అధికోత్పత్తిచేయుచున్న అమెరికా కొంత ధాన్యమును సముద్రముపాలు చేసినది. ఈ కాలముననే ఇతరదేశములలో ఆకలితో ప్రజలు నకనకలాడుచుండిరి. ఈ విషయమునే పై పంక్తులలో అభ్యుదయకవి వ్యంజింపజేసినాడు. పెట్టుబడిదారీసమాజములోని ఉత్పత్తిసాధనములలో 'ఫ్యాక్టరీ' ఒకటి ఇది పూర్తిగా పెట్టుబడిదారుల చేతులందున్నది. శ్రామికుల స్వేదబిందువులను రక్తముగా త్రాగి ఈ ఫ్యాక్టరీలు జీవించుచున్నవని అభ్యుదయకవులు పెట్టుబడిదారీ సమాజమును నిరసించిరి.

'ప్రతినిత్యం ఫ్యాక్టరీ
కూలియెముకలనెన్నో
సున్నంగా చిదకగొట్టి
రక్తంతో రంగరించి
ధనస్వామి పాదమ్ముల
పారాణిని పూస్తున్నది'[3]

అని ఒడలు జలదరించునట్లుగా మహావేశములో అభ్యుదయకవి యెలుగెత్తిచాటినాడు.

గతనిరాసము, ప్రస్తుతవ్యవస్థాతిరస్కారముతోపాటు వర్గసంఘర్షణ తప్పదని మార్క్సు చెప్పిన జోస్యమునకు వీరు భాష్యముచెప్పిరి.

'అనాదిగా సాగుతుంది అనంతసంగ్రామం,
అనాధుడికీ, ఆగర్భశ్రీమంతుడికీ మధ్య'[4]

అనీ వర్గసంఘర్షణను సుందరముగా సూత్రబద్ధముచేసిరి.

'అలకాపురానికీ అలగాజనానికీ యిది సమరం సంకులం'[5]

అని భంగ్యంతరముగా చెప్పటతో తృప్తిపడక 'అమెరికాతనానికీ అగాధజనాళికీ యిది యుద్ధం దారుణం.'[6] అని కుండబ్రద్దలుగొట్టినట్లు చెప్పిరి. ఈ సిద్ధాంతమునే

1. నయాగరా : రామదాసు : పుట 19. 2. నయాగరా : కుందుర్తి : పుట 48.
3. వజ్రాయుధం : సోమసుందర్ : పుట 29. 4. అగ్నిధార : దాశరథి : పుట 111.
5. అడవి : రమణారెడ్డి : పుట 20. 6. అడవి : పుట 20.

'భూరివృక్షం జారిపడ్డపుడే
లేతమొక్క పైకిలేస్తుంది
పసిడిమేడ ప్రక్కకొరిగినపుడే
అడుసుగుడిసె నడువనేరుస్తుంది'[1]

అన్నంత వ్యంగ్యముగా చెప్పుటయు లేకపోలేదు. అట్లే శ్రామికవర్గచైతన్యమును రుధిరపక్షులుగా, ఆ రుధిరపక్షుల రెక్కల బరువునకు 'కూలిపోయిన గాలిసౌధం'గా పెట్టుబడిదారీవ్యవస్థ నుత్ప్రేక్షించుట అభ్యుదయకవుల ధ్వనిమార్గసంచారమునకు నిదర్శనము.[2]

## 2. విప్లవప్రబోధము :

'బూర్జువా' వ్యవస్థలో శ్రామికవర్గప్రస్తుతస్థితి 'రైలుక్రింద పట్టాలాగా, చెప్పుక్రింద చీమల్లాగా'[3] ఉన్నదని అభ్యుదయకవులు గమనించినారు. శ్రామికుని 'పిల్లల నిల్లాలిని కిల్లీమాదిరి నమిలే మిల్లు మ్యాగ్నెట్లు', అతని వేడివేడి నెత్తురుతో 'షవర్‌బాత్' తీసుకునే భువనైక ప్రభువులు'[4]న్నారని అభ్యుదయకవులు సింహగర్జనచేసినారు. శ్రామికులు, నిరుపేదలు పచ్చిగడ్డి వంటివారు. ఒక్కొక్కగడ్డిపరక ఒక కరవాలమై అభ్యుదయనిరోధకులను హతమార్చునని వారు విశ్వసించిరి. అందుకు సార్వజనీనమైన విప్లవము రావలెనని కాంక్షించిరి.

'గుండెగుండెకు చిచ్చుమండించి లేవండి
గుడిసెగుడిసెకు కోట నిర్మించి లేవండి'[5]

అని వారు పీడితప్రజలను విప్లవమునకై ప్రబోధించిరి. ఎప్పుడోఒకప్పుడు సమాజములో మార్పు రాదా ? దానికి విప్లవము, తిరుగుబాటు ఎందుకను మితవాదులకు విరుద్ధముగా వారు గొంతెత్తిరి.

'ప్రాతస్సంధ్యానేత్రం ప్రసవించేపర్యంతం
నిశితనిశానిస్త్రింశం నీడల్లో నిలిచేమా'[6]

అని యెదురుతిరిగిరి. వేకువజామున వెలుగందించుటకు వీరే కావలసినపనిలేదని, 'నిశలో ఉష వెల్గించగ నిల్వండి జనుల్లారా!'యని విప్లవశంఖమొత్తిరి. ఇంక వీరి నినాదము లిట్లు సాగినవి.

'యుగధర్మం ! చైతన్యం-జనహృదయం ! పోరాటం
తిరుగుబాటు! తిరుగుబాటు! తిరుగుబాటు! బావుటా'[7]

'లోకపు సిరిసంపదలకు మనకూ హక్కు'న్నదని ప్రబోధించుచు

1. జలపాతం : నారాయణరెడ్డి : పుట 40. 2. రుద్రవీణ : పుట 25.
3. నయాగరా : పుట 14. 4. అగ్నిధార : పుట 95. 5. అగ్నివీణ : పుట 46.
6. జలపాతం : పుట 42. 7. వజ్రాయుధం : పుట 11.

'పామరుల శిరస్సులతో బంతులాడు పాలకులను
ప్రగతిచక్రఘట్టనతో సంహరించవలెనురా'[1]

అని వీరోచితముగా వీరు నినాదములిచ్చిరి. వీరి విప్లవప్రబోధముతో 'దీన పరాధీనజాతి, శ్రామిక జాతి దెబ్బతిన్న బెబ్బులివలె మేల్కొన్నది.'[2] అంతేకాదు, ప్రతీకారవాంఛ బుసగొట్టుచుండగా విశ్వరూపము వహించినది. 'ఆకలితో అటమటించు' జీవులకు 'అన్నపూర్ణ స్వర్ణపాత్ర'గా అవతరించినది.[3] 'దంతాలమేడలో మంతనాలాడేది' వారి పాలిట మాత్రము

'గాండ్రించిన బెబ్బులిగొంతై
తీండ్రించిన బలిపౌలికేకై, విడదీసిన పిడికిలిబాకై
విదిలించిన సింహపుజూలై, అదిలించిన వీరగర్జయై
పగిలించిన ప్రళయంబాంబై, రగిలించిన అగ్నిగోళమై'[4]

ఘీంకరించుచు, దిక్‌దిక్కుని అధర్మధిక్కారముచేయుచు విజృంభించినది. ఈ విప్లవశక్తుల విజృంభణమును గమనించి అభ్యుదయకవులు పరవశులై

'ఎవరాపుదు రీశక్తిని ఎవరడ్డుదు రీ కత్తిని'[5]

అని గానముచేసినారు.

**వీరగాథాకథనము :**

భావకవులు ఆంధ్రాభిమానమో, జాతీయాభిమానమో ఉన్న వీరులను గూర్చి పాడుకొనిరి. అభ్యుదయకవులంతటితో తృప్తిపడక 'బూర్జువా' వ్యవస్థ నెదిరించి, దానిని గడగడలాడించి, చివరకు తమ అసువులను తృణప్రాయముగా విసరివేసిన విప్లవవీరులను గూర్చి గానముచేసిరి. అల్లూరి సీతారామరాజు, ఠాకూర్‌చంద్రసింగ్, భగత్‌సింగ్ మున్నగువారిని గూర్చి వీరు మహావేశముతో గేయములు రచించిరి. దేశవిఖ్యాతులైనవారిని గూర్చియేకాక తెలంగాణమున, ఆంధ్రప్రాంతమున పాలకవర్గమును ప్రతిఘటించి ప్రాణములొడ్డిన వీరులగూర్చి వీరు స్మృతిగీతములు రచించిరి. తెలంగాణాపోరాటమున పాల్గొన్న 'మాధవరెడ్డి, కొమరయ్య, కామ్రెడ్ లక్ష్మీనరసయ్య, రఘుపతిరెడ్డీ, మేరయ్యా, చిన్నారెడ్డీ, ఎల్లయ్యా, పాపయ్యా, మల్లయ్యా, సామ్యూలూ, లింగయ్యా, దస్తగిరీ, వినాయకయ్యా, కొమరయ్యా, అమరయ్యా, కాంతయ్యా. అనంతయ్య' వంటి చరిత్రకెక్కని నెరజోదులు వీరికి 'నిటాలాక్షు'లుగా కనిపించిరి.[6] మార్క్సిజమునకు విశ్వశ్రామికదృష్టి ప్రధానలక్ష్యము. అందువలన లోకములోని ప్రగతిశీలురైన జోదులందరు అభ్యుదయకవులస్తుతిని చూరగొనిరి. మాధవరెడ్డితోపాటు గేబ్రియల్ పెరీని, భగత్సింగ్‌తోపాటు ఫ్యూజిక్‌నుచేర్చి వారిని

---

1. అగ్నివీణ : పుట 88. 2. అగ్నిధార : పుట 96. 3. నయాగరా : ఏల్చూరి : పుట 49.
4. కల్పన : (ఆధునిక కవితా సంకలనం) విశ్వం · పుట 129.
5. సంఘర్షణ : రెంటాల : పుట 34. 6. భువనఘోష : రమణారెడ్డి : పుట 25.

స్మరించుటలో ఈ దృష్టి ద్యోతితమగుచున్నది.[1] వీరిలో మాధవరెడ్డి తెలుగువాడు. గ్రేబియల్ పేరీ ప్రఖ్యాత ఫ్రెంచిరచయిత. 'Tomorrow is ours' అన్న అభ్యుదయగ్రంథ మీతనిదే ఇతనిని నాజీప్రభుత్వము ద్వితీయప్రపంచయుద్ధకాలమున నిర్బంధించినది. మరి భగవత్సింగుతో పాటు చేర్చబడిన 'ఫ్యూజిక్ (Fuchick) చెకోస్లోవెకియాలోని అభ్యుదయకవి. ఇతనిని గూడ ద్వితీయప్రపంచయుద్ధకాలమున నాజీప్రభుత్వ మురితీసినది. ఈవిధముగా ప్రపంచములోని యేమూలలోని విప్లవవీరుడైనను ఈకవుల లేఖినుల కుద్రేకములూదినాడు. అట్లే విశ్వపటములోని యేదేశములోని విప్లవవ్యతిరేకియైనను వీరి దూషణకు, ప్రతిఘటనకు గురియైనాడు. రెండవ యుద్ధములో హిట్లరుకు యుద్ధమంత్రిగా నున్న గోరింగు, ప్రచారమంత్రియైన గోబెల్సుతో పాటు, 'ఫారో, నీరో, ఖానులు, సీజరు, జారు, ఖైజరు'వంటివారు గూడ వీరి ప్రతిఘటనపాలైనారు.[2] వీరిలో ఫారో ఈజిప్టుదేశపు పూర్వప్రభువు. పిరమిడ్లు కట్టించుట కనేకులను బానిసలుగాచేసి వారిని పీడించినవా డితడు. సీజరు, నీరో క్రూరులైన రోమనుచక్రవర్తులు. జారు రష్యాదేశపు నిరంకుశచక్రవర్తుల బిరుదనామము. ఖాను నరరక్తతృష్ణగల చెంగీజ్ ఖాను. ఈవిధముగా ప్రజాద్రోహులైనవారిని గీతప్రతిఘాతములతో నెదుర్కొని, ప్రజాబంధువులైన వీరుల శౌర్య శీలములను వీరు కీర్తించినారు. వ్యక్తికీర్తనమే కాక నవచైనా, నియంతల కెదురుదిరిగిన మలయా, కొరియా మున్నగు పురోగామిదృక్పథముగల దేశములుకూడ వీరి స్తుతిపాత్రములైనవి.

అభ్యుదయకవుల 'గెరిల్లా' పోరాటమునకు సంబంధించిన వర్ణన లీ వీరగాథాకథనమున భాగస్వాములే. పాలకవ్యవస్థను సంప్రదింపులతో, సామముతో లొంగదీయుట సాధ్యముకాదని భావించిన అతివాదులు స్వాతంత్ర్యమునకు పూర్వము, దానితర్వాత, 'గెరిల్లా' పోరాటము సాగించిరి. అడవులలో దాగి, 'కాయకసురుల'ను దిని, అష్టకష్టములకోర్చి మిలిటరీని, పోలీసులను ఎదిరించిరి. వీరి పోరాటములోని మంచిచెడ్డలు ప్రస్తుత మప్రస్తుతములు. ఆ పోరాటములు అభ్యుదయకవుల నెట్లు కదలించివేసినది మాత్రమే ప్రకృతవిషయము. తెలంగాణమున నల్లగొండ మండలములో జరిపిన గెరిల్లాపోరాటముల నీకవులు ప్రముఖముగా వర్ణించిరి, జనగామలోని గెరిల్లానాయకుని, 'జమ్మికొమ్మపై' నెక్కి గాండీవమును వెదకు విజయునితో ఉపమించిరికవులు.[3] శత్రువులు జనగామను ముట్టడించి పెట్రోలుతో ఇండ్లు తగులబెట్టగా, పసికందులను, మిసిమి జవ్వనులను నిర్దాక్షిణ్యముగా హతమార్చుచుండగా, ఆ తెలంగాణ గెరిల్లానాయకుడు

'ప్రళయకాలమహారుద్రుడై -
తాండవజటాజనితభద్రుడై -'

విజృంభించెనని, అతడు హత్యను, మృత్యువును జయించిన అమృతాంధసుడని, అతనినాయకత్వములో 'ఈటెలూ బల్లెములు నాటుబందూకులూ రోకళ్లు, కారాలమూటలతో' ప్రజలందరు తిరుగ

1. కల్పన : అవసరాల : పుట 118. 2. అడవి : పుట 12.
3. వజ్రాయుధం : పుట 55.

బడినారని, విజయము వారికే లభించినదని అభ్యుదయకవులు గానముచేసిరి.[1] ఈ పోరాటములో యువకులతోపాటు స్త్రీలుగూడ పాల్గొని, శత్రువులను ధిక్కరించి

'తేతెండి వడిసెలలు రాలు రువ్వండి
పోపొండి మెరపపొడి కళ్లకుప్పండి
కాల్చండి లారీలు గోరీలు పూడ్చండి
మృత్యువై మనము శవతాండవము నేడు'[2]

అని భద్రకాళికలవలె తిండ్రించిపోయినట్లు ఈ కవులు చిత్రించిరి. 'గెరిల్లా' పోరాటములోని అన్నియంచులను, నెత్తురును, కన్నీళ్ళను యథాతథముగా చిత్రించిన అభ్యుదయకవి గంగినేని. ఇతని 'ఉదయిని' ఈ తెగకు చెందిన 'మహోజ్జ్వల కావ్యసంపుటి'. 'గంగినేని స్వయముగా గెరిల్లాపోరాటపు ఆటుపోట్లకు గురియైనవారిలో ఒకరు. పోలీసుక్యాంపు చిత్రహింసలను అనుభవించారు.'[3] చిమ్మచీకటిని కప్పుకొని పడుకొనియున్న ఒక అర్ధరాత్రిలో అరణ్యగర్భమున గెరిల్లా దళరక్షణ కేంద్రముపై ఎస్. ఎ. పి. (Special Armed police) క్రూరమైనదాడి జరిపినపిమ్మట దళము గబగబ ప్రయాణము సాగించినది. ఆవిధముగా ప్రయాణించుచున్న 'గెరిల్లా' వీరుల నుద్దేశించి, 'అరచేతిలో మృత్యువు' అను శీర్షికతో ఈ కవి వ్రాసిన

'జాగ్రత, భుజంపై తుపాకీ అదే మన పంచప్రాణం
మొలలో తూటాబెల్టు ! అదేఅదే మన సర్వస్వం'[4]

'ఇక్కడకాదు ముళ్ళతీసేది నడువు క్రామేడ్ !
ఇప్పుడుకాదు కాళ్ళుకుంటడం దళంలో కలిసి పదవయ్యా'[5]

'ఇంటిదగ్గర అంతాకులాసా రేపీపాటికి ఈప్రాంతం మనది
తెలీదా, నిన్న ఆరుపరగణాలు మనవాళ్ళు విముక్తిచేశారు'[6]

వంటి పంక్తులలో ఈ ఉద్యమములో నున్నబాధలు, గెరిల్లాల కష్టగాధలు హృదయవిదారకముగా చిత్రింపబడినవి. ఈ సంపుటిలోని 'ప్రియుడు ప్రియురాలికి', 'తల్లి తనయునికి' అన్న లేఖారూపక గేయములు గెరిల్లావీరుల హృదయములోని ఉద్రేకబడబాగ్నిని, వారిని నమ్ముకొనియున్న తల్లుల గుండెలలోని శోకదవాగ్నిని కరుణమహితముగా చిత్రించిన కవితాఖండములు. ఒక విప్లవకారుడు, ఒక యువతి పరస్పరము గాఢముగా ప్రేమించుకొనిరి. పెద్దలు పెండ్లితేదీని నిర్ణయించిరి. ఇంతలో యువకుడు గెరిల్లాపోరాటమున పాల్గొనవలసివచ్చినది. ఆమెకు విప్లవమున

1. వజ్రాయుధం : పుటలు 58, 59 :
2. భువనఘోష : పుట 82. 3. ఉదయిని : పీఠిక నుండి.
4, 5, 6. ఉదయిని : పుటలు 55, 57. 57.

పార్గొను వీలులేనందున ఇంటనిలిచి అతనిదీక్ష నారాధించినది. అమె వ్రాసిన జాబునకు 'జవాబు'గా ఆ విప్లవవీరుడు వ్రాసినలేఖ ఈ గేయరూపమున రచింపబడినది.

'ఉత్తరాలు ప్రతిరోజూ వ్రాస్తూవుండు
అక్షరఅక్షరంలో నీ మధురస్వర ఆలాపన వింటాను
పంక్తిపంక్తిలో నీ జీవనదృక్కోణం స్పర్శిస్తాను,
లేఖలో నీవు కనపడతావు, కరిగిస్తావు, గరళంత్రాగే శక్తినిస్తావు'[1]

అన్నమాటలు వీరునికి తన ప్రేయసిపైగల ప్రగాఢప్రేమతోపాటు కర్తవ్యముపట్ల గల అచంచల దీక్షను స్ఫురింపజేయుచున్నవి.

'విప్లవం జయిస్తుంది, నేను త్వరలో యింటికి వచ్చేస్తాను
నాకు స్వాగతంచెప్పడానికి పధ్నాలుగు ప్రపంచాల్ని పిలిపించు'[2]

అనుపంక్తులలో అతనికి భవిష్యత్తుపై గల బ్రహ్మాండమైనవిశ్వాసము వ్యక్తమగుచున్నది.

'ఉత్తరం ముగించి పగవాడిగుండెకు మరతుపాకి గురిపెడుతున్నా,
భయపడకు నాపేరు మృత్యుంజయుడు, నాకోసం ఎదిరిచూడు'[3]

అను ఈ గేయములోని చివరిమాటలు యుద్ధవీరమునకు పతాకప్రాయములైనవి. యువకునికిగల అకుంఠితమైన ఆత్మవిశ్వాసమును వ్యక్తీకరించుచున్నవివి. అతనికి ప్రేయసిపైగల అనురాగాతిశయమును ప్రదర్శించుచున్నవి. ఇక 'తల్లి తనయునికి' అన్నగేయము కన్నీళ్ళను మంటలను కలిపి రచించినది. తన కొడుకు గెరిల్లాపోరాటమున పాల్గొనుటకు వెడలిపోయినపిమ్మట ఒకానొక మాతృమూర్తి పొందిన మరణవేదన ఈ గేయములోని వస్తువు. వీరుడు వెడలిపోయిన పిమ్మట శత్రుసైనికులు ఇంటిమీద పడి, అతనిభార్య నెక్కడికో ఈడ్చుకొనివెళ్ళిరని, 'ఆ నైచ్యం చెప్పడానికి నోరు పెగలడంలే'దని తల్లి ఈ యుత్తరమున ఆక్రందించును. అంతటి బీభత్సచర్య జరిగినది కావున వెంటనే లొంగిపోవలసినదిగా ఈ తల్లి కొడుకును బ్రతిమిలాడదు.

'తక్షణం ప్రళయరుద్రుడవై అంతకు వేయంతలక్రోధంతో
విజృంభించి, వారి గుండెరక్తం పిండిరా !
ఆమె ఆత్మకు శాంతి ప్రసాదించు'[4]

అని పలికి అతనిలోని పౌరుషాగ్నిని మరింత రగుల్కొల్పి వీరమాత యనిపించుకొన్నది. భారతములో కుంతీదేవి తన కుమారులకిచ్చిన సందేశమును స్ఫురింపజేయుచున్నదిది. మన ప్రాచీన

---

1. 2. ఉదయిని : పుటలు 17, 18.
3. 4. ఉదయిని : పుటలు 18, 22.

చరిత్రలోనే కాక ప్రస్తుత సమాజములో గూడ వీరమాతలకు కరవులేదని గంగినేని వ్రాసిన యీ గేయము నిరూపించినది.

### 4. యుద్ధవిముఖత : శాంతిప్రియత :

అభ్యుదయకవులు గెరిల్లాపోరాటమును చిత్రించినంతమాత్రమున వారిని యుద్ధప్రియులని భావించుటకు వీలులేదు. సామ్రాజ్యవాదులకు, ప్రజాపీడకులకు విరుద్ధముగా జరిగెడి పోరాటములను, తిరుగుబాటులను వీరు సమధికోత్సాహముతో చిత్రించిరి. అంతేకాదు; దాశరథి, గంగినేని వంటి కవులు ప్రత్యక్షముగా పోరాటములలో పాల్గొని నిరంకుశపాలకవర్గము నెదిరించిరి. పాశ్చాత్యదేశములలోని కొందరు కవులుగూడ సామ్రాజ్యవాద ప్రభుత్వమున కెదురొడ్డి సమర రంగమున పాల్గొన్నవారున్నారు. ప్రజాశక్తులకు వ్యతిరేకముగా స్పెయిన్‌లో జనరల్ ఫ్రాంకో నాయకత్వమున జరిగిన యుద్ధము నభ్యుదయరచయితలు నిరసించిరి. కాడ్వెల్ మున్నగు రచయితలు ఫ్రాంకోకు వ్యతిరేకముగా పోరాడి మరణించిరి. ఈ పోరాటముల స్వరూపము వేరు ; ప్రపంచ యుద్ధముల తీరుతెన్నులు వేరు, ప్రపంచయుద్ధములు సామ్రాజ్యవాదతృష్ణవలననో, అధికార విస్తృతికాంక్షవలననో, వర్ణజాత్యహంకారకారణముననో, ఐశ్వర్యదాహమువలననో తలలెత్తినవి. ప్రపంచమును నిమిషములో భస్మీపటల మొనర్చునంతటి పటుతరమైన మారణాయుధములతో క్రీడలాడు అగ్రరాజ్యముల ధోరణిని అభ్యుదయకవులు సహింపలేకపోయిరి. యుద్ధవ్యతిరేకతను పాటలలో, గేయనాటికలలో ప్రకటించిరి. శాంతికపోతము నాహ్వానించి దాని చుంచు దువ్విరి. పచ్చని మానవజాతిసంస్కృతికి యుద్ధము కారుచిచ్చువంటిదని దానిపట్ల తమ నిరసనను ప్రకటించిరి. 'యుద్ధము మాకొ'ద్దని నినాదరూపమున ఎలుగెత్తిచాటిరి. 'గడియగడియకొక గులాబి చిఱుచెక్కుల మొలిపించీ జీవనదేవాలయమున వెలిగేమూర్తి'యైన శిశువుజీవము యుద్ధజ్వాలల కాహుతియైపోవునని ఆక్రోశించిరి.[1] 'యుద్ధాల మహాగ్నిలో శాంతి నేడు జోనాఫ్‌ఆర్క్'[2] అను సత్యమును గమనించిన ద్రష్టలు కావుననే

'అమృతం పండించే అణుబీజాల నుండి
విషపూరిత మృత్యుసస్యాలను మొలిపిస్తున్న
శాస్త్రజ్ఞులారా !
పరమాణువుల రగిల్చి
చరిత్రను పొగచూరనీయకండి'[3]

అని శాస్త్రజ్ఞులను ప్రతిఘటించగలిగిరి. 'హిరోషిమా'లో రెండవ ప్రపంచయుద్ధమున జరిగిన దుర్భరవిలయకాండను తలచుకొని అశ్రుతర్పణముచేసిరి.

1. పురోగమనం : పుట్టపర్తి : పుట 7
2. పునర్నవం : దాశరథి : పుట 30
3. జలపాతం : నారాయణరెడ్డి : పుట 38

'అమ్మా ! ఉమా ! రుమా ! హిరోషిమా !
నీ శ్మశానవేదికపై తొలకరివానలు కురియునులే
నీ అనాథసమాధిపై 'ఎఱ్ఱపూలు' పూయునులే'[1]

అని 'హిరోషిమా' నాశ్వాసించిరి. యుద్ధతృష్ణాళువుల నుద్దేశించి

'గుండెలు పగిలిన నగరాల ఆర్తఘోష
ఇంకా వింటూనేఉన్నాం.
పచ్చనిభూమితల్లి వక్షస్థలి పుచ్చిపోతుండగా
ఇకమీదట చూడలేం'[2]

అని దైన్యమును, దారుణవేదనను ప్రకటించిరి. చివరకు వజ్రనిశ్చయులై

'చితిమంటల యుద్ధానికి ప్రతికవి ఒక ఫైర్‌బ్రిగేడ్
అణ్వస్త్రపు గ్రీష్మానికి ప్రతిపద్యం మబ్బుముక్క'[3]

అని ప్రతిజ్ఞచేసిరి. యుద్ధవిముఖతను ప్రకటించుటతోనే ఊరకుండక శాంతి నెన్నో రీతులుగా ఆరాధించిరి; ఆశ్వాసించిరి.

'తల్లీ చల్లనిశాంతీ
ధారుణి పండించవమ్మా'[4]

అని శిశుహృదయముతో శాంతిదేవతను వేడుకొనిరి.

'ఎంతచల్లని కన్నులమ్మా
ఎంత ఎఱ్ఱనిపెదవులమ్మా
వంతలను మరపించు నీదర
హాసచంద్రికలేవి శాంతీ'[5]

అని దీనావనులై ప్రశ్నించిరి 'పిలుపువచ్చింది, పిలుపు శాంతిదూత పిలుపు'[6] అని స్టాక్‌హోమ్ శాంతివిజ్ఞప్తిని గూర్చి సంతోషముతో పాడుకొనిరి. 'శాంతి'ని గూర్చి వ్రాసిన రచనలలో దాశరథి వ్రాసిన 'కపోతీసందేశము' గణనీయమైనది.[7] కవికి 'రణోల్బణకామనకామనాత్తహైమోన్నత పర్వతాగ్రశిఖరోదితశాంతికపోతపోతముల్' కనిపించినవి. వానిలో నుండి ఒక పావురము వచ్చి కవిభుజముపై వ్రాలగా, కవికి దానికి జరిగిన సంభాషణము ఈ పద్యములలో రసవత్తరముగా

---

1. సర్పయాగం : పుట 78. 2. జలపాతం : పుట 34. 3 పునర్నవం : పుట 30.
4. సర్పయాగం : పుట 88. 5. కాహళి : సోమసుందర్ : పుట 31.
6. పురోగమనం : పుట 36. 7. మహాంధ్రోదయం : పుట 59.

చిత్రింపబడినది. పావురమును శాంతికి ప్రతీకగా వాడుట పాశ్చాత్యసంప్రదాయము. రష్యావలన ఈ సంప్రదాయము బహుళవ్యాప్తి నొందినది. పావురముతో కవి సంభాషించునెపమున దాశరథి ప్రస్తుత సమాజములో పెచ్చరిల్లుచున్న మచ్చరములను, రణకండూతిని, దౌష్ట్యభావనను బయట పెట్టినాడు.

'కాన్త పశ్చిమాద్రికడకేగి నాబంధు
జాలమునకు గూడ శాంతినేర్పి
ఇలను కాచుమోయి ఈ అణుప్రోద్గత
ప్రళయవహ్నినుండి పక్షిరాజ్ఞి'[1]

అని కొన్ని పశ్చిమదేశములలో పెల్లుబుకుచున్న సమరకాంక్షకు విరుగుడుమందు చూపినాడు. ఈ సందర్భమున గంగినేని, రమణారెడ్డి, నారపరెడ్డి వ్రాసిన శాంతిగీతములు గూడ పేర్కొన దగినవే.

### 5. సమసమాజ నిర్మాణము :

సమాజములో గూడుకట్టుకొనియున్న ఆకలి, దరిద్రత, వ్యాధులు, అసమానత మున్నగు నవి తొలగిపోయి, అది వర్గరహితస్వర్గముగా వెలుగొందవలెనని అభ్యుదయకవుల హార్దిక లక్ష్యము. గణపతిశాస్త్రిగారి 'మాదాకబళం తల్లీ' అన్న ప్రఖ్యాతగేయ మీ దృష్టికి చక్కని నిదర్శనము. రాయలసీమ, బెంగాలు మున్నగుచోట్ల ఏర్పడిన కరువులచే ఉద్విగ్నులై ఈ కవు లెన్నో క్షామగీతులను, ఆకలిపాటలను రచించిరి.

'ఆకలివేస్తోందమ్మా అన్నంపెట్టమ్మా
స్వర్ణారుణ సస్యశ్యామలమగు
ఈజగతిని దరిద్రమున ఆకలితో చావలేను'[2]

అని ఆక్రందించు ప్రజావళి ఆర్తరావములను తమ లేఖినీముఖమున ముఖరింపజేసిరి. రాయల సీమలో కలిగిన దుర్భరక్షామము నుద్దేశించి

'గుండెల్లో జీవతైల మెండిపోవ
మండిపోయెరా ఆకలి దివిటీలు.
నరాల్లో పరిచిన నెత్తురుతెరల
కత్తిరించెరా కరువుకత్తెరలు'[3]

1. మహాంధ్రోదయం : పుట 64. 2. వజ్రాయుధం : పుట 19.
3. కల్పన : నారాయణరెడ్డి : పుట 262.

అని దీనముగా ఆక్రందించిరి. సమాజములో నాటుకొనియున్న ఆకలి, దారిద్ర్యము మున్నగు భయంకరవ్యాధులకు కారణము సమాజవ్యవస్థయే యని వీరు గ్రహించిరి. అందువలననే ఆకలి పాటలతో చేతులు దులుపుకొనక ప్రస్తుత సాంఘికవ్యవస్థలో మార్పురావలెనని, వర్గభేదములతో కుళ్ళిపోయిన నేటి సమాజముస్థానే సరిక్రొత్తసమాజము మొలకెత్తవలెనని కాంక్షించిరి.

'వృద్ధజగతిసమాధిపై సమధర్మం ప్రభవించును
నిద్దురచీకటివెలుపల వేకువ మెఱుకువ పుట్టును'[1]

అని భాష్యముచెప్పిరి. రానున్నసమాజములో 'శాంతికొరకుయుద్ధమనే స్వార్థపరుల నినాదాలు'ండవని,[2] 'రూపాయికి విలువలేనిరోజు రేపువస్తు'ందని[3], 'మతాలకై మరణించు అమాయకు లెవరుండబో'రని, 'గతానికై విలపించే మృతభావులు కానరా'రని[4] ఆశాసంగీత మాలపించిరి. భవిష్యత్ సమాజములో 'ప్రతివ్యక్తి ముఖంమీద లక్షఉదయాలు మొలు'స్తాయని[5], 'శ్రమకూ కళకూ ఫలితం సమరీతిగ లభియించు'నని[6] భావనచేసిరి. పెద్దచేప చిన్నచేపను తినున్యాయము ముందుండబోదని, 'లాఠీలు, మెడబందలు, చెరసాలలు, ఉరికొయ్యలు' అంతరించునని[7] జోస్యము చెప్పిరి.

'వ్యక్తులు పరిపాలించే శక్తినశించింది నేడు
రక్తంలో అణువణువూ శక్తిగడించింది నేడు'[8]

అని సమాజములో కలిగిన పీడితవర్గచైతన్యము నుగ్గడించి, పాలక పాలితభేదములేని 'వర్గరహిత స్వర్గము'ను స్థాపించుటకు గళమునే కాహళగా జేసికొని ప్రబోధించిరి.

**తెలంగాణావిముక్తి :**

భారతదేశమునకు స్వరాజ్యము లభించినది. హైద్రాబాదుమాత్రము నైజామునవాబు ఇనుపపిడికిటిలో బందీయైపడియున్నది. హైద్రాబాదులోని తెలుగుప్రజల తీయనిమాగాణమగు తెలంగాణము విముక్తికొరకు అభ్యుదయకవులు గేయములు, కావ్యములు రచించిరి. తెలంగాణావిముక్తిని తలచుకొన్నప్పుడు ప్రప్రథమముగా కనులముందు సటలు విదిల్చి చటుల గర్జాధ్వనులు చేయు కవిసింహము దాశరథి కనిపించును. తెలంగాణములో పుట్టిపెరిగి, 'నా తెలంగాణ కోటిరత్నాల వీణ' యని సగర్వముగా లోకమున కెలుగెత్తి వినిపించిన కవిధీరుడు దాశరథి. గట్టుమీద నిల్చుండి గానముచేయక, కదలిలో దూకి తరంగముల కెదురీది, కడకు తీరముచేరుకొన్న విజయుడీతడు. దాశరథితోబాటు తెలంగాణావిముక్తికై గీతము లాలపించినకవులలో కాళోజీ, సోమసుందర్, రెంటాల, గంగినేని, కుందుర్తి, రమణారెడ్డి మున్నగువారు పేర్కొనదగినవారు. రెంటాల

1. వజ్రాయుధం : పుట 9. 2. యుగేయుగే. కుందుర్తి : పుట 26.
3. పునర్నవం : పుట 57. 4. నారాయణరెడ్డి గేయాలు : 'రేపటి ఉదయం'
5. యుగేయుగే : పుట 89. 6. విశ్వగీతి : నారాయణరెడ్డి : పుట 18.
7. కల్పన : అవసరాల : పుట 165. 8. అగ్నిధార : పుట 106.

'తెలంగాణా సమరగీతం' (సర్పయాగం)లో 'పగలేయి నిజాంకోట, ఎగరేయి ఎఱ్ఱబావుటా' యని, సోమసుందర్ 'ఖబడ్దార్, ఖబడ్దార్ నిజాంపాదుషాహే' (వజ్రాయుధం)అని నైజామునవాబును ప్రతిఘటించిరి. వీరివలెనే అవసరాల, గంగినేని ప్రభృతులు విమోచనోద్యమగీతము లాలపించిరి. వీరివలె ఒకటిరెండు గీతములుకాక తెలంగాణలో నవాబునకు వ్యతిరేకముగా కార్మికులు, కర్షకులు జరిపిన విప్లవోద్యమమును ఒక సమగ్రకావ్యముగా రచించినవాడు కుందుర్తి. ఈకవి తెలంగాణా విప్లవోద్యమగాధను భారతగాధగా వ్యంజించి 'ప్రస్తావన, సింహాసన, బీజోత్పన్న,సంఘోదయ, ప్రజోద్యమ, రాయబార, బహిష్కార, అజ్ఞాత, మానభంగ, గృహదహన, ప్రతిఘటన, దిగ్విజయ, భూమిదాన, న్యాయదాన, రజాకార, దురాగత, దండయాత్ర, ఉపసంహార' అను అష్టాదశపర్వములుగా విభజించి రసవత్తరముగా కావ్యము రచించినాడు. ఈ కావ్యములో ప్రయోగింపబడిన 'సంఘము' కమ్యూనిస్టుపార్టీకి సంకేతము. ఈ పార్టీ ప్రోద్బలముతో ప్రజలు జరిపిన ప్రతిఘటనను కుందుర్తి చిత్రించినాడు. ఈ విషయమును కవి స్వయముగా ఒప్పుకొన్నాడు. కుందుర్తి వ్రాసిన మాటలివి: "——చారిత్రక పరిణామంలో మరీ పాతదై పోయిన ఫ్యూడల్‌వ్యవస్థ మీద ఒక పెద్దతిరుగుబాటుగా తెలంగాణావుద్యమాన్ని నేను భావించాను."[1] ఈ దృక్పథముతోనే కావ్యము మొత్తము నిర్వహింపబడినది. విప్లవోద్యమములోని వివిధసంఘటనలకు, కష్టనష్టము లకు, బాధలకు కన్నీటిగాధలకు, రక్తమును రగిలించు సన్నివేశములకు కావ్యగౌరవము కలిగించి నా డీతడు.

తెలంగాణా విముక్త్యుద్యమమును దాశరథి విలక్షణమైనరీతిలో సంభావించినాడు. కుందుర్తి వలె ఇతడు దానిని కేవలము భూస్వామ్యవ్యవస్థపై జరిగిన తిరుగుబాటుగానే భావింపలేదు. మార్క్సిస్టు దృక్పథమును, జాతీయోద్యమములోని వీరావేశమును మేళవించుకొన్న దృక్పథ మితనిది. ఈ రెండు దృక్పథములను సముచితరీతిలో సమన్వయించుకొని పాటలు, పద్యములు రచించినాడు. తెలంగాణను 'నను గనిపెంచినట్టి కరుణామయి'యన్నాడు.[2] ఈభావనలో దేశాభి మానధోరణి వ్యక్తమగుచున్నది. జాతీయోద్యమకవులు భారతదేశమును భారతమాతగా, ఆంధ్ర దేశమును ఆంధ్రమాతగా భావించుట ప్రసిద్ధము. దాశరథిపై గల జాతీయోద్యమప్రభావమే అతనిచేత 'నా తెలంగాణతల్లి'యని పలికించినది. 'నా తెలంగాణతల్లి కంజాతవల్లి'యని గానము చేయించినది. జాతీయోద్యమకవిత్వములో ఒక ప్రధానగుణమైన గతవైభవస్మరణము దాశరథిపై ప్రభావమువేసినది.

'వేయిస్తంభాల్‌గుడి వ్రాయించుకొన్నది
నాచేత ఏకశిలాచరిత్ర.
వీరరుద్రమదేవి వినిపించుకొన్నది
నాచేత జన్మజన్మాల కథలు'[3]

1. తెలంగాణ : విజ్ఞప్తి. 2. రుద్రవీణ : పుట 1.
3. రుద్రవీణ : పుటలు 1, 14, 16.

అన్న పద్యములో ఈ గతవైభవస్మరణమే ప్రవేశించినది. తెలంగాణము ఈనాటివీరభూమికాదని, అది అల్లనాడుగూడ శత్రుదుర్జయముగా నిలచినదని, గతచరిత్రలో తెలంగాణము నిర్వహించిన పౌరుషపాత్ర నీరీతిగా స్మరించుకొన్నాడు.

> 'కాకతీయుల కంచుగంట మ్రోగిననాడు
> తురకరాజులకు తత్తరలుపుట్టె
> వీరరుద్రమదేవి విక్రమించిననాడు
> తెలుగుజెండాలు నర్తించె మింట
> కాపయ్యనాయకుం డేపుసూపిననాడు
> పరరాజులకు గుండెపట్టుకొనియె.'[1]

'నాడునేడును తెలగాణమొదలే'దనుట కీ నిదర్శనములు చూపినాడు. రెండువందలయేండ్ల క్రింద తెలుగుపటములోని మూడవపాలును నిజామునవాబు కత్తిరించుకొన్నాడని, 'నాడు తొలగించిన ఆంధ్రమహాపతాక క్రీనీడలు నాగుపాములయి నేటికి కాటిడె వాని వంశమున్'[2] అని దాశరథి తెలంగాణా విమోచనానంతరము గానముచేసిన పద్యములలోగూడ జాతీయోద్యమప్రభావమే తొంగిచూచుచున్నది. నేను ముందే తెలిపినట్లుగా దాశరథి ఈ జాతీయోద్యమభావావేశమునకు తోడుగా శ్రామికవర్గచైతన్యమునుగూడ మేళవించుకొని రచన సాగించినాడు. నిజామురాజు నుద్దేశించి 'మా నిజాంరాజు జన్మజన్మాలబూజు' అని మహోద్వేగముతో ఎలుగెత్తినాడు.

> 'చరిత్రబొంగరంతిరిగి కిరీటాలునేలకొరిగి
> ధరాధిపులునశిస్తుంటే బరాయెనాంనవ్వాబా
> పరాక్రమంచూ పేవా'[3]

అని ప్రస్తుతసమాజములో భూస్వామ్యవ్యవస్థ పతనమైనవిషయము నుద్బోధించినాడు. పచ్చిగడ్డి పరశునిశాతధారల నెదిరించినట్లుగా పేదవాడు రాచరికపుటుక్కుచట్టమును చల్లగా ధిక్కరించి నాడని చాటినాడు. 'తెలగాణమ్మున గడ్డిపోచయును సంధించెన్ కృపాణమ్ము'[4] అని పీడితవర్గములో కలిగిన విప్లవచైతన్యమును ప్రకటించినాడు.

> 'ప్రాణములొడ్డి ఘోరగహనాటవులన్ బడగొట్టి మంచిమా
> గాణములన్ సృజించి ఎముకల్ నుసిజేసి పొలాలుదున్ని భో
> షాణములన్ నవాబునకు స్వర్ణమునింపినరైతుదే, తెలం
> గాణమురైతుదే; ముసలినక్కకు రాచరికమ్ముదక్కునే'[5]

1. 2. రుద్రవీణ : పుటలు 1. 14, 16. 3. అగ్నిధార : పుట 120.
4. రుద్రవీణ : పుట 12. 5. అగ్నిధార : పుట 3.

అన్నపద్యములో జమీందారీవిధానము కర్షకవర్గము నెట్లు పీడించుచున్నదో వివరించి, ఎన్నటి కైనను రైతునకే విజయమని ఘోషించినాడు.

'చుట్టూసముద్రంపొంగి
నట్టనడిగడ్డన్మ్రింగి
అంతా ఏకంచేస్తుం
దంతా ఒకటౌతుంది'[1]

అని హైద్రాబాదునలువైపుల నువ్వెత్తుగా నెగయుచున్న ప్రజావిప్లవమును, పీడితజనచైతన్యమును వ్యంగ్యముగా వ్యక్తముచేసినాడు. చుట్టున్నసముద్రము ఈ విప్లవచైతన్యమునకు సంకేతము. నట్టనడిగడ్డ జమీందారీవ్యవస్థ శిథిలావశేషము. సముద్రతరంగములు నాలుకలను చాచి విజృంభించగా హిమాచలసూర్యగోళములే కూలిరాలిపోనుండగా, నడిగడ్డ ఆగుట కలలోనిమాట యని హెచ్చరించినాడు. హైద్రాబాదు నలువైపులనేకాక, ప్రపంచములో మేల్కొన్న దేశములలోని ప్రగతిశక్తులనుగూడ దాశరథి వ్యంజింపజేసినాడు. ఈవిధముగా జాతీయోద్యమమును, శ్రామికవర్గ చైతన్యమును దృష్టిలో పెట్టుకొని తెలంగాణా విముక్తిగీతములు రచించిన వీరకవి దాశరథి. రుద్రవీణ ప్రకాశకులన్నట్లుగా 'దాశరథియే తెలంగాణము, తెలంగాణమే దాశరథి.' దాశరథితో పాటు తెలంగాణా విముక్తికిచెందిన గీతము లాలపించినవారిలో కాళోజీనారాయణరావు, పొట్లపల్లి రామారావు, అడ్లూరి అయోధ్యరామకవి పేర్కొనదగినవారు.

### ఆంధ్రరాష్ట్రోద్యమము :

రాయప్రోలుతో ప్రారంభమైన ఆంధ్రరాష్ట్రోద్యమము అభ్యుదయకవులను గూడ ఉద్రిక్తులను చేసినది. అయినను వీరి ఆంధ్రరాష్ట్రోద్యమకవిత వర్గచైతన్యముదృష్ట్యా వ్రాసినదే. సోమసుందర్, రెంటాల, దాశరథి మున్నగువారు రాష్ట్రగీతము లాలపించినవారిలో గణనీయులు. రాష్ట్రప్రాప్తి కొరకు పొట్టిశ్రీరాములుచేసిన ఉపవాసదీక్ష చరమదశలోనుండగా విజయవాడలోని అన్ని రాజకీయపక్షములు కలిసియిచ్చిన 'హర్తాల్' పిలుపుచేత ప్రభావితుడై సోమసుందర్ 'శ్రీరామరక్ష' యను సుదీర్ఘగేయము రచించినాడు.[2] రెంటాల వ్రాసిన 'ప్రభుత్వంలేని నాలుగుగంట'లను గేయము ఈ తెగకు చెందినదే.[3] 1953 లో ఆంధ్రరాష్ట్ర మవతరించుటతో అభ్యుదయకవు లనేక గేయములు రచించిరి. 'సిందూరంవోలె తెలుగుసీమ నేడు వికసించిన'దని, 'మందారంవోలె తెలుగుమాట నేడు వికసించిన'దని ఆనందభరితులై పాడుకొనిరి.[4] ఆంధ్రరాష్ట్రమును శారదాపీఠమని, శాంతిసంకేతమని, అన్నపూర్ణహస్తమని, అక్షయకుంభమని ఉల్లేఖించిరి.[5]

'వేదంలా గోదావరి ప్రవహిస్తుందేచెల్లీ
వెన్నెలవలె కృష్ణవేణి విహరిస్తుందేచెల్లీ'[6]

1. అగ్నిధార : పుట 116. 2. కాహళి : పుట 35. 3. సర్పయాగం : పుట 62.
4. జలపాతం : పుట 33. 5. సర్పయాగం : పుట 65. 6. గాథాలూ : గేయాలూ : ఆరుద్ర.

అని పరవశులై గానముచేసిరి. ఇంతటితోనే తృప్తులుకాక విశాలాంధ్రావతరణము కొరకు కలమును గళముగాచేసి యెలుగెత్తిచాటిరి. 'విశాలాంధ్ర' నుద్దేశించివ్రాసిన కవితాఖండికలలో దాశరథి రచించిన 'మహాంధ్రోదయము' ప్రథమగణ్యమైనది. తెలంగాణా విముక్తికొరకెంతటి తీవ్రావేశముతో ఈకవి గానముచేసినాడో, విశాలాంధ్ర స్థాపనావశ్యకమునుగూర్చి అంతటి మహోద్వేగముతో పాడుకొన్నాడు. దాశరథి సువిశాలదృష్టి కిది చక్కని తార్కాణ. మహాంధ్రోదయమును 'మూడుకోటుల నొక్కటేముడిబిగించు' సుందరరాగబంధముగా భావించుకొన్నాడు. తెలుగునే వెలుగుగా, వెలుగునే తెలుగుగా సంభావించుకొన్నాడు. శ్రీశ్రీ 'విషాదాంధ్ర'అను గేయములో "శిశువుకు దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరినీళ్లు' అను పంక్తులలో 'విశాలాంధ్ర' రాకపోవుటవలన ఆంధ్రులకు కలిగిన విషాదస్థితి నెత్తిచూపినాడు. ఎట్టకేలకు ముక్కోటితెలుగులు కలగన్న విశాలాంధ్రమవతరించినది. అంతట

'విజయీభవ, విజయీభవ, విశాలాంధ్రజననీ
ప్రజలంతా సుఖాలతో బ్రతుకంతామననీ'[1]

అని మంగళాశాసనము గావించినా రీకవులు.

'పదవోయితెలుగువాడా
అదెనీతెలుగుమేడా
సంకెళ్ళులేనినేల
సంతోషచంద్రశాల'[2]

అని తెలుగువారి సముజ్జ్వలభవిష్యత్తును గానముచేసినారు.

ఇంతవరకు అభ్యుదయకవిత్వమునకు ప్రయోక్త, ప్రవక్తయైన శ్రీశ్రీని గురించి, ఆయన తెలుగుకవిత్వమున ప్రవేశపెట్టిన నూతనదృక్పథముగురించి వివరించితిని. అభ్యుదయకవితోద్యమములోని వివిధాంగములను విశదీకరించితిని. అభ్యుదయకవులుగూడ తిరుగుబాటుదారులేకావున వారి సంప్రదాయములను, నూతన ప్రయోగములను అతినవ్యకవులనుగురించి వ్రాయునప్పుడు వివరింతును. అభ్యుదయకవితోద్యమముతో ఒకప్పుడు పెనవేసికొని, ఇంకొకప్పుడు విడిపోయి సరిక్రొత్తతెన్నులలో సంచరించిన అధివాస్తవికత మున్నగు అతినవ్యకవితాధోరణులను రానున్న ప్రకరణమున నివేదించుకొందును.

1. గాయాలూ : గేయాలూ : అరుణ : పుట 9
2. 'తెలుగుతల్లి' ; శ్రీశ్రీ : 'ఆంధ్రసాహిత్య పునర్వికాసం'లో ఉదాహృతము.

## అతినవ్యకవితా ధోరణులు:

1940 ప్రాంతమున శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి ప్రభృతులు అతినవ్యకవితాధోరణులకు పునాదులువేసిరి. శిష్ట్లా అతినవ్యకవులలో ఒకడైనను వస్తువులో ఇతడు పైవారివలె ప్రయోగవైచిత్ర్యము చూపలేదు. భావకవుల ప్రణయమునే క్రొత్తఛందస్సులలో తొడుగుటకు ప్రయత్నించెను. శ్రీశ్రీప్రభృతు లట్లుగాక పాశ్చాత్యకవులలో అతినవ్యులు జరిపిన ప్రయోగము లన్నిటిని తెలుగున దిగుమతిచేయుటకు ప్రయత్నించిరి. ఇరువదవశతాబ్దిలో ఫ్రెంచికవితారంగమునను, ఇంగ్లీషుకవిత్వమునను వెలువడిన విచిత్రకవితాధోరణులను వీరాకళించుకొన్నారు. ఇమేజిజము, సర్రియలిజము, రియలిజము, డాడాయిజము మున్నగు కవితోద్యమముల స్వరూపమును పరిశీలించి వాని జాడలలో తమ కవితారథమును పరుగెత్తించినారు. వస్తువులోనే కాక భాషలో, ఛందస్సులో, భావవైఖరిలో వీరు నవ్యప్రయోగములుచేయుటకు ప్రయత్నించినారు. ఆ ప్రయత్నఫలితముగా తెలుగులో అధివాస్తవికత, అహంభావప్రకటనము, బీభత్సచిత్రణము, వస్తుభావవైచిత్రి, అరాజకవాదము, నిరాశావాదము మున్నగు వింతవింతధోరణులు మొలకెత్తినవి. ఈ ధోరణులలో ఏదియు తెలుగుపొలమున పుట్టినదికాదు. భావకవిత్వమువలె, అభ్యుదయకవిత్వమువలె ఈ ధోరణులవేళ్ళు తెలుగునేలనంటిపట్టుకొన్నవికావు. ఫ్రెంచికవులు, ఇంగ్లీషుకవులు జరిపిన వినూత్నప్రయోగములకు వీరు తెలుగుదుస్తులు మాత్రము తొడుగగలిగిరి, అందుకే ఇవి భావకవిత్వమువలె, అభ్యుదయకవిత్వమువలె తెలుగునాట బలముగా నిలువగలుగలేదు. ఇవి సంపాదించిన ప్రజాదరణయును అంతంతమాత్రమైనదే. శ్రీశ్రీప్రభృతులు ప్రయోగించిన అధివాస్తవికత మున్నగుధోరణులు సఫలముకాకున్నను, వారు ఛందస్సులో, భావవ్యక్తీకరణములో, శబ్దప్రయోగములో గొప్పమార్పులు తేగలిగిరి. తెలుగుకవిత కపూర్వమైన వైవిధ్యమును ప్రసాదించగలిగిరి. ముఖ్యముగా వీరి కృషివలన వచనగేయమునకు చక్కని స్థానమేర్పడినది.

ఇంగ్లీషుభాషలో కాల్పనికోద్యమమునకు నిరసనగా ఇమేజిస్టులు, సింబాలిస్టులు, రియలిస్టులు చేసిన తిరుగుబాటువంటిదే వీరు చేసిరి. 'జార్జియన్ కవిత్వముతో మొగముమొత్తిన పాఠకులకు 'వేస్టులాండ్'ద్వారా ఇలియట్ చేసిన విద్యుత్‌చికిత్స(Shock treatment)నే వీరు 'ఫిడేలురాగాల డజన్', 'రుధిరజ్యోతి'వంటి గేయములద్వారా చేసిరి. అతినవ్యకవులకు గల ఆంగ్లభాషా పరిచయాధిక్యమే వారి హృదయములలో క్రొత్తగవాక్షములను తెరచినది. అట్లని తెలుగులోని భావకవుల కాంగ్లభాషాపరిచయము స్వల్పమని నా యభిప్రాయముకాదు. భావకవులలో ప్రథమాచార్యుడగు రాయప్రోలు వర్డ్సువర్తును దాటిరాలేదు. ద్వితీయదశకు చెందిన కృష్ణశాస్త్రిప్రభృతులు షెల్లీ, కీట్సు, బైరన్, బర్న్సువంటి కాల్పనికకవుల రచనలవలను తుష్టముగా పఠించిరి. ఈ ఆంగ్లకవు

లందరు పందొమ్మిదవశతాబ్దికి చెందినవారు. ఇరువదవశతాబ్దికి చెందిన ఇంగ్లీషు, ఫ్రెంచికవుల వైపు భావకవులదృష్టి పోలేదు. అతినవ్యకవులైన శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి, ఆరుద్ర ప్రభృతులు కాల్పనికకవులనేకాక ఇరువదవశతాబ్ది కవుల రచనలను క్షుణ్ణంకషముగా చదువుకొన్నారు. టి. యస్. ఇలియట్, ఎజ్రాపౌండ్, ఆడెన్, సిట్వెల్, బార్కర్, కమింగ్స్‌వంటి నవ్యకవుల రచనలను చదివి, వారుచేసిన ప్రయోగములచేత సమ్మోహితులైనారు. ఎజ్రాపౌండ్, ఇలియట్‌వంటి ఇంగ్లీషుకవులచేతిలో వచనగేయము (Verse Libre) ఎన్ని అంచులతో మెరసిపోయినదో వీరు గమనించినారు. డిలాన్‌థామస్, గ్యాస్కాయిన్‌వంటి అధివాస్తవికులగేయములు వీరిని ప్రోత్సహించినవి. ఫ్రెంచిసాహిత్యరంగమున సర్రియలిజమును ప్రవేశపెట్టిన ఆంద్రే బ్రిటన్ (Andre Breton), పాల్‌ఎల్వార్డ్‌వంటి కవుల రచనలను చదివి వీరు మురిసిపోయినారు. 1924లో ప్రచురింపబడిన 'సర్రియలిస్టు మ్యానిఫెస్టో' ఆంద్రీబ్రిటన్ సర్రియలిజమును గూర్చి వ్రాసిన వ్యాసములు, ఇంగ్లీషుసాహిత్యమున New Signatures ద్వారా విప్లవధ్వజమెత్తిన ఆడెన్‌ప్రభృతుల గేయములు, ఛందఃక్షేత్రమున జెరార్డ్‌మేన్లీహాప్కిన్స్ (Gerard Manley Hopkins) నాటిన Sprung-rhythmవంటి నూతన ఛందోరీతులు, 'Stream of consciousness' (చైతన్యస్రవంతి) రచనలో ప్రవేశపెట్టిన జేమ్సుజాయిస్ 'యులిసిస్' వంటి నవలలు, సాల్వడర్‌డాలీ (Salvador Dali), మాక్స్‌ఎర్నెస్ట్ (Max Ernst), పికాసోవంటి అధివాస్తవిక క్యూబిస్టుచిత్రకారుల చిత్రములు, మాన్రేవంటి అధివాస్తవికఛాయాచిత్రకారులబొమ్మలు ఈ కవుల ఆలోచనలమంత్రకవాటములను తెరచినవి[1]. ఈ ప్రభావములన్నియు సమష్టిగా వీరి అతినవ్య ధోరణులకు కారణభూతమైనను ప్రధానముగా ఫ్రాయిడ్‌మనోవిశ్లేషణశాస్త్రము (Psycho-analysis), ఇలియట్‌నగరజీవనచిత్రణవిధానము, ఆడెన్, హాప్కిన్‌వంటి కవుల చమత్కారమయమైన ఛందోరీతులు, కమింగ్స్‌వంటి కవుల శబ్దగతవాక్యగతవైచిత్రి, శ్రీశ్రీ, నారాయణబాబు, ఆరుద్ర, పఠాభిప్రభృతుల అతినవ్యకవితాధోరణులకు ఉజ్జీవముకలిగించినవి. ఇంకొక చిత్రమేమనగా ఈ కవులలో ఏ ఒక్కరైనను ఒక ప్రత్యేకధోరణికి అంకితమైపోయినవారు కారు. నవ్యతాప్రీతితో పరవశులైపోయి ప్రతినవ్యధోరణి వెంటబడి దానిని తెలుగులో ప్రయోగించుటకు ప్రయత్నించిరి. అందువలన నారాయణబాబుపైగాని, శ్రీశ్రీపైగాని (అతినవ్యకవితా ధోరణులవిషయమున), ఆరుద్రపైగాని ఎవరి ప్రభావమున్నదో, వీరేతెగకు చెందెదువారో చెప్పుట

1. 'ఆశ్వాసాంతం' అను గేయములో రుక్మిణీనాథశాస్త్రి అవధానపురోహితులు, భావకవిత్వపుదినములు గతించినవని, సాహిత్యమున క్రొత్తకవిత్వరీతులు ప్రవేశించినవని తెలుపుచు ఇట్లు వ్రాసెను.

"యూబోటూ, టార్పెడో
బాంబుదెబ్బ, టార్నాడో
డాలీబొమ్మ మాన్‌రేబొమ్మ
వొచ్చేశాయొచ్చేశాయి." (భారతి 1941 జనవరి)

'యూబోటు', టార్పెడోఅనగా 'జలాంతర్గామి' నౌకలు. టార్నాడో అనగా సుడిగాలి.

సాధ్యముకాదు.[1] నారాయణబాబునే తీసికొందము. ఇతడు వ్రాసిన 'గడ్డిపరక', 'దేశమాత' మున్నగుగేయముల ధ్యేయముపై మార్క్సిజము ప్రభావమున్నది, వస్తుచిత్రణలో ఇమేజిజము, సింబాలిజము ప్రభావమున్నది. ఛందస్సులో ఇలియట్ ప్రభృతుల ప్రభావమున్నది. అట్లే ఆరుద్ర 'త్వమేవాహం'ను తీసికొందము. ఇది 'తెలంగాణా'లో జరిగిన విప్లవోద్యమము కేంద్రబిందువుగా గల కావ్యసంపుటి. దీనిలో వర్గసంఘర్షణసిద్ధాంతము ప్రతిపాదితమైనందున ఇది అభ్యుదయ కవిత్వమగును. కాని వ్యక్తీకరణమున ఈ కావ్య మభ్యుదయకవిత్వధోరణిలో పయనించలేదు. గడియారము, చిన్నముల్లు, పెద్దముల్లు మున్నగు సంకేతములను తీసికొని కాలమునుగూర్చి, సమాజమును గూర్చి కవి వ్యాఖ్యానించినందున కొంతవర కీ కావ్యము సింబాలిస్టుధోరణికి సంబంధించినదేమో యనుభ్రాంతి కలుగుచున్నది. ఈ కావ్యములోనే నగరజీవితమును, మధ్యతరగతి ప్రజల బ్రతుకుతెన్నులను చిత్రించుటవలన ఇలియట్ ప్రభావమున్నట్లు స్పష్టమగుచున్నది. అందుకే నేను అతినవ్యకవిత్వరీతులను 'వాదములు' (Isms) అనుటకు బదులుగా 'ధోరణులు' (Trends) అని మాత్రమే పేర్కొంటిని.

అధివాస్తవికతావాదముయొక్క ఉత్పత్తివికాసముల గూర్చి యింతవరకే గత ప్రకరణమున వివరించియుంటిని. ప్రస్తుతము దాని మూలతత్త్వమును సంగ్రహించి, తెలుగుకవిత్వములో దానికి లక్ష్యప్రాయములైన రచనలగూర్చి ప్రస్తావింతును.

ఫ్రాయిడ్ అను మనస్తత్త్వశాస్త్రవేత్త ప్రతిపాదించిన మనోవిశ్లేషణసిద్ధాంతము కళారంగమున సర్రియలిజమునకు దారితీసినది. మానవుని మనస్సులో మూడుఅరలున్నవి. ఒకటి Conscious (వ్యక్తము); రెండవది Sub-conscious (వ్యక్తావ్యక్తము); మూడవది Unconscious (అవ్యక్తము). మనస్సులోని యీ మూడుపొరలనుగూర్చి ఫ్రాయిడ్ చేసిన పరిశోధనల ఫలితమే మనోవిశ్లేషణసిద్ధాంతముగా రూపుదిద్దుకొన్నది ఈ సిద్ధాంతము మానవుని తీరని కాంక్షలకు, అణగారినభయములకు, దమితానుభూతులకు నూత్నవ్యాఖ్యానముచేసి సరిక్రొత్త అర్థము నందించగలిగినది. మానవునిలోని 'అవ్యక్తము' అనేకానుభూతులకు కూడలి. పూర్వసంవేదనలనేకములు ఈ అవ్యక్త'దశలో నిగూఢముగా నుండును. తీరనికోరికలు, తీరుతీరుల ఊహలు, మానవుని వ్యక్తావస్థలో సుప్తభుజంగములవలె అవ్యక్తముగా పడియుండును. స్వప్నములో ఇవి 'అవ్యక్త'దశనుండి పడగలువిప్పుకొని పైకివచ్చునని ఫ్రాయిడ్ నిర్ణయించెను. ఈవిధముగా స్వప్నదృశ్యములకు సరిక్రొత్త వ్యాఖ్యానముచేసినా డీ తత్త్వవేత్త. మానవుడు

1. **'It is dangerous to speak of movements in literature. Inspiration blows with too wild a breath for its motion to be measured, and the poet's personality defeats our efforts to claim him for this or that party or to explain him as an example of a rule'.**

**—The Heritage of Symbolism: C. M. Bowra: Page: F ,Pub: 1951.**

వ్యక్తస్థితిలో నున్నప్పుడు అతని వ్యక్తిత్వము సంపూర్ణముగా గోచరించదని, కృత్రిమత్వమునకు లోనై అతడు మహావాహినిలో తేలియాడు మంచుగడ్డ (iceberg) వలె కొంచెమే పైకి కన్పించు చున్నాడని, మరుగుపడిన మిగిలినభాగమును పరిశీలించి దానిని పైకెత్తునప్పుడే అతని సంపూర్ణ వ్యక్తిత్వము సమస్తాంచలములతో గోచరమగునని ఫ్రాయిడ్ వివరించెను. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన ఈ సిద్ధాంతము నాధారముగా జేసికొని అధివాస్తవికులు కళారంగమున క్రొత్తబాటలువేసిరి. మానవుడు సంఘజీవి. కావున అతడు సాంఘికనిబంధనలకులోనై కొన్ని అనుభూతులనుమాత్రమే బల్లెడపట్టి ప్రకటించగలుగుచున్నాడు. మిగిలినవానిని అణగద్రొక్కుచున్నాడు. ఆవిధముగా అణగద్రొక్కబడిన కోరికలు, ఊహలు, అవ్యక్తములో తలదాచుకొనును. కృత్రిమతావాసనలేనివవి. వానిని యథాతథముగా హేతుకర్తరీప్రయోగములేకుండ బహిర్గతమొనర్చుటయే సమంజసమని అధివాస్తవికులమతము. దీనినే వారు 'Free Association' (స్వచ్ఛందానుబోధ) అనిరి. అవ్యక్తములో అణచబడినఊహలు, కోరికలు, మానవుడు వ్యక్తావ్యక్తదశలో నున్నప్పుడే వెలికుబుకుటకు వీలుండును. ఈ వ్యక్తావ్యక్తదశలోనుండి జీవితమును వీక్షించినప్పుడు, ఇంతకాలము గోచరముకాని క్రొత్తవిషయములనేకము బయల్పడునని వీరు భావించిరి.[1] ఎప్పుడెప్పుడవ్యక్తములోని ఊహలకు, స్వప్నదృశ్యములకు, హేతుబంధములను త్రెంచుకొన్న స్వచ్ఛందవాంఛలకు ప్రాధాన్యముకలిగినదో, అప్పుడే సమాజము నిర్ణయించిన నీతిసూత్రములు, నిబంధనలు వీండ్రృష్టికి అర్థరహితములుగా కనిపించినవి.[2] సమాజము వీరికి 'భూతద్దము' నుండి కనిపించు ప్రకృతివలె అగుపించినది. సమాజములోని సుందరపార్శ్వముకన్న జుగుప్సావహపార్శ్వమే ప్రధానముగా భాసించినది. వైచిత్రియే వీరికి సర్వత్రగోచరించినది. అధిక్షేపము, అవహేళన వీరి ఆయుధములైనవి. చమత్కారమే వీరి జెండాయైనది. వీరు ప్రకటించిన భావన ఉన్మాదమునకు, ఉన్మోదమునకు మధ్య ఊగిసలాడినది. మానవుని కోరికలన్నిటికి 'Libido' (కామవాంఛ) మూలమన్న ఫ్రాయిడ్ 'సెక్సు' సిద్ధాంతము వీరికి చవులూరించినది. దానితో 'అవ్యక్తము'లో పడగలు ముడుచుకొని పడుకొనియున్న కామవాంఛలను బహిరంగముగా, బహుతీవ్రముగా చిత్రించవచ్చునన్నవిశ్వాసము వీరిలో ప్రబలినది. పఠాభి 'ఫిడేలురాగాలడజన్'లో ఈ 'సెక్సు' సిద్ధాంతప్రోద్బలమే ఉద్వేలముగా కనిపించుచున్నది. నారాయణబాబు గేయములలో

1. 'జీవితమొక ఆసుపత్రి, వ్యక్తావ్యక్తంఅనే గవాక్షంలోంచి వీక్షిస్తే మనోజగత్తులోని పచ్చికబయళ్ళు, వృక్షచ్ఛాయలు, సెలయేళ్ళగానము, ఇంతామీదికి సముద్రపు కెరటాలహోరు-అందే అవ్యక్తం వినిపించి కనిపిస్తాయి'. —నారాయణబాబు : 'సంఘర్షణ'కు వ్రాసిన 'ప్రవర' నుండి.

2. 'Pure psychic automatism, by which it is intended to express, verbally, in writing, or by other means, the real process of thought. Thought's dictation, in the absence of all control excercised by the reason and outside all aesthetic or moral preoccupation.'

—The Trend of Modern poetry : by G. Bullough. Page 214.

(అంద్రీబ్రిటన్ వ్రాసిన 'The Magnetic fields' అను సంపుటినుండి ఇలో ఉదాహరించెను.)

'స్వచ్ఛందానుబోధ' గట్లుత్రెంచుకొని ప్రవహించినది. బీభత్సమే ప్రధానరసముగా పరిణమించినది. కార్యకారణసంబంధమునకు తిలోదకములిచ్చుటయు, వస్త్వైక్యమును సన్యసించుటయు, వాక్యముల పరస్పరసంబంధమును పరిత్యజించుటయు సంభవించినది. ఉద్రేకానుభవములకు, స్వచ్ఛందమనఃప్రవృత్తులకు, అసంపూర్ణకాంక్షలకు రచనలో అగ్రతాంబూలము లభించినది. తెలుగులో దీని ననుసరించినకవు లిరువురు మువ్వురే. వారును చక్కని కవితాశక్తిగల వారైనందున, అధివాస్తవికరీతితోపాటు ఇమేజిజము మున్నగుధోరణులను కలగలిపి వ్రాసినందున వారి రచనలు కొంతకాలము నిలబడగలిగినవి. నారాయణబాబు స్వయముగా అధివాస్తవిక కవితారీతిగూర్చి చెప్పిన వాక్యములను ఆయనయే తు.చ. తప్పకుండ అనుసరించినచో, అతని రచన లింతవరకు నిలచెడివికావు.[1] 'ఈ జగత్తుతో మాకు పనిలేదు' అన్నవాదము గాలిలోని యీతవంటిది. మానవుని అనుభూతులన్నియు భౌతికజగత్తు వలన కలిగినవే. అవ్యక్తములోని అనుభూతులును అట్టివేకదా. కావున జగత్తుతో సంబంధములేని అనుభూతు లెటనుండివచ్చును ? పైగా వీరు బుద్ధియాజమాన్యమునొల్లని 'స్వచ్ఛందానుబోధ' ను కోరుటగూడ అర్థరహితమైనదే. వీరు ఒక సంకెలనుకాదని కాలదన్ని మరియొకసంకెలను వేసికొనుచున్నారు. అధివాస్తవికుల మతమున అనుభూతికి 'అవ్యక్తము' పాదు. అనగా వీరి భావనలపై, కోరికలపై 'వ్యక్తము' నకు బదులుగా 'అవ్యక్తము' పెత్తనమువహించుచున్నదన్నమాట. కావున ఏబంధములేని 'స్వచ్ఛందానుబోధ' యన్నది అసంభవమైనవిషయము. అందుకే 'కళకళకొరకే' యన్న అభ్యుదయనిరోధక సిద్ధాంతము దీనికి ప్రోద్బలకమని ఇది యొకవిధముగా అరాజకమే యని క్రిస్టోఫర్ కాడ్వెల్ అధివాస్తవికమతమును ఖండించినాడు. ఏదియెట్లున్నను తెలుగుకవిత్వమున జరిగిన అతినవ్య ప్రయోగములలో ఇదికూడ ఒకటైనందున దీనికి లక్ష్యప్రాయములగు గేయములను పరిశీలింతము.

తెలుగులో అధివాస్తవికగేయములను వ్రాసినవారిలో శ్రీశ్రీ నారాయణబాబులే పేర్కొనదగినవారు. వీరిరువురిలోను శ్రీశ్రీ వ్రాసినవానిలో రెండుమూడు మాత్రమే చెప్పకొనదగినవి. వానిలోఒకటి 'అభిసారికి కడసారి' అన్నగేయము. అధివాస్తవికతను లక్ష్యరూపమునగాక లక్షణ రూపమున ఎక్కువగా ప్రచారముచేసిన కవి శ్రీశ్రీ. అధివాస్తవికకవిత్వసూత్రములను దృష్టిలో పెట్టుకొని ఇతడు 'రుబాయత్, కొంటెకోణాలు, విదూషకుని ఆత్మహత్య'అను మూడుగేయములను ప్రకటించినాడు.[1] ఈ గేయములలో 'ఛందోబందోబస్తులన్ని' త్రెంచివేయుట, 'అర్థాన్ని అధ్వాన్నపుఅడవిలో వదలుట, 'గద్యాన్ని పద్యానికి' పెళ్ళిచేయుట, 'హాష్, హాష్' అనికేకలు

1. 'యథార్థాన్నిగుర్తించము. కలలుమాకు యథార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్న జగత్తు. సంపన్నులు, భాషాసంపన్నులు మాకువిరోధులు. కావ్యలక్షణాలే అవలక్షణాలు. అందరం కవులమే. వ్యక్తాన్నివదలిపెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈతకొడతాము. ఏదో విధమైనశక్తి మమ్మల్ని పూనుతుంది. అదేదో రాయిస్తుంది. అర్థమనర్థం. అదేది రాయిస్తే అదేకవిత్వం. ఇదీ అధివాస్తవికుల మతం.' —సంఘర్షణ : 'ప్రవర' నుండి.

1. ప్రతిభ : గిడుగురామమూర్తి స్మారకసంచిక : నాల్గవసంపుటి.

వేయుట, 'న...న...న...న...న'... న త్తిమాటలు గూడ' తమ వ్రాతలలో నుండవచ్చుననుట శ్రీశ్రీ ప్రతిపాదించిన ప్రధానసూత్రములు, 'ఖాంటెకోణాలు' చివరలో స్యర్రియలిజమనగా ఇట్లుండు నని చెప్పబడినది.

'జీబ్రాకి, Algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్ళూతొడిగి
సాహిత్యపౌరోహిత్యంయిస్తే
వెర్రికాదు, Sur-realismరా సోదరా.'

ఇందులో జీబ్రావేరు, ఆల్జిబ్రావేరు. ఈ రెంటికి శబ్దసామ్యము మాత్రమే కలదు. 'జీబ్రా'కు ఆల్జిబ్రాచిహ్నాలలాంకోటు (లాంగుకోటు) తొడుగుటకూడ అర్థములేనిది. దానిని తొడుగుటకు, సాహిత్యపౌరోహిత్యముచేయుటకు సంబంధములేదు. కావున అసంబద్ధత, అనర్థకత, శబ్దచమత్కారము స్యర్రియలిజము లక్షణములని శ్రీశ్రీ చెప్పదలచుకొన్నాడు. ఈ పాదములకు పైన ఇట్లున్నది.

'పులికి పిలకలేదనడం
చలికి తెలుగురాదనడం
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
'మానిషాదగీతం'లోవున్నది.'

పులికి పిలకలేదనియనుట, చలికి తెలుగురాదని యన్నట్లేయని పై పంక్తులలోని భావము. చలికి తెలుగురాదు కావున పులికి పిలకలేదని తేలినది. ఇంతకు 'పులికి' అనగానే 'పిలక' స్ఫురించుట, 'చలికి' అనగానే 'తెలుగు' స్ఫురించుట దీని వెనుకనున్న విశేషములు. ఈ స్ఫురణకు కారణము ఆ శబ్దముల సారూప్యమే. క్రింది రెండుపాదములలో ఒకదానికొకటి సంబంధము లేకపోవుటయే విశేషము. 'శ్రీనివాసరావు వ్రాస్తున్నది' 'మానిషాదగీతములో నున్నది' అనగా వాల్మీకిలో ఉన్నదని అర్థముచేసికొనగూడదు. 'శ్రీనివాసరావు'నకు తూకములో 'మానిషాదగీతం'వచ్చిచేరినది. అంతే. అంతకుమించిన అర్థమున్నదని ప్రయత్నించగూడదు.[1] ఇంకొకరచనలో శ్రీశ్రీ అధివాస్తవికధోరణికి నిదర్శనముగా

'౬, ౮, ౨, ఆముక్తమాల్యద
ఆటవెలది ద్విపదకర్తగారు'

అని ప్రకటించినాడు. ౬, ౮, ౨కు ఆముక్తమాల్యద కేమియు సంబంధములేదు. బహుశః సామాన్యముగా కొరుకుడుపడని ప్రౌఢప్రబంధముకావున ఆముక్తమాల్యదను హేళనచేయుటకు

1. 'మానిషాద' శ్లోకము కరుణమునకు ప్రతీకయని, శ్రీనివాసరావు కవితలో ఆ రసస్పర్శకున్నదని సమన్వయింతువారును లేకపోలేదు.

ఆ అంకెలు వాడినాడేమో ? 'ఆటవెలది ద్విపదక త్తగారు' అన్నదానిలో ఆ రెండు పద్యములకు గల సాన్నిహిత్యమును, లలితహాస్యరీతిలో చెప్పుచున్నాడేమో ? ఇంకొకగేయములో

'తురాయికంటె ఆ
కురాయికంటె, హిమాం
శురాయి గొప్పవాడు'

అన్నాడు. ఇందులో మూడు 'రాళ్ళు' ప్రయోగింపబడుట; అవి మూడునురాళ్ళు కాకపోవుట చమత్కారము. 'హిమాంశురాయి' (య్) ఒకవ్యక్తి. 'తురాయి' కిరీటమున తురుమబడునది. ఆకురాయి సరేసరి. వీనిలో 'తురాయి'కి మరియు 'ఆకురాయి'కి 'హిమాంశురాయి'తో గల సంబంధమేమి ? హిమాంశురాయ్ రాచఠీవి తొణికిసలాడు పాత్రలను ధరించుటలో ప్రసిద్ధుడైన నటుడు. ఇతని బుద్ధి ఆకురాయివలె చురుకైనదని (Sharp as a file), ఇతని వ్యక్తిత్వము తురాయివలె రాజవైభవ ద్యోతకమని కవియభిప్రాయమేమో ? ఏమైనను దీనిలో శబ్దచమత్కారమే ముఖ్యగుణము.

శ్రీశ్రీ వ్రాసిన యీ గేయములనుబట్టి హాస్యము, శబ్దచమత్కారము, అర్థముల అసంబద్ధత, విశృంఖలపదప్రయోగము అధివాస్తవికకవిత్వలక్షణములని తేలును. వీనితోపాటు జుగుప్సాప్రియత్వము, కామోద్రేకప్రకటనము, తీవ్రభావప్రదర్శనమను ముఖ్యమైన లక్షణములున్నవి. అవి శ్రీశ్రీ 'అభిసారికి కడసారి'లో, నారాయణబాబు 'లెండోయి ఋషులు', 'మౌనశంఖం', 'భావం', 'చిన్నా', 'నీవెవరే', 'గేదిపెయ్యి'వంటి గేయములలో స్ఫుటముగా గోచరించును. వానిని సంగ్రహముగా పొందుపరుతును.

శ్రీశ్రీ వ్రాసిన 'అభిసారికి కడసారి'అనుగేయ మిది.

'ఆకాశంమీద రాకాసికోర
ఏడకయ్యాపోతావు
కోరచుట్టూ నెత్తుటిచుక్కలు
ఏడకయ్యాపోతావు
కనుమలోనిది...కొ...కొ...కొ...కొలిమి
వెళ్ళకయ్యా చెడతావు
నీడచూడకు నీకేహాని
సంకేతం నీశ్మశానం
వింతైనది విహంగం
ఏడకయ్యా పోతావు
చూపులలోనివి సూదులు
ఎందుకయ్యాపోతావు.

"పడుచుదనానికి జడుపులేదు
సంకేతం నాసరస్సు"
వెళ్ళకువెళ్ళకు చస్తావు
నాచునిండిన కోనేరు.
ఏమిటి దంతపుచర్మంమీద
ఎర్రనిపచ్చనిదేదోమచ్చ
లోతులోయలో భూతాలు
కొలిమినిప్పులో గుర్రాలు
సూదికికంట్లో సోపానం
కాళ్ళకు కళ్ళుసంకెళ్ళు
సంకేతం నీసాల్వర్సాణ్
జలపాతంలో జంఝూటి.'[1]

దీనిలోని వస్తువు సిఫ్లిస్‌కు (సుఖవ్యాధికి) సంబంధించినది. ఒకానొక అభిసారి సుఖవ్యాధి పీడిత యైన స్త్రీదగ్గరకు కామతృప్తికై వెళ్ళబోగా వలదని వారించుట దీనిలోని వస్తువు. ఈ వస్తువును వ్యక్తీకరించుపదజాలము, రీతి దీనిని అధివాస్తవికకవిత్వముగా మార్చినవి. 'ఆకాశంమీద రాకాసికోర, కోరచుట్టూ నెత్తుటిచుక్కలు', 'కనుమలోనిది కొలిమి', 'సంకేతం నీ శ్మశానం', 'సంకేతం...నాచునిండిన కోనేరు', 'దంతపుచర్మంమీద, ఎర్రని పచ్చనిదేదోమచ్చ', 'లోతు లోయలో భూతాలు' మొదలైనప్రయోగములన్నియు, ఆస్త్రీ రహస్యాంగము నుద్దేశించి వ్రాసినవే. వ్రాయుటలో కవి జుగుప్సావహమైన పదజాలమును, ప్రతీకలను ఉపయోగించినాడు. కొలిమి, నాచునిండిన సరస్సువంటివి ఇట్టివే. వస్తువు జుగుప్సావహమైనది; పైగా కామోద్రేకమునకు సంబంధించినది. పదములు వికారమును కలిగించునవి. వ్యక్తీకరణము స్పష్టతకు దూరముగా నుండుట, భావము పొగమంచువెనుకగల పదార్థమువలె అగమ్యముగా నుండుట, 'కొ...కొ... కొలిమి'వంటి నత్తిమాటలుండుట దీనిలోనున్న అధివాస్తవికలక్షణములు. తమకు పూర్వము

1. ప్రతిభ: 1940 జూలై సంచిక.

శృంగారరస మేల్బడిలోనుండగా దానిని గద్దెదించి బీభత్సమును ప్రతిష్ఠింపదలచుకొన్నారు వీరు. ఆ ప్రయత్న మీ గేయమున రుజువైనది.[1]

ఇక నారాయణబాబు గేయములలో కొన్నిటిని పరిశీలించిచూపుదును.

'చిన్నా' అనుగేయమునకు ముందు నారాయణబాబు ఈవిధముగా వ్రాసికొనెను.

'వ్యక్తంచేరుకుందామని, చైతన్యస్రవంతినీది, వ్యక్తంకంటబడకుండ, వ్యక్తావ్యక్తంలో తలదాచుకుంటున్న తలపుల చెప్పేందుకే యిందులో చేసిన ప్రయత్నం.'

ఈ గేయములోని కొన్ని భాగము లివి.

'మన్నుతింటున్న చిన్న !
మీనాన్న నిన్నుకొడితె
ఏమిటిఅల్లాచూస్తావు !
నీ చూపులు ?
నాగమయ్య గొంతుకుతడిపే
చవితినాడు చిమ్మిలితిన్నావ !
... ... ... ...
మన్నుతింటె పాండురోగ
మొస్తుందంటాం ఏం
ఏమంటాయి నీచూపులు ?
... ... ... ...

---

1. David Gascoyne వ్రాసిన 'And the Seventh Dream is the Dream of Isis' అను గేయములోని క్రింది పంక్తులు స్త్రియలిస్టుల భయానకబీభత్సచిత్రణకు చక్కని ఉదాహరణములు.

'There is an explosion of geraniums in the ballroom of the hotel.
There is an extremely unpleasant odour of decaying meat
arising from the depetalled flower growing out of the ear
her arms like pieces of sand paper
Or wings of Leprous birds in taxis
and when she sings her hair stands on end
and lights itself with a million little lamps like glow worms
you must always write the last two letters of her christian name
Upside down with a blue pencil'. —New verse: Pub: 1938 oct.

ఈ గేయములో విభిన్నభావచిత్రముల సమ్మేళనములో, బీభత్సచిత్రణతో పాఠకుని చకితునిజేయు ప్రయత్నము కలదు.

పూర్వంమీ పెరడు
యినుపగని యిప్పటికి
మంటిలోన యినుముందని
పాండురోగానికె మందని :
చిన్నా !
నీచూపులు వేదాలు
నీవే బ్రహ్మపదార్థానివి.'[1]

ఇందులో మన్నుతిను కుర్రవానికి 'చవితినాటి చిమ్మిలి'కి సంబంధములేదు. అట్లే కుర్రవానిచూపులలో అంతటి అర్థమున్నదని అనుకొనుటగూడ వ్యక్తావ్యక్తమునకు సంబంధించినగుణమే. మట్టిలో ఇనుముండుటవలన అది పాండురోగమునకు మందనుట, మట్టితినుటవలన పాండురోగము వచ్చుననుట పరస్పరసంబద్ధములుకావు. కవి స్వయముగా చెప్పుకొన్నట్లు అది వ్యక్తావ్యక్తభావమేళనముగల గేయము. నారాయణబాబు వ్రాసిన 'గేదిపెయ్యి'లో కవి తనకు 'గేదిపెయ్యి'కి గల సామ్యవైషమ్యములను వితర్కించుకొనును. మేడమీద తాను. మేడక్రింద అది. ఇది వ్యక్తములో. అవ్యక్తములో 'నీతోనే'నని యనును. 'వ్యక్తంలో నీనోటిని గడ్డిపరక వ్యక్తావ్యక్తంలో నాభావం' అని యనును. అనగా ఈ రెండు ఒకటేయని అర్థము. అది గడ్డిమేయుచున్నది; తానో భావములను చర్వణమొనర్చుచున్నాడు. దానిరవము సజీవమట. తన గీతములు నిర్జీవములట. చివరికి 'నీ సజీవ "ంభా" రవమునకె చెవులు మూసుకొని నా నిర్జీవపు గీతాలను వినేందుకు సభచేసిన లోకం సెభాస్' అని సమాజముపై 'విసు'రున్నది. 'నీవెవరె' అను గేయములో 'అర్ధరాత్రి'ని వర్ణించుచు 'ఆవ మగ తడిమినా తెలియని తాంద్రపాపారాయుడు తమస్సు' అనెను. తమస్సునకు తాంద్ర పాపరాయనికి ఏమాత్రము సంబంధములేదు. తమస్సును వర్ణించదలచుకొనగా, దానితో యతికి సరిపోవు 'తాంద్రపాపరాయడు' పదము కవి వ్యక్తావ్యక్తమనఃస్థితిలో స్ఫురించినది. దానినే చటుక్కున ప్రయోగించినాడు. 'కవి' అనుగేయములో అందరు సుందరముగా దర్శించు చుక్కలను ఇతడు జుగుప్సావహములుగా చిత్రించినాడు. ఆ వర్ణన యిది.

'నల్లని బ్రాచుకోరలు
తెల్లని మసూచికుండలు
గగనమ్మున చుక్కలు
ఒళ్ళుతెలియని పుళ్ళబాధతో
వెక్కివెక్కిరోదించినది చుక్కలఆకాశం.'

1. ఈ గేయము కవిగారి వ్రాతప్రతినుండి సేకరించితిని.

ప్రకృతిలో సౌందర్యమునేకాక దారుణబీభత్సగుణమునుదర్శించుట అధివాస్తవికులలక్షణములలో నొకటి. చుక్కలను మల్లెలుగా, ఆకాశమును నీలిపందిరిగా చిత్రించిన భావకవులకు విభిన్నముగా చేసిన వర్ణనమిది. నారాయణబాబుగారి గేయములన్నిటిలో అధివాస్తవికకవితాగుణములన్నియు సమగ్రముగాగల గేయము 'మౌనశంఖం'.[1] ఈ గేయము 1940 ప్రాంతములోనే రచింపబడినదట. ఈ కాలములోనే శ్రీశ్రీ 'అధివాస్తవికుల ప్రవేశము' అనుశీర్షికతో 'రాసభమా వికారములు రాల్చకు' వంటి పద్యములు రచించినాడు.[2] నారాయణబాబు 'మౌనశంఖం'లో తాను, శ్రీశ్రీ అధివాస్తవిక రంగమున ప్రవేశించినప్పటి మనఃస్థితిని వ్యంగ్యముగా వివరించినాడు. వ్యక్తావ్యక్తస్థితిలో ఇరువురు దేవలోకమువంటి లోకమున కెగిరిపోదురు. అక్కడ దేవేంద్రుడు, శచి దయనీయస్థితిలో కనిపింతురు. ఇంతలో గండభేరుండపక్షి వచ్చి 'శ్రీశ్రీని ముక్కుతో అంకించుకొని' గరుడలోకములోనికి ఎగిరిపోవును. అంతలో రజతాచలము కన్పడును. అక్కడ నగ్నముగా నిల్చుండి పూలుకోయు పార్వతి కన్పడును. పార్వతీదర్శనముతో నారాయణబాబు 'బట్ట అంటుకొ'నును. దగ్గరగా ఒక 'మౌనశంఖం' కన్పడగా దానిని స్పృశించినంతనే నారాయణబాబు 'ఏముకల మూలుగులో చంద్రోదయమై', అతని 'గుండెఅంతా హంసయై' 'సోహం' అని అరచినది. ఇది ప్రధానవస్తువు. కాని గేయము చదువుచున్నప్పుడు అనేకములైన అసంబద్ధవిషయము లెదురగును. ఈ గేయములోని మొదటి పంక్తులివి.

'కాడ్‌లీవరాయిల్లో 'డీ' విటమినుంటుంది
కోడిగుడ్లు ధాతుపుష్టి
కాకాతువ్వ తెలుపు; కోయిలనలుపు.'

'కాడ్‌లీవరాయిల్లో' (ఇంగ్లీషు శబ్దములో)డి' యున్నది ('డీ' విటమినున్నది). 'కోడిగుడ్లు ధాతుపుష్టి' ఇవి సహజగుణములే. 'కాకాతువ్వ' యన్నది శబ్దచమత్కారము ఇంగ్లీషులో 'Cacatoo' అనుపదమునకిది తెలుగువికృతి. Cacatoo అనగా తెల్లరామచిలుక. దీనిలో ఇంతకుమించిన విశేషములేదు. గాలి కవిని నీ వెవరని ప్రశ్నించును. కవి యిట్లు చెప్పును.

'తాగిచనిపోయిన ఒకపుండాకోరుని
డాక్టరు శవపరీక్షచేసినప్పుడు
అతనికడుపులో అరగకుండా
పైకిఒలికిన సారాచుక్కను.'

సభ్యలోకము దేనిని చెప్పుటకు వెనుదీయునో, ఆ విషయమును దారుణముగా చెప్పుటకు ఈ చరణములలో కవి ప్రయత్నించినాడు. తర్వాత ఇట్లు వ్రాసెను. 'ఇంతకూ ఎవరైతేనేం? దుక్మిణీ

---

1. కల్పన (ఆధునికకవితాసంకలనం): పుట 69.
2. ఈ రెండు విషయములు నాతో ఆరుద్ర చెప్పియున్నాడు.

కళ్యాణ తపస్సులో కుటుంబచింతనలో కలిశాం నీవూ నేనూ.' రుక్మిణీకళ్యాణతపస్సు, కుటుంబ చింతన ఒకదానికొకటి పొసగని విషయములు. 'రుక్మిణీ కళ్యాణ తపస్సులో' అన్నమాటలో జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, 'కుటుంబచింతనలో' అన్నదానిలో కొడవటిగంటి కుటుంబరావు సూచింపబడిరి. ఈ యిరువురు అతినవ్యకవులపై సానుభూతిగల రచయితలు. తర్వాత శ్రీశ్రీ నారాయణబాబు లిరువురు వీధిలోనికి ప్రవేశింతురు. వారికప్పుడు కనిపించినవి.

> 'కాశ్మీరసరస్సులలో పడవల్లాగు
> కాలప్రవాహంలో కలరాశవాలుకొన్ని.'

కాలప్రవాహములోని కలరాశవాలను కాశ్మీరసరస్సులలోని పడవలతో పోల్చి, కవి లోకుల దృష్టిలో అందమైన వస్తువులను హేళనచేయుచున్నాడు. తర్వాత వారికి 'కుష్ఠురోగంతో కాళ్ల చేతులు పడిపోతే కిందపడి దొర్లుతూ ఏడుస్తున్న దేవేంద్రుడు' 'ఇంకిపోయిన అమృతభాండంలో తడైనా తగుల్తుందేమోనని వేళ్ళతో స్పృశిస్తున్న శచీదేవి', తానొకప్పుడు ఖండించిన కొండల రెక్కలను ప్రోగుచేసి 'మరల పర్వతభుజాలకు పేస్టుతో' అంటించు వజ్రాయుధము కన్పించినవి. అధివాస్తవికులు దేవతావహేళనకు ఇవి మచ్చుతునుకలు. 'గండభేరుండపక్షులు కలరవాలు చేస్తుంటే శ్రీశ్రీ పాడుదామన్నా'డట. గండభేరుండపక్షులు భయంకరధ్వనులు చేయునేకాని కలరవములుచేయవు. ఇది కోయిలలపై 'విసురు.' ఎదురుగా 'దాకలి సరస్వతి' కన్పించగా దానిని తన్నుటకు కాలెత్తి శ్రీశ్రీ మూగయై నిల్చున్నాడు. దానిముందు గుతజాద ముత్యాలసరము. హాప్కిన్సు Sprung - rhythm, జర్మనుఛందస్సగు వాల్ ఖలేడ్ దిగదుడుపని శ్రీశ్రీ అన్నాడు. తర్వాత 'అరగండభేరుండపక్షి' శ్రీశ్రీని ముక్కుతో కరచుకొనిపోవును. ఈ రెండుసంఘటనలు దమితమైన కామవాంఛకు సంకేతములు. రెండస్థిపంజరములలో ఒకటి నల్లబడిన యెముకలతో బంగారపు గునపముతో తాజమహలు త్రవ్వుచున్నట్లు కన్పడును. తాజమహలును త్రవ్వివేయుటలో సుందరవస్తువులని లోకము భావించినవానిపట్ల అసహ్యత ప్రకటించుట కలదు. పార్వతీ దర్శనముతో 'బట్ట అంటుకొను'ట కామజ్వాలకు సంబంధించిన వ్యంగ్యచిత్రణము. అయినను నిర్వహణములో కవి కామవాంఛ జ్ఞానోదయముగా మారినట్లు సూచింపబడినది. కవి సంప్రదాయ సిద్ధమైన నిర్వాణస్థితి నందుకొన్నట్లు చెప్పబడినది. ఈ గేయములో చివరికి గభీరవిషయ నిర్దేశ మున్నను, అంతకుముందు కామవాంఛాప్రకటనము, వికృతవిషయకథనము, విచిత్రభావచిత్రణము ప్రధానముగా నున్నందున ఇది అచ్చమైన అధివాస్తవికగేయమనవచ్చును. దేశిరాజు కృష్ణశర్మ వ్రాసిన 'దయ్యాల పెళ్ళి' వంటి గేయములు బీభత్సరసమునకు సంబంధించినవేకాని వానిలో మిగిలిన అధివాస్తవిక కవితాలక్షణములులేవు కావున వానిని గూర్చి చర్చింపలేదు.

అధివాస్తవికత సాహిత్యలోకమున తెరువబడిన మంత్రకవాటమని ఎందరెన్ని చెప్పినను, ఇది భావచిత్రములలోతప్ప సాధించినదేమియులేదు. వ్యక్తమునకు హేతువునకు బదులుగా అవ్యక్తమునకు వ్యక్తావ్యక్తమునకు ప్రాధాన్యమిచ్చుటవలన, సాధారణీకరణరాహిత్యమను లోపము

వలన, పదములను వానిరూఢ్యర్థములకు బదులుగా విపరీతార్థములలో వాడుటవలన, అపూర్వ విషయములను చెప్పు ఉబలాటముతో అన్వయమును సన్యసించుటవలన, జుగుప్సావహవిషయ చిత్రణము వలన ఈ అధివాస్తవికరీతి తెలుగులో ఎక్కువకాలము నిలువలేకపోయినది. నారాయణ బాబు వ్రాసిన 'రుధిరజ్యోతి'లోని గేయములు ప్రాయికముగా ఇమేజిజమునకును సింబాలిజమున కును చెందినవి. ఆయా సందర్భములలో వానిని పేర్కొనవలసియుండును కావున ఈవిషయము నింతటితో ముగింతును.

## 2. సెక్సు (కామ) ప్రాధాన్యము :

మానవుని కాంక్షలన్నిటికి 'Libido' (కామవాంఛ) మూలమని ఫ్రాయిడ్ ప్రతిపాదించి నాడు. పసిపిల్లలలోగూడ ఈ కామవాంఛ బీజప్రాయముగా నుండునన్నాడు. పిల్లవాడు స్తన్యము గ్రోలుచున్నప్పుడు తల్లిపొందు అవ్యక్తానుభూతి 'Libido' కు సంబంధించినదే యని అనెను. లోకములో తండ్రికి కూతురుపై తల్లికి కొడుకుపై అధికప్రీతి యుండుటగూడ ఈ వాంఛకు మారు రూపమే యని ఫ్రాయిడ్ అభిప్రాయపడెను.

నారాయణబాబు ఫ్రాయిడ్ 'కామ' సిద్ధాంతముచేత ప్రభావితుడై 'లెండోయ్ ఋషులు' అను గేయము రచించెను. దీనిలో ప్రాణికి కామోద్రేకము, సుఖవాంఛ సహజగుణములని, వానిని అణచివేయుటవలన ప్రయోజనములేదని ధ్వనింపజేసెను.

'కనురెప్పలసెజ్జమీద కళ్ళజోడుముక్కుతోడ
వ్యభిచరించె
నట్టింట్లో చిల్లువడిన మజ్జిగకుండ కవ్వం
చీకటితప్పేచేశాయ్.
కుళ్ళిపోయిన కూరగాయలు
కునికిపాట్లు పడుతుంటే
టమాటాపండు మాంసంముక్క కలిసి
అఖండసంధ్యారాజ్యం చేస్తున్నాయి'

అనుపంక్తులలో ఈ లైంగికసంబంధమునే ఆపాదించినాడు.

'పత్తిగింజలు చుక్కలు గోళ్ళతోనొక్కండి.
సురవిలాసవతులు చూచుకొనే
అద్దం చంద్రుని బ్రద్దలుకొట్టండి'

అను చరణములలో ఇవి ఎట్లు సాధ్యముకానివో అట్లే 'సెక్సు'ను అణగార్చుటగూడ సాధ్యము కాదని అధిక్షేపించెను. ఈ గేయములోనే 'విరులంటే మండిపడే విశ్వస్తం పడకగదిలో

కంచెంబులో ఉద్ధరైన కమ్మవిల్తుకేళిదేలె'నని అతిదారుణముగా 'సెక్సు' ప్రాధాన్యము నుద్ఘోషించెను.

'కామ' ప్రాధాన్యము స్ఫుటముగాగల అతినవ్యకవితాసంపుటి 'ఫిడేలురాగాలడజన్.' దీని కర్త పఠాభి; ప్రధానముగా నగరజీవితచిత్రణమునకు అంకితమైన కవి. తెలుగులో నగరజీవితమును వస్తువుగా తీసికొన్న అతినవ్యులలో ఇతడు ప్రథముడు. వస్తుభావపదవైచిత్రికి పఠాభిని చెప్పి ఇంకొకరిని చెప్పవలెను. కాని యీ సంపుటిలో ఒకటిరెండు గేయములలోతప్ప, మిగిలిన తొమ్మిది పది గేయములలో కామోద్రేకనగ్నప్రకటనమే ప్రధానముగా కన్పించును. ఈసంపుటికి చలం వ్రాసిన ప్రశంసాగేయమున తాను 'ఈ పొడుగాటిపాటల్లో చిత్రచిత్రాలుఐనట్టి భావాలు ఎన్నో వాడిఅయినట్టి కొనగోళ్ళతోడ చురుకుమనునట్లు పెట్టిన చక్కిలిగింతషోకు'ననుభవించినట్లు చెప్పబడినది. ఈ ప్రశంసలోనే కావ్యవస్తువు సూచితమైనది. భావకవుల అమలినశృంగారమును, లలితసంయోగభావమును త్రోసిపుచ్చి యీ కవి కేవలకామోద్రేకప్రధానమైన ఆంగికశృంగారము నభివర్ణించినాడు.

కవీశ్వరు లఖండముగావినుతించిన చంద్రబింబము తనకునచ్చదని, 'నాగరికకన్యల' 'పౌడరుపూయబడిన ముఖములను' చూచినచో తనకునోరూరునని, ఆ ముఖములను

'మాకళ్ళపిడికళ్ళతో గట్టిగాపట్టి
తిండిబోతుల్లాగ తినివేస్తాము'

అని అన్నాడు. కన్నులతో - చూపులతో - ముఖలావణ్యమునుగ్రోలుట ప్రాచీనకవుల - భావకవుల - సంప్రదాయము. దానినీకవి యిట్లు వికారమొనర్చెను. 'మరీనా' అను శీర్షికతో మెరీనా బీచిలో విహరించు 'హంగ్రీకనులు'గల జవ్వనులను వర్ణించుటతో తృప్తిపడక, రోడ్డుమీదగల మోటారుకారులుగూడ 'ఉబ్బుకొనివచ్చేసెక్సు' అపీలుగల అమెరికన్ స్త్రీలవలెనున్నవనెను. 'సీత' అను గేయములో కవిప్రేయసి 'సీత.' రామయ్యకు సతిగానుండుటకన్న రావణుని ప్రియురాలిగా నుండుటయే తనకిష్టమని ఆమెయనును. అప్పుడుకవి తానురావణుడనై, 'పదిమూతులతోను, నీ పెదవులను, మృదుశరీరమును, వదనమును అదుముతా'ననియనును. ఈ అసురభావన కామోల్బణజనితమేకదా !

'బోగందాన' అను గేయము సమాజముపై కవివిసరిన పరిహాసచంద్రహాసము. బోగముదాన ముసుగులేని నిష్ఠురసత్యమని, పూజారులు యోగులు పతివ్రతలవలె వెలికికనిపించుసతులు నాటకమాడుచున్నారని యెత్తిపొడిచి కవి సంఘములోనికుళ్ళును బయటపెట్టినాడు. ఇంతటి సాంఘికప్రయోజనమున్న గేయములోగూడ బోగముదానల 'చనులు బ్రాందీపొట్లాల'వలె ఊగుచున్నవని అనవసరమైన ఆంగికవర్ణనపాలైనాడు. 'నవ్యస్త్రీ'యను గేయములో నవ్యస్త్రీ కుచయుగళము స్వర్గద్వయమని, తాను వానినడుమ ఊగాడు పార్కర్‌కలముగా మారిపోయిన బాగుండునని, నవ్యస్త్రీమీద చూపులునిలుపుటయనగా 'డిలక్స్‌కుషన్‌సోఫాల'మీద కూలబడి

నట్లుండునని వస్తువైచిత్ర్య ప్రవాహమునబడి కాముశృంగారమునకు దాసుడైనాడు. ఈ సంపుటి లోనేయున్న 'కామాక్షికోక'యన్న రచన నగ్నశృంగారమును చిత్రించుగేయము. కవి 'కామాక్షి' యను పేరుగల ఒక కామాక్షికి ఆమె జన్మదినసందర్భమున కోకను సమర్పించినాడు. ఆ పిమ్మట కామాక్షిసమస్తాంగముల నాకోక యేవిధముగా ఆలింగనముచేసికొన్నదో, కామాక్షికవుల సంయోగ సమయమున తనకు (కోకకు) గలిగిన అనుభూతులేవో దానిస్వగతరూపమున పచ్చిపచ్చిగా ఉల్లేఖింపబడినది. ఈ విధముగా పైన పేర్కొన్న గేయములన్నియు పాశవికశృంగార క్రీడ లకు, అసంపూర్ణకామవాంఛలకు పతాకలవంటివి. ఈ ధోరణి పఠాభితోనే అస్తమించుట తెలుగు కవితలోని ఆరోగ్యవంతమైన లక్షణములలో నెన్నదగినది.

### 3. ప్రతీకవాదధోరణి :

#### ఇలియట్ ప్రభావము :

సింబాలిజమునకు తెలుగులో ప్రతీకవాదమనియనుట సమంజసమనిభావించి దానినే వాడు చున్నాను. పాశ్చాత్యసాహిత్యప్రపంచములో వెలువడిన యీ ప్రతీకవాదము శబ్దమునకు భావ ప్రకటనముకాక సూచనయేప్రధానమని, వాతావరణకల్పనమే కళ ప్రధానలక్షణమని భావించినది. అందుకు ప్రతీకవాదులు వెలుతురును జ్ఞానమునకు, చీకటిని అజ్ఞతకు, వసంతమును జన్మకు, శిశిర మును మృత్యువునకు ప్రతీకలుగా స్వీకరించిరి. ఈ వాదము తాత్త్వికదృక్పథముతో ముడివడి యుండుట గమనింపదగినది. జపధ్యానములద్వారా ఆస్తికులుసాధించులక్ష్యమును ప్రతీకవాదులు 'కళ' ద్వారా పొందుటకు ప్రయత్నించిరి. అందుకొరకు వారు మతసంబంధమైన ప్రతీకలనేకాక క్రొత్తవానిని సృష్టించుకొనిరి. ప్రముఖప్రతీకవాదకవి మలార్మే తన అనుభవక్షేత్రమునుండి అనేకప్రతీకలనేరుకొనెను. అందుచేతనే ఇతని కవిత్వములో అస్పష్టత (Obscurity) అను దోషము ప్రవేశించినది. ప్రతీకవాదులందరిలో ఈయస్పష్టతకలదు. వీరు ప్రయోగించిన ప్రతీకల నర్థముచేసికొన్నచో అపూర్వానందముకలుగును; లేనిచో అయోమయమనిపించును.

ఇంగ్లీషుకవులలో ప్రతీకవాదప్రభావమున్నకవి టి. యస్. ఇలియట్. ఇతడు కేవలము ఈ వాదముననే ముడివడియున్నవాడుకాడు. ఇతనిపై ఇమేజిజముప్రభావముగూడ గాఢముగా నున్నది. ఇలియట్ Wasteland మున్నగు కావ్యములలో కొన్ని విచిత్రమైన ప్రతీకలువాడి క్రొత్తదారి త్రొక్కినకవి. ఈ విషయమున తెలుగు నవ్యకవులలో ఆరుద్ర, బైరాగి మున్నగు కొందరు కవులపై ఇలియట్ ప్రభావము కంఠదఘ్నముగానున్నది. అందువలన Wastelandలో ఇలియట్ ప్రతీకలద్వారాచేసిన చమత్కారములనువివరించి తర్వాత ఆరుద్ర ప్రభృతులరచనలను పరిశీలింతును.

ఇలియట్ ప్రథమప్రపంచసంగ్రామఫలితముగా యూరోపియను సమాజమున ఏర్పడిన నిరాశానిస్పృహలను అరాజకస్థితిని కవితావస్తువుగా స్వీకరించినాడు. సమకాలీనసమాజములోని స్థితిగతులను తానూహించిన కొలమానముతో కొలిచి అసంతృప్తి ప్రకటించినాడు. ఆధునిక

నాగరకతలోని 'అయోమయ'స్థితి నీసడించినాడు. Wasteland కావ్యములో ఈ కవి రుజాగ్రస్త సమాజమునుగూర్చి రోదించెనేకాని దానికి విరుగుడు సూచించలేదు. యుద్ధానంతరము యూరపులోని మానవసమాజమునే ఒక 'మరుభూమి'గా భావించినాడు. నగరవాసుల అనుభూతులను ఆలోచనలను క్రొత్తపలుకుబడితో చిత్రించిన మొదటి ఇంగ్లీషుకవి ఎజ్రాపౌండ్ (Ezra Pound). ఇతని ప్రభావముతో ఇలియట్ నగరజీవనచిత్రణమునకు పాదులువేసి తీగలుసాగించెను. ఇతని వేస్టుల్యాండులో మాటిమాటికి ప్రయోగింపబడు Fisher king తాను ప్రత్యక్షముగా కనిపించడు. వక్త (కవి) ఉత్తమపురుషైకవచనములోచెప్పిన విషయములన్నియు ఈతనికే వర్తించును. Fisher king మారుచున్న పరిస్థితులను గమనించి వానితో శ్రుతికలుపలేని అసమర్థునికి ప్రతీకగా వాడబడినాడు. సమాజము సంక్షుబ్ధస్థితిలోనుండగా ఈతడు చేపలుపట్టుకొనుచు కూర్చుండును.[1] ఈ కావ్యము ప్రథమదశలోని టైరీషియన్ (Tiresias) ఇతడే.[2] లండన్‌వంతెన (London Bridge)పై ప్రవహించెడి మృతజీవులలో తన్ను తాను దర్శించుకొన్నాడితడు. ఇలియట్ ఇతని అసహాయస్థితిని ఆధునికులస్థితితో పోల్చినాడు. ఈ కావ్యములోని Deliverer పాత్ర గార్హస్థ్య పరాజయములకు, వైవాహికవ్యవస్థాక్షీణతకు ప్రతీకలు. ఇతడు తన యిల్లాలితో విసిగిపోయి టైపిస్టు అమ్మాయిని ప్రేమించుటలో ఈ సూచనయే ఇమిడియున్నది Phlebas the phoenician (ఫ్లీబస్ ది ఫినీషియన్) అను పాత్ర ధనసంపాదనవృత్తికి, ప్రణయప్రవృత్తికి ప్రతీక వంటిది. ఈ యువకుడు చివరికి నిరాశానిహతుడై సముద్రములోమునిగి చనిపోవును.[3] ఇతని మృతిరూపకముగా ఇలియట్ ఆధునికసమాజములోని నిస్సారతను సూచించుచున్నాడు.

ఈ కావ్యమంతట ఊషరక్షేత్రమున జలముకావలెనను ఆందోళన వ్యక్తమగుచున్నది. థేమ్సునదిలో ప్రవహించునీరు ఊషరభూమిని తడుపుటకుబదులుగా వ్యర్థముగా పోవుచున్నది. Deliverer, Woman పాత్రలు తమ లక్ష్యసాధనలో పరాజితమైనట్లే థేమ్సునదీజలములు ఫ్లీబస్‌నుముంచుటకుమాత్రమే ఉపయోగపడి వ్యర్థమైపోయినవి. ఇంతటి నైరాశ్యమును ధ్వనింపజేసిన ఈ కావ్యములో కొన్ని ఆశారేఖలు లేకపోలేదు. తుఫాను, ఉరుములకు సంబంధించిన ఘట్టమునగల 'Dry sterile thunder' (నిస్సారమైన వినాశాత్మకగర్జన) వర్ణనలోగూడ భవిష్యత్తులోని ఆశామయజీవితము ధ్వనించుచున్నది. ఇలియట్ ఆశాసందేశము నొసగుటకు ఉపనిషత్తులలోని 'దత్త, దయాధ్వమ్, దమ్యత'అను సూక్తులను గ్రహించినాడు.[4] ఈ యుపదేశమును మానవులు శిరసావహించినచో-అనగా వారిలో ఉదారత్వము, సానుభూతి, సంయమనమనుగుణములు పెరిగినచో-ఊషరక్షేత్రము పునరుజ్జీవితమగునని సూచింపబడినది. ఈ కావ్యములోని మరికొన్ని ప్రతీకలివి. దీనిలో అనేక పర్యాయములు Nightingale ప్రసక్తి వచ్చినది. గ్రీకు

1. 'I sat upon the shore—'.
2. టైరీషియన్ గ్రీకునాటకములలోని ప్రవక్త. ఇతడంధుడు.
3. 'A current under sea picked his bones in whispers' అను పంక్తిలో ఇదే సూచింపబడినది.
4. 'Datta. Dayadhvam. Damyata. Shantih Shantih Shantih.' —The Waste Land.

పురాణములలో నైటింగేల్ అనశ్వరసౌందర్యమునకు, విషాదమధురగానమునకు సంకేతము.[1] ఇలియట్ దీనిని కామశృంగారవైఖరికి, గభీరవిషాదప్రవృత్తికి (Serious tragic character) ప్రతీకగా గ్రహించినాడు. Red Rock అను పదమును ఆశారేఖకు ప్రతీకగావాడినాడు. భయ గ్రస్తమైన జగత్తులో Red Rock ముక్తికిరణమువంటిదని ఇతని భావన. ఈస్టుకోకర్ (East Coker) అను కావ్యమున క్రీస్తును గాయపడిన సర్జనుగా, చర్చిని చనిపోవుచున్న నర్సుగా, మృతియే చక్కని చికిత్సగా సంకేతించినాడు 'Love song of J. Alfred Prufrock' అను గేయములోని ప్రూఫ్రాక్ (Prufrock) పరాజితమనస్తత్త్వమునకు ప్రతీక. బర్న్టనార్టన్ (Burnt Norton) లో త్రికాలములకు సంబంధించిన తాత్త్వికచర్చ ప్రతీకవాదధోరణిలో జరిపి నాడు. వేస్టుల్యాండ్‌లోని ఫైర్ సెర్మన్ (Fire sermon) అను ఖండమున మానవజాతి దురాశా ద్వేషానలజ్వాలలలో మండిపోవుచున్నట్లు ధ్వనింపజేసినాడు. ఈ ప్రతీకలన్నిటికి మిస్ జెస్సీ ఎల్. వెస్టన్ (Miss Jessie L. Weston) వ్రాసిన 'Ritual To Romance' అను గ్రంథ మాధారము. ఈ ప్రతీకల నాధారముచేసికొని వేస్టుల్యాండ్ మున్నగు కావ్యములు రచించి ఆధ్యాత్మి కతయే మానవజాతికి ముక్తిదాయకమని ఇలియట్ ప్రబోధించినాడు.

ఇలియట్ ప్రభావముతో తెలుగున అతినవ్యకవితావీధుల విహరించినవారిలో ఆరుద్ర ప్రథమగణ్యుడు. ఇతని 'త్వమేవాహం', 'సినీవాలి' రెండును ఇలియట్ ప్రభావముగల కావ్య ములే. అయినను ప్రతీకవాదములోని ఆధ్యాత్మికతాగంధమును ఆరుద్ర స్వీకరించలేదు. తాత్త్విక దృష్టిని తనలో కలుపుకొనలేదు. ఆ వాదమున ప్రతీకలద్వారాజరిపెడు చమత్కృతులను మాత్ర మాకళించుకొన్నాడు. ఇలియట్ వేస్టుల్యాండ్ ఏ విధముగా నీతిభ్రష్టమైన మానవసమాజ మునకు ప్రతీకయో, ఆరుద్ర 'త్వమేవాహం'లోని ఇసుకగడియారమమున్నగునవి కాలమునకు, సమాజమునకు ప్రతీకలు. ప్రతీకలద్వారా భావవైచిత్ర్యమును కలిగించుటలో, నగర జీవనచిత్రణములో ఇలియట్ ప్రభావ మితనిపైనున్నది. అంతేకాని ప్రతీకవాదములోని తాత్త్విక దృష్టితో ఆరుద్రరచనలకు ప్రసక్తిలేదు. ఇక 'త్వమేవాహం'లో ఆరుద్ర వివిధప్రతీకలద్వారా వ్యక్తీకరింపదలచుకొన్న అభిప్రాయములను వివరింతును.

తెలంగాణాలోని జమీందారీవ్యవస్థను, రజాకారులనిరంకుశత్వమును ప్రతిఘటించి ప్రజలు జరిపిన విప్లవము 'త్వమేవాహం' కావ్యమునకు ప్రోద్బలకమని శ్రీశ్రీగారన్నారు.[2] పోలీసు చర్యకు పూర్వము తెలంగాణా-అంతర్యుద్ధమునాటి స్పెయిన్‌దేశమువంటిదని, కృష్ణాపత్రికలోపడిన 'రజా

1. గ్రీకుపురాణములలో 'నైటింగేలు' పూర్వజన్మమున 'ఫిలోమెలా' అనుకన్య. టిరియస్ అనురాజు మరదలు. టిరియస్ ఫిలోమెలాను మానభంగమొనర్చి ఆమెనాలుక కత్తిరించెను. దేవతలాకన్యను కనికరించి, ఆమెను నైటింగేలుపక్షిగా మార్చివేసిరి. అందుచేతనే నైటింగేలుపాటలో మాధుర్య ముతోపాటు విషాదముగూడ స్ఫురించుచుండును.
2. త్వమేవాహం : లఘుటిప్పణి : పుట 45 : ముద్రణ 1949 జూలై.

కార్ల చెరచబడ్డ స్త్రీకథనం' చదివినపిమ్మట తానీరచనచేసితినని ఆరుద్ర స్వయముగా చెప్పు కొన్నాడు.[1]

'ఈకాంతను చెరపట్టగ
రాకాసులు తలపెట్టిరి'

అను పాదములలో రజాకార్ల దౌర్జన్యము

'నక్కలుతిరిగేతోటలో
రాకాసిరాజొకడుండెరా'

వంటి పంక్తులలో నిజామునవాబు నిరంకుశత్వము

'బ్రెయిన్లో స్టైన్గన్లా
చెట్లు చిట్టెలుకలు
చెయిన్సులో మగాళ్ళు
చెరచబడ్డ ఆడవాళ్ళు
చెదపురుగులు
మదమెక్కినసోల్జర్లు'

వంటి పంక్తులలో రజాకార్ల దుర్మార్గములవలన ప్రజలుపొందినబాధలు చిత్రించబడినవి. తెలంగాణావిప్లవమే యీ కావ్యమున ప్రధానవస్తువుకాదు. అది యీ రచనకూపిరులూదిన ఒకఘటనము మాత్రమే. 'త్వమేవాహం'లో కాలము ప్రధానవస్తువు. మృత్యువు చిరంజీవిమానవునితో 'నీవేనే' ననియనును. కాలమునకు మృత్యువునకుగల అభేదము ఈ విధముగా సూచింపబడినది. మృత్యువు అంతగా భయపడవలసిన విషయముకాదని, మానవుడు పుట్టినప్పటినుండి మరణించునని, మరణించినప్పటినుండి జీవించసాగునని, అందువలన మృత్యుజీవితములకుగల సంబంధమునకు వెరవగూడదని ఈ కావ్యములోని ధ్వనిప్రాయమైన ప్రబోధము. శ్రీశ్రీఅన్నట్లుగా ఈ దృష్టితో చూచినచో 'త్వమేవాహం' కావ్యమునకు కాలమే ప్రధానవస్తువు. 'తెలంగాణా అప్పుడొక అల్పక్షణంగా మారిపోతుంది.'[2] ఇక ఈ దృష్టితో ఈ కావ్యమున ఆరుద్రవాడిన 'ప్రతీక'లను వివరించుటకు ప్రయత్నింతును.

'త్వమేవాహం' కావ్యమంతట ప్రసరించిన మృత్యుఝంఝనుసూచించుటకు ముఖపత్రము పైని మానవుని మస్తిష్కము మంటలలోనున్నట్లు కవి సూచించినాడు. ఈ కావ్యము ప్రవాహమునకు పర్యాయముగా ఊహించబడినది. ఘనీభవించిన పర్వతదశతో ప్రారంభమై ఈ కావ్యము

1. శ్రీదాశరథికిలేఖ : ఆరుద్ర : స్రవంతి : జయమాఘసంచిక : పుట 30.
2. త్వమేవాహం : ఉపోద్ఘాతం : పుట 43.

నడుమనడుమ ఉపనదులను చేర్చుకొని ప్రవాహదశతో అంతమగును. ఈ ప్రవాహము ఆరుద్ర అన్నట్లుగా కాలమునకు పర్యాయపదము. ఈ కాలమునకు సంకేతము గడియారము. ఇసుకగడియారము, నీటిగడియారము గతకాలమనస్తత్త్వమునకు ప్రతీకలు. వీనిలో మొదటిది యూరోపియన్ల ప్రభావముగల భారతీయులది; రెండవది ఛాందసులైన భారతీయులకు సంబంధించినది. గంటలు పెట్టుబడిదారీసమాజమునకు, నిమిషములు మధ్యతరగతికి, సెకండ్లు శ్రామికజనులకు ప్రతీకలు. చిన్నముల్లు పెట్టుబడిదార్ల మనస్తత్త్వమునకు, పెద్దముల్లు మధ్యతరగతి మనస్తత్త్వమునకు, సెకండ్లముల్లు శ్రామికవర్గమనస్తత్త్వమునకు చిహ్నములు. 'స్టాప్‌వాచ్' విప్లవమును కొలుచు సాధనము. 'కీ' విప్లవమునకు ప్రోద్బలకారణము. 'ఎలారం' సమకాలికపరిస్థితులను గూర్చి హెచ్చరిక. ఈ విధముగా కాలమునుగూర్చి తనకుగల జిజ్ఞాసను ఆరుద్ర యిన్ని ప్రతీకలతో వ్యక్తముచేసినాడు. ఈ ప్రతీకలను తనకుగల విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానము నాధారముగాజేసికొని ప్రయోగించుటకు ప్రయత్నము చేసినాడు. 'పెద్దముల్లు'ద్వారా (మధ్యతరగతి మనస్తత్త్వచిత్రణసందర్భమున) పైథాగరస్‌థీరమును సామ్యవాదమునకనుగుణముగా అన్వయింపజేసినాడు.

'చిన్న చిన్న చీమలూవగైరా
అడుగుభుజం అనుకోండి
బలవంతమైనసర్పం
గ్రటాఎట్ స్ట్రెటా
అడుగుభుజం ఉత్పత్తిచేసే
ఆహారంమీద ఆధారపడ్డంవల్ల
లంబంఅవదామరి ?
ఈ భుజాల పరస్పరసంఘర్షణలఫలితం
ఈ భుజాల కర్ణంమీదిచతురశ్రం
అవునా ? సరి.
ఈ చతురశ్రపువైశాల్యంఇజీక్వల్టూ
రెండువిభిన్నభుజాలపైగల చతురశ్రాలలోనితమిశ్రం
థీసిస్‌యాంటీథీసిసులమిశ్రం
రెండుభిన్నపక్షసంజ్ఞలపోరాటం
అనగా ఒక నూతనవ్యవస్థ.'

'బలవంతమైనసర్పము చలిచీమలచేతజిక్కి చావదె'అన్న సుమతిశతకములోని న్యాయము దీనికి ప్రోద్బలకమైనది. సర్పము బూర్జువావ్యవస్థ. చీమలు శ్రామికవర్గము. చిన్నచిన్న చీమలు.

అడుగుభుజము; అడుగుభుజముమీద ఆధారపడినది లంబము. అది బూర్జువావ్యవస్థ. ఈ రెంటి ఘర్షణ అనివార్యమని మార్క్సువాదము. ఈ రెంటిఘర్షణఫలితముగా ఏర్పడు కర్ణముమీది చతురశ్రము సామ్యవాదసమాజము. ఈ సిద్ధాంతమునకు గణితశాస్త్రములోని పైథాగరస్ థీరము ద్వారా సమన్వయముకుదిర్చి ఆరుద్ర గొప్ప చమత్కారమును, ధీశక్తిని ప్రదర్శించినాడు. ఆధునికవిజ్ఞానశాస్త్రఫలితముగా కవిత్వములో ఏర్పడిన నూతనపరిభాష కిదియొక మచ్చుతునక. ఆరుద్ర సిద్ధాంతమును రేఖాచిత్రముద్వారా ఇట్లు స్పష్టముగా చూపవచ్చును.

పైథాగరస్ థీరమిది :— $AB^2 + AC^2 = CB^2$




'త్వమేవాహం' సంపుటిలోని 'వేదనాశకలము' అను కావ్యములోగూడ ఆరుద్ర ఇట్టి చమత్కారములే చేసినాడు. ఇందులో ఒకచోట వృక్షశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతము నూతగాగొని శ్రామికవర్గమును, పెట్టుబడిదారీసమాజమును సంకేతింపజేసినాడు.

'మనమానవసమాజమొక పూరావిస్ఫారినపుష్పం
అట్టడుగునపరిశ్రమించేజనావళి
మనకందరికీ రక్షకపత్రావళి
కడుపుమంటసైరింపనిశాఖ
కీటకాలనాకర్షించేపతాక
అవకాశాలవల్ల తలెత్తినవర్గం
పరాగప్రాప్తినోచుకునే కీలాగ్రం
శ్రీలుపొంగినకేసరాలధర్మం
విశ్రాంతి పరాపరాగసంపర్కం.'

పువ్వు అట్టడుగుననుండి దానిని రక్షించునని రక్షకపత్రములు. కాని ఇంకొక పువ్వునుండి వచ్చి పడిన పరాగసంపర్కమును నోచుకొనునవి ఇవికావు. కేసరములలో పెద్దదైన కీలాగ్రమునకే ఆభాగ్యమబ్బినది. పెట్టుబడిదారీవ్యవస్థను తమ కండలుపిండి నిలబెట్టు శ్రామికులకు ఫలితము సున్న. హాయిగా పైపైని తేలియాడు శ్రీమంతులకే ఐశ్వర్యప్రాప్తి. సామ్యవాదములోని యీ నగ్నసత్యమును ప్రతిపాదించుటకు ఆరుద్ర వృక్షశాస్త్రములోని పరపరాగప్రాప్తియను న్యాయమును ప్రతీకగా గ్రహించినాడు. అట్లే ఈ కావ్యఖండికలో నీలం, ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, అఖండజ్యోతివంటి ప్రతీకలను గ్రహించి తన లక్ష్యమును బోధించినాడు. అఖండజ్యోతి ఆదర్శ మునకు, విజ్ఞానమునకు ప్రతీక. నీలము కార్మికశక్తికి, ఎరుపు విప్లవభావమునకు, ఆకుపచ్చ మేధావివర్గమునకు ప్రతీకలు. పసుపుపచ్చ కాంగ్రెసుకు చిహ్నము. 1937 లో కాంగ్రెసు పెట్టె పసుపువన్నెదనువిషయ మీ సందర్భమున గమనింపదగినది. ఈ సంపుటిలోని 'తథాస్తు' అను చిన్న కావ్యఖండికలోగూడ లోహములను ప్రతీకలుగాజేసికొని సామాజికవిప్లవమును వ్యంజింప జేసినాడు. ఇందులో ఇనుము ధనికవర్గమునకు, రాగి మధ్యతరగతికి, తుత్తునాగము శ్రామిక వర్గమునకు ప్రతీకలు. రాగి తుత్తునాగము కలసినప్పుడు అయస్కాంతముగామారును. అట్లే మధ్యతరగతి, శ్రామికవర్గము రెండు కలసినప్పుడే విప్లవము విజయవంతమగునని సూచింప బడినది.

ప్రతీకలను సంగ్రహించుటలోనేకాక రచనాసంవిధానములోగూడ ఆరుద్ర ఇలియట్ పద్ధతిని గ్రహించినాడు. ఇలియట్ విక్టోరియన్ జార్జియన్‌కవుల ప్రాతగిల్లిన పదజాలమును అవల త్రోసి, సమకాలికజీవితములోని పలుకుబడులను ప్రయోగించినాడు. Deadened vowels (ఉచ్చరింపబడని అచ్చులను), Slurred consonants (ఒత్తిపలుకబడని హల్లులను) వదలి, దంత్యములను, ఓష్ఠ్యములను ప్రక్కప్రక్కగా (Juxtaposition) వాడి నవ్యత చూపినాడు. ఇందుకుదాహరణము :—

'A rat crept slowly through the vegetation
Dragging its slimy belley on the bank.'

ఇందులో మొదటి పంక్తిలో దంత్యములు, రెండవదానిలో ఓష్ఠ్యములు కూర్చబడుటతో ఎలుక నిశ్శబ్దగతి స్ఫురించుచున్నదని సి. యం. బౌరా వ్యాఖ్యానించినాడు.[1] ఇలియట్ ఈ విధముగా శబ్దచమత్కృతి నాశ్రయించి భావమునకు పదునుతీర్చుకొన్నాడని బౌరా అభిప్రాయపడినాడు.[2] ఆరుద్రగూడ శబ్దసంవిధానముద్వారా భావమునకు వింతగతులు కూర్చినాడు. 'పర్వతదశ' పర్వతములవలె కఠినముగా నుండవలెనని

1. The Creative Experiment : P. 160.
2. 'Eliot's first appeal was through his words. He used them as a master uses them; with a full sense of their sound and of its value for a poetical effect.'
—The Creative Experiment : P. 160

'బ్రెయిన్‌లో బ్రేన్‌గన్
రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్
గ్లూమీతిమిరాలు చెరిపించి
సైతాన్ మనల్ని పరిషించినప్పుడు'

వంటి కొరుకుడువడని పదజాలముతో ప్రారంభించి క్రమముగా సౌలభ్యము చూపినాడు. 'ఎలారం'లోని 'లో : హలో లోయలో', 'ఓ ఒహో పటాలం పటాలం'వంటి పంక్తులు పర్వత పంక్తుల మధ్యలో ప్రవహించు సెలయేటి నడకలను స్ఫురింపజేయుటకు వాడబడినవి. 'సెకండ్లు'లోని 'తొయ్యోయ్‌తొయ్'వంటి పంక్తులలోని రచనాశిల్పమును శ్రామికుల బ్రతుకుబరువును సూచించునదిగా తీర్చిదిద్దినాడితడు. 'స్టాప్‌వాచీ'లో

'ఉరు
మేధకు
నిరు
పేదలు'

అను ధోరణిలో పాదమునకొక పదమునుమాత్రమే ప్రయోగించి సమాజములోని ప్రమాదస్థితిని ధ్వనింపజేసినాడు. పెద్దముల్లు నిమిషములను సూచించునదికావున (60) పంక్తులు కూర్చినాడు. సెకండ్లముల్లులో (60) అక్షరాలుమాత్రమే కూర్చినాడు. చిన్నముల్లులో ఐదైదుపాదముల నొక వరుసలో (Stanza) గా పేర్చినాడు. 'ఉపనదులు'లోని 'నిమిషాల'లో మధ్యతరగతిస్వగతములను, వారి జీవితమునుగూర్చి కవిచేయు వ్యాఖ్యలను ఒకదానివెంబడి ఒకటి కూర్చినాడు. మధ్యతరగతిస్వగతమును వచనగేయపద్ధతిలో, కవివ్యాఖ్యానమును విరామచిహ్నములులేని శుద్ధవచనములో నడుపుట మరియొక ప్రత్యేకత. 'Brainలో Pain, ప్రతీ Veinలో Machinegun rain'వంటి పంక్తులలో ఇంగ్లీషుమాటలను ప్రయోగించి కవిత్వమున నాగరకజీవనమును వ్యక్తీకరించుటకు సరిక్రొత్త పదజాలమును ప్రవేశపెట్టినాడు. 'వేదనాశకలం'లో ఉత్సాహము, దండకమున్నగు ప్రాచీనవృత్తములను ప్రయోగించినాడు.[1] 'తథాస్తు'లో కందపద్యములనే విడదీసి వచనమువలె వ్రాసినాడు. ఈ వృత్తములన్నిటిని శిష్టవ్యావహారికములోనే నడుపుట గమనింపదగినది. శరీరశాస్త్రము, వృక్షశాస్త్రము, గణితశాస్త్రము, మనోవిశ్లేషణశాస్త్రము, నౌకాశాస్త్రము మున్నగువానినుండి పారిభాషికపదములను గ్రహించి వానిని తన భావవ్యక్తీకరణకు, సరిక్రొత్త ప్రతీకలుగా మలచుకొన్నాడు. ప్రవాహదశలో 'సెకండ్లు' అను ఖండిక 'భళానోయిభళి తమ్ముడూ' అని బుర్రకథ ధోరణిలో రచించినాడు. ఈ విధముగా ఇలియట్ ప్రభావముతో

1. 'జీవితం విటీక : బోధచేయువాడులేడులే
ఖావి ఎండిపోయినట్టిబావి; కీడుమూడులే'.
ఇది ఉత్సాహవృత్తము. కాని దీనిలోనివస్తువు నిరుత్సాహమగుట చమత్కారము.

ప్రతీకలను వాడుట నేర్చుకొని, స్వోపజ్ఞతో ఛందస్సులచేత చాకిరీచేయించుకొని, తెలుగుకవితలో అపూర్వసంవిధానమునకు బాటలుతీసిన అతినవ్యుడు ఆరుద్ర.

## 4. నగరజీవనచిత్రణము :

ఆధునికనాగరకతవలన నైతికస్థాయికోల్పోయిన నగరజీవితమును చిత్రించినవారిలో ఇంగ్లీషుకవిత్వమున ఎజ్రాపౌండ్, ఇలియట్ ముఖ్యులు. ఇలియట్ 'The Love song of J. Alfred Prufrock' అను కావ్యములోను 'Waste Land' లోను నగరజీవనచిత్రణమునకు పాదులువేసినాడు. నగరజీవులబ్రతుకు ఎంత యాంత్రికముగా మారిపోయినదో సూచించుటకు ఇలియట్ ఒకచోట 'Time kept city' అన్నాడు. ఇంకొకచోట 'I have measured out my life with coffee spoons' అన్నాడు.[1] ప్రకృతివర్ణనలకుగూడ నాగరక జీవితములోని ఉపమానములనే స్వీకరించినాడు. ఉదాహరణకొకటి.

> 'When the evening is spread out against the sky
> Like a patient etherised upon a table.'[2]

ఇందులోని ఉపమానము నవ్యతాభరితమైనదని వేరేచెప్పనక్కరలేదు. ఆపరేషన్‌టేబిలుమీద చావు బ్రతుకులమధ్యపడియున్న రోగి అవస్థతో సాయంసంధ్యను పోల్చుట నాగరకజీవితచిత్రణమునకు ప్రతిబింబమే. ఇలియట్ ప్రభావముతో తెలుగులో పఠాభి, నారాయణబాబు, ఆరుద్ర, అనిసెట్టి, నారపరెడ్డి మున్నగువారు నగరజీవితచిత్రణము ప్రారంభించిరి.

తెలుగు ప్రబంధములలో పురవర్ణనసంప్రదాయమున్నది. అది అష్టాదశవర్ణనలలో ఒకటి. మనప్రబంధకవులు పురములను వర్ణించునప్పుడు, వానిలోని అంబరచుంబి సౌధములను, పాతాళమునంటు అగడ్తలను, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదిచతుర్వర్ణము లను, వేశ్యలను, పుష్పలావికలను వర్ణించిరేకాని పురములలోని ప్రజల జీవితముపై తమ దృష్టిని కేంద్రీకరించలేదు. ఆముక్తమాల్యదమున్నగు ఒకటిరెండు ప్రబంధములలో ప్రజాజీవితచిత్రణ మున్నను అది రాశికివచ్చునదికాదు. పాశ్చాత్యుల యేల్బడిలో ఆధునికవిజ్ఞానముఫలితముగా మన దేశములోని నగరములస్థితి మారిపోయినది. నగరజీవితము యాంత్రికతావలయములోపడి గుడు సుళ్ళుతిరిగినది. ఇలియట్ క్షోభపడినట్లుగా భౌతికసౌఖ్యలాలస పెరిగిపోయినది. కృత్రిమతకు పూజ్యతయేర్పడినది. నగరజీవులు కాలమునకు బానిసలైపోయినారు. వారి బ్రతుకులను గడి యారములే నడిపింపసాగినవి. నగరజీవితములోని యీ కృత్రిమత్వమును అతినవ్యులు చమ త్కారముగా వెల్లడించినారు. మద్రాసునగరములోని చంద్రునిచూచి పఠాభి

1. 'The Love song of J. Alfred prufrock' : The wasteland & other poems.

2. 'The Love Song of J. Alfred prufrock'.

'తగిలింపబడియున్న దిజాబిల్లి
చయినాబజారుగగనములోన'[1]

అని వాపోయినాడు. రంగురంగుల విద్యుద్దీపములముందు శశి వెలవెలబోవుట గమనించి పఠాభి

'కనిపిస్తావునీవు, స్పున్సర్సుకంపనీ
లేక వయిటువేసులోకి
దారితప్పి ప్రవేశించి
తందరాడుచున్న దరిబేసిగ్రామస్తున్లాగ'[2]

అని చమత్కరించినాడు. నాగరకత ముదిరిన వ్యవస్థలో చంద్రుడుమున్నగు నిసర్గరమణీయములైనవస్తువుల కెట్లు విలువతగ్గిపోయినదో కవి పై పంక్తులందు ధ్వనింపజేసినాడు. ప్రాచీనులు వర్షర్తువునువర్ణించిన విధమువేరు; అతినవ్యకవి చిత్రించిన తీరువేరు. పఠాభి మహానగరముపై వాన కురిసినప్పటి దృశ్యము నీరీతిగా వర్ణించినాడు.

'మహానగరముమీదమబ్బుగమి గర్జిస్తున్నది
దేవునిఏరోప్లేనుల్ భువికిదిగుచున్నట్టుల.'[3]

జలదగర్జను పర్జన్యునిరథచక్రఘోషయని ప్రాచీనులు వర్ణించగా పఠాభి 'దేవుని ఏరోప్లేనులు' దిగునప్పటి ధ్వనితోపోల్చి ఆధునికత ప్రదర్శించినాడు. ఉదయము పదిగంటలకు వర్షము ప్రారంభమైనది. ఆఫీసుకుపోవు సమయమైనది. ఆ స్థితిలో ఉద్యోగికి తన పై అధికారి జ్ఞాపకమునకువచ్చి 'పోకుండిన నాబాస్ మేఘంలాగ ఉరంతాడు' అని అనుకొన్నట్లు పఠాభి చిత్రించినాడు. 'పోలీసు'వానిపై ఈ కవి వ్రాసిన గేయము నగరజీవితచిత్రణకు చక్కని ఉదాహరణము. ఆధునికపరిపాలనావ్యవస్థ ఫలితముగా గ్రహించిన వస్తువిది. నగరములోని 'చీలుదారులలో' నిల్చుండి త్రోవచూపించు పోలీసుభటుడు 'భరతనాట్యంబాడుచున్న......నటర్షిచూడామణి'వలె కన్పించుచున్నాడట. అతడు

'బల్బుహారన్లతాళంతోడి
యలక్ట్రికుహారన్లరాగానికిన్ని
మోటారుసైయికిళ్ళమృదంగానికిన్ని
అనుగుణ్యంగానర్తిస్తుంటాడు.'[4]

భ్రూవిక్షేపముచేతనే బండ్లను బలవంతముగా నడుపగల సామర్థ్యముగల 'పోలీసుభటుణ్ని చాలా నేను స్తుతిచేస్తాను'అని ఈ కవియన్నాడు. ఇవికాక పఠాభి మద్రాసులోని రోడ్లను, దుకాణములను.

1. ఫిడేలురాగాలడజన్ : పుట 8. 2. ఫిడేలురాగాలడజన్ : పుట 8.
3, 4. ఫిడేలురాగాలడజన్ : పుటలు 9. 16.

మెరినాబీచిని, హోటళ్ళను, బాల్‌రూం నృత్యములను వర్ణ్యవస్తువులుగా తీసికొని నగరజీవితమును చిత్రించినాడు.

మద్రాసునగరములోని యాంత్రికజీవితమును, కాగితపుపూవులవంటి బ్రతుకులను నిశిత దృష్టితోచూచి వర్ణించినవారిలో అనిసెట్టి, నారపరెడ్డి గణనీయులు. అనిసెట్టి 'మద్రాసు మహానగరం' అను శీర్షికతో ఉదయమధ్యాహ్నసాయంకాలములలో ఆ నగరస్థితిని వర్ణించినాడు.[1] మద్రాసు మహానగరము పౌరులకు 'కోరలుచూపుతూ', 'పంజావిప్పుతూ' రమ్మనునని, నగరములో విషప్రవాహమువంటి మురుగుకాలువ, ప్రాణప్రవాహమువంటి విద్యుత్తు ప్రవహించునని, 'రెంటికి మధ్యగా లక్షలపౌరుల నిత్యప్రయాణం' జరుగుచుండునని ఉల్లేఖించినాడు. ఈ పౌరుల వర్ణన 'A crowd flowed over London Bridge'అన్న ఇలియట్ చిత్రణను స్ఫురింపజేయుచున్నది. మద్రాసునగరములోని చీకటి 'అంక్షలాగ, ఆర్డినెన్సులాగ' వ్యాపించుచున్నదన్న అనిసెట్టి వర్ణనలోని ఉపమానములు ఇలియట్ Urban Similies ను (నాగరకజీవనమునుండి గ్రహించిన ఉపమానములను) స్మరింపజేయుచున్నవి. నారపరెడ్డివ్రాసిన 'రాక్షసనగరం' అను ఖండికలో మద్రాసునగరములోనిపౌరుల 'ప్రతిచేయీ నమస్కరిస్తుంది అయితే ఆ నమస్సులలో మనస్సులేదు' అన్న వ్యాఖ్యానము నగరములోని కృత్రిమజీవితములను చక్కగా ప్రతిబింబించుచున్నది.[2] నగరములో 'సెంట్రల్‌స్టేషన్ చివరిటవరుపై నగరపుకాలాన్ని నడుపు గడియారము' అను వర్ణన ఇలియట్ విసరిన 'Time kept city' అన్న చెణుకును జ్ఞాపకమునకు తెచ్చుచున్నది. 'లైట్‌హౌస్'ను 'నగరపురుద్రుని ఫాలనేత్రము'గా, 'తారురోడ్డు'ను నల్లత్రాచుగా వర్ణించి నారపరెడ్డి నగరజీవితముపట్ల తనకున్న వైముఖ్యమును ప్రకటించినాడు.

శ్రీరంగంనారాయణబాబువ్రాసిన 'విశాఖపట్నం' అన్న గేయము ఈ జాతికి చెందినదే. విశాఖపట్నములోని తారురోడ్లు 'నీగ్రోస్త్రీ బుగ్గల'వలె నిగనిగలాడుచున్నవని వర్ణించినాడు. నగరములోని దుర్గంధభూయిష్ఠమైన బ్రతుకులను, దుర్భరమైన సంఘటనలను నారాయణబాబు తీవ్రమైన ధోరణిలో వ్యక్తమొనర్చినాడు.

'ఇక్కడ సోడాలోకాక్ టైల్
కిల్లీలో ఉల్లిపాషాణం
సినిమాహాలులో శిశుహత్య
సిరాబుడ్డిలో ఆత్మహత్య
విమానంలో భ్రూణహత్య
పెట్టిబండిలో గర్భస్రావం.'[3]

ఈ విధముగా నగరముయొక్క జుగుప్సావహమైన పార్శ్వమును బయటపెట్టినాడు.

---

1. అగ్నివీణ : పుట 40. 2. అశ్రుమాల పుట 94.
3. 'రుధిరజ్యోతి' (వ్రాతప్రతి) నుండి.

పఠాభి, నారాయణబాబు, అనిసెట్టి ప్రభృతులు నగరములోని మధ్యతరగతిమనుష్యుల బ్రతుకులను చిత్రించుటకన్న, నగరములోని కృత్రిమవాతావరణములోని కుళ్ళునే అధికముగా బయటపెట్టుటకు ప్రయత్నించినారు. ఆరుద్ర అట్లుగాక నగరములందు, పట్టణములందు గుమాస్తాలుగా స్థిరపడిపోయిన మధ్యతరగతిప్రజల ఆలోచనలను, ఆందోళనలను, వారి నైరాశ్యమును, వారి బ్రతుకులనంటుకొని వ్రేలాడు వివిధసమస్యలను చిత్రించినకవి. జాతిజీవనములో తిరుగుబాటుతగ్గినది. 'యాంత్రికనాగరకత కాంతివంతమైన చీకటివలె' 'జీవితాన్ని ఆవరించి వేళ్ళాడుతు'న్నది.[1] ఈ స్థితిలో కొట్టుమిట్టాడుచున్న మధ్యతరగతిస్వగతములను ఆరుద్ర ఆర్ద్రముగా చిత్రించినాడు.

'కణాపూర్యుఝాముట్టడినుంచి
ఏంగ్రుయిటీగుప్పిటినుంచి
... ... ... ... ...
మమ్ముబ్రోచేవారెవరులేరా' (త్వమేవాహం : పుట 29)

అని ఆక్రందించు మధ్యతరగతిప్రజల స్వగతముల కనేకరీతులుగా సయుక్తికముగా వ్యాఖ్యానముచేసినాడు. ఈ తరగతివారికి 'స్వగతాలుతప్ప సంభాషణలు'లేవని, 'కృత్రిమసమాజపు చట్టాలలో మేకుబందీ అయిపోయి గానుగెద్దులలాగ' బ్రతుకుదురని, 'మాసిపోయిన మనస్సులు ఉతుక్కోలేక మహర్షుల లాండ్రీలోపారే'స్తారని ఇతడు వ్యాఖ్యానించినాడు. మార్క్సు చెప్పినట్లుగా మధ్యతరగతి పరస్పరవైరుధ్యముతో సతమతమగువర్గము. ఆరుద్ర ఈ వర్గముగురించి 'మీదిమెట్టు ఎగురలేక కిందిమెట్టుమీదకు పడిపోతారు' అని చక్కగా వ్యాఖ్యానించినాడు. 'త్వమేవాహం' లో ఇతడు మిగిలినవర్గముల మనస్తత్త్వమును కొంతగా చిత్రించినను, దీనిలో మధ్యతరగతి మానిసియే ప్రధాననాయకుడు.

'లాభంలేదుసిస్టర్ ఈగాయం
మానబోదు డాక్టర్
చేతులు కడుక్కోవోయ్ మిస్టర్' (త్వమేవాహం : పుట 47)

వంటి పంక్తులలో 'మధ్యతరగతి' నిస్సహాయతనే ప్రకటించినాడు. 'త్వమేవాహం' కన్న 'సినీవాలి' నగరజీవితచిత్రణమునకు అధికప్రాతినిధ్యమువహించు కావ్యము. ఈ సంపుటి 1960 లో ప్రచురింపబడినను, దీనిలోని కొన్ని గేయములు విడివిడిగా గతదశాబ్దికాలమునుండి వివిధపత్రికలలో వెలువడినవే. 'సినీవాలి' యనగా చంద్రకళకన్పించు అమావాస్య. సమకాలికజీవితము తమస్సులు ఘనీభవించిన రాత్రివంటిది; అమావాస్యవంటిది. అందులో ఆశారేఖ రేఖామాత్రముగా

1. సినీవాలి : ఆరుద్ర : పుట 19.

భాసించుచున్నది. ఈ దృష్టితోనే ఈ కావ్యమునకు 'సినీవాలి'యను నామకరణము జరిగినది. ఆరుద్ర ఈ కావ్యమున స్వీకరించిన సమకాలిక జీవితము సార్వజనీనమైనదికాదు. 'కాలకూట మకరందము'వంటి నగరజీవితము మాత్రమే దీనిలోని కథావస్తువు. ఈ కావ్యప్రారంభముననే కవి

'పాడుతాను నాకుతెలిసిన నగరంగురించి
నగరంలో నాతిగురించి నీతిగురించి'

అని కావ్యవస్తువును స్పష్టముగా నిర్దేశించినాడు. ఆధునికనగరములోని ప్రజలు ఒకేహారములోని పూసలవంటివారని. వారిని నగరము 'మందుపెట్టి దక్కించుకొనే పెళ్ళాంలాగ' కామించి వశం చేసికొన్నదని ఆరుద్ర స్పష్టీకరించినాడు. నగరభామిని సిలిన్నైలానుచీరల తారురోడ్లు ధరించి, 'పానీయపుటంగళ్ళఖరీదైనకాశీనులంగా' కట్టుకొని, 'నైటుక్లబ్బుల' 'న్యూలుక్కుబ్రా' బిగించి నాగరకుల నాకర్షించునని నగరములోని తాత్కాలికమైన విలాసజీవితమును వ్రేలెత్తి చూపినాడు. సూర్యుడనుపేరుగల మధ్యతరగతి మానిసి నగరములో ప్రవేశించి 'కడుపుమంటతో కాలిపోతూ కన్నీళ్ళపై స్వారీచేస్తూ' 'కలలపచ్చడమునేసి', చిక్కని చీకటిలోనికి, పాతాళము లోనికి దిగజారిపోవుచున్న విలాసినుల జీవితజంబాలమును గమనించి, నగరములోని భయంకర కృత్రిమత్వమునకు జడిసి, కడకు 'సంజచీకటిపంటి స్వగ్రామమనెడి పంజరంలోనికి' పరుగెత్తి పోవును. పల్లెలో పెండ్లిచేసికొమ్మని తండ్రి తన్ను బలవంతముచేయగా, నగరమ్మాయిలలో 'ప్రేమ'కు తన హృదయము నంకితముచేసిన అమ్మాయిని స్వీకరించి, మరల 'పల్లెలో ప్రాణ వాయువులు పీల్చలేక, బొగ్గుపులుసుగాలులబోసు'లోనికి, అనగా నగరములోనికి ప్రవేశించును. 'మంత్రాల అనలవేదికముందుగాక యంత్రాల అనిలవీచికలందు' తన ప్రేయసిని పరిణయ మాడును. కొంతకాలమునకు యాంత్రికజీవితమున కలవాటుపడి, పగిలిపోయిన కలలపెంకుల నతికించు శక్తిలేక, తనభార్య 'మాజీ చక్కదనమువలె తోచగా, చింతనలపాలై, 'మేజాల భూజ ముల మేదినిలోంచి' బయటపడి పార్కులో ప్రవేశించి, అశాంతిగ్రహణమునచిక్కి గిలగిల తన్ను కొని, చివరకుద్యోగమూడి 'దూలంగ్రిందవ్రేలాడే కాలంతాడు-మూడుపేటలుగా' నేయుచు మృత్యు ముఖములోనికి తొంగిచూచుస్థితికి దిగజారిపోవును.

క్లార్కు సూర్యారావు ఈ కావ్యమున నాయకుడగుట నవ్యత. నగరములోని మధ్యతరగతి ప్రజలకితడు సరియైన ప్రతినిధి. నగరముపై మోజుపడి, విలాసములకు వినోదములకు మొదట లొంగిపోయి, తర్వాత వానిపై రోతపుట్టి, ఊహించిన ఆశాసౌధములు గాలిమేడలై కూలిపోగా 'రెంటికిచెడిన రేవడుల'వంటి నగరజీవుల దయనీయమనఃస్థితికి, ప్రవర్తనకు సూర్యారావుపాత్ర ముకురప్రాయమైనది. వస్తువులోనేకాక దానిని తీర్చిదిద్దుటలోగూడ ఆరుద్ర నగరవాతావరణము నుండియే ఉపమానము లేరుకొన్నాడు. ఈ విషయము తర్వాతి అంశములనుగూర్చి వ్రాయు నప్పుడు వివరింతును.

ఆధునికనాగరకతమీది వ్యామోహముతో, ఉద్యోగవలయమునపడి బ్రతుకులను గొంగళీ పురుగులవలె మార్చుకొన్న మధ్యతరగతి మానిసులగూర్చి బాలగంగాధరతిలక్ 'గొంగళీ పురుగులు' అను గేయమున చక్కగా వ్యాఖ్యానించినాడు.

'బల్లపరపు జీవితంకింద కావలసినట్లుగా దాచిన
కోర్కెలన్నీ క్రెటుబాక్సులోంచి తీసి
ఉద్రేకాల్ని, సెక్సుని, శృంగారాన్ని
క్రైమ్‌ని, షాక్‌ని, లాటరీకాగితాన్ని
చాటుకుండాచూసుకొని నవ్వుకొని మీసంమెలేసుకుని
మాట్లాడకుండా, జెంటిల్మాన్‌లా మత్తుగా
పడుకుంది గొంగళీపురుగు.'[1]

'మధ్యతరగతి'నుండివచ్చి 'చాలీచాలని' జీతముతో ఉద్యోగముచేయుచున్న గుమాస్తాలకున్న కోర్కెలను, వానిని తీర్చుకొనలేక వారుపొందు ఆందోళనను చమత్కారముగా వ్యక్తముచేసినాడీకవి.

మన నవ్యకవులు నగరజీవితము నేవిధముగా కావ్యవస్తువుగా స్వీకరించి, నగరజీవితములోని అసహజత్వమును, యాంత్రికప్రవృత్తులను చిత్రించిరో ఇంతవరకు విశదీకరించుటకు ప్రయత్నించితిని.

### 5 వైచిత్రీప్రియత్వము :

అతినవ్యకవులకు వైచిత్రి ధ్వజమువంటిది. వీరు హృదయముకన్న మెదడుకే అగ్రస్థానమిచ్చిరి. భావనకన్న ఊహింపులకే ప్రాధాన్యమిచ్చిరి. అందువలన క్రొత్తదేదోచెప్పి పాఠకులను విస్మయవిద్యుత్తాడితులనుగా చేయవలెననుకోరిక వీరి రచనలన్నిటిలో కనిపించుచున్నది. అందుకు వారు వస్తువరణములో, భావవ్యక్తీకరణములో, పదప్రయోగములో, ఛందస్సులలో వైచిత్రికొరకు ప్రాకులాడిరి. 'కవిత్వహ్రస్వలిపి'ని ప్రవేశపెట్టుటకు ప్రయత్నించిరి. అంతేకాదు. కవిత్వనిర్వచనముపట్లగూడ వీరు తమచమత్కారదృష్టిని చూపిరి. ఆరుద్ర మంచిరచన గూర్చి తన అభిప్రాయము నిట్లుచెప్పెను.

'మంచిరచనచదివాక బాగాభోంచేసినట్టుండాలి
కొంచెంబాధపడాలి చింపుకొన్నట్టుంటాలి
మనస్సుకిజ్వరంరావాలి ఒళ్ళుతిరగాలి
ఈ బాదలోంచి తేరుకొని బాగుపడాలి, (సినీవాలి :పుట 14)

1. 'కవిత' : అబ్బూరిఛాయాదేవి సంకలనము.

ఇట్టి అభిప్రాయమునే ఆధునికాంగ్లకవి హౌస్మన్ ఈ విధముగా వెల్లడించెను. 'Poetry is something that gives me a strange sensation in the back of the neck or down the spine, or a funny feeling in the pit of stomach.'[1]

అతినవ్యకవులు పారిశ్రామికనాగరకతను చక్కగా ప్రతిబింబించుటకనువైన శాస్త్రీయపదజాలము స్వీకరించిరి. బహుముఖముగా వ్యాపించిన విజ్ఞానశాస్త్రములోని విషయములను, పారిభాషికపదములను స్వీకరించి కావ్యపరిధిని పెంచిరి. ఇంగ్లీషుకవిత్వమున సి. డి. లూయిస్ (C. D. Lewis), ఆడెన్ వంటినవ్యులు ఈ పనియే చేసిరి. ఇంగ్లీషునవ్యకవులు ఏవిధముగా విజ్ఞానశాస్త్రసంబంధమైన పదార్థములను కవితావస్తువులుగా గ్రహించిరో సి. డి. లూయిస్ వ్రాసిన ఈ గేయభాగమువలన స్పష్టమగును.[2]

'Let us be off our stream
Is deafening the dome
The needle in the gauge
Points to a long-banked rage
And trembles there to show
What a pressure's below'[3].

ఇంగ్లండులో 'రైల్వే' ప్రవేశపెట్టబడినపిమ్మట దానికి సంబధించినపదజాలము కవిత్వమున ప్రవేశించకతప్పలేదు. పై గేయభాగమున ఆ ప్రభావము స్పష్టముగా కనిపించును. ఆరుద్ర 'నీటిగడియారం' అను గేయములో ప్రాతకాలపుభారతీయుల మనస్తత్వమును చిత్రించుటకు రైల్వేపదజాలమును వాడుకొన్నాడు.[4] 'ఎక్కదలచుకున్న రైలు', 'ఆదర్శాలంగేజి', 'ఈప్సితాలట్రంకుపెట్లు', 'కలలబ్రేకు', 'ఎక్సెసంటాడు టి సీ' మున్నగునవి రైల్వేపారిభాషికపదముల నుపయోగించుటవలన వైచిత్రిని సంతరించుకొన్న భావములే. దుర్గానంద్ వ్రాసిన 'భూగోళం', 'కోలంబస్‌జలయాత్ర'. 'జువాలజీ', 'త్రాగుబోతుతూలుతూ' మున్నగుగేయములు వస్తువైచిత్రికి చక్కని ఉదాహరణలు.[5] పఠాభి వ్రాసిన 'నవ్యస్త్రీ', 'పోలీసు', 'జాబిల్లి' మున్నగునవి అతినవ్యకవుల వస్తువైచిత్రికి ఆదర్శప్రాయములైన గేయములు. తర్వాత ఈ మార్గమున ఆరుద్రప్రభృతులు యథేచ్ఛముగా సంచరించినారు.

---

1. Quoted in 'Modernists, Imagists and Futurists' (వ్యాసము): M. Chalapathi Rao : pub. Triveni : 1932 Sept.

2. 'Modern poets are making strenuous attempts to tap the power of science by absorbing scientific data into their work : by 'scientific data' I mean the myriad new sense-data which scientific development has put before us.' —'A Hope for Poetry' by C. Day Lewis : pub. 1947 : P. 61.

3. A Hope for Poetry : P. 62. 4. త్వమేవాహం : పుట 26.

5. ఈ గేయములన్నియు 'అంతర్గోళా'లను సంపుటిలోనివి.

(i) వ్యక్తీకరణవైచిత్రి :

చెప్పదలచుకొన్న విషయమును భావనాబలముతోగాక ఊహాలంబనముతో చెప్పుట, ఆ చెప్పెడి రీతి సూటిగా హృదయమునకు హత్తుకొనునట్లుగాక మేధకు గిలిగింతలుపెట్టునట్లుండుట అతి నవ్యులు సాధించిన ప్రత్యేకత. దీనినే నేను వ్యక్తీకరణవైచిత్రి అనుచున్నాను. ఈ వ్యక్తీకరణ వైచిత్రి నూతనతాప్రీతివలన వచ్చినగుణమే. భోగముదాన సంఘములోని కొందరు వ్యక్తుల కామ వాంఛనుదీర్చు సాధనము. కాని ఆమెకు సంఘములో విలువలేదు. ఈవిషయమును దృష్టిలో పెట్టుకొని పఠాభి

'ఓభోగంచానా ! నీవు
సంఘానికి వేస్టుపేపరుబాస్కెటువా'[1]

అన్నాడు. వక్రోక్తిద్వారా, ఆధునికపదజాలముద్వారా కవి వైచిత్రిసాధించినాడు. ప్రాచీదిశలో ఉదయించిన సూర్యబింబము 'ప్రభాతరేజరు నిసినల్లనిచీకట్లగడ్డంబును షేవ్‌జేయన్ పడినకత్తి గాటు'వలె కనిపించినదని పఠాభిఅన్నాడు.[2] ప్రభాతమును రేజరుతోపోల్చుట, చీకట్లను గడ్డముతో పోల్చుటలోనివైచిత్రి ఆధునికకాలములోని పదజాలమువలన సాధింపబడినది. జీవితమున భార్యాభర్తలిరువు రెంతసమప్రాధాన్యముకలవారో చెప్పుటకు ఆరుద్ర

'జీవితంరేడియోసెట్టుకి
భర్తవీరియల్ భార్యఎర్తు'

అన్నాడు[3]. ఇతడు ప్రయోగించిన 'అబ్బాయిజీవితంపజిల్‌కి, అమ్మాయి కీసొల్యూషన్', 'టెలిఫోనునంబరులేనిజీవితాలు', 'యంత్రాలఅనిలవీచికలు'[4], 'విశాలలోకంసర్కస్‌లోపల పొడిచిన ప్రతికత్తి పెట్లోఉన్న నీ ఆశయాలజవరాలి జవనాలగుచ్చుకొనుట'[5]వంటి విచిత్రవ్యక్తీకరణముగల ప్రయోగములు పారిశ్రామికనాగరకత ప్రభావముతో వెలువడినవే. ఆరుద్రవ్రాసిన 'వెయ్యివోల్టుల కవిత్వం ' అన్న గేయములోని సంవిధానము అతిచిత్రమైనది.

+ { 'గారడీవాడు ప్రవేశించి- రకరకాలప్రణాళికల
కాగితంపువ్వులు
వాసనచూపెట్టి

— { నాబాధే న్యాప్రేయసి
అది స్వర్గాదపిగరీయసి

+ { పారిజాతకుసుమాలుసుమాఅంటే
........................
........................

---

1, 2. షేడేలుబాగాలండలా : పుటలు 26, 18.
3. 4. సినీవాలి : పుట 58. 5. త్వమేవాహం.

ముళ్ళకంచెలుమేసిబలిసిన
—
....................
....................

+ కొడతాం

ఈ విధముగా సాగిపోయినది. ఇందులో + గుర్తుతోనున్న పాదములుచదివినతర్వాత, — గుర్తుతో నున్న పాదములనువిడిచి మరల + గుర్తుగలపాదములనే చదువుకొనవలెను. మొత్తము గేయము ఈవిధముగా చదువుకొని అప్పుడు—గుర్తుగల పంక్తులను చదువుకొనవలెను. ఈ గేయములో + విప్లవమునకు,—రసికత్వమునకు చిహ్నలు. గారడీవాడు కాంగ్రెసుప్రభుత్వము, మొదటిపంచ వర్షప్రణాళిక కాగితపుపువ్వు. లెనిన్అన్న 'Let us electrify Russia first' అనువాక్యము ఈ గేయమునకు మూలహేతువని ఆరుద్ర నాతో అన్నాడు. ప్లస్మైనస్‌లు చేర్చి గేయమును రచించుటలో ఇ. ఇ. కమింగ్సుప్రభావమున్నది. కమింగ్సు Parenthesis ద్వారా అనగా డాష్ లలో, బ్రాకెట్లలో కొన్నిమాటలుచేర్చి చమత్కారముచేసినట్లుగా ఆరుద్ర ప్లస్మైనస్‌లను చేర్చి భావవ్యక్తీకరణమున వైచిత్రిసాధించెను. విజ్ఞానశాస్త్రమునాధారముగాజేసికొని భావవ్యక్తీకరణ మున వైచిత్రిసాధించిన నవ్యకవులలో దాశరథి, దుర్గానంద్ గణనీయులు. 'బేడాకుదొరికే పెన్సిల్‌ముక్కలో జగత్తుకుప్రాణంప్రసాదించిన కార్బణపరమాణువు'న్నదని దాశరథి అన్నాడు. మానవజీవితములో పెన్సిలుముక్కద్వారా వెలువడురచనకుగల మహత్తరస్థానము నీవిధముగా వ్యక్తీకరించినాడు.[1]

'దూకిదూకి ఈ జలపాతం
ప్రాకించనీ పైకిపైకి విద్యుద్వల్లీమతల్లికలను'[2]

అన్న పంక్తులలో ప్రజాచైతన్యప్రవృద్ధిని సైన్సుపరిభాషలో తెలిపినాడు. 'మెతుకులలో ప్రోటీనులు మిక్కిలిగా రానీవయ్యా'అని మానవునికి 'తిండిగలిగితె కండగలదోయ్' అను సత్యమును సూత్రప్రాయముగా చెప్పినాడు.

'కోతిని రేడియేషణగా తొలిచిన
కాస్మిక్ - రేడియేషణబలమే
నాకలంలో చొరబడి నేడు
మనిషిని దేవతగామలుస్తుంది'[3]

అని నగ్నమైన శాస్త్రీయభౌతికసత్యమును చమత్కారముగాత్రిప్పి కవిత్వమున కన్వయింపజేసినాడు. తనది విద్యుత్‌ఛంద'స్సన్నాడు.[4] దుర్గానంద్ ప్రపంచముయొక్క దినదినశ్లైష్యమును గమనించి

1. 2. 'మస్తిష్కంలో లెబొరటరి' : పునర్నవం.
3. 4. 'కిరణశకలం' : పునర్నవం.

'ఈ ప్రపంచాన్నెవడో
నైట్రిక్ యాసిడ్లో ముంచాడు'[1]

అని దారుణభావమును శాస్త్రబలముతో చిత్రముగా వెల్లడించినాడు. సొంతకాళ్లపై నిలబడుశక్తిలేక దైవముపై భారమువేసి దిక్కులుచూచువారి మనస్తత్త్వమునకనుగుణముగా

'దైవం స్విచ్చినొక్కిచూస్తుంది
వెలుగుతున్నాయి మనబ్రతుకులు వ్యర్థంగా'[2]

అని వ్యాఖ్యానించినాడు. 'టీచరు'నుద్దేశించివ్రాయుచు 'ఓ కిండరుగార్డనువనమాలీ' అన్నాడు. ఇందులో 'కిండర్‌గార్టను'ను గార్డనుగాచేయుట చమత్కారము. 'వనమాలి'శబ్దమునకు వనమాలనుధరించినవాడను అర్థమునకాక 'తోటమాలి'యన్న అర్థమున ప్రయోగించినాడు. ఇది హిందీ భాషాపరిచయముతోచేసిన చమత్కారము. నారాయణబాబు ఊగిఊగిఆరిపోయిన దీపజ్యోతిని 'ఎర్రనిరబ్బరుముక్క'వలె తెగిపోయినదన్నాడు. దీపజ్యోతి ఊగుటకు, రబ్బరుసాగుటకుగల సాదృశ్యముచేత కల్పితమైనఉపమానమిది. నెలవంకను 'రక్తమువిరిగినగుర్విణిహస్తమునఁ చిదిలిపోయినగాజుముక్క'అన్నాడు.[3] శరన్మేఘములు 'శ్యామలశ్మశానవాటులరాలిన రాబందు'లన్నాడు.[4] ఇవి బీభత్సకల్పనముకొరకుచేసిన విచిత్రప్రయోగములు.

(ii) *శబ్దవైచిత్రి*

తెలుగులో శబ్దములద్వారా గారడీలుచేసిన నవ్యకవులలో పఠాభిప్రథముడు. 'హైహీలుయాన' వంటి క్రొత్తసమాసములనే సృష్టించినాడితడు. ఇంగ్లీషుపదములను విచ్చలవిడిగా గ్రుమ్మరించిన తొలికవియును ఇతడే. ఇంగ్లీషుమాటలకు తెలుగుమాటలకు సంధికార్యము నిర్వర్తించినదితడే. Catch + చేయఅనుమాటలనితడు 'క్యాజ్జేయ'అనెను. మద్రాస్ + సిటీ అనుమాటలను సకారాంత శబ్దముతర్వాతవచ్చు సవర్ణమునకుఁజరుగు సంధికార్యమును దృష్టిలోపెట్టుకొని 'మద్రాస్సిటీ'యని ప్రయోగించెను. 'దుస్సాధ్యకాంపిటీషను'వంటి మిశ్రసమాసములు సృష్టించెను. 'మౌనంగా'అనుటకు 'మవునంగా'అని విడదీసివ్రాసెను. శాకాహారులకు 'శాఖాహారు'లని ప్రయోగించెను. పఠాభిచేసిన శబ్దచమత్కారములకు 'ఫిడేలురాగం'అను గేయము చక్కని నిదర్శనము. ఇందులో ఇతడు మామూలువర్ణక్రమమును మార్చివ్రాసెను. ప్రేమికులు అనుటకు 'ప్‌రేమికులు'అని, 'అన్యోన్యము' అనుటకు అన్‌యోన్‌య'మని, ప్రశ్నించినదిఅనుటకు 'ప్‌రశ్‌నిన్‌చినది'అని అక్షరములనుచీలదీసి ప్రయోగించెను. 'చిత్రగుప్త'లో ప్రచురింపబడిన గేయమున పఠాభి అచ్చులో ఈ చమత్కారము చేసినాడు.

'అద్దముతిరిగెను ౨ ౪ ౭ ౧౫౬
తలక్రిందులైనది ౧౧౫౫౯౯౫౨.'

---

1. 2. అంతర్గోళాలు: పుటలు 60, 64.
3. 'తెనుగురాత్రి'. 4. 'కావాళి.'

భావమునకనుగుణముగా అచ్చులోమార్పుచేయుట దీనిలోనివిశేషము. ఇది ఒకవిధముగా ఇ. ఇ. కమింగ్సుప్రభావముగల ధోరణియే. కమింగ్సు ఆంగ్లభాషలోనిచిన్నక్షరములను, పెద్దక్షరములను ఇష్టమువచ్చినట్లుపేర్చి చమత్కారముచేసినాడు 'Dreams'అను మాటలో 'dream'అన్నది ఒకపంక్తిలోవ్రాసి రెండవపంక్తిలో 's'నుమాత్రమే ప్రయోగించినాడు. ఆరుద్ర

'ప్రతిరజం - ఇ
ద్రేప్రయాణం - మూ
సలోపోసిన'

వంటిపంక్తులలో చేసిన'గమ్మ' త్తిదే. కంమిగ్సు ఒకేపదములోనిఅక్షరములను విడదీసి వ్రాసినాడు. 'twilight' అనుదానిని 'twi li ght'అని 'Grasshopper'అను పదమును 'r-p-o-p-h-e-s-s-a-g-r'అనివ్రాసినాడు. ఇది 'పజిలు'వంటి ప్రయోగము. Grasshopper లోని అక్షరములను చిందరవందరగా, క్రమరహితముగాకూర్చుటయే దీనిలోనివైచిత్రి. 'you do'nt' అనుటకు 'ydoan' అని, 'you'అనుటకు ఇంకొకచోట 'U' అని ప్రయోగించినాడు. కొన్నిపాదములలో ఒకేఒక్కఅక్షరము కూర్చినాడు. 'Rolled into nowhere' అనుదానిని

'r
olle
di
nt
o
n
o
w(he)re'[1]

అని పేర్చినాడు. ఆరుద్ర 'త్వమేవాహం' లో

'మ్రోగెా
నీ
గా
నా
పెా
ఆపెా'

మున్నగుచమత్కారములను కమింగ్సుప్రభావముతోనే చేసెను. శిష్ట్లా 'మహాలయఅమావాస్య అనుగేయముచివర 'మహాలయఅమావాస్య'అనుపంక్తిని 'పెద్దదైపు'లో ముద్రించుట కమింగ్సు

1. ఈ ఉదాహరణలన్నియు 'The Magic-maker E. E. Cummings' అను పుస్తకమునుండి గ్రహించితిని. దీని రచయిత చార్లెస్ నార్మన్ (Charles Normon).

ప్రభృతులుచేసిన గమ్మత్తులను పునస్కరించుకొనియే. ఎజ్రాపౌండు, ఇలియట్ మున్నగువారు అంగ్లేతరపదములను (ల్యాటిన్, గ్రీకు, సంస్కృతము) ప్రయోగించుట గమనించి మన అతి నవ్యులు ఇంగ్లీషు, హిందీపదములను ప్రయోగించిరి. అయినను 'మణిప్రవాళశైలి' యనుపేర ఈపద్ధతి మనభారతీయసాహిత్యములందు చిరకాలమునుండి ఉన్నదే. సంస్కృతశబ్దములను, దేశీయపదజాలముతోకలిపి ప్రాచీనులు ఈ మణిప్రవాళశైలిని నిర్వహించినారు. పాలకురికి సోమనాథుడు 'అనయము చేతులందు భవదంఘ్రిసరోజయుగంనమామి'అనుపద్యము దీనికి నిదర్శనముగా రచించినాడు. అతినవ్యులు దీనిని పురస్కరించుకొని ఇంగ్లీషుహిందీ పదములను తెలుగు మాటలమధ్య ఇరికించి వైచిత్రిచూపినారు. బి.వి.సింగరాచార్య 'Vibgyor' శీర్షికతో రచించిన గీతములిట్టివే.

'గదిలో light తగ్గిస్తే
ఎల్లాగుంటుందో తెలో
ఈ Beauty Worshipper కి'[1]

వంటిపంక్తులలో ఈ వైచిత్రియేకలదు. ఇందులో ఏ భాషాపదము ఆ లిపిలోముద్రింపబడుట మరి యొకవిశేషము. సింగరాచార్య, పూషావంటివారు వ్రాసిన ఈ మణిప్రవాళశైలి కేవలము పేశల చమత్కారము కలిగించుటకే ఉద్దేశింపబడినది. ఇంగ్లీషుపదములను తెలుగులోవాడి గభీరవిషయా విష్కరణముచేసినవాడు ఆరుద్ర. 'బ్రెయిన్‌లో బ్రెన్‌గన్, రెయిన్‌లా ఆలోచనలబ్రెయిన్' అన్నపుడు మనకు హాస్యముకలుగదుసరికదా తీవ్రమైన ఆలోచనలు రేకెత్తును. ఇంగ్లీషుపదములను ప్రయోగించుటలోనే తృప్తిపడక ఆరుద్ర ఇంగ్లీషుమాటలను తెలుగుమాటలనుకలిపి కొన్ని క్రొత్తపదములనే సృష్టించినాడు. 'చెరిష్'అను ఇంగ్లీషుమాటకు 'ఇంచు'అను తెలుగు ప్రత్యయము చేర్చి 'చెరిషించు'అనుపదము కల్పించినాడు. అట్లే 'రన్'అను ఇంగ్లీషుమాటకు 'అండి' చేర్చి 'రనండి'అన్నాడు. Redtapism అను ఇంగ్లీషుపదమునకు 'ఎర్రదేపు'అని ప్రయోగించినాడు. 'నా పెన్ ఆపెన్ కాపాడున్'వంటి పంక్తులలో మొదటి 'పెన్' ఇంగ్లీషుది. 'ఆపెన్'అనునది 'ఆమెను'అను తెలుగుమాట. 'నీ విన్ నీవిన్'అనుపంక్తిలో మొదటి 'విన్' జయముఅనుఅర్థమున వాడినది. రెండవ 'నీవిన్'అనునది 'శోకముది'. ప్రాచీనులు సంస్కృతాంధ్రశబ్దములతో చేసిన యమకక్రీడలను ఆరుద్రపొడిగించి ఇంగ్లీషుతెలుగుమాటలను కలిపిచేసినాడు. 'ఎన్నడులు', 'ఎప్పుడులు'వంటి భాషాసంప్రదాయవిరుద్ధమైన ప్రయోగములుచేసినాడు. ఇదియును కమింగ్సు ప్రభావముగల ధోరణియే. కమింగ్సు తనగేయములో 'One has'nt a 'why'అని, 'forever was never till now'అని ప్రయోగించినాడు. ఆరుద్ర కొన్నిమాటలలోని అక్షరములను కత్తిరించి ఇంకొకరకమైన చమత్కారముచేసినాడు.

1. ప్రతిభ : సంపుటి 8 : సంచిక 1.

'అందమైనబ్ర–
కొంతమెతుకుతో
నిండుతుందిస్మీ.
కడుపునింపుమె——
కొంతబ్రతుకులో
దొరుకుతుందిలే.'[1]

'బ్ర'యన్నది బ్రతుకు. 'మె'యన్నది మెతుకు. 'బ్రతుకు'లో 'మెతుకు'లో 'తుకు'అను అక్షరములు సమానము. కావున బ్రతుకులో కొంతమెతుకున్నదని, మెతుకులో కొంతబ్రతుకున్నదని చమత్కరించినాడు. సింగరాచార్య ఒకచోట 'కప్పూ'అనుమాటకు Cup + ఊఅని, 'స్పూనూ' అను మాటకు Spoon + ఊఅని విచిత్రమైన మిశ్రసంధులు చేసినాడు.[2] 'యింత'అను మాటలో ఆద్యక్షరమునొత్తిపలుకుటకు 'య్యింత'అని ప్రయోగించినాడు. శార్వరి ఇంగ్లీషుఅంకెలలో కొన్నిటి నేరి వానిఉచ్చారణముద్వారా తెలుగుపదములను సృష్టించినాడు.

'అపాయం 3తుంది
6బైట పడుక్కొన్నప్రదేశం
జనత 7స్తుంది.'[3]

ప్రశ్న, క్వొశ్చెన్అను రెండుమాటలను దృష్టిలోపెట్టుకొని 'క్రొశ్న'అను క్రొత్తశబ్దమును కల్పించినాడు. ఇవికాక అతినవ్యులలోకొందరు 'జీవనఅశ్వము'వంటి అనుచితవిసంధులను, 'అయస్కాంతించు'వంటి సరిక్రొత్తక్రియారూపములను, లెక్కలేనన్ని మిశ్రసమాసములను బుద్ధిపూర్వకముగా ప్రయోగించినారు. విమర్శకులుకొందరు ఇది వ్యుత్పత్తిదారిద్ర్యమువలన సంక్రమించిన దోషమని భావించిరి. కాని వీనిని వైచిత్రీప్రియత్వమను మైకములోపడిపోయి విశృంఖలముగాచేసిన ప్రయోగములనవచ్చునేమో ?

*(ii) ఛందోవైచిత్రి :*

అతినవ్యులు ప్రధానముగావాడిన ఛందస్సు వచనగేయము. కొందరు మాత్రాచ్ఛందస్సులనుగూడ వాడిరి. వృత్తములను వృత్తములనిపేర్కొనకుండ ప్రయోగించుట వీరుచేసిన చమత్కారము. పఠాభి 'నర్తకులు'అనుశీర్షికతో 'తెలికలతాంతముల తూలికలు వ్రాయువిధి' యనురీతిలో లయగ్రాహిరచించినాడు. శ్రీశ్రీ 'సిరిసిరిమువ్వ' అనుమకుటముతో వ్యావహారికమున కందపద్యములు వ్రాసినాడు. ఆరుద్ర 'తథాస్తు'లో

1. గాయాలూ–గేయాలూ : ఆరుద్ర : పుట 60
2. Vibgyor : ప్రతిభ : 1941 ఏప్రిలు.
3. రోదసి : 'కన్నీరు : కుడి' అను గేయము.

'మరొకవిధంగాబతికే
వరంఎలాగ ?
తికమకలవలలన్ని జయించు'

అనుధోరణిలో వచనపద్యభ్రాంతికలిగించుచు వ్రాసినది కందపద్యమే. ఈ శీర్షికతో నాలుగు కందపద్యములు రచించినాడు. 'వేదనాశకలం'లో ప్రాతవడినవృత్తములకు క్రొత్తరంగువేసినాడు. ఇందులో మొదటిపద్యము ఉత్సాహవృత్తము. 'తెరలో'అనుశీర్షికక్రిందగల 'దారుణం ఇదిదారుణం' అన్నది మత్తకోకిల. 'నకనకలాడెడిఆకలితోడను' అన్నది కవిరాజవిరాజితము. 'చెడినజీవిత సారమాధురి'యన్నది తరళవృత్తము. 'జనత'శీర్షికతోగలది దండకము. 'అఖండ జ్యోతి'లో మొదటిమూడుపాదములు త్ర్యస్రగతిలో నడచిన మాత్రాచ్ఛందస్సులు. చివరిరెండు పాదములు తేటగీతికి చెందినవి. 'భూమిపయిదేవతల'అన్న భరతవాక్యపద్యము లయగ్రాహి. ఇవికాక మధ్య మధ్య వివిధమాత్రాచ్ఛందస్సులను ప్రయోగించినాడు. 'సినీవాలి'లో ఆరుద్ర ప్రారంభముననే గీతపద్యములు రచించినాడు. అచ్చులో ఇవి వచనపద్యభ్రాంతి కలిగించును. తర్వాత వచన గేయముగుప్పించి వెంటనే వ్యావహారికమున కందపద్యమును, పిమ్మట మాత్రాచ్ఛందస్సులను విరజిమ్మినాడు. ఈ కావ్యమున మధ్యమధ్య కవిచేసెడివ్యాఖ్యలకు ఆటవెలదిని ప్రయోగించుట ప్రత్యేకతయనవచ్చును.

'అంతర్గోళాలు'లో దుర్గానంద్ వ్రాసిన 'తపనః శీతలమూర్తివైకనుము'అను ఒకేపద్యములో ప్రథమపాదము మత్తేభము; ద్వితీయము శార్దూలము; తృతీయము ఉత్పలము; చతుర్థము చంపకము. ఒకేపద్య మిన్నివృత్తగతులలో వ్రాయుట అపూర్వవిషయము. 'అగ్నిధార'లోదాశరథి 'బాల చంద్రరేఖ' అను పద్యమున ఆటవెలది, తేటగీతులపాదములను కలిపికుట్టినాడు. 'రక్తాక్షి'లో సోమసుందర్, ఆరుద్ర 'వేదనాశకలం'లోచేసిన ఛందోవైచిత్రినే కనబరిచినాడు. 'అయయో అయయో కొనిపోయిరిరో'వంటి మాత్రాచ్ఛందస్సుల విచిత్రగతులలో సోమసుందర్ కొంతవిశిష్టత చూపినాడు. అబ్బూరివరదరాజేశ్వరరావు ఒకగేయమున

'పదముందుకు, వెనకఆపద
ముదికనులకు లేదుకౌముది
గదిలోపలినలుపు మూగది
పదనేత్రం వెనకఆపద' (అందాక : పుట ౩౭)

అని ప్రతిపాదప్రారంభములోని రెండక్షరములను చివరచేర్చి చమత్కారముచేసినాడు. ఇంతకు మించి మాత్రాచ్ఛందస్సులో వీరుచేసిన ప్రయోగములు అంతగా గణనీయమైనవికావు. వృత్తము లను చమత్కారముకొరకు ప్రయోగించి, మాత్రాచ్ఛందస్సులను కొంతవరకాదరించి, వచనగేయ మును జవనాశ్వమువలె, మత్తేభమువలె, కురంగివలె, సివంగివలె బహురీతులలో నడిపించినారు

ఈ అతినవ్యులు. వచనగేయము వీరిసృష్టికాదు. దానికి కవికొండల, మల్లవరపు, పఠాభి, శిష్టా ప్రభృతులెన్నడో పాదులువేసినారు. ఐనను ఈ ప్రక్రియ శ్రీశ్రీ, ఆరుద్ర, పాలగుమ్మిపద్మరాజు ('పాప'), నారాయణబాబు, దాశరథి, కుందుర్తి, తిలక్‌మున్నగు అతినవ్యకవుల చేతిచలువతో ఎదిగిఎదిగి తీగలుసాగి సురభిళించిపోయినది. ఒకొక్కమాటు చరణనియమముతో, ఇంకొక మాటు నిర్నియమముగా నిరంకుశగతిలో ఈ వచనగేయము పలుతెన్నులుపోయినది. సమర్థుల చేతిలో వజ్రధారవలె తీండ్రించినది. అసమర్థులచేతిలో 'జావ'వలె జారిపోయినది. 'Free-verse, a dangerously different art, appears to be even more dangerously easy'[1]. ప్రతినవ్యప్రయోగమునకు ఈ చిక్కులుతప్పనివేకావున వానిగూర్చి విచారించక, వచన గేయము స్వరూపస్వభావములను సంగ్రహముగా ఉల్లేఖింతును.

### వచనగేయము :

వచనగేయమును ఫ్రెంచిభాషలో Verse Libre అని, ఇంగ్లీషులో Free Verse అనియందురు. ఈ ప్రక్రియకు మొదట ఫ్రెంచిభాషలో జూలిస్‌లాఫోర్జ్ (Jules Laforgue) మున్నగువారు పాదులువేసిరి. ఈ తెగకుచెందిన గేయము ఛందోబద్ధమైనకవిత్వమున కేమాత్రము తీసిపోదని గుర్తించిరి. మలార్మేఅను ప్రఖ్యాతఫ్రెంచిరచయిత సాహిత్యములో వచనమను ప్రత్యేకప్రక్రియ లేనేలేదని అభిప్రాయపడెను. ఒకటికిమించినశబ్దములు సంయుక్తమైనప్పుడది పద్యమేయగునని వాదించెను. మలార్మేప్రభృతులు విషయవైశద్యమున్నప్పుడు వచనమని, నిగూఢభావనిబంధన మున్నప్పుడు పద్యమని అభిప్రాయపడిరి. ఫ్రెంచికవుల ప్రభావమునకులోనైన ఇంగ్లీషుకవు లీప్రక్రియను చేపట్టిరి. ఈ ప్రక్రియ ఇంగ్లీషులో అర్నాల్డ్, వాల్ట్‌విట్‌మన్ వంటివారిరచనలలో తీగలుసాగినది. అయినను వీరికిముందే షేక్స్పియరు, వెబ్స్టర్, మిల్టన్ మున్నగువారిరచనలలో కొన్నిభాగములు వచనగేయమునకు సన్నిహితమైనవి లేకపోలేదు. కాని ప్రధానముగా ఫ్రెంచి కవుల ప్రభావమువలననే ఇంగ్లీషులో వచనగేయమునకు రూపురేక లేర్పడినవి.

తెలుగున వచనగేయ మతినవ్యులచేతులలో విశ్వరూపముదాల్చినది. శ్రీశ్రీ 'కవితా ఓకవితా' అన్నది వచనగేయమైనను దానిలో మాత్రాచ్ఛందోవాసనగల పంక్తులు లేకపోలేదు. 'నానాగానా నూనస్వానావళితం' మున్నగు పంక్తులిట్టివే. ఈ మాత్రము మాత్రాచ్ఛందోగంధముగూడ లేకుండ అతినవ్యులు వచనగేయమును నడపినారు. ఇంతకు గేయమునకు వచనగేయమునకుగల భేద మెక్కడ ? గేయము నియమితమాత్రలతో నడచు ఛందఃప్రక్రియ. ఒకపాదములో ఇన్నిమాత్రలు అనెడు నియమము వీడినంతమాత్రమున అది వచనగేయముకాదు. మాత్రలనియమముతోపాటు మాత్రాచ్ఛందస్సునకు ప్రధానమైన ఖండత్ర్యస్రచతురస్రాదిగతులుకూడ తొలగిపోవలసియుండును. అనగా గేయములోనిమాత్రానియమముగాని, కనీసము మాత్రాచ్ఛందస్సులగతిగాని లేకయుండుట వచనగేయమునకు ప్రాథమికమైనగుణము. మాత్రాఘటనముతో గేయమున శబ్దలయ, సంగీత గుణము పెరిగిపోవును. ఇవి భావదారిద్ర్యమును కప్పిపుచ్చుటకుపయోగపడవచ్చును. కావున

1. 'English Literature In The Twentieth Century': H. V. Rowth: P. 114.

మాత్రానియమనిరసనముతో శబ్దలయప్రాధాన్యము, సంగీతాత్మకత ఎగిరిపోయినవి. వృత్తము అక్షరగణనియమముకలది. గేయము వృత్తములోని కఠిననిర్బంధములను కొంతసడలించుకొన్న క్రొత్తప్రయోగము. అనగా వృత్తములో ఒకపాదమున 'నా'అనుఅక్షరమున్నదనుకొనుడు. ప్రతి పాదమున ఆ స్థానములో అట్టిదీర్ఘాక్షరమే ఉండితీరవలెను. గేయములో ఈ నిర్బంధము కొంత సడలినది. 'నా'అనుటకుబదులుగా 'నన' అనువీలుచిక్కినది. అనగా దీర్ఘాక్షరమునకుబదులుగా రెండుమాత్రలువేయుటకు అవకాశముకలిగినది. దీనితో వృత్తములోనిబిగింపులు సడలిపోవుటతో గేయము కొంతస్వేచ్ఛను సంపాదించుకొన్నది. గేయములోగూడ మాత్రానియమమొక అడ్డంకిగా పరిణమించినది. చెప్పదలచుకొన్నవిషయమును స్వచ్ఛందముగా, సమర్థముగా చెప్పుటకు ఒక్కొక్కప్పుడీమాత్రలనియమము అడ్డువచ్చినది. ఈ మాత్రల నియమమును త్రోసివేసి, పాద నియమును తీసివేసి భావమునకనుగుణముగా పదప్రయోగముచేయవలసిన అవసరమువచ్చినది. ఈ అవసరమే వచనగేయసృష్టికి మూలహేతువు.

వచనగేయమునకు 'లయ'ముఖ్యము. ఈ 'లయ' గణములను కూర్చుటతోనే ఉత్పన్నము కాదు. ఒకానొకఊపులో; విసురులో పదములనుగుప్పించుటవలన ఈ లయఏర్పడును. ఏ నియమములులేకుండ శుద్ధవచనమును లయాత్మకముగామార్చినచో అది వచనగేయమగును. వచనమునకు వచనగేయమునకిక్కడే వ్యత్యాసమున్నది. వచనములో విషయప్రకటనమే ముఖ్యలక్ష్యము. అందుకు వచనరచయిత వైశద్యముకొరకుమాత్రమే ప్రయత్నించును, వచనగేయములో వైశద్యము ప్రధానగుణముకాదు. పాఠకునిలో భావోద్వేగముకలిగించు 'అంతర్లయ' దీని ప్రధాన లక్షణము[1]. దీనిలో కేవలము అనుప్రాసాదులవలన సంక్రమించు శబ్దలయ ఆనుషంగికమైనది. దీనికతీతమైన 'భావలయ' ముఖ్యమైనది. భావలయయనగా వచనగేయమున పూసలలోదారము వలెనుండు అంతర్లయ. వచనగేయములోని యీఅంతర్లయ ఎల్లప్పుడొకేరీతిగా ఉండరాదు. ఒకప్పుడీవచనగేయము మందమందముగా నడవవచ్చును. ఇంకొకప్పుడు తురగధాటిలో పరుగిడవచ్చును. మరియొకప్పుడు చటుక్కున విరిగివిరిగి సాగవచ్చును. ఎట్లున్నను ఆ అంతర్లయగాని, విరుపులుగాని మొత్తముగేయముయొక్క గమనమున కుపస్కారకముగానుండవలెను. అంతమాత్రమున వచనగేయములోని పాదములన్నియు ఒకేతూగులో నుండవలెనని నా అభిమతముకాదు. ఛందోనియమముగల పద్యములోని 'లయ' 'ఏకతార'వంటిది. దానిలో వైవిధ్యము తక్కువ. వచనగేయములోని లయ అట్లుగాక స్వచ్ఛందమైనది. ఈ స్వచ్ఛందత వలన పద్యములో గేయములో అసంకల్పముగా దొరబారు కృత్రిమపదబంధములు, పాదపూరణ శబ్దములు వచనగేయమున ప్రవేశించుటకు వీలులేకుండపోయినది. చెప్పదలచుకొన్న భావమును సూటిగా గుండెకుతాకునట్లుచెప్పెడిగుణము అలవడినది. కవిత్వమునకు జీవితమునకు సాన్నిహిత్యమేర్పడినది. సమకాలీనవస్తువును కవితావస్తువుగా జేసికొనుటకు మరింత వీలుకలిగినది. ఇతర

1. 'In Free Verse we look for the insurgent naked throb of the instant moment'
—'English Literature In The Twentieth Century': P. 114.

భాషాపదములను (వ్యవహారములోనున్నవానిని) ఏ యిబ్బందిలేకుండ ప్రయోగించు వెసులుబాటు కలిగినది. భావచిత్రములను విరివిగా గుప్పించుట కవకాశముచిక్కినది. అందుకే ఇంగ్లీషులో ఇమేజిస్టుకవులు వచనగేయమును ప్రధానవాహికగా గ్రహించిరి. తెలుగున అతినవ్యకవులు దీనిలో ఖండకావ్యములేకాక కావ్యములేరచించిరి. ఆరుద్ర 'త్వమేవాహం'లో మాత్రాచ్ఛందస్సులతోపాటు వచనగేయమునుకూడకలిపి రచించినాడు. నారాయణబాబు 'రుధిరజ్యోతి'లోని గేయములన్నియు ఇంచుమించుగా వచనగేయములే. శిష్ట్లా 'నవమిచిలుక'లోనివన్నియు వచనగేయములే. కాని వీనిలో కథనము ప్రధానముగా నుండుటవలన వచనగంధ మెక్కువై పోయినది. పఠాభి 'ఫిడేలురాగాలడజన్'లోని గేయములన్నియు వచనగేయములే. కాని కృత్రిమగ్రాంధిక రూపములను చేర్చుటవలన, అంతర్లయను పాటించక ఒక్కొక్కమాటు శుద్ధవచనపు తుంటలనే చేర్చినందున ఇవి ప్రామాణికమైన వచనగేయములనిపించుకొనలేదు. తొలిసారిగా వచనగేయములో సమగ్రమైనకావ్యము రచించినకీర్తి కుందుర్తికే దక్కినది. ఇతని 'తెలంగాణా' కావ్యము వచనగేయములోని లక్షణములన్నియు సమగ్రముగా కలిగియున్న సంపూర్ణకావ్యము. వచనగేయములో గూడ ఆలోచనలకు, అనుభూతులకు విందుకలిగించు సమగ్రకావ్యము రచించవచ్చునని కుందుర్తి 'తెలంగాణా'ద్వారా నిరూపించినాడు. వచనగేయములో వెలువడిన నాటికలలో కుందుర్తి 'ఆశ', ఆరుద్ర 'సీతాకోకచిలుక' ప్రౌఢశిల్పము పొదుగుకొన్న రచనలు. దాశరథివ్రాసిన 'మస్తిష్కంలో లెబొరటరీ', 'బాల్యం'వంటివి వచనగేయప్రక్రియకెత్తిన మణిదీపములు. ఇటీవలికాలమున గోపాలచక్రవర్తివంటి యువకవులు ఈ బాటలోనడచి చక్కని వచనగేయములు రచించుచున్నారు. ఇక వచనగేయముయొక్క ముఖ్యలక్షణములకు లక్ష్యములిచ్చి ఈ పరిశీలన ముగింతును.

వచనగేయమునకు నిరాడంబరత ముఖ్యమైనగుణము. నిరాడంబరతయనగా నిరలంకారత కాదు. అనవసరమైన శబ్దార్భటిని, పొల్లుపదముల పొర్లింతలను ఇది నిరసించినది. శ్రీశ్రీ వ్రాసిన 'ఆకాశదీపం'లోని ప్రారంభపంక్తులను చూడుడు.

'గదిలో ఎవరూలేరు
గదినిండా నిశ్శబ్దం
సాయంత్రం ఆరున్నర
గదిలోపల చినుకులవలె చీకట్లు.'[1]

మన నిత్యవ్యవహారభాషకు సన్నిహితముగానున్న రచనయిది. చివరిపంక్తిలోని ఉపమానము ఈ నాలుగు పంక్తులకు ప్రాణమూదినది. అయినను అలంకారములేదన్నంత నిరాడంబరముగా రచింపబడిన గేయభాగమిది.

1. 'గదిలోఎవ + రూలేరు
గదినిండా + నిశ్శబ్దం' అన్న ధోరణిలో విరిచిచూచినచో ఇది త్ర్యస్రగతిలో వచ్చిచేరును. కాని ఈ గేయమును చదివినప్పుడు మాత్రాజ్ఞాన మేమాత్రముండదను విషయము గమనింపదగినది.

వచనగేయమున కింకొక ముఖ్యమైనలక్షణము 'తూగు'. ఇది అంతర్లయలోని ఒక భాగము. చరణములు చిన్నవిగా పెద్దవిగానున్నను, ఒక్కొక్కవాక్యములో పదజాల మెక్కువగా తక్కువగా పడినను, ఆ విషయము తెలియనీయకుండ పాఠకులను పట్టి యీడ్చుకొనిపోవు గుణమిది. ఆరుద్రగేయము చూడుడు.

'నిర్దేశించినభావాలను వాక్యాలుబట్వాడాచెయ్యవు.
పదేపదేవాగిన గ్రామఫోనురికార్డులమాదిరి
మాటలు అర్థప్రేరణచెయ్యవు.
విశాలలోకంసర్కసులోపల విద్య ప్రభుత్వోద్యోగాల
ట్రాటిమీద పిల్లిమొగ్గలు వెయ్యదు.' (త్వమేవాహం : పుట 19)

ఇందులో మూడు వాక్యములున్నవి. మొదటిదానికన్న రెండవది, రెండవదానికన్న మూడవది పెద్దగానున్నవి. అయినను వీనిని ఆవేశములో చదువుచుపోయినచో మనకు వాని దైర్ఘ్యము స్ఫురించదుసరికదా అన్నియు సమానమేయన్నంత భ్రాంతికూడ కలుగును. ఒకానొక విశిష్టమైన 'తూగు'లో నడిపించుటతో దీనికిగుణ మేర్పడినది.

అనుప్రాసము, కొన్నిపదముల ఆద్యక్షరసామ్యము వచనగేయలక్షణములలో ఎన్నదగినవి.

'నిశ్శబ్దంగా నితాంతజీవితలతాగ్రానపూచే
నిర్మలమైన ఎఱ్ఱరోజాప్రసూనం బాల్యం'.[1]

ఇందులో 'ని'తో ప్రారంభమగు మూడు పదములు ప్రయోగింపబడుటవలన, నితాంత, లతాగ్రాన వంటి దూరానుప్రాసలుండుటవలన చక్కని బిగిబిగి యేర్పడినవి.

'నాగజెముడు గుచ్చుకుంటుందనీ
నాగసర్పం కరుస్తుందనీ
నమ్మించిమోసంచేయొచ్చనీ'[2]

వంటి పంక్తులలో ప్రతిపాదము 'నకారము'తో ప్రారంభమగుటతో సామాన్యభావ ప్రకటనమునకు సౌందర్యమబ్బినది.

వచనగేయములోని లయకు అనుప్రాసములకన్న అంత్యప్రాసము అయువుపట్టువంటిది ఆరుద్ర, కుందుర్తిమున్నగువారు ఈ అంత్యప్రాసములతో వివిధక్రీడలు జరిపినారు. కుందుర్తి 'నాగీతం' అను శీర్షికతో వ్రాసిన వచనగేయమున ఐదారుపాదములవరకు ఒకేరకమైన అంత్యప్రాసమునుపాటించి చమత్కారముచేసినాడు.[3] 'పాటను' అనుమాట మొదటిపాదము చివరనుండగా

1, 2. 'బాల్యం' : పునర్నవం : పుట 4.
3. యుగేయుగే : పుట 14.

తర్వాతి పాదములచి ట్లో 'మాటను', 'మూటను', 'కోటను', 'నాటను', 'దాటను', 'పూటను' వంటి అంత్యప్రాసములను పుంఖానుపుంఖముగా గుప్పించి చెప్పదలచుకొన్న అంశమునకు ఓజస్సు సమకూర్చినాడు. ఇక

'చరమసంధ్యకువిడాకులిచ్చి, రవిచేసినచీకటితప్పు
చరిత్రనిర్మించినధరిత్రికమలవనానికిముప్పు'[1]

వంటివి రెండురెండు పాదముల కొకరకమైన అంత్యప్రాసలకు నిదర్శనములు. పలువురీపద్ధతి లోనే రెండురెండు పాదముల కంత్యనియమము పాటించినారు. కొందరు 4 పాదములకు పాటించి నారు. కొన్ని సందర్భములలో 4 పాదములున్న Stanza (గేయభాగము) లో అంత్యనియమము రెండవ నాల్గవ పాదములకు మాత్రమే పాటింపబడినది.

'మనకాలంఅలాంటిది; అనుమానాలుమెండు
ఎవడూ ఎవణ్ణీ నమ్మడు:
కంట్లో చల్లుతాడనిభయపడి, కొట్టువాడు
యింకోకులానికి కారంఅమ్మడు.'[2]

ఇట్లుగాక 4 పాదములలోని మొదటిపాదమునకు, నాల్గవదానికి అంత్యనియమము పాటించిన సంద ర్భములు, నాల్గింటికి పాటించిన సందర్భములున్నవి. కుందుర్తి వ్రాసిన 'కృతంలోకి'వంటి గేయ ములు నాలుగునాలుగు పాదములుగా విడిపోయినవి. 'చోట్లేదు'వంటి గేయములు కొంతవరకు 4 పాదములుగానడచి తర్వాత మూడింటికి, రెండింటికి దిగిపోయినవి. ఆర్ద్ర 'త్వమేవాహం'లో సినీవాలిలో విరామచిహ్నములులేకుండ వచనమువలెముద్రించి వచనగేయములు రచించినాడు. ఇట్టిసందర్భములలో ఆ గేయములలోని అంతర్లయనుబట్టి, భావచిత్రములనుబట్టి, పదప్రయోగ రీతినిబట్టి వానిని వచనగేయములని గమనించుటకు వీలుండును.

ఈ విధముగా వచనగేయము అన్నిరకముల ఆవేశములను, వివిధభావములను ప్రకటించు టకు పటుసాధనమని అతినవ్యకవులు నిరూపించిరి. ఇంతకు వచనగేయము కవితాశరీరములో వచ్చిన మార్పుమాత్రమే. ఆంతరంగములో అన్ని ప్రక్రియల లక్ష్యమొకటే. అక్కిరాజు ఉమాకాంతపండితులు భావకవులనుగూర్చి విమర్శించునప్పుడు పేర్కొన్న 'పులుముడుదోషము', 'దండగ్గణము'లు మున్నగునవి వచనగేయప్రక్రియతో తుడుచుకొనిపోయినవి. 'బాల్యము' వంటి సామాన్యమైన విషయమునుగూర్చి వచనగేయములో రసవత్తరముగా కవిత్వము చెప్పవచ్చునని దాశరథి నిరూపించినాడు. ఒకానొక విప్లవోద్యమమును వీరావేశముకొరవడకుండ రక్తమును, కన్నీళ్ళను రంగరించి వచనగేయములో కావ్యరూపమున ఫలింపజేయవచ్చునని 'తెలంగాణా'ద్వారా

1, 2. యుగేయుగే: పుటలు 81, 85.

కుందుర్తి నిరూపించినాడు. అత్యాధునికజీవితములను, పారిశ్రామికనాగరకతవలన సంక్రమించిన ఊహలను ఈ ప్రక్రియలో అందముగా అందించవచ్చునని ఆరుద్ర, దుర్గానంద్ ప్రభృతులు రుజువుచేసినారు. వచనగేయములో మహాకావ్యము రచించవచ్చునని వీరందరి సమష్టికృషి ఘోషించుచున్నది

## 6. అరాజకవాదము (Anarchism) :

పాశ్చాత్యసాహిత్యలోకములో వెలువడిన ఫ్యూచరిజము, డాడాయిజమురెండును అరాజకవాదమునకు సంబంధించిన ఉద్యమములే. గతవిధ్వంసనము, భవిష్యత్తుపట్ల అవిశ్వాసము డాడాయిజము లక్షణములు. ఫ్యూచరిజమునకు గతముతోపాటు వర్తమాననిరసనము ప్రధానధ్యేయము. ఈ రెంటికి గతద్వేషము సమము. ముఖ్యముగా ఈ రెంటిలో డాడాయిజము అరాజకవాదమును అధికముగా ప్రేరేచినది. అక్షరవిన్యాసములో, భావనారీతిలో, భాషాప్రయోగములో, జీవితవైఖరిలో డాడాయిస్టులు అరాజకమును ప్రదర్శించిరి. ఒక డాడాయిస్టుగీతము నుదాహరింతును.

'La—di—da—da
—di—da—da
———da—da
————dum :
Why do French men
Woo a woman
as if women
never resisted.'

ఇందులో అర్థములేని శబ్దములు, అనవసరమైనగీట్లు, Punctuation marks (విరామ చిహ్నములు) గమనింపదగినవి. శ్రీశ్రీ వ్రాసిన 'న...న...న...నత్రిమాటలు', 'హూష్‌హూష్' అను కేకలు డాడాయిజము ప్రభావముతో వెలువడినవే. డాడాయిస్టులు జీవితముపట్ల ప్రదర్శించిన అరాజకస్థితిని మన తెలుగుకవులుగూడ అనుకరించిరి. 'పూషా' వ్రాసిన 'కల్చర్ అండ్ అనార్కి' అను గేయములో ఈ ధోరణి స్పష్టముగా కనిపించును.[1] ఈ గేయములో కవి

'వొక్కొక్కడికీ యెవడికివాడికి
నాలగ్గోడలనడింప్రపంచం : కల్చర్—కంచం ! మంచం !
యెవడికివాడికి యెవడిదివాడిది !
మాయింట్లో నేనొక Pooh—'shaw' ని ! పర్షాని ! నాదిర్షాని !
నీయింట్లో నువ్వొక Go—'wells'వి : గోబెల్స్‌వి ! గోరింగ్‌టాంగ్‌వి !'

1. 'కల్చర్-అండ్-అనార్కి' : ప్రతిభ : సంపుటి 5 : సంచిక 2, 3.

అని 'కంచము, మంచమే' సంస్కృతియన్నాడు. ఎవనికివాడే గొప్పయని, సాంఘికమూల్యములు, నైతికపు విలువలన్నవిలేవని ప్రబోధించినాడు.

'దొరకనిదాన్నీ దొరికినదాన్నీ కొరుక్కుంటాం
వొకర్నొకరం మహాకసిగా పసగా నరుక్కుతింటాం !'

ఈ పంక్తులలో సంఘములోని అరాజకవ్యవస్థను కవి అధిక్షేపించుటకు ప్రయత్నించినట్లు కనిపించును. కాని బురదలో వడిగా రాయివిసరినచో అది విసరినవాని ముఖముపైననే చిమ్మినట్లుగా, కవిచిత్రించదలచుకొన్న అరాజకస్థితిని తానే ప్రబోధించుచున్నట్లు గోచరించుచున్నది. ఈ గేయములోనే ఇంకొకభాగమున కవి

'మనిషికి లవ్‌ఆఫ్‌మదర్‌కంట్రీ
జీవితానికి ఆర్ట్‌అండ్‌పోయిట్రీ
అక్కర్లేదు ! అననెసిసరి'

అని కళలతోపాటు దేశభక్తినిగూడ నిరసించినాడు. ఈ గేయముచివర

'జాతులుభాషలూదేశాలూ
ఖండాలూసముద్రాలుగోళాలూ
అరాజకంలో అనార్కీలో
విప్లవవిలయప్రళయజ్వాలలో
భగ్నంభుగ్నంమగ్నంనగ్నంకావాలి !
వర్షానంతరప్రశాంతశారదనభానికి
దేర్‌యీజ్ వోనలీవనఫిట్‌టెస్ట్
సర్‌వైవల్‌ఆఫ్‌దిఫిట్టెస్ట్'

అని, సంఘములో అరాజకస్థితియేర్పడి తరతరములుగ పెరిగిన మానవసంస్కృతి బుగ్గియైపోవలెనని, 'కర్రయున్నవానిదే బర్రె'యని అవినీతి ప్రేరకములగు అభిప్రాయములను ప్రకటించినాడు. ఏ ఉద్దేశముతో వ్రాసినను ఈ గేయము అరాజకధోరణికి ప్రతిబింబముగానేయున్నది. కె. వి. రమణారెడ్డిగారి 'అడవి'లోని 'సత్యం, శివం, సుందరం' అను గేయమున అరాజకధోరణులగుపించుచున్నవి.

"నిందిస్తున్నానునేను పరిశుద్ధమైన గ్రంథాన్ని

నిందిస్తున్నానునేను దిగంబరన్యాయాన్ని

..................మంగళసూత్రాన్ని
నిందిస్తున్నానునేను
నెమిలిసింహాసనాన్ని; తాజమహలుశిల్పాన్ని
పిరమిడ్‌ను....................."

విప్లవదృష్టిపేర ఈ కవి అరాజకత్వమును ప్రేరేచుట వాంఛనీయముకాదు.

శ్రీశ్రీ, వరద, ఆరుద్రకలసి రచించిన 'మేమే'[1] అను గేయసంపుటి ఈ అనారోగ్యకరమైన ధోరణికి అసలైన ప్రతిబింబము. 'ఏసోడా ఏనీళ్ళూ వీసంకూడా కలుపక విస్కీ సౌనాయాసంగా' త్రాగు 'ఏసు' కు ('ఏల్చూరి సుబ్రహ్మణ్యానికి') ఈ కావ్యసంపుటి అంకితము చేయబడినది. వ్యక్తిగతమైన అలవాట్లను రచ్చకెక్కించుధోరణి ఇందులో స్పష్టముగా కనిపించును. 'సీసాపయి నేగా మనధ్యాస హామేషా' యన్న వాక్యము దానికి ప్రోద్బలకముగానున్నది. అంకితగేయము వలెనే ఈ సంపుటిలోని గేయములన్నియు అవినీతికి, అరాజకతకు, ఉన్మత్తప్రవర్తనకు మచ్చుతునుకలుగానున్నవి. 'బమ్మెరపోతులం', 'అల్లసానివాడలం' వంటి పంక్తులలో వీరు ప్రాచీన కవుల నవహేళనచేసినారు. 'భగవంతుని వితంతువులం', 'ఎదిగీయెదగనిలంజలం'వంటి అసభ్యోక్తులు గుప్పించినారు.

'అక్షయపాత్రలో ఉమ్మేద్దాం
మక్షికాన్ని మింగి తుమ్మేద్దాం'

వంటి అవినీతికరమైన జుగుప్సావహమైన భావములు వెల్లడించినారు, శబ్దచమత్కారపు మోజులో పడి, అంత్యప్రాసలగారడికిలోనై వ్యక్తావ్యక్తమనఃస్థితికిదాసులై చేసినరచనయిది. ఏ దృష్టితో రచించినను ఇది అరాజకధోరణికి ప్రతినిధిగానే ఉన్నది. అయినను ఇట్టి రచనలను అతినవ్యకవులాదరించలేదు. ప్రజలు అంతకు సరకుచేయలేదు. అందువలన ఈ విధమైన ఒకటిరెండు రచనలు పుబ్బలోపుట్టి మఖలో మాడిపోయినవి. పాశ్చాత్యదేశములలోవలె తెలుగునాట డాడాయిజమువంటి ధోరణు లుద్యమరూపమున రాలేదు. అప్పుడప్పుడు హఠాత్తుగారేగి కండ్లలో దుమ్ముచల్లిపోవు సుడిగాలివలె ఈ ధోరణి ఒకరిద్దరు కవులలో ప్రవేశించి ఒకటిరెండు రచనలు చేయించినది. పాశ్చాత్యుల అంధానుకరణముతో ప్రారంభమైనధోరణి కావున ఇది తెలుగునేలలో నిలువలేకపోయినది. సంప్రదాయవాసనలేని యేధోరణిగతియైనను ఇంతేకదా!

## 7. నిరాశావాద ధోరణి (Pessimism) :

అతినవ్యకవులందరు భవిష్యత్స్వర్ణశిఖరములవైపు ప్రస్థానించిన ఆశావాదులే. కాని వాస్తవికజీవితములోని కొరడాచరుపులకు త్రుళ్ళిపడి, ఇక్కట్లగబ్బిలములు వ్రేలాడుచున్న

1. 1954 మే నెలలో ప్రచురింపబడినది.

బ్రతుకుబేండ్లను బాగుపరుచుకొను చేవచాలక ఒక్కొక్కమాటు నైరాశ్యధోరణికి దాసులై పోయి నారు. శ్రీశ్రీవంటి ఆశావాది కవికూడ

'మనమంతా బానిసలం
గానుగలం, పీనుగులం
వెనుకదగా, ముందుదగా
కుడియెడమల దగాదగా' (మహాప్రస్థానం : పుట 45)

అని 'చేదుపాట' పాడుకొన్నాడు. 'చెదరిన గుండెలనదిమేదేమిటి? అవతల, ఇవతల అరులై, ఇరులే' యని పరాజితులగొంతుకను వినిపించినాడు. ఆరుద్ర 'త్వమేవాహం'లో మధ్యతరగతి స్వగతములద్వారా నిరాశావాదధోరణిని వెల్లడించినాడు. 'సినీవాలి'లోని కథానాయకుడు జీవిత సమరమునుండి పరాజితుడై, ఉరిత్రాడువైపు దృష్టిమరలించినట్లు ఈ కవి చిత్రించినాడు. అజంతా వ్రాసిన 'భయపడినవాడు' అను గేయములోని

'ఉరిత్రాళ్లు నా ఊహలు
సంకెళ్ళు నామాటలు
నాపైరువ్వినరాళ్లు నాఅక్షరాలు
నాకు లోకంలేదు' (కల్పన : పుట 177)

వంటి పంక్తులు నీరుగారిపోయిన మనస్సులను ప్రతిబింబించుచున్నవి. ఇతడే వ్రాసిన 'పరిత్యాగి పరివేదన' అను గేయములోని

'అంతదాకా ఎందుకూ రోడ్డుమీద నామృతకళేబరాలని
నేనే లక్షసార్లు చూశాను' (కల్పన : పుట 180)

వంటి పంక్తులలో నిస్పృహ, నిరాశ దట్టముగా క్రమ్ముకొనియున్నవి. 'పాడుపోయిన ఊరు' అను గేయములో బాలగంగాధర్‌తిలక్

'ఒక వెగటుఏదో నన్ను ఆవరించుకొంది
కాలం పాడునుయ్యిలా నాకన్నులకు కనపడింది'[1]

అని నైరాశ్యపు గొంతుకనే వినిపించినాడు.

ఈ కవులందరికన్న అధికముగా నిరాశావాదధోరణిని ప్రదర్శించిన అతినవ్యకవి బైరాగి. ఈ కవి వ్రాసిన 'నూతిలో గొంతుకలు' నిరాశాధోరణికి దారిచూపు సంశయకావ్యము. 'నూతిలో గొంతుకలు' అన్న ఈ కావ్యముపై టి. యస్. ఇలియట్ ప్రభావము సాంద్రముగానున్నది.

1. 'పాడుపోయినఊరు' : ప్రతిభ : 7 వ సంపుటము.

ఇలియట్ 'Love Song of J. Alfred Prufrock' లోని నాయకుడగు ప్రుఫ్రాక్ 'And in short, I was afraid' అన్న భీతుడు.

'I grow old......I grow old......
I shall wear the bottoms of my
trousers rolled'

అని ఆక్రోశించిన నిరాశానిహతుడు. భయగ్రస్తులైన మధ్యతరగతిమనుష్యుల కితడు ప్రతినిధి. బైరాగి కావ్యములోని నాయకులుగూడ ఇట్టివారే. హామ్లెట్, అర్జునుడు, రాస్కల్నికోవ్- ఈ ముగ్వురి స్వగతములను బైరాగి చిత్రించినాడు. వీరిలో హామ్లెట్ కర్మకుముందు సందిగ్ధావస్థలో పడినవాడు. అర్జునుడు కర్మక్షేత్రములో ప్రవేశించి 'దిగాలుపడి'పోయి, కింకర్తవ్యతా విమూఢుడై త్రొక్కిసలాడినవాడు. రాస్కల్నికోవ్ డాస్టవస్కీ వ్రాసిన Crime and Punishment' అను నవలలోని కథానాయకుడు. ఇతడు విద్యావంతుడేకాని పరమభీరువు. ఒకానొక విచిత్రమైన ఉద్రేకముగల మానసికస్థితిలో ఒక ముసలిదానిని హత్యచేసి తర్వాత తుకతుకఉడికిపోయినవ్యక్తి. కర్మానంతరము ఏ నిర్ణయము చేతగాక ఊగిసలాడు ఆధునిక జీవితములోని వ్యక్తుల మనస్తత్త్వమున కితడు ప్రతినిధి. ఈ విధముగా ముగ్వురు సంశయగ్రస్తులను బైరాగి కావ్యనాయకులుగా గ్రహించి వారిమనస్తత్త్వమును చిత్రించినాడు. 'నూతిలో గొంతుక' లన్న పేరు 'waste Land' లోని 'And voices singing out of empty cisterns and exhausted wells' అన్న వాక్యము ప్రభావముతో రూపుదిద్దుకొన్నది. తూర్పు యూరపులోని మానవ సమాజము నూషరక్షేత్రముగా, పాడుపడినగోయిగా ఇలియట్ చిత్రించినాడు.

'In this decayed hole among the mountains
In the faint moonlight, the grass is singing
Over the tumbled graves, about the chapel
There is the empty chapel, only the wind's home'[1]

అను పంక్తులలో ఆ దుస్థితినే విశదీకరించినాడు. 'Here one can neither stand nor lie nor sit' వంటి పాదములలో ఇలియట్ వెల్లడించిన అభిప్రాయమును బైరాగి పాడునూతిలో పడిపోయి పైకిరాలేక గమ్యముకానక పరితపించు మానవుల దురవస్థను చిత్రించు నెపముతో వెల్లడించినాడు. బైరాగి ఉద్దేశించిన పాడునూయి మరణమునకు, పతనమునకు సంకేతము. అందులో పడిపోయిననరులు 'గర్వాంధతవల్ల అభిశప్తులైన నహుషులు'.[2] వారికి పైకిరావలెనను కాంక్ష ఉన్నది. కాని రాలేరు. చీకటియే వారికి తోడు. 'నూతిలో గొంతుకలు' ప్రారంభమే యీ చీకటి వర్ణనతో జరుగును.

1. Waste Land లో 385-388 పంక్తులు.
2. 'నూతిలో గొంతుకలు': 'తొలిపలుకు' నుండి.

'రాత్రి కాలరాత్రి కరాళకాలరాత్రి
ఆదిమతమస్సులు ఆవరించాయిఆకాశాన్ని[1]
..............................
వల్లకాటిమునివాకిట నాటినమొక్కలు పండవు.
చివరకు చీకటొకటే, చలనంలేదు చీకటికి.'[2]

వల్లకాటిలో నాటినమొక్క లెట్లు వర్ధిల్లవో, పాడువడిననూతిలో పడిపోయిన మానవుల జీవనము పెంపొందదు. వారికి చివరకు మిగులునది నిశ్చలనిబిడాంధకారమే.

'తిరుగుతున్నా, తిరుగుతున్నా
చీకటిలో, చీకటిలో
నేనెరిగిన సుఖమెక్కడ
(ఎరిగిన సుఖమేదుఃఖం).[3]

చీకటిలో తిరిగితిరిగి కడకు నిస్పృహపాలై సుఖమునుగూడ దుఃఖముగా భావించు నైరాశ్య ధోరణిలో పడిపోయినారు మానవులు. చీకటితో ప్రారంభమైన ఈ కావ్యఖండము 'ఆవేదనల అనంతంలో అంతమైన జీవితాల'నుగూర్చి చర్చించును. ఆవేదనాక్రకచముకోతతో గిలగిల తన్నుకొన్న ఈ అభిశప్తులు 'మానవజాతి ఆర్జించిన సిఫిలిస్ నీ వారసత్వం' అన్నంత నైరాశ్యమును ప్రకటింతురు. 'కత్తిరించి కుడుతున్నారు నన్నెవరో చొక్కాలా, శ్వాసనాళంలోంచి శ్వాసత్రాగుతున్నారు హుక్కాలా' అని దారుణమరణవేదనను వెళ్ళగక్కుదురు. వీరి అయోమయమైన జీవితములను చివరికి బైరాగి యిట్లుచిత్రించినాడు.

'ప్రొద్దుపొడవదు, కూచునేందుకు వీలులేదు
ఒంటరిగా ఒంటరిగా మంటల్లోమంటల్లో
పయనిస్తున్నాడు నరుడు
తానెరుగని దిక్కుకేసి.'[4]

ఈ సంపుటిలోని ముగ్గురుసంశయగ్రస్తులలో హామ్లెటుపొందినవేదన కర్మపూర్వమంటిని. తనపినతండ్రి తనతండ్రినిచంపి తనతల్లిని చేపట్టినాడనుసంశయముతో, ఆవేదనతో క్రాగిపోయిన వీరుడితడు. అంతటిద్రోహముచేసిన తనపినతండ్రిని తెగటార్చవలెనని అతని భీష్మప్రతిజ్ఞ. కాని ఆ కర్మచేయుటకుముందు అతనిలో కోటిసంశయతరంగముల్లులేచి ఒకొక్కమాటు భీరుత్వమును కలిగించినవి.

1, 2. 'నూతిలో గొంతుకలు': పుటలు 1, 3.
3, 4. ,, పుటలు 6, 17.

'పిరికిగుండెలో శ్వాసలు
పిరికికనుల అడియాసలు
ఎవ్వరిదో ధీరత్వం
ఎవ్వరిదో భీరుత్వం.[1]

అను పంక్తులలో హామ్లెట్ సందిగ్ధహృదయమును బైరాగి చక్కగా చిత్రించినాడు. కురుక్షేత్రమున ప్రవేశించినపిమ్మట బంధుజాలమును చంపుటకు చేతులురాక తట్టుమిట్టాడిన వీరుడర్జునుడు.

'ఎటుబోతే పూలతోట, ఎటుబోతే వల్లకాడు ?
ఈ ప్రళయముహూర్తంలో ఏమిటినాకర్తవ్యం'

అని దిక్కుతెలియక భగవానునిపై చేతులెత్తినాడర్జునుడు. హామ్లెటు, అర్జునుడు మొదటిదశలో నైరాశ్యకూపములోపడి గిలగిల తన్నుకొందురు. తర్వాత దానినుండి బయటపడి లక్ష్యశిఖరము నధిరోహింతురు. మూడవనాయకుడు రాస్కల్నికోవ్ అట్టివాడుకాడు. పగటికల (day dream) వంటి భ్రాంతియేదో ముసురుకొనిరాగా ఒక ముసలిదానిని హత్యచేసి, తర్వాత గుండెనిబ్బరము లేక గుబులుతో మూర్ఛిల్లిపోయి, తన ప్రియురాలితో

'త్రోవ ఎక్కడ సోనియా !
గహనమానసకాననంలో చిక్కుతీవెలతలపుగుబురులు'[2]

అని ఆందోళనను వెలిపుచ్చినాడు. అతనికి దిక్కులన్నియు వెక్కిరింతలుగా తోచినవి. 'మొయిలు నొసలున నల్లత్రాచులు' స్ఫురించినవి. అతని 'నరనరాలా గూఢచారులు' కదలినట్లనిపించినది. ఈ స్థితిలో కొంతకాలము వఱవఱవణకిపోయి పాపపంకములో మొలచిన పద్మమువంటి 'సోని యా'ను శరణువేడినాడు.

'పిలువు మృతదుర్గతిలోంచి
నవజీవితసద్గతిలోకి
ధ్వాంతంనుంచి కాంతిలోకి
భ్రాంతినుంచి శాంతిలోకి
సోనియా ! త్రోవచూపు'[3]

అని ప్రార్థించినాడు. ఈ కావ్యము ప్రధానముగా 'సంశయకావ్య'మైనను నైరాశ్యమును, నిస్పృహను, ఆందోళనను పుక్కిటబెట్టుకొన్నది. కావున దీనినిగూర్చి ఇంతగా చర్చించితిని.

1, 2, 3. నూతిలో గొంతుకలు : పుటలు 2, 32.

## అతినవ్యకవులపై

### సంప్రదాయప్రభావము :

అతినవ్యకవులెంతగా నియమోల్లంఘనముచేసి తెలుగులో పాశ్చాత్యకవితాధోరణులను దిగుమతిచేసినను పూర్తిగా సంప్రదాయమునుండి విడివడినవారుకారు. వీరిలో ప్రవక్తృస్థానమధిష్ఠించిన శ్రీశ్రీపై గల సంప్రదాయముద్రనుగూర్చి యింతవరకే వివరించితిని. ఇక మిగిలినకవులపై సంప్రదాయ మెంతటిప్రభావముకు వేసినదో వివరింతును. అతినవ్యకవులలో అభ్యుదయరచనలుచేసిన కవులనుగూడ చేర్చి ఈ విషయమును పరిశీలించుచున్నాను.

శిష్ట్లా 'విష్ణుధనువు' ప్రధానముగా సంప్రదాయప్రభావమున్న గేయసంపుటి. దీనిలో పౌరాణికసంప్రదాయము లెంతప్రబలముగా పనిచేసినవో ఇంతవరకే వివరించియుంటిని. 'విగత కౌస్తుభాభరణఅశ్వత్థామశిరమువోలె నిస్తేజమయ్యోనామ స్తకము – నీ ప్రేముడిముద్రలేక' అనియు, 'కృష్ణుడులేని యర్జునుని రథమువిధి నా జీవితమెటకో యీడ్చుచున్నదిగదేప్రియా' యనియు[1] ఇతడు భారతములోని అంశములనుగ్రహించి తన ప్రణయజీవితమున కన్వయించుకొనెను. 'ఇటువెన్నెల అటువెన్నెల ఈశ్వరునికి తలవెన్నెల'[2] అనుపంక్తిలో ఈశ్వరుని చంద్రభూషణత్వము ను ధ్వనింపజేసినాడు. 'నారక్తనాళములో పసరెక్కి పేరుకొన్నది. విపరీతవైతరణి' అన్న భావము నరకము, వైతరణి మున్నగు పౌరాణికప్రతీకల ఆంతర్యము నెరిగినవారికే అలవడును. విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లుగా పురాణగతసర్వకథలు ఇతనికి పోలికలుగా ఉపయోగపడెను.[3]

'వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాలనడుముల్ విరుగదంతా'నని దారుణప్రతిజ్ఞచేసిన పఠాభి సైతము సంప్రదాయప్రభావమునుండి విడివడలేకపోయినాడు. ఇతని 'మృణాళిని' అన్న గేయము అనంతరప్రబంధకవుల చిత్రకవిత్వధోరణిని స్ఫురింపజేయును.

'మృణాళినీ ! నీ చూడ్కులు చంద్రకి
రణాలనీ ! నీతోనుండుగంటలు
క్షణాలనీ ! నీ నవ్వులు తాపహ
రణాలనీ——————.'[4]

గేయములో ఉన్నదనుటతప్ప 'హాయను......బాహాయను......సింహాయను వంటి పద్యములకు దీనికి భేదములేదు. 'ఫిడేలురాగాలదజన్'లో ప్రధానముగా పాశ్చాత్యవాసనలే గుబాళించినను 'బానల్తోడ పోసినట్లుం గురిసేది...వాన' యన్నప్పుడు 'కుంభవృష్టి' స్ఫురించును.

1, 2, 3. విష్ణుధనువు: పుటలు 27, 29, 57.
4. కల్పన : పుట 66.

రంగురంగుచీరలు ధరించిన నాగరకస్త్రీలు 'వికసితలతాకుంజాల్లాగా' కన్పింతురన్న భావముపై సంప్రదాయముద్ర స్పష్టముగా గోచరించును.

అతినవ్యులలో నారాయణబాబు పురాణసంప్రదాయములను, ప్రాచీనకవితాసంప్రదాయములను క్షుణ్ణముగా ఆకళించుకొని తిరుగుబాటుచేసినకవి.

'ఏదో కీచకభావం నా సైరంధ్రీగీతాన్నే
చెరపడితే చూస్తూ ఊరుకునే
నారక్తం ధర్మరాజు'[1]

అను పంక్తులలో భారతములోని విరాటపర్వగాధను స్ఫురింపజేసినాడు.

'యీ ప్రపంచం జీవనవైతరిణి
దాటేందుకు నీకోసం నేచేసిన
గోదానం నాగీతం'[2]

అన్నచోట వైదికమతవిశ్వాసమును ప్రవేశపెట్టినాడు. మరణించినవారి ఆత్మలు నరకమును దాటుటకు, వారికి సంబంధించినవారు బ్రాహ్మణులకు గోదానముచేయుట వైదికసంప్రదాయము. దానినాధారముగాజేసికొని కవి తన కవిత్వముయొక్క సాంఘికప్రయోజనమును ధ్వనింపజేసినాడు. 'గడ్డిపరక'అన్న గేయములో గడ్డిపరక ధనవంతుల దౌర్జన్యముతో అణగారిపోయిన పేదవానికి సంకేతము. పేదవాని కష్టఫలితముగానే ధనవంతునిఆటలు సాగుచున్నవి. కాని అట్టి పేదవానినే ధనికులు పీల్చిపిప్పిచేయుచున్నారు. ఈ విషయమును 'గడ్డిపరక' స్వగతముగా నారాయణబాబు రచించినాడు.

'మాతృవర్గంనాడు, మా అన్న పన్నగమ్ముల రసన
లుత్తరించినమిన్న, నేటికి మీ పితృకార్యం నా
పారణమీద మీచేతిమీద
మరకత అంగుళీయకమ్ము'[3]

అని గడ్డిపరక తనపై నడచువారినుద్దేశించి అనును. ఇందులో గరుత్మంతుడు తనతల్లి దాస్యవిముక్తికై అమృతముతెచ్చి దర్భలపైనుంచుట, ఇంద్రుడు దానిని దొంగిలించుకొనిపోవుట, అమృతభాండముంచబడినదర్భలను పన్నగములునాకగా వానినాలుకలు రెండుగా చీలుటయను పౌరాణికాంశములు నిక్షేపింపబడినవి. పేదవానిని ధనికులెంతచులకనగా చూచినప్పటికి, ఒక్కొక్కప్పుడు వానినే తలపై నిలుపుకొను స్థితివచ్చునని 'పితృకార్యమునాటి మరకత అంగుళీయ

1, 2. నగ్నగీతి : భారతి 1941 సెప్టెంబరు.
3. కల్పన : పుట 64.

కమ్ము' రూపమున వ్యక్తముచేసినాడు. ఇది శ్రాద్ధమునకు సంబంధించిన ఆచారమును సూచించుచున్నది. శ్రాద్ధమునాడు గడ్డిపోచను (దర్భను) అంగుళీయకముగా ధరించుట ప్రసిద్ధము. 'కపాలమోక్షం' అను గేయములో భారతవిప్లవవీరుడు భగత్సింగ్ ఉరితీయబడినపిమ్మట చరితార్థుడైనాడను విషయము వ్యంగ్యముగా సూచింపబడినది. శివుడు కపాలమున భిక్షగొనును. భగత్సింగ్ నిర్యాణానంతరము ఆతనికపాలము 'కపర్దిచేతికిరివ్వునవాలి'నదని, దానిని శివుడు మహానందముతో చుంబించినాడని, దానిని భిక్షాపాత్రగా స్వీకరించినాడని ఈ గేయమున చిత్రించబడినది. భగత్సింగ్ త్యాగజీవితమును 'కపాలమోక్షము'గామలచుట నారాయణబాబుపైగల సంప్రదాయముద్రకు ప్రబలనిదర్శనము.

ఆరుద్ర పురాణసంప్రదాయములను స్వీకరించలేదు. ప్రాచీనకవితాసంప్రదాయములను జీర్ణించుకొని క్రొత్తప్రయోగములను చేసినవాడితడు. 'త్వమేవాహం' పాశ్చాత్యప్రభావముగల కావ్యము. 'వేదనాశకలం' ప్రబంధములలోని వృత్తములను, పదప్రయోగములను దృష్టిలో పెట్టుకొని చేసినరచన. ఇందులోని ప్రాచీనవృత్తములనుగూర్చి యింతవరకే వివరించితిని. ఈ కావ్యము చివరగల

'భూమిపయి దేవతలభూమివిహరించవలె
లేమిగలవారలకు కామితముపంచఁ

— — — — — — —

క్షామములుపోయి ధర క్షేమమువసించవలె
నీమనికి సుందరతకోమలతనించఁ'

వంటి పంక్తులు ప్రాచీననాటకములలోని భరతవాక్యములను స్మరింపజేయును. 'సినీవాలి'లోని 'ఈ ఆవేదనాశిశిరంలో ప్రతిచైతన్యతరువూ ఇంగితజ్ఞానపత్రాలను రాల్చివేసింది'వంటి పంక్తులలో ప్రాచీనకవిసమయములు క్రొత్తరూపమున సాక్షాత్కరించుచున్నవి.

వీరివలెనే, అభ్యుదయకవులలో పేరెన్నికగన్నవారెల్లరు సంప్రదాయమును జీర్ణించుకొన్నవారే. అనిసెట్టివ్రాసిన 'వచ్చానువచ్చాను వ్యాససంతతివాణ్ని' అను గేయము అతనికి సంప్రదాయముపట్లగల గౌరవమునకు చక్కనినిదర్శనము. అడవిబాపిరాజుగారి 'వేయి సంవత్సరాల్ వెనకాలకవినోయ్' యను గేయములోని మకుటమును స్మరింపజేయుచున్నదిది. అనిసెట్టి 'ప్రతిఒకడూ శివుడునేడు' అను గేయమున 'భూతకాలగళముమరిగి కాలకూటమావిరులౌ'నని, 'నేడు' 'ప్రళయరుద్రునిత్రేతాగ్నిశిఖలదహనమౌ'నని, 'భావి'మకుటదీప్తులెగయ ప్రతిఒకడూ శివుడునే'డని విప్లవవీరునికి, శివునికి అభేదముచూపినాడు.[1] పరప్రభుత్వపు సిపాయీలు స్వదేశస్త్రీని బలిగొన్న ఉదంతమును స్మరించుకొనుచు 'ఏ ఇంద్రుని ఇనుపవేళ్ళు చీల్చినవీకుసుమాన్ని'[2] అన్నాడీకవి. దూర్వాసోముని ఐరావతారూఢుడైన యింద్రునికి పారిజాతమాల బహూకరించగా, అతడు

1, 2. అగ్నివీణ : పుటలు 18, 58.

నిర్లక్ష్యముగా తన ఐరావతమస్తకముపై విసరివేసెను. ఐరావతమాసుమదామమును చీల్చి విసరివైచెను. కవి ఈ ప్రాచీనగాథను పై పాదములో ధ్వనింపజేసినాడు. 'ఎవరిపిల్లలోయిమీరు' అను గేయమున అనిసెట్టి పాశ్చాత్యసంప్రదాయమును ప్రవేశపెట్టినాడు. పిల్లలనుద్దేశించి కవి యిట్లనెను.

'భవిష్యత్తునూరించే వెలుగుపోచలామీరు
దివ్యకాంతిమూర్తులైన ఎండిమియాన్లెంతమంది
సంఘపుకుంపటివెల్గించే సైంట్ జోన్లెంతమంది
జీవశాంతిరసార్ద్రిలా జీసస్‌లెందరామీలో.'[1]

ఇందులో సూచింపబడిన ఎండిమియాన్ గ్రీకుయువకుడు; సౌందర్యమూర్తి.

సోమసుందర్ మున్నగు అభ్యుదయకవులు తమ సమరగీతములలో ప్రజావిరోధులగు నైజాముప్రభువువంటివారిని కీచకులుగా, మారీచులుగా, హిరణ్యకశిపులుగా, భస్మాసురులుగా, కౌరవేయులుగా, రావణులుగా, కబంధులుగా చిత్రించినారు. పురాణసంప్రదాయములను ఆధునిక జీవితమునకు మలచుకొను విధానమిది. అట్లే విప్లవవీరులను అభిమన్యులుగా, పరశురాములుగా, విజయులుగా, తాండవశివులుగా, వీరవనితలను ప్రళయకాళికలుగా మలచుకొన్నారు. తెలంగాణములోని జనగామలో జమ్మికొమ్మపైనెక్కిన గెరిల్లావీరుని అభినవార్జునుడుగా సోమసుందర్ సంభావించినాడు.[2] రెంటాల వర్గసంఘర్షణమునకు భాగవతములోని సముద్రమథన వృత్తాంతమును సంకేతముగా తీసుకొన్నాడు.

'క్రోధారుణనేత్రాంచితదీప్తిగ
అంతిమసమరం ! ప్రపంచవిజయం
మానవకోటి కృషిఫలితంగా
అమృతభాండం కదలింది'[3]

అను పంక్తులలో సంఘర్షణఫలితముగా లభించిన సమసమాజమును అమృతభాండముతో పోల్చి చూపినాడు. 'సర్పయాగం' అను గేయములో తానే జనమేజయుడుగా, కౌటిల్యము, ధనమదము, రాచరికమున్నగునవి సమిధలుగా, పీడితులు, తాడితులు, కార్మికులు, కర్షకులు అధ్వర్యులుగా సర్పయాగముచేయుచున్నానని ఎలుగెత్తిచాటినాడు.[4] ఈ యాగముతో 'విశ్వాంతర విషనాగులు'- అనగా పరాన్నభుక్కులు హతముకావలెనని కవియభిలాష. జనమేజయుడు సర్పసంహారమునకై చేసిన యాగవృత్తాంతమును పురస్కరించుకొని రెంటాల ఈ విధముగా మలచుకొన్నాడు. ఇంకొకగేయములో పాలకడలి భరతావనిగా, ఆంధ్రజాతి మంధరగిరిగా, త్యాగచైతన్యములు వాసుకిగా మథనముజరిగినదని, తత్ఫలితముగా ఆంధ్రరాష్ట్రమను అమృతభాండ మవతరించినదని రాష్ట్రావతరణసందర్భమున పాడుకొన్నాడు.[5] రమణారెడ్డి తెలంగాణమును భీమగదాదండ

1. అగ్నివీణ : పుట 82. 2. వజ్రాయుధం : పుట 55.
3. సంఘర్షణ : పుట 17. 4, 5. సర్పయాగం : పుట 1, 58.

ముగా, తెలంగాణా విప్లవనిరోధకశక్తిని దుశ్శాసనుడుగా పోల్చినాడు.[1] గంగినేని గెరిల్లావీరులను అజ్ఞాతవాసముచేయు పాండవులతో ఉపమించినాడు. తెలంగాణములో విప్లవప్రతిరోధకులు జరిపిన దౌర్జన్యకాండను స్మరించుకొనుచు తెలంగాణను తల్లిగాభావించుకొని ఆమె నిట్టూర్పా సించినాడు.

'వేళకానివేళ కళ్ళు
చెమ్మగిలనీయకమ్మా
నిలువున కదలిఇంకిపోతుందో
సూర్యచంద్రులు గతితప్పుతారో.'[2]

కలకంఠి కంటకన్నీరొలికినచో మహోత్పాతములు జరుగునన్న సాంప్రదాయికవిశ్వాసము నీ చరణములో ధ్వనింపజేసినాడు. దాశరథి (కృష్ణమాచార్య)

'దానవులనంతమొందింప నేనుగూడ
రామకృష్ణావతారధారణముసేతు'[3]

నని ప్రజావిరోధులకు వ్యతిరేకముగా ఎలుగెత్తినాడు. విప్లవచైతన్యమునకు రుద్రుని ఫాలనేత్ర వహ్నిని సంకేతముగా గ్రహించినాడు.

'విశ్వరుద్రఫాలంలో విప్లవాక్షివిరిసింది'[4]

వంటి పంక్తులలో ఈ విషయము సువ్యక్తమగుచున్నది, 'రుద్రవీణ'ను ప్రజాచైతన్యమునకు ప్రతినిధిగా గ్రహించినాడు. రైతులను, కూలీలను వీరభద్రులుగా సంబోధించినాడు. 'నయాగరా' కవులలో ఒకరగు ఏల్చూరి ప్రజాశక్తిని 'అన్నపూర్ణస్వర్ణపాత్ర'గా ఉపమించినాడు. రామదాసు ప్రజలనుద్దేశించిప్రాయుచు 'మీ కళ్యాణానికి రణధనుస్సు విరిగిందీరోజున' అన్నాడు. ప్రజలవిజయమును, సీతాస్వయంవరఘట్టమున రాముడు శివధనుస్సును విరిచిన ఉదంతముగా స్ఫురింపజేసినాడు. బ్రతుకొక అశోకవృక్షమని, ప్రపంచమొకలంకానగరమని, తాను సీతనని 'లంకాదహనంఎదురుచూస్తూ' కూర్చున్నానని వ్రాసికొన్నాడు.[5] కుందుర్తి నియంతలను కర్కోటకులతో పోల్చినాడు. రామరాజు నడిపించిన సైన్యమును ప్రజలపాలిటి 'కల్పతరువు'గా భావించినాడు. నారపరెడ్డి 'మనరామాయణం' అను గేయములో రామాయణమునంతటిని ఆధునిక కాలమున ప్రజలు పాలకులకు వ్యతిరేకముగా జరిపెడి సమరగాథగా చిత్రించినాడు.

'ఇరువైచేతుల తెగగొట్టండి
పదిశిరసుల తెగనరకండి
అసురుడు చావకతప్పదు
నరునకు చావన్నదిలేదెప్పుడు'[6]

1. భువనఘోష. 2. ఉదయని : పుట 45. 3. అగ్నిధార : పుట 89.
4. అగ్నిధార : పుట 92. 5. కల్పన : పుట 225. 6. అశ్రుమాల : పుట 88.

అన్న ధోరణిలో రామాయణగాధను క్రొత్తఫక్కిలో అన్వయించినాడు. దుర్గానంద్ కృషికుల చైతన్యమును చిత్రింపనెంచి వారిని 'శివునిజటల్లోచొరబడి సురధుని విడిపించుకొన్న' వారని కీర్తించినాడు.[1] బైరాగి భీతులనుగూర్చివ్రాయుచు 'వృద్ధవిప్రవేషంలో పిరికివడినపరీక్షిత్తును' అన్నాడు.[2] 'అగ్నిదేవుని అజీర్తికి ఆహుతి అవుచున్నది మన నాగరకత' అను పాదములో అగ్ని దేవునికికలిగిన అజీర్ణవ్యాధికి సంబంధించిన పురాణగాధను వ్యంజింపచేసినాడు.[3] 'హంసలేదిట ఎవరుచెపుతా రేవినీళ్ళోవిపాలో' అను పంక్తిలో నీరక్షీరన్యాయమును సూచించినాడు.[4] సోమ సుందర్ 'నల్లగొండనవ్వులు తెలుగుతల్లిపచరించిన ముత్తెపుముగ్గులు' అను గేయఖండమున నవ్వు తెల్లనిదను ప్రాచీనకవిసమయమును తిరుగదోడినాడు.[5] ఈ విధముగా అభ్యుదయకవులు, అతి నవ్యకవులు పురాణసంప్రదాయములను, సాంఘికవిశ్వాసములను, వైదికసంప్రదాయములను, ప్రాచీనకవిసమయములను సరిక్రొత్తరీతిలో సమన్వయించుకొని తమపైగల సాంప్రదాయికతా ముద్రను ప్రకటించిరి.

ఈ ప్రకరణములో ప్రధానమైన అతినవ్యకవితాధోరణులనుగూర్చి వివరముగా ముచ్చటించి తిని. ఇవికాక 'ప్యారడీ', 'అధిక్షేపము' మున్నగు కవితాధోరణులున్నవి. ఇవి అంతగా చెప్ప కొనదగినవికావుకావున వీనిగూర్చి విపులముగా వ్రాయుటలేదు. తెలుగు నవ్యకవులలో 'ప్యారడీ' ప్రక్రియకు శ్రీకారముచుట్టినవారు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు. ఈ మార్గమున నడచిన వారిలో మాచిరాజు దేవీప్రసాద్‌గారు గణనీయులు. మాచిరాజువారన్నట్లుగా 'ప్యారడీ' యనగా సాహిత్యరీత్యాచేసిన వెక్కిరింత.[6] సున్నితమైనహాస్యము, సుకుమారమైన చమత్కారము దీని ముఖ్యగుణములు. 'ప్యారడీ'కవికి స్వీయవ్యక్తిత్వమును విస్మరించుట ప్రధానవిషయము. తాను వేనిని అనుకరింపదలచుకొన్నాడో వానిలో సంపూర్ణముగా లీనమైపోవలసియుండును. ఎడ్మండ్ గాస్ (Edmund Gosse) దీనినిట్లనెను.

'The parodist sinks his own individuality as completely as possible. He lives in the writer whom he parodies, like a soldier crab in a shell carrying his original about in fantastic excursions over which the original has no control. it must enter into the spirit of its model and not merely echo its voice.'[7]

నండూరివారి 'గుండెగొంతుకలోన కొట్లాడుతాదీ కూకుండనీదురా కూసింతసేపు' అన్న ప్రసిద్ధగేయమకుటము ప్యారడీకవిచేత

'గుండుగొంతుకలోన కొట్లాడుతాదీ
గుటకేయనీదురా కూసిన్నిగూడ'

1. అంతర్గోళాలు : పుట 24. 2, 3, 4. నూతిలో గొంతుకలు : 7, 13, 35.
5. వజ్రాయుధం : పుట 72. 6. 'వికటకవిత్వం' : ప్రతిభ : 7 వ సంపుటము.
7. పై వ్యాసములో మాచిరాజువారుదాహరించినారు.

అని 'సోడాబుడ్డి'కి అన్వయించబడినది. అయినను ఈ ప్యారడీకవిత్వము తెలుగులో క్రొత్తకాదు.

'హాయను; గాధినందనమఖారినిశాటమదాపహారిబా
హాయను; గ్రావజీవదపదాంబురుహాయను రాజలోకసిం
హాయను; బోషితార్యనివహాయను; గానలకేగితే నిరీ
హాయను; నిర్వహింపగలనానినుఁబాసి రఘూద్వహాయనుఁ'[1]

అను రామభద్రుని పద్యమునకు

'హాయను; చంచరీకనిచయాంచితకుంచితరోమధామదే
హాయను; దానమానితమహాద్విపపుచ్ఛసముచ్ఛ్రయైకబా
హాయను; కాకఘూకచరణాయుధకుర్కురదూషితాత్మగే
హాయను; చంద్రి! తాళనహహా! యను భీతశిరోరుహాయనుఁ'

అను 'చంద్రరేఖా విలాపము'లోని పద్యము చక్కని ప్యారడీ. అంతవరకెందుకు? ఈ కావ్యము సాంతము వివిధప్రబంధములలోని పద్యరీతులకు, వర్ణనాసంవిధానమునకు ప్యారడీవంటిది. వీరేశలింగంగారి అభాగ్యోపాఖ్యానము ప్రబంధములలోని పద్యరీతులకు చక్కని ప్యారడీ.

జలసూత్రంవారు విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతుల పద్యములకు ప్యారడీలురచించి నవ్యకవిత్వములో క్రొత్తదారి త్రొక్కినారు. మాచిరాజువారు శ్రీశ్రీ 'దేశచరిత్రల'కు వ్రాసిన ప్యారడీ గణనీయమైనది.

'ఏదేశచరిత్రచూచినా ఏమున్నదిగర్వకారణం
నరజాతిచరిత్రసమస్తం పరపీడనపరాయణత్వం'

అన్న శ్రీశ్రీ పంక్తులకు మాచిరాజువారు

'ఏరోడ్డుచరిత్రచూచినా ఏమున్నదిగర్వకారణం
రహదార్లచరిత్రసమస్తం ధూళిధూసరపరిన్యస్తం'[2]

అని ప్యారడీ వ్రాసినారు. మాచిరాజువారి 'సంక్రాంతి కానుకలు', 'మావాహనం', 'నేర్చుకోండి' మున్నగు గేయములు చమత్కారకవిత్వమునకెత్తిన రవ్వలదివ్వెలు. ఇతని 'రాజకీయ బాధితుడు' లోని పద్యములు ప్రణయకవుల వియోగకవిత్వమునకు ప్యారడీలవంటివి. 'సంక్రాంతి కానుకలు'లోని

'ఆమహానసవీధీవిహాయసాన
కార్తికీవక్రశీతాంశుఖండమనగ
కీర్తిపరిధవిల్లువితంతుమూర్తికందె
కెంపురాకట్టువెండికుంకంపుభరిణ'[3]

1. రామాభ్యుదయము : పంచమాశ్వాసము.
2, 3. కల్పన : 'రహదార్లు', 'సంక్రాంతికానుకలు': పుటలు 810, 158.

అను పద్యము కృష్ణశాస్త్రిగారిశైలికి వెక్కిరింతవంటిది. ఇటీవలికాలమున కాళోజీగారు చక్కని ప్యారడీలను వ్రాసినారు.

'రఘుపతిరాఘవరాజారాం
రాంత్రోవకురానేరాం'

వంటి వీరి పంక్తులలో ప్యారడీలక్షణముతోపాటు అధిక్షేపగుణముగూడ కన్పించుచున్నది.

నవ్యకవిత్వములో అధిక్షేపప్రధానమైన రచనలుగూడ కొన్ని వెలువడినవి. శ్రీశ్రీవ్రాసిన 'సిరిసిరిమువ్వ' శతకమిట్టిదే. ఈ అధిక్షేపమార్గము ప్రాచీన శతకములలో నలిగిపోయిన ధోరణియేకావున దీనిని ప్రత్యేకముగా వివరించవలసిన అవసరములేదు. ఆధునికపరిస్థితుల కనుగుణముగా శ్రీశ్రీ 'సిరిసిరిమువ్వ'లో అధిక్షేపమును వినియోగించుకొన్నాడు. సిరిసిరిమువ్వనుండి మచ్చున కొకటిరెండు పద్యములు.

'తెగకుట్టివదలిపెట్టిన
వగణితవై జాగుదోమలశ్వత్థామా
పొగరెక్కినరేక్కెన్గులు
చిగురించినతుమ్మముళ్ళు సిరిసిరిమువ్వా.'[1]

'చీకటిబజారులో (వే
శాకోశంకాదు) లక్షలకొలందిగమ
స్కాకొట్టినవాళ్ళంతా
శ్రీ కాంగ్రెసువాదులౌర సిరిసిరిమువ్వా.'[2]

ఈ పద్యములలో మొదటిదానిలో చక్కనిహాస్యము, రెండవదానిలో చిక్కని అధిక్షేపముఉన్నవి. ఈ ధోరణి కాళోజీచేతిలో పరిపక్వమైనది. అది వారినిగురించి ముచ్చటించునప్పుడు వివరింతును.

## ఈ దశాబ్ది కవితాసమీక్ష : (1950–60)

ఇంతవరకు ఆధునికాంధ్రకవిత్వములోజరిగిన ముఖ్యప్రయోగములగూర్చి వివరముగా చర్చించితిని. ఈ దశాబ్దిలో వెలువడిన కొన్ని కావ్యసంపుటులనుగూడ ఆయా విషయములను చర్చించినప్పుడు పేర్కొంటిని. ఐనను ప్రధానముగా 1954 లోపుగా వెలువడిన కవిత్వమునే స్వీకరించితిని. 1950–54 ల మధ్యవెలువడిన కొన్ని కవితాసంపుటులగూర్చికూడ ఇంతవరకు పరిశీలించుటకు వీలుకాలెదు. అందువలన 1950–60 ల మధ్యవెలువడిన కవిత్వమును పరిశీలించు

1. ఆనందవాణి : 23–8–1947. 2. ఆనందవాణి : 16–8–1947.

నిమిత్తము 'ఈ దశాబ్దికవితాసమీక్ష'యని నామకరణముచేసితిని. ఇక ఈ పదేండ్లలో ప్రచురింపబడిన కవితాస్వరూపము నావిష్కరించుటకు ప్రయత్నింతును.

కడచిన అర్ధశతాబ్దిలోవలె ఈ దశాబ్దిలో ప్రత్యేక కవితావాదములు (Isms) బయల్వెడలలేదు. భావకవిత్వము, అధివాస్తవికకవిత్వమువున్నగు విలక్షణములైనవాదములవలె ఈ దశాబ్దిలో చెప్పుకొనదగిన ప్రయోగములు జరుగలేదు. 1954-55 లవరకు అభ్యుదయకవితోద్యమము సాగినది. భావకవిత్వమేనాడో కనుమరుగైనది. అధివాస్తవికతావాదమువున్నగు విచిత్ర కవితాప్రయోగములు అంకురస్థితిలోనే అణగారిపోయినవి. ఈ మూడింటిని తలదన్నిన సరిక్రొత్త ప్రయోగము ఈ పదేండ్లకాలమున వెల్వడలేదు. అంతమాత్రమున ఈ దశాబ్దిలో కవితారంగము నిర్వీర్యమైనదని అనుకొనగూడదు. నవ్యతాప్రీతి, ప్రయోగకాంక్ష సన్నగిల్లి సంప్రదాయదాస్యమలవడినదని భావించరాదు. భావకవిత్వము, అభ్యుదయకవిత్వము, అధివాస్తవిక కవిత్వము - ఈ మూడు ప్రధానకవితావాదముల ప్రభావము ఈ తరముపై సమష్టిగా పనిచేసినది. అనగా ఈతరము యువకవులు ఏ ఒక్కవాదమునకో ముడిపడక, ఈ వాదత్రయములోని మేలినిగ్గులను వస్తుభావరచనలలో మేళవించుకొని కవితాసృష్టిచేసిరి. ముఖ్యముగా అభ్యుదయకవిత్వములోని వస్తుప్రాధాన్యము, వాస్తవికదృక్పథము; భావకవిత్వములోని శబ్దశిల్పము, భావసౌకుమార్యము; అధివాస్తవికకవితలోని వచనగేయరీతి, వక్రోక్తినైపుణి ఈతరము యువకవులలో చొరబారి సరిక్రొత్తరూపుతో సాక్షాత్కరించినవి. ఈ లక్షణములన్నియు ప్రతి కవిలో వెదకినచో లభింపక పోవచ్చును. వీనిలో అధికాంశములు ఈ దశాబ్దికవులలో కాననగును. స్థూలముగా చూచినచో ఈ దశాబ్దికవిత్వము సమన్వయధోరణిలో నడచినట్లనిపించును. సంప్రదాయమును నిరసించుట గాని, అతినవ్యకవితాప్రయోగములుచేయుటగాని లేక 'క్రొత్తపాతల మేలికలయిక' నవలంబించినట్లు తోచును. అంతేకాక ఈ దశాబ్దికవులు ఒకే ఛందస్సును పట్టుకొని వ్రేలాడక పద్యము, గేయము, వచనగేయము మూడింటిని సమానముగా ఆదరించినారు. ప్రణయమును, ప్రళయమును తుల్యాభిరుచితో కవితావస్తువుగా స్వీకరించినారు. వాస్తవికతను, కాల్పనికతను సమాభినివేశముతో చిత్రించినారు. వీనిని వివరించుటకుముందు ఈ పదేండ్లలోని జాతీయాంతర్జాతీయ పరిస్థితులను, ప్రపంచ కవితారీతులను సంగ్రహముగా చర్చించుట సమంజసమనుకొందును.

బ్రిటన్‌లో ద్వితీయప్రపంచసంగ్రామకాలమునుండియే Neo-Romanticism ప్రారంభమైనది. దీనికి వెర్నన్‌వాట్కిన్స్ (Vernon watkins), జార్జిబార్కర్ (George Barker) ప్రభృతులు ప్రతినిధులు. 1956 లో ప్రచురింపబడిన 'New Lines' అను కవితాసంకలనములో ఈ ధోరణులున్నవి. దీనితర్వాత వెలువడిన 'mavericks' అను కవితాసంకలనమున రొమాంటిసిజము ఛాయలు ప్రస్ఫుటముగా కన్పించినవి. అమెరికాలోని కవిత్వము ప్రాయికముగా సంప్రదాయమునకు సన్నిహితముగానున్నది. ఫ్రెంచికవిత్వముమాత్ర మింకను అధివాస్తవికతా ప్రభావములోనే కొట్టుమిట్టాడుచున్నది. ఇంగ్లండు ఈ రెంటికిమధ్య ఊగిసలాడుచున్నది. కవితారంగములోగాని రాజకీయములోగాని విప్లవపథము ఇంగ్లీషువారికి అంతగా రుచించుటలేదు.

క్రొత్త ప్రయోగములుచేసెడు శక్తిగాని, ఆసక్తిగాని సన్నగిల్లిపోయినది. 1959 లోగూడ ఇలియట్, ఏట్సు, హాప్కిన్‌వంటి వెనుకటితరముకవులే అటు రచయితలలోను, ఇటు పఠితల లోను ప్రబలమైన స్థానము కలిగియున్నారు. ఆధునికాంగ్లకవిత్వమున మరల వ్యక్తిగతానుభూతి ప్రకటనము ఏ విధముగా ప్రధానస్థానమాక్రమించినదో J. M. Cohen అను విమర్శకుడిట్లు స్పష్టపరిచినాడు. 'Poetry no longer aims at making major pronouncements about the nature or fate of the world, but is becoming content again to speak of private experience.'[1]

ఈ ధోరణినిబట్టి చూడగా ఆధునికాంగ్లకవులు బ్లేక్, వర్డ్సువర్తు ప్రభృతి కాల్పనికకవుల సంప్రదాయమువైపే మొగ్గుచూపుచున్నట్లు విదితమగును.

జర్మనీలో ఇటీవలే ఇలియట్, పాల్ఎల్వర్డ్, మైకొవస్కీ, నెరూడారచనలమీద ఆసక్తి పెరిగినది. రష్యాలో సాహిత్యరంగమున జరిగెడు అత్యాధునికప్రయోగములపట్ల మక్కువ మందగించినది. 'నవచైనా'లో 1949 లోపుగా జరిగిన అతినవ్యప్రయోగములకు ఆ తర్వాత పట్టుదప్పినది. ప్రజాసంప్రదాయము (People's tradition) అనుపేర మరల సంప్రదాయము వైపే ప్రయాణము జరిగినది.[2]

ప్రపంచమునందలి ప్రముఖదేశములలోని కవితారంగములలో ప్రయోగకాంక్ష సన్నగిల్లి నట్లు ఈ సంగ్రహసమీక్షవలన విశదమైనదనుకొందును. ఇక అంతర్జాతీయజాతీయపరిస్థితుల నుల్లేఖింతును.

కొంతకాలము కొరియాయుద్ధసమస్య ప్రపంచమంతటికి గుండెమీదికుంపటివలె ప్రజ్వరిల్లి క్రమముగా చల్లారిపోయినది. తొలినాళ్ళలో అమెరికారష్యాలమధ్యనున్న యినుపతెరలు క్రమ ముగా మంచుతెరలుగామారి కడకు మటుమాయమగు సుస్థితికల్గినది. సమరపిపాసతో నాల్కలు సాచుచున్న అగ్రరాజ్యములమధ్య స్వతంత్రభారతదేశము శాంతిదౌత్యము వహించినది. జవహర్ లాల్‌నెహ్రూ ప్రతిపాదించిన 'పంచశీల' సిద్ధాంతము అంతర్జాతీయరాజకీయరంగములోని పరస్పర విద్వేషవిషమును విరిచివేసి, కొంతవరకు డేగలను పావురములను ఒక పంక్తిలో నిలుపగలిగినది. ఆసియాఖండమున బానిసదేశములెన్నో దాస్యశృంఖలలను ఛేదించుకొని స్వరాజ్యమును ప్రక టించినవి. ఆఫ్రికాలో, దక్షిణఅమెరికాలో అనేకదేశములు సామ్రాజ్యవాదమునకు, ధనస్వామ్య మునకు ఎదురుదిరిగి స్వాతంత్ర్యశంఖమును పూరించినవి. ఈజిప్టు, ఇరాకువంటి అరబ్బు

1. 'Poetry of This Age': Page. 252: Pub: 1959.
2. 'Since 1949, anti-traditional forces have been channelled officially into the direction of 'Revolutionary Literature.' There have been increasing signs, however, that the party line is advocating a return to native chinese tradition-what is referred to as the people's tradition.'

—Modern Chinese Literature (వ్యాసము) by yt-TSI MEI.

దేశములలో రాచరికమునకు శాశ్వతసమాధి యేర్పడినది. అమెరికాచేత 'అంటరాదు; ముట్టరాదు' అనబడిన నవచైనాకు ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమీయవలెనని ఆందోళనజరిగినది. రష్యా అమెరికాలు సృష్టించిన ఉపగ్రహములు, జరిపించిన అంతరిక్షయాత్రలు వైజ్ఞానికరంగమున అద్భుతప్రయోగములుగా నిలచిపోయినవి. గాంధీజీ అహింసాసిద్ధాంతము పాశ్చాత్యదేశములలో గూడ పలువురిదృష్టి నాకర్షించినది. బెర్ట్రండ్ రసెల్‌వంటి మహామేధావి అణ్వస్త్రపరీక్షలకు ప్రతికూలముగా, నిరాయుధీకరణమున కనుకూలముగా గాంధీగారుపయోగించిన సత్యాగ్రహాస్త్ర మునే స్వీకరించెనన్నచో మన మహాత్ముని బోధలకుగల విశ్వవ్యాప్తి ఊహించుకొనవచ్చును. అట్లే నెహ్రూగారి తటస్థవిధానము, శాంతిమార్గము, సహజీవనసిద్ధాంతము ఆసియా, ఆఫ్రికా, అరబ్బురాజ్యములు పెక్కింటికి తారకమంత్రములైపోయినవి. ఈ దశాబ్దిలో ప్రధానమైన అంతర్జాతీయపరిస్థితులివి. ఇక భారతదేశములోని స్థితిగతుల నుల్లేఖింతును.[1]

ఈ దశాబ్దిలో భారతదేశముసాధించిన మహత్తరకార్యములలో ఎవరెస్టు శిఖరారోహణము ప్రథమగణ్యమైనది. ఈ విజయము భారతీయులనేకాక సమస్తప్రపంచప్రజలను ఆనందాశ్చర్యము లలో ముంచియెత్తి భారతదేశకీర్తిని శిఖరస్థాయికి గొంపోయినది. రష్యా, అమెరికా, ఫ్రాన్సు, యునైటెడ్ అరబ్‌రిపబ్లిక్, చైనా మున్నగుదేశముల నాయకులు భారతదేశమునకు విచ్చేసి, జాతీయముగా అంతర్జాతీయముగా భారతదేశము నిర్వహించినపాత్రను వేనోళ్ళ శ్లాఘించిరి. అట్లే నెహ్రూగారు జరిపిన అమెరికా, రష్యామున్నగుదేశముల పర్యటన భారతదేశప్రశస్తిని ద్విగుణీ కృతమొనర్చినది. ఈ దశాబ్దిలోనే భారతదేశము ఆర్థికముగా అఖండవిజయమును సాధించ గలిగినది. ప్రారంభదశలోని ఆకలిసమస్య పంచవర్ష ప్రణాళికాప్రథమఘట్టపరిసమాప్తితో అధికాంశము పరిష్కృతమైపోయినది. ద్వితీయప్రణాళిక పూర్తియగుటతో ప్రతివ్యక్తి సగటు ఆదాయము పెరిగినది. భాక్రానంగల్, నాగార్జునసాగరము, మాచ్‌ఖండ్, దామోదర్‌లోయ, తుంగభద్రమున్నగు ప్రాజెక్టులు ప్రారంభింపబడి అధికభాగము పూర్తియైపోయినవి. వీనితోపాటు పరిశోధనాలయములు, కర్మాగారములు, విద్యాలయములు అనేక సంఖ్యలో నిర్మింపబడినవి. సాహిత్యఅకాడమీవంటి సంస్థలు బయలుదేరి ఉత్తమరచనలకు బహుమతులిచ్చి సాహిత్యసేవ చేయసాగినవి. ఇతరదేశకవులు, కళాకారులు మనదేశమునకు వచ్చుటతో, మనదేశమువారు ఇతర దేశములకు పోవుటతో సాంస్కృతికసంబంధములు పటిష్ఠమైపోయినవి. అమెరికాదేశపు కవి షాపిరో, రష్యారచయిత ఇల్యాఎహ్రెన్‌బర్గ్, ఇంగ్లీషుకవులు లూయీమెక్నీస్, స్టీఫెన్‌స్పెండర్ మున్నగువారు ఈ దేశమునకు విచ్చేసి తమరచనలను వినిపించి, ఇక్కడి రచయితల రచనలను విని ఆనందించిపోయిరి. ఈ దశాబ్దిలోని మరియొక చరిత్రాత్మకసంఘటనము బుద్ధజయంత్యుత్స వము. దుర్ముఖిసంవత్సరవైశాఖశుద్ధపూర్ణిమకు (1956 మే నెలకు) బుద్ధుడు జన్మించి ఇరువది యైదువందల సంవత్సరములకాలము జరిగినది. ఈ పంచవింశతిశతాబ్ద్యుత్సవ మఖిలభారతమున

1. ఈ విషయమునుగూర్చి వ్రాయుటలో 'శ్రీవాత్సవ'గారి ఉగాది సాహిత్యసమీక్షలలోని కొన్ని అంశములు చక్కగా ఉపకరించినవి.

మహావైభవముగా జరుపబడినది. ఆంధ్రదేశములోని కవులు, కళాకారులు, ప్రజలు నాగార్జునా చార్యుని మధురస్మృతితో పరవశించిపోయిరి. జగ్గయ్యపేటలో బుద్ధజయంత్యుత్సవము మహోత్సాహముతో నిర్వహింపబడినది.

ఈ దశాబ్దిలోనే ఆంధ్రదేశమున మహత్తరమైన చరిత్రాత్మకసంఘటన జరిగినది. దాదాపు అర్ధశతాబ్దమునుండి ముక్కోటితెలుగులు కలలుగనుచున్న 'విశాలాంధ్రము' ఈ తరములోనే అవతరించినది. ఈ విశాలాంధ్రావతరణము ఒక్కుమ్మడిగా జరుగలేదు 1953 లో పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానముతో ఆంధ్రరాష్ట్ర మేర్పడినది. తర్వాత రెండుసంవత్సరములపాటు ప్రజల, ప్రజానాయకుల నిరంతరాందోళనఫలితముగా 1956 లో 'ఆంధ్రప్రదేశ్' రూపమున విశాలాంధ్రమవతరించినది. ఈ రెండుమూడేండ్లు ఆంధ్రజాతీయజీవనక్షేత్రమున దేశభాషాభిమానము కరళ్ళెత్తిపోయినది. పొట్టిశ్రీరాముల ఆత్మార్పణముతో ఆంధ్రుల త్యాగశీలము జగద్విదితమైనది. ఆంధ్రులు రాష్ట్ర సంపాదనముతో అందలమెక్కుటయేకాక, రాయలసీమ క్షామముతో గోదావరివరదలతో అలమటించినది ఈ దశాబ్దిలోనే. ప్రభుత్వము, ప్రజలు సమష్టిగా నిల్చుండి నిర్విరామముగా కృషిచేయుటతో కరువువలని వరదలవలని ఉపద్రవము అనతికాలములోనే తొలగిపోయి దేశము సంవత్సమేతమై కలకలలాడినది. ఇక ఈ పదేండ్లలో వెలువడిన కవిత్వముయొక్క నవ్యతను పరిశీలింతును.

### కవితాసమీక్ష :

ఈ కాలముకృతులు మూడుమార్గములలో పయనించినవి. (i) సంప్రదాయమార్గము. (ii) నవ్యమార్గము, (iii) సమన్వయమార్గము.

### (i) *సంప్రదాయమార్గము :*

కేవలము సంప్రదాయమార్గమున మహాకావ్యములు రచించినవారిలో విశ్వనాథసత్యనారాయణగారు ప్రథమగణ్యులు. దాదాపు ఇరువదేండ్లక్రింద ప్రారంభింపబడిన వీరి 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం' కావ్యము ఇప్పటికి సుందరకాండమువరకు ప్రచురింపబడినది. వస్తువులో వాల్మీకిని, రచనలో నన్నయతిక్కనలను ఆదర్శముగాగొని, జీవునివేదన, మనోలక్షణనివేదన ప్రధాన గుణములుగా గ్రహించి, 'సకలోహవైభవసనాథముగా' సమస్తశిల్పాభిరామముగా రచించిన మహాకావ్యమిది. విశ్వనాథవారి రామాయణమువలెనే సంప్రదాయక్షుణ్ణమైన ఘంటాపథమున పయనమైన మరియొకకావ్యము మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్రపురాణము.' ప్రాచీనాంధ్రకావ్యములతో సహపంక్తిలో నిల్వగలిగిన ఈ కావ్యము కంకాళములవంటి చారిత్రకాంశములకు కమనీయమూర్తికల్పనము చేసినది. ప్రాచీనకావ్యములలోని పలుపోకడలను, బహువిధ శిల్పభంగులను మేళవించుకొని అవతరించిన ఇంకొక మహాకావ్యము వానమామలై వరదాచార్యుల వారి 'పోతన'. దీనిలోనుండి కొన్ని పద్యములుమాత్రమే వెలుగుచూడగలిగినవి. సంప్రదాయ మార్గమున రచింపబడిన కావ్యములింకనెన్నోయున్నను వానిలో ముఖ్యముగా పేర్కొనదగినవి

మోటూరి వెంకటరావుగారి 'సింహబలి', ఉప్పాడ రాజారావుగారి 'మధూదయము', వెంకట నారాయణరావుగారి 'అశోకచరిత్రము'. వీనిలో వెంకటరావుగారి 'సింహబలి' తానాజీ అను మహారాష్ట్రవీరుని విక్రమగాథ. ఓజోగుణప్రధానముగా 'కడుపులోని కండలు కదలించు' నంతటి ప్రౌఢశిల్పముతో వెలువడిన కావ్యమిది. ఆంధ్రపత్రికవారు నిర్వహించిన కావ్యరచన 'పోటీ'లో ప్రథమముగా గెలుపొందిన వజ్ఝలకాళిదాసుగారి ద్విపదకావ్యము 'ఆంధ్రమహావిష్ణువు' గూడ సంప్రదాయాధ్వమున సాగిన చక్కని రచన. వేముగంటినరసింహాచార్యులు రచించిన 'తిక్కన' యను కావ్యము గుణమునుబట్టి గణనీయమైన కావ్యము. ధారాశుద్ధి, లలితభావ సిద్ధి ఈ కావ్యములోని విశిష్టగుణములు.

ఇట్టికావ్యములుగాక ప్రాచీనకావ్యములలో, పురాణములలో ప్రసిద్ధములైనపాత్రల నాధారముగాజేసికొని ఈతరముకవులు కొన్ని చిన్నకావ్యములు రచించిరి. మహాకావ్యములకు, ఖండకృతులకు మధ్యలోనున్న కావ్యప్రక్రియయిది. ఈ తెగకుచెందిన కావ్యములలో ఎమ్మనూరి చిన వెంకటరెడ్డివ్రాసిన 'మేనక', 'రంభ' అను రెండు కావ్యములు గణనీయములు. భావనలో కించిన్నవ్యతతో ప్రాచీనవస్తువును ప్రతిభామహితముగా నిర్వహించిన కావ్యములివి. స్ఫూర్తిశ్రీ వ్రాసిన 'అహల్య', 'మహాశ్వేత' ఈ తెగకుచెందిన చక్కని కావ్యములు. 'అహల్య'లో వస్తువునకు సంబంధించినమార్పు గమనింపదగినది. ఇంద్రునితో 'చీకటితప్పు' చేసినది అహల్యకాదని, ఆరూపముననున్న శచీదేవియేయని మార్పుచేసి ఈ కవి యుగయుగములుగ అహల్యాపాత్రకు అంటుకొనియున్న కళంకపంకమును తుడిచివేసినాడు. ఈ మార్గములోనే రచింపబడిన మరిరెండు కావ్యములు 'సంపత్కుమార' 'సుప్రసన్న'ల 'ఆనందలహరి', సుప్రసన్న 'దుఃఖయోగిని'[1] అనునవి. 'ఆనందలహరి'లో శబరిగాథ చిత్రింపబడినది. 'దుఃఖయోగిని'లో సీతాదేవి దుఃఖమునే సుఖముగా మలచుకొన్న విషయము ప్రగాఢమైన అనుభూతిశీలముతో వర్ణింపబడినది.

పల్లాదుర్గయ్యగారి 'గంగిరెద్దు' పస్తునవ్యతగల సంప్రదాయసిద్ధమైన కావ్యము. ఒకానొక కాపుదంపతుల ఆవునకు ఒకదూడ పుట్టినది. దానిమూపురమున ఐదవకాలున్నది. రెండు తోకలున్నవి. ఆ దూడయే ఈ కావ్యమున నాయకపదవి నాక్రమించినది. రాళ్ళపల్లివారు పీఠికలో నన్నట్లుగా ఈ కవి 'పశుప్రాణులలోగూడ పరీత-విపరీతజ్ఞానముండక తప్పదన్న రహస్యము'ను గ్రహించి ఈ కావ్యమున ప్రవేశపెట్టినాడు. ఆవునకు దూడకు జరిగిన సంభాషణము ఈ విషయమును ప్రతిపాదించుచున్నది. 'గంగిరెద్దు'ను కావ్యనాయకముగా ఇంతవరకెవరు చిత్రింపలేదు. ఇది చక్కని ప్రయోగము. గంగిరెద్దునెపముతో కవి లోకవృత్తమును ప్రదర్శించినాడు. ఆవు దూడలకుగల అనుబంధమును చిత్రించుటలో మాతాపుత్రుల అనుబంధమును, కాపుదంపతులకు గంగిరెద్దుపైగల మమకారమును సూచించుటలో తలిదండ్రులకు పెంపుడుబిడ్డపైగల మమకారమును ధ్వనింపజేసినాడు. దూడపుట్టినప్పుడు దాని మిక్కిలికాలును, మిక్కిలితోకనుగని పరిహ

1. 'తేజశ్చక్రము' అను పుస్తకములో ముద్రింపబడినది.

సించిన ప్రజలే అది గంగెద్దై రవ్వసెల్లాలు కప్పుకొని వచ్చినపిమ్మట 'ఇటువంటి పశుజన్మమైన మేలు'అని అభినందించుటలో లోకుల అస్థిరచిత్తవృత్తులను సున్నితముగా అధిక్షేపించినాడు. ఈ విధముగా వస్తువులో నవ్యతగలిగినను, ఈ కావ్యము మిగిలిన విషయములలో కేవల సంప్రదాయమార్గమున పయనించినది.

దాశరథి 'మహాబోధి' బుద్ధజయంత్యుత్సవసందర్భమున వెలువడిన పద్యకావ్యము. ఇందులో బుద్ధుని జాతకగాధలు (మహాపద్మజాతకము, చాంపేయజాతకము, ఛదంతజాతకము) రసవత్తరముగా చిత్రింపబడినవి. వస్తుభావరచనలలో ఈ కావ్యము చాలవరకు సంప్రదాయపథములోనే నడచినది.[1]

(ii) నవ్యమార్గము :

1954 వరకు అత్యంత వినూత్నప్రయోగములతో ఆంధ్రకవితాలోకమును సమ్ముగ్ధమొనర్చిన శ్రీశ్రీ, ఆరుద్ర, బైరాగి, పఠాభి, నారాయణబాబు ప్రభృతుల గొంతులు ఆ తరువాతి కాలమున చాలవరకు మూగవడిపోయినవి. ఆరుద్ర 'సినీవాలి', బైరాగి 'నూతిలోగొంతుకలు' ఇటీవలి కాలముననే వెలువడినను వానిలోని కొన్ని గేయములు రచింపబడి దశాబ్ది దాటినది. 'సదసత్సంశయం'వంటి ఒకటిరెండు మౌలికగేయములు, మరికొన్ని పాశ్చాత్యగీతముల కను కృతులు, మధ్యమధ్య ప్రాసక్రీడలు పచరించుటతప్ప శ్రీశ్రీ విశేషించి సాధించినదేమియులేదు. శ్రీశ్రీ 'సదసత్సంశయం'లో[2]

'ఈసృష్టికిఏమర్థం మానవునికిగమ్యమేమి
ఒక సకలాతీతశక్తి ఉన్నట్టాలేనట్టా'

అని తాత్త్వికధోరణిలోపడిపోయి వెంటనే తేరుకొని

'భూతకాలపుసరీసృపాలని
పాతరాతియుగంలోపారెయ్
పాతెయ్నీసందేహాలని

— — — —

నిటారుగానిలబడునేస్తం
హుటాహుటిగా ముందుకిసాగు'

అని ప్రగతిశీలదృక్పథమును ప్రదర్శించినాడు. 'దూరంకరిగిపోతోంది, కాలం మరిగిపోతోంది' అని దేశకాలములలో జరుగుచున్న సత్వరపరిణామములను వ్యక్తమొనర్చినాడు. ఈ అతినవ్య

1. ఈ కావ్యమున వచనంత పదములుగూడ ఉండుట ఈ అభిప్రాయమునకు ఉపస్కారముగానున్నది.
2. 'సదసత్సంశయం' [illegible]

కవులరచనలనొకచో క్రోడీకరించి అబ్బూరిఛాయాదెవిగారు 'కవిత' అనుపేర రెండు సంపుటులుగా ప్రచురించినారు. ఈ రెండు సంపుటులు ప్రధానముగా శ్రీశ్రీ అనుయాయుల రచనలనే ప్రచురించినవి. అబ్బూరి రామకృష్ణరావుగారి గేయములుమాత్రము ఇందుకపవాదములు. అబ్బూరివారు

'మనసులోనియాలాపము మాటలలోమారిపోవు
ఎత్తినకవితాదీపము వత్తికుమిలియారిపోవు'

నని, మొదటి సంపుటిలో వ్రాసిన గేయమున ఆత్మవేదన వ్యక్తపరిచినారు. ఈ సంపుటిలో శ్రీశ్రీ వ్రాసిన 'నగరంలోవృషభం' అను గేయమున్నది. ఆ వృషభము 'యంత్రవిరోధి అహింసావాది శాఖాహారి మద్యనిషేధ ప్రజ్ఞాశాలి'యట. ఇందులోని వృషభము కాంగ్రెసు ప్రభుత్వమునకు ప్రతీకయనిపించును.[1] అజంతా వ్రాసిన 'రోజూచూస్తూనేఉన్నాను కళ్ళవెనక ఉమ్మెత్తచెట్లను......... ఉరితీయబడుతున్న అక్షరాలను'వంటి పంక్తులలో భయపడినవాని మనస్తత్త్వమే ప్రతిబింబించుచున్నది. రాజశేఖర్, రామదాసుల గేయములలో అశాంతిపాలైన మానవాత్మల 'రణగొణ' ధ్వనులున్నవి. వీనిలో భావచిత్రపరంపరలకున్న ప్రాధాన్యము వస్తూన్మీలనమునకు లేదు. రెండవ సంపుటిలో నవకవిత్వముగురించి ఆరుద్ర, వరద (అబ్బూరి వరదరాజేశ్వరరావు)ల కవితారూపసంభాషణ కలదు. 'అనుభవంనినదించడం కవిత్వం, భవాన్నీ భయాన్నీ వచించి చించడం కవిత్వం'అని ఈ సంభాషణలో తేలిన సారాంశము. 'వానకురిసినరాత్రి' అన్న గేయములో బాలగంగాధర్ తిలక్ 'కలలుజారుసవ్వడి'ని చిత్రమైన భావచిత్రములద్వారా అందించినాడు. వచనగేయమునకు మాత్రాచ్ఛందస్సునకు మధ్యవర్తియైన గేయమిది. ఆరుద్ర 'అవనీ' అను గేయమున

'ఒసేఒసే భువీభువీ పసందుగాలేవే
అసయ్యం నీ మొహం అసింటాపోవే'

అన్న ధోరణిలో మాటలను దూదిపింజలవలె ఎగురవేసినాడు. ఇందులోనేఉన్న 'విస్తరిమోస్తరు చంద్రుడు కాస్తయినా అందడ'న్న పంక్తిలో తనకు సహజమైన ఊహావైచిత్ర్యము ప్రదర్శించినాడు. ఈ సంపుటిలో పఠాభి 'యాత్రాఛందస్సు'లు ప్రత్యేకతకలవి. 'సిలోనుపిల్ల', 'స్కాచిపిల్ల', 'హోట్యల', 'చయినాయువతీ' అను శీర్షికలతో ఈ కవి తనకు అజానజమైన శబ్దార్థ వైచిత్ర్యము ప్రదర్శించినాడు. 'స్కాట్లాండుసరోరుహాక్షి ! నీదుసోయగమ్ముసాక్షి కన్నుగుట్టి నిన్నుజూచినంత, త్రాగినట్లుస్కాచి' అన్న ధోరణిలో గిలిగింతలుపెట్టు విచిత్రకవిత్వమిది. ఈ సంపుటిలోనే ప్రచురింపబడిన బైరాగి 'క్రిస్మస్‌గీతాల'లోని వస్తునవ్యత గమనించదగినది. కవి

1. శ్రీశ్రీగారి 'ప్రాసక్రీడల'లో అధికభాగము కాంగ్రెసు ప్రభుత్వమును విమర్శించుట కుద్దేశింపబడినవి. ఈ 'క్రీడ' లంతటితోనే ఆగక విశ్వనాథ, కృష్ణశాస్త్రిమున్నగు సాటికవులగురించి హేళనచేసెడువరకు సాగిపోయినవి.

రాజమూర్తి 'ప్రార్థన' నిరాశాజీవి నిర్వేదమును ప్రకటించిన వచనగేయము. వరదరాజేశ్వరరావు వ్యావహారికభాషలో గేయభ్రాంతికలిగించు కందపద్యములు ప్రకటించినాడు.

విద్వాన్‌విశ్వంగారి 'నా హృదయం'[1] వివిధచ్ఛందస్సులలో పరుగులుదీసిన నవ్యకృతి. ఆత్మాశ్రయరీతిలో నడచినను సాంఘికప్రయోజనము నాశించెడు అభ్యుదయకావ్యమిది. ఈ కావ్యములో కవిహృదయమునజరుగు కల్లోలము వర్ణింపబడినది. కవి, అతని ప్రియురాలు, రాక్షసుడు ఇందులోని పాత్రలు. మానవుని మనస్సులోని సత్త్వరజస్తమోగుణములకు సంకేతము వంటి కావ్యమిది, ప్రియురాలు సత్త్వగుణప్రధానమైనది. రాక్షసుడు రజస్తమోగుణభూయిష్ఠుడు. ఇరువురికి జరిగిన సంగ్రామమే దీనిలోని కథావస్తువు. కవిహృదయము ఈ సంగ్రామమునకు నిలయమైనది. ఫలితము సత్త్వమునకు విజయప్రాప్తి. మానవుని మనస్సులో మంచిచెడ్డలు రెండును ఉండునని 'మంచి'కి 'చెడు'కు ఘర్షణ జరిగినప్పుడు 'చెడు'ను లొంగదీసికొని 'మంచి'కి మకుటము పెట్టుటయే వ్యక్తికర్తవ్యమని ఈ కావ్యమిచ్చు సందేశము. వస్తుభావనవ్యతతోపాటు ఈ కావ్యములోని ఛందోనవ్యత ప్రశంసింపదగినది. ఇందులో వివిధవృత్తములు, వివిధమాత్రాచ్ఛందోగతులు, వచనగేయరీతులు యథేచ్ఛముగా ప్రయోగింపబడినవి. హృదయములోని వివిధదశలకు వివిధచ్ఛందస్సులను ప్రయోగించుట దీనిలోని విశిష్టత.

ఈ పదేండ్లలో శ్రీశ్రీ ఆరుద్ర ప్రభృతులప్పుడప్పుడు అలవోకగా ప్రచురించిన గేయముల నటుంచిచూచినచో నవ్యప్రయోగములకొరకు ఉవ్విళ్లూరు నవకవులిర్వురు ప్రముఖముగా కన్పింతురు. ఒకరు కుందుర్తి ఆంజనేయులు, రెండవవారు గోపాలచక్రవర్తి. కుందుర్తి వచనగేయములో సాధించిన ప్రత్యేకతనుగురించి గతప్రకరణముననే నివేదించితిని. ఇతడీదశాబ్దిలోనే తెలంగాణ, యుగేయుగే అను కావ్యసంపుటులను ప్రచురించి, వచనగేయములో అన్నిరసములను మెప్పించెడి శక్తియున్నదని నిరూపించినాడు. గోపాలచక్రవర్తి 'కలంకలలు' అన్న చిన్న వచనగేయసంపుటిద్వారా గణనీయమైన నవ్యతను చూపినాడు. ఇతడు 'కలంకలల ఘలంఘలలు వినిపించు' మనుటలోనే ఎంతయో క్రొత్తదనమున్నది. అంధకారము 'మహిషాసురుని మీసాలవలె, అనభ్యుదయవాది ఆలోచనలవలె' వ్యాపించినదనుట, 'అంగీలోపల అగ్నిపర్వతంవున్నా, చిరునవ్వు మనసారగానవ్వు సగటుమనిషీ'యనుట ఇతని భావవైచిత్రికి నిదర్శనములు.

జీవితం కరిగిపోయేమంచు
ఉన్నదాంట్లోనే నలుగురికిపంచు'

వంటి పంక్తులువ్రాసి ఈ కవి కవిత్వము జీవితము భిన్నమైనవికావని నిరూపించినాడు. 'రాత్రిదేవి నీలిరంగుచీరకట్టిండి' వంటి పంక్తులలో వాస్తవికతకు భావుకతకు సేతువునిర్మించినాడు. 'కందకావరుడు'వంటి క్రొత్తపదములను సృష్టించినాడు. 'కేకులనుతిన్నమనం కేకులమయ్యాం' అని

1. భారతి : వికృతి ఆశ్వయుజము.

సంస్కృతాంగ్లశబ్దముల సాదృశ్యమును పురస్కరించుకొని చమత్కారము చేసినాడు. ఇందులో మొదటి 'కేకులు' రొట్టెలు. రెండవ 'కేకులు' నెమళ్ళు. మబ్బులనుచూచి నర్తించుటకు నగరమున మయూరములులేవని, హాయిగా కేకులనుతిను నాగరకులే నెమళ్ళవంటివారని దీని తాత్పర్యము. వాస్తవికత, ఆశావాదముమున్నగు లక్ష్యములను వచనగేయమున ఊహావైచిత్ర్యముతో, శబ్ద చమత్కృతితో చిత్రించుట గోపాలచక్రవర్తి ప్రత్యేకత.[1]

ఈ యిరువురుకవులవలెనే ఈ శతాబ్దిలో విలక్షణమైనగొంతుకతో నవ్యగేయములు విని పించిన కవి కాళోజీ. దాదాపు రెండు దశాబ్దులనుండి కాళోజీ తెలంగాణా కవితారంగమున విహ రించుచున్నాడు. పోలీసుచర్యకు పూర్వమే నైజాం 'నాజీశక్తుల నగ్నతాండవము'ను నిష్ఠుర స్వరముతో నిరసించినాడు. అప్పటి ప్రభుత్వపు దమననీతికి సంక్షుబ్ధుడై 'ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు' అని వగచినాడు. నవ్యకవిత్వమున వేమన్నతో తులదూగు మెత్తనిహాస్యమును చిక్కని అధిక్షేపమును అందించిన కవి కాళోజీ. 'ఖర' సంవత్సరము నుద్దేశించి వ్రాయుచు 'గాడిదపేరిటగూడా, ఏడాదొకటుండాలా' అన్న చమత్కారి ఇతడు. లోకము మారినది, కాలము మారినది అన్నమాటలు ఈ కవికి నవ్వుపుట్టించును. 'ఏడుమారినా ఈడుముదిరినా, ఏమి మారినది ఈ లోకంలో' అన్నదీతనిప్రశ్న. మానవస్వభావము నాటికి నేటికి ఏ మాత్రము మార లేదని, చాకిరేవు, శాసనసభ రెండును పోటీపడి కాటులాడుటకు రంగస్థలములుగా నున్నవని ఇతడధిక్షేపించెను. చాదస్తమన్నది ప్రాచీనాచారముల నంటిపెట్టుకొనియుండుటలోనే లేదని, అది ఆధునికులలోగూడ రూపభేదముతో గోచరించునని ఇతడీవిధముగా ఎత్తిపొడిచెను.

'ప్రతిచాదస్తందేవుడే ఏదోఒకవిధంగాగోకుడే
నశ్యంచూస్తేఏవగింపు జర్దారూపంలోగిట్టునుకంపు.'[2]

ఆధునికసమాజములోని ఎగుడుదిగుడుల నెప్పటికప్పుడు నవ్యరీతిలో పరామర్శించి అధిక్షేపించు టలో ఆధునికకవితారంగమున కాళోజీ ప్రత్యేకస్థానము సంపాదించుకొన్నాడు.

(iii) సమన్వయమార్గము :

ఈ దశాబ్ది అంతర్జాతీయజాతీయస్థితిగతులను సమీక్షించుచు సహజీవనవిధానము, శాంతి సామరస్యము ఈ కాలపు ప్రధానలక్ష్యములని పేర్కొంటిని. ఈ పరిస్థితుల ప్రభావము సమకాలీన సాహిత్యరంగముపై ప్రసరించక తప్పలేదు. తత్ఫలితముగా కవిత్వములో అరాజకధోరణులు, నేలవిడిచిచేసిన ప్రయోగములు వెనుకకు మొగ్గినవి. సంప్రదాయముపైపు దృష్టిమరలినది.

1. ఈ లక్షణములు ఆరుద్ర పఠాభి ప్రభృతులలో ఒక రకముగానున్నను వారితర్వాతి యువకవులలో గోపాలచక్రవర్తిలోనే ఇవి విశిష్టత నందుకొన్నవి.
2. నా గొడవ : (గేయసంపుటి).

'గతమనెడు వజ్రంపుగోడల
కట్టడముపై నిట్టనిల్వున
శిరసునెత్తిన స్వర్ణమయగో
పురముసుమ్మీ వర్తమానము'[1]

అను విశ్వాసము అనేకులలో వేరూదినిల్చినది. ముందుచూపు కోల్పోయిన గతదృష్టిగాని, వెనుక చూపును నిరసించిన భవిష్యద్దృష్టిగాని మానవపురోభివృద్ధికి దోహదకారులు కాలేవను అభిప్రాయము బలపడినది. అంతర్జాతీయరంగములోని సహజీవనవిధానము, జాతీయజీవనక్షేత్రమున నెహ్రూగారుచూపిన సమన్వయమార్గము ఈతరముకవులను ప్రబలముగా ఆకర్షించినవి. తత్ఫలితముగా ఈ కాలపు నవకవులు పల్వురు సాహిత్యరంగమున విభిన్నదృక్పథముల సమన్వయ ధోరణిని కాంక్షించిరి. ప్రాచీనసంప్రదాయములను త్రోసివేయకయే నవ్యప్రయోగములు చేయుటకు ప్రయత్నించిరి. 1954 కు ముందు అభ్యుదయకవితామార్గమున రచనలుచేసిన పల్వురు తమ రచనలలో 'కొత్తపాతల మేలుకలయిక'కొరకు పూనుకొనిరి. దాశరథి, సోమసుందర్, విశ్వం, నారాయణరెడ్డి, పుట్టపర్తి, దుర్గానంద్ మున్నగువారీ సమన్వయధోరణి నవలంబించిన వారిలో కొందరు. 'పురోగమనం'వంటి అభ్యుదయగేయములను విరజిమ్మిన పుట్టపర్తి ఈ కాలమున 'మేఘదూతము' వంటి కావ్యములు రచించినాడు. అగ్నిధారలను ప్రవహింపజేసి, రుద్రవీణలను మ్రోగించిన దాశరథి 'మహాబోధి'వంటి చల్లనికృతుల నందించినాడు. విశ్వం 'పెన్నేటిపాట' వంటి కన్నీటిగాథను వినిపించినాడు. తొలినాళ్ళలో శ్రీశ్రీ ప్రభావముతో అభ్యుదయగేయములు రచించిన నారాయణరెడ్డి నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలువంటి చారిత్రకకావ్యములు నిర్మించినాడు. 'అంతర్గోళాలు'వంటి ప్రయోగాత్మకగేయసంపుటి సంతరించిన దుర్గానంద్ 'మధూలిక'వంటి అభ్యుదయప్రబంధము ప్రచురించినాడు. 'వజ్రాయుధం'వంటి సమరగీతికా సంపుటి ప్రకటించిన సోమసుందర్ 'పంచశీల' గీతము లాలపించినాడు. 'సోమసుందరం-సుందరకాండ' అనుపేర వ్యక్తిగతానుభూతులకు కవితారూపమిచ్చినాడు. ఈ విధముగా పూర్వ మేదో ఒక కవితాధోరణికి కట్టువడియున్నకవులు క్రమముగా అన్ని ప్రక్రియల సమన్వయరూపము నవలంబించినారు. ఈ కవుల ఇటీవలి రచనలలో ప్రబంధకవిత్వము, భావకవిత్వము, అభ్యుదయ కవిత్వము మున్నగువాని సమష్టిప్రభావము రూపుదిద్దుకొన్నది. శ్రీశ్రీ, ఆరుద్రవంటివారు మాత్రము తమ పూర్వపరిధులలోనే నిలచిపోయినారు. ఇక ఈ సమన్వయధోరణి నవలంబించిన ముఖ్యుల కవిత్వముగూర్చి సంగ్రహముగా చర్చింతును.

విశ్వం 'పెన్నేటిపాట' ఈ మార్గమున వెలువడిన కావ్యములలో అగ్రపంక్తికి చెందినది. రాయలసీమలోని పెన్నేటిగట్టుననున్న పల్లెల బ్రతుకునీడ ఇందులో ప్రతిబింబించుచున్నది. రాయలసీమ గతవైభవస్మరణముతో కాలయాపనముసేయక కవి 'కోటిగుండెల కంజరి కొట్టు

1. సమదర్శనం : నారాయణరెడ్డి.

కొనుచు' 'నేటి రాయలసీమ కన్నీటిపాట'ను వినిపించినాడు. పెన్నానది యేటికాల్వపాయలలో ప్రతిజలకణమున రైతుల నెత్తుటిచాయలు సమ్మిశితమై విచారము గొల్పునన్నాడు. రాళ్ళపల్లివారు పీఠికలో అన్నట్లుగా ఈ కావ్యమున పీనుగలపెన్న, నక్కబావలు, నాగుబాములు, బొంతగద్దలు, రేణగంపలు, పల్లేరుగాయలు, తుమ్మతోపులుమున్నగు అసంఖ్యాకసామగ్రితో విశ్వం కవితా విరూపాక్షుడు తాండవించినాడు. అంతమాత్రమున దీనిని బీభత్సరసప్రధానమైన కావ్యమను కొనరాదు. రంగడు, గంగమ్మ అను కాపుదంపతుల పరస్పరానురాగము, పరోపకారబుద్ధి, నిష్కల్మషప్రవర్తనము, నిప్పచ్చరముమున్నగు అంశములను కరుణమహితముగా చిత్రించిన కావ్యమిది. రైతుల దైనందినజీవితమును, పడుగుపేకలవంటి వారి ఆశానిరాశలను, రాయలసీమ పలుకుబళ్ళతో రమణీయముగా చిత్రించినాడు కవి. 'ఆ యిల్లాలికరయుగమ్ము, వేయిసంజీవనుల మేళవింపుసుమ్ము' వంటి పంక్తులందు సంప్రదాయమును గర్భీకరించుకొన్న నవ్యత తొంగి చూచుచున్నది. భావానుకూలముగా పద్యగేయచ్ఛందస్సులను సమ్మిశ్రముచేసి వాడుట దీనిలోని ప్రత్యేకత. వీరికి ముందు చిన్నచిన్న ఖండకావ్యములలో పద్యగేయసమాహారమున్నది. సమగ్ర కావ్యములో దీని నవలంబించుటకు ఈ కవియే ప్రథముడు.

వృత్తములలో సరిక్రొత్తవస్తువును సంతరించుకొన్న నవ్యకావ్యము బోయిభీమన్న 'దీప సభ'. దీనిలో దీపము ప్రధానవస్తువు. సృష్ట్యాదినుండి వెలువడిన వివిధదీపములు ఇందలి పాత్రలు. మైనపుదీపము, బండిదీపము, హరికైనులైటు, ఉల్క, వీధిలాంతరు, విద్యుద్దీపము మున్నగునవి విశ్వేశ్వరియగు పరంజ్యోతి అధ్యక్షతలో జరిగిన విశ్వదీపికాపరిషత్తు సమావేశమున తమతమ అనుభవములను విన్నవించుకొనును. దీపములన్నియు ఆ పరంజ్యోతి అంశలేయని ఈ కావ్యములోని సారాంశము. దీపము ప్రధానవస్తువుగా తొలుదొల్త వెలువడిన సమగ్ర కావ్య మిదే. దీపముల స్వానుభవప్రకటనవ్యాజమున కవి మానవజీవితచక్రమునకున్న అన్ని యంచు లను స్పృశించినాడు. సృష్టియెడల మానవునకు కలిగెడు జిజ్ఞాసను ప్రదర్శించినాడు. రచనా విషయమున సంప్రదాయమార్గములోనున్నను వస్తుభావాదుల విషయమున నవ్యతకలిగియున్న కావ్యమిది.

దుర్గానంద్ 'మధూలిక' ఈ మార్గమునసాగిన కావ్యములలో ఎన్నదగినది. కవి దీనిని 'అభ్యుదయ ప్రబంధము' అని పేర్కొన్నాడు. 'కావ్యసమస్య అభ్యుదయం, తీరు ప్రాబంధికం' కావున ఇది అభ్యుదయప్రబంధమని కవి యభిప్రాయము. 'మధూలిక' అనుపేర హిందీలో ఒక కథ ఉన్నది. అందులోని మగధ, కోసల, మధూలిక అను మూడుపేర్లుతప్ప దానికి దీనికి పోలికలేదు. ఈ కావ్యకథకు శిరిపల్లె కేంద్రస్థానము. మధూలిక ఆ యూరి యువతిపేరు. ఒకా నొక యాదృచ్ఛికసంఘటనములో పరదేశరాజకుమారుడు గుఱ్ఱమునుండి జారిపడగా ఆమె సేద దీర్చి రిత్తకౌగిలియిచ్చును. ఆ ప్రాంతపురాజు శిరిపల్లెను యుద్ధమునకు కేంద్రముగా జేయును. శిరిపల్లె ధ్వంసమైపోవును. మధూలిక, గ్రామప్రజలు యుద్ధవ్యతిరేకత ప్రకటింతురు. మధూలిక కపోతితో సందేశముపంపును. పరదేశరాజకుమారుడు పశ్చాత్తప్తుడై ఆమెను కలసికొని యుద్ధ

మును విరమింపజేయును. స్థూలముగా ఈ కావ్యములోని కథయిది. యుద్ధవ్యతిరేకత, సమకాలీనప్రజల సమష్టిచైతన్యప్రకటనము, శాంతివాంఛ దీనిలోని అభ్యుదయ కవితాలక్షణములు. వృత్తరచన, నాయికాదివర్ణనలు, అలంకారప్రాబల్యము ప్రబంధకవితాలక్షణములు. ఈ రెంటిని మేళవించుకొని దుర్గానంద్ ఈ కావ్యమును సృష్టించినాడు. అశ్రుగుచ్ఛము, కత్తివంటి నవ్వు మున్నగు నవ్యప్రయోగములు, పుంశ్చలి, యుయుత్సవంటి ప్రాతవాసన దోపించు పదములు ఇందులోనుండుట గమనింపదగినది. వస్తువు ప్రాతదైనను నవీనభావములు వెల్లడించుట ఈ కావ్యము విశిష్టతయని చెప్పవచ్చును.

'ఈ యనంతవిశ్వము రమణీయమ్మగు పణవిపణి, అహోరాత్రముల్ మెఱసెడి ఆశాజ్యోతుల బరణి'అను విశ్వాసముతో నళినీకుమార్ రచించిన గేయకావ్యము 'పణవిపణి'. ఇందులోని గేయములన్నియు త్ర్యస్రగతిలో సంప్రదాయసిద్ధముగా నడచిపోయినవి. కొన్ని గేయఖండములు దేనికదే సమగ్రముగానున్నను, ప్రధానముగా కవి ఆత్మకథను, 'యాచమహాషి' యను వేశ్యజీవితగాథను వెల్లడించు శీర్షికలే అధికముగా నున్నందున ఇది ముక్తక కావ్యపంక్తిలో చేరదు. జీవితసత్యములను జిజ్ఞాసాప్రధానముగా దర్శించి, వాస్తవికతారమ్యముగా ప్రదర్శించుట దీనిలోని విశిష్టత. నారాయణరెడ్డివ్రాసిన 'సమదర్శనం' ఈ కోవకుచెందిన కావ్యమే. ఐనను కథాస్పర్శ లేకపోవుట, జీవితముపట్ల కవికిగల దృక్పథమును కించిదధిక్షేపాత్మకమైన ధోరణిలో వ్యక్తముచేయుట, గేయఖండములు (Stanzas) దేనికది స్వతంత్రముగా నుండుటమున్నగు లక్షణములనుబట్టి 'సమదర్శనం' ప్రాచీనులన్న ముక్తకకావ్యశ్రేణిలోనికి చేరుననిపించును. మకుటనియమము విస్మరించినచో దీనిని గేయశతకమనవచ్చును.[1]

ఈ దశాబ్దిలో రెండు విశిష్టమైన సందేశకావ్యములు వెలువడినవి. ఒకటి పుట్టపర్తివారి 'మేఘదూతము'; రెండవది మోటూరి వెంకటరావుగారి 'చకోర సందేశము'. మేఘదూతమునకు కాళిదాసు మేఘసందేశమే ఒరవడి. ఒకానొక సామాన్యమానవుడు 'ధనికవాదము'ను గర్హించిన కారణమున 'అధికారుల'చేత నిర్బంధితుడై 'కుటిలకారాగారకఠినదంష్ట్రాక్రకచదళితుడై', ఆ 'బందిఖాన'నుండియే తన ప్రేయసి స్మృతికిరాగా మబ్బుతోచేసికొన్న విన్నపము ఈ కావ్యమున రసవంతముగా చిత్రింపబడినది. ఆంధ్రదేశములోని వివిధప్రాంతములతోపాటు వర్తమానస్థితిగతులు వర్ణింపబడినవి. కాళిదాసు కావ్యములో నాయకుడు యక్షుడుకాగా ఇందులో సామాన్యుడైన 'ఖైదీ' యగుట, సమకాలీనసాంఘికపరిస్థితులను చిత్రించుట దీనిలోని నవ్యత. గేయములో స్వతంత్ర 'సందేశకావ్యము'న్ను నడపిన విశిష్టత దీనికుండనేయున్నది.[2] ఈ కావ్యము సాంతము ఖండగతిలోనే సాగినది. ఈ ఛందస్సు సమపాదములుగాకాక మధ్యమధ్య చక్కని విరుపులతో సాగుటవలన గతివైవిధ్య మేర్పడినది. మచ్చునకొక గేయఖండము.

1. ఇందులో గేయఖండములసంఖ్య దాదాపు 125 ఉండుట ఈ అభిప్రాయమునకు దోహదమిచ్చుచున్నది.
2. 'మొయిలురాయబారము'వంటి గేయకృతులున్నను అవి కాళిదాసున కనుకృతులు మాత్రమే.

'అలసముగవచ్చెవ్యోమానా, యింద్రునకు
అద్దాలమేడచందానా-
తరుణవిరహముగాల్చు దంపతులనూరార్ప
మరుడుపంపిన చిన్నమరులుపడవయుఁబోలె.'

'చకోరసందేశము' కాళిదాసాదుల సందేశకావ్యములవంటిదేయైనను వానికిలేని ఒక విశిష్టతను సంపాదించుకొన్నది. కాళిదాసు మేఘసందేశమునకు 'స్వతంత్ర భావనాకుశలతతోగూడిన ప్రతిరూపమైనకావ్య'మిది. కాళిదాసుకావ్యములోని యక్షునిభార్య, తన భర్తకు చకోరముద్వారా సందేశముపంపుట ఈ కావ్యములోనివస్తువు. ఇది విలోమమార్గము. ఈ మార్గమున ఇంతవరకెవ్వరును రచనచేయలేదు. వెంకటరావుగారి ఊహావిలక్షణతకు, భావనానవ్యతకు ఈ వస్తువే తార్కాణము. సామాన్యవృత్తములతోపాటు గేయగంధముగల ఉత్సాహ కవిరాజవిరాజితములను, దేశీయగేయరీతులను కలిపివాడి ఈ కవి ఛందస్సమన్వయము సాధించినాడు.

ఈ దశాబ్దిలోనే నారాయణరెడ్డి మూడు కథాప్రధానమైన గేయకావ్యములు వెలువరించినాడు. ఒకటి నాగార్జునసాగరం; రెండవది కర్పూరవసంతరాయలు; మూడవది విశ్వనాథనాయడు. నాగార్జునసాగరమున చారిత్రకాంశముల పునాదులపై కల్పితగాధ నిర్మింపబడినది. మతమునకు, ప్రణయమునకు జరిగిన సంఘర్షణ దీనిలోని ప్రధానవస్తువు. 'కర్పూరవసంతరాయలు' కుమారగిరిరెడ్డిలకుమల శృంగారజీవితమును, లకుమత్యాగశీలమును చిత్రించుకావ్యము. విశ్వనాథనాయడు కృష్ణదేవరాయల మన్నినిపేరు. ఆతడు తండ్రినిగూడ నిర్బంధించి రాజభక్తిని ప్రకటించిన చారిత్రకవృత్తాంతము 'విశ్వనాథనాయడు'లోని ప్రధానవస్తువు. నాగార్జునసాగరంలో ప్రసన్నకథాకథనము, కర్పూరవసంతరాయలులో కవితాశిల్పము, విశ్వనాథనాయడులో పాత్రచిత్రణము ప్రధానమైన గుణములు ఈ మూడుకావ్యములును మాత్రాచ్ఛందస్సులో వివిధగతులలో రచింపబడినవి. వీనికిముందు విశ్వనాథ, తల్లావఝ్ఝల ప్రభృతులు గేయకావ్యములు రచింపక పోలేదు. ఐనను కథ, పాత్రల వర్ణనలుమున్నగు కావ్యాంగములను దృష్టిలో పెట్టుకొని, వృత్తవాసనదోపించు గేయచ్ఛందస్సులో రచింపబడిన గేయకథాకావ్యములలో నాగార్జునసాగరమొక ప్రత్యేకసంవిధానమునకు మార్గదర్శకమైనదని విమర్శకులభిప్రాయపడిరి. ఈ కవియే రచించిన 'ఋతుచక్రం' తెలంగాణలోని పల్లెటూళ్ళను, వానిలోని ఋతుపరివర్తనలక్షణములను కథాసూత్రముతో సమన్వయించుకొని వెలువడిన ఆత్మాశ్రయగేయకావ్యము. ఋతువులను తీసుకొని కథచెప్పుట ఈ కావ్యములో జరిపిన నవ్యప్రయోగము. ఋతువర్ణనలు చాలవరకు ప్రాచీనకావ్యముల ధోరణిలోనేయుండుట దీని సంప్రదాయానుసరణమునకు నిదర్శనము. వఝ్ఝల వెంకటేశ్వర్లుగారి 'అమరవీణ' ఈ దశాబ్దిలో వెలువడిన గేయకావ్యములలో గణింపదగినది. దీనికి తెలుగుభాషాసమితివారి బహుమతిలభించినది.[1] ప్రఖ్యాత గ్రీకుకథ 'ఆర్ఫియస్' (Orpheus)

1. ఇది 1954-55 సంవత్సరములో బహుమతి పొందినను 1958 లోనే ప్రచురింపబడినది.

జీవితగాథననుసరించి వ్రాయబడిన కావ్యమిది. 'మాధురి' అను నాయిక, 'రుచిప్రియు'డను నాయకుడు పరస్పరము ప్రేమించుకొని విడిపోయిన విషాదాంతగాథయిది. మాధురి మాయమైపోగా రుచిప్రియుడు గిరిశృంగమునుండి దూకి ఆత్మహత్య చేసికొనును. అతని వీణమాత్రము ఆ 'విజన ద్వీపమున తనంతతా నిరంతరముగ, నాటికి నేటికి మరియేనాటికి' మ్రోగుచుండును. అదే 'అమరవీణ'. మాత్రాచ్ఛందస్సులో అనేకగతులను ప్రయోగించుట ఈ కావ్యములోని వైశిష్ట్యము. అంతేకాక ఆశ్వాసములకు 'శ్రుతు'లను పేరుపెట్టుటలోగూడ కవి నవ్యత చూపినాడు.

ఇంతవరకు సమన్వయమార్గమున ప్రయాణించిన కవిముఖ్యుల కావ్యములనుగూర్చి ఉల్లేఖించితిని. కావ్యరూపమునగాక వివిధఖండకావ్యములను రచించి వానిని సంపుటములుగా ప్రచురించిన కవు లనేకులున్నారు. స్థలాతిరేకభీతివలన వానినిగూర్చి అతిసంగ్రహముగా ముచ్చటింతును.

ఈ దశాబ్ది ఖండకావ్య రచయితలలో దాశరథి మకుటాయమానమైన రచనలు చేసినాడు. మహాంధ్రోదయం, పునర్నవం, అమృతాభిషేకం అను మూడు సంపుటముల రూపమున ఇతని పద్యగేయకృతులు ప్రకటింపబడినవి. ఈ మూడింటిలో 'మహాంధ్రోదయం' ప్రతిపర్వ రసోదయముగల కావ్యేక్షువు. ముఖ్యముగా మంజీర, గుండెలోదీపాలు, రాగదీపము, శిల్పి అను ఖండికలు చిక్కని కవితాశక్తిని పొదుగుకొన్న రచనలు. 'శిల్పి' ఖండికలో శిల్పినిగనగానే కొండలు 'రమణీకుచపాళికలై, కపోలమోహనఫలకమ్ములై, భ్రుకుటులై, కుటిలాలకజాలమై, సురాంగనలయి రూపుదిద్దుకొన్న'వట. అప్పుడు అపరబ్రహ్మయైన శిల్పి 'ఉలితో అమృతమ్ము చల్లి జీవనములు పోసిపోవు'నట. 'వాక్యంరసాత్మకం కావ్యమ్' అన్న లాక్షణికసూక్తిని సార్థకముచేయు పద్యమిది. 'మంజీర' ఖండికలో మంజీరానదిని 'గజ్జెలరవళి'గా 'కజ్జలబాష్పధార'గా వర్ణించుట భావనాశక్తికి పతాకవంటిది. బాష్పధారయనుటతో ప్రవాహరూపమును, గజ్జెలరవళి యనుటతో ఆ ప్రవాహధ్వనిని వ్యంజింపజేసినాడు కవి. 'పునర్నవం' సంపుటిలోని 'అచుంబితం' అను గేయములో ఈ కవి 'మాట్లాడని మల్లెమొగ్గమాదిరిగా నడచిరా' అన్నాడు. మల్లెమొగ్గ మాదిరిగా నడచుటయన్నది వినూత్నమైన ఊహ. ఇట్లే ఈ మూడు సంపుటులలోని ఖండకృతులు చక్కని భావనాశక్తికి, చతురరచనానైపుణికి తార్కాణలుగా నున్నవి.

నార్ల వెంకటేశ్వరరావుగారి 'జగన్నాటకం' వస్తువైవిధ్యముగల ఖండకావ్యసంపుటి. 'వెన్నెల' అన్న గేయములో వీరు వెన్నెలను 'మానవుని మంత్రించు వెన్నెల'యని ఉల్లేఖించిరి. ఈ సంపుటిలోగల 'పిచ్చివూహలు' వంటివి వస్తునవ్యతగల గేయములు. 'ఇల్లాలు'ను 'మల్లెపూల గోపుర' మనుట సులలితమైన ఊహకు కొలమానముగా తీసుకొనవచ్చును. వీరి 'నార్లవారిమాట' వేమన్న ధోరణిలో రచింపబడిన ఆధునికశతకము. సమకాలీనసమస్యలను సూటిగా 'ఘాటు'గా వ్యక్తపరిచిన రచనయిది.

దేవులపల్లి రామానుజరావుగారు వెనుక తాము రచించిన ఖండకావ్యములను ఈ దశాబ్ది ప్రారంభములోనే 'పచ్చతోరణము' అనుపేర వెలయించిరి. రాయప్రోలువారి ఛాయలలో నడచిన

వీరి కవితలో ప్రకృతిరామణీయకము, పదతికామనీయకము సరళరమ్యముగా చిత్రితమైనవి. 'శ్రీమన్నకావ్యకుసుమాల'లో ప్రకృతివర్ణనలతోపాటు, తత్త్వజిజ్ఞాస, ప్రణయభావన ప్రధానస్థాన మాక్రమించినవి. ఉందేలమాలకొండారెడ్డి 'కాంతిచక్రాలు'లో వస్తువైచిత్రి ప్రత్యేకత. కోడిని ముత్తైదువుగా, రేడియోను వలపులాడిగా, గాజులను కాంతిచక్రాలుగా, రైలును ధూమవేణిగా వర్ణించి ఈ కవి ఊహాచమత్కారము ప్రదర్శించినాడు. శ్రీనివాససోదరుల 'ఉపహారము'గూడ వస్తువైవిధ్యము, వైచిత్ర్యముగల ఖండకవితాసంపుటియే. దీనిలో అధిక్షేపము ప్రధానాకర్షణ. దీనిలోని స్మృతిగీతములు మంచిపాకములో పడినవి. 'రజని' రెండుమూడు దశాబ్దులుగా అసంఖ్యాకముగా వెలయించుచున్న లలితమధురగీతములు ఈ దశాబ్దిలోనే 'శతపత్రసుందరి'రూపమున సంపుటీకృతమై తెలుగుభాషాసమితి బహుమతినందుకొన్నవి. ఈ సంపుటిలోని 'పసిడివెలుంగుల తళతళలు'వంటి గేయము లేనాడో ఆబాలగోపాలము నాకర్షించినవి. గానయోగ్యములైన ఇట్టి గీతములతోపాటు వచనగేయములు, రవీంద్రాదుల అనుకృతులుగూడ దీనిలో చేర్చబడినవి.

వానమామలై వరదాచార్యులుగారి పద్యగేయములలోనుండి కొన్ని 'ఆహ్వానము' అనుపేర సంపుటిగా వెలువడినవి. దీనిలో ప్రధానముగా గాంధీస్మృతిగీతములున్నవి. ఇవికాక పంచశీల, బుద్ధగీతి మున్నగునవి భావస్నాతములైన గీతములు. వరదాచార్యుల గేయరచనాపాటవమునకు ఈ సంపుటి దిక్సూచి. పొట్లపల్లి రామారావుగారు రచించిన గేయములు 'ఆత్మవేదన' అను సంపుటిగా ప్రచురింపబడినవి. ఇందులోని 'కాలిబాట' అను గేయము వస్తుభావనవ్యతకు ఉత్తమ నిదర్శనము. యస్వీజోగారావు 'పంచకళ్యాణి' పద్య, గేయ, వచనగేయములలో సమధాటితో కదనుద్రొక్కిన ఖండకవితాసంపుటి. సాంప్రదాయికత, నవ్యత పరస్పరము కరచాలనము చేసుకొన్న రంగస్థలమిది. 'ఊహాప్రహేళిక' అను ప్రాచీనప్రక్రియను పునరుద్ధరించిన కవి ఇతడు. జ్ఞానానందకవి జాషువాకు అచ్చమైన వారసుడై దేశభక్తిభరితమైన ప్రబోధాత్మకమైన పద్యము లనేకములు రచించినాడు. ఇతని సంపుటులలో పర్జన్యము, పాంచజన్యము మున్నగునవి పేర్కొనదగినవి. పరుగులుదీయు పద్యశైలి, పట్టువడని మహావేశము ఇతని ప్రత్యేకగుణములు. గట్టిపల్లి సత్యనారాయణ పద్యగేయములను సమప్రమాణమునరచించు యువకవి. ఇతని 'కలస్వనం' లలితమార్గములో నడచిన కవితాసంపుటి. బాపురెడ్డి 'చైతన్యరేఖలు' మధురభావనాశక్తి, మసృణపదయుక్తి సంగమించిన కావ్యసంపుటి. పేర్వారం జగన్నాథం 'సాగరసంగీతం' సాధకుని సత్ప్రయత్నమునకు చక్కని నిదర్శనము. ఈ దశాబ్దికిచెందిన ఉదీయమాననవకవులలో ఎక్కువ సంపుటులను ప్రచురించినకవి మాదిరాజు రంగారావు. కేవలము వచనగేయమార్గములోనే పయనించుచు అనతికాలముననే కిర్మీరం, మేల్కొన్న ఆకాశం, మనోభూమికలు, అద్దంలో నీడలు అను నాలుగు చిన్నచిన్న సంపుటులను వెలువరించినాడితడు. కవయిత్రులలో శ్రీదేవి 'మధుకలశం', ఆదిలక్ష్మి 'పంచామృతము' వసంతాదేవి 'సమాగమము' పేర్కొనదగిన ఖండకావ్య సంపుటులు. ఈతరము కవులలో దాశరథి, సోమసుందర్, నారాయణరెడ్డి, నారపరెడ్డి, రెంటాల, దుర్గయ్య, రమణారెడ్డి, కవిరాజమూర్తి, చిల్లర భావనారాయణరావు, ఉత్పల సత్య

నారాయణాచార్య ప్రభృతులు తమ ఖండకృతులను, కృతులను పుస్తకరూపమున ప్రకటించినారు. పుస్తకరూపమున వెలువడని రచన లనేకములున్నవి. వివిధపత్రికలలో పద్యములను, గేయములను, వచనగేయములను ప్రచురించుచున్న యువకవులనేకులున్నారు. బొడ్డుబాపిరాజు, గణపతిశాస్త్రి, కౌనకళ్ళ, కరుణశ్రీ మున్నగు నడిమితరముకవులు, శశాంక, అమరేంద్ర, మసూనా, లసూనా, పి. యస్ ఆర్. ఆంజనేయశాస్త్రి, అరిపిరాలవిశ్వం, ముకురాల రామిరెడ్డి, మురళీధర్, బాపురెడ్డి, కనపర్తి మున్నగు ఈ శతాబ్ది కవులెందరో ఇటీవల చక్కని రచనలను ప్రచురించినారు. ఇటీవలి కవులగూర్చి నేను విపులముగా పరిశీలించకపోవుటకు రెండు కారణములున్నవి. ఒకటి: ఈ పరిశోధనవ్యాసపరిధికి వీరిగురించినచర్చ దూరముగానుండుట. రెండవది: ఇప్పుడిప్పుడే వెలువడుచున్న రచనలనుగూర్చి అప్పుడే అభిప్రాయము వెలిపుచ్చుట సమంజసమౌనోకాదోయను సంశయముండుట. కొన్ని యేండ్లపాటుగా వీరిరచనలు నిలువద్రొక్కుకొనియున్నచో వాని విలువలను కట్టుటలో సౌకర్యమున్నది; సార్థక్యమున్నది. ఈ రెండు కారణములవలన నేను ఇటీవలి కవుల రచనలనుగూర్చి విపులపరిశీలనము చేయలేదు.

ఏదియెట్లున్నను ఎవరికివారు అరలు గట్టుకొని ప్రయోగములుచేయు మన స్తత్త్వము ఈ దశాబ్దిలో చాలవరకంతరించి, అందరొక వేదికమీద ఆసీనులై విభిన్నరీతులలో రచనలుచేసి మెప్పించుట ప్రత్యేకించి పేర్కొనదగినది. ఈ లక్షణమునుబట్టి చూచినచో ఈ కాలముకవిత్వము 'సమన్వయవాదము'నకు చెందినదేమో యనిపించును. ఐనను అప్పుడే ఈ ధోరణికి నామకరణము చేయుట సమంజసముకాదు. గంటిజోగి సోమయాజిగారివంటి భాషాశాస్త్రజ్ఞులు, పండితులు 'కొత్తలాంతర్లు' వంటి నవ్యగేయమురచించి ప్రచురించుటయన్నది ఇది సమన్వయధోరణికి చెందిన యుగమన్న అభిప్రాయమునే బలపరుచుచున్నది. సంప్రదాయముతోపాటు నిత్యనవ్యత యెంత అవసరమైనదో సోమయాజిగారిగేయ మెలుగెత్తి చాటుచున్నది. క్రొత్తపాతల సముచిత సమ్మేళనమే సదా వాంఛనీయముకదా! ప్రాతను బొత్తిగా త్రోసిరాజనిన నవ్యప్రయోగము గాలి ప్రోగుచేయుటవంటిదే. సంప్రదాయపోషణముపేర గతమునకే అంకితమైపోయినచో గణన కెక్కుట సాధ్యముకాదు. సంప్రదాయములోని మేలినిగ్గునుదీసి ప్రయోగగుణముతో మేళవించుకొన్నప్పుడే ప్రతిభ రాణించుటకు వీలుండును. ఈ పరిశోధనవ్యాసములో నేను నిరూపించుటకు ప్రయత్నించినదిదే. ఆ ప్రయత్నమును నేను కొంతవరకైన జయప్రదముగా నిర్వహించినచో కృతార్థుడను.

> 'క్రొత్తనీటిని జేర్చుకొని తర
> గెత్తునదివలె ఎట్టిజాతియు
> ముందుకేగినయంతకాలము
> మూడుపూవులు, ఆరుకాయలు.'[1]

1. నా 'సమదర్శనం' నుండి.

# అనుబంధము - 1

*చతుర్విధకందము

క. సుజ్ఞాన యోగతత్త్వవి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో
నజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁ గొల్తు రచలభావనదవులన్

1. భవబంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁబొందక ప్రాజ్ఞుల్
శివుగొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞానయోగతత్త్వవిధిజ్ఞుల్

2. అజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావనదవులన్
సుజ్ఞానయోగతత్త్వవి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచుభువిలో

3. శివుగొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞానయోగతత్త్వవిధిజ్ఞుల్
భవబంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్

4. సుజ్ఞానయోగతత్త్వవి
ధిజ్ఞుల్ భవబంధనములఁద్రెంచుచు భువిలో
నజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁగొల్తు రచలభావనదవులన్

నన్నెచోడ మహాకవి రచననుసరించి, పాల్కురికి సోమనాథుడు అనుభవసారమునను, ప్రౌఢ కవి మల్లన రుక్మాంగద చరిత్రమునందును ఇట్టి రచనలు చేసినారు. జక్కనపూర్వుడు పెద్దయామాత్యుడును ఇట్టి రచనలు చేసినట్లు తెలియుచున్నది

---

*ఈ కందగ్రంథిని విప్పుటలో తోడ్పడిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారికి కృతజ్ఞుడను.

# అనుబంధము - 2

## బంగారము

లక్షణము -

ఇంద్రగణంబులాఱినగణంబులు రెండు నిందుగణంబొకండిందు నుండు -
నీక్షింపుడీ
నాల్గుపాదములిట్లు నల్వొందఁ దేటియు తేటిబోటియు కూడ వాటముగను
బాటిలెడున్
బంగారమనగను బద్యంబు హృద్యంబు సీసమేల సువర్ణసిద్ధి గలుగ -
శ్రీమించగాఁ
బ్రణవగణావళి పరగుటఁ బ్రతిపాదమందిది ప్రణవవిఖ్యాతిగాంచు -
నారయుడీ

షడ్గణాళి పాదసరణి నొప్పుటను బ్రా - సాదమొఁగా
సకల సౌమనస్యసారంబు గ్రహియింపఁ - జాలులీలన్
గాంచదేటిబోటిగా నయ్యెనిది వెలి - గారమనన్
గదిసి చాలఁ గ్రాలగాఁ జేయునొరబం - గారమున్ శ్రీ॥

## లక్ష్యము

కాలుసేతులు పద్మఘనతను వహియింప మొగము మహాపద్మముగను
దనర - ముఖ్యముగా
గొంతు శంఖంబుగాఁ గొఱలంగఁ బలుజాడ కుందంబుగాఁ గడు
నందమొందఁ - బొందికగా
గొప్పుఁ జూడ్కియు నీలగురుతను దెలుపంగఁ గ్రుస్సిన కౌను ముకుంద
పదము - గొనబగుగా
మీఁగాళ్ళు కచ్ఛపరాగంబుఁ జూపంగఁ బిక్కలు మకర సువిభ్రమ
మమును - వెలయును గా

రూపుగొనములు వరరుచినిఁ గాంచంగను - రూఢిగనే
నవనిధులును నొక్క నవరూపమూనెనా - నల్వగనే
రత్నవస్త్రభూషరత్న రత్నమనంగ - రంగుగనే
విద్యుదాభయద్ది వెలదుక వెలుగొందెఁ - బేర్కొననే.

(బిల్వేశ్వరీయము - ద్వితీయ బింబము - 162)

## వెండి

లక్షణము -

వరుసఁగూడ నాల్గు బంగారు పాదముల్ - పైనెసంగ
నలరఁ దేటగీతి యాటవెలది - యదగు వెండి
సీసపాదములును జెలగ నాల్గాపయి - జేరినన
య్యాటబోటి దేటిదేటిబోటి - యగును వెండి.

లక్ష్యము

ప్రప్రథమంబునం బల్లవశ్రీలను బల్లవశ్రీలను బరగ నునిచి -
పతిహితగా
సౌకుమార్యముఁ బత్రసౌకుమార్యంబున జాణతనంబున
జతనుపఱచి - సాధ్వియకా
చిటులు గందపుఁబొడి చెల్వొందు పూవుల వలపున వలపును
వలనుపఱిచి - భవనుతగా
సంసారఫలలక్ష్మి సవరించు కుచరుచి సంసారఫలలక్ష్మి
జానుపఱిచి - శంకరిగా

నంకుశంబును ముండుల నందఁ గొలిపి
పాశమును గొమ్మలందును బాదుకొలిపి
చంద్రమౌళి యిదేయనఁ జంద్రమౌళి
శ్రీకుజంబయ్యె శివప్రియ శివప్రియముగ.

(బిల్వేశ్వరీయము - ద్వితీయబింబము - 180)

# అనుబంధము - 3

## కాసులు

పాదనియతిలేని రచనయిది. అంతమాత్రముచేత దీనిలో ఛందోభంగము జరిగినదని కొందరు విమర్శించినది వాస్తవముకాదు. ఈ క్రింద చేయబడిన పాదవిభాగమునుబట్టి చూచినచొ అది స్పష్టమగును.

మనలకీ పోరాట మిప్పుడు
దేనిగూరిచి కలిగె చెపుమా,
మరచితిని; నవ్వేదవదేలను !
యేమికారణమైన పోనీ;
వినుము...ధనములు రెండు తెరగులు;
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ;
మదియు నిద యొక్కెడను కలుగుట
యరుదు; సతులకు వేడతగినది
యెద్దియో ?
మనసులో నీకుండు ధనమన
నొండుకలదే పసిడిగాకని.
ప్రాజ్ఞులకె కనికట్టు కనకము;
చపలచిత్తల కన్నుచెదరుట
చిత్రమా !
తీవలకు తలిరుల తెరంగున,
కాంచనము సింగారమందురు
లలనలకు కానిమ్ము;
గాని, కమ్మని తావిగ్రమ్మెడి
పుష్పనిచయము ప్రేమకా ? అది
లేక మంకెన కెంపు, కాంతల
యందము.
ప్రేమకొరుకుకు తిందురా !

యెట్టిదది ? నావలను కలదో
లేదొ; యను నౌకవింత చూపును
చూ*
చెదవు - బంగరు మిసిమిమేనికి
పసపు నలదితి;
కురుల నలరులనూనె నించితి;
కాటుకకు మెరుగిడితి చూడ్కికి;
విడెము వింత హొరంగు గూర్చెను
వాతెరకు; పలువరుస వెన్నెల
లలమె;
దానదానను, ముదువు పెనగొనె
నేర్చిమెరసితిరూపు;
ప్రేమపెంచక పెరుగునే ?
ప్రేమ - పెన్నిధిగాని, యింటను
నేర్పరీకళ, ఒజ్జలెవ్వరు
లేరు. శాస్త్రములిందుగూరిచి
తాల్చెమౌనము - నేను నేర్చితి
భాగ్యవశమున, కవులకృపగని.
హృదయమెల్లను నించినాదను
ప్రేమయను రతనాల - కొమ్మ !
తొడవులుగ నవిమేనదాల్చుట
యెటులనంటివో† తాల్చితదె, నా
కంటచూడుము : సతులసౌరను
కమలవనముకు పతులప్రేమయె
వేవెలుగు;
ప్రేమకలుగక బ్రతుకు చీకటి.

---

* ఈ విరుపొక్కడే అసంబద్ధమైనది. ఇక్కడ అగిలాగనిదే వీలులేదు. (ఛందస్సు దృష్ట్యా).
† ఒకమాత్ర ఎక్కువగానున్నది.

నా
నేర్పుకొలదిది
(ప్రేమవిద్దెకు వోనమాలివి,)
యెదను నిల్పిన మేలు చేకురు
మరులుప్రేమని మదిదలంచకు;
మరులు మరలును వయసుతోడనె.
మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము.
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును.
ప్రేమనిలిపిన ప్రేమనిలుచును.
ఇంతియె —
కాసు వీసము నిల్వనొల్లక
కవిత పన్నితినని తలంపకు;
కాసులివె; నీ కంఠసీమను
జేరి బంగరువన్నె గాంచుత;
మగడు వేల్పన పాతమాటది
ప్రాణమిత్రుడ నీకు నీ
నెనరు కలుగకయున్న, పేదను;
కలిగినను నాపదవి వేల్పుల
రేనికెక్కడ ?

# అనుబంధము - 4

## 'ఫూల్ కీచాహ్'

రచన : మాఖన్‌లాల్ చతుర్వేది

'చాహ్ నహీ సురబాలాకే గహనోఁమే గూంథా జావూఁ
చాహ్ నహీ ప్రేమీమాలామే బింధ్‌ప్యారీకో లల్చావూఁ
చాహ్ నహీ సమ్రాటోఁకే శవ్‌పర్ హేహరిడాలాజావూఁ
చాహ్ నహీ దేవోఁకే సర్‌పర్ చఢూఁ భాగ్యపర్ ఇఠ్లావూఁ

ముఝే తోడ్‌లేనా బనమాలీ
ఉన్ పథ్‌పర్ దేనా తుం ఫేంక్
మాతృభూమి పర్ శీర్ష్ చెఢానే
జిన్ పథ్ జాయేఁ వీర్ అనేక్.''

# ముఖ్య పదానుక్రమణిక

---



# ఉపకరించిన గ్రంథములు:


1. నవ్యాంధ్రసాహిత్యవీధులు : కురుగంటి సీతారామయ్య : పిల్లలమర్రి హనుమంతరావు
2. కవిత్వతత్త్వవిచారము : కట్టమంచి రామలింగారెడ్డి
3. కవికోకిలగ్రంథావళి (వ్యాసములు) : దువ్వూరి రామిరెడ్డి
4. కావ్యజగత్తు : జి. వి. కృష్ణరావు
5. ఆంధ్రరచయితలు : మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
6. ఆంధ్రభాషాచరిత్రము : గంటి జోగి సోమయాజి
7. ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము : ఖండవల్లి లక్ష్మీరంజనం
8. ఆంధ్రవాఙ్మయచరిత్రము : దివాకర్ల వేంకటావధాని
9. దక్షిణభాషాసారస్వతములు; దేశి : కోరాడ రామకృష్ణయ్య
10. పదునారవశతాబ్దిలో ప్రబంధవికాసము (వ్రాతప్రతి) : పల్లా దుర్గయ్య
11. తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషుప్రభావము (వ్రాతప్రతి : ఆధునికయుగమను ప్రకరణముమాత్రము) : కొత్తపల్లి వీరభద్రరావు
12. గౌతమవ్యాసములు : పింగళి లక్ష్మీకాంతం
13. వ్యాసావళి : గిడుగు రామమూర్తిపంతులు
14. గీతాప్రవచనములు : వినోబా భావే
15. వాత్స్యాయనకామసూత్రములు : వివరణకర్త : పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి
16. భారతీయతత్త్వశాస్త్రము : రాధాకృష్ణ—ఆంగ్లమాతృకకు బులుసు వేంకటేశ్వర్లు అనువాదము
17. బ్రిటిష్‌రాజ్యతంత్రయుగము : దిగవల్లివేంకటశివరావు
18. అప్పకవీయము : అప్పకవి
19. నాట్యశాస్త్రము : భరతుడు
20. కావ్యప్రకాశము : మమ్మటుడు
21. కావ్యాదర్శము : దండి

22. ధ్వన్యాలోకము : ఆనందవర్ధనుడు
23. కావ్యాలంకారసూత్రవృత్తి : వామనుడు
24. సాహిత్యదర్పణము : విశ్వనాథుడు
25. సరస్వతీకంఠాభరణము : భోజుడు
26. కావ్యాలంకారసంగ్రహము : వివరణకర్త : సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
27. జ్ఞానవాశిష్టము :
28. ఉషఃకిరణాలు : శ్రీవాత్సవ
29. గురజాడ : శ్రీ శ్రీ
30. గతితార్కికభౌతికవాదం : కంభంపాటి సత్యనారాయణ
31. కళలు సారస్వతము ఎవరికోసం ? మూలం : మావ్ - సే - టుంగ్
32. వైతాళికులు : (కవితాసంకలనము)
33. కల్పన : ,,
34. మహోదయము : ,,
35. ఉదయఘంటలు : ,,
36. ఆంధ్రవిజ్ఞానసర్వస్వసంపుటులు :
37. సంగ్రహాంధ్రవిజ్ఞానకోశసంపుటులు :
38. ఆధునికాంధ్రకవులకావ్యములు :
39. వివిధసాహిత్య పత్రికలందు ప్రచురింపబడిన కవితాఖండికలు : విమర్శనవ్యాసములు ,
40. Contemporary Indian Literature : Pub : Sahitya Akademi
41. An Introduction To The Study of Literature : W. H. Hudson
42. An Outline History of English Literature : ,, ,,
43. The Age of Wordsworth : C. H. Herford
44. The Beginnings of The English Romantic Movement : W. L. Phelps
45. A History of English Poetry : W. J. Courthope
46. Lyrical Ballads (Preface) : Wordsworth
47. Republic : Plato
48. Symposium : Plato
49. A Defence of Poetry ; P. B. Shelley
50. The Rudiments of Criticism : E. A.G. Lamborn
51. The Idiom of Poetry : F. A. Pottle
52. Some Concepts of Alankara Sastra : Raghavan
53. Biographia Literaria : Coleridge
54. Poetic Diction : Owen Barfield

55. Poetics : Aristotle (Butcher's trans.)
56 Oxford Lectures on poetry : Bradley
57. Critical Approaches To Literature : David Daiches
58. Essay on Dramatic Poesie : Dryden
59. Principles of Literary Criticism : I A. Richards
60 Essays In Criticism : Mathew Arnold
61. Three Ages of Poetry : Thomas Love Peacock
62. An Apologie for Poetrie : Philip Sidney
63. Glimpses of Bengal : Rabindranath Tagore
64. The Theory of poetry In England : R. P. Cowl
65. Creative Experiment : C. M. Bowra
66. The Heritage of Symbolism : C. M. Bowra
67. English Literature In the Twentieth Century : H. V Rowth
68. From Cubism To Sur-realism In French Literature : Georges Le Maitre
69. Illusion and Reality . Christopher Cawdwell
70. Studies In Dying Culture : Christopher Cawdwell
71. Further Studies In Dying Culture : Christopher Cawdwell
72. The Trend of Modern poetry : Bullough
73 India To-day : K. Palme Dutt
74. What Is Marxism : Emile Burns
75. Communist Manifesto : Marx and Engels
76. The State And Revolution : Lenin
77. Maxim Gorky on Literature :
78. A Hope For Poetry : C. D. Lewis
79. The Poetic Image : C. D. Lewis
80. The Magic-maker E. E. Cummings : Charles Norman
81. Introduction To Sociology : Wallis
82. Points of View : T. S Eliot
83. The Classical Tradition In Poetry : Gilbert Murray
84. Convention And Revolt In Poetry : J. L. Lowes
85. Tradition In The Making of Modern Poetry : Howard Sergeant
86. The Hindu View of life : S. Radhakrishnan
87. Discovery of India : Jawaharlal Nehru

88. Vision of India : Sisirkumar Mitra
89. Lectures on The History of Literature : Carlyle
90. A Key To Modern English Poetry : Martin Gilkes
91. The Classical Tradition : Gilbert Highet
92. The Classical Background of English Literature : J. A. K. Thomson
93. Mysticism In English Literature . C. F. E. Spurgeon
94. Plato's Thought : G. M. A. Grubbe
95. The Religion of Beauty In woman : Fletcher
96. Lectures on Poetry : Montgomery
97. Dictionary of world Literary Terms : Shipley
98. తరక్కీ పసంద్ అదబ్ (ఉర్దూ) : సర్దార్ జాఫ్రీ
99. రివాయత్ ఔర్ తజ్రుబా (ఉర్దూ) : అబూల్యైజ్ సిద్దీఖీ
100. ఆధునిక్ హిందీకవితాకీ ముఖ్యప్రవృత్తియాం (హిందీ) : డా॥ నగేంద్ర



## ఈ గ్రంథం గురించి

ఈ శతాబ్ది తొలిపొద్దునుంచి 1960 వరకు వెలువడిన సుసంపన్నమైన, పరిణామ శీలమైన, వైవిధ్యభరితమైన ఆధునికాంధ్ర కవిత్వాన్ని ఒక్క చేత్తో ఏకబిగిన సేకరించి, క్రోడీకరించి, వ్యాఖ్యానించి, విశ్లేషించి సూత్రీకరించిన బృహద్రచన ఇది. మూడు దశాబ్దాలకు పైగా పఠన పాఠనాల్లో నలుగుతున్న సజీవ వ్యాసంగానికి నిలువెత్తు వేదిక ఇది. ఆధునిక కవిత్వ విమర్శ సందర్భంలో ఈ గ్రంథగత విషయాన్ని కోట్ చెయ్యక తప్పని పరిస్థితిని కల్పించిన ప్రామాణిక గ్రంథమిది. సమాచార సమగ్రత ఉండడమే కాక, మౌలిక సమాచారాన్ని అందించడంలో కూడా ఇంతటి నమ్మకమైన గ్రంథం మరొకటి లేదు.